పట్టికలకు మహాభారత మందలి ప్రయోగములే యాధారములని తెల్పి యందుండి పెక్కు పద్యముల నుదాహరించి యుండెను. అతఁడు మహాభారతమునకు వ్యాఖ్యానము కూడ వ్రాసి యుండుటచే నతఁడు చెప్పినది యథార్థమే యైయుండును. ఈ వ్యాఖ్యానము విషయము ముందు వివరింపఁబడును.

తెలుఁగు నిఘంటువులలో అచ్చతెలుఁగు నిఘంటువులకు సంబంధించిన యింకొక శాఖ యున్నది. నన్నెచోడుఁడు, పాల్కురికి సోమనాథుఁడు మున్నగు శైవకవులాంధ్రకవితాశైలియందుఁ బరివర్తనము కలిగింప నభిలషించిరి. ఉదాత్తసాంస్కృతిక శైలితోఁ గొంచెమించుమించుగా సమానమై మార్గపద్ధతి యనఁబడు శైలి వారికసంతృప్తి కలిగించెను. నన్నయభట్టును గాని యతని భారతమును గాని ప్రత్యేకముగాఁ బేర్కొనక పోయినను మార్గపద్ధతి యను నప్పుడు వారు నన్నయ శైలినే మనసునందుంచుకొని యుందురు. దీనికి వ్యతిరేకముగా వారు జానుతెనుఁగుతోఁ గూడిన దేశిపద్ధతిని ప్రశంసించి యుండిరి. జాను తెనుఁగున కింతవఱ కెవ్వరును సరియైన నిర్వచనమొసంగి యుండలేదు. కాని 'బలుపొడతోలు సీరయు' నిత్యాదిగాఁగల వృషాధిపశతకమందలి పాల్కురికి సోమనాథుని యేకైక పద్యమును బట్టి విమర్శకులు జానుతెనుఁ గనఁగా నచ్చతెనుఁగని యే యభిప్రాయ పడుచున్నారు. అచ్చతెలుఁగనఁగాఁ దత్సమ పదములు లేని తెలుఁగు భాష. తరువాత 16 వ శతాబ్దిలో నచ్చతెలుఁగు భాషలో సమగ్రకావ్యమే రచింపఁ బడెను. ఇది దృష్టిలో నుంచుకొని యాధునిక విద్వాంసులలో నొకరగు కొట్ర లక్ష్మీనారాయణ శాస్త్రిగా రచ్చతెనుఁగు నిఘంటువును నిర్మించిరి. వారు కూడ నాంధ్రమహాభారతమునుండి లక్ష్యముల నుదాహరించి యుండిరి ఈ నిఘంటువు శబ్దరత్నాకరమున సేకరింపఁబడిన యుదాహరణముల పైనే యధికముగా నాధారపడి యుండినట్లు కనిపించును. ఇది ప్రత్యక్షముగాఁ గాక యితరాధారములద్వారా పరోక్షముగా మహాభారతము నుపయోగించుకొన్నదగుటచే సంశోధితముద్రణ నిర్మాణమున నంతగాఁ దోడ్పడఁ జాలదు.

## సంశోధిత ముద్రణమున కావశ్యకము

ఆంధ్రభాషా సారస్వతములందు మహాభారతమున కింత ప్రాధాన్య ముండుటచే గతశతాబ్ది యందలి విద్వాంసులును ఆంధ్రభాషాభిమానులును మహాభారత సంశోధిత ముద్రణమునకై యభిలషింపఁ దొడంగిరి. తెలుఁగున ముద్రణ సౌకర్యము లేర్పడిన తరువాత నాంధ్రభాషాభిమానులు కొంద ఱేకదేశముగను గొందఱు సంపూర్ణముగను మహాభారతమును బ్రచురించిరి నిజమున కది చాల పెద్దప్రయత్నమగుటచే నారంభముద్రాపకులకు బహువిధములఁ గ్లేశము కలిగించి యుండును. ఆంధ్రమహాభారతమునందలి ప్రధానములైన పదునెనిమిది పర్వములలో 21,516 గద్య పద్యములును 63 ఆశ్వాసములును ఉన్నవి. కథను బర్వములుగా విభజించుటలో నాంధ్రభారతము సంస్కృతభారతమునే యనుసరించుచున్నది. అనఁగా నాది సభాద్యష్టాదశ పర్వములందలి కథాభాగములు సంస్కృతాంధ్రభారతము లందు సమానములుగానే యుండును. కాని పర్వములందలి కథావర్ణనాదులనుసంతరించుటలో మాత్ర మాంధ్రభారతకవు లధికమైన స్వాతంత్ర్యము ప్రదర్శించిరి. వారు తఱుచుగాఁ గథను సంక్షేపించి

యుండిరి; పెక్కుపాఖ్యానములను, తాత్త్వికచర్చలను, ఆర్థిక రాజకీయ ప్రసంగము లను సంగ్రహించుటయో పరిహరించుటయో కావించి యుండిరి. ఈ కారణముచే నాంధ్రభారతము సంస్కృత భారతములోఁ గొంచెమించుగా సగమునకుఁ దగ్గుట సంభవించినది.

## మహాభారత తాళపత్రప్రతులు

ముద్రణమునకుఁ బూర్వము మహాభారతము తాళపత్రములలో మాత్రమే లిఖిత మైయుండెను. సి. పి. బ్రౌనుగారి యాదేశమున సిద్ధము చేయఁబడిన దాని కన్న ముందు వ్రాయఁబడిన కాగితపు లిఖితప్రతి మా కింతవఱకుఁ గనఁబడలేదు. తాళపత్ర ప్రతిని లిఖించుట బహు వ్యయప్రయాసలతోఁ గూడిన పని. జమీందారులును సంపన్ను లైన పౌరులును మాత్రమే వానిని వ్రాయించుటకు సమర్థులై యుండిరి. తగిన పాండితీ ప్రకర్ష లేని కారణమున లేఖకులు మహాభారత లిఖితప్రతిని జూచి వ్రాయుటను సరిగాఁ జేయఁజాలకుండిరి. వారి వ్రాఁతలలోఁ బెక్కు తప్పులు దొరలుచుండును. అక్క డక్కడ బుద్ధిమంతులైన లేఖకులు కూడఁ గనిపింతురు. వారందఱును దామొనర్చు దోషములకు క్షమాపణము చెప్పుకొనుచుందురు. తాళపత్రములం దొకసారి వ్రాసిన దానిని జెఱిపివేసి సవరించి వ్రాయుటకు వీలులేకపోవుటచే మనము వారియెడ సాను భూతి వహింప వలయును

## వర్ణక్రమ విధానములు

లిఖిత ప్రతులందలి వర్ణక్రమ విధానమును గూర్చి యించుక వివరింప వలసి యున్నది. ఒకేవిధముగా నుండుటచే భ్రాంతి కలిగించు తెలుఁగునందలి నన, పవ, ధథ మున్నగు వర్ణముల మాట యటుండ లిఖితప్రతు లందలి వర్ణక్రమ విధానమునఁ బెక్కు విశేషములు గోచరించును. పండితులు కాల్డ్వెల్ మెల్లినమ్ వల్లినమ్ రాలని పేర్కొను సాధుశకట రేఫములను గూర్చి మిక్కిలి పట్టుదల వహించి యుందురు. వాని సార్థక్య మును సూచించుటకై ప్రత్యేక లక్షణ గ్రంథములే వ్రాయఁబడినవి. కాని మన లిఖిత ప్రతు లీ విషయమున సంపూర్ణమైన యుపేక్ష వహించును. వానిలో సాధుశకట రేఫ ములు రెండింటికిని బదులు సాధురేఫమే (మెల్లినమ్ ర యే) గోచరించును. పండితులు మిక్కిలి పట్టుదల వహించి వివాదము చేయుచుండు మఱియొక వర్ణవిశేష మర్ధాను స్వారము. ఇది తాళపత్ర ప్రతులలోఁ గానరామి వింతగా నుండును. కాని అర్ధాను స్వార పూర్ణానుస్వారములను సూచించుట కొక పద్ధతి యవలంబింపఁ బడినది. అను నాసికధ్వని పూర్ణముగా నుద్దిష్టమైనప్పుడు లేఖకులు పూర్ణానుస్వారమును వ్రాసి తరు వాతి హల్లును ద్విత్వయుక్తముగా సూచింతురు ఉదాహరణమునకు కుండ యనుపదము కుండ్డ యనునట్లు వ్రాయఁబడును. అనునాసికధ్వని యశ్రుతముగా నుండునప్పుడు కూడ పూర్ణానుస్వారమునే వ్రాయుదురు కాని తరువాతి హల్లును ద్విత్వయుక్తము కావింపరు. వాండు. కొన్ని సంయుక్తాక్షరములు తమకు సహజములైన ధ్వనులకన్న భిన్నముగా నుచ్చరింపఁబడు చుండును. ఉదాహరణమునకు జ్ఞ యను సంయుక్తాక్షరమున తాలవ్యానునాసికాధ్వని సంయోగ మున్నది. కాని సాధారణ భాషణమున నది

కంఠ్యామ నాసికాధ్వని సంయోగముతోఁ గూడిన గ్న వలె ముద్రింపఁబడుట వినుచుం దుము. ఈ శాసన సంప్రదాయము సాధారణముగాఁ జేసికొని కొందఱు కవు లొక క్రొత్త యతికిఁ దావొసంగి యున్నారు.

తాళపత్ర ప్రతులందలి లేఖనమున నింకను గొన్ని వర్ణక్రమ విశేషములు కనిపిం చును. ఉదాహరణమునకు ద్రుతము కొన్ని యెడల స్వరవిరహితమైన నకారపుపొల్లు రూపమును గూడఁ బొందుచుండును. ఒక్కొక్కప్పు డది కొన్నిపద్యముల చివర వచ్చు చుండును. అట్టియెడల నిజమునకు నకారపు పొల్లునే (న్) వ్రాయవలయును. కాని తాళపత్ర ప్రతులం దది స్వరవిశిష్టమైన స్వత్వ రూపముతో వ్రాయఁ బడుచుండును. ఇట్లు వ్రాయుటచే గణభంగము వాటిల్లును. అందుచే చిన్నయసూరి తన బాలవ్యాక రణమున (సంధి–20) 'గుర్వవసాయి యగు పద్యంబు తుదను (ద్రుతమునకు) స్వత్వంబు లే'దని హెచ్చరిక కావించి యుండెను.

తాళపత్ర ప్రతులందలి వర్ణక్రమ విశేషములలో వలపలి గిలక మఱొకటి. రేఫ సంయుక్తాక్షరములలో రేఫమును సూచించుటకు వ్రాయు గుర్తు వలపలి గిలక. సంయు క్తాక్షరములలో రేఫము ప్రథమాంగమైనప్పుడు దాని బదులు వలపలి గిలకను వాడు దురు. ఉదా: కర్మ. కాని రేఫధ్వని ద్వితీయాంగమైనప్పు డిది యంగీకార్యము కాదు. ఉదా:– ఆశ్రమము. తాళపత్రప్రతులలో వలపలి గిలకకు వెనుక నున్న హల్లును వర్ణ క్రమము ననుసరించి యవసరము లేకున్నను, ద్విత్వరూపమున వ్రాయుచుందురు. అను నాసికాక్షరములకు వెనుకఁ బూర్ణానుస్వారమును వ్రాయుట తాళపత్రప్రతులందలి మఱియొక లేఖన విశేషము. అన్న, అమ్మ మొదలగు శబ్దములను [అంన, అంమ] అనున నట్లు పూర్ణానుస్వార యుక్తములుగాఁ గాక ద్విత్వయుక్తములుగా వ్రాయుట యిప్పటి పరిపాటి. కాని తాళపత్ర ప్రతుల లేఖకులు తఱుచుగాఁ బూర్ణానుస్వారయుక్తరూపము లనే వ్రాయుచుందురు. దీనికిఁ గొంత చారిత్రకపూర్వ రంగము లేకపోలేదు. ఆంధ్ర భాషా పరిణామమున నిదియొక దశను సూచించును ప్రాఙ్నన్నయ యుగమునఁ గొన్ని పదములు సమీకరణ విధానము ననుసరించి మార్పు చెందెను. కంబురామ్ చెఱువను నొక గ్రామ నామము కమ్మరి చెఱు వనునట్లుగా సమీకృతమయ్యెను. సమీకరణము నకు ముందా పదమున ననుస్వార ముండుట యుక్తమే. కాని యది జరిగిన పిమ్మట ననుస్వార మనవసరము. అందుచేతనే ఆంధ్ర వైయాకరణులు "సంస్కృత సమేతరము లయిన తెలుఁగు శబ్దముల యందు ఖరుష సరళములకు ముందే బిందువు కానంబడు చున్న"దను సూత్రము (బా. వ్యా. సంజ్ఞా ౧౬) నేర్పఱచిరి. కాని లేఖకులు చిరకా లాగతమైన వర్ణక్రమ లేఖన పద్ధతిని విడువ నంగీకరింపరు. వైయాకరణులు వారట్లే యెందుకు వ్రాయుచుందురో గ్రహించి సానుభూతి వహింప యత్నింపరు.

## లేఖకులు

అత్మప్రత్యయసంపన్నుఁడును లాక్షణికోత్తముఁడునైన అప్పకవి అమాయకు లైన యీ లేఖకులను

నన్నయముఖ్యసత్కవి జనంబుల కావ్యములందు లేఖకుల్
గొన్నియుఁబాఠకాధములు కొన్నియుఁ బోకడఁ బెట్టఁ దక్కువై
యున్నెడఁ గాంచి జానపదు లోడక దిద్దినతప్పుత్రోవలె
ల్లన్నిజమంచుఁ గైకొనిన లక్షణవేత్తలు సమ్మతింతురే.

అప్ప. ౩—౨౦౨

అని నిశితముగా విమర్శించి యున్నాఁడు. శ్రీకృష్ణ దేవరాయల భువనవిజయసభయందలి యష్టదిగ్గజములలో నగ్రేసరుఁడైన అల్లసాని పెద్దన యీక్రింది చాటుపద్యమునఁ గృతి రచన కావశ్యకమైన సాధన సామగ్రిలో లేఖక పాఠకోత్తములను గూడఁ జేర్కొనెను.

నిరుపహతిస్థలంబు రమణీప్రియదూతిక తెచ్చి యిచ్చు క
ప్పుర విడె మాత్మకింపయిన భోజన ముయ్యెల మంచ మొప్పు త
ప్పరయు రసజ్ఞు లూహ తెలియంగల లేఖక పాఠకోత్తముల్
దొరకినఁ గాక యూరక కృతుల్ రచియింపు మనంగ శక్యమే.

లేఖకులును బాఠకులు నుత్తములు కానిచోఁ గృతికి లాఘవ మేర్పడు నను భావ మిందు స్ఫురించు చున్నది. క్రీ. శ. 18 వ శతాబ్దికిఁ జెందిన కూచిమంచి తిమ్మకవి కూడ లేఖకుల మూలమునఁ బూర్వకవుల కావ్యములలో దోషములు చొచ్చిన వని తెల్పియు న్నాఁడు. బమ్మెరపోతన ఆంధ్ర మహాభాగవతమందు యతి ప్రాసల విషయమున సాధు శకటరేఫములను గలపిన కతమున అప్పకవి యాదిలాక్షణికు లెల్లరు నాతనిఁ బ్రామాణిక కవిగా గ్రహించి యతని గ్రంథము నుండి యుదాహరణము లీయమానిరని యాక్షేపింప తిమ్మకవి యిట్లు సమాధానము చెప్పియున్నాఁడు.

సీ. ఘనుఁడు పోతనమంత్రి మును భాగవతము ర
చించి చక్రికి సమర్పించు నెడల
సర్వజ్ఞ సింగయ క్ష్మావరుండది దన
కిమ్మని వేఁడిన నిడకయున్న
నలిగి యాపుస్తకం బతని పాతించిన
జీకికి యందొక కొంత శిథిలమయ్యె
గ్రమ్మర నది వెలిగందల నారప
రాజును మఱి బొప్పరాజు గంగ

రాజు మొదలగు కవి వరుల్దేజ మెసఁగ
జెప్పి రా గ్రంథముల యందె తప్పులొదవె
గాని పోతకవీంద్రుని కవిత యందు
లక్షణం బెందు దప్పదు దక్షహరిణ.

సర్వ. సా. స. ౩—266.

పోతన ఆంధ్ర మహా భాగవతము పూర్తిగా రచింప నందుఁ గ్రిమిదష్టములై కొన్ని భాగములు శిథిలము లయ్యెననియు వాని నతని మిత్రులును శిష్యులును బూరించి రనియు నొక కథ కలదు.

## ప్రక్షేపములు

లేఖకుల యజ్ఞతా లేఖన వైలక్షణ్యములను గూర్చి కవులును లాక్షణికులును పైవిధమున భావించిరి. విమర్శించు నెడఁ గొందఱు తీవ్రతను గొందఱు సానుభూతిని బ్రదర్శించిరి. ఒక్కొక్కప్పుడు బాండిత్యహీనులును సాహసులును నైన లేఖకులు కవి పాఠములను దమ భావముల కనుకూలముగా దిద్దుచుందురు కొందఱు వేడుకకై సులభ చ్ఛందములలో నొండు రెండు పద్యములను దాము రచించి కవి పద్యముల నడుమఁ జొప్పింతురు. ఇట్టివానిని బ్రక్షేపము లందురు. అదృష్టవశమున సంస్కృత మూలము వలె నాంధ్ర మహాభారత మెక్కువగా నట్టి ప్రక్షేపములకు గుఱియై యుండలేదు. సంస్కృతభారతమున వాడఁబడిన యనుష్టుప్పులు సులభముగా వ్రాయఁదగిన వగుటచే నల్ప ప్రతిభ గల కవులు కూడ నట్టివి కొన్ని రచించి గుర్తించుట కవకాశము లేకుండ గ్రంథమునఁ బ్రక్షేపించుటకు వీలున్నది. అదియును గాక సంస్కృతభారతము సుమా రిరువది యైదు శతాబ్దుల కాలము నుండి పరంపరగా వచ్చుచున్నది. అందుచే నందుఁ బ్రాజ్ఞులయో యప్రాజ్ఞులయో చేయిపడి యుండె ననుటలో నాశ్చర్యము లేదు. ఆంధ్ర మహాభారత విషయ మట్లు కాదు. ఇంతవఱకు దాని జీవితము పదిశతాబ్దులు మాత్రము. అదియును గాక ఆంధ్ర భారత కవిత్రయమువారు మహాకవి శేఖరులు. బయలుపడకుండ వారి ననుకరించుట సులభము కాదు. మఱియు నారంభము నుండియు నది రాజసభ లందును జానపద సంఘము లందును గూడ నిరపవాదముగాఁ బరమగౌరవము నందు చుండెను. అందుచే నల్పులైన కవు లందు స్వేచ్ఛగాఁ బ్రక్షేపములను జొప్పించుట కవ కాశము లేదు. కాని పద్య భాగముల విషయమున నిది యథార్థమేయైనను గద్యభాగ ములు కొన్ని ప్రక్షేపములకు గుఱి కాకుండ లేదు ఛందోనియమము లేని కారణమున లేఖకులును జిన్నకవులును గూడ వీనియందుఁ గొన్ని చేర్పు మార్పు లొనరింప యత్నించి యుండిరి. వారు చేయు మార్పులు సాధారణముగాఁ బదభేదములయుఁ బర్యాయపదములయు రూపమున నుండును ఈ విధముగా నైన నాంధ్ర మహాభారత మందలి గద్యభాగములు కూర్పు చేర్పులకు గుఱియైనవని చెప్పక తప్పదు.

## ఆంధ్రమహాభారతమునకు సంబంధించిన సమస్యలు

ఆంధ్రమహాభారతమున ప్రక్షిప్తములంత యధికముగా లేనిచో నింక దానివిషయ మునఁ బనిచేయు విద్వాంసుల నెదుర్కొను సమస్యలేవి? ఈ సందర్భమున సంస్కృత భారతమునుగూర్చి యపారపరిశ్రమ కావించిన శ్రీ. డా. సుక్తంకరుగారు నిరూపించిన పూర్వగ్రంథవిమర్శన లక్ష్యములవంకకు విద్వత్ప్రేరకులు తమదృష్టి ప్రసరింపఁజేయ వేఁడుచున్నాము "సాంప్రదాయిక భాషాశాస్త్రవేత్త లనుసరించు సాధారణ సూత్ర ములు నాలుగు: 1. (Heuristics) లిఖితప్రతుల తోడను సాక్ష్యములతోడనుగూడిన వస్తుసామగ్రినంతను సేకరించి వంశవృక్షమురూపమున సమకూర్చుట 2. (Recensis)

ప్రధానవర్గమునకుఁ జెందిన గ్రంథమును పునరుద్ధరించుట 3. (Emendatio) గ్రంథ కర్త పాఠములతోఁ గూడిన గ్రంథమును పునరుద్ధరించుట 4. (Higher Criticism) గ్రంథకర్త వినియోగించుకొన్న మూలములఁ బృథక్కరించుట" అని వారు చెప్పి యున్నారు. తెలుఁగు భారతమునకు సంబంధించినంతవఱకుఁ బై వానిలోఁ జివరి రెం డును మనకెక్కువ యావశ్యకములుగా గోచరించును వానిని గూర్చి తరువాతఁ బరి శీలింతము.

## ముద్రిత ప్రతులు

తెలుఁగున మొట్టమొదట ముద్రణమును బ్రవేశపెట్టినవారు క్రైస్తవమత ప్రచారకులు. వారు ముఖ్యముగా బైబులు యొక్కయుఁ దద్భాగముల యొక్కయు ననువాదములను బ్రచురించిరి. బెంజమిన్ స్కూల్ట్జ్, ఎ. డి గ్రాన్జ్ వంటి మతప్రచా రకు లీపనియందుఁ బాల్గొనిరి. తెలుఁగు–ఇంగ్లీషు నిఘంటువులో సి. పి బ్రౌనుగారు "క్రి. శ. 1806తో తెలుఁగున ముద్రణ మారంభింపఁ బడెను గాని యది క్రి. శ. 1830 వఱకు నంతగా నభివృద్ధి నందలేద"ని చెప్పియున్నారు. క్రీ శ. 19వ శతాబ్ది యారంభ మునఁ బాఠశాలలకుఁ గావలసిన వచనగ్రంథము లెక్కువ ప్రచారములో నుండెను. సెంట్ జార్జికోట కళాశాలలోఁ బ్రధానాంధ్రపండితులుగా నుండిన రావిపాటి గురు మూర్తిశాస్త్రిగారు విక్రమార్కుని కథలను పంచతంత్రకథలను సులభవచన శైలిలో రచించిరి. అందు మొదటిది క్రి శ. 1819 లోను రెండవది 1834లోను బ్రచురింపఁ బడినవి.

అట్టియెడ ఆంధ్రదేశ మహాభారత ప్రచురణమునకై యెదురుచూచుట సహ జమే. దానిని మొట్టమొదటఁ బ్రచురించిన వారెవ్వరో చెప్పుటకింకను ఆధారములు లభింపకున్నవి. విద్వాంసులు ఉత్సాహవంతులునైన ఆలూరి ఏకామ్రజోస్యుల వారుప్రచు రించిన మహాభారతమే (లండను ప్రతి) మొట్టమొదటి ముద్రణమని మేము కొంతకాలము భావించితిమి.

లండను ప్రతికాలము చాలా కాలమునుండి సందేహాస్పదమై యున్నది. స్పష్ట మగునైన వివరములు తెలియని కారణమున నది 1833వ సంవత్సరపు ముద్రణమని పిలువఁబడినది అధికమైన పరిశీలన చేయఁగా నది 1852 వ సంవత్సరమందలి కరాలపాటి రంగయ్యగారి ముద్రణముతో సమకాలీనమని తేలినది.

లండను ముద్రణమునకు సంబంధించిన కొన్ని విషయము లిచ్చుటఁ జెప్పుట యుక్తముగా నుండదు భీష్మపర్వముతో నారంభించు మహాభారత భాగమునకు ముం దుపోద్ఘాతరూప మైన యొకపత్రమున్నది. అందిట్లు చెప్పఁబడినది, ఆలూరి ఏకామ్రజోస్యులు గారాంధ్రవాఙ్మయసేవా తత్పరులైన శ్రోత్రియవిద్వాంసులు. సాధారణ సంవత్సర మందలి ఆణిమాసమున (జూను, 1850) వారాంధ్రమహాభారతమును ముద్రింపవలె నని సంకల్పించి తన్నిర్వహణమునకై యుత్సాహవంతులతోఁ గూడిన యొకసంఘము నేర్పఱిచిరి. ఈ సంఘ మాదిసభాపర్వములను బ్రచురించెను. కాని దురదృష్టవశ

మున నొపంపుమందు మనఃస్పర్ధలు తలచూపుటచేఁ దరువాతిపని యాగిపోవుట సంభ వించెను.

కాని మహాభారత విద్వన్ముద్రణమును వెలువరింపవలెనను నుత్తమసంకల్పము విషయమున ఏకామ్రజోస్యులవారు నిరుత్సాహపడి యుండలేదు. వారుత్సాహ వంతులతోఁ గూడిన మతొకసంఘము నేర్పఱిచి తత్ప్రచురణమున కారంభించిరి. ఈ ద్వితీయయత్నమున వారు మదరాసునందలి వర్తమానతరంగిణీ ముద్రణాలయాధి పతులైన పువ్వాడ వెంకటరావుగారి సహకారము పొందియుండిరి. జోస్యుల గారికిఁగూడ జ్యోతిషకళానిధి ముద్రణాలయమనునొక స్వంతముద్రణాలయముండెను. ఈ క్రొత్త సంఘమువారు బహుశః అందలి సంపన్నసభ్యులలో నొకరైన దూర్వా సుల జగన్నాథరావుగారిపేర భారతము వెల్వరింప నంగీకరించిరి.

వర్తమానతరంగిణీ జ్యోతిషకళానిధి ముద్రణాలయములు రెండింటినుండి ఆంధ్ర మహాభారతమును బూర్తిగా ముద్రించి ప్రచురింపవలెనని వారు తలంచి యుందురు. ఇట్లని యేపక్షమువారును స్పష్టముగాఁ జెప్పియుండలేదు. ఇది యూహామాత్రమే. ఇండియా ఆఫీసుమ ణము (లండనుప్రతి) రెండుభాగములుగా నున్నది. ఆదిపంచ కము, భీష్మపర్వాది గ్గారోహణ పర్యంతమైన భాగము. ఆదిపంచకము పువ్వాడ వెంకటరావుగారిచే ర్తమానతరంగిణీ ముద్రణాలయమున ముద్రింపఁ బడినట్లు కనిపించుచున్నది. ఈభాగమునకు ముఖపత్రము కాని విషయసూచిక కానిలేదు. వర్త మానతరంగిణీ ముద్రణాలయ ముద్రతోఁ గూడిన యొకపుటమాత్రమున్నది. ముద్రణ సంవత్సరము 1851 అని పేర్కొనఁబడి యున్నది.

భీష్మపర్వాదియైన భాగమునందు ముఖపత్రమును, భీష్మపర్వమునుండి తుదివఱ కునుగల కథాభాగములను సూచించు విషయసూచికయును గలవు. ఇందు మహాభార తము మముక్షువుల లాభముకొఱకు జ్యోతిషకళానిధి, వర్తమాన తరంగిణీ అను రెండుముద్రణాలయములనుండి వెలువరింపఁ బడినట్లు తెల్పఁబడి యున్నది. ముద్రణ సంవత్సరమిచ్చట క్రీస్తుశకమునఁగాక శాలివాహనశకమునందును చాంద్రమానా బ్దమునందును సూచితమైయున్నది. ఆ శాలివాహనశకము క్రీ. శ. 1833నకు సమాన మైన 1755. ఈ ముద్రిత సూచనమూలముననే యీ ముద్రణము ప్రచురింపఁబడిన సంవత్సరమునకు సంబంధించిన పొరపాటేర్పడినది. అట్టిపొరపాటు ముద్రణమున కెట్లెక్కినదో తెలియదు. ఇచ్చట సూచింపఁబడిన చాంద్రమానకాలము పరీధావి పుష్య శుద్ధ పాడ్యమీ సోమవారము. ఇది 1853 జనవరి 10వతేదికి సమానము.

చివరికి మనము లండనుప్రతికి 1833వ సంవత్సరమును విడిచి యందలి భీష్మ పర్వమునుండి స్వర్గారోహణపర్వము వరకును గల యుత్తర భాగమునకు 1853 వ సంవత్సరము నంగీకరింప వలయును. ఈ ముద్రణమునకు సంబంధించిన సాక్ష్యము నంతను మన మీ క్రిందవిధమున సమన్వయింపవచ్చును.

సాధరణ సంవత్సరము ఆణిమాసమున (జూన్ 1850) ఆలూరి ఏకామ్రజోస్యుల వారి కాంధ్రమహాభారతమును ప్రచురింపవలెనను భావ ముదయించెను. అప్పుడు

వా రాదిసభాపర్వములను వెలువరించిరి అంతటితో నా ప్రయత్న మాగిపోయెను. ఆ రెండుపర్వములు నేమయ్యెనో మనకుఁ దెలియదు ఏకామ్రజోస్యులవారు రెండవ యత్న మారంభించిరి క్రీ. శ. 1851 వ సంవత్సరమున పువ్వాడ వెంకటరావు గారిచే వర్తమానతరంగిణీ ముద్రణాలయమున ఆదిపంచకము ప్రచురింపఁ బడినది. మహాభారతమును పూర్తిగా రెండు ముద్రాలయముల ద్వారా ప్రచురింపవలెనను సమగ్రప్రణాళిక యందలి యేకదేశమిది. ఇందు ముఖపత్రము కాని విషయ సూచిక కానిలేవు. వెంకటరావుగారి కీ భాగస్వామ్యము విషయమునఁగాని సంయుక్త వ్యాపారమునఁగాని యెక్కువ యుత్సాహముండెనో లేదో తెలియదు. ఈ సర్వప్రయత్నమును గుఱించియు వారు మౌనము వహించిరి. కాని ఏకామ్రజోస్యుల వారు మాత్రము చాలవిషయములను తెల్పుటయే కాక ముఖపత్రమునందు రెండు ముద్రణాలయముల పేర్లుకూడ నొసంగిరి.

సంయుక్త వ్యాపారమును బలపఱుచు నంశ మొకటున్నది. సంపాదన కార్యమును నిజముగా నిర్వహించిన వారు 1. మా. వెంకటకృష్ణమాచార్యులు 2. రా. వెంకటకృష్ణశాస్త్రి 3 తో. విజయరాఘవకవి అను ముగ్గురు పండితులు. ఈ మూఁడు పేర్లును భీష్మపర్వపుముఖపత్రమునందు ముద్రితములైనవి. వర్తమానతరంగిణీ ముద్రాలయముచేఁ బ్రచురింపఁబడిన ఆదిపంచకమునందు వారి ప్రసక్తి లేదు. కాని యీ విషయమునకు సంబంధించిన సూచనయొకటి లండనుప్రతికిఁ జేర్పఁబడినది. ఇండియాఆఫీసు గ్రంథాలయమున భద్రపఱుచుటకుఁ బూర్తిముద్రణము సిద్ధము చేయఁబడిన తరువాతికాలమున నిది జరిగియుండవలెనని స్పష్ట మగుచున్నది. ఈ భాగమునఁ గాలమును గూర్చికూడ నొక సూచన యున్నది. ఆ కాలము 1833, కాని యిది పొరపాటని స్పష్టముగాఁ దెలియుచున్నది. ముద్రింపఁబడిన కాలము శాలివాహనశకము 1755 అని యుండుటయే యందుకుఁ గారణము. 1833వ సంవత్సరమును విడిచిపెట్టుటకు మఱొక సాక్ష్యముకూడ నున్నది. భీష్మపర్వాది భాగమునందు సంగ్రహోపోద్ఘాతమని చెప్పఁగిన యొకముద్రితపుట యున్నది. ఇచ్చటనే ఏకామ్రజోస్యులవారి మహాభారతముద్రణ ప్రయత్నములు సంగ్రహముగాఁ దెల్పఁబడినవి. ఈ సంగ్రహోపో తము చివర సంపాదకులు సుప్రసిద్ధుఁడైన ఛార్లెస్ ఫిలిప్ బ్రౌనుగారికిఁ గృతజ్ఞతలు తెల్పియుండిరి. అందు బ్రౌనుదొరగారు తెలుఁగు వాఙ్మయమునకుఁ జేసిన సే యు వారి గ్రంథాలయమునుఁ బ్రశంసింపఁబడినవి. దీనినిబట్టి తాళపత్రప్రతులతో సరిచూచి బ్రౌనుదొరగారు మహాభారతసంశోధితముద్రణ మనఁదగిన యొకప్రతిని సిద్ధము చేయుటకై యత్నించుచుండినట్లు జోస్యులవారును ఇతరులును ఎఱిఁగి యుండినట్లు స్పష్టమగుచున్నది లండనుప్రతిలో సి పి. బ్రౌనుగారు పేర్కొనఁబడుట దీనిని రూఢిచేయుచున్నది. అది 1851_53 సంవత్సరముల నడుమ ముద్రితమై యుండును. ఈవిధముగా నది కరాలపాటి రంగయ్యగారి ముద్రణముతో సమకాలీన మగుచున్నదే కాని మనము ముందు భావించినట్లు దానికొక తరము పూర్వముదై యుండదు.

లండనుప్రతి యిట్లు మహాభారత ప్రథమ ముద్రిత ప్రతియను ప్రాముఖ్యమును గోల్పోవుచున్నను అది మనకు చాల ముఖ్యమైనదే. క్రీ. శ. 19 వ శతాబ్ది మధ్య

భాగమున నివసించిన ప్రసిద్ధవిద్వన్మణి ఆలూరి ఏకామ్రజోస్యుల వారి పేరుతో నది సంబద్ధమై యుండుటయే యిందుకుఁ గారణము. ఈ ప్రతిని వారియందలి గౌరవ మును సూచించుటకై ఏకామ్రముద్రణము లేక జోస్యుల ముద్రణము అని పేరిడుట యుచితముగా నుండునని నా యభిప్రాయము. దానిపైఁ గల విద్వత్తాముద్ర నిర్వి వాదమైనది. దాని సంపాదకత్వమును బ్రచురణమును బరిశీలించుటకు ముగ్గురు పండి తులు నియోగింపఁబడిరి. ఇంతేకాక యీ ముద్రణమునకు ఛార్లెస్ ఫిలిప్ బ్రౌనుదొర గారి పరిశ్రమలఫలితముకూడ లభించినది. కరాలపాటి రంగయ్యగారు బ్రౌను గారి లిఖితప్రతుల యెడఁ గృతజ్ఞతను దెల్పియుండలేదు

ఈ ముద్రణము యొక్క ముఖపత్రముమీఁద 1755 శకవత్సరము ముద్రితమై యున్నది. దీనినిబట్టి అది (1755 + 78) 1833వ సంవత్సరమునఁ బ్రచురింపఁ బడెనని యనుకొంటిమి. కాని పరీధావి నామ సంవత్సర పుష్యశుద్ధ పాడ్యమీ సోమవారమని తెలుఁగు తేదీకూడ నీయఁబడినది. ఇది క్రీ. శ. 1853వ సంవత్సరము జనవరి 10వ తేదీకి. సమానమగును. అందుచే మేము చివరికి మా విమర్శన సాధనసామగ్రిలో నొకటిగా నంగీకరించిన లండన్ ప్రతికి 1853 వ సంవత్సరమే ప్రచురణకాలముగా గ్రహింపవలసి వచ్చినది. దీనిప్రతిని మేము లండన్‌నందలి ఇండియాఆఫీసు గ్రంథాలయమునుండి సంపా దించి యుండుటచే దీనిని లండనుప్రతియని పేర్కొంటిమి. క్రీ. శ. 1852 సంవత్సరము ప్రాంతమున కరాలపాటి రంగయ్యగారిచేఁ బ్రచురింపఁబడిన ప్రతినిగూడ మేమెఱు గుదుము. ఈ రెండింటికిని ముందాదిపర్వపు ముద్రణమొక్కటి వెలువడి యుండెనని తెలియుచున్నది. ఇది వైయాకరణము రామానుజాచార్యులవారిచేతను పరవస్తు చిన్నయసూరిగారిచేతను సంపాదింపఁబడి వచనముతోఁగూడ 1847వ సంవత్సరమునఁ వెలువరింపఁ బడినది. ఎంత ప్రయత్నముచేసినను దీనిప్రతి మాకు లభింపలేదు. రావు బహాదరు గిడుగు వేంకటరామమూర్తి పంతులుగారు దీనిని తమ బాలకవి శరణ్యములోఁ బేర్కొని యుండిరి. వారు దానినిగూర్చి యీక్రింది వివరములొసంగియున్నారు. అది భారతవచనమని పేర్కొనబడినది. "వైయాకరణము రామానుజాచార్యులుగారును, పరవస్తు చిన్నయసూరిగారును ఆదిపర్వమును సంపాదించియుండిరి. భారత వచనము వారు సిద్ధముచేసిన ఆదిపర్వమునకు వచనీకరణము. అది 1847లో ముద్రితమైనది. రామానుజాచార్యులుగారు పచ్చయప్పమొదలి ఉన్నతపాఠశాలలో సంస్కృతాంధ్ర పండితులుగా నుండిరి."

## హయగ్రీవశాస్త్రిగారి ముద్రణము

వివరములు తెలియని మఱొక ఆంధ్రమహాభారత ప్రతికూడ మాపరిశీలనములోఁ గానవచ్చినది. ఇది 19వశతాబ్దిలో జీవించిన పురాణం హయగ్రీవశాస్త్రుల వారి పేర నున్నది. దీనిని చదలువాడ సుందరరామశాస్త్రులవారును దండిగుంట సూర్య నారాయణశాస్త్రులవారును బేర్కొనియుండిరి. వారు 1913 లో భారత సంజీవనియను

1. బాలకవిశరణ్యము (1933 ముద్రణము) 26, 46 పుటలు.

టీకతోఁ గూడ తిక్కన సోమయాజి విరాటపర్వమును బ్రచురించిరి. తరువాత 1915లో నన్నయభట్టు ఆదిపర్వమునుగూడ ఆ పేరుతోడనే టీకాసహితముగాఁ బ్రచురించి యుండిరి. వారిరువురును సుప్రసిద్ధ విద్వాంసులు. ఈసంశోధితముద్రణమునందలి ఆదిపర్వమును సిద్ధము చేయునప్పుడు మాకు వారి టీక పెక్కువిధముల నుపయోగపడి యుండెను. వారు తమటీకకు వ్రాసిన యుపోద్ఘాతములో మహాభారతముద్రణమును మొదటఁ బ్రచురించినవారు పురాణం హయగ్రీవశాస్త్రులుగారని పేర్కొని యుండిరి. విరాటపర్వ టీక కాంగ్లమున తొలిపలుకు వ్రాయుచు మధురానివాసులైన దివాన్ బహద్దరు యమ్. ఆదినారాయణయ్యగారు కావించిన యొకసూచనకూడ నీ యభిప్రాయమును బలపఱుచుచున్నది. ఈ దివాన్ బహద్దరుగారు మదరాసులో సెటిల్ మెంటు డిప్యూటీ కమీషనరుగాఁ బనిచేసి విశ్రాంతివహించిరి. విరాటపర్వ భారతసంజీవని తొలిపలుకులో (9–8–1913) వారిట్లు వ్రాసిరి. తెలుఁగున శ్రీమహాభారత ముద్రణము లనేకములున్నవి. అందు మదరాసుప్రభుత్వ రాజధానికళాశాలలో నాంధ్రపండితులుగా నుండిన పురాణం హయగ్రీవశాస్త్రులుగారు ప్రచురించినది మొట్టమొదటిది ఈ ముద్రణము సుమారేఁబదియేండ్లక్రిందఁ బ్రచురింపఁబడినది. ఆదినారాయణయ్యగారు చెప్పిన కాలమును బట్టి చూచినచో నా ప్రతి 163 ప్రాంతమున ముద్రింపఁబడి యుండును. 1860 ప్రాంతమున వెలువరింపఁబడిన పెక్కు తెలుఁగుభారత ముద్రణములను బ్రిటిషు మ్యూజియమ్ కాటలాగు పేర్కొనుచున్నది కాని యందెచ్చటను హయగ్రీవశాస్త్రులు వారి పేరు కానవచ్చుట లేదు.

ఇప్పటికొక శతాబ్దిపూర్వము మాత్రమే నివసించిన హయగ్రీవశాస్త్రులవారి విషయమే యింత అస్పష్టముగను అసంపూర్ణముగను దెలియవచ్చుట వింతగానుండును. 19 వ శతాబ్ది పూర్వార్ధమున నుండిన సుప్రసిద్ధవిద్వాంసులలో వారొక్కరు. వారు వివేకాదర్శమను ముద్రణాలయమునకధిపతులుగా నుండిరి అందులో భూగోళదీపిక యను భూగోళఖగోళ శాస్త్రములకు సంబంధించిన గ్రంథమొకటి ప్రకటింపఁ బడినది. 1847 లో రాజధానికళాశాలయందలి పండితపదవికి హయగ్రీవశాస్త్రులవారు పరవస్తు చిన్నయసూరిగారితో పోటీచేసియుండిరని తెలియుచున్నది[2]. హయగ్రీవశాస్త్రులుగారు సంస్కృతాంధ్రములందుఁ బెక్కు గ్రంథములను బ్రచురించి యుండిరి[3]. వారు

1. ఆంధ్రవచన వాఙ్మయము– పు. 99 శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు.

2. చిన్నయసూరి జీవితము పు. 39. శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు.

3. మాసంస్థలో పండితులుగాఁ బనిచేయుచున్న శ్రీ నిడుదవోలు సుందరేశ్వరరావుగారు శ్రద్ధతో వెదకి హైదరాబాదునందలి శ్రీకృష్ణదేవరాయ గ్రంథాలయమువారు సేకరించిన సంస్కృత ముద్రిత ప్రతులలో హయగ్రీవ శాస్త్రిగారిచేఁ బ్రచురింపఁబడిన సంస్కృత భారత ప్రతిని గుర్తించిరి. ఇది తెలుఁగు లిపిలోనున్నది. ఆదిపంచకమునందలి ముఖపత్రము నష్టమైనది. యుద్ధపంచకమునకు మాత్రము ముఖపత్రమున్నది. దీనినిబట్టి పురాణం హయగ్రీవశాస్త్రులుగారు ధర్మప్రచారసేవార్థమై మహాభారతప్రచురణమునకుఁ బూనిరని తెలియుచున్నది. మహాభారత మద్వైతవేదాంతమును బోధించునని శాస్త్రులవారి నమ్మకము. విద్వచ్చూడామణియైన

1855 లో ఆంధ్ర భాగవతమును బ్రచురించుట సుప్రసిద్ధమే. ఆంధ్ర ప్రదేశ సాహిత్య అకాడమీవారు ప్రచురించిన ఆంధ్రభాగవతమున సంపాదకులు హయగ్రీవశాస్త్రులవారి ముద్రణమును బేర్కొనియుండిరి. 1848 లోఁ బ్రచురింపఁ బడిన భాగవతప్రతి నొకదానిని బ్రౌను దొరగారు పేర్కొనియుండిరి. కాని యిది పైని పేర్కొనఁబడినదే యగునో తద్భిన్నమో తెలియదు. రావుబహద్దరు కందుకూరి వీరేశలింగము పంతులుగారు కరాలపాటి రంగయ్య గారిని గూర్చి వ్రాయుచు ఆంధ్రకవులచరిత్ర తృతీయ భాగమున వారు తలుఁగున భారత భాగవత రామాయణములను బ్రప్రథమమునఁ బ్రచురించి యుండినట్లు తెల్పియుండిరి. కరాలపాటి రంగయ్యగారు ప్రచురించిన భాగవతమునే బ్రౌను దొరగారు పేర్కొనియుండిరాయను విషయమును నిర్ణయించుట కాధారములు లేవు.

ఆచార్య పి. పి. యస్. శాస్త్రిగారు తమ మహాభారత దాక్షిణాత్య ముద్రణము యొక్క యుపోద్ఘాతమున పురాణం హయగ్రీవశాస్త్రిగారిని బేర్కొని యుండిరి. ''మదరాసునగరమున సంస్కృత మహాభారతము తెలుఁగులిపిలో నాలుగు మార్లు ముద్రింపఁబడినది. 1. 1850 లో వెంకటరాయ శర్మగారిచే. 2. 1855–60 సంవత్సరముల నడుమ ఈముద్రణమునకుఁ బ్రచురణకర్తలైన వావిళ్ళ ముద్రాలయాధిపతులకు బంధువులైన పురాణం హయగ్రీవశాస్త్రులవారిచే 3 1870 లో వెంకటసుబ్బశాస్త్రిగారిచే. 4. 1929 లో నీముద్రణమునకుఁ బ్రచురణకర్తలైన వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారిచే.'' అని వారు వ్రాసియుండిరి. దీనినిబట్టి

వేంకటనారాయణగారును కౌశికగోత్రోద్భవయైన సావిత్రమ్మగారును హయగ్రీవశాస్త్రిగారి మాతా పితరులు. సావిత్రమ్మగారు వేంకటశేషయ్యగారి కుమార్తె. హయగ్రీవశాస్త్రిగారు ప్రాచీన విద్యాశాఖలన్నిటియందును నిష్ణాతులై యుండిరి. వారికి సర్వతంత్ర స్వతంత్రులను పేరుండెను. తండ్రిగారి దయవలన వారు హయగ్రీవమంత్రమును బడసిరి దాని నుపాసించుటచే వారు సంస్కృత ప్రాకృతములందును దేశభాష యందును మహాపండితులైరి.

మహాభారత ప్రచురణ విషయమునఁ దాముపొందిన శ్రమను వారిట్లు వివరించిరి. "తాళపత్రప్రతులు దేశమునందలి వివిధ ప్రాంతములనుండి తేబఁడినవి వైశంపాయన నీలకంఠుల వ్యాఖ్యానములు శ్రద్ధతోఁ బరిశీలింపఁబడినవి. శ్లోకసంఖ్య వేయఁబడినది. అర్థము గూఢమును సందేహాస్పదమునైనప్పుడు సందేహనివృత్తికై నీలకంఠవ్యాఖ్య యుద్ధరింపఁ బడినది. భగవద్గీతవిషయమున శ్రీ శంకర భగవత్పాదుల వ్యాఖ్యానము చేర్చఁబడినది."

ఈవిధముగా మహాభారతము వారిచే స్వకీయ వివేకాదర్శ ముద్రణాలయమున రాక్షస సంవత్సర మాఘశుద్ధ పూర్ణిమనాఁడు ముద్రింపఁబడినది. ఆ సంవత్సరము క్రీస్తుశకము 1856 అయినది.

దీనినిబట్టి పురాణం హయగ్రీవశాస్త్రులుగారు చిన్నయసూరిగారికిని కరాలపాటి రంగయ్యగారికిని ఆలూరి ఏకామ్రజోస్యులగారికిని సమకాలికులని నిర్ణీతమగుచున్నది. కాని వారిచేఁ బ్రచురింపఁబడెనని తెలియుచున్న తెలుఁగుభారతమునకు సంబంధించిన యన్వేషణ మింకను అనిశ్చితఫలముగనే యుండిపోయినది.

క్రీ. శ. 1860 ప్రాంతమున హయగ్రీవశాస్త్రిగారు సారస్వతకార్యకలాపమున నిమగ్నులై యుండినట్లు స్పష్టమగుచున్నది. కాని వారు ప్రచురించినట్లు చెప్పఁబడుచున్న తెలుఁగుభారతమునకు నిర్దేశ మెచ్చటను గానవచ్చుటలేదు. హయగ్రీవశాస్త్రి గారు ప్రచురించిన సంస్కృతభారతమునే ఆదినారాయణయ్యగా రాంధ్రభారతమని భ్రాంతిపడి యుందురా? అట్లయియుండదు, ఏలయన విరాటపర్వ టీకాకారులు కూడ వది తెలుఁగుభారతమేయని తెల్పియుండిరి. దీనినిబట్టి హయగ్రీవశాస్త్రిగారి తెలుఁగు భారతముకొఱకు మనమింకను వెదకవలసియున్నదని తోచుచున్నది. అది వావిళ్ళవారి యాంధ్రభారత ముద్రణమునకు మూలమైయుండును.

## క్రీ. శ. 1860వ సంవత్సరమునకుఁ బూర్వమున్న ముద్రణములు

1860 వ సంవత్సరమునకుఁ బూర్వముండిన ఆంధ్రమహాభారత ప్రతుల పరిశీలనము వలనఁ దేలిన సారాంశమిది.

1. చిన్నయసూరిగారిచేతను రామానుజాచార్యులుగారిచేతను వెల్వరింపఁబడిన ఆదిపర్వము — 1847
2. ఆలూరి ఏకామ్రజోస్యులవారిచేఁ బ్రచురింపఁబడి మేము లండనుప్రతి యని పేర్కొన్న ముద్రణము. 1851 — 53.
3. కరాలపాటి రంగయ్యగారి ముద్రణము. 1852.
4. పురాణం హయగ్రీవశాస్త్రిగారి ముద్రణము దీని వివరములు తెలియలేదు.
5. సి. పి. బ్రౌనుగారి కాగితపు లిఖితప్రతి (అప్రకటితము).

పై వానిలో 2వ దానినిగూర్చి లండనునందలి ఇండియాఆఫీసు అధికారు లీసూచనను వ్రాసి పంపియుండిరి. "తెలుఁగుది — 7. యుద్ధ పంచకము. ఆర్. వెంకట కృష్ణ శాస్త్రులుగారిచే సంపాదితమైనది. జ్యోతిషకళానిధి ముద్రణాలయము. 1772 శక సంవత్సరము" ఈ సంవత్సరము క్రీ. శ. 1850 తో సమానము.

మూఁడవది ఆలూరి ఏకామ్రజోస్యులవారి ప్రయత్నముల సమగ్రఫలమైన ముద్రణము. దీనిని సిద్ధముచేసిన ముగ్గురు సంపాదకులలో పై యుద్ధపంచకమునకు సంపాదకులైన ఆర్. వెంకటకృష్ణశాస్త్రిలు గారుకూడ నొక్కరు. ఈ రెండు ప్రతులును జ్యోతిషకళానిధి ముద్రణాలయమందే ముద్రింపఁబడినవి. దాని యజమానులు ఆలూరి ఏకామ్రజోస్యులవారు. వారు 1853వ సంవత్సరముననేకాక 1850వ సంవత్సరమునఁ గూడ నొకయుద్ధపంచకమును బ్రచురించి యుండిరాయను విషయము సందిగ్ధముగా నున్నది.

## సి. పి. బ్రౌనుదొరగారి కృషి

సి. పి. బ్రౌనుగారి సారస్వత కృషిని గూర్చి యిచటఁ గొంత చెప్పవలసి యున్నది. తమ తెలుఁగు — ఇంగ్లీషు నిఘంటువు నుపోద్ఘాతమునందు బ్రౌనుగా

రీట్లు వ్రాసియున్నారు. "1827 వ సంవత్సరము నా ధనముతో భాగవత పరిష్కృత ప్రతియొకటి సిద్ధము చేయఁబడినది. మదరాసులో తెలుఁగు భాగవతము 1848 వ సంవత్సరమున ముద్రింపఁబడినది." వారిందు తాము మహాభారత పరిష్కృత ప్రతిని సిద్ధము చేయించినట్లు తెలిపియుండలేదు. ఆ నిఘంటు కార్యమున వ్యాపృతులై యుండినప్పుడు వారు బహుశః దానిని గూర్చి గాఢముగా నాలోచించుచుండకపోవచ్చును. కాని తరువాత వారా ప్రశంసనీయమైన కార్యము నారంభించి యుందురు. తెలుఁగు మహాభారతమునకు సంబంధించిన వారి కృషికి ఫలితమైన మహాభారతముయొక్క కాగితపు ప్రతులు [సం. 163 - 164] మదరాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత భాండాగారమున భద్రపఱుపఁబడి యున్నవి. అందు వారిట్లు వ్రాసిరి: "మహాభారత మిప్పుడు ఛార్లెసు ఫిలిప్ బ్రౌనుగారి నిర్దేశము ననుసరించి మొట్టమొదటిసారి సంఖ్యాక్రమానుసారముగాఁ గూర్పఁబడి వేఱువేఱు పంక్తులుగాను బద్యములుగాను వ్రాయింపఁబడినది. ఈప్రతిలో కావింపఁబడిన మార్పులు నేను సేకరించిన ప్రతులలోఁ గానఁబడు భిన్న పాఠములు."

బ్రౌనుగారు వ్రాయించిన కాగితపు ప్రతులు మంచి స్థితిలో లేవు. క్రిములందు చాల రంధ్రము లొనరించినవి. పాఠములు పంక్తికిఁ బంక్తికి నడుమ వ్రాయఁబడినవి. వానిని జదువుట మిక్కిలి కష్టము. ఎన్నుకొనఁబడిన పాఠములు ప్రక్కపుటలలో వ్రాయఁబడినవి. బ్రౌనుగారి నిర్దేశము ననుసరించి యంగీకృతములైన పాఠముల నెవరో ప్రక్క పుటలలో వ్రాసి యుందురు. 163 వ సంఖ్య గల ప్రతిలో మొదటి నుండి పంచమాశ్వాస మందలి 190 వ పద్యము వఱకును, 164 వ సంఖ్య గల దానిలో పంచమాశ్వాసము నందలి 191 వ పద్యము నుండి తుది వఱకును వ్రాయఁబడియున్నది. 193 వ సంఖ్య గల యింకొక ప్రతిపై 163, 164 సంఖ్యలు గల వాని శుద్ధప్రతి వలెఁ గానవచ్చుచున్నది. ఈ లిఖితప్రతులలో వేనియందును. శకటరేఫములు కాని అఱసున్నలు కాని కానరావు. ఇందలి ప్రధానవిషయ మేమన నాయా సందర్భములకుఁ దగినట్లు సంస్కృత భారతము నుండి నిర్దేశము లొసంగఁబడినవి. బహుశః ఇది ముద్రణమునకై సిద్ధము చేయఁబడిన ప్రతి కావచ్చును. 201 వ సంఖ్య గల ప్రతిలో ఆది పర్వమునందలి చతుర్థాశ్వాసము వఱకు మాత్రమే కలదు. ఇందర్ధానుస్వారములు పెట్టుటకుఁ బ్రయత్నము చేయఁబడినది.[1]

ఆంధ్ర భారతము విషయమున బ్రౌనుదొరగారు కావించిన కృషియైనిని పేర్కొనఁబడిన ఆదిపర్వపు ప్రతులతో ముగిసి యుండలేదు. భిన్నములైన D సంఖ్యలు గల 47 కాగితపు ప్రతులున్నవి. చివరి మహాప్రస్థాన స్వర్గారోహణ పర్వములు తప్ప మిగిలిన యన్ని పర్వములకు సంబంధించిన పాఠాంతరములు నందుఁ గలవు. అవి రెండును మిక్కిలి చిన్న పర్వములు. బహుశః అవి యితరములైన కట్టలలోఁ గట్ట కట్టఁబడి యుండును. బ్రౌను దొరవారు పదునెన్మిది పర్వములను తాళపత్ర ప్రతులతో సరి చూపించి పాఠాంతములు వ్రాయించి పరిష్కృతమైన ప్రతిని సిద్ధము

1. 17-9-64 వ తేదీని ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనముగారు శ్రీ టి. శ్రీధరశర్మ గారితోడను శ్రీ నిడుదవోలు సుందరేశ్వరరావు గారితోడను గలసి మదరాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత భాండాగారమందలి బ్రౌనుదొరవారి లిఖిత ప్రతులను బరిశీలించి యుండిరి.

చేయించి యుండుటని స్పష్టమగుచున్నది. ఆదిపర్వమునకు సంబంధించి నంతవఱకుఁ దాము సరిచూచుట కుపయోగించిన తాళపత్ర ప్రతులమగూర్చి వారేమియు వ్రాయక పోయినను తరువాతి కొన్ని పర్వములకు సంబంధించిన విషయము తెల్పియున్నారు. ఆదిపర్వమును 7 తాళపత్ర ప్రతులతో సరిచూచి యుండిరి. విరాటోద్యోగాది పర్వముల విషయమున తాము పరిష్కృతప్రతిని సిద్ధము చేయుటకై సరిచూచిన తాళపత్ర ప్రతులను గూర్చి వారు వ్రాసియుండిరి. విరాటపర్వమును వారీక్రింది తాళపత్ర ప్రతులతో సరిచూచినట్లు తెల్పి యున్నారు.

| | | |
|---|---|---|
| 1. | రావు బ్రహ్మాజీ పంతులుగారి | తాళపత్రము. |
| 2. | వేమూరి సుబ్బారావుగారి | ,, |
| 3 | వద్దిపర్తి వెంకయ్య (సామర్లకోట)గారి | ,, |
| 4. | గుడిమెట్ట పల్లయ్యగారి (జగన్నాథపురము) | ,, |
| 5. | తాడిగడప వీరేశలింగము [పెనుగొండ] | ,, |
| 6. | మన్నె కనకయ్య (ఏనాము) గారి | ,, |
| 7. | వత్సవాయి బుచ్చిసీతయ్యగారి [పెద్దాపురము] | ,, |
| 8. | పెద్దపూడి అయ్యవారి | ,, |
| 9. | మాశేటి సర్వేశలింగము (ఏనాము)గారి | ,, |
| 10. | మొగలితుర్తి గ్రామమునసబు [మాజీ] | ,, |

విరాటము, ఉద్యోగము, శాంతి మున్నగు బహుప్రచారముగల పర్వములకెక్కువ సంఖ్యగల తాళపత్ర ప్రతులు లభించెడివి. ఇతర స్థలముల బ్రౌనుదొరవారు పెక్కు ముఖ్యములైన విషయములను పమకూర్చియున్నారు. డి. నెం. 211 అరణ్యపర్వము క్రింద ఆశ్వాసక్రమమున గ్రంథపరిష్కరణ మెట్లు జరిగెనో వారు సూచించియుండిరి.

## అ ర ణ్య ప ర్వ ము

బ్రౌను పరిష్కరణకాలము లిట్లు తెల్పినాఁడు.

I "విశంబివామ సం॥ మార్గశిర శుద్ధ ౧౫ ల్కు సరియైన ౧౮౩౮ సం।. డిశంబరు నెల ౧ తేది అరణ్యపర్వం తీర్పు ఆరంభించి ఆ సంవత్సర పుష్య బ ౧౪ కు ౧౮౩౭ సం॥ జనవరి నెల ౧౪ తేది వరకు ౧ ఆశ్వాసం సమాప్తం."

II "విశంబి సం॥ ఫాల్గుణ శుద్ధ ౧ ల్కు సరియైన ౧౮౩౭ సం॥ ఫిబ్రవరి ౧౪ తేది వరకు ౨ ఆశ్వాసం సమాప్తం."

III "వికారి సం॥ ఫాల్గుణ బ॥ ౮ ల్కు సరియైన మార్చి నెల ౮ తేది వరకు ౩ ఆశ్వాసం సమాప్తం."

IV "వికారి సం॥ చైత్ర శుద్ధ ౧౩ ల్కు సరియైన మార్చి నెల ౨౭ తేది వరకు ౪ ఆశ్వాసం సమాప్తం"

V "వికారి సం॥ వైశాఖ శుద్ధ ౨ ల్కు సరియైన ఏప్రిల్ నెల ౧౫ తేది వరకు ౫ ఆశ్వాసం సమాప్తం."

VI "వికారి సం॥ వైశాఖ బ. ౬ ల్కు సరియైన మే నెల ౪ తేది వరకు ఆశ్వాసం సమాప్తం."

VII "వికారి సం॥ అధిక జ్యేష్ఠ శుద్ధ ౧౪ ల్కు సరియైన మే నెల ౨౭ తేది వరకు ౨ ఆశ్వాసం సమాప్తం."

బ్రౌనుగారికార్యమునకు సంస్కృతపదమైన పరిష్కరణమునకు బదులు న్యాయస్థానములందు వాడఁబడు 'తీర్పు' అనుపదమును వాడియుండిరి. వారు చాలకాలము మండల న్యాయాధికారులుగా నుండిరి అరణ్యపర్వముయొక్క పరిష్కరణము లేక తీర్పు 1838 డిసెంబరు 1వ తేదీ నారంభింపఁబడి 1839 మే 27వ తేదీని ముగిసెను. 1840 జూలై 20 నాఁటి కుద్యోగపర్వ పరిష్కరణము ముగిసెను .ఇట్లే యితర పర్వములు తీర్పు విషయముల కూడ వారు వ్రాసి యుండిరి. శాంతి పర్వ పరిష్కరణ సందర్భమున ప్రత్యేకమైన యొకపాఠమును సమర్థించుటకై తెలుఁగు భారతమును సంస్కృత మూలముతో సరిచూచు కార్యమున కొక పండితుఁడు నియమింపఁ బడినట్లు కనిపించును. ఆ పండితుఁడు మధ్య నొకచోట "ఈపాఠమును దొరగారితోఁ జరిపించి నిశ్చయింపవలె"నని వ్రాసియుండెను; ఆంగ్లేయ పరిపాలనకాలమున దొర యనుపద మాంగ్లేయుని సూచించుటకు వాడఁబడుచుండెను. ఇచ్చట దొరగారనఁగా బ్రౌను దొరగారని యర్థము.

ఆలూరి పకాృమజోస్యులవారు 1853 వ సంవత్సరమునందలి భీష్మపర్వాదియైన భారత ద్వితీయసంపుటమున కుపోద్ఘాతము వ్రాయుచుఁ దాము బ్రౌనుగారి గ్రంథసంచయమును గ్రంథాలయమును వినియోగించుకొన్నట్లు కృతజ్ఞతాపూర్వముగాఁ దెల్పియున్నారు. దీనినిబట్టి బ్రౌనుగారి పరిష్కృత ప్రతి యప్పటికి రూపొందియుండినట్లు తెలియుచున్నది. 1852 వ సంవత్సరము నందలి తమ ముద్రణములో కరాలపాటి రంగయ్యగారు బ్రౌనుదొరగారిని కాని వారి పరిష్కృత ప్రతిని గాని పేర్కొని యుండలేదు. తెలిసియో తెలువకయో తరువాతి భారత ప్రచురణకర్తలు పలువురు బ్రౌనుగారి ప్రతిని పాఠములను వాడుకొని యుందురు. మేము మూలముగా నుపయోగించిన వావిళ్ళ ముద్రణము బ్రౌనుదొరగారి పాఠములకు సన్నిహితముగా నున్నది. వావిళ్ళవారు స్వార్థరహితముగా సారస్వతసేవ యొనరించిన యా దొరగారికిఁ గృతజ్ఞత తెల్పిరో లేదో తెలియదు. పకాృమజోస్యులవారు మాత్రము పండితులకుఁ జక్కని సంప్రదాయము నేర్పఱిచి యుండిరి.

## 1860 తరువాతి ప్రతులు - బ్రిటిషు మ్యూజియము గ్రంథాలయము — మద్రాసు రికార్డు ఆఫీసు

1860 తరువాత ముద్రింపఁబడిన ఆంధ్రమహాభారత ప్రతులను గూర్చి తెలిసికొనుటకు మనకు రెండాధారములున్నవి. 1. కొన్ని ముఖ్యములైన ముద్రణములను పేర్కొన్న బ్రిటిషు మ్యూజియము గ్రంథ పట్టిక. 2. 1867 వ సంవత్సరమందలి రిజిస్ట్రేషను చట్టము ననుసరించి గ్రంథ ప్రచురణములను ''రిజిస్ట్రారు ఆఫ్ బుక్సు' అను నధికారి కార్యాలయమున నమోజు చేయవలసిన యావశ్యక మేర్పడెను. అప్పటి నుండియుఁ బ్రచురింపఁబడిన గ్రంథముల ప్రతులచ్చట భద్ర పఱుపఁబడి యున్నవి.

1867 తరువాత ముద్రింపఁబడినమహాభారతప్రతుల ఆరోపములు కనఁబడుచున్నవి. అందులోఁ గొన్ని వర్ణితములైనవి; కొన్ని వర్ణనము లేకుండ నూరక పట్టికలోఁ జేర్పఁబడినవి.

బ్రిటిషు మ్యూజియము గ్రంథాలయాధికారులు మే మడిగిన వెంటనే తమయొద్ద భద్రపఱుపఁబడిన మహాభారత ప్రతులకు సంబంధించిన సర్వవిషయములును మాకుఁ దెల్పియుండిరి. వారికి మా కృతజ్ఞతలు. వారు వట్టి పట్టికయే కాక యున్నచోట ముఖపత్రముల యొక్కయు నొండు రెండాంతర పత్రముల యొక్కయు ఛాయా పటములను గూడఁ బంపి యుండిరి వాని వివరము క్రింద నొసంగఁబడుచున్నది.

1. ఆదిపర్వము సం. 14174 L — 12 రుధిరోద్గారి. మదరాసు క్రీ.శ. 1863.
2. మూఁడు సంపుటములుగా నున్న సంపూర్ణ మహాభారత ప్రతి. సం. 14174— L — 16. వింజమూరి కృష్ణమాచార్య సంపాదితము. మదరాసు 1864.
3. ఉద్యోగపర్వము — సం. 14174 K — 33 — 1864.
4. సభాపర్వము సం. 14174 K 23 — 1865.
5. యుద్ధ పంచకము సం. 14174 L — 13 — మదరాసు. 1875.
6. మహాభారతము — రెండు సంపుటములు — సం. 14174 L — 14. భద్రాచలం తిరుమల నరసింహాచార్యులవారిచే సంపాదితము — మదరాసు 1881.
7. ఆదిసభాపర్వములు. సం. 14174 K — 57 నెల్లూరు - 1896.
8. సభాపర్వము. సి. జానకిరామయ్యగారి టీకతో - 1899 సం. 14174 — K — 45.
9. ఉద్యోగపర్వము. పనప్పాకం అనందాచార్యులవారి ఆంగ్లోపాధ్యాతముతోఁ గూడినది — 1900.

10. మహాభారతము. శతఘంటం వేంకట రంగ శాస్త్రి గారి తొలి పలుకుతోఁ గూడినది. రావు బహద్దరు కందుకూరి వీరేశలింగముగారిచేతను రాయదుర్గము నరసయ్యశాస్త్రిగారిచేతను సంపాదింపఁబడినది. 3 సంపుటములు మదరాసు. 1901 సం. 14175. B - 1.

11. ఆరణ్యపర్వము. షష్ఠ సప్తమాశ్వాసములు — F.A పాఠ్య గ్రంథమునకు శ్రీ దండిగుంట సూర్యనారాయణ శాస్త్రిగారిచేతను వ్రాయఁబడిన టీక.

12. భారతసార రత్నావళి. పి. వి. సుబ్రహ్మణ్యరెడ్డి మదరాసు - 1885.[1]

వింజమూరి కృష్ణమాచార్యుల వారిచే సంపాదితమైన 1864 వ సంవత్సరపు ఆంధ్రమహాభారత ముద్రణము మనముద్రితప్రతుల పురోగతిలో నొక దశను సూచించును గావున మనకుఁ బరిశీలనార్హమైనట్టిది. బ్రిటిషుమ్యూజియము గ్రంథాలయము వారు దాని ప్రతిని సమకూర్చుట కంగీకరించిరి. కాని దాని నింతవఱకుఁ దెప్పించుకొనలేకపోతిమి. ఈ గ్రంథాలయమున ఆదిపర్వమునకు సంబంధించిన యింకొక తాళపత్రి ప్రతి కూడ నున్నది. ఈ తాళపత్రప్రతి యందలి మొదటి తుదిపత్రముల ఛాయా ప్రతులను గ్రంథాలయాధికారులు మాకుఁ బంపియుండిరి.

అది నన్నయగారి యాశీర్వచన శ్లోకముతో నారంభించుచున్నది. ఈ యొక్క శ్లోకమునఁగూడ సామాన్యదోషములును పాఠాంతర భేదములును గలవు. ఆది పర్వాంతమున గద్య మొసంగఁబడినది. దాని తరువాత దానిని వ్రాయించుకొన్న వారిని గూర్చి లేఖకుఁడు వ్రాసిన సూచన యున్నది "విశ్వావసునామ సంవత్సర తులామాసాష్టమీ గురువారమునాఁడు (ఇది 23-10-1845కు సమానము) నుట్కూపురి నివాసులును, అత్తంతల గోత్రులును, మన్నరు నాయనివారి కుమారులునైన బంగారయ్యగారు చదువుకొనుటకు సెదమంగళం నివాసియు చెవ్వంది లింగయ్య భేషజుని [బహుశః వైద్యుఁడై యుండును] కుమారుఁడునైన చొక్కలింగముచే వ్రాయఁబడినది''.

డా. కట్టమంచి రామలింగారెడ్డిగారి జనకులు సుబ్రహ్మణ్యరెడ్డిగారు భారతము నుండియు భాగవతము నుండియు నీతితత్త్వమయములైన పద్యముల నేరి 1885 వ సంవత్సరమున భారతసార రత్నావళి, భాగవతసార రత్నావళి యను పేర్లతో రెండు గ్రంథములను బ్రచురించిరి. వానిని 1926 వ సంవత్సరమున రామలింగారెడ్డి గారు మరల ముద్రించి యందుఁ దమ తండ్రిగారిని గూర్చి సంగ్రహముగాఁ దెల్పియుండిరి. విద్వత్కవులైన శేషాద్రిరమణకవులు దాని కుపోద్ఘాతము రచించిరి. వారందు సుబ్రహ్మణ్యరెడ్డిగారు భారత పద్యములను 1863 వ సంవత్సరమున మదరాసు వాణీనికేతన ముద్రణాలయమునందుఁ బ్రచురింపఁబడిన ప్రతినుండి సంగ్రహించిరని తెల్పియుండిరి, ఆ సంకలనమున మహాభారతము నందలి యన్ని పర్వములకును సంబంధించిన పద్యములుండుటచే 1863వ సంవత్సరపు ప్రతి సంపూర్ణ ప్రతియే యని యూహింప

1. కట్టమంచి సుబ్రహ్మణ్యరెడ్డిగారని యుండఁదగును. వీరు ఆంధ్ర విశ్వవిద్యాలయమున కుపాధ్యాయులుగా నుండిన డా. కట్టమంచి రామలింగారెడ్డిగారి జనకులు.

వచ్చును. ఈ ప్రతి మాకింకను లభించి యుండలేదు శేషాద్రిరమణకవులు భారత సార రత్నావళి ద్వితీయ ముద్రణమందలి పద్యములను ఆనందముద్రణాలయము వారి భారత ప్రతితో సరిచూచి పాఠములను గుర్తించియుండిరి. ఈ విధముగా భారత సార రత్నావళి యీ సంశోధిత ముద్రణమునకుఁ బరంపరగాఁ దోడ్పడవచ్చును.

## ఇండియా ఆఫీసు గ్రంథాలయము

లండనునందలి ఇండియాకార్యాలయ గ్రంథాలయపు అధికారులు మేమడిగినంతనే చాల తక్కువ వ్యయముతో మహాభారతమందలి పదునెన్మిది పర్వములకును ఒక్కని ఛాయాప్రతిని దీసి పంపియుండుటచే వారికి మేమెక్కువగా ఋణపడియున్నాము. లండను ముద్రణమని[1] పేర్కొనఁబడిన యీప్రతి మావిమర్శ సాధన సామగ్రిలో మిక్కిలి ముఖ్యమైనది.

ఇండియా కార్యాలయ గ్రంథాలయ మందలి ముద్రిత ప్రతుల పట్టిక.

1. తెలుఁగు డి. 67, 68. యం. వేంకటకృష్ణమాచార్యులు, ఆర్ వెంకటకృష్ణశాస్త్రి. టి. విజయరాఘవకవి అనువారిచే సంపాదింపఁ బడినది. ఆదిపర్వము నుండి ఉద్యోగపర్వము వఱకు. ప్రథమ సంపుటము, జ్యోతిషకళానిధి ముద్రణాలయము. మద్రాసు. శక, 1755.

   ద్వితీయ సంపుటము, భీష్మపర్వమునుండి తుదివఱకు. జ్యోతిషకళానిధి ముద్రణాలయము, మదరాసు. శక 1755.

2. తెలుఁగు డి 71. ఆంధ్రభారతము. యుద్ధపంచకము. భీష్మపర్వమునుండి సౌప్తిక పర్వము వఱకు ఆర్ వెంకటకృష్ణశాస్త్రులవారి సంపాదితము. జ్యోతిషకళానిధి ముద్రణాలయము, శక. 1772. 

3. తెలుఁగు. డి. 83, 84 ఆంధ్రభారతకావ్యము, కాలపాటి రంగయ్య గారిచే సంపాదితము, రెండు సంపుటములు కళానిధి ముద్రణాలయము. మదరాసు 1852. 

   సి. పి. బ్రౌనుగారి నిర్దేశమున సిద్ధము చేయఁబడినది. దీనికి వారు స్వహస్తముతో టీక వ్రాసియుండిరి. 

1. ఈ ముద్రణమందలి ఆదిపర్వముతో నారంభించు మొదటిసంపుటమున ముఖపత్రము లేదని యిదివఱకు వ్రాసియుంటిమి. లండనుప్రతిలో నదిలేనిమాట నిజమే. తరువాత ఆంధ్ర విశ్వవిద్యాలయమువారి ప్రత్యేక సంచయమున ఆలూరి ఏకామ్ర జోస్యులవారి ఆదిపంచకము లభించినది. అందు ముఖపత్రమున్నది. అది సరిగా లండనుప్రతియందలి భీష్మపర్వాది యగు ద్వితీయ సంపుటము మొదట నున్నదానివలెనే యున్నది, జ్యోతిషకళానిధి వర్తమాన తరంగిణీ ముద్రణాలయముల పేర్లందుఁగూడఁ బేర్కొనఁబడినవి.

4. తెలుఁగు డి. 54 హరివంశ పురాణము శంభుదాసుఁడైన ఎఱ్ఱాప్రెగడ రచించినది. కరాలపాటి రంగయ్యగారిచే[1] సంపాదితము అసంపూర్ణము ఉత్తర భాగము 4 ఆశ్వాసముల వఱకు కళానిధి ముద్రణాలయము. మదరాసు. 1868.
ఇండియా కార్యాలయ గ్రంథాలయమున కాగితపు లిఖితప్రతు లేవియు లేవు.

1. కరాలపాటి రంగయ్యగారిని గూర్చి వివరములను వీరేశలింగము పంతులు గారి ఆంధ్రకవుల చరిత్ర — తృతీయ భాగమునుండి గ్రహింపవచ్చును.

కరాలపాటి రంగయ్యగారు (1814 — 1863) వైష్ణవ మతావలంబులైన వైశ్యశ్రేష్ఠులు. వారు కవులై భూతపురిమాహాత్మ్యము. కవిజనమనోహరము అను రెండు కావ్యములను రచించియుండిరి. వారు పచ్చయ్యప్ప మొదలి ఉన్నత పాఠశాలయందును, రాజధాని ఉన్నత పాఠశాల యందును ఆంధ్ర సంస్కృత పండితులుగాఁ బనిచేసి యుండిరి. వాణీమండపమని వర్ణింపఁబడు మదరాసునందలి హిందూ బాలికోన్నతపాఠశాలలోఁ గూడ వారు ప్రధాన పండితులుగాఁ బనిచేసిరి రంగయ్యగా రాంధ్ర భారత భాగవత రామాయణములను బ్రచురించునట్లు వీరేశలింగము పంతులుగారు తెల్పియుండిరి. పై నొసంగఁబడిన పట్టికనుబట్టి వారు హరివంశమును గూడ సంపాదించి ప్రచురించినట్లు తెలియుచున్నది. లేఖక ప్రమాదములను దొలఁగించి యాంధ్రభారతాది గ్రంథములను బ్రచురించిన వారిలో రంగయ్యగారే ప్రథములని వీరేశలింగము పంతులుగారి యభిప్రాయము. మహాభారతమునకు సంబంధించినంతవఱకు ఏకామ్ర జోస్యులవారి ప్రయత్నముకూడఁ గనవచ్చుచుండుటచే వారి యభిప్రాయము కొంతవఱకు మాత్రమే నిజమై యుండును. రంగయ్యగారియు జోస్యులయు ముద్రణములు రెండును సకాలమున వెలువరింపఁ బడినవి.

జోస్యులవారికివలె రంగయ్యగారి కార్థిక క్లేశమంతగా లేనట్లుకనిపించును. జోస్యులవారు తెల్పిన ఆర్థిక క్లేశములను జదువునప్పుడు హృదయము విషణ్ణమగును. రంగయ్యగారికి వి (విలందూడ) సోమసుందరం పిళ్లెగారను సంపన్నుల సాహాయ్య ముండెను. మహాభారత ముఖపత్రమునఁ బ్రకటింపఁబడిన కొన్ని హృద్యములైన పద్యములలో రంగయ్యగారు వారికిఁ గృతజ్ఞత వెల్లడించి యుండిరి. సోమసుందరం పిళ్లెగారి జనకులైన ముత్తయ్య పిళ్లె గారు వృద్ధాచలేశ్వరుని యనుగ్రహమును బడసి యుండిరి. శ్రీమతి మీనాక్షి వారి ధర్మపత్ని. ఆ పవిత్ర దంపతులకు సోమసుందరం పిళ్లెగారు జన్మించిరి. వా రుదార హృదయులై శిథిలములైన తటాకములను, దేవాలయములను, ఆరామములను, నూతులను, గ్రీష్మకాల జలాధారములను బాగు చేయించినట్లే సోమసుందరం పిళ్లె గారు కవిత్రయము వారిచే రచింపఁబడిన ఆంధ్ర మహాభారతమును లేఖక ప్రమాదములు లేకుండ పండితులచేఁ బరిష్కరింపఁజేసి నిర్దుష్టముగ ముద్రించుటకుఁబూని 1852 డిసెంబరు 26 వ తేదీకి సమానమైన పరీధావినామ సంవత్సర మార్గశీర్ష పూర్ణిమనాఁడు (శక 1775) ముద్రణమునుఁ బూర్తి చేయించిరి. ఇంతకు ముందు సోమసుందరంగారు భాస్కర రామాయణమును, ఉత్తరరామాయణమును గూడఁ బ్రచురించిరి. ఇవి పి. కుమారయ్యగారి కళానిధి ముద్రణాలయమున ముద్రింపఁ బడినవి.

ఈకాలమున కళానిధి, జ్యోతిషకళానిధి, వర్తమాన తరంగిణీ వివేకా దర్శ ముద్రణాలయములు నాలుగుమాత్రమే యాకాలమునందలి ప్రముఖ ముద్రణాలయములుగాఁ గనఁబడుచున్నవి. ప్రామాణిక గ్రంథ ప్రచురణవిషయమున నవి యొండొంటితో స్పర్ధనహించు చుండెను. ముద్రణ కార్యమారబ్ధమైన యా తొలినాళ్ళలో నవి కావించిన కృషి కెంతయుఁ బ్రశంసింప వలసియున్నది. ఈ దినములతో ముద్రితములగు గ్రంథములకంటెఁగూడ నవి నిర్దుష్టతరములుగా నుండుట గమనింపఁదగిన విషయము.

## డెన్వరు ప్రజా గ్రంథాలయము
## (అమెరికా సంయుక్త రాష్ట్రములు)

అమెరికా సంయుక్త రాష్ట్రములందలి కొలొరేడోలోని డెన్వరు నగరమందున్న ప్రజా గ్రంథాలయమున నొక ఆంధ్ర మహాభారత తాళపత్ర ప్రతి యున్నట్లు మాకుఁ దెలిసినది. ఆ గ్రంథాలయాధికారులతో నుత్తర ప్రత్యుత్తరములు జరిపితిమి. దానిని గూర్చి యీయఁబడిన ప్రథమ వర్ణనను బట్టి యది యుద్ధపంచకమునకు సంబంధించినదని యూహించితిమి. అది 120 సంవత్సరముల క్రిందటిదనియు, క్రీ.శ. 1800 కంటెఁ బ్రాచీనతరము కాదనియు వారు తెల్పియుండిరి. మఱియు నా తాళపత్రప్రతి మూఁడుభాగములుగా విభజింపఁబడినది. ఆ మూఁడు భాగములను డెన్వరు నగరమందలి ప్రజా గ్రంథాలయమును, గ్రీవాయందలి కొలరేడో రాష్ట్ర కళాశాలయు, ఫోర్టుకాలిన్సు నందలి కొలరేడో రాష్ట్రవిశ్వవిద్యాలయమును బంచుకొన్నవి. తమకుఁ దెలియని లిపిలోను భాషలోను వ్రాయఁబడిన వ్రాఁత తాళపత్రప్రతిని మిక్కిలి జాగరూకతతోఁ భద్రపఱుచునట్లు చేసిన దూరగతములైన యా గ్రంథాలయముల విజ్ఞానతృష్ణ యెంతయు మెచ్చుకొనఁదగియున్నది. అవి యా తాళపత్ర ప్రతిని మూఁడు భాగములుచేసి పంచుకొనుట కూడ మా కాశ్చర్యకరముగ నున్నది. ప్రస్తుతము మే మారంభపర్వముల సంపాదన కార్యమున నిమగ్నులమై యుండుటచేఁ బై తాళపత్రప్రతి చరిత్ర నెఱుంగుట కింకను గాఢ ప్రయత్న మొనరించి యుండలేదు.

## 1900 తరువాతి ముద్రిత ప్రతులు.

1860 నుండి 1900 వఱకును బంచమ వేదమందలి గౌరవము చేతనో, వ్యాపార దృష్టి చేతనో పలువురు ప్రచురణకర్తలు మహాభారతము నేకదేశముగనో సమగ్రముగనో ముద్రించుటకు యత్నములు కావించినను తరువాత నట్టి ముద్రణముల సంఖ్య క్రమముగాఁ దగ్గిపోయెను. ఆనంద వావిళ్ళ ముద్రణాలయములు రెండు మాత్రమే మహాభారత ప్రామాణిక ముద్రణములఁ బ్రచురించు విషయమున ప్రాముఖ్యము వహించెను. ఈ మార్పునకుఁ గారణము నూహించుట సులభమే. సాధారణముగ నే దేశముననైన ముద్రణ వ్యాపారము మొదట నారంభింపఁ బడినప్పుడు ముద్రణము లసంఖ్యాకములుగా నుండును. తరువాత నూత్న ప్రయోగమునకు సంబంధించిన నవ్యత సడలిపోవుటచేఁ బ్రజలు పాండితీ సాంకేతిక నిర్వహణములు రెండింట నున్నత ప్రమాణములను వాంఛింపఁ దొడఁగిరి. అపరిష్కృతములును అసుందరములు నైన ముద్రణము

అందలి లోపములను అముద్రితగ్రంథ చింతామణివంటి యుత్తమ పత్రికలు తీవ్రముగా విమర్శింప సాగెను. ఈతీవ్ర విమర్శ ప్రవాహముల నడ్డుకొనుట క్లిష్టకార్యమయ్యెను. అందుచే చిన్న ప్రచురణకర్తలు మహాభారతమువంటి యుద్గ్రంథములను బ్రచురించు పనికిఁ బూనుట సులభము కాదని గ్రహించి యా రంగము నుండి తప్పుకొనిరి.

ఈ ముద్రణములలోఁ గొన్నింటిని గూర్చి లక్ష్యములైన వివరముల ననుబంధములలో నొసంగెదము. మనకింక ఆనంద వావిళ్ల ముద్రణములు రెండుమ మిగిలినవి. విద్వత్సంపాదకత్వ సుందర ముద్రణముల విషయమున నీ రెండు ప్రతులును సమముగనే పోటీచేయుచున్నవి.

## వావిళ్ళ, ఆనంద ముద్రణములు

వీనిలో నేది మొదటిది యను సమస్య మనల నెదుర్కొనుచున్నది. వీని పరిణామ చరిత్ర మున్నగు విషయములను వివరించుటకు నిర్వివాదమైన సాక్ష్యములు లేవు. లభించు సాక్ష్యములతోనే తృప్తి పడవలయును. 1870 వ సంవత్సరమునందలి మహాభారతాది పర్వమునకు సరస్వతి తిరువేంగళాచార్యులవారితో సంయుక్తప్రకాశకులుగా వావిళ్ళ రామస్వామి శాస్త్రులవారి పేరు కూడ కనఁబడుచున్నది[1]. ఇది హిందూ భాషాసంజీవనీ ముద్రణాలయమున ముద్రింపఁబడినది. ఈ సంవత్సరముననే ఈ గ్రంథకర్తలపేరు మీఁదనేమఱియొక గ్రంథముగూడ గానవచ్చుచున్నది [19/1.71—1870]. ఈమూఱు వారుద్యోగపర్వమును ప్రచురించిరి.

ఆది ఉద్యోగ మొక్కటే యగునా యను విషయము స్పష్టముగాఁ దెలియదు. పుటల సంఖ్య 470. అని యీయఁబడినది. బహుశః అది ఆదిపంచక మంతయుఁ గావచ్చును. ఇంక వేమూరి వేంకట కృష్ణయ్యచెట్టి అండ్ సన్సువారిచేఁ బ్రచురింపఁబడిన ఆనంద

---

[1] కీ. శే. వావిళ్ళరామస్వామి శాస్త్రిలుగారి జీవితసంగ్రహమునకు (1832—99) రక్తాక్షి సంవత్సర ఆశ్వయుజ మాసపు (1924) సారస్వత సర్వస్వము (సంపుటి సంచిక ౧) చూడుఁడు. వావిళ్ళ రామస్వామి శాస్త్రిగారు నెల్లూరునకు సమీపమందలి దండిగుంటయను గ్రామమున జన్మించిరి. వారు సాంప్రదాయిక విధమున విద్యాభ్యాసము కావించిరి. విద్వాంసులు తాళపత్ర ప్రతులతో పడు క్లేశముల నీక్షించి వారు ముద్రణ వ్యాపారము నవలంబింప నిశ్చయించిరి. క్రి. శ. 1853లో వారొక చిన్నముద్రణాలయమును స్థాపించి ప్రామాణిక గ్రంథముల నత్యంతశ్రద్ధతో ముద్రించుటకు వారు జీవితకాలమంతయుఁ గృషి చేసిరి. వారు విజయనగరమహారాజులైన ఆనందగజపతి రాజు గారియొక్కయు వెంకటగిరిమహారాజులయొక్కయుఁ బ్రశంసల నందుకొని యుండిరి. ముద్రణ స్ఖాలిత్యములను దొలఁగించుటకై వార వలంబించిన విధానమునుగూర్చి యొకకథ చెప్పుదురు. ముద్రణమునకు సిద్ధముచేయఁబడిన ఫారమును వారు ముద్రణాలయము బయటఁ బ్రదర్శించి అందేదైన దోషమును గనిపెట్టిన యెవ్వరికైనను వారు దోషము 1కి 8 అణాలచొప్పున నిచ్చుచుండెడివారఁట.

ముద్రణమును గూర్చి పరిశీలింతము. అముద్రితగ్రంథచింతామణిలో నీవ్యాపారసంస్థ పేరు వినవచ్చుచున్నది. 1894 వ సంవత్సరపు సంపుటములో దాని సంపాదకులైన పూండ్ల రామకృష్ణయ్యగారి వ్యాపారసంస్థచేఁ బ్రచురింపఁబడిన యాంధ్ర భాగవతమును గూర్చి ప్రశంసాపూర్వకముగా వ్రాయుచు "వేమూరి వెంకటకృష్ణయ్య చెట్టి అండ్ సన్సువారు భాగవతమును వలెనే ఆంధ్ర మహాభారతమునుగూడ నత్యంతప్రశస్త విధమునఁ బ్రచురించి వారి ప్రతిష్ఠను బ్రోదిచేసికొందురని యాశించుచున్నా"మని వ్రాయుండిరి.

దీనినిఁబట్టి మహాభారతము యొక్క ఆనందముద్రణము 1894 తరువాతనే వెలువడెనని తెలిసికొనవచ్చును. ఈ సందర్భముననే యీ సంస్థవారిచేతనే 1901వ సంవత్సరమున రావుబహద్దరు వీరేశలింగంపంతులుగారును రాయదుర్గం నరసయ్యశాస్త్రిగారును[1] సంపాదకులుగాఁ బ్రచురింపఁబడిన ప్రసిద్ధ మహాభారతముద్రణమునుగూర్చి చెప్పవలసి యున్నది. ఈ ముద్రణము యొక్క ప్రతిష్ఠకు ప్రామాణిక విద్వాంసులతో దానికిఁ గల సంబంధమే కారణము. అప్పటినుండియు ఆనందముద్రణాలయమువారు బుక్కపట్టణం రామానుజయ్యగారు, తంజనగరం తేవప్పెరుమాళ్ళయ్యగారు, పురాణం సూర్యనారాయణ తీర్థులుగారు మున్నగు పండితప్రకాండుల సహకారమును బడయుచుండినట్లు గోచరించును.

తరువాత వెలువడిన ఆనందముద్రణము లన్నియు నించుక చేర్పు మార్పులతో దీని పునర్ముద్రికలే. కాని అవి యెవ్వియును వీరేశలింగము పంతులుగారికిఁ గాని, నరసయ్యశాస్త్రిగారికిఁ గాని కృతజ్ఞతలు ప్రకటించినట్లు కనఁబడదు 1907 వ సంవత్సరపు ముద్రణమునందలి తొలి పలుకులో తంజనగరం తేవప్పెరుమాళ్ళయగారు 1901 సంవత్సరపు ముద్రణాలయము యొక్క సంపాదకులను గూర్చి యేమియుఁ జెప్పియుండలేదు. పురాణం సూర్యనారాయణ తీర్థులవారు తమ 1922 వ సంవత్స

1. రాయదుర్గం నరసయ్యశాస్త్రులవారు 19 వ శతాబ్ది చరమ పాదమున నివసించిన సుప్రసిద్ధ విద్వాంసులలో నొకరు. సుబ్బలక్ష్మాంబా లక్ష్మీనరసార్యులు వారితలిదండ్రులు వారు మదరాసునందలి క్రైస్తవ కళాశాలలో పండితులుగా నుండిరి. వారు 1894 వ సంవత్సరముననే కాళిదాసుని అభిజ్ఞాన శాకుంతలము నాంధ్రీకరించిరి. కందుకూరి వీరేశలింగంపంతులుగారి యనువాదము 1883 వ సంవత్సరముననే వెలువడెను. సులకమైన శైలిచేతను, మనోహరమైన భావ వ్యక్తీకరణము చేతను వీరేశలింగం పంతులుగారి యనువాద మిప్పటికిని అధికమైన జనాదరముఁ బడయుచున్నది. నరసయ్యశాస్త్రిగారు నాటకవ్యాఖ్యాతలకు సాధ్యమైనంత సన్నిహితముగా నుండవలెనను నుద్దేశముతో క్రొత్తయనువాదము నారంభించి యుందురు. నాటకమున నీచపాత్రలకు వ్యావహారిక భాషను వాడిన వారిలో నరసయ్యగారే ప్రథములని చెప్పవచ్చును. తరువాత వేదం వేంకట్రాయశాస్త్రిగారు తమ ప్రతాపరుద్రీయనాటకమున నీ ప్రయోగమును జయప్రదముగ నిర్వహించి యుండిరి. ఆనంద ముద్రణాలయమువారి సారస్వత ప్రచురణములతో నరసయ్యశాస్త్రిగారికి సన్నిహిత సంబంధము కలదు.

రపు ముద్రణతో దీని కించుక పరిహారము కావించిరి. వారిందుఁ గూర్చిన మెఱుఁగులను కూడ మనము పరిశీలింప వలెను. వీరేశలింగంగారును, నరసయ్యగారును తాము గ్రహించిన పాఠములను స్థిరపఱచుటకై పరిశీలించిన తాళపత్రప్రతులను పేర్కొని యుండలేదు.

కాని వారేవో కొన్ని తాళపత్రప్రతులను పరిశీలించి యుందురనుటకు సందేహము లేదు. ఆనంద ముద్రణమున తరువాతి సంపాదకులంతకంటె నెక్కువశాస్త్రీయమైన పద్ధతి నవలంబించి యుండిరి. వారు తాము పరిశీలించిన తాళపత్ర ప్రతుల నక్షర సంజ్ఞలచే సూచించి యుండిరి. దీనివలన పాఠకులాయా తాళపత్ర ప్రతులను పరిశీలించి స్వీయాభిప్రాయముల నేర్పఱుచుకొనుట కవకాశముండుటచే నిది వెనుకటివాని కంటె నుత్తమమైన పద్ధతి. కాని యింతకంటెను మెఱుఁగులు తీర్చిదిద్దుటకు వీలున్నది. ఆనందముద్రణపు విద్వాంసులు కూడ తాము సరిచూచుటకై ఉపయోగించిన తాళపత్ర ప్రతులను గాని, యా ప్రతులనే వారు ప్రత్యేకముగా నెన్నుకొనుట కవలంబించిన సూత్రములను గాని, యా ప్రతుల వర్ణనాదులుగాని తెలిపియుండలేదు.

## సంశోధిత ముద్రణము యొక్క తటస్థ స్వభావము.

నిజమైన సంశోధిత ముద్రణము లక్ష్యములైన సాక్ష్యములన్నియు విద్వత్సంఘముల ముందుంచి ప్రత్యేకములైన పాఠముల నంగీకరించుటో, తిరస్కరించుటో వారు స్వయముగా నిర్ణయించికొనుట కవకాశ మొసంగవలయును. సంశోధిత ముద్రణము సాధ్యమైనంతవఱకు తటస్థముగా నుండవలయును. సంపాదకుఁడు తన కిష్టము వచ్చిన పాఠము నెన్నుకొన వచ్చుననుటలో సందేహము లేదు కాని, యతఁడు తన యభిప్రాయములచేఁ బాఠకులను ప్రభావితుల నొనరించుటకు యత్నింప రాదు. సంశోధిత ముద్రణము నందలి పాఠములను నిర్ణయించుటలో ప్రస్తుతసంపాదకులు తాళపత్రప్రతులందలి పాఠములకే ప్రథమ ప్రాధాన్యము నొసంగి యుండిరి. కేవల సంఖ్యను బట్టియే వారు పాఠములను నిర్ణయించిరని దీని యర్థము కాదు. ఉత్తమ పాఠ మేకైక తాళపత్ర ప్రతిలో మాత్రము లభించినను దోష భూయిష్ఠములును నల్పములునైన పెక్కితర పాఠముల కంటె దానికే ప్రాధాన్యము నొసంగితి. ఈ దృష్టితోఁ జూచినచో వీరేశలింగం గారియు నరసయ్యశాస్త్రిగారియు ముద్రణము పరంపరాప్రాప్తమైనదే కాని వర్ణనాత్మక మైనది కాదు. నిజమునకు పూర్వపు ముద్రణములన్నియు పకా్రమజోస్యుల వారిదైనను, కరాలపాటి రంగయ్యగారిదైనను, తదితరులదైనను నొక విధముగా పరంపరాప్రాప్తములైనట్టివే. బహుశః బ్రౌనుదొరగారి ముద్రణము సంశోధనాత్మక మైయుండి యుండును. కాని అది ప్రచురితము కాలేదు.

## సంశోధిత ముద్రణ భావోదయము

మహాభారతమునకు సంశోధిత ముద్రణము కావలెనను భావమీ శతాబ్దియారంభముననే యుదయించెను. గ్రాంథిక వ్యావహారిక భాషావాదము మహాభారత సంశోధిత ముద్రణ భావోదయమునకు దారి చూపెను. కీ. శే. రావు సాహేబు గిడుగు రామమూర్తి పంతులుగారు వ్యావహారిక భాషా ప్రచారమునకై వాదము

చేయు సందర్భమునఁ బూర్వమున్న లేఖన విధానముల నన్నిటిని బరిశీలింపఁ దొడంగిరి. ప్రాచీన లేఖనములలో వ్యావహారికభాష ప్రయోగింపఁబడినదేమో పరిశీలించుటకై వారు ప్రాఁత లిఖిత ప్రతులనన్నిటిని గాలించిరి. దీనివలనఁ గొన్ని నూతన విషయములు వెలుఁగునకు వచ్చెను. భాషాపాండిత్యము వాంఛించువారిచే వ్యావహారిక భాషలో వ్రాయఁబడిన పెక్కు భాగములు గ్రాంథికభాషగా పరివర్తనము పొందింపఁబడినవని వారు కనుగొనిరి. పండితుల యీ నిరంకుశచర్యను వారు తీవ్రముగా నిరసించిరి.

ఈ సమయముననే రామమూర్తి పంతులుగారును వారి కుమారులైన డా. సీతాపతిగారును అప్పకవీయము వంటి ప్రముఖచ్ఛందో లక్షణ గ్రంథములకు విద్వన్ముద్రణములను సిద్ధము చేయుట యందు వ్యాపృతులై యుండిరి. అప్పకవివంటి లాక్షణికులు ఆంధ్రచ్ఛందస్సును గూర్చి తమకుఁగల యభిప్రాయముల కనుగుణముగా మహాభారతము నందలి పాఠములను మార్చివేసిరని గ్రహించి వారాశ్చర్య చకితులైరి. ఆంధ్ర మహాభారతము యొక్క ప్రామాణికత్వము నెల్లరు నంగీకరించిరి. ఈ ప్రామాణిక గ్రంథము నందలి పాఠములు చిరప్రతిష్ఠితములైన సిద్ధాంతముల కనుగుణముగాఁ జేయఁబడినచో నా సిద్ధాంతముల కెక్కువ ప్రాముఖ్యమును పావిత్ర్యమును గలుగును. ఈ విధానము వలన నన్నయయునితర భారతకవులును గావించిన ప్రయోగములను యథాతథముగఁ గాక యింకొక రూపమునఁ గనఁబడునట్లుచేసి తాను వారి కెంతో యన్యాయముచేసినట్లు పండితులు గ్రహింపలేకపోయిరి. ఈ సందర్భమున అచ్చునకును హల్లునకును యతిమైత్రి పాటించుటకు వీలున్న అఖండయతిని ముఖ్యోదాహరణముగా గ్రహింపవచ్చును. ప్రసిద్ధమహాకవుల పాఠములు విచక్షణతావిహీనముగ మార్చివేయఁబడుట గాంచి పంతులుగారు ముద్రిత గ్రంథముల నంతకంటెఁ బూర్వతరములైన లిఖితప్రతులతోఁ బోల్చి చూడవలసిన యవసరమెంతో యున్నదను నిశ్చయమునకు వచ్చిరి. అట్లు చేయుట వలన కవుల మూలరచనకు సన్నిహితముగా నుండు గ్రంథముల తొల్లిటిరూపము ప్రతిష్ఠితమగుట కవకాశముండును.

## శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు

గిడుగు రామమూర్తి పంతులుగారీ విషయమునఁ దమ యభిప్రాయము నిట్లు వెల్లడించిరి

"రాజరాజ నరేంద్రుని కీర్తికి పతమాధారముగా నన్నయ రచించిన భారతమున్నది. ఇది రాజమహేంద్రవరమందు వెలసినదవుటచేత దీనియందు అక్కడివారికి అత్యంత గౌరవముండుట ఉచితమే. వారితోపాటు తెలుగు వారందరున్ను దానిని ఆదరిస్తున్నారు. అయితే తెలుగు పాండిత్యము యొక్క దురదృష్టముచేత, నన్నయ భారతము పుట్టి తొమ్మిది శతాబ్దములయినా, నిర్దుష్టమై విశ్వసనీయమైన పాఠములుగల గ్రంథము దొరకదుగదా. ఇంతవరకున్ను తగిన ఉద్యమముచేసి ఈ పవిత్రగ్రంథము

రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక. పుట. 128. ప్రచురణ – 1928.

యథాస్థితి లోనికి ఉద్ధరించక ఉపేక్షించి భాషాభిమానులు దోషులయినారు ఇకనైనా ఆ పనికి పూనుకోకపోతే తెలుగువారి భాషాభిమానము మిధ్య అని తెలుగు వారికి అపకీర్తి కలుగుతుంది. మహానుభావులు, కార్యదక్షులు పట్టుదలతో పనిచేస్తే శీఘ్రముగానే ఉద్దేశము నెరవేరుతుంది. ఇప్పుడు విజృంభించిన దేశాభిమానమున్ను వాస్తవమయితే ఈ కార్యము చేయబూనుకొన్నవారికి కావలసిన సాయము దొరకకపోదని నమ్ముతున్నాను."

మహాభారత సంశోధిత ముద్రణము కావలెననుట కిదియొక గంభీరమైన శంఖ ధ్వనియని చెప్పవచ్చును. సుమారు నలువది యాేండ్ల క్రిందట చేయఁబడిన యీ ధ్వని యుపేక్షితమై వృథాగా పోలేదని సంతోషించుచున్నాము.

డాక్టరు డి. యస్. రెడ్డిగారి సమర్ధమైన యాధ్యక్ష్యమున ముందంజ వేయుచున్న ఉస్మానియా విశ్వవిద్యాలయ మా ధ్వని నాలకించి దానికి కార్యరూప మొసంగ నాయితమయ్యెను. మేమిప్పుడా ప్రవాహము యొక్క మధ్యభాగమున నున్నాము కూలము లింకను కన్నులకు గోచరించుటలేదు.

మహాభారత సంశోధిత ముద్రణమును గూర్చి కడచిన తరమునందలి విద్వాంసుల యభిప్రాయముల నెక్కువగా చెప్పవలసిన యవసరములేదు కీ. శే. డా. సి. ఆర్. రెడ్డిగారు కూడ మహాభారత సంశోధిత ముద్రణము కావలెనన్న యుద్దేశము నభిమానించిన వారిలో నొకరు. మహాభారత మన్న వారికిఁ బరమప్రీతి.

సుక్తాంకరు స్మారకసంచికలఁ బ్రచురణమును బ్రశంసించుచు వారు వ్యక్తము చేసిన యభిప్రాయ మీక్రింద నొసంగఁబడుచున్నది.

"డాక్టరు ఆర్.జి. భండార్కరుగారి మరణానంతరము సంస్కృత ప్రాచ్యభాషా విజ్ఞానము విషయమున భారతదేశమునకు కలిగిన అపారనష్టములలో డా. వి. యస్. సుక్తాంకరుగారి ఆకస్మికమరణము మిక్కిలి తీవ్రమైనది. వారు కేంబ్రిడ్జిలో నాకు సమకాలికులు. ఆధునిక భారతదేశమున నిర్వహింపఁ బడుచున్న మహాకార్యములలో సంస్కృత మహాభారత సంశోధిత ముద్రణము సుమారిరువదియేండ్లనుండి సాగుచున్నది. ఈ కార్యముననుఁ గావలసి నయపారపరిశ్రమయు, తులనాత్మక పరిశీలనమును. విమర్శన సామర్థ్యమును ఊహకందనట్టివి" డా. రామలింగారెడ్డిగారు ఆంధ్రమహాభారతమునకుఁ గూడ నిట్టి సేవ జరుగుటకెంతయో వాంఛించిరని వేఱుగా చెప్పనవసరములేదు.

రామమూర్తి పంతులుగారు ఆంధ్రమహాభారత సంశోధిత ముద్రణముకావలెనని చెప్పుటతో నూరకుండక దానిని కార్యరూపమున నుంచుటకు,గూడ నారంభ మొనరింపఁ దొడఁగిరి. ఉత్తమములగు ప్రాచీనతరములునైన పాఠములు బడయుటకై వారాదిపర్వమును లిఖితప్రతులతోఁ చూచుటకారంభించినట్లు కన్పించును. వారి పరిశ్రమలఫలము మేము సాధనసామగ్రిగా గ్రహించిన గి. గి[1] అను పాఠములతోఁ

సుక్తంకర్ స్మారక. సంచిక 2సం. తొలిపలుకు పుట - 7.

గూడిన సంపుటములో గోచరించును. ఇది ఆంధ్ర విశ్వవిద్యాలయ గ్రంథాలయములో భద్రపఱుపఁబడిన రామమూర్తి పంతులుగారి సొంతప్రతి. మధ్యమధ్య తెల్లకాగితములు వేసికుట్టి రామమూర్తిపంతులుగారు తాము సేకరించిన పాఠములు వందు గుర్తించిరి. వారి మరణానంతరము వారిగ్రంథము లాంధ్ర విశ్వవిద్యాలయమునకు బహూకరింపఁబడినవి. వారు సేకరించిన పాఠముల కాధారములను నిర్దేశించుచు నందొక సూచనయున్నది. పంతులుగారు 1914 వ సంవత్సరపు వావిళ్ళవారి ఆంధ్రభారత ముద్రణమును తమ తులనాత్మకపరిశీలనమునకు మూలముగా గ్రహించిరి. కొంచెమించుగా మే ముపయోగించిన ప్రతియునదియే. దీనిని వారు తంజావూరు నందలి సరస్వతీమహాలు గ్రంథాలయపు తాళపత్ర ప్రతులతోడను, 1847వ సంవత్సరమున ప్రచురింపఁబడిన ఆదిపర్వముతోడను సరిపోల్చియుండిరి. ఇందు మొదటిదానికి $గ_1$ అనియు, రెండవదానికి గ యనియు మేము పెట్టిన గుర్తులు. దీనినిబట్టి పంతులు గారు పాఠములను సరిచూచుటకొక ముద్రితప్రతితోపాటు (1847నాటి ముద్రణము), కొన్ని తాళపత్రప్రతులను గూడ నెన్నుకొని యుండిరని తెలియుచున్నది. వారెన్ని తాళపత్రప్రతులను గ్రహించిరో, ఏ సూత్రముల ననుసరించి వానినెన్నుకొనియుండిరో, వారిసూచనల ననుసరించి పనిచేసిన పరిశీలకులెవ్వరో మనకుతెలియదు. ఈపాఠము లాది పర్వమునకు మాత్రమే లభించుచున్నవి. సభాపర్వభాగము పాఠశూన్యమై యున్నది. ఈవిధముగా మహాభారత సంశోధిత ముద్రణమునకు రామమూర్తిపంతులుగారు నాంది వాక్యమును బఠించిరి. వ్యక్తిగతముగా తమకున్న పరిమిత ధనసౌకర్యముతో వారింత కంటె నధికము చేయఁజాలక పోయిరి.

## జయంతి రామయ్య పంతులు గారు [1]

మహాభారత సంశోధితముద్రణమను ఘనకార్యమున నిట్టి తాత్కాలిక ప్రయత్న మభిలషించిన ఫలము నీయఁజాలదని తెలియవచ్చినది. దానికి దేశమంతయు వెతకి సేకరించిన తాళపత్ర ప్రతులును, కొన్ని ప్రాచీనములును నుండవలయును. ఈ కార్యము ధనసంపద పుష్కలముగా నున్న యొక పెద్దసంస్థ చేపట్టినఁగాని జయప్రదము కానేరదు. కాకినాడయందలి ఆంధ్రసాహిత్యపరిషత్తువారు దేశమంతయుఁదిరిగి తాళ

1. జయంతి రామయ్యపంతులు గారు (1860_1941) గ్రాంథికాంధ్ర భాషా వాదమునకు మూల స్తంభము వంటివారు. గిడుగు రామమూర్తి పంతులుగారు సారస్వతము నందే కాక విద్యావిధానమున నన్నిదశలందునుగూడ శిష్టవ్యవహారభాష ప్రవేశపెట్టవలె నని పోరుసాగించుచుండ రామయ్యపంతులుగారు గ్రాంథికభాషనే బలపఱుచుచు పర్వతము వలె స్థిరముగా నిలఁబడిరి. వారి గ్రాంథికాంధ్రభాషావాదము గ్రాంథికశైలి యావశ్యకమును నిరూపించు శక్తిమంతమైన ప్రయత్నము. ప్రధానముగా వారి ప్రయత్నము మూలముననే విశ్వవిద్యాలయములలో గ్రాంథికాంధ్రభాష నిలువఁ జాలినది. రామయ పంతులుగారు చరిత్రపరిశోధనయందును, శాసన పరిశీలనమునందును గూడ నిపుణు యుండిరి. వారు భారతప్రభుత్వ పక్షమున పెక్కుశాసనములను సంపాదించి యుండి . ఆంధ్రసాహిత్యపరిషత్తును, సూర్యరాయాంధ్ర నిఘంటువును రామయ్య పంతులుగారి నామధేయము నాంధ్రులకు శాశ్వత స్మరణీయమొనరించును.

పత్రప్రతులు సేకరించుట కారంభించిరి. ఈ మహాకార్యమునకు సూత్రధారులని చెప్ప దగినవారు కీ. శే. జయంతి రామయ్యపంతులుగారు. దీనికికావలసిన యార్థిక సాహాయ్యమును ఆంధ్రభోజ బిరుదాంకితులును పిఠాపురము మహారాజులునునైన కీ. శే. రావు సూర్యారావు బహద్దరువారు సమకూర్చియుండిరి కాకినాడయందలి ఆంధ్ర సాహిత్య పరిషత్తు గ్రంథాలయమందే బహుశః మహాభారతమునకు సంబంధించిన తాళపత్రప్రతు లధిక సంఖ్యాకముగాఁ గలవు.[1] మహాభారత సంశోధిత ముద్రణమును సిద్ధముచేయు సందర్భమున నీగ్రంథాలయము నుండియు మేము పెక్కుతాళపత్రప్రతులను తెప్పించు కొని యుంటిమి.

మహాత్మాగాంధిగారి సహాయనిరాకరణోద్యమముతో దేశమునందు ప్రాంతవిభు వలమ భారతీయ సంస్కృతిని పునరుజ్జీవింపఁజేయు కోరిక పొడసూపినది. వాఙ్మయ రంగమున నది తాళపత్రప్రతులను ప్రాచీనగ్రంథములను సేకరించి భద్రపఱుచు రూపము నొందినది. పెక్కుసంస్థలీ కార్యమునం దాదరము వహించినవి. ఐకమత్య ముతోఁ గూడిన ప్రయత్నమును, సేకరించిన సారస్వతకోశములను భద్రపఱుచు కేంద్ర గ్రంథాలయమును ఉండినచో ఆ ప్రయత్నమధికముగా ఫలవంతమైయుండినది. కాని ఆరెండును లేకపోయినవి. అందుచేఁ గొన్ని గ్రంథాలయములు తమంతతాము, కొన్ని తాళపత్రప్రతులను సేకరించినను ఆరంభమందలి ఉత్సాహమించుక తగ్గిన పిమ్మట వానిని సరిగా భద్రపఱుపఁజాలకపోయినవి. అందు కార్థికస్తోమత యేకాక అపార మైన శ్రద్ధకూడ నుండవలెను. ఉస్మానియా విశ్వవిద్యాలయాంధ్రశాఖవారు 1964 లో మహాభారత సంశోధిత ముద్రణప్రచురణమును సిద్ధముచేయ నిశ్చయించి తాళపత్ర ప్రతులను సేకరించుట కారంభించునాఁటికి వానిలోఁ బెక్కు శిథిలములై పోవుట సంభ వించినది. దేశమున సరియైన ముద్రణవ్యాపారము సుమారు 135 యేండ్లకుఁబూర్వమే ప్రవేశఁబెట్టఁబడియుండుటచే ప్రత్యేకవ్యక్తులు తాళపత్రప్రతుల విషయమున శ్రద్ధవహిం చుట మానివేసి గ్రంథ పరిణామ విధానమునందలి యాదరమను వారు పూర్తిగా విస్మ రింప నారంభించిరి.

1. ఈ పరిషత్తున కధికారులకును, ముఖ్యముగా దానికి కార్యదర్శులైన శ్రీ దంటు భాస్కర రావు గారికి — ఆదిపర్వమునకు సంబంధించిన 127 తాళపత్రప్రతులను సభా పర్వమునకు సంబంధించిన 17 ప్రతులను, అరణ్యపర్వమునకు సంబంధించిన 13 ప్రతు లను మాకుఁ బంపినందుకు మేమెంతయుఁ గృతజ్ఞులము. అరణ్యపర్వము అశుభప్రద ముగా పరిగణింపఁ బడుటచే దానిప్రతులు వ్రాయుటకు ఎక్కువమంది ప్రయత్నించెడి వారుకారు. అందుచే వానిసంఖ్య తక్కువగానున్నది. ఒక్క కాకినాడ పరిషత్తువారే ఈ పర్వమునకు సంబంధించిన 13 తాళపత్రప్రతులను మాకొసంగఁజాలిరి. ఇట్లే ముందుముందుకూడ నీపరిషత్తువారు విద్వాంసులును, పరిషదధ్యక్షులునైన శివశ్రీ బండారు తమ్మయగారి ఆశీస్సులతోపాటు సంపూర్ణసహకారముగూడ నొసంగుదురని విశ్వసించుచున్నాము

## తాళపత్ర ప్రతి సంగ్రహణము

రాజమహేంద్రవరము నందలి గౌతమీ గ్రంథాలయమువంటి కొన్ని ప్రాంత గ్రంథాలయములు తాళపత్రప్రతుల నతి కష్టముమీఁద భద్రపఱుపఁ గల్గినవి. గౌతమీ గ్రంథాలయమువారు మేమడిగినంతనే తమ యొద్దనున్న తాళపత్రప్రతులను దయతో మాకుఁ బంపియుండిరి. రాజమహేంద్రవరమునందలి ఆంధ్రదేశ–చరిత్ర–పరిశోధన సంఘము వారియొద్దఁ గూడఁ గొన్ని తాళపత్రప్రతు లున్నవి. కాని వానిని బయటి వారి కిచ్చుట వారి కభిమతము కాదు. వారు తమ యొద్ద నున్న తాళపత్రప్రతుల వర్ణనాత్మకపట్టికను ప్రచురించిరి. పిఠాపురమునందలి శ్రీ సూర్యరాయ విద్యానంద పుస్తక భాండాగారము వారు తమ యొద్ద నున్న తాళపత్రప్రతుల నుపయోగించు కొనుటకై మా కిచ్చియుండిరి.[1] కీ. శే. రావు సూర్యారావు బహద్దరువారు గొప్ప విద్యాపోషకులగుటచే పిఠాపురరాజసౌధమున నమూల్యములైన తాళపత్రప్రతు లెన్నో యుండునని మే మాశించితిమి. కాని నిరాశ పొందవలసి వచ్చినది. పార్థనా పూర్వకములైన మా లేఖలకుఁ బ్రత్యుత్తరములు రాలేదు. జమీందారీలు ర చేయఁ బడిన పిమ్మట వచ్చుటఁగల పరిస్థితుల కిదియొక మంచి దృష్టాంతము. క్రీ. . 19 వ శతాబ్దిలో నివసించిన భారతము లక్ష్మీపతి సోమయాజిగారి భారత కూలంకషా వ్యాఖ్య కానరాకపోవుట తీరని నష్టములలో నొకటి. శ్రీ పిఠాపుర మహారాజులుంగారు తమ గ్రంథాలయము కొఱకు దానిని వ్రాయించియుండిరని చెప్పుదురు. తరువాత నది మహారాజుగారు సిద్ధము చేయించుచున్న సూర్యరాయాంధ్ర నిఘంటువు కార్యాలయమునకుఁ బంపఁబడినది. పిమ్మట నమూల్యమైన యాగ్రంథమదృశ్యమై పోయినదని చెప్పుచున్నారు. సుప్రసిద్ధ సారస్వతాభిమానులును, పిఠాపుర రాజవంశమునకు సన్నిహిత బంధువులునైన శ్రీ చెలికాని లచ్చారావుగారి నివాస గ్రామమైన చిత్రాడకు మా ప్రతినిధిని బంపియుంటిమి. కాని యాప్రయత్న మేవిధముగను ఫలించి యుండలేదు.

## తెలంగాణము

1922 వ సంవత్సరమున తెలంగాణము కూడ గాఢనిద్ర నుండి మేల్కొల్పఁ బడినది. పునరుజ్జీవనోద్యమ ప్రతిధ్వను లిక్కడఁ గూడ నస్పష్టముగా వినఁబడినవి. నిజామురాష్ట్రాంధ్ర మహాసభవారు సారస్వత సేవచేయుట కారంభించి సుప్రసిద్ధ విద్వత్కవులు శేషాద్రిరమణ కవులను తాళపత్రప్రతులను, శాసనములను సేకరించుటకై దేశమునందలి యన్నిభాగములకుఁ బంపియుండిరి. వారు సంగ్రహించిన తాళపత్రప్రతులే శ్రీ లక్ష్మణరాయ పరిశోధక మండలికి మూలబీజములు. ఈ మండలివారును హైదరాబాదు నందలి సారస్వతసంస్థలలో ప్రముఖమైన ఆంధ్రసారస్వత పరిషత్తువారును

1. మా పూర్వవిద్యార్థియుఁ బ్రస్తుతము నానక్రామ్ భగవాన్‌దాస్ కళాశాలలో నాంధ్రోప న్యాసకుఁడు నైన శ్రీ వి. సుబ్బారావు (శశాంక) గారీ తాళపత్రప్రతులను మాకు సంపాదించుటలోఁ గావించిన ప్రయత్నముల నిచట సంతోషకృతజ్ఞతలతో స్మరించు చున్నాము.

మాకు కొన్ని తాళపత్రప్రతుల నిచ్చియుండిరి. ఇంతకంటె ప్రాచీనమైన హనుమకొండ యందలి రాజరాజనరేంద్రభాషానిలయము నుండి మేమెక్కువ సాహాయ్యము వాశించితిమి. ఆ గ్రంథాలయమునం గొన్ని మంచి తాళపత్ర ప్రతులున్నమాట వాస్తవమే, కాని దురదృష్టవశమున మేము వానిని బడయం జాలమైతిమి. కరీంనగర గ్రంథాలయమున కధ్యక్షులైన శ్రీ వేంకట్రామారావుగారు మాకు కొన్ని మహాభారత తాళపత్రప్రతుల నొసంగియుండిరి. కడచినతరమునందలి కొన్ని ప్రముఖ సంస్థానముల లోని గ్రంథాలయముల శోచనీయ పరిస్థితులనిట చెప్పవలసియున్నది. ఈ సంస్థాన గ్రంథాలయ నిధానముల నుండి అవశిష్ట గ్రంథములనైన వెదకి రక్షింపవలయునని తత్తదధికారులకు విన్నవించుటకే యీ వాక్యములు వ్రాయుచున్నాము. గద్వాల వంటి ప్రసిద్ధ విద్యాకేంద్రము నుండి అట్టకట్టుకొనిపోయిన కొన్ని తాళపత్ర ప్రతులమ మాత్రమే మేము పొందంజాలితిమి. శ్రీ వేంకటగిరి మహారాజులుంగారి అమూల్య తాళపత్రగ్రంథ సంగ్రహమునకు గూడ నిట్టిగతియే పట్టినదని విని మేము చాల విచారించుచున్నాము. అచ్చటను తదితర స్థలములందును గూడ చెదపురుగులు తాళపత్ర ప్రతులకు చాల నష్టము కలిగించినవి. జనాదరపాత్రులును విద్వత్పరి పాలకులునైన ఆనందగజపతి మహారాజుగారు కొలువుతీర్చియుండిన విజయనగర దుర్గమునుండి మేమొక్క తాళపత్ర ప్రతినైన పొందంజాలక పోతిమి.

విజయనగర దుర్గమునందలి గ్రంథాలయములో నుంచంబడిన తాళపత్రప్రతులను గూర్చియు ప్రాచీనముద్రిత గ్రంథములను గూర్చియు కొన్ని వివరములిచ్చట చెప్పంబడుచున్నవి. ఆంధ్రవిశ్వవిద్యాలయములోం బనిచేయుచున్న శ్రీ యం. వి. సత్యనారాయణగారు మాకీ వివరములను దెల్పిరి. కోటయందలి గ్రంథాలయమువారు తాళపత్ర ప్రతులనుగాని, గ్రంథములనుగాని బయటివారి కొసంగరు. భీష్మ ద్రోణ కర్ణ శల్య స్త్రీ శాంతి పర్వములకు సంబంధించిన తాళపత్ర ప్రతు లచ్చటం గలవు. కాని యవి శిథిలావస్థలో నుండుటచే నుపయోగించుటకు వీలులేనిస్థితిలో నున్నవి.

ఒకవింత విషయమేమనంగా నిచ్చట ఆదిపర్వమునందలి ద్వితీయాష్టమాశ్వాసములు తప్ప మిగిలిన యాశ్వాసములును సభాపర్వమునందలి ద్వితీయాశ్వాసమును మాత్రముగల కాగితపు లిఖితప్రతులున్నవి. బ్రౌను లిఖితప్రతులుతప్ప మాకు లిఖితములైన మఱియేకాగితపు ప్రతులును లభింపలేదు. ఆదిసభాపర్వములు చిన్న నోటు పుస్తకములలో వ్రాయంబడినవి. అవి యేకాలమునకు చెందినవో ఏమూలమునుండి వ్రాయంబడినవో తెలిసికొనుట కవకాశములేదు.

1891వ సంవత్సరమున మదరాసు సరస్వతీవిలాస ముద్రాక్షరశాలలో ముద్రింపంబడిన యొక ఆదిపర్వపు ప్రతిగూడ నిచ్చటనున్నది. నేలటూరి పార్థసారథి అయ్యంగారిచే వ్రాయంబడిన స్త్రీ, శాంత్యనుశాసనికపర్వములకు సంబంధించిన ఆమ్నాయకళానిధి వ్యాఖ్యానముకూడ నీగ్రంథాలయమునంగల అమూల్యగ్రంథములలో నొకటి. ఇది 1892,94 సంవత్సరముల నడుమ మదరాసునందలి శశిరేఖా ముద్రణాలయమున ముద్రింపంబడినది. భారత సంజీవనీ వ్యాఖ్యతోంగూడిన 1916వ సంవత్సరపు ముద్రణము (వావిళ్ళవారిదా?) విజయనగరమందలి మహారాజావారి కళాశాలలో

నున్నదని మాకు తెలిసినది. భారతసంజీవని వ్యాఖ్య యెంత ప్రాచీనమైనదో ప్రస్తుతము చెప్పఁజాలము.

ఈవ్యాఖ్యాన కర్తలైన దండిగుంట సూర్యనారాయణశాస్త్రిగారును, సుందరరామ శాస్త్రులవారును బ్రిటిష్‌మ్యూజియమ్ గ్రంథాలయ పట్టికలోఁ బేర్కొనఁబడియున్నారు. భారతసంజీవని ఆమ్నాయకళానిధి అను నీరెండు వ్యాఖ్యానములలో నేదిముందు వెల్వరింపఁబడినదో తెలిసికొనవలసి యున్నది.

ఆమ్నాయకళానిధి వ్యాఖ్యానకర్తనుగూర్చి మాకు తెలియవచ్చిన విషయములు కొన్నియిట వివరించెదను. ఈవ్యాఖ్యానకర్తయైన నేలటూరి పార్థసారథిఅయ్యంగారు వెంకటాంబికారాఘవులను పవిత్రదంపతుల ద్వితీయకుమారులు. వారితాత నరసింహుఁడు. ముత్తాత వెంకటరాయఁడు వారిది భారద్వాజ గోత్రము. పార్థసారథి అయ్యంగారి గురువులైన నరసింహతాతాచార్యులవారు ప్రసిద్ధవైష్ణవాచార్యులైన కోటి కన్యాదానం తాతాచార్యులవారి సంతతికి చెందినవారని చెప్పుదురు పార్థసారథి అయ్యంగారు ఆనందసరస్వతిగారి యొద్ద శాస్త్రాభ్యాసము కావించిరి వారు వీర వైష్ణవులై అద్వైతులను దూష్యులుగా భావించెడివారు. దీనిని బట్టి గత శతాబ్ది చివరిభాగమునఁ గూడ నంతశ్శాఖాభేదములు ప్రబలియుండెనని తెలియుచున్నది.

పార్థసారథిఅయ్యంగారు వారివ్రాఁతలనుబట్టి నెల్లూరువాసులని తెలియుచున్నది. తాము మనుస్మృతికాంధ్రటీక రచించి పండితుల ప్రశంసలఁ బొందినట్లు వారు తెల్పియున్నారు వారామ్నాయ కళానిధి వ్యాఖ్యానమును రచించిరి. అది 1894 జనవరిలో మదరాసునందలి కుప్పుస్వామిచెట్టిగారి ఎడింబరో ముద్రణాలయమున ముద్రింపఁబడినది. అప్పుడు పార్థసారథిఅయ్యంగారు మదరాసునందలి హిందూ థియలాజికల్ ఉన్నత పాఠశాలలో ఆంధ్రపండితులుగాఁ బనిచేయుచుండిరి. తరువాత వారు తమ సొంతజిల్లాయైన నెల్లూరికరిగి వెంకటగిరిరాజావారి ఉన్నతపాఠశాలలో ఆంధ్ర పండిత పదవి నిర్వహించిరి.

ఆమ్నాయకళానిధి వ్యాఖ్యానము 1894 జనవరిలో ఎడింబరో ముద్రణాలయమునందేకాక 1891 మేలో మరల శశిరేఖా ముద్రణాలయమునఁగూడ ముద్రింపఁబడినట్లు మాకు తెలిసినసంగతులనుబట్టి అనుకొనవలసి వచ్చుచున్నది. మాకాసంగతులు తెలిపినవారు పొరపాటు పడియుండవచ్చును లేదా మనమావిషయమిట్లు సమన్వయంచుకొనవలసి వచ్చును. మతదృష్టిగలవారిచే మిక్కిలి తఱుచుగా పఠింపఁబడుచుండు మహాభారతపర్వములలో శాంతిపర్వమొక్కటి మోక్షధర్మములందు వివరింపఁబడియుండుట అందుకుఁగారణము. అందుచే దానిపై వ్రాయఁబడిన టీక మిక్కిలి జనప్రచారము పొందియుండును. ఆ కారణమున నొకసంవత్సరములోపలనే ఆమ్నాయ కళానిధి వ్యాఖ్యతోఁగూడ శాంతిపర్వమును రెండుసార్లు ప్రచురింపవలసిన యావశ్యక మేర్పడి యుండవచ్చును.

ఈ సందర్భమున రాయలసీమతో మాకు గల సంబంధమంత యధికమైనదికాదు. వయోవిజ్ఞానము లందు వృద్ధులును, దేశభక్తాగ్రగణ్యులునునైన పద్మశ్రీ కల్లూరి

సుబ్బారావుగారు తమ దగ్గర నున్న తాళపత్ర ప్రతులను గుంటూరున నున్న శారదానికే తన గ్రంథాలయమున కొసఁగిరి. మేము కార్వేటి నగరమునఁ గూడ యత్నించితిమి గాని లాభము లేకపోయినది. చిత్తూరుమండలము నుండి మాత్రము మా మిత్రులైన డాక్టరు నందూరి రామకృష్ణమాచార్యుల వారిద్వారా కొన్ని తాళపత్ర గ్రంథములను పొందఁగలిగితిమి. చిత్తూరు జిల్లా లోని వాయలపాడునందలి [1] శ్రీ కన్యకాపరమేశ్వరీ దేవాలయము నుండి ఒక్క ఆదిపర్వము తప్ప మిగిలిన పర్వము లన్నియుఁ గల యొక మహాభారత ప్రతిని సంపాదింపఁ గలిగితిమి.

తాళపత్రప్రతులను సుచితరీతిని భద్రపఱుచుచున్న గ్రంథాలయములలో తంజావూరునందలి సరస్వతీమహాలు గ్రంథాలయమును, మదరాసునందలి ప్రభుత్వ ప్రాచ్య లిఖితగ్రంథాలయమును, అడయారునందలి దివ్యజ్ఞాన సమాజ గ్రంథాలయ మును, ఆంధ్ర వేంకటేశ్వర విశ్వవిద్యాలయ గ్రంథాలయములును ముఖ్యములైనవి. మేమచ్చట మాకొఱకు కొన్ని ముఖ్యములైన తాళపత్రప్రతులు పరిశీలింపఁ జేసితిమి. ఆంధ్ర వేంకటేశ్వర విశ్వవిద్యాలయముల వారు మా పరిశీలనమునకై యొక్కొక్కసారి రెండేసి తాళపత్రప్రతుల చొప్పున దయతో నొసంగు చున్నారు. వారికి మేమెం తయు కృతజ్ఞులము.

సారస్వతాభిమానులు పలువురు తమ దగ్గర నున్న తాళపత్రప్రతులను ప్రాచీన ముద్రితప్రతులను మాకొసంగి మమ్ము కృతజ్ఞతా బద్ధుల నొనరించిరి. సమగ్రమైన వానిపట్టిక దాతల పేరులతోఁగూడ వేఱుచోట నొసంగఁబడి యున్నది.

1. గ్రామములలో కొన్నికుటుంబములయందు మహాభారతము, రామాయణము, భాగ వతమువంటి గ్రంథములను మిత గౌరవముతో పూజించు నాచారమున్నది. ఆ కుటుంబ ముల వారు వానికి గృహదైవతములకువలె గంధమాల్యాదులతోఁ గూడిన షోడశోప చార పూజ చేయుచుందురు. వాయలపాడునందలి కన్యకాపరమేశ్వరీ దేవాలయములో కొన్ని మహాభారత తాళపత్రప్రతులున్నట్లు మాకు తెలిసినది. కొందరు వైశ్యశిఖామణులా యుత్తమ దేవాలయమునకు ధర్మకర్తలుగా నుండిరి. కొంతకాలము త్తర ప్రత్యుత్తర ములు జరిగినపిమ్మట 1964 వ సంవత్సరమున ఆచార్య శ్రీ లక్ష్మిరంజనము గారు స్వయముగా వాయల్పాడు గ్రామమున కరిగిరి. ఆ గ్రామాలయ ధర్మకర్తలు తామొక మహానిధానముగా భావించుచున్న మహాభారత తాళపత్ర ప్రతుల కట్టలను వారి కర్పించిన పరిస్థితులు హృదయద్రావకములుగా నుండును. ఆ తాళపత్రప్రతులు తమ దేవాలయా వరణమునుండి బయటికి పోవునప్పు డాధర్మకర్తలు పొందిన వియోగ దుఃఖము శకుంతలను పంపునపుడు కణ్వమహర్షికూడ పొందియుండలేదు. ఈ సందర్భమున ఆ దేవాలయ ధర్మకర్తలకు ప్రస్తుతము వ్యవసాయశాఖామాత్యులుగా నున్న గౌ. శ్రీ పి. తిమ్మారెడిగా రిచ్చిన ఉపోద్ఘాత లేఖను కృతజ్ఞతతో స్మరించుచున్నాము.

తెలుఁగుదేశమున సారస్వత పత్రికలు వెలువడుచుండి నప్పటినుండియు పండితులు వానిలో మహాభారతపాఠములను గూర్చి చర్చించుచునే యున్నారు. వారి చర్చలు సాధారణముగా వ్యాకరణ ఛ్చందః పారిశుద్ధ్యము ననుసరించియు, రసౌచిత్యము ననుసరించియు ముద్రితప్రతుల యందలి పాఠములను పరిశీలించుట రూపమున నుండెడివి. అనువదించు సందర్భమున కవిత్రయము వారు సంస్కృత భారతముతో భేదించిన ఘట్టములను గూర్చి కూడ వారు తఱచుగ చర్చలు సాగించుచుండిరి. కవిత్రయము వారి సారస్వత ప్రతిభను ప్రశంసించుచు వ్రాయఁబడిన వ్యాసము లసంఖ్యాకములుగా నున్నవి. వ్యాకరణచ్ఛంద స్సంబంధి వ్యాసములంత యసంఖ్యాకములు గాక పోయినను నవి కూడ అధికముగానే యున్నవి.

సంశోధితముద్రణమునందలి పాఠములను నిర్ణయించుట కుపయోగపడు నను నుద్దేశముతో పై విమర్శ వ్యాసముల అనుక్రమణికను తయారుచేయుటకై మేము ప్రయత్నించితిమి. మొదట నీయుద్యోగమును చాల పట్టుదలతోనే అరంభించినను నడుమ దానిని విడిచి వేయవలసివచ్చినది.

మహాభారతమునకు సంబంధించిన విమర్శవ్యాసములకు తావొసంగిన పత్రికలలో అముద్రిత గ్రంథచింతామణి ముందు పేర్కొనఁదగినది తత్సంపాదకులైన పూండ్ల రామకృష్ణయగారు వెఱపులేని విమర్శకులు. వ్యాకరణచ్ఛందో విషయములనుగూర్చి యాపత్రికలో పెక్కు వైదుష్యపూరితములైన చర్చలు సాగుచుండెడివి. నన్నయ రచనగా భావింపఁబడుచున్న ఆంధ్రశబ్ద చింతామణిని గాని, చిన్నయసూరి బాలవ్యాకరణమును గాని, వ్యాకరణమునకు సంబంధించిన చర్చలలో వ్యాసకర్త లాదర్శముగా గ్రహించుచుండిరి.

ఈ క్రింది పద్యమొక మనోజ్ఞమైన వివాదమునకు దారి చూపినది.

క. కవదొనలును గాండీవము
నవలనిడం బనుపు ముంద అరదము డిగు మే
న(ను)విదప డిగియెద శుభకర
మవు నివ్విధమట్లు సేయు మనుడు నతండున్.

9 – 2 – ౩౩౩.

ఈ పద్యము శల్యపర్వమున కృష్ణుఁ డర్జుననితో "నీవు ముందు తొందరగా రథము డిగుము. నేను తరువాత దిగెద"నని చెప్పు సందర్భము లోనిది. ఇందలి మూఁడవ పాదమున నొక వ్యాకరణ విశేష మున్నది. 'ఏను' అను పదము ద్రుతప్రకృతికము గావున దాని తరువాత వచ్చిన "పిదప'యను పదమునందలి 'పి' యను పరుషము 'బి' యను సరళముగా మాఱవలయును. 'పి' స్థానమున 'బి' యని వ్రాసినచో ప్రాస తప్పి పోవును. ఈ పద్యము రచించిన తిక్కన యట్టి దోషమును కావించునని భావించుటకు

వీలు లేదు. అందుచే ప, వలకు ప్రాసమైత్రి కలదని చెప్పవలసి వచ్చును. కొందఱు లాక్షణికులు వానికి యతిమైత్రినే యంగీకరింప లేదని చెప్పినచో ప్రాసమైత్రి సంగతి వేరుగా చెప్ప నవసరము లేదు. అప్పకవి సంధిగత ప్రాసమునకు లక్ష్యముగా నీ పద్య మొసంగి యున్నాఁడు 3-373. 'పిదప' అను పదమునకు పూర్వ మొక కళ యుండినచో నాతఁడు చెప్పినది సమంజసముగానే యుండును. కాని ఉత్తమ పురుషైక వచన సర్వ నామమైన 'ఏను' ద్రుతప్రకృతికములలో గణింపఁ బడుటచే దాని తరువాత వచ్చిన పరుషము సరళముగా మాఱి తీరవలయును.

తిక్కన సోమయాజి కావించిన యీ ప్రయోగము పండితులలోఁ దీవ్రమైన వివా దమున కవకాశ మొసంగినది. అది యిప్పటికిని అపరిష్కృతముగానే యుండిపోయి నది. 19 వ శతాబ్దిలో నివసించిన మండపాక పార్వతీశ్వర శాస్త్రి గారు దానిని నీవిధ ముగా సమర్థించిరి.

"ఉత్తమ పురుషైక వచనమందలి సర్వనామ రూపములైన ఏను, నేను, అను వాని కించుక భేదమున్నది. ఒకటి అజాది. రెండవది హలాది. అజాది యైన 'ఏను' అను దానిని మనము కళగా భావింప వలయును. అప్పుడు గసడదవాదేశసంధినిబట్టి 'పి' 'వి' గా మాఱుట సమంజసమే యగును" ఈ సమర్థనము చమత్కారవంతము గానే యున్నను ఉత్తమ పురుషైక వచన సర్వనామ మొకప్పుడు ద్రుతమును నొకప్పుడు కళయును నగు ననుట కాధారము లేదు.

మహాభారతమున వ్యాకరణచ్ఛందములకు సంబంధించిన యిట్టి క్లిష్టసమస్యలెన్నో యున్నవి. వాని విషయమున పండితు లిరు పక్షములుగా తీరి తీవ్రమైన సారస్వత సంగ్రామము నొనరించు చుందురు. కొన్ని సందర్భములలోన ఈ వివాదములు శుష్క ప్రాయములుగా నుండెను.

హాస్య చమత్కార భాషణమునఁ బేరువడిన డా. సి, ఆర్. రెడ్డిగా రొకప్పుడు "ఈ పండితుల వాదములు పరుషములే కాని సరళములు కా"వని ద్వ్యర్థిగా బల్కి యుండిరఁట. కాని కొన్ని అతి హృద్యములైన వివాదములును గలవు మహాభారత ప్రయోగములకు సంబంధించిన చర్చలు[1] మిక్కిలి వినోదకరములైనవి. ఇప్పటికిని అట్టివి పట్టుదలతో కొనసాగింపఁ బడుచునే యున్నవి. అముద్రితగ్రంథచింతామణి చిరకా లము క్రిందటనే ఆఁగిపోయినది. ఉదాత్తమైన సారస్వత విమర్శ కది తీరని లోటని చెప్పవచ్చును. ఇప్పుడు భారతి ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, ఉగాది సంచికలు పరిశోధన (ఇదియు నాఁగి పోయినది) మున్నగునవి దాని స్థానము నాక్రమించినవి.

మహాభారత భిన్న ముద్రణముల యుపోద్ఘాతములలోఁ గూడ నట్టి వివాదములు తావు చేసికొనుచుండెను. 1901 వ సంవత్సరపు. వీరేశలింగముగారి ముద్రణము నందలి యుపోద్ఘాతములో విద్వద్వర్యులైన శతఘంటం వేంకట రంగశాస్త్రిగా రిట్టి యంశముల నెన్నిటినో సూచించిరి. అట్లే అభినవవాగనుశాసన బిరుదాంకితులైన

1. ధనంజయ ప్రవరకరము. భారతి. నవంబరు 1960. పుటలు. 2-8.

మల్లాది సూర్యనారాయణ శాస్త్రులవారు వావిళ్ళవారు ప్రచురించిన మహాభారత ముద్రణమునకు (ప్రచురణ సంవత్సరము తెలియదు) ఉపోద్ఘాతము వ్రాయుచు కొన్ని పాఠముల సామంజస్యమును గూర్చి చర్చ సాగించిరి. వేఱుచోట్ల నితరవ్యాసములలో కూడ వారు నన్నయగారి సంస్కృత సమాసప్రయోగవైచిత్రినిగూర్చి చర్చించి యుండిరి. తమ షష్టిపూర్తి సంచిక యందలి 'నిరంకుశాః కవయః' అను వ్యాసమునందు సైతము వారట్టి ప్రయోగములను పరిశీలించి యుండిరి. (పుటలు 301 – 315). మహాభారతమునకు సంబంధించిన విమర్శ వ్యాసముల, ముఖ్యముగా వ్యాకరణచ్ఛందస్సంబంధి వ్యాసముల, అనుక్రమణిక తయారు చేయవలసిన యావశ్యక మెంతైన నున్నది[1].

మహాభారత సంశోధితముద్రణమును గూర్చి గాఢముగా నాలోచించినవారిలో మదరాసు విశ్వవిద్యాలయాంధ్రశాఖాధ్యక్షులుగా నుండిన కోరాడ రామకృష్ణయ గారొకరు. వారు 'ఆంధ్ర భారత కవితా విమర్శన'మను గ్రంథమున తిక్కన సోమయాజి కవితాకౌశలమును గూర్చి విశదీకరించి యుండిరి. అదికాక వారు శ్రీపాద లక్ష్మీపతి శాస్త్రులవారితోఁ గలసి మదరాసు విశ్వవిద్యాలయ ప్రాచ్య పరిశోధన పత్రిక 2వ సంపుటములో (1937 – 38) 'ఆంధ్ర భారత పాఠ నిర్ణయ పద్ధతి' అనునొక ఉత్తమ వ్యాసమును ప్రకటించి యుండిరి. రామకృష్ణయ్యగారు సమకాలీనశాసనముల సాక్ష్యమును గొనివచ్చి పాఠములకు సంబంధించిన వివాదమును బరిష్కరింప యత్నించిరి. వారు సూచించిన మార్గము సమంజసమే యైనను వారు చెప్పిన కొన్ని యంశములతో మనమేకీభవింపఁజాలము. ప్రయోగముల విషయమున నన్నయ తీవ్ర వాదియని వారి యభిప్రాయము. నన్నయ ఆదికవి యగుటచే నతఁడు ప్రయోగ విషయమున సంకుచిత దృష్టి గాక విశాల దృష్టి వహించెనని భావించుటయే యుచితము. నన్నయలో స్వవర్గజప్రాసము తఱుచుగాఁ గానరాకున్నది. కాని యెక్కడనో 'శాదన కిట్టి పాటి యవ కారము' (1–1–124) అను పద్యమునందువలె నవసరమైనచోట్ల నతఁడు దాని వాడి యుండెనని భావించుటలో దోసఁగు లేదు. రామకృష్ణయగారు సూచించిన పద్ధతి కంటె ఈ సంశోధితముద్రణపు సంపాదకు లవలంబించిన పద్ధతి అంత భిన్నమైనది కాదని చెప్పుటకు సంతోషించుచున్నాము. మహాభారత కవుల యొక్క, ముఖ్యముగా నన్నయయొక్క, ప్రయోగములను పరీక్షించుచున్న యెడ సమకాలీన శాసనము లందలి భాషనాదర్శముగా గ్రహింపవలెనను రామకృష్ణయగారి యభిప్రాయము సర్వాంగీకార యోగ్యమైనది. భారతమునకు సంబంధించిన వ్యాసముల పట్టికను సిద్ధముచేయుటవలెనే భారత కాలమునాఁటి శాసనములందలి ప్రయోగములను వర్గీకరించు నుద్దేశము గూడ మేము కార్యరూపమునఁ బెట్టఁజాలక పోతిమి.

ఆధునికులును, మహాభారత సంశోధితముద్రణమునకు సంబంధించిన సలహా సంఘము నందలి సభ్యులును అయిన శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారు మహాభారతముతో నితర ప్రామాణిక గ్రంథములకుఁ గూడ, సంశోధితముద్రణములు సిద్ధము చేయుట యావశ్యకమని తలంచి యుండిరి. ఆ విషయమును గూర్చి భారతి పత్రికలో వారొక వ్యాసమును బ్రకటించి యుండిరి.

1. ఆంధ్రప్రదేశ సాహిత్య ఎకాడమీవారు సారస్వతవ్యాసాను క్రమణికను సిద్ధము చేయించుచున్నట్లు తెలియుచున్నది.

## డా. చిలుకూరి నారాయణరావుగారు - గరుడోపాఖ్యానము.

కీ. శే. గిడుగు వేంకటరామమూర్తి పంతులుగారి శిష్యులైన డా. చిలుకూరి నారాయణరావుగారు మహాభారత సంశోధితముద్రణమునకు మార్గదర్శకమని చెప్పఁదగిన యొక యుత్తమప్రయత్న మొనరించియున్నారు. వారాదిపర్వమునందలి గరుడోపాఖ్యానమును సంపాదించి తమ ఆంధ్రభాషాచరిత్రగ్రంథమునఁ బ్రకటించిరి. ఆ కార్యమునకు వారు 92 తాళపత్రప్రతులను రెండు ముద్రితప్రతులను ఎన్నుకొని యుండిరి. ఈ రెండు ముద్రితప్రతులలో 1847 వ సంవత్సరమున చిన్నయసూరిగారును రామానుజాచార్యులుగారును సిద్ధముచేసిన దొకటి. రెండవది గిడుగు రామమూర్తి పంతులుగారు విశేషములు వ్రాసికొన్న వావిళ్ళ ముద్రణము. దీనిని మేమును మా విమర్శన సామగ్రిలో గ్రహించితిమి.

నారాయణరావుగారు తాళపత్రప్రతులను, ఏమండలము నుండి సేకరింపఁబడినవి, ఎవరు సేకరించిరి మున్నగు వివరములను సూచించుచు సయుక్తికమైన పద్ధతిలో విభజించి యుండిరి. లేఖకులు తమ పరిశ్రమ ముగిసిన పిమ్మట నొసంగిన వివరములను గూడ వారు సూచించియుండిరి. వా రుపయోగించిన తాళపత్రప్రతులలోఁ బెక్కు కాకినాడ యందలి యాంధ్రసాహిత్యపరిషత్తునందలివి. కొన్ని రాజమహేంద్రవరము నందలి గౌతమీ గ్రంథాలయము నుండి గ్రహింపఁబడినవి మిగిలిన వానిలోఁ గొన్ని నెల్లూరు, చిత్తూరు, అనంతపురము జిల్లాలకును గొన్ని గోదావరి జిల్లాలకును సంబంధించినవి. వారు తాళపత్రప్రతు లనేకములు దక్షిణదేశమునకు సంబంధించిన వని తెల్పియుండిరి. దక్షిణదేశమనఁగా వారిభావమేమో సరిగాఁ దెలియదు. ఆ తాళపత్ర ప్రతులన్నియు ఆంధ్రసాహిత్యపరిషత్తున భద్రపఱుపఁ బడినవి. వారి తాళపత్ర ప్రతులలో తెలంగాణమునకు సంబంధించినవి లేవు. తెలుఁగు దేశపుఁ బ్రాచీనభాగమైన తెలంగాణము నుండి కూడఁ గొన్ని తాళపత్రప్రతులను సేకరింపఁ గల యదృష్టము మాకుఁ గలిగినది బ్రౌనుదొరగారి కాగితపుప్రతులను గాని, మదరాసు ప్రాచ్య లిఖితపుస్తక భాండాగారము నందలి తాళపత్రప్రతులను గాని, విశ్వవిద్యాలయము లందలి వానిని గాని నారాయణరావుగా రుపయోగించినట్లు కనఁబడదు. ఇవన్నియు మా కందుపాటులో నుండుటచే వాని నన్నిటిని సాధ్యమైనంతవఱకుపయోగించుకోఁ గలిగిన యవకాశము మాకు లభించినది. మా విమర్శన సాధనసామగ్రి విశాలతరమును వైవిధ్యశోభితమును

తమకు లభించిన స్తుత్య తాళపత్రప్రతుల సంచయము సాహాయ్యముతో నారాయణరావుగారు 120 గద్యపద్యములతోఁ గూడిన గరుడోపాఖ్యానమును సంపాదింపఁ దొడంగిరి. ఆ గరుడోపాఖ్యానమును జూచినంతనే నారాయణరావుగారు తాళపత్ర ప్రతులందలి వర్ణక్రమమునందలి యన్నివింతలతో వైలక్షణ్యములతో నట్లే యుంచివేయుటకు యత్నించినట్లు కన్నులకు గోచరించును. సామాన్య పాఠకు లది చూచి కలఁతనొంది వెంటనే దానిని జదువుయత్నమునుండి విరమింతురు. ఆ సంశోధిత ముద్రణము విద్వాంసులకొఱకే కాని సామాన్య పాఠకుల కొఱ కుద్దిష్టము కాలేదన్న మాట వాస్తవమే కాని మహాభారతమువంటి యుద్గ్రంథము ప్రస్తుతము ప్రచారమున లేని వర్ణక్రమ విధానముతో ముద్రితమైనచో నెట్టిప్రయోజనమును నిర్వహింపఁజాలదు.

అట్టి ముద్రణములు ప్రాచీన గ్రంథాలయముల నలంకరించుటకు మాత్రము పనికివచ్చును. అందుచే నీ సంశోధితముద్రణపు సంపాదకులు తాళపత్రప్రతులందలి వర్ణక్రమవిశేషముల నట్లే యుంచుట యావశ్యకమని తలంచి యుండలేదు. మిగిలిన విషయములలో నారాయణరావుగా రవలంబించిన పద్ధతికిని మేమవలంబించిన దానికిని అంతభేదము లేదు.

నన్నయభారత పఠనమునకు నారాయణరావు గారొనరించిన గొప్ప యుపకృతి వారు రెండువందలకుఁ బైఁబడిన పుటలలో క్రి. శ 11వ శతాబ్దియందలి యాంధ్ర భాషకు సంబంధించిన విశేషములను వివరించుట. అది నూత్నభాషా జ్ఞానమునకొక పెన్నిధానము. ప్రాఙ్నన్నయ యుగమునందలి భాషావిశేషములను గూడ వివరించి వారు దానికి మఱింత విలువ చేకూర్చినారు.

ఆచార్య శ్రీగంటి జోగిసోమయాజిగారుకూడ తమ ఆంధ్రభాషావికాసమున ప్రాఙ్నన్నయ యుగమునందలియు, నన్నయభారతమునందలియు భాషావిశేషములను గూర్చి పెక్కుమూల్యములైన విషయములను విశదీకరించి యున్నారు. నన్నయ భాషా విశేషములను వివరించు గ్రంథములు మఱికొన్నికూడ నున్నవి.[1]

## ఆంధ్రమహాభారత వ్యాఖ్యలు

సంశోధిత ముద్రణమును సిద్ధముచేయుటకై మే ముపయోగించిన సాధన సామగ్రిలో ఆంధ్రమహాభారత వ్యాఖ్యలనుగూడఁ బేర్కొనవచ్చును. సారస్వతప్రశస్తి విషయమున తెలుఁగును రెండవతరగతికో మూఁడవతరగతికో చెందినదానినిగాఁ గణించి చిన్నచూపుచూచిన కాలమొకప్పుడుండెను. ఆదికవి నన్నయ యీవిషయమును బరోక్షముగా వ్యక్తము చేసియున్నాఁడు. తెలుఁగునుగాని దేశిమార్గమునకుఁ జెందిన దేనినిగాని లాఘవముతోఁ జూచుటకుఁ గొమ్ములు తిరిగిన సంస్కృతవిద్వాంసులు కొందఱు కారణమై యుందురు. క్రి. శ. 11వ శతాబ్దిలో నప్పుడే తప్పుటడుగులు వేయ నారంభించుచుండిన తెలుఁగునకును అంతకు కొన్నిశతాబ్దుల పూర్వమే సారస్వతపరాకాష్ఠ నందిన సంస్కృతమునకునుగల వ్యత్యాసమునుగాంచి కొందఱు సంస్కృతాభిమానులు తెలుఁగును గేలిసేయుటకో యం దుదాత్త సారస్వతమును సృష్టించుటకుఁజేయు ప్రయత్నముల నవహసించుటకో కడంగియుందురు నన్నయ కర్తృకమని భావింపఁ బడుచున్న ఆంధ్రశబ్ద చింతామణి యీ విషయమును జక్కఁగా బరిశీలించి "స్వస్థాన వేషభాషాభిమానులును రసప్రలుబ్ధధీకులునైన పండితులు లోకమున నన్యములవిడిచి వైకృతకావ్యములను బహుమానింతు"రని చెప్పియున్నది[2] ఇందలి యన్యము లప్పటికప్పుడే ప్రచార విషయమున వెనుకంజవేయుచున్న సంస్కృతప్రాకృతములయియుండును.

1. నేను రచించిన ప్రాఙ్నన్నయ యుగము, నన్నయభారతము అను గ్రంథములు.
   ఆం. ప్ర. సాహిత్యఅకాడమివారు ప్రచురించిన నన్నయ పదప్రయోగకోశము.

2. స్వస్థాన వేషభాషాభిమతాస్సంతో రసప్రలుబ్ధధియః లోకేబహుమన్యంతే వైకృతకావ్యాని చాన్య దసహాయ ఆం. శ. చిం. సూ. 5.

ఆంధ్రమహాభారతాదిపర్వపుటవతారికలో నన్నయభారతాంధ్రీకరణ ప్రయత్నమునఁ దన్నెదుర్కొన్న క్లేశములను వానిని దానుత్తరించిన విధమును.

పాయకపాకశాసనికి భారతఘోరరణంబునందు నా
రాయణునట్లు వానసధరాఘురవంశ విభూషణంబు నా
రాయణభట్టు వాఙ్మయధురంధరుఁడున్ దనకిష్టుఁడున్ సహా
ధ్యాయుఁడునైన వాఁ డభిమతస్థితిఁ దోడయి నిర్వహింపఁగన్. (1-1-25)

అనుపద్యమున సూచించెనని చెప్పుదురు. మృదువును గవితోచితమునై యున్నను ఇందాధ్వని కలదనుటలో సందేహములేదు. నన్నయ యానాఁటి సంస్కృత విద్వత్ప్రకాండుల భావవికారములను జాగరూకతతో గమనించి యారంభమున వినమ్రుఁడై వారికి వినతిశతము లర్పించి యుండెను

క్రీ. శ. 15వ శతాబ్ది యారంభమందుండిన విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణిలోని యీక్రిందిపద్యమున సంస్కృతాభిమానుల యాధిక్యభావము నింత కంటెను విస్పష్టతరముగా నధిక్షేపించియున్నాఁడు

విలసద్భావరసాద్యలంకృతులచే విప్పారి గీర్వాణభా
షల కబ్బంబుల కెన్నిమంచితనము ల్సంధిల్లు నాచందమై
వళియుం బ్రాసము నంత కగ్గలములై వర్తిల్లు సత్కావ్యముం
దెలుఁగంచుం జెవిఁబెట్టలేమి యుడుపం దేఁగల్గనే మందిలన్. (9-4)

క్రమముగా అప్పటినుండియుఁ గొన్నిశతాబ్దులు గడచిపోయెను. తెలుఁగు ప్రాముఖ్యము ప్రాపించెను. వసుచరిత్రవంటి తెలుఁగుకావ్యములు సంస్కృతములోని కనువదింపఁబడినవి. విద్వాంసులు మహాభారతమువంటి తెలుఁగు గ్రంథములు వ్యాఖ్యానము రచింపఁదగినవని భావించిరి.

ఇట్టి భావముతోడనే క్రీ. శ. 19వశతాబ్ది యారంభమునందుండిన భారతము లక్ష్మీపతి సోమయాజియను విద్వాంసుఁడు భారతకూలంకష వ్యాఖ్యానమును రచించెను. వారియింటిపేరే యాకుటుంబమునందలి విద్వాంసులు భారత పరిశీలనమునఁ బ్రత్యేక ప్రావీణ్యము గడించిరని చెప్పకచెప్పుచున్నది. వారు మహాభారతమును బురాణముగాఁ జెప్పుటయందుఁ బ్రఖ్యాతివహించియుందురు. ఇంతవఱకీ విద్వద్వరేణ్యుని జీవిత విశేషములను గూర్చి యేమియు సరిగాఁ దెలియవచ్చుటలేదు. భారతకూలంకష వ్యాఖ్యనే కాక లక్ష్మీపతి సోమయాజి శకటరేఫనిర్ణయమను[1] మఱొకగ్రంథమునుగూడ రచించి యుండెను. ఇది శకటరేఫసహితములు సాధురేఫసహితములునై పదములను గూర్చి.

1. శకటరేఫనిర్ణయమను గ్రంథము ఏలూరునందలి మంజువాణీ ముద్రాలయమున ముద్రింపఁబడినది. అది మంజువాణియను పేరుగల పత్రికనుండి పునర్ముద్రింపఁబడినట్లు కనిపించును మాయొద్దనున్న ముఖపత్రపు భాగమువలన నది రాజా మంత్రిప్రగడ భుజంగరావు జమీందారుగారిచే విమర్శనోపోద్ఘాత పూర్వకముగా సంపాదింపఁబడినట్లు తెలియుచున్నది. ఉపోద్ఘాతభాగము మాయొద్దనున్న ప్రతిలోఁ గానవచ్చుట

వివరించును. లక్ష్మీపతి సోమయాజి యిందుఁ బలుచోట్ల కవిత్రయభారతమునుండి పద్యములను బ్రమాణముగా నుద్ధరించియుండెను.

భారతకూలంకష యంతకంటె విస్తృతరమును బ్రముఖతరమునైన రచన. లక్ష్మీపతి సోమయాజిగా రందు భారతములోని ప్రతిపద్యమును వివరించియుండ లేదు. వారు కొంత సంస్కృతమునను గొంత తెలుఁగునను దానిని గచ్ఛద్వ్యాఖ్యగా వ్రాసియుండిరి. తా మొసంగిన యర్థమును సమర్థించుటకై వారు తఱుచుగా సంస్కృత భారతము నుండి శ్లోకముల నుద్ధరించుటయే కాక అలంకారములను వ్యాకరణ విశేషములను గూడ వివరించియుండిరి. వారు పాండవుల కథనుఁ గాలక్రమానుగుణముగా ననుసరించుటకు యత్నించి పాండురాజు మరణానంతరము పాండవులు

లేదు. ఎవ్వరైన లక్ష్మీపతి సోమయాజిగారినిగూర్చిన వివరములనుగాని అధమము రాజా భుజంగరావుగారి యుపోద్ఘాతమునుగాని సమకూర్పఁ జాలినచో నావిద్వద్వర్యుని స్మృతికర్హమైన సేవ కావించినట్లగును అట్లే భారతకూలంకష వ్యాఖ్యను సంపూర్ణముగఁగాని యేఁ దేశముగఁగాని మాకుఁ బంపఁగల్గినచోఁ దెలుఁగుభాషకంతకంటెను అధికమైన సేవ కావించినట్లగును

వారు రచించిన శకటరేఫనిర్ణయమునుండి సేకరింపఁగల్గిన స్వల్పవివరముల నిచ్చట నిచ్చుచున్నాము

వారు తమగ్రంథమును శివునికంకితము చేసిన భాగమును గ్రంథాంతమునఁ బునరుక్తము గావించియున్నారు.

వక్ష్యామి శకటాన్ రేఫాన్ శృణుష్వాంద్రే ప్రవర్తితాన్ ।
గౌరీపతేయతస్స్వప్నే ప్రవక్తుం మామ చూచుద॥ ॥ (1.)

ప్రీణీహి గిరిజాజానే జానీహిమం పునీహి మాం ।
యానీహి తాన్య హంత్వత్తో మానీహిత్వం దివౌకసామ్ ॥ (63.)

శకటరేఫ నిర్ణయములలో రచింపఁబడినది సాధుశకటరేఫ సహితములైన తెలుఁగుపదములందు సంస్కృతీకరింపఁ బడినవి. వానికొక విధమైన టీక గ్రంథకర్తయే వ్రాసినట్లు కనిపించును లేనిచో నది నిగూఢమును అజ్ఞేయమునునైయుండును. తరువాత వా రుభయరేఫధ్వములతో గూడిన మహాభారత పద్యముల నుద్ధరించి యున్నారు. ఉదాహరణమునకీ క్రిందిశ్లోకమును బరికింప వచ్చును.

"ప్రాహ స్వైకారముఖం జ్ఞాన మాంసంవ్యాఖ్యో గరున్నతిః"
జ్ఞానం— ఎఱుక. ఉదాహరణము.

ఎఱుకగలవారి చరితలు, గఱచుచుసజ్జనుల గోష్ఠిఁ గదలక ధర్మం
బెఱుఁగుచు నెఱిఁగినదానిని. మఱవ కనుష్ఠించు నది సమస్థిరబుద్ధిః.
(1—3—203)

కౌరవుల కొలువున కరుదెంచునప్పటి యాసోదరుల వయస్సులను విశదముగా నిర్ణయించిరి. వారణాసి నివాసము, లాక్షాగృహదహనము మున్నగు తరువాతి సంఘటనల కాలమును సన్నిహితముగాఁ బరిశీలించిరి. వారు కావించిన కొన్ని వివరణములు వింతగాను దూరాన్వయముగాను ఉన్నవి. ఉదాహరణమునకు విరాటపర్వారంభమునందలి "వైదికమార్గనిష్ఠమగు వర్తనముందగ నిర్వహించుచుండ్" అను పద్యమునందలి వైదికశబ్దమునకువారు నియోగికి భిన్నుఁడగు వైదికుఁడను నర్థము చెప్పియుండిరి. తెలుఁగు బ్రాహ్మణులలోఁ గొందఱు ప్రభుత్వోద్యోగము లందు నియుక్తులగుటచే నియోగికులని పిలువఁబడుచుండిరి. నియోగికులనఁగా నియోగమును గ్రహించినవారని యర్థము. రెండవతెగవారైన వైదికులు పూర్వాచారపరాయణులై, ప్రభుత్వోద్యోగములందాసక్తి వహింపక, వేదాధ్యయన యజ్ఞాచరణాదులతోఁ గూడిన సాంప్రదాయిక జీవితపద్ధతి నవలంబించియుండిరి. లక్ష్మీపతి గారొసంగిన యర్థము మామూలు వాడుకలో నున్నట్టిది. తాను వేదోదితములైన కర్మముల నాచరించుచుది వైదిక మార్గాను గుణమైన జీవితము పుచ్చుచుండెనని కవిభావము. అంతేకాని "నేను నియోగికునికంటె భిన్నుఁడైన వైదికుఁడ" నని చెప్పుకొనుట యతని యభిప్రాయము గాదు.

లక్ష్మీపతిగారు ధర్మవేదాంతములకు సంబంధించిన యంశములను వివరించుట యందుఁ జాలశ్రద్ధ వహింతురు. వారు ధర్మశాస్త్రమున నిష్ణాతులుగాఁ గనిపింతురు. తెలుఁగు వ్యాకరణాంశములను సమర్థించుటకై వారుదాహరించు గ్రంథములు కొన్ని మన కపరిచితములు. ఒక్కొక్కప్పుడు వారు తమ్మే ప్రమాణముగా నుద్ధరించుకొనుచుందురు.

> ఆ ఋషి కుమారు గట్టిన, చీరలు నతిమృదులములు విచిత్రములు మనో
> హరము లతని బృహత్కటిఁ, జారననందొక్క కనకపట్టము వ్రేలున్
>
> (3-3-104)

అను పద్యమును వ్యాఖ్యానించువారు "ఋకారో రేఫతాం యాతి కర్మధారయ మాత్రకే" యను సూత్రము నుద్ధరించిరి. ఇది యెచ్చటిదో తెలిసికొనుట కష్టము. ఇది వారి శకట రేఫనిర్ణయమునందలిదని యిప్పుడు తెలియవచ్చినది. (శ్లో. 60)

మొత్తముమీఁద భారతకూలంకష తెలుఁగు భారతమునకు విజ్ఞానపూరితమును, హృద్యమునునైన సంగ్రహవ్యాఖ్య. వారు తెలుఁగు భారతమునకు సంస్కృత వ్యాఖ్యానమున కర్తమైనదను సారస్వత గౌరవము కల్పించుట మిక్కిలి ప్రశంసాపాత్రము. ఈ వ్యాఖ్యసంపూర్ణముగాఁ బ్రచురించుటకుఁ దగినట్టిది. కీ శే. పలూరు పాటి రామభద్రయ్యలుగారు సభాపర్వమునకు సంబంధించినంతవఱ కా వ్యాఖ్యను దమ సారస్వతసర్వస్వమునఁ బ్రచురించి మార్గమును జూపి యుండిరి.

చదలువాడ సుందరరామశాస్త్రిలుగారును, దండిగుంట సూర్యనారాయణ శాస్త్రిలుగారును రచించిన భారతసంజీవనీ వ్యాఖ్యనిదివఱకుఁ బేర్కొనియుంటిమి. అది ఆదివిరాటపర్వములకు మాత్రమే లభించుచున్నది. వారితరపర్వములకుఁ గూడ నావ్యాఖ్య రచించియుండిరేమో తెలియదు. వారు ముందుచితపాఠములతోఁ గూడిన

గ్రంథము నిర్ణయించుకొని తరువాత వ్యాఖ్యానము రచించిరి. వారు గ్రహించిన పాఠములు పెక్కు సుపరీక్షితములును, యుక్తములునని మాకుఁ దోఁచినది. ఆది పర్వమును బరిష్కరించునప్పుడు మేము వారి వ్యాఖ్యను వినియోగించుకొని యుంటిమి. విరాట పర్వమునకు సంబంధించిన భారతసంజీవని మాకు లభింపలేదు.[1] ఈ వ్యాఖ్యలోఁ బ్రతి పద్యమునకును గద్యమునకును టీకాతాత్పర్యము లొసంగఁ బడినవి.

తెలుఁగు భారతమునకుఁ గల వ్యాఖ్యానములలో వెంకటగిరి యందలి మహారాజా వారి యున్నత పాఠశాలలోఁ బ్రధానాంధ్ర పండితులైన శ్రీ నేలటూరు పార్థసారథి అయ్యంగారు రచించిన దొకటి. దానికి 'ఆమ్నాయకళానిధి' యని పేరు. వారు మను స్మృతికిని శాంతిత్రయమునకును గూడ వ్యాఖ్యరచించినట్లు తెల్పియున్నారు. ఆమ్నాయ కళానిధి సులభముగా నున్నది. ఇందలి తాత్పర్యభాగము మూలభావములను జక్కఁగా వెల్లడించుచున్నది. కాని వ్యాఖ్యాత వ్యాఖ్యానరచనమునకుఁ బూర్వము భారతసంజీవనీ వ్యాఖ్యాతవలె నుచితపాఠ పరిష్కారమునకై ప్రయత్నించినట్లు కన్పింపదు. వారు గ్రహించిన పాఠములు కొన్ని సుపరీక్షితములు కావు. 1926 వ సంవత్సరమున ముద్రింపఁబడినను ఈ గ్రంథమునఁ బద్యగద్యములసంఖ్య యొసంగఁ బడలేదు. వావిళ్ళ ముద్రణమునందలి పాఠములతోఁ బోల్చి చూచినచో నామ్నాయకళానిధి గ్రహించిన పాఠముల స్థితి తెలియవచ్చును

> ధృతరాష్ట్రుండును బుత్రులుఁ వనము కుంతీనందనుల్ సింహముల్
> మతినూహింప ససింహమైన వనమున్ మర్దింతురెందున్ వనా
> వృత వృత్తంబులు గాని సింహములకున్ వేగంబ చేటొందుఁగా
> న తగం బొందుట కార్యమీ యుభయము న్సంతుష్టిమై నుక్కికిన్.
>
> 5_1_358.

'మతినూహింప నసహ్యమైన ననమున్ మర్దింతు రెందున్' అనునది ఆమ్నాయ కళానిధి పాఠమునందుఁగల భేదము సువిదితమే. ఆమ్నాయకళానిధి పాఠమున నుపమానము సమగ్రముగాలేదు. ఇట్టివింకను మఱికొన్నిగలవు.

కీ శే.[2] ఆకొండి వ్యాసమూర్తిశాస్త్రి గారాదిపర్వమునకు భారతఫక్కియను వ్యాఖ్యానమునుటకంటె నన్నయగారి అనువాదపద్ధతి పరిశీలనమనుట యుక్తముగా నుండును. అందు సంస్కృత భారతమునందలి భాగములు నన్నయగారి పద్యగద్యముల కెదురుగా ముద్రింపఁబడినవి. కవిత్రయమువారు మూలభారతమును యథాతథముగా ననువదించుటకుఁ గూడఁ బూనినట్లు కన్పించును. అందలి ఆదిధారయను భాగము

1. విద్వాంసులు కాని గ్రంథాలయములు కాని తమ యొద్ద విరాటపర్వమునకు సంబంధించిన భారత సంజీవనీ వ్యాఖ్యానముయున్నచో మాకుఁబంపవేఁడుకొనుచున్నాము. ఆధునికయుగమున 2. ఆకొండి వ్యాసమూర్తిశాస్త్రిగారు (1860—1916), శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు, తాడూరి లక్ష్మీనరసింహం పంతులుగారు అను ముప్వురు పండితులు మహాభారతమును సమగ్రముగా ననువదించుటకు యత్నించినట్లు తెలియుచున్నది.

మాత్రము ముద్రితమైనది. సంస్కృత భారతమునంతను నిస్సహాయముగా ననువదింపఁ గల్గిన గౌరవము వ్యాసమూర్తిశాస్త్రిగారికి దక్కినది. వారి యనువాదమునకు శ్రీకృష్ణభారతమని పేరు. నన్నయగారు ప్రసన్నకవితార్థయుక్తియు, నక్షరరమ్యతయు, నానారుచిరార్థ సూక్తినిధిత్వమును వెలయునట్లుగా సంస్కృత భారతము నాంధ్రీకరించి యుండిరి. కేవలానువాదమున నట్టియుత్తమాదర్శములకు సాఫల్యము కల్గించుట దుష్కరము.

విద్వత్కవిశేఖరులైన తిరుపతి వేంకటేశ్వరకవులు తాము రచించిన భారత విశేషములను చిన్నగ్రంథమున వ్యాసమూర్తిగారు భారత ఫక్కిలోఁ గావించిన కొన్ని యాక్షేపములకు సమాధానము లొసంగ ప్రయత్నించి యుండిరి.

భారత గ్రంథమాలవారు హస్తానుకూల పరిమాణముతోఁ బ్రచురించిన మహాభారత సంపుటములు కొన్ని కలవు. ఇందు శ్రీ పళ్లె పూర్ణ ప్రజ్ఞాచార్యులవారు రచించిన టీకకలదు. భారతమంతయు నారూపముగాఁ బ్రచురింపఁబడినదో లేదో తెలియదు

ఆంధ్రమహాభారతమునందలి భాగములు విశ్వవిద్యాలయములందేకాక చిన్న తరగతులలోఁ గూడఁ దప్పక పాఠ్యములుగా నియమింపఁ బడుచుండును. మదరాసు విశ్వవిద్యాలయమువారు కొన్ని మహాభారత భాగములనుగూడఁ దమ పాఠ్యభాగ సంకలన గ్రంథములోఁ జేర్చియుండిరి ఈ భాగములను బరిష్కరించు కార్యము వారు సమర్థులైన విద్వాంసుల కొప్పఁ జెప్పియుండిరి. అందుచే నవి పాఠ పరిశీలనమునఁ గొంత వఱకుఁ దోడ్పడవచ్చును.

## ఉస్మానియా విశ్వవిద్యాలయము — సంశోధిత ముద్రణప్రణాళికారంభము

1959 ఆగస్టు 12వ తేదీని అప్పుడు యూనివర్సిటీ గ్రాంట్సుకమీషన్ యూనిట్ కోఆర్డినేటింగు ఆఫీసరుగానుండిన శ్రీ డా. యన్. వి. సుబ్బారావుగారు తృతీయ

వారిలో కృష్ణమూర్తిశాస్త్రిగారొక్కరే పదునెన్మిది పర్వములను సంపూర్ణముగా ననువదింపఁ జాలిరి. తాడూరి లక్ష్మీనరసింహం పంతులుగారు విరాటోద్యోగ పర్వములు రెండింటినే యనువదింప యత్నించినట్లు చెప్పుదురు. అందేదియు ముద్రితము కాలేదు. వ్యాసమూర్తిశాస్త్రిగారు 13 పర్వములు రచింపఁ జాలిరి. కాని యందాదిభారయను నాదిపర్వభాగము మాత్రమే 1939 వ సంవత్సరమున పిఠాపురములో ప్రచురింపఁబడినది. వ్యాసమూర్తిశాస్త్రిగారు సంస్కృతాంధ్రములందుఁ బేరెన్నికగన్న విద్వాంసులై రాజమహేంద్రనగరమందలి ప్రభుత్వకళాశాలలోఁ బ్రధానాంధ్రపండితులుగాఁ బనిచేసియుండిరి. వారితర గ్రంథములు కూడ రచించిరి. వారికి వేదవ్యాసుని యపరావతారమని ప్రసిద్ధి. వారిశైలియర్థ గంభీరమైనను గ్లిష్టమైనట్టిది. అది విద్వదేకవేద్యము. ఆదిభారయందాదిపర్వమునందలి కథలున్నవి. వ్యాసమూర్తిశాస్త్రిగారు కథయందు నన్నయవిడిచిన బ్రహ్మ - గణపతి వృత్తాంతమును జొప్పించి యుండిరి.

ప్రణాళికా కాలమునఁ గార్యరూపమునొందించుటకుఁ దగినయభివృద్ధి పథకముల కార్తి
కపుటంచనాలతోఁగూడఁ బ్రతిపాదనలు పంపవలెనని యాహ్వానించి యుండిరి. అప్పు
డాంధ్రశాఖాధ్యక్షులుగా నుండిన ఆచార్య శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనము గారాంధ్రశాఖ
యందలి యితర సభ్యులతో నాలోచించి, సంస్కృతఅకాడమీతో నప్పుడు పనిచేయు
చుండిన కురుగంటి సీతారామ భట్టాచార్యులవారితో నా విషయమును గూర్చి
చర్చించుచు. "శ్రీ డా. కట్టమంచి రామలింగారెడ్డిగారు, రా. సా. గిడుగు వేంకటరామ
మూర్తి పంతులుగారు, జయంతి రామయ్య పంతులుగారు, వేటూరి ప్రభాకరశాస్త్రులు
గారు మొదలైన మహనీయులు కలలుగాంచిన మహాభారత సంశోధిత ముద్రణము
సిద్ధముచేయుటకు యత్నింతము. వారే యీ ప్రయత్నముఁ గావించియుండినచో మిక్కిలి
యాదర్శప్రాయముగా నుండెడిది. భారతమున కిట్టిసేవ గావించి యీ తరమువారు
ధన్యతగాంతురను నుద్దేశముతో వారు దానిని విడిచియుందురు. నన్నయ తిక్కనాది
మహాకవులు భారతాదుల ననువదించియు భాగవతము నంత దృష్టి సారింపక దానిని
దనకు విడుచుట తన్ను ధన్యునిగాఁ జేయు నుద్దేశముతోడనే యని బమ్మెర పోతనగారు
భావించియుండలేదా? ఆంధ్రమునఁగల యీజాతీయేతిహాసమునకు సేవచేసినచో మనకు
ధర్మమేకాక యించుక యశస్సును జేకూరు"నని సీతారామయ్యగారికి సూచించిరి.
వారాయభిప్రాయమును మిక్కిలి ప్రశంసించి హృదయపూర్వకముగాఁ బ్రోత్స
హించిరి.

ఆరంభముననే మేము పూనాయందలి భండార్కరు ప్రాచ్యపరిశోధన సంస్థవారు
సంస్కృత మహాభారత సంశోధిత ముద్రణము సిద్ధము చేయుటలో ననుసరించిన
పద్ధతులనే యీ సంశోధిత ముద్రణము విషయమునఁ గూడ ననుసరింప నభిలషించితిమి.
మహాభారతమునంతను అనుక్రమణికాసంపుటముతోఁ గూడ నైదుసంపుటములుగా
ముద్రించుటకు సుమారు రెండు లక్షల రూపాయలు కావలసియుండునని యంచనా వేసి
31–8–1959 వ తేదీని ప్రతిపాదనమును శ్రీ డా. సుబ్బారావుగారికిఁ బంపితిమి. దాని
నొక సంఘము వారు బాగుగాఁ బరిశీలించి, వ్యయమును రూ. 1,38 000 లకుఁ
దగ్గించి ప్రణాళికను బలపఱచి యుండిరి. 25–2–1961 వ తేదీని జరిగిన సమావేశ
ములో ఉస్మానియా విశ్వవిద్యాలయ సెనేటుసభవారు దానిని బరిశీలించిరి కాని దానిని
ద్వితీయ ప్రాధాన్యముగల ప్రణాళికా వర్గములోఁ జేర్చిరి. ఆర్థిక సాహాయ్యమునకై
విశ్వవిద్యాలయ విరాళసంఘము వారికభ్యర్థన పంపఁబడెను. ఆ సంఘమున కధ్యక్షు
లైన శ్రీ డా. డి. యస్. కొఠారిగారు ఉస్మానియా విశ్వవిద్యాలయమును దర్శింప
నరుదెంచినప్పుడు శ్రీ లక్ష్మీరంజనంగారు వారికి ప్రణాళిక విషయము విన్నవించిరి
శ్రీ డా. కొఠారిగారు "ఇది చాల ఘనమైన ప్రయత్నము. ఈ దేశమున యోగ్య
మైన యీప్రయత్నమును ధనాభావముచేఁ గుంటువడియుండ లేదు. స్వయం సాహా
య్యముతో ముందంజవేయుఁ" డని తగిన ప్రోత్సాహమొసంగిరి. యు.జి.సి. వారు
మహాభారత ప్రణాళిక కార్థికసహాయ్యమొనర్ప భారతప్రభుత్వ వైజ్ఞానిక పరిశోధన
సాంస్కృతిక వ్యవహారమంత్రిత్వశాఖ వారిని మొదటఁ గోరవలెనని విశ్వవిద్యాలయము
వారికి సూచించిరి. తదను గుణముగా వంచవాను పునఃపరిశీలనము గావించి యార్థిక
సాహాయ్యమునకై భారతప్రభుత్వమునకును, ఆంధ్రప్రభుత్వమునకును గూడ విశ్వ
విద్యాలయము వారు దరఖాస్తు పంపియుండిరి. రాష్ట్ర ప్రభుత్వమునకు సంబంధించి

నంతవఱకప్పుడు సాంస్కృతిక వ్యవహారామాత్యులుగా నుండిన శ్రీ గౌ. యం. ఆర్. అప్పారావుగారును, కార్యదర్శులుగా నుండిన శ్రీ యల్.యన్. గుప్తగారును ఈ విషయమునఁ జాల శ్రద్ధ వహించిరి. రాష్ట్ర ప్రభుత్వము మొత్తము వ్యయములో (మొత్తము అంచనా రూ. 1,75.000 లు) సగము భరించుట కంగీకరించెను. తరువాత భారత ప్రభుత్వము కూడ మిగిలిన సగము వ్యయమును మంజూరుచేసెను. ఇదంతయు 1964_65 సంవత్సరములలో జరిగెను.

ఉస్మానియా విశ్వవిద్యాలయోపాధ్యక్షులైన శ్రీ డా. డి. యస్. రెడ్డిగారు మొదటినుండియు నీ మహాభారత సంశోధిత ముద్రణము విషయమున శ్రద్ధాసాను భూతులు ప్రదర్శించుచుండిరి. వారు మాటలయిందుఁ గంటెఁజేఁతల యందధికమైన విశ్వాసము కలవారు. వారు విశ్వవిద్యాలయముచే మొదటి వాయిదాగా రూ. 6500 లిప్పించిరి. ఈ విషయమున నప్పుడు రిజిస్ట్రారుగా నుండిన శ్రీ బి. పి. ఆర్ విఠల్‌గారు చాలఁ దోడ్పడియుండిరి ఇది 1963 వ సంవత్సరమున జరిగెను.

## ప్రారంభము

శ్రీ లక్ష్మీరంజనంగారీ క్రింది కారణములచే సంశోధిత భారతముద్రణ ప్రయత్నమునకు శ్రీ కారముచుట్ట వలెనని యాత్రపడుచుండిరి.

1. ఇది చాల ధర్మ్యము నుత్తమమునైన కార్యము. ధర్మమధర్మమువలె నాలస్యము నోర్వఁజాలదు.

2. ఉస్మానియా విశ్వవిద్యాలయమందలి యాంధ్రశాఖలో పి. హెచ్. డి. పట్టమునకై పరిశోధనలు జరుపుట కవకాశములు కల్పింపఁబడినవి. పరిశోధన గ్రంథ ప్రచురణమునఁ దెలుఁగుశాఖ ముందంజవేయవలసి యున్నది. మహాభారత సంశోధితముద్రణమందు కర్హమైన యారంభము కాఁజాలును.

3. విశ్వవిద్యాలయోపాధ్యక్షులైన శ్రీ డా. డి. యస్. రెడ్డిగారి నామ మీజాతీయేతిహాస ప్రచురణముతో సంబద్ధమై యుండుట యుచితముగా నుండును. పూర్వము రెడ్డి రాజు లాంధ్రవాఙ్మయమున కపారమైనసేవ కావించియుండిరి. శ్రీ సదాశివ రెడ్డిగా రభ్యుదయమందుచున్న విశ్వవిద్యాలయముల సమూహములో ఉస్మానియా విశ్వవిద్యాలయమున కుచితమైన స్థానము కల్పించియున్నారు.

బాహ్యమైన సాహాయ్యముకొఱకు వేచియుండక శ్రీ డా. కోఠారిగారొసంగిన స్వయంసాహాయ్య సందేశముపై నాధారపడి ఆంధ్రశాఖవారు 17-7-1961 తేదీని మహాభారత సంశోధితముద్రణప్రణాళికకు విఘ్నేశ్వరపూజ గావించిరి. ఆరంభవ్యయమునకై కొన్నివిరాళములు వసూలుచేసి వారు పనిచేయుట కారంభించిరి.

ఈప్రణాళికకు సంబంధించిన వివిధదశలలో ఉస్మానియా విశ్వవిద్యాలయాంధ్ర శాఖయందలి విద్యార్థులు చాల ఉపయోగపడియుండిరని చెప్పుటకెంతయు సంతసించు

చున్నాము. మొదటనే కుమారి బి. విజయభారతి, టి. సుశీల, సీత, శ్రీమతి కె. హేమలత అను విద్యార్థినులు భారతాది సభాపర్వమునందలి పద్యముల ప్రథమపాదానుక్రమణికలను సిద్ధముగావించిరి. అనుక్రమణికా సంపుటమొకటి యుండవలెనని మేము మొదటినుండియు నాసించుచునే యుంటిమి. తరువాత మహాభారతమునందలి యితర పర్వములకుఁగూడ నట్టియనుక్రమణిక సిద్ధముచేయఁబడినది.

ఈప్రణాళికకు సంబంధించిన వివిధ విధానములతో ఉస్మానియా విశ్వవిద్యాలయ తదనుబంధ కళాశాలలందలి యాంధ్రోపన్యాసకులు పలువురు దమంతఁ దాముత్సాహముతోఁ దోడ్పడియుండిరి. వారేకాక నగరమునందలి ఉన్నతపాఠశాలలోని యాంధ్ర పండితులుకూడ మాకు సాహాయ్యమందిచ్చిరి. వారికందఱికిని, ముఖ్యముగా శ్రీ పరాయితం కృష్ణమూర్తి, శ్రీ టి. వేంకటేశ్వరశర్మ, శ్రీ మూలంపల్లి చంద్రశేఖర శర్మగార్లకును, మా కృతజ్ఞతలు.

## కా ర్య వి ధా న ము

మొట్టమొదటనే యీ సంశోధిత ముద్రణనిర్మాణ కార్యమున పూనాయందలి భండార్కరు ప్రాచ్యపరిశోధన సం వారి సంస్కృతమహాభారత సంశోధితముద్రణము నాదర్శముగా గ్రహించవలెనని ని యించితిమి. భండార్కరు ప్రాచ్యపరిశోధన సంస్థవా రవలంబించిన శాస్త్రీయవిధా ముల తెప్పగానెఱుంగుటకై 1963వ సంవత్సరమున శ్రీమాన్ చెలమచర్ల రంగాచార్యులుగారిని విశ్వవిద్యాలయమువారు పూనా నగరమునకుఁ బంపియుండిరి. వారాసంస్థ యందలి మహాభారతశాఖ కధ్యక్షులైన శ్రీ డా. పి. యన్. వైద్యగారియొద్ద శిక్షణము పొందివచ్చిరి.

## కా ర్య ద శ లు

1. మొదట నాంధ్రమహాభారతమునకు సంబంధించిన తాళపత్రప్రతుల కొఱకును, ప్రాచీన ముద్రితప్రతులకొఱకును ముద్రితవిజ్ఞప్తులు పంపియుంటిమి. ఇచ్చట మాకు మొట్టమొదటి తాళపత్రప్రతినిచ్చినవారిని మాత్రమే పేర్కొందును. వారు ప్రస్తుతము ఓరుగల్లుకళాశాలలో నాంధ్రోపన్యాసకులుగానున్న శ్రీ వి. నరసింహారెడ్డిగారు. వారిచ్చిన తాళపత్రప్రతిలో ఉద్యోగపర్వమొక్కటి మాత్రమే యున్న . ఇతరములైన వివరాళములును, గ్రంథదానములును అనుబంధమున వివరింపఁబడును.

2. తాళపత్రప్రతుల సంచయములున్న కొన్నిసంస్థలవారు తమయొద్దనున్న ప్రతులను బయటివారికీయ నంగీకరింపరు కావున నట్టిచోట్లకు ప్రతులవర్ణనాత్మక పట్టికలను సిద్ధముచేయుటకై కొందఱిని బంపియుంటిమి. మాయధీనముననున్న తాళపత్ర ప్రతులకుఁగూడ నట్టివర్ణనాత్మక పట్టికలను సిద్ధము చేయించితిమి.

3. దర్శనమాత్రముననే యేపర్వపుఁ బ్రతులెచ్చటనున్నవో వానిస్థితియెట్లున్నదో తెలిసికొనుటకనువుగాఁ దాళపత్రప్రతుల పర్వాను గుణానుక్రమణికలను సిద్ధముచేయించి

తిమి. ఉన్నచోట కాలమును ఇండియన్ ఎఫిమెరిస్ సాహాయ్యమునఁ బరిశీలించి నిర్ణయించితిమి

4. ఆంధ్రదేశమందున్న తెలంగాణము, రాయలసీమ, తీరమండలములు అను మూఁడు సాంస్కృతిక ప్రాంతములకును దగిన ప్రాతినిధ్యమొసంగు నుద్దేశముతోఁ దాళపత్ర ప్రతుల నన్నింటిని బృథక్కరించితిమి. ఈపనిచేయుట యంతసులభమైనదికాదు.

5. పై విధముగాఁ దాళపత్రప్రతులను సిద్ధముచేసి యందుండి పరిచూచుటకుఁ బనికి వచ్చువాని నెన్నియుంటిమి. కాలము, లేఖక ప్రమాదరాహిత్యము, చదువుటకుఁ దగిన సుస్థితి అనువిషయములను వానినెన్నిక చేయుటలో దృష్టియందుంచుకొని యుంటిమి.

6. సంపాదించిన విద్వాంసుల ప్రామాణికత్వమును బురస్కరించుకొని కొన్ని ముద్రిత ప్రతులనుగూడ విమర్శన సాధనసామగ్రిలోఁ జేర్చియుంటిమి.

## మహాభారత లక్ష్యములను సేకరించుట

ఛందోవ్యాకరణ గ్రంథములందును నిఘంటువులందును ఉద్ధృతములైయుండిన మహాభారత లక్ష్యములను సేకరించుటకు 1962 వ సంవత్సరము నుండియుఁ బ్రయత్నము చేయుచునే యుంటిమి. గ్రాంథికాంధ్రభాషకు మహాభారతమెట్లు మూలాధారభూతమో ముందే తెల్పియుంటిమి. వ్యాకరణచ్ఛందోనిఘంటు గ్రంథముల రచయితలు మహాభారతమునుండి లక్ష్యముల నుద్ధరించుచుండుట సర్వసాధారణము. ఆయుద్ధరణములు ప్రాచీనకాలమున మహాభారతమునందలి పాఠములెట్టులుండెనో విప్పి చెప్పఁ జాలును. కొన్ని వ్యాకరణచ్ఛందోగ్రంథములు ముద్రితములైనవి ముద్రణ సందర్భమున నాధునిక విద్వాంసులు వానిని తమకుఁదోఁచినట్లు పరిష్కరించి యుండిరి. వారు తమకభిమానపాత్రములైన సారస్వతసిద్ధాంతముల ననుసరించి వానిలోని పాఠములను మార్చియుండిరేమోయను ననుమానముకలదు. అందుచే నీఛందోవ్యాకరణ గ్రంథముల పారిశుద్ధ్యము సందేహాస్పదమని కొందఱి యభిప్రాయము. వారియభిప్రాయము ననుసరించి వానికి మూలములైన తాళపత్రప్రతులనే మనము పరిశీలింపవలసి యున్నది. అనఁగా నాలక్షణ గ్రంథములన్నింటికిని సంశోధితప్రతులను సిద్ధముచేయవలె నన్నమాట. అదియంత సులభముగ ఉపయోగకరముగను గానిపింపక పోవుటచే మేము ముద్రితములైన లక్షణగ్రంథములనుండియే మహాభారతోద్ధరణములను సేకరించి యుంటిమి.

ఈక్రింది ఛందోవ్యాకరణాది గ్రంథములనుండి మేము మహాభారతోద్ధరణములను సేకరించియుంటిమి.

## ఛందోగ్రంథములు

1. అప్పకవీయము. 2. ఆనందరంగరాట్ఛందము. 3. కవిసంజీవని. 4. కవిసంశయ విచ్ఛేదము, 5. సర్వలక్షణసార సంగ్రహము. 6 ఆంధ్రప్రయోగ రత్నాకరము

7. ఛందము. 8. సర్వలక్షణసారము, 9. పరసాంప్రవృత్త రత్నాకరము. 10. లక్షణ దీపిక. 11. వీరభూపాలీయము. 12. శకటరేఫనిర్ణయము. 13. ద్విరేఫవర్ణదర్పణము. ఇంకను మఱికొన్ని ఛందోగ్రంథములున్నట్లు తెలియవచ్చినది. కాని అయ్యవి మాకు లభింపలేదు.

## వ్యాకరణ గ్రంథములు

1. సుప్తార్థప్రకాశిక. 2. ప్రౌఢవ్యాకరణము. 3. ఆంధ్రభాషానుశాసనము. 4. ఆంధ్రవ్యాకరణ సంహితా సర్వస్వము. 5. బాలకవిశరణ్యము. 6. అహోబల పండితీయము. ఆంధ్రకౌముదిలోఁగూడ మహాభారతోద్ధరణములు కలవని తెలియవచ్చినది. కాని దానిని సేకరింపఁజాలక పోయితిమి.

## నిఘంటువులు

1. సి. పి. బ్రౌనుదొరవారి ఆంధ్రాంగ్లనిఘంటువు 2. శబ్దరత్నాకరము. 3. సూర్యరాయాంధ్రనిఘంటువు.

## సంకలనగ్రంథములు

క్రీ. శ. 15 వ శతాబ్ది పూర్వార్థమున నివసించిన మడికిసింగనకవిచే సంకలితమైన సకలనీతి సమ్మతమొక్కటిమాత్రమే మాకులభించినది. పెదపాటి జగన్నాథకవిచే సంకలితమైన ప్రబంధరత్నాకరము, ప్రబంధమణిభూషణము, ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికలో ప్రచురింపఁబడిన ఉదాహరణపద్యములు మాకు లభింపలేదు.

## వ్యాఖ్యానములు

ఇదివఱకుఁ జేర్కొనఁబడిన, 1. భారతకూలంకషము, 2 భారతసంజీవనిని మేము లక్ష్యమైనంతవఱకు వినియోగించు కొంటిమి.

## డాక్టరు సర్వేపల్లి రాధాకృష్ణగారి ఆశీస్సులు

ఈప్రణాళిక అభ్యుదయమునకు దోహదమొసంగిన అదృష్టకర సన్నివేశములలో భూతపూర్వ భారతరాష్ట్రపతులైన శ్రీ డా. సర్వేపల్లి రాధాకృష్ణయ్యగారి యాశీస్సుల నందుకొనఁజాలుట అగ్రగణ్యమైనది. 1963వ సంవత్సరపు వేసంగిలో శ్రీవారు సికింద్రాబాదునందలి రాష్ట్రపతి భవనమున విడిసియుండిరి. 1963 అగస్టు 4వ తేదీని శ్రీవారు శ్రీ కె. లక్ష్మీరంజనంగారికిని, శ్రీమాన్ శ్రీరంగాచార్యులగారికిని దర్శన మొసంగ నంగీకరించిరి. తరువాత వారిప్రణాళికనుగూర్చి సంపూర్ణముగా విని దాని ఆరంభోత్సవమునకు సూచనగా పుస్తకమున నన్నయభట్టు రచించిన 'శ్రీవాణీ గిరిజాశ్చిరాయ'యను శ్లోకమును తమ స్వహస్తముతో లిఖించియుండిరి

## ఆదర్శ సంపాదనము

విమర్శనసాధన సామగ్రినంతను నిర్ణయించుకొన్న పిమ్మట నాదిపర్వము నందలి స్వల్పభాగము నాదర్శముగా సంపాదింప నారంభించితిమి. మేమాదిపర్వమునందలి ప్రస్తావనను ఉదంకోపాఖ్యానమును సంశోధన పూర్వకముగా సంపాదించి యాభాగము నాంధ్రదేశమునందలి ప్రసిద్ధ విద్వాంసులు పలువురికి పంపియుంటిమి. వారందఱును అనుకూలములైన యభిప్రాయము లొసంగుటయేకాక కొన్ని యమూల్యములైన సూచనలుకూడ కావించిరి. తరువాత కొనసాగించిన సంపాదనకార్యమున మేము వాని నన్నింటిని దృష్టిలో నుంచుకొని యుంటిమి. సామాన్య వ్యాకరణచ్ఛందోనియమముల కనుగుణముగా నున్నప్పుడు తాళపత్రప్రతులయందలి పాఠములకే ప్రాధాన్య మొసంగవలయుననియు, వావిళ్ళప్రతిలోని పాఠమునకంటె భిన్నమైనపాఠమును గ్రహించినప్పుడు దానికాధారమైన ప్రతియేదో సూచింపవలెననియు వారు కావించిన సూచనలలో ముఖ్యములైనవి.

## తాళపత్ర ప్రతులతో సరిచూచుట

వావిళ్ళ ప్రతి పాఠములను తాళపత్రప్రతుల పాఠములతో సరిచూచు పని యతివిస్తృతమై దీర్ఘకాలము కొనసాగెను. తొలుఁదొల్త నా పని నాంధ్రశాఖ యందలి యుపన్యాసకులే చేసియుండిరి. కాని యట్లు చేసినచో తాళపత్ర ప్రతులను సరిచూచు పనికి చాలకాలము పట్టునని తెలియవచ్చెను. అందుచే 1965-66 సంవత్సరమున నా పని నిర్వహించుటకు సుమారు పది మంది పరిశీలకులు నియమింపఁబడిరి. అందువలన పని తొందరగానే సాగెను గాని కొందఱు పరిశీలకులా పనికి సరిక్రొత్త వారగుటచేఁ గొంత పునః పరిశీలనము కావలసివచ్చెను. ఈ విధముగా నాదిపర్వమునకు సంబంధించిన పనినంతను పునఃపరిశీలనముచే సంతృప్తికరము కావించితిమి. తరువాత తంజావూరు సరస్వతీ మహాలు లోని ముఖ్య తాళపత్ర ప్రతులను సరిచూచుటకై కొందఱు పండితుల నచ్చటికి పంపియుండిమి. ఆంధ్ర విశ్వవిద్యాలయమునందలి తాళపత్రప్రతులను శ్రీ పండిత కొమ్మనమంచి జోగయ్యశర్మగారు మా కొఱకై పరిశీలించి యుండిరి. పిమ్మట ఆంధ్ర శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయముల వారు మాకు తడవకు రెండేసి తాళపత్ర ప్రతులవంతునఁ బంపుటకు సమ్మతించిరి. అందుచే నా ప్రతులను స్థానికముగనే పరిశీలించుట కవకాశము లభించెను. మదరాసున ప్రాచ్య లిఖితపత్ర గ్రంథాలయము, అడయారు దివ్యజ్ఞానసమితి గ్రంథాలయము అను రెండు కేంద్రములలో పరిశీలన కార్యము జరుగుట కేర్పాట్లు కావించితిమి అనుభవశాలులైన విద్వాంసులు శ్రీ బులుసు వెంకట రమణయ్యగారు కొంతకాలము మా కొఱకు పరిశీలన కార్యమును నిర్వహించి యుండిరి. ఇప్పుడాపనిని స్థానిక కళాశాలలో నుపన్యాసకులుగా నున్న శ్రీ కె. సూర్యనారాయణగారు చేయుచున్నారు. శ్రీ బ్రౌను దొరగారి కాగితపు లిఖితప్రతులు మదరాసునందలి ప్రభుత్వ ప్రాచ్య లిఖితపుస్తక భాండాగారమున నున్న సంగతి యిదివఱకే తెల్పియుంటిమి. కాకినాడయందలి ఆంధ్ర సాహిత్యపరిషత్తు వారును. రాజమహేంద్రవరము నందలి గౌతమీ గ్రంథాలయము వారును. హైదరాబాదు నందలి ఆంధ్రసారస్వత పరిషల్లక్ష్మణరాయ పరిశోధక

మండలులవారును దమయొద్ద నున్న తాళపత్ర ప్రతుల నెరవిచ్చుట కంగీకరించి యుండుటచే వానిని బరిశీలించు పనియంతయు మా విశ్వవిద్యాలయము నందే జరిగి యుండెను.

మాయొద్దనే ఎం. ఏ చదివి యాపరీతులలో నుత్తీర్ణులైన కుమారి యం దీనావతి. బి. జ్యోతిర్మయి. ఐ. కాంతలక్ష్మి. డి. విద్యేశ్వరి అను పూర్వవిద్యార్థినులు స్థిరముగా నుండి నిపుణముగాఁ దాళపత్రప్రతులను పరిశీలించియుండిరని చెప్పుట కెంతయు సంత సించుచున్నాము వారిలో కుమారి మానాప్రెగడ దీనావతి సుమారైదేండ్లనుండి మాతో యవిచ్ఛిన్నముగా పనిచేయుచుండుటచేఁ దాళపత్రముల విషయమునఁ గొంతప్రామాణిక పరిజ్ఞానము సంపాదింపఁజాలినది.

తాళపత్ర ప్రతులను పరిచూచుటలో మేము భండార్కరు పరిశోధన సంస్థవారి విధానమునే యవలంబించితిమి పరిచూచుటకుపయుక్తములగు పత్రములు ప్రత్యేక ముగా సిద్ధముచేయఁబడినవి. పద్యగద్యము లందొక్కొక్క పంక్తి (పాదమున) కొక్కొక్కపత్ర ముపయోగింపఁబడినది ప్రతి పత్రమునకును మొదట తాళపత్ర ప్రతులందలియు ప్రాచీన ముద్రితప్రతులందలియుఁ బాఠములు నిలువుగా నొకదాని తరువాత నొకటి చొప్పున నీయఁబడినవి. ప్రతి తాళపత్ర ప్రతికిని, ముద్రితప్రతికిని నొక్కొక్క యక్షరసంజ్ఞ నొసంగియుంటిమి. ఆ సంజ్ఞలతోఁ గూడిన విమర్శసాధన సామగ్రి వివరములు వేఱుగా నొసంగఁబడినవి.

సంపాదన కార్యమున నవలంబింపఁబడిన సూత్రములు పూర్వపు విద్వాంసులు మహాభారత విషయమున నొనర్చిన సేవను నిరసించుటకుఁ గాని యందలి లోపములను వెల్లడించుటకుఁ గాని మేమీ సంశోధితముద్రణ కార్యము నారంభించి యుండలేదు. ఆమహనీయులు మహాభారతమునకుఁ జేసిన సేవ చాలమహత్తరమైనది పూర్వవిద్వాంసు లొనర్చిన యాసేవను యథాశక్తిగాఁ బూరింపయత్నించుట మాత్రమే మా యుద్దేశము మఱియు శాస్త్రీయపాఠవిమర్శన సిద్ధాంతముల నాంధ్రమహాభారత ముద్రణము విష యమున సమన్వయింపవలెననియు మేము భావించితిమి. భారతదేశము నందలి ప్రాంతీయభాష లన్నిటిలోఁగల భారతములం దాంధ్రమహాభారతమునకు గౌరవస్థానము నాక్రమించునని డా. సుక్తంకరుగారు తెల్పియున్నారు అసంఖ్యాకములైన వ్యాఖ్యలు కాక సాక్ష్యములుగను సహాయములుగను, పదకొండవ శతాబ్దిలోని యీ క్రింది మూఁడు గ్రంథములును లభించుచున్నవి. 1. జవానీయుల భారతము. 2. ఆంధ్రకవి నన్నయభట్టకృతమైన ఆంధ్రభారతము. 3. కాశ్మీరకవి పుంగవుఁడైన క్షేమేంద్రుని భారతమంజరి (క్రీ. శ. 1050); నన్నయభట్టు తన కావ్యమున తాను జూచిన సంస్కృత భారతమునందలి ప్రతి పర్వములోఁ గల శ్లోకముల సంఖ్య నొసంగు పర్వసంగ్రహమును సరిగా ననువదించి యుండుటచే నతని గ్రంథము పదకొండవ శతాబ్ది యందలి దాక్షిణాత్యముద్రణము యొక్క — ముఖ్యముగా తెలుఁగు ముద్రణము యొక్క — పరిస్థితి నెఱుంగుట కెంతో సహకారిగా నుండఁగలదు. ఆంధ్రానువాదమే కాక యింకను దేశభాషలలో చేయఁబడిన భారతానువాదము లున్నవి కాని వానిలో పెక్కు తరువాతి కాలమునకు చెందినట్టివి. అదియును గాక అవి అతిస్వతంత్రము లగుటచే మహాభారత గ్రంథ పునర్నిర్మాణమున కంతగా నుపయోగపడఁజాలవు.

## ఆ ద ర్శ సం పా ద న ము

విమర్శనసాధన సామగ్రినంతను నిర్ణయించుకొన్న పిమ్మట నాదిపర్వము నందలి స్వల్పభాగము నాదర్శముగా సంపాదింప నారంభించితిమి. మేమాదిపర్వమునందలి ప్రస్తావనను ఉదంకోపాఖ్యానమును సంశోధన పూర్వకముగా సంపాదించి యాభాగము నాంధ్రదేశమునందలి ప్రసిద్ధ విద్వాంసులు పలువురికి పంపియుంటిమి. వారందరును అనుకూలములైన యభిప్రాయము లొసంగుటయేకాక కొన్ని యమూల్యములైన సూచనలుకూడ కావించిరి. తరువాత కొనసాగించిన సంపాదనకార్యమున మేము వాని నన్నింటిని దృష్టిలో నుంచుకొని యుంటిమి. సామాన్య వ్యాకరణచ్ఛందోనియమముల కనుగుణముగా నున్నప్పుడు తాళపత్రప్రతులయందలి పాఠములకే ప్రాధాన్య మొసంగవలయుననియు, వావిళ్ళప్రతిలోని పాఠమునకంటె భిన్నమైనపాఠమును గ్రహించినప్పుడు దానికాధారమైన ప్రతియేదో సూచింపవలెననియు వారు కావించిన సూచనలలో ముఖ్యములైనవి.

## తా ళ ప త్ర ప్ర తు ల తో స రి చూ చు ట

వావిళ్ళ ప్రతి పాఠములను తాళపత్రప్రతుల పాఠములతో సరిచూచు పని యతివిస్తృతమై దీర్ఘకాలము కొనసాగెను. తొలుఁదొల్త నా పని నాంధ్రశాఖ యందలి యుపన్యాసకులే చేసియుండిరి. కాని యట్లు చేసినచో తాళపత్ర ప్రతులను సరిచూచు పనికి చాలకాలము పట్టునని తెలియవచ్చెను. అందుచే 1965–66 సంవత్సరమున నా పని నిర్వహించుటకు సుమారు పది మంది పరిశీలకులు నియమింపఁ బడిరి అందువలన పని తొందరగానే సాగెను గాని కొందఱు పరిశీలకులా పనికి సరిక్రొత్త వారగుటచేఁ గొంత పునః పరిశీలనము కావలసివచ్చెను. ఈ విధముగా నాది పర్వమునకు సంబంధించిన పనినంతను పునఃపరిశీలనముచే సంతృప్తికరము కావించితిమి. తరువాత తంజావూరు సరస్వతీ మహాలులోని ముఖ్య తాళపత్ర ప్రతులను సరిచూచుటకై కొందఱు పండితుల నచ్చటికి పంపియుండిమి. ఆంధ్ర విశ్వవిద్యాలయమునందలి తాళపత్రప్రతులను శ్రీ పండిత కొమ్మనమంచి జోగయ్య శర్మగారు మా కొఱకై పరిశీలించి యుండిరి. పిమ్మట ఆంధ్ర శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయముల వారు మాకు తడవకు రెండేసి తాళపత్ర ప్రతులవంతునఁ బంపుటకు సమ్మతించిరి. అందుచే నా ప్రతులను స్థానికముగనే పరిశీలించుట కవకాశము లభించెను. మదరాసున ప్రాచ్య లిఖితపత్ర గ్రంథాలయము, అడయారు దివ్యజ్ఞానసమితి గ్రంథాలయము అను రెండు కేంద్రములలో పరిశీలన కార్యము జరుగుట కేర్పాట్లు కావించితిమి అనుభవశాలులైన విద్వాంసులు శ్రీ బులుసు వెంకట రమణయ్యగారు కొంతకాలము మా కొఱకు పరిశీలన కార్యమును నిర్వహించి యుండిరి. ఇప్పుడాపనిని స్థానిక కళాశాలలో నుపన్యాసకులుగా నున్న శ్రీ కె. సూర్యనారాయణగారు చేయుచున్నారు. శ్రీ బ్రౌను దొరగారి కాగితపు లిఖితప్రతులు మదరాసునందలి ప్రభుత్వ ప్రాచ్య లిఖితపుస్తక భాండగారమున నున్న సంగతి యిదివఱకే తెల్పియుంటిమి. కాకినాడయందలి ఆంధ్ర సాహిత్యపరిషత్తు వారును, రాజమహేంద్రవరము నందలి గౌతమీ గ్రంథాలయము వారును, హైదరాబాదు నందలి ఆంధ్రసారస్వత పరిషల్లక్ష్మణరాయ పరిశోధక

మండలులవారును దమయొద్ద మున్న తాళపత్ర ప్రతుల నెరవిచ్చుట కంగీకరించి యుండుటచే వానిని బరిశీలించు పనియంతయు మా విశ్వవిద్యాలయము నందే జరిగి యుండెను.

మాయొద్దనే ఎం. ఏ చదివి యాపరీక్షలో నుత్తీర్ణులైన కుమారి యం. దీనావతి. బి జ్యోతిర్మయి. ఐ. కాంతలక్ష్మి. డి. విద్యేశ్వరి అను పూర్వవిద్యార్థినులు స్థిరముగా నుండి నిపుణముగాఁ దాళపత్రప్రతులను పరిచూచియుండిరని చెప్పుట కెంతయు సంత సించుచున్నాము వారిలో కుమారి మానాప్రెగడ దీనావతి సుమారైదేండ్లనుండి మాతో యవిచ్ఛిన్నముగా పనిచేయుచుండుటచేఁ దాళపత్రముల విషయమునఁ గొంత ప్రామాణిక పరిజ్ఞానము సంపాదింపఁజాలినది

తాళపత్ర ప్రతులను పరిచూచుటలో మేము భండార్కారు పరిశోధన సంస్థవారి విధానమునే యవలంబించితిమి. పరిచూచుటకుపయుక్తములగు పత్రములు ప్రత్యేక ముగా సిద్ధముచేయఁబడినవి పద్యగద్యము లందొక్కొక్క పంక్తి (పాదమున) కొక్కొక్కపత్ర ముపయోగింపఁబడినది. ప్రతి పత్రమునకును మొదట తాళపత్ర ప్రతులందలియు ప్రాచీన ముద్రితప్రతులందలియుఁ బాఠములు నిలువుగా నొకదాని తరువాత నొకటి చొప్పున నీయఁబడినవి. ప్రతి తాళపత్ర ప్రతికిని, ముద్రితప్రతికిని నొక్కొక్క యక్షరసంజ్ఞ నొసంగియుంటిమి. ఆ సంజ్ఞలతోఁ గూడిన విమర్శసాధన సామగ్రి వివరములు వేఱుగా నొసంగఁబడినవి.

సంపాదన కార్యమున నవలంబింపఁబడిన సూత్రములు పూర్వపు విద్వాంసులు మహాభారత విషయమున నొనర్చిన సేవను నిరసించుటకుఁ గాని యందలి లోపములను వెల్లడించుటకుఁ గాని మేమీ సంశోధితముద్రణ కార్యము నారంభించి యుండలేదు. ఆమహనీయులు మహాభారతమునకుఁ జేసిన సేవ చాలమహత్తరమైనది. పూర్వవిద్వాంసు లొనర్చిన యా సేవను యథాశక్తిగాఁ బూరింపయత్నించుట మాత్రమే మా యుద్దేశము మఱియు శాస్త్రీయపాఠవిమర్శన సిద్ధాంతముల నాంధ్రమహాభారత ముద్రణము విష యమున సమన్వయింపవలెననియు మేము భావించితిమి. భారతదేశము నందలి ప్రాంతీయభాష లన్నిటిలోఁగల భారతములం దాంధ్రమహాభారతము గౌరవస్థానము నాక్రమించునని డా సుక్తంకరుగారు తెల్పియున్నారు అసంఖ్యాకములైన వ్యాఖ్యలు కాక సాక్ష్యములుగను సహాయములుగను, పదకొండవ శతాబ్దిలోని యీ క్రింది మూఁడు గ్రంథములును లభించుచున్నవి. 1. జవానీయుల భారతము. 2. ఆంధ్రకవి నన్నయభట్టకృతమైన ఆంధ్రభారతము. 3. కాశ్మీరకవి పుంగవుఁడైన క్షేమేంద్రుని భారతమంజరి (క్రీ. శ. 1050); నన్నయభట్టు తన కావ్యమున తాను జూచిన సంస్కృత భారతమునందలి ప్రతి పర్వములోఁ గల శ్లోకముల సంఖ్య నొసంగు పర్వసంగ్రహమును సరిగా ననువదించి యుండుటచే నతని గ్రంథము పదకొండవ శతాబ్ది యందలి దాక్షిణాత్యముద్రణము యొక్క — ముఖ్యముగా తెలుఁగు ముద్రణము యొక్క — పరిస్థితి నెఱుంగుట కెంతో సహాకారిగా నుండఁగలదు ఆంధ్రానువాదమే కాక యింకను దేశభాషలలో చేయఁబడిన భారతానువాదము లున్నవి కాని వానిలో పెక్కు తరువాతి కాలమునకు చెందినట్టివి. అదియును గాక అవి అతిస్వతంత్రము లగుటచే మహాభారత గ్రంథ పునర్నిర్మాణమున కంతగా నుపయోగపడఁజాలవు.

ఇంతకుపూర్వము తెలుఁగుభారతము మేమిప్పుడు చేయుచున్నట్లుగా పరిమర్శ మైన పరిశీలనమునకు గురిచేయఁబడక పోవుటయే, మేమీసంశోధితముద్రణము నారం భించుటకు సమర్థనము. ఇతరులు కొందఱిట్లుచేసిరి గాని మిక్కిలి స్వల్పపరిమాణములో నొనరించియుండిరి, మేమొనర్చిన సంశోధనమున నసాధారణ విషయములంతగాఁ గనఁ బడకపోయినను ముఖ్యావహకములైన కొన్ని ఫలితములు లభించినవి.

ఇదివఱకు తెల్పినట్లు ఆంధ్రమహాభారత సమస్యలకును సంస్కృత మహాభారత సమస్యలకును చాలభేదముకలదు. మేమేప్రతియందలి పాఠములనుగాని సమర్థించుటకో, నిరసించుటకో పూనికొనియుండలేదు. మాకులభ్యములైన విస్తృతములైన యాధార ములను దృష్టియందుంచుకొని ప్రతిపాఠమును గాఢముగా పరిశీలించియుంటిమి. మేము ప్రధానముగా గ్రహించిన హావిళ్ళప్రతియందలి పాఠము పరీక్షకునిలిచినచో దానినే ధైర్యముగా నుంచివేసితిమి. లిఖితప్రతులుగాని యితరముద్రణములు గాని అంతకంటె నుత్తమమైన పాఠము నొసంగియుండినచో నున్నదానిని మార్చుటకు యత్నించితిమి. ఉచితమైనపాఠమేదియని నిర్ణయించునపుడు సంస్కృత మూలమునుగూడ పరిశీలించి యుంటిమి. అవసరమైనచోట్ల అధ్యాయపద్యశ్లోక సంఖ్యలతోఁగూడ మూలభాగముల నొసంగియుంటిమి. ప్రస్తుతము ప్రచారములోనున్న వ్యాకరణసూత్రములను దృష్టిలో నుంచుకొన్నను భారతమునందలి పాఠములు బాలవ్యాకరణమునకో, మఱి యేవ్యాక రణగ్రంథమునకో అనుగుణముగా నుండునట్లు ప్రయత్నముమాత్రము చేయలేదు. పాఠ భేదములున్నచోట్లనెల్ల పాఠకులు తమకువచ్చిన పాఠములను స్వేచ్ఛగా గ్రహించుటకు వీలుగా లభ్యములైన పాఠవిశేషములన్నియు నొసంగియుంటిమి. అన్నిపరిస్థితులలోను వ్రాఁతప్రతుల పాఠములకు తగినప్రాముఖ్యము నొసంగియుంటిమి.

## విమర్శన—సాధన సామగ్రి

మేమాదిపర్వము విషయమున గ్రహించిన విమర్శన సాధనసామగ్రి యిట సంగ్ర హముగా వర్ణింపఁబడుచున్నది. మేమిచ్చిన తెలుఁగులక్షరములు ఒక్కొక్క వ్రాఁతప్రతి కొసంగఁబడిన సంజ్ఞలు. సంఖ్యలు మాతిజిష్టర్లలోని క్రమసంఖ్యను సూచించును. ఉ. వి. అనగా ఉస్మానియా విశ్వవిద్యాలయము. మా వ్రాఁతప్రతులన్నియు తాళపత్రప్రతులే. ఉ. వి అని సూచింపఁబడిన తాళపత్రప్రతులలో ఈక్రిందివానిని మేము పాఠములను సరిచూచుటకు వినియోగించియుంటిమి.

1. అ.ఉ వి. సంఖ్య 5. ఇందు ఆదిసభా—విరాటపర్వములు సంపూర్ణముగను, ఉద్యోగ పర్వము శాల్లవ ఆశ్వాసమునందు 375 గద్యపద్యములును కలవు. ఇందు 403 పత్రములున్నవి పరిమాణము 18న్నర"×1న్నర". అచ్చటచ్చట కొంఁచిగా పాడయినను స్థితి బాగుగానున్నది. బహుశః 200 సంవత్సరములకు పూర్వముదికావచ్చును. నిజామాబాదు మండలమునందలి దోమకొండగ్రామము నుండి గ్రహింపఁబడినది. దీనిని కీ|| శ్రీ అ. రాజేశ్వరశర్మగారు బహూకరించిరి.

2. ఆ.ఉ.వి. సంఖ్య 7 ఆదిసభాపర్వములు పూర్తిగనున్నవి. పరిమాణము 17"×1న్నర" 310 కమ్మలు. కొద్దిగా శిథిలమైనను ప్రతి మంచిస్థితిలోనున్నది. వ్రాతచక్కనిది.

శ్రీ యం. వీరేశలింగంగారు బహుమతిగా నొసంగిరి తెలంగాణము నుండి వచ్చిన ప్రతియై యుండనోపు.

3. ఇ.ఉ.వి. సంఖ్య 19. ఆదిపర్వము. అసంపూర్ణము 4వ ఆశ్వాసమువఱకు పూర్తిగను, 5వ ఆశ్వాసములోని కొంతభాగమును గలదు. పరిమాణము 16"×1న్నర". 110 కమ్మలు ప్రతిప్రాఁతది. శిథిలము వ్రాతచక్కనిది. గద్వాల ప్రాంతము. 'పాయక పాకశాసనికి' (1–1–25) అను పద్యమిందులేదు.

4. ఈ.ఉ.వి. సంఖ్య 32. ఆదిపర్వము పూర్తిగనున్నది. 273 కమ్మలు. మంచిస్థితి 6వ ఆశ్వాసము ప్రారంభమున తేదీ సంస్కృతమున గలదు. అంగీరస చైత్ర బ॥ చతుర్దశీ వారమిందుచెప్పఁబడి యుండలేదు. మొదటికమ్మపై మఱియొకతేదీ ఆషాఢ శు॥ త్రయోదశి (శుక్రవారము) అని కలదు. సింగరార్యుని కోర్కెపై వ్రాయఁబడినది.

5. ఉ.ఉ.వి. సంఖ్య 33. ఆదివర్వము పూర్తిగనున్నది. 187 కమ్మలు. ప్రతిమంచిస్థితిలో నున్నది. ద్రోణపర్వపు కమ్మలు కొన్నిగలవు కమ్మలలో 34,79,82,83,84,89,95 సంఖ్యలు గలవి లేవు.

6. ఋ.ఉ.వి. సంఖ్య 63. ఆదిపర్వము అసంపూర్ణప్రతి 4వ కమ్మనుండి గలదు. పరిమాణము 15"×1న్నర" 179 కమ్మలు వ్రాఁతమంచిది శివపురపు శ్రీశైలపతి పలూరి వెంకయ్య నిమిత్తము వ్రాసెను. "ఎనమదల వీరేశ్వరా నీవేకలవు" భ్రమరాంబా చెన్నమల్లికేశ్వరా నీవేకలవు" అని గ్రంథారంభమునఁగలదు. తేదీ అంగీరస మార్గశీర్ష బ॥ దశమీ ఆదివారము శ్రీఅమరేశం రాజేశ్వరశర్మగారు బహూకరించిరి.

7. ఊ.ఉ.వి. సంఖ్య 74. ఆదిపర్వము అసమగ్రము అష్టమాశ్వాసములోని 144వ పద్యమువఱకు గలదు. మంచిస్థితి. ఆంధ్రసాహిత్య పరిషత్తు కాకినాడ.

8. ఎ.ఉ.వి. సంఖ్య 75 ఆదిపర్వము. సంపూర్ణము స్థితిమంచిది. పింగళనామ సంవత్సర శ్రావణ శు॥ చతుర్దశీ వారమిందులేదు ఆంధ్రసాహిత్యపరిషత్తు కాకినాడ.

9. ఏ.ఉ.వి. సంఖ్య 76. ఆది, సభా, ఆరణ్యపర్వములు కొన్నిభాగములు లేవు. విరాటపర్వము 4వ ఆశ్వాసమువఱకు కలదు. స్థితిమంచిది. వ్రాఁతలో తప్పులున్నవి. శార్వరి వైశాఖ శు॥ విదియ శనివారం (6–5–1780) చింతలపూడి వారి ప్రతిలో నున్నప్రకారము విప్పర్ల బలరాములు వ్రాసినవి. ఆంధ్రసాహిత్య పరిషత్తు కాకినాడ.

10. ఐ.ఉ.వి. సంఖ్య 80. ఆదిపర్వము సమగ్రము పరిమాణము 17"×1.3". 193 కమ్మలు. మంచిస్థితి. వ్రాయసగాని పేరు– సంజీవకవి. ఈవిషయమొకపద్యములో చెప్పఁబడినది. 'పాయకపాకశాసనికి' 1–1–25 అనుపద్యమిందుఁ గానరాదు. ఆం.సా.ప కాకినాడ.

11. ఒ ఉ.వి. సంఖ్య 91. ఆదిపర్వము సమగ్రము. పరిమాణము 18 8'' × 1 3'' 195 ఆకులు వ్రాత తీరంత శ్రేష్ఠముగాలేదు. ఆ సా ప. కాకినాడ.

12. ఓ ఉ.వి. సంఖ్య 94. ఆదిపర్వము సమగ్రము పరిమాణము 17'' × 1 5'' 180 కమ్మలు. వ్రాతచక్కనిది జయ శ్రావణశు॥ దశమీ శుక్రవారము (14–7–1654) పులివేట తిమ్మప్ప ప్రతిననుసరించి వ్రాయఁబడినది. వ్రాయసగాని పేరిందు కానరాదు ఆ సా ప. కాకినాడ.

13. ఔ.ఉ.వి సంఖ్య 96. ఆదిపర్వము సమగ్రము ప్రతిమంచిదే కాని చేతప్పులధికము. వ్రాలు పెద్దవి చక్కనివి. కుంతీపురాగ్రహారమునందలి సుబ్బారాయని కుమారుఁడు సీతారామునకుఁ జెందినది. (ఈకుంతీపురాగ్రహారము తూర్పు గోదావరి మండలములోని పిఠాపురము కాఁదగునా? అచ్చట కుంతీమాధవుని ఆలయము గలదు). ఆ. సా. ప కాకినాడ.

14. క ఉ వి. సంఖ్య 99. ఆదిపర్వము సమగ్రము. ప్రతిమంచిస్థితిలో నున్నది. కమ్మకొక వైపు దిద్దుబాట్లుకలవు. వ్రాఁతమంచిది. వికారి పుష్య శు॥ దశమీ సోమవారము (17–1–1780) కశాంబి రామస్వామికి పాపయ్య యనునాతఁడు వ్రాసి యిచ్చినది. ఆ సా ప. కాకినాడ

15. చ ఉ.వి. సంఖ్య 110 ఆదిపర్వము సమగ్రము ప్రతిస్థితి మంచిది పరిమాణము 17'' × 1న్నర''. 189 కమ్మలు వాధూలస గోత్రుఁడు తఱకల్లు వాస్తవ్యుఁడునైన పేరనంది వేంకటకృష్ణభట్టు తనయుఁడు భాస్కరప్ప వ్రాసినది. క్రోధన పుష్య బ. చతుర్దశీ శనివారము [4–1–1746] ఆ సా ప. కాకినాడ.

16. ట.ఉ.వి. సంఖ్య 112. ఆదిపర్వము సమగ్రము ప్రతిమంచిస్థితిలో నున్నది పరిమాణము 16'' × 1న్నర'' 246 కమ్మలు. తనతప్పులను క్షమింపుఁడని వేడుకొనుచు వ్రాయసగాఁడు వ్రాసినపద్యముగలదు. గౌరవరము పోలమరాజాదిపర్వము నేదోమాతృకనుండి పూర్తిగ వ్రాసికొనెను. నల మాఘ శు. సప్తమీశనివారము [4-2–1797] (నట్టం సుబ్రహ్మణ్యముగారు ఆ. సా. ప. న కొసఁగినది )

17. త. ఉ. వి. సంఖ్య 119 ఆదిపర్వము అసమగ్రము సప్తమాశ్వాసమున 111 వ పద్యము వఱకును గలదు స్థితి మంచిది. పరిమాణము 17 న్నర'' × 1.2'' 265 కమ్మలు వ్రాఁతమంచిది. వ్రాయసగాఁడు మీనాక్షీ సోమసుందరులను, తన గురువు రామభద్రుని స్తుతించినాఁడు. నుదురుపాటి రామస్వామయ్యగారు ఆ సా. ప. కొసఁగినది. దక్షిణదేశమందలి ప్రతికానోపు.

18. ప ఉ. వి. సంఖ్య 126 ఆదిపర్వము అసమగ్రము అష్టమాశ్వాసము లోని 181 వ పద్యము వఱకుఁ గలదు 197 కమ్మలు స్థితి మంచిది. ఇదియును పైదాని వలె నుదురుపాటి రామస్వామయ్యగారు ఆ సా. ప. న కొసంగినదే గ్రంథారంభమున.

హరిదాసున్ వనవాసున్
పరిచిత పరమోపవాసు భాసురహాసున్
నిరుపమ నిగమాఖ్యాసున్
విరచిత కాశీనివాసు వేదవ్యాసున్

అను వ్రాయస గాని పద్యము బమ్మెర పోతనామాత్యుని అంత్యానుప్రాసము లను జ్ఞప్తికిఁ దెచ్చుచున్నది.

19 గ. ఉ.వి. సంఖ్య 143 ఆదిపర్వము సమగ్రము క్రిమిదష్టమైనది కాని చదువుటకు వీలగును పరిమాణము 17½" × 1 3" 105 కమ్మలు కార్వేటినగర సంస్థానము నుండి జయంతి రామయ్య పంతులుగారు సంపాదించినది. ఆ.సా.ప. కాకినాడ.

20 జ. ఉ. వి. సంఖ్య 197. ఆదిపర్వము సమగ్రము స్థితిమంచిది. పరిమాణము 18'' × 1½" 150 కమ్మలు. శ్రీయుతులు నండూరి రామకృష్ణమాచార్యులు గారు, ఓరుమళ్ల కామేశ్వరరావుగారు చిత్తూరు మండలము నుండి సేకరించి మహాభారత కార్యాలయము వారికి బహుమతిగా నొసంగినది. విశ్వావసు ఆణినెల 16 వ దినము. (10–7–1845) క్రొత్తింటి నాథమునుల కుమారుఁడు బంగారయ్య వ్రాసినది.

21. డ ఉ. వి సంఖ్య 198 ఆదిపర్వము సమగ్రము మంచిస్థితి పరిమాణము 17 8'' × 1½" 168 కమ్మలు. ఇదియును పై దానివలనే శ్రీయుతులు నండూరి రామకృష్ణమాచార్యులుగారు, ఓరుమళ్ల కామేశ్వరరావుగారు చిత్తూరుమండలము నుండి సేకరించి మహాభారత సంస్థవారికి బహుమతిగా నొసంగినది జయసంవత్సర చైత్ర శు॥ విదియా శనివారం (6–3–1714) నాటికి బూసె దాసన్న కుమారుఁడు కొండన్న తుంకూరి నారాయణచెట్టి కుమారుఁడైన వేంకటదాసుచెట్టికి వ్రాసియిచ్చినది.

22 ద. ఉ వి. సంఖ్య 200 ఆదిపర్వము సమగ్రము క్రిమిదష్టమైనను చదువుటకు వీలున్న ప్రతి పరిమాణము 18'' × 1.4" 195 కమ్మలు ఇదియును పై విధముగ మహాభారత సంస్థకు చేకూరినదే.

23. బ ఉ వి. సంఖ్య 201 ఆదిపర్వము అసమగ్రము అష్టమాశ్వాసపు 214 వ పద్యము వఱకుఁ గలదు ప్రతిస్థితి మంచిదైనను కమ్మలు పెళుసెక్కినవి. పరిమాణము 17½" × 1 4''. 215 కమ్మలు. ఇదియును పై విధముగ మహాభారత సంస్థకు చేరినదే. (ఆదిపర్వ పరిష్కరణానంతరము తాళపత్రప్రతులలోఁ గొన్నింటిని కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్తు వారికి పంపివేయుటచే, 32, 33, 74, 75, 76, 96, 99, 126 ప్రతుల విశేష వివరము లిచ్చుటకు వీలులేకపోయినది.)

మా దగ్గర నున్న తాళపత్ర ప్రతులు – కొన్ని మిక్కిలి ప్రాచీనము లైనవి.

| | |
|---|---|
| ఉ. వి. సంఖ్య 95 | 14–7–1654 |
| ,, ,, 198 | 6–3–1714 |
| ,, ,, 110 | 4–1–1746 |
| ,, ,, 76 | 6–5–1780 |

24. ఖ. 532/S. ఉస్మానియా విశ్వవిద్యాలయము లోని సంస్కృత అకాడమీ వారివి. (ప్రస్తుతము విశ్వవిద్యాలయ గ్రంథాలయము నందున్నవి.) ఆది, సభా అరణ్య పర్వములు. ఏ కొలది ఆకులో తప్ప ఆది, సభాపర్వములు పూర్తిగను, అరణ్యపర్వము 4 వ ఆశ్వాసము చివరకును గలవు. పరిమాణము 18" × 1½" 302 కమ్మలు. శోభకృన్నామ సంవత్సర భాద్రపద బ॥ శుక్రవారము నాటికి గలం అచ్చన్న తమ్ముడైన లక్ష్మీనరసునకు పలవాయి చెల్లయ వ్రాసియిచ్చినది. ఈ తేది 1722, 1782, 1842 సంవత్సరములతో సంవదించుచున్నను 1782 సంవత్సరమే ప్రతి లేఖనపు తేదీగా గ్రహింపఁబడినది.

25. న. ఆంధ్ర విశ్వవిద్యాలయము వారిది సంఖ్య 3654 ఆది, అరణ్య, మహాప్రస్థాన, స్వర్గారోహణ పర్వములు సమగ్రములు. 426 కమ్మలు 12780 గ్రంథములు (32 అక్షరము లొక గ్రంథము) వ్రాఁతచక్కనిది కుదురైనది. మహారాజ రాజశ్రీ సీతారామచంద్రరంగారావు బహద్దరుగారికి వెల్లా అచ్చి అప్పయ్య వ్రాసి దాఖలుచేసినది. వ్రాయసగాఁడు తేదీ సూపుట లేదు. (పండిత శ్రీ కొమ్మన మంచి జోగయ్య శర్మగారుపాఠభేదములు గుర్తించి యిచ్చిరి.)

26. మ. ఆంధ్ర విశ్వవిద్యాలయము. T. 1111/N–18-1. ఆదిపర్వము. అసమగ్రము అష్టమాశ్వాసములో 197 వ పద్యము వఱకే కలదు. ప్రాఁతప్రతి శిథిలము. వ్రాతచక్కనది. 45 × 14 సి యం. 178 కమ్మలు. 4984 గ్రంథములు. పండిత కొమ్మన మంచి జోగయ్య శర్మగారు పాఠభేదములు గుర్తించిరి.

27. య. అడయారు గ్రంథాలయము. సంఖ్య 74758 ఆదిపర్వము. సమగ్రము. వ్రాఁతచక్కనిది. ప్రతి మంచిస్థితిలో నున్నది. శ్రీ కాళిదాసు సూర్యనారాయణ గారు (మదరాసు) పాఠభేదములు గుర్తించిరి

28. ర. అడయారు గ్రంథాలయము. సంఖ్య. 75067. ఆదిపర్వము సమగ్రము మంచిస్థితి కొజ్జుపాటి గంగరాజు వ్రాసినది. తేదీలు రెండు విధములుగా నున్నవి. మొదటిది పరీధావి మార్గశిర బ 3 జయవారము. రెండవది. (అష్టమాశ్వాసము చివర) పార్థివ వైశాఖ బ॥ తృతీయా శనివారము రెండవ తేది సంవత్సరము ననుసరించి మొదటనే రావలసి యుండెను వ్రాయవకాడిట్లు ఇచ్చుటకు కారణము దురూహ్యము శ్రీ కాళిదాసు సూర్యనారాయణగారు పాఠభేదములుగుర్తించిరి

29. గి. ముద్రిత ప్రతి ఆదిసభాపర్వములు రావుసాహెబు గిడుగు రామమూర్తి పంతులు గారు గుర్తించిన పాఠములు $గి_1$ తంజావూరి సరస్వతీ మహలు గ్రంథాలయ ప్రతుల నుండి వారికొఱకు సేకరింపఁబడిన పాఠములు.

30. గ$_1$ పైదానివలెనే శ్రీ రామమూర్తి పంతులుగారు 1847 లో శ్రీ పశవస్తు చిన్న యసూరిగారిచే ప్రచురింపఁబడిన ప్రతినుండి సేకరించిన పాఠములు (గి. గ$_1$ ప్రతుల విషయ మీ ఉపోద్ఘాతమం దందు ముందే చెప్పఁబడినది.)

31 ల. ఇది మద్రాసు ప్రాచ్య లిఖితపుస్తకశాలలో నున్నది. శ్రౌనుదొరగారు పరిష్కరించి సిద్ధముచేసిన కాగితపుఁ బ్రతి పండిత బులుసు వేంకట రమణయ్యగారు పాఠభేదములు గుర్తించిరి

32 వ. పై శ్రౌనుదొరగారి ప్రతిలో నున్న అన్యపాఠములు. ఇదిదొరవారితర ప్రతులనుండి గ్రహించిన పాఠములు పండితబులుసు వేంకట రమణయ్యగారు పాఠభేదములు గుర్తించిరి. (శ్రౌనుదొరవారి ప్రతుల వివరములు పీఠికలో నొసంగఁ బడినవి.)

33 వా. మేము ప్రధానాధారముగా గ్రహించిన వావిళ్ళవారి ముద్రితప్రతి (Vulgate) గిడుగు రామమూర్తి పంతులుగారు పాఠభేదపరిశీలనకు 1914 వావిళ్ళ ముద్రణ మును గ్రహించిరఁట. డా. చిలుకూరి నారాయణరావుగారు సంస్కరించిన నన్నయకృత మహాభారతాంతర్గతమగు గరుడోపాఖ్యానమునకుఁ గూడ ప్రాతి పదిక వావిళ్ళ ముద్రణమే

వావిళ్ళ ముద్రణమొక్కటే సమధ్య ధారాళముగా లభించుచున్నది విద్వాంసులు పెక్కుమంది వావిళ్ళ ముద్రణము పైనే దృష్టి నిలిపిరనుట నిర్వివాదము 1950 సంవత్సరపు ముద్రణమును, తరువాతి వావిళ్ళముద్రణమును మేము విని యోగించితిమి.

34. వీ. రావుబహద్దరు కందుకూరి వీరేశలింగం పంతులుగారి చేతను, రాయదు మానవసయ్య శాస్త్రుల వారిచేతను పరిష్కరింపఁబడి, వేమూరి వేంకటకృష్ణ మ చెట్టి అండ్ సన్సువారిచే 1901లో ప్రకటితమైన ముద్రితప్రతి. మూఁడు సంపుటములు. ఇది ఈనడుమనే మాకుచేరినది. దీనినిగూర్చి పూర్వమే వివరించితిమి.

35. శ. ఆలూరి ఏకామ్రజోస్యులవారిచే 1851వ సంవత్సరము ప్రాంతమున ప్రచురితమైన ముద్రితప్రతి. ఇండియాఆఫీసు లైబ్రరీ [లండను] నుండి మాకుచేరిన ఛాయాచిత్ర ప్రతి. అచ్చుతప్పు లచ్చటచ్చటఁగలవు ముద్రిత ప్రతిలో శకట రేఫమును విధిగా పాటింపఁబడి యుండలేదు.

36 ష. విశ్వవిద్యాలయోపాధ్యాయులైన కరాలపాటి రంగయ్యగారిచే 1852 లో సంస్కరింపఁబడి ముద్రితమైన ప్రతి దీనిపరిష్కరణ పాండితీ స్ఫోరకముగా నున్నది. ఇది ఏకామ్రజోస్యుల ప్రతికంటె శ్రేష్ఠమైనది.

37. స. పాఠనిర్ణయము చేయునపుడు మేము వావిళ్ల ముద్రణమునందలి అధోజ్ఞాపికలలోని పాఠభేదములనుగూడఁ బరిశీలించి యుంటిమి, వావిళ్ళభారత పరిష్కర్తలు గ్రంథమున వేఱుపాఠమును గ్రహించినను దాము చూచిన యితరపాఠముల నధోజ్ఞాపికలలో నొసంగియుండిరి.

38. ళ. ఇది సంశోధిత ముద్రణసూత్రములకు సన్నిహితముగా నుండుటచేఁ గొందఱు మిగిలిన వారికన్న దీనికధిక ప్రాధాన్యమొసంగుచున్నారు. ఇటీవల నిది సులభముగా దొరకుటలేదు.

[1] "ఆనందాశ్రమ గ్రంథమాల" యనెడు శీర్షికతో మహాభారత, భాగవతాది పూర్వ కవి ప్రణీత గ్రంథములు కొన్ని వెలువడినవి. ఈ గ్రంథమాలాధికారులు మొదట వేమూరి వేంకటకృష్ణమచెట్టి, ఏ కన్నన్‌చెట్టిగార్లు తరువాత రామా అండ్ కంపెనీ (ఏలూరు) వారు. ఆనందముద్రణమును గూర్చి యిదివఱకు నుడువఁబడినది

39. ళ. [1] ఆనంద ముద్రణమునందలి అధోజ్ఞాపికల లోని పాఠభేదములు వావిళ్ళ ముద్రణము లోని పాఠాంతరముల కిచ్చినట్లుగనే దీనికి నొక సంకేతాక్షరము నొసంగితిమి. ఇతరాధార గ్రంథములు ఇతరాధారముల నుండియు సహాయ గ్రంథముల నుండియుఁ గూడఁ మేము పాఠాంతరములను గ్రహించినట్లు చెప్పియుంటిమి వాని నిచ్చట నిచ్చుచున్నాము.

అ క-1. క్రీ శ. 1656 లో రచితమైన లక్షణ (ఛందో) గ్రంథము కాకునూరి అప్పకవి దీనికి కర్త. లక్షణ గ్రంథములలోనిది బహుళ ప్రచారము గలది యగుటయే గాక వివాద గ్రస్తమైనది కూడను. ఆంధ్రశబ్ద చింతామణియను వ్యాకరణ గ్రంథమునకు పద్య గద్యరూపమగు వ్యాఖ్యానగ్రంథమైనను, అప్పకవి దీని ప్రధానముగా నొక ప్రామాణికచ్ఛందో గ్రంథముగాఁ బరిణమింపఁ జేసినాఁడు ఛందోవిషయములకు లక్ష్యము లొసంగుటకై అప్పకవి ఆంధ్రమహాభారతమందలి పద్యము లెన్నో యిందుద్ధరించి యున్నాఁడు

ఆనం. 2. ఆనందరంగ రాట్ఛందము. క్రీ.శ. 1750 ప్రాంతమున కస్తూరిరంగ కవిచే రచింపఁ బడినది. ఆనాఁడు దక్షిణభారతమున ఫ్రెంచి రాజకీయవేత్తగా పేరొందిన డూప్లే యను దొరయొద్ద దుబాసిగా పనిచేసిన ఆనందరంగ పిళ్ళకిది యంకితము చేయఁబడినది. డూప్లే సమకాలికులు పెక్కండ్రను రంగకవి తన అవతారికలో పేర్కొనియున్నాఁడు. తనకు ముందు వెలసిన లక్షణవేత్తలను, వారి లక్షణ గ్రంథములను పేర్కొనియు నితఁడేలకో అప్పకవి నామమును విస్మరించియున్నాఁడు రంగకవి పేర్కొనిన గ్రంథములు కొన్ని నేఁడు నామమాత్రావశిష్టములు సాంబనిఘంటు వీతని కృతంతరము ఇతఁడును మహాభారతము నుండి పెక్కు పద్యముల నుదాహరించి యున్నాఁడు.

కవి 3. కవిసంజీవని. ముద్దరాజు గణపాత్యుని కుమారుఁడైన రామన దీనికర్త. ఇది 1930 లో వావిళ్ళవారిచే ముద్రితము. రామభద్రుని సోదరుఁడగు పెదరామనయె సూరన రాఘవ

1. మనగ్రంథముద్రాపకులు ముద్రణ సంవత్సరము నిచ్చుటలో నొక నియమము ననుసరించి యుండలేదు. ఈవిషయమున వారు తగినంత శ్రద్ధచూపినచో, ఉన్నత సాహిత్య విమర్శకు సేవచేసిన వారగుదురు. గ్రంథముద్రణకాలము లేకపోవుటచే మహాభారత ముద్రణములచరిత్ర తెలిసికొనుట దుష్కరమగుచున్నది. ఉదాహరణకు రామా అండ్ కంపెనీవారు 1948 లో శాంతిపర్వము వెలయించిరి. కాని భీష్మద్రోణపర్వముల యందు ముద్రణకాలము నొసఁగరైరి.

పాండవీయ వ్యాఖ్యాత. ప్రాచీన గ్రంథముల నుండియు ముఖ్యముగా మహాభారతము నుండియుఁ రామన పెక్కు పద్యములను లక్ష్యములుగా నుదాహరించి యున్నాడు. ఇందు మూఁడు అధ్యాయములు లేక తరంగములు గలవు. 16 వ శతాబ్ది చివర నీకవి వెలసి యుండవచ్చును.

తి _ 4. సర్వలక్షణ సారసంగ్రహము: క్రీ. శ. 18 వ శతాబ్ది పూర్వార్ధమున జీవించిన సుప్రసిద్ధుఁడైన కూచిమంచి తిమ్మకవి దీనిని రచించెను. అతఁడు తూర్పుగోదావరి మండలమున పిఠాపురమునకు సమీపమున నున్న కందరాడ, చంద్రంపాలెము అను గ్రామములకుఁ జెందినవాఁడు తిమ్మకవి పెక్కు గ్రంథములు రచించెను. వానిలో రసికజనమనోభిరామము, నీలాసుందరీ పరిణయము, అచ్చ తెనుఁగు రామాయణము అనునవి ముఖ్యములైనవి సర్వలక్షణసార సంగ్రహమున ఛందోవ్యాకరణాది విషయములు చెప్పఁబడినవి దీనిని శ్రీ నందివాడ చలపతిరావుగారు మంజువాణీ ముద్రణాలయమున 1927 వ సంవత్సరము నందు ముద్రించిరి. తిమ్మకవి తాను జెప్పిన ఛందోవ్యాకరణాంశములను సమర్థించుటకై మహాభారతము మున్నగు ప్రమాణగ్రంథముల నుండి ప్రయోగముల నుద్ధరించియుండెను చివరి అధ్యాయమున నతఁడు సాధు శకట రేఫములతోఁ గూడిన పదములను గూర్చి వివరించియుండెను ఆ రోజులలోఁ గవుల ప్రసిద్ధికి సాధుశకటరేఫ విజ్ఞానము ప్రముఖముగా భావింపఁబడుచుండెను. మహాకవి బమ్మెరపోతరాజు యతిప్రాసలలో రేఫ శకట రేఫములను గలిపిన కారణమున అప్పకవియు మఱికొందఱు లాక్షణికులును అతనిని ప్రామాణికకవిగాఁ బరిగణింప నిరాకరించిరి, తిమ్మకవి వారి నిరసనమును విమర్శించి పోతరాజు కవితామాధుర్య మహత్త్వముల నుత్సాహపూరితుడై ప్రశంసించి యుండెను

క సం. 5. కవి సంశయ విచ్ఛేదము దీనిని 18 వ శతాబ్దియందుండిన (1720_1785) అడిదము సూరకవి రచించెను. అతఁడు బహుగ్రంథకర్త. అతని రచనలలో కవిజనమనోరంజనము ప్రబంధము ప్రముఖమైనది. అతఁడు విశాఖపట్టణ మండల మందలి చీపురుపల్లి తాలూకాలోని రామచంద్రపుర గ్రామమున నివసించెను. శ్రీ వీరేశలింగం పంతులుగారు సూరకవి గ్రంథములను సేకరించి 1899 వ సంవత్సరమున ప్రచురించినట్లు తెలియుచున్నది. కవిసంశయ విచ్ఛేదము వావిళ్ళ వారిచేతను శ్రీ పరవస్తు వారిచేతను రెండు మూఁడు పర్యాయములు ప్రకటింపఁబడినది. మేము 1955 వ సంవత్సరమున ముద్రింపఁబడిన వావిళ్ళ వారి ప్రతి నుపయోగించియుంటిమి. అందు సూరకవి వ్యాకరణమునకును ప్రయోగములకును సంబంధించిన ప్రత్యేకాంశములను వివరించి మహాభారతము నుండియు నితరగ్రంథముల నుండియు లక్ష్యముల నుదాహరించి యుండెను. అతఁడు రేఫ శకట రేఫములతోఁ గూడిన పదముల విషయము కూడ నొక్కచో విశదీకరించి యుండెను. తెలుఁగునందలి తద్భవపదములను గూర్చి వివరించు నీ గ్రంథమందలి భాగము మిక్కిలి ప్రశస్తమైనదని విద్వాంసుల యభిప్రాయము.

గణ. 6. ఆంధ్రప్రయోగ రత్నాకరము. ఇది మధుర విజయరంగ చొక్కనాథుని సోదరుఁడైన ముద్దళగిరి కొలువున నుండిన గణపవరపు వేంకటకవి (1674) రచించిన సర్వలక్షణ శిరోమణియను బృహద్గ్రంథమందలి ఏకదేశముగాఁ గనిపించును. సర్వలక్షణ శిరోమణి యందుఁ గావ్యమునకు సంబంధించిన వ్యాకరణము, ఛందస్సు, నిఘంటువు

మొదలైనవి కలవు. అందు ప్రయోగరత్నాకరము ఛందోవిషయములను వివరించును సర్వలక్షణ శిరోమణి యందలి వ్యాకరణభాగమే ఆంధ్రకౌముదియను పేరం బ్రకటింపం బడినట్లు కనిపించును. ఛందోభాగమింతవఱకును బ్రకటితము కాలేదు.

ఆంధ్రప్రయోగ రత్నాకరము తంజావూరు సరస్వతీమహలు గ్రంథాలయమందలి ఆంధ్ర లిఖితగ్రంథముల వర్ణనాత్మకపట్టికలో 290, 291 పుటలందు 696, 698 సంఖ్యలతోం గానవచ్చుచున్నది. తంజావూరు గ్రంథాలయమందలి యాంధ్ర లిఖితగ్రంథముల ప్రతులాంధ్ర విశ్వవిద్యాలయమున భద్రపఱుపబడియున్నవి. 1. ఆంధ్రప్రయోగ రత్నాకరము. 2. ఛందము. 3. సర్వలక్షణసారము. 4. సరసాంధ్ర వృత్తరత్నాకరము. 5. వీరభూపాలీయము 6. లక్షణదీపిక అనునాఱు లిఖితగ్రంథములనుండి మహాభారతోద్ధరణములను సేకరించి పంపిన శ్రీ డా. యమ్. వి. సత్యనారాయణ గారికి మేమెంతయు కృతజ్ఞులము. ఇందలి తుది మూండు గ్రంథములును మదరాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము నుండి గ్రహింపబడినవి. వెంకటరవి కొన్ని యుదాహరణములు తాను ప్రాచీనలాక్షణికులనుండి గ్రహించినట్లును, కొన్నిటిని తాను స్వయముగ సేకరించినట్లను, జెప్పుకొనియున్నాడు.

ఛ. 7. ఛందము, అజ్ఞాతకర్తృకమైన యీ యప్రకటితచ్ఛందోగ్రంథము తంజావుర గ్రంథపట్టికలో 295 పుటయందు 705 నుండి 712 సంఖ్యలతోం గానవచ్చుచున్నది. ఇది మహాభారతమునుండియే కాక పెక్కితర గ్రంథముల నుండియు గ్రహింపంబడిన యుదాహరణపద్యముల సంకలనము. కవి కొన్ని సిద్ధాంతములను జెప్పి ప్రసిద్ధకవుల ప్రయోగములనుండి వానికి లక్ష్యము నొసంగుచుండును.

ల.సా. 8. సర్వలక్షణసారము- అప్రకటితమైన యీ ఛందోగ్రంథము తంజావుర గ్రంథపట్టికలో 297 పుటయందు 714 సంఖ్యతోం గాన వచ్చుచున్నది. దీనిని రచించినవాండు రంగయ. అతనికాలము తెలియదు. సాధారణముగా పలువురు ఛందోగ్రంథకర్తలు వర్ణముల తాంత్రిక ప్రాధాన్యమును గూర్చియు, పద్యమున ప్రత్యేకవర్ణములను ప్రత్యేకస్థానములలో వాడుట వలనం గలుగు సదసత్ఫలితములను గూర్చియు వివరించి చెప్పుచుందురు. సర్వలక్షణసారమున గ్రంథకర్త రేఫశకటరేఫములతోం గూడిన పదములను కూర్చి కూడ కొంత చర్చ కావించియుండెను

వీర. 9. వీరభూపాలీయము— అప్రకటితమైన యీ కాగితపు లిఖితప్రతి మదరాసు నందలి ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథభాండాగారమున 1319 సంఖ్యతోం గానవచ్చుచున్నది. (చూడు. ఆంధ్ర లిఖిత గ్రంథముల వర్ణనాత్మక పట్టిక 5వ సంపుటము — వ్యాకరణచ్ఛందో నిఘంటువులు) వీరభూపాలీయము అప్పకవీయము వలె ఆంధ్రశబ్ద చింతామణి యందలి సూత్రములను వివరించు గ్రంథము. ఇది వచనభారత కర్తయు, మైసూరు దండనాథుఁడునైన కళువె వీరరాజున కంకితము చేయంబడినది. వీరభూపాలీయమున మహాభారతమునుండి యుద్ధరింపం బడిన లక్ష్యములు కొన్నికలవు.

వృ. 10. సకలసాంద్రవృత్తరత్నాకరము — అప్రకటితమైన యీ కాగితపు ప్రతి మదరాసు నందలి ప్రభుత్వ ప్రాచ్యలిఖిత భాండాగారమున 1320 సంఖ్యలో గానవచ్చుచున్నది. దీనిని రచించినవాఁడు వెంగనామాత్యుని పుత్రుఁడును, మల్యాద్రి నృసింహస్వామి భక్తుడునైన వెల్లటూరి లింగనమంత్రి. మల్యాద్రి నెల్లూరు మండలమునందలి కందుకూరు తాలూకాలోని మాలెకొండ. అందుచే నీ గ్రంథము నొక్కొక్కప్పుడు మల్యాద్రిచ్ఛందమనియుఁ బేర్కొనుచుందురు. ఇందు వృత్తములు యతిప్రాసలు వివరింపఁ బడినవి. గ్రంథకర్త యైదాశ్వాసములు రచించెనుగాని చివరియాశ్వాస మసంపూర్ణముగా నున్నది. ఈ గ్రంథమునకు సంబంధించిన తాళపత్రప్రతికూడ నొకటియున్నది. కాగితపు ప్రతికిదే మూలమై యుండవచ్చును.

రఘు. 11: లక్షణదీపిక— అప్రకటితమైన యీకాగితపు లిఖితప్రతి మదరాసు ప్రాచ్యలిఖిత భాండాగారమున 1929 (1329?) సంఖ్యలోఁ గానవచ్చుచున్నది. గ్రంథకర్తపేరు గ్రంథమునఁ బేర్కొనఁబడక పోయినను ఈ గ్రంథము రచించినవాఁడు వార్తాకవి రఘునాథయ్య అని యూహింపఁ బడుచున్నది. ఇందనేక విషయములు వివరింపఁ బడియున్నవి. వ్యాకరణచ్ఛందోఽలంకార శాస్త్ర విషయములుకూడ నిండుట చోటుచేసికొని గ్రంథమునకు సమగ్రత్వము కల్పించు చున్నది. ఇందువర్ణములు, ధ్వనులు— వాని యావిర్భావము, వాని సదసల్లక్షణములు మున్నగువానికిఁ అకు చాలస్థలము వినియోగింపఁ బడినది. ఇందు రూపకలక్షణములుకూడ సంగ్రహముగ నొసంగఁబడినవి. రేఫ శకటరేఫముల చర్చకలదు. మహాభారతమువంటి గ్రంథములనుండి ప్రయోగము లుద్ధృతములైనవి.

మదరాసునందలి ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయపు వర్ణనాత్మక పట్టికలో 1254 సంఖ్యతోఁగూడిన కాగితము మఱియొకటి యున్నది. రేఫ ఱకారవచ్ఛబ్దజ్ఞాపక లోకోపకారకము — అని యాగ్రంథమునకు పేరు. గ్రంథకర్తపేరు తెలియదు. ఇది ఇఱుతెఱఁగుల రేఫముల ప్రయోగము లుదాహరించుటకు మహాభారతము నుండియు, ఇతర ప్రమాణ గ్రంథముల నుండియు పద్యముల నుద్ధరించియున్నది.

శక. 12. శకటరేఫవిర్ణయము— ఇది చాలకాలముక్రింద పలూరు మంజువాణీ ముద్రణాలయమున ముద్రితమైనది. భారత కూలంకష వ్యాఖ్య రచించిన భారతము లక్ష్మీపతి సోమయాజియే దీనినికూడ రచించెను. రేఫ శకటరేఫ సహితములైన పదముల యుదాహరణములకుఁ జూపుటకై యతఁడు మహాభారతమునుండి యనేకపద్యముల నుద్ధరించి యుండెను.

ద్వి. 13. ద్విరేఫ వర్ణదర్పణము— పేరు సూచించు చున్నట్లీగ్రంథము రేఫశకటరేఫ ధ్వనుల ప్రయోజనమును గూర్చి వివరించును. దీనిని రచించినవాఁడు 19 శతాబ్ది పూర్వార్ధమున నివసించినవాఁడును, తూర్పుగోదావరి మండలమునందలి నీలపల్లి నివాసియునగు ఓగిరాల రంగనాథకవి. ఈ గ్రంథము

శ్రీ పూండ్ల రామకృష్ణయ్యగారిచే సంపాదితమై 1903 వ సంవత్సరమున ప్రకటింపఁ బడినది. తనకుఁ బూర్వముండిన పెక్కురు లాక్షణికులవలెనే రంగనాథకవియు రేఫ శకటరేఫ సహిత పదముల నుద్ధరించుట యందధిక శ్రద్ధచూపి వివిధ ప్రామాణిక గ్రంథములనుండి ప్రయోగము లొసంగి యుండెను. ఇందు భారతము, భాగవతము భాస్కర రామాయణము మున్నగు గ్రంథములన్నిటికిని భా— యను సంజ్ఞయె వాడఁబడి యుండుటచే నేప్రయోగ మెచ్చటిది యను విషయమున పాఠకులకుఁ గొంత క్లేశము కలుగును. అదియటుండ నితర రంగములందలి పండితులవలెనే తెలుఁగున సాధుశకటరేఫములను గూర్చి వివరించిన విద్వాంసులలోఁ గూడ నేపదమున నేరేఫయున్నది యను విషయమున నభిప్రాయభేదములు కనిపించును. అందుచే నొకరు సాధురేఫమున కుదాహరించిన పద్యమునే వేఱొకరు శకట రేఫమున కుదాహరించు చుందురు. ఈ కారణముచే పాఠకుల మనస్సులలోఁ గొంత కలఁత కలుగుచుండును. తాళ్ళపాక అన్నమాచార్యుని కుమారుఁడైన పెదతిరుమలాచార్యుఁడు కూడ రేఫశకటరేఫ నిర్ణయమును గూర్చి యొక గ్రంథము వ్రాసియుండెను. అతఁడుకూడ మహాభారతము నుండి రేఫ శకటరేఫద్వయములుగల పదములను పదబంధములను సూచించి యుండెను. పద్యములు సమగ్రముగా నీయఁబడని కారణమున నీగ్రంథము మనకంతగా నుపయోగ పడజాలదు.

## వ్యాఖ్యలు.

భా. కూ. 14. భారతము లక్ష్మీపతి సోమయాజి రచించిన యీ గ్రంథమును గూర్చి యిది వఱకుఁ జెప్పఁబడినది.

భా. సం. 15. భారత సంజీవని — దండిగుంట సూర్యనారాయణ శాస్త్రివారును, చదలువాడ సుందరరామ శాస్త్రులవారును రచించిన యీగ్రంథ మిదివరకు పేర్కొనఁ బడినట్టిదే.

## వ్యాకరణములు

అ. పం. 16. అహోబల పండితీయము — దీనికి కవిశిరోభూషణమని నామాంతరము. హైదరాబాదు నందలి ఆంధ్ర రచయితల సంఘమువారు దీనిని 1965 లోఁ బ్రకటించి యుండిరి. అహోబల పండితుఁడు 17 వ శతాబ్ది చరమపాదమున నివసించి యుండెను. కవిశిరోభూషణము సంస్కృత భాషలో రచింపఁబడిన ఆంధ్ర శబ్ద చింతామణి యను ఆంధ్ర వ్యాకరణమునకు సంస్కృత వ్యాఖ్యానము. చింతామణి సూత్రములను వ్యాఖ్యానించుచు నహోబలుఁడచ్చటచ్చట నథర్వణకారికలనుఁ గూడ వివరించి యుండెను. ప్రయోగవిషయమున కవులందఱికిని ఆదికవియైన నన్నయయే పరమప్రమాణమని భావించు వారి కోవకుఁ జెందిన వాఁడీ యహోబలుఁడు. వ్యక్తీకరణ పారిశుద్ధ్యమున

తిక్కన వంటి మహాకవులుఁ గూడ నన్నయకు ద్వితీయులేయని యాతనియభి
ప్రాయము. అతఁడు నన్నయ పద్యములకు తఱుచుగను ఇతర ప్రామాణిక
కవుల పద్యములను క్వాచిత్కముగను నుదాహరించు చుండును

గు. 17 — గుప్తార్థప్రకాశిక — ఇది రాజమహేంద్రవరమునందలి ప్రభుత్వ కళాశాలలో
నాంధ్ర పండితుఁడుగా నుండిన కల్లూరి వెంకట్రామ శాస్త్రి గారిచే
(1857 – 1928) రచింపఁ బడిన బాలవ్యాకరణ వ్యాఖ్య. ప్రాచీన కాలమున
నాంధ్రశబ్దచింతామణి యాక్రమించిన గౌరవస్థానమును ఆధునిక కాలమున
పరవస్తు చిన్నయసూరి రచితమైన బాలవ్యాకరణ మాక్రమించు చున్నది.
బాలవ్యాకరణముపై మంచి వ్యాఖ్యానములు మూఁడు నాలుగున్నవి కాని
యందేదియు గుప్తార్థప్రకాశికను మించఁ జాలదు వెంకట్రామ శాస్త్రి
గారు ఆంధ్రసంస్కృతములం దుద్దండ పండితులు వారికి మహోపాధ్యాయ
బిరుదము కలదు. వారు బాలవ్యాకరణము శిష్టు కృష్ణమూర్తి గారు
రచించిన హరికారికావళికి యనువాదమో యనుకరణమో యని భావించి
యుండిరి. ఇతర పండితు లెవ్వరు నీ యభిప్రాయమును బలపఱిచి యుండ
లేదు. గుప్తార్థ ప్రకాశికలో మహాభారతము నుండి యుద్ధరింపఁ బడిన పద్య
ములు పెక్కు గలవు. అవి అప్పటికి ముద్రితములైన భారత ప్రతులనుండి
గ్రహింపఁ బడి యుండును. ఈ వ్యాఖ్య 1903 వ సంవత్సరమునకుఁ బూర్వమే
ప్రచురింపఁ బడినది.

ప్రౌ. 18. — ప్రౌఢవ్యాకరణము — ఇది శబ్దరత్నాకర నిఘంటుకర్తలైన బహు
జనపల్లి సీతారామాచార్యులవారిచే (1827–91) రచింపఁబడిన వ్యాకరణము.
వారు నిఘంటువును నిర్మించునపుడు బహు ప్రాచీన గ్రంథములను పరిశీలించి
యుండుటచే నందలి పెక్కు ప్రయోగములను సేకరించి ప్రౌఢవ్యాకరణమున
నుచితస్థలముల లక్ష్యములుగా నొసంగి యున్నారు ఆంధ్రశబ్దచింతామణికి
ధర్వణ కారికావళి వలె దీనిని బాలవ్యాకరణమునకు శేష గ్రంథమని చెప్ప
వచ్చును. చిన్నయసూరిగారు తమ బాలవ్యాకరణమున నాంధ్రము నందలి
పెక్కు ప్రయోగములకు లక్షణముఁ జెప్పి యున్నారు సీతారామా
చార్యులవారు ప్రౌఢవ్యాకరణమున వారు సాధింపని ప్రత్యేక ప్రయోగము
లకు సూత్రములు రచించి యున్నారు. సూత్ర నిర్మాణ క్రమమున బాల
ప్రౌఢ వ్యాకరణములకుఁ బోలికయే లేదు. చిన్నయసూరివలె సూత్రములు
నిర్మించు శక్తి తరువాతివా రెవ్వరికిని లభించియుండ లేదు. బాలవ్యాకరణ
మునకు వలెనే ప్రౌఢవ్యాకరణమునకును నాంధ్రపండితలోకమున నధికప్రసిద్ధి
యున్నది. దానికి రెండుమూఁడు మంచి వ్యాఖ్యానములు గూడ రచింపఁ
బడినవి.

ఆం. 19 ఆంధ్రభాషానుశాసనము — ఇది ఆంధ్ర విశ్వవిద్యాలయమున నాంధ్ర
సంస్కృత పండితులుగాఁ బనిచేసిన మల్లాది సూర్యనారాయణ శాస్త్రిల
వారిచే రచింపఁబడిన వ్యాకరణ గ్రంథము. వారు సుప్రసిద్ధవైయాకరణు
లగుటయే గాక పెక్కు గద్య పద్య కావ్యములు కూడ రచించి యుండిరి.

'ప్రయోగశరణమ్ వ్యాకరణమ్ము'ను ప్రాచీన సిద్ధాంతమున కనుగుణముగా వారు వ్యాకరణమును రచించి యుండిరి. చిన్నయసూరి మొదలైన పూర్వ వైయాకరణులు భాషా విషయమున నాంధ్ర కవీంద్రుల నందఱిని ప్రామాణికులుగా గ్రహింపక కవిత్రయము వారిని మాత్రమే యధికముగా గౌరవించి యుండిరి. ఇతరులను వారాధునికులుగా భావించి ద్వితీయ శ్రేణికిఁ జేర్చి యుండిరి. సూర్యనారాయణ శాస్త్రులవారి ప్రాంత సంప్రదాయము నుల్లంఘించి ప్రాచీన మధ్య యుగములందున్న మహాకవులందఱిని ప్రామాణికులుగా గ్రహించి వారి ప్రయోగముల ననుసరించి వ్యాకరణము రచించిరి ఈ విధముగా వారి వ్యాకరణము కొంత విశాలతరమగుటయే కాక ఆంధ్ర దేశమున నధిక ప్రచారమును గూడ పొందినది.

సం. 20 — ఆంధ్ర వ్యాకరణ సంహితా సర్వస్వము — ఇది నిజముగా నాంధ్రవ్యాకరణ సర్వస్వమే. ఆంధ్ర విశ్వవిద్యాలయమున నాంధ్ర పండితులుగా నుండిన వఝల చిన సీతారామస్వామిశాస్త్రిగారు దీనిని రచించిరి. వారు వైయాకరణ సార్వభౌములై వ్యాకరణ విషయములను గూర్చి పెక్కువ్యాసములు, గ్రంథములు రచించియుండిరి. ఆంధ్రశబ్ద చింతామణి కర్తృత్వ విషయమున లోకమున మతభేదములున్నవి. అది నన్నయ కర్తృకమే యని విశ్వసించు వారిలో శాస్త్రులవారొకరు. వైయాకరణ పారిజాతము, చింతామణి విషయ పరిశోధనము, బాలవ్యాకరణోద్యోతము, ద్రావిడభాషాసామ్యములు మున్నగునవి వారు రచించిన ప్రముఖ వ్యాకరణ గ్రంథములు. వారు ఆంధ్ర శబ్ద చింతామణి, అథర్వణకారికావళి, బాలవ్యాకరణము అను మూడింటి యందలి సూత్రకారికలను వ్యాఖ్యానించుచు వానికి సామరస్యము కల్పింప యత్నించి యుండిరి. వా ఖ్యాన సందర్భమున వారు మహాభారతము నుండి యనేక ప్రయోగముల ను రించి యుండిరి సందేహము గలిగినపుడు తాము తాళపత్ర ప్రతులను గూ పరిశీలించినట్లు వారు తెలిపియుండిరి.

బా. 21 : బాలకవి శరణ్యము — ఇది అప్పటికున్న వ్యాకరణములను గూర్చియు గ్రాంథిక భాషను గూర్చియు పండితులకుఁ గల యాశయములకు సవిమర్శముగా పరిశీలించు గ్రంథము. దీనిని రచించినవారు రావుసాహెబు గిడుగు వెంకట రామమూర్తి పంతులవారు. భాషాప్రయోగ విషయమున విశాలతరమైన దృష్టి వహింప వలెనని వాదించిన వారిలో వారు ప్రముఖులు. వారి వాదమునకు వ్యావహారిక భాషావాదమని పేరు. సంప్రదాయానుసారులైన విద్వాంసుల యనావశ్యక నియమములు యువరచయితలకు వెఱపు గొలుపుచున్నవనియు, అర్థములేని వ్యాకరణదాస్యము నుండి విముక్తులై వారు రచనలు సాగింపవలెననియు, జీవద్భాషలు పెక్కు శతాబ్దుల నుండి మారుచు వచ్చుచుండగా కవులు వాని యందలి క్రొత్త సౌందర్యము ననుసరించుచునే యున్నారనియు, వ్యాకరణవేత్తలు మాత్రమే శక్తిమత్తరమైన వ్యావహారిక భాషాప్రవాహము కడ్డగించి దానిలోఁ బడి కొట్టుకొని పోవుచున్నారనియు, అజ్ఞాతముగా నైనవారు వాడుక భాషయొక్క ప్రభావమునకు గుఱికాక తప్పదనియు వారి యభిప్రాయము.

బాలకవి శరణ్యమను పేరే అది యే ప్రయోగములతో రచింపఁ బడినదో తెలుపుచున్నది. రామమూర్తి పంతులుగారు తెలుఁగు కవులు స్వతంత్ర దృష్టితోఁ గావించిన ప్రయోగ సంపదను సేకరించి వానిని బాగుగా పరిశీలించి వ్యావహారిక భాషా ప్రవాహమే వాని కన్నిటికి నాధారమని నిరూపించి యుండిరి.

## నిఘంటువులు

మహాభారతోద్ధరణములను సేకరించుటకు మేము మూఁడు ముఖ్యములైన నిఘంటువులను బరిశీలించి యుంటిమి. అవి కాలక్రమానుగుణముగా నిట వివరింపఁ బడుచున్నవి.

ప్రౌ. 22. బ్రౌనుదొరవారి ఆంగ్లాంధ్ర నిఘంటువు· ఇది మొదట 1852వ సంవత్సరమునఁ బ్రచురింపఁబడి 1966లో ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి వారిచేఁ బునర్ముద్రింపఁ బడినది. మహాభారత విషయమున బ్రౌనుదొరగారు కావించిన కృషి యిదివఱకు బేర్కొనఁబడినది. వారినాఁటి కాంధ్రకవుల కాలములింకను బూర్తిగా నిశ్చయింపఁ బడియుండ లేదని తోఁచును. ఏలయన వారు తెలుఁగు భారతము సుమారు 1120 ప్రాంతమున రచింపఁ బడెనని వ్రాసియుండిరి. నన్నయభట్టు అప్పటికొక శతాబ్ది పూర్వమే నివసించి యుండినట్లు మనకిపుడు నిశ్చితముగాఁ దెలియును బ్రౌనుదొరవారు మహాభారతమును 'M' అను అక్షరముతోఁడను పర్వాశ్వాసపద్యములను సంఖ్యలతోఁడను సూచించుచుందురు. ఇపుడు లభించుచున్న ముద్రిత ప్రతులలో వారొసంగిన నిర్దేశములను గుర్తించుట క్లేశకరముగా నుండును. మహాభారతమును మొట్టమొదట సంఖ్యాక్రమమునకుఁ దెచ్చినవారు బ్రౌనుదొరవారేయని వారి వ్రాఁతలవలనఁ దెలియుచున్నది. ఈ సందర్భమున వారు మహాభారతము నందు కొన్ని చేర్పుమార్పులను జేసియుండిరి. ఉదాహరణమునకు "ఓహరి సాహరి" — అను సమాసమునకు వారు ఆంగ్లమున నర్థమును వివరించి మహాభారతమునుండి M 4–3–157 పద్యమును లక్ష్యముగా నుద్ధరించి యున్నారు వారు కావించిన సూచనమునుబట్టి యీ పద్యము విరాటపర్వము నందలి తృతీయాశ్వాసము నందు 157వ పద్యమై యుండవలయును. ఇప్పటి ముద్రితప్రతులలో నది 166వ పద్యముగాఁ గన్పడుచున్నది బ్రౌను దొర వారు తాము తెలుఁగుభాషయందు జ్ఞానము[1] సంపాదించిన విధమునొక్కచో వివరించి యున్నారు.

"[1] నేను 1817లో ఆంధ్రాక్షరములను నేర్చుకొంటిని 1822 లో దానిని సులభముగా మాట్లాడఁగల్గితిని. 1824 లో తెలుఁగు కవిత్వమును చదువనారంభించితిని. ఆ సంవత్సరము నందే ఆంధ్రాంగ్ల నిఘంటువు రచించుట కారంభించి స్వల్ప్యవధానముతో దానిని పదేండ్లకుపైగా కొనసాగించితిని. 1830 వ సంవత్సరమున ఆంగ్లాంధ్ర నిఘంటువును రచింప నారంభించి 21–7–1832 వ తేదిని ముగించితిని." — మదరాసునందలి ప్రభుత్వ ప్రాచ్య లిఖిత భాండాగారమునందలి ఆంధ్రలిఖిత గ్రంథముల వర్ణనాత్మక పట్టిక సంపుటము 5. పుట 713

శ.ర. 23. శబ్దరత్నాకరము ఇది తెలుఁగుపదములకు తెలుఁగర్థములొసంగుచు సుప్రసిద్ధ పండితులగు బహుజనపల్లి సీతారామాచార్యులవారు రచించిన గ్రంథము. దీనిని మొట్టమొదట మదరాసు స్కూలుబుక్ అండ్ లిటరేచర్ సొసైటీవారు 18 లో ముద్రించి యుండిరి. ఇంతవఱకు ముద్రింపబడిన తెలుఁగునిఘంటువుల కెల్ల తలమానికమైనది. తరువాత వెలువడిన నిఘంటువులెల్ల వీని ననుసరించి నట్టివే. దీనిని రచించుటకిరువది యైదేండ్లు పట్టెనని శ్రీమదాచార్యులవారు వ్రాసియున్నారు. వారు మహాభారతము నుండి పెక్కులక్ష్యముల నుద్ధరించిరి. వారి పాఠములు సాధారణముగా సుపరీక్షితములై యుండును వారు పర్వాశ్వాసముల సంఖ్యలే కాని పద్య సంఖ్యల నొసంగరు. అవికూడ నిచ్చినచో పాఠకులు లక్ష్యములను మూల గ్రంథములందు పరిశీలించుట కవకాశము హెచ్చుగా నుండెడిది.

సూ. 24 సూర్యారాయాంధ్ర నిఘంటువు. ఇది 8 సంపుటములుగా వ్రాయఁబడిన విస్తృతతరమైన నిఘంటువు. ఇంతవరకేడు సంపుటములు మాత్రమే ముద్రితమైనవి. ఇది కాకినాడయందలి ఆంధ్రసాహిత్య పరిషత్తు పక్షమున 1936 వ సం. నుండి ప్రచురింపఁ బడుచున్నది. పరిషత్తునకు రూపుదిద్దిన జయంతి రామయ్య పంతులుగారి సంపాదకత్వముననే మొదటి రెండు సంపుటములును వెలువడినవి. ఈ ప్రణాళికను శ్రీ పిఠాపుర మహారాజుగారు పోషించి యుండిరి. సూర్యరాయాంధ్ర నిఘంటువు తెలుఁగుపదములకు సమానములైన తమిళ కన్నడ పదముల నిచ్చియుండుటచే నది శబ్దరత్నాకరమునకు మెఱుఁగులు దిద్దినదని చెప్పవచ్చును. ఇందు మహాభారతమునుండియు నితర ప్రమాణ గ్రంథముల నుండియు లక్ష్యములు విరివిగా నొసంగఁబడియున్నవి. కొన్ని లక్ష్యములు జనవ్యవహారము నుండియు, ప్రాచీన శాసనముల నుండియుకూడ గ్రహింపఁబడినట్లు తోఁచును. ఇందు పర్వాశ్వాస పద్యసంఖ్యలు కూడ నొసంగఁ బడియుండుటచే మూలగ్రంథములందు ఆ పద్యములను వెదకుటకు క్లేశపడవలసిన యవసరములేదు.

## సంకలనములు

సిం. 25 మడికి సింగన - సకలనీతిసమ్మతము. ఈ సింగన పద్మపురాణమును కూడ రచించెను. అతడు సకలనీతి సమ్మతమును శ. 1342 (1420) సం న, కూర్చినట్లు చెప్పియున్నాఁడు. మానవల్లి రామకృష్ణకవిగారు సకలనీతి స తమును విస్తృతకవి పరంపరలో × సంఖ్యగా 1923 వ సంవత్సరమున ఆం। పత్రికా ముద్రణాలయమున ముద్రించియున్నారు మడికిసింగన వివిధ కవుల ండియు మహాభారతాది గ్రంథముల నుండియు రాజనీతికి సంబంధించిన పద్యములు గ్రహించి యీ గ్రంథరూపమున సంకలనము కావించెను. ఇందలక్ష్యములు ప్రాచీనములు నగు పెక్కు గ్రంథములనుండి పద్యము లుదాహృతములైనవి. అందుఁ గొన్ని శాశ్వతముగా నష్టములే యయిపోయినవి. శ్రీరామకృష్ణకవి గారు సకలనీతిసమ్మతమునకు నమూల్యమైన యుపోద్ఘాతము రచించి

యున్నారు అందు ప్రబంధమణిభూషణమను గ్రంథముకూడఁ బేర్కొనఁ బడినది. సింగన రాజనీతి సిద్ధాంతములను కామందకము, నీతిసారము, పంచతంత్రి, ముద్రామాత్యము, మహాభారతము, బద్దెన నీతి మున్నగు మూల గ్రంథముల నుండి సేకరించి యుండెను. మహాభారతమందు రాజనీతి ప్రసక్తి యధికముగాఁ గల శాంతి సభాపర్వములనుండియే యతఁ డెక్కువ పద్యముల నుద్ధరించి యుండెను

## ప్ర కీ ర్ణ ము లు

భా.ఫ.28. భారతఫక్కి. దీని నాకొండి వ్యాసమూర్తిశాస్త్రిగారు రచించిరి. దీనినిగూర్చి యిదివఱకు వివరింపఁ బడినది.

## స భా ప ర్వ ము

సభాపర్వ విషయమున మేము గ్రహించిన విమర్శన సాధన సామగ్రి క్రింద వివరింపఁ బడుచున్నది.

1. అ. ఉ. వి. సం. 5. ఆదిపర్వ సందర్భమునఁ బేర్కొన్న 5 వ సంఖ్యగల తాళపత్ర ప్రతియే. ఇందు 162 నుండి 201 వఱకుఁగల పత్రములలో సభాపర్వము నందలి రెండాశ్వాసములును సంపూర్ణముగా నున్నవి.

2 ఆ. ఉ. వి. సం. 7. ఆదిపర్వ సందర్భమునఁ బేర్కొన్న 7వ సంఖ్యగల తాళపత్ర ప్రతియే. ఇందు 232 నుండి 301 వఱకునుగల పత్రములలో సభాపర్వమునందలి రెండాశ్వాసములును సంపూర్ణముగా నున్నవి.

3. ఇ. ఉ వి. సం. 8. ఇందశ్వమేధాశ్రమవాస మౌసల మహాప్రస్థాన స్వర్గారోహణ సౌప్తిక సభాపర్వములున్నవి. ఇందు సభాపర్వము చివర 161నుండి 206 వఱకును గల పత్రములలో నున్నది స్థితి బాగుగానున్నది పరిమాణము 17న్నర" × 1 3" కమ్మలు 206. ఈ తాళపత్రప్రతి యజమానుఁడు తనయవసర క్రమము ననుసరించి భారతమునందలి యాయాపర్వములను వ్రాయించుకొని యుండును.

4. ఈ. ఉ.వి. సం. 33. ఇందు సభాపర్వము సంపూర్ణముగా నున్నది. 42 కమ్మలు. కాలము పేర్కొనఁబడినది. విరోధి భాద్రపద బహుళ చతుర్దశి వారము లేదు.

5. ఉ. ఉ. వి. సం. 127. సభాపర్వము సంపూర్ణము. స్థితిబాగున్నది 26 కమ్మలు ఆంధ్ర సాహిత్యపరిషత్తు కాకినాడ.

6. ఊ. ఉ. వి సం. 156. సభాపర్వము సంపూర్ణము. స్థితి చాలబాగుగా నున్నది. 42. కమ్మలు. కాకినాడయందలి. ఆంధ్ర సాహిత్య పరిషత్తు వారికి సత్రా రామయ్యగారు బహూకరించిరి

7. ఎ. ఉ. వి. సం. 161. సభా, సౌప్తిక, కర్ణ, శల్యపర్వములు. సంపూర్ణముగా నున్నది. స్థితిబాగున్నది. సభాపర్వము 213 నుండి 260 పత్రమువఱకు నున్నది ఆంధ్రసాహిత్యపరిషత్తు. కాకినాడ

8. ఏ. ఉ. వి. సం. 162. సభాపర్వము. సమగ్రము స్థితిబాగున్నది. క్రిములచ్చటచ్చట కొంచెము కొట్టివేసినవి. పరిమాణము. 17'' × 1.4''44. కమ్మలు. ఆంధ్ర సాహిత్య పరిషత్తు. కాకినాడ.

9. ఐ. ఉ. వి. సం. సభాపర్వము. సమగ్రము. స్థితి చాలబాగున్నది. పరిమాణము 14న్నర × 1.2" ; 78 కమ్మలు. తేది. రాక్షస అధిశాషాడ బహుళ సప్తమీ శుక్ర వారము. జూలై 6. 1855 లేఖకుఁడు జొన్నలగడ్డ వ్యాసులుగారి ద్వితీయ కుమారుడు వ్యాఘ్రి. ఆంధ్రసాహిత్యపరిషత్తు కాకినాడ.

10. ఒ. ఉ. వి. సం. 167. సభాపర్వము. సమగ్రము. పరిమాణము 17 × 13" 63 కమ్మలు చాలశిథిలమైనది. దీనిని చాల జాగరూకతతో నుపయోగించ వల యును. కోట్టియం సీతారామయ్యగారు కాకినాడ యందలి ఆంధ్రసాహిత్య పరి షత్తు వారికి దీనిని బహూకరించిరి.

11. ఓ. ఉ. వి. సం. 171. సభాపర్వము అసంపూర్ణము. స్థితి బాగున్నది. 42 కమ్మలు. ఆదినుండి ద్వితీయాశ్వాసమునందలి 151 పద్యమువఱకు నున్నది ఆంధ్రసాహిత్య పరిషత్తు కాకినాడ.

12. ఔ. ఉ. వి. సం. 172. సభాపర్వము. సమగ్రము. స్థితిబాగున్నది. 59 కమ్మలు సాంబ శివుఁడను లేఖకుడు గుడిమెట్ల తిమ్మరాజుగారి కుమారుడైన శేషయ్యగారి కొఱకు, రౌద్రినామ సంవత్సర మార్గశీర్ష శు సప్తమీ సోమవారమునాటికి సభాపర్వము సంపూర్ణముగా వ్రాసియిచ్చెను. ఈ కాలము 23 నవంబరు 1800 సంవత్సరమునకు సమానము. ఇది నందిగామ తాలూకా యందలి గుమ్మడిదుఱ్ఱు గ్రామమున సంపాదింపఁబడినది. ఆంధ్రసాహిత్యపరిషత్తు. కాకినాడ.

13. క. ఉ. వి. సం. 204. సభాపర్వము సంపూర్ణము. 90 కమ్మలు. స్థితిబాగున్నది. ప్రథ మాశ్వాసము చివరసిద్ధార్థినామ సం॥ కార్తిక శు పూర్ణిమనాటికి వ్రాయఁబడినదని యున్నది. ద్వితీయాశ్వాసము చివర సిద్ధార్థి నామ సం॥ (10_11_1610) మార్గ శీర్ష శు దశమీ శనివారమునాటికి ఆకుల రంగనాయకులచే వ్రాయఁబడినదని యున్నది. రాజమహేంద్రవరము నందలి గౌతమీ గ్రంథాలయము.

14. ఖ. ఉ. వి. సం. 205. సభారణ్యపర్వములు సంపూర్ణములుగానున్నవి. స్థితిబాగున్నది. 264 కమ్మలు సభాపర్వము 1 నుండి 53 పత్రముల వఱకు నున్నది. రాజ మహేంద్రవరము నందలి గౌతమీ గ్రంథాలయము నుండి యెరవు తెచ్చు కొన్నది. లేఖకులు సభారణ్యపర్వములు వ్రాయుటకు పట్టినకాలమును గూర్చి వివరము లొసంగియున్నారు. సభాపర్వమునందలి ప్రథమాశ్వాసమును దత్తారు

నరసింహారావు స్వోపయోగమునకై ప్లవంగనామ సం. ఆషాఢ బ దశమీ శుక్ర వారమునాఁడు వ్రాయుట కారంభించి ప్లవంగనామ శ్రావణ శు తృతీయా శుక్రవారమునాఁడు రాత్రి 8 గంటలకు (రెండు గడియలు) పూర్తిచేసెను సభా పర్వ ద్వితీయాశ్వాసము చివఱ యతఁడు మరల" దశాారు నరసింగరాయడు ప్లవంగనామ సంవత్సర ఆషాడ బ దశమీ శుక్రవారమునాడు ఆరంభించి సభా పర్వమందలి రెండాశ్వాసములను భాద్రపద బ పంచమి (ప్లవంగనామ సం॥ మే అయి ఉండును) బుధవారము మధ్యాహ్నము వరకు పూర్తి గావించెను." ఇది 29-9-1847 తేదీకి సమానము. దీనినిబట్టి లేఖకుఁడు 295 గద్యపద్యములతో గూడిన ప్రథమాశ్వాసమును సరాసరి రోజు 1 కి 33 పద్యగద్యములచొప్పున 9 రోజులలో పూర్తిచేసినట్లు తెలియుచున్నది లేఖకులు రోజునకు 30 నుండి 40 పద్య గద్యములవఱకు సులభముగా వ్రాయగలరని గ్రహింపవచ్చును. దశాారు నర సింహారావు అను లేఖకుఁడు స్వోపయోగము కొఱకై మహాభారతము వ్రాసికొని యుండుటచే కొంతసంస్కారము కలవాఁడుగా కాన్పించుచున్నాఁడు. ఇది అతనికి భారతముపెడగల స్వార్థరహితమైన ఆసక్తినిగూఢ వ్యక్తము చేయు చున్నది. అరణ్యపర్వము అశుభప్రదమను అభిప్రాయముండుటచే వ్రాజలు దాని నరుదుగ వ్రాయించుకొనుచుండిరి. అందుచేతనే మనకు అరణ్యపర్వముయొక్క లిఖితప్రతులు చాల తక్కువగ కానవచ్చుచున్నవి నరసింగరాయుడు మాత్రము దీర్ఘమును కొన్నియెడల విసువు కలిగించునదియునగు నీపర్వము నంతను తన కొఱకు శ్రమపడి వ్రాసికొనియుండెను. అతఁడు తాను మంగిపూడి సూర్య నారాయణగారి యొక్కయు తుమురాడ అనంతన్నగారి యొక్కయు మాతృ కలనుండి ఆపర్వములను చూచి వ్రాసికొన్నట్లు తెలిపియున్నాఁడు.

15. గ. ఉ. వి. సం. 207 సభాపర్వము సంపూర్ణము, స్థితిబాగున్నది. జయసంవత్సర ఫాల్గున శుద్ధ తృతీయా శనివారము మధ్యాహ్నమునకు మాతృక ననుసరించి సభాపర్వ ప్రథమాశ్వాసము కాకులపాటి పెదవీరన్న కుమారుఁడైన నరసన్నచే వ్రాయఁబడినది. ఇది 1775వ సంవత్సరము మార్చి 4వ తేదీకి సమానము. ద్వితీ యాశ్వాసము చివర మరల మన్మథనామ సంవత్సర జ్యేష్ఠశుద్ధ పంచమీ శుక్ర వారమని పేర్కొనఁబడినది రాజమహేంద్రవరమునందలి గౌతమీ గ్రంథా లయము.

16. ఘ. ఉ వి. 908/S ఈ వ్రాఁతప్రతి ఉస్మానియా విశ్వవిద్యాలయమందలి సంస్కృత అకాడమికి చెందినది. సభాపర్వము సంపూర్ణము స్థితిబాగున్నది. కమ్మలు 72. లేఖ కుఁడు వ్రాసిన ఒకశ్లోకములో మాతృకవలెనే నేను వ్రాసినప్రతి యనియున్నది తప్పైనను ఒప్పైనను నాదోషమేదియు లేదని తెల్పఁబడినది. దుర్మతి నామ సం వత్సర చైత్ర బహుళ సప్తమీ గురువారమునాఁటికి గన్నమరాజు కొమ్మాజీ సభాపర్వమును చూచి వ్రాసియుండెను ఇది 11-4-1776 తేదీకి సమానము.

17. చ. ఉ,వి సం. 532/S (24 వరుస సంఖ్యగల ఆదిపర్వముతో సమానము) ఈవ్రాఁత ప్రతి ఉస్మానియా విశ్వవిద్యాలయమందలి సంస్కృత అకాడమికి చెందినది. ఆది

సభారణ్యాపర్వములు సంపూర్ణములు. స్థితి బాగుగానున్నది. పరిమాణము 18''×1న్నర'' కమ్మలు 302. సభాపర్వము 129 నుండి 159వ పత్రము వఱకు మున్నది. శోభకృత్సంవత్సర భాద్రపద బహుళ త్రయోదశి అపరాహ్ణమునకు గజం అచ్చన్నగారి తమ్ముఁడైన లక్ష్మీనరుసుగారి వైపలవాయి చెల్లయ్య దీనిని వ్రాసియుండెను ఈకాలము క్రీ. శ 1782వ సంవత్సరమునకు సమానము

18. ఛ. టి. యమ్. 40 సభాపర్వము సంపూర్ణము. ఈవ్రాఁతప్రతి తంజావూరు సరస్వతీ మహాలు గ్రంథాలయమున నున్నది స్థితి బాగుగా నున్నది. పరిమాణము 15"×1 3/8'' 54 పత్రములు 1000 గ్రంథములు

ఇచ్చట వ్రాఁతప్రతులతో మేము గ్రహించిన ముద్రితప్రతులను సరిచూచు టను గూర్చి యించుక వివరింపవలయును. అందు చాలభాగము విశ్వవిద్యాలయ మందే చేయఁబడినది. వ్రాఁతప్రతులను బయటివారికిచ్చుట కంగీకరింపనిచోట్లకు మాయొద్ద పనిచేయు పండితులను బంపితిమి. బయటనుండి సరిచూచుటకు మేము సాధారణముగా రెండేసి వ్రాఁతప్రతులను మాత్రమే యెన్నియుంటిమి రావు సాహెబు గిడుగు వెంకటరామమూర్తి పంతులుగారు తంజావూరు గ్రంథాలయమునుండి పాఠములను సేకరించి యుండుటచే మేమందలి వ్రాఁత ప్రతులను వేఱుగా సరిచూచి యుంఁడలేదు. ఇతర పర్వములకు తంజావూరు గ్రంథాలయ పాఠములను సంపాదించి యుంటిమి.

19. జ టి. యమ్ 37 సభాపర్వము సంపూర్ణము స్థితి బాగుగానున్నది పరిమాణము 18''×1న్నర'' పత్రములు 74. గ్రంథములు 1000. ఈవ్రాఁతప్రతి తంజా వూరు సరస్వతీ గ్రంథాలయమున నున్నది.

హైదరాబాదునందలి న్యూసైన్సు కళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగా నున్న డా. ఏ రమాపతిరావుగారును. గద్వాల ప్రభుత్వ కళాశాలలో బోధకులుగా నున్న శ్రీ టి ప్రభాకరరెడ్డిగారును తంజావూరు సరస్వతీ గ్రంథాలయము నందుండి యెన్నుకొన్న వ్రాఁతప్రతులతో ఆదిపర్వము తప్ప మిగిలిన పర్వముల నన్నిటిని సరిచూచి యుండిరి మా సంఘమువారి ప్రయోజనమునకై వారిని ప్రత్యేకముగా తంజావూరు పంపియుండిరి

20. ఝ. సం 74883. సభావిరాటోద్యోగ పర్వములు సంపూర్ణములు. స్థితి బాగుగా నున్నది, అందు సభాపర్వము 1 నుండి 48వ పత్రమువఱకు నున్నది. అందు రెండు తేదీలు సూచింపఁబడినవి. రాక్షససంవత్సర మార్గశి 9. వల సంవత్సర పెర టాసి 1. ఇది బహుళః 1804వ సంవత్సరమై యుండవచ్చును. ఇది దాక్షిణాత్య మైన వ్రాఁతప్రతిగాఁ గనిపించుచున్నది. దీనిని శ్రీ కె. సూర్యనారాయణగారు అడయారు గ్రంథాలయమున సరిచూచి యుండిరి.

21. ట. ఆంధ్ర విశ్వవిద్యాలయము సభాపర్వము సంపూర్ణము చాల ప్రాఁత వ్రాఁత ప్రతి. వ్రాఁత బాగుగానున్నది. 142 కమ్మలు. 1278 గ్రంథములు. మన్మథ నామ

సంవత్స రాషాఢ శుద్ధ పంచమీ బుధవారము నాఁటికి సభా పర్వమంతయు నేతేటి లచ్చన్నచే వ్రాయఁబడినది. ఇది 8–7–1527 తేదీకి సమానమై యుండ వచ్చును.

దీనిని శ్రీ కె. జోగయ్య శర్మగారు పరిచూచి యుండిరి.

22. డ. సం 7/1111/N18–6 ఆంధ్ర విశ్వవిద్యాలయము సభాపర్వము సంపూర్ణము. ప్రాఁతది. అచ్చటచ్చట క్రిములచేఁ గొట్టివేయఁ బడినది. పరిమాణము 46×11 సెం. మీ. కమ్మలు 78. 1657 గ్రంథములు వ్రాఁత బాగుగానున్నది వరాభవ నామ సంవత్సర భాద్రపదబహుళ దశమీ భానువారమునాఁటికి సభాపర్వ మంతయు రామెళ్ళ గోనయ్యచే చూచి వ్రాయఁబడినది. ఇది 4–8–1420? తేదీకి సమానము.

దీనినికూడ శ్రీ కె. జోగయ్యశర్మగారే పరిచూచియుండిరి.

23. ణ సం. 75066. అడయారు గ్రంథాలయము. సభారణ్యపర్వములు సంపూర్ణములు. స్థితి ఒకమాదిరిగా నున్నది. 284 పత్రములు. సభాపర్వము 1 నుండి 43వపత్రము వఱకు నున్నది

దీనిలేఖన కాలమునుగూర్చి రెండు సూచనలున్నవి. ఈప్రతిని మానవెల్లి కాంతయ్య వ్రాసియుండెను 1. అక్షయనామ సంవత్సర వైశాఖబహుళ పంచమీ బుధవారము 7–5–1806 (2) అక్షయనామసంవత్సర ఆశ్వయుజ శుద్ధ అష్టమీ భానువారము.

దీనిని అడయారులో శ్రీ కె. సూర్యనారాయణగారు పరిచూచి యుండిరి.

24–ల– బ్రౌనుదొరవారి కాగితపు వ్రాఁతప్రతులు

25 వ– బ్రౌనుదొరవారి వ్రాఁతప్రతులందలి యితర పాఠములు.

26 వా. వావిళ్ళ ముద్రణము. మేము మూలముగా గ్రహించినది

27. వీ వీరేశలింగంగారి ముద్రణము 1901

28. శ. లండను ప్రతి.

29. ప. కరాలపాటి రంగయ్యగారి ప్రతి 1852.

30 సం. వావిళ్ళముద్రణమందలి అధస్సూచికలు.

31. శ. ఆనందముద్రణము

32. శ. ఆనందముద్రణమందలి అధస్సూచికలు.

33. క.భూ. కవిశిరోభూషణము. దీనికే అహోబలపండితీయమని నామాంతరము.

34. ఛం. ఆదిపర్వమునకు సంబంధించిన 'ఛందము'తో సమానము.

35. స. ల సర్వలక్షణసారము. ఆదిపర్వమునకు సంబంధించిన ల సా తో సమానము.

28 నుండి 32 వఱకునుగల సంఖ్యలతోఁ గూడినవి ముద్రితప్రతులు. అవి ఆదిపర్వ సందర్భమున వర్ణితములైన వానితో సమానములు. 33 నుండి 35 వఱకును గల సంఖ్యలతోఁ గూడినవి కూడ ఆదిపర్వ సందర్భమున వ్రాఁతప్రతుల వరుసలో వర్ణింపఁ బడినవి.

## సంఘములు

ఈమహాభారత సంశోధిత ప్రతిపాదనము వ్యక్తులచేఁ గాక పండిత సంఘములచేఁ జేయఁబడుచున్నది. అట్లు చేయుటవలన మేళ్ళును గీళ్ళును గూడఁగలవు. సంపాదకులు వ్యక్తులైనచోఁ బనిని వేగముగా జేయుట కవకాశమున్నది. సంఘములద్వారా సంపాదనము జరిగినచో బహువ్యక్తుల అనుభవాలోచనల వలని లాభము కలుగుట కవకాశమున్నది. కూలంకషముగాఁ జర్చించి వారొక యంగీకారమునకు వత్తురు. దీనివలనఁ గొంతఆలస్యము కలుగుట నిజమేయైనను లాభముకూడ విరివిగా నుండును ఇంతవఱకు ఆదిసభారణ్య పర్వముల సంపాదనము జరిగినది. విరాటపర్వ సంపాదనము జరుగుచున్నది. ఈక్రింది విద్వాంసులలోఁ గొంద ఱధికకాలము గొంద రల్ప కాలమును సంపాదన కార్యము పాల్గొనియుండిరి

1. ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనము
2. డా. దివాకర్ల వేంకటావధాని.
3. ఆచార్య నిడుదవోలు వేంకటరావు.
4. ఆచార్య బి. లక్ష్మీనారాయణరావు.
5. డా. పల్లా దుర్గయ్య.
6. డా. బిరుదురాజు రామరాజు
7. డా. పాటిబండ మాధవశర్మ,
8. డా. మడుపు కులశేఖరరావు.
9. శ్రీ అమరేశం రాజేశ్వరశర్మ.
10. డా. కేతవరపు రామకోటిశాస్త్రి.

ఇటీవలనే శ్రీ చెలమచర్ల రంగాచార్యులుగారును, డా. బి. వి. కుటుంబరావు గారును డా. కె సుప్రసన్నాచార్యులుగారును సంపాదన కార్యమున నియోగింపఁ బడిరి.

శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు, శ్రీ వెంపరాల సూర్యనారాయణ శాస్త్రిగారు, శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు అను పరిణతులైన విద్వద్వర్యుల సలహా సహాకారము లీప్రణాళికకు లభించినవి. ఆదర్శ సంపాదిత విభాగమునుగూర్చి విద్వాంసులనుండి అభిప్రాయములు వచ్చిన తరువాత సలహాదారులతోఁగూడిన విస్తృత సంపాదకవర్గము కొన్నిరోజులు సమావేశమై భావి సంపాదన కార్యవిధానమును నిర్ణయించినది. ఆ విద్వాంసు లిచ్చిన సూచనల ననుసరించి యంతవఱకును సంపాదితములైన భాగముల పునఃపరిశీలనము కావింపఁ బడినది.

ఈప్రణాళిక కార్యనిర్వహణ విధానము చాల సరళమైనది సంపాదకవర్గము నిర్ణయముల నొక కార్యనిర్వహణోద్యోగి కార్యరూపము నొందించును. ఆర్థిక విషయములు విశ్వవిద్యాలయోపాధ్యక్షుల అంగీకారమునకుఁ బంపఁబడును. కార్యనిర్ణయ సంఘ మాంధ్రప్రదేశ సాహిత్య అకాడమి అధ్యక్షులును, ఉత్తరప్రదేశ రాజ్యపాలకులు నైన మాన్యశ్రీ డా. బెజవాడ గోపాలరెడ్డిగారి సలహా లాభమును బొందఁజాలినది. భారత శాసనసభా సభ్యులైన శ్రీ నూతల నరోత్తమరెడ్డిగారును, ఆం ప్ర. సాహిత్య అకాడమి కార్యదర్శులైన శ్రీ దేవులపల్లి రామానుజరావుగారును ఆదినుండియు ప్రణాళికయెడ వత్యంతాభిమానమును ప్రదర్శించుచున్నారు. పూర్వము విశ్వవిద్యాలయ విరాళ సంఘము పక్షమున సమీకరణోద్యోగులుగా నుండిన శ్రీ డి. హనుమంతరావుగారు ప్రణాళిక విషయముల నత్యంతశ్రద్ధతోఁ బరిశీలించుచు ననవరతమైన సహకారమొసంగి యుండిరి శ్రీ బి. లక్ష్మీనారాయణరావు, శ్రీనిడుదవోలు వెంకటరావు, డా. బి. రామరాజు, ఆచార్య కె లక్ష్మీరంజనముగార్లు వరుసగా కార్యనిర్వహణోద్యోగులుగాఁ బనిచేసియుండిరి.

సంశోధిత ముద్రణము ఉస్మానియా విశ్వవిద్యాలయ ముద్రాలయమునందే ముద్రింపఁ బడుచున్నది. తెలుఁగులో భారతమువంటి యుద్గ్రంథమును ముద్రించుటకుఁ దగిన సాధనసామగ్రి పూర్తిగా లేకపోయినను ముద్రాలయమావశ్యకమును బట్టి సాధనమును నిర్వహింపఁ జాలినది. ముద్రాలయ సంచాలకులకును, అందలి యుద్యోగులకును మాఅభివందనములు. ముద్రణవిధానమునకును, గ్రంథబంధనాదులకును ఇంతకంటె మెఱుఁగులు తీర్చుట కవకాశమున్నట్లు కనిపించును. ప్రూఫులు చదువుట ఇంతకంటెను నిర్దుష్టతరముగా జదువవలసి యున్నది.

మా కార్యాలయమున పండితులుగాఁ బనిచేయుచున్న శ్రీ నిడుదవోలు శివసుందరేశ్వరరావుగారు ప్రణాళికా కార్యమున నిరంతరముగాఁ బని చేయుచున్నారు. ఈ ఉపోద్ఘాతము వ్రాయునప్పుడు కావలసిన ఉద్ధరణముల నన్నిటిని సమకూర్చి వారు మాకు చాల సాయమొనరించిరి. లిఖితగ్రంథాలయములను గూర్చియు, అపూర్వ గ్రంథ ప్రచురణములను గూర్చియు వారు చాలవిషయములను సేకరించి యున్నారు.

## ఉ ప సం హా ర ణ ము

మహాభారత సంశోధిత ముద్రణవిషయము మొదట తలపెట్టినది. 1958వ సంవత్సరపు ఆగస్టుమాసమున అప్పటినుండి ఆది సభాపర్వములతోఁ గూడిన ప్రథమసంపుటము ముద్రితమగువఱకు అనఁగా 1967 ఆగస్టు మాసమువఱకు తొమ్మిదిసంవత్సరములైనది. ఈప్రణాళికను ప్రోత్సహించుచున్న ఉస్మానియా విశ్వవిద్యాలయమువారును, దీనికిఁ గావలసిన ఆర్థికసాహాయ్యమొనఁ గూర్చుచున్న ప్రభుత్వములును ఈకార్యము చాలమందముగా జరిగినదని భావించవచ్చును కాని భారవంతమైన యీ కార్యము స్వభావమును సమర్థింపఁజాలును "మహత్త్వాచ్చ మహాభారత ముచ్యతే" యని ఋషులు మహా భారతమును నిర్వచించి యుండిరి. అదియునుగాక పూర్వపు విద్వత్సరేణ్యులెందరో శ్రద్ధతో పరిశీలనచేసి విడిచిన యీ రంగమున బనిచేయుట కత్యధికమైన జాగరూకత కావల

యును. పై తొమ్మిది వత్సరములలో సగము కాలమార్థిక సాహాయ్యమునకై అఱ్ఱులు చాచుటలోనే కడచిపోయినది. తరువాత ప్రాచీనములైన తాళపత్రప్రతులను, ముద్రిత ప్రతులను సంపాదించుట కష్టసాధ్యమైనది. సుమారొక లక్ష పాదములతోఁ గూడిన (21013 పద్యగద్యములు) మహాభారతము వంటి గ్రంథమును తాళపత్రప్రతులతో సరి చూచుటకుఁ జాలకాలము పట్టినది.

ఈ ప్రణాళికలోఁ గాలమంతయు దీనికొఱకే వినియోగించు సంపాదకవర్గము లేదు. విశ్వవిద్యాలయాంధ్రభాషాబోధకులే తమకు విశ్రాంతి యున్నప్పుడు సంపాదనకార్యము సాగించుచుందురు. మొట్టమొదట విశ్వవిద్యాలయాంధ్రశాఖాబోధకులును విద్యార్థులును గలసి పరస్పర సహకారముతో నీ కార్యము గ్రహింపవలెనని యూహింపఁబడినది. కాని మానవులకు సహజసిద్ధములైన లోపములకును, ఆదర్శములకును అనుకొన్నట్లు చేయుటకును గల వైరుధ్యమునకును గొంత యవకాశ మొసంగవలసి యుండును. అయినను ఫలితమంత నిరాశాజనకముగా లేదు. భావికార్యమునకు దృఢమైన పునాది వేయఁబడినది. సంవత్సరము పొడుగునను స్థిరముగను, సమర్థముగను పనిచేయు విద్వాంసులు కావలయును. పూనాయందలి భండార్కరు ప్రాచ్యసంస్థవారికి సంస్కృత భారత సంశోధిత ప్రతిని సిద్ధముచేయుటకు సుమారు నలువదియేండ్లు పట్టినది. ఆంధ్ర మహాభారతమంత విస్తృతమైనదికాదు; దానికి సంబంధించిన సమస్యలంత వైవిధ్యముతోఁ గూడినవికావు. అందుచే స్థిరముగను శ్రద్ధగను పనిచేయు విద్వాంసులు దానిని నాలుగైదేండ్లలోఁ బూర్తిచేయవచ్చును.

ఆంధ్రదేశము నందలి శిష్టజను లీమహాభారత సంశోధిత ముద్రణమున నన్నయ, తిక్కన, ఎఱ్ఱనలను మువ్వురు మహాకవులకుఁ దగిన స్మృతిచిహ్నముగ బరికించి యాదరింతురు గాక.

హైదరాబాదు.
6–6–1968

దివాకర్ల వెంకటావధాని

—: o :—

# విషయసూచిక

## ఆదిపర్వము

### ప్రథమాశ్వాసము



### ద్వితీయాశ్వాసము

## తృతీయాశ్వాసము

## చతుర్థాశ్వాసము

## పంచమాశ్వాసము

## పంచమాశ్వాసము

## సప్తమాశ్వాసము

## అష్టమాశ్వాసము

—౧—

## సభాపర్వము – ప్రథమాశ్వాసము

## ద్వి తీ యా శ్వా స ము



మూలమనగా భండార్కరు సంస్థవారి సంస్కృత భారతప్రతి
అను – పై ప్రతిలోని అనుబంధములు.

# శ్రీమదాంధ్రమహాభారతము

## ఆదిపర్వము - ప్రథమాశ్వాసము

1 శ్రీవాణీగిరిజాశ్చిరాయ దధతో వక్షోముఖాఙ్గేషు యే
లోకానాం స్థితి [1]మావహన్త్యవిహతాం స్త్రీపుంసయోగోద్భవాం
తే వేదత్రయమూర్తయ స్త్రిపురుషా స్సంపూజితా వ స్సురై
ర్భూయాసుః పురుషోత్తమామ్బుజభవ శ్రీకన్ధరా శ్శ్రేయసే.

-: అవతారిక :-

2 వ. అని సకలభువనరక్షణ[1]ప్రభువులై [2]యాద్యులైన [3]హరిహరహిరణ్యగర్భపద్మోమావాణీపతుల [4]స్తుతియించి [5]తత్ప్రసాదసమాసాదితనిత్య [6]ప్రవర్ధమాన [7]మహా [8]మహీ [9]రాజ్యవిభవుండును [10]నిజభుజవిక్రమ[11]విజితారాతి రాజనివహుండును [12]నిఖిల [13]జగ [14]జ్జేగీయమాన [15]నానాగుణరత్నరత్నాకరుండును [16]నై [17]పరగుచున్న రాజరాజనరేంద్రుండు.

1 1 మావహన్తివిహితాం—అ.ఉ.ఊ.జ.ట.డ.ద.న ప బ.వ; మావహన్త్యనిహితాం—చు, మావహన్తిజగతాం—చీ.

2 1. ప్రవణులై—ఈ.మ; ప్రవణులైన హరిహర—ర; ప్రముఖులై-అ.ఉ ఊ.ప ట.ఔ. ద ప.బ.మ, ప్రభులై—వ; ప్రశస్తులై—స. 2. యాధ్యులైన——అ.ఈ.ఉ.ఊ. ఎ.ఏ.క మ.వ 3. హరిహరహిరణ్యగర్భుల, పద్మోమావాణీపతుల—అని భారత ఫక్కియు; హరిహరహిరణ్యగర్భపద్మోమావాణీపతుల— అని వేదం వేంకటరాయ శాస్త్రిగారును (మద్రాసు విశ్వవిద్యాలయమువారి తెలుఁగు సెలక్షన్సు.) సూచించిన పాఠములు గమనింపఁదగినవి 4. నుతియించి—అ; సంస్తుతించి—మ; ప్రస్తుతించి-కే. 'స్తుతియించి' రూపము గ్రాహ్యము కాదని కొందఱి యభిప్రాయము. 'స్తుతి' కృదంతరూపమగుటచే దీని మీద 'ఇయుడాగమము' రాదని వారి వాదము. అత్యధిక సంఖ్యాక ప్రతులలో 'స్తుతియించి' యను పాఠమే కలదు. 'క్షణియించి' (1-1-100) మున్నగు నియుడాగమసహితరూపములు నన్నయభారతమునఁ గలవు. 5. తత్ప్రసాదంబుననిత్య-ఊ; తత్ప్రసాదిత—ప క.మ; తత్ప్రసాదాసాదిత-అ ఆ.ఇ ఈ.ఐ.ఒ గ ట.య. 6. ప్రవర్తమాన-చే. 7. మహారాజ్య-అ.ఈ.ఉ.ఔ.య.స. 8. మహీ-పెక్కుప్రతులలో లేదు స. లో కూడ. 9. రాజ్యవిభుండును—కు. 10. నిజభుజనివహుండును—కే.చా. ప్రతులలో లేదు. 11. నిర్జిత-ఊ. 12. అఖిల-అ ఇ.ఎ.ఐ ఒ.ఔ.క.గ.గి.చ.జ త.ల.వ శ.ష; సకల—ప. 13. జనజేగీ—అ.ఇ.ఔ, జగజ్జనజేగీ—ఆ.ఈ. 14. జేగియ్య—వ్రాఁతప్రతుల లేఖన సంప్రదాయము. 15. నామానగుణసుగుణ——స; నానానూన——ఈ.ఊ ఐ.ఒ.కే.; మానానూన—చే.చొ.మ. 16. ననగుచున్న—ఉ. 'డ' ప్రతిలో 'మహాధర్మపరుండునునై' అను నధికపాఠము గలదు. 17. పరఁగుచున్న-వా.

3 ఉ. రాజకులైకభూషణుఁడు రాజమనోహరుఁ డన్యరాజతే
జోజయశాలి శౌర్యుఁడు విశుద్ధయశశ్శరదిందుచంద్రికా
రాజితసర్వలోకుఁ డపరాజితభూరిభుజాకృపాణధా
రా[1]జలశాంతశాత్రవపరాగుఁడు రాజ[2]మహేంద్రుఁ డున్నతిన్.

4 క. [1]విమలాదిత్యతనూజుఁడు [2]విమలవిచారుఁడు గుమారవిద్యా[3]ధరుఁ డు
త్తమచాళుక్యుఁడు వివిధాగమ[4]విజిత[5]శ్రముఁడు తుహినకరుఁ డురుకాంతిన్.

5 చ. ఘనదురితానుబంధకలికాలజదోషతుషార[1]సంహతిం
[2]దన యుదయప్రభావమున [3]దవ్వగఁ [4]జోపి జగజ్జనానురం
జన[5]మగు రాజ్యసంతతవసంతనితాంతవిభూతి నెంతయుం
[6]దనరుఁ జళుక్యమన్మథుఁడు ధర్మ[7]నిబద్ధ[8]దయార్ద్రబుద్ధి యై.

6 ఉ. [1]ఆశ్రితపోషణంబున ననంత[2]విలాసమునన్ [3]మనీషివి
ద్యాశ్రమతత్త్వవిత్త్వమున దానగుణాభిరతిన్ సమస్తవ
ర్ణాశ్రమధర్మరక్షణమహామహిమన్ మహి నొప్పు సర్వలో
కాశ్రయుఁ డాదిరాజనిభుఁ డత్యకలంక[4]చరిత్రసంపదన్.

3 1. జితసర్వ—మ ; 2. నరేంద్రుడు—ఊ టో.ద.

4 1. ఈ పద్యము 'ఒ' 'ర' ప్రతులలో లేదు. 2. విమలాచారుడు—న ; విమల విచారుండు, వినుతవిద్యాధరుడు—చో; విమలవిచారుండు దానవిద్యాధరుడు—టో. 3. విదుడు—ఏ.కే 4. విహిత—ఒ.గ.గి.చ.జ.న.య.ర.వ.వా.ష. ; విదిత—మ; విజిత-స. మున్నగు ప్రతులు. 5. క్లముడు—వ ; క్రముడు—ఐ ; శ్రవుడు—ఈ.

5 1. సంహ్వాతి—లేఖన సంప్రదాయము. 2. తనదుదయ—ట.బ. 3. దవ్వుల—న. 4. జొన్పి—ఒ.కే.టో.త.వ; దోలి—న ; జొంపి—క. 5. ముగ—ఝ.శ స. 6. తనరు చళుక్య—అ.ఆ.ఇ.ఒ.ఓ.ట జ త డ.బ 7 దయార్ధ్రనిబద్ధ--20 ప్రతులలో నిట్లున్నది. 8. దయార్థ—చ.ట.స.బ.

6 1. 'ఊ' ప్రతిలో నీ పద్యము లేదు. 2. విలాసము నమ్మనీషి—చే. 3. మనీష—కి.కు. కై.కం.న.య ; మనీషి విద్యాశ్రమతత్త్వవిత్తమున - పెక్కు ప్రతులు ; మనీషివిద్యాశ్రయతత్త్వవిత్తమున—చా.చే; మనీష విద్యాశ్రయ తత్త్వ విత్తమున - కై.కం. 4. 'చ' స్థానమున 'చె' వ్రాయుట సంప్రదాయము. చెంద్రిక. చెరిత్ర.

7 సీ. నిజమహీమండలప్రజఁ బ్రీతిఁ [1]బెంచుచుఁ బరమండలం[2]బుల ధరణిపతుల
నదిమి కప్పంబుల [3]ముదముతోఁ[4]గొనుచును బలిమి[5]నియ్యని భూమివలయపతుల
నుక్కడఁగించుచు దిక్కులఁ దనయాజ్ఞ [6]వెలుఁగించుచును విప్రకులము నెల్లఁ
బ్రోచుచు శరణన్నఁ గాచుచు భీతుల నగ్రజన్ములకు ననుగ్రహమునఁ

ఆ. జారుతరమహాగ్రహారంబు లిచ్చుచు దేవభోగముల మహావిభూతిఁ
దనరఁ జేయు [7]చిట్లు మనుమార్గుఁడగు విష్ణువర్ధనుండు [8]వంశవర్ధనుండు.

8 వ. అఖిలజలధివేలా[1]వలయితవసుమతీవనితావిభూషణంబైన [2]వేంగిదేశంబునకు
నాయకరత్నం[3]బునుంబోని రాజమహేంద్రపురంబునందు మహేంద్రమహిమ
తోఁ బరమానందంబున ననవరతమహామహీరాజ్యసుఖంబు [4]లనుభవించుచు
సకలభువన లక్ష్మీ[5]విలాస[6]నివాసంబయిన [7]రమ్యహర్మ్యతలంబున మంత్రిపురో[6]
హిత సేనాపతి [8]దండనాయక [9]దౌవారిక మహాప్రధా[10]న సామంత[11]విలాసినీ
పరివృతుఁడయి యపారశబ్ద[12]శాస్త్రపారగులైన [13]వైయాకరణులును
భారతరామాయ[14]ణానేక [15]పురాణప్రవీణులైన పౌరాణికులును

7 1. బెంపుచు—ఉ.ఊ.ఎ ఏ.ఐ.ఓ జ.డ.న.బ.ర.వ; పెనుచుచు—ఇ. 2. బేలు—ఆ.
3. ముదమొప్పగొంచును-కు.చే. 4. గొంచును-ఔ.క.డ.వ; 5. నీననినభూవలయ—
మ; నియ్యని — ఇ.ఊ ఎ.ఒ.క గ్రి.చ.జ.డ.త.న.బ.య.ష; మైమనినభూవలయ—
ఔ.గి; మైనీని—కే; నెయ్యమున భూవలయ—టి; నీయని చి.సూ. పాఠము;
ప్రయోగాంతరము నన్నయలో లేదు. 6. వెలుగించుచు— అ.ఇ.ఊ.ఐ.ఒ.ఓ.క.కె.చా.
చో.డ.త.బః వెలిఁగించుచు—వా. 7. నిట్లు—అ.ఈ.ఉ.ఏ.కూ.చా.చే.ట ఠే.న.ర వ.స;
చుండు—కు కం. 8. పుణ్యా—చే

8 1. వలయవలయిత — పెక్కు ప్రతులు. 2. వేంగి—ఈ.ఉ.ఎ.ఏ.ఐ.జ ట.త.న.ల.పి.
కొన్ని ప్రతులలో 'వేగి' అనియు కలదు. వేఁగీదేశంబు—వా. 3. బైన రాజమహేంద్ర
పురంబు తనకు రాజధానిగా—టో. 4. లనుభవింపుచు— పెక్కుప్రతులు.
5. విలాస—లేనిప్రతులు—ఉ.ఔ.కు.కె.కే.కం.టి చే. 6. భాసురం—ఓ. 7. రమ్యభర్మ—
కొన్నింట; రమ్యహర్మ్యతలంబున—అ.ఈ.ఔ.పి. మొదలగు ప్రతులు. 8. కొన్నింట
లేదు. 9. దవ్వారిక—లేఖన సంప్రదాయము 10. నానంత—కొన్నింట. 11. వర
విలాసినీ—ఎ.ఓ; వారవిలాసినీ—ఐ.ల. 12. శాసన—అ.కీ.చో.టో. 13. వయ్యాకరణ—
లేఖన సంప్రదాయము. 14. ణాద్యనేక—కొన్నింట; ణానేక—పెక్కు ప్రతులు.
15. పురాణేతిహాస చాతురీధురీణులైన—స; పురాణపుణ్యకథాకథనప్రవీణులైన—ఎ.ఏ.

[16]మృదుమధురరసభావభాసుర [17]నవార్థవచనరచనావిశారదులయిన మహా కవులును వివిధ[18]తర్కవిగాహిత సమస్తశాస్త్ర[19]సాగరగరీయఃప్రతిభులైన తార్కికులు[20]ను నాదిగాఁగలుగు విద్వజ్జనంబులు పరివేష్టించి [21]కొలుచుచుండ విద్యా[22]విలాసగోష్ఠీసుఖోపవిష్టుండయి యిష్టకథావినోదంబు[23]లనుండి యొక్కనాఁడు.

9 సీ. [1]తన కులబ్రాహ్మణు ననురక్తు [2]నవిరతజపహోమతత్పరు [3]విపులశబ్ద
శాసను [4]సంహితాభ్యాసు బ్రహ్మాండాదినానాపురాణ[5]విజ్ఞాననిరతుఁ
బాత్రు నాపస్తంబ[6]సూత్రు ముద్గల[7]గోత్రజాతు సద్వినుతావదాతచరితు
లోకజ్ఞు నుభయభాషాకావ్యరచనాభి[8]శోభితు సత్ప్రతిభాభి యోగ్యు

ఆ. నిత్యసత్యవచను [9]మత్యమరాధిపాచార్యు సుజను నన్నపార్యుఁ జూచి
పరమధర్మవిదుఁడు వరచళుక్యాన్వయాభరణుఁ డిట్టులనియెఁ గరుణతోడ.

16. మృదుమధురరసభావకథార్థ—కు.కం ; మృదుమధురరసభావభాసురనవరసార్థ—చూ ; నవరసార్థ—చే ; మధురసంభావనభాసురనానార్థరచనా—టా ; వచన—లేనివి 27 ప్రతులు ; నవార్థ వచన—లేనివి కొన్ని ప్రతులు; చిత్రవిస్తర నవరసభావ భాసుర కవితారచనావిశారదులైన—స. 17 నానార్థ—అ.ఈ.ప.ఐ.క.టా.డ.మ.య.వ ; సమర్థ—కీ ; రచనావిశారదులైన—ఆ.ఈ.ఉ.య ర. 18. వితర్క—ఊ.ఎ.ప.ఐ.ఒ.క.చ.జ.ట డ.త.న.ప.బ.య.ల. 19. సాగరసారగరీయః—కొన్నిప్రతులు ; సాగరగరీయఃప్రతిభులు— అ.ఊ.క.వీ మున్నగు ప్రతులు ; ప్రతిభాభాసితులైన—స. 20. ను వైణిక గాయకులును – ఎ.గ.ద.వా. ఇది లేనివి పెక్కు ప్రతులు. 21. కొలువ విద్యా – ఆ.ఇ.ఈ ఊ.ఎ.క గ చ.జ.ట.డ త.ద.బ ; కొలిచియుండ – ప.ఔ. 22. విలాసుండును సుఖోపవిష్టుండునునై — ఆ.ఈ.ఊ.ఎ.ప.ఐ.ఓ.ఔ.క.జ.ట.డ.త ప బ మ.య. 23. లం దగిలి—ఔ. కే.

9 1. తను—ఈ ప.కో; నను—అ 2. నవిరళ—అ.ఆ.ఇ.ఉ.ఎ.ప.ఐ.ఒ.ఓ.ఔ.క.గ.చ.జ.డ ద.బ.య.ల.వ.వా.శ.ష హ , నవిరత—ఈ.ఊ.కీ.కే.చే. 3. విపుల శబ్దశాసన సంహితాభ్యాస బ్రహ్మాండాది— కూ.య 4. సంహ్యిత ; లేఖనము 5. విగ్నాన. విగ్నాన - లేఖనము. 6 సూత్ర—ఐ.ట.డ.త.బ. 7. గోత్రు చతుర – కు.కం. 8. శోభినిజప్రతిభా—అ.ఇ.ఉ ఊ.ఎ ప ఐ.ఒ ఓ.గ.జ.ద.న.ప.బ.మ.య.ల.స. 9. మర్త్యామరాధిపా—కీ. పెక్కు ప్రతులలో మర్త్య—అనియే కలదు. ఇది లేఖక ప్రమాదము కావచ్చును. మర్త్యామరాధిపా—ప్రాస యతి సంప్రదాయము చర్చింపఁదగినది.

10 చ. విమలమతిం బురాణములు వింటి ననేకము [1]లర్థధర్మశా
స్త్రముల తెఱం గెఱింగితి [2]నుదాత్తరసాన్వితకావ్యనాటక
క్రమములు పెక్కు సూచితి జగత్పరి[3]పూజ్యములైన యీశ్వరా
గమములయందు నిల్పితిఁ బ్రకాశముగా హృదయంబు [4]భక్తితోన్.

11 వ. అయినను [1]నాకు ననవరతంబును శ్రీమహాభారతంబు[2]నందుల [3]యభిప్రా
యంబు పెద్దయై యుండు.

12 మ. ఇవి [1]యేనుం సతతంబు నా[2]యెడఁ గరం బిష్టంబులై యుండుఁ బా
యవు భూదేవకులాభితర్పణ[3]మహీయఃప్రీతియుం భారత
శ్రవణాసక్తియుఁ బార్వతీపతిపదాబ్జధ్యానపూజామహో
త్సవముం సంతతదానశీలతయు శశ్వత్సాధుసాంగత్యమున్.

13 వ. [1]మఱి [2]యదియునుంగాక.

10 1. లైనవేద—వ; లేను—అ.పం. 2. నుదార—టీ.ర. 3. పూర్ణము—వ. 4. నెమ్మి
తోన్—ఆ.చా టో.త.మ.

11 1. నాహృదయంబున—ఆ.ఇ ప.గి.ట.మ.ల.వా. 2. నందలి—వా. మఱికొన్ని ప్రతులు;
నందుల—ఎ.ఏ.ఒ.ఔ కీ.కు కం.చే.చొ.టో 'ఇందుల' అనురూపము యతిస్థానమునందు
కన్పించుటచే 'అందుల' అనురూపము గ్రహించుట యుక్తము.
'ఇందుల జీవనమేల నమ్ము—దురుతత్త్వవిదుల్' (1—6—248)
'ఇందులకున్ వచ్చితిమి దుష్ట—దూషణబుద్ధిన్' (2—1—188)
3. యభిప్రాయంబు విననభిలాష - చ.చె.జ.టి.టు.డా ద.వా శ.ష; లేని ప్రతులు —
అ.ఇ.ఉ.ఊ ఎ.ఏ.ఐ.ఒ.ఓ.ఔ.గ.ట.డ త.ప.బ.వ; యభిప్రాయంబు విననర్థి - ఔ.కూ.
చే.స, యభిప్రాయంబు విననర్థిత్వంబు-ఔ.కే.జ; యభిప్రాయంబు వినవేడ్క—న.

12 1. యెల్లన్—అ.కే.శే.టో. 2. మది—ఇ; యెద—ఐ; యడ—లేఖన పద్ధతి;
హృది—గి. 3. మహార్య—మ.

13 1. ఈ వచనము లేని ప్రతులు—ఇ.ఒ. 2. యట్లుంగాక—అ.ఈ.ఏ.ఐ.ఔ.గ.జ.ట.డ.
త.న.ప.బ.య.ర.

14 చ. హిమకరుఁ[1]దొట్టి పూరు[2]భరతేశకురుప్రభుపాండుభూపతుల్
క్రమమున వంశకర్త లనఁగా మహి నొప్పిన యస్మదీయవం
శమునఁ బ్రసిద్ధులై [3]విమల సద్గుణశోభితులైన పాండవో
త్తముల చరిత్ర నాకు సతతంబు వినంగ నభీష్ట [4]మెంతయుఁ.

15 చ. [1]అమలసువర్ణశృంగఖురమై కపిలంబగు గోశతంబు ను
త్త[2]మబహువేదవిప్రులకు దానము [3]సేసిన తత్ఫలంబు త
థ్యము సమకూరు భారతకథాశ్రవణాభిరతిఁ మదీయచి
త్తము ననిశంబు భారతకథాశ్రవణ[4]ప్రవణంబ కావునన్.

16 క. [1]జననుతకృష్ణద్వైపాయన మునివృషభాభి[2]హిత[3]మహాభారతబ
ద్ధనిరూపితార్థ మేర్పడఁ దెనుఁగున రచియింపు మధిక[4]ధీయుక్తి మెయిన్.

17 క. బహుభాషల బహువిధముల బహుజనములవలన వినుచు భారతబద్ధ
స్పృహు లగు[1]వారికి నెప్పుడు బహు[2]యాగంబులఫలంబు పరమార్థ[3]మిలన్

18 వ. అని యానతిచ్చిన [1]విని యక్కవివరుం డిట్లనియె.

14 1 తొంటి—ఊ ఎ.ఏ.ఔ క.గ చ చా చో జ ట టీ.డ త.ప.బ దీనికి 'మొదలుకొని' అను నర్థము శ ర. లో లేదు. 2. భరతేశకుల—చ.ట.టీ. 3. విపుల—ఊ.ప. 4. మెమ్మెయిన్—ఊ.ఎ.ఏ.ఔ.ద.వా ; మెంతయున్—అ.ఆ.ఇ.ఈ.ఉ.ఐ.ఒ.ఓ.క.గ. చ.జ.ట.డ త.ప.బ వీ.శ.ష.

15 1. అమర—ర సూ. ఈ పద్యము కొన్ని ప్రతులలో లేదు. 2. ములగు—చ.ష.వీ. 3. సేసినఁదత్ఫలంబు—స ; సేసిన సత్ఫలంబు—స. పూర్వ ముద్రణము. 4. ప్రవణంబు—ఐ.గి.త.ర.వీ.ష.స.

16 1. ఈ పద్యము 'ష' ప్రతిలో లేదు; అనఘుడు—ఘ కం. 2. మత—ల. 3. మహాభారత శబ్దనిరూపితార్థ —చు 4. ధీశక్తి—ఉ.సూ.

17 1. వారలకెప్పుడు—అ.ఈ.ఐ.ఒ.డ.మ. 2. యాగఫలంబులగుట పరమార్థ మిలన్–ఏ. 3. మగున్—ఇ.ఔ.గి.జ.న.ప.వ.వా.

18 1. 'విని' లేని ప్రతులు—ఆ.ఇ.ఈ.ఒ.క.జ.డ.త.బ.

19 చ. [1]అమలినతారకాసముదయంబుల నెన్నను సర్వవేదశా
స్త్రముల యశేష[2]సారము ముదంబునఁ బొందను బుద్ధిబాహువి
క్రమమున దుర్గమార్థజలగౌరవ భారత[3]భారతీసము
ద్రముఁ దఱియంగ నీఁదను [4]విధాత్రునకైనను నేరఁ బోలునే.

20 వ. అయినను దేవా నీయనుమతంబున విద్వజ్జనంబుల యనుగ్రహంబునం జేసి
నా నేర్చు విధంబున [1]నిక్కావ్యంబు రచియించెద[2]నని.

21 [1]తరలము. హరిహరాజగజాననార్కషడాస్య[2]మాతృసరస్వతీ
గిరిసుతాదికదేవతాతతికిన్ నమస్కృతి చేసి[3] దు
ర్భరతపోవిభవాధికున్ [4]గురుఁ బద్యవిద్యకు [5]నాద్యు నం
బురుహగర్భనిభుం [6]బ్రచేతసుపుత్త్రిభక్తిఁ దలంచుచున్.

22 ఉ. భారతభారతీశుభగభస్తిచయంబులఁ జేసి ఘోరసం
సారవికారసంతమసజాల[1]విజృంభముఁ [2]బాచి సూరిచే
తోరుచిరాబ్జబోధనరతుండగు [3]దివ్యుఁ బరాశరాత్మజాం
భోరుహమిత్త్రుఁ [4]గొల్చి మునిపూజితు భూరియశోవిరాజితున్.

19 1. అమరిన—అ.న.వ. 2. పారము—కూ.కే.కొ; భారము—టో. 3. వాహినీ-చ.వీ.శ.ష.స 4. విధాతకునైనను—ఊ.కీ.గి ట.ప మ

20 1. 'నిక్కావ్యంబు' లేని ప్రతులు—అ.ఇ.ఈ.ఉ.ఊ.ఎ.ఏ ఐ ఒ ఔ.కీ కు.కూ.కే.చే చో. ట.టి.టే.టో.త.ప.మ.య. ఉన్న ప్రతులు— ఉ.గ.చ జ.డ.ద.బ.శ ష. 2. నని తొడంగి-అ.గి.ద.వ.వా.ష.

21 1. ధ్రువకోకిల—గి; 2. మార—అను పాఠము మేము చూచిన ప్రతులందు కానరా లేదు. ఇతరత్ర కలదని కొందఱందురు. 3. నిర్భర—కు 4. గురుపద్య — 'గి' లో తప్ప అన్నిప్రతులలోను; గురుబద్యగద్య—ఔ.కు కూ టో; గురుబద్య—అను పాఠము గల ప్రతులు—అ.ఇ.ఉ.కు.కూ.కె కే.కొ.కం.ట.టి.టీ.టే.టో. 5. నాథు్య-ఉ.కం.చే. 6. ప్రచేతసపుత్రు—కొన్ని ప్రతులు—రూపము విచార్యము.

22 1. విజృంభణ—ఊ.ప. 2. వాపి-చ ద వా.శ.ష; విజృంభణ బాచి—అ.ఆ.ఇ.ఉ.ఊ. ఎ.ఐ.ఒ.ఔ.క.జ.ట.డ.ప;విజృంభణ మెడల్చి—చే. 3. దివ్యపరాశరా—ఆ.ఉ.గి చ.ట. ద.ప మ.ల.వ.శ.ష స; దివ్యుబరాశరా—అ.ఇ.ఐ.ఒ.వీ. మొదలగునవి. 4 గొల్తు—పెక్కు ప్రతులు.

23 వ. [1]మఱియును.

24 చ. [1]పరమవివేకసౌరభవిభాసితసద్గుణపుంజవారిజో
త్కరరుచిరంబులై సకలగమ్యసుతీర్థములై మహామనో
హరసుచరిత్రపావనపయఃపరిపూర్ణములైన [2]సత్సభాం
తరసరసీవనంబుల ముదం [3]బొనరం గొనియాడి వేడుకన్

25 ఉ. [1]పాయక పాకశాసనికి భారత[2]ఘోరరణంబు[3]నందు నా
రాయణు[4]నట్లు [5]వానసధరామరవంశవిభూషణుండు నా
రాయణ[6]భట్టు వాఙ్మయధురంధరుఁ[7]డుం దన కిష్టుఁడుఁ సహా
ధ్యాయుఁడు నైనవాఁ [8]డభిమతంబుగఁ దోడయి నిర్వహింపఁగన్.

26 ఉ. సారమతిం గవీంద్రులు ప్రసన్నకథా[1]కవితార్థ[2]యుక్తి[3]లో
నారసి [4]మేలునా నితరు [5]లక్షరరమ్యత నాదరింప నా
నారుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు తెనుంగునఁ మహా
భారతసంహితారచనబంధురుఁ డయ్యె [6]జగద్ధితంబుగన్.

23 1. ఎ.ఒ.ఔ.బ.వా. ప్రతులలోఁ దప్ప తక్కిన వానిలో నీ వచనము లేదు.

24 1. 'ఒ' ప్రతిలో నీ పద్యము లేదు. 2. తత్సభాంతర—కొన్నిటఁగలదు. 3. బలరఁ—కే.ట.య.

25 1. ఈ పద్యము లేనివి—ఆ.ఇ.ఊ.ఎ.ఐ.ఓ.ఔ.కు.చే.చొ.టి.ఱే.త.బ. ఈ పద్యము 'సారమతిం' అను పద్యము తరువాత కల ప్రతులు—ఈ.ఉ.ఒ.క.గి.చ.జ.ట డ.శ.ష. కాని అన్వయమగుటలేదు. 2. వీర—కి. భార, అ.ఈ.ఒ.క.కం.జ.ట.టో.డ.ప. 3. నాటి—ల.తి. 4. డట్లు—య.స. 5. వా(ణ)నస—ఉన్న ప్రతులు—అ.ఈ.ప.కూ.ఱే; వాసిగ— ద.వ.వా ; బాణస—చు ; తానును—క.గి.చ.వీ.శ.ష.శ.అప్ప.క ; దాను వసుధామర—కే.ట.య. 6. భట్లు—కీ.కూ.కే.కం చా.టో. 7. డిద్ధవిచారుడున్— జ డ ; నైతనకాప్తుడుం—మ. 8. డభిమతస్థితి—వా. పెక్కుప్రతులు ; అభిమతం బుగ—ఉ.క.చ.వీ. మొదలైనవి.

26 1. కలితా—గి.ద.న.మ.య.ల.వ వా; కవితార్థయుక్తితో—వీ. ఇది 29 ప్రతులలో గల పాఠము ; వివిధార్థయుక్తి (కొన్నిప్రతులు) ; కథాకథితార్థ— కొ. చొ ; కవితార్థతత్త్వ మొప్పారసి—టీ. 2. తత్త్వమున్నారసి—ఉ.ర ; యుక్తితో— అ ఇ.ఎ ఏ ఓ ఔ క.చ.జ.ట.డ.ప.బ.య.వ.శ.ష. 3. లోతారసి—అ.ఈ.ఎ ఏ.ఐ.ఒ. 4. మేలనా—అ.ఆ.ఈ.ఉ.ఊ ఎ.ఓ.క.బ. 5. అక్షతనాదము—చొ. 6. జగత్ప్రసిద్ధి గన్—ప.ర.

## —: భారతకథా ప్రస్తావన :—

సం. 1—1—8

27 వ. [1]తత్కథా ప్రారంభం బెట్టి దనిన.

28 సీ. నైమిశారణ్యపుణ్య[1]క్షేత్రమునఁ గులపతి శౌనకుండను పరమ[2]మౌని
బ్రహ్మర్షిగణసముపాసితుండై సర్వలోకహితార్థంబు లోక[3]నుతుఁడు
ద్వాదశవార్షికోత్తమసత్త్రయాగంబు మొగిఁ జేయుచున్న నమ్మునుల[4]కడకు
వచ్చి తా నుగ్రశ్రవసుఁడను సూతుఁడు రౌమహర్షణి సుపౌరాణికుండు

ఆ. పరమభక్తితోడఁ బ్రణమిల్లి యున్న [5]నక్కథకువలన మునినికాయ మెల్ల
వివిధపుణ్యకథలు [6]వినువేడ్క నతనిఁ బూజించి రపరిమితవిశేషవిధుల.

29 వ. అక్కథకుండు వెండియు నమ్ముని[1]సంఘంబునకు నమస్కారంబు చేసి [2]యే ననేక పురాణపుణ్యకథాకథన[3]దక్షుండ వ్యాసశిష్యుండైన రోమహర్షణునకుఁ [4]బుత్త్రుండ నావలన నెక్కథ విన వలతు రనిన నమ్మును లతని కిట్లనిరి.

30 క. [1]ఏయది [2]హృద్య మపూర్వం బేయది యెద్దాని [3]వినిన నెఱుక సమగ్రం
బై యుండు నఘనిబర్హణ మేయది యక్కథయ [4]వినఁగ నిష్టము మాకున్.

27 1. తత్ప్రారంభం —ఆ.ఇ.ఉ.ఏ.ఐ ఓ క ట.న.య , తత్కృక్రమ్యం—వ.

28 1 క్షేత్రమున కులపతి—ఓ. య. 2. మునియు—అ ఇ.ఈ.ఉ.ఊ.ఎ ఏ.ఐ.ఒ.ఓ.ఔ. క.గి జ.ట.డ.త.ద ప.మ.య.ర. 3 హితుడు—ఉ కీ.చా.మ. 4 సభకు—అ ఇ.ఈ. ఒ గి.త.మ.ల. 5. యక్కథకు—వీ ; యక్కథికు – పెక్కు తాళపత్ర ప్రతులు. 6. వినవేడ్క—వీ శ.ష.

29 1. నికాయంబునకు—వ; సంతతికి—ఊ. 2. యశేష —ఊ ; యనేక–ఊ.ఐ.జ. ప్రతులలో తప్ప 3. దక్షుండగు—చె ; దక్షుండును వ్యాసశిష్యుండును—చౌ ; దక్షుండనైన వ్యాస శిష్యుండ—టి. 4. సూనుండ—ఎ.

30 1. అ.ఆ.ఇ.ఈ.ఉ గి. ప్రతులలో తప్ప తక్కిన అన్నింటను—ఎయ్యది, బెయ్యది, బియ్యుండు, మెయ్యది—అని క్రమముగా నాలుగు పాదములందును గలదు. అనేక ప్రతులలో పద్యము యకారాదిగ నున్నది. 'అద్యఃక్రియాసు భూతార్థద్యోతిన మావ్యగం వినా సర్వః' అను చింతామణి సూత్రప్రకారము పదాది 'యె' త్వము నన్నయకు అంగీకారముగా తోఁచినను 'సర్వత్రాఽజ్వత్కార్యం జ్ఞేయం యస్య ద్రుత ప్రకృతికేభ్యః' అను సూత్రముచే పదాది యకారమునకు అజ్వద్భావము విధింపఁబడి యుండుటచేతను అనంతర సంప్రదాయప్రకారము పదాది యకారము అనంగీకార మగుటచేతను, ఇచ్చట పదాదిని 'ఏ' అను రీతిని అచ్చే గ్రహింపఁ బడిన 2. పుణ్యా—కు. 3. వలన—ఈ.ఊ.ఏ ఐ.ఒ.క. 4. విన నభీష్టము—ఏ.

31 వ. అనిన నుగ్రశ్రవసుం [1]డట్లేని మీకు నభిమతంబైన పుణ్యకథఁ జెప్పెద [2]దత్తావధానులరై వినుండని శౌనకాదిమహామునుల [3]కిట్లని చెప్పం[4]దొడంగె కృష్ణద్వైపాయనుండను బ్రహ్మర్షి తొల్లి వేదంబు లేకీభూతంబులై యేర్పడ కున్న ఋగ్యజుస్సామా[5]థర్వంబులుగా విభాగించి తనశిష్యులయిన పైల [6]వైశంపాయనసుమంతుజైమినులం బంచి క్రమంబునఁ జతుర్వేదసూత్రం బులఁ జేయించి వేదవ్యాసుండై నిజతపోమహత్త్వంబునం జేసి బ్రహ్మచేత ననుజ్ఞాతుండై యష్టాదశ[7]పురాణంబులును [8]నీతిధర్మ[9]శాస్త్రార్థతత్త్వంబులును జతుర్వేదవేదాంతాభిప్రాయంబులును [10]జతుర్వర్గవర్గానుబంధబంధురకథేతి హాసంబులును [11]జతుర్యుగ [12]మహర్షి [13]రాజవంశచరితంబులును జతుర్వర్ణా శ్రమధర్మక్రమంబులును జతుర్ముఖప్రముఖనిఖిలసురముని[14]గణ[15]పూజితుం డైన శ్రీకృష్ణుని మాహాత్మ్యంబును బాండవాదిభారతవీరులమహాగుణంబు లును దన విమలజ్ఞానమయంబైన వాగ్దర్పణంబునం [16]దేర్పడి వెలుంగుచుండ.

32 సీ. ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రం బని యధ్యాత్మవిదులు వేదాంత మనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రం బని కవివృషభులు మహాకావ్య మనియు
లాక్షణికులు సర్వ[1]లక్ష్యసంగ్రహ మని యైతిహాసికు లితిహాస మనియుఁ
బరమపౌరాణికుల్ బహుపురాణసముచ్చయంబని మహిఁ గొనియాడుచుండ.

31 1. డిట్లనియె—ఊ ప య. 2. సావధానులై—కు.టో. 3. కుజెప్పం — ఎ.ఏ.ఐ. ఒ ఔ.క.గి.గి।.చ.జ.ట.డ.త బ ష.ల. 4 దొడంగె నాదియుగంబునందు——ఆ.ఇ.ఈ. ఉ.గి.చ.ట.ద య.ర.ల.వ.వా.శ.ష. 5. థర్వణంబులు —— ఊ.ఎ.ఏ.ఐ.ఒ.ఔ.చ.జ.డ. త.ప.బ.శ.ష ఇంకను పెక్కు ప్రతులు. 6. వైశంపాయన శుకసుమంతు — ఉ ఔ.త.న. 7 పురాణధర్మశాస్త్రార్థ—ఉ.ఎ.ఏ.ఐ.ఒ ఔ.గ.బ.ర.ల.ష. 8. 'నీతి' లేని ప్రతులు — ఓ క.కూ.కె.చ జ డ త శ.ష.పీ. 9. శాస్త్రంబులు——ఊ.ఐ.ఒ.ఓ.క. జ.త.బ ; శాస్త్రతత్త్వంబులు——ఎ.ఏ.ఔ. 10. జతుర్వర్గ వంశాను కథితబంధుర— చె.చే ; జతుర్వర్గ సర్గానుబంధుర—టీ ; జతుర్వర్గానుబంధుర ——చి.టూ కొన్ని ప్రతులలో నిది లేదు. 11. జతుర్యుగప్రసిద్ధ — ఎ.ఏ ఔ.క.చ.జ ట.డ బ మ.ర ల. 12. 'మహ ' లేని ప్రతి—ల. 13 రాజవంశానుచరితంబులును - కె. కొ; రాజ వంశానుకీ నంబులును— కూ. కం. 14. 'గణ' లేని ప్రతులు——ఉ ఊ.ఎ.ఏ ఒ.క. జ.డ.త. 1 కీర్తితుండైన——ఎ.ఏ.ఒ.క.జ.ట.డ.మ.ల.స ; సేవితుండయిన——ర. 16. దేర్పడ——ఆ.ఇ.ఈ.ఉ.ఒ.ద.ర ల.వ.వా.శ.ష.

32 1 లక్షణనిధియని—ఉ.ర.వ ; లక్షణంబనియు——ఒ.ఔ.జ.న.ప.పీ.శ.ష.

ఆ. వివిధ[2]వేదతత్త్వవేది వేదవ్యాసుఁ డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు [3]విశ్వజనీనమై పరగుచుండఁ జేసె భారతంబు.

—: పర్వానుక్రమణిక :—

సం. 1—2—34

33 వ. అదియునుం బౌష్యంబు పౌలోమం బాస్తీకం బాదివంశావతారంబు సంభవ పర్వంబు జతుగృహదాహంబు హైడింబంబు బకవధ చైత్రరథంబు ద్రౌపదీ స్వయంవరంబు వైవాహికంబు విదురాగమనంబు రాజ్యార్ధలాభం బర్జున తీర్థయాత్ర సుభద్రాకల్యాణంబు హరణహారిక ఖాండవదహనంబు మయ దర్శనంబు సభాపర్వంబు మంత్రపర్వంబు జరాసంధవధ దిగ్విజయంబు రాజ సూయం బర్ఘ్యాభిహరణంబు శిశుపాలవధ ద్యూతం బనుద్యూతం బారణ్యంబు కిమ్మీరవధ కైరాతం బింద్రలోకాభిగమనము ధర్మజతీర్థయాత్ర జటాసుర వధ యక్షయుద్ధం బాజగరంబు మార్కండేయోపాఖ్యానంబు సత్యా ద్రౌపదీ సంవాదంబు ఘోషయాత్ర ప్రాయోపవేశంబు వ్రీహిద్రోణకాఖ్యా నంబు ద్రౌపదీహరణంబు కుండలాహరణం బారణేయంబు వైరాటంబు కీచకవధ గోగ్రహణం బభిమన్యువివాహం బుద్యోగంబు సంజయయానంబు ధృతరాష్ట్ర ప్రజాగరణంబు సానత్సుజాతంబు యానసంధి భగవద్యానంబు సేనానిర్యాత్ర యులూకదూతాభిగమనంబు సమరథాతిరథసంఖ్యానంబు

32 2. తత్త్వవేదవేది— ఎ డ బ మ వ ; ధర్మతత్త్వవేది—ఉ మ. 3. విశ్వసంజనకమై— కె, విశ్వసంజననమై—కొ.

33 భండార్కరుప్రతి మున్నగు మూలసంస్కృతప్రతులందు పర్వానుక్రమణికలో 'పర్వానుక్రమణీ - పర్వసంగ్రహః' అను రెండును చేర్పఁబడినవి. వీనితో కలిపి మొత్తము శతపర్వము లగుచున్నవి. 'పర్వానుక్రమణీ పూర్వమ్ ద్వితీయః పర్వసంగ్రహః'— చిత్రశాలాప్రతి. పుట 26. ఆదిపర్వము. భండార్కరు ప్రతిలో— మయదర్శనము— ఇంద్రకీలాభిగమనము — శాంతిపర్వము— ఇవి విడిగా పరిగ ణింపఁబడలేదు. ఇంద్రకీలాభిగమనము కైరాతపర్వమునందు అంతర్భూత మైనది. 'ఈశ్వరార్జునయోర్యుద్ధమ్ — పర్వకైరాత సంజ్ఞితమ్'. మయ దర్శన మును గూర్చి 'తతః ఖాండవదాహాఖ్యం తత్రైవ మయదర్శనమ్' అని యున్నది. శాంతిపర్వమును గూర్చి 'శాంతిపర్వతతో యత్ర రాజధర్మానుకీర్తనమ్'. మూల ప్రతులయందు 'ఇంద్రలోకాభిగమనము' అధికముగా నున్నది. ఇట్లు- పర్వాను క్రమణీ, పర్వసంగ్రహ, ఇంద్రలోకాభిగమన — పర్వములతోఁ గూడ శతపర్వ సంఖ్య నిర్దేశింపఁబడినది.

కర్ణభీష్మవివాదం బంబోపాఖ్యానంబు జంబూఖండ వినిర్మాణంబు భూమి పర్వంబు భీష్మాభిషేకంబు భగవద్గీత భీష్మవధ ద్రోణాభిషేకంబు సంశప్తక వధ యభిమన్యువధ ప్రతిజ్ఞాపర్వంబు జయద్రథవధ ఘటోత్కచవధ ద్రోణ వధ నారాయణాస్త్ర ప్రయోగంబు కర్ణపర్వంబు శల్యపర్వంబు హ్రదప్రవే శంబు గదాయుద్ధంబు సారస్వతంబు సౌప్తికపర్వం బైషీకంబు జలప్రదా నంబు స్త్రీపర్వంబు శ్రాద్ధపర్వంబు రాజ్యాభిషేకంబు చార్వాకనిగ్రహంబు గృహప్రవిభాగంబు శాంతిపర్వంబు రాజధర్మానుకీర్తనం బాపద్ధర్మంబు మోక్షధర్మం బానుశాసనికంబు భీష్మస్వర్గారోహణం బాశ్వమేధికం బనుగీత యాశ్రమవాసంబు పుత్రసందర్శనంబు నారదాగమనంబు మౌసలంబు మహాప్రస్థానికంబు స్వర్గారోహణంబు హరివంశంబు భవిష్యత్పర్వంబు నను శతపర్వంబులు గలిగి.

---

తెలుఁగు తాళపత్రప్రతులను, లండనుప్రతిని, కరాలపాటి రంగయ్యగారి ప్రతిని, వావిళ్ళ, ఆనంద ముద్రణ ప్రతులను సమీకరించి సంశోధితప్రతియందును శతపర్వములు పరిగణింపనైనవి. 'మయదర్శనము — ఇంద్రకీలాభిగమనము, శాంతిపర్వము' తెనుఁగుప్రతులలో వేరుగా పరిగణితములైనవి. వీనిలో దేని యందును 'ఇంద్రలోకాభిగమనపర్వము' లేకుండుట లోపముగా తోఁచినది. ఈ పర్వము ఊర్వశీశాపవృత్తాంతమునకు ప్రాతిపదిక కాఁదగియున్నది. కావున దానిని మేము గ్రహించినాము ఇంద్రకీలాభిగమనము కైరాతమునందలి భాగమే కాన దానిని విడిగా పరిగణించలేదు. ఇట్లు శతపర్వసంఖ్య నిర్ణయింపనైనది.

భండార్కరు ప్రతిలో మొదట 'అనుక్రమణీపర్వ' 'పర్వసంగ్రహపర్వ' అని రెండధికముగఁ గలవు. కొన్ని తాళపత్రప్రతులలో ఉపపర్వములతోబాటు పర్వ సంగ్రహమునందలి యంశములు కూడ పర్వములుగా గణింపఁబడియున్నవి. అట్లు గణింపఁబడిన వానిలో— పంచేంద్రోపాఖ్యానము, ఉలూచి సమాగమము, గాండీవ దివ్యరథాశ్వలాభము, మయభుజంగ మోక్షణము, మందపాలోపాఖ్యా నము, కృష్ణపాంచాలాభిగమనము, సౌంభకాఖ్యానము, నలోపాఖ్యానము, శ్రీరామ చరిత్రము, సావిత్ర్యుపాఖ్యానము— అనునవి ముఖ్యములు.

ద. ప్రతిలో పర్వానుక్రమణికయందు ఒక్కొక్క ప్రధానపర్వమున ఎన్నెన్ని యుపపర్వములు గలవో సంఖ్యలతో విశదముగ చూపఁబడియున్నవి ఈ యుప పర్వముల సంఖ్య నన్నయ పర్వసంగ్రహమును వివరించుచు ఒక్కొక్క ప్రధాన పర్వమున కలవని చెప్పిన యుపపర్వముల సంఖ్యతో సరిపోవుచున్నది.

'ఇంద్రకీలాభిగమన' పర్వమును విడిచి, 'కైరాతము' తర్వాత 'ఇంద్రలోకాభి గమన' పర్వమును ఈప్రతిమాత్రమే సూచించుచున్నది. ఇది సంస్కృత భారతము భం. తో సంవదించు చున్నది. ఇట్లుండుటయే యుచితము.

34 సీ. ఆయురర్థులకు దీర్ఘాయురవాప్తియు నర్థార్థులకు విపులార్థములును
ధర్మార్థులకు నిత్యధర్మసంప్రాప్తియు వినయార్థులకు [1]మహావినయమతియుఁ
బుత్త్రార్థులకు బహుపుత్త్రసమృద్ధియు సంపదర్థుల కిష్టసంపదలును
[2]గావించు నెప్పుడు భావించి వినుచుండు[3]వారికి నిమ్మహాభారతంబు

ఆ. భక్తియుక్తులైన [4]భాగవతులకు శ్రీవల్లభుండు భక్తవత్సలుండు
భవభయంబు లెల్లఁ [5]బాచి యిష్టార్థసంసిద్ధిఁ గరుణతోడఁ జేయు[6]నట్లు.

—: పర్వసంగ్రహము :—

సం. 1—2—71

35 వ. మఱియుఁ బౌష్యోదంకమాహాత్మ్యంబును భృగువంశకీర్తనంబును నాగ గరుడసంభవంబును సముద్రమథనంబు నుచ్చైశ్శ్రవోజన్మంబును సౌపర్ణో పాఖ్యానంబును [1]నాస్తీకచరితంబును జనమేజయసర్పయాగంబును శ్రీ మహాభారతకథాశ్రవణప్రవృత్తియు వ్యాసజన్మంబును దేవదైత్యదానవ ముని యక్షపక్షిగంధర్వాది నానావిధభూతసంభవంబును దదంశావ తారంబును రాజవంశానుకీర్తనంబును యయాతిచరితంబును భారత వంశానుకీర్తనంబును గంగాశంతనుసమాగమంబును వసూత్పత్తియు స్వర్గ గమనంబును దదంశసంభూతంబున గాంగేయజన్మంబును దద్రాజ్య నివర్తనంబును బ్రహ్మ[2]చర్య ప్రతిజ్ఞాపరిపాలనంబును సత్యవతీవివాహంబును

34 1 మహావిమలమతియు—చె. 2 'కావించు నెప్పుడు భావించి వినుచుండు' దీనిపై భారతపక్కిలోని చర్చ — ''ఈ పద్యము సర్వయతి సీసము— కాని పై పాఠము గ్రహించినచో ఆ నియమము చెడును. కావున ఈ క్రింది సవరణ సూచింపనైనది. 'కావించు నెప్పుడు కామించి వినుచుండు వారల కిమ్మహాభారతంబు'—అభేదయతి'' 3. వారలకిమ్మహా—ఊ.పౌ.క.గి.చ.న.మ య.వ.వా.శ ష.శ. 4. భాగ్యవంతులకు— చ.వా.శ.శ. ప్రతులలో తప్ప అన్నిటియందును 5. బాపి—వా, బాచి—అ.ఊ.ప.ఒ. క.గ.డ.బ. 6. చుండు — అ ఆ ఇ.ఈ.ప.ఐ.ఒ.ఓ.క గ గి చ జ ట.డ.న.బ మ.య.ర. ల.వ.శ.స.వీ; బ్రీతి—ఊ.పౌ.ప.

35 1. ఆస్తిక చరితంబును— వీ.శ.ష మున్నగు ప్రతులు 2. చర్య వ్రతప్రతిజ్ఞా—వీ.శ ష. మున్నగు ప్రతులు.

భండార్కరు ప్రతిలోను, పి. పి యస్ శాస్త్రి ప్రతిలోను పర్వసంగ్రహము చాలవఱకు సమానముగ నున్నది నన్నయ పర్వసంగ్రహమునందు పేర్కొన్న వివరములకంటెను ఈ మూలములందలి వివరములు తక్కువ ఐనను ఆదిపర్వము నందలి ఉపపర్వములు పదునెనిమిది యనియే నన్నయయు చెప్పియున్నాఁడు. తెలుఁగు లిపిలోని సంస్కృతభారతములో (వావిళ్ళప్రతి) పర్వసంగ్రహము నందు శకుంతలోపాఖ్యానము చెప్పఁబడినది. ఇది తక్కినవానిలో లేదు దీనిలో

చిత్రాంగద విచిత్రవీర్య జన్మంబును జిత్రాంగద రాజ్యాభిషేకంబును జిత్రాంగద మరణానంతరంబున భీష్ముండు విచిత్రవీర్యుం గౌరవరాజ్యంబున నభిషిక్తుం జేయుటయు వాని పరోక్షంబునఁ గృష్ణద్వైపాయనమునివలన ధృతరాష్ట్ర పాండురాజుల జన్మంబు నాణిమాండవ్యోపాఖ్యానంబును ధర్ముండు మాండవ్య శాపంబున శూద్రయోనియందు విదురుండై పుట్టుటయును ధృతరాష్ట్రపాండురాజుల వివాహంబును బాండవధార్తరాష్ట్రసంభవంబును బాండునిర్యాణంబును గృపద్రోణజన్మకథనంబును గుమారాస్త్రవిద్యాగ్రహణంబును గుమారాస్త్రసందర్శనంబును గర్ణార్జునుల పరస్పరక్రోధంబును ద్రుపదగ్రహణమోక్షణంబును యుధిష్ఠిరు యౌవరాజ్యాభిషిక్తుం జేయుటయు దుర్యోధను దుర్మంత్రంబును వారణావతయాత్రయు జతుగృహదాహంబును విదురోపదిష్టద్వారంబునఁ బాండవాపక్రమణంబును హిడింబాదర్శనంబును హిడింబువధయును ఘటోత్కచసంభవంబును బాండవుల [3]కేకచక్రపురంబున విప్రగృహంబున నజ్ఞాతచర్యయు బకవధయు ధృష్టద్యుమ్నద్రౌపదీజన్మకథనంబును గృష్ణద్వైపాయన సందర్శనంబును గంగాతీరంబున నంగారపర్ణు నర్జునుండు జయించుటయుఁ దాపత్యవసిష్ఠౌర్వోపాఖ్యానంబును బాండవులు పాంచాలదేశంబునకుం జనుటయు ద్రౌపదీస్వయంవరంబును బంచేంద్రోపాఖ్యానంబును ద్రౌపదీవివాహంబును విదురాగమనంబును గృష్ణసందర్శనంబును రాజ్యార్ధలాభంబును ఖాండవప్రస్థనివాసంబును సుందోపసుందోపాఖ్యానంబును నారదువచనంబున ద్రౌపదియందు సమయక్రియయును నర్జును తీర్థాభిగమనంబును నులూపి

నిచ్చిన శ్లోక సంఖ్య 8884. భం. ప్రతిలోని శ్లోక సంఖ్య 7984. పి పి.ఎస్. శాస్త్రి ప్రతిలో శ్లోక సంఖ్య 9884 అని చెప్పఁబడినది. నన్నయ చెప్పిన శ్లోకసంఖ్య 9984. ఐ. ప్రతిలో ఆదిపర్వ శ్లోకసంఖ్య 11984 గా నున్నది. యయాతి చరిత్ర భారత వంశానుకీర్తనము గంగాశంతను సమాగమము సత్యవతీ వివాహము చిత్రాంగద విచిత్రవీర్య జన్మము - ఈ ఐదంశములును మూలమున లేవు. అ. ఆ. ఇ. ఈ. ఉ ఊ ఎ. ఏ. ఐ.ఔ. క. ట డ. ప. బ ప్రతులయందును లేవు.

"పంచానా మేకపత్నీ త్వే విమర్శో ద్రుపదస్య చ" — అను మూలమునందలి యంశము ఆ. ఏ. ద ప్రతులలోఁ గలదు.

3. మూలమునందు 'ఏకచక్రాపురము' అని కలదు.

సమాగమంబును జిత్రాంగదయందు బభ్రువాహను జన్మంబును ద్వారకా గమనంబును వాసుదేవానుమతంబున నర్జునుఁడు సుభద్ర వివాహంబగు టయు సుభద్రాహరణంబును హరణహారికయు నభిమన్యుసంభవంబును గాండీవదేవదత్త దివ్యరథాశ్వలాభంబును ఖాండవదహనంబు నగ్నిభయంబు వలన మయభుజంగమోక్షణంబును మందపాలోపాఖ్యానంబును నను వృత్తాంతంబుల నొప్పి తొమ్మిదివేలుందొమ్మన్నూటయెనుబదినాలుగు శ్లోకంబులు గలిగి.

36 క. మదిఁ బౌష్యపర్వమాదిగఁ బదునెనిమిది పర్వములను బర్వి మనఃప్రీ
తి[1]దమగుచు నాదిపర్వం బది వినఁగా నొప్పు భారతాద్యం బగుచున్.

37 వ. మఱియు ధర్మరాజునకు సభాప్రాప్తియుఁ గింకరదర్శనంబును నారదు వలన లోకపాల సభాశ్రవణంబును రాజసూయ మహాధ్వరారంభంబును జరా సంధవధయును గిరివ్రజనిరుద్ధులైన రాజులఁ గృష్ణుండు విడిపించుటయును దిగ్విజయంబును రాజసూయంబు నర్ఘ్యాభిహారణంబును శిశుపాలవధయును రాజసూయవిభూతికి దుఃఖితుండై సభాస్ఖలితుండై యున్న [1]దుర్యోధనుం జూచి ద్రౌపదీ భీమసేనులు నగుటయును దత్కారణంబున జూదం బాడు టయు నందు శకునికైతవంబున ధర్మరాజపరాజయంబును ద్యూతదుఃఖా ర్ణవమగ్నులైన పాండవులం బాంచాలి యుద్ధరించుటయును బునర్ద్యూత పరాజితులై పాండవులు వనవాసగతు లగుటయునను వృత్తాంతంబుల నొప్పి [2]నాలుగువేలుఁ మున్నూటపదునొకండు శ్లోకంబులు గలిగి.

అణిమాండవ్యోపాఖ్యానము ధృతరాష్ట్రపాండురాజుల వివాహము కుమారాస్త్ర విద్యాగ్రహణము కర్ణార్జునుల పరస్పర క్రోధము ద్రుపదగ్రహణ మోక్షణము ఈ అంశములు సంస్కృతమూలమునలేవు. అ ఆ ఉ.ఎ.ప.క.జ ద.ప.బ. ప్రతులందును లేవు.

36 1. దనరుచు— ఊ

37 1. దుర్యోధనుంజూచి ద్రౌపదీ భీమసేనులు నగుటయు — అను నంశము నన్న యలో కలదు. సంస్కృత మూలమున ద్రౌపది నవ్వినట్లు లేదు. అ ఆ ఇ. బొ. త.ల ప్రతులందును లేదు. 2. భం. ప్రతి 2511 శ్లోకములనియు పి.పి.యస్. ప్రతి 4511 శ్లోకములనియు నీలకంఠ ప్రతి 25:1 శ్లోకములనియు పేర్కొనుచున్నవి.

38 క. పర్వి సభా[1]ప్రభృతిగ నవపర్వములను విస్తరిల్లి పండితచేతో
నిర్వృతిఁ జేయుచు [2]రెండవ పర్వమునా రమ్యమగు సభాపర్వమిలన్.

39 వ. మఱియు మహారణ్యంబునందుఁ గిమ్మీరవధయును గృష్ణపాంచాలాగమనంబును [1]సౌభకాఖ్యానంబును యుధిష్ఠిరభీమసేనసంవాదంబును గురూపదేశంబున నర్జునుండు దివ్యాస్త్రంబులు వడయఁ దపశ్చరణంబు సేయుటయు నీశ్వరుతోడి యుద్ధంబును లోకపాలసందర్శనంబును దివ్యాస్త్రలాభంబును స్వర్గగమనంబును నిట బృహదశ్వుండను మహామునిం గాంచుటయు యుధిష్ఠిరాదుల పరిదేవనంబును నలోపాఖ్యానంబును దమయంతీపతివ్రతాస్తుతియు యుధిష్ఠిరాదులకు నర్జునకుశల వార్త రోమశుండు సెప్పుటయును ధర్మజు తీర్థాభిగమనంబును జటాసురవధయును బాంచాలీనియుక్తుండై భీముండు సౌగంధికపుష్పాహరణార్థంబు గంధమాదనంబునందలి కొలనికిఁ జని యందు మణిమంతుఁడు మొదలుగాఁగల యక్షరాక్షసులం జంపుటయు నాజగరంబు నగస్త్యోపాఖ్యానంబును వాతాపిభక్షణంబు నపత్యార్థం బగస్త్యమహాముని లోపాముద్ర నభిగమించుటయు శ్యేనకపోతంబులైన యింద్రాగ్నులు శిబిమాంసంబు గొనుటయు ఋష్యశృంగు చరితంబును బరశురామ చరితంబును గార్తవీర్యవధయును మాంధాతృజన్మంబును సౌకన్యాఖ్యానంబును భార్గవుండయిన చ్యవనుండు శర్యాతి యజ్ఞంబున నాశ్వినుల సోమపీథులం జేసి వారిచేత జవ్వనంబు వడయుటయు జంతూపాఖ్యానంబును యజ్ఞపుత్త్రుండైన సోమకుండు బహుపుత్త్రార్థంబు యజ్ఞంబు

38 1. ప్రభృతిక—ఎ 2 రెండగు-స.

39 1. సౌంభకాఖ్యానము- కొన్ని ప్రతులు పర్వశ్లోక సంఖ్య మూలమున భం. పి. పి ఎస్. నీలకంఠ ప్రతుల ననుసరించి 11664 నన్నయ ననుసరించి 13664 మూలముకంటె నధికముగా నన్నయలో కన్పట్టు అంశములు దివ్యాస్త్రలాభము మున్నగునవి నీలకంఠుడు అనుసరించిన మూలమునఁగలవు నన్నయభారతమునందు కంటె నధికాంశములు నీలకంఠ ప్రతిలో గలవు. ద. ప్రతిలో మాత్రము 11664 శ్లోకములనియే కలదు. సౌగంధికావృత్తాంతమున మందార పుష్పమని భం. ప్రతిలోను, పి.పి ఎస్. ప్రతిలోను కలదు. నీలకంఠ ప్రతిలో సౌగంధిక మని యున్నది. మందార పుష్పమని ఈ ఉ.ఊ ఎ.ఏ.ఐ ఒ.ఓ. క.ట.త న.ప.బ.ర ల ప్రతులలో వాడఁబడి

సేసి పుత్త్రశతంబును బడయుటయు వంద్యష్టావక్రుల వివాదంబును సము
ద్రంబును జయించి తిత్తిరియను మహర్షి తనతండ్రిం బడయుటయు దివ్యాస్త్రం
బులు వడసి యర్జునుండు హిరణ్యపురనివాసులయిన పౌలోమకాలకేయ
నివాతకవచాదులం జంపుటయు గంధమాదనంబున కందఱుం * గూడవచ్చు
టయు మార్కండేయబహువిధోపాఖ్యానంబును గృష్ణసందర్శనంబును
సత్యాద్రౌపదీసంవాదంబును ఘోషయాత్రయుఁ జిత్రసేనాది గంధర్వులఁ
జెక్కండ్ర జయించి దుర్యోధనుని విడిపించుటయు దుర్యోధనుని ప్రాయోప
వేశంబును వ్రీహిద్రోణకాఖ్యానంబును గలియుగధర్మంబును వామ్యాశ్వ
హరణంబును నింద్రద్యుమ్నోపాఖ్యానంబును సరస్వతీగీతయు ధుంధుమారు
చరితంబును జయద్రథుఁ డాశ్రమాంతరంబున ద్రౌపది నపహరించుటయు
భీముండు వానిం బరిభవించుటయు నుద్దాలకోపాఖ్యానంబును వైన్యో
పాఖ్యానంబును శ్రీరామాయణకథయును సావిత్ర్యుపాఖ్యానంబును
పాండవులు క్రమ్మఱ ద్వైతవనంబునకు వచ్చుటయుఁ గర్ణుకవచకుండలంబు
లింద్రుండు గొనుటయు నారణేయోపాఖ్యానంబును యముండు ధర్మజు
ననుశాసించుటయు యమువలన వరంబులు వడసి పాండవులు పశ్చిమదిక్కు
నకుం జనుటయు ననువృత్తాంతంబులనొప్పి పదుమూఁడువేలు నాలునూట
యఱువదినాలుగు శ్లోకంబులు గలిగి.

40 క. ఆరణ్యపర్వమనఁగా నారణ్య[1]ప్రముఖమోద శాంతః[2]పర్వా
ధారమయి సకలసూరిసభా[3]రమ్యంబగు తృతీయ[4]పర్వము వెలయున్.

యున్నది మహారణ్యప్రయాతులగు పాండవులంజూచి పౌరులు నిర్వేదించుటయు,
ధౌమ్యోపదేశంబున ధర్మజునకు సూర్యప్రసాదంబుచే నన్నసంభవంబును నట విదుర
ప్రవాసంబును, మైత్రేయ శాపోత్సర్గము అను నంశములు సంస్కృతమూలాను
సరణముగా ఊ.ప మ ప్రతులలో గలవు.

పౌరానుకంపా ప్రజతో ధర్మరాజస్య ధర్మతః
ధౌమ్యోపదేశాత్ తిగ్మాంశు ప్రసాదా దన్నసంభవః
మైత్రేయశాపోత్సర్గశ్చ విదురస్య ప్రవాసనమ్. ॥

అని పి.పి.ఎస్. ప్రతి. ఇది నన్నయలో లేదు

* సమాగమశ్చ పార్థస్య భ్రాతృభి ర్గంధమాదనే - ఖం.

40 1. ప్రభృతి–మ. 2 పరోపదారమయి–డ. 3. రంజనమగు–ఊ.ఒ గ.జ.డ. 4. పర్వం బలరున్–ట; పర్వంబమురున్–ఔ గ.స; పర్వంబగుచున్–చె.

41 వ. మఱియు విరాటనగరంబునకుం జనుచుండి తత్సమీపశమీవృక్షంబునఁ బాండవులు తమ యాయుధంబులు నిక్షేపించి తమ్మెవ్వరు నెఱుంగకుండ విరాటుం గొలిచి యునికియు నందు భీముండు సింహబలుం దొట్టి సకల కీచకుల వధించుటయు గోగ్రహణంబునఁ గురుబలంబుల నెల్ల నొక్క రుండ జయించి ధనంజయుండు గోగణంబులఁ గ్రమ్మఱించుటయు విరాటరాజపుత్త్రి యైన యుత్తర నభిమన్యుండు వివాహం బగుటయు నను వృత్తాంతంబుల నొప్పి మూఁడు వేలు నేనూఱు శ్లోకంబులు గలిగి.

42 క. పర్వుచు వైరాటాదిక పర్వచతుష్టయమునను [1]సభారంజనమై
సర్వమనోజ్ఞము [2]నాలగు పర్వమునాఁ దగి విరాట[3]పర్వము వెలయున్.

43 వ. మఱియు భారత రణోద్యోగు లైన పాండవు లుపప్లావ్యంబున విడియు టయు నర్జునదుర్యోధనులు ద్వారకా నగరంబునకుం జని శ్రీకృష్ణునిం గని సహాయత్వంబునకుం బ్రార్థించుటయు నారాయణుండు వారి నాశ్వాసించి నారాయణ గోపాల బలంబుల నిరూపించి వారలం గోరికొం డనుటయు నారాయణ గోపాల బలంబుల దుర్యోధనుండు గోరికొను టయు నారాయణుని నొక్కని నర్జునుండు గోరికొనుటయు ధృతరా ష్ట్రుండు వనుప నుపశమనార్థం బుపప్లావ్యంబున సంజయుండు పాండవుల కడకుం బోవుటయు వాసుదేవ సహితు లైన పాండవుల రణప్రారంభంబు విని ధృతరాష్ట్రుండు నిద్రాహారంబులు విడిచి చింతాక్రాంతుం డగు టయు హితవచనుం డైన విదురు పల్కులు వినమియు ధృతరాష్ట్రునకు మనస్తాపోపశమనంబుగా సనత్సుజాతుం డధ్యాత్మ కథలు సెప్పుటయు

41 విరాట పర్వశ్లోక సంఖ్య భం. నీలకంఠ ప్రతుల ప్రకారము 2050. పి. పి. ఎస్ ప్రతియందు — 3500. నన్నయ 3500 తాళపత్ర ప్రతులలో శ్లోకసంఖ్య కొన్నింట 7500 అనియు, మఱికొన్నింట 2800 అనియు కలదు.

42 1. సభారమ్యంబై—శా.స. 2. నాలవ — పెక్కు ప్రతులు. నాలగు — ఉ.త. 3. పర్వంబొప్పున్ — స; పర్వంబమరున్ — ద స.

43 శ్లోక సంఖ్య — భం. నీలకంఠ — 6698, పి. పి. ఎస్ — 7998 నన్నయ 6998 అర్ధరథులలోనం గలయం దన్నెన్నిన నలిగి కర్ణుండు భీష్ము పది దినంబులు సమర పరాఙ్ముఖుండగుటయు సం క్రందనోపాఖ్యానము - అను నంశములు సంస్కృత

వాసుదేవార్జునుల యత్యంత సాంగత్యం బెఱింగి వచ్చి సంజయుండు సకల రాజసమక్షంబున విస్తరించుటయు సర్వభూతహితుండైన శ్రీకృష్ణుండు పాండవ ధార్తరాష్ట్రులకు సంధి గావింపం దలంచి హాస్తిపురం బునకుం జని యందుఁ గర్ణాది దుష్టశిక్షితుండైన ధుర్యోధను దుర్మంత్రం బెఱింగి విశ్వరూపంబుఁ జూపుటయుఁ గృష్ణుండు కర్ణునిం దన రథం బెక్కించుకొని యుపాయంబున ననునయించి యొడంబఱుప నేరక కర్ణు చేతం బ్రత్యాఖ్యాతుండయి క్రమ్మఱి వచ్చుటయు బలాతిబల సంఖ్యానంబు నెల్లి యుద్ధంబు సేయవలయునని కురుపతి పనుప నులూకుండను దూత పాండవుల పాలికి వచ్చి పరుసంబులు పలుకుటయు సమరథాతిరథసంఖ్యా నంబు నర్ధరథులలోనం గలయం దన్నెన్నిన నలిగి కర్ణుండు భీష్ము పదిదినం బులు సమరపరాఙ్ముఖుండగుటయు రామభీష్ములయుద్ధకీర్తనంబు నంబో పాఖ్యానంబును సంక్రందనోపాఖ్యానంబును శ్వేతాభిషేకంబు నను వృత్తాంతంబుల నొప్పియాఱువేలుం దొమ్మనూటతొంబది యెనిమిది శ్లోకంబులు గలిగి.

44 క. విదితంబై యుద్యోగము మొదలుగఁ బదు[1]నొకఁడు పర్వముల నెంతయు[2]నొ
ప్పిదమై [3]యేనగు పర్వం బిది నా నుద్యోగ పర్వ మిమ్మగు సభలన్.

45 వ. మఱియు [1]జంబూఖండవినిర్మాణంబు సంజయుండు ధృతరాష్ట్రునకుం జెప్పుటయు భూవిస్తారంబును భీష్మాభిషేకంబును పాండవ మధ్యమ విషా దంబును వాసుదేవుండు మోక్షదర్శన హేతువులం జెప్పి యర్జును మోహా

మూలమున లేవు. శ్వేతాభిషేకము అనునంశము పి. పి. ఎస్. లో కలదు. సంక్రందనోపాఖ్యానము లేనిప్రతులు ఆ.ఇ.ఈ.ఐ.ఒ.త.ద.ను. శ్వేతాభిషేకము లేని ప్రతులు — ఆ.ఇ.ర.

44 1. నొక్క — అ.ఐ.ఔ.చ.ట.య ల.వి.స.స.శ; నొండు — ఒ. 2. నింపొదవిన—స. మున్నగు పెక్కుప్రతులలో గలవు. 3. యేనవ—ఇ ఈ.ఐ ఒ.ఓ.క.గి.గి$_1$.చ.ము.య.ర. వ.వా.శ.ష.

45. 1. జంబూషండ—అని తెలుఁగుప్రతు లన్నియు. భూవిస్తారంబును భీష్మాభిషేకంబును అను నంశములు సంస్కృతమూలమున లేవు. గి.గి$_1$.చ.ము.వ. లలో తప్ప తక్కిన ప్రతు లన్నిటియందును పాండవ మధ్యము విషాదంబును అనుటకు బదులు పాండవ

భ్రాంతిఁ జెఱుచుటయు శిఖండిం బురస్కరించుకొని యర్జునుండు భీష్ముని వధియించుటయు నను వృత్తాంతంబుల నొప్పి యైదువేలు నెనమన్నూట యెనుబదినాలుగు శ్లోకంబులు గలిగి.

46 క. జంబూఖండవినిర్మాణం బాదిగ హృదయ[1]రోచనములగు నేన్ప
ర్వంబులను భీష్మపర్వము పంబి వినం బొలుచు షష్ఠపర్వం బగుచున్.

47 వ. మఱియు ద్రోణాభిషేకంబును సంశప్తకు లర్జునుం బాపికొనిపోయి యేక తంబు యుద్ధంబు సేయుటయు నర్జునుచేత సుప్రతీకగజంబు తోడన భగదత్తు చావును ద్రోణకర్ణాదులు పెక్కండ్రు గూడుకొని యధర్మయుద్ధంబున నభిమన్యుం జంపుటయు నర్జును ప్రతిజ్ఞయు నభిమన్యు వధకుం గ్రుద్ధుండై యర్జునుం డేడక్షౌహిణుల బలంబుల నొక్కరుండ చంపి సైంధవుం దునుముటయును దొమ్మిది కోట్లు సంశప్తకుల నర్జునుండు నిశ్శేషంబు సేయుటయు నలంబస శ్రుతాయు జలసంధ [1]సోమదత్త భూరిశ్రవో బాహ్లిక విరాట ద్రుపద ఘటోత్కచ ధార్తరాష్ట్ర నారాయణ గోపాలాది వధయును ద్రోణవధయు నశ్వత్థామ నారాయణాగ్నేయాస్త్ర కీర్తనంబును గృష్ణార్జునుల మాహాత్మ్యంబును ననువృత్తాంతంబుల నొప్పి పదివేలుం దొమ్మన్నూట పందొమ్మిది శ్లోకంబులు గలిగి.

సైన్యవిషాదంబును అని యున్నది. "యత్రయోధిష్ఠిరం సైన్యం విషాద మగమత్పరమ్" అని మూలము. కొన్ని తెలుఁగు ప్రతులలో విషాదము అనుటకు మారుగా వివాదము అని యున్నది. మూలమున జంబూ ఖండ అని యున్నది. నన్నయలో జంబూ షండ అని ప్రయుక్తము. నన్నయ యిచ్చిన శ్లోక సంఖ్య 5884. ఇది మూల సంఖ్యతో సరిపడుచున్నది.

46 1. రంజన — ఇ గి.చ ద.బ.వి.శ స.శ ; తోషణ — జ; మోహన — స; శోభన— ఈ.ఉ.ఎ.గ.ట.ద ప.మ.ర; శోభనములగు నవపర్వంబులను — చె

47 1. సోమదత్త-ష.స. ప్రతులలో లేదు

సంస్కృత మూలము ననుసరించి శ్లోకసంఖ్య 8909. నన్నయ - 10919. కొన్ని తెలుఁగు ప్రతులలో 9909 అనియు, కొన్నింట 10909 అనియు కల్లవు. **అర్జును ప్రతిజ్ఞ ద్రోణవధ** అను నంశములు మూలమున లేవు. కృష్ణార్జున మాహాత్మ్యము అను నంశము నీలకంఠ ప్రతిలోఁగలదు.

48 క. విన [1]నేడగు పర్వము మేలనఁగా ద్రోణాభిషేక మాదిగఁ గల య
య్యేనిమిది పర్వములను సత్యానుపమమై ద్రోణపర్వ మమరున్ సభలన్.

49 వ. మఱియుఁ గర్ణాభిషేకంబును గర్ణునకు రథంబు గడప [1]శల్యుం బూన్చు
టయుఁ ద్రిపురదహనోపాఖ్యానంబును కర్ణశల్యుల పరస్పరవివాదంబును
హంసకాకీయోపాఖ్యానంబును యుధిష్ఠిరార్జునుల పరస్పరక్రోధవచ
నంబులు నర్జునానునయంబును వృషసేను వధయును దుశ్శాసనుం జంపి
భీముండు తద్వక్షోరక్తం బాస్వాదించుటయు విప్రశాప నిమిత్తంబునఁ
గర్ణు రథచక్రంబు భూమియందుఁ గ్రుంగుటయు నాగాస్త్రభయంబున
నర్జును రథంబు శ్రీకృష్ణుండు భూమియందుఁ జొనపుటయు నింద్రాది
త్యుల పరస్పరసంవాదంబును గర్ణువధయును నను వృత్తాంతంబుల
నొప్పి నాలుగు వేలుం దొమ్మనూఱు శ్లోకంబులు గలిగి.

50 క. అనుపమబలులగు కర్ణార్జునవీరుల శౌర్యమహిమ [1]శోభిల్లంగా
నెనిమిదియగు పర్వం బిది యనఁ బరగుం గర్ణపర్వ మతిహృద్యంబై.

51 వ. మఱియు భారతవీరు లెల్లఁ బరలోకగతులైన శల్యుండు రణభారంబు
పూనుటయుఁ గురుకుమారవధయును ధర్మజు రోషంబున శల్యు మరణం
బును గురుముఖ్యుల వధయును సహదేవునిచేత సపుత్రకుండైన శకుని

48 1. నేడవు — య; నేడవ — ఇ ఈ.ఉ.ఐ.బ.మ.

49 1. శల్యు పూనుటయు - స. భం. ప్రతిలోను, పి.పి.ఎస్. ప్రతిలోను, శ్లోకసంఖ్య 4900. నీలకంఠ ప్రతిలో 4964. అర్జునానునయము, దుశ్శాసనుంజంపి ... ఆస్వాదించుట అను నంశములు నీలకంఠప్రతిలోఁ గలవు. వృషసేను వధ విప్రశాపనిమిత్తంబున ... క్రుంగుట నాగాస్త్ర భయంబున ... జొనుపుట - అను నంశములు భం. ప్రతిలో పాఠాంతరములుగ గుర్తింపఁబడినవి.

50 1 శోభిల్లుచుఁ దానెనిమిది యగు మర్వమ మేలనఁగఁ బరఁగుఁ—స; నెనిమిదవదైన పర్వం బన బరగుచు గర్ణపర్వ మతిహృద్యంబై - ద.

51 కురు కుమార వధ అను నంశము అ.గి $గి_1$.చ.జ.ప.మ.ల.ప. ప్రతులలో తప్ప తక్కిన తాళపత్ర ప్రతులలో లేదు. సంజయగ్రహణమోక్షణము మూలమున లేదు. సహదేవునిచేత ... శకుని చావు హ్రదప్రవేశము భం. ప్రతిలో

చావును సంజయగ్రహణమోక్షణంబును హ్రదప్రవేశంబును భీమదుర్యోధనుల గదాయుద్ధంబును సరస్వత్యాదిపుణ్యతీర్థకీర్తనంబు ననువృత్తాంతంబుల నొప్పి మూఁడువేలు నిన్నూట యిరువది శ్లోకంబులు గలిగి.

52 ఆ. సభల విస్తరిల్లి శల్యాదికము లైన నాల్గుపర్వముల వినంగఁ జాలి
నవమపర్వ[1]మనఁగ నవ్యార్థరమణీయమగుచు శల్యపర్వ మతిశయిల్లు.

53 వ. మఱియు భీము గదాభిఘాతంబున దుర్యోధనుండు తొడలు విఱిగిపడిన పాండవులు రణం బుపసంహరించి చనిన నాఁటి రాత్రి కృపకృతవర్మాశ్వత్థామలు పాండవశిబిరంబుపయిం జనుటయు నందశ్వత్థామ కోపోద్దీపితుండై తన ప్రతిజ్ఞ దీఱ ధృష్టద్యుమ్నపురోగము లైన సర్వపాంచాలురను బ్రతివింధ్యాదిద్రౌపదేయులను పాండవామాత్యులను సుఖసుప్తులయిన వారి వధించుటయు నందు శ్రీకృష్ణప్రసాదంబునఁ బాండవులేవురు సాత్యకియుం దప్పుటయుఁ బుత్త్రభ్రాతృవధదుఃఖితయై పాంచాలి యనశనంబు సంకల్పించుకొనుటయు దద్వచనంబున భీముం డశ్వత్థామ పిఱుందం జనుటయు భీమసేనభయార్తుండయి యశ్వత్థామ యపాండవం బయ్యెడ మని శరమోక్షణంబు సేయుటయు నట్లు గాకుండెడమని శ్రీకృష్ణుండు దానిం బరిహరించుటయు దానిం దునియ నర్జునుండు తన దివ్యబాణంబున నేయుటయు వ్యాసాశ్వత్థామల యన్యోన్య శాపంబులు నశ్వత్థామ శిరోరత్నంబుఁ బాండవులు గొనుటయు నను వృత్తాంతంబుల నొప్పి రెండు వేలు నెనమన్నూట డెబ్బది శ్లోకంబులు గలిగి.

పాఠాంతరములుగఁ గలవు నన్నయ యిచ్చిన శ్లోకసంఖ్య భం. ప్రతితో సరిపడుచున్నది

52 1. మయ్యె ... శయిల్లి — శ.

53 తాళపత్రప్రతులలో శ్లోకసంఖ్య 2870 అనియున్నది. సంస్కృత మూలమున 870 అని యున్నది ద ప్రతిలో మాత్రము ఎనమన్నూట డెబ్బది శ్లోకంబులు అని మూలానుసరణముగ నున్నది. అశ్వత్థామ శిరోరత్నంబును పాండవులు గొనుట అను నంశము నీలకంఠప్రతిలోఁ గలదు. ఈయంశము లేని ప్రతులు — ఆ.ఇ.ఈ.ఉ.ఊ ఎ ఐ.ఒ.ఔ.ట.డ.ద.ప.

54 క. మతసౌప్తికాది పర్వత్రితయంబునఁ దనరి వసుమతీసురవరస
మ్మతమై సౌప్తికపర్వము ప్రతిభ వినం బొలుచు దశమపర్వం బగుచున్.

55 వ. మఱియు వీరపత్నీవిలాపంబును గాంధారీధృతరాష్ట్రుల కోపప్రసాదంబులును ధర్మజుండు రణనిహతులైన పితృపితామహభ్రాతృపుత్త్రభృత్యామాత్యమాతులాచార్య మిత్త్రాదులం బరీక్షించి యథావిధి సంస్కరింపం దగువారలం బంచుటయు భారతవీరుల కుదకదానంబు సేయుటయుఁ దత్సమయంబునఁ గుంతీదేవి పాండవులకుఁ గర్ణుండు గూఢోత్పన్నుండని యెఱింగించుటయు ధర్మజువిలాపంబును ధర్మజురాజ్యాభిషేకంబును చార్వాకనిగ్రహంబును గృహప్రవిభాగంబును ననువృత్తాంతంబుల నొప్పి వేయునేడునూటడెబ్బదియైదు శ్లోకంబులు గలిగి.

56 క. పర్వుచు స్త్రీపర్వాదికపర్వంబు[1]ల నేనిటం [2]గృపాయుతమై స్త్రీ
పర్వంబు పదునొకండగు పర్వము నా [3]వెలయు సుకవి పండితసభలన్

55 సంస్కృత మూలమున స్త్రీ పర్వము నందలి శ్లోకసంఖ్య 775 ద. ప్రతిలో మూలానుసరణముగ 775 అనియే యున్నది. ధర్మజు విలాపము అను నంశము తరువాత ధర్మజు రాజ్యాభిషేకము, చార్వాక నిగ్రహము, గృహప్రవిభాగము అను మూఁడంశములు స్త్రీ పర్వములో పఠింపఁబడినవి ఇట్లు వీనిని స్త్రీ పర్వాంతర్గతముగ చెప్పినవి — 1. సంస్కృత భారత పర్వానుక్రమణిక. 2. ఈ క్రింది భారత తాళపత్రప్రతులు. అ.ఇ.ఈ.ఉ.ఊ.ఎ.ఐ.ఔ.గి.చ.ట.త.బ.ర.ల.శ.ష. ముద్రితప్రతులు. దీనికి భిన్నముగానుండి పైమూఁడు శీర్షికలను శాంతిపర్వభాగములుగా పఠించినవి 1. వా.శ. ముద్రిత ప్రతులు. 2. మాకు లభించినవానిలో మిగిలిన తాళపత్ర ప్రతులు. మూలభారతము పర్వానుక్రమణికలో పైమూఁడంశము లున్నను పర్వసంగ్రహమునందు స్త్రీపర్వమునఁగాని శాంతిపర్వమునఁగాని యివి పఠింపఁబడలేదు తిక్కన సోమయాజి రచనయందు పైమూఁడు శీర్షికలు ధర్మజు రాజ్యాభిషేకము చార్వాకనిగ్రహము గృహప్రవిభాగము — శాంతిపర్వము నందు వర్ణింపఁబడినవి. ''గూఢోత్పన్నస్య చ ప్రోక్తం కర్ణస్య పృథయాత్మనః'' అనుసంశ ము భం. పి.వి.ఎస్. ప్రతులలో పర్వసంగ్రహమున గలదు. నీలకంఠప్రతిలో నిది స్త్రీ పర్వమున పేర్కొనఁబడినది. ఈ యంశమును పేర్కొన్న ప్రతులు— అ.ఇ.ఈ.ఉ.ఊ.ఎ.ఒ.ఔ. జ.ట.డ.త.ప.బ.

56 1. ల నెనిమిదింట భాసురమై — చూ ; లెనిమిదిటం—ఔ ; పర్వంబుల నెనిమిదిట — అని పెక్కు ప్రతులలో గలదు. 2 కృపాయత — అ.ఇ.ఎ.ప.క.కా కే.గ.చ చి.చౌ.జ.ట.టో.డ.ద బ.శ.ష ; కృపాయిత — వా.వీ.శ. ఈ పాఠము మాకు లభించిన తాళపత్ర ప్రతులలో నెచ్చటను కానరాలేదు. కృపాయుత — ఆ.ఈ.ఉ.ఊ.ఋ.ఒ.ఔ.చు.చె.చో.టి. 3 నొప్పు — అ.ప.ఐ.వ.జ; బరగు — ఉ; నెగడు — స; నమరు — ఎ.త; నొనరు — య.

57 వ. మఱియు బంధువర్గంబు నెల్ల వధియించి పరమనిర్వేదనపరుండై కృష్ణువచనంబుల శాంతుండై యున్న ధర్మజునకు శరతల్పగతుండైన భీష్ముండు ధర్మవిదులయిన రాజులకెల్ల హితంబుగా రాజధర్మంబులు నాపద్ధర్మంబులు నేవాని నెఱింగిన సర్వజ్ఞానసంపన్నులగుదు రట్టి మోక్షధర్మంబులుఁ జెప్పుటయు నను వృత్తాంతంబుల నొప్పి పదునాలుగు వేలు నేనూట యిరువదియైదు శ్లోకంబులు గలిగి.

58 క. సకలహితంబై శాంత్యాదిక[1]పర్వచతుష్కమున విదితమై సమబుద్ధికిఁ [2]బంౘడెండగు పర్వం[3]బ కదుఁ మేలనఁగ శాంతిపర్వము వెలయుఁ.

59 వ. మఱియుఁ బితామహుండగు గాంగేయువలన సర్వధర్మనిశ్చయంబును దానవిధులును నాచారవిధులును ధర్మరా జెఱుంగుటయుఁ బుత్త్రాను శాసనంబును భీష్మస్వర్గారోహణంబు నను వృత్తాంతంబుల నొప్పి పంౘడెండు వేల శ్లోకంబులు గలిగి.

60 క. [1]ఒనరుఁ ద్రయోదశపర్వం బనఁగా ననుశాసనాద్యమగు పర్వయుగంబున మేలై విబుధశ్రేణినుతంబై [2]యానుశాసనికపర్వ మిలఁ.

57 భం. పి.పి. ఎస్ శ్లోక సంఖ్య — 14525. నీలకంఠ ప్రతి శ్లోకసంఖ్య 14732. ధర్మజు రాజ్యాభిషేకంబును అను మాట మూలమున లేదు. కృష్ణ వచనంబుల ... గృహప్రవిభాగంబు—అను భాగము ల ప్రతిలో లేదు.

58 1. పర్వచతుష్టయము: — అ ఓ.ఔ.క గ గి.గి$_1$,చ డ.న.ప.య.ల.వ.వా.శ.ష.శ,పర్వాష్టకమున — కీ; పర్వచతుష్కమున — స. 2. బంౘడెండవ — ఇ ఉ.ఎ.ఒ.క.గ.గి.గి$_1$ చ ట.జ.న య ల వ.శ ష.శ; బంౘడెండగు పర్వము ప్రకటముగా సభల శాంతి పర్వము వెలయున్—స. 3. ఇచ్చట యతిని అఖండయతిగాఁగాని, ఉభయయతిగాఁ గాని సమన్వయించుకొనవలెను

59 పి. పి. ఎస్ శ్లోక సంఖ్య. 12000 భం, శ్లోకసంఖ్య 6700 నీలకంఠ. 8000 పుత్త్ర అను మాట భం. ప్రతిలోని పాఠాంతరమున గలదు.

60 1. ఒనర .. శాసనిక మిల వెలయున్—ఐ; 2. యానుశాసనిక మది వెలయున్—ఒ.

61 వ. మఱియు నశ్వమేధారంభంబును సంవర్తమరుత్తీయోపాఖ్యానంబును స్వర్ణకోశసంప్రాప్తియు నుత్తరగర్భంబున నశ్వత్థామాస్త్రదగ్ధుండై శ్రీకృష్ణుచేత సంజీవితుండయిన పరీక్షితుని జన్మంబు నర్జును నశ్వానుసరణంబు నెడనెడ రాజులతోడి యుద్ధంబును జిత్రాంగదపుత్త్రుండైన బభ్రువాహనుం డాహవంబున నర్జునుం బరిభవించుటయు నశ్వమేధమహాయజ్ఞంబునందు నకులోపాఖ్యానంబును ననుగీతయు బ్రాహ్మణగీతయు గురుశిష్యసంవాదంబును నను వృత్తాంతంబుల నొప్పి నాల్గువేలు నన్నూటయిరువది శ్లోకంబులు గలిగి.

62 తే. అభి[1]మతంబగు నశ్వమేధాదికద్విపర్వయుతమై చతుర్దశపర్వ [2]మనఁగ
నాశ్వమేధికపర్వ మత్యంత[3]నిబిడవస్తు [4]విస్తారమై బుధవరుల సభల.

63 వ. మఱియు ధృతరాష్ట్రుండును గాంధారియు రాజ్యంబు విడిచి విదురసంజయసహితంబుగా నాశ్రమవాసంబునకుఁ జనుటయు సకల రాజ్యభారధౌరేయులైన కొడుకుల విడిచి కుంతీదేవి గురుశుశ్రూషాపరయయి వారి పిఱుందన పోవుటయు సమరనిహతులైన పుత్త్రపౌత్త్రుల నెల్ల ధృతరాష్ట్రుండు వ్యాసవరప్రసాదంబునఁ గాంచి విగతశోకుండయి గాంధారీ కుంతీ విదుర సంజయులతోఁ బరమసిద్ధికిం జనుటయుఁ బాండవులు నారదువలన నిఖిలయాదవవ్యసనం బెఱుంగుటయు నను వృత్తాంతంబుల నొప్పి వేయునూటయాఱు శ్లోకంబులు గలిగి.

61 పి. పి. ఎస్. జ.డ. శ్లోక సంఖ్య, 4420. భం - నీలకంఠ పెక్కు తెలుఁగు తాళపత్రప్రతులు 3320. అశ్వమేధారంభము అనుగీత - బ్రాహ్మణ గీత గురు శిష్య సంవాదము ఈ యంశములు మూలమున లేవు. భం. ప్రతిలోని పాఠాంతరములలోఁ గలవు. ఏ. ప్రతిలో నీయంశములు లేవు.

62 1. నుతంబుగ — అ.ఆ.ఇ.ఓ; నుతంబుగ — ఋ.ఒ.క.జ.డ.న.య. 2. మగుచు - ఆ.ద.న. 3. వివిధ — ఆ.ఇ.ఈ ఉ.ఊ.ఎ.ఐ.ఓ.ఔ.క.గ.గి.గి$_1$చ.జ. ట. డ. త ప. బ. వా. శ. ష; విమల — ఏ; నిబిడ — ఋ; విభవ — స. 4. విస్తరమగు — ఈ. ఊ.ఎ.ఏ.ఐ.ఔ.క.గి.గి$_1$చ.డ.ప.బ.య.ర.శ.ష.శ.

63 భం. శ్లోక సంఖ్య 1506; పి. పి ఎస్. 1906. నీలకంఠ ప్రతి 1111 వ్యాఖ్యలో 1100 అనియున్నది. పాండవులు నారదువలన నిఖిలయాదవవ్యసనం బెఱుంగుట వృష్ణీనాం అనుటకు బదులుగా గురూణాం అను పాఠాంతరమును భం. లో కలవు.

64 క. అమితార్థయుక్తితో [1]నాశ్రమవాసాది త్రిపర్వసహితంబయి యా
శ్రమవాసపర్వ మత్యుత్తమ [2]కథలను వెలయుఁ బంచదశపర్వంబై.

65 వ. మఱియు యాదవులెల్ల మదిరాపానపరవశులయి శాపనిమిత్తంబున సముద్రతీరంబునఁ దమలోఁబోరి పొడిచికొని పరలోకగతు లగుటయు దాని నెఱింగి రామకృష్ణాదియాదవవిరహితంబయిన ద్వారవతి కర్జునుం డరిగి విషణ్ణచిత్తుండయి వసుదేవాది యాదవులనెల్ల సంస్కరించి యాదవకళత్రంబుల నెల్లఁ దోడ్కొని వచ్చుచో గాండీవదివ్యబాణంబుల శక్తి దఱిఁగిన వనచరభయంబువలనఁ దత్కళత్రంబుల రక్షింపనోపమియు నర్జునుండు ధర్మరాజుకడకు వచ్చి వ్యాసవాక్యప్రబోధితుండై సన్న్యసించుటయు నను వృత్తాంతంబుల నొప్పి మున్నూఱు శ్లోకంబులు గలిగి పదియాఱవ పర్వంబై మౌసలపర్వంబునాఁ బరగె మఱియుఁ బరీక్షిద్రాజ్యాభిషేకంబును రాజ్యపరిత్యాగము సేసి పాండవులేవురు ద్రౌపదీసహితులై పరమసిద్ధికిం జనుటయునను వృత్తాంతంబుల నొప్పి నూటయిరువది శ్లోకంబులు గలిగి పదియేడవ పర్వంబై మహాప్రస్థానికంబునాఁ బరగె.

64 1 నాశ్రమవాసాదిక త్రిపర్వసంయుతమై — మ; ఈ పాఠము ననుసరించి త్రిపర్వను తేల్చి పలుకవలెను. 2 సభలను — అ.ఈ ఐ.పొ.క.గ.జ.డ.ప ర.వ.

65 • మౌసల పర్వ శ్లోకసంఖ్య. భం. పి. పి. ఎస్. 300; నీలకంఠ - 320; మహాప్రస్థానిక పర్వశ్లోక సంఖ్య — భం. పి ఎ. ఎస్. 120; నీలకంఠ వ్యాఖ్య — 123. పరీక్షిద్రాజ్యాభిషేకము మూలమున లేదు. తెలుఁగున చ ప్రతిలో మాత్రమే కలదు. స్వర్గారోహణపర్వ శ్లోకసంఖ్య - భం. పి. పి. ఎస్. 200, నీలకంఠ 209. కర్ణు నరకప్రాప్తియుఁ దన్మోక్షణంబును, స్వర్గంబున భారతవీరుల సంగమంబును, గర్మ పరిపాకోప భోగంబు ననెడి — నన్నయ పేర్కొన్న యంశములు భం. ప. పి ఎస్. ప్రతులలో లేవు. భం. ప్రతిలోని పాఠాంతరములలోఁ గలవు. మూలమునందు పేర్కొన్న, ఖిలపర్వములగు హరివంశ భవిష్యత్పర్వముల ప్రశంస నన్నయలో లేదు. తెలుఁగు ప. ప్రతిమాత్రము భవిష్యత్పర్వమును బేర్కొన్నది. ఈ వచనము తరువాత కం. ప్రతిలో ఈ పద్య మున్నది.

క. ఇమ్మగు నష్టాదశపర్వమ్ముల గల గ్రంథ సంఖ్య వర్ణింప సహ
స్రమ్ములు తొంబది తొమ్మిదియుం బదునేబదియు నారునేడును నయ్యెన్.

ఈ పద్యము ఉత్తరార్థము టి. ప్రతిలో నిట్లున్నది.

మఱియుఁ గర్ణు నరకప్రాప్తియుఁ దన్మోక్షణంబును స్వర్గంబున భారతవీరుల సంగమంబును గర్మపరిపాకోపభోగంబునను వృత్తాంతంబుల నొప్పి యున్నూఱు శ్లోకంబులు గలిగి పదునెనిమిదవ పర్వంబై స్వర్గారోహణంబునాఁ బరగె నిట్లష్టాదశపర్వంబులు గలిగి.

-: భారత సంహితా నిర్మాణ ప్రశంస :-

సం. 1—1—63

66 మ. అమితాఖ్యానక శాఖలం[1]బొలిచి [2]వేదార్థామలచ్ఛాయమై
[3]సుమహద్వర్గ చతుష్కపుష్పవితతిఁ శోభిల్లి కృష్ణార్జునో
త్తమ నానాగుణ కీర్త[4]నార్థఫలమై ద్వైపాయనోద్యాన జా
తమహాభారతపారిజాత [5]మమరుఁ ధాత్రీసురప్రార్థ్యమై.

67 వ. ఇట్టి మహాభారతంబు ననేకవిధ పదార్థ ప్రపంచ సంచితంబు నుపపర్వ మహాపర్వోప శోభితంబు నుపద్వీప మహాద్వీప సంభృతంబయిన భువనం బజుండు నిర్మించినట్లు కృష్ణద్వైపాయనుండు నిఖిలలోకహితార్థంబు [1]దత్తావధానుండై సంవత్సరత్రయంబు [2]నిర్మించి దాని దేవలోకంబునందు వక్కాణింప నారదుం బనిచెఁ బితృలోకంబున వక్కాణింప నసితుండైన దేవలుం బనిచె గరుడగంధర్వ యక్షరాక్షస లోకంబులందు వక్కాణింప [3]శుకుం బనిచె [4]నాగలోకంబునందు వక్కాణింప సుమంతుం బనిచె మనుష్యలోకంబున [5]జనమేజయునకు వక్కాణింప వైశంపాయనునిం బనిచె నేనా వైశంపాయనమహామునివలన విని వచ్చితిఁ దొల్లి కృతత్రేతావసాన సమయంబుల దేవాసుర రామరావణ యుద్ధంబులునుం బోలె ద్వాపరాంతంబునం బాండవధార్తరాష్ట్రులకు మహాఘోరయుద్ధం బయ్యె నందు.

ప్రమ్ములు తొంభై తొమ్మిది
యిమ్మై దశశతము మీద నేనును వ్రాసెన్.

66 1. పొదివి — బ; గలిగి — న.స. 2. వేదాంతామల — ఉ. 3. సుమహద్వర్గ — అని పెక్కు తాళపత్ర ప్రతులు, ఆ.ప.భా.సం. ప్రతులును. సుమహాపర్వ—వా. 4. నీయ— అ.ఉ; నార్థ — అ.ఉ.కే.ఉ.ర. తప్ప మిగిలిన ప్రతులు; నాత్త — గి; నాద్య - టొ; నార్ద్రి - కే 5. మెనగుఁ — అ. ఇ. ఊ. ఎ. ఏ. ఐ. టొ. గ. గి. జ. డ. ప. ర; మెనగున్ ధాత్రిన్ సురప్రార్థ్యమై - కే.

67 1. దత్తావసదనుండై - స. 2. నిర్మించినదాని- ఈ.ఉ.ఊ.ఋ.ఐ.ఓ.ఔ.క.జ.ద.ప.బ మ.ర.ల. 3. శకునింబనిచె-స. మూలమునందిట్టి పేరు ఈ సందర్భమునఁ గనఁబడదు. 'గంధర్వయక్షరక్షాంసి శ్రావయామాస వై శుకః.' 4. ఈ వాక్యము పెక్కు వ్రాఁత ప్రతులలోను మూలమునను లేదు. 5. 'జనమేజయునకు' — లేని ప్రతులు — ఎ.ఐ.గ.ద.వ.బ.మ.

68 తరలము. [1]పదిదినంబులు భీష్ముఁ డాహవభారకుండు గురుండు పం
[2]చదివసంబులు గర్ణుఁడుఁ దివసద్వయంబు దినార్ధమం
దుదిత[3]తేజుఁడు శల్యుఁ [4]డత్యధికోగ్ర వీరగదారణం
బది దినార్ధముగాఁగ నిట్లు మహాభయంకర[5]వృత్తితోఁ.

69 శా. ఏ[1]డక్షౌహిణు లెన్నఁ బాండవబలం బేకాదశాక్షౌహిణుల్
[2]రూఢిం గౌరవసైన్య మీ యుభయముఁ రోషాహతాన్యోన్యమై
యీడంబోవక వీఁక[3]మైఁ బోడువఁగా [4]నేపారు ఘోరాజి న
ల్లాడెఁ ధాత్రి శమంతపంచకమునం దష్టాదశాహంబులుఁ.

70 వ. ఇట్టి మహాభారతంబు [1]కృష్ణద్వైపాయన మహాముని విరచితం[2]బై ప్రవ
ర్తిల్లుచుండు.

71 సీ. ఇమ్మహాభారతం బిమ్ములఁ బాయక విహితావధానులై వినుచునుండు
వారికి విపులధర్మారంభసంసిద్ధి యగుఁ బరమార్థం[1]బ యశ్రమమున
వేదముల్ నాలుగు నాదిపురాణముల్ పదునెనిమిదియుఁ [2]దత్ప్రమితధర్మ
శాస్త్రంబులును మోక్షశాస్త్ర తత్త్వంబులు నెఱిఁగిన ఫలమగు నెల్లప్రొద్దు

ఆ. దానములను బహువిధక్రతుహుతజపబ్రహ్మచర్యములను బడయఁబడిన
పుణ్య[3]ఫలముఁ బడయఁబోలు నశేషపాపక్షయంబు నగు శుభంబుఁ [4]బెరుఁగు.

68 1. టో. ప్రతిలో 68, 69 పద్యములు లేవు. 2 చదినముల్ మరి—స 3. శౌర్యుడు-అ.ఆ 4. డట్లు సుయోధనోగ్రగదా—డ.ద 5. లీలతోన్-ఊ.ఔ.నవ ఈ పద్యము తరువాత పదిదినములై దుర్ప్రొద్దులు బదపడి రెన్నాళ్ళు నొక్క పగలున్ రేయున్
[1]మదమున రణమొనరించిరి నదిసుతగురుకర్ణశల్యనాగపురీశుల్.
అను కందపద్యము చ. ప్రతిలో తప్ప తక్కిన వ్రాఁత ప్రతులలో లేదు ఇది వేములవాడ భీమకవి భారతములోనిదని యొక ప్రతిలోనున్నట్లు స చెప్పుచున్నది. ఇది యథర్వణ భారతములోనిదని తి. లో నున్నది. పూర్వ తరలమే యీ యర్థ మును చెప్పుచున్నది. కాన నిది ప్రక్షిప్తమై యుండునని పలువురు భావించిరి. తిమ్మ కవి సర్వ. సా సం. [231] లో 'మదమున రణ మొనరించిరి' అనుటకు 'కదనంబు జేసి మడిసిరి' అని పాఠాంతరము.

69 1 'అక్షోహిణి' యను రూపము పెక్కువ్రాఁతప్రతులందును,తి.మ.ర.ల.శ. లందును కలదు. 2. రూడిఁ—తి.వి.శ; కూడన్ ... కోపాహత—అ.ఆ.న; కూడన్ ... క్రోధాహత — చో. 3. తో — పెక్కు ప్రతులు. 4. నేపారె — అ.ఈ.ఔ; నేపార — ఒ.ప.

70 1. కృష్ణద్వైపాయన — లేని ప్రతులు — న.మ. 2. బై, తేజరిల్లి- మ.ర.

71 1 బు నశ్రమమున — గి.గి$_1$ చ.బ.మ.వ.శ అను వీనిలో తప్ప తక్కినవానిలో నీ పాఠము కలదు. 2. దత్ప్రిణుత — ఆ.ఊ.ద; దత్ప్రిథిత — మ. 3 చయము-అ ఈ.ఊ.ఋ.ఎ.ఏ.ఒ.ద. 4. గలుగు — ద.వ.స.

72 ఉ సాత్యవతేయవి పదసంభవమై విబుధేశ్వరాద్విసం
గత్యుపశోభితంబయి [1]జగద్విదితంబగు భారతీయ భా
రత్యమరాపగౌఘము నిరంతర [2]సంతత పుణ్యసంప దు
న్నత్యభివృద్ధి సేయు వినినం గొనియాడిన నెల్లవారికిన్.

73 వ. అనిన విని శౌనకాది మహామునులు శ్రీమహాభారతకథాశ్రవణ[1]కుతూహల
పరులయి య[2]క్కథకున కిట్లనిరి.

-: శమంతపంచకాక్షౌహిణీ సంఖ్యాకథనము :-

సం. 1-2-1

74 మ. అనఘా [1]మున్ను శమంతపంచకము నయ్యక్షౌహిణీసంఖ్యయున్
వినఁగా మా కెఱిఁగించి భారతకథావిఖ్యాతికిం గారణం
బును దద్భారతవిస్తరోక్తివిభవంబుం బాండవాడంబరం
బును భీష్మాదికురుప్రవీరచరితంబుం జెప్పు ముద్యన్మతిన్.

75 క. అనిన విని రోమహర్షణతనయుం డమ్మునుల కతిముదంబున వినయా
వనతుఁడయి గురులఁ దన హృద్వనజంబున నిలిపి కొలిచి వాగ్గణపతులన్.

76 ఉ. [1]ఇంబుగ సర్వలోకజను లెవ్వనియేని ముఖామృతాంశుబిం
బంబున నుద్భవంబయిన భారతవాగమృతంబు కర్ణరం
ధ్రంబను నంజలిం దవిలి త్రావుదు రట్టి [2]మునీంద్రలోక వం
ద్యుం బరముం బరాశరసుతుం బ్రణమిల్లి కరంబు భక్తితోన్.

77 వ. అమ్మును లడిగిన [1]కథ యథాక్రమంబున [2]సవిస్తరంబుగాఁ జెప్పందొడంగె.

72 1. జగద్వినుతం – క. 2. నిర్మల – మ.

73 1. 'కుతూహల' లేని ప్రతులు - ఓ.చ వీ.శ. 2. క్కథికునకు – పెక్కు ప్రతులు.

74 1. నీవు – న

76 1. ఇమ్ముల – ఇ.ఎ.ప ఓ ప గణ ; ఇమ్ముగ – చి.చు. టు.టం; ఇమ్ముగ-బింబమ్మున-రంధ్రమ్మను - వంద్యుమ్ముని - వా; ఇంబుగ – ఆ.ఔ.ద.ర.వీ.స సూ శ. 2. మునీంద్రుఁ కు కే కొ.చే.

77 1. కథానూత్రంబు విస్తరించి – ఆ ఊ, కథాక్రమంబు విస్తరించి - అ ఇ ఏ.ఐ.ఓ.త. ప య. 2. విస్తరించి – అ.ఆ.ఇ ఈ ఊ ఎ.ఏ.ఐ.ఒ.ఓ.త.ప మ.య.

78 శా. త్రేతాద్వాపరసంధి నుద్ధత మదాంధీభూత[1] విద్వేషిజీ
మూతోగ్రశ్వసనుండు రాముఁ డలుకన్ ముయ్యేడుమాఱుల్ రణ
ప్రీతిఁ వైరిధరాతలేశ్వరులఁ జంపెం బల్వురన్ దీర్ఘని
ర్ఘాతక్రూరకుఠారలూననిఖిలక్షత్త్రోరుకాంతారుఁడై.

79 వ. అప్పరశురాముండు నిజనిశితకుఠారధారావిదళిత సకలక్షత్త్ర[1]రుధిరాపూర్ణం బులుగా నేను మడుంగులు గావించి తద్రుధిరజలంబులఁ బితృతర్పణంబు సేసి [2]తత్పితృగణప్రార్థన నుపశమితక్రోధుం డయ్యె దానన చేసి తత్సమీప ప్రదేశంబు శమంతపంచకంబునాఁ బరగె మఱి యక్షౌహిణీ సంఖ్య వినుండు.

80 సీ. వరరథ మొక్కండు వారణ మొక్కండు తురగముల్ మూఁడు[1] కాల్వురును నేవు
రను సంఖ్యగలయది యగుఁ [2]బత్తి యది [3]త్రిగుణంబైన సేనాముఖంబు దీని
త్రిగుణంబు గుల్మంబు దీని [4]ముమ్మడుఁగగు గణము తద్గణము త్రిగుణితమైన
వాహినియగు దాని వడి మూఁట గుణియింపఁ బృతననాఁ బరగుఁ దత్పృతన
మూఁట

ఆ. గుణితమైనఁ జమువగుఁ మఱి దాని ముమ్మడుఁ గనీకినీసమాఖ్య నొనరు
నదియుఁబదిమడుంగులైన నక్షౌహిణి [5]యగా నిరంతర [6]ప్రమాను సంఖ్య

78. 1. విద్విష్ట — అ.ఆ.ఇ.ఈ.ఉ.ఋ.ఎ ఏ ఐ ఓ.ఔ.జ.త.ద.న.ప.య ర.

79 1. రుధిరౌఘపరి — ర; రుధిరాధారా—స; రుధిరోద్ధారా — న. 2. సంతర్పితపితృ— ఆ.ద.న; తర్పితపితృ — ఇ ఈ ఋ.ఎ.ఐ ఓ గ.జ.త.ర.

80 1. కాల్బురుషులేవురు—ఋ ఔ.మ.య 2. పజ్తి — కీ టు; పంక్తి — కు చి.టం.వీ; బంతి—చే.చో. 3. త్రిగుణింప — స. 4. ముమ్మడియగు — ఉ.ఋ ఓ క. 5. యనగ నొప్పు తత్సమాజ సంఖ్య — టం. 6. క్రమానుసంఖ్య — ఉ.స. 'ప్రమాణ' అను పాఠము కొన్ని ప్రతులలోను, ప్రాచీన ముద్రితప్రతులలోను కలదు అది ప్రాసయతి యగును. 'ఏ' ప్రతిలో నీక్రింది పద్య మధికముగా నున్నది.

క. అరదము లంబర ముని వసు ధరణీకర సంఖ్య సమము తత్త్రిగుణంబున్
శరగుణితంబును గుంజర హరివీర ప్రముఖు లొక్క యక్షౌహిణికిన్.

81 వ. ఇరువదియొక్కవేయు నెనమన్నూటడెబ్బది రథంబులు నన్ని యేనుంగులు నఱువదేనువేలు నాఱునూటపది గుఱ్ఱంబులు లక్షయుం దొమ్మిదివేలున్ మున్నూటయేఁబండ్రు వీరభటులును గలయది యొక్క యక్షౌహిణి యయ్యె నట్టి యక్షౌహిణులు పదునెనిమిదింట సన్నద్ధులై కురుపాండవులు యుద్ధంబుసేయుటం జేసి యా శమంతపంచకంబు కురుక్షేత్రంబునాఁ బరగె నట్టి కురుక్షేత్రంబు నందు.

82 చ. ప్రతిహతశత్రువిక్రముఁడు పాండవవంశవివర్ధనుండు సు
వ్రతుఁడు పరీక్షిదాత్మజుఁ [1]డవద్యవిదూరుఁ డుదార కీర్తి ని
ర్మిత వివిధాధ్వరుండు జనమేజయుఁడన్ జనపాలుఁ డుత్తమ
స్తుతమతి దీర్ఘసత్త్ర మజితుం డొనరించె శుభాభి[2]కాంక్షియై.

*—: సరమ వృత్తాంతము — జనమేజయుని పురోహిత వరణము :—*

సం. 1-3-1

83 వ. [1]ఆప్రదేశంబునకు సరమయను దేవశుని కొడుకు సారమేయుండను [2]కుర్కుర కుమారుండు క్రీడార్థంబు వచ్చి క్రుమ్మరుచున్న నలిగి జనమేజయు తమ్ములు [3]శ్రుతసేనుండును భీమసేనుండు నుగ్రసేనుండును నను వార లాసారమేయు నడిచిన నది యఱచుచుం [4]బఱతెంచి [5]తనతల్లికిం జెప్పిన నాసరమయు నతికోపా[6]న్వితయై జనమేజయు[7]నొద్దకు వచ్చి యిట్లనియె.

84 క. క్షితినాథ కడు [1]నకరుణాన్వితులై నీతమ్ము లతి వివేక[2]విదూరుల్
మతి దలఁపక నా పుత్త్రకు నతిబాలకు [3]ననపరాధు నడిచిరి పెలుచన్.

82 1. డవంద్య — అ.ఊ.ఋ.ఎ.ఏ.జ డ ద.న.బ.ర. 2. లాషియై — ఆ.ఋ.ఏ.ఔ.జ.డ; కాంక్షుడై — ఉ త.వ.

83 1. తత్ప్రదేశంబునకు — కొ; అట్టియవసరంబునకు — స. 2. కుక్కురయను రూపము కొన్నింటఁ గలదు. 3. శ్రుతసేన, ఉగ్రసేన, భీమసేన, అనునది మూలమునందలి క్రమము. 4. బరచి-కొ. 5. తమ—కొన్ని ప్రతులు. 6. న్వితచిత్తయై — కె.ల. 7. పాలికి — ఈ.ఋ ఐ.ఒ.ఔ.కూ.గ.ఢ.న.య; కడకు — కె.

84 1. నధర్మాన్వితులై — ఔ క.గ్[1].జ.ట బ.శ ష 2. విహీనుల్ — త. 3. ననపరాధి — ఆ.ఊ ఎ ఫ.ఐ.న.వ.

85 క. [1]తగునిది తగదని [2]యెదలోఁ వగవక సాధులకుఁ బేద[3]వారల కెగ్గుల్
మొగిఁ జేయు దుర్వినీతుల కగు[4]ననిమిత్తాగమంబులయిన భయంబుల్.

86 వ. అని సరమ [1]యదృశ్యయైన నతివిస్మితుండై జనమేజయుండు కొన్ని దినంబులకు దీర్ఘసత్త్రంబు సమాప్తంబుసేసి హస్తిపురంబునకుం జని యందు సుఖంబుండి యొక్కనాఁడు దేవశునీవచన ప్రతీకారార్థంబు శాంతిక పౌష్టికక్రియలు నిర్వర్తింప ననురూప పురోహితు నన్వేషించుచు ననేక [2]మునిగణాశ్రమంబులకుం జని యొక్క [3]మునిపల్లెం గని యందు శ్రుతశ్రవసుండను మహామునిం గని నమస్కరించి యిట్లనియె.

87 క. కరుణించి యిందు నాకుం [1]బురోహితుఁడు గాఁగ మీ[2]సుపుత్త్రి పవిత్రుం
బరమతపోనైష్ఠికు భాసురయమనియ[3]మాభిరాము సోమశ్రవసుఁ.

88 వ. అని యడిగి [1]వాని యనుమతంబున సోమశ్రవసుం దనకుం బురోహితుం [2]గావించుకొని వాని నభీష్టసత్కారంబుల సంతుష్టునిం జేసి తదుపదేశంబున.

89 ఉ. ఆయతకీర్తితో వివిధయాగము[1]లఁ సురధాసుణీసురా-
మ్నాయము [2]నాహితాహుతి సమంచితదక్షిణ లిచ్చి తన్పుచుం
జేయుచునుండె రాజ్యము విశిష్టజనస్తుత[3]వర్ధమానల
క్ష్మీయుతుఁ డుత్తముండు జనమేజయుఁ డాదినరేంద్రమార్గుఁడై.

85 1. తగునిది తగవిది యెడలో — కొన్ని ప్రతులు. 2 మనమున — అ ఇ ఉ ఎ ఓ ఔ. త.మ; మదిలో — కి. 3 వారికి నెగ్గుల్ — కొన్ని ప్రతులు. 4. ననిమిత్తాగతంబు — అ ఆ.ఇ ఈ ఐ.ఓ.ఔ గ.త.ద.ప.శ; న నిమిత్తంబులైన కష్టచయంబుల్ — చు
చే. ప్రతిలో నీ పద్యమిట్లున్నది

క. తగునిది తగవిది యని యెడ వగవక సాధులకు పెద్దవారికి నెగుల్
మొగి జేయు దుర్వినీతుల బగి నుండగ వచ్చు ఘోరపాపభయంబుల్

86 1 యదృశ్యంబైన — ఆ.ఇ.ఉ ఋ ఎ ఏ ఐ.ఓ ఔ.క.గ ట.డ.త.ద ప.బ 2. మునిజనాశ్రమంబు — కొ. 3. మునిపల్లియం గని — కె

87 1 బురోహితుని—అ.ఇ ఎ ఐ.ఒ.ఓ ఔ క చ ట ద.ప బ వా శ.ష సం శ ; బురోహితుడు గాగ-అ.ఉ ఋ.ఏ.గ.ద.స శ. 2 సుపుత్రుని బాత్రున్ - బ కె మాదినియతు—మ

88 1. వారి యనుగ్రహంబు వడసి — కె. 2. గాబడసి - ఈ.ఋ ఏ ఒ గ.డ న.స

89 1. లొప్పగజేసి భూసురా - య. 2. లన్ హితాహుతి—షు; నాహుతాహుతి—ట.వి.
3. ధర్మమూర్తి - బ

90 వ. ఇట్లనవరత శాంతికపౌష్టికక్రియలు నిర్వర్తించుచు [1]గురుదేవ పిహిదేవ తర్పణాభిరతుండై యుండునంత.

—: ఉదంకుండు పౌష్యమహాదేవి కుండలంబులం దెచ్చుట :—

సం. 1—3—86

91 క. పంకజభవసన్నిభుఁ డఘపంకక్షాళనమహాతపస్సలిలుఁ డనా
తంకమతి పైలశిష్యుఁ [1]డుదంకుండను మునివరుండు [2]దద్దయు భక్తిన్.

92 క. గురుకులమునందు గురులకుఁ బరిచర్య [1]లొనర్చి తా నపరిమితనిష్ఠా
పరుఁడై జ్ఞానము వడసెను గురుదయ నణిమాదికాష్టగుణములతోడన్.

93 వ. అయ్యుదంకుండు గురుహితకార్యధురంధరుండ[1]యి గురుపత్నీనియోగంబునం బౌష్యుండ[2]నురాజుదేవి కుండలంబులం బ్రతిగ్రహించి తేరంబోని వనంబులో నొక్కరుఁడ చనువాఁ డెదుర నొక్క మహోక్షంబు నెక్కి [3]చనుదెంచు[4]వాని నొక్క దివ్యపురుషుం గని వాని[5]పన్నిన వృషభగోమయభక్షణంబు సేసి య[6]మ్మహాత్ము ననుగ్రహంబు వడసి యతిత్వరితగతిం జని పౌష్యమహారాజుం గాంచి దీవించి గృహీతసత్కారుండై యి ట్లనియె.

94 తే. ఏను గుర్వర్థ మర్థినై మాన[1]వేశ కడఁగి వచ్చితి నిపుడు నీకడకు వేడ్క
దండితారాతి నీదేవికుండలమ్ము లిమ్ము నా[2]పూన్కి యిది సఫలమ్ము గాఁగ.

90 1. గురుమునిదేవ — కొన్ని ప్రతులు.

91 1 ఉతంకుడు - కా పీ. 2. దద్దయుబ్రీతిన్ — ఇ.గ$_1$.చ.త.వ.శ ల.

92 1. లొనర్చిమున్నపరిమిత — అ.వ; లొనర్చుచున్నపరిమిత — ఈ.ఎ.ట.మ; యొనర్చుచును నపరిమిత — ఒ య.స.

93 1. యి, యొక్కనాడు — ఆ.ఉ.ఐ ఒ.గ.జ డ.ద.న.బ 2. ను మహారాజు— ఆ.ఈ. ఉ.ఊ.ఎ.ఓ క.గ.జ.ట.డ.మ.ర.ల; ను రాజు దేవిక్షత్రియ — కి. 3. వచ్చువాని — ఇ.ల. 4. వాని నొక్క పురుషు మహాతేజస్విం గని అతని పంచిన — కూ. 5. పనిచిన — అ.గ.న; పంపున - ఆ.ప. 6. మహాత్మునను‌జ్ఞ వడసి — కూ.

94 1. వేంద్ర — అ.ఊ.ఔ.జ.ట.డ.ద. 2. పూనికిది — జ.ద.బ.బ్రౌ.

95 వ. అనినం [1]బౌష్యుం డిట్టి మహాత్మున కీఁ [2]గాంచితిఁ గృతార్థుండ నైతి [3]నని [4]సంతసిల్లి యుదంకున కిట్లనియె నయ్యా మదీయధర్మపత్ని యక్కుండలంబులు [5]దొడిగి యున్నయది మద్వచనంబున [6]వాని నిప్పించు[7]కొమ్మనిన నుదంకుం డంతఃపురమునకుఁ జని పౌష్యమహాదేవిం గానక [8]క్రమ్మఱి పౌష్యుని కడకు వచ్చి నీదేవి [9]నందులం[10]గాన నీవ యక్కుండలంబులు దెప్పించి యిమ్మని[11]నఁ బౌష్యుం డిట్లనియె.

96 క. భూవినుత నిన్నుఁ ద్రిభువనపావను నశుచివని యెట్లు పలుకఁగ నగు న ద్దేవి [1]పవిత్ర పతివ్రత గావున నశుచులకుఁ [2]గానఁగా దనవద్యా!

97 వ. అనిన విని యుదంకుం డప్పుడు దలంచి యావృషభగోమయ[1]భక్షణానంతరంబున [2]నాచమింపమి నైన నా యశుచిభావంబునఁ [3]గాకేమి యప్పరమపతివ్రత మదీయదృష్టిగోచర [4]గాకున్న దయ్యెనని పూర్వాభిముఖుండయి శుద్ధోదకంబులం బ్రక్షాళిత పాణిపాదవదనుండయి యాచమిం[5]చి పౌష్యానుమతంబున నద్దేవి [6]యొద్దకుం [7]జనిన [8]నదియును నమ్మహామునికి నమస్కరించి కుండలమ్ము లిచ్చి యిట్లనియె.

95 1. బౌష్యుండు నీయట్టి సత్పాత్రున — అ.ఆ.ఇ.ఈ.ఎ.ఐ.ఒ ఓ.క.గ.జ.ట.త న.ప.బ.య ల. 2. గాంచి — అ.ఆ.ఇ ఈ.ఉ.ఎ.ఐ.జ.డ.త.బ. 3. నని మనంబున—అ ఆ.ఉ.ఊ.ఋ ఎ ఏ.క.చ.జ.ట.త.ద.ప.మ.వ.శ ష.శ. 4. సంతోషించి — ఆ.ఉ.క.మ. 5 దొడుగ నవసరంబై - ఋ.చ.వా శ ష.శ; దాల్చి — బ. 6. వాని నొప్పించు కొమ్మనిన - టు. (ఒప్పగించుకొమ్ము — అని అర్థము) 7. కొనుమని — కొన్ని ప్రతులు; కొండని — కీ. 8. క్రమ్మర — ఈ ఓ.క. 9. నెందును - ఇ ఉ ఊ. ఋ.ఒ.ఓ.క.చ ట త.ద.ప.బ.వా.శ.ష శ; నందుంగాన — కూ. 10. గానక యిట వచ్చితి నీవ — వీ శ ష.స. 11. న, నుదంకునకు — అ.ఋ.క.చ.త.శ.ష

96 1. యు బరమ — అ.ఔ ; పతివ్రతశుచియగు — ఉ.మ. 2. గానగాదనవంద్యా?- కొన్ని ప్రతులు.

97 1. భక్ష నంతరంబుననైననాయశుచి — అ.ఈ.ఉ ఋ ఐ.ఓ.ద.ల ర ; భక్షణంబుననైన - ఆ. ఊ. చ. ప. బ వా. శ ష. శ. 2. నాచమింపమినైననా — ఎ. జ మఱియు నిది "అస్తి ఖలు మయాతు భక్షితమ్ నోప స్పృష్టమాగచ్ఛతేతి." అను మూలమునకు పి. పి. యస్. శాస్త్రి ప్రతి 1-3-119 అనుగుణముగా నున్నది. 3. గాదె — మ. 4 గాదయ్యె - ఇ.ఋ.ఊ.ఎ.ఏ.ఐ ఒ.ఓ.ఔ.క.గ. ట.డ.త చ న.బ.య.ర ల.స. 5 చి, శుచియై — అ.ఔ.త.మ. 6 పాలికిం—ఈ ఔ.డ.త చ.బ.య, యున్నెడ కుం - ఇ.ల; కడకుంబోయిన- అ. 7. బోయిన— ఆ.ఉ.ఏ ఒ ఐ.ఓ.ట.జ.బ.మ. 8. నమ్మహాపతివ్రత — స.

98 క. తక్షకుఁ డీకుండలములు లపేక్షించుచు నుండువాఁ డభేద్యుఁడు మాయా
దక్షుండు వానివలన సురక్షితముగఁ జేసి చనుము రవినిభతేజా!

99 వ. అనిన నుదంకుం డట్ల చేయుదు నని [1]యద్దేవి వీడ్కొని [2]పౌష్యుపాలికిం బోయిన నతం డయ్యా నీ వతిథివి [3]మాయింటఁ గృతభోజనుండవై పొమ్మని [4]క్షణియించిన నొడంబడి యుదంకుండు గుడుచుచో నన్నంబు కేశదుష్టంబైన రోసి కరం బలిగి [5]యిట్లపరీక్షితంబైన[6]యశుద్ధాన్నంబు [7]పెట్టినవాఁడ వంధుండ వగు మని శాపం బిచ్చిన నల్గి యల్పదోషంబున నాకు శాపం బిచ్చినవాఁడవు నీ వనపత్యుండ వగు మని ప్రతిశాపం బిచ్చిన నుదంకుండు నే ననపత్యుండఁ గా నోప [8]దీనిఁ గ్రమ్మఱింపు మనినఁ బౌష్యుం డిట్లనియె.

100 ఉ. నిండుమనంబు నవ్యనవనీతసమానము పల్కు దారుణా
ఖండలశస్త్రతుల్యము జగన్నుత విప్రులయందు నిక్కమీ
రెండును రాజులందు విపరీతము గావున విప్రుఁ డోపు నో
పం డతిశాంతుఁ డయ్యు నరపాలుఁడు శాపము గ్రమ్మఱింపఁగన్.

—: *తక్షకుండు కుండలంబు లపహరించుట* :—

సం. 1—3—136

101 వ. [1]కావున నా కశక్యంబు [2]నీయిచ్చిన శాపంబు గ్రమ్మఱింపు మనిన నుదంకుం డట్లేని [3]నీకు నల్పకాలంబున శాపమోక్షం [4]బగు నని పౌష్యునకు ననుగ్రహించి [5]మగుడి [6]నేఁడ పోయి గురుపత్నికిఁ గుండలంబు లీఁ గంటినని

99 1. వారి వీడ్కొని రాబోయిన పౌష్యుండయ్యా — చి. టం. 2. రాబౌష్యుం డయ్యా - కొన్నిప్రతులు, రాబోయిన పౌష్యుండయ్యా — కొన్నిప్రతులు. 3. మాయందు - ఈ.ఉ.ఊ.ఋ.ఎ.ఐ.ఔ.క ట త.బ. 4. క్షణంబిచ్చిన — య; నియమించిన — అ; యనునయించిన — ట. 5. ఇట్లపవిత్రంబైనయన్నంబు—ప. 6. యశుద్ధ — కొన్ని ప్రతులలో లేదు. 7. పెట్టి నాఁడవు — వా.శ. మఱికొన్ని ప్రతులు. 8. నీయిచ్చిన శాపంబు — ఆ.ప.య.

101 1. కావున—కొన్నిప్రతులలో లేదు 2. నీవ నీయిచ్చిన-కె; నీవయిచ్చిన-కూ. 3 అల్పదోషంబు చేసినవాడవు గావున నల్పకాలంబున—కె. 4. బగు నోడకుండు మని పౌష్యు ననుగ్రహించి మగుడి నేడ పోయి—స. 5. మగుడి పోవు నెడ— గి.గ$_1$.చ.వా శ ష.శ. 6. నేడ మగుడిపోయి—కు.కె.

[7]సంతోషించి చనువాఁ డెదుర నొక్క జలాశయంబు గని శుచిప్రదేశంబునఁ దనచేతి కుండలంబులు పెట్టి యాచమించుచున్నంతఁ [8]దనతోడన [9]వచ్చి తక్షకుండు నగ్నవేషధరుండై యక్కుండలంబులు గొని పాఱిన నుదంకుండును వాని పిఱుందన పాఱి పట్టి[10]కొనుడు.

102 క. విడిచి దిగంబరవేషము విడువక మణికుండలములు విషధరపతి యే ర్పడ నిజరూపముతో నప్పుడ యహిలోకమున [1]కరిగె భూవివరమునన్.

103 వ. ఉదంకుండును వానితోడన [1]తగిలి యవ్వివరంబున నురగలోకంబున కరిగి [2]నాగపతుల నెల్ల నిట్లని స్తుతియించె.

104 చ. బహువనపాదపాబ్ధికులపర్వతపూర్ణసరస్సరస్వతీ
సహితమహా[1]మహీభర మజస్రసహస్రఫణాళిఁ దాల్చి దు
స్సహతరమూర్తికిఁ జలధిశాయికిఁ బాయక శయ్య యైన య
య్యహిపతి దుష్కృతాంతకుఁ డనంతుఁడు మాకుఁ [2]బ్రసన్నుఁ డయ్యెడున్.

105 చ. [1]అరిది తపోవిభూతి నమరారుల [2]బాధలు వొందకుండఁగా
నురగుల నెల్లఁ గాచిన మహోరగనాయకుఁ డానమత్సురా
సురమకుటాగ్రరత్నరుచిశోభితపాదున కద్రి[3]నందనే
శ్వరునకు భూషణం బయిన వాసుకి మాకుఁ [4]బ్రసన్నుఁ డయ్యెడున్.

7. సంతసిల్లి— ఇ.ఈ.ఉ.ఊ.ఋ.ఎ.ఏ.ఐ.ఒ.గ.జ.ట.డ.మ.య. 8. తనతోడన— కూ.కొ. ప్రతులలో లేదు; తన — లేనిప్రతులు — ఆ.ఈ.ఉ.ఊ.ఋ.ఎ.ఏ.ఐ.ఒ.ఓ.క.గ.జ.ట.డ.ద.బ. 9. వేచివచ్చి — అ.ఆ.ఇ.ఈ.ఉ.ఊ.ఎ.ఏ.ఔ.క.జ.ట.డ.త.ద.న.ప.బ.య. 10. కొనుడు తత్క్షణంబ — కె.

102 1. కేగె—కొ.

103 1. తగిలి—కొన్ని ప్రతులలో లేదు. 2. యురగ—పెక్కు ప్రతులు.

104 1. మహీధుర — స; 2. బ్రసన్నమయ్యెడున్—ఆ.ఉ.ఒ.త.న.బ.య.

105 1. ఈ పద్యము 'కొ' ప్రతిలో లేదు. 2. బాధలబొంద—కూ కె. 3. నందనావరునకు— టం. న.స.శక. 4. బ్రసన్నమయ్యెడున్— ఉ.ఒ.ఓ ద.మ ; మయ్యెడన్—చొ. మొదలైనవి.

106 ఉ. [1]దేవమనుష్యలోకములఁ ద్రిమ్మరుచుం విపుల[2]ప్రతాపసం
భావితశక్తి[3]శౌర్యులు నపారవిషోత్కటకోపవిస్ఫుర
[4]త్పావక[5]తాపితాఖిలవిపక్షులు నైన మహానుభావు లై
రావతకోటిఘోరఫణిరాజులు మాకుఁ బ్రసన్ను లయ్యెడున్.

107 ఉ [1]గోత్రమహామహీధరనికుంజములం విపినంబులం గురు
క్షేత్రమునం [2]బ్రకామగతిఖేలన నొప్పి [3]సహాశ్వసేనుఁడై
ధాత్రిఁ బరిభ్రమించు బలదర్ప[4]పరాక్రమదక్షుఁ డీక్షణ
శ్రోత్రవిభుండు తక్షకుఁడు శూరుఁడు మాకుఁ [5]బ్రసన్నుఁ డయ్యెడున్.

108 వ. అని [1]యిట్లురగపతుల నెల్ల [2]స్తుతియించి యందు సితాసితతంతు [3]సంతాన పటంబు ననువయించుచున్నవారి నిద్దఱ స్త్రీలను ద్వాదశారచక్రంబుం బరి[4]వర్తించుచున్నవారి [5]నార్వురఁ గుమారుల నతిప్రమాణ[6]తురంగంబు నెక్కినవాని మహాతేజస్వి నొక్క దివ్యపురుషుం గని విపులార్థవంతంబు లైన [7]మంత్రంబుల నతిభక్తియుక్తుండై స్తుతియించినం బ్రసన్నుండై యద్దివ్యపురుషుం డయ్యుదంకున కి ట్లనియె.

106 1. ఈ పద్యము లేని ప్రతులు—అ.క.య 2. ప్రసాద సంభావిత భక్తసౌఖ్యులు— ఉ.ఊ.ఏ.ర.ల ; భక్తిసౌమ్యులు—ఇ. 3. సౌఖ్యులు—అ ఔ.ట.ప.స. 4. పావన తాపితాకుల-ర. 5. పీడితా—ఈ.

107 1. ఈ పద్యము లేని ప్రతులు—అ ఊ.క.ర. 2. బ్రకాశ—ఆ.ఉ.ఋ ఏ.ఓ.ఔ.జ.ట. డ.త.ద న.ప.బ యు.వ.స ; బ్రకామగతిఖేలత— ఖా.టు. 3 సుహాశ్వసేనుసై— కి.టు. 4. సమగ్రుడు—వ. 5. బ్రసన్నమయ్యెడున్—ఆ.ఈ

108 1. యిట్లు నాగకులంబు—అ ఎ.ఐ.చ.ప.బ.శ.ష.వా.శ ; యిట్లు నాగకులంబు నెల్ల - కొన్ని ప్రతులలో లేదు. 2. స్తుతించి—ఒ. 3. సంతానంబు పటంబునం బెట్టి పటంబు—ప. 4. వర్తింపించుచున్న—వా.శ.సూ. మఱికొన్ని ప్రతులు, పరివే ష్టించి వర్తించుచున్నవారి—టు. 5. నార్వురు—కు.కె. 6. తురగారూఢుడైన వాని—అ.బ. 7. స్తుతుల- అ.ఆ.ఉ.ఋ.ఎ.ఏ.ఐ.ఒ.ఓ.క.గ-జ.డ.ద.ప.బ; సూక్తుల—ఇ; సూక్తంబుల-ఔ; నుతుల— ఈ.ఉ.

109 క. [1]మితవచన [2]నీ యథార్థస్తుతుల కతిప్రీతమానసుఁడ నైతి ననిం
దితచరిత నీకు నభివాంఛిత మెయ్యది దానిఁ[3]జెపుమ[4]చేయుదు [5]ననినన్.

110 వ. [1]ఉదంకుండు గరంబు సంతసిల్లి యిన్నాగకులం బెల్ల నాకు [2]వశం బగు నట్టులుగ ననుగ్రహింపు మనిన నప్పురుషుం డశ్వేని నీయశ్వకర్ణరంధ్రాధ్మానంబు సేయు మనిన వల్లె యని తద్వచనానురూపంబు సేయుడుఁ [3]దత్క్షణంబ.

111 శా. పాతాళైకనికేతనాంతరమునం బర్వెం దదశ్వాఖిల
స్రోతోమార్గవినిర్గతోగ్రదహనార్చుల్ పన్నగవ్రాతముల్
భీతిల్లెఁ భుజగాధినాథుమనముఁ భేదిల్లెఁ గల్పాంతసం
జాత[1]ప్రోద్ధతబాడబానలశిఖా[2]శంకాధికాతంకమై.

—: తక్షకుండు కుండలంబులం దెచ్చి యుదంకున కిచ్చుట :—
సం. 1-3-158

112 క. శంకరనిభుఁడగు విప్రు భయంకరకోపాగ్ని యొకొ్కా యనుచును జాతా
[1]తంకుఁడయి కుండలంబు లుదంకునకును దెచ్చి యిచ్చెఁ దక్షకుఁ డంతన్.

113 వ. ఇట్లు నాగలోకంబున కెల్ల మహాక్షోభంబు గావించి తక్షకుచేతఁ గుండలంబులు గొని యుదంకుఁ డాత్మగతంబున.

109 1. ఋతవచన—అ.ఇ.ఏ.ట.న; హితవచన—ఉ.ఊ.ఋ.క.ద.బ.మ.ర; నుతవచన—త; మితవచనా నియతార్థ—గి.వి.శ. 2. నియమితార్థ—ఉ.ఊ.ఋ; నీయుదాత్త—కీ. 3. బనుపు—పెక్కు ప్రతులు 4. చేసెద—కొ 5. ప్రీతిఁ—అ.ఆ.ఇ.ఈ.ఊ.ఋ.ఎ.ఒ.ఓ.ఔ గ.డ.త.ద బ; ఎలమిఁ—ఐ; నెమ్మిన్—ఉ.ర.

110 1. అనిన నుదంకుడు—పెక్కు ప్రతులు. 2. వశంబుగా—ఉ.క.మ.య. 3. నతక్షణంబ—ఆ.ఊ.ఏ.ట; తత్క్షణంబ—కొన్ని ప్రతులలో లేదు.

111 1. ప్రోద్గత—ఆ.ఇ.ఐ.ఔ.త.మ.ర.స. 2. శంకోదితాతంకమై—టు.స.

112 1. శంకుండై కుండలములు—అ.ఆ.న.ర.ఉ.స; తంకమతి—య.

114 సీ. కుండలమ్ములు వేగ కొనిరమ్ము నాలవనాఁటికి నని [1]పూని నన్నుఁ బనిచె
గురుపత్ని నేఁడ [2]యక్కుండలంబులు [3]దొడ్గు దివస మీదివస [4]మతిక్రమింప
కుండంగఁ[5]బోక యెట్లొడఁగూడు నిన్నాగభవన మెప్పాటు వెల్వడఁగఁబోలు
నేఁడు వోవనినాఁడు నిష్ఫలం బిమ్మహాయత్న మెంతయు నని యధికచింతఁ

ఆ. దవిలియున్న నయ్యుదంకు నభిప్రాయ మెఱిఁగి దివ్యపురుషుఁ డిట్టు లనియె
నీహయంబు నెక్కి యేఁగుము యిప వడి గలదు[6]మనముకం టె గాడ్పుకంటె.

115 వ. అనవుడు నద్దివ్యపురుషు [1]వచనంబు[2]న నత్తురంగంబు నెక్కి [3]తత్క్షణంబ యయ్యుదంకుండు [4]గురుగృహంబునకు వచ్చె [5]నిట గురుపత్నియు శుచి [6]స్నాతయై నూతనపరిధానశోభితయై యక్కుండలంబులు [7]దొడువ నవసరంబైనఁ [8]దదాగమనంబు గోరుచున్నయది యప్పు డయ్యుదంకుం గని తద్దయు సంతసిల్లి తదానీతరత్నకుండలభూషితయై బ్రాహ్మణులం బూజించి నిజసంకల్పితమహోత్సవం బొనరించె నట్లు గురుకార్యంబు [9]నిర్వర్తించి యున్న యుదంకుం జూచి గురుం డిట్లనియె.

116 క. ఈయున్న పౌష్య[1]పాలికిఁ బోయి కడుం బెద్దదవ్వు వోయినయ ట్ల
త్యాయతవిమలతపోమహిమా యిన్నిదినంబు లేల మసలితి చెపుమా.

114 1. పూన్చి—అ.ద. 2. యకోకమలికడకేగుదివసమద్దివస మతిక్రమిల్ల—అ.ఇ.ఈ.ఉ.ఋ.ఐ.ఒ.ఔ.క.బ.స.ళ. 3. దాల్చు—ల 4. మతిక్రమించ— ఊ.గ. 5. బోవనెట్లొడ—ఆ.డ.మ.య. 6 మనసుకంటె—చ.త.వీ.శ.ష.ళ.

115 1. ననుమతి—న. 2. విని య—య. 3. యతుణంబ—ఈ.ద.మ. 4. గురుపత్ని గృహంబు—ఔ.ప. 5. నంతకుముందర—న. 6. స్నానపరిధానశోభితయై—ఆ.ఇ.ఉ.ఋ.ఐ.ఒ.ఓ.క.గ.జ.ట.డ.త.ద.న.ప.బ; కృతస్నాన—య 7. దొడుగ—కె.కొ. ఇంకను యితర ప్రతులు. 8. నుదంకాగమనంబు—పెక్కు ప్రతులు. 9. నిర్వహించి—అ.గ్రి.చ.ణ.వ.వీ.శ.ష.స.

116 1. పాలికి—పెక్కు ప్రతులు; ప్రోలికి—వా.

117 వ. అనిన నుదంకుం డిట్లనియె నయ్యా మీయానతిచ్చినట్లు మసలవలవదు తక్షకుండను దుష్టోరగంబు సేసిన విఘ్నంబున [1]నింత మసల[2]వలసె మిమ్ము వీడ్కొని చనువాఁడ నెదుర నొక్కమహోక్షంబు నెక్కి చనుదెంచు [3]వాని నొక్కదివ్య పురుషుం గని వాని[4]పన్నిన వృషభ[5]గోమయ భక్షణంబు [6]సేసి చని పౌష్యమహాదేవికుండలంబులు [7]ప్రతిగ్రహించి [8]వచ్చుచోఁ దక్షకుచేత నపహృతకుండలుండనై వాని[9]పిఱుందన పాతాళ[10]లోకంబునకుం బోయి నాగపతులనెల్ల స్తుతియించి యందు సితాసితతంతుసంతానపటంబు ననువ యించుచున్నవారి నిద్దఱస్త్రీలను ద్వాదశారచక్రంబుఁ [11]బరివర్తించు చున్నవారి నార్వురఁ గుమారుల నతిప్రమాణతురగారూఢుండైన యొక్కదివ్యపురుషుం గని తత్ప్రసాదంబునఁ గుండలంబులు వడసి తదా దేశంబున నత్తురంగంబు నెక్కి వచ్చితి నిది యంతయు నేమి నాకెఱిం గింపుఁ డనిన గురుం డిట్లనియె.

118 సీ. అప్పురుషుం డింద్రుఁ డయ్యుక్ష మైరావతంబు గోమయ మమృతంబు నాగ
భువనంబు[1]లోఁగన్న పొలఁతు లిద్దఱు ధాతయును విధాతయు వారియనువ
యించు
సితకృష్ణతంతురాజితతంత్రమదియహో రాత్రంబు ద్వాదశారము[2]లు గలుగు
చక్రంబు [3]మాసాత్మసంవత్సరంబు కుమారు లయ్యార్వురు[4]మహితఋతువు

ఆ. లత్తురంగ మగ్ని యప్పురుషుండు పర్జన్యుఁ [5]డింద్రసఖుఁడు సన్మునీంద్ర
యాది నింద్రుఁగాంచి యమృతాశివగుట నీకభిమతార్థసిద్ధి యయ్యెనయ్య.

117 1 నింత మసలితి— కొన్ని ప్రతులు; మసలితి—కొ. 2. వలసె వినుడు— కొన్ని ప్రతులు. 3 వాని మహాతేజస్వి—గి.గ$_1$ చ.య.ర.వ.శ.ష.ళ. 4. పను పున—అ.ఆ.ఏ, పంచిన—ఓ గ. 5 గోమయం బుపయోగించి—ఆ.ఈ ఉ.ఎ.ఓ.క.ట.ద. మ.ర. 6. సేసి యమ్మహాత్ము ననుగ్రహంబు వడసి చని—ఊ.న మ.ల. 7 కొని— య; పరిగ్రహించి—త.మ 8. వచ్చి తక్షకు— గి.వా.శ ష.ళ. 9. తోడన—పెక్కు ప్రతులు 10. లోకంబు— కొన్నిప్రతులలో లేదు. 11. బరివర్తింపించు—వా శ. ష.ళ. మఱికొన్ని ప్రతులు.

118 1. నందున్న—అ.ఇ.ఊ.ఏ.ఓ.క.ద.న.య.ల 2. ల బరగు—ఓ. 3. మాసర్తు—కూ. కె.కొ. 4. మరియు—చ.ట.వీ.శ.ష.స.ళ. 5. ఇంద్రుఁడు ఉదంకుని గురువునకు, సఖుఁడు అని మూలమునఁగలదు "స చాపి మమ సఖా ఇంద్రః" 'పర్జన్యసఖుడు నతడు'—అను పాఠము 'మ' ప్రతిలో కలదు. కాని అన్వయము కుదురుట లేదు.

119 క. కర మిష్టము సేసితి మా కరిసూదన దీన నీకు నగు [1]సత్ఫలముల్
గురుకార్యనిరతులగు సత్పురుషుల కగు [2]టరుదె యధికపుణ్యఫలంబుల్

120 వ. నీవలనం [1]బరమసంప్రీతహృదయుండ నయితి నీవును [2]గుర్వర్థంబునందు ఋణ[3]విముక్తుండ వయితివి నిజేచ్ఛ [4]నుండు మనినఁ [5]దదనుజ్ఞ వడసి యుదంకుం డనేకకాలంబు దపంబు [6]సేసె నట్టి యుదంకుండు తక్షకుు చేసిన యపకారంబునకుం బ్రతీకారంబు సేయం [7]జింతించి యొక్కనాఁడు జనమేజయమహీపాలు పాలికిం బోయి యిట్లనియె.

-: ఉదంకుండు జనమేజయునకు సర్పయాగబుద్ధి గలిగించుట :-

సం. 1-3-177

121 చ. మితహితసత్యవాక్య జనమేజయ భూజనవంద్య యేను సు
[1]స్థితి గురుదేవకార్యములు సేయఁగఁబూను టెఱింగి వంచనో
న్నతమతియై యకారణము నా కపకారము సేసెఁ దక్షకుం
డతి[2]కుటిలస్వభావుఁడు [3]పరాత్మవిశేషవివేకశూన్యుఁడై.

122 వ. [1]అదియునుంగాక.

123 చ. అనవర[1]తార్థదానయజనాభిరతుం భరతాన్వ[2]యాభివ
ర్ధను సకలప్రజాహితవిధాను ధనంజయసన్నిభుం భవ
జ్జనకుఁ బరీక్షితుం [3]భుజగ[4]జాల్ముఁ డసహ్యవిషోగ్రధూమకే
తనహతిఁ జేసి చేసె నతి[5]దాంతుఁ గృతాంతనికేతనాతిథిన్.

119 1. శుభఫలముల్ — అ.ఋ ; తత్ఫలముల్ — య. 2. డరుదె — అ.బ.

120 1. బరసుప్రీతుండనైతి — అ.ఇ.ఈ.ఉ.ఊ.ఋ.ఐ.ట.క.గ.డ.ద.య.ర. 2. గురుకార్యంబువలన — య; గుర్వర్థంబు వలన — ఎ. 3 విముక్తుండవు — పెక్కు ప్రతులు. 4. జనుమనిన — ఎ.న.స. 5. గురుప్రసాదంబున నుదంకుం డనేక — పెక్కు ప్రతులు. 6. సేయుచుండె నట్టి — పెక్కు ప్రతులు. 7. దలంచి — ఊ.ఋ ద.మ.య.ల.

121 1. స్థితమతిదేవ - వ. 2. కుపిత — స. 3. దురాత్ముడశేష - ఐ.

122 1. అట్లుంగాక — కొన్ని ప్రతులు.

123 1. తాన్న — అ.స. 2. వాయ — ఇ.క.సం.అనం ; యప్రవ — ఏ.బ.వ. 3. పటుభుజంగుడసహ్య — అనం. 4. జాత్యుడు — అ.ప; జన్ముడు — న. 5. దాంతకృతాంత — క.

124 ఉ. [1]కాదన కిట్టిపాటి యపకారముఁ దక్షకుఁడేక[2]విప్ర[3]సం
బోధనఁజేసి చేసె నృపపుంగవ నీవు ననేక[4]భూసురా
పాదితసర్పయాగమున భస్మముసేయుము తక్షకాదికా
కోదర[5]సంహతిన్ హుతవహోగ్రసముగ్రశిఖాచయంబులన్.

125 ఉ. ప్రల్లదుఁడైన యొక్క కులపాంసను చేసినదానఁ దత్కులం
బెల్లను దూషితంబగుట యేమి యపూర్వము గావునన్ మహీ
వల్లభ తక్షకాధము [1]నెపంబున సర్పములెల్ల [2]నగ్నిలోఁ
ద్రెళ్ళఁగ సర్పయాగ మతి[3]ధీయుత చేయుము విప్ర[4]సమ్మతిన్.

126 వ. అని యిట్లయ్యుదంకుండు జనమేజయునకు సర్ప[1]యాగంబునందు బుద్ధి పుట్టించె ననిన విని శౌనకాది మహామును లక్కథకున కిట్లనిరి.

127 చ. అమితజగద్భయంకరవిషాగ్నియు నప్రతిహన్యమాన వీ
ర్యముఁగలయట్టి సర్పముల రాజనమేజయు చేయు సర్పయా
గమున నుదగ్రపావకశిఖా[1]తతులం [2]దొరుఁగంగఁ గారణం
బమలచరిత్ర యేమి చెపుమయ్య [3]వినం గడు వేడ్క యయ్యెడున్.

124 1. ఈ పద్యము లేని ప్రతులు—ఆ ఈ.ఉ.ఋ.ఎ.ఏ.ఒ.ఓ.క.కి.కు కూ. కే.కొ.చా.చూ. చె ట.టీ.టె.డ.ద.న.బ.య ర.వ.స. 2. విప్రు సంబోధన — సం. వీ; విప్ర సంపాదన జేసిచేసె నృపపావనఁ (నృపవల్లభ)- స.శ. 3. సంచోదన చేసి చేసె నృప సుందర — ఇ.ప; సంచోదనఁజేసిచేసె రిపుసూదన — ఐ. 4. భూసురోత్పాదిత—అ. — 5, సంతతిన్ — ఇ.

125 1. నెవంబున — అ.పి.శ. [శ్రీనాథుని ప్రయోగము కలదు. నై —8—47.] 2. వహ్నిలో—కొన్ని ప్రతులు; నగ్నిలో త్రెల్లగ — అ.కూ. 3. ధీరత — ఐ.ల.స. 4. సన్నిధిన్—ఇ.ఔ.గ.చ.ట.డ.ద.ప.బ.వా.శ.ష.శ. సమ్మతిన్—పెక్కు ప్రతులు.

126 1. యాగబుద్ధి — వా; యాగంబు సేయబుద్ధి — ర.

127 1. తతిలో — పెక్కు ప్రతులు. 2. దొలఁగంగఁ — వా; దొరగంగ — శ. 3. వినంగ నభీష్టమెంతయున్ — ఆ.ఇ.ఊ.ఏ.క.వ; వినం గడువేడు కయ్యెడున్ — కి.

—: భృగువంశ కీర్తనము – భృగు వగ్నికి శాప మొసంగుట :—
సం. 1-5-3

128 వ. అనియడిగిన వారికి నక్కథకుం డిట్లని చెప్పెం దొల్లి సర్పకులజననియైన [1]కద్రువశాపంబు కారణంబునం జేసి జనమేజయు సర్పయాగంబున సర్వభక్షకుండైన యగ్నియందు సర్పంబులకెల్ల నకాండప్రళయంబైన దాని భృగువంశ[2]జుండైన రురుండు [3]గావించు సర్పఘాతంబు సహస్రపాదుం డుడిగించినట్లు జరత్కారుసుతుండైన యాస్తీకుం డుడిగించె దీని సవిస్తరంబుగాం జెప్పెద [4]వినుండని భృగువంశకీర్తనంబు [5]నాస్తీకుచరితంబును జెప్పందొడంగె.

129 సీ. భృగుండను విప్రుండు మగువం బులోమయన్ దాని గర్భిణిం దన ధర్మపత్ని నగ్నిహోత్రమునకు నగ్నులు [1]విహరింపుమని పంచి యభిషేచనార్థ మరుగ నంత బులోముండన్ వింతరక్కసుం డగ్నిహోత్రగృహంబున [2]కొయ్యవచ్చి యత్తన్విం జూచి యున్మత్తుండై [3]యెవ్వరిసతి యిది సెప్పుమా జాతవేద

ఆ. [4]యనంగ నగ్నిదేవుం డనృతంబునకు విప్రశాపమునకు[5] వెఱచి శాప[6]భయము దీర్చుకొనంగం బోలుం దీర్పరా దనృతాభిభాషణమునసైన పాపభయము.

130 వ. అని [1]విచారించి య[2]ప్పరమపతివ్రత భృగుపత్నియని కలరూపుం జెప్పిన నప్పులోముండు నిది [3]నాకుం దొల్లి వరియింపంబడినభార్య పదంపడిభృగుండు పెండ్లియయ్యెనని వరాహరూపంబున [4]నాసాధ్వి నతిసాధ్వసచిత్త నెత్తికొని [5]పర్వంబర్వం తద్గర్భంబున నున్న యర్భకుండు గరం బలిగి కుక్షిచ్యుతుండై చ్యవనుండు[6]నాం బరగె నమ్మునికుమారుని.

128 1. కద్రువు — ప 2. జాతుండైన — ఇ.ల. 3. కావించిన — కీ. 4. దత్తావధానులరై —వా 5. అస్తికుని – పీ – పెక్కు తాళపత్రప్రతులు.

129 1. పొనరింపు — ఓ.స; విభజింపు — న స. 2. కొనరవచ్చి — ఓ.జ.ప. 3. యెవ్వని — కీ.కూ.కె.కొ.చె.టు. 4. యనిన— పెక్కు ప్రతులు; యనుడు — చె.టు. 5. నోడి—బ. 6. ఫలము — అ.ఇ ఈ.క.న.స; చయము — ఉ.చ. జ.డ.శ.స.

130 1. వితర్కించి — ర. 2. పరమ — కీ చె.టు.లలో లేదు. 3. తనకు—బ. 4. నత్తన్వి నతిసాధ్వి భీతచిత్త నెత్తుకొని — కూ. 5. పరవంబరవం—పెక్కు ప్రతులు; పరవం — చె. 6. నాబరగిన యమ్ముని కుమారు డయ్యెనురం గనుంగొనుటయు — కె.

-: చ్యవనునివలనఁ బులోముఁ డనురాక్షసుండు చచ్చుట :-

131 క. సముదితసూర్యసహస్రోపమదుస్సహ తేజు జగదుపప్లవ[1]సమయా
సమదీప్తి తీవ్రపావకసముఁ[2]జూచుచు నసుర భస్మసాత్కృతుఁ డయ్యెన్.

132 వ. పులోమయు నక్కొడుకు భృగు[1]కులవర్ధను నెత్తికొని నిజాశ్రమంబునకు వచ్చె నంతకు [2]ముందఱ నారక్కసునకు వెఱచి యక్కోమలి యేడ్చుచుం బోయినఁ దద్బాష్పధారాప్రవాహంబు మహానదియై తదాశ్రమసమీపంబునం బాఱిన దానికి వధూసర యను నామంబు [3]లోకపితామహుండు సేసె నంతఁ గృతస్నానుండై భృగుండు సనుదెంచి బాలార్కుండునుంబోని బాలకు నెత్తికొని[4]యున్న నిజపత్నిం జూచి యసుర సేసిన [5]యపకారంబున కలిగి యయ్యసుర నిన్నెట్లెఱింగె నెవ్వరు సెప్పి రనినఁ బులోమ యిట్లనియె.

133 క. [1]ఈయగ్ని దేవుఁ డసురకు నోయన చెప్పుటయు విని మహోగ్రాకృతితో
నాయసుర నన్ను సూకరమై యప్పుడ యెత్తికొని రయంబునఁ జనుచోన్.

134 క. కుక్షిచ్యుతుఁడై సుతుఁ డారాక్షసు భస్మంబు సేసి రాజితశక్తిన్
రక్షించె [1]నన్ను ననవుడు [2]నక్షణమ మునీంద్రుఁ డగ్ని కతిరోషమునన్.

131 1. సమయోద్యమదీప్త—న.స; సమయోద్యమదీప్తిసూర్య—కీ. 2. జూచుడు — అ ఈ.ఋ.ఔ.జ.డ.బ; చూచినన్ — చా.

132 1. వంశదీపకు — ఆ ఇ.ప.ఒ.ఓ.గ.జ.డ; కులనందను — అ ఋ.ఔ ట.ప. 2. ముందఱ – కొన్నిప్రతులలో లేదు. 3. లోకహితార్థంబుగ—చె.టు; లోకహితంబుగ—స. 4. యేడ్చుచున్న—ఇ.ఔ.త.న.బ.ల.స. 5. యపరాధంబు—ఇ.బ.

133 1. ఈ పద్యము మొదటి మూడు పాదములం దాదియందు ఇయ్యగ్ని-నొయ్యన-నయ్యసుర,—అనియును, నాల్గవపాదాదిని మైయప్పుడ—మయ్యప్పుడ,—అను పాఠములును గలవు.

134 1. దన్ను ననవుడు—కె. 2. నాక్షణమ — అ.ఊ.ఔ.క.చ.వా.శ.

135 వ. నీవతి[1]క్రూరుండవు సర్వభక్షకుండవు గమ్మని శాపం బిచ్చిన నగ్నిదేవుం డిట్లనియె.

136 క. తనయెఱింగిన యర్థం బొరుఁ డనఘా యిది[1]యెట్లు సెప్పుమని యడిగినఁ[2]జె
ప్పని[3]వాఁడును సత్యము సెప్పనివాఁడును ఘోరనరక[4]పంకమునఁ బడున్.

137 వ. [1]కావున నేనసత్యంబునకు వెఱచి యక్కోమలి భృగుపత్నియని [2]కలరూపుఁ జెప్పితి నఖిలజగత్కర్మసాక్షినైయుండి యసత్యం బెట్లు పలుకనేర్తు[3]నది నిమిత్తంబుగా నీవు నాకు శాపంబిచ్చిన నేనలిగి నీకుఁ బ్రతిశాపం బీ[4]నోపని వాఁడను గాను వినుము.

138 చ. అడిచినఁ దిట్టినన్ మఱి మహాపరుషంబులు పల్కి యల్కతోఁ
బొడిచిన నుత్తమద్విజులు పూజ్యులు వారల కెగ్గు సేసినం
జెడు నిహాముం బరంబు నిది సిద్ధము [1]గాన్రు నెఱింగి భక్తినె
ప్పుడు ధరణీసురోత్తములఁ బూజలఁ దన్పుదు నల్గ నోడుమస్.

139 వ. నీవు బ్రాహ్మణుండవు [1]నీ వెద్దిసేసిన నీక చనులోకహితుండనయిన నాకు శాపం బిచ్చి లోకంబులకెల్లఁ [2]జెట్టసేసితి వదెట్లనిన వేదోక్తంబులయిన నిత్యనైమిత్తిక [3]బలివిధానంబులందు మహాద్విజులచేత నాయందు వేల్వం[4]బడిన హవ్యకవ్యంబులు నా ముఖంబునన దేవపితృగణంబు లుపయోగింతు రట్టియేను సర్వభక్షకుండనై యశుచినైనఁ గ్రియానివృత్తియగుఁ గ్రియానివృత్తియై లోకయాత్ర లేకుండు నని యగ్నిభట్టారకుండు నిఖిలలోకవ్యాప్తంబైన తన తేజోమూర్తి నుపసంహరించిన.

135 1. క్రూరహృదయుండవు—పెక్కు ప్రతులు; క్రూరహృదయుండవు గావున–కీ.

136 1. యేమి – ఊ. జ 2. దా విని యెఱింగినంతయును జెప్పనివా డతి —ర. 3. నాడును సత్యము సెప్పని నాడును — అ ఇ.ఈ.ఉ.ఋ.చ.వా.శ; చెప్పని వాడును సత్యము సెప్పనివాడును–పెక్కుప్రతులు. 4. బాధలపడడే — ఋ.

137 1. కావున — కొన్నింట లేదు. 2. యున్నరూప — చె.టు. 3. నిది — చె.టు 4. నోపిన — ఆ.వా.

138 1. గాననెఱింగి — త.డ; గానయెఱింగి—ర.

139 1. తలంపక యెద్దిచేసిన — కే.చె.టు.టం. 2. నహితంబు చేసితెట్లనిన – పెక్కు ప్రతులు. 3. బహువిధవిధానంబులం జేసి—అ.న.స. 4. బడియెడు — ఆ.ఉ. ఋ.ఒ.ఓ.గ.ద.మ.ల.

140 సీ. తేఁతాఁగ్ను లెల్లను దేఁరిల్లమి జేసి క్రతుకృత్యములు వినిర్గతము లయ్యె
[1]నగ్నిహోత్రములందు నౌపాసనాది సాయంప్రాత రాహుతు లంత నుడిగె
దేవతార్చనలందు దీపధూపాది సద్విధులు వర్తిల్లక విరతిఁ బొందెఁ
బితృకార్యములఁ బితృపిండయజ్ఞక్రియ [2]లడఁగె విచ్ఛిన్నంబులై ధరిత్రి

ఆ. నంత జనులు[3]సంభ్రమాక్రాంతులై మహా మునుల కడకుఁ జనిరి మునులు నమర
వరుల కడకుఁ జనిరి వారును వారును బ్రహ్మకడకుఁ జనిరి భయము [4]వొంది.

141 వ. బ్రహ్మయు భృగుశాపనిమిత్తంబున నగ్నిభట్టారకు నుపసంహారంబును
సకలలోకవ్యవహారవిచ్ఛేదంబును నెఱింగి యగ్నిదేవు రావించి యిట్లనియె.

142 చ. ప్రకటితభూత[1]సంతతికి భర్తవు నీవ చరాచరప్రవృ
త్తికి [2]మఱి హేతుభూతుఁడవు దేవముఖుండవు నీవ లోకపా
వకుఁడవు నీవ యిట్టి యనవద్యగుణుండవు నీకు విశ్వధా
రకభువనప్రవర్తనపరాఙ్ముఖభావముఁ బొందఁ బాడియే.

143 వ. అమ్మహాముని [1]వచనం బమోఘంబు గావున నీవు సర్వభక్షకుండవయ్యును
శుచులయందెల్ల నత్యంతశుచివై [2]పాత్రులయందెల్లఁ బరమపాత్రుండవై
పూజ్యుల యందెల్ల నగ్రపూజ్యుండవై వేదచోదితవిధానంబుల యందు
విప్రసహాయుండ భువనంబుల నడపుమని విశ్వగురుండు వైశ్వానరుం
[3]బ్రార్థించి నియోగించి భృగువచనంబు [4]ప్రతిష్ఠాపించె నట్టి భృగునకుఁ
బుత్త్రుండై పుట్టి పరగిన.

140 1. నగ్నిహోత్రములయు నౌపాసనములు — అ.ఇ.ఎ.ఐ.ఒ.ఓ.క.గ,జ.ట.డ.ద బ మ.
ల.స; నగ్నిహోత్రములును నౌపాసనములు — ర; నగ్నిహోత్రములయందౌపా
సనముల సాయంప్రాతరాహుతులంత నుడిగె—కొ టీ. 2 లణగి విచ్ఛిన్నంబు
లయ్యెధరణి — అ ఊ.ఔ స 3 సంభ్రమాక్రాంతహృదయులై మునుల—కీ టా
4. బొంది — పెక్కు ప్రతులు

142 1. సంహతికి — కొన్నిప్రతులు 2. దగ—స.

143 1. శాపంబ — ప. 2. పవిత్రులయందు ... పవిత్రుండవై — జ. డ.
3. బ్రార్థించి — పెక్కింటిలోలేదు. 4. ప్రతిష్ఠించె — కొన్ని ప్రతులు.

144 క. చ్యవనునకు సుకన్యకు [1]నుద్భవమయ్యె ఘనుండు ప్రమతి ప్రమతికి నమ్మృతో
ద్భవయగు ఘృతాచికిని భార్గవముఖ్యుఁడురురుఁడుపుట్టెఁ గాంతియుతుండై.

*—: ప్రమద్వర సర్పదష్టయై చచ్చి మరల బ్రదుకుట :—*

సం. 1-8-1

145 వ. అట్టి రురుండను మునివరుండు విశ్వావసుండను గంధర్వరాజునకు మేనకకుం బుట్టినదాని స్థూలకేశుండను [1]మునివరు నాశ్రమంబునఁ బెరుఁగుచున్న దాని రూపలావణ్యగుణంబులఁ బ్రమదాజనంబుల యందెల్ల నుత్కృష్టయగుటం జేసి ప్రమద్వరయన నొప్పుచున్న కన్యక నతిస్నేహంబున వివాహంబుగా నిశ్చయించి యున్నంత.

146 తే. కన్నియలతోడ నాడుచు నున్న దానిఁ బాదమర్దితమైయొక్క పన్నగంబు గఱచెఁ గన్నియ లందఱు వెఱచి పఱచి యఱచుచుండఁ బ్రమద్వరయవనిఁ ద్రెళ్ళె.

147 వ. దాని నెఱింగి కరుణాకలితహృదయులై గౌతమ [1]కణ్వకుత్స కౌశిక [2]శంఖమేఖల భరద్వాజ వాలఖిల్యోద్దాలక శ్వేతకేతు మైత్రేయ ప్రముఖులు ప్రమతియు రురుండును స్థూలకేశాశ్రమంబునకు వచ్చి [3]విషవ్యపగత ప్రాణయై పడియున్న యక్కన్యం జూచి దుఃఖితులై యుండ నచ్చోట నుండనోపక రురుండు శోక[4]వ్యాకుల హృదయుండై యేకతంబ వనంబునకుం జని.

148 చ. అలయక యేన [1]దేవయజనాధ్యయనవ్రతపుణ్యకర్మముల్
సలుపుదునేని యేన గురుసద్ద్విజభక్తుఁడ నేని యేన య
త్యలఘుతపస్వినేని [2]దివిజాధిపభూసురులార మన్మనో
నిలయకు నీప్రమద్వరకు [3]నిర్విషమయ్యెడు నేఁడు మీదయన్.

144 1 నుద్భవించె ననఘుండు – ఇ.ప.

145 1. మహాముని నివాసంబున – కొన్ని ప్రతులు.

147 1. కౌణకుత్స అని మూలము. 2. శంఖపాల అని కొన్నిప్రతులు; మూలమున శంఖ మేఖల అని యున్నది. 3. విషగత ప్రాణయై – కె; విగత ప్రాణయై – కూ కొ. 4. వ్యాకులితచిత్తుండై – కొన్ని ప్రతులు.

148 1. దేవయజనాధ్యయనాధ్వర — ఐ. 2. దనుజామర—అ.గ.ట.డ.ద.ప.బ.ల స; దివిజాసుర — న. 3. నిర్విషమయ్యెడ—ఋ.ఒ.

149 చ. అపరిమితాజ్ఞఁ జేసియు మహాపురుషుల్ విషతత్త్వసంహితా
నిపుణులు మంత్రతంత్రములు నేర్చి [1]విధించియు దీనికిన్ విష
వ్యపగతమైన జీవమిది వచ్చు నుపాయము సేయరొక్కొ నా
తపము ఫలంబు నధ్యయన దానఫలంబులు నిత్తు వారికిన్.

150 వ. అని దీనవదనుండై యాక్రోశించువానికి నాకాశంబున నుండి యొక్క దేవదూత యిట్లనియె. నయ్యా! కాల[1]వశంబయిన నెవ్వరికిం దీర్ఘ [2]దరంబుగా దొక్క యుపాయంబు గలదు చేయనోపుదేనిఁ జెప్పెద వినుము నీ యాయుష్యంబునం దర్ధం బిక్కన్యకిమ్మనిన రురుం డట్ల చేయుదునని తన యాయుష్యంబునం దర్ధం బక్కన్యక కిచ్చిన నక్కోమలి దొల్లింటికంటె నధికశృంగార సమన్వితయై విషనిర్ముక్తయయ్యె నట్లు దేవదూత [3]ధర్మరాజానుమతంబునఁ దన చెప్పిన యుపాయంబునం బ్రమద్వరను బంచత్వంబు వలనం బాపె రురుండును దాని వివాహంబై యిష్టోపభోగంబుల [4]ననుభవించుచు నుండి.

151 క. తన సతి [1]కపకారము సేసిన పాముల కలిగి [2]బాధ సేయుదునని చి
క్కనిదండము గొని పాములఁ గనినప్పుడ యడువఁదొడఁగె గహనములోనన్.

152 చ. * [1]తిరుగుచుఁ బుట్టలం బొదలఁ ద్రిమ్మరు పాముల [2]రోసిరోసి ని
ష్ఠురతరదీర్ఘదండమున డొల్లఁగ వ్రేయుచు [3]వచ్చివచ్చి య
య్యెరవున డుండుభంబను నహిం గని వ్రేయఁగ దండ మెత్తుడున్
హారిహారియంచు డుండుభమహాహి భయంపడి [4]పల్కె భార్గవున్.

149 1. పఠించియు — ఉ.వ.

150 1. సర్పదష్టంబైన — కె; దష్టంబైన— పెక్కు ప్రతులు. 2. వశంబు— కొన్ని ప్రతులు. 3. ధర్మరాజానుమతంబువడసి—కూ. కె కొ. 4. దనుపుచుండి — ?

151 1. కపరాధము — కి 2. యెగ్గు — టీ.

152 1. తిరివడి — ఔ. సూ; తెరువుల — కూ? 2 నెల్లరోసి — ద.స; రోసిపట్టి నిష్ఠురభుజ—109. 3. వచ్చి వచ్చి యయ్యెరవున — ఇ.ఋ.గి గి$_1$.వా.శ; వచ్చి వచ్చి యయ్యెరవున—అ ఐ.ఒ, వచ్చి వచ్చి యొక్కొరుకున — ర, వచ్చివచ్చి యయ్యెడనొక — ఎ.ఓ.జ.డ.త.వ; వచ్చి వచ్చి యయ్యెరువున— శక 57 పుట, వచ్చివచ్చి యయ్యెరుగున—ద.వ. ద్విగే; వచ్చి యొక్కచో నిరుకున డుండుభంబను—ల; వచ్చి యొక్కచో నెరనొక' — పెక్కు ప్రాచీన ముద్రిత ప్రతులు పూవు లయ్యెరగమి డాయనోడుదు రహివ్రజశంక విభీతచిత్తులై —కు.సం. 6-44 4. పల్కె—ఉ.ఎ.ద న.ల.

* తెరువుల బుట్టలం బొదల ద్రిమ్మరు పాముల రోసి పట్టి ని
ష్ఠుర భుజ దీర్ఘదండమున డొల్లగ వ్రేయుచు వచ్చి వచ్చి యొ
క్కొరుకున డుండుభంబను నహిం గని వ్రేయగ దండమెత్తుడున్
హారి హారి యంచు డుండుభ మహాహి భయంపడి పల్కె భార్గవున్ — కూ.డా.

153 మత్తకోకిలము. ఏమి కారణమయ్యె పాముల [1]కింత యల్గితి నీవు తే
జోమయుండవు బ్రాహ్మణుండవు సువ్రతుండవు నావుడుం
బాము లెగ్గొనరించె మత్ప్రియభామ కేను రురుండ ను
ద్దామసత్త్వుఁడ నిన్ను నిప్పుడ దండతాడితుఁ [2]జేసెదన్.

154 వ. అని రురుం డలిగి [1]కృతాంతకరదండంబుంబోని తన దండం బెత్తికొనుడుఁ [2]దత్క్షణంబ డుండుభంబు మునియై యెదుర నిలిచినం జూచి [3]రురుం డిట్లనియె.

155 క. ఉరగమవై యుండి మునీశ్వరవేషము దాల్చి యున్న [1]వడు వెంతయు న
చ్చెరువిది [2]యెట్టులు నావుడు రురునకు నిట్లనియె మునివరుం [3]డనురక్తిన్.

—: సహస్రపాదుని వృత్తాంతము :—

సం 1-10-6

156 వ. ఏను సహస్రపాదుండను మునిముఖ్యుండ నాసహాధ్యాయుండు ఖగముం డను మునిముఖ్యుం డగ్నిహోత్ర గృహంబున నున్న నే నపహాసార్థంబు తృణమయసర్పం [1]బమ్మునిపై వైచిన నతం [2]డులికిపడి నాకలిగి నీవు [3]నిర్వీర్యంబైన యురగంబ వగుమని శాపంబిచ్చిన నేనును మేలంబు [4]సేసిన నింత యలుగనేల క్షమియింపు మనినం బ్రసన్నుండై ఖగముండు నా వచనం [5]బమోఘంబు గావునఁ గొండొక కాలంబు డుండుభంబవై యుండి భార్గవ కుల[6]వర్ధనుండైన రురుం గనిన యప్పుడు [7]శాపవిముక్తుండవగుదు వనెనని సహస్రపాదుండు రురునకుఁ దన వృత్తాంతం బంతయుం జెప్పి వెండియు నిట్లనియె.

153 1. కేల — పెక్కు ప్రతులు; కెల్లనల్గితి — అ స. 2. జేయుదున్—అ.బొ.త

154 1. దండధరుదండంబుం — అ. 2. నక్షణంబ – పెక్కు ప్రతులు. 3 రురుండు విస్మితుండై యిట్లనియె — ల.

155 1. వాడ విదియు — ఊ 2 యెట్లగు — త. 3. డతిభక్తిన్ — పెక్కు ప్రతులు; డును భక్తిన్ — క; డును ప్రీతిన్ — చె.టు

156 1. బమ్మని యెఱుత వైచిన—చె.టు. 2. దదిరి — మ.య.ర.వా.శ; డులికి పడి — పెక్కు ప్రతులు. 3. నిర్విషంబైన—చె.టు.న. 4 సేసిన నాపయి—ఉ.గి.చ.య.ర.వా.శ. 5. బసత్యంబు గాదు — ఇ.ఈ.ఉ.ఊ.ఋ.ఒ ఓ జ.ద. 6. దీపకుండైన—ఈ.ర; ప్రదీపకుండైన—ఉ.క.డ; నందనుండైన—ఒ.గ.ద.న; ముఖ్యుండైన — త.బ. 7. నీకు శాపమోక్షం బగునని — పెక్కు ప్రతులు.

157 ఉ. భూనుతకీర్తి బ్రాహ్మణుఁడు [1]పుట్టుడుఁ దోడన పుట్టు నుత్తమ
జ్ఞానము సర్వభూతహిత[2]సంహితబుద్ధియుఁ జిత్తశాంతియుఁ
[3]మానమదప్రహాణము [4]సమత్వము [5]సంతత వేదవిద్యను
ష్ఠానము సత్యవాక్యము దృఢవ్రతముం గరుణాపరత్వముఁ.

158 వ. అయ్యా నీవు బ్రాహ్మణుండవు భృగువంశ[1]సముత్పన్నుండవు సర్వగుణ సంపన్నుండ విది యేమి దొడంగి తిట్టి దారుణక్రియారంభంబు క్షత్రియులకుం గాక బ్రాహ్మణులకుం జనునే [2]బ్రాహ్మణు లహింసాపరు లొరులు సేయు హింసలు వారించు పరమకారుణ్యపుణ్యమూర్తులు జనమే జయుండను జనపతి చేయు సర్పయాగంబునందుఁ గద్రూశాపంబున నయ్యెడు సర్పకుల ప్రళయంబును భవత్పితృ శిష్యుండయిన యాస్తీకుండను బ్రాహ్మణుండ కాఁడె [3]యుడిగించెనని చెప్పి సహస్రపాదుండు రురునకు సర్పఘాతంబునం దుపశమనబుద్ధి పుట్టించె ననిన విని శౌనకాది మహామును లక్కథకున కిట్లనిరి.

159 ఆ. ఒరుల వలనఁ బుట్టు [1]నోటమియును నెగ్గుఁ
బొరయకుండ [2]నరసి పుత్త్రవరులఁ
దగిలి కాచునట్టి తల్లి సర్పములకు
నేల యలిగి శాప మిచ్చె నయ్యా.

160 వ. అని సౌపర్ణాఖ్యాన శ్రవణకుతూహలపరులై యడిగిన.

157 1. పుట్టుడుతోడన — డా. పుట్టుటతోడనె — టి; పుట్టగతోడనె — కం. చూ. టీ; పుట్టిన—చా టా. 2. సంయుత — ల. 3. మానమద ప్రహారము—కూ కె కొ.చె.చే.టు మఱికొన్ని ప్రతులు. 4. శమత్వము — ఉ.ఊ.ఋ.ఎ.ఏ.ఐ. ఒ ఓ.ఔ.క.గ చ.జ.ట.డ.త.ద.ప.బ; శమంబును — చ శ.ష.స ప్రాచీన ముద్రిత ప్రతులు; 5. శాస్త్రము వేద విధ్యనుష్ఠానము — చు.

158 1. సంభవుండవు — ఊ.ఏ య. 2. బ్రాహ్మణులగువారల — ఏ.ట.త.బ.ర. 3. నివర్తించె — జ; నివర్తించు — కూ.కొ; యుడిగించు—కె.

159 1. నోటమి నెగ్గును — పెక్కు ప్రతులు; నోటయు నెగ్గును—కె; నోటము నెగ్గును — స.శ. 2. తల్లి — పెక్కు ప్రతులు; తనదు—న.ర.

161 ఉ. [1]రాజకులాగ్రగణ్య మృగరాజపరాక్రమ రాజరాజ వి
భ్రాజితశుభ్రకీర్తి పరిపాండుర సర్వదిగంతరాళ ఘో
రాజిముఖోపలబ్ధ విజయ ప్రమదాశ్రిత బాహుదండ ని
స్తేజిత వైరివీర కులదీప [2]మృడప్రియ విష్ణువర్ధనా.

162 క. ఆదిత్యచరిత్ర ధరాదేవాశీఃపరంపరావర్ధితని
త్యోదయ [1]సత్యోదిత [2]విమలాదిత్యతనూజవిక్రమాదిత్యనిభా.

163 తోటకము. నిరవద్యనరేశ్వర నిత్యనిరంతర ధర్మమతీ గుణధామ జగ
త్పరి[1]పూరిత[2]కీర్తి[3]విభాసి విభాకరతేజ నృపోత్తమ కాంతినిధీ.

## గద్యము

164 ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్ట ప్రణీతంబైన శ్రీ మహాభార
తంబునందాదిపర్వంబున ననుక్రమణికయును బౌష్యోదంక
మాహాత్మ్యంబును భృగువంశ కీర్తనంబు నన్నది
ప్రథమాశ్వాసము.

161 1. ఈ పద్యము పెక్కు ప్రతులలో లేదు. కొన్నింట నిది 'ఆదిత్య' పద్యము తరువాత నున్నది 2. బుధప్రియ—అ.ఇ.ఊ ఏ.త.ల.స; మృదుప్రియ — చూ.

162 1. సత్యాధిక — ఇ ఎ ఔ.డ.త; సత్యనిధీ—కి. 2. విమలాదిత్యాత్మజ నిరంతరానందమతీ — స.

163 1. పూజిత కీర్తి—టు. 2. శాశ్వతకీర్తి విభాకరతేజ—ఊ. 3. విభాసితభాస్కర — ఈ.చ.శ.ష; విభాసి ప్రభాకరతేజ — స.

# శ్రీమదాంధ్రమహాభారతము

## ఆదిపర్వము - ద్వితీయాశ్వాసము

1 శ్రీవనితా వల్లభ [1]వేంగివిషయాధీశ కావ్య [2]గీత ప్రియ నా
నావనినాథ కిరీటతటీవిలసద్రత్న సంఘటితపదకమలా.

*—: కద్రూ వినతలు పుత్త్రులం గోరి పడయుట :—*

సం. 1-14-5

2 వ. అక్కథకుండు శౌనకాది మహామునులకుం జెప్పె నాదియుగంబునం గశ్యప ప్రజాపతి భార్యలైన [1]కద్రువయు వినతయు ననువారలు పుత్త్రార్థినులై యనేకసహస్ర వర్షంబులు కశ్యపు నారాధించినం గశ్యపుండును బ్రసన్నుండై మీ కోరిన వరంబు లిచ్చెద వేఁడుం డనిన.

3 తరలము. అనలతేజులు దీర్ఘదేహులునైన యట్టి తనూజులన్
వినుత సత్త్వులఁ గోరెఁ గద్రువ వేవురం గడు వేడ్కతో
వినత గోరె సుపుత్త్రులన్ భుజవీర్యవంతుల వారి కం
టెను బలాధికులైనవారిఁ గడింది వీరుల నిద్దఱన్.

---

1 1. వేఁగీ - వా ; వేగీవిషయ - పీ. 2. గీతి - స.

2 1. కద్రువు - ఇ.ఒ గి.చ.ప.

4 వ. కశ్యప ప్రజా[1]పతి తొల్లి పెద్దకాలంబు తపంబు సేసి పుత్త్రి[2]కామేష్టిఁ జేసెఁ గావునఁ గద్రువకు [3]వేవురు కొడుకులను వినతకు నిద్దఱు కొడుకులను వారి కోరిన యట్ల యిచ్చి గర్భంబు లిమ్ముగా రక్షింపం బనిచిన నయ్యిద్దఱును దద్దయు సంతసిల్లి యున్నంత గర్భంబులు గొండొకకాలంబునకు నండంబు లైన నయ్యండంబులు ఘృతకుండంబులం బెట్టి రక్షించు చున్నంత నేనూఱేండ్లకుఁ [4]గద్రూగర్భాండంబులు తరతరంబ యవిసిన నందు శేష వాసు క్యైరావత తక్షక కర్కోటక ధనంజయ కాళియ మణినాగాపూరణ పింజర [5]కైలాపుత్త్ర వామన నీలానీల కల్మాష శబలార్య కోగ్రక కలశపోతక [6]సురాముఖ దధిముఖ విమలపిండ కాప్త[7]కరోటక శంఖ వాలి శిఖ [8]నిష్ఠానక హేమగుహ నహుష పింగళ బాహ్యకర్ణ హస్తిపద ముద్గరపిండక కంబ లాశ్వతర కాళీయక వృత్త సంవర్తక [9]పద్మ [10]శంఖముఖ [11]కూష్మాండక క్షేమక పిండారక కరవీర పుష్పదంష్ట్రి [12]బిల్వక [13]బిల్వపాండర మూషకాద శంఖశిరః [14]పూర్ణభద్ర హరిద్ర కాపరాజిత జ్యోతిక శ్రీవహ కౌరవ్య ధృతరాష్ట్రి [15]శంఖపిండ వీర్యవ ద్విరజస్సుబాహు శాలిపిండ [16]హస్తిపిండ పిఠరక [17]సుముఖ [18]కౌణపాశన [19]కుఠర కుంజర ప్రభాకర కుముద కుముదాక్ష తిత్తిరి హాలిక [20]కర్దమ బహుమూలక కర్క రాకర్కర కుండోదర మహోదరు లాదిగాఁగల వేవురు నాగముఖ్యులు పుట్టిన.

—: అనూరుఁడు జనించి వినతకు శాప మిచ్చుట :—

సం. 1-14-14

5 క. తన గర్భాండంబుల రెంటను బ్రియనందనులు [1]వెలువడమి నతి లజ్జా
వనత యయి వినత పుత్త్రార్థిని యొక యండంబు విగత ధృతి నవియించెన్.

4 1. పతియును దొల్లి, పతియుందొ — కొన్ని ప్రతులు. 2 కామేష్టి జేసినవాడు గావున — పెక్కు ప్రతులు; కామే వేల్చినవాడు గావున — త. 3. వేవుర గొడుకులను — ఋ.ఒ.ఔ క.ఖ గ త వా ష శ. 4 గద్రువగర్భాండంబులు — పెక్కు ప్రతులు 5 ఏలాపత్ర — భం. నీల 6 సుమనోముఖ — భం. సుమనాఖ్య—నీల. 7. కోటనక — భం. 8. నిష్ఠ్యానక — భం ; నిష్టానక — నీల. 9. ద్వావద్మా — భం నీల 10 శంఖనక — భం. 11. స్ఫండక — భం. 12 ఏళక — భం 13 బిల్వపాండుక — భం: బిల్వపాండుర — నీల 14. పూర్ణదంష్ట్ర — భం. 15. పుష్కర—శల్యక — భం. 16. హస్తిభద్ర — భం. 17. ముఖర — భం. 18. కోణవాసన — భం. 19 కురర — భం. 20 కర్దమ—బహుమూల — ఇవి భం. ప్రతిలో లేవు.

5 1. వెలువడమి కతి — ఈ.బ.మ.

6 క. దాన నపరార్ధకాయ విహీనుఁడు పూర్వార్ధతను సహితుఁ డరుణుఁ డనం
గా నుదయించె సుతుండు మహానీతి [1]యుతుండు తల్లి కప్రియ [2]మెసఁగన్.

7 వ. ఇట్లు వికలాంగుండై పుట్టిన యనూరుండు వినతకు నలిగి నన్ను సంపూర్ణ శరీ
రుం గానీక యండం బవియించిన యవినీతవు కావున నీవు నీ సవతికి దాసివై
యేనూఱేం డ్లుండుమని శాపం బిచ్చి యింక నీ రెండవ యండంబు తనకుఁదాన
యవియునంతకు నుండ నిమ్మిందుఁ బుట్టెడు పుత్త్రుండు మహా బల పరాక్రమ
సంపన్నుండు నీదాసీత్వంబు వాపునని చెప్పి సూర్యరథసూతుండయి యరిగె
వినతయు నయ్యండం బతిప్రయత్నంబున రక్షించుకొని యుండె నంత.

—: దేవాసురు లమృతమును బడయఁ గోరి సముద్రమును మథించుట :—

సం. 1-15-5

8 క. అమరాసుర వీరులు మున్నమల పయోరాశిఁ [1]ద్రచ్చి యమృతము వడయన్
సమకట్టి సురేంద్రపురోగములై హరి హర హిరణ్యగర్భులతోడన్.

9 ఉ. మేరు మహా మహీధరము మీఁదికి నందఱుఁ బోయి యే క్రియన్
వారిధిఁ [1]ద్రచ్చువారము ధ్రువంబుగ దానికిఁ గవ్వమెద్ది యా
ధారము దాని కెద్ది యని తద్దయు [2]వెస్పడి యున్న నచ్యుతాం
భోరుహ గర్భు లిద్దఱును బూనిరి సర్వము నిర్వహింపఁగన్.

10 చ. [1]అరుదుగ సర్వశైలముల [2]యంత తనర్చును నార్జవంబు సు
స్థిరతయు నోషధీరసవిశేషతయుం గల దుత్తమంబు మం
థర కుధరంబు [3]గవ్వ మగు [4]దానికి నంచును నిశ్చయించి య
య్యిరువురుఁ బంపఁగాఁ బెఱికి యెత్తె ననంతుఁడు తద్గిరీంద్రమున్.

6 1 పరుండు — అ.గ.ట. 2. మొదవన్ — బొ.క.డ.త.ల స ; మొనరన్ — ఆ.ఏ.
న.ర.స.

8 1. తర్చి — ఋ.స $శ_1$ ; దరచి — ఖ.

9 1. దర్చువారము — స.శ 2. జేడ్పడి - ఉ.న.ల ; బెంపరి - ఆ.ర.స.

10 1. అరయగ - అ ఈ బ.వ 2. యందుఁ దనర్చును - స 3. గవ్వముగదా యని
యంచును — మ య. 4. దానిది యంచును — ఆ.ఈ.ఉ.ప మ.స.

11 వ. ఇట్లు పదునొకండు వేల యోజనంబుల తనర్చును నంతియ [1]పాఁతునుం గల [2]మంథరనగం బనంతుం డనంత శక్తిం జెఱికి యెత్తిన నందఱును నప్పర్వతంబు దెచ్చి సముద్రంబులో వైచి దానిక్రింద నాధారంబుగాఁ గూర్మరాజు [3]నియమించి [4]యోక్త్రంబుగా వాసుకి నమర్చి.

12 శా. క్షోణీచక్ర [1]భరంబు గ్రక్కదల దిక్కుల్ మ్రోయఁగా నార్చి య
క్షీణోత్సాహసమేతులై రయమునన్ గీర్వాణులుం బూర్వగీ
ర్వాణవారితము నబ్ధిఁ [2]ద్రచ్చునెడఁ దద్వ్యాకృష్టనాగానన
శ్రేణీప్రోత్థ విషాగ్ని ధూమ వితతుల్ [3]సేసెం[4]బయోదావలిన్.

13 క. ఉరగపతి తలల[1]వల నురుతరజవమున నసురు లూఁది తత్పుచ్ఛము ని
ర్జరవరు లూఁది మహామత్సరమున వడిఁ ద్రచ్చి త్రిచ్చి జవమఱియున్నన్.

14 క. నారాయణుండు వారి కవారిత జవసత్త్వములు ధ్రువంబుగ నిచ్చెన్
వారును దొల్లిటికంటె నపార [1]ప్రారంభులై రపరిమిత శక్తిన్.

15 చ. ఉడుగక యొండొరుం [1]జఱచి యొక్క [2]బలంబున దేవదానవుల్
వడిగొని [3]వార్ధి నిట్లు దరువం దరువన్ విష [4]ముద్భవిల్లి నల్
గడలను విస్ఫులింగములు [5]గప్పఁగఁ [6]బర్విన దానిఁ జెచ్చెరన్
మృడుఁడు గడంగి పట్టుకొని మ్రింగి గళంబున నిల్పెఁ బొల్పుగన్.

11 1 లోతు – పెక్కు ప్రతులు. 2. మందరమహానగంబు – న.య.ర ష. 3. నియోగించి – అ.ఈ.ఔ.గ. 4. సూత్రంబు – ఆ.ఋ క న.బ.వ, నేత్రంబు – ఇ ఒ.క.శ.

12 1 తలంబు – స. 2 దర్చు – న.స.$శ_1$. 3. సేరెం బయోదావలిన్ – ల.స. 4. బయోదాకృతిన్ – అ.

13 1 దెస – ఐ.గ.న.ర.

ఉరగపతి తలల వలనుగ
నురుజవమున నసురు లూదియును బుచ్ఛము ని
ర్జరవరు లూదియును మహా
భరమునవడి దర్చితర్చి (ద్రచ్చిత్రచ్చి) వసమఱి యున్నన్ – $శ_1$.స.

14 1. పరాక్రములునై – స.

15 1. బొదివి – ద.స. 2 మొగంబున – ఆ.స; జవంబున – ఔ.స. 3. యిట్లువార్ధి – పెక్కు ప్రతులు. 4. ముద్భవిల్లుడున్ గడువడి – ఓ. 5. గప్పుచు – అ ఎ.క ఖ.జ.త.న.ప.య; గ్రమ్మగ – ఓ. 6. జేర్చిన – ఇ.

16 వ. [1]మఱియు [2]జ్యేష్ఠయుఁ జంద్రుండును [3]శ్రీయును నుచ్చైశ్శ్రవంబును గౌస్తుభంబును[4] [5]నైరావణ [6]గజం బును నమృత పూర్ణ శ్వేతకమండలుధరుం డైన ధన్వంతరియు నాదిగా ననేకంబు లుద్భవిల్లిన నందుఁ ద్రిభువన వంద్య యయిన శ్రీదేవియు నిజప్రభాపటల [7]పర్యుదస్తప్రభాకరగభస్తివిస్తరం బయిన కౌస్తుభంబును నారాయణువక్షస్స్థలంబున విలసిల్లె నుచ్చైశ్శ్రవం బను యుగ్యంబు [8]నైరావణ గజంబును సురరాజయోగ్యంబు లయ్యె నంత నయ్యమృతంబు నసురులు చేకొనిన.

17 క. నారాయణుండు కృత్రిమ నారీరూపమునఁ దన్మనంబుల కతి మో
హారంభకారుఁడై యమరారులచేఁ ద్రమ్మఱంగ నమృతము [1]గొనియెన్.

18 వ. ఇట్లుపాయంబున నసురుల వంచించి యమృతంబు గొని విష్ణుదేవుండు దేవతల కిచ్చిన నయ్యమృతంబు దేవత లుపయోగించుచో దేవరూపంబు దాల్చి [1]రాహువు వేల్పులబంతి [2]నయ్యమృతం [3]బుపయోగించుచున్నఁ దత్సమీపం బున నున్న చంద్రాదిత్యులు [4]వాని నెఱింగి నారాయణునకుం జెప్పిన నయ్యమృతంబు వాని కంఠబిలంబు సొరక ముందఱ.

19 క. అమరారి[1]మర్దనుఁడు చక్రము గ్రక్కున [2]నేయ రాహుకంఠము దెగి దే
హము ధరణిఁ బడియెఁ దన్ముఖ మమృత స్పర్శమున నక్షయంబై నిలిచెన్.

16 1 మఱియు నమృతంబును – వా.ళ. ఇతర ప్రతులు. 2. జ్యేష్ఠయుఁ జంద్రుండును– పెక్కు ప్రతులలో లేదు. 3 శ్రీయును సురాదేవియు – అ.ప క. 4 ధన్వంత రియు— వా. ళ. ఇతర ప్రతులు. 5. పెక్కు ప్రతులలో లేదు. కొన్నింట 'ఐరావ తంబు'—అని రూపము. 6. గజంబును నమృతపూర్ణ శ్వేత కమండలుధరుండైన ధన్వంతరియు – ఈ పాఠము అ.ప.క.ల ప్రతులలో కలదు. మూలమున కిది యను గుణముగనున్నది. 7. పర్యస్త – ఈ.ఉ ట త.ప న ; పర్యాప్త – అ.ప.క.ఖ.ర. 8. పెక్కు ప్రతులలో లేదు.

17 1 వడసెన్ – ట బ

18 1. రాహుకేతువులు - అని పెక్కు ప్రతులు. కాని యిది మూలానుగుణము కాదు. 2. నయ్యమృతంబు ద్రావం – ఈ.ఉ.జ.డ ; నయ్యమృతంబు ద్రావంబోయిన - అ ట.వ. 3. బుపయోగింప బోయిన– బుపయోగింపనున్న – అని పాఠాంతరములు. 4. దాని – ఇ ఒ.ప య

19 1. దమను కరచక్రము గ్రక్కున గొనియె రాహుకంఠము - అ.మ; మథనకరచక్రము గ్రక్కున గొనియె - డ. 2 గొనిన – య.

20 వ. నాఁటంగోలె [1]రాహువునకుఁ జంద్రాదిత్యులతోడి [2]విరోధంబు శాశ్వతంబయి ప్రవర్తిల్లుచుండె.

-: దేవ దానవుల యుద్ధము :-
సం. 1—11—10

21 సీ. అంత దేవాహితు లమృతంబు గానక యెంతయు [1]నలిగి బలీంద్రుఁ గూడి
మంతనం బుండి యమర్త్యులతోడి [2]పొత్తింతియ చాలు నింకేల యనుచు
[3]సంతనకట్టి యుత్సాహ సమేతులై యంతంబు లేని రథాశ్వములను
దంతుల సమితపదాతుల నొడఁ గూర్చి యంతకాకారులై యార్చి యమర

ఆ. వరులఁ దాఁకి యేసి రురుతర శర పక్ష జాత వాత రయ విధూతమగుచుఁ
జెదర జలదపంక్తి బెదర వజ్రాయుధుహృదయ ముదిలకొనఁగఁ ద్రిదశగణము.

22 మహాస్రగ్ధర.
అమరేంద్రారాతు లిట్లాహవముఖమున నేయంగఁ [1]దత్తీక్ష్ణబాణౌ
ఘము ఘోరంబై సురానీకము పయిఁ బెలుచం[2]గప్పినంజూచి [3]దైత్యో
త్తములం గోదండ [4]చక్రోద్యతభుజులు మహోదారులై వీరలక్ష్మీ
రమణుల్ దుర్వారవాత్యారయమున నరనారాయణుల్ దాఁకి రల్కన్.

23 మ. నరచాప ప్రవిముక్త దారుణ బృహన్నారాచధారల్ భయం
కర దైతేయ నికాయ కాయములపైఁ గప్పెన్ దిశల్ [1]నిండ బం
ధుర ధాత్రీధర తుంగ శృంగ తట సందోహంబుపైఁ గప్పు దు
ర్ధర ధారా ధర ముక్త సంతత పయోధారావళిం బోలుచున్.

---

20 1. రాహునకు—ఆ.ఇ.ఈ.ఉ ఐ,ఒ ఖ.డ.త. 2 విరోధాను బంధంబు—అ ఉ.ఒ; వైరంబు—ఏ. మ.

21 1. వగచి—ఎ చ.ట.ద ప.య.శ ష. 2 పొందింతియ—ఔ.త.న.మ శ.ష.శర 3 నెంతయు సమకట్టి యూర్జ్వా సమేతులై—న.

22 దత్తీవ్ర—న. 2. గ్రమ్మినం—ఎ. 3 దైత్యాధములం— కొన్నిప్రతులు. 4 చక్రోద్ధత— కొన్నిప్రతులు.

23 1. నిండి— కొన్నిప్రతులు

24 మ. పతదుర్వీధర ధాతునిర్ఝరజలాభంబై మహా దేహ ని
ర్గతసాంద్రారుణపూర మొక్క మొగి నొల్కం [1]గ్రెస్సి నారాయణో
న్నతదోర్దండ విముక్త చక్ర నిహతిన్ నాకద్విషన్మస్తక
ప్రతతుల్ ఘోరరణంబునం బడియె భూభాగంబు [2]గంపింపఁగన్.

25 వ. ఇట్లు సముద్రతీరంబున నమరాసురులకు నతిఘోరయుద్ధం బయ్యె నందు నరనారాయణు లపారపరాక్రములై యసురవీరులఁ [1]బెక్కండ్రం జంపిన నుక్కడంగి [2]దెసచెడి యసురులు సముద్రంబు [3]సొచ్చిన నమరులు సమరలబ్ధ విజయులై యమరపతి నమృతరక్షణార్థంబు ప్రార్థించి యథాస్థానంబున మంథరనగంబుఁ [4]బ్రతిష్ఠాపించి తమ తమ నివాసంబులకుం జని సుఖంబుండి రంత.

*—: కద్రూవినత లుచ్చైశ్శ్రవమును జూచి పందెములు నఱచుట :—*

సం. 1-18-1

26 క. అమృతముతో నుద్భవమై యమరేశ్వరయోగ్యమైన హయరత్నము త
ద్విమలోదధితీరంబునఁ గొమరుఁగ నేకతమ యుచ్చైఁ గ్రుమ్మరుచున్నన్.

27 వ. [1]కద్రువయు వినతయు వినోదార్థంబు విహరించువారు కరిమకర [2]నికరాఘాత జాత వాతోద్ధూత తుంగ [3]తరంగాగ్ర సముచ్చలజ్జలకణాసార [4]ఛటాచ్ఛాదిత గగనతలంబైన దాని [5]నుద్యానవనంబునుంబోలె బహు విద్రుమలతాలంకృతంబైనదాని [6]నాటక ప్రయోగంబునుంబోలె ఘనరసపాత్ర [7]శోభిత రంగరమ్యంబైనదాని [8]దివంబునుం బోలె నహిమకర [9]భరితంబైన దాని మఱియు.

24 1. గ్రస్సి—ఎ.జ బ స; గ్రెవ్వి—మ. 2. గంపించుచున్—స

25 1. బెక్కండ్ర నుక్కడంగజంపిన— ఔ.బ. 2. దెసచెడి శేషించిన యసురులు — ఎ న. 3. సొరబారిన—కొన్నిప్రతులు 4 బ్రతిష్ఠించి—పెక్కుప్రతులు.

27 1. అట్టియెడ కద్రువ— గి.వా. 2. నికరకరాఘాత—పెక్కుప్రతులు. 3 తరంగాగ్ర సంఘట్టన—ర.స. 4. ఛటాస్ఫోటిత— ఆ.ఊ; ఛటాఛోటిత— క.త.స. 5. ఉద్యానవనంబునుంబోలె......భరితంబైన దానివఱకు న ప్రతిలోలేదు 6. నాటక ప్రబంధంబునుంబోలె— ఓ. 7. శోభిత తరంగ— అ.ఉ.ప.బ 8. దివసంబు— అ; దివసకరుండునుంబోలె— స. 9. చరితంబయిన దాని— స.

28 చ. అలఘు ఫణీంద్ర లోక కుహరాంతర [1]దీప్త మణిస్ఫురత్ప్రభా
వలి గలదాని శశ్వ[2]దుదవాస మహావ్రత శీతపీడితా
చలముని సౌఖ్యహేతువిలసద్బడబాగ్ని శిఖాచయంబులన్
వెలుఁగెడుదానిఁ గాంచి రరవిందనిభానన లమ్మహోదధిన్.

29 మ. వివిధోత్తుంగ తరంగ[1]ఘట్టిత చలద్వేలావనై లావలీ
లవలీ లుంగ లవంగ [2]సంగత లతా లాస్యంబు లీలించుచున్
ధవళాక్షుల్ సని కాంచి రంత నెదురం దత్తీరదేశంబునం
దవదాతాంబుజ ఫేనపుంజనిభు నయ్యశ్వోత్తమున్ దవ్వులన్.

30 వ. కని కద్రువ వినతం జూచి [1]చూడవె [2]యల్లయతిధవళం బైన యశ్వంబునందు సంపూర్ణచంద్రు నందు [3]నల్లయుంబోలె వాలప్రదేశంబునందు [4]నల్లనై యున్నది యనిన విని వినత నగి నీవేకన్నులం జూచితే యక్క యెక్కడిది [5]నల్ల యీ యశ్వరాజుమూర్తి మహాపురుషకీర్తియుంబోలె నతినిర్మలం బై యొప్పుచున్నయది [6]యనిన విని నవ్వి వినతకుఁ గద్రువ యిట్లనియె.

31 తే. అమ్మహాశ్వంబు ధవళదేహంబు [1]నందు నల్లగలిగిన నీ విప్డు నాకుదాసి
వగుము మఱియందు నల్లలేదయ్యేనేని నీకు నేదాసి నగుదుఁ బన్నిదము [2]సఱుము.

28 1. దీప- ఇ ఈ.ట వ స 2. దువవాస — పెక్కుప్రతులు. 3. దీనితరువాత కొన్ని ప్రతులలో 'మఱియును' అను చిన్న వచనము కలదు

29 1 ఘట్టన—అ.ఈ.ఉ ఊ.ఒ.చ.ట.ద వా. శ.ష శ; ఘట్టిత—పెక్కుప్రతులు. 2. సంతత- ఎ.స.శ.

30 1. చూచితే- అ.ఈ.ఉ ఎ జ వ 2. యల్లయంగంబులయందునతి—మ. 3 నల్లన యుంబోలె- ఈ, కందునుంబోలె-ర. స; కళంకంబునుంబోలె- ఉ. డ; కళంకునుంబోలె-అ; నైల్యంబునుంబోలె- మ 4. నల్లనై -కొన్ని ప్రతులు. 5. నల్లన-ఓ ట న 6. యనిన నవ్వినతకు- ఊ. య.

31 1. తోఁక—స. 2 సఱుము—బ్రౌ.స. సూ.సం. శ ; సఱము—ఉ.డ.వా.పీ. ఇంకను పెక్కు వ్రాఁత ప్రతులు ; సుమ్ము — ర.

32 వ. అని యిట్లిద్దఱు నొండొరులకు దాసీత్వంబు [1]పణంబుగా నొడివి పన్నిదంబు సఱచిన వినత యయ్యశ్వంబు డాసి చూతము రమ్మనినఁ గద్రువయు నిప్పుడు ప్రొద్దు[2]లేదు ఱేపక[3]డయ [4]చూతమని యిద్దఱు మగుడివచ్చి [5]తమ నివాసంబులకుం బోయియున్నయప్పుడు.

33 సీ. కద్రువ కొడుకుల కడకేఁగి యేను [1]మిమ్మందఱ [2]వేఁడెద నన్నలార
నాపంపు సేయుండు నన్ను [3]రక్షింపుఁడు కామచారులకు దుష్కరముగలదె
[4]యుల్లతెల్లని తురగోత్తమువాలంబు నల్లసేసితి రేని నాకుదాసి
యగు మన వినత మీరట్లు సేయనినాఁడు దానికి మఱి యేను దాసి నగుదు

ఆ. జంటపన్నిదంబు సఱచితి మిట్లుగాఁ ననినఁ బాములెల్ల ననయమిదియుఁ
దల్లి పనిచె నని యధర్మువుసేయంగ [5]నగునె [6]యెఱుక[7]గలరె మగువలెందు.

34 వ. [1]అని యందఱుఁ దమలో విచారించి యధర్మా[2]రంభంబునకు సుముఖులు [3]గాక యున్నఁ గద్రువ [4]కోపోద్దీపితముఖి యై.

35 క. అనుపమ[1]ముగ జనమేజయుఁడను జనపతి సేయుసర్పయాగ నిమిత్తం
బునఁ [2]బాములు పంచత్వము [3]సనియెడమని [4]యురగములకు శాపం బిచ్చెన్.

32 1 పణంబుగా- పెక్కు ప్రతులలో లేదు. 2. లేదు- దీనితరువాత "పతిపరిచర్యాకాలంబునయ్యె"— ఓ గి. $గి_1$ ద.య ల వ.వా. మూలములో నీ భావము లేదు. పెక్కుతాళపత్రప్రతులలోను లేదు 3. కడచూతము—అ.ఈ.ప.ర.శ; కడఁజూతము—$గి_1$ మ ష. 4 చూతమురమ్మనిన—కొన్నిప్రతులు 5 నిజ—ఓ; తమతమ—పెక్కు ప్రతులు.

33 1. మిమ్మడిగెదనొక వరంబన్నలార—ఋ 2. అడిగెద-త.ల.స. 3 మన్నింపుడు—న 4. యెడలు- చ శ.ష, యల్లతెల్లనితురగాధిపు-ఏ ప్రౌ.భాసం.బ్రౌ.వీ.స. 5. దగునె—ల. 6. యడరుగలదె మగువయందు-ఉ. 7. గలదె మగువలందు—ల.

34 1. అని తమలోనందరు విచారించుకొని—ఊ.ర.ల; అని తమలో నందరు-పెక్కు ప్రతులు. 2, చరణంబు- ఆ.ప మ. 3. గాకున్న- కొన్నిప్రతులు. 4. రోషోద్దీపితయై- అ.ఉ.ఓ.జ.డ.

35 1. మగు-కొన్నిప్రతులు. 2. బాములెల్లమృతులై-జ; బాములెల్ల మృతమై-న; బంచత్వము బొందగ- ర.ల స, 3. సనియెదరని- అ.ఉ.ఎ న; సనియెడమని-త.ర; సనియెడునని- మ. 4. యురగులకును- ఓ.ద ర.

36 వ. అందు [1]శాపాను భవభీత చిత్తుం[2]డై కర్కోటకుం డనువాఁడు తల్లిపంచిన [3]రూపంబున నుచ్చైశ్శ్రవంబువాలంబు నీలంబుగాఁ [4]బట్టి [5]వ్రేలు[6]చున్న మఱునాఁడు ఱేపకడయ కద్రువయు వినతయుం జని యత్తురంగంబుఁ [7]జూచి వినత యోటువడి కద్రువకు దాసియై [8]నోసి పనులు సేయు చున్నంతఁ బంచశత వర్షంబులు [9]నిండి [10] రెండవయండం [11]బవిసిన నందు.

—: వినతకు గరుడుండు జనియించుట :—

సం. 1-20-4

37 ఉ. ఆతత [1]పక్షమారుతరయప్రవికంపిత ఘూర్ణితాచల
వ్రాతమహార్ణవుండు బలవన్నిజదేహసముజ్జ్వల[2]ప్రభా
ధూతపతంగతేజుఁ డుదితుండయి తార్క్ష్యుఁడు తల్లికిన్ మనః
ప్రీతి యొనర్చుచున్ నెగసె భీమజవంబున నభ్రవీథికిన్.

38 క. దారుణకల్పాంత మరుత్ప్రేరిత హవ్యవహశిఖల పెల్లిది యని బృం
దారకముని బృందస్తుతి [1]బోరనఁ దానగ్ని [2]సూక్తములతో [3]నెసఁగెన్.

39 వ. అంత.

40 క. హరికులిశ[1]క్షతి [2]యెఱుఁగని గురుతరపక్షములతోడి కులగిరివోలెన్
[3]గరుడండు [4]గగనగతి నురుతరజవమున నరుగుదెంచి తల్లికిమ్రొక్కెన్.

36 1. శాపఫలానుభవభీతుండై-ఐ.మ.య; శాపాను భవభీతుండై-అ.ఆ.ఇ.ఉ ఋ.ఒ ఓ క.గ.త ప ల. 2. డై న-మ. 3. మార్గంబున-ఆ. 4. జుట్టి-అ. 5. వ్రేలిన- ఆ.ఇ.ఋ. ఎ.ఐ.ఒ.డ.ద.న ర ల 6 చుండెనంత-ఓ. 7. జూచిన నందువినత-ర. 8. యోపిన-పెక్కుప్రతులు; నొడివిన-బ.శ.స;యొరసి-ర. 9. నిండిన-కొన్నిప్రతులు. 10. వినత సంగ్రహించిన యండం బవిసిన నందు-అ ఈ.ఉ ఏ.క-ఖ. 11. బవిసె-ఎ.ఖ.

37 1. పత్త్ర-ఉ. 2. ప్రభోద్భూత-ఏ.ఓ.ఔ.క ద.ల.స.

38 1. బోరనగా- య.ల.స; భోరనగా- అ.ఈ. గణ ఛ.య.ర.శ.; భోరున-ఎ.ఏ. 2 సూత్రములతో - గణ. ఛ. 3. నెగసెన్-పెక్కుప్రతులు; నొప్పెన్- ఔ; నెగడెన్-న. వెలసెన్-ఛ.

40 1. క్షతమెరుగని- న.ర. 2. దొరగిన-ఔ 3. గరుడండు-అ.ఇ.ఉ.య.స. 4. గగనమున నురుతరగతి నరుదెంచియపుడు- స.

వ. ఇట్లు నిజజననికి మ్రొక్కి కద్రువ పాలికిం బోయి.

చ. తడయక [1]మ్రొక్కియున్న వినతాసుతునప్పుడు సూచియాత్మలో
నిడుగడఁ జేయుచుం గడు సహింపక కద్రువ వానిఁ బిల్చి నా
కొడుకుల నెల్ల నెత్తికొని క్రుమ్మరుచుండుము యేమి పంచినన్
[2]మడవక [3]చేయు మీవని సమర్పణసేసెఁ బ్రభుత్వ[4]మేర్పడన్.

వ. గరుడండును గద్రువ [1]పంచినపను లెల్లను [2]వినత యనుమతంబున నతివినయ
పరుండై చేయుచు.

క. ఆపన్నగముఖ్యులఁ దన [1]వీపునఁ బెట్టికొని పఱచి [2]విపినములు మహా
ద్వీపములు [3]గిరులు [4]నఖిల[5]దిశాపతిపురములును [6]జూపె [7]జన వారలకున్.

వ. ఒక్కనాఁడు సప్తమారుతజవంబున సప్తాశ్వమండలంబుదాఁక నెగసిన నమ్మా
ర్తాండు చండకిరణంబులవేఁడిమి దాఁకి [1]మాఁడి గరుడని వీపుననున్న [2]యుర
గులు [3]దొరఁగి నేలంబడి మూర్ఛవోయినం జూచి కద్రువ గడునలిగి
గరుడనిం బదరి యతిభక్తి నింద్రు [4]నారాధించి.

1. ఈ వచనము పెక్కువ్రాఁతప్రతులలోను, శ.ప.లలోనులేదు.

2 1. వచ్చి—క.వ. 2. మదువక—అ ఉ ఐ ఓ.ఔ.గి.చ.డ.ల.శ.ష.స ళ; మడపక—న.
3 చేయుమాయని_ఒ. 4. సంపదన్—ఈ.

3 1. చెప్పిన—ఓ.ద. 2. వినతానుమతంబున—మ.

4 1. వీఁపు — వీపుశబ్దములో సరసున్న లేదని కొందఱు—పీ.శ.ష. 2. కొన్ని ప్రతు
లలో—విపినముల, ద్వీపముల, గిరుల ; పురములను అని ద్వితీయాంతరూపములున్నవి.
3 నదులు—ఓ.ర స, గిరు లలఘు—ఆనం; 4. సకల—అ ఓ క.గ.ణ 5. దిశాపాల పుర
ములు- పెక్కు ప్రతులు; దిశాపతి పురములును— న.6. జూ పజనువారలకున్—ఏ.మ.
7 జని—పెక్కుప్రతులు

5 1. మాడి—ఆ.ఋ.చ.డ.బ.శ ష. ప్రతులలోలేదు. 2. యురగంబు లెల్ల—అ.ఈ.ఉ.
ఐ. ఒ. 3. సోల—అ.ఈ.ఉ.ల స.ళ; సొరిగి—ఔ.ట త ద.ప.బ.స. 4. ఆరాధించి
తరువాత—అ.ఈ ఉ క.చ.ల.శ.ష. ప్రతులలో నీవాక్యము అధికముగా కలదు—
'నానావిధస్తుతుల నిట్లనియె'

46. చ. నరసుర [1]సిద్ధకింపురుష [2]నాగనభశ్చరముఖ్యులెల్ల నీ
[3]కరుణయ [4]వేచి [5]మంద్రు త్రిజగంబులు నీ కులిశాభిరక్షణ
స్ఫురణన చేసి సుస్థిరతఁ బొందుఁ బురందర [6]సర్వలోకసుం
దర శరణంబు నాకగుము దానవసూదన పాకశాసనా.

47 వ. అని స్తుతియించి పర్జన్య [1]ప్రసాదంబున మహావృష్టి గొడుకుల పయిం గురి
యించి [2]యయ్యురగుల విగత పరితాపులం జేసి కద్రువ గర్వంబున నుఱక
[3]గరుడని వినతనుం బనులు గొనుచున్నంత నొక్కనాఁడు గరుడండు తల్లి
కిట్లనియె.

48 ఉ. ఆయత పక్ష తుండ హతి నక్కులశైలము [1]లెల్ల నుగ్గుగాఁ
జేయు మహా[2]బలంబును బ్రసిద్ధియునుం గల నాకు [3]నీ పనిం
బాయక [4]వీపునం [5]దవడుఁ బాముల మోవను వారికిం బనుల్
[6]సేయను నేమి కారణము సెప్పుము దీనిఁ బయోరుహాననా.

49 వ. అని యడిగిన వినత తనకుం గద్రువతోడి పన్నిదంబున నైన దాసీత్వంబును
దత్కారణం[1]బైన [2]యనూరు శాపంబును గొడుకున కేర్పడం జెప్పి
యిట్లనియె.

46 1. యక్ష– ఓ బ్రౌ. 2. వియచ్చర–ట.శ. 3. కరుణనుగాదె– ఔ. 4. చేసి–న. 5. మంద్రు–అ.య. 6. భక్తలోక–డ.స.

47 1. ప్రసాదంబువడసి మహా—కొన్నిప్రతులు. 2 యయ్యురగుల—పెక్కుప్రతులలో లేదు. 3. గరుడని—అ.ఆ.ఇ ఈ.ఉ.ఊ ఏ ఐ.ఔ.క.ఖ గ.జ ట.వ , గరుడుడు—బు. చ.డ.త.ద బ.వ.శ.ష వి — కొన్ని వ్రాత ప్రతులలో 'గరుడడు'. అనురూపము కాన్పించు చున్నది.

48 1. లైన—ఏ.న. 2. జవంబును—బ. 3. రేబగల్ పాయక–మ. 4. రొమ్మునందవడు – పెక్కు ప్రతులు (వీపునం—ఊ) 5. దెవుడు – పెక్కు ప్రతులు ; దడవు–ట; దడవ–డ; నడుచు — మ; నందునిడి పాముల — ఏ. 6. సేయుచునుండ నేమియది సెప్పుము —ర

49 1. బును–పెక్కుప్రతులు. 2. యనూరుశాపంబును—చాల ప్రతులలోలేదు.

50 క. నీకతమున నా దాస్యము ప్రాకటముగఁ బాయు ననిన [1]పలు [2]కెడలోనం
[3]జేకొని యూఁటడి నిర్గత శోకస్థితి నున్నదానఁ [4]జూవె ఖగేంద్రా.

51 వ. కొడుకులు సమర్థులైనం దల్లిదండ్రుల యిడుమలు వాయుట యెందునుం గలయది గావున [1]నీయట్టి సత్పుత్త్రిం బడసియు దాసినై [2]యుండుదాననే యనిన విని వైనతేయుండు తద్దయు దుఃఖితుండై యొక్కనాఁడు కాద్రవేయుల కిట్లనియె.

52 క. [1]మా యీదాస్యము వాయ నుపాయము సేయుండు నన్నుఁ బనుపుం డిష్టం
బేయది దానిన తెత్తు నజేయుఁడనై యమర[2]వరులచేఁ గొనిత్తైనన్.

53 వ. అనిన [1]నయ్యురగులు గరుడని కిట్లనిరి.

54 చ. అమిత పరాక్రమంబును రయంబును లావును గల్గు ఖేచరో
త్తముఁడవు [1]పూని [2]నీ దయిన దాస్యముఁ [3]బాచికొనంగ నీకుఁ [4]జి
త్తము గలదేని భూరి భుజదర్పము శక్తియు నేర్పడంగ మా
కమృతము దెచ్చి యిమ్మనిన నవ్విహగేంద్రుఁడు సంతసంబునన్.

50 1. పలుకే నెడదన్–న 2 ఎద–అ.ఆ.ఎ త.ద ప మ.ర.వీ శ.శర ష.స 3. గైకొని—గ 4 జువ్వె– ఊ ర.

51 1 నీయట్టి మహాసత్త్వసుపుత్త్రుం– కొన్నిప్రతులు; నీయట్టి మహాజవసత్త్వ సంపన్న సుపుత్త్రు–స; నీయట్టి బలపరాక్రమ సత్త్వసంపన్నుండైన సుపుత్త్రు–న. 2. యుండుదునే– ట. న. శ.

52 1. మాయిద్దరి దాసీత్వము పాయ నుపాయంబు చెప్పి పనుపుం డిష్టం– అ. 2. వరులచే గొనిత్తైనన్– అ ఆ.ఇ ఓ.ఖ ట.డ స వరులఁజేకొని–వా.శ. మున్నగు ప్రతులు

53 1. దీని తరువాత గి.జ.ట డ.య.ల.వ.వా. ప్రతులలో కరుణించి అని కలదు.

54 1. నీవు — అ.ఇ ఈ.ఉ బు ఔ.క.ఖ చ.జ ట.డ.ద ప.బ య ర ల వ.వా శ ష 2. మీదయిన– ఆ ఒ. 3. బాపి–వాపి–బాపు–పాపి– మున్నగు రూపములుగలవు. 4. నిష్టముగలదేని భూరిభుజశక్తియు గర్వము—ఆ ఈ.ఔ.త.ద; నిష్టముగలదేని భూరి భుజ శక్తియు దర్పము—ల నిష్టముగలదేని భూరిబల సత్త్వము శక్తియు—ను;

55 వ. అట్లు [1]చేయుదు నమృతంబు దెచ్చి మీ కిచ్చి యేనునుం దల్లియు [2]దాస్యంబు వలన విముక్తుల [3]మగువార మని [4]నొడివి తద్వృత్తాంతం బంతయుం [5]దల్లికిం జెప్పి [6]యమృతహరణార్థం బరిగెద నని మ్రొక్కిన వినత సంతసిల్లి [7]కొడుకుం గౌఁగిలించుకొని.

-: గరుత్మంతుం డమృతంబుఁ దెచ్చుటకుఁ దల్లి యనుమతిఁ గొనుట :-

సం. 1-24-1

56 చ. అనిలుఁడు పక్షయుగ్మ మమృతాంశుఁడు వీపనలుండు మస్తకం
బినుఁడు సమస్తదేహమును నెప్పుడుఁ గాచుచు [1]నీ కభీష్టముల్
ఘనముగఁ [2]జేయుచుండెడు జగన్నుత యున్నతియుం జయంబుఁ జే
కొనుమని యిచ్చె [3]దీవనలు గోరి ఖగేంద్రునకున్ [4]ముదంబునన్

57 వ. గరుడండును [1]దల్లి దీవనలు గైకొని గమనోన్ముఖుండై [2]యమృతంబు దెచ్చునప్పుడు [3]లావు గలుగవలయు [4]నా కాహారం [5]బుపదేశింపుమనిన వినత యిట్లనియె.

58 క. విషనిధి కుక్షి [1]నసంఖ్యము నిషాదగణ ముండి ధారుణీప్రజకుఁ గడుం
[2]విషమమును జేయు [3]దాని నిమిషమున భక్షించి చను మమిత్ర[4]విఘాతీ.

55 1. సేసెద-ఓ. 2 మీదాస్యంబువలన—గి.న.శ 3. మగుదుమని- ఆ ఎ ఓ.జ.డ న. 4. నుడివి— ల స 5. దల్లికెఱింగించి—ల. 6 యమృతార్థంబు—న. 7. కొడుకు కడంకకు మెచ్చి—నిష్టము గలదేని భూరిబల శౌర్యము శక్తియు—న

56 1. నీకునిష్టముల్—ఆ ఇ.ప ఐ.ఖ డ.త ద ర.వ. 2 జేయుచుందురు—ఊ.మ; చేయుచుండెడ-ఆ ఇ బు ఎ ఒ.క.ఖ జ.ట.త; జేయువారలు—డ. 3. దీవెన—ఆ 4. ముదంబునన్—పెక్కు ప్రతులు; బ్రియంబుతోన్—వా ; బ్రియంబును వా.శ

57 1 దల్లియిచ్చిన దీవనలం జేకొని — ఔ.జ.డ.ర ల 2 యమృతాహరణార్థంబరిగెడు— అ.య 3 లావు వలయు — ఎ.ఐ.ఒ డ న.య. 4. నాకుందగిన యాహారంబు గృపసేయ వలయుననిన — మ 5. ప్రసాదింపుమనిన — బు.ఐ.గ జ.డ.వా. బుపదేశింపుమనిన—పెక్కుప్రతులు.

58 1. ననంతము —- ఉ. ఐ 2. విషమము సేసెడి-ఈ.ఉ.క.జ, విషమము సేయును—ట.త.ద; విషమము సేతురు ; ఊ.శా.సం. 3. వారి—పెక్కుప్రతులు. 4. ధ్వంసీ—ఈ. ఉ.ఎ.ఓ.ఔ క.ఖ డ.ప మ.ర.స; విదారీ—శా.

59 వ. [1]భక్షణ విషయంబున [2]బ్రాహ్మణునిం [3]బరిహరించునది యనిన గరుడండు నాకు [4]బ్రాహ్మణు నెఱుంగు తెఱం గెఱింగింపుమనిన వినత యిట్లనియె.

60 క. రయమున [1]మ్రింగుడు గాలము క్రియ నెవ్వఁడు కంఠబిలము క్రిందికిఁ [2]జనక గ్నియ[3] పోలె [4]నేర్చుచుండును భయరహితా వాని నెఱుఁగు [5]బ్రాహ్మణుఁ గాఁగన్.

61 తే. కోపితుండైన విప్రుండు ఘోర[1]శస్త్ర మగు మహావిషమగు నగ్నియగు [2]నతండ యర్చితుండైన జనులకు నభిమతార్థ సిద్ధికరుఁడగు గురుఁడగుఁ జేయుఁ బ్రీతి.

62 వ. అని బ్రాహ్మణ స్వరూపంబుఁ జెప్పిన నెఱింగి వినతకు [1]మ్రొక్కి వీడ్కొని గరుడం డతిత్వరిత [2]గతిం బఱచి [3]సముద్రోదరంబున నున్న నిషాదుల ననేక శత సహస్ర[4]సంఖ్యల వారిని బాతాళ వివరంబునుం బోని తనకంఠబిలంబుఁ దెఱచి యందఱ [5]నొక్కపెట్ట మ్రింగిన నందొక్క విప్రుం డుండి [6]కుత్తుకకు [7]డిగక నిప్పునుంబోలె నేర్చుచున్న నెఱింగి నాకంఠబిలంబున [8]విప్రుం డున్నవాఁడేని వెలువడి వచ్చునది [9]యనిన గరుడని కవ్విప్రుం డిట్లనియె.

59 1 భక్షణంబు జేయునెడల—వ; భక్షణవిషయంబునందు—ఇ ఐ య.ల ; భక్షణ విష యంబువలన — ర. 2. బ్రాహ్మణుల — ఇ ఎ.ఓ.ఖ ద మ.య 3 బరిహరింపు మనిన—ఊ.ఔ.చ.న ర.శ ష ; బరిహరణంబు సేయుమనిన—క. 4. బ్రాహ్మణుల తెఱంగు—య.

60 1. మ్రింగెడు—ఊ క.ఖ.త.య. 2. జొరక—ఓ.క. 3. యుబోలె—ఏ.ఔ.ప్రా.శ. 4. లోదహించును—పెక్కుప్రతులు 5 బ్రాహ్మడుగాగన్—ఋ;బ్రాహ్మణకులుగాన్ ప్రా.వా.శ. ఇంకను పెక్కుప్రతులు; తం విద్యాత్ బ్రాహ్మణర్షభమ్— మూలము 1—24—6.

61 1. శత్రుడగు— ఓ. 2. నతండు—అ.ఉ ఒ.ఓ.ఔ. గ.జ డ.ద.బ య శ.ష.

62 1. మ్రొక్కి— పెక్కుప్రతులలో లేదు 2 గతి గగనంబున బఱచి—న. 3 సము ద్రంబున నున్న— మ; సముద్రతీరంబున— ఏ.ఔ.య. 4. సంఖ్యలగు వారిని—క.ల; సంఖ్యులం గని వారిని; శతసహస్రంబులగువారిని—మ. 5. నొక్కట—అ.ఎ.ఏ న.య. ర; నొక్కపెట్టున—ఓ శ.ష. 6 కుత్తికకు—ఈ ప.ర; కుత్తుకడిగక—ల. 7. దిగక, డిగ్గక— రూపములు 8 విప్రుండ వున్నవాడవేని— ఔ; నున్నవాడవు విప్రుండవేని—ర. 9. యనిన యందున్న విప్రుండు—ఇ.ఈ.ఉ.ఐ. మొదలైన ప్రతులు

63 ఉ. విప్రుఁడ నున్న వాఁడ నపవిత్ర నిషాది మదీయ భార్య కీ
ర్తిప్రియ దీనిఁ [1]బెట్టి [2]చనుదెంచుట [3]ధర్మువె [4]నాకు నావుడుꣳ
విప్రులఁ బొందె[5]యున్న యపవిత్రులుఁ [6]బూజ్యులుగారె కావునꣳ
విప్రకులుండ వెల్వడుము వేగమ నీవును నీ నిషాదియున్.

64 వ. అనిన నా గరుడని [1]యనుగ్రహంబున బ్రాహ్మణుండు నిషాదీసహి
తుండై వెలువడి వచ్చి [2]గరుడని దీవించి [3]యథేచ్ఛం జనియె [4]గరుడండును
గగన పథంబునం [5]బఱచి కశ్యపుం గని నమస్కరించి [6]యస్మజ్జననీ [7]దాస్య
నిరాసార్థం బురగుల కమృతంబుఁ [8]దేర నరిగెద నిషాద ఖాదనంబున నాఁకలి
వో[9]వకు న్నయది నా కాహారంబుఁ బ్రసాదింపు మనినఁ గొడుకు కడంకకు
మెచ్చి కశ్యపప్రజాపతి యిట్లనియె.

—: *గజకచ్ఛపముల వృత్తాంతము* :—

సం. 1-25-10

65 క. [1]అనలనిభుండు విభావసుఁ డనువిప్రుఁడు నియమవంతుఁ డర్థాఢ్యుండై
[2]తనరి సుఖమున్న నాతని [3]యనుజన్ముఁడు సుప్రతీకుఁడనువాఁ డతనిన్.

66 క. మన పితృవర్గము వడసిన ధనము విభాగించి [1]యిమ్ము ధర్మస్థితి నా
కని యడుగం బోయిన నయ్యనుజునకు విభావసుం డహంకారమునన్.

63 1. డించి—ల స 2 చనుఌెందును యుక్తమై—అ. 3. ధర్మమె—ఓ.ఔ.వ; యుక్తమె—క.చ.ట య.ర. శ. ష. 4. గాదు—న. 5. యున్న నపవిత్రులు—ఆ.ఇ ఓ.డ.త ద.ప.బ 6. బూజ్యులకారె—స.

64 1. యనుమతంబున- ఓ.ఔ; యనుజ్ఞవడసి—న. 2. వానిం—కొన్నిప్రతులు. 3. నిజేచ్ఛంజనియె—ఒ న; యథాస్థానంబున కరిగె-ఫ క.మ; యథేష్టంబరిగె-ఇ ఊ. ఐ. ట. 4. గరుడండును నిషాదులనెల్ల నొక్కటబ్రమింగి- ఫ ద వ 5 బఱచి గంధ మాదనంబునం దపంబు సేయుచున్న—ఊ ఎ స; నగత్వాపర్వతశ్రేష్ఠం గంధ మాదన మవ్యయం(1—26—5 భండార్కరు ప్రతి). 6. యస్మద్— పెక్కుప్రతులలో విడువఁ బడినది. 7. నివారణార్థంబు—ఆ.ఉ 8. తే నరిగెద— ఉ. 9. కయున్నయది-య.

65 1. అనిల—ఈ.ఔ చ.ట.డ ప.వా 2 తనరిన సుఖముగ నాతని యనుజుడు మఱి—య. 3. యనుజుండగు— అ.గి.జ.ద.శ.ష; జుడు మఱి—కొన్నిప్రతులు.

66 1. నాకు ధర్మస్థితినిమ్మని వానినడుగబోయిన నను జునకు— ల.శ ష

67 క. తానలిగి యిచ్చె శాపం బేనుఁగవై యుండుమని సహింపక వాఁడుఁ మానుగఁ [1]గూర్మమ వగుమని వానికిఁ బ్రతిశాప మిచ్చె వసులోభమునన్.

68 వ. ఇట్లన్నయుం దమ్ముండును నన్యోన్య శాపంబులం జేసి యోజన [1]త్రయో త్సేధంబు గలిగి దశ యోజన [2]వృత్తంబైన కూర్మంబును [3]షడ్యోజనోత్సే ధంబు గలిగి ద్వాదశ యోజన విస్తృతం బైన గజంబును నై సరోవర విపి నంబుల నుండి యర్థ[4]నిమిత్తంబైన పూర్వ వైరంబునఁ [5]దమలో నిత్యంబు నొండొంటితోడం [6]బెనంగి పోరుచుండు నవి [7]నీ కాహారంబు సుమ్మరుగుము కార్యసిద్ధి [8]యయ్యెడ మనిన [9]గరుడండును సునోవేగంబునం బఱచి యా రెంటినిం గాంచి.

69 క. [1]చఱచి యొకచేతఁ గూర్మముఁ బెఱచేత గజంబుఁ బట్టి పెనఁచి ఖగేంద్రుం [2]డిఱికికొని గగనవీథిం బఱచె వియచ్చర విమాన పంక్తులు [3]దూలన్.

70 క. కనక [1]వ్రతతీ వితతులఁ బెనఁగిన సుర భూరుహములఁ బెద్దయు బెడఁగై తనరిన యలంబతీర్థంబున [2]కరిగె నగంబు లొక్కమొగి గ్రక్కదలన్.

71 వ. అందు [1]రోహిణంబను పాదపోత్తమంబు గరుడనిం గని [2]సంభావించి [3]శత యోజనాయతంబైన మదీయశాఖపై నుండి యిగ్గజకచ్ఛపంబుల భక్షించి [4]పొమ్మనిన గరుడండు నట్ల చేయుదునని యమ్మహాశాఖపై నూఁద సమ కట్టి యందు.

67 1. కూర్మంబగు మని— వ.

68 1. త్రయోచ్ఛ్రాయంబుగల్గి—ఔ. 2. విస్తీర్ణంబైన, విస్తృతంబైన—అని పాఠములు కలవు 3 ద్వాదశయోజనోత్సేధంబును గలిగి షడ్యోజన విస్తృతంబైన— పెక్కు ప్రతులు. 4 నిమిత్తంబునైన—ఆ ఎ.ఓ క జ.ట బ 5. దమలో—కొన్ని ప్రతులలో లేదు. 6. బెనంగుచుండునవి—ఆ ఊ జ డ ర. 7. నీకాహారంబగు నరుగుము— ఇ.ఉ.స.య ర; నీకాహారంబుగా గొని యరుగుము — కొన్ని ప్రతులు 8 యయ్యెడమనిన—ఇ.ఖ. ఒ.ఓ ఔ.ఖ.ట.త.ప ర; — 9. గరుడండును వల్లెయనిన—న.

69 1. ఉరక—అ.ఊ.క.ర.స సం 2. ఉరికికొని—ఏ వ. 3. చెదరన్—క.ఖ.

70 1. లతాప్రవితతుల—అ.మ 2 కేగె—ఎ.న

71 1. రౌహిణ వా శ. ఇంకను కొన్ని ప్రతులు; రో - భండార్కరు ప్రతి; రోహిణీ యము—ఎ.ఏ ఓ.త.జ.స. 2. సంభావించి— పెక్కు ప్రతులు. 3. నూఱు యోజ నంబులాయతంబైన - పెక్కు ప్రతులు. 4. చనుమనిన - కొన్ని ప్రతులు.

72 క. పాదంబులు [1]పెట్టుడుఁ దత్పాదప ఘనశాఖ విఱిఁగి [2]బల్లన నుచ్చై
ర్నాదమున దిక్కు లద్రువఁగ భేదిల్లె విహంగతతులు భీతిం బఱవన్.

73 వ. అమ్మహాశాఖ నవలంబించి తలక్రిందై యాదిత్య కిరణంబులు తమ కాహా
రంబు[1]గాఁ దపంబు సేయుచున్న వాలఖిల్య మహాముని గణంబులం జూచి
యిది భూమిపయిం బడిన నిమ్మునులకు బాధ యగునని దానిం గఱచికొని
గజకచ్ఛపంబులం గరంబుల [2]నిఱికికొని గరుడండు గగనంబునం బఱచి
తనకు నూఁద నిమ్మగు ప్రదేశం బెందునుం గానక గంధమాదనంబునకుం
జని యందుఁ దపంబు సేయుచున్న కశ్యపుం గనుంగొని మ్రొక్కిన.

74 చ. కనక మహీధర ప్రతిమకాయు మహాజవ నిర్జిత ప్రభం
జను నవిచింత్య భూరి [1]బల సత్త్వ సమన్వితు దీప్తహవ్యవా
హనసము వైనతేయునిఁ దదాస్యగతద్రుమశాఖ నున్న య
త్యనఘుల వాలఖిల్యులను నమ్మునినాథుఁడు జూచి నెమ్మితోన్.

75 వ. ఇగ్గరుడండు భువన హితమహారంభుం[1]డు మీకు బాధయగు నని యి త్తరు
శాఖ విడువ[2]నేరకున్న వాఁడు [3]వీనిం గరుణించి మీ రొండుకడ [4]కరుగుం
డనిన [5]వాలఖిల్యులు కశ్యపుప్రార్థనం జేసి దాని విడిచి హిమవంతంబున
కుం జనిరి గరుడండును ముఖ నిక్షిప్త శాఖా స్ఖలిత [6]వచనుం డగుచుఁ దండ్రి
కిట్లనియె.

76 క. ధరణీసుర విరహితమగు నరణ్యదేశంబు నాకు నానతి యిం డి
త్తరుశాఖ విడువవలయును గరము నిరోధ [1]మిది యనినఁ గశ్యపుఁ డనియెన్.

72 1. మెట్టుడు – ఊ జ స. 2 భల్లన— చ ల శ ష స; బ్రల్లన – ఊ.త.ర స

73 1. గామౌనవ్రతంబున దపంబు సేయుచున్న – ఊ క.డ మ ర వ స. 2. నిడికొని–ప

74 1 జవ – బౌ; భుజ – శ ష.

75 1. 'డు' తరువాత బల సమన్వితుండు అని చ.ల వ.వా శ.ష.శ. ప్రతులలో కలదు. 2 నేరక యున్నవాడు – కొన్ని ప్రతులు. 3. వీనికిం గరుణించి – ఉ. ఊ.ఐ ట వ. 4. కుంజనుడని; ఓ త.మ 5. వాలఖిల్యులనుగ్రహించి – న; వాల ఖిల్యులు కరుణించి – ద.ర 6. వదనుండై–కొన్ని ప్రతులు.

76 1 మగుననిన – క.సం.

77 క. హిమశైలకందరాభాగము కడ నిష్పురుష నగము గల [1]దచ్చో నీ
ద్రుమశాఖ విడువు మది [2]దా నమానుష మగమ్య మీశ్వరాదులకైనన్.

78 వ. అది [1]యిచ్చటికి లక్షయోజనంబులు గల దనుగుమనిన గరుడండును మనో[2]వేగంబునం బఱచి యా నిష్పురుషనగంబునం దత్తరుశాఖ విడిచి హిమవంతంబు [3]మీఁదికిం బోయి గజకచ్ఛపంబుల భక్షించి మహాసత్త్వసంపన్నుండై నాకలోకంబున కెగయ సమకట్టి పక్షవిక్షేపంబుఁ జేసిన.

—: *గరుడం డమృతహరణార్థం బెగయుట- వాలఖిల్యుల వృత్తాంతము* :—
సం. 1-26-37 1-27-4

79 క. ఘన పక్షానిల చలితావనిరుహముల వలనఁ [1]దొరఁగ వరపుష్పచయం
బనిమిష జయార్థ మఱిగెడు వినతాసుతు మీఁదఁ బుష్పవృష్టియ పోలెన్.

80 వ. ఇట్లమృతహరణార్థం[1]బు గరుడండు [2]గగనంబున కెగసిన నట దేవలోకంబునందు.

81 మాలిని. సురపతిసభఁ [1]జూడంజూడ నంగారవృష్టుల్
గురిసెఁ గులిశధారల్ [2]గుంఠితంబయ్యె [3]దిక్కుం
జరమదము లడంగెఁ [4]సర్వదిక్పాలకాంతః
కరణములు [5]భయోద్వేగంబునన్ [6]సంచలించెన్.

77 1. దచ్చటనీ - ఓ.మ. 2 యా— మ.

78 1. యిందులకు - పెక్కు ప్రతులు 2. జవంబునం - ర.వ. 3. భూమికిం - న.

79 1. దొరగు - పెక్కు ప్రతులు.

80 1. బరుగు - న; బుగ - ఓ. 2. గగనమండలంబున - క

81 1. లోనం - మ 2 గుంఠితం బొందె - ఇ.ఋ ఐ ఔ క.ద్వి మ.ర.శక. 3. దిక్కుంజరముల మదమింకెన్ - ఈ.ఉ ఏ.ఔ.మ స. 4. సర్వ దిక్పాల కాంతః కరణము చలియించెన్ గాఢవిభ్రాంతిగాగన్-న. 5. భయోద్రేకంబుమై - ఏ.మ. 6. సంభ్రమించెన్ - ఇ.ఈ.ఉ.ఋ.ఎ.ఓ.ఖ గ.ద.ర.వి స.

82 వ. ఇట్టి మహోత్పాతంబులు పుట్టిన సురపతి బృహస్పతిం జూచి యిది యేమి నిమిత్తంబని యడిగిన [1]దాని నెఱింగి [2]బృహస్పతి సురపతి కిట్లనియె.

83 సీ. బ్రహ్మర్ష్యుఁడగు కశ్యపబ్రహ్మవరమున వినతకుఁ బుట్టిన యనఘమూ ర్తి
వాలఖిల్యుల దయ వరపక్షికులమున కింద్రుడై పరగిన [1]యుంద్రతేజుఁ
డుదధిలో నున్న యత్యుగ్రనిషాదుల నారంగ మ్రింగిన ఘోర[2]వీరుఁ
డిభకచ్ఛపముల రోహిణ శాఖతో నెత్తికొని దివిఁ బఱచిన యనిలవేగి

తే. [3]పెఁగి తనతల్లి దాస్యంబు నీఁగఁబూని తడయ కమృతంబు గొనిపోవఁగడఁగి వచ్చెఁ
గామ రూప[4]సంపన్నుండు గామగమనుఁ డతఁడు నీకు నసాధ్యుండు శత మఖుండ.

84 వ. అగ్గరుడని మాహాత్మ్యంబు నీవు నెఱుంగుదు వది యెట్లనినఁ దొల్లి కశ్యప ప్రజాపతి పుత్త్రార్థియై [1]భవత్ప్రభృతులైన [2]దేవగణంబులను వాలఖిల్య ప్రముఖులైన మహామునిగణంబులను దనకు [3]సహాయులను గాఁ బడసి పుత్త్రకామేష్టి సేయునాఁడు నీవు నీబలంబునకుం దగిన యిధ్మ[4]భారంబు మోచికొని యశ్రమంబున వచ్చువాఁడవై యల్పకుశపలాశేధ్మ [5]భారంబులు [6]మోచికొని వడవడ వడంకుచు వచ్చువారి నల్పసత్త్వుల నంగుష్ఠ[7]ప్రమాణ దేహుల [8]ననవరతోపవాసకృశీభూతశరీరుల [9]వాలఖిల్య మహామునులం జూచి నగిన నమ్మునులు సిగ్గువడి కడు నలిగి.

82 1. దానినంతయు నెఱింగి – అ.ఈ.ఒ ఔ.ఖ గి.ట.ద స.బ మ.ర 2. బృహస్పతి యిట్లనియె – పెక్కు ప్రతులు.

83 1 యిద్ధ – ఊ.ఔ.వా.శ.ప.శ; చంద్ర – ఎ; ఇంద్ర – ర స; సాంద్ర – స; రుంద్ర – పెక్కు ప్రతులు 2. మూర్తి – స. 3. వ్రేగు – న. 4. ధరుండును – స.

84 1 భవత్ప్రముఖులైన – పెక్కు ప్రతులు. 2. నిర్జరులను – ఈ.ఖ. 3. సహాయులుగా – ఇ.ఎ.ఐ ఒ ఔ. 4. భారంబు నశ్రమంబున దెచ్చువాడవై – మ; తెచ్చిన వాడవై – పెక్కు ప్రతులు. 5. భారంబులు భరంపడి – ర 6. తెచ్చి వడంకుచున్న వారి –య. 7. మాత్ర – ఊ. 8. ననవరత వ్రతోపవాస – ఇ.క.ట.డ.ర.స. 9. వాలఖిల్య గణంబులం – కొన్ని ప్రతులు; వాలఖిల్యులం జూచి – ఖ.చ.మ

85 క. రణవిజయుఁ [1]దనలతేజుం దణిమాదిగుణాఢ్యుఁ దుదితుఁ దయ్యేడు వీరా
గ్రణి శతముఖుకంటెను శతగుణవీర్యుండైన [2]పుత్త్రకుం డజితుండై.

86 వ. వాఁడు రెండవ యింద్రుం [1]డయ్యెడు మని మహావీర్యవంతంబులైన మం
త్రంబుల [2]వేల్చుచున్నంత నంతయు నెఱింగి నీవు కశ్యపు పాలికిం బోయి
నాకుం [3]గరుణింపుని ప్రార్థించిపఁ గశ్యపప్రజాపతి యమ్మునుల కిట్లనియె.

87 ఉ. ఉండు నితండు పద్మజు నియోగమునం ద్రిజగంబులందు నిం
ద్రుం [1]డయి భూతరాశిఁ దనదోర్బలశక్తిఁ గడంగి కాచుచున్
రెండ[2]గు నింద్రుఁడైన విపరీత మగుఁ భువన[3]ప్రవృత్తి మీ
రొండు విధంబు [4]సేయుటిది యుక్తమె బ్రహ్మని[5]యుక్తి యుండఁగన్.

88 వ. మీ వచనం బమోఘంబు గావున నింక నాకు నుద్భవిల్లెడు పుత్త్రుండు పక్షి
కులంబున కెల్ల నింద్రుం [1]డయ్యెడ మని కశ్యపుండు వారల నొడంబఱిచి
నీ యింద్రత్వం బేకాధిష్ఠితంబు సేసె నట్టి కశ్యపప్రజ్ఞాపతియజ్ఞమహిమను వాల
ఖిల్యుల తపోమహిమను వినతకుం బుట్టి విహగేంద్రుండైన యాగరుడం
డిప్పుడమృత హరణార్థం [2]బరుగు దెంచుటం జేసి స్వర్గలోకంబున మహోత్పా
తంబులు పుట్టె నని సురపతికి బృహస్పతి చెప్పిన నింద్రుం డమృత రక్షకుల
నెల్ల రావించి మీర లతి ప్రయత్నంబున నమృతంబు రక్షించుకొని యుండుం
డని పంచిన వల్లెయని.

85 1 డలఘుతేజుం - న 2. పుత్త్రకు డభీతుండై - ర, పుత్త్రకుం డుద్ధతుడై - ఒ.

86 1. డయ్యెడమని - పెక్కు ప్రతులు; డయ్యెడునని - మ; డయ్యెడుంగాకని - ఖ.
2. వేల్చి సుపుత్త్రుం బడసి పుత్త్రార్థియైన కశ్యపున కిచ్చిన నింతయు నెఱింగి నీవు వాల
ఖిల్యుల పాలికింబోయి - పెక్కు తాళపత్త్ర ప్రతులలోను, స.శ$_1$ లోను నిట్లుకలదు.
కాని దీనికి మూలము కాన్పింపదు. 3 గరుణింపుండని వారిం - వా.శ. కొన్ని
వ్రాఁతప్రతులు.

87 1 డన - న. 2. డవ యింద్రుడైన - వా శ. ఇంకను పెక్కు ప్రతులు; (డగు
నింద్రుడైన - ) ఉ.బా.వ.శ. 3. త్రయంబు - బొ.య. 4. సేయుడిది — ఈ. ఊ.
బొ.ట.త; సేయునది - అ. 5 యోగముండగన్ - మ; యోగ మొండగున్ - క.

88 1. డయ్యెడమని — కొన్ని ప్రతులు; డయ్యెడునని - మ 2. బువచ్చుటం జేసి —
పెక్కు ప్రతులు.

89 క. వారలు బహుప్రకారా కారులు [1]వీరులు నిశాతఖడ్గాది మహా
దారుణ శస్త్రధరులు కృష్ణారుణసిత[2]పీతఘనతరాంగత్రాణుల్.

90 క. సమకట్టి యొక్క మొగి న[1]ప్రమాదులై నిలిచి రేయుఁ[2]బవలును రక్షా
తములై యమృతము చుట్టును [3]నమేయబలు లుండి రంతనతిరభసము[4]నన్.

91 మ. వితతోల్కాశనిపుంజమొక్కొ యనఁగా విన్వీథి [1]విక్షిప్త ప
క్షతి వాతాహతిఁ [2]దూలి తూలశకలాకారంబులై వారిద
ప్రతతుల్ [3]సాల్వడి [4]నల్గడం జెదరఁగా బాహా మనో[5]వేగుఁడై
పతగేంద్రుం డమృతాంతికంబునకుఁ [6]దత్పాలుర్ భయం బందఁగన్.

92 వ. అంత.

*-: గరుడఁ డమృతరక్షకులతో యుద్ధము సేయుట :-*

సం. 1–28–1

93 క. కల్పాంతానల కీలా [1]కల్పాయత పక్షుఁ బక్షిగణవిభు శౌర్యా
కల్పుఁ గని యమృతరక్షు లనల్పక్రోధులయి తాఁకి [2]రార్చి కడంకన్.

94 క. తడఁబడ నేసియు [1]వైచియుఁ బొడిచియు వివిధాస్త్రశస్త్రముల నుద్ధతులై
కడుకొని యుద్ధము సేసిరి కడిమి[2]మెయిన్ [3]విబుధవరులు గరుడనితోడన్.

89 1. ధీరులు – అ.ర.స. 2. వర్ణ – పెక్కు ప్రతులు.

90 1 ప్రమత్తులై – ఏ ఔ ఖ గ ట మ ర స. 2. బగలును – పెక్కు ప్రతులు. 3. నమిత బలులు గాచియుండి రతి – య 4 తోన్ – ఆ.చ వ.

91 1. నుత్క్షిప్త – ఒ న ర; నుద్దీప్త – ఖ.డ; సందీప్త – మ; నిక్షిప్త – అ.ఉ.ఐ ప్రౌ.వ.శ. కొన్ని ప్రతులు 2. జేసి – ఏ.ఐ.ఖ. 3. సాల్వడి – ఏ.ఓ క.జ.డ.త ర.బ.శ.ర. 4 నల్దిశల్ – ఋ. 5. వేగియై – ఔ 6. దిక్పాలుల్ – అ.ఆ.ఉ ఓ.క.ఖ.జ.న.ర; దత్పాలుల్ – ఇ.ఎ.ఏ ఐ.చ.శ ష.

93 1. కల్పాతత – పెక్కు ప్రతులు; 2. రార్చుచు గడకన్ – జ య స; రార్చుచు జెలుచన్ – ఖ.ద; రార్పులుసెలగన్ – ఏ

94 1 ప్రేసియు – ఎ. 2 మెఱసి – ఉ ఔ.త.స. 3. యమర – ఉ.ఊ.ఔ.త.స

95 వ. గరుడండును నిజపక్ష [1]విక్షిప్త [2]రజోవృష్టి [3]నమరవరుల దృష్టిపథంబుఁ గప్పి స్వర్గలోకంబ [4]నిరాలోకంబుగాఁ జేసిన నమరేంద్రు [5]పనుపున బవనుం డా రజో[6]వృష్టి చెదర వీచె నంత.

96 మాలిని. పరశు కులిశ కుంత ప్రాస [1]బాణాసనోద్య
త్పరిఘ [2]కణప చక్ర ప్రస్ఫురద్బాహు సేనా
పరివృతుఁ[3]డయి తాఁకెఁ [4]భౌమనుండ న్మహో కిం
కరుఁడు సమరకేళీ గర్వితున్ వైనతేయున్.

97 క. బలవత్ఖగేంద్ర కోపానల భస్మీభూతుఁడై క్షణంబున వాఁడుఁ
బల మఱి క్రాఁగె నుదగ్ర జ్వలన [1]జ్వాలావలీఢ శలభమ పోలెన్.

98 సీ. [1]పక్షతుండాగ్ర నఖక్షత దేహులై [2]బోరన నవర క్తధార లొలుక
విహగేంద్రునకు నోడి [3]నిహతులై సురవరుల్ సురరాజు మఱువు సొచ్చిరి [4]కలంగి
[5]సాధ్యు లనాయాస సాధ్యులై పాఱిరి పూర్వాభిముఖులయి [6]గర్వముడిఁగి
వసువులు రుద్రులు వసుహీన విప్రుల క్రియ దక్షిణాశ్రితులయిరి భీతి

95 1 విక్షేప – ల స; ఇది లేని ప్రతులు– ఈ ఐ.ఓ.ఔ క ట డ ప య. 2. దీధితుల జేసి– ఋ; 3. నమరుల నంధులం జేసి—ఓ ల 4. నిరవలోకంబు—అ ఇ ఈ.ఎ.ఓ.క ఖ గ. చ.జ ట డ ద ప బ వ.వా శ ష.శ; నిర్విలోకంబు – త. నిరాలోకంబు – ఆ ఉ.ఋ. ఏ.ఐ.ఓ ఔ డ 5. పంచినన్ – ఏ ర; పంప – ఇ ఔ ట. 6. వృష్టిం బార వీచె– జ.ర.

96 1. బాణాసిరాజత్ – ఏ 2 కణయ – అ.ఆ వ స పెక్కు ప్రతులు, ముసల – ఏ; వలయ – డ, ఫలక – ఖ. 3. డనిదాకెఁ – ర. 4 భౌమనః – అని తెలుఁగు లిపి భారతము; భౌవనః – భం; భవ్యకుడు – అ ఆ.ఉ.ఓ ఔ.స. మున్నగు ప్రతులు

97 1 జ్వాలలను దలగుశలభమ – య; ఈ పద్యము తరువాత 'మఱియును' అని కొన్ని వ్రాఁత ప్రతులలోఁ గలదు.

98 1 పక్షితుండాగ్ర – య. 2. భోరున, భోరన – అను రూపములు కొన్ని ప్రతు లలో. 3. విహతులై – భాసం 4. కడంగి – స – పెక్కు ప్రతులు 5 సాధ్యులు నాయాస – ఆ.ఈ ఓ.క.ఖ.ట త 6. గర్వమడగి – గి.$గి_1$ ర.ల.వ.వా.శ.

ఆ. [7]వంది యపరదిక్కుఁ బొంది రాదిత్యు లాశ్వినులు నుత్తరమున కొనరఁ బఱచి
రనల వరుణ పవన ధనద యమాసురుల్ [8]వీఁక [9]దఱిఁగి కాందిశీకులయిరి.

99 క. తలరఁగ [1]రేణుక్రథన ప్రలిహ ప్రరుజాశ్వక్రంత [2]పదనఖులను [3]ర
తులఁ గులిశ నిశాత నఖావలిఁ బక్షీంద్రుండు వచ్చి వందఱలాడెన్.

100 వ. ఇట్లు నిర్జరవరుల నెల్ల నిర్జించి [1]యూర్జితుండై గరుడం డమృత స్థానంబున
కరిగి దానిం బరివేష్టించి ఘోర సమీర ప్రేరితంబై దుర్వార శిఖా [2]జిహ్వాల
నంబరంబు నాస్వాదించుచున్న యనలంబుం గని తత్క్షణంబ సకల [3]నదీ
జలంబుల నెల్లఁ బుక్కిలించుకొని వచ్చి [4]యయ్యనలంబు [5]నాఱంజల్లి తీక్ష్ణ
[6]ధారంబై దేవనిర్మితంబై పరిభ్రమించుచున్న యంత్రచక్రంబు [7]నారాంత
రంబున [8]సంక్షిప్తదేహుండై చొచ్చి యచ్చక్రంబు క్రింద.

101 ఉ. ఘోర [1]వికార సన్నిహిత కోప ముఖంబులు దీప్త విద్యుదు
ల్కారుణ [2]దారుణాక్షములునై నిజదృష్టివిషాగ్ని నన్యులం
జేరఁగ నీక యేర్చుచుఁ బ్రసిద్ధముగా నమృతంబు చుట్టు ర
క్షారతి నున్న యుగ్రభుజగంబుల రెంటిని గాంచి చెచ్చెరన్.

7 నొంది – అ.ఊ.ఐ.చ.త ల ష స. 8 వీకు – అ జ ఒ.ట.భాసం వీ.శ; నీకు – స.
9 దప్పి – న.

99 1. రేణుక్రథన— న శ$_1$ క్రధన (అనుచో క్రవర్ణమును తేల్చి పలుకవలెను),
రేణుక కుధన— రేణుక కుచర— రేణుక క్రోధన— రేణుకకుంత — అని యు
పాఠములు. 2. పదనఖ – అను పేరు తెనుగు లిపి భారతములోను భం. ప్రతి
లోను లేదు. 3. యక్షుల — ఊ.ను; పక్షుల — స

100 1 యూర్జిత స్థానుండై – న. 2 శిఖల — న. 3 నదీనద – భాసం. ర.స. 4
యయ్యనలం బాఱంజల్లి — ఉ.ఒ ఓ.జ త మ. 5. పైజల్లి — బ 6 ధారాసమన్వి
తంబై — కొన్ని ప్రతులు, దీప్తద్వారంబై – ర 7. నంతరాంతరంబున —
పెక్కు ప్రతులు; నరాంతరంబున — భాసం, యంత్ర చక్రాంతరంబు గని — మ;
8 సంకుచిత – ఆ ప ఐ ఖ; సూక్ష్మ — ఓ.

101 1 విషాన్ని — అ.ఎ.న.స. 2. సారజిహ్వలును — భాసం — స; దారుణేక్షణము
లై — ద.

102 వ. అయ్యురగంబులం దత్పతురజోవృష్టి [1]నంధంబులం జేసి వాని శిరంబులు ద్రొక్కి పరాక్రమం బెసంగ [2]నమృతంబు గొని గరుడండు గగనంబున కెగసిన.

103 క. కలహమున నిట్లు సురవీరులఁ బల్వురనోర్చి [1]యొక్కరుఁడ యమృతముఁ దెక్కలి కొని యాస్వాదింపక [2]యలోలుఁడగు వానిఁ జూచి హరియిట్లనియెన్.

104 క. నీ విజయోత్సాహమునకు ఠావునకు [1]జవంబునకు నలౌల్యమునకు సద్భావమునకు మెచ్చి వరంబిచ్చితి [2]వేఁడు మెద్ది యిష్టము నీకున్.

*—. శ్రీమన్నారాయణుఁడు గరుడునకుఁ బ్రసన్నుఁడగుట ఇంద్రుఁడు వానితో స్నేహించుట :—*

సం. 1-29-12

105 వ. అని ప్రసన్నుండై యానతిచ్చిన [1]యాదిదేవుండగు శ్రీమన్నారాయణునకు నమస్కరించి గరుడం డిట్లనియె

106 సీ. అమృతాశనంబు చేయకయును దేవ నాకజరామరత్వంబు సందుటయును
నఖిలలోకంబుల కగ్రణివైన నీ యగ్రంబునందు నిన్నధికభక్తిఁ
గొలుచుచు [1]నునికియుఁ గోరితిఁ గరుణతో దయచేయు ముద్ధత దైత్యభేది
యనవుడు [2]వానికి నభినుతంబులు ప్రీతుఁడై యిచ్చి హరి యిట్టు లనియె
నాకు

102 1. నంధులం జేసి—పెక్కు ప్రతులు 2 నమృతఘటంబు—ఖ.

103 1 యొక్కరు డయ్యమృత మిమ్ముల గొని- న (యొక్కరుండ యమృతమిమ్ముల-అనియుండ నోపు) 2. యలఘుండగు - య.

104 1. చలంబు — ఉ ద.ప స; జయంబు — య. 2 కోరు — పెక్కు ప్రతులు.

105 1. ఆదిదేవుండగు - అనునది పెక్కు ప్రతులలో లేదు

106 1. నునికికి - న 2 నాతనికభి — అ య, నతనికినభి - ర.

ఆ. [3]ననఘ వాహనంబవై మహాధ్వజమవై యుండుమనినఁ బక్షియును బ్రసాద
మనుచు మ్రొక్కి పలిచె నంత [4]నాతనిమీఁద వజ్ర మెత్తివైచె వాసవుండు

107 వ. అదియును నంబరంబున [1]నగ్నికణంబులు చెదరం [2]బఱతెంచి పక్షిరాజు పక్షంబులు [3]దాఁక వచ్చినం జూచి గరుడండు [4]నగి నీచేయు [5]వేదన నన్నుం [6]దాఁకనోపదు నీవు మహాముని సంభవంబ వగుటను దేవేంద్రు నాయుధంబ వగుటను నిన్ను నవమానింప [7]గాదు గావున [8]మదీయైక పర్ణశకల చ్ఛేదంబు సేయుము నాయందు [9]నీశక్తి యింతియ యనిన సకలభూత సంఘం బెల్ల నాతని పర్ణంబుల [10]సుస్థిరత్వంబునకు మెచ్చి సుపర్ణుండని [11]పొగడె సురేంద్రుండును నవ్విహగేంద్రు మాహాత్మ్యంబునకు మెచ్చి యచ్చెరువంది యిట్లనియె.

108 ఆ. నిరుపమాన శౌర్య [1]నీతోడఁ జెలిమి సేయంగ [2]నా కభీష్టమైన యదియు నిట్టి [3]విక్రమంబు నిట్టి సామర్థ్యంబుఁ గలదె యొరుల కిజ్జగంబునందు.

109 క. అమరుఁడ వజరుఁడ వజితుఁడ వమేయుఁడవు నీకు నమృత మది యేల ఖగో త్తమ దీని నొరుల కిచ్చిన నమరులకును [1]వా రసాధ్యు లగుదురు పోరన్.

110 క. నీ వొరులకు నీయమృతం బీ వలవదు నాకు [1]మగుడ నిచ్చిన నీ కి ష్టావాప్తి యగు [2]విధం బేఁ గావించెద ననిన హరికి గరుడం డనియెన్.

3. నలఘు – న 4 నంతనత్తార్క్ష్యుపై – స; నంత నగ్గరుడుపై – ఐ ఒ.

107 1. కగ్నికణంబులు చెదఱంఒఱచి – ర 2. బఱచి – ఏ.ఐ.ఖ 3 దాకినంజూచి– కొన్ని ప్రతులు 4. నగి యిట్లనియె – ఖ.మ. 5. వేధ – ఐ.ఖ మ. 6. దాకదు– పెక్కుప్రతులు. 7. దగదు – అ ఔ.క.ట.త.ప, రాదు – ఈ.ఖ.చ న.వ. 8. మదీయంబైన యేక పర్ణశకల విచ్ఛేదనంబు — న. 9. నీకుం గల శక్తి యింతియ — అ.ఈ.ఎ. 10. సుస్థిరంబులగుటకు — ఔ.య. 11. పొగడిరి — పెక్కుప్రతులు; సకల భూతంబులు పొగడె — మ.

108 1 నీతోడి చెలిమి–య.ర; నీతోడఁజెలిమి వా శ. మున్నగు ప్రతులు 2. నాకు బుద్ధియయ్యె బ్రీతి–ఋ[1]. భాసం స,నాకు నిష్టమైన యదియు–య 3 విక్రమమును నిట్టి సాహసమును గలదె యొరుల కెట్టి ఘనులకైన–ఔ.

109 1 వారజేయు లగుదురు–అ.

110 1 మరల–చ.శ.స. 2 తెఱంగే—ఏ.

111 వ. [1]ఏను మదీయ మాతృ దాసీత్వ నిరాసార్థం [2]బమృతంబు [3]దెచ్చి యిత్తునని [4]కాద్రవేయులతో నొడివి వచ్చినవాఁడ నీయమృతంబు గొనిపోయి వారల కిచ్చి [5]మదీయ జననీ [6]దాస్యంబుఁ బాచికొనిన నురగు లీ యమృతం బుప యోగింపకుండ [7]ముందఱ నీవు గొని చనుమనిన నగ్గరుడని [8]మహాను భావంబునకు మెచ్చి నీ [9]బలపరాక్రమంబులు వినవలతుం జెప్పుమనిన నయ్యింద్రునకు గరుడం డిట్లనియె

112 క పరనిందయు నాత్మగుణోత్కర [1]పరికీర్తనముఁ జేయఁగా నుచితమె స త్పురుషుల కైనను నీ కచ్చెరువుగ నా కలతెఱంగుఁ జెప్పెదఁ [2]బ్రీతిన్.

113 ఉ. స్థావర జంగమ [1]ప్రవితతం బగు భూవలయంబు నెల్ల నా
లావునఁ [2]బూని తాల్తు నవిలంఘ్య పయోధి జలంబు లెల్ల ర
త్నావళితోన చల్లుదు బృహన్నిజపక్ష సమీరణంబునన్
దేవగణేశ యీక్షణమ త్రిమ్మరి వత్తుఁ [3]ద్రివిష్టపంబులున్.

114 వ. అని చెప్పిన గరుడని జవసత్త్వ సామర్థ్యంబులకు మెచ్చి [1]సంతసిల్లి [2]నీవు నాతో [3]నెప్పుడు బద్ధసఖ్యుండవై [4]యుండుమని యొడంబఱిచి వెండియు దేవేంద్రుండు గరుడని కిట్లనియె.

111 1. ఏనును—మ 2 బురగుల కమృతంబు—పెక్కుప్రతులు 3 దెచ్చిమీకిత్తు—న 4 కద్రువపుత్రులతో—పెక్కుప్రతులు 5 నాతల్లి—గ స; నాజననీ—ఏ; పెక్కుప్రతులలో 'మదీయ'—లేదు 6 దాసీత్వము—కొన్నిప్రతులు; దాస్యంబు వాపికొనిన—$గ_1$ భాసం. స. 7. ముందఱ — పెక్కుప్రతులలో లేదు 8. మహిమాను—అ. 9. పరాక్రమ ప్రకారంబులు—వ; పరాక్రమంబే ప్రకారంబు—య.

112 1. వర—అ—న; పర—ర. 2 దెలియన్—మ.

113 1. ప్రవిదితంబగు—వ 2. జేసి—వ. 3 ద్రివిష్టపంబులన్— వా. మొదలగు కొన్ని ప్రతులు; త్రివిష్టపంబునున్— భా సం

114 1. సంతసిల్లి— కొన్నింటలేదు. 2. నీతో సఖ్యం బభిమతం బైనయది— ఇ ల.స 3. నెప్పుడు — కొన్నింటలేదు. 4 యుండవలయునని—వా ళ. మఱికొన్ని ప్రతులు—భాసం.

115 క. నాకభిమత మొనరించితి నీకిష్టము [1]చెప్పికొను మనిన [2]దుర్మదులై
మాకిట్లహితముఁ జేసిన యాకద్రువపుత్త్రు లశన [3]మయ్యెడు నాకున్.

116 క. భవదభిరక్ష్యములగు నీ భువనంబులయందు సర్పములు [1]ద్రిమ్మరుటన్
దివిజాధిప నీ కెఱిఁగింపవలసె నీ యాజ్ఞ నాకుఁ [2]బడయఁగ వలసెన్.

117 వ. అని గరుడండు దనకు నురగభోజనత్వంబు సురపతిచేతం బడసి తదను గమ్యమానుండై యురగులయొద్దకు వచ్చి [1]మరకతహారితం బైన [2]కుశాస్తరణంబున నమృత[3]కలశంబు నిలిపి యురగులకుం జూపి యిట్లనియె.

118 క. అనిమిషనాథ సుగుప్తమయిన యమృతము దెచ్చి మీకు నిచ్చితి నస్మజ్జననీ దాస్యము వాసెను దినకర పవనాగ్ని తుహిన[1]దీప్తుల కరిగాన్.

119 వ. [1]మీరలు స్నాతాలంకృతులరై వచ్చి దీని నుపయోగింపుం డని [2]పంచి [3]తల్లిం దన వీ పెక్కించుకొని విహగేంద్రుం డురగుల కదృశ్యుండై [4]యున్న సురేంద్రు వీడ్కొని [5]చనియె [6]నిట యురగులును నమృతోపయోగ [7]కుతూహలంబున నొండొరులం గడవఁ [8]గృతస్నానాలంకృతులై [9]చనుదెంచుటకు ముందఱ.

115 1. గోరు—ఓ. 2. దుర్మతులై — ఆ ప క గ డ.త య వ.స; దుర్మదులై — వా మున్నగు ప్రతులు. 3. మయ్యెడనాకున్ — ఐ ఒ గి

116 1. గ్రుమ్మరు— ఆ.ప ద మ. 2 బడయవలయుటన్—స.

117 1. మరకతరుచి భరితంబైన—య స. 2 కుశస్థలంబున— పెక్కుప్రతులు 3 కలశం— కొన్నింటలేదు

118 1. దీప్తులుగురిగాన్— ఇ ఊ.ఏ.ఓ.క గ త న.బ స.

119 1 మీరు స్నానాలంకృతులై —పెక్కుప్రతులు. 2. యునిచి— మ; చెప్పి- ఓ ఔ. 3. వారలచేత నను జ్ఞవడసి తల్లిం—ఖ 4. యచ్చేరువనున్న—న. 5 యథేచ్ఛం జనియె— ల. 6 నంతనయ్యురగ—ఆ ఔ, పెక్కు ప్రతులలో నిట అనునదిలేదు. 7 కుతూహలపరులై — ఆ ఔ త న.ల; కుతూహలచిత్తులై —బ. 8. కృతస్నానులై — ఇ.ఈ ఔ.క ప బ య; కృతస్నానులై యలంకృతులై — న; కృతస్నానాలంకరణులై —గ.ర స. 9. చనుదేర నంతకుముందర-గ ర స, వచ్చుటకు ముందర—ఇ వ, వచ్చిరంతకు ముందర-జ డ ద.

120 క. అమరాధిపుఁ డమృతము గొని [1]యమరావతి [2]కరిగి తొంటియట్టుల సుస్థా
[3]నమున నవిచలితరక్షా [4]క్షముఁడై రక్షించుకొని [5]సుఖస్థితి నుండెన్.

121 వ. అంత [1]నయ్యురగులు నమృతం బుపయోగింపం గానక దానియున్న స్థానం బని దర్భలు నాకిన నాలుకలు రెండుగా [2]వ్రయ్యుటంజేసి నాఁటంగోలె [3]ద్విజిహ్వులు [4]నాఁ బరగిరి యమృత[5]స్థితిం జేసి దర్భలు పవిత్రంబు లయ్యె.

122 క. ఈ సౌపర్ణాఖ్యానము భాసురముగ వినిన పుణ్యపరులకు నధిక
శ్రీ సంపదలగు దురితనిరాసంబగుఁ బాయు నురగ రక్షోభయముల్

123 వ. ఇట్లురగు లమృతం బుపయోగింపం గానక [1]చనిన శేషుండు దనతల్లియుం దమ్ములుఁ జేసిన [2]యధర్మంబునకు నిర్వేదించి వారల విడిచి కడునిష్ఠతో గంధమాదన [3]బదరీవన గోకర్ణ పుష్కరారణ్య హిమవంతంబు లాదిగాఁ గల పుణ్య [4]స్థానంబులం దనేక సహస్ర వర్షంబులు బ్రహ్మ నుద్దేశించి తపంబు సేసిన బ్రహ్మయుఁ బ్రత్యక్షుండై వరంబు వేఁడుమనిన శేషుం డిట్లనియె.

-: *బ్రహ్మ యనుజ్ఞవలన శేషుఁడు భూభారంబు దాల్చుట* :-

సం. 1-32-2

120 1. యమరావాసమున కరిగియచ్చట-య. 2. కేగి-స. 3. నమునం దచలిత-ఐ.గ.ర.స; నమునను నచలిత-న, నమునందు నునిచి-ద.బ. 4. క్రముడై-స; క్రమమున-ఋ.ఏ.మ. 5. సుఖంబున-న.

121 1. నయ్యురగులు నిట- పెక్కుప్రతులు; నయ్యురగులు నిట చనుదెంచి—ల.స. 2. వ్రయ్యలగుటంజేసి—ఖ. 3. పాములు ద్విజిహ్వులు నా బరగె—ఎ.ఐ.బ.ల, పాములు ద్విజిహ్వ లనం బరగె—మ; నురగులకు ద్విజిహ్వానామంబు ప్రశస్తంబయ్యె—న. 4. నాఁబరగి— ఈ శ.ష; నాబరగె— పెక్కు తాళపత్రప్రతులు. 5. స్పర్శం జేసి—ఏ.గ; స్పర్శనంబునం జేసి—ర.

123 1. దానియున్న స్థానంబుఁజూసి చనిరి- ఏ మ; చనిరి—ఆ.ఉ.ప.ల; చనినంత నురగాగ్రజుండైన—వ. 2. యధర్మారంభంబునకు వెరచి వారల నిందించి విడిచి పోయి—అ.ట, యధర్మారంభంబునకు—క.గ.బ. 3. బదరీతపోవన—అనికొన్నింట. 4. స్థలంబులం దనేక—న.

124 సీ. తల్లియు నా సహోదరులును మూర్ఖులై ధర్మువు నుచితంబుఁ దప్పి వినత
కా వైనతేయున కపకారము[1]లు సేసి [2]రెప్పుడు వారు సహింప కెగ్గు
సేయుదు రేను [3]రోసితి వారితోడి పొత్తొల్లఁ దపంబు సేయుచు శరీర
భారంబు విడిచెదఁ బరమేష్ఠి యనవుడు నాతని సమబుద్ధి కజుఁడు మెచ్చి

ఆ. నిత్యసత్య ధర్మనిరతుండ వఖిలంబు దాల్పనోపునట్టి ధైర్యయుతుఁడ
విది యనన్యవిషయ మిమ్మహీభారంబు నీవ తాల్పవలయు [4]నిష్ఠతోడ.

125 చ. వినతకు నాత్మజుం డయిన వీరుఁడు కశ్యప వాలఖిల్య స
న్మునుల వరంబు గన్న ఖగముఖ్యుఁడు వాసవు నోర్చు [1]యున్న స
ద్వినుత బలుండు కావున వివేకమునన్ వినతా తనూజుతో
[2]ఘనముగఁ జెల్మిసేయు మిది కార్యము నీకు భుజంగమేశ్వరా.

126 వ. అని బ్రహ్మ [1]నియోగించిన శేషుం డశేషమహీభారంబు దాల్చి గరుడనితో బద్ధసఖ్యుండై యుండె [2]నిట వాసుకియుం దల్లిశాపంబున [3]జనమేజయు చేయు సర్పయాగంబునం దయ్యెడు సర్ప[4]కుల ప్రళయంబునకు వెఱచి[5]తన బాంధవుల నైరావతాది [6]సహోదరుల రావించి విషణ్ణహృదయుండై యిట్లనియె.

*—: వాసుకి తల్లి శాపంబునకు వగచుట :—*

సం. 1—33—1

127 చ. చిరముగ బ్రహ్మకుం దపము సేసి యనంతుఁ [1]డనంత ధారుణీ
భరగురు కార్య[2]యుక్తుఁడయి పన్నగముఖ్యుల పొత్తు వాసి చె
చ్చెరఁ దనయంత నుండి మదిఁ [3]జేర్చి తలంపఁడ యొక్కనాఁడు దు
ర్భరతర దందశూకకుల భావి [4]భయ [5]ప్రవిఘాత కృత్యముల్.

124 1. ను జేసి—కొన్ని ప్రతులు; లు సేసి — వీ. మొదలగు ప్రతులు. 2. రిప్పుడు — వా. కొన్ని యితర ప్రతులు. 3. బాసితి—పెక్కు ప్రతులు. 4. నెమ్మితోడ — వా.శ. మున్నగు ప్రతులు. నిష్ఠతోడ—ఆ.ఇ.ఈ.ఉ.ఋ.ఏ ఐ క ఖ-గ జ న.య ర.ల.స;

125 1. నట్టి — వ 2 ఘనముగ సంధి — ఓ బ స

126 1. నియమించిన — య. 2. నట — ఉ న. 3 జనమేజయు సర్పయాగంబున — వా. కొన్ని ప్రతులు; జనమేజయుండు సేయు — ఖ ల.స ; జనమేజయు చేయు — కొన్ని ప్రతులు. 4. పెక్కు ప్రతులలో 'కుల' లేదు. 5. యురగ — య. 6. మహోరగుల — ఊ.

127 1. డశేష — ఆ. 2. సక్తుఁడయి — వా. కొన్ని ప్రతులు ; యుక్తుఁడయి — స. మున్నగు ప్రతులు 3 జేసి — కొన్ని ప్రతులు. 4. భవ — య.ర.స. 5. ప్రతి ఘాత — భాసం వ వీ.శ.ష

128 వ. మఱి యమృతమథనంబునాఁడు మంథరమహానగంబునకు [1]నేత్రంబ నయిన
నా క్లేశంబునకు మెచ్చి [2]యమరు [3]లెల్లఁ బితామహుం బ్రార్థించి నాకు నవ్య
యత్వంబును సకల క్షయ[4]విమోక్షణంబునుం గా వరం [5]బిప్పించి రైనను
జననీశాపంబున నురగ[6]కుల ప్రళయం బగుటకు మనోదుఃఖంబు దుస్సహం బై
యుండు దాని నుడిగించు [7]నుపాయం బెద్ది యేమి [8]సేయువార మని
చింతించుచున్న యన్నాగరాజునకు నాగ[9]కుమారు లత్యుద్ధతులై యిట్లనిరి.

129 సీ. జనమేజయు[1]ని చేయు సర్పయాగమునకు విఘ్న[2]మందఱముఁ గావింత
మతఁడు
ధర్మార్థి గావున ధారుణీసురులమై యడుగుద [3]మిదియు సేయకు మనియును

128 1 నేత్రంబ — అ ఇ.ఋ.ఒ, సూత్రంబ — అ ఓ ఖ భాసం వ పీ స; యోక్త్రంబ — ఏ ఔ. వేత్రము అని కొన్ని ముద్రిత ప్రతులలోని పాఠము మూలానుగుణము కాదు. దీనియందు 'వేత్రంబ నయిన క్లేశంబునకు' అనియున్నది. వేత్ర శబ్దమునకు కట్టుత్రాడు అను నర్థము ఆప్టేలో కాని శబ్దరత్నాకరములో కాని కనఁబడదు. మూలమునందు నేత్ర శబ్దమే యున్నది, తత్ర నేత్రమ భూన్నాగో వాసుకిర్బలినాం వరః చిత్రశాలా ప్రతి పుట 87 2. యమరవరు — ఈ ఉ ఋ.బ.ర. 3. లెల్ల నత్యుద్ధతులై — ఖ మ. 4. విమోచనంబును—ఓ.ఔ జ.య. 5. బిచ్చి రైనను— న పీ స. పెక్కు ప్రతులు 6. కులంబునకుం బ్రళయం — ర 7. నుపాయం బెట్టిది — అ ట ప, నుపాయం బెయ్యది — ఓ: నుపాయం బొం డెద్ది — న ర. 8. సేయంగలవాడనని—న. 9. కుమారులెల్ల నుద్ధతులై — అ ఖ

129 1. డు సేయు — పెక్కు ప్రతులు 2 మిందరము — అ.ఓ ల 3 మిట్టి సేయకు మటనియు — స ఈ సీసపద్యము సందంతటను సాధారణయతి కాన్పించుచున్నది రెండవపాదము ఉత్తరార్ధమునందు 'యడుగుద మీక్రతు వుడుగు మనియు' మాత్రము ప్రాసయతిగల పాఠము వావిళ్ళ మున్నగు ప్రతులలోఁ గైకొనఁబడినది ఒక్క పాదార్ధమునందు మాత్రము నన్నయ తన నియమభంగముచేసియుండునా? యను ప్రశ్న యుదయించుచున్నది తాళపత్ర ప్రతులను పరిశీలింపఁగాఁ జెరిసగముగా ప్రాసయతిగల పాఠములును సాధారణయతిగల పాఠములునులభించినవి కావున నన్నయ నియమమున కనుగుణమైన పాఠమునే యాదరించుట చేసితిమి. 'యడుగుదమిదియు సేయకుమనియును' - ఎ; 'యడుగుదమిదియు సేయకుమ యనియు' అను పాఠము ఋ ఔ. ప్రతులలో కాన్పించు చున్నది. ఇది మేలైనపాఠమైనను వ్రాఁత అస్పష్టముగా నుండుటచే ముఖ్య పాఠముగా గ్రహింప లేదు
ముగ్రతువు సేయకుము ననియు — ఆ ఇ ఈ; మిదియు సేయకుము ననియు — ఉ; ముగ్రతువు సేయకుము యనియు — ఋ.ఊ.క; మీక్రతువు సేయకుమనియును—ఎ;

గొందఱు మతనికిఁ గూర్చు మంత్రులముపై యాత్రకతు[4]క్రియఁ జేసి [5]యిహ పరముల
కగుఁ బెక్కుదోషంబులని హేతువులు సూపి [6]యుడిగింత [7]మందఱు నొక్క మొగిన

ఆ. భక్షభోజ్యలేహ్య పానీయములమీఁద [8]సదములోని విప్ర[9]జనుల మీఁద
[10]వెగడు బడఁగఁ జాటి వెఱపింత మొజ్జలు తత్ప్రయోగ[11]విధులు దప్పి[12]పఱవ.

130 వ. అనిన [1]వారలలోఁ గొందఱు బుద్ధిమంతులయిన భుజంగముఖ్యు లిట్లనిరి.

131 క. ఇవి [1]మీ [2]కన్నియుఁ జేయఁగ నవునని తలఁపకుఁడు భూసురా[3]హుతి మంత్రో
ద్భవదారుణ [4]దహన[5]శిఖల్ గవిసి[6]న నెద్దియును జేయఁగా [7]నెడగలదే.

132 వ. అనిన [1]విని నాగరాజానుజుండైన యేలాపుత్త్రుం డిట్లనియె.

133 ఆ. శాపమిచ్చునాఁడు జనని యుత్సంగంబునందు [1]నిద్రవోయినట్లు యుండి
యమరవరుల కజునకైన [2]యన్యోన్య సంభాషణంబు లెఱుకపడఁగ వింటి,

ముక్రతువు సేయకుమ ననియు — ప, మఖము సేయకుముననియు — డ. 4. వున — స. 5 యిహము బరము చెడునని పెక్కులు నుడివి హేతువుచూపి— న. 6. యుడిగింతమని కొందఱొక్క మొగిన — ప మ. 7.మందర మొక్క మొగిన — పెక్కుప్రతులు , మిందరు నొక్క మొగిన — ఆ న 8 సభికులైన— ఆ ప.బొ ఖ త.స; సదసులోని — న. 9. సమితి మీద — డ.ద న. 10. వెరగు—ఎ.ర. 11. సరణి — గ. 12. నడువ — మ.

130 1. నందు గొందరు — ఈ.ఉ ఋ.క.ఖ.న.మ.

131 1. మా కన్నియు — య. 2. కిన్నియు — కొన్ని ప్రతులు. 3. వళి — బొ.ప.పి. 4. దవశిఖదాఁ గవిసిన — స. 5 నార్చులుఁ — స 6. నబెద్దయును బాయగా — య 7. మీ కగునే — వ.

132 1. విని — కొన్నింట లేదు.

133 1. నిదుర — ఆ.ప 2. యేకాంత — స.

134 వ. అప్పలుకు[1]లు సవిస్తరంబుగాఁ జెప్పెద వినుండు శాపానంతరం[2]బ యమరు
లెల్ల నజుని కిట్లని రయ్యా కద్రువ కడునిర్దయు రా[3]లై యిట్టి యనంత [4]బల
వీర్య సంపన్నులయిన కొడుకులం బడసి [5]వారి కకారణంబ దారుణంబైన
శాపం బిచ్చె మీరును వారింపక యుపేక్షించితిరి దీనికిం బ్రతీకారం[6]బు
[7]గలదే యనిన నమరులకుఁ గమలసంభవుం డిట్లనియె.

135 క. క్రూరాకారుల జగదపకారులఁ బన్నగులఁ దాల్పఁగాఁ [1]నోపని యి
ద్ధారుణి[2]కి హితంబుగ దుష్టోరగసంహార మిప్పు డొడఁబడ వలసెన్.

136 వ. మఱియు సకలలోక [1]హితాచారంబులై ప్రసిద్ధులైన నాగముఖ్యుల నెల్ల
వాసుకి చెలియలైన [2]జరత్కారువునకు జరత్కారుం డను [3]మహా[4]మునికిం
బుట్టెడువాఁ డధికతేజస్వి యాస్తీకుండను [5]మహాముని జనమేజయ [6]సమా
రబ్ధ సర్ప[7]సత్త్రప్రళయంబువలన రక్షించునని పితామహుండు దేవతలకుం
[8]జెప్పిన తెఱంగు సెప్పిన వాసుకి ప్రముఖ నాగముఖ్యు లెల్ల సంతసిల్లి యేలా
పుత్త్రు నెత్తుకొని సాధువాదంబుల నభినందించిరి వాసుకియు నాఁటంగోలె
జరత్కారు మునీంద్రుం డెన్నండు దారపరిగ్రహంబు సేయునో యని [9]తత్స
మయ సమాగమం బపేక్షించి [10]యుండునంత.

134 1. లు సవిస్తరంబుగా జెప్పెద — ర.ల.స. 2 బున నమరవరులెల్ల — కొన్ని ప్రతులు. 3. లయ్యెనట్టి — న. 4. వీర్యబల సంపన్ను — అ.ఈ.ఔ.క బ. 5. వారల కలిగి యకారణంబ — స ; వారికి నకారణంబ యలిగి — ఊ.క.ద న.బ.ర; వారల కకారణంబ — అ.ఆ.ఔ.మ. 6. బొండెద్దియేనియున్ — స ; బొండెద్ది యును గలదే — సు ; బొండు గలదే — ఇ.ఊ ఋ ఏ.జ.ద న వ. 7. యేనియుం గలదే — ఏ ; యెద్దియేనియుం గలదే — ఆ , విచారింపంగలదే — ఖ.

135 1. నోపమి యిద్ధారుణి — స. 2. కిహితంబగు — న.ర , కి హితంబను — మ.

136 1. హితాచారులైన నాగ — ఇ ఏ.ఔ.చ త ద మ య. ష. శ. ; హితాచారులై ప్రసిద్ధులైన — వా.శ; కొన్ని యితర వ్రాఁతప్రతులు ; హితాచారంభులై — ఓ గ.జ. 2. జరత్కారకు — పెక్కు ప్రతులు. 3. మహా — పెక్కు ప్రతులలో లేదు. 4. ఋషికిం — ఆ ఇ ఈ.ఊ.ఋ ఎ.ఏ.ఐ.ఓ.ఖ గ.ద.న.మ ర. 5. మునిసత్తముండు — గ.ర ; మహాత్ముండు — అ.ట ప. 6. జనితంబైన — అ.ఋ.ఎ.ఔ.ట.ప.య.ర.స.శ. 7. కుల — వా.శ. కొన్ని యితర వ్రాఁత ప్రతులు. 8. చెప్పెనని చెప్పిన విని — అ ఈ.ఋ ఔ.మ; చెప్పెననిన నప్పుడు — న ప 9.తత్సమయం బపేక్షించి— అ.ఆ ఇ ఉ.ఊ.క.డ ద.బ.మ య.శ.ష. 10. యుండె నంత — కొన్నిప్రతులు;లోక పితామహువాక్యంబు తప్పదని యుండునంత — న

137 క. పరమతపోనిధి [1]యాయా వర[2]వంశోత్తముఁడు నియమవంతుఁడు లోకో
త్తరుఁడు జరత్కారుఁడునాఁ బరగిన ముని బ్రహ్మచర్య పరిపాలకుఁడై.

138 క. ఘోరవ్రతములు సలుపుచు దారపరిగ్రహము సేయఁ డానొల్లక సం
సారపునర్భవభీతి నపార [1]వ్యామోహ [2]పాశ బంధచ్యుతుఁడై.

139 వ. తపస్స్వాధ్యాయ [1]బ్రహ్మచర్యవ్రతంబులం జేసి ఋషుల [2]ఋణంబుల
[3]నీఁగుచుఁ బరిభ్రమించువాఁడు వనంబులో [4]నొక్క [5]పల్వలంబు [6]గని
యందు మూషిక [7]విలూనంబయి యొక్క [8]మూలంబు [9]తక్కియున్న
వీరణతృణ స్తంబంబు నవలంబించి [10]తలక్రిందై యాదిత్య[11]కిరణంబు లాహా
రంబుగా వ్రేలుచున్న ఋషుల గొందఱం [12]జూచి డాయం బోయి [13]జర
త్కారుం డిట్లనియె.

140 క. కడు నుగ్రము దల[1] క్రిందుగఁబడి [2]వ్రేలుట యిదియునొక [3]తపంబొకో నాకే
ర్పడఁ జెప్పుఁ [4]డీతపం బేఁదొడఁగెద ననవుడును నయ్యధోముఖ విప్రుల్.

---

137 1 యగు నావర — అ క.న య ; యైయావర — ఉ.మ.స. 2. వంశోత్తరుఁడు భువన వంద్యుఁడు — వ.

138 1 వ్యాపార మోహపాశచ్యుతుఁడై — పెక్కు ప్రతులు. గ$_1$ ; వ్యాపార మోహ పాశ చ్ఛిదుఁడై — ఖ.స ; వ్యాపార మోహ పారభిదుండై — మ. 2. దురిత బంధచ్యుతుఁడై — ఏ

139 1. బ్రహ్మచర్యంబులం జేసి — వీ ళ పెక్కు ప్రతులు 2. ఋణంబుల నీగుచు — పెక్కు ప్రతులు. 3 దీర్చుచు — ఋ. 4. మహాకూపంబు దరియ — గ 5. పల్లంబున మూషిక — అ ఋ ఏ.ట.డ.ద బ ; గర్తంబునందు — మ. 6. దరి — స. 7. విలూనమూలంబై యొక్క వేర తక్కి యున్న దాని — ఔ. 8. వేర — ఏ. త 9. తక్కియున్నదాని — అ ఆ.ఇ.ఎ.స.క.గ వా. 10 తలక్రిందై వ్రేలుచున్న — ఎ ; తల క్రిందుగా వ్రేలుచున్న — ఋ.ఏ.గ. 11. కిరణంబు లాహారంబుగా — పెక్కు ప్రతులు. 12 జూచి డాయంబోయి — పెక్కు ప్రతులు ; డాయంబోయి వారలకు — న.య ల 13. జరత్కారుండు వారల కిట్లనియె—ఆ.ఖ.జ.మ.

140 1. క్రిందై పడి — ఆ.ఊ.క.ఖ.మ. 2. యుండుట — శ.ష స. 3. తపంబే నా — మ.ర.స, తపంబకో — ఊ.జ. 4 డిత్తపం బే నడరించెద నన్నిన — స.

141 క. అనఘ యిది యేటితప మేమనుపమ [1]దుఃఖితుల మగుట నాధారము [2]లే
కను సంతానోచ్ఛేదంబున వ్రేలెద మధమ[3]లోకమున తెరువు చనన్.

142 వ. మందభాగ్యుల మయిన మావంశంబున జరత్కారుం డను పాపకర్ముండు పుట్టి దారపరిగ్రహంబు [1]సేయను సంతానంబు వడయను [2]నొల్లకున్నవాఁ డే మాతని [3]పితృపితామహులము మాపట్టిన యవురుగంట వేళ్ళెల్లం గాలుండు మూషికవ్యాజంబునం [4]దరతరంబ కొఱికిన నొక్కవేర [5]తక్కి యున్నయది యదియును జరత్కారుం [6]డనపత్యుం డైనం దెగు [7]నే మధఃపాతుల మగుదు మాతం డపత్యంబు [8]వడసెనేని యూర్ధ్వగతుల మగుదుము.

143 తే. నీవు మా [1]చుట్టమవపోలె నెమ్మితోడ [2]నవహితుండవై మా[3]పల్కు లాదరించి
తా జరత్కారుఁ గని [4]చెప్పవయ్య [5]వాని నెఱుఁగుదేని మా పడియెడు నీ యవస్థ

144 వ. అనిన విని జరత్కారుం డతికారుణ్యచిత్తుండయి యపత్యార్థం బవశ్యంబు వివాహంబు [1]గావలయు నని యెంతయుం బ్రొద్దు [2]చింతించి తనపితృ[3]వర్గంబున కిట్లనియె.

141 1. దుష్కృతుల — అ.ఆ.భాసం. వా.శ ; దుఃఖితుల — పెక్కు ప్రతులు. 2. లేవని— ఏ ఔ ప.వా. లేక ను — స.శ ప మున్నగు ప్రతులు 3. లోకముల — ఆ.ఈ.ఊ.ఋ.ఐ త.శ ష ; లోకముల కేగుటకుఁ — మ.

142 1. సేయక సంతానంబు పడయ నొల్లకున్నవాడు — ఊ.ప.ద. 2. మనస్కరింప కున్నవాడు — న. 3. పితృపితామహప్రపితామహులము — అ ఈ ఐ.ఒ.ఓ.గ జ. ట.త.ద న.బ ల. 4 గ్రమంబున గొరుక — ఆ.మ. 5 తక్కిన యది — ఊ.ఋ.న. 6. డనపత్యుం డయ్యెనేనిం దెగు — ర. 7. నే మును నధః — కొన్ని ప్రతులు. 8. వడసెనేని నూర్ధ్వ — అ ఒ ఖ.య.

143 1. చుట్టమువు — స 2. నతిహితుండవై — మ. 3. పల్కు లవధరించి — ఆ.ఋ. ఖ.మ. 4. చెప్పుమయ్య — పెక్కు ప్రతులు. 5. యతని — అ.మ.

144 1. గావలయు గాకేమి యని — ఇ ఈ.ఉ ఊ.ఋ.ఏ.ఐ.ఒ.క.గ జ.డ.త.ద న.ర.ల.స ; గావలయునని — వా.శ. 2. విచారించి — ఋ.వ. 3 వరుల కిట్లనియె — అ.ట. య.వ ; దేవతల కిట్లనియె — ఆ.ఈ.ఉ.ర.

145 క. మీరలు నాపితృ[1]దేవత లారాధ్యుల రేను మీకు నాత్మజుఁడ జర
త్కారుఁ డనువాఁడ ముందఱ దారపరిగ్రహము [2]సేయఁ [3]దగులదు బుద్ధిన్.

146 క. మిమ్మిట్లు చూచి హిత మ్మెట్లగు [1]నట్ల కా ముదంబున దారా
ర్థమ్ము ప్రవర్తింపఁగఁ జిత్తమ్మిప్పుడు పుట్టె నాకు ధర్మస్థితిమై.

147 వ. [1]అనిన నమ్మహామునులు జరత్కారు పల్కులకు సంతసిల్లి యిట్లనిరి.

148 చ. [1]తగియెడు పుత్త్రిలం బడసి ధర్మువు దప్పక తమ్ము నుత్తముల్
పొగడఁగ [2]మన్మహామతులు పొందుగతుల్ గడుఘోరనిష్ఠతోఁ
దగిలి తపంబు సేసియును దక్షిణ లిమ్ముగ నిచ్చి యజ్ఞముల్
నెగడఁగఁ జేసియుం బడయ నేర రపుత్త్రికులైన దుర్మతుల్.

-: జరత్కారుండు వివాహంబు చేసికొనఁ బూనుట :-

సం. 1-42-9

149 వ. కావున [1]నీవు కృతదార పరిగ్రహుండవై సంతానంబు వడసి మమ్ము
[2]నూర్ధ్వలోక గతులం జేయుమనిన జరత్కారుం డట్లేని నాకు [3]సనామ్ని
యయినదాని వివాహంబు [4]గావలయు నని వారికి నమస్కరించి [5]వీడ్కొని
[6]సనామ కన్యాన్వేషణపరుండై భూవలయం బెల్లఁ గలయం గ్రుమ్మరి.

145 1. వర్గం బారాధ్యుల — ఇ.త.న. 2 నందు — ఖ. 3. దగులని — వ ; దల పదు — య.

146 1. నట్లుగా — అ.ఈ.బు ఓ.త.య ర.శ.ష.స.

147 1 అనిన విని య — కొన్ని ప్రతులు ; వా.శ.

148 1 తగిన సుపుత్రులం — పెక్కు ప్రతులు—గి$_1$ 2. సన్మహా — ల స ; నమ్మహా — ఊ.బు.ఎ గ జ ద.ప బ.శ.

149 1. నీవు దారపరిగ్రహంబుసేసి — అ. 2. నూర్ధ్వగతుల — అ.ఈ.ఉ.ఏ.ఔ చ.త.బ భాసం. శ.స. 3 సనామ — ఓ.క.ఖ ప్రతులలో తప్ప తక్కిన అన్నింటి యందును ; సనామ్నీం యద్యహం కన్యా ముపలప్స్యే కదాచ న—మూలము. 4. గావలతు — ఆ.మ. 5. వీడ్కొని — కొన్నింట లేదు. 6. స్వనామ — ఆ. ల.

150 తరువోజ. అనవరత వ్రతాయాసఖేదమున నతికృశం బగుచున్న యంగంబునందుఁ
దనరి [1]యేర్పడ సిరల్ దద్దయు [2]ముదిమిఁ దల వడంకుచు [3]నుండఁ దన పితృవరుల
ఘనముగా నూర్ధ్వాభిగమనులఁ జేయఁ గడఁగి వివాహంబుగా జరత్కారుఁ
డనఘుండు దనకోర్కి కనురూప యైన యట్టికన్యకఁ గానఁడయ్యె మర్త్యమున.

151 వ. ఇట్లు జరత్కారుండు వివాహాపేక్షుం [1]బరీక్షించుచున్న వాసుకియుం దన
చారుల వలన నంతయు నెఱింగి నిజసహోదరి యైన [2]జరత్కారుం దోడ్కొని
జరత్కారు మహాముని పాలికిం బోయి యిట్లనియె.

152 శా. ధన్యంబయ్యె భవత్కులం బతికృతార్థంబయ్యె నస్మత్కులం
బన్యోన్యానుగుణాభిధానములఁ జిత్తానంద మొందెఁ వివే
కన్యాయాన్విత భూసురోత్తమ జరత్కా[1]రూ జగన్మాన్య యి
క్కన్యాభిక్షఁ బరిగ్రహింపుము జరత్కా[2]రున్ మదీయానుజన్.

153 వ. [1]అనిన నొడంబడి జరత్కారుండు [2]సనామ యగుటం జేసి యక్కన్యకను
వివాహంబై ప్రథమ [3]సమాగమంబునం దన ధర్మపత్నికి సమయంబు సేసె
నాకు నీ వెన్నండేని [4]యవమానంబు [5]దలంచితి నాఁడ నిన్నుం బాసి
పోవుదు [6]ననిన నాఁటంగోలె.

150 1. యేర్పడిన ర (రా) ల్ — ఈ ప ఒ గ. జ ట డ.ద.బ.ల శ ష స. 2 ముదిసి —
క బ.వ.శ ష.స. 3. నుండు — చ ప్రొ ష.స; నుండఁ దన పితృ — ఈపాఠమే
మూలానుగుణము. ముదిమి నొందినది జరత్కారుడు 'నచస్మ లభతే భార్యాం
వృద్ధోయ మితి శౌనక'.

151 1. పరీక్షించు — కొన్ని ప్రతులు 2. జరత్కారం— పెక్కుప్రతులు. కానిమూలము
నందు జరత్కార రూపము కానరాదు.

152 1. రా — పెక్కు ప్రతులు. 2. రఁ — పెక్కు ప్రతులు.

153 1 అనిన విని — భాసం వా. కొన్ని ప్రతులు. 2. స్వనామ—ఆ.న మ 3 సమా
గమంబయ్యెడు నా సమయంబున దన ధర్మపత్నికి నియమంబు సేసె—న. 4. నవ
మానంబు—అ.ఆ.ఈ.ఏ.బొ.క.ఖ.గ ట.ప. భాసం ర. 5. దలంచి తప్పెడ—బొ త స;
దలంచి తప్పుడు—గ 6. నని — వా; కొన్ని ప్రతులు.

154 క. వాలుపయి నడచు[1]నట్లబ్బాలిక [2]నడునడ నడుంగి భయమున నియమా
శీలుఁడగు పతికిఁ [3]బవళుల్ రేలును నేమఱక [4]పరిచరించుచునుండెన్

155 క. అనవరత భక్తిఁ బాయక తనపతికిం [1]బ్రియము సేసి [2]తద్దయు గర్భం
బను రక్తిఁ దాల్చి యొప్పెను దినకరగర్భయగు పూర్వదిక్సతి వోలెన్.

156 వ. అక్కోమలి యొక్కనాఁడు దన [1]కుఱువు దలయంపిగాఁ గృష్ణాజినాస్తర
ణంబున నిజనాథుండు [2]నిద్రితుండై యున్నయవసరంబున నాదిత్యుం డస్త
గిరి శిఖరాసన్నుం [3]డగుటయు సంధ్యాసమయోచిత [4]క్రియలు నిర్వర్తింపఁ
దదాశ్రమవాసులైన [5]మునులు గడంగుటం [6]జూచి యాత్మగతంబున

157 సీ. సంధ్యలం దొనరించు సద్విధుల్ [1]గడచిన ధర్మలోపంబగు దడయ కేల
బోధింప వైతని భూసురప్రవరుండు పదరునో బోధింపఁబడి యవజ్ఞ
దగునె నాకిట్లు నిద్రాభంగ మొనరింపనని యల్గునో దీని కల్గెనేని
[2]యలుకయ పడుదుఁగా కగునె ధర్మక్రియాలోపంబు హృదయంబులో
సహింప

ఆ. నని [3]వినిశ్చితాత్మయై నిజపతిఁ [4]బ్రబోధించె మునియు [5]నిద్ర[6]దేఱి యలిగి
యేల నిద్ర దెలిచి [7]తీవు [8]నావుడు జరత్కా[9]రువిట్టులనియెఁ గరము వెఱచి.

154 1 వడువున బాలిక—ర. 2. వడవడ వడంకి — చ మ.శ.ష; నడు నడ నడుంగి—భాసం వా. కొన్ని ప్రతులు. 3 బగలును — కొన్ని ప్రతులు 4 యుపచరింపుచు—మ

155 1. ప్రీతి సేసి—అ ఇ ఈ ఉ ఎ.ఐ.ఒ ఖ ర. 2. తడయక—మ

156 1 యూరువు—పెక్కు ప్రతులు. 2 నిద్రితుండైన యవసరంబున—కొన్ని ప్రతులు. 3 డగుడు సంధ్యా — ఇ.ఉ.ఎ ఏ.ఐ.గ.ప.బ 4. కృత్యంబులు — వ 5. మునులరుగుటం — వ ; మును లేగుటం — గ$_1$ చ.శ ష. 6 జేసి — వ.

157 1. దప్పిన — అ.న ; గడపిన — మ 2 యలుకనే పడుదు గాక — అ.ఆ.గ.చ.మ.ర శ స ; యలుకన — ఈ ఖ. 3. సునిశ్చితా — ట ప ; యు నిశ్చితా — య. 4. ప్రబోధింప — అ ఎ.క.చ య.ల 5 నంత దేఱి నిద్ర — న. 6 దెలిసి — ఆ ఊ. ఔ ఖ.గ.ట.ద.ప ర.ల.వ. 7. తిపుడు — ఉ.ఓ.వా. 8. జరత్కారయనిన నిట్టులనియె నతనితోడ — న 9. ర యిట్టులనియె — పెక్కు ప్రతులు.

158 క. ఇనుఁ డ స్తమింపఁ బోయిన నరఘా [1]బోధింపవలసె ననవుడు నామే
ల్కను నంతకు నుండక యినుఁ డొనరఁగ నస్తాద్రి[2]కేఁగ నోడఁడె చెపుమా.

159 వ. [1]నీవు నా కవమానంబు [2]దలంచితివి నీయొద్ద నుండనొల్లఁ [3]దొల్లి నీకు నాచేసిన సమయంబు నిట్టిద నీ గర్భంబున నున్నవాఁడు సూర్యానల సమ [4]ప్రభుం[5]డైన పుత్త్రుం [6]డుభయకుల దుఃఖోద్ధరణ సమర్థుం[7]డు సుమ్ము నీవు వగవక నీయగ్రజు[8]నొద్ద నుండుమని జరత్కారువు నూరార్చి జరత్కారుండు తపోవనంబున[9]కుం జనియె నిట జరత్కారువును దన యగ్రజుం డైన వాసుకియొద్దకు వచ్చి తద్వృత్తాంతం బంతయు [10]నెఱింగించి [11]యుండునంత.

160 క. అపూర్ణతేజుఁ డపగత [1]పాపుఁ డపాకృత భవానుబంధుఁడు నిజమా
తాపితృ పక్ష ప్రబల భయాపహుఁ డాస్తీకుఁ డుదితుఁడై [2]పెరిఁగెఁ బ్రభన్.

161 తే. చ్యవనసుతుఁడైన ప్రమతితోఁ జదివె సకల వేదవేదాంగములు [1]నిజవిమల బుద్ధి
నెఱిఁగె సకల శాస్త్రంబుల [2]నెల్ల యందు నధిక [3]సాత్త్వికుఁ డాస్తీకుఁ డనఁగ జనులు.

158 1 మేల్కనుప — అ.స. 2. కరుగ — ఐ.ఖ.

159 1. అని పల్కి నీవు — ర స. 2. చేసితింక — ర.స ; చేసితివి — ఉ ట.ప.మ. 3 దొల్లియు నీకుం జేసిన — ఆ ఈ.ఊ.ఔ.ఖ.ప మ 4 ప్రభుం డుభయకులపక్ష — పెక్కు ప్రతులు 5. డైన సుపుత్రుండు — అ.ఆ. 6. దుభయకులపక్షరక్షణ సమర్థుడు — భాసం శ ష. 7 డగు — మ 8 కడ — అ ల. 9. కరిగె — అ. ఆ.ఏ.ఖ.య ర. 10 నెరుంగ జెప్పియున్నంత — ల. 11 యున్నంత — పెక్కు ప్రతులు

160 1 పాపుం డవకృత — ఆ. 2 పరగె — కొన్ని ప్రతులు ; ప్రథఁబెరిఁగెఁ (వెలిగెఁ—బరగెఁ) — స ; ప్రథ బెరిగెన్ — వ.ర

161 1. దన విమల బుద్ధి — గ.జ.డ ర.ల. 2. నెందు నధిక సత్త్వ డాస్తీకుడ యనంగ జనులు భువిని — ఏ.గ స; నిందునందు నధిక — ఈ.ఉ.జ. 3 తేజస్వి యస్తీకుం — ఔ జ.ట.డ.త.

162 వ. [1]అట జనమేజయుండు దక్షక విషానలంబునం దన జనకు పంచత్వం బుదంకు వలన నెఱింగి మంత్రులం జూచి యిది యేమి [2] నిమిత్తంబు దీని సవిస్తరంబుగాఁ జెప్పుండనిన మంత్రు లిట్లనిరి.

:- జనమేజయునకుఁ బరీక్షితు శాపకారణంబు మంత్రులు చెప్పుట :-

సం. 1-36-8

163 సీ. అభిమన్యునకు విరాటాత్మజయైన యుత్తరకును బుట్టిన ధర్మమూర్తి
కౌరవాన్వయ పరిక్షయమున నుదయించి [1]ప్రథఁ బరీక్షితుఁడు నాఁబరగు వాఁడు
ధర్మార్థకామముల్ దప్పక సలుపుచుఁ బూని భూప్రజ నెల్లఁ బుణ్యచరిత
ననఘుఁడై రక్షించి యఱువది[2]యేఁడులు రాజ్యంబు సేసిన రాజవృషభుఁ
ఆ. [3]డధిక ధర్మ[4]మార్గుఁడైన నీయట్టి సత్పుత్త్రుఁ [5]బడసి [6]యున్న పుణ్యుఁ డన్య
నాథ మకుట [7]మణిగణప్రభా [8]రంజిత పాదపంకజుండు భరత[9]నిభుఁడు.

164 వ. [1]భవత్పితృ ప్రపితామహుండైన పాండురాజునుంబోలె మృగయాసక్తుండై యొక్కనాఁడు మహా[2]గహనంబులఁ బెక్కు మృగంబుల [3]నెగచి చంపి తన చేత వేటువడి [4]పాఱిన మృగంబు [5]వెంటం దగిలి మహాధనుర్ధరుండై యజ్ఞ మృగంబు పిఱుందం బఱచు రుద్రుండునుం బోలె.

162 1. అంత నొక్కనాడు — ఎ.న ర ; అంతనఁ — మ ; అంత — ఆ. 2. నిమిత్తం బెరుంగుదురేని — ఏ.ఖ మ.

163 1 ప్రథ—పెక్కుప్రతులు; ప్రధ—శ ష ళ. 2 వేలేండ్లు — ఊ ట.డ, యేడేండ్లు — క జ ; యేవేండ్లు — ఐ ద. ప్రజా ఇమా స్తవపితామహష్టి వర్షాణ్యపాలయత్—అని మూలము. 3 డధిక ధర్మమూర్తియైన — అ.ఓ.ర ; డఖిల ధర్మమూర్తి — స. 4. విదుడవైన — ఈ.ఉ.ఊ.ఐ.ఒ.క.జ ద.ల. 5 గాంచి — ఆ ఖ. 6 నట్టి — స. 7 రత్ననానాప్రభాంచిత — న. 8. విలసిత — ఏ ల.స ; భాసిత — ఇ.ఒ స ; పటల సత్పాద — క.గ.ద.ర , పటల శ్రీపాద — ఔ.త.య 9. కులుడు — ఆ మ

164 1 భవత్ప్రపితామహుం — భాసం. వా.శ. కొన్నిప్రతులు భవత్పితృప్రపితా— అను పాఠము ఒ మ. ప్రతుల నుండి గ్రహింపఁబడినది. 2. గహనంబునం — పెక్కు ప్రతులు. 3 నేసి — అ.ఆ , నెగిచి — భాసం. పెక్కు ప్రతులు 4 పారిన యొక్క — అ ఆ.ఉ ఔ.గ.త. 5 వెను — కొన్ని ప్రతులు

165 పృథ్వీవృత్తము. అమిత్ర మదభేది యొక్కరుఁడ [1]యమ్మృగాన్వేషణ
భ్రమాకులిత చిత్తుఁడై [2]తగిలి పాఱుచుఁ ముందటన్
శమీకుఁ డనువాని నొక్కమునిసత్తమున్ సంతత
క్షమాదమ సమన్వితుం గని యెఁ గానసాంతంబునన్.

166 వ. కని మునీంద్రా నాచేత నేటు[1]వడి మృగం బమ్మృగంతోన యిట వచ్చె[2]నది యెక్కడం [3]బాఱె నీ వెఱుం[4]గుదుదేని [5]చెప్పుమనిన నమ్ముని మౌన వ్రతుండు గావునఁ బలుకకున్నం గినిసి తత్సమీపంబున నపగతప్రాణంబై పడియున్న [6]పామును దనవింటి[7]కొప్పున [8]నెత్తి యమ్ముని యఱుతం దగుల వైచి క్రమ్మఱి హస్తిపురంబునకు వచ్చియున్నంత.

167 ఆ. ఆ శమీకుపుత్త్రి డంబుజసంభవు[1]గుఱిచి భక్తితోడ ఘోరతపము
సేయుచున్న సుప్రసిద్ధుండు [2]శృంగియన్ వాఁడు [3]భృంగినముఁ డవంధ్య
కోపి.

168 క. తప జనకు నఱుతఁ బవనాశనశవముఁ దగిల్చి రాజసమునఁ బరీక్షి
[1]జ్జనపాలు చనుట కృశుఁడను మునివలన నెఱింగి కోపమూర్ఛా[2]న్వితుఁడై.

169 వ. శాపజలంబు లెత్తికొని విజనంబైన [1]విపినాంతరంబున విజితేంద్రియుండై మొదవుల చన్నులు వత్సంబులు గుడుచునప్పు డుద్గతంబగు పయః[2]ఫేనంబ తన కాహారంబుగా మౌనవ్రతంబునం దపంబు నేయుచున్న మహావృద్ధు

165 1. దైవ మృగా — స. 2 తరలి — మ.

166 1. వడిన — అ ఆ ఖ.చ.త.న.శ.ష. 2. నది— కొన్నింటలేదు. 3 బారె నెరుంగు దేని — కొన్ని ప్రతులు 4. గుదురేని — కొన్ని ప్రతులు 5 చెప్పుండనిన — ఐ క. 6. బాలపన్నగశవంబు — న ; సర్పము, యురగంబు — కొన్ని ప్రతులు. 7. కొమ్మున — కొన్ని ప్రతులు ; కోపున—కొన్ని ప్రతులు 8 నెత్తి తెచ్చి-డ.న.

167 1. గొలిచి — ఊ.వ. 2. భృంగి — వ ; వహ్ని — ద. 3. శృంగినము డవంధ్య — వా శ.ష మున్నగు ప్రతులు.

168 1. జనవిభుడు — ట.ప. 2. గతుడై — పెక్కు ప్రతులు.

169 1. విపినస్థానంబున — ఖాసం వా.స. కొన్ని ప్రతులు ; విపినంబున — బొ.ఖ.డ త.మ; విపినాంతరంబున — స. 2. ఫేనంబ యాహారంబుగా — ఇ.ఖ.య ; ఫేనం

మదీయ జనకు నవమానించిన పరీక్షితుండు నేఁడుమొదలుగా [3]సప్త[4]దివసంబులలోనఁ [5]దక్షుక విషాగ్ని దగ్ధుండై యమసదనంబున [6]కరిగెడు మని శాపంబిచ్చి తండ్రిపాలికిం జని.

170 క. ఉరగ[1]కళేబర మంసాంతరమునఁ బడి వ్రేలుచునికి దలఁపఁక [2]యచల స్థిరుఁడై పరమ[3]ధ్యానా వరతేంద్రియవృత్తి నున్నవాని శమీకున్.

171 వ. కని యయ్యురగకళేబరంబుఁ బాఱ[1]వైచి తత్క్షణంబ ప్రబుద్ధనయనుండైన తండ్రి [2]కభివాదనంబు సేసి బాష్పపూరిత నయనుండై శృంగి పరీక్షితు నుద్దేశించి తన[3]చేసిన శాపస్థితి సెప్పిన విని శమీకుండు [4]గరంబడలి యిట్లనియె.

172 క. [1]క్రోధమ తపముం జెఱచును గ్రోధమ యణిమాదులైన [2]గుణములఁ బాపుం గ్రోధమ ధర్మక్రియలకు బాధయగుం గ్రోధిగాఁ దపస్వికిఁ జన్నే.

173 క. క్షమలేని తపసితపమును బ్రమత్తు సంపదయు ధర్మబాహ్యు ప్రభు రాజ్యము భిన్న[1]కుంభమున తోయములట్టుల యధ్రువంబులగు [2]నివి యెల్లన్.

బాహారంబుగా — కొన్ని ప్రతులు. 3 సప్తాహంబులలోన — ఓ.బ. 4. దినంబుల— కొన్ని ప్రతులు. 5. దక్షుక దష్టుండై — పెక్కు ప్రతులు, దక్షుక విషానలంబున — బ.స ; దక్షుక విషానల — అ.ర.ల. 6. కరిగెడమని — అ.ఈ ; కరిగెడునని — మ.య.ర.

170 1. కళేబరము గళాంతర — అ ఆ ప.ఓ.య.ర. 2 యునునుస్థిరుడై — చ.శ.ష 3. ధ్యానాపరతేంద్రియ — పెక్కు ప్రతులు; ధ్యానోపరతేంద్రియ — న భాసం ర శ.ష.

171 1 వైచిన — య.ర 2. కభివందనంబు — పెక్కు ప్రతులు 3. యిచ్చిన — అ.ఊ ఔ.క.ఖ.చ త ప.వీ.ష. 4. కరంబు దుఃఖితుండై — స; కడుంబదరి — వ ; కరంబదరి — న; దుఃఖితుండై కరంబలిగి — మ.వ.

172 1. ఈ పద్యము 'య'—లో లేదు 'ర'—లో 'క్షమలేని' — అను పద్యము తరువాత నున్నది ; క్రోధమె — మ. 2. గుణములు చెరుచున్ — త.

173 1. కుంభముల— కొన్ని ప్రతులు. 2. నవి — అ ఊ.ఖ.గ.చ.య.శ.ష.

174 వ. [1]క్షమ విడిచి నీవు దృష్టాదృష్ట [2]విరుద్ధంబైన క్రోధంబుఁ జేకొని సకల
[3]కుమారరక్షకుండైన పరీక్షితునకుం [4]బరీక్షింపక శాపం బిచ్చి చెట్ట [5]సేసితివి
రాజ[6]రక్షితులై కాదె మహామును లతిఘోర తపంబు సేయుచు వేద[7]విహిత
[8]ధర్మంబులు నడపుచు మహా[9]శక్తిమంతు లయి యున్నవా రట్టి రాజుల
కపకారంబు [10]దలంచునంతకంటె [11]మిక్కిలి పాతకం బొండెద్ది [12]మఱియు
భరతకుల [13]పవిత్రుండైన పరీక్షితు రాజసామాన్యుంగా [14]వగచితే.

175 ఉ. క్షత్రియవంశ్యులై ధరణిఁ గావఁగఁ బుట్టినవారు బ్రాహ్మణ
క్షత్రియ వైశ్య శూద్రు లనఁగాఁ గల నాలుగు జాతులన్ [1]స్వచా
రిత్రము దప్పకుండఁగఁ బరీక్షితు కాచినయట్లు రామమాం
[2]ధాతృ రఘుక్షితీశులు ముదంబునఁ గాచిరె యే[3]యుగంబులన్.

176 వ. అతండు మృగయా[1]వ్యసనంబున నపరిమితక్షుత్పిపాసా [2]పరిశ్రాంతుండయి
యెఱుంగక నా కవజ్ఞఁ జేసె నేనును [3]దాని సహించితి [1]నమ్మహాత్మునకు
నీయిచ్చిన శాపంబుఁ [5]గ్రమ్మఱింప [6]నేర్తేని లగ్గగు ననిన శృంగి యిట్లనియె.

174 1 కావున నీ విట్లు క్షమ విడిచి — ల స 2 విరోధియైన — ఇ ఉ ఊ ఒ క డ ద. బ.య; విరోధం బైన — అ.ఎ ఏ ఐ.ఒ.ఓ ఔ — విరుద్ధం బైన — భాసం శ.ష స.శ. 3. క్ష్మారక్షకుండైన — అ ఆ ఔ.మ, క్షమాజనరక్షకుండైన — న, కుమారక్షణదక్షుండైన — ఊ. 4 బరీక్షింపక — లేని ప్రతులు — ఐ.మ. 5. చేసి తదియెట్లనిన — స ; చేసితెట్లనిన — అ.ఔ ల ; చేసితి రాజ రక్షితులై — పెక్కు ప్రతులు. 6. రక్షకులై — పెక్కు ప్రతులు 7. విహితకర్మానుష్ఠానపరులై — అ ; విహి[illegible]ాను ష్ఠాన ధర్మంబులు — శ.ష. మున్నగు ప్రతులు 8 ధర్మమార్గంబులు నడపుచు — న. 9. శక్తిసంపన్నులై యున్న — ఆ 10. దలంచుకంటె — దలంచుటకంటె — దలంచునంతకంటె — దలంచినయంతకంటె — వివిధప్రతులలో. సేయునంతకంటె — వా.శ. 11 మహా — అ యు ; మిక్కిలి — న. లో లేదు. 12. యుం గలదె ఊ.ఔ.క.త న.ప య 13 ప్రదీపకుండైన — అ ఔ.త.ప.య.స. 14. దలంచి తేయని వెండియు నిట్లనియె — ల స ; దలంచితే — పెక్కు ప్రతులు, వగచితే — శ ష.

175 1 స్వచారిత్రలు — ఒ.మ 2 ధాత్రరఘు — ఒ న ; ధాత్ర భగరథాదులు — ఔ; ధాతృభగీరథాదులు — స , ధాతృరఘు — ట. 3. యుగంబునన్ — ఇ.ఔ.ష.

176 1. వ్యసనుండై వనంబున — కొన్ని ప్రతులు ; వినోదంబున — ల. 2. పరవశుండై — కొన్ని ప్రతులు 3. దానికి — అ ఎ.క.య ర ; వానికి — ఔ ఖ. 4. నమ్మహాపురుషునకు — పెక్కు ప్రతులు; నమ్మహాత్మునకు — భాసం. శ.ష.శ. 5. మరల్ప — మ 6. నోపుదేని గ్రమ్మరింపుమనిన విని — ఖ.

177 క. అలుకమెయి మున్న పలికితి [1]నలుకని నాపలుకు తీక్ష్ణమై యింతకు ను
జ్జ్వలదహనాకృతిఁ దక్షకుఁ [2]దలరఁగఁ బ్రేరేప కేల [3]తా నెడ నుడుగున్.

178 వ. నావచనం బమోఘం బనిన శమీకుండు [1]శోకాకులితచిత్తుండై తనశిష్యున్
గౌరముఖుండనువానిం బిలిచి దీని నంతయుఁ బరీక్షితున కెఱింగించి తక్షకు
వలని భయంబు [2]దలంగునట్టి యుపాయంబు సేసికొమ్మని చెప్పి రమ్మనిన
[3]వాఁడు నప్పుడ పరీక్షితు పాలికిం జని యిట్లనియె.

179 సీ. అడవిలో నేకాంతమతి ఘోర[1]తపమున నున్న [2]మాగురులపై నురగశవము
[3]వైచుట విని యల్గి వారితనూజుండు శృంగియన్వాఁడు కార్చిచ్చు[4]నట్టి
శాపంబు నీకిచ్చె సప్తాహములలోన నా [5]పరీక్షితుఁడు నాయలుకఁ జేసి
తక్షకవిషమున [6]దగ్ధుఁడయ్యెడమని దానికి [7]గురులు సంతాప [8]మంది

ఆ. భూతలేశ నన్నుఁ [9]బుత్తెంచి రిప్పుడు [10]తద్భయంబు లెల్లఁ దలఁగునట్టి
మంత్ర తంత్రవిధు లమర్చి యేమఱకుండునది నిరంతరంబు [11]ననియుఁ
[12]గఱప.

180 వ. [1]అనిచెప్పి గౌరముఖుం డరిగినం బరీక్షితుండు పరిక్షీణహృదయుండై తన
చేసిన [2]వ్యతిక్రమంబునకు సంతాపించి శమీకు నుపశమనంబునకు మెచ్చి

177 1. నలుకన—పెక్కు ప్రతులు; నలుకన్ నాపలుకు — మ; నలుకనె - ఆ ఖ ఛాసం. పీ.శ ష; అలుకని నా పలుకు—వా.శ. 2 దలపడి ప్రేరేప—మ. 3. తానెటు లుడుగున్—మ; తానేలుడుగున్—ఈ.ఖ

178 1. శోకవ్యాకులిత—ఎ ద ల 2 దక్కు—అ 3. వాడును— కొన్నిప్రతులు, వాడును బరచి—ర.

179 1 నిష్ఠతో—డ; తపముమై—పెక్కు ప్రతులు. 2. మద్గురుల—ఉ ఓ.జ. 3. వైచుడు—అ.ఇ.బ; వైచుటయును— ఔ 4. వంటి— గ1.ర.ష. 5. పరీక్షితుని... దగ్ధమయ్యెదవన్న—ఔ ఖ. 6. దగ్ధమయ్యెడమని—పెక్కుప్రతులు. 7. గురుడు—ఈ.ఉ.ఖ. 8. మదరి—ఊ.ట. 9. బుత్తెంచె నిప్పుడు—ఖ. బుత్తెంచిరిపుడు—ట. 10. తద్భవభయంబు—ట. 11. ననుచు—ఆ.ఓ.జ ర. 12. గరపి — పెక్కు ప్రతులు.

180 1. 'అని చెప్పి'—కొన్ని ప్రతులలో లేదు. 2. వ్యతిక్రమదోషంబునకు—ల; వ్యతిక్రమంబున కనుతాపించి—ఆ.ఐ.న; వ్యతిక్రమంబున కనుతాపంబు బొంది—ద;

శృంగి శాపంబునకు [3]వెఱచి [4]మంత్రివర్గంబుతో విచారించి యాత్మరక్షయం [5]దప్రమాదుండై.

181 మ. సకలోర్వీశుఁ డతిప్రయత్నపరుఁడై సర్వక్రియా[1]దక్షత
క్షకకోటుల్ పని సేయఁగా ఘనతరైక స్తంభహర్మ్యంబుఁ ద
క్షకభీతిఁ [2]రచియింపఁ బంచి దృఢ[3]రక్షన్ దానిలో నుండె జా
యక [4]రాత్రిం దివ జాగరూక హిత భృత్యామాత్య వర్గంబుతోన్.

182 వ. మఱియు [1]విషాపహారంబులయి [2]వీర్యవంతంబు లయిన మంత్రతంత్రంబులు గలిగి [3]యాజ్ఞాసిద్ధులైన [4]విషవైద్యుల నొద్దఁ బెట్టికొని పరీక్షితుం [5]డుండు నంత [6]నట తక్షకుండు విప్రవచన[7]ప్రచోదితుండయి పరీక్షితునొద్దకు నెవ్విధం బునఁ బోవ[8]నగునోయని [9]చింతించుచుండె [10] నటఁ దొల్లి.

*-: కశ్యపునకుఁ దక్షకుఁడు గోరిన ధనం బిచ్చి మరల్చుట :-*

సం. 1-38-31

183 మధ్యాక్కర. ధరణిఁ జరాచర భూతసంఘంబుఁ దమ విషవహ్ని
నురగంబు లేర్చుచు నునికి [1]కలిగి పయోరుహాగర్భుఁ
డురగ [2]విషాపేత జీవ సంజీవనోపదేశంబు
గరుణఁ [3]గశ్యపునకు నిచ్చె నఖిలలోక హితంబు పొంటె.

వ్యతిక్రమంబునకు పరితాపించి — వ ; వ్యతిక్రమంబున కనులాపించి — వ. 3. నొచ్చి—న 4. మంత్రి పురోహితులతో — ఊ ; మంత్రిగణంబుతో — న. 5. దప్రమత్తుండై —అ న.

181 1. రక్షక—ఆ.మ.ర.శ. 2. సృజియింప—ట.ప. 3. నిష్ఠన్—ఈ. 4. రాత్రిం దివమున్ ప్రజాగరణ—ర.ల.

182 1. విషోప సంహారంబులయి—ఖ.శ.ష.స; విషాపహాంబులయి—ల.వ; విషాపహార ణంబులై —ఈ.ఉ.ఒ.ప.ర 2. మహావీర్య — ఋ.ఖ.చ.త.ప.వా.శ ష. 3. ప్రసిద్ధులైన—ఖ. 4. మంత్రవాదుల—ఔ.త ; విషవాదుల— పెక్కు ప్రతులు. 5. డున్నంత — పెక్కు ప్రతులు. 6. నట—కొన్ని ప్రతులలో లేదు. 7. ప్రబోధితుండై — అ.ఇ.ఈ.ఉ.ఊ.ఎ.న మ య.ర. 8. గలుగునోయని—అ.ట , దగునోయని—ర. 9 విచారించుచుండె— ఈ ఉ , చింతించుచుండ — అ.ఆ.ఇ.ఎ.ద ; చింతించుచున్నంత—ర. 10. నంత—అ.ఇ.ప.

183 1. నలిగి—ట. 2. విషోపేత — ఈ.గ.ట.ప.య. 3. గశ్యపమునికిచ్చె—ఎ ; గరుణ నిచ్చెన్ గశ్యపునకు—ప ర; సంస్కృత ప్రతులలో కాశ్యపుఁడని యేయున్నది.

కిచ్చె నశ్విన్యాదు లైన యిరువదేడ్వురను జంద్రునకిచ్చె నదితి దితిదను కాలా నాయు స్సింహికా ముని కపిలా వినతా క్రోధా [3]ప్రాధా[4]క్రూరా కద్రువ లను పదుమువ్వురను గశ్యపున కిచ్చె నం దదితియను దానికి ధాత్రృ మిత్రార్యమ శక్ర వరుణాంశు భగవివస్వత్పూష సవిత్రృ త్వష్టృ విష్ణు లనంగా ద్వాదశా దిత్యులు పుట్టిరి[5] మఱియును.

62 క. దితి యను దానికి నప్రతి, హతబలుఁడు హిరణ్యకశిపుఁ డనఁబుట్టె సుతుం
డతనికి నేవురు పుట్టిరి, ప్రతాప [1]గుణయుతులు సుతులు ప్రహ్లాదాదుల్.

63 వ. ఆ ప్రహ్లాద సంహ్లాదానుహ్లాద శిబి బాష్కళుల యందుఁ బ్రహ్లాదునకు విరోచన కుంభ నికుంభు లనంగా ముగ్వురు పుట్టిరందు విరోచనునకు బలిపుట్టె బలికి బాణాసురుండు పుట్టె దను వను దానికి విప్రచిత్తి శంబర నముచి [1]పులో మాసి లోమ కేశి దుర్జయాదు లయిన దానవులు నలువండ్రు [2]పుట్టిరి వారల పుత్త్రి పౌత్త్ర [3]వర్గం బసంఖ్యాతంబై ప్రవర్తిల్లెఁ గాల యను దానికి వినా శన క్రోధాదు [4]లెనమండ్రు [5]పుట్టిరి.

64 ఆ. [1]అజితశక్తియుతు[2]ల నాయువ యనుదాని, కజరు లధిక[3]వీరు లతుల భూరి
భుజులు శక్రరిపులు పుట్టిరి నలువురు, [4]విక్షర బలవీర వృత్రు లనఁగ.

3. 'ప్రావా', 'ప్రాధా' అనురూపములు సంస్కృతమూలముల గలవు. 4. 'అరిష్టా' భం. కొన్నిసంస్కృత ప్రతులలో 'క్రూరా' అనియు గలదు. 5. ఈ వచనముల యందెల్ల నామమాలలు అన్యోన్య విరుద్ధములై సంస్కృతముతో వివదించుచున్నవి

62 1. గుణ—మ య ర.ల స గుణహేతులు—న.వ; బలయుతులు — వా; ప్రతాప దర్ప యుత సుతులు ప్రహ్లాదాదుల్ — హె.జ.ట.ప.

63 1 పులోమ ప్రముఖులైన దానవులు నలువుండ్రు — పెక్కు ప్రతులు. 2. పుట్టిరి మరియు దను వంశంబున ననేక రాక్షసులు పుట్టిరి. అమృత ప్రలంబ నరక వాతాపి శత్రుతపన సవ దనిష్టదనాయు దీర్ఘజిహ్వులను పదుండ్రు దానవులు పుట్టిన—ద; దను పుత్త్రా మహారాజ దశదానవ పుంగవాః ఏకాక్షోమృత హావీరః ప్రలంబ నరకావపి వాతాపిశ్శత్రుతపనశ్శఠశ్చైవ మహాసురః గవిష్ఠశ్చవ నాయుశ్చ దీర్ఘజిహ్వాశ్చ దానవః భం. 1—59—27, 28.3 సంఘాతంబు — ద. 4 లైన వా రెనమండ్రు—య 5. పుట్టిరి మరియును—క.ర

64 1. అధిక—ఆ.హె.ర; అమిత—య; అతుల—స. 2 అనాయుష—ఆ.ఈ ఉ.బు. ఏ.శ; అనాయుషి — య అనాయుః [ప్రథమ] [అనాయుషః (షష్ఠి) మూలము] 3 వీర్యు—ఉ ఒ వా శ. 4 విజయధీరవీర వృత్రులనఁగ; వీరబల తితిక్షు వితుతులన, విజయ వీర విలయ వృతులనంగ — ఇత్యాదిగాపాఠ భేదము లెన్నో యున్నవి. కాని మూలమున "విక్షరో బలవీరేచ వృత్రశ్చైవ మహాసురః" భం. 1—59—32.

65 వ. మఱియు సింహిక యను దానికి రాహువుపుట్టె ముని యను దానికి భీమసేనోగ్రసేనాదు లయిన గంధర్వులు పదార్వురు పుట్టిరి [1] కపిల యను దానికి నమృతంబును గో[2]గణంబును[3] బ్రాహ్మణులును ఘృతాచీ మేనకాదు లయిన యప్సరసలును బుట్టిరి వినత యనుదానికి ననూరుండును గరుడండును బుట్టిరం దనూరునకు [4]శ్యేని యను దానికి సంపాతి జటాయువులు పుట్టిరి [5]క్రోధ యను దానికిఁ గ్రోధవశగణంబు పుట్టెఁ [6]బ్రాధ యనుదానికి సిద్ధాదులు పుట్టిరి క్రూర యనుదానికి సుచంద్ర చంద్ర హంత్రాదులు పుట్టిరి కద్రువ యనుదానికి [7]శేష వాసుకి [8]పురోగమానేక భుజంగముఖ్యులు పుట్టిరి.

66 సీ. మఱి యంగిరసుఁడను మానసపుత్త్రున క[1]య్యుతథ్యుండు బృహస్పతియును
సంవర్తుఁడును గుణాశ్రయ[2]యోగసిద్ధి యన్కూఁతురు బుట్టి రక్కొఁడుకులందు
[3]విభుఁడు బృహస్పతి వేల్పుల కాచార్యుఁడై లోక[4]పూజితుఁడై వెలింగె
మానుగా నత్రి యన్మానసపుత్త్రున కుద్భవించిరి ధర్మయుతచరిత్రు

ఆ. లఖిల వేద[5]వేదు [6]లార్యు లనేకులు, దీప్తరవి సహస్రతేజు లనఘు
లధిక తర తపోమహత్త్వ సంభృతవిశ్వ, భరులు సత్యపరులు పరమమునులు.

65 1 సురభి— పెక్కు ప్రతులు, మూలమునందు కపిల యనియే కలదు. అమృతం బ్రాహ్మణాగావో గంధర్వాప్సరసస్తథా। అపత్యం కపిలాయాస్తు పురాణేపరికీర్తితం 1—59—50 — భం 2. గణంబులును — వా. శ. కొన్ని ప్రతులు 3 మేనకా సహ జన్యాదులయిన — పెక్కు ప్రతులు. 4. శేని — వా. కొన్ని ప్రతులు 5. సింహికా సుషువే పుత్రం రాహుం చంద్రార్క మర్దనం సుచంద్రం చంద్ర హన్తారం తథా చంద్ర విమర్దనమ్ క్రూరస్వభావం క్రూరాయాః పుత్రపౌత్ర మనంతకమ్. భం. 1—59—30, 31. 6. అనుగ — పెక్కుప్రతులు 7. శేషోఽనన్తో వాసుకిశ్చ తక్షకశ్చ భుజంగమః కూర్మశ్చ కులికశ్చైవ కాద్రవేయా మహాబలాః — భం 1—59—40 8. ప్రముఖానేక—ఆ

66 1. య్యుచథ్యుండు—స; భండార్కరు ప్రతియందు ఉతథ్యుఁడుఅనియే గ్రహింపఁబడెను. పాదసూచికయందు 'ఉచథ్య' అనుపాఠమును గలదు 2 యోగసిద్ధా — అని భం 3. విభుడు—స. పెక్కుప్రతులు ; వినుము — వా. 4. సంపూజ్యుఁడై — మ. 5. వేద్యు—పెక్కు ప్రతులు 6 లాద్యుల— వా.శ పెక్కు ప్రతులు.

67 వ. మఱియుఁ [1]బులస్త్యుండను మానసపుత్త్రునకుఁ [2]ననేక రాక్షసులు పుట్టిరి పులహుండను మానస పుత్త్రునకుఁ గిన్నర కింపురుషాదులు పుట్టిరి క్రతు వను మానస పుత్త్రునకు సత్యవ్రత పరాయణు లైన పతంగ సహ చరులు పుట్టిరి[3] పైతామహుండై న దేవుండను [4]మునికిఁ బ్రజాపతి పుట్టె వానికి ధూమ్రా బ్రహ్మవిద్యా మనస్వినీ [5]రతా శ్వసా శాండిలీ [6]ప్రభాత లనంగా నేడ్వురు భార్యలై రందు ధూమ్రకు ధరుండును బ్రహ్మవిద్యకు ధ్రువుండును మనస్వినికి సోముండును రతకు నహుండును శ్వసకు ననిలుండును శాండిలికి నగ్నియుఁ [7]బ్రభాతకుఁ బ్రత్యూష ప్రభాసు [8]లనంగా నెనమండ్రు వసు వు[9]లు బుట్టి రందు ధరుండను వసువునకు ద్రవిణుండును [10]హుతహవ్యవ హుండునుం [11]బుట్టిరి ధ్రువుండను వసువునకుఁ గాలుండు పుట్టె సోముం డను వసువునకు మనోహర యనుదానికి వర్చసుండును [12]శిరుండును బ్రాణుండును రమణుండును బృథయను కూఁతురునుం బుట్టిరి పృథకుఁ బదుండ్రు [13] గంధర్వపతులు పుట్టిరి నహుండను వసువునకు జ్యోతి పుట్టె ననిలుం డను వసువునకు శివ యను దానికి [14]పురోజవుండును నవిజ్ఞాతగతియునుం బుట్టిరి యగ్ని యనువసువునకుఁ గుమారుండు పుట్టెఁ బ్రత్యూషుం డను వసువునకు ఋషి యైన దేవలుండు పుట్టెఁ బ్రభాసుండను వసువునకు బృహ స్పతి చెలియలై న యోగ[15]సిద్ధికి విశ్వకర్మపుట్టె.

67 1. పులస్తి యను– కొన్ని ప్రతులు. 2 ననేకులు — అ ఇ గ.ట.డ.న య.ర రాక్షసాస్తు పులస్త్యస్య వానరాః కింనరాస్తథా। పులహస్య మృగాః సింహాః వ్యా ఘ్రాఃకింపురుషాస్తథా॥ భం ఈ వచనములు వంశక్రమము విషయమునను పేళ్ళవిష యమునను మూలముతోడను పరస్పరమును విరుద్ధములై యున్నవి పులహస్య మృగాస్సింహాః వ్యాఘ్రాయక్షా మహా మృగాః —॥ పి.పి.ఎస్ ॥. రాక్షసాశ్చ పులస్త్యస్య వానరాః కిన్నరాస్తథా యక్షాశ్చ మనుజవ్యాఘ్ర పుత్రాస్తస్యచధీరత॥ వావిళ్ల॥ 3. ఈ వాక్యము వావిళ్ళ వారి సంస్కృత భారతముతో సరిపోవుచున్నది. "పితామహో మునిర్దేవః తస్య పుత్రః ప్రజాపతిః॥ భం 1–60–16, పితా మహో న్మునిర్దేవః తస్యపుత్రః ప్రజాపతిః॥ పి పి ఎస్ ॥ ఇక్కడ పాదసూచియందు 'పైతా మహా, మనుర్దేవ' అని యున్నది. 4. మునికి– పెక్కు ప్రతులు ; దేవ మునికి —స. దేవుండను మనువునకు – వా. 5. రసా—పి.పి.ఎస్. గ్రి$_1$. 6. ప్రభాస– పెక్కు ప్రతులు. మూలమునందు ప్రభాత అనియే కలదు 1–60–19. 7. ప్రభాస – పెక్కు ప్రతులు. 8. ప్రభాసులుననంగా—అని యుండ నోపు 9 లును — వా. కొన్ని ప్రతులు. 10. హుతహవ్యవహుడు — పెక్కు తెలుఁగు తాళపత్ర ప్రతులలో లేదు కాని మూలమున గలదు 11 పుట్టె – న. 12. శిబిరుండు — వా. 13. గంధర్వులు – పెక్కు ప్రతులు 14. పురోజవుండు—భం. పి.పి.ఎస్. పెక్కు తాళ పత్రప్రతులు; మనోజవుఁడు – వా. భండార్కరు పాదసూచి 1–60–24 15. సిద్ధ – మూలము.

68 క. ఆ విశ్వకర్మ నిర్మిత. దేవ విమానుండు నిఖిల దివ్యాభరణ
శ్రీ [1]విరచన పరితోషిత, దేవుఁడు శిల్ప ప్రజాపతియు [2]నై నెగడెన్.

69 వ. మఱియు స్థాణునకు మానసపుత్త్రులైన మృగ వ్యాధ శర్వ నిరృత్య జైకపాద హిర్బుధ్న్య పినాకి [1]దహనేశ్వర కపాలి స్థాణు [2]భవు లనంగా నేకాదశ రుద్రులు పుట్టిరి [3]మఱి బ్రహ్మ దక్షిణ స్తనంబున ధర్ముండను మనువు పుట్టె వానికి శమ కామ హర్షు లనంగా మువ్వు[4]రు పుట్టిరి యామువ్వురకుఁ గ్రమంబునఁ బ్రాప్తి రతి [5]నందు లనంగా మువ్వురు భార్యలైరి సవితృనకు బడబా రూపధారిణి యైన త్వాష్ట్రికి [6]నశ్వినులు పుట్టిరి బ్రహ్మ హృదయంబున భృగుండు పుట్టె వానికిఁ గవిపుట్టె వానికి శుక్రుండు పుట్టి యసురుల కాచార్యుండయ్యె వానికిఁ [7]జండామర్క [8]త్వష్టృ ధరాత్త్రు లనంగా నలువురు గొడుకులు పుట్టిరి వా రసురులకు [9]యాజకులైరి మఱియును.

70 సీ. [1]విగతాఘుఁడైన యా భృగునకుఁ బుత్త్రుఁడై చ్యవనుండు పుట్టె భార్గవ [2]వరుండు
జనవంద్యుఁ డతనికి మను[3]కన్యకకుఁ బుట్టె నూరుల [4]నౌర్వుండు భూరికీర్తి
యతనికి నూర్వురు [5]సుతులు ఋచీకాదు లుదయించి రఖిల భూవిదిత తేజు
[6]లందు ఋచీకున కొందంగ జమదగ్ని యను ముని పుట్టె నాతనికిఁ బుట్టి

68 1. విరచిత — పెక్కు తాళపత్రప్రతులు 2. నైపరగెన్ – పెక్కు ప్రతులు; ననబరగెన్ – ఊ డ.ర.

69 1 భవనః – పి పి.ఎస్; వామదేవుడని కొన్ని తాళపత్రప్రతులలో కలదు. కాని దానికి మూలము కనబడలేదు 2. భగ్గు— వా భవః—అనిమూలము. పెక్కు తాళపత్ర ప్రతులు 3. "మఱి" పెక్కు ప్రతులలో లేదు. 4. రు కొడుకులు—ఈ న. 5 నందీతు భార్యాహర్షస్య అనిమూలము 6 నాశ్వినులు—వా ళ 7. జండామర్క – పెక్కు ప్రతులలో లేదు. 8 త్వష్ట్రిధాతృభద్ర కర్ములనంగా – న. పెక్కు ప్రతులు. 9. యాజకులైరి — పెక్కుప్రతులు; యాజ్ఞికులైరి – వా మూలము– అసురయాజకాః 1–59–35.

70 1. విగతాశుడైన – ఊ.ప 2. కులుండు — య. 3. కన్యకును – ఇ.ఒ ఔ.బ. 4 నౌర్వుడన్భూరి కీర్తి — అ.ఒ.గ.జ ద న.ర. 5. సుతవరుల్ ఋచికాదులు — పెక్కుప్రతులు, ఋచీకస్తస్య పుత్రస్తు. భం. 1–60–46. 6. లందు నాఋచికున—

ఆ. రలఘుమతులు సుతులు నలువురు వారిలోఁ, బరశురాముఁడాదిపురుష[7]మూర్తి
దండితాహితుండు [8]గొండుక యయ్యును, దద్గుణములందుఁ బెద్ద యయ్యె.

71 వ. మఱియు బ్రహ్మకు [1]ధాతయు విధాతయు ననంగా నిద్దఱు మను సహాయులై పుట్టిరి వారి[2]తోడన లక్ష్మి పుట్టె [3]దానికి మానసపుత్త్రి లనేకులు [4]పుట్టిరి వరుణునకు జ్యేష్ఠకు బలుండును [5]సుర యను కూఁతురునుం బుట్టిరి సురయందు ధర్ముండు పుట్టె నాయధర్మునకు నిరృతికి భయ మహాభయ మృత్యువు లనఁగా మువ్వురు పుట్టిరి మఱియుఁ [6]దామ్రకుఁ గాకియు శ్యేనియు భాసియు ధృతరాష్ట్రియు శుకియు నన నేవురు[7]కన్యలు పుట్టిరి యందుఁ గాకి యను దానికి [8]నులూకంబులు పుట్టె శ్యేనియను దానికి [9]శ్యేనంబులు పుట్టె భాసి యను దానికి భాసగృధ్రాదులు పుట్టె ధృతరాష్ట్రి యను దానికి హంస చక్ర[10]వాకంబులుపుట్టె శుకియను దానికి శుకంబులు పుట్టె మఱియుం[11]గ్రోధు నకు మృగియు మృగమందయు హరియు [12]భద్రమనసయు మాతంగియు శార్దూలియు శ్వేతయు సురభియు సురసయు [13]ననఁ దొమ్మండ్రు పుట్టి రందు మృగియను దానికి మృగంబులు పుట్టె మృగమంద యనుదానికి ఋక్ష చమర [14]సృమరాదులు పుట్టె హరి యనుదానికి వానరగణంబులు పుట్టె భద్ర

న యు.స. పెక్కు ప్రతులు 7. నిసుడు – పెక్కు ప్రతులు. 8. గొండిక — ఇ.ఔ.చ.న.ర.శ ష స, గొండొ — మ యు.స; కొండిక — కొన్ని ప్రతులు

71 1 ద్వౌపుత్రౌ బ్రహ్మణ స్త్వన్యౌ యయో స్తిష్ఠతి లక్షణమ్ లోకేధాతా విధాతాచ యౌస్థితౌ మనునాసహ॥ 1–60–49 ఇచ్చట ఔప్రతిలో సూర్య చంద్ర వంశరాజుల పట్టికతోఁ గూడిన పెద్ద వచన మున్నది 2. తోడనె (న) లక్ష్మియుంబుట్టె — పెక్కు ప్రతులు 3. దానికి — పెక్కు ప్రతులు, లక్ష్మికి – వా. 4. పుట్టిరి మఱియు—పెక్కుప్రతులు. 5 తస్యాః పుత్రం బలం విద్ధి సురాం చ సురనందినీమ్. 1–60–51. సురనందిని యని కొన్ని ప్రతులు. 6 వారికి — ఇ.ఈ ఉ ఊ. ఋ ఎ. ఏ ఓ. జ. త ప బ.; ఇచ్చట మూలమున 'తామ్ర' అని కలదు. తామ్రాతుసుషువేదేవి 1–60–54 వానికి — ఐ.డ 7. కన్యకలు పెక్కు ప్రతులలో లేదు ; కూఁతులు – జ.ఢ ర. 8. గాకో లూకంబులు పుట్టె — పెక్కు ప్రతులు. 9. శ్యేన కపోతంబులు – పెక్కు ప్రతులు ; శ్యేన గృధ్రాదులు — త. 10. వాకబక బలాక టిట్టిభంబులు — పెక్కు ప్రతులు. 11. నవక్రోధవశా నారీః ప్రజజ్ఞే ప్యాత్మసంభవాః మృగీంచమృగ మందాంచ హరిం భద్ర మనామపి. భం. 1–60–59; కశ్యపునకు మృగియనుదానికి — పెక్కుప్రతులు. 12 భద్రమదయు — ర , భద్రమందయు — కొన్ని ప్రతులు ; భద్రమతియు — ఆ.న. 13. ననలయు ననఁబదుండ్రు — శ.ష; ఐ బ.మ యు.ర. లలో సురభి లేదు – ఎనమండ్రు పుట్టిరని కలదు. 14. సృమర — కొన్ని ప్రతులలో లేదు.

మనస యనుదానికి [15]నైరావణంబు పుట్టెనైరావ[16]ణంబునకు దేవనాగంబులు పుట్టె మాతంగి యనుదానికి [17]గజంబులు పుట్టె శార్దూలి యనుదానికి సింహ వ్యాఘ్రంబులు పుట్టె శ్వేత యనుదానికి దిగ్గజంబులు పుట్టె సురభి యను దానికి [18]రోహిణియు గంధర్వియు [19]ననలయు ననం బుట్టి రందు రోహిణికిఁ బశుగణంబులు పుట్టె [20]గంధర్వి [21]యనుదానికి హయంబులు పుట్టె ననలకు గిరి వృక్ష లతా గుల్మంబులు పుట్టె [22]సురసకు సర్పంబులు పుట్టె నిది [23]సకల భూత సంభవ ప్రకారంబు.

72 చ. దివిజమునీంద్రదానవదితి ప్రభవాది సమస్త భూత సం
భవముఁ గృతావధాను లయి భక్తిమెయిన్ విను[1]చున్న పుణ్యమా
నవులకు [2]నిక్కువం బగు మనఃప్రియ నిత్యసుఖంబులుం జిరా
యువు బహుపుత్త్రలాభ[3]విభవోన్నతియుఁ దురి[4]తప్రశాంతియున్.

*—: దేవదానవాద్యంశములచే భూమియందుఁ బుట్టిన వారి క్రమము :-*
సం. 1—57-84

73 వ. మఱియు మర్త్యలోకంబునందు దేవ దైత్య [1]దానవుల యంశావతారంబు[2]ల వివరించెద వినుము.

15. నైరావతంబు – కొన్ని ప్రతులు. 16. వతంబు — పెక్కు ప్రతులు. 17. మాతంగంబులు—అ.ప క మదగజంబులు – ద 18. రోహిణియు భద్రాంగియు; పెక్కుప్రతులు. తథా దుహితరౌ రాజన్ సురభిర్వై వ్యజాయత రోహిణీం చైవ భద్రం తే గంధర్వీంతుయశస్వినీమ్ భం 1—60—64 19 ననలయు—అనునది పెక్కు ప్రతులలో లేదు విమలామపి భద్రం తే హ్యనలామపి భారత — వావిళ్ల వారి తెలుఁగులిపి ప్రతి 20. భద్రాంగికి — పెక్కు ప్రతులు. 21. యనుదానికి... ......ననలకు — పెక్కు ప్రతులలో లేదు సప్తపిండ ఫలాన్‌వృక్షా ననలాపి వ్యజాయత. భం 1—60—66 22. సురసకు...... పుట్టె — కొన్ని ప్రతులలో లేదు (గృ) రుహయను దానికి వృక్షంబులును వీరుధయను దానికి లతాగుల్మంబులును బుట్టె — ద పుష్పైః ఫలగ్రహాన్ వృక్షాన్ రుహాయాః ప్రసతాన్ విభో... లతాగుల్మానివల్ల్యశ్చ త్వక్సార తృణజాతయః వీరుధాయాః ప్రజాస్తాస్యుః —పి.పి. యస్ 1—57—74,75. 23 సకల చరాచరభూత — ఊ బ

72 1 చుండు — పెక్కు ప్రతులు. 2 విశ్రుతంబగు — జ.ఢ. 3. విభవోన్నతులున్— అ.ఉ ఎ ప ఐ.గ జ.ట.డ.త.ప.బ య. 4. తోపశాంతియున్ — జ డ.

73 1. దానవాదుల — అ.ప ఐ.క.గ.న ; దానవయక్ష పక్షిగంధర్వాదుల యంశావతారంబున ప్రభవించిన వారల తెరంగు వినుము — ఊ ఓ.య. 2. ల వివరించెద — పెక్కుప్రతులలో లేదు ; లుచెప్పెద — ఔ.

74 క. యాదవవంశంబున [1]జగ, దాదిజుఁడగు విష్ణుదేవు నంశంబున ను
త్పాదిల్లెఁ గృష్ణుఁ [2]డపగత, ఖేదుఁడు వసుదేవ దేవకీదేవులకున్.

75 క. [1]శ్రీ[2]వెలుఁగ [3]రోహిణికి వసు,దేవున కుదయించె విష్ణుదేవాంశమునన్
భూవంద్యుఁ డనంతుఁడు బల,[4]దేవుండు ప్రలంబముఖ్య దితిజాంతకుఁడై.

76 వ. [1]మఱియు సనత్కుమారు నంశంబునఁ బ్రద్యుమ్నుండు పుట్టె నప్సరసల యంశంబులఁ గృష్ణుని షోడశసహస్రాంతఃపుర వనితలు పుట్టి రయ్యాయి వేల్పుల యంశంబుల[2]యదువృష్ణిభోజాంధక [3]వంశంబుల [4]వీరు లనేకులు పుట్టిరి [5]మఱియు.

77 క. ముదమునఁ బ్రభాసుఁ డను నెని,మిది [1]యగు వసునంశమునను మేదిని భీష్ముం
డుదయించె సర్వవిద్యా,విదుఁ డప[2]జిత పరశురామ వీర్యుఁడు [3]బలిమిన్.

78 క. [1]అనఘుఁడు సురగురు నంశం,బునను భరద్వాజు కలశమునఁ బుట్టె శరా
సన విద్యాచార్యుఁడు [2]భూ,[3]వినుతుఁడు ద్రోణుండు నిఖిల వేదవిదుండై.

74 1 జగదధీశుడగు — ఊ.ప ఓ క ట ప ద.య; జగదాధారుడు విష్ణు — జ; 2. డనుగత ఖేదుడు — ము

75 1 ఈ పద్యము ఎ ప్రతిలో లేదు 2. వెలయు — ఇ.య; వెలయ — ర కొన్ని ప్రతులు. 3 రోహిణీ వసుదేవులకుదయించె — న. 4. దేవుఁడన — ర.

76 1 లక్ష్మియంశంబున... రుక్మిణి యుదయించె — సనత్కుమార — వా శ.శ ష. 2. వృష్ణియదుభోజాంధక — వా.శ. కొన్ని ప్రతులు 3 వంశంబుల యంద నేక — ఇ.ఊ.ప.మ. 4 వీరుల — కొన్ని ప్రతులలో లేదు 5. మఱియు — పెక్కు ప్రతులలో లేదు.

77 1. యవ — $గ్రి_1$.చ.శ.ష 2. గత — గ.$గ్రి_1$ చ.ల.ష. 3. పోరన్ — ర.స.

78 1 అనఘుడగుశుక్రునంశం—ల.స; అనఘుడయి శుక్రు_య.ర; అనఘుండై శుక్రాంశం— ము; ద్రోణుఁడు శుక్రునంశమునఁ బుట్టినట్లు ఆధారము లేదు. ఇచ్చట మూలము 'బృహస్పతేర్బృహత్కీర్తే ర్దేవర్షేర్విద్ధిభారత అంశాద్ద్రోణం సముత్పన్నమ్ భారద్వాజమయోనిజమ్' 1–61–63. 2. జన—య. 3. వినుతుండగు ద్రోణుఁ డఖిల విద్యావిదుఁడై — స.

79 క. [1]అలఘుఁడు కామక్రోధా,ముల [2]యేకత్వమునఁ బుట్టె ద్రోణునకు మహా
బలుఁ డశ్వత్థామ రిపు,ప్రళయాంతకుఁ డస్త్రశస్త్ర [3]పరిణతుఁ డగుచున్.

80 వ. [1]మఱియు నేకాదశ రుద్రుల యంశంబునఁ గృపుఁడు పుట్టె సూర్యునంశంబునఁ గర్ణుండు పుట్టె ద్వాపరాంశంబున శకుని పుట్టె [2]నరిష్టాపుత్త్రుం డయిన హంసుండను గంధర్వ [3]విభుండు ధృతరాష్ట్రుం డయి పుట్టె [4]మతి యను వేల్పు గాంధారియై పుట్టె [5]నయ్యిద్దఱకుం గలియంశంబున దుర్యోధనుండు పుట్టెఁ బౌలస్త్యభ్రాతృవర్గంబు [6]దుశ్శాసనాది దుర్యోధనానుజశతంబై పుట్టె హిరణ్యకశిపుండు శిశుపాలుండై పుట్టె [7]సంహ్లాదుండు శల్యుండై పుట్టె [8]నను హ్లాదుండు ధృష్టకేతుండై పుట్టె శిబియనువాఁడు [9]ద్రుముఁడై పుట్టె బాష్కళుండు భగదత్తుఁడై పుట్టె విప్రచిత్తి యను దానవుండు జరాసంధుండై పుట్టె నయశ్శిరుండును నశ్వ[10]శిరుండును నయశ్శంకుండును గగన మూర్ధుండును వేగవంతుండును నను వారేవురు దానవులు గేకయరాజు లయి పుట్టిరి కేతుమంతుం డమితౌజుండై పుట్టె స్వర్భానుం డుగ్రసేనుండై పుట్టె జంభుండు విశోకుండై పుట్టె నశ్వపతి కృతవర్మయై పుట్టె వృషపర్వుండు దీర్ఘప్రజ్ఞుండై పుట్టె నజరుండు మల్లుండై పుట్టె నశ్వగ్రీవుండు రోచమానుండై పుట్టె సూక్ష్ముండు బృహద్రథుండై పుట్టెఁ దుహుండుఁ డనువాఁడు సేనాబిందుండై పుట్టె నేకచక్రుండు ప్రతివింధ్యుండై పుట్టె విరూపాక్షుండు చిత్రవర్మయై

79 1. అలుకమెయి — వ 2. యంశంబునందు — అ బు బౌ ద స 3. పరిణత మతియై — ఇ ఉ బు ఐ ఒ.క త.ద. న.స; పరిణతు డుర్విన్ — అ ఈ ఊ ఎ ఏ. గ డ ఒ య ర.

80 1 మఱి — ర. 2 నరిష్ట పుత్త్రుండయిన — పెక్కు ప్రతులు 3 పతి — పెక్కు ప్రతులు 4. సుమతి — అ.బౌ జ.ద.త భం (పారాం) 5 మఱియు నయ్యిద్దఱకుం — చ త వా.శ.ష ళ, నయ్యిరుపురకు — ఈ ఉ.ట న. 6 దుశ్శాసనాది — కొన్ని ప్రతులలో లేదు. కాని మూలమున గలదు. పౌలస్త్యా భ్రాతరస్సర్వే జజ్ఞిరే మనుజేష్విహ శతం దుశ్శాసనాదీనాం సర్వేషాం క్రూరకర్మణాం 1—61—82 7. సంహ్రాదుఁడు — భం. 8. ననుహ్రాదుండు — భం. 9. ద్రుమ ఇత్యభివిఖ్యాతః —సంస్కృతమూలము ; ద్రుమసేనుండై — వా.శ; గం ద్రుమసేనుఁడై పుట్టెనని మూలము 1—61—32 10. శీర్షుండు — వా.శ. అయశ్శిరా

పుట్టె [11]హారుండును నహరుఁడును సుబాహుబాహ్లికులై పుట్టిరి [12]చంద్రవర్మ్రుండు ముంజకేశుండై పుట్టె నికుంభుండు దేవాపియై పుట్టె శరభుండు సోమదత్తుండై పుట్టెఁ జంద్రుండు [13] చంద్రవర్మయై పుట్టె నర్కుండు ఋషికుండై పుట్టె మయూరుండు [14]విశ్వుండై పుట్టె సుపర్ణుండు [15]క్రోధకీర్తియై పుట్టె రాహువు క్రోధుండై పుట్టెఁ జంద్రహంత శునకుండై పుట్టె నశ్వుం డనువాఁ డశోకుండై పుట్టె భద్రహస్తుండు నందుండై పుట్టె దీర్ఘజిహ్వుండు గాశిరాజై పుట్టెఁ జంద్రవినాశనుండు జానకియై పుట్టె [16]బలీనుండు పౌండ్రమత్స్యుండై పుట్టె వృత్రుండు మణిమంతుండై పుట్టె [17]గాలాపుత్త్రులెనమండ్రు క్రమంబున జయత్సేనాపరాజిత [18]నిషాదాధిపతి శ్రేణిమన్మహౌజోఽభీరు సముద్రసేన బృహత్తులై పుట్టిరి క్రోధవశ[19]గణంబు వలన మద్రక కర్ణవేష్ట సిద్ధార్థ కీటక సువీర సుబాహు మహావీర బాహ్లిక క్రథ విచిత్ర సురథ శ్రీమన్నీల చీరవాసో భూమిపాల దంతవక్త్ర రుక్మి జనమేజయాషాఢ వాయువేగ భూరితేజ ఏకలవ్య సుమిత్ర వాటధాన గోముఖ కారూషక క్షేమధూర్తి శ్రుతాయు రుద్వహ బృహత్సేన క్షేమాగ్రతీర్థ కుహర మతిమదీశ్వరాదులనేకులు పుట్టిరి కాలనేమి కంసుండై పుట్టె స్త్రీపుంస రూపధరుం

అశ్వశిరా అయశ్శంకుశ్చవీర్యవాన్. 1-61-10 11 హర స్త్వరిహరోవీర ఉ ఆసీ ద్యోదానవో త్తమః సువాస్తు (సుబాహు) రితివిఖ్యాతః సజజ్ఞేమనుజర్షభః అహరస్తు మహాతేజాః శత్రుపక్షక్షయంకరః బాహ్లికోనామరాజా స బభూవ ప్రథితక్షితౌ 1-61-24,25. 12 నిచంద్రశ్చంద్ర వక్త్రశ్చ — అని మూలము 13. చంద్రస్తు దితిజశ్రేష్ఠో లోకేతారాధిపోపమః చంద్రవర్మేతి విఖ్యాతః కాంభోజానాం నరాధిపః పి పి ఎస్ అర్క-ఇత్యభివిఖ్యాతోయస్తు దానవపుఙ్గవః ఋషికో (ఋషికో) నామరాజా ఉఽ సీత్ బభూవ ఋషిసత్తమః 14. వసుండై — వా 15. కాలకీర్తి — భం. 16. బలవీర — భం, ప్రవీర - పి.పి ఎస్. 17 కాలకాయాస్తు — భం. 18. నిషధాధిప — వా.శ

19 క్రోధోవిచిత్ర్యః సురసః శ్రీ మాన్నీలశ్చ భూమిపః వీరధామాచ కౌరవ్య భూమిపాలశ్చ నామితః దంతవక్త్రశ్చ నామాసీత్ దుర్జయశ్చైవ నామతః రుక్మీచ నృపశార్దూలో రాజాచ జనమేజయః ఆషాఢో వాయువేగశ్చ భూరితేజా స్తథైవచ ఏకలవ్య స్సుమిత్రశ్చ వాటధానో ఉథ గోముఖః కారూపకాశ్చ రాజానః క్షేమధూర్తి స్తథైవచ శ్రుతాయు రుద్ధవశ్చైవ బృహత్సేన స్తథైవచ క్షేమోగ్రతీర్థః కుహరః కలింగేషునరాధిపః మతిమాన్ శ్చ మనుష్యేంద్ర ఈశ్వరశ్చేతివిశ్రుతః గణాత్క్రోధవశాదేవం రాజపూగో ఉభవత్క్షితౌ — ఇందు వేరే అచ్చులో నున్న పదములు తెలుఁగుతో సమన్వయించుచున్నవి. తక్కినవి కొంచెము భిన్నముగా నున్నవి "మద్రక"

డైన గుహ్యకుండు శిఖండియై పుట్టె మరుద్గణాంశంబునఁ బాండురాజు పుట్టె.

81 క. మరుతుల యంశంబునఁ బుట్టిరి ముప్వురు వివిధ రణ[1]పటిష్ఠ బలులు సు
స్థిరయశులు ద్రుపద సాత్యకి, విరాట భూపతులు భువనవిశ్రుత [2]చరితుల్.

82 క. మాండవ్యుం డను మునివరు, చండతర క్రోధజనిత శాపంబున ధ
ర్మ్మం డఖిల ధర్మతత్త్వవి,దుం[1]డగు విదురుఁ డనఁ బేర్మితో నుదయించెన్

83 క. ప్రియ మొనరఁగ సిద్ధియు బు,ద్ధియు ననుదేవతలు వసుమతిని గుంతియు మా
ద్రియునై పుట్టిరి పాండు, ప్రియ పత్నులు నిఖిల జగదభీష్ట చరిత్రల్.

84 సీ. యమునంశమునఁ బుట్టె నధిపతి ధర్మజుం డనిలాంశమునఁ బుట్టె ననిల[1]జుండు
శక్రాంశమున ధనంజయుఁ డుదయించె [2]నశ్వినులయంశము[3]ల నూర్జితులు నకుల
సహదేవులనవద్య చరితులు పుట్టిరి శ్రీమూర్తియై యాజ్ఞసేని పుట్టె
నగ్నియంశమున జితారి ధృష్టద్యుమ్నుఁ డనఁ బుట్టె ద్రుపదరాజాన్వయమున

ఆ. ననఘ యిది సురాసురాంశావ[4]తారకీ, ర్తనము దీని [5]భక్తిఁదవిలి వినినఁ
జదివి నను సమస్త జనులకు నఖిల దే,వాసురాదు లిత్తు రభిమతములు

85 వ. అనిన విని జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె.

మొదలు "బాహ్లీక" వరకు కొన్ని పేర్లు మూలమునలేవు తాళపత్ర ప్రతులీ పేర్ల విష యమున మిక్కిలి భేదించుచున్నవి

81 1. వరిష్ఠ — ప; ప్రకృష్ట — త. 2. శౌర్యుల్ — పెక్కు ప్రతులు. న; కీర్తుల్ — ఎ ట.త.ద

82 1. డై — వా శ; డగు విదురుడయి పేర్మితో — ఇ ఉ.ఒ.గ డ.ద.బ.మ.

84 1. సుతుడు — పెక్కుప్రతులు 2. నా — వా శ. 3. న — పెక్కు ప్రతులు.
4. తరణ — మ. 5. వినినఁ దవిలిభక్తి — వా.శ.

86 సీ. అభ్యస్త వేదవేదాంగులు [1]విధిదత్త దక్షిణా[2]ప్రీణిత ధరణిదేవు
లనవరతాశ్వమేధావభృథస్నాన పూతమూర్తులు కృతపుణ్యు లహిత
వర్గజయుల్ ప్రాప్త వర్గచతుష్టయుల్ [3]సత్త్వాది సద్గుణ జన్మనిలయు
లా భరతాది మహామహీపాలకు లిద్ధ[4]యశోర్థు లెందేనిఁ బుట్టి

ఆ. రట్టి [5]పౌరవాన్వయంబుఁ బాండవనృప, రత్నములకు వారిరాశి యైన
దాని వినఁగ [6]వలతుఁ దద్దయుఁ [7]బ్రీతితో, విప్రముఖ్య నాకు విస్తరింపు.

87 వ. అని యడిగిన జనమేజయునకు వైశంపాయనుం డిట్లనియె.

—: కౌరవ వంశ వివరణము :-

సం. 1-70-10

88 చ. నిరుపమ ధర్మమార్గ పరినిష్ఠితులై మహి యెల్లఁ గాచుచుం
బరగిన తొంటి పూరు కురుపాండు మహీశుల [1]పేర్మిఁ జేసి భూ
భర వహనక్షమం బగుచుఁ బౌరవ కౌరవ పాండవాన్వయం
బురుగుణ సంపదం [2]బెరిఁగి యొప్పె సమస్త [3]జగత్ర్ప[4]సిద్ధమై.

89 వ. అది యెట్లనినం [1]దొల్లి దాక్షాయణి యైన యదితికిఁ గశ్యపునకుం బుట్టిన వివస్వంతునకు వైవస్వతుండను మనువును యముండును శనైశ్చరుండును [2]యమునయుఁ [3]దపతియు ననం బుట్టిరందు వైవస్వతుండను మనువు వలన [4]బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రాదు లైన మానవులు పుట్టిరి

86 1 విధ్యుక్త — చ ర.శ.ష.స; వివిధాస్త్ర శస్త్రధను ర్వేదసత్ప్రవీణు — బౌ త. 2. తర్పిత — ఏ. గ.మ శ ష స. 3. సత్యాది — పెక్కు ప్రతులు. య స. 4. యశోమూర్తులెందు — ద ల శ ష స; యశస్కులెందేని — య. 5. కౌరవా — వా.శ. 6. వలయు — ఊ ట 7. వేడ్కతో — మ.

88 1. శక్తిఁజేసి — వ 2. వెలిగి — పెక్కుప్రతులు 3 జగద్ధితంబుగన్ — వ.వ. 4. సిద్ధియై — ఊ బౌ.క.బ.ర.

89 1. దొల్లి — పెక్కు ప్రతులలో లేదు. 2. మార్తాండస్యయమీచాపి సుతారాజన్ వ్యజాయత 1-59-15 పి.పి.ఎస్ 3. సావిత్రియుఁ దపతియు—మ ; సరస్వతియు దపతియు — డ 4 బ్రాహ్మణక్షత్రియ — కొన్ని తాళపత్ర ప్రతులు.

మఱియు [5]వానికి వేనప్రముఖు లైన రాజు లేఁబండ్రు పుట్టి వంశకరు లై తమ లోన యుద్ధంబు సేసి [6]మడిసిరి మఱియు నమ్మనుపుత్త్రి యైన యిల యను దానికి సోమపుత్త్రుం డైన బుధునకుఁ బురూరవుఁడు పుట్టి చక్రవర్తి యై.

90 క. ఇమ్మహిఁ [1]త్రయోదశ ద్వీపమ్ములు [2]దన[3]శౌర్యశక్తిఁ బాలించి మదాం
ధ్యమ్మున విప్రోత్తమవి, త్తమ్ములు దానపహరించె ధనలోభమునన్.

91 క. విని దాని నుడుపఁగా బ్రహ్మనియుక్తుం డై సనత్కుమారుఁడు మహికిం
జనుదెంచె బ్రహ్మలోకం, బునుండి యనేక దివ్య మునిసంఘముతోన్.

92 వ. పురూరవుండును రాజ్యగర్వంబున నమ్మును[1]లకు దర్శనంబీ నొల్లక [2]పరిహరిం చిన నలిగి వారలు వాని నున్మత్తుంగా శపియించిన వాఁడు గంధర్వ లోకంబున నూర్వశీసహితుం డై యుండె నట్టి పురూరవునకు నూర్వశికి నాయువు ధీమంతుండు నమావసువు దృఢాయువు వనాయువు శతాయువు నను నార్వురు గొడుకులు పుట్టిరం దాయువునకు స్వర్భానవి యనుదానికి నహుష వృద్ధ శర్మ రజి[3]గ యానేనసు లనంగా నేవురు పుట్టిరి వారియందు నహుషుండు రాజ్యాభిషిక్తుం డై.

93 మ. చతురంభోధి పరీత భూవలయమున్ సద్వీప సారణ్య స
క్షితిభృత్కంబగుదాని భూరిభుజశక్తిం జేసి [1]పాలించుచుం
గ్రతువుల్ నూఱొనరించి కీర్తివెలయంగా దిక్కులన్ నిర్జితా
హితుఁ డై యానహుషుండు దాఁ బడసె దేవేంద్రత్వముం బేర్మితోన్.

5. వానికి — లేని ప్రతులు — క.మ 6. దివంబున కరిగిరి — న; మడిసిరి — ఔ.జ.ట త ద ప; చనిరి — వా.

90 1. నవద్వయ — య; ఇచ్చట మూలమున త్రయోదశ ద్వీపములని మ,లో కలదు. "త్రయోదశసముద్రస్య ద్వీపానశ్నన్ పురూరవాః" 1—70—17 2. దోశ్శౌర్య శక్తి — న. 3. బాహుశక్తి — ఎ.క.జ ట త.న

92 1. ల కవసరం— ఊ.ఓ క.ర.స 2 యపహసించిన — వా శ. "ప్రత్యగృహ్ణన్న చాప్యసౌ" 1—70—19 3. నహుషం వృద్ధశర్మాణం రజిం రంభమనేనసం — భం 1—70—23

93 1. రక్షింపుచున్ — ఒ గ.త.ర.వ, రక్షించుచుఁ — అ.ఋ.ఔ.ఖ.డ.

94 వ. అట్టి నహుషునకుఁ [1]ప్రియవాస యనుదానికి [2]యతి యయాతి సంయాత్యా యా[3]త్యయతి [4]ధ్రువులనంగా నార్వురు పుట్టిరందు యయాతి రాజై యనేక యాగంబులు సేసి శుక్రపుత్త్రియయిన దేవయానియందు యదు తుర్వ[5]సులును వృషపర్వపుత్త్రియయిన శర్మిష్ఠయందు ద్రుహ్యానుపూరులు ననంగా [6]నేవురు కొడుకులం బడసి రాజ్యంబు సేయుచు శుక్రశాపంబున జరాభార పీడితుండై కొడుకుల [7]నందఱం బిలిచి యిట్లనియె.

95 సీ. విషయోపభోగాభి[1]లాషణ మింకను నాకు వదలదు పెరుఁగుచున్నదియుఁగాన
నందనులార మీ యందొక్కరుండు నాదగు జరాభారంబు దగిలి తాల్చి
తనజవ్వనంబు నాకొసరంగ [2]నెవ్వఁడీనోపు నాతండ సద్వీపసకల
ధారుణీసామ్రాజ్య భారయోగ్యుండగు నని యడిగిన నగ్రతనయుఁ డయిన

ఆ. [3]యదువుఁ దొట్టి సుతులు ముదిమికి నోపక, తలలు[4]వాంచి యున్న వెలయఁ దండ్రి
పనుపుఁ జేసి ముదిమిగొని జవ్వనంబిచ్చెఁ, బూరుఁడను సుతుండు భూరి[5]కీర్తి.

96 వ. అనిన విని జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె

94 1. ప్రియంపద — వా స. శ, ప్రియమానస — స.శ. కొన్ని ప్రతులు. ప్రియవాస — భం "నహుషోజనయామాసషట్పుత్రాన్ ప్రియవాససి" 1—70—28. 2. యతిం యయాతిం సంయాతి మాయాతిం పాంచముద్ధవమ్ భం. 1—70—28 3 అయతింధ్రువం — భం పాఠాంతరము. 4. 'ఉద్ధవ'— అని కొన్ని ప్రతులు. 5. సులను నిద్దఱు గొడుకులంబడసె— వా శ. 6. ముప్వురు—వా శ. 7 నందఱం— పెక్కు ప్రతులలో లేదు.

95 1. లాషమింకను — ప ఐ.జొ.క ప 2 పుత్త్రిఁడెవ్వండేని దాల్చునాతండు సకల సద్వీపధారుణీ సామ్రాజ్య యోగ్యుఁడునగునని యడిగిన నగ్రసుతుఁడుయదుఁడు — య 3. యదుని దొట్టి — త వ. 4. వంచియున్న — క ర 5 కీర్తి — పెక్కు ప్రతులు; యశుఁడు—వా కొన్ని ప్రతులు.

## —: యయాతి మహారాజు చరిత్రము :—

సం. 1-71-3

97 తే. వర్ణధర్మముల్ గాచుచు వసుధ యెల్ల,[1]ననఘచరితుఁడై యేలిన యయ్యయాతి
భూసురోత్తమ [2]భార్గవపుత్త్రి యైన, [3]దేవయానిని దానెట్లు దేవిఁ జేసె.

98 తే. [1]విపుల తేజంబునను దపోవీర్యమునను, జగదనుగ్రహనిగ్రహశక్తియుక్తుఁ
డయిన యట్టి యయాతికి నలిగి యేమి, కారణంబున శాపంబు కావ్యుఁడిచ్చె.

99 వ. [1]మఱియు నస్మద్వంశకరుండయిన యయాతిచరితంబు విననలతుం జెప్పు మని యడిగిన వానికి వైశంపాయనుం డిట్లనియె.

100 క. మనుజాధిప వృషపర్వుం,డను దానవపతికి శుక్రుఁ డాచార్యుండై
యనిమిషవిరోధులకుఁ[1]బ్రియ, మొనరించుచు వివిధ [2]విధిన యోపాయము
లన్.

101 క. దేవాసుర రణమున గత, జీవితులగు నసురవరులఁ జెచ్చెర మృతసం
జీవని యను [1]విద్యఁ బునర్జీవులఁగాఁ బ్రతిదినంబుఁ జేయుచు [2]నుండెన్.

102 వ. దాని నెఱింగి దేవతలెల్ల [1]నతిభీతులై యసురుల నోర్వనోపక శుక్రువలన [2]మృత[3]సంజీవని వడసి తేనోపునట్టి [4]మహాసత్త్వుం [5]డెవ్వండగునో యని విచారించి బృహస్పతిపుత్త్రుండయిన కచుని [6]కడకుం జని యిట్లనిరి.

97 1 నమల — ట ద వ వ. 2 బ్రాహ్మణ — వ. 3 దేవయాని — అనుదానికి 'దేవయాన' అనురూపము పెక్కుప్రతులలోఁగనఁబడుచున్నది మూలము 'దేవయాని'

98 1. విమల — ర.

99 1. అదియునుంగాక — ర.

100 1. హిత — పెక్కు ప్రతులు. 2 గుణ — త; గతి — ర.

101 1. విద్యను సంజీవులుగ — కొన్ని ప్రతులు, విద్యను సంజీవితులుగ — ఊ.బు ఖ; విద్యను బునర్జీవితులుగ — జ.య 2. నుండున్ — ఆ.ఎ.డ.త.ర; నున్నన్ — ఈ.

102 1. 'నతి' — పెక్కింట లేదు. 2. 'మృత' — పెక్కింట లేదు. 3. సంజీవని విద్య వడసి — ఈ. 4. మహాత్ముండెవ్వడో — ద న.ర. 5. డెవ్వండు గలండొకో — ఔ.త. 6. కడకువచ్చి — పెక్కు ప్రతులు.

103 క. [1]పోరను మృతసంజీవని, కారణమునఁ నిహతులయ్యుఁ గా రసురవరుల్
వారల [2]నోర్వఁగ మనకతి, ఘోరము దుర్వార[3]వీర్యబలయుతు లగుటన్.

104 క. మనపక్షంబున వార, ద్దనుజులచే నిహతు[1]లయ్యుఁ దగ మృతసంజీ
వని లేమిఁ జేసి [2]యమసా, దనమున [3]కరుగుదురు [4]వీర్యదర్పితులయ్యున్.

105 క. కావున మృతసంజీవనిఁ, దేవలయును శుక్రువలన [1]ధృతిఁ బడసి [2]తప
శ్శ్రీవిభవ దాని [3]బలమునఁ, గావంగా వలయు సుర[4]నికాయ బలంబున్.

106 క. బాలుండవు [1]నియమవ్రత, శీలుండవు నిన్నుఁ బ్రీతిఁ జేకొని తద్వి
ద్యా[2]లలనాదానముఁ గరు, ణాలయుఁడై చేయు [3]నమ్మహాముని నీకున్.

107 వ. దుహితృస్నేహం[1]బునం జేసి యద్దేవయాని పలుకులు శుక్రుం[2]డతి క్రమిం పండు గావున నీ నేర్పువిధంబున దాని చిత్తంబు వడసి శుక్రు నారా[3]ధించిన నీ కిష్టసిద్ధి యగునని దేవతలు ప్రార్థించి పంచినం గచుండును దేవహితా ర్థంబు వృషపర్వుపురంబునకుం జని [4]యందు [5]వేదాధ్యయన శీలుండయి సకల[6]దైత్య [7]దానవ గణోపాధ్యాయుం డయి యున్న శుక్రుం గని నమస్క రించి యిట్లనియె.

103 1 పోరున — ఇ.ఎ.చ.ర.శ.ష ; పోరన్ — ర. 2. గెలువగ — ఆ. 3. వీర — పెక్కు ప్రతులు.

104 1. లగుచుదడయక సంజీ — పెక్కు ప్రతులు. 2. యమునిసదన — ఎ.ఐ.క ; శమను సదన — చ.ల వి.శ ష. 3 కేగెదరు — మ. 4. శౌర్య — ఆ మ ర

105 1. ధృతివడసి — య.ర. 2. వచశ్శ్రీ — ఉ.ఊ ఒ.ఓ.గ.జ.త. 3. పెంపున — ర స. 4.నికాయమునెల్లన్ — ఖ.స; నికాయంబెల్లన్ — ఉ.ఊ.

106 1. గురుహితనయశీలుం — స. 2. లలనన్ దానము — య. 3 నమ్మహా త్ముడు — అ.ఆ.ఖ య.వ.

107 1. బున నద్దేవయాని — పెక్కు ప్రతులు. 2. డతిక్రమింపకుండు — గ.ప. 3. ధింపుము నీకుంగార్యసిద్ధి — ట; ధింపుము నీకు నిష్టసిద్ధి — అ. 4 యచ్చట — ఇ.ఏ.చ.వా.వి.శ.ష.శ. 5. వేదాధ్యయన శీలుండయి — పెక్కు ప్రతులలో లేదు 6. దైత్యోపాసితుండై — మ. 7. దానవోపా — పెక్కు ప్రతులు

108 క. ఏను గచుండనువాఁడ మ,హానియమసమన్వితుఁడ బృహస్పతి సుతుఁడన్
మానుగ వచ్చితి నీకును, భానునిభా శిష్యవృత్తిఁ బని సేయంగన్.

109 వ. అనిన నమ్మునికుమారుని సుకుమారత్వం[1]బును వినయప్రియ[2]వచన మృదుమధురత్వం[3]బును ననవరతనియమ వ్రతప్రకాశిత ప్రశాంతత్వం[4]బునుం జూచి శుక్రుం డతిస్నేహంబున వీనిం [5]బూజించిన బృహస్పతిం బూజించిన [6]యట్ల యని యభ్యాగతపూజల వాని [7]సంతుష్టుం జేసి శిష్యుంగాఁ [8]జేకొని యున్నంత నక్కచుండు.

110 సీ. పని యేమి పంచినఁ బదపడి చేసెద ననక తన్ బంచిన [1]యాత్రణంబ
చేయుచు నిజగురుచిత్తవృత్తికిఁ [2]గడు ననుకూలుఁడై వినయంబుతోడ
మనమునఁ జెయ్వుల మాటల భక్తి నేకాకారుఁడై మఱి యంతకంటె
[3]దేవయానికి సువిధేయుఁడై ప్రియహితభాషణములఁ బుష్పఫలవిశేష

ఆ. దానములను సంతతప్రీతిఁ జేయుచు, నివ్విధమునఁ బెక్కుఁ లేండ్లు నిష్ఠ
[4]గురుని గురుతనూజఁ గొలిచి యయ్యిరువుర, నెమ్మి వడసెఁ దనదు
నేర్పు పేర్మి.

111 వ. ఇట్లు గురు[1]శుశ్రూషా[2]కౌశలంబునఁ గచుండు శుక్రునకుం బ్రియశిష్యుండై యున్న [3]నెఱింగి [4]సహింపక దానవులు బృహస్పతితోడి [5]యలుక నక్కచు నొక్కనాఁడు హోమధేనువులం [6]గాచుచు వనంబున నేకతంబ యున్నవాని వధియించి విశాలసాలస్కంధంబున బంధించి [7]చనిరంత నాదిత్యుం [8]డస్తగిరి శిఖరగతుం డగుడు మగుడి హోమధేనువు లింటికి

109 1. బునకును — య.ర. 2. మధుర వచనత్వంబును — మ. 3. బునకును — య.ర. 4. బునకును మెచ్చి (సంతోష హృదయుండై) య ర 5. బూజించుట — కొన్ని ప్రతులు, బూజించుట బృహస్పతిం బూజించుట యని — ఆ ఐ. 6 సమానం బని — స. కొన్ని ప్రతులు. 7. సంతుష్టుంగా — వా శ. 8. జేకొని — పెక్కు ప్రతులు; జేసికొని — వా.శ.

110 1. యత్నణంబ — కొన్ని ప్రతులు. 2. దగ — య.ర. 3. దేవయానకును విధేయుడై — పెక్కు ప్రతులు. 4 గురుల — కొన్ని ప్రతులు.

111 1. శుశ్రూషణ — పెక్కు ప్రతులు. 2. పరుండయి — ఔ.ట.త.ప; గౌరవంబున — చ.శ.మ. 3. చూచి — ఆ మ, 4. దానవులు సహింపనోపక — వా. 5. వైరంబున — ఔ.చ.త.వీ.శ.ప. 6. గాచికొని — ఐ. 7. చనిన — పెక్కు ప్రతులు. 8. డస్తగతుం

వచ్చిన వాని[9]తోడన [10]కచుండు రాకున్న దేవయాని దనమనంబున [11]మలమల మఱుంగుచుం [12]బోయి తండ్రి కిట్లనియె

112 ఉ. వాఁడిమయూఖముల్ గలుగువాఁ డపరాంబుధిఁ గ్రుంకె ధేనువుల్
నేఁడిట వచ్చె నేకతమ నిష్ఠమెయిన్ భవదగ్నిహోత్రముల్
[1]పోఁడిగ వేల్వఁగాఁ బడియెఁ బ్రొద్దును బోయెఁ[2]గచుండు నేనియున్
రాఁడు వనంబులోన మృగరాక్షస పన్నగ బాధ [3]నొందెనో.

—: కచుండు దానవహతుండై మృతసంజీవనిచే బ్రదుకుట :—

సం 1—71—30

113 వ. అనిన విని శుక్రుండు దన దివ్య[1]దృష్టి నసుర[2]వ్యాపాదితుం డైన [3]కచుం గని వానిం [4]దోడ్కొని తేర [5]మృతసంజీవనిం బంచిన నదియును బ్రసాదంబని [6]యతి త్వరితగతిం జని విగతజీవుం [7]డయిన కచునప్పుడ సంజీవితుం జేసి తోడ్కొని [8]వచ్చినం జూచి శుక్రుండును దేవయానియు [9]సంతసిల్లి యున్నంతఁ గొన్నిదినంబులకు వెండియు నొక్కనాఁడు.

114 క. అడవికిఁ బువ్వులు దేరఁగ, వడి నరిగిన కచునిఁ జంపి [1]వారక [2]దనుజుల్
[3]పొడవు సెడఁగాల్చి సురతోఁ,దడయక యబ్భాది శుక్రుఁ ద్రావించి రొగిన్.

డగుడు (డగుటయు) — కొన్ని ప్రతులు. 9 తో — పెక్కు ప్రతులు. 10. కచుం గానక — పెక్కు ప్రతులు. 11. మలుమల — స 12. బోయి — లేనిప్రతి — మ.

112 1 పోడిమి — గ.త.న 2. గచుండదేలకో — గ య; గచుండునేగియున్ — మ. 3 బొందెనో — కొన్ని ప్రతులు; చెందెనో — ఔ.

113 1. జ్ఞానంబున — ఆ.ఓ ఔ.క.డ; దృష్టింజూచి — అ ఖ.చ.ట.న.ప ర.ల.శ.ష 2. వ్యాపారపీడితుండైన — కొన్ని ప్రతులు 3. కచునెరింగి — పెక్కు ప్రతులు. 4. దోడ్తేర — ఐ.ఒ గ.ర 5 మృత — పెక్కింట లేదు. 6. యతిత్వరితగతి — కొన్నింట లేదు. 7. డయి పడియున్నకచు నక్షణంబ — న; డయి పడియున్న కచు — య ర. 8. తెచ్చినం — ఇ.ఎ.ఖ 9. సంతోసిల్లి, సంతోసిల్లి — స; సంతోషించియున్న — ఆ.

114 1. వానిని — పెక్కు ప్రతులు. స. 2. దైత్యుల్ — మ. 3. పొడవడగ ఆ.క.వ.ప.

115 వ. శుక్రుండును సురాపాన[1]మోహితుం డయి [2]యున్నఁ దొల్లింటియట్ల దేవయాని గచుంగానక దుఃఖితయై నేఁడును గచుండు రాక మసలె [3]నసురులచేత నిహతుం డయ్యెం గావలయునని [4]శోకించిన దానిం జూచి శుక్రుం డిట్లనియె.

116 క. [1]వగవక సంజీవని పెం,పగణిత [2]గర్వమున [3]నసురు లాకచుతోడం బగఁ గొని చంపెద రాతఁడు, [4]సుగతికిఁ [5]జనుఁగాక యేల శోకింపంగన్.

117 వ. [1]అనిన దేవయాని యిట్లనియె.

118 మ. [1]మతిలోకోత్తరుఁడైన యంగిరసు మన్మం[2]డాశ్రితుం డాబృహ స్పతికిం బుత్త్రుఁడు మీకు శిష్యుఁ[3]డు సురూప[4]బ్రహ్మచర్యాశ్రమ వ్రతసంపన్నుఁ డకారణంబ దనుజవ్యాపాదితుం డైన న చ్యుతధర్మజ్ఞు మహాత్ము యక్కచున [5]కే శోకింప కెట్లుండుదున్.

119 వ. వానిం జూచి కాని [1]కుడువనొల్ల నని [2]దేవయాని యేడ్చుచున్నఁ బెద్దయుం ప్రొద్దు[3]నకుఁ బ్రసన్నుండై [4]శుక్రుండు [5]యోగదృష్టిం జూచి లోకాలోక పర్యంత భువనాంత[6]రంబునఁ గచుం గానక సురా[7]సమ్మిశ్ర భస్మమయుండై తనయుదరంబున నున్న [8]యక్కచుం గని సుర సేసిన దోషంబును [9]నసురులు సేసిన యపకారంబును నెఱింగి.

115 1. పరవశుండయి — బొ.త 2. పడియున్న — గ వ 3. నసురనిహతుం డయ్యెం — కొన్ని ప్రతులు. 4. శోకింపుచున్న — ట.

116 1. వగువక — స. 2. సత్త్వమున — అ. 3. అసురలా — ఆ.ర. 4. సుగతిం — ప ర. 5. గను — డ; జనుదెంచునేల — డ.

117 1. అనిన విని — అ.ఆ.ఉ ఎ.ప.న

118 1. 'ఊ' ప్రతిలో ఈ పద్యములేదు. 2. డూర్జితుం — అ. 3. డనురూప — వ; డుదురాప — ఖ. 4. బ్రహ్మచర్యాన్విత — ఐ.ఓ.య.స; బ్రహ్మచర్యశ్రుత — ఋ.స; బ్రహ్మచరాశ్రిత — అ.ఆ.ఈ ఉ.ప.ర. 5. కై — ఐ మ.య, కుః — అ.న.ర.

119 1. కుడువనని — పెక్కుప్రతులు; నేరనని — క; నోపనని — బ. 2. 'దేవయాని' — అ.ఉ.ఊ.ఓ.ఖ ర. లలో లేదు. 3. నకుదేవయానివలనం — అ న.ర. 4. శుక్రుండుదన — వా.శ. 5. దివ్యజ్ఞానంబునలోకాలోక — య. 6. రాళం బున — ఆ.ఊ.ఎ.ఓ.ర. 7. సమ్మిశ్రిత — అ.ఈ.ఊ.ఓ.ఔ.ర. 8. కచుంగని — కొన్ని ప్రతులు 9. నసురులవలనన్షైన — వా.శ.

120 ఆ. [1]మొదలి పెక్కుజన్మములఁ బుణ్యకర్మముల్, పరగఁ బెక్కుసేసి పడయఁ బడిన
యట్టి యెఱుక [2]జనుల కాక్షణమాత్రన, చెఱుచు మద్యసేవ సేయ[3]నగునె.

121 క. భూసురు లాదిగఁ గలజను, లీసుర సేవించిరేని యిది మొదలుగఁ బా
పాసక్తిఁ బతితు లగుదురు. చేసితి మర్యాద దీనిఁ [1]జేకొనుఁడు జనుల్.

122 వ. అని [1]శుక్రుండు సురాపానంబు మహాపాతకం[2]బుగా శపియించి తనయుదరంబున నున్న [3]కచు నప్పుడ సంజీవితుం జేసిన[4]నంద యుండి కచుండు శుక్రున కిట్లనియె.

123 క. తనువును [1]జీవము సత్త్వం,బును బడసితి నీప్రసాదమున [2]నీయుదరం
[3]బనఘా వెలువడు [4]మార్గం, బొనరింపుము నాకు భూసురోత్తమ దయతోన్.

124 వ. అనిన నాయుదరంబు భేదిల్లినంగాని యిమ్మునికుమారుండు వెలువడనేరం డుదరభేదనంబున మూర్ఛితుం[1]డ నయిన నన్ను సంజీవితుంజేయ[2]వలయు నని శుక్రుండు కచునకు సంజీవని నుపదేశించిన.

125 క. ఉదర[1]భిదాముఖమున న,భ్యు[2]దయముతో నిర్గమించె బుధనుతుఁడు కచుం
డుదయాద్రి [3]దరీముఖమున, నుదితుం డగు పూర్ణహిమ మయూఖుఁడ పోలెన్

120 1. మొదలబెక్కు — పెక్కు ప్రతులు. 2. జులుకయక్షణ — ఊ. 3. దగునె — కొన్నిప్రతులు ; జనునె — ఆ.వ ; జనదు — వ ; దగదు — ఎ.ఔ.ప.

121 1. జేకొండ్రు — య.

122 1 శుక్రుండు — పెక్కు ప్రతులలో లేదు. 2. బని — న. 3. కచుని సంజీవితుం — పెక్కు ప్రతులు 4. 'అందయుండి' — ఋ.ట. లలో లేదు.

123 1. జవమును — స. 2. నియ్యుదరం — స. 3 బును వెలువడు మార్గము దగ నొనరింపుము — న. 4. మార్గము నొనరింపుము — య.

124 1. డయిన — కొన్ని ప్రతులు 2 వలెనని — ర

125 1. విభేదనమున — థ ; ఛ్ఛేదనమున — వ. 2. దితుండై — వా.శ. 3. శిఖర — కొన్ని ప్రతులు.

126 వ. [1]అంత.

127 తే. విగతజీవుఁ[1]డై పడియున్న [2]వేదమూర్తి యతని చేత సంజీవితుఁడై వెలుంగె
దనుజమంత్రి యుచ్చారణ దక్షు చేత, నభిహితం[3]బగు శబ్దంబు నట్ల పోలె.

128 వ. ఇట్లతిప్రయత్నంబున గచుండు శుక్రు వలన సంజీవని వడసి [1]పెద్దకాల
బుండి యొక్కనాఁడు శుక్రుచేత ననుజ్ఞాతుం డయి దేవలోకంబునకుం
[2]బోవుచుండి దేవయాని కతి ప్రియ పూర్వకంబు[3]నం జెప్పిన నది[4]యును
దద్వియోగ దుఃఖితయై కచున కిట్లనియె.

129 ఉ. నీవును బ్రహ్మచారివి వినీతుఁడ వేనును గన్యకన్ మహీ
దేవకులావతంస రవితేజ వివాహము నీకు నాకు మున్
భావజ[1]శక్తినై నయది పన్నుగ నన్నుఁ బరిగ్రహింపు సం
జీవనితోడ శుక్రుదయఁ జేయుము [2]నాకుఁ బ్రియంబు నావుడున్.

130 క. ఆ కచుఁ డత్యంత విషాదాకులుఁడై లోక నింద్యమగు[1]నర్థము నీ
వాకునకుఁ దెచ్చుటుచితమె, నాకు సహోదరివి నీవు నాచిత్తమునన్.

131 క. గురులకు శిష్యులు పుత్త్రిలు, పరమార్థమ లోకధర్మపథ[1]మిది దీనిం
[2]బరికింపక యీపలుకులు,[3]తరుణీ గురుపుత్త్రి నీకుఁ దగునే [4]పలుకన్.

126 1. కొన్నింట లేదు.

127 1. డైయున్నయవ్వేద — మ ర; డై పడిన యవ్వేద — వ. 2. విశదకీర్తి – బా.
3 డైన – కొన్ని ప్రతులు.

128 1. కొండొక — ఎ. 2. బోవుచో – ద; బోవ సమకట్టి – ఈ. 3 గా —
కొన్ని ప్రతులు. 4. 'యును' – కొన్నింట లేదు.

129 1. యుక్తి – పెక్కు ప్రతులు. 2. నాకు మనః ప్రియంబగున్ (బుగన్) నావుడు;
అప్పుడు — స.

130 1. నర్థంబున్ – అ ఋ.మ.

131 1. మది — వా.శ. 2. బరికింపఁగ — స. 3. ధరణీసుర పుత్త్రి — వ
4. చెప్పుమా — స.

132 వ. అనిన నాకచునకు దేవయాని కరంబలిగి నీవు నామనోరథంబు విఫలం బుగాఁ జేసిన వాఁడవు నీకు సంజీవని పనిసేయ[1]కుండెడు మని శాపం బిచ్చినఁ [2]గచుండేను ధర్మ[3]పథంబు దప్పనివాఁడను నీవచనంబున నాకు సంజీవని పనిసేయదయ్యె [4]నేనియు నాచేత నుపదేశంబు గొన్నవారికిఁ బని[5]సేయుంగాక మఱి నీవు ధర్మ[6]విరోధంబు దలంచి[7]తివి గావున నిన్ను బ్రాహ్మణుండు వివాహంబు గాకుం[8]డెడ మని దేవయానికి బ్రతిశాపం బిచ్చి తత్క్షణంబ.

133 క. దేవగురు[1]నందనుం డమ,రావాసంబునకు నరిగి యమరులకును సం
జీవని యుపదేశిం[2]చి సు,ధీ[3]వినుతుఁ డొనర్చుచుండె దేవహితంబుల్.

134 వ. ఇట వృషపర్వుకూఁతురు శర్మిష్ఠ యను కన్యక యొక్కనాఁడు కన్యకా సహస్ర పరివృత యయి దేవయానీసహితంబు వనంబునకుం జని యొక్క సరోవరతీరంబునఁ [1]దమతమ పరిధానంబులు పెట్టి జలక్రీడ లాడుచున్న నని సుర[2]కరువలిచేతం బ్రేరితంబు లయి కలిసిన నొండొరులం గడవఁ గొలను [3]వెలువడు సంభ్రమంబున నక్కన్యక లన్యోన్య పరిధానంబులు వీడ్వడం గొని కట్టునెడ దేవయాని పుట్టంబు శర్మిష్ఠ [4]గట్టిన మఱి దానిపరిధా నంబు దేవయాని పుచ్చు[5]కొనక [6]రోసి [7]శర్మిష్ఠం జూచి యిట్లనియె.

132 1. కుండెడమని — కొన్ని ప్రతులు. 2. గచుండును నేను - పెక్కు ప్రతులు. 3. స్థితి — అ ఇ ఉ ఒ.క గ.డ వ 4. నేని — వా. 5. సేయుమఱి — పెక్కు ప్రతులు 6. విరుద్ధంబు - ఋ.బ. 7. నదానవు - ఔ.త వ. 8. డెడమని - కొన్ని ప్రతులు ; డెడుమని — వా. మున్నగు ప్రతులు.

133 1. తనూజుండమ - ప. 2 చుచుధీ - వ. 3 విభవుడొనర్చు - న.ర; వినుతు డొనర్చు — ఐ. విభుఁడొనరించుచుండె — వా

134 1. దమతమ — పెక్కు ప్రతులలో లేదు. 2 కరువలి — అ న. భాసం. య ర; సురగరువలి — వా. మున్నగు ప్రతులు; 3 వెలువడి — పెక్కు ప్రతులు. 4. గట్టిన దాని — పెక్కు ప్రతులు 5. కొనికట్టక - ఏ; కొనికట్టి — ల. 6. 'రోసి' — కొన్నింట లేదు. 7. శర్మిష్ఠకిట్లనియె — ఏ.ఐ

135 క. లోకోత్తరచరితుండగు, నాకావ్యతనూజ నీకు [1]నారాధితను నేఁ
బ్రాకట భూసుర కన్యక, నీకట్టిన మైలగట్ట నేర్తునె [2]చెపుమా.

136 వ [1]అనిన శర్మిష్ఠ యిట్లనియె.

137 క మాయయ్యకుఁ బాయక పని, సేయుచు దీవించి ప్రియము [1]సెప్పుచునుండుఁ
మీయయ్య [2]వెండి మహిమలు, నాయొద్దన పలుక నీకు [3]నానయు లేదే.

138 వ. నాకట్టిన పుట్టంబు నీకుం గట్టంగాదు గాకేమి యని గర్వంబున నెగ్గులాడి దేవయాని నొక్క[1]నూతం [2]ద్రోచి శర్మిష్ఠ కన్యకా[3]సహస్రపరివృత యయి క్రమ్మఱి వచ్చి నిజనివాసంబున [4]నుండె నంత.

*-: యయాతి నూతంబడిన దేవయాని నుద్ధరించుట :-*

సం. 1-73-14

139 ఉ. ఆనహుషాత్మ[1]జుండగు యయాతి యధిజ్యధనుస్సహాయుఁడై
యానతశాత్రవుండు మృగయా[2]రస లోల నిబద్ధ[3]బుద్ధిఁ ద
త్కానన మెల్లఁ గ్రుమ్మరి నికామ[4]ధృతశ్రముఁ డేఁగుదెంచె నం
దానలినాక్షి యున్న విపినాంతర కూప[5]తటంబు నొద్దకున్.

135 1. నారాధితను - పెక్కు ప్రతులు, నారాధ్యను - చ.వా.వీ.శ ష. 2. యనినన్ - పెక్కు ప్రతులలో లేదు

136 1 ఈ వాక్యము పెక్కు ప్రతులలో లేదు.

137 1. చెప్పుచు (సెప్పుచు) — స, కొన్ని ప్రతులు. సేయుచు - వా. మున్నగు ప్రతులు. 2. మేటి — ఊ; పెద్ద - ల; పెట్టి - ర వ; మహిమ వెండియు నా యొద్ద - స. 3. నాయము — అ ఈ ఒ వ; నానతి (నాయము) గలదే - స; నాయమె చెపుమా - స. 'నానతి' అను పాఠమున అఖండయతి;

138 1. విపివాంతర కూపంబున - ప; పురాతన కూపంబున - న 2. ద్రోయించి — త గర, ద్రోపించి - వ స. 3. సహస్రంబుతో - పెక్కు ప్రతులు. 4. సుఖంబు న్నంత - య; సుఖంబుండెనిట - ఓ.

139 1. సూనుఁడు - పెక్కు ప్రతులు. 2. లస - వా; వశ - అ ప; రతి - మ. 3. బుద్ధిమై - ఔ.మ; 4. ధృత - ఇ.ఈ ఐ జ డ.ప.శ ష.స; జిత - ఉ.ఎ.క.ఖ.చ ద.బ. య.ర.వ. పథిశ్రముఁడు — వా.శ.భా.సం. 5. వనంబు - పెక్కు ప్రతులు ; సమీప భూమికిన్ -.న.

140 సీ. చనుదెంచి యమ్మహాజనపతి జల మపేక్షించి యచ్చో విశ్రమించి చూచి
తత్కూపమున విలసత్కూలఘనవల్లి యన్నిష్టసఖి నూఁది యున్నదాని
గురు[1]కుచయుగముపైఁ బరువడిఁ [2]దొరఁగెడు కన్నీరు పూరించుచున్న దానిఁ
దన సమీపమునకు జనుల యాగమనంబు [3]పన్నుగాఁ గోరుచు నున్నదాని

ఆ. వరుణ దేవుతోడఁ గరమల్గి జలనివాసంబు [4]విడిచి భూస్థలంబు [5]వలని
కరుగు [6]దేర నున్న వరుణేంద్రు దేవియ, పోని దాని దేవయానిగనియె.

141 వ. కని నీవెవ్వరిదాన విట్లేల యేకతంబ యివ్విపినాంతర కూపంబున నున్నదాన వనిన [1]విని దేవయాని యెప్పుడుం దమ విహరించు[2]చున్న యవ్వనంబునకు మృగయావినోదార్థంబు యయాతి [3]వచ్చుటం జేసి తొల్లియుఁ జూచి[4]నది [5]గావున [6]నాతని [7]నెఱింగి [8]యిట్లనియె.

142 తరలము. అమరసన్నిభ యేను ఘోర సురాసురాహవభూమి న
య్యమరవీరుల చేత [1]మర్దితులైన దానవులన్ [2]గత
[3]శ్రమము[4]లఁగాఁ దనవిద్య [5]పెంపునఁ బ్రాప్తజీవులఁ జేసి య
త్యమిత శక్తి మెయిన్ వెలుంగిన యట్టి భార్గవు కూఁతురన్.

143 వ. దేవయాని యనుదానఁ బ్రమాద[1]వశంబున నిన్నూతంబడి వెలువడనేర కున్న [2]దాన[3]ను నన్నుద్ధరించి రక్షింపుమనిన నవ్విప్రకన్యక యందుఁ దద్దయు దయాళుండై.

140 1. కుచంబుల మీద – ఊ.ప ఖ.గ.య ; కలశముల్ – ఇ ఈ ద న.ర ; కుంభముల్ – ఋ.ఐ ఒ 2. దోగెడు – ప 3 పెన్ను – ఊ. 4 వాసి – క.ర ; బాసి – ఊ.ఓ ; వెడలి – ఋ. 5 మీది – ఆ మ. 6. దెంచుచున్న – ఋ

141 1 విని — కొన్ని ప్రతులలో లేదు 2. చుండెడు — త ; చుండు – మ. 3 వచ్చుట తొల్లి — ప. 4 నయదియైయె యెఱింగి యిట్లనియె — ఆ ఋ.చ 5 యై... యా — ఆ ఈ.ఉ య ; యై... య — ర. 6 రాజున కిట్లనియె — య 7. నెరింగి — కొన్ని ప్రతులలో లేదు 8. కిట్లనియె — ఆ.ఎ.ఔ క.చ.త.శ.ష.

142 1. బాధితు — ఎ.క ట.ద. ప ; మారితు — ఈ ప జ.త.య ; నిర్జితు — ర 2 జిత — అ. 3. శ్రమ — అ.ఇ.క.జ ర వ.స. 4. లు — ఐ.ఓ.గ.జ.త.య.

143 1. వశ — పెక్కు ప్రతులలో లేదు 2. దానను — య ర.లలో లేదు. 3. ను — పెక్కు ప్రతులలో లేదు.

144 చ. జలధి విలోల వీచి విలసత్క[1]ల కాంచి [2]సమంచితావనీ
తల వహన క్షమం బయిన దక్షిణ హస్తమునం [3]దదున్నమ
ద్గళదురు ఘర్మవారి కణ క్రమ కరాబ్జము పట్టినూతిలో
వెలువడఁ [4]గోమలిం దిగిచె విశ్రుత కీర్తి యయాతి ప్రీతితోన్.

145 వ. ఇట్లు దేవయాని నుద్ధరించి [1]నిజ[2]పురంబున [3]కరిగె నిట దేవయానియు శర్మిష్ఠ సేసిన [4]యెగ్గువలన విముక్త యయి తన్ను [5]రోయుచు వచ్చు దాని ఘూర్ణిక యను పరిచారికం గని యేను [6]వృషపర్వు పురంబు సొర [7]నొల్ల శర్మిష్ఠ [8]చేత నా పడిన యవమానంబు మదీయ జనకున [9]కెఱింగింపుమని పంచిన నదియును నతిత్వరితగతిం జని [10]తద్వృత్తాంతం బంతయు శుక్రునకుం [11]జెప్పిన శుక్రుండును [12]నాతఱింబ వచ్చి [13]కోపఘూర్ణిత బాష్ప పూరిత నయన యై యున్న దేవయానిం గని యిట్లనియె.

146 క. అనుపమ [1]నియమాన్వితు లై, యనూనదక్షిణలఁ గ్రతుసహస్రంబులు సేసిన వారి కంటె నక్రో, ధనుఁడ గరం బధికుఁ డండ్రు [2]తత్త్వవిధిజ్ఞుల్.

147 క. అలిగిన నలుగక యెగ్గులు, పలికిన [1]మఱి వినని యట్ల ప్రతివచనంబుల్
వలుకక బన్నము [2]వడి [3]యెడఁ, దలఁపక యున్నతఁడ చూవె [4]ధర్మజ్ఞుఁ డిలన్.

144 1 టి – స. మ. య. 2 సమన్వి – బొ 3. దదుగ్గమ – ల. 4. బాలికెం – ర.

145 1 తన – ఏ 2 గృహం – ఇ 3 కుంజనియె – ఊ ప.ఓ.బొ.గ.త. 4 యపకారంబున వృషపర్వుపురంబు సొరకయుండెనంత దన్నురోయుచు – ఊ. 5. రోయ పచ్చు – అట; రోయ వచ్చుచున్న – ఏ. 6. వృషపర్వు – 'ఏ' అను ప్రతిలో లేదు. 7. నొల్లనెటులేని యుండెదయెద శర్మిష్ఠచేసిన – ఋ.ప బ. 8 చేతం బడినా – య 9 కెఱింగించి రమ్మనిన నదియు – జ 10. యంతవృత్తాంతంబును — పెక్కు ప్రతులు 11. కెఱింగించిన – ఐ బొ త.న.య. 12. తతఱింబ – పెక్కు ప్రతులు; నాతఱింబ కోపఘూర్ణిత – వా ళ. 13. కోపాగ్ని ధూమ జనిత – త, కోపధూమ జనిత – పెక్కు ప్రతులు; కోపధూపజనిత – న; రోషాగ్ని ధూమజనిత – బొ, రోషజనిత – కొన్ని ప్రతులు, శోకఘూర్ణిత – భాసం.

146 1. మహిమాన్వి – ఖ ; వినయాన్వి – వ 2. తత్త్వజ్ఞులిలన్ – స

147 1. దా – న ; నవి – య 2. వడియుం – న ; వడియున్ – డ.స;వడియును – అ.బ.
3. యెద – పెక్కుప్రతులు 4. తత్త్వ – స కొన్ని ప్రతులు.

148 వ. కావున బుద్ధిగలవారికిఁ గ్రోధంబు గొనియాడం [1]దగదు శర్మిష్ఠ రాచ కూఁతురు [2]గొండుక యది దానితోడి [3]దేమి రమ్మనిన దేవయాని యిట్లనియె.

149 క. కడు ననురక్తియు నేర్పునుగడఁకయుఁ, గలవారి నులక [1]కడవఁగ నెగ్గుల్ నొడివెడు వివేకశూన్యుల, [2]కడనుండెడు సంత[2]కంటె గష్టము గలదే.

150 వ. [1]ఈ వృషపర్వు పురంబేను జొరనొల్ల నెటయేనియుం [2]బోదు ననిన శుక్రుండు నాకు నీవ గతి[3]వి నీతోడ నేనును వత్తు [4]ననుచుఁ [5]గూఁతుం బట్టువఱుచుచున్నంత [6]నంతయుఁ జారుల వలన నెఱింగి వృషపర్వుండు శుక్రునొద్దకు వచ్చి [7]నమస్కరించి యిట్లనియె.

151 ఉ. దేవతలన్ జయించుచు నతిస్థిర సంప[1]దలం ద్వదీయ వి
ద్యావిభవంబు పెంపునన దానవు లుద్ధతులైరి కానినాఁ
డీవ రాశిలోఁ జొరరె యింతకు [2]నంతక కోపులైన య
ద్దేవపతాకినీ [3]పతుల దివ్యనిశాత [4]మహాయుధాహతిన్.

152 క. వారణ ఘోటక భాండా,గారంబులు [1]మొదలు గాఁగ గలధనములతో సూరినుత [2]యిందఱము నీ[3], వారకములు గాఁగ మమ్ము వగవుము బుద్ధిన్.

148 1. జనదు – కొన్ని ప్రతులు. 2. గొండిక – ఆ ఈ.ఒ చ.న.ర.శ.ష; కొండొక – పెక్కు ప్రతులు ; కొండికి – స; 'కొండుకయది' – ఎ య.లలో లేదు 3.విరోధంబేల– ఏ ఖ య పి; విరోధంబేమి – $గ_1$.చ.ట.శ ప

149 1 కడుకొనియెగ్గుల్ – య. 2. కన్న – ర.

150 1 ఏనువృషపర్వుపురంబున నుండనొల్ల – డ.న.బ.ర. 2 బోయెద – పెక్కు ప్రతులు. 3. వి – పెక్కు ప్రతులలో లేదు. 4. నని – పెక్కు ప్రతులు 5. గూతునొడంబఱు – $గ_1$.చ వీ.శ.ష.స 6. అంతయు నెఱింగి – పెక్కుప్రతులు ; నింతయుఁ దనచారులవలన విని – ర. 7. 'నమస్కరించి' పెక్కు ప్రతులలో లేదు.

151 1. దుర్దైత్య–ఐ.స ; దతో–ఈ.ఎ.జ ; దకై–య ; దదైత్య — కొన్ని ప్రతులు. 2. నంతకు– అ.ఒ.క.ఖ డ.ర.శ.ష. 3 వరుల—వ. 4 ముఖా—ప ; మహాస్త్రసంహతిన్–బు ; మహాయుధోద్ధతిన్—ఐ.

152 1. లోను—అ. 2. యిన్నియును—పెక్కు ప్రతులు. స. 3 కారణములుగాఁగ మమ్ము గఱపుము బుద్ధిన్—న ; వారలముంగాఁగ బుద్ధి వగవుము మమ్మున్ — ను.

-: శర్మిష్ఠ దాసియై దేవయానిం గొలుచుట :-

సం. 1-75-13

153 వ. ఈదేవయాని కెద్ది యిష్టంబు దానిన [1]యిత్తు నడుగుమనిన దేవయాని [2]సంతసిల్లి [3]యట్లేని శర్మిష్ఠ గన్యకాసహస్రంబుతో నాకు దాసి[4]గా వలయు నిదియ [5]నా కిష్టంబు దీనిన యిచ్చునది [6]యనిన వృషపర్వుం డప్పుడ[7]క్కూఁతు రావించి [8]కన్యకా సహస్రంబుతో దేవయానికి దాసిగా నిచ్చి శుక్రునకు మనఃప్రియంబు [9]సేసిన శర్మిష్ఠయు నగ్గురువచనంబునఁ గన్యకా సహస్రంబుతో నిత్యంబును దేవయానిం గొలుచుచుండె నంత నొక్కనాఁడు.

154 క. వనకేళీ కౌతుకమునఁ, జనియెను [1]శర్మిష్ఠ దొట్టి సఖులెల్ల ముదం బునఁ గొలిచి రాఁగ విభవము, దన [2]కమరఁగ దేవయాని తద్వనమునకున్.

155 వ [1]ఇట్లరిగి యవ్వనంబునఁ గన్యకలుం దానును బుష్పాపచయంబు సేయుచు విమల [2]జల ప్రవాహ విలసితం బైన యొక్క సెలయేటి [3]కెలన నవ వికచ కుసుమ [4]సుకుమార కోరక నికర [5]భరిత సహకార కురవక వకు ళాశోక తమా[6]ల [7]సాంద్రచ్ఛాయాశీతల [8]సికతాతలంబున నిష్ట వినోదంబుల నున్న యవసరంబున.

153 1 యిత్తుననిన—ఊ.ఐ.ఒ.గ జ; యిచ్చెదననిన—అ ఖ.చ.బ.వీ శ.ష 2 సంతోషించి—ఆ.మ 3 యిట్లనియె—ఋ.బ.మ, యట్లైన—ఉ ఎ.ఓ 4. గానీ వలయు—వా.శ కొన్ని ప్రతులు. 5. నాకు నిష్టంబు — అ ఇ.ఈ.ఉ జ 6. యనిన విని— జ. 7. దతి శీఘ్రంబునఁ గూఁతు రావించి దేవయానికి దాసిఁ గావించి శుక్రునకు — 8. కన్యకా సహస్రంబుతో—కొన్నిప్రతులలో లేదు 9 చేసె నా శర్మిష్ఠయునిజగురు—య.

154 1 శర్మిష్ఠతోడి—ఐ క, తోడ—న 2. కలరగ—అ గ న.

155 1 ఇట్లరిగి దేవయాని — వా శ. 2. నిర్ఝర—పెక్కుప్రతులు; జలనిర్ఝర—వీ.శ.ష స; జలనిర్ఝరంబైన — చ. 3. తీరంబున—ర. 4 కిసలయ— ఊ. 5. ఫలభరిత - ఇ. 6 లానోకహ — న. 7. తరుచ్ఛాయా—కొన్ని ప్రతులు. 8. శిలాతలప్రదే శంబున — పెక్కు ప్రతులు ; రమ్య ప్రదేశంబున — స.

156 సీ. అంగనాజనుల యుత్తుంగ సంగత కుచ కుంకుమ చందన పంకములయు
[1]వారివ ధమ్మిల్ల భారావకలిత దివ్యామోద నవపుష్ప దామములయు
[2]వారివ ముఖ సకర్పూర తాంబూలాది [3]వాసిత సురభి నిశ్వాసములయు
[4]వారివ పరిధాన చారు[5]ధూపములయు విలసిత సౌర[6]భావలులు దాల్చి

తే. యనిలుఁ డనుదూత వోయి [7]తోడ్కొనుచు వచ్చె, దేవయాని పాలికి మృగ తృష్ణఁజేసి
కాన[8]సంబునఁ గుమ్మరు వాని [9]వీరు [10]నతి[11]పరిశ్రాంతుఁ డైన [12]యయాతి నంత.

157 క. తరళ నయనాబ్జదళములు, నెరయఁగఁ బై [1]మున్న చల్లి నృప[2]సుతుఁ బూజిం
చిరి నవకుసుమ మయాలం, కరణ విశేషము[3]ల నచటి కాంతలు ప్రీతిన్.

-: యయాతి మహారాజు దేవయానిని వివాహంబగుట :-

సం 1-76-8

158 వ. అయ్యయాతియుఁ దత్ప్రదేశంబున సుఖోపవిష్టుండై [1]దేవయానిం దొల్లి యెఱింగిన[2]వాఁడై యతిశయరూపలావణ్యా[3]గుణ సుందరి యయిన శర్మిష్ఠ నెఱుంగ వేఁడి [4]మీ రెవ్వరి[5]వారలు మీ కులగోత్రనామంబు లెఱుంగ [6]వలతుఁ జెప్పుం డనిన [7]నారాజునకు దేవయాని యిట్లనియె.

156 1. వారల — న, వారిపై — మ 2 వారల — ఏ న ; వారిపై — మ. 3. వాసిత— ఆ మ ; వాసనా—వా. మున్నగు ప్రతులు. 4 వారల — ఏ న ; వారిపై — మ. 5. గంధములయు — న ; భూషణముల—ఏ. 6. భములను — అ.మ. 7. తోడ్కొనుచు వచ్చె—స పెక్కు ప్రతులు. తోడ్కొనియుఁదెచ్చె - వా. 8 నములోన— కొన్ని ప్రతులు ; నంబులో — మ ర. 9. ధీరు— ఐ బ మ య ల ; శూరు — ట. 10. డగు ప్రశాంతాత్ము—బ. 11. పథిశ్రాంతుఁడైన — స ; 12. యయాతిప్రీతి— పెక్కు ప్రతులు

157 1. మున్న — పెక్కు ప్రతులు ; పైన — క. 2. వరు — ఊ.త. 3. ల జేసి — పెక్కు ప్రతులు

158 1. తొల్లిదేవయాని నెఱిఁగియుంట నతిశయ — మ; తొల్లి దేవయాని నెఱింగిన — ఖ.చ.ట.వీ.శ ష. 2. వాఁడయ్యు నెఱుంగని వాఁడపోలె నతిశయ — స. 3. గుణ — ఔ.న య.ర.లలోలేదు. గుణ గంభీరయైె సుందరి — మ. 4. మీరలెవ్వరి — ఏ. 5. వారు — ఔ క.త.మ. 6. వలయు—ఏ న. 7. రాజునకు — వా.శ.

159 తే. నన్ను మున్న యెఱుంగు దిన్నాఁటి నాకు, దాసి వృషపర్వుఁడను మహా దానవేంద్రు
కన్య నాయొద్ద నెప్పుడుఁ గదలకుండు, ననఘ [1]మఱి దీని శర్మిష్ఠ యండ్రు జనులు.

160 ఉ. నిగ్రహ [1]మేది నన్నుఁ [2]దరణిప్రభ కూపము వెల్వరించు నాఁ
డుగ్రమయూఖ [3]సాక్ష్యముగ నున్నత దక్షిణ పాణిఁ జేసి భూ
పాగ్రణి నాదు దక్షిణ [4]కరాగ్రము వట్టితి కాన [5]మున్న పా
ణిగ్రహణంబు [6]సేసి తది నీ [7]యెడ విస్మృతిఁ బొందఁ బాడియే.

161 ఉ. నన్ను వివాహ[1]మై నహుషనందన యీలలితాంగిఁ [2]దొట్టి యీ
కన్నియ లందఱున్ దివిజ కన్యలతో [3]నెనయైనవారు నీ
కున్నతిఁ [4]బ్రీతి సేయఁగ నృపోత్తను వాసవుఁ బోలి లీలతో
నిన్నరలోక [5]భోగము లనేకము [6]లందుము నీవు నావుడున్

162 వ. క్షత్త్రియకన్యకల బ్రాహ్మణులు వివాహం బగుదురు గాక [1]యధర్మోత్తరంబుగా క్షత్త్రియులు బ్రాహ్మణకన్యకల వివాహం బగుదురే నీపలుకులు ధర్మవిరుద్ధంబులు [2]మఱియు సర్వ వర్ణాశ్రమ ధర్మంబులు [3]సంకరంబులు గాకుండ రక్షించుచున్న [4]యేన యిట్టి [5]యధర్మంబున కొడంబడితి నేని

159 1. యిది — ఈ.ఊ

160 1. మేర—య ; మేడ—ర ; మేల — గ.వ. 2 ధరణీవర — స పెక్కు ప్రతులు ; ధరణీశ్వర—కొన్ని ప్రతులు ; ఇచ్చట నఖండయతిగా భావింపఁ దగును. ధరణిప్రభ-వా ; ధరణీధవ — మ ; ధరణిప్రభు - ద. 3 సాక్షిగను-య ; సాక్షిగ సమున్నత-ల 4. కరాగ్రము— పెక్కు ప్రతులు ; కరాబ్జము - వా. 5 మున్ను — వా.శ 6 సేసితివి — కొన్ని ప్రతులు. 7. యెద—ఐ పీ.శ.ష.స

161 1. మైన వృషనందన—ర. 2. దొంటి - య ర. 3. సరి - ఇ 4. సేవ-అ. 5. సౌఖ్యము — ఆ.మ. 6. లందుదు — ర.

162 1. యధర్మ మార్గంబున — అ.ఏ.ట.ప ల ; ధర్మేతరంబుగా— న; యధర్మంబుగా — మ ; విపరీతంబుగా — వ. 2. 'మఱియు'— పెక్కుప్రతులలోలేదు. 3. సంకరంబు, నొంద — ఈ ; సంకరం బొంద — అ.ఆ ఐ.జ ; సంకరంబు వొంద—ర. 4. యేనిట్టి యధర్మ — కొన్ని ప్రతులు ; యేననీ యంద ధర్మంబు — స. 5. యధ

జగత్ప్రవృత్తి విపరీతం [6]బగునని యయ్యాతికి దేవయాని యిట్లనియె.

163 క. వెలయఁగ ధర్మాధర్మం,బులు [1]నడపుచు నిఖిలలోకపూజ్యుండై ని
ర్మలుఁ డగు శుక్రుఁడు [2]పంచిన, నలఘు[3]భుజా నను వివాహమగు దేయనినన్.

164 వ. అమ్మహాముని [1]వచ్చి యిది ధర్మవిరుద్ధంబు గాదని [2]చెప్పెనేని నిన్ను వివాహం బగుదు నని యయాతి యొడంబడిన దేవయాని [3]యప్పుడ శుక్రు [4]రావించిన.

165 క. తన దివ్య తేజమున స,ర్వవనమెల్ల వెలుంగుచుండ వచ్చెను భృగునం
దనుఁడు నిజనందనకుఁ బ్రియ, మొనరింపఁగఁ[1]దలఁచి దాని యొద్దకు [2]బ్రీతిన్.

166 క. అతి సంభ్రమమున నవనీ,పతి విహితోత్థాను డై తపశ్శక్తిఁ బ్రజా
పతి నిభుఁడగు భార్గవునకు, నతిభక్తిం బ్రణమితోత్తమాంగుం డయ్యెన్.

167 వ. మఱియు దేవయానియు శర్మిష్ఠయుం గన్యకా సహస్రంబును [1]నత్యంత భక్తితోఁ [2]గ్రమంబున నమస్కరించి రంత దేవయాని శుక్రున కిట్లనియె.

168 ఆ. ఇన్నరేంద్రుచేత మున్న గృహీత[1]మై, యున్న నాకరంబు గ్రన్ననింక
[2]నొరున [3]కర్హ మగునె పరిణయవిషయమై,[4]ధరఁ బరిగ్రహింపఁ బరమమూర్తి.

ర్మంబు చేసిన— పెక్కు ప్రతులు, యధర్మ చరితంబు చేసిన — ర 6. బగు గావున దీని కొడంబడనేర—అ.ఐ.ఒ.ము ; బగుఁ గావున నేనిట్లు సేయనేర — అ.త ర.

163 1. చెప్పుచు — అ.ఊ ట ద.న ర.స ; సలుపుచు — ఆ త బ.స , నొడువుచు — ఉ జ. 2. చెప్పిన — ఊ ; వచ్చిన—అ.ఏ.ఐ.ఒ.ట.న. 3. మతీ—ర స ; గుణా—అ.బ

164 1. 'వచ్చి'—పెక్కు ప్రతులలో లేదు. 2. చెప్పిన నేనిన్ను—బ య ; చెప్పిననిన్ను-అ.డ. 3 యప్పుడు—వా.శ. 4. నారాధించిన — ర.

165 1. ఎలసి ... సంతన్—స ; వలచి—య. 2. నంతన్—స.మ. పెక్కు ప్రతులు.

167 1. 'నత్యంత భక్తితో'— పెక్కు ప్రతులలో లేదు. 2. 'గ్రమంబున'—పెక్కు ప్రతులలో లేదు.

168 1. నై యున్న — కొన్ని ప్రతులు. 2. నొరుల—పెక్కు ప్రతులు. 3 యోగ్య—కొన్ని ప్రతులు. 4 యొరు—కొన్ని ప్రతులు.

169 వ. [1]కావున నాకు నీజన్మంబు[2]నఁ బతి యయాతియ [3]యితండును భవద్వచనం బున [4]నన్ను వివాహం బగుదు ననియె నిందు ధర్మ[5]విరోధంబు [6]లేకుండు నట్లుగాఁ బ్రసాదింప వలయు ననిన శుక్రుండు గరుణించి యయాతికి నీకును నయిన యీ వివాహంబునం [7]దపక్రమదోషంబు [8]లేకుండెడు మని వరంబిచ్చి [9]యయ్యిరువురకుం బరమోత్సవంబున వివాహంబుసేసి శర్మిష్ఠం జూపి యిది వృష[10]పర్వుని కూఁతురు దీనికిం బ్రియంబున నన్నపాన భూష ణాచ్ఛాదన మాల్యాను [11]లేపనాదుల సంతోషంబు సేయునది [12]శయన విషయబుంబు[13]నఁ బరిహరించు నది యని [14]పంచి కూఁతు నల్లునిం బూజించిన నయ్యయాతి[15]యు శుక్రు[16]ని వీడ్కొని[17]దేవయానిని శర్మిష్ఠను [18]గన్యకా సహస్రంబును దోడ్కొని[19]నిజపురంబునకుం జని యంతఃపుర [20]రమ్య[21]హర్మ్యతలంబున దేవయాని నునిచి [22]తదనుమతంబున నశోక [23]వనికాసమీపంబున నొక్కగృహంబు నందుఁ [24]గన్యకా సహస్రంబుతో శర్మిష్ఠ నునిచి దేవయాని యందు [25]సుఖోపభోగ[26]పరుండై యున్నఁ [27]గొండొక కాలంబునకు దేవయానికి యదు [28]తుర్వసు [29]లను కొడు కులు పుట్టి రంత శర్మిష్ఠ సంప్రాప్తయౌవనయు ఋతుమతియునై యాత్మ గతంబున.

169 1. కావున - పెక్కు ప్రతులలో లేదు. 2 నకు - ఎ.డ. 3. యితండు—వా. 4. నన్నుఁ బరమోత్సవంబున—య 5. విరుద్ధంబు – కొన్ని ప్రతులు 6. లేకుండ ప్రసా— పెక్కు ప్రతులు 7. దవక్రమ – అ ఊ.ఎ ; దతిక్రమణ–న. 8. లేకుండెడ మని - కొన్ని ప్రతులు ; పొందుకుండెడమని-ర. 9. యయ్యిరువురం-కొన్ని ప్రతులు. 10. పర్వుపుత్రి - కొన్ని ప్రతులు. 11 లేపనంబుల - కొన్ని ప్రతులు. 12. శయన-య. ప్రతిలో లేదు. 13. న — పెక్కు ప్రతులలో లేదు. 14. పంచి - కొన్నింట లేదు ; చెప్పి – ఖ ర. 15. యు — పెక్కు ప్రతులలో లేదు. 16 ని — పెక్కు ప్రతులలో లేదు. 17. దేవయానీ శర్మిష్ఠలం - మ. 18. గన్యకాసహస్రంబును - కొన్ని ప్రతులలో లేదు 19. తన – కొన్ని ప్రతులు. 20. రమ్య – పెక్కు ప్రతులలో లేదు. 21. హర్మ్యంబున - పెక్కు ప్రతులు. 22 తదనుమతి — కొన్ని ప్రతులు 23. వనికా సమీపగృహంబున — న.స , వనంబునం దాసన్న గృహం బున — ఈ ఉ ల స. 24. గన్యకా సహస్రంబుతో – కొన్ని ప్రతులలో లేదు. 25. సుఖ సంభోగ — ర. 26 పరవశుండై - న. 27 బెద్ద — స. పెక్కు ప్రతులు. 28. తుర్వసులు పుట్టిరంత – పెక్కు ప్రతులు. 29. లను నిద్దరు — న.

170 చ. అసదృశ యౌవనం బిది యనన్యధనం బగునొక్కొ నాకు ని
క్కుసుమసముద్గమంబును నగోచరదుర్గమదుర్గవల్లరీ
కుసుమ సముద్గమం బగు నొకో పతిలాభము లేమిఁ జేసి [1]యొ
ప్పెసఁ[2]గఁగ దేవయాని పతినేమి తపం బొనరించి కాంచెనో.

171 క. పతిఁ బడసి సుతులఁ బడయఁగ, నతివలు గోరుదురు గోరినట్టుల [1]తనకుం
బతిఁ బడసి సుతుల బడసెను, సతు లీభార్గవికి భాగ్యసంపద నెనయే.

172 తరువోజ. ఈరాజు[1]నంద నాహృదయంబు [2]దవిలి యెప్పుడు నుండు నన్ని తఁడు గరము
[3]కారుణ్యమునఁ బ్రీతి గల[4]యట్లు సూచుఁ గమలాక్షి భార్గవకన్య దానెట్లు
గోరి యీతనిఁ దనకును బతిఁ జేసి[5]కొని యె నటుల యేను గోరి లోకైక
భారధురంధరుఁ బర[6]హితు ధర్మపరు నహుషాత్మజుఁ బతిఁ జేసికొందు.

—: యయాతి శర్మిష్ఠకుఁ బుత్రదానంబు సేయుట :—

సం. 1-77-10

173 వ. అని విచారించు [1]చున్న [2]యవసరంబున దాని పుణ్యాస్వ[3]రూపంబు సన్ని
హితం[4]బైన యట్లొక్కనాఁడు యయాతి యశోకవనికాలోకన [5]తత్ప
రుండై వచ్చువాఁ [6]డేకతం[7]బ యున్న శర్మిష్ఠం గనిన నదియును [8]సం

170 1 పెంపెసగగ — అయ; యింపెసఁగఁగ — ర. 2. గెడు — హొ.స.

171 1. తానుం — స.

172 1. నందు — పెక్కు ప్రతులు. 2. తగిలి — పెక్కు ప్రతులు 3. గౌరవం
బున — అ; గౌరవమున — బు. 4. యట్లు — పెక్కు ప్రతులు. 5. కొనిన
యట్టుల—చ.శ ష. 6. హితు — కొన్ని ప్రతులు; హిత - వా. కొన్ని ప్రతులు.

173 1 చున్నంత — ఆ.మ వ; చున్న సమయంబున — హొ త.బ 2. యవస
రంబున — కొన్ని ప్రతులలో లేదు. 3. రూపంబున — ఊ.య ర. 4. బగున —
ఉ.ప.ఒ.న 5. పరుండై — పెక్కు ప్రతులు. 6. డేకాంతంబున — ఉ.బు.
7. బునన్న — ఉ.ఓ.త ర. 8. సంభ్రమంబున — కొన్ని ప్రతులు; నతిసంభ్ర

భ్రమ వినయావనత[9]యై తనవలన నమ్మహీపతి [10]ప్రసన్న చిత్తుం డగుట యెఱింగి కరకమలంబులు [11]మొగిచి యిట్లనియె

174 ఉ. నీలగళోపమాన కమనీయగుణోన్నతిఁ జెప్పఁ [1]జాలు న
న్నేలిన దేవయానికి నరేశ్వర భర్తవు గాన నాకునుం
బోలఁగ [2]భర్త వీవ యిది భూనుత ధర్మపథంబు నిక్కువం
బాలును దాసియున్ సుతుఁడు నన్నవి వాయని [3]ధర్మముల్ [4]మహిన్.

175 వ. అద్దేవయానిం బరిగ్రహించి నప్పుడ తద్ధనం [1]బగుట నేనును భవత్పరిగ్రహంబ కావున [2]నన్నుం గరుణించి నాకు ఋతుకాలోచితంబుఁ [3]బ్రసాదింపవలయు ననిన [4]నయ్యయాతి యిట్లనియె.

176 క. లలితాంగి శయన [1]మొక్కఁడు, వెలిగా రుచిరాన్నపాన వివిధాభరణా
దుల శర్మిష్ఠకు నిష్టము, [2]సొలయక చేయుమని [3]నన్ను శుక్రుఁడు పంచెన్.

177 వ. [1]ఏ నమ్మహాముని వచనంబున [2]కప్పుడొడంబడితి నెట్లు బొంక నేర్తు ననిన శర్మిష్ఠ యిట్లనియె.

మంబున — న ర. 9. వదనయై — య ర. 10. సంతుష్ట హృదయుం — ఔ.త; కారుణ్యచిత్తుం — అ.మ 11. మొగిడ్చి — ఎ.న.

174 1 నొప్పు — ఔ త ; బోలు — ఖ ; జాలి — ర. 2. నీవభర్తవిది — పెక్కు ప్రతులు 3. యర్థముల్ — పెక్కు ప్రతులు. 4. భువిన్ — న.

175 1. బన — ఇ. 2. నన్ను — పెక్కు ప్రతులలో లేదు. 3. బ్రసాదింపుమనిన — పెక్కు ప్రతులు. 4. దానికి యయాతి — పెక్కు ప్రతులు

176 1. మొక్కటి — కొన్ని ప్రతులు. 2 సొలవక — పెక్కు ప్రతులు. 3. పనిచె శుక్రుడునన్నున్ — పెక్కు ప్రతులు.

177 1. ఏనును నమ్మహా — పెక్కు ప్రతులు 2. కొడంబడితి — ఏ.ఐ.బ; నప్పుడొడంబడితి — ర.

178 క. చను బొంకఁగఁ [1]బ్రాణాత్యయమున సర్వధనాప[2]హారణమున [3]వధగా వ
చ్చిన విప్రార్థమున [4]వధూ, జనసంగమమున వివాహ సమయము[5]లందుక్.

179 వ. [1]ఈ యేనింటి[2]యందు నసత్యదోషంబు [3]లేదని మునివచ[4]న ప్రమాణంబు [5]గలదు నీవు [6]వివాహసమయంబున నొడంబడితివి కావున నసత్య[7]దోషం బునం [8]బొంద [9]వనిన నయ్యయాతి [10]యొడంబడి [11]శర్మిష్ఠకు నభిమతం బొనరించె [12]నదియుఁ దత్సమాగమంబున [13]గర్భిణియై కొడుకుం [14]గనిన [15]విస్మయపడి దేవయాని దానికడకు వచ్చి యిట్లనియె.

180 తే. బాలవయ్యు [1]నత్యుత్తమశీల వినయ, గౌరవాన్వితవై నిర్వికారవృత్తి
నున్న [2]నీకున్న యునికిన సన్నుతాంగి, సుతుఁడు పుట్టుట యిది గడుఁ
జోద్యమయ్యె.

178 1. బ్రాణవ్యయ — పెక్కు ప్రతులు. మూలము 'ప్రాణాత్యయే సర్వధనాపహారే' 2. హారమున — కొన్ని ప్రతులు. 3. వధి — ఒ బ.య. 4. గవాశనయానము లను — పెక్కు ప్రతులు. స. 5. దీనికి మూలము ననర్మయుక్తం వచనం హినస్తి, నస్త్రీషు రాజన్ నవివాహకాలే ప్రాణాత్యయే సర్వధనాపహారే, పంచా నృతాన్యాహు రపాతకాని భం. 1 — 77 — 16

179 1. ఇయ్యేనింటి — అ ఈ ర ; ఇయ్యేనింట — య ; ఈయేనిట — ఏ.జ డ. 2. యందును నసత్య — ఊ.ఎ ఓ.క.త.ద.బ ర. 3. లేదను — కొన్ని ప్రతులు 4. నంబుగలదు — కొన్ని ప్రతులు ; నంబు గలుగుటం జేసి — డ. 5. కలదు గావున — కొన్ని ప్రతులు , కలుగుటం జేసి —ఓ.ఔ త.ర. 6. మన్మనోరథంబు సఫలంబుసేయుమనిన నయ్యయాతి శర్మిష్ఠ — ఖ. 7 దోషంబునం బొందవు — న య, దోషంబు నిన్నుఁ బొందదనిన- వా. కొన్నిప్రతులు. 8 బొరయ—అ ఔ.త. 9. వనిన — కొన్ని ప్రతులు; దనిన - వా కొన్ని ప్రతులు. 10. యొడంబడి — పెక్కు ప్రతులలో లేదు. 11 శర్మిష్ఠ యభిమతం — ఇ; శర్మిష్ఠ కభిమతం—జ.ర , 12 నట్లు — పెక్కు ప్రతులు. 13 శర్మిష్ఠ గర్భిణియై — ర ; శర్మిష్ఠ గర్భంబై — కొన్ని ప్రతులు ; శర్మిష్ఠ గర్భంబుదాల్చి — న. 14. గనిన విని— కొన్ని ప్రతులు. 15. విస్మయపడి — కొన్ని ప్రతులు ; విస్మితయై — ఏ. ఖ , విస్మయం బంది — వా.

180 1. ను నత్యంత—ఈ.ఖ.జ య. 2. నీ యున్న యునికికి — య ; యునికికి నీకును — చ.వీ.శ.ష; యునికికి నిప్పుడు—ర.

181 వ. [1]అది యెట్లని యడిగిన శర్మిష్ఠ లజ్జావనతవదన [2]యయి యిట్లను నెందేని [3]నుండి యొక్కమహాముని నిఖిల వేదవేదాంగపారగుం[4]డు వచ్చి ఋతుమతినై యున్న [5]నన్నుం జూచి నాకుఁ [6]బుత్త్రోత్పత్తిఁ బ్రసాదించె ననిన విని దేవయాని [7]నిజనివాసంబునకుం జనియె [8]శర్మిష్ఠయు నయ్యయాతి వలనఁ గ్రమంబున ద్రుహ్యానుపూరు లనంగా ముగ్గురు గొడుకులం బడసి యున్నంత నొక్కనాఁడు.

182 సీ. కరువలిచేఁ దూలు కపిల[1]జటాలియ కరమొప్పు శిఖలుగాఁ గనకరత్న
మయజాలభూషణామల దేహదీప్తుల తేజంబు[2]గాఁ బ్రవిదీప్యమాన
యాగశతంబుల [3]నర్చితం బైన మూఁడగ్నులు ప్రత్యక్షమైన యట్లు
దనమ్రోల శర్మిష్ఠతనయులు గ్రీడించుచుండంగ [4]నున్న యయ్యుర్వీశుని
ఆ. కడకు [5]నేఁగు [6]దెంచెఁ గన్యలు దనుజాధిరాజసుతయుఁ దోడరాఁగ[7]నొప్పి
దేవి దేవయాని దేవేంద్రు దేవియపోలె నెంతయును విభూతి మెఱసి.

183 వ. ఇట్లరుగుదెంచి యధికతేజస్వు[1]లయి యయాతి ప్రతి[2]బింబంబులు [3]బోని యబ్బాలకులం జూచి [4]యిక్కుమారు లెక్కడి [5]వారెవ్వరి కొడుకు లని [6]యయాతి నడిగి యలబ్ధప్రతివచనయై మీ[7]తల్లిదండ్రు లెవ్వ రని యక్కుమారుల నడిగిన.

181 1. ఇది — కొన్ని ప్రతులు. 2 యయి యెందేని — అ.ఏ.ఖ.య.ర. 3. యు నుండి — కొన్ని ప్రతులు. 4 డైన బ్రహ్మవిదుండు — ఔ.త; డును నకల దేశభాషా విదుండును నైన బ్రహ్మవిదుండు — అ. 5 నన్ను — అప; లలోలేదు; నన్నుంజూచి — అ డ.న బ మ.య.ర.లలోలేదు. 6. బుత్త్రిదానంబు—వ. 7. నిజంబుగాఁదలఁచి నిజ — వ. 8 నంత శర్మిష్ఠ — ఔ గ.ట.న; నిటశర్మిష్ఠ — మ. 9. పూరులం బడసి — ఇ ద.

182 1. జటావలి — పెక్కు ప్రతులు. 2. గాగబ్రదీప్తమాన — ఓ.య; గాఁబ్రతిదీప్యమాన — ర; గానతిదీప్య — చ.ల.వి.శ ష. 3 నర్చితులైన — కొన్ని ప్రతులు. 4. నప్పుడయ్యుర్వీ — య. 5. నరుగు — ఇ.ఈ.ఉ.ఓ. 6. దెంచి — కొన్ని ప్రతులు. 7. నొప్పె — కొన్ని ప్రతులు

183 1 లైన — అ.ఉ.జ య.ర. 2. బింబంబులు — పెక్కు ప్రతులు; రూపంబులుం బోని — వా. మున్నగు ప్రతులు 3. బోలెనున్న — పెక్కు ప్రతులు; బోలియున్న — కొన్ని ప్రతులు. 4 యక్కుమారు — వా. 5. వారలెవ్వరి — అ ఏ.ఓ.క.ఖ.య. 6 యారాజు — కొన్ని ప్రతులు; రాజు నడిగిన — కొన్ని ప్రతులు 7· తల్లియు దండ్రియు నెవ్వ — కొన్ని ప్రతులు

184 క. [1]తరుణప్రదేశిను[2]లు [3]మూ,సరముగ వారలు యయాతిశర్మిష్ఠలఁ జూ
పిరి తండ్రియుఁ దల్లియు నని, కర మనురాగిల్లెఁ గన్యకా నివహంబుల్.

185 వ. ఇట్లు దన్నెఱుంగకుండ [1]యయాతి శర్మిష్ఠ[2]వలన లబ్ధసంతానుండగుట
యప్పుడెఱింగి.

186 చ. [1]పతివిహితానురాగమున [2]భార్గవపుత్త్రి యయాతిచేత వం
చిత యయి వాఁడు దానవికిఁ జేసిన నెయ్య మెఱింగి కోపదుః
ఖిత [3]యయి తండ్రిపాలి కతిఖేదమునం జని దీర్ఘనేత్రని
ర్గతజలధారలం [4]గడిగెఁ గాంత తదీయ పదాబ్జయుగ్మమున్.

—: *శుక్రుఁడు యయాతికి శాపం బిచ్చుట* :—

సం. 1-78-24

187 వ. [1]అయ్యయాతియు దానిం బట్టువఱచుచుఁ దోడన చని [2]శుక్రుంగని [3]నమ
స్కరించి యున్న నద్దేవయాని గద్గదవచనయై యధర్మంబున ధర్మంబు
గీడ్వఱిచి యిమ్మహీశుం డాసురంబున నాసురియం దనురక్తుండై పుత్త్ర
త్రయంబు వడసి నా కవమానంబు సేసె ననిన విని శుక్రుండు యయాతి
కలిగి [4]నీవు యౌవనగర్వంబున [5]రాగాంధుండవై నాకూఁతున [6]కప్రి
యంబు సేసితివి కావున జరాభారపీడితుండ[7]వు గమ్మని శాపం బిచ్చిన
నయ్యయాతి [8]శుక్రున కిట్లనియె.

184 1. తరణి ప్రతి తేజో గోచరులగు వారల— న. 2 ల—వా ళ. 3. భాస్కరవర
మూర్తులు యయాతి – ద.

185 1. నయ్యయాతి—వా ళ. 2. యందు – ర.

186 1. ప్రతివిహితా – స భాసం. 2. భార్గవ పుత్రి – కొన్నిప్రతులు. 3 మతి —
ఇ.ద.వ; తన– ఋ.ల. 4. దడిపె—స

187 1. అంత నయ్యయాతియు—ర. 2 శుక్రునకు నమస్కరించి— ఆ.మ.ర. 3. నమ
స్కారంబుచేసి— ఈ ఐ.ఓ.గ. 4. నీవు — కొన్ని ప్రతులలో లేదు. 5. మదాం
ధుండవై —కొన్నిప్రతులు. 6. కవమానంబు—ఆ.మ 7 వగుమని— ఈ.ఋ.ఎ.య.
ర వ. 8. యిట్లనియె — పెక్కుప్రతులు.

188 క. ఋతుమతియై పుత్త్రార్థము, పతిఁ గోరిన భార్య[1]యందు బ్రతికూలుండై
ఋతువిఫలత్వము సేసిన, [2]యతనికి మఱి భ్రూణహత్య యగు నండ్రు
[3]బుధుల్.

189 క. దానికి భీతుఁడ నై [1]యమ్మానవతీ ప్రార్థనం [2]గ్రమంబొనరఁగ సం
తానము వడసితి నెదలో, దీనికి [3]నలుగంగఁ[4]దగునె దివ్యమునీంద్రా.

190 వ. ఏ నిద్దేవయాని యందు విషయోపభోగతృప్తుండఁ గాను జరాభారంబుఁ
దాల్పనోప [1]నని ప్రార్థించిన విని వానికి శుక్రుండు గరుణించి [2]యట్లేని
నీముదిమి నీకొడుకులయం [3]దొక్కరుని పయిం బెట్టి వాని జవ్వనంబు
నీవుగొని రాజ్యసుఖంబు లనుభవింపుము నీవు విషయోపభోగతృప్తుండ
[4]వైన [5]మఱి నీముదిమి [6]నీవ తాల్చి వాని జవ్వనంబు వానికి నిచ్చునది
నీముదిమిఁ దాల్చిన పుత్త్రుండ రాజ్యంబున [7]కర్హుండును వంశకర్తయు
నగు నవిన నయ్యయాతి [8]శుక్రు వీడ్కొని దేవయానీసహితుండై తన
పురంబునకు వచ్చి శుక్రుశాపంబున జరాభారంబుఁ [9]దాల్చిన వానికి.

---

188 1 వలన—ఏ 2 నతనికి — వా.శ. కొన్ని ప్రతులు. 3 మునుల్ — ఆ.ఇ.
ఐ ఓ యు; జనుల్ — ఔ.క.బ.

189 1. యమ్మానినిని ప్రార్థించినం— ద.స; యమ్మానినిని ప్రార్థింపఁ గడుసమత్వమునను—
ఊ. 2. క్రమంబున మఱి—న 3. కోపింప— అ స 4. నగునె— ఉ.ర స;
నేల — కొన్ని ప్రతులు; జనునె — య.స.

190 1. నవినవానికి— పెక్కుప్రతులు. 2. యట్లేని— కొన్నిప్రతులలో లేదు; యిట్లని
యె— ర 3. దొక్కని— కొన్ని ప్రతులు; దొక్కనిపై — కొన్ని ప్రతులు;
[illegible] దొకనికిచ్చివాని—ఔ ఖ.త.న. 4. వగుము మఱియు — న.
5. మఱి— పెక్కుప్రతులలో లేదు, మఱియు— కొన్నిప్రతులు; మఱి....నిచ్చునది
కొన్నిప్రతులలో లేదు 6. నీవ — పెక్కుప్రతులలో లేదు 7. కర్హుండగు ననిన
నయ్యయాతి — పెక్కు ప్రతులు ; కొడయుండగు ననిన నయ్యయాతి — న ; కుయో
గ్యుండనిన — ఊ.ఐ.య. 8. శుక్రు వీడ్కొని — కొన్ని ప్రతులలో లేదు. 9.
దాల్చినంత— ర.

191 క. తల పడఁకఁ[1]దొడఁగె నింద్రియ,ముల [2]గర్వమడంగె నంగములు [3]వదలె వళీ
పలితంబు లయ్యె వగరుసు, దల[4]యేరును [5]నుక్కిసయును [6]దరికొను
దెంచెన్.

–: యయాతి యదుప్రముఖులకు శాపంబిచ్చుట :–

సం. 1‑79‑1

192 వ. ఇట్లు జరాక్రాంతుం[1]డైన యయాతి [2]గొడుకుల నెల్ల రావించి నాకు [3]విషయసుఖతృప్తి [4]లేకున్న యది గావున మీ యందొక్కరుండు నా ముదిమి గొని తనజవ్వనంబు నా కిచ్చునది యనిన విని యదు తుర్వసు ద్రుహ్యానులు దండ్రి కిట్లనిరి.

193 ఆ. తగిలి [1]జరయు రుజయు దైవ[2]వశంబున,[3]నయ్యెనేని [4]వాని [5]ననుభవింత్రు
గాక యెఱిఁగి యెఱిఁగి కడఁగి [6]యారెంటిఁ జే,కొందురయ్య యెట్టి
[7]కుమతులైన.

194 క. [1]నరలుగల [2]కాముసైనను, దరుణులు రోయుదురు [3]డాయ ధనపతి
[4]యయ్యుం
బురుషుఁడు దుర్వారజరా, [5]పరిభూతి [6]సక్షీణభోగబాహ్యుఁడ కాఁడే.

191 1. జొచ్చె—ఇ 2 గర్వములడగె—కొన్ని ప్రతులు 3 వదలి — కొన్ని ప్రతులు. 4. యదురును—ద ; యేరుపు—ఊ ఎ.ట 5 నుక్కెస—కొన్ని ప్రతులు ; కక్కెస— ఊ 6. దరికొనుదెంచెన్— ఇ ఎ.స ; దరికొన దోచెన్‑బ ; దరికొనజొచ్చెన్—క ; దళముగఁ బర్వెన్ — న ; దలకొనుదెంచెన్—వా.

192 1. సైయయాతి — పెక్కు ప్రతులు. 2. కొడుకులం బిలిచి నాకు — పెక్కు ప్రతులు. 3. విషయతృప్తి — ఇ ఓ డ ద , విషయోపభోగతృప్తి—అ. 4. గాకయున్నది — ఉ.బు ద , చాలకయున్నది—ఊ

193 1. రుజయు జరయు — కొన్ని ప్రతులు. 2. యోగంబున — అ 3. నందెనేని — య 4. తార — స ; దాని — కొన్ని ప్రతులు. 5. ననుభవింప — అ.బు.ఏ.ట. 6 యా — అ.ఇ ఎ ఏ.ఔ త.య 7. కుజనులైన — వ

194 1. నెరలు — న. 2. మరునికైనను — స 3. గవయ — ఖ.స 4. యైనన్ — ఊ క.ద.మ వ. 5 పరిభూతుడక్షీష్ట—ద.య ; పరిపీడితుఁడైనభోగ—న 6. నశేష—బ

195 వ. అని యొడంబడ కున్న నలిగి యయాతి యదువంశంబున వారు రాజ్యంబున [1]కయోగ్యులుగాఁ దుర్వసువంశంబునవారు ధర్మాధర్మ వివేకశూన్యు[2]లై [3]సంకీర్ణ[4]వర్ణ[5]కిరాతులకు రాజులుగా ద్రుహ్యువంశంబున[6]వారు డుపప్లవ [7]సంతార్యం బైన దేశం[8]బునకు రాజులుగా జరాదూషకుం డగుట ననువంశంబునవారు[9]ముదియు నంతకునుండక జవ్వనంబునన[10]పంచత్వంబున కరుగువారునుం గా శాపంబిచ్చి యానలువురకుం [11]గొండుకవాని శర్మిష్ఠాపుత్త్రుఁ బూరుం బిలిచి యడిగినవాఁడు దండ్రికోరినయట్ల [12]చేసిన నవయౌవనుండై [13]యయాతియభిమత[14]సుఖంబులు సహస్రవర్షంబు [15]లనుభవించి [16]తృప్తుండై పూరుజవ్వనంబు [17]వానికయిచ్చి [18]తనజరాభారంబుఁ [19]దాన [20]తాల్చి నిజాజ్ఞానిధేయ చతురంతమహీతల బ్రహ్మ[21]క్షత్త్రాదివర్ణముఖ్యుల నెల్ల [22]రావించి మంత్రి పురోహిత [23]సామంత పౌరజన సమక్షంబున [24]సకలక్షోణీచక్రసామ్రాజ్యంబునకుఁ బూరు నభిషిక్తుం జేసిన సర్వప్రకృతి[25]జనంబు లారాజున కిట్లనిరి.

195 1 కనర్హులుగా—చ వీ శ ష.స ; కర్హులుగాకయుండను—ట.ప.ల ; యోగ్యులు గాకుండను — బ ర. 2. లైన — కొన్ని ప్రతులు 3. సంకీర్ణవర్ణ — మ. 4 వ — కొన్ని ప్రతులలో లేదు. 5. కిరాత దేశంబునకు—చ.య.ల వీ.శ ష. 6 వా రుదక వరహితం బైన — పెక్కు ప్రతులు , ఇచ్చట మూలము ''ఉడుపప్లవసంతారో యత్ర శ్యామ్ భవిష్యతి'' భం ప్రతి 1 — 79 — 19. వా రుదకరహితం బైన — ఏ.క.ఖ య. 7. రహితం బైన — న 8. బులకు — కొన్ని ప్రతులు. 9. ముదిమియగు — ద.బ శ 10. పంచత్వంబును బొందువారు — ఆ చ ల.వీ.శ.ష,పంచత్వంబునొందువారు—ఒ.ఖ గ.య ; పంచత్వంబునకుం జనువారు — ఋ 11. గొండిక—ఇ.చ శ.ష స; గొండొక — ఐ.ఓ.క.గ జ.ల.వీ స.12. యప్పనికి నొడంబడిన — న ; యిచ్చిన — అ.ట.ప. 13. యయాతి — పెక్కుప్రతులలో లేదు ; పెద్దకాలంబు—న. 14. సుఖంబు లనుభవించి తృప్తుండై—పెక్కు ప్రతులు 15 లనుభవించుచు— లనుభవించి తృప్తుండై కొంత కాలమునకు — ఈ ఓ 16. తృప్తుండై పూరుం బిలిచి యేను సహస్రవర్షంబులు జవ్వనం బనుభవించితినని పూరుజవ్వనంబు — న. 17. పూరున కిచ్చి—గ.న. 18. తాను— కొన్ని ప్రతులు. 19 దాన—పెక్కింటలేదు. 20. తాల్చియయాతి — పెక్కుప్రతులు. 21. క్షత్రవిట్ఛూద్రాది— న. 22. బిలిపించి — మ 23. సామంతానంతపౌర — వా శ. 24 నిఖిల—కొన్ని ప్రతులు ; నఖిల—కొన్ని ప్రతులు 25. జనులారాజున— ఋ ఐ ద ; జనులు—ప.

196 మ. అవిచారంబని పల్క [1]నోడెదము ధర్మాభిజ్ఞ నీ యగ్రసం
భవుఁ [2]డత్యున్నతశక్తియుక్తుఁడు మహీ[3]భారప్రగల్భుండు భా
ర్గవదౌహిత్రుఁడు పాత్రుఁడీ యదుఁడు లోకఖ్యాతుఁ డుండంగ నీ
[4]భువనేశత్వభరంబుఁ బూన్పఁ [5]దగునే పూరుం జఘన్యాత్మజున్.

197 వ. [1]అనిన [2]వారల కయ్యయాతి యిట్లనియె.

198 క. యదుఁ డగ్రతనూజుఁడు నా,హృదయసముద్భవుఁడు [1]దానయిన మద్వచనం
బిది [2]యేటిది యని కడు[3]దు,ర్మదుఁడై చేయక కృతావమానుం డయ్యెం.

199 క. తనయుండు దల్లిదండ్రులు, పనిచినపని సేయఁడేని పలు[1]కెడలోఁ జే
కొనఁడేని వాఁడు తనయుం,డనఁ [2]బడునే పితృధనమున కర్హుం డగునే.

200 క. పూరుఁడు [1]గొండుక యయ్యును, భూరిగుణ[2]జ్యేష్ఠుఁ[3]డును సుపుత్త్రుఁడు నవనీ
[4]భారస[5]సహిష్ణుఁడు నాతఁడ, కోరినకార్యంబు [6]దీర్చి కుశలుం డగుటన్.

201 వ. నా జరాభారంబుఁ [1]దాల్చిన పుత్త్రుండ [2]రాజ్యంబు[3]న కర్హుండును వంశ
కర్తయు [4]నగు శుక్రవచనంబును నిట్టిద యని యయాతి ప్రకృతి[5]జనం

196 1 నోడుదుము—య ల కొన్ని ప్రతులు. 2 డత్యంతము—మ 3. భారంబు దాల్పంగ — మ. 4. భువనైకత్వ — ప ఖ.య.వ 5. నగునే — త.ద.న

197 1 అనిన విని — ఔ.త. 2. వారల పలుకుల — య

198 1. వాఁడ — వా ళ. కొన్ని ప్రతులు ; దానయిన — డ 2. యెట్టిది— కొన్ని ప్రతులు. 3 దుర్మదమున జేయక — బ య.

199 1. కెద—స మఱికొన్ని ప్రతులు. 2 జనునే—బు ; దగునే — న.

200 1. గొండొక — కొన్ని ప్రతులు ; గొండిక—ఈ.బు.ఔ క గ[1] జ.ట.ద.ల., బాలుండ య్యును—న 2 శ్రేష్ఠుఁడు—కొన్ని ప్రతులు. 3. డధిక పుణ్యుడు — బ.య 4. భారకుడును నాతడు నా —ఎ.చ.శ ష. 5. సహిష్ణుండు ననా—స 6 చేసి — స. పెక్కు ప్రతులు.

201 1. పూనిన—ఖ. 2. రాజ్యభారయోగ్యుండును—న.య. 3. నకుయోగ్యుండును— కొన్ని ప్రతులు. 4. నగునని—స కొన్ని ప్రతులు. 5. జనంబుల నెల్ల—న.

బుఁ గొడంబఱిచి పూరు నఖిల[6]భూభారధురంధరుం జేసి యదుప్రభృతులఁ [7]బ్రత్యంతభూములకు రాజులం జేసి [8]తాను వేదవేదాంగ[9]పారగు లయిన బ్రాహ్మణులతోడం దపోవనంబునకుం జని యందు గందమూలఫలాశనుండై వన్యంబులయిన [10]ఫలంబుల హవ్యకవ్యంబుల నగ్నిభట్టార[11]కుం బితృదేవతలం దనుపుచు వానప్రస్థవిధానంబుఁ దప్పక శిలోంఛవృత్తి నతిథిభుక్తశేషం [12]బుపయోగించుచు [13]నియతాత్ముండై [14]జితారి[15]షడ్వర్గుండును నయి సహస్రవర్షంబులు [16]దపంబు సలిపి సర్వసంగ విముక్తుండై సర్వద్వంద్వంబులు[17]ను విడిచి ముప్పదియేండ్లు నిరాహారుం డయి యొక్కయేఁడు వాయుభ[18]క్షకుండయి పంచాగ్నిమధ్యంబున నిల్చి యొక్కయేఁడు [19]నీటిలో నేకపాదంబున [20]నిలిచి [21]మహాఘోరతపంబు [22]సేసి దివ్య[23]విమానంబున దేవలోకంబునకుం జని యందు [24]దేవర్షిగణ పూజితుండై బ్రహ్మలోకంబునకుం జని యందు బ్రహ్మర్షిగణపూజితుండై [25]యనేకకల్పంబు లుండి [26]కమ్మఱ నింద్రలోకంబునకు వచ్చిన నింద్రుండు వానిం [27]బూజించి యిట్లనియె.

202 ఆ. కొడుకు జవ్వనంబుఁ గొని[1]నీవు నిజరాజ్య,భూరిభరము వానిఁ బూన్చునప్పు
డతని కెద్ది గఱపి తని యడిగిన హా౽,కయ్యయాతి యిట్టు [2]లనుచుఁబలికె.

6. మహీభార—ఇ ఊ బ 7. ప్రత్యేక—ఔ ట.ద.ప య. 8. తాను—పెక్కింట లేదు 9. విదులయిన—పెక్కు ప్రతులు. 10. ఫలంబుల—పెక్కింట లేదు. 11. కుం బ్రీతుం జేసి పితృ—న. 12 బుపయోగింపుచు—కొన్ని ప్రతులు 13. సంయమితాత్ముండై—ఐ.న మ. 14. జితారిషడ్వర్గుండై— ఈ.ఉ.ఓ జ. 15 షడ్వర్గుండై—చ న వీ.ల శ ష. 16 దపంబు—పెక్కింటలేదు ; సలిలమధ్యంబున సర్వద్వంద్వంబులు విడిచి—య. 17 నొడిచి—అ ఇ క.న 18. కుండయి— పెక్కు ప్రతులు 19. నీరిలో—పెక్కు ప్రతులు. 20. నుండి—కొన్ని ప్రతులు. 21. మహా— పెక్కింట లేదు ; యిట్లు—బు ప.య. 22. సేసిన ఇంద్రుండు ప్రత్యక్షుండై తోడుకొనిపోయిన—ఔ.త ; సేసిన ఇంద్రుండు ప్రత్యక్షుండై దివ్య విమానం బొసంగిన దానినెక్కి దేవలోకంబు—ల.స 23. విమానారూఢుండై—ప.ఓ.ఔ.త 24. దేవగణ— పెక్కు ప్రతులు 25. యనేక కల్పంబులుండి — 'మ' ప్రతిలో లేదు. 26. క్రమ్మరియింద్ర — పెక్కు ప్రతులు 27. జూచి—అ.ఈ.ఓ.ఔ జ

202 1. నీవునీ రాజ్య — కొన్ని ప్రతులు ; యిచ్చి భూచక్ర — స. 2. లనియె బ్రీతి — ఒ.ఔ.ట.త న.ప వ ; లనియు జెప్పె — ఈ.ఊ.య ; లనుచు జెప్పె — ఖ మ.వ.

## -: యయాతి పూరునకు బోధించిన నీతులు :-

సం. 1—82—6

203 క. ఎఱుకగలవారి చరితలు, గఱచుచు సజ్జనులగోష్ఠిఁ [1]గదలక ధర్మం
బెఱుఁగుచు నెఱిఁగిన [2]దానిని, మఱవ కనుష్ఠించునది [3]సమంజసబుద్ధిన్.

204 క. ఇచ్చునది [1]పాత్రునకు ధన, మిచ్చుగ వోరువేఁడ కుండునది యభిముఖులై
వచ్చిన [2]యాశార్థుల పృథ,పుచ్చక [3]చేయునది సర్వభూతప్రీతిన్.

205 క. మనమునకుఁ బ్రియంబును హిత,మును బథ్యముఁ దథ్యమును నమోఘము మధురం
బును [1]బరిమితమును నగుపలు, కొనరఁగఁ బలుకునది ధర్మయుతముగ సభలన్.

206 సీ. వదన బాణాసన వ్యక్తముక్తములైన పలుకు [1]లన్కాడు వాఁడిబాణతతులఁ
బరమర్మలక్ష్యముల్ పాయక భేదించు చుండెడు దుర్జన యోధవరుల
కడ[2]నుండ కున్నది కరుణ యార్జవ మతుజయము సత్యం[3]బును శమము శౌచ
మను[4]నివి యెద నిల్పు[5]నది శత్రు షడ్వర్గ జయమందునది శుద్ధ శాంత బుద్ధి

తే. [6]మదముఁ గామము గ్రోధంబు మత్సరంబు [7]లోభమును మోహమును [8]నను లోనిసహజ
వైరివర్గంబు [9]నోడిచిన వాఁడ యొడుచు నశ్రమంబున [10]వెలుపలి [11]యహితతతుల.

203 1. గడవక — ద. 2. నన్నియు — ఔ. 3. సముంచిత — మ.వ ల. స ; సమస్థిర — పెక్కు ప్రతులు ; సమాహిత — ఊ.

204 1. ధనము పాత్రున కచ్చుగ — వా శ 2. యతిథిజనుల — ఊ . సాధుజనుల — న. 3. యుండునది — కొన్నిప్రతులు ; యిచ్చునది — ఔ.త.డ బ.య.

205 1. బరహిత — ఔ.ట.త.ప ; నభిమతమును నగు — బ.

206 1. లనెడి — ఎ ; లన్నోకవ్వాడి — త. 2. బోవ — ద. 3. బుపశమము — ఇ.ఊ. ఋ ఐ.ర. 4 వీని నెద — వా ; నవి — న 5. కొని — వ. 6. మానమును గామమును గ్రోధమత్సరములు — పెక్కు ప్రతులు. 7. లోభ మోహంబులును నను — ఋ.ట.త ప. 8. నాగ — ఐ 9. నుడిచిన వాడయుడుచు — స. 10 వెలి కృత్రిమారితతుల — ద. 11 యవనిపతుల — ద.

207 వ. అని పూరుం గఱపితి నమ్మహాపురుషుం [1]దొరులకుఁ గఱపు[2]నట్టి సర్వ గుణసంపన్నుం డనిన విని యింద్రుండు వెండియు నయ్యయాతి కిట్లనియె.

208 క. ఏమి తపం బొనరించితి, భూమీశ్వర పుణ్యలోక[1]భోగంబులఁ దే జోమహిమ ననుభవించితి, సామాన్యమె శతసహస్రసంవత్సరముల్.

209 వ. అనిన నయ్యింద్రున కయ్యయాతి యిట్లనియె.

210 క. సుర దైత్య యక్ష రాక్షస, నర [1]ఖేచర సిద్ధ మునిగణ [2]ప్రవరుల ఖా సురతపములు నా దగు దుష్కరఘోరతపంబు [3]సరియుఁగా వమరేంద్రా.

*—: ఇంద్రుండు యయాతిని స్వర్గలోక భ్రష్టునిఁ జేయుట :—*

సం. 1—83-3

211 వ. అని [1]తపోభిమానంబున [2]మహర్షులతపంబు [3]లవమానించి పలికిన నయ్యయాతి [4]గర్వంబునకు సహింపక యింద్రుం డలిగి నీకు దేవలోక సుఖాను [5]భవంబు [6]ఇందుఁ బుణ్యసమాప్తి యయ్యె నీగర్వంబు నిన్నింతసేసె నింక నధోలోకంబున కరుగు మనిన [7]వాఁడును మనుష్యలోకంబునకుం బోవ నోప నంతరిక్షుంబున [8]సద్భువనంబున [9]సత్సంగతి నుండునట్లుగా నాకుఁ [10]బ్రసాదింపు మని యింద్రు [11]ననుమతంబు వడసి.

207 [1]. దొరులు [illegible] — ర. 2. నట్టివాఁడు సర్వ — ఊ.ద యు

208 1. భోగంబులు — కొన్నిప్రతులు , భోగఫలము—ఊ.

210 1. కిన్నర— ఏ. 2. ప్రతతుల—ర. 3. సవతు —; ఋ.చ ద వీ.శ ష ; సమము — ఒ.ప

211 1. తన తపోభిమానంబున—వా శ, తపోవిభవాభిమానంబున-ఊ 2 మహాపురుషుల— కొన్నిప్రతులు. 3. లవమానించిన యయాతి — పెక్కుప్రతులు 4. గర్వంబు సహింపక — పెక్కు ప్రతులు 5 భోగంబునందు — ప. 6 నందు — పెక్కు ప్రతులు. 7. నయ్యయాతియు నేనధోలోకంబు — కొన్నిప్రతులు 8. సద్భువనంబు — ఆ.ప.క 9 సత్సంగంబున — మ. 10 ప్రసాదింప వలయునని — చ పి ల శ.ష 11. ననుమతి — ఊ.ఋ.ఒ వ

212 తే. అంతరిక్షంబు [1]వలన దిగంతరములు, వెలుగఁ జనుదెంచు నాతని [2]విమలదీప్తి
సూచి [3]సద్గణములు గడుఁ జోద్యమంది, రురుతరద్యుతి యిది యేమి
యొకొ యనుచు.

213 వ. అంత నయ్యయాతి దౌహిత్రులైన యష్టకుండును [1]బ్రితర్దనుండును [2]వసుమంతుండును నౌశీనరుండయిన శిబియు ననువారలు సద్భువన నివాసులు దమ యొద్దకుం జనుదెంచిన యయాతి నధికతేజోమయు ననంత పుణ్యమూర్తిం గని నిసర్గస్నేహంబున నభ్యాగతపూజల [3]సంతుష్టుం జేసి [4]నీవెవ్వండ వెందుండి యేమికారణంబున నిందులకు వచ్చితని యడిగిన వారలకు నయ్యయాతి యిట్లనియె.

214 క. అనవద్య ధర్మచరితం,బున నున్నతుఁడైన [1]నహుషుపుత్త్రుఁడఁ బూరుం
డను మధ్యమలోకేశ్వరు,జన[2]కుండ యయాతి యనఁగఁ[3]జని యెడు వాఁడన్.

215 క. [1]అమిత తపోవిభవంబున,, గమలజులోకంబు మొదలుగాఁ గల సురలో
కములందుఁ బుణ్యఫలములఁ, గ్రమమున భోగించి యింద్రు[2]కడ కేఁ జనినన్.

216 క. సురపతి నాతపమున కచ్చెరువడి నీతపము పేర్మిఁ జెప్పుమ యనినన్
సుర సిద్ధ మునీంద్ర [1]తపశ్చరణలు నాతపముతోడ సరి[2]గా వంటిన్.

212 1 నఖిల దిగంతములును — నఖిలదిగంతరములు — కొన్నిప్రతులు 2. విపుల— ఋ.స. 3 సురగణములు — ఋ.ఏ.గ య

213 1. బ్రవర్ధనుండును — పెక్కుప్రతులు. 2 వసుమానుండును — కొన్నిప్రతులు; సుమనుండ, వసుమనుండు, వసుమన్యుండు — అని భిన్నప్రతులలో భిన్నరూపము లున్నవి. 3. సత్కృతుం — మ య పెక్కుప్రతులు 4. నీవెందుండి యేమి — పెక్కుప్రతులు.

214 1 నహుషపౌత్త్రుడుపూరుం — ద. 2. కుఁ డను—ఊ.ట.ప. 3. నడిననువాఁడన్— గ్రి$_1$.స. శర ; జాలినవాడన్ — ఈ.ఉ.ప.జ డ స.

215 1 అమలతపో—ఈ.ఊ. 2 కడకుం — కొన్నిప్రతులు.

216 1. తపశ్చరితలు — పెక్కుప్రతులు. 2 రావంటిన్—ఓ.

217 చ. అమరవిభుండు దాని విని యల్గి [1]మదంబున నుత్తమావమా
నము దగునయ్య్ చేయ నని నన్ను నధోభువన [2]ప్రపాత సం
భ్రమ వివశాత్ముఁ జేసె నది [3]పాడియ యెందును నల్పమయ్యు [4]ద
ర్పము బహుకాల సంచిత తపఃఫలహాని యొనర్చుకుండునే.

218 వ. [1]ఇట్లు కుపితశతమఖవచన[2]ప్రపీడితుండ నయి తదాదేశంబున [3]సద్భువ
నంబునకు వచ్చితి ననిన నాతండు దమకు మాతామహుం [4]డగుటయు
నతనిమహత్త్వంబును [5]సార్వలౌకికత్వంబును సర్వజ్ఞానసంపత్తియు
నెఱింగి యష్టకాదులు సకలధర్మాధర్మంబులు సుగతిదుర్గతి స్వరూపంబులు
జీవుల గర్భోత్పత్తి ప్రకారంబులు [6]వర్ణాశ్రమధర్మంబులు నడిగిన వారల
కయ్యయాతి యిట్లనియె.

*—: యయాతి యష్టకాదు లడిగిన ప్రశ్నలకు సంక్షేప రూపంబున*
*సమాధానంబు లొసఁగుట :—*

సం. 1—84—3

219 ఆ. [1]సర్వభూతదయకు సత్యవాక్యమునకు, నుత్తమంబు [2]ధర్మ వొండెఱుంగ
[3]నొరుల నొప్పి [4]కోడ కుపతాప మొనరించు, నదియ కడు నధర్మ[5]మనిరి
[6]బుధులు.

220 ఆ. వేదవిహితవిధుల నాదరించుట యూర్ధ్వ,గతికిఁ దెరువు విధులఁ గడచి
యెందు
నాఁగఁ బడినవాని [1]లోఁగక చేయుట,యధమగతికి మార్గ మనిరి[2]మునులు.

217 1. మనంబున — ఊ ఓ ; ముదంబున — క 2 ప్రవాస — ఐ బ ; ప్రతాప —
కొన్నిప్రతులు · 3 పాటియె — ఓ 4 గర్వము — ఊ.

218 1. అట్లు — ఉ ఋ 2. ప్రేరితుండ — ఊ ; ప్రతిహతుండ — ఔ ట త.ప.ర. 3.
నిందులకు—ఏ. 4 డగుటను—మ. 5 సర్వలోకైకత్వంబును — ఔ ట.త.వ య ;
కొన్నింటలేదు. 6. నాశ్రమ — కొన్నిప్రతులు.

219 1 సకల — కొన్నిప్రతులు. 2 ధర్మమొండెరుంగ — కొన్నిప్రతులు. 3. నొరుల
కెగ్గు దలచి యుపతాప — వ 4. కొఅకు నుపతాప — పెక్కు ప్రతులు స; కోర్చి
యుపతాప — స 5. మనగబడియె — కొన్ని ప్రతులు; మనగబరగె —
కొన్ని ప్రతులు. 6 మునులు — అ.ఔ.గ.చ.త.య.వి.శ.ష ; జనులు — ఇ.

220 1. నాఁగక—స. 2 బుధులు — కొన్నిప్రతులు

221 వ. మఱియు [1]గర్భయోనియందు ఋతుపుష్పరససంయుక్తం బగుచు రేతంబు గాడ్పుచేతం బ్రేరితం [2]బయి కలసిన నందుఁ బంచతన్మాత్ర[3]లు పొడవయి క్రమంబున నవయవంబు [4]లేర్పడి లబ్ధజీవులయి యుద్భవిల్లి శ్రోత్రంబుల శబ్దంబును నేత్రంబుల రూపంబును ఘ్రాణంబున గంధంబును [5]జిహ్వను రసంబును ద్వక్కున [6]స్పర్శంబును మనంబున సర్వంబును నెఱుంగుచుఁ బూర్వకర్మనియోగంబున దుష్కృతంబును సుకృతంబు[7]ను జేయుచు దుష్కృత బాహుళ్యంబు[8]నఁ బుణ్యంబు గీడ్పఱిచి బుద్ధి[9]విరహితులై తిర్య[10]గ్యోనులందుఁ బుట్టుదురు సుకృత బాహుళ్యంబు[11]నఁ బాపంబు గీడ్పఱిచి [12]బుద్ధియుక్తులై [13]మనుష్యయోనులందుఁ బుట్టి యుక్తాచారులును దత్త్వవిదులును నయి [14]దేవత్వంబునం బొంది [15]విశుద్ధజ్ఞానులయి ముక్తులగుదురు మఱి యుక్తాచారు [16]లెవ్వరనిన గురు శుశ్రూష సేయుచు నిత్యాధ్యయనాగ్ని కార్యంబుల [17]యం దప్రమత్తులయి శమదమ శౌచంబులు దాల్చి [18]యపప్లుత బ్రహ్మచర్యులయిన బ్రహ్మచారులును బాపంబునకుఁ [19]బరోపతాపంబునకు వెఱచి [20]ధర్మ్యంబైన విత్తంబున నతిథులం బూజించుచు యజ్ఞంబులు సేయుచుఁ [21]బరుల యీనిధనంబు[22]లు పరిగ్రహింపక [23]నిత్యానుష్ఠానపరు లయిన గృహస్థు

221 1. మన్మథ మందిరంబు నందు — ఇ. 2. బయిన నందు — పెక్కు ప్రతులు. 3. లొడలయి — స 4 లేర్పడి యనిలంబువలన — డ. 5 జిహ్వయందు — ఊ ప ఔ.య.ర. 6. స్పర్శనంబును — ర; 7 నుం జేసి — ఈ.ఎ.ప.క.న 8. నం జేసి — ల. 9 విరహతులైనవారు — య, విరహితంబులైన — వా శ. కొన్ని ప్రతులు 10. గ్జాతుల యందు — ఔ.త. 11. వలన — ల. 12. బుద్ధియుక్తులై — కొన్ని ప్రతులలో లేదు ; బుద్ధియుక్తంబులైన — ట. 13. మానుష—ఆ మ. 14 దేవత్వంబు బొంది—ఈ ఎ ఐ.ఓ స , పుట్టిదేవత్వంబు— స. 15. పరిశుద్ధ—చ.ప.ల వీ.శ.ష. 16 లైనవా రెవ్వరనిన—ఓ ; లెవ్వరనియడిగిన — మ. 17. యందుఁబ్రవిష్టులయి—య ; న ప్రమత్తులై నడపుచు—ఉ ఊ ర ల. 18. యధిగత— ఈ.ప.ఓ.క చ.జ ల వీ.శ ష.స ; యవిఘ్నిత — ప.ట. స , యవిఘ్న — ర ; యతివ్రత — మ ; యవిష్కృత — న. 19. పరాపకారంబునకు — ఔ. 20. ధర్మవృత్తి నతిథుల — ఈ.ఓ.చ మ.ల.వీ.శ.ష ; ధర్మంబులైన వృత్తుల — ఉ ప.ర; ధర్మప్రవృత్తి — అ జ.ట.న.వ 21. పరుల ధనంబులు — పెక్కు ప్రతులు ; పరధనంబులు — కొన్ని ప్రతులు ; పరనిందలు పరిహరించి పరధనంబు లపహరింపక — న ; పరులచేత ధనంబులు వడయు టుడిగి — య 22. లపహరింపక — క ; లుపహరించుచు — ఊ. 23. విహితానుష్ఠాన — న ; వేదాధ్య

లును నియతాహారులై సర్వసంగంబులు [24]విడిచి [25]జితేంద్రియు[26]లైన వానప్రస్థులును వనంబులనుండి గ్రామ్యవస్తువు[27]ల నుపయోగింపక గ్రామంబుల నుండి శరీర[28]ధారణార్థంబు నియత స్వల్పభోజనులయి [29]నగరప్రవేశంబు పరిహరించి కామక్రోధాదులం బొరయక [30]శౌచాచారక్రియారతులయి సర్వద్వంద్వంబులు [31]నొడిచి [32]సర్వసంగవివర్జితులయి [33]యేకచరులయి [34]యనేకనికేతను లయిన యతులును [35]వీరలు దమతమ పుణ్యాచారంబులం జేసి క్రిందం బదితరంబులవారిని మీఁదం బది తరంబుల వారిని [36]దమ్మును నుద్ధరింతు[37]రు.

222 క. మానాగ్నిహోత్రమును మఱి, మానాధ్యయనమును[1]మానమౌనంబు స[2]వి జ్ఞానమున మానయజ్ఞము, [3]నా నయథార్థంబు [4]లివియు నాలుగు నుర్వీన్.

223 వ. [1]అని యయాతి యష్టకాదు లడిగిన [2]వాని నెల్ల సంక్షేప[3]రూపంబునం [4]జెప్పుటయు వార లిట్లనిరి.

యన — ఐ.గ. 24. పరిహరించి — ఐ. 25. విహితాచారులైన — బ. 26. లై వానప్రస్థధర్మంబున నుండి గ్రామ్య — య. 27 ఉపయోగింపక — కొన్ని ప్రతులు. 28 యాత్రకు — ఔ.త. 29 గురూపదేశంబును గ్రహించి — ఋ 30 శౌచాచారక్రియా రతులు — అ ఊ.న.య; లోకాచారక్రియా రహితులయి— ఔ చ.ఠ.ల పీ.శ ష; శౌచాలంక్రియా రతులయి — వా. 31. విడిచి —ఔ.ట.త వ. 32. సంసర్గ — ఔ.ద, 33 యనేక — ఉ ఎ మ. 34. నియతాత్ములై యనేక — జ ట. 35 ననువీరలు — వా శ; అనువారలు — ద; నగువారలు — జ. 36. దమ్మును — ర ఖ లలో లేదు 37 రుగావున — వా.శ.

222 1. మానమౌనంబును విజ్ఞానంబును — పెక్కు ప్రతులు. 2. సుజ్ఞానమును — ఇ; సన్మానమును — అ.ఐ.గ మ.య. 3 నాను — కొన్ని ప్రతులు; నా నియతార్థంబు — ఆ.ఈ.ఉ చ త మ పీ శ ష; నా నార్థంబులును నివియు — య. 4. లుర్వి నాలుగు నివియుఁ — ఊ.

223 1. అనియిట్లు — ఐ.ట. 2. వాని సంక్షేప — పెక్కు ప్రతులు; ధర్మాధర్మ వర్ణాశ్రమంబులెల్ల సంక్షేప — ఇ, వాక్యంబులకెల్ల — య; వారికి నెల్ల — ర; 3. మార్గంబున — అ ర; మానంబున — డ. 4 జెప్పిన — కొన్ని ప్రతులు; జెప్పిన విని — కొన్ని ప్రతులు.

224 తే. [1]సకలధర్మవిదుండవు సర్వలోక, వర్తనము [2]లెఱింగిన పుణ్య[3]కర్త వీవు
నెయ్య మొనరంగ నెఱిఁగింపు మయ్య మాకు, [4]వెలయఁ బుణ్యాలోకంబులు
గలవె [5]యనిన.

225 వ. [1]మీకుం బుణ్యాలోకంబులు గలవని యయాతి [2]సెప్పిన విని [3]యన్నలువురు
[4]సంతోషించి యేము నీదౌహిత్రుల[5]ము సుమ్మని [6]తమ్మెఱింగించి [7]వానికిఁ
[8]బుణ్యాలోకంబు లిచ్చి [9]నట్లయ్యయాతి [10]సత్సంగతిం జేసి తానును
దౌహిత్రులు నూర్ధ్వలోకంబునకుం [11]జనిరె నని.

226 క. [1]ఆ యతుల[2]పుణ్యునకు నన,సూయునకుఁ బరీక్షిదగ్రసుతునకు వైశం
పాయనుఁ డనంత పుణ్యఫ,లాయత్తముగాఁగఁ జెప్పె [3]నని కడుఁ[4]బ్రీతిన్.

227 క. వీరశ్రీవనితాశ్రిత, భూరి [1]స్థిరబాహుదండ [2]బుధనుతసుగుణా
[3]ధార కలియుగపవిత్ర, పురారాతి పదాబ్జ పూజ[4]నాసక్తమతీ.

---

224 1. సర్వధర్మ — పెక్కు ప్రతులు న.య.ర 2. నెరింగిన — ఊ.కట. 3. మూర్తి — ఊ.య 4. బుణ్యాలోకంబు గలవేని పురుషవర్య — .క 5. యేని—న.

225 1. అనిన బుణ్యాలోకంబులు మీకుం — అ.వ; అనిన మీకుం — డ.ద.న.య; విని మీకుం — మ. 2. తన దివ్యజ్ఞానంబునం జూచి సెప్పిన — ఊ, పలుకులు విని — మ. 3. వారేవురును — అ; వారల కిట్లయ్యేవురు — మ. 4 సంతసిల్లి — కొన్ని ప్రతులు. య.న.ర; సంతోషిల్లి — ఊ.ఎ 5. మని — పెక్కు ప్రతులు. 6. వానికిం దమ్మెరింగించి — ఉ.ఊ.ఋ.ఏ; యయాతికిం జెప్పి — న. 7. వానిక - కొన్నింటలేదు ; తమ - ఊ బ 8. పుణ్యభాగం బిచ్చి — జ.డ.ద. 9 నయ్యయాతి—కొన్ని ప్రతులు ; యయాతి—కొన్ని ప్రతులు. 10 తత్సంగతిం—-ఈ ఔ క.జ.ప.య. 11. జనిరి—పెక్కు ప్రతులు ; జనిరని—కొన్ని ప్రతులు.

226 1. యయాతి చరిత్రం బనసూయునకు — పెక్కు ప్రతులు ఇది యప పాఠము ; ఆ యయాతి చరితం బనసూయునకు — కొన్ని ప్రతులు; పాయక యయాతిచర్యయు బరీక్షిదగ్రసుతునకు—ద. 2. చరిత్రము ననసూయునకు—స. 3. జెప్పినది— డ. 4. భక్తిన్—పెక్కు ప్రతులు.

227 1. స్థిత—ఓ.త ; స్తుత—ఔ. 2 బుధవినుతగుణా—పెక్కు ప్రతులు. య.ర. 3. పార—ఔ. 4. నాయత్త—ఎ.

228 మత్తకోకిలము. దండితాహిత[1]వీర సూరి[2]నిధాన దానవినోద కో
దండపార్థ పరాక్రమ[3]ప్రియ[4]ధామ దిక్పరి[5]పూరితా
ఖండపాండుయశోనిధీ [6]పరగండభైరవ వైరివే
దండ [7]గండ విదారి ఘోర తరాసి భాసి భుజార్గళా.

## గద్యము

ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్ట ప్రణీతం బయిన శ్రీ మహా
భారతంబునం దాది[1]పర్వంబున శ్రీ మహాభారత కథాప్రారం
భంబును వ్యాసుజన్మంబును దేవ దైత్య దానవ ముని యక్ష
పక్షి గంధర్వాది నానావిధభూతసంభవంబును
దదంశావతారంబును రాజవంశోత్పత్తియు
యయాతి చరితంబును నన్నది
తృతీయాశ్వాసము.

228 1 వీరశూర—ఉ.ఔ.డతద ప.; సూరివీర—య. 2. నిదాన—ర. 3. శ్రియ—ఔ.క; క్రియ—త; ప్రతి—య. 4. దామ—క.ర. 5 పూజితా—ఉ.య.ర. 6. వర—ఐ ఖ. 7. తుండ — కొన్ని ప్రతులు; మండలచండతుండ విదారణాసి—చ.వ.శ ష, మండల ఖండ సింహ —ఆ.మ; మండలఖండతుండ విదారణాసి—ఇ.ల, గంని మహా ప్రతుండవిదారితాసి—వ.

[గద్యము] 1. పర్వంబునందు భారత కథారంభంబును — పెక్కు ప్రతులు.

—:o:—

# శ్రీమదాంధ్రమహాభారతము

## ఆదిపర్వము - చతుర్థాశ్వాసము

1 క. శ్రీలలనా స్తన[1]ఘటిత వి,శాలోర[2]స్థల వివేకచతురానన వా
ణీ [3]లీలాస్పద విలస,చ్చాళుక్యాన్వయపయోధి సంపూర్ణశశీ.

—: పూరువంశక్రమము :—

సం. 1-90-11 (1-89-4)

2 వ. [1]అక్కథకుండు శౌనకాదిమహామునులకుం [2]జెప్పెనట్లు యయాతికిం బుత్త్రుం డయిన పూరుం[3]డు సకలమహీరాజ్యంబు [4]సేయుచు వంశకర్త [5]యయిన వానికిఁ [6]గౌసల్య యనుదానికి జనమేజయుండు పుట్టి రాజై యశ్వమేధ [7]త్రయంబుఁ [8]జేసి [9]ప్రఖ్యాతినొందె [10]నాజనమేజయునకు ననంత యను దానికిఁ [11]బ్రాచిన్వంతుఁడు [12]పుట్టి పరాక్రమంబున నుదయాచల పర్యంతంబు [13]ప్రాగ్దిగ్విజయంబు సేసి [14]ప్రాచిన్వంతుఁడు నాఁ బరగె నట్టి ప్రాచిన్వంతు

1 — 1. ఖచిత - ఖ. 2. స్తల — ఓ.చ.జ.ట త ర. 3. లలనాస్పద — అ.

2 — 1 అక్కథికుండు—య.ర. పెక్కుప్రతులు. 2. జెప్పినట్లు— పెక్కు ప్రతులు; జెప్పెనట్టి — మ. 3. డఖిల—కొన్నిప్రతులు , డు మహీరాజ్యంబు— పెక్కుప్రతులు ; డుమహామహీరాజ్యంబు—ఉ ఊ త. 4 చేసి — మ.ర పెక్కు ప్రతులు. 5. యయ్యె-ప. 6. గౌరవ్య — ఊ ; మూలమునందు కౌసల్యా అనియే కలదు పురోస్తు భార్యా కౌసల్యానామ తస్యామస్యజజ్ఞే జనమేజయో నామ. భం. 1-90-11. 7. త్రితయంబు ర. ప్రతులు — కొన్నిప్రతులు. శతంబు — ద ; త్రయంబును రాజసూయ శతంబును — ఓ.డ 8. జేసె—పెక్కుప్రతులు ; జేసిన — ట.ర. 9. ప్రఖ్యాతి నొందె— పెక్కు ప్రతులలో లేదు. తేజోధికుండైనట్టి— ప ; తేజోధికుండయ్యె — ఖ.య. 10. నట్టి-ఖ.గ.జ.ప. 11. ప్రాచీన్వంతుండుమూలము.ప్రాచీశుఁడువా మున్నగు—ప్రతులు ప్రాచిన్వంతుండు - వీ. 12. పుట్టె- పెక్కు ప్రతులు. 13. ప్రాగ్విజయంబు—కొన్ని ప్రతులు ; దిగ్విజయంబు — కొన్ని ప్రతులు ప్రాగ్దక్షిణ దిగ్విజయంబు — మ. 14. ప్రాచీనుండనం — మ ; ప్రాచీశుండనం — అ.ఋ.ఔ.జ ; ప్రాచీశుండనా—కొన్ని

నకు [15]నశ్మకి యనుదానికి [16]సంయాతిపుట్టె వానికి [17]వరాంగి యనుదానికి [18]నహంయాతి పుట్టె వానికిం గృతవీర్యపుత్రియైన [19] భానుమతికి సార్వ భౌముండు పుట్టె వానికిఁ [20]గేకయరాజపుత్రియైన [21]సునందకు జయ త్సేనుండు పుట్టె వానికి [22]వైదర్భియైన [23]సుశ్రవసకు [24]నవాచీనుండు పుట్టె [25]నయ్యవాచీనునకు [26]విదర్భరాజపుత్రియైన [27]మర్యాదకు [28]నరిహుండు పుట్టె వానికి నాంగి యనుదానికి మహా[29]భౌముండు పుట్టె [30]నామహా [31]భౌమునకుం [32]బ్రసేనజిత్పుత్రియైన [33]సుపుష్ట[34]కు నయుతా[35]నీకుండు పుట్టె [36]వానికిం [37]బృథుశ్రవసునిపుత్రియైన [38]కామకు నక్రో[39]ధనుండుపుట్టె [40]వానికిం [41]గాళింగియైన [42]కరంభ యనుదానికి [43]దేవాతిథి పుట్టె [44]వానికి వైదేహి యయిన మర్యాదకు [45]ఋచీకుండు పుట్టె వానికి [46]నాంగియైన

ప్రతులు 15. నస్మికి_ర ; నశ్మక - కొన్ని ప్రతులు ; నస్తి - జ ; నస్తిక - ఈ ; నశ్వకి - ఏ ; శిఖి - బ ; హరి - ఋ; హస్తిక - య, సుశర్మ - అ. 16. శర్యాతి - ఆ.చ.మ.శ ష , సంయయాతి - గ. 17. వారాంగి - ఏ.ఓ ప , పరాంగి_ఋ ఔ.మ, గృతవీర్య పుత్రియైన భానుమతి - ర. 18. నహుయాతి - కొన్ని ప్రతులు ; నహుం యాతి - గ1. భం; నహూయాతి - ల ; యయాతి - ఎ.య; పంయాతి - ఈ.బ. 19. మర్యాదకు - ఐ.క. 20. గైకేయ — అ ఇ ఋ ఒ ట 21 వసుంధరకు — ఆ.మ, 22 వైదేహి - కొన్ని ప్రతులు ; వైదేహియైన సుభద్రకు సురాచీనుండు - మ య ల స. 23. సుభద్రకు - మ.య ర.ల స పెక్కు ప్రతులు , సునంద - గ ; సుభార్య - ఊ ; సుషువ - భం. 1_90_17. 24 సురాచీనుండు - య.స. పెక్కు ప్రతులు ; సురాసీనుండు_ర; సురాసేనుండు_ఋ ; సురాధీనుండు - ద ; అరాచీనుఁడు - భం. అవాచీనుఁడు - చిత్రశాలాప్రతి 1_95_17. 25. సరాచీనునకు - పెక్కుప్రతులు ; వానికి - కొన్ని ప్రతులు. 26 వైదేహియైన - ర. 27 భానుమతికి - ఐ.మ. 28. నరిహుండు పుట్టెవానికి నాంగియను దానికి - పెక్కు ప్రతులలో లేదు. 29. ధాముండు - ఋ. 30 వానికిం - కొన్ని ప్రతులు. 31. ధాముండు - ఋ 32. బ్రసేనజయైన - పెక్కుప్రతులు ; ప్రియసేనజ - ఏ. 33. సుపుష్ప - ఏ.ఓ.క ; వపుష్ట - ఋ.ర; పుష్కర, సునష్ట, వపుష్ట, సుయజ్ఞ, మున్నగు రూపములును గలవు. 34. యనుదానికి - కొన్ని ప్రతులు. 35. నియుతుండు_కొన్ని ప్రతులు , నియతుండు - కొన్ని ప్రతులు ; అయుతనాయి - మూలము. 36. నయుతానియుతునకు_పెక్కుప్రతులు ; నయుతాపీకునకు - స. 37. ప్రియసేన_స;ప్రియంవద_చ.ప.శ;ప్రియసేన_ర; బృథవసు_ఐ ఓ క.జ 38. భానుమతికి - పెక్కు ప్రతులు. 39 ధుండు-కొన్నిప్రతులు. 40. నక్రోధనునకు_కొన్నిప్రతులు 41. గాళింది_పెక్కు ప్రతులు. య స ; దక్షపుత్రియైన_ర. ; 'కాలింగీంకరండుమ్ నామ' - భం. 42. కరందమ - కొన్ని ప్రతులు. కరంషమ, కరండవ, కరందువ, కరింద. కరంద, — మున్నగు రూపములునుగలవు. 43. దేవాపి_య.స పెక్కుప్రతులు 44. దేవాపికి - పెక్కు ప్రతులు. 45. ఋచికుంశు- పెక్కు ప్రతులు 46. వైరాంగి - పెక్కు

[47]సుదేవ యను దానికి [48]ఋతుండు పుట్టె ఋతునకుఁ దక్షకపుత్త్రియయిన [49]జ్వాల యనుదానికి [50]మతినారుండు [51]పుట్టె.

3 క. ఇమ్మగ సరస్వతీతీ, రమ్మునఁ బంౘడెండువత్సరమ్ములు విధి మా
ర్గమ్మున సద్గుణసముదా[1],య మ్మెసగఁగఁ జేసె సత్త్రియాగము [2]నిష్ఠన్.

4 క. అతనికి సరస్వతీనది, మతి ననురక్త యయి వాని మానుగఁ దనకుం
బతిఁ జేసికొనియె ధర్మస్థితి నయ్యిరువురకుఁ [1]త్రసుఁడు ధీరుఁడు పుట్టెన్.

5 వ. ఆ[1]త్రసునకుఁ గాళింది యనుదానికి [2]నిలినుండు పుట్టె [3]వానికి [4]రథంతరి యనుదానికి దుష్యంతుండు పుట్టెఁ బుట్టి యనన్య[5]సాధారణ[6]శక్తియుక్తుండై.

6 క. బాలహరిణములఁ బట్టెడు, [1]లీలను విషమాటవీ చలిత కేసరి [2]శా
ర్దూలేభ శరభములఁ దన, బాలత్వము [3]నంద డెగిచి పట్టుచు [4]మఱియున్.

ప్రతులు; వరాంగి_ క గ జ.ప.ర.స; అనంగ రాజకన్యయైన – ఆ.ఔ.మ 47. దేవ- పెక్కు ప్రతులు ; దేవకి_చ వ శ ష; దేవల_ర , వామదేవి_ఆ ఔ త మ. 48. ఋక్షుండు_ఔ.త.ర ; ఋషభుండు_ప; రిక్షుండు_ అ ఈ.ఐ క.గ ట.ద. 49. జ్వలన_డ.ర ; జ్వల_ఇ ఎ ఒ.ఖ.గి$_1$ చ శ.ష , జాల_ఊ; సవినయ_ఋ. 50. మతిమంతుండు_ ఔ క. ఖ చ త.ర ; మతివరుండు – పెక్కుప్రతులు న య ల; నంతిరాముండు – మ 51. పుట్టె – పెక్కు ప్రతులు.

3 1. యమ్మున నొనరించె – ఋ. 2. నెమ్మిన్ – ఔ.త వ స, పేర్మిన్ – వ.స.

4 1. ద్రిశుడు – అ.ఆ.ఉ.ట.ద బ.య.ర. తంసు – చిత్ర భం. వీ.స.

5 1. త్రిశునకు – ద.య.ర ; త్రిదశునకు – అ.ఉ. 2. నీలుండు – పెక్కు ప్రతులు; నిలుండు – ర; ఇలలుండు – ఔ; కిలిలుండు – న , నీలినుండు—వా. 3 నీలునకు_ పెక్కుప్రతులు ; ఆ నీలునకు, నన్నిలినకు, అనియు గలవు ; ఇలీనుండు – భం. ఇలినమ్ జనయామాసకాలింద్యామ్ తంసురాత్మజమ్. 4. రథంతయను – పెక్కు ప్రతులు. 5. సామాన్య – ఋ. 6. గుణ – వా.శ. పెక్కు ప్రతులు.

6 1. లీలమహాటవికి జనిచలింపక హరిశా – జ.డ బ ; లీలమహాటవికిఁ జనిచలింపక మృగశా – స. 2 శార్దూల మదేభామల దన – జ.డ ; శార్దూ లేభ మృగావళి దన_ ఇ.ఉ.న.బ. 3. నప్పుడెగిచి – కొన్ని ప్రతులు ; నప్పుడేచి – ఔ. 4, గడిమిన్ – అ ఎ.ఐ.ద; నుండెన్ – డ.

7 క. ఉర్వీరుహ నివహముతోఁ, బర్వతములు వెలికి యొండు పర్వతముల[1] పైఁ
బర్వఁగ వైచుచు యౌవన,గర్వంబున [2]నొప్పె నుర్విఁ గడు నధికుండై.

—: దుష్యంతుఁడు వేఁట కరుగుట :—

సం. 1-63-1

8 శా. ఆ దుష్యంతుఁ డనంతసత్త్వుఁడు సమస్తాశాంత మాతంగ మ
ర్యాదాలంకృతమైన భూవలయ మాజ్ఞాయత్తమై యుండఁగా
నాదిత్యాంశు సమీర దుర్గమ మహోగ్రా[1]రణ్య దేశాళితో
నాదిక్షత్రచరిత్ర నేలె నజితుండై బాహు[2]వీర్యంబునన్.

9 క. అతని రాజ్యంబున నుర్వీతలము ప్రజాసమృద్ధి [1]వెలసి రుజాశో
కాతంకతయ శంకా,పేతంబై ధర్మచరితఁ [2]బెరుఁగుచు నుండెన్.

10 వ. అమ్మహీపతి యొక్కనాఁడు మృగయావినోదార్థియయి యాదిత్యహయం బులకంటె వడిగల [1]వాహనంబులు [2]పూనిన రథం బెక్కి యాజానేయ [3]తురంగారూఢులైన యాశ్వికులు పరివేష్టించి [4]రాఁగ ననంత కుంత శక్తి చాప [5]కృపాణపాణు లయిన వీరభట[6]సహస్రంబులతోఁ జని వనంబులోని మృగంబులం [7]జుట్టి ముట్టి.

11 క [1]కలయఁగ [2]నార్పుల బొబ్బల, యులివున నవ్విపిన మను మహోదధిఁ బెలుచం
గలఁచెను దుష్యంత మహా,బలమందరనగము [3]సత్త్వభయ జన[4]నంబై.

7 1. తో - వ 2 జూడనొప్పె - గ

8 1, గణ్య - అ 2, గర్వంబునన్ - వ

9 1. వెలయ - ద. 2. బెఱుఁగు - గి.శ.ష.

10 1. హయంబు - ఈ.ఏ ఖ.డ.ద ర; తురంగంబు - ఋ.య 2. పూన్చిన - $గ_1$ స ; బూన్చిన - చ.ల,వీ శ.ష. 3. పారశీకాది - ఔ.త; పారశీక వైదేశజాత - ప.వ. 4. రాననంత - పెక్కు ప్రతులు. 5. బాణపాణు - ర; కృపాణులయిన - కొన్ని ప్రతులు. 6. సహస్ర పరివృతుండై చని - ట 7 గూడ - ఎ.జ.డ; దగిలి - బ; జుట్టి - కొన్ని ప్రతులలో లేదు

11 1. అలయక - గ. 2. నార్పును బొబ్బయునులివును - స. పెక్కు ప్రతులు. 3. సర్వ - ఈ ఎ ఖ.ట.డ.ర. 4. కంబై - ఇ ఒ.ఖ.గ.ద.

12 క. [1]సరభస పరిచలిత మహా, [2]శరభ ద్విప[3]రిపు వరాహ శార్దూల మద
[4]ద్విరదాది [5]ప్రకర భయం, కర వనమధ్యమున నృపతి [6]గడుఁ గడిమి మెయిన్.

13 క. [1]ఒసరిలి పఱచుమృగముల, నేసియు [2]డాసిన [3]మృగముల [4]నెగిచి భుజాసిన్
వ్రేసియుఁ [5]జంపెను మృగయా,వ్యాసక్తి నపార ఘోర వన్య మృగాలిన్.

14 వ. ఇట్లు [1]పెక్కు మృగంబుల [2]నెగిచి [3]చంపుచు మఱియుఁ జంపెడు వేడుక నతి[4]దూరంబున కరిగిన నాతని రథవేగంబు [5]ననుగమింప నోపక యధిక క్షుత్పిపాసా పరవశు లయి [6]పదాతులయ్యాయి ప్రదేశంబుల విశ్రమించి రంత దుష్యంతుండు కతిపయా[7]మాత్య పురోహిత [8]సహితుండై కొండొక [9]నేల యరిగి [10]ముందట నొక్కపుణ్యనదీతీరంబున వివిధ సురభి కుసుమ ఫల [11]భార వినమ్ర తరులతా గుల్మ పరిశోభితం బయిన యొక్క వనంబు గని.

—: *కణ్వాశ్రమ వర్ణన* :—

సం. 1-64-3

15 క. అమరపతి ఖాండవమునకు, రమణను వైశ్రవణు చైత్రరథమునకు సమా
నముగా దీనిని భూభా,గము[1]నను [2]రచియించె నొక్కొ కమలజుఁ[3]డు
దయన్.

12 1. పరిచరిత - కొన్ని ప్రతులు; ప్రవిచలిత - ఐ ; 2. శరభోరగ వరవరాహ - న, 3. వర - పెక్కుప్రతులు 4, ద్విరదారి - అ. 5. ప్రకట - ద. 6. గడుఁగడఁక మెయిన్ - $గ_1$, కడిమినిమెరసెన్ - డ.

13 1. ఏసరణిబ - గ.మ.య; పాసిలలిబ - ఉ.ఊ త, వేసరవి - వ.ద; వేసరిల - ఋ బ. 2 డాసియు - అ.ఎ ఓ.ఔ.త ద 3. మృగాళి - అ.ఉ ఏ.ట.త.బ.మ ; మృగాల - ఊ. 4 నేచి - ఔ; నెగచి - వీ. కొన్ని ప్రతులు 5. జంపియు - అ ఉ.ఏ.ఖ.ట.డ.ల బ, నుజంపె - గ.బ.ల; వడి జంపెమృగ - ఋ.మ.

14 1. పెక్కు-చాలప్రతులలో లేదు. 2 నేచి-ఋ ; నెగచి-క ట.మ.వీ 3. చంపుచు మఱియు- పెక్కుప్రతులలో లేదు. 4. దూరం బరిగిన-పెక్కుప్రతులు. 5. ననుసరింప- పెక్కుప్రతులు, సహింప నోపక-య. 6. భటులు-య. 7 మాత్యపరిజన పురోహిత- వా ; పరిజన - పెక్కు ప్రతులలో లేదు. 8. సహాయుండై-న. 9. దూరంబరిగి - ఖ.న ; నెలవున కరిగి- చ.ల శ.ష. 10. ముందర - కొన్ని ప్రతులు. 11. భారానమ్ర- పెక్కుప్రతులు

15 1. కు - వా.వీ శ.ష.శ. 2. నిర్మించె - ఔ.త. 3. డరయన్ - వ.

16 వ. అని దాని రమణీయ[1]భావంబుఁ బొగడుచుఁ [2]జనుదెంచి యవ్వనంబు సొచ్చునప్పుడు.

17 చ. అతిరుచిరాగతుం డయిన యాతనికిన్ హృదయ ప్రమోద మా
తతముగ నవ్వనంబున లతాలలనల్ మృదులానిలాపవ
ర్జిత కుసుమాక్షతా[1]వళులు సేసలు [2]వెట్టిన [3]యట్టులైరి [4]సం
పత దళినీ నినాద మృదుభాషల దీవన లొప్ప నిచ్చుచున్.

18 వ. [1]మఱియును.

19 క. కాఱడవిఁ బఱచు మృగముల, [1]నూఱడకం [2]దిగిచి డస్సి యున్న [3]తని శ్రమం
బాఱఁగ [4]నెడఁ బరితాపము, దీఱఁగఁ బై వీచె నన్న దీపవనం[5]బుల్.

20 మానిని. [1]ఏచి [2]తనర్చి తలిర్చిన [3]క్రోవుల నిమ్మగు [4]తావుల జొంపములం
బూచిన మంచియశోకములన్ సురపొన్నలఁ బొన్నల గేదఁగులం
గాచి పెడంగుగఁ బండిన యాసహకారములం [5]గదళీ[6]తతులం
జూచుచు వీనుల కింపెసఁగన్ వినుచున్ శుకకోకిల [7]సుస్వరముల్.

16 1. ప్రభావంబు - కొన్ని ప్రతులు; విలాసంబు - ఔ.త. 2. జొత్తెంచునప్పుడు - పెక్కు ప్రతులు ; జనుదెంచునప్పుడు - మ; జొత్తెంచెనప్పుడు — ర.

17 1. వలుల - పెక్కు ప్రతులు. 2 చల్లిన - ట స. 3. యట్టులైరి - అ.ఆ.ఐ.గ.చ జ మ.వీ.శ ష; యట్టులయ్యె - ద. 4 నుత్పతదళి - ద

18 1. కొన్ని ప్రతులలో లేదు.

19 1. నూఱడనీకెగసి - య; నూఱటకుడిగించి — న. 2. దెగిచి - పెక్కు ప్రతులు. 3 తరి — ఊ; తను - య.వ 4. నెద -- పెక్కు ప్రతులు. 5. బున్ - ఆ.ఉ. ఋ ఏ జ.ట.ద.య.

20 1. దీనికి ముందు కొన్ని ప్రతులలో అంత అనువచన మున్నది. 2 యెలర్చి తలర్చిన - ర. 3 కొమ్మల — అ.ఔ త.మ య. 4. తావుల - ఏ ఐ; రావుల — ఋ.ఓ ఖ.ట.త 5. బదరీతరులున్ — ర. 6. తరులున్ — పెక్కు ప్రతులు. 7. నిస్వనముల్ — ఆ.ట.ర.

21 కవిరాజవిరాజితము.

చనిచని ముందట నాజ్య[1]హవిర్హృత సౌరభ ధూమలతా తతులం
బెనఁగిన మ్రాఁకుల కొమ్మలమీఁద నపేత లతాంతము [2]లైనను బా
యని మధుపప్రకరంబులఁ జూచి జనాధిపుఁ డంత [3]నెఱింగెఁ దపో
వన మిది [4]యల్లదె దివ్య[5]మునీంద్రునివాసము [6]దానగు నంచు నెదన్.

22 వ. ఇట్లు హృదయసుఖావహం బగుచున్న యవ్వనంబు[1]లో నరిగి యరిగి యనవరత[2]మహాద్విజపఠ్యమాన వేదధ్వనులను నవిచ్ఛి[3]న్నహూయమానాగ్నిహోత్ర స్వాహాశబ్దంబులను ననేకమునిగణ[4]ప్రణీత[5]వచన విషయవిభాగ[6]వినిర్ణయ న్యాయ నిపుణ [7]విద్వత్సభాసంభాషణ ఘోషంబులను [8]ప్రతిపక్ష [9]దుర్విభేద ప్రమాణ విచార్యమాణ [10]వేదార్థ మీమాంసక గోష్ఠీ[11]వివాద నాదంబులనుం జేసి [12]మ్రోయుచు యజ్ఞప్రయోగప్రవీణు లయిన యాజ్ఞికులకును విహితానుష్ఠా[13]నాసక్తు లయిన [14]యనుష్ఠాతలకును నధికతపోనిరతులయిన మహాతపోధనులకును నివాసం బయిన పుణ్యానదీ తీరంబునఁ దద్దయు రమ్యం బయి [15]గంగాతీరంబున నరనారాయ[16]ణ స్థానంబునుంబోలె జగత్పావనం[17]బైన కణ్వమహాముని యాశ్రమంబు గని యందు.

21 1 హవిస్సుల - ట; హవిర్ద్రుమ—క.డ.త.ప. 2. లయ్యును - ఆ.ఇ.ఊ.ఔ.ట. 3. నెఱింగి తపో—ఊ ఏ.ఓ.గ.జ.త.ద.వ.బ. 4. యల్లది—ఐ.ఒ. 5. మునీంద్ర—అ,ఆ.ఏ.ఐ.ఓ. య.ర.శ.ష ; మునీంద్రు—గ ; 6 నాదగు-య.

22 1. లోని కరిగి యనవరత—పెక్కుప్రతులు. 2. పదక్రమపఠ్యమానమహాద్విజ—వా.శ; పదక్రమితమహా—న, అన... ధ్వనులను— 'మ' ప్రతిలో లేదు. 3. న్నాహూయ — కొన్ని ప్రతులు. 4. ప్రణుత – స ; పరిత – ర. 5. వచనరచనా విభాగ—అ.ఓ.ఔ. ఖ.త వ. 6. వికీర్ణ—ఓ 7, విద్వత్సంభాషణ-పీ.శ.ష. పెక్కుప్రతులు. 8. బరపక్ష-స. పెక్కు ప్రతులు 9. చ్ఛేద ప్రమాణ-ర; ప్రాదుర్భావ-ఊ.ఔ.త.మ. 10. వేదాంత-ఐ.ఔ.త.ల. 11. వినోదంబులనుం-ఔ.త. 12. మ్రోయుచున్న—పెక్కుప్రతులు 13. న పరులయిన—ఋ.ఓ. 14 యాజకులకును-మ. 15. గంగాతీరంబున—కొన్నిప్రతులలో లేదు. 16. ణాశ్రమస్థానంబు – ర. 17. బగుచున్న – వా.శ. కొన్ని ప్రతులు

23 సీ. శ్రవణసుఖంబుగా సామ[1]గానంబులు [2]చదివెడు శుకముల చదువు దగిలి
కదలక విను[3]చున్న కరు[4]లయు గరి [5]కర శీతలచ్ఛాయఁ దచ్ఛీకరాంబు
కణముల చల్లనిగాడ్పానపడి [6]దానిఁ జెంది సుఖంబున్న సింహము[7]లయు
భూసుర[8]ప్రవరులు భూతబలుల్ దెచ్చి పెట్టు నీవారాన్న పిండతతులు

తే. గడఁగి భక్షింప నొక్కటఁ [9]గలసి యాడుచున్న [10]యెలుకలుఁ బిల్లుల యొండు సహజ
వైరి[11]వర్గంబు[12]లయు సహవాస మపుడు, సూచి [13]మునిశక్తి కెంతయుఁ జోద్య మంది.

24 వ. ఇక్కాశ్యపుండైన కణ్వమహామునీంద్రునకు నమస్కరించి వచ్చెద నావచ్చు
నంతకు నందఱు నిచ్చోట[1]న యుండు నది యని.

25 చ. వలయునమాత్యులం దగిన వారల [1]నుండఁగఁ బంచి ధారుణీ
తలవిభుఁ డొక్కరుండ చని తన్విఁ బయోజదళాయతాక్షి సం
కుల [2]మిళితాళి నీల పరికుంచితకోమలకుంతలన్ శకుం
తల యను కన్యకం గనియెఁ [3]దన్మునివల్లభు మందిరంబునన్.

23 1 వేదంబులు – గ. 2. చదివెడి చిలుకల — ఐ,ఓ; చదివెడు చిలుకల – ఇ.బ; చదివెడి శుకముల — క త 3. చుండు — వా.వి.శ.ష.శ. 4. లును – వా.శ. కొన్ని ప్రతులు. 5. వర — కొన్ని ప్రతులు. 6. వాని – వా.శ. కొన్ని ప్రతులు. 7 లును–వా.శ. కొన్నిప్రతులు. 8. కన్యలు – డ. 9. గాచి—అ ఆ.ఇ. ఋ.మ. 10 యెలుకలుఁ బిల్లులునొండు — వా శ. కొన్ని ప్రతులు. 11. సత్వంబుల—ఊ.ఒ చ.వి.శ.ష, 12. లేనియవ్వనము నపుడు— మ. 13. మునులశక్తికి గడు చోద్యమంది--కొన్నిప్రతులు, మునుల తపశ్శక్తిఁ జోద్యమంది—న, మౌనులశక్తికిఁ జోద్యమంది—క.

24 1. నుండుండని — ర.

25 1. నుందగ — ఆ.క; నిల్వగ — డ. 2. శితఫాల – ఖ. 3. నమ్ముని — అ ఋ.ట.డ త.బ.

26 వ. అదియును ననంత విలాసంబున జయంతుండ [1]పోని [2]దుష్యంతు నెఱింగి [3]యతిసంభ్రమంబున [4]నాసనార్ఘ్యపాద్యాదివిధులం బూజించి కుశలం బడిగి [5]యున్న [6]నక్కన్యకం జూచి దుష్యంతుం డిట్లనియె.

27 ఉ. [1]క్రచ్చఱ వేఁట వచ్చి యిట కణ్వమహామునిఁ జూచి పోవఁగా
వచ్చితి [2]మెందుఁ బోయిరొకో వారనినన్ విని యాలతాంగి వా
రిచ్చట నుండి యీక్షణము యేఁగిరి కానకుఁ బండ్లుదేర [3]మీ
వచ్చు టెఱింగిరేని జనవల్లభ వారును వత్తు రింతకున్.

28 వ. వారు వచ్చునంతకు [1]నొక్కముహూర్తం బుండునది యనిన విని యక్కోమలి వినయంబునకు మృదుమధురవచనంబులకు [2]సంతసిల్లి దానిం గన్యకఁగా నెఱింగి మనోజ[3]రాజ్యలక్ష్మియుం[4]బోని దాని సర్వలక్షణలక్షితంబు లయిన సర్వావయవంబులుం జూచి సంచలితహృదయుండై నీవెవ్వరి కూఁతుర విట్టి [5]రూప లావణ్య విలాస విభ్రమ గుణసుందరి విందుల [6]కేల వచ్చి తని యడిగిన [7]నది యిట్లనియె.

26 1. పోలెనున్న యతని — చ పీ.శ.ష. 2. దుష్యంతుం గని సంభ్ర — కొన్ని ప్రతులు ; దుష్యంతుంగని యెఱింగి — ఏ.ఔ. 3. ససంభ్రమంబుగ — ఏ. 4. నర్ఘ్యాది విధులం — ఓ.ఔ.త ; నాసనార్ఘ్య పాద్యామలం - అ.ట; నాసనార్ఘ్యాది విధులం - మ 5 యున్నంత — ఉ.య. 6 యక్కన్య— పెక్కు ప్రతులు.

27 1. క్రచ్చర — ల. 2. మెందువోయి — అ.ఇ ఋ ర.స. 3. నీ — ట, మీర్వచ్చు — ఋ.

28 1. నిచ్చోనొక్క ముహూర్తం — అ.గ ; ముహూర్తం — డ.త; నొక్క ముహూర్త మాత్రం బుండునది — అ.చ.ట.న.పీ.శ.ష ; నొక్క ముహూర్తంబు మసలునది — ఎ.య 2. సంతోషించి — ఆ.ఇ ప.మ, సంతోసిల్లి — జ.ట.య 3 రాజరాజ్య లక్ష్మి — ట.ప.ర; రాజలక్ష్మి — న.య. 4. బోనిసర్వలక్షణలక్షితం బైనదాని — కొన్ని ప్రతులు ; బోలె సర్వలక్షణ లక్షితయైన దాని — ఈ.ఒ.ఖ. 5. రూపలావణ్య గుణసుందరి — స, రూపగుణసుందరి—వ. పెక్కు ప్రతులు. 6. కేమిగారణంబున — త. 7. నారాజునకు శకుంతల యిట్లనియె — ఏ.ఓ.

—: శకుంతల దుష్యంతునకుఁ దన జన్మక్రమం బెఱింగించుట :—
సం. 1-65-14

29 క. జగతీవల్లభ యే న,త్యగణిత ధర్మస్వరూపుఁ డని [1]జనములు దన్
బొగడఁగ జగదారాధ్యుం, డగు కణ్వమహామునీంద్రు నాత్మజ ననినన్.

30 చ. [1]ఇది మునికన్య యేని మఱి యేలొకొ యీ లలితాంగి యందు నా
హృదయము దద్దయుం దవిలె నిప్పలు కింకను నమ్మ[2]నేర [3]న
య్యెద విజితేంద్రియుం డనఁగ నిమ్మునిఁ [4]బాయక విందునంచు దా
నిది కలరూ పెఱుంగ నవనీ[5]పతి యుత్సుకుఁడయ్యె నాత్మలోన్.

31 వ. ఇట్లు దుష్యంతుం డా శకుంతల [1]జన్మం బెఱుంగ [2]వేఁడి వెండియు దాని కిట్లనియె.

32 తే. ఉత్తమాశ్రమ [1]నిష్ఠితుఁ డూర్ధ్వరేతుఁ, [2]డైన కణ్వమహాముని యనఘ [3]చరితుఁ
[4]డట్టిముని కెట్లు గూఁతుర వైతి దీని, నాకు నెఱుఁగంగఁ జెప్పుము నలిన[5]నేత్ర.

33 వ. అని యడిగిన నారాజునకు శకుంతల యిట్లనియె.

34 క. ఇక్కమలాక్షి శకుంతల,యెక్కడియది దీనిజన్మ [1]మెవ్విధమని [2]త
మ్మొక్క మునినాథుఁ డడిగిన, నిక్కాశ్యపు [3]లర్థిఁ జె[4]ప్పి రేను వినంగన్.

29 1. జనులు దనున్ — కొన్ని ప్రతులు; జగములుదన్ - అ.ర.

30 1. ఈ పద్యము 'య' ప్రతిలో లేదు 2. జాల - ఆ.పౌ.త 3 నాయెద - ల స. 4. నాథుని - ద. 5. శ్వరుడు - అ.ఆ.క.

31 1 జన్మప్రకారం — అ.ద.ల. 2 గోరి — మ.

32 1. నైష్ఠికు - ఉ.క చ మ, ధర్మజ్ఞు - ట. 2 డట్టి - కొన్ని ప్రతులు. ఈ రెండవ పాదము 'య' ప్రతిలో లేదు నాల్గవపాద మిట్లున్నది. నీ సమాచార మెల్లను నిజముగాను. 3. మూర్తి - ఋ. 4 డతనికెట్లు - పౌ.త 5 వదన - ఒ; నేత్రి - పెక్కు ప్రతులు.

34 1. మెట్టిదయని — ర; మెయ్యదియని — పెక్కు ప్రతులు. 2. తన్నొక్క — కొన్ని ప్రతులు. 3. దర్థి జెప్పె నేను — ఋ.ఎ.ఓ.గ.య; డిట్టులనియె — వ. 4. ప్పెనేనును వినగన్ — ఋ న.

35 వ. నాజన్మప్రకారంబు మాయయ్య యమ్మునికిం జెప్పిన [1]విధంబు చెప్పెదఁ [2]జిత్తగించి వినుమని యాదుష్యంతునకు శకుంతల యిట్లనియె.

36 సీ. అనఘుఁడు రాజర్షియై తపశ్శక్తిమై బ్రహ్మర్షిభావంబుఁ బడసి యున్న
[1]సన్మునీశ్వరుఁడు విశ్వామిత్రుఁ డతిఘోరతపము [2]సేయుచునున్నఁ దత్తపమున
కెంతయు వెఱచి [3]దేవేశ్వరుఁ డప్సరో[4]గణముల[5]లో నగ్రగణ్యయైన
దాని మేనక యను ధవళాక్షిఁ బిలిచి విశ్వామిత్రు పాలికిఁ జని తదీయ

ఆ. ఘోరతపము చెఱిచి కోమలి నాదైన, [6]దేవరాజ్యమహిమఁ దివిరి నీవు
[7]గావు మనిన [8]నదియుఁ గడు [9]భయంపడి యమ, రేశ్వరునకు మ్రొక్కి యిట్టులనియె.

37 చ. వనజభవ ప్రభావుఁ డగువాని వసిష్ఠు నపత్యశోక మ
న్వననిధిలోన ముంచిన యవారిత[1]సత్త్వుఁడు నిన్నుఁ [2]దొట్టి [3]యీ
యనిమిషులెల్ల [4]వానికి భయంపడుచుండుదు రట్టి యుగ్రకో
పను కడ [5]కిప్పు డేఁగు మని పాడియె [6]యిప్పని నన్నుఁ బంపఁగన్.

35 1. విధంబంతయు – ర 2 జిత్తగింపుమని — పెక్కు ప్రతులు ; వినుండని – న.

36 1 సన్మునీంద్రుండు – ఎ, యమ్మునీశ్వరుడు – అ ఏ.క. 2. సేయంగఁ దత్తపమ్ము పేర్మి — ర 3. దేవేంద్రుండున — ఔ న.య. 4 గణికలలో — పెక్కు ప్రతులు 5 యందగ్ర — ఐ.గ.బ. 6. దివిజరాజ్య — అ. 7. గానవలయు – ఐ.ఒ ఖ గ బ వ. 8. ననిన – ఐ.ఒ.ఖ.గ.బ వ; వినియు — ప. 9. భయంబున నమ — య.

37 1. తేజుడు — కొన్ని ప్రతులు ; శౌర్యుడు — ఏ; వీర్యుడు — య.ర. 2 దొంటి — పెక్కు ప్రతులు. 3. యయ్యనిమిషు — పెక్కు ప్రతులు. 4. వానిని — స; వానిక – అ.ఆ బు ఒ.ట త. 5. కేగుమిప్పుడని — పెక్కు ప్రతులు; 6. మీకును — క; నీకును — గ.

38 ఉ. అమ్ముని యల్గి చూచు[1]డును నాఞణమాత్రన గోత్రధారుణీ
భ్రమ్ములు వ్రయ్యు [2]నయ్యుసుము [3]దక్కఁగ నంబుధు లింకు మూఁడు లో
కమ్ములు దిర్దిరం దిరుగు గాడ్పు చలింపఁగ నోడు నుగ్రతం
బమ్మిన యట్టి కోపపరు పాలికి ఛామలు వోవ [4]నోడరే.

39 వ. అయినను నానేర్చువిధంబున నమ్ముని[1]వరు చిత్తంబు [2]మెత్తన చిత్తజా యత్తం [3]బగునట్లుగాఁ జేసెద నని వాసవు వీడ్కొని మేనక తనకు [4]మంద మలయా[5]నిలంబు దోడుగాఁ జనుదెంచి [6]హిమవత్పర్వతప్రదేశంబునం దపంబు సేయుచున్న విశ్వామిత్రు తపోవనంబు [7]సొత్తెంచిన.

40 క. చల్లని దక్షిణమారుత,మల్లన వీతెంచెఁ దగిలి యాలలనాధ
మ్మిల్ల కుసుమాంగ రాగ స,ముల్ల[1]సన సుగంధి యగుచు మునివరు[2]మీఁదన్.

41 వ. [1]అంత.

42 చ. అనిమిష[1]కాంతయుఁ నవలతాంతవిభూషణ లీల నల్లన
ల్లన వనకేళి [2]లాలస విలాస గతిం జనుదెంచి ముందటం
గనియె [3]మహామునిప్రవరుఁ గాౕకుఁ గౌశికచిత్త[4]భిత్తి సం
జనన మహాతప[5]స్ఫురణ [6]సంయత[7]చిత్తు నిరస్తచిత్తజున్.

38 1. టయు — ఆ క, నెడ — న. 2 నయ్యుసుమ — అ ఋ.ఒ.ట త వ. 3. దక్కక — జ. 4. నేర్తురే — పెక్కు ప్రతులు.

39 1. వరు — పెక్కు ప్రతులలో లేదు 2. మెత్తనై — చ ల.వీ శ.ష. మెల్లన — ట.ర. 3. బుగాజేసెద — పెక్కు ప్రతులు. 4 ముందర — ఖ.య. 5. నిలుండు — ఊ.ఋ ఏ ఔ. 6. హిమవత్ప్రదేశంబున — పెక్కు ప్రతులు. 7. సొత్తెంచెనంత — ఔ చ.త ల వీ శ.ష.

40 . 1. సిత — క.ట.ర. 2 మో్రిలన్ - ఇ ఎ ఐ.మ

41 1. పెక్కు ప్రతులలో లేదు..

42 1 కన్యయుఁ — పెక్కు ప్రతులు. 2. లోల — ఊ.ట; కౌతుక విలాసముగా — ఋ; లోలుప — ర. 3. మునీశ్వర — పెక్కు ప్రతులు. 4. వీరసంహనన — ఋ. 5. స్ఫురణ — ఏ. 6. సంయుత — పెక్కు-ప్రతులు. 7. చిత్త — గ.త.

43 క. అంబుజలోచన [1]కడువిన, యంబున నమ్మునికి మ్రొక్కి యనురాగముతో
డం బుష్పాపచయ వ్యా, జంబున విహరించుచుండె సఖులుం దానున్.

44 చ. అలసత యొప్పఁగాఁ దరుణి యమ్ముని[1]వల్లభు మ్రోల [2]నున్న [3]సం
మిళిత సుగంధ బంధుర సమీర వశంబునఁ [4]దూలి [5]చాలపై
వలు వెడలన్ బయల్పడియె [6]వల్లకుచంబులుఁ గక్షయుగ్మమున్
లలితకృశోదరంబుఁ దరళత్రివళీయుతరోమరాజియున్.

45 క. అందుఁ దన[1]దృష్టి నాటుడుఁ, [2]గందర్పనిశాతసాయకంబులు [3]పెలుచన్
డెందముఁ [4]గాఁడినధృతిసెడి, కంది మునీంద్రుఁడు దానిఁ [5]గవయం [6]దివిరెన్.

46 వ. మేనకయు విశ్వామిత్రునిష్టంబునకుం దగిన కామోపభోగంబులం బెద్ద
కాలంబు రమియించిన నయ్యిద్దఱకు నిక్కన్యక పుట్టిన దీని మాలిని యను
[1]నొక్కయేటి పులినతలంబున బెట్టి మేనక దేవలోకంబున[2]కుం జనియె
విశ్వామిత్రుండును దపోవనంబున[3]కుం జనియె నంత నమ్ముని ప్రభా
వంబు[4]న.

47 ఆ. [1]చెలఁగి[2]లేవ నేడ్చుచియు[3]తుక దానిఁ గ్ర, వ్యాద ఘోరమృగము లశన[4]బుద్ధిఁ
[5]బట్టకుండఁ [6]జెట్టుపలఁ [7]గప్పి రక్షించు, కొని శకుంతతతులు గూడియుండె.

43 1. గని — వా.శ, పెక్కుప్రతులు. సని — అ.

44 1. నాథుని — ఖ. 2. నిల్వ — అమయ. 3 నా — పెక్కు ప్రతులు.
4. జేసి — ఇ బు.ఐ ఒ.ఔ ఖ.గ.త. 5. దానిపై — ఒ. 6 వస్త్రువచన్నులు — ల.వ.

45 1. దృష్టి నాటిన — కొన్ని ప్రతులు 2 కందర్పు — అ బు.ఒ.జ.ట.ద.ర
3. వెచ్చన్ — అ 4. నాటిన — పెక్కు ప్రతులు. 5. గదియఁగ — మ; గది
యగ — కొన్ని ప్రతులు 6. దిరిగెఁ — ఊ ; గోరెన్ — ఓ

46 1. ఒక్క - కొన్ని ప్రతులలో లేదు; సెలయేటి – న. 2. కరిగె - పెక్కు ప్రతులు.
3. కరిగె— పెక్కు ప్రతులు 4. నం జేసి యన్నది తీరంబున — చ.న,ల.వీ.శ.ష.

47 1. చెలగు — కొన్ని ప్రతులు. 2. వెతల — ఏ; నెడల - గ. 3. తగు — అ.
4. కాంక్ష - కొన్ని ప్రతులు. 5. డాయకుండ — పెక్కు ప్రతులు 6. జుట్టు
వల — జ; జుట్టువలు — ఎ. 7. పెట్టి — ఔ.త

48 వ. అంత నేము శిష్య[1]గణంబులతోఁడ [2]సమిత్కుసుమఫలాహరణార్థం బక్కడకుం జని యమ్మాలినీ పులినతలంబున శకుంత [3]రక్షితయై యున్న కూఁతు నత్యంతకాంతిమతి నవనీతలంబున కవతరించిన తరుణశశిరేఖయుం [4]బోనిదాని నెత్తికొని వచ్చి శకుంతరక్షితయగుటం జేసి శకుంతల యను [5]నామంబిడి కరంబు గారవంబునం [6]బెనిచితిమి.

49 మధురాక్కర. తనర జనకుండు నన్నప్రదాతయును భయత్రాత
యును ననఁగ [1]నింతులకు మువ్వు రొగిన గురువులు వీర
లనఘ యుప[2]నేత మఱియు నిరంతరాధ్యాపకుండు
ననఁగ బురుషున [3]కిర్యేవు రనయంబును గురువులు.

50 వ. అనం బరగిన శాస్త్రార్థంబున నేము దీనికి భయత్రాతల మగుటం జేసి గురుల మిది[1]యును మాచే నభివర్ధిత యగుటం జేసి మాకు హృదయా[2]నందని యైన కూఁతు రని కణ్వమహాముని లమ్మునికిఁ [3]జెప్పిన విధం[4]బంతయు శకుంతల సెప్పిన విని దుష్యంతుం డాత్మగతంబున.

*—: దుష్యంతుండు శకుంతలను వివాహంబు సేసికొనఁ గోరుట :—*

సం. 1—67—1

51 చ. ఇది మునినాథకన్య యని యెంతయు నిస్పృహవృత్తి నున్న నా
హృదయము రాజపుత్రి [1]నని యిక్కమలాక్షి నిజాభిజాత్య సం
పద నెఱిఁగించినన్ మదన బాణ[2]పరంపర [3]కిప్పు డుండ నా
స్పదమయి సంచలించె నళి[4] పాత వికంపిత పంకజాకృతిన్.

48 1. సమేతంబుగా—మ. 2 సమిత్కుశకుసుమ—పెక్కు ప్రతులు. 3 సురక్షిత—గ.ప; పరిరక్షిత - ఆ 4. బోలెనున్న దాని—పెక్కుప్రతులు ; బోలెవెలుంగు దాని—మ. 5. నామకరణంబు చేసి — కొన్ని ప్రతులు. 6. బెంచితిమి - కొన్ని ప్రతులు.

49 1 మువ్వురగుదురు నువిదలకును గురులు — మ. 2. నేతయును — కొన్ని ప్రతులు. 3. కేవురనగ నగుదురు గురువులు - న ఈపద్యమున తొలిపాదమున 'భయత్రాత' యన్నప్పుడు రేఫ సంయుక్తాక్షర పూర్వాక్షరమును తేల్చి చదువ వలెను

50 1. మున్నుమాచేత — మ 2 నందయైన — న ల. 3 జెప్పిరనిన విని దుష్యంతు—మ. 4. బంతయు శకుంతల — పెక్కు ప్రతులు; బంతయు సవిస్తరంబుగా శకుంతల — వా.

51 1. యని—పెక్కు ప్రతులు. 2. పరంపర గుందనిప్పుడా — ఓ.ద.స. కొన్నిప్రతులు. 3. మండనిప్పుడా—న ; కుండనిప్పుడా — ట ; కిప్పుడెన్ననా—య. 4. పాద — ట.త.

52 వ. అనుచు మదనాతురుండయి దుష్యంతుండు దన యందఁ గోమలి[1]యనురాగం
బుపలక్షించి యిట్లనియె.

53 క. ఈ వల్కలాజినములకు, నీవన్యఫలాశనముల కీ [1]విటపకుటీ
రావాసము[2]లకు [3]నుచితమె, నీ విలసిత రూప కాంతి నిర్మల గుణముల్.

54 ఉ. ఈ మునిపల్లె [1]నుండు టిది యేల కరం బనురాగ మొప్పఁగా
భామిని నాకు [2]భార్య వయి భాసురలీల నశేషరాజ్య ల
క్ష్మీమహనీయ [3]సౌఖ్యముల మేలుగ నందు మనిందితేందు[4]పా
దామల తుంగ [5]హర్మ్యతల హారి హిరణ్మయ కుట్టిమంబులన్.

55 సీ. [1]బ్రాహ్మంబు దైవంబుఁ బరగ నార్షంబుఁ బ్రాజాపత్యమును రాక్షసంబు నాసు
రంబు గాంధర్వంబు రమణిఁ [2]బైశాచంబు నను నెనిమిది వివాహముల యందుఁ
గడుఁ [3]బ్రశస్తములు సత్క్షత్త్రియవంశ్యులకు గాంధర్వ రాక్షసములు ధర్మయుక్తి
నీకును నాకును నెమ్మిఁ బరస్పర ప్రేమంబు గాముండు [4]పెంపఁ దొడఁగెఁ

ఆ. గాన [5]యెడయుఁ జేయఁగా నేల గాంధర్వ, విధి వివాహమగుట వినవె యుక్త
మనిన లజ్జఁ [6]జేసి యవనత వదనయై, యాలతాంగి యిట్టు లనియెఁ [7]బతికి.

56 క. కరుణానిరతులు ధర్మస్వరూపు[1]లింతకు మదీయజనకులు సనుదెం
తురు వారు వచ్చి నీకి, చ్చిరేని [2]పాణిగ్రహణము సేయుము నన్నున్.

52 1. యభిప్రాయం - త.

53 1. విపిన — ప; పర్ణ — ఖ 2 నకు — ఒ.క.న 3 యోగ్యమె — య.ర.

54 1. యుండుడిదియెల — కొన్ని ప్రతులు 2 బళ్ని - త. 3. భోగముల — వ. 4. కాంతామల — ఖ. 5. హర్మ్యతల — పెక్కు ప్రతులు; హర్మ్యముల హారి హిరణ్మయ — చ.వా.శ.ష.శ

55 1. బ్రాహ్మ్యంబు — పెక్కు ప్రతులు. 2. పైశాచికంబనగ - ఊ.న 3. ప్రశస్తంబులు క్షత్రవైశ్యులకు - చ పి.శ.ష. 4. పెనుప - కొన్ని ప్రతులు 5 తడవు సేయు - స; యెడము సేయ — ఒ బొ.క.ఖ; నెడయుఁ జేయ—చ.పి.శ ష. 6. బొంది—వ. 7. ప్రీతి — ఊ వ.

56 1. లిప్పుడ — బొ 2. పాణిగ్రహంబు — ద.న.ప.ల స.

57 వ. అనిన [1]దానికి దుష్యంతుం డిట్లనియె.

58 తే. తనకు మఱి తానచుట్టంబు తాన తనకు, గతియుఁ దన్నిచ్చుచోఁ దానకర్త యనఁగ
వనజ[1]నేత్ర గాంధర్వ వివాహ [2]మతి ర,హస్యమును [3]నమంత్రకమును నగుచు నొప్పు.

59 వ. అని దుష్యంతుండు గాంధర్వ వివాహ [1]స్వరూపంబు [2]సెప్పి శకుంతల నొడం బఱిచిన నది యిట్లనియె.

60 చ. నర[1]నుత నీప్రసాదమున నా కుదయించిన నందనున్ [2]మహీ
గురుతర యౌవరాజ్యమునకుఁ దయతో నభిషిక్తుఁ జేయఁగా
వరము [3]ప్రసన్న బుద్ధి ననవద్యముగా [4]దయసేయు [5]నెమ్మితో
[6]నిరుపమ కీర్తి యట్లయిన నీకును నాకును సంగమం బగున్.

61 వ. అనిన [1]విని శకుంతల కెంతయు [2]సంతోషంబుగా దాని కోరిన వరంబిచ్చి గాంధర్వవివాహంబున నభిమతసుఖంబు లనుభవించి యక్కోమలి వీడ్కొని నిన్నుఁ [3]దోడ్కొని రా నస్మత్ప్రధానవర్గంబుఁ గణ్వమహాముని పాలికిం [4]బుత్తెంచెద నని [5]యూఱడ నొడివి దుష్యంతుండు నిజపురంబునకుం జనియె

57 1. విని – చ వి.శ.ష విని దానికి – మ.య ల.

58 1. నేత్రి — పెక్కుప్రతులు. 2. మిది — ప న, మది — కొన్ని ప్రతులు. 3. నతిమంత్రకం బగుచునొప్పు – ఉ.

59 1. ప్రకారంబు — త. 2. తెలియం జెప్పి – య.

60 1. వర – ఊ.గ.ద. 2. మహిన్ – ఉ.గ.త.ద ; మహా — ఈ.ఊ.ఋ.ఔ. 3. ప్రసాద – ఐ బ వ. 4. గృహ్ణసేయు— ఆ న ; దయనిమ్ము —ఉ.ట. 5. పేర్మితో – ఊ.డ. 6. నిరుపమ కీర్తి – పెక్కుప్రతులు ; నిరుపమదాన – వా.

61 1. విని — పెక్కింటలేదు. 2. సంతసంబుగా—న 3. దోడతేర – ఇ ; దోడ్తేర – ఆ.ఈ ; దోడ్కొనితేర – చ.వి.శ ష. 4. బుత్తెంతునని – ఇ.మ. 5. యూఱడం బలికి – కొన్నిప్రతులు ; యూఱడించి – న.

సమన్వితుం డయి దాశరాజు [5]కడకుంజని మా రాజునకు సత్యవతినిఁ దేవింగా నిచ్చునది యని యడిగిన నాతండును దేవవ్రతుం [6]బూజించి నీవు ధర్మశీలుండ వర్థానర్థవిదుండవు [7]సకలకార్యసమర్థుండవు గుర్వర్థంబు గన్యార్థివై వచ్చితివి కావునం గృతార్థుండ వైతి వెవ్వనియేని వీర్యంబున నిక్కన్య [8]యుద్భవిల్లె నట్టియుపరిచరుం డను రాజర్షి యీ సత్యవతి నొరుల కీ వలవదు శంతనునక యిచ్చునది యనుటం జేసి తొల్లి యసితుం డయిన దేవలుండు కన్యార్థి యయి వచ్చి ప్రత్యాఖ్యాతుం [9]డయ్యె నిట్టి సంబంధ మెవ్వరికిఁ బడయ [10]నగు.

185 క. విను మైనను [1]సాపత్న్యం, బనుదోషము [2]కలదు [3]దీన నదియును నీచే
తన [4]పరిహార్యము నీవలి, గిన నడ్డమె [5]పురహరాజ కేశవు లయినన్.

186 వ. [1]ఆదోషం [2]బెట్లు పరిహృతం బగు నట్లుగా నీ చిత్తంబునం దలంచి [3]వివా హంబు [4]సేయు మనిన [5]గాంగేయుం డిట్లనియె.

187 చ. వినుఁడు ప్రసిద్ధులైన పృథివీపతు [1]లిందఱు [2]నే గురుప్రయో
జన[3]మునఁ జేసితిఁ [4]సమయసంస్థితి యీలలితాంగి కుద్భవిం

కొన్ని ప్రతులు ; 5 పాలికిం — న ; పురంబునకుం — ఏ. 6 జూచి — ఔ.త ; దోడ్కొనిపోయి పూజించి — ప 7. కార్యాకార్య — చ వీ.శ.ష , సకల కార్యసమర్థుండవు — అ.మ. లలో లేదు 8 యుద్భవంబయ్యె — వ. 9 డయియర్రిగె — చ.డ ద ర.వీ.శ ప. 10. నగును — పెక్కు ప్రతులు , నశక్యంబు — ర

185 1. సాపత్న్యం — పెక్కు ప్రతులు 2. కలుగు — కొన్ని ప్రతులు ; నందు — మ. 3. నదియు నట్టులు నీచేతను సంహృత్యము — య. 4 సంహార్యము — ఏ.ఐ.ఓ న; పరిహారము — ఋ.ఐ, సంపాద్యము — వా.శ. 5. హారవిరించి — ఖ.య ర.ల కొన్ని ప్రతులు.

186 1. అద్దోషంబు పరిహారంబగునట్లుగా — వ. 2 బెట్లపహృతంబగు — ట.ర; బెట్లుపరిహరంబగు — ఊ య ల ; బెట్లుపరిహారంబగు — ఒ గ. 3. యివ్వివా హంబు — ఋ.చ న ప.య ర.వీ.శ ష. 4 ఘటియింపు — మ స. పెక్కు ప్రతులు ; సంఘటింపు — ఇ.ఏ.ఖ వ. 5. వినిగాంగేయుం — అ.ఔ. క.ఖ.జ.ట.డ.ద.

187 1. లందరు — స; పెక్కు ప్రతులు; తెల్లను — ఊ.ట.ల. 2. నీగురు — య; మద్గురు — ఋ. 3. ముగ — కొన్ని ప్రతులు 4 బ్రతిన సమ్మతి — ఆ.

చిన తనయుండ [5]రాజ్యమును జేయఁగ నర్హుఁడు వాఁడ మాకు నె
ల్లను బతి వాఁడ [6]కౌరవ కుల[7]స్థితికారుఁ డుదార సంపదన్.

188 వ. అని సభాసదుల కెల్ల [1]రోమహర్షణంబుగా సత్యవ్రతుం డయిన దేవవ్రతుండు [2]పలికిన వెండియు దాశరా జిట్లనియె.

189 క. నీ వఖిల ధర్మ[1]విదుఁడవు, గావున నీ కిట్ల చేయఁగా దొరకొనియెఁ
భావిభవత్సుతు [2]లిట్టిరె, నీ విహిత[3]స్థితిన్ [4]నలుప నేర్తురె యనినన్.

190 క. ధృతిఁ బూని బ్రహ్మచర్య, వ్రత మున్నతిఁ దాల్చితిని ధ్రువంబుగ ననప
త్యత నైనను లోకములా, యతిఁ బెక్కులు గలవు నాకు ననుభావ్యములై.

191 వ. అని యిట్లు సత్యవతిని దన తండ్రికి వివాహంబు [1]సేయుపొంటె నిజరాజ్య పరిత్యాగంబును బ్రహ్మచర్యవ్రత[2]పరిగ్రహంబును జేసిన దేవవ్రతు [3]సత్యవ్రతంబునకు గురుకార్యధురంధరత్వంబునకు మెచ్చి [4]దేవర్షి గణంబులు నాతని పయిం బుష్పవృష్టిఁ [5]గురిసి భీష్ముం డని [6]పొగడిరి దాశరాజును గరంబు సంతసిల్లి శంతనునకు సత్యవతి నిచ్చె నంత.

192 మ. ఇనతేజుం డతిభక్తిఁ గాంచన రథంబెక్కించి యక్కన్యఁ దో
డ్కొని [1]తెచ్చెం దనతల్లి సత్యవతినిన్ ఘోణీజనుల్ దన్ను [2]భో

5. రాజ్యమొుగ — స 6 పౌరవ — బ. 7 స్థిర — బొ.మ వ

188 1. మహాహర్షంబుగా — ఊ.స; రోమహర్షంబు — కొన్ని ప్రతులు; పరమ హర్షంబుగా — ప 2 ప్రతిఙ్ఞవట్టిన — ఊ.మ

189 1 మూర్తివి — ఉ క.ఖ చ జ.పి.శ ష.స, పరుడవు — న.ప. 2. లిట్టిది — బొ.ప ర; లిట్టిద — ల. 3 స్థితియ — ఎ.ట.ర; స్థితులు — ఈ క జ. 4. నిలుప — వ, దలప — వ, నడుప — ఊ

191 1 సేయువాడై — ప ద; సేయుకొరకు – మ; సేయుటకై — బ. సేయుటొంది – ర 2, ప్రతిజ్ఞయు – ఋ ఐ గ య. 3. సత్యంబును – కొన్ని ప్రతులు. 4. ఋషిగణంబులు దేవతలు — పెక్కు ప్రతులు 5. గురియించి — పెక్కు ప్రతులు. 6 పేరిడిరి — ప య , నామం బిచ్చిరి — బొ; నామం బిడిరంత — త.

192 1. వచ్చెన్ — కొన్ని ప్రతులు. 2. భోరని — కొన్ని ప్రతులు ; భోరన

రనఁ గీర్తింపఁగ శంతనుం డతిమనో[3]రాగంబునం బొంద శాం
తనవుం [4]డాతతకీర్తి హాస్తిపురికిం దత్కౌతుకారంభుఁడై.

-: చిత్రాంగద విచిత్రవీర్యుల వృత్తాంతము :-

సం. 1-95-1

193 వ. శంతనుండును [1]బరమానురాగంబున సత్యవతిని వివాహంబై యతిమానుషం బయిన యా భీష్ము సత్యవ్రతంబున[2]కు [3]సంతసిల్లి యాతనికి [4]స్వచ్ఛంద [5]మరణంబుగా వరంబిచ్చి సత్యవతియందుఁ జిత్రాంగద విచిత్రవీర్యులన [6]నిద్దఱు గొడుకులం [7]బడసి వారలు సంప్రాప్తయౌవనులు [8]గాకుండఁ బరలోకగతుండైనఁ దండ్రికి భీష్ముండు పరలోకక్రియలు నిర్వర్తించి చిత్రాంగదు రాజ్యాభిషిక్తుం జేసిన నాతండును నతి[9]వ్యాలోలుండై [10]గర్వంబున నెవ్వరి [11]నుఱక సుర దనుజ [12]మనుజ గంధర్వాదుల [13] నాక్షేపించు చున్నవాని కలిగి చిత్రాంగదుం డను గంధర్వపతి యుద్ధార్థి యయి వచ్చినం గురుక్షేత్రంబు నందు.

194 క. నర గంధర్వాధిపు ల, య్యిరువురు చిత్రాంగదులు సహింపక [1]యని నొం డొరుఁ దాఁకి వీఁకఁ [2]బొడిచిరి, హిరణ్వతీతీరమున నహీనబలాఢ్యుల్.

వర్ణింపగ — కొన్ని ప్రతులు. 3. రాగంబు బొందంగ — ఋ. ప ఒ.ఓ గ.ట.య. 4 డాయత — అ.ఏ.ఖ.డ ద.

193 1. బరమానందంబున — కొన్ని ప్రతులు ; బరమోత్సవంబున — ఐ డ.బ. 2 కును దనయందలి భక్తికిని — ల 3 సంతోషించి — కొన్ని ప్రతులు ; మెచ్చి — ఈ ఎ డ. 4. స్వేచ్ఛామరణంబుగా — కొన్ని ప్రతులు 5. మరణంబు ను నవధ్యత్వంబునుగా — ఇ య ల 6 నిద్దఱఁ గొడుకులం — ర.శ ష. 7. బడసె — ఔ.త 8. గాఁ మున్న — ఎ ప ఐ.ల; గాక మున్నశంతనుండు — కొన్ని ప్రతులు. 9. వ్యాకులుండై — ఔ.త; వ్యాళుండై — అ ఐ.ఒ.ట.డ.య. 10. యౌవన గర్వంబున — త 11. సరకు గొనక — స. కొన్ని ప్రతులు ; మెచ్చక — ఊ ఔ త. 12. మనుజ — పెక్కు ప్రతులలో లేదు. 13. నాక్షే పించి పలుకుచున్న — డ.ద.వ.

194 1. వడి — అ.ఊ.ఔ.త. 2. బోరిరి — ట.న.

195 క. వదలక మాయా యుద్ధా, తిదక్షుఁడయి [1]వంచనోన్నతిఁ గంధర్వుం
డుదితరనితేజుఁ జిత్రాం, గదుఁ జంపె విచిత్ర[2]పత్త్రికార్ముకహస్తున్.

196 వ. ఇట్లు చిత్రాంగదుండు గంధర్వ నిహతుండైనఁ దత్పరోక్షంబున భీష్ముండు
విచిత్రవీర్యుం గౌరవరాజ్యంబు[1]న కభిషిక్తుం జేసిన.

197 క. వసునిభుఁడు పైతృకంబగు, వసుధారాజ్యంబు భీష్మువచనమున గత
వ్యసనుఁడయి [1]తాల్చెఁ దేజం, బెసఁగంగ విచిత్రవీర్యుఁ డిద్ధ యశుండై.

*-: భీష్ముఁడు కాశీరాజు కూఁతుల స్వయంవరమున కరుగుట :-*

సం. 1-96-4

198 వ. [1]అట్టి విచిత్రవీర్యు నారూఢయౌవనుం జూచి భీష్ముండు వివాహయత్నపరుం
డయి తన చారులవలనం గాశీరాజు [2]కూఁతుల స్వయంవరోత్సవంబు విని
ధనుర్ధరుండయి రథంబెక్కి [3]యొక్కరుండును వారణాసిపురంబునకుం
జని యందు స్వయంవరంబునకు మూఁగిన [4]రాజ లోకంబెల్ల [5]వెఱచి
[6]వెఱఁగుపడి చూచుచుండ నక్కన్యకలఁ దన రథం బెక్కించుకొని యెల్ల
వారలు [7]విన నిట్లనియె.

199 క. నా యనుజునకు వివాహము, సేయఁగఁ గన్యాత్రయంబుఁ జేకొని బలిమిం
బోయెద నడ్డంబగువా, రాయత భుజశక్తి నడ్డమగుఁ డాజి మొనన్.

195 1. వంచనామతిన్ — పెక్కు ప్రతులు. 2. పత్రి — ఇ ఋ.ఐ.ఓ.వ; శస్త్ర —
అ క.త; చిత్ర — ఔ.ప.

196 1. నం దభిషిక్తుం — ఆ.య.

197 1. యేలె — ట.న.

198 1. ఆ — పెక్కు ప్రతులు. 2. దుహితల — ఊ.ఎ ఏ.చ.వీ.శ.ష. 3 యొక్క
రుండ — పెక్కు ప్రతులు. 4. రాజులు వెరచరచి — గ. 5. వెరచి —
కొన్ని ప్రతులలో లేదు. 6. వెగడు పడి — ఓ.క.బ.మ.వ. 7. వినుచుండ-ర వ.

200 వ. బ్రాహ్మంబు మొదలుగాఁగల యెనిమిదివివాహముల యందు [1]క్షత్త్రి యులకు గాంధర్వ రాక్షసంబు లుత్తమంబు[2]లు స్వయంవరంబున [3]జయించి వివాహం బగుట [4]యంతకంటె నత్యుత్తమంబు గావున నిమ్మొగిన రాజ లోకంబు నెల్ల నోడించి యిక్కన్యలం దోడ్కొని [5]నాచనుట యిది [6]ధర్మంబ యని కాశిరాజునకుం జెప్పి [7]పీడ్కొని భీష్ముండు వచ్చు నప్పుడు.

201 మ. నరనాగాశ్వవరూథయూథములతో నానావనీనాథు లు
ద్ధురులై యొక్కట నొండొరుం [1]జఱచి యుత్తుంగానిలోద్ధూత సా
గరసంక్షోభసమంబుగాఁ [2]గఱఁగి పేఁకఁ వీరులై తాఁకి యే
సిరి దేవవ్రతుపై నభో[3]వలయ మచ్ఛిద్రంబుగా నమ్ములన్.

202 క. [1]ఘోరల నందఱ రౌద్రా, [2]కారుండై కసిమసంగి గాంగేయుఁడు దు
ర్వారపటుబాణ నిహతిని, వీరాహవరంగమునకు విముఖులఁ జేసెన్.

203 క. నెఱి నుఱక వైరివీరుల, [1]నెఱఁకుల [2]దూఱంగ[3] నేయు నృపపుంగవు నం
పఱ [4]కోర్వక [5]పిఱుసని రని, వెఱచి విషణ్ణు లయి సకల [6]విషయాధి
పతుల్

200 1 రాజులకు — పెక్కు ప్రతులు 2 లందును స్వయంవరంబున — పెక్కు ప్రతులు 3. గెలిచి — త; నొడిచి — న. 4. కంటె నుత్తమం బొండెద్ది కలదు — ర.ల; కంటె నుత్తమం బెద్దియులేదు గావున — బొ.త. 5. నా — పెక్కు ప్రతులలో లేదు; నాపోవుట — ఖ. 6. పరమధర్మంబు — ల.వి. ధర్మవిరోధంబు కాదని — జ. 7 పీడ్కొని — కొన్ని ప్రతులలో లేదు.

201 1. జెనసి — ట ర వి; బొదివి — య; గడచి — క ఖ, బొడిచి — న. 2. నలిగి — య; గవిసి — ఐ. 3. వివర — ఆ ఋ ఒ గ.

202 1. ఈ పద్యమునకు ముందు 'అయ్యవసరంబున' అని ఏ ఖ. ప్రతులందు కలదు. 2. కారంబున గసిమసంగి — ర.

203 1. నెరకలు — పెక్కు ప్రతులు. 2. దూలంగ — ఇ.ఋ.ఓ.క ద.ర. 3. నేయ — ఋ.ఎ ఏ.ఓ.ఓ.త.బ; వారు — ఖ. 4. కోపక — పెక్కు ప్రతులు. 5. పిఱువేఁడిరి — పురివీడిరి — స. కొన్ని ప్రతులు; పిరిది సనిరి — ల; పరువెత్తిరి — మ; విఱిగిసనిరి — న; పిరుపెడలి — బ; పిఱుఁదజనిరి — చ.వి.శ.ష. 6. విపులాధిపులుఁ — ఋ క.మ.

204 వ. ఇట్లు [1]నిఖిల క్షత్రియ [2]క్షయార్థం [3]బలిగిన పరశురాముండునుంబోలెఁ [4]గడు నలిగి పరశురామశిష్యుం డాక్షత్త్రివర్గంబు నెల్లఁ దన శర[5]ధారా వర్షంబున ముంచి [6]యోడించి యేకవీరుండయి వచ్చువాని పిఱుంద సమర[7]సన్నద్ధుండయి [8]సాల్వుండు సనుదెంచి.

-: సాల్వుఁడు భీష్మునితో యుద్ధంబు సేయుట :-

సం. 1-96-27

205 ఉ. ఈ వసుధాధినాధుల జయించిన [1]యట్టిద కాదు చక్కనై
పోవక [2]నిల్వు నా కెదిరి [3]పోర మదీయ ధనుర్విముక్తనా
నావిధమార్గణోగ్ర [4]గహనంబున దిగ్భ్రమఁ బొంద కెమ్మెయిం
బోవఁగఁ [5]బోలు నీకనుచుఁ బూరుకులోత్తముఁ దాఁకె వీఁకతోన్.

206 వ. భీష్ముండును [1]దనరథంబు [2]నివర్తింపించి సంవర్తసమయ [3]సమవర్తియుం బోలె నతిరౌద్రాకారుండయి [4]నిలిచిన.

207 చ. అనిలజవంబునం బఱచు నమ్మదనాగ [1]మెదిర్చి క్రమ్మఱిం
చిన పరికాఁడ పోలెఁ గురుసింహ [2]వరూథము నిట్లు [3]గ్రమ్మఱిం
చునె యితఁడంచుసుం దగిలి [4]చూపఱు సాల్వమహీశు విక్రమం
బొనరఁగ [5]నగ్గడం బొగడుచుండిరి విస్మయ[6]సక్తచిత్తులై.

204 1. సకలక్షత్రియహరణార్థం — న 2. జయార్థం — డ.ద 3 బరిగిన — పెక్కు ప్రతులు. 4. కడునలిగి — కొన్ని ప్రతులలో లేదు. 5. ధారా — ఐ ఓ.ట. లలో లేదు. 6. జయించి — ఆ.ఇ.ఋ. వాఁడు — వా.ళ. 7 సరంభుండై — స. కొన్ని ప్రతులు; సన్నాహ సంభ్రమంబున — వ. 8 సాల్వరాజు — పెక్కు ప్రతులు.

205 1 యట్టుల — ఊ.ఖ.బ; యట్టిద నాకుఁ — చ.శ ష. 2. నిల్చి — ల. 3. ఘోరు — ఆ.వ. 4. గహనార్చుల — డ. 5. వచ్చు — ఊ.డ.

206 1. దనరథం బతనికి సమ్ముఖంబు సేయించి — మ 2. తాన నిర్వర్తించుకొని — బ; నివర్తించి — స; నిర్వర్తించి — పెక్కు ప్రతులు. 3 వర్తి — వా 4. నిలిచెనంత — ఔ.త.

207 1. ముదీర్చి — కొన్ని ప్రతులు; ముదించి — ఓ; మున్రదిప్పి — ఆ. 2. వరోత్తము — న.ర. 3. నిల్వరించునె--ఋ. 4. చూపరు — పెక్కు ప్రతులు; చూపఱ — వా. 5. నెల్లెడం — జ. 6. మాన — ఔ.త.

208 వ. [1]అంత.

209 క. ధృతిమెయి శతసంఖ్యయు దశ,శతసంఖ్యయు [1]శతసహస్రసంఖ్యయును [2]శతా
యుత సంఖ్యయుఁగా దేవ,వ్రతు మీఁదను సాల్వుఁ డేసె వాఁడిశరంబుల్.

210 క. ఘనభుజుఁ డన్నియు నడుమన,[1]తునియఁగ వడి నేసి వాని తురగ[2]చయస్యం
దన సూతుల [3]నొక్కొక యమ్మున, ద్రెళ్ళఁగ నేసె భరతముఖ్యుఁడు
పొంరన్.

211 క. రథమును రథ్యంబులు సా,రథియును వృథయైన భగ్నరథుఁడై బాగీ
రథి [1]కొడుకుచేత విమనో,రథుఁడై [2]సాల్వుండు నిజపురంబున [3]కరిగెన్.

212 వ. ఇట్లు సకలరాజలోకంబు నెల్ల నశ్రమంబున [1]నోడించి సాల్వ[2]రాజు
మందల విడిచి పరాక్రమలబ్ధలయిన కాశీరాజ [3]దుహితల నంబాంబాలికాంబి
కలం దోడ్కొని వచ్చి భీష్ముండు విచిత్రవీర్యునకు వివాహంబు సేయ
[4]నున్న నందుఁ బెద్దయదియైన యంబ యిట్లనియె.

213 ఆ. పరగ [1]నన్ను సాల్వపతి వరియించినఁ, దండ్రిచేతఁ బూర్వదత్తనైతి
నమ్మహీశునకు నయంబున నెయ్యది, ధర్మువెఱిఁగి దానిఁ దలఁపు[2]మిపుడు.

208 1 కొన్ని ప్రతులందు లేదు.

209 1. దశ — పెక్కు ప్రతులు. 2. దశాయుత — పెక్కు ప్రతులు

210 1. తునియంగా నేసి వాని — ఆ ఇ ఋ ; తునియఁగఁ బడనేసి — చ.ట.శ ష.
2. ధనుస్స్యందన — ఏ.ఔ.ఖ న.స ; శిరస్స్యందన — స; గజ — అ ఎ; రథ —
ఆ.ఇ.ఋ ఓ.ట. 3. నొకసాయకమున — ఈ.

211 1. పుత్రుచేత — వ. 2. సాళ్వుండు — కొన్ని ప్రతులు 3. కేగెన్ — ట.

212 1. జయించి — కొన్ని ప్రతులు. 2 రాజు ముందట — ఊ ; రాజు మఁందల —
ద.ర; రాజుం బరిభవించి — న. 3. దుహితలం దోడ్కొని — కొన్ని ప్రతులు ;
దుహితల ముగ్గురం దోడ్కొని — ఔ; కూఁతుల నంబాం — చ.వీ.శ.ష.
4. నున్నంత — కొన్ని ప్రతులు ; నున్న యవసరంబున — ఔ.త.ర.

213 1. మున్ను—య 2. డీరు—స. కొన్ని ప్రతులు ; డిపుడు — కొన్ని ప్రతులు.

-: విచిత్రవీర్యుని వివాహము; మరణము :-

సం. 1-96-52

214 వ. అనిన విని భీష్ముండు ధర్మవిదులయిన బ్రాహ్మణుల యనుమతంబున దాని సాల్వరాజున కిచ్చి పుచ్చి మహోత్సవంబున [1]నయ్యిరువురు కన్యకల విచిత్రవీర్యునకు వివాహంబు సేసిన

215 ఉ. లాలితరూపయౌవనవిలాస[1]విభాసిను లైన యంబికాం
బాలికలం వివాహ మయి భారతవంశకరుండు గామలీ
లాలలితాను[2]భోగరసలాలసుఁడై నిజరాజ్యభారచిం
తాలసుఁడయ్యెఁ గామికి [3]నయంబున నొండు దలంపఁ బోలునే.

216 వ. ఇట్లు సకలవ్యాపారరహితుండై కాశీరాజదుహితల నయ్యిరువుర నతి [1]ప్రణయగౌరవంబునం దగిలి.

217 సీ. అమలసుధారమ్యహర్మ్యతలంబుల నవకుసుమామోదనందనములఁ
గృతకాద్రికందరక్రీడా[1]గృహాంగణ వివిధ[2]రత్నోపలవేదికలను
గలహంస కలనాద కమనీయ కమలినీ దీర్ఘికా సైకత తీరములను
రమియించుచును గామరాగాధికాసక్తిఁ జేసి శోషించి విచిత్రవీర్యుఁ

ఆ. డమరపురికిఁ [3]జనిన నతనికిఁ బరలోక, విధుల శాస్త్ర[4]దృష్టి వెలయఁ జేసె నాపగాతనూజుఁ డఖిల బాంధవులయు, బ్రాహ్మణులయుఁదోడ భాను నిభుఁడు.

214 1. నయ్యిద్దరు — కొన్ని ప్రతులు ; కడమయిద్దరు — ఇ.

215 1. విభాసిత — ఖ.వ.ల పి.శ.ష. 2 రాగ — పెక్కు ప్రతులు. 3. మనంబున నొండుదలంపు గల్గునే — స

216 1 ప్రియంబున — కొన్ని ప్రతులు.

217 1 గృహంబుల - అ.ట.త య.ర. 2. రత్నోజ్జ్వల — చ.పి.శ.ష.స. 3. జనియె — మ.ర. 4. యుక్తి - త.స.

—: సత్యవతి భీష్ముని వివాహమాడుమని కోరుట :-

సం. 1-97-4

218 వ. మఱియు నత్యంతశోకార్ణ[1]వంబున మునింగిన తల్లిని [2]మఱందండ్రను [3]నాశ్వాసించి యరాజకం బయిన [4]రాజ్యం బకలంకం[5]బుగాఁ బ్రతిపాలించు చున్న కొడుకు నఖిలధర్మవిదు గాంగేయుం జూచి సత్యవతి యిట్లనియె.

219 క. శంతను సంతానంబును, సంతతకీర్తియును బిండ [1]సత్కృతియును న త్యంతమహీ[2]భారమును బ,రంతప నీయంద చిరతరంబై నిలిచెన్.

220 చ. జననుత [1]సర్వధర్మములు సర్వజగత్పరి[2]వర్తనక్రమం
బును మఱి సర్వ[3]వంశములుఁ బుట్టిన మార్గము నీవ నిక్కువం
బనఘ యెఱుంగు దున్నతగుణాఢ్యుఁడవుం భరతాన్వయావలం
బనుఁడవు [4]నీవ [5]నిన్నొకఁడు పంచెదఁ జేయు[6]ము మత్ప్రియంబుగన్.

221 క. ఇక్కురు వంశంబున [1]నీ,వొక్కరుఁడవ యున్నవాఁడ వుర్వీరాజ్యం [2]బెక్కటి సేకొని తేజము, దిక్కుల వెలిఁగింపు సంతతియుఁ బడయు మొగిన్.

222 క. నిరతంబు బ్రహ్మ మొదలుగ, వరుసన యెడతెగక యిట్లు వచ్చిన వంశం బురుభుజ నీ వుండఁగ నీ, తరమున విచ్ఛిన్నమగుట ధర్మమె యనినన్.

218 1. వమగ్నలైన — బౌ.త. 2. దన మాఱదండ్రను — కొన్ని ప్రతులు. 3. నూరార్చి — వ 4. రాజ్యంబు కలంకంబుగాకుండ — మ; రాజ్యంబు సకలంబునుం — య. 5. బై నిర్వక్రంబుగా — న

219 1. సత్కృతి — పెక్కు ప్రతులు; సంస్కృతి — వా శ; సత్క్రియ — ఆ.మ. 2. రాజ్యంబు — ఋ గ ల; రాజ్యమును — ఓ ట.బ; భారభరంబంతయు నీయంద — న.డ. (యతిభంగము)

220 1. సర్వధర్మువులు — వా.శ ; కొన్ని ప్రతులు; సత్యధర్మములు — వ. 2 రతుణ — ఊ జ. 3. కర్మములు — ర 4. గాన — ర.వ 5. నిన్నొకటి — ఆ.ఐ బౌ.గ.జ.ట న ర; నిన్నొకటబంచెద — మ, నేనొకటి — ఓ వ. 6. మనఃప్రియంబుగన్ — డ.ద.

221 1. కివొకరుడవ — య. 2. బొక్కట చేకొని — బ.

223 క. విని భీష్ముఁ డనియె మీకిట్లని యానతి [1]యీయదగునె యమ్మెయి నాపలికిన పల్కును మఱి నాతాల్చిన వ్రతమును [2]జెఱుప నంత చిఱుతనె [3]చెప్పుఁడా.

224 క. హిమకరుఁడు శైత్యమును న, ర్యముఁడు మహాతేజమును హుతాశనుఁ డుష్ణత్వము [1]విడిచి రేని గుర్వ, ర్థము [2]నాచేకొనిన [3]సద్వ్రతంబు విడుతునే.

225 వ. పృథివ్యాది[1]మహాభూతంబులు గంధాదిగుణంబుల నెట్లు విడువ నట్ల యేనును [2]గురుకార్యంబున [3]మీ శుల్కార్థంబుగా సర్వజనసమక్షంబు[4]న నాచేసిన సమయస్థితి [5]విడువ నది యట్లుండె మీయానతిచ్చినట్లు నా యెఱుంగని [6]ధర్మువులు లేవు శంతనుసంతానంబు శాశ్వతంబగునట్లుగా [7]క్షత్త్రధర్మంబు సెప్పెద నాచెప్పిన దాని [8]ధర్మార్థవిదు లయి లోక[9]యాత్రానిపుణు లయిన పురోహిత ప్రముఖ [10]నిఖిల బ్రాహ్మణవరులతో విచారించి చేయు నది యని భీష్ముం డందఱు విన నిట్లనియె.

223 1 యీను — స ; కొన్ని ప్రతులు ; యీఁగ — వా ; యియ్య — కొన్ని ప్రతులు ; నియ్య — ల. 2. నెడప — ఊ.ఓ, గడప — ప య, విడువ — ఇ ఐ ఖ గ.మ 3. చెపుమా — పెక్కు ప్రతులు ; చెపుడా — ఉ.ఋ.

224 1. విడుతు రేని — కొన్ని ప్రతులు ; విడుచునేని — కొన్ని ప్రతులు. 2. గా నా కొనిన — కొన్ని ప్రతులు ; గా జేకొనిన — కొన్ని ప్రతులు. 3 సువ్రతము — ఏ.ఓ ; యీ వ్రతము విడువనొగిన్ — న.

225 1 పంచమహా — ఊ ఖ జ.వీ శ ష. 2. వివాహకార్యంబున మీకు — మ. 3. మీ వివాహార్థంబుగా — కొన్ని ప్రతులు , మీ శుశ్రూషార్థంబుగా — న; మీకు సుఖార్థంబుగా—ఎ ఋ 4. నంజేసిన — కొన్ని ప్రతులు ; న నాఁడు చేసిన — ఇ.చ ల వీ శ ష.స ; న సర్వసంగపరిత్యాగ సమయసంస్థితి చేసితిం గాన దాని — ఋ. 5. విడుతునే యది — జ 6. ధర్మువు లేదు — ల; ధర్మంబు లేదు — ఋ.గ ద.బ 7. క్షత్రియ — ఖ.మ. 8 సర్వార్థవిదు — మ. 9. పావనయాత్రా — న , శాస్త్ర — ప. 10. నిఖిల — పెక్కు ప్రతులలో లేదు

226 చ. పితృవధజాతకోపపరిపీడితుఁడై జమదగ్ని[1]సూనుఁ డు
ద్ధతబలు హైహయుꣳ సమరదర్పితుఁ జంపి [2]యశేషధారుణీ
పతుల [3]వధించె గర్భగత[4]బాలురు నాదిగ నట్టిచోటఁ ద
త్సతులకుఁ దొల్లి ధర్మవిధి సంతతి నిల్పిరెభూసురోత్తముల్.

—: దీర్ఘతముని వృత్తాంతము :—

సం. 1-98-6

227 వ. మఱి యదియునుంగాక [1]యుతథ్యుం డను మునివరుని[2]పత్ని మమత యను దాని గర్భిణి నభ్యాగతుం డయి బృహస్పతి [3]దేవరన్యాయంబున నభిలషించినఁ దదీయగర్భస్థుండయిన పుత్త్రుం డెఱింగి యిది ధర్మవిరుద్ధం బని యాక్రోశించిన వానికి నలిగి బృహస్పతి సర్వభూతేప్సితం బైన యిక్కార్యంబు నందు నాకుఁ బ్రతికూలుండ వయితివి కావున దీర్ఘ[4]త మంబును బొందుమని శాపం బిచ్చిన వాఁడును దీర్ఘతముండు నాఁ [5]బుట్టి సకలవేదవేదాంగవిదుం డయి జాత్యంధుం డయ్యును తన విద్యాబలం బునఁ బెద్దకాలంబునకుఁ బ్రద్వేషిణి యను [6]నొక్క [7]బ్రాహ్మణి వివాహం బయి [8]గౌతమాదులయిన కొడుకులం బెక్కండ్రం బడసిన నది లబ్ధ [9]పుత్త్రియై తన్ను మెచ్చకున్న నిట్లేల [10]నన్ను మెచ్చవని దీర్ఘతముండు [11]ప్రద్వేషిణి నడిగిన నది యిట్లనియె.

226 1. రాముడు — మ. 2 సమస్త — ఓ.న.బ.వ. 3 నుజంపె — వా.శ. కొన్ని ప్రతులు. 4. బాలుర నాదిగ — పెక్కు ప్రతులు.

227 1. యుచథ్యుఁడు — వా; భవ్యుండను — కొన్ని ప్రతులు. ఉతథ్యుఁడు — శ. అథోతథ్య ఇతిఖ్యాత ఆసీద్ధీ మానృషిఃపురాః — నీలకంఠప్రతి పుట 191. 2. ధర్మపత్ని — పెక్కు ప్రతులు. 3. దేవరత్వంబున — కొన్ని ప్రతులు. 4. తమంబునంబొందు — అ ఐ.త.బ ల ; తమసం బొందు — మ. 5. బరగి — ట.ర. 6. నొక్క — పెక్కింట లేదు. 7. భార్యను — వ. 8. దాని యందు గౌతమాదు — ఋ ఐ.ఖ.బ 9. సంతాన — ఏ.బ.వ. 10. తన్ను—న. కొన్ని ప్రతులు. 11. ప్రద్వేషీం నామ బ్రాహ్మణీం. భం. లో. s. పాఠము.

228 తే. పతియు భరియించుఁ గావున భర్త యయ్యె
భామ భరియింపఁబడుఁ గాన భార్య యయ్యెఁ
బరగ [1]నవి మనయందు [2]పీడ్వడియె నిన్ను
[3]నేన యెల్లకాలము భరియింతుఁ గాన.

229 ఆ. [1]ఎంత కాలమయిన నిప్పాట భరియింప, [2]నోప నింక నరుగు మొండు కడకు
ననిన నిర్దయాత్మ లని దీర్ఘ[3]తముఁ డల్గి, [4]సతులకెల్ల నపుడు శాప మిచ్చె

230 క. పతిహీన లయిన [1]భామిను, లతి ధనవతు లయ్యుఁ గులజ లయ్యును ననలం
కృత లయ్యెదు మాంగల్య ర,హిత లయ్యెదుఁ గృపణవృత్తి నిదియు
మొదలుగన్.

231 వ. అని శాపం బిచ్చిన దీర్ఘ[1]తమునకు [2]నలిగి ప్రద్వేషిణి యిమ్మునిదు[3]కని నె
టయేనియుం గొనిపొండని తనకొడుకులం బంచిన వారును [4]నయ్యౌతథ్యు.
నతివృద్ధు జాత్యంధు [5]నింధనంబులతోఁ బంధించి [6]మోహాంధులయి
గంగలోఁ [7]బడిచిన నమ్మునియును బ్రవాహవేగంబునఁ బెక్కు దేశంబులు

228 1. నది — చ ల శ.ష; నివి — కొన్ని ప్రతులు ; నిది — ఋ.ఐ క.గ.ద.
2 గీడ్వడియె — త; గిడ్వడియె—బ. 3. నెల్లకాలమునే భరియింతుఁగాన —
ఇ.చ.మ ల.వీ.శ.ష

229 1. ఇంత కాలమయ్యె నిప్పాట — న 2. నోప నరుగుమింక నొండుకడకు —
పెక్కు ప్రతులు. 3. తమసుండు సతులకెల్ల నలిగి శాపమిచ్చె—ఆ. 4 శాప
మిచ్చెనపుడు సతులకెల్ల — ఈ.ఉ.ఋ జ.వ.వ

230 1. కామిను — ఓ

231 1. తమస్సున — ఆ మ. 2 కడునలిగి — న. 3. నలి — ఐ క ; నని —
ఓ ఖ.ట 4. నయ్యౌచద్యు — వా , నంచుని — ఊ ; నతిశాంతచిత్తు —
చ ల శ.ష ; నౌచిత్యు — కొన్ని ప్రతులు 5. నింధన బంధనములతో —
కొన్ని ప్రతులు ; కాష్ఠే సముద్గే ప్రక్షిప్య గంగాయాం సమవాసృజన్ — భం.
6. మదాంధులయి — ఆ ఇ.చ.పీ శ.ష ; నిర్మోహులయి — ప.య. 7. వైచిన —

గడచి చనియె నంత నొక్క[8]నాఁడు బలియను రాజు గంగాభిషేకార్థంబు వచ్చిన వాఁ డయ్యింధన బంధనంబున నుండియు నుదాత్తానుదాత్త స్వరిత ప్రచయ స్వరభేదంబు లేర్పడ సలక్షణంబుగా వేదంబులం జదువుచుఁ దరంగఘట్టనంబునం దనయున్న దరిం జేరవచ్చినవానిఁ [9]దీరంబుఁ జేర్చి యింధనబంధనంబులు విడిచి మహర్షి మామతేయుంగా నెఱిఁగి [10]తన్నెఱింగించుకొని నమస్కారంబు సేసి యిట్లనియె.

232 క. ఎందుండి వచ్చితిందుల, కెందుల [1]కేఁగుదు మహాముసీశ్వర విద్వ
ద్వందిత నాపుణ్యంబునఁ, జెందితి [2]నన్నిష్ట[3]ఫలముఁ జెందిన [4]పాటన్.

233 వ. [1]ప నపుత్త్రికుండనై యెవ్విధంబునను సంతానంబు వడయనేరకున్న వాఁడ నాకు [2]సంతానదానంబు దయ[3]సేయుమని యతనిం బూజించి తనపురంబునకుం దోడ్కొని చని ఋతుమతియై యున్న తనదేవి సుదేష్ణ యనుదాని సమర్పించిన నదియును.

234 ఆ. పుట్టుఁజీకు వృద్ధుఁ బూతిగంధాననుఁ, వేదజడునిఁ [1]బొంద వెలఁది రోసి
[2]తన్నపోనిదానిఁ దన్వీఁ గోమలిఁ దన, [3]దాదికూఁతుఁ బంచెఁ దపసికడకు.

235 వ. ఆదీర్ఘతముండును దాని[1]యందుఁ గాక్షీవదాదుల నేకాదశపుత్త్రులం బుట్టించిన బలియును సంతసిల్లి వీరలు [2]నాకులపుత్త్రకులే యని నమ్మని వానికిట్లనియె.

అ.ఇ.ఊ.ఒ ఓ న బ 8 దేశంబున — మ. 9 ఁదీరంబుఁ జేర్చి యింధనబంధనంబులు విడిచి — ఈ భాగము పెక్కు ప్రతులలో లేదు. 10. తన్నెఱింగించి — వా ళ. కొన్నింట లేదు.

232 1. కేఁగెదు — పెక్కు ప్రతులు. 2. నన్నిష్ట — పెక్కు ప్రతులు; నాకిష్ట — ఆ.ఊ మ. 3. సిద్ధి — డ.ద 4. పొంకెన్ — అ.ఇ.బ ల, మాడ్కిన్ — గ.ప.య; భంగిన్ — చ ట.ర.వీ.శ ష.

233 1. పనపత్యుండనై — క 2. సంతానంబు దయసేయు — కొన్ని ప్రతులు; సంతానంబు సేయు — ఔ.త. 3. సేయవలయు — ర, సేయుండని — ఋ.న.

234 1. ముట్ట — ర. 2. తన్నుఁబోలు - య.వ. 3. దాసి — ఊ ఎ.ఖ.జ

235 1. వలన — వా ళ కొన్ని ప్రతులు 2 నా పుత్త్రకులే — వా; నాపుత్రకు లగుదురే — కొన్ని ప్రతులు.

236 క. వీరలు [1]నీకులపుత్త్రులు, గారు భవద్దేవి దాది గాదిలిసుతకుఁ
భూరి[2]భుజ యుద్భ[3]వించిన, వారు మహాధర్మ[4]పరు లవారితసత్త్వుల్.

237 వ. అనిన నబ్బలి సంతానార్థి గావున వెండియు నమ్మునిం బ్రార్థించి తత్ప్ర సాదంబు వడసి సుదేష్ణ నియోగించిన దీర్ఘతముండును దాని యంగంబు లెల్ల నంటి చూచి వంశకరుండును [1]మహాసత్త్వుండును నయ్యేడు కొడుకు నీకుంబుట్టునని యనుగ్రహించిన దానికి నంగరాజను రాజర్షి పుట్టె నివ్విధంబున నుత్తమక్షత్రియక్షేత్రంబులందు ధర్మమార్గంబున [2]బ్రాహ్మణుల వలనం బుట్టి వంశకరు లయిన క్షత్త్రియు లనేకులు గలరు.

*-: సత్యవతి భీష్ముని యనుమతంబున వ్యాసుని సోదరక్షేత్రములయందు సంతానమును బడయుమని నియోగించుట :-*

సం. 1—99—1

238 క. కావున [1]నియతాత్ము జగ, త్పావను [2]ధర్మస్వరూపు బ్రాహ్మణుఁ బడయం
గా వలయు వాఁడు సంతతిఁ, గావించు విచిత్రవీర్యక క్షేత్రములన్.

239 వ. అనిన భీష్ముపలుకులకు సంతోషించి సత్యవతి దొల్లి[1] దన కన్యయై యున్న కాలంబునఁ బరాశరుండు దన్నుఁ గామించుటయు నమ్మునివరంబునఁ దన కన్యాత్వంబు దూషితంబు గా కునికియుఁ దత్ప్రసాదంబునం జేసి యమునా ద్వీపంబునఁ గృష్ణద్వైపాయనుండు గానీనుండయి సద్యోగర్భంబునఁ బుట్టి [2]పని గల యప్పుడ [3]తన్నుఁ దలంచునది యని చెప్పి తపోవనంబునకుం జను టయును భీష్మునకుం జెప్పి నిజతపోదహనదగ్ధపాపేంధనుం డయిన కృష్ణ ద్వైపాయనుం [4]డఖిలధర్మమూర్తి [5]నిత్యసత్యవచనుండు నా నియోగంబున నీ యనుమతంబున భవద్భ్రాతృక్షేత్రంబుల యందు సంతానంబు వడయు ననిన నమ్మహర్షి కీర్తనంబు విని భీష్ముండు కరకమలంబులు [6]మొగిచి

236 1. నీకును — ఋ.న. 2. భుజులుద్భ — ద.చ.య. 3. వెల్లిన — కొన్ని ప్రతులు. 4. పరులు వసుధాదీశా — ర.

237 1. బవసత్త్వ సంపన్నుండును — ఔ.ట.న.ర.వ 2. బ్రాహ్మణవరుల — న.

238 1. నియతాత్మ — ఎ ఐ.క.గ.బ.య.ర. 2. బ్రహ్మ — వ.

239 1 కొండుకనాఁడు దనకన్యయై — వా.శ. 2. నీకుంబని — ర; మీ కుంబని — య. 3. నన్ను — ఐ ద బ.య.ర; ల ప్రతిలో లేదు. 4. డఖిల లోకపూజ్యుం డఖిల ధర్మ — ఇ.చ.వి.శ.ష.స. 5. నిత్య — పెక్కింట లేదు. 6. మొగిడ్చి — ఈ ఖ.

వ్యాసభట్టారకుఁ డున్న [7]దిక్కునకు మ్రొక్కి తొల్లి జగంబు లుత్పాదించిన యాదిమబ్రహ్మకుం గలసామర్థ్యంబు గల వేదవ్యాసుం డిక్కురువంశంబుఁ [8]బ్రతిష్ఠించునది యెల్లవారికి నభిమతంబ యనిన సత్యవతి కురువంశోద్వాహనార్థంబు పారాశర్యుం దలంచుడు నాక్షణంబ

240 ఉ. నీలగిరీంద్రశృంగ[1]మున నిర్మలమైన సువర్ణవల్లరీ
జాలముపోని పింగళవిశాలజటాచయ మొప్పఁగా వచ
శ్శ్రీలలితుండు వచ్చి నిలిచెన్ హరినీల వినీల విగ్రహ
శ్రీల రుచుల్ వెలుంగఁగ బరాశరసూనుఁడు తల్లిముందటన్.

241 వ. సత్యవతియును బెద్దకాలంబునకు వచ్చిన యా ప్రథమపుత్త్రు నతిహర్షంబునం గౌఁగిలించికొని యవిరళ[1]పయోధారల నానందబాష్పధారలం జేసి యభిషేకించుచున్న నమ్మునివరుండును దల్లి బాష్పజలంబులు దుడిచి యభి[2]వాదనంబు సేసి పురోహిత పురస్సర భూసురవరులతో [3]విధిపూర్వకంబుగా భీష్ముండు సేసిన యర్ఘ్యాది పూజలు సేకొని సుఖాసీనుండై యున్న నమ్మహామునిఁ గుశలం బడిగి సత్యవతి యిట్లనియె.

242 క. జనకునకును స్వామిత్వము, [1]తనయోద్దేశమునఁ గలిమి తథ్యమయది య
జ్జననికిఁ గలుగున కావునఁ, జనుఁ బనిఁ బంపంగ నిన్ను జననుత నాకున్.

నరవ, 7 దిశకు — అమ; దిక్కుమొగంబై — య; దిక్కునకు మొగంబై — గ. 8 బ్రతిష్ఠించుట యెల్లవారికి — ల.స; ప్రతిష్ఠాపించుట — చ.వీ శ ష; ప్రతిష్ఠ సేయుట — మ

240 1 మన — వ.

241 1. పయోధర — పెక్కింట లేదు; పయోధర — వా. పయోధారల — వీ.శ.ష. కొన్ని ప్రతులు. 2. వందనంబు — ఒ.డ ద.బ.మ.ర. 3 విధిపూర్వకంబుగా — కొన్నింట లేదు.

242 1. తనయుని దెసఁగలిమి వినఁగఁదథ్యమదియ — ఋ.చ వీ.శ.ష.

243 చ. అనుపమరాజ్యసంపదకు నర్హుఁడు వంశము [1]వి_స్తరింప నో
పిన సుచరిత్రుఁ డీసుతుఁడు భీష్ముఁడు దొల్లియుఁ దండ్రికిం బ్రియం
బనఘుఁడు సేయుచుండి నిఖిలావనిరాజ్యనివర్తనంబునుం
దనరఁగ బ్రహ్మచర్యమును దాల్చె జగద్విదిత ప్రతిజ్ఞుఁడై .

244 క. ఈయన్వయ విచ్ఛేదము, నీయెఱుఁగనియదియె సన్ము[1]నిస్తుత జగముల్
నీయంద [2]నిలిచినవి గా, వే యిక్ష్వాకులత్రయ ప్రవృత్తులతోడన్.

245 క. ధృతి నీయను[1]జుండై వి, శ్రుతుఁడైన విచిత్రవీర్యు సుక్షేత్రములన్
సుతులం బడయుము కులమవి,రత[2]సంతతి [3]నెగడ దేవరన్యాయమునన్.

246 క. నీకారణమున వంశ మ,నాకులమై నిలుచుటయుఁ దిదాప్తులుఁ బ్రజలున్
శోకభయంబులు విడుతురు, నాకును భీష్మునకుఁ గడు మనఃప్రియ [1]మెసఁ
గున్.

247 క. అని సత్యవతి నియోగిం,చిన వేదవ్యాసుఁ డట్ల చేయుదు [1]నిదియెం
దును గల [2]ధర్మువ యెప్పుడు, వినఁబడు నానాపురాణ [3]వివిధశ్రుతులన్.

248 వ. ఇక్ష్వాకురాజ దుహితలయందు ధర్మస్థితిం బుత్త్రోత్పత్తిఁ గావించెద వీరలు నాచెప్పిన వ్రతం బొక్క సంవత్సరంబు సేసి శుద్ధాత్మలగుదురేని సత్పుత్రులు పుట్టుదు రనిన సత్యవతి యిట్లనియె.

249 క. ప్రకటముగ వంశ[1]విస్తా,రకులగు పుత్త్రకులఁ జెచ్చెరం బడయు మరా
జకమయిన ధారుణీప్రజ, [2]కొక నిమిషం [3]బయినఁ [4]బ్రకృతి నుండఁగ లావే.

---

243 1. ని_స్తరింప - అ ఇ.ఏ.ఐ.మ.ర.స.

244 1. నీశ్వర – ఋ.ఐ.ఔ గ.త వ. (అఖండయతి) 2. పుట్టినవి - ఋ.య.

245 1. జుడుగడు విశ్రుతు – ట.ర. 2. సంపద–న. 3 నెసగ – కొన్ని ప్రతులు.

246 1. మెసఁగఁగ – వా.శ. కొన్ని ప్రతులు

247 1. నది – కొన్ని ప్రతులు 2. ధర్మమ యనియును — మ. 3. వివిధ స్మృతులన్–ఆ.ఊ; విశ్రుతకథలన్ – ఐ.

249 1. నిస్తారకు—ఇ.ఋ ఉ.త.మ.ల.స. 2. యొక—ఇ చ.ద.ల.వి.శ.ష; లోక – ఎ.ఏ.ఔ.త. 3. బేని – పెక్కు ప్రతులు. 4. బ్రతికియుండంగలరే– కొన్నిప్రతులు

250 చ. అవని యరాజకం బయిన యప్పుడ భూప్రజయందు సర్వధ
ర్మువులు దొలంగు దేవమునిముఖ్యులు వాయుదు [1]రోలి వృష్టి [2]తే
దవు మఱి [3]యర్ఘువుల్ దఱుఁగు [4]నందురు గావునఁ గాలయాపనం
[5]బవితథవాక్య చేయక [6]నయంబున రాజ్యము నిల్పు మిత్తఱిన్.

251 క. [1]దయ నీచే నుత్పాదితు, లయినసుతులు దమ్మెఱుంగునంతకు భీష్ముం
డయనయశాలి సమర్థుం, డయి చేకొని రాజ్యభార [2]మూరయుచుండున్.

252 వ. అని సత్యవతి కృష్ణద్వైపాయను నియోగించి ఋతుమతియు శుచిస్నాత
యునై యున్న యంబికకడకుం జని [1]క్షేత్రజ్ఞుండైన వాఁడు సుపు
త్త్రుండు గావున ధర్మ్యంబైన [2]విధానంబున నీవు రాజ్య[3]ధురంధరుండయిన
కొడుకుం బడసి భరతవంశంబు నిలుపు మెల్లధర్మంబుల కంటెఁ గులంబు
నిలుపు[4]టయు మిక్కిలి ధర్మంబు నేఁటిరాత్రి నీకడకు దేవరుండు [5]వచ్చుం
దదాగమనం[6]బుఁ బ్రతీక్షించి [7]యుండునది యని కోడలి నొడంబఱిచి
యనేకసహస్ర[8]మహీసురులను [9]దేవతలను [10]ఋషులను నిష్ట[11]భోజనంబు
లం [12]దనిపి యున్న నారాత్రియందు.

250 1 రోపి — ర.ల.స. కొన్ని ప్రతులు. 2 తేఁతవు — మ. 3. యగ్గువుల్ — స. 4 నంద్రది గావున — ఆ ఈ.స 5. బధిరళ — య. 6. రయంబున — ఉ.చ.త.వీ.శ.ష.

251 1. దయచే నీయుత్పాదితు — ర. 2. మరయుచు నుండున్ — అ.ఈ.ఉ.ఔ. ఖ.జ.బ య.వ; మంతయు నరయున్ — ర

252 1. క్షేత్రజ్ఞుండైన — వా. కొన్ని ప్రతులు 2. విధంబున — ఊ.డ.ద.మ; విషయంబున — య. 3. భారధురంధరు — కొన్ని ప్రతులు. 4. టయుత్తమ ధర్మంబు — ఏ ఖ. 5. వచ్చుంగావున దదాగమ — ఆ.ఇ ఖ మ.ల వీ శ.ష. 6. బపేక్షించి — కొన్ని ప్రతులు. 7. యుండుమని కోడలి — ర. 8. మహీసుర వరులకు, దేవతలకు — ర.స. 9. ఋత్విజులను దేవత — ఏ ఐ.ట.న.బ. 10. ఋషులను — పెక్కింట లేదు. 11. భోజనారాధనల — ర.వ. 12. దుష్టినలిపి యున్నంతనారాత్రి — ర స

## —: ధృతరాష్ట్ర పాండురాజ విదురుల జననము :-

సం. 1-100-4

253 క. తివిరి సుతజన్మ [1]మెన్నం,డవునొకో దేవ[2]రునివలన ననుచును నవప
ల్లవ కోమలాంగి [3]యంబిక, ధవళేక్షణ విమలశయనతలమున [4]నున్నన్.

254 మధ్యాక్కర. అవసరజ్ఞుం[1]డయి వ్యాసుఁ[2]డేతెంచె నంత నత్తపసి
[3]కవిల గడ్డంబును గవిలజడలును గవిలకన్నులును

253 1. మెట్టిండవు — వా.శ. 2. రునికరుణ — కొన్ని ప్రతులు ; రుఁడు నాకు — వా.శ. కొన్ని ప్రతులు 3. యంతట — ఈ. 4. నుండెన్ — కొన్ని ప్రతులు.

254 1. డైనవ్యాసు — ప. 2. డరుదెంచె — ను 3. గవురుగడ్డంబును — స; కపిల......కపిల......కపిల (ప్రాస?) అత్యధిక సంఖ్యాక తాళపత్ర ప్రతులు. కవిలగడ్డంబును, గవిల జడలునుమొదలైనవి ఇచ్చట కపిల గడ్డము అను పాఠము గ్రహించినచో వైరిసమాసమగుటయే కాక ప వ ప్రాస యేర్పడుచున్నది. ఇది నన్నయకు సమ్మతమగునో కాదో నిర్ణయించుట కాధారము లేదు తాళపత్ర ప్రతులన్నియును, శ ప. ప్రతులును కపిలగడ్డము అను పాఠమునే గ్రహించినవి 'కవిల' కపిలశబ్ద వైకృతమని శబ్దరత్నాకరము.

కాని ప్రాచీన శాసనము లందు కపిలగోవు అనుటకు కవిల అను రూపము. వినవచ్చును. వేగవిరాళు వంటి రూపములు కాన్పించుచున్నవి. దీనినిబట్టి కపిల శబ్దమునకు కవిల రూపము ప్రాచీనమైనది కలదు. నన్నయ యీ కవిల రూపము నిచ్చట వాడెనని సరిపుచ్చుకొనవలెను.

మఱియొక సందర్భమునందు కపిల శబ్దమును నన్నయ ప్రయోగించెను అమల సువర్ణ శృంగ (1-15) ఇత్యాది పద్యము నందు కపిలంబగు గోశతంబు అని ప్రయోగము కన్పించుచున్నది. ప,వ లకు అభేదవర్గయతిని అప్పకవి యంగీకరించెను. సంధిగత మైనప్పుడు గసడదవా దేశముచే ప,వ లకు ప్రాస యంగీకరింపబడినది. అట్టిచో ప,వ లకు అభేదవర్గనియతిచే క్యాచిత్కమైన ప్రాసయుండెనేమో తెలియదు. గవురు గడ్డంబును అను పాఠమును వినవచ్చుచున్నది. (అముద్రితగ్రంథ చింతామణి, సంపుటము 16, సంచిక 2 పుట 17 సం 1903) ఇచ్చట సంస్కృత మూలము నందు భిన్నవిశేషణములు వాడబడియున్నవి. తస్యకృష్ణస్యకపిలాం జటాం దీప్తేచ లోచనే బభ్రూణీ చైవ శ్మశ్రూణి దృష్ట్వా దేవీన్య మీలయత్ నన్నయ కూడ ఇదేమార్గము నవలంబించి భిన్నవిశేషణములను వాడెనని భావించవచ్చును. అప్పుడు గవురుగడ్డము, కపిలజడలును, కపిలకన్నులును అని నన్నయ ప్రయోగించి యుండెనని ఊహింపవచ్చును

[4]దవిన యన్నువ [5]నల్లనైన దీర్ఘపుందనువును జూచి
[6]యువిద గన్నుంగవ [7]మొగిచి దెఱవక యుండె భయమున.

255 వ. కృష్ణద్వైపాయనుండును దానికిం [1]బుత్త్రదానంబు[2]సేసి యీ[3]యంబిక యందు బలపరాక్రమ[4]వంతుండయిన కొడుకు పుట్టువాఁడు మాతృదోషం బున [5]నంధుం డగు ననిన విని విషణ్ణచిత్తయయి సత్యవతి వెండియుం గృష్ణద్వైపాయనుం బ్రార్థించి యింక నంబాలిక యందొక్క [6]కొడుకుం బడ[7]యుమని నియోగించిన నెప్పటియట్ల యమ్మునివరుండు నంబాలిక కడకుం జనిన [8]నదియుం దనవేషంబునకు వెఱచి వెల్లనైయున్న నక్కో మలికిం బుత్త్రదానంబు సేసి యీ యంబాలిక [9]యందు మహా[10]బలపరాక్రమ గుణవంతుడు [11]వంశకరుండు నగు[12]పుత్త్రుండు పుట్టువాఁడును మాతృ దోషంబునఁ బాండుదేహుం డగు నని[13]చెప్పి యరిగిన.

256 క. బలవన్మద నాగాయుత, [1]బలయుతుఁడు సుతుండు పుట్టెఁ బ్రజ్ఞాచక్షుం
డలఘుఁడు ధృతరాష్ట్రుం డా,లలనకు నంబికకుఁ గురుకులప్రవరుండై.

257 క. అంబాలికకును గుణర,త్నాంబుధి [1]పాండురవిరాజితాంగుఁడు ప్రభవిం
చెం బాండురాజు కురువం,శంబు [2]ప్రతిష్ఠింప ధర్మ[3]సర్వజ్ఞుండై.

4. దపసి—కొన్ని ప్రతులు; దవిలి - అ ఐ.ఔ ఖ.త; దివిరి — ర. 5. నల్లని దీర్ఘతనువు జూచి — కొన్ని ప్రతులు. (గణము తక్కువ) 6 యువతి — అ.ఆ.ఇ.ఋ.ఖ.మ.య వ 7. మోడ్చి — ఆ.ఔ.న వ; మూసి — త

255 1 బుత్రాధానంబు — స. 2. సేసివచ్చి — న 3. యంబికకు — పెక్కు ప్రతులు 4 సంపన్నుండైన — ఏ.ఔ.ఋ.ఖ.త 5. జాత్యంధుం — బ 6 కొడుకు రూపగుణ వంతుంబడయు — స. కొన్ని ప్రతులు. 7. యవలయునని — ఆ ఇ మ. 8. నదియును నమ్ముని వికృతవేషం — చ.ల.వీ.శ.ష; నతని వేషంబు చూచి — ఊ.న.ర. 9. కు — కొన్ని ప్రతులు. 10. బలపరాక్రమ — కొన్నింట లేదు. 11. వంశకరుండు — కొన్నింట లేదు. 12. కొడుకు పుట్టెడు — కొన్ని ప్రతులు; సుపుత్రుండు పుట్టు — చ.ఖ ర.వీ శ ష 13. యెరింగించిన — మ.

256 1 బలవంతుడు — య; బలుడగుసుతుడట్లు — ఆ.ఔ మ; బలయుతుడగు సుతుడు — ఋ ఐ.క.వ.

257 1. ధైర్యుండు రాజితాంగుడు—య. 2. ప్రతిష్ఠిల్ల—కొన్ని ప్రతులు; ప్రవర్ధిల్ల— ఋ ఔ.లు; ప్రవర్తిల్ల—త. 3. సర్వజ్ఞుండై—ఇ.ఊ.ఐ.ట; శాస్త్రజ్ఞుండై—అ.ఏ.ఖ; తత్త్వజ్ఞుండై—డ; సర్వస్వుండై, సంయుక్తుండై, సంవంతుండై, సంచితమతియై, సంపన్నుండై, సత్యవ్రతుండై, సామగ్రుండై—స; సారూప్యుండై — మ.

258 వ. ఇట్లు క్రమంబునం బుట్టిన ధృతరాష్ట్రపాండుకుమారులకు [1]బ్రాహ్మణసమేతుండై భీష్ముండు జాతకర్మాదిక్రియ లొన[2]రించి నంత నాంబికేయు జాత్యంధుం జూచి దుఃఖితయయి సత్యవతి [3]వెండియుం బారాశర్యుం [4]దలంచుడు [5]నాక్షణంబ యమ్మునివరుండు వచ్చి పనియేమి యని [6]యన్న నీయంబికకుఁ బ్రథమపుత్త్రిం డంధుం డయ్యె నింక నొక్కకొడుకు రూపవంతుం [7]బడయుమనిన [8]నది నియతాత్మ యగునేని సుపుత్త్రిండు పుట్టు ననవుడు సత్యవతి తొల్లింటియట్ల కోడలి [9]నియోగించిన [10]నక్కోమలి యమ్మునివరు వికృత[11]వేషరూపగంధంబుల కోపక రోసి తన[12]దాసి ననేకభూషణాలంకృతం జేసి [13]తన శయనతలంబున నుండం బంచిన వ్యాసభట్టారకుండు వచ్చి దాని[14]చేసిన యిష్టోపభోగంబులం [15]దుష్టుండై దానికిం బుత్త్రిదానంబు సేసిన.

259 ఆ. చండ[1]కోపుఁ డయిన మాండవ్యమునివరు, శాపమున జముండు [2]సంభవిల్లె విదురుఁడనఁగ ధర్మవిదుఁడు పారాశర్యు, వీర్యమునను [3]నవార్య వీర్య బలుఁడు.

260 వ. అనిన విని జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె.

258 1 బ్రాహ్మణ సమ్మతంబున — పెక్కు ప్రతులు; బ్రాహ్మణానుమతంబున — గ$_1$.చ.ల.వీ; బ్రాహ్మణ సహితుండై — అ.ఔ ఖ త; బ్రాహ్మణ సమ్ముఖంబున - మ; బ్రాహ్మణ సమ్మతుండై — ఐ.ఓ ట.స బ య.వ 2 రించెనంత — పెక్కు ప్రతులు. 3 వెండియు — పెక్కు ప్రతులలో లేదు. 4. దలంచుటయు — కొన్ని ప్రతులు; దలంచిన — కొన్ని ప్రతులు. 5 నప్పుడమ్ముని — కొన్ని ప్రతులు. 6. యడిగిన — చ.జ.ట.వీ శ ష. 7. బడయవలయుననిన — కొన్ని ప్రతులు. 8. నది — వా. లో లేదు. 'శ' లో 'ఇది' యని యున్నది 9 నియమించిన — అ.ఋ.ఐ గ ట త; నియమించె — ఔ. 10. నక్కోమలియును — ఎ, నదియును — కొన్ని ప్రతులు; నమ్ముదితయు — న. 11. వేషంబున కోపక — పెక్కు ప్రతులు 12. దాది — కొన్ని ప్రతులు; దానికూతు — ఐ.ట.వ. 13 యాశయన — పెక్కు ప్రతులు. 14. తోడ నిష్టో — ఔ. కామోప భోగేన తునతస్యాం తుష్టమగాదృషిః — సం. 1—100—25. 15 దృష్టుండై —కొన్ని ప్రతులు; సంతుష్టుండై —కొన్ని ప్రతులు.

259 1. కోపియైన — మ. 2. సంభవించె — పెక్కు ప్రతులు. 3. భువిన వార్యబలుడు — వా.

## —: మాండవ్యోపాఖ్యానము :-

సం. 1—101—1

261 ఆ [1]సకల జీవరాశి సుకృత దుష్కృత ఫల,[2]మరసి నడుపుచున్న యట్టి ధర్ముఁ
[3]డింద శూద్ర యోనియందు మాండవ్యుచే, శప్తు[4]ఁడై యదేల సంభవించె.

262 వ. అని యడిగిన [1]వానికి వైశంపాయనుం డిట్లని చెప్పె మాండవ్యుండను బ్రహ్మర్షి దొల్లి మహీవలయంబునం గలతీర్థంబులెల్ల [2]నేకాంతచారి యయి సేవించి యొక్కనగరంబున కెడ[3]గలుగ [4]నడవిలో నాశ్రమంబు గావించి తద్ద్వారవృక్షమూలంబున నూర్ధ్వబాహుం డయి మౌనవ్రతంబునం దపంబు సేయుచున్న నన్నగరంబు రాజునర్థంబు [5]ముచ్చిలికొని ముచ్చు లారె కులచేత [6]ననుధావ్యమానులై మాండవ్య సమీపంబు[7]నం బాఱి యయ్యా శ్రమంబు[8]లో డాఁగిన వారి వెనుదగిలి వచ్చిన యారెకు లమ్మునింగని రాజధనాపహారులయిన చోరులు నీ[9]యొద్దన [10]పాఱి రెటవోయి రెఱుంగుదేని చెప్పుమనిన నమ్ముని మౌనవ్రతుండు గావునఁ బలుకకున్నం [11]గినిసి యయ్యాశ్రమంబు[12]లోఁ జొచ్చి వెదకి ధనంబుతోడ నాముచ్చులం బట్టికొని.

261 1. ఈ పద్యమునకు బదులువచనము 'బ' ప్రతిలో కలదు — సకలలోక ధర్మ మూర్తియైన యముండు శూద్రుండై పుట్టుటయు మాండవ్యముని వరుండు శాపంబిచ్చుటయు నాన తిమ్మనిన వానికి. 2 మెఱఁగి...... యిట్టి — వా.శ. కొన్ని ప్రతులు; మరసి — ఒ.క.జ.ద. 3. డిందు — పెక్కు ప్రతులు; డొంద — వా. 4. డగుచు నేలసంభవించె — ఋ ట

262 1. జనమేజయునకు — కొన్ని ప్రతులు. 2. నేకాంతచారి — పెక్కు ప్రతులు; నేకచారి — వా.శ. 3. గలుగు — వా.శ. కొన్ని ప్రతులు. 4. నడవిలో — కొన్ని ప్రతులలో లేదు. 5 ముచ్చిలి కొనిపోయి — ఆ ఇ.మ; ముచ్చిలి కొనిపోవుచు — న; ముచ్చిలి కొనివచ్చి — ఋ.ఐ ల.ర. 6. ననుగమ్యమానులై — ఈ.ఋ.ట.ర; ననుచోద్యమానులై — న. 7. నకుం — అ.ఉ.ఓ.న. 8. సొచ్చిన — ఐ. 9. యొద్దకు వచ్చి పారి — గ. 10. పాఱిరి వారెట — అ.ఇ.ఒ.ఖ ట 11 గినిసి—పెక్కు ప్రతులలో లేదు. 12. సొచ్చి — పెక్కు ప్రతులు.

263 ఆ. తాన [1]చోరులకును దాపికాఁడై వేష,ధారి మిన్న[2]కేని తపము సేయు
చున్నయట్టు వలుక కున్నవాఁడని యెగ్గు,లాడి యారెకులు నయంబులేక.

264 వ. మాండవ్యు నాశ్రముచ్చుల[1]తోన [2]కట్టికొని వచ్చి రాజునకుం జూపి ధనం
బొప్పించిన రాజు నాశ్రముచ్చులం జంపించి తపోవేషంబున [3]నున్న
ముచ్చని యమ్మాండవ్యునిఁ బురంబు [4]వెలుపలశూల[5]ప్రోతుం జేయించిన.

265 క. మునివరుఁ డట్లుండియుఁ దన,మనమున నతిశాంతుఁడయి [1]సమత్వమునఁ దప
మ్మొనరించె [2]ననశనుం డ,య్యును బహుకాలంబు ప్రాణయుక్తుండగుచున్.

266 వ. ఇట్లు శరీరదుఃఖంబు దలంపక తపంబు సేయుచున్న యమ్ముని [1]తపంబు
పేర్మికి మెచ్చి [2]మహామునులు పక్షులయి [3]రాత్రివచ్చి [4]మునీంద్రా[5]మహా
తపస్వివైన నీకిట్టి దుఃఖంబు గావించిన వారెవ్వరని యడిగిన [6]వారికి
నమ్మాండవ్యుం డిట్లనియె.

267 తే. ఎఱిఁగి యెఱిఁగి [1]నన్నడుగంగ నేల దీని,సుఖము దుఃఖంబు [2]ప్రాప్తించు చోట వరుఁడు
దగిలి తనకర్మవశమునఁ దనకుఁ దాన, కర్తగా కన్యులకు నేమికారణంబు.

263 1. ముచ్చులకును — ఊ ల. 2. కేల — మ; కేమి — న.

264 1. తోడన్ — కొన్ని ప్రతులు. 2 పట్టుకొని — కొన్నిప్రతులు. 3. నున్నవా డితండును ముచ్చని — న ; నున్నఋషి ముచ్చని — మ. 4. వెలుపల — పెక్కుప్రతులు ; వెలి — వా ; సమీపంబున — న. 5. ప్రాప్తుం — కొన్ని ప్రతులు

265 1. శమత్వమున — ఎ.ఖ.ట త.ద.ప.బ.మ.ల 2. నచేతను డయ్యును — బ.

266 1. తపంబున కచ్చెరువంది — పెక్కు ప్రతులు. 2. మహర్షులు — కొన్ని ప్రతులు 3. రాత్రి — కొన్ని ప్రతులలో లేదు. 4. మునీంద్రా — పెక్కు ప్రతులలో లేదు. 5. యిట్టి మహాతపస్వి — వా శ. కొన్నిప్రతులు. 6. వారికి — పెక్కుప్రతులలో లేదు.

267 1. యిమున్న నన్నేటి కడుగ — వ ; నన్ను నిక్లేల యడుగ—న. 2. ప్రాపించు— కొన్ని ప్రతులు

268 వ. అని యమ్మహామునులతో మాండవ్యుండు పలికిన పలుకు [1]లన్నగరరక్షకులు వినివచ్చి రాజున [2]కెఱింగించిన [3]రాజునుం బఱతెంచి శూల [4]ప్రోతుం డయి యున్న మాండవ్యునకు నమస్కరించి నాచేసిన యజ్ఞానంబు సహించి [5]నాకుం బ్రసాదింప వలయు[6]నని శూలంబువలన నమ్మునిం [7]బాచుచో నది [8]పుచ్చరాకున్న దాని మొదలు [9]మెత్తన తునిమించినం దత్కంఠపార్శ్వంబునందు శూలశేషం బంతర్గతంబై యుండె దానంజేసి యాముని[10]యణీ మాండవ్యుండు నాఁ[11]బరగుచు నమ్మహాముని ఘోర తపంబు సేసి యెల్లలోకంబులు [12]గమించి యొక్కనాఁడు యముని పురంబునకుం జని [13]ధర్మరాజున కిట్లనియె.

269 క. దండధర యిట్టి దారుణ, [1]దండమునకు నేమిదుష్కృతముఁ జేసితి ను
గ్రుండ వయి తగనిదండము, [2]దండింపఁగ బ్రాహ్మణుండఁ దగునే[3]నన్నుఁ.

270 వ. అనిన మాండవ్యునకు ధర్మరా జిట్లనియె.

271 క. [1]సొలయక తూనిఁగలం గొ,ఱ్ఱులఁ బెట్టితి నీవు నీచిఱుతకాలము త
త్ఫలమిప్పు డను[2]భవించితి, తొలఁగునె హింసాపరులకు దుఃఖప్రాప్తుల్.

268 1. లు విని నగర — ఇ ఎ 2. కుం జెప్పిన — పెక్కుప్రతులు. 3. రాజును భీతాత్ముండై పరతెంచి — న 4. ప్రాప్తుండై యున్న — పెక్కుప్రతులు, ప్రాపితుండై యున్న — మ. 5. నన్నుం గరుణింపవలయు — మ; నాకు బ్రసన్నుండవు గావలయు — అ; నాకు గృపాదృష్టి బ్రసాదింపవలయు — ఋ; నన్ననుగ్రహింప వలయు — ఖ 6 ననిప్రార్థించి — కొన్ని ప్రతులు. 7. బాపుచో — ఆ.ఖ.త 8 పాప — త 9. మెల్లన — ర. 10. మాండవ్యుండు — వా; యాణి మాండవ్యుండు — ఔ.చ.శ అణీ మాండవ్య ఇతి చ తతో లోకేషు కథ్యతే— (1–101–21) 11 బరగెనట్టి యమ్ముని — కొన్ని ప్రతులు. 12. జరియించి — పెక్కు ప్రతులు. 13. సమవర్తి — ర.

269 1 దండమునకేమి — ఋ య. 2. దండించితి — అ.ఉ.ఊ ఐ.జ. 3 నీకున్ ఆ.ఇ డ.

271 1. సొలపక — స. పెక్కుప్రతులు; సొలగెడు — య 2. భవింపక — కొన్ని ప్రతులు

272 వ. అనిన విని మాండవ్యుం డలిగి జన్మంబు మొదలుగాఁ [1]బదునాలుగు వత్సరంబులు [2]దాఁటునంతకుఁ బురుషుండు [3]బాలుండు వాఁడెద్దిసేసినఁ బాపంబుం [4]బెద్ద[5]పొరయండు వానికి నొరులెగ్గు[6]సేసిన పాతకు లగుదు రిది నా చేసిన మర్యాద [7]నీ విట్టి ధర్మంబు దలంపక బాల్యంబున నల్పదోషంబుఁ జేసిన నాకు బ్రాహ్మణోచితంబు గాని క్రూరదండంబు [8]గావించిన వాఁడవు మర్త్యలోకంబున శూద్రయోనిం బుట్టుమని శాపం[9]బిచ్చుటం జేసి వాఁడు విదురుండై పుట్టె.

273 క. అని మాండ[1]వ్యాఖ్యానము, జనమేజయునకు [2]నుదారచరితునకుఁ బ్రియంబునఁ జెప్పెను వైశంపా, యనుఁ [3]డవితథ పుణ్య[4]వచనుఁ డనికడు[5]భక్తిన్.

—: ఆశ్వాసాంతము :—

274 క. సత్యాశ్రయ కులశేఖర, నిత్యోదయ [1]రాజరాజన్నృపసుకవిజన
స్తుత్య మహాగుణ విమలా,దిత్యాగ్రతనూజ [2]విమలధీరమణీయా.

275 ద్రుతవిలంబితము. త్రిభువనాంకుశ దీప్తనిధీ సమ,స్త భువనాశ్రయ ధర్మధురంధరా
శుభయశఃపరిశోభిత పూర్వది,క్ప్రభువిలాస కృపారస బంధురా.

272 1 బంద్రెండు — కొన్ని ప్రతులు. 2. దాఁకఁ బురుషుండు — స కొన్ని ప్రతులు. 3. బాలుండు కాడె — ట ద.ర, బాలుండు గావున — ఉ. 4. పెద్ద — కొన్ని ప్రతులలో లేదు. 5 పొరయకుండు — కొన్ని ప్రతులు. 6. సేసిరేని — ఇ ఋ బ.మ. 7. దీనిందలంపక — కొన్ని ప్రతులు. 8 దండించిన — పెక్కు ప్రతులు 9. బిచ్చుటయు నదికారణంబుగ — ఇ.ప.

273 1. వ్యునిచరితము — గ 2 నుదాత్త — ఊ. 3. డవిరళ — ఖ.డ.త.న.బ.వ ; డవిరత — అ.ప.మ. 4. హృదయుడయి — న ; మూర్తియై — ఊ ; చరితుడయి — కొన్ని ప్రతులు. 5. ప్రీతిన్ — కొన్ని ప్రతులు.

274 1 ధర్మసకల నృపసుకవిజన — ఓ.గ. 2 విపుల—అ.ఇ.ఔ.ట బ.మ ; చతుర—న ; విక్రమాదిత్యనిభా — జ.డ.

## గద్యము

ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్ట ప్రణీతంబైన శ్రీమహాభారతంబునం
[1]దాదిపర్వంబునం [2]గౌరవవంశ కీర్తనంబును గంగాశంతను సమాగమం
బును వసూత్పత్తియు [3]స్వర్గగమనంబును దదంశసంఘాతంబున
గాంగేయుజన్మంబును దద్రాజ్యనివర్తనంబును బ్రహ్మచర్య
వ్రత ప్రతిజ్ఞాపరిపాలనంబును [4]సత్యవతివివాహంబును
చిత్రాంగద విచిత్రవీర్యుల జన్మంబును చిత్రాంగద
మరణానంతరంబున భీష్ముండు విచిత్రవీర్యు
రాజ్యంబున నిలుపుటయు విచిత్రవీర్యుని
వివాహంబును వానిపరోక్షంబునఁ గృష్ణ
ద్వైపాయనువలన ధృతరాష్ట్ర పాండు
రాజుల జన్మంబును[5]మాండవ్యశాపం
బున విదురుజన్మంబును నన్నది
చతుర్థాశ్వాసము.

[గద్యము] 1. దాదిపర్వంబునందు శాకుంతలోపాఖ్యానంబును పౌరవ — ర. 2 పౌరవ — పెక్కుప్రతులు 3. స్వర్గాగమన నిమిత్తంబును — ఎ పౌ.య.ర. 4. సత్యవతీ వివాహంబును — పెక్కు ప్రతులలో లేదు. 5. నాణి మాండవ్యోపాఖ్యానం నంబును — పెక్కుప్రతులు

—:o:—

# శ్రీమదాంధ్రమహాభారతము

## ఆదిపర్వము - పంచమాశ్వాసము

1 శ్రీనాథమూర్తి విబుధ ని, ధాన మహా[1]దానతర్పితద్విజవర [2]వేం
గీ నాథ పార్థనిభ యభి,మాన మహార్ణవ మహేంద్రమహిమహాతిశయా.

—: ధృతరాష్ట్ర పాండుకుమారులు పెరుఁగుట :—

సం. 1-102-1

2 వ. అక్క[1]థకుండు శౌనకాదిమహామునులకుం జెప్పె నట్లు ధృతరాష్ట్ర పాండు[2]విదురులు [3]భీష్మాభిరక్షితు[4]లై పెరుఁగుచు నుపనయనానంతరంబున [5]నధ్యయనం [6]బొనరించి రాజవిద్యల యందు జితశ్రము[7]లై యున్నంత.

3 సీ. అమరాపగా [1]సుతు ననుశాసనంబునఁ గౌరవరాజ్యంబు గడు [2]వెలుంగెఁ
గురుభూము లుత్తర[3]కురువుల [4]కంటెను నధికలక్ష్మియుక్తి నతిశయిల్లె

1 1. వాస—ఈ. 2. వేంగి — ఋ.ఔ.డ.త.బ. వేగి — గ[1] వీ.శ.ష. వేఁగీనాథ — వా. * శ్రీనాథ శబ్దమందలి థ కారము ద్వితీయ చతుర్థ రూపము కలది — భాకూ.

2 1. థి — పెక్కు తాళపత్ర ప్రతులలో 'కథికుఁడు' అనియే యున్నది. కిటెల్ నిఘంటువు నందిట్టి రూపము కలదని తెలియుచున్నది 2. రాజులు — పెక్కు ప్రతులు; ధృతరాష్ట్రుండును పాండురాజును — ఎ.మ.య; పాండురాజ విదురులు — భాకూ. ర, 3. భీష్మాది — ర. 4. లై యుప — పెక్కు ప్రతులు; లై పెరుగు — గి.శ.ష. (అరసున్న లేనిరూపము) 5. వేదాధ్యయపం — అ. 6. బాచరించి — ఎ.ప. 7 లై పెరుగుచున్నంత - పెక్కు ప్రతులు; పెరుగుచున్న ఇ.ఈ.ఉ.ఒ జ.డ ప మ.ర. కూలంకష వ్యాఖ్య ఇచ్చుట మూలమును ఉటంకించినది. సంస్కారైః సంస్కృతాస్తే వైవుతై రధ్యయనేనచ ధృతరాష్ట్రశ్చ పాండుశ్చ విదురశ్చ మహాయశాః విదురుడుదాసీ పుత్త్రుడైనప్పటికి రాజేలనుట.

3 1. సూను—ఒ ఓ.ఖ.జ.వ. 2. వెలుంగె— పెక్కుప్రతులు; వెలింగె — వా.వీ. మున్నగు ప్రతులు. 3. కురు దేశముల కంటె నధిక — ఎ.న.ర.వ.వీ. 4. కంటె నత్యధిక —

ధర్మాభిసంరక్షితం బైన భూప్రజ [5]కెంతయు [6]నభివృద్ధి యొసఁగు చుండె
వలసిన [7]యప్పుడు వానలు గురి[8]యుట సస్య[9]సమృద్ధి ప్రశస్తమయ్యెఁ

ఆ. [10]బాలుసేఁపెఁ బుష్పఫలభరితంబులై, తరువనంబు లొప్పె ధర్మకర్మ
[11]నిరతిఁ జేసి కరము [12]నెమ్మితో నన్యోన్య, హితముఁ [13]జేయుచుండి
రెల్లజనులు.

4 మ. అమలాచారపవిత్రభూసురవరేణ్యాగార పుణ్యప్రదే
శములం దధ్యయనారవం[1]బు విధివత్స్వాహాస్వధాస్వస్తిశ
బ్దములున్ మంగళతూర్య ఘోషములు నుద్యత్కా[2]కాశీర్ణ నా
దములున్ రమ్యతరంబు లయ్యె ధరణిం దద్రాజ్య[3]సంవృద్ధితోఁ.

5 వ. ఇట్లు [1]బ్రహ్మోత్తరంబుగాఁ బ్రజావృద్ధియు [2]సస్యసమృద్ధియు [3]నగుచుండ
నాంబి[4]కేయు ధృతరాష్ట్రు [5]రాజ్యాభిషిక్తుంజేసి భీష్ముండు దనకు [6]విల్లును
[7]విదురుబుద్ధియును [8]సహాయంబులుగా రాజ్యంబు [9]రక్షించుచున్నంత.

చ.వ.ల.శ.ష. 5. కెల్లను—య. 6. ననురాగమె—బ 7 యప్పుడ — సూ
కొన్ని ప్రతులు. 8. యంగ – ర. 9. సంపత్తి — ఆ.ఇ.ఈ.ఉ ఎ.గ్$_1$ చ.ట.డ.
ప ద.మ.ర ల.వీ.శ.ష ; సంపదలు – న య. 10 బాండ్లుసేపె — అ.ఇ.ఒ.ఓ.ట.
త.ల స.ళ ; పాంళ్ళుసేపె — భా కూ. పాంళ్ళ రూపమును గూర్చి ఈ వ్యాఖ్య
యందు చర్చింపఁబడినది ; పాఁడిసేపె — వా.శ. మున్నగు ప్రతులు ; బాలుసేపె-
ఏ.జ.డ.ద.ప.మ.ర ; పాడిగలిగె – య. 11. నియతి – ప 12 నియతితో – య.
13. గోరుచుండిరెల్ల – బ.

4 1. బునువిధి స్వాహా – కొన్ని ప్రతులు ; బులువిధి — కొన్ని ప్రతులు ; బులువషట్
స్వాహా – స.ళ. 2. కాకీర్ణ—ఆ.ర. 3. సమ్బుద్ధి—య; బుద్ధి- Prosperity.

5 1. ధర్మోత్తరంబుగా — స ళ. ధర్మోత్తర మవర్తత — మూలము. బ్రహ్మోత్తర
మనియు గలదు 2. రాజ్యాభివృద్ధి — పెక్కు ప్రతులు 3. నెసగుచుండ —
ఆ.ఈ.ఉ.చ ; నగుచుండె — ఎ ఏ.జ ; నగుచున్నంత – ర. 4. కేయుండైన —
ఆ.చ.ర.వీ.శ.ష ; కేయుండగు – త.య. 5. రాజుం జేసి – కొన్ని ప్రతులు.
6. విల్లునమ్ములు - ఖ.ర. 7. బుద్ధియు విదురుండును – ఆ ఇ.ఈ.ఉ ఋ.ఐ.ఒ ఓ.
గ.ట.ప.య ; విదురుండు తనకు బుద్ధి సహాయుండునుంగా — ఔ ; విదురు — క.
జ.డ.ద. లలో లేదు. 8. సహాయులుగా—ఐ.ట.య. 9. సేయుచు—ఔ.క.య

6 ఉ. [1]ఆయము గర్వమున్ విడిచి యన్య[2]పతుల్ పని[3]సేయ నిట్లు గాం
గేయ [4]భుజాబలంబున [5]నికృత్తవిరోధిసమాజుఁడై కుమా
[6]రాయితశక్తి[7]శాలి ధృతరాష్ట్రుఁడు రాజ్యము సేయుచుండె న
త్యాయతకీర్తితోఁ దనకు హస్తిపురం [8]బది రాజధానిగన్.

7 వ. ఇట్లు రాజ్యంబు సేయుచు నారూఢయౌవనుండైన యా[1]ధృతరాష్ట్రునకు వివాహంబు సేయ [2]సమకట్టి భీష్ముండు గాంధారపతి యయిన సుబలు [3]కూఁతు గాంధారి యనుదాని [4]నతిశయ[5]రూపలావణ్యశీలాభిజాత్యసమన్వితఁగా బ్రాహ్మణులవలన [6]విని విదురున కిట్లనియె.

8 క. ఈవంశము విచ్ఛేదము, గావచ్చినఁ గులము [1]నిలువఁగా సత్యవతీ
దేవి వచనమున సంతతిఁ గావించెను వ్యాసుఁడను జగత్కర్త దయన్.

9 క. ఈకులము [1]వివర్ధింపఁగ, నాకభిమత మేను వింటి నలినేత్రుణ దా
నేకశతసుతులఁ బడయఁగ, నా కన్యక వరము [2]వడసె [3]నట హరుచేతన్.

6 ధృతరాష్ట్రుఁడు రాజ్యాభిషిక్తుఁడైనట్లిపుడు లభించిన మూలములందు లేదు ఇచ్చట మూలమిట్లున్నది. ధృతరాష్ట్ర స్త్వచక్షుష్ట్వాత్ రాజ్యం నప్రత్యపద్యత పారసవత్వా ద్విదురో రాజా పాండుర్బభూవహి ఆది – 109 అధ్యా – 20 శ్లో చిత్రశాలా ప్రచురణము. 1. ఆయత – ఔ.ఖ.చ.డ.త.య, ఆయత గర్వముల్ భాసం ర.స.శ, 2 నృపుల్ – ఇ.వ. 3. సేయుచుండ – ఉ.ఋ.ఐ.ఒ.గ.బ ర.వ ; సేయనట్లు – ఒ ఔ య. 4. భుజాశ్రమంబున – అ.ఆ ఈ ఉ ఊ.ఏ క.ఖ.జ ట య ; భుజాశ్రయంబున – ఐ.ఒ.ద న అక.కసం 5. నివృత్త – అ క.చ.జ బ య. ఇచ్చటయతి విచార్యము ; నికృత్త సమస్తవిరోధియై – కసం. 6. రాయత – కసం. పెక్కు ప్రతులు ; రాయుత – ర.ప కొన్ని ప్రతులు 7. దాల్చి – ఔ. 8 బటు – వ.

7 1. ధృతరాష్ట్రు వివాహంబు — కొన్ని ప్రతులు. 2. దలంచి — ఓ డ.మ. 3. కూతురుగా – పెక్కు ప్రతులు. 4. అతిశయిత – భాసం. 5. రూపశీలా— ఎ.ఔ.క.ట.డ.ద.ర.వ. 6. నెరింగి – మ.

8 1. నిలుపగా – భాసం. పెక్కు ప్రతులు.

9 1. ప్రవర్ధింపగ – ఎ.ఏ.గ.ట.డ.న ప.ర ; మభివర్ధింపగ – బ. 2 గొనియె – ఊ ; గాంచెనట – ఔ. 3. నట – భాసం.

10 వ. కావున ధృతరాష్ట్రునకు గాంధారి[1]ని వివాహంబు సేయుద[2]ము గాంధార [3]పతి మన[4]తోడి సంబంధమునకుం [5]దగునని నిశ్చయించి సుబలుపాలికిఁ [6]దగు ముదుసళ్ళం బంచిన సుబలుండును సుముఖుండై కురుకుల [7]విస్తారకుం డయిన ధృతరాష్ట్రుండ యిక్కన్యకకు [8]సర్హుండు గావున నారాజునకు గాంధారి నిచ్చితి ననిన [9]వాని [10]బంధుజనంబు లెల్లఁ దమలో నిట్లనిరి.

11 తే. అంగములలోన మే లుత్తమాంగమందు, నుత్తమంబులు గన్నుల యుర్విజనుల
కట్టికన్నులు లేవను [1]నదియకాక, యుత్తముఁడు గాఁడె, సద్గుణయుక్తి
నతఁడు.

*—: ధృతరాష్ట్రుఁడు గాంధారిని వివాహంబు సేసికొనుట :—*

సం. 1—103—10

12 వ. [1]అనిన వారి పలుకులు విని గాంధారి ధృతరాష్ట్రునకుఁ బితృవచనదత్తఁగాఁ [2]దన్ను నిశ్చయించి [3]నాకుఁబతి యిమ్మహీపతియ కాని యొరు[4]ల నొల్లనని [5]యప్పరమపతివ్రత పరపురుషదర్శనంబు [6]పరిహరిం[7]చి పతి కనుగుణంబుగా నేత్ర[8]పట్టంబున దననేత్రంబులు [9]గట్టికొని యుండె నంత నక్కన్యం దోడ్కొని దాని సహోదరుండయిన శకుని మహావిభూతితో హస్తిపురంబునకు వచ్చిన ధృత

10 1. ని — కొన్ని ప్రతులలో లేదు. 2. మగ్గాం ధారపతియు - ర 3. పతియును—న. 4. తోడివై వాహిక - పెక్కు ప్రతులు. 5. దగినవాడని - య. 6. దగు — పెక్కు ప్రతులలో లేదు. 7. నిస్తారకుడు— ఋ ప త.ర.శ.ష.స. 8. వరుండు — ఇ.వ. 9. వానికి — ఋ.ప.బ ; అతనికి - ర. 10. బంధుజనంబు లిట్లనిరి - ఋ.ఔ.బ.ర.

11 1. నంత - అ.ఈ.ఉ.ప క.ఖ.గ.త.బ.మ ; నంతె - ఆ.ఇ ఊ.ఎ.ఔ ట.డ.య ; టంతె - వా.శ. కొన్ని ప్రతులు , నదియ కాక - న.

12 1. అనువారల — ఓ.మ. 2. దన్నుమనంబున — ఖ ; దనమనంబున — ఋ. 3. నాకు నీ జన్మంబున - బ. 4. లజూడ - ఊ.ట.డ.ద.వి. 5. యప్పరమ — ఊ.ఋ.ఐ.గ.జ.ట.డ. భాసం. వీ; పరమ - వా.శ. పెక్కు ప్రతులు. 6. పరిత్యజించి - ర. 7. చితన — వా.శ. కొన్ని ప్రతులు. 8. పట్టంబు గట్టుకొని — వా.శ. భాసం. కొన్ని ప్రతులు ; పటంబున — ఆ.ఇ.ఔ.శ.ష. 9. గట్టించుకొని — మ
నేత్రపట్టు - పట్టు వస్త్రభేదము. బస. 2. ఆ.సం. ద్వాత్రిం. 3. 188 ఇందు నేతలోనే కన్నుల రూపములు వచ్చును. ఇట్లే తురగావళులు, హంసావళులు, గజావళులు

రాష్ట్రుండును బరమోత్సవంబున గాంధారిని వివాహంబై దాని[10]తోఁ బుట్టిన కన్యకల [11]సత్యవ్రతయు సత్యసేనయు సుదేష్ణయు సంహితయుఁ దేజశ్రవయు సుశ్రవయు నికృతియు శుభయు [12]శంభువయు దశార్ణయు ననుపదుండ్ర నొక్క లగ్నంబున వివాహంబయి మఱియును.

13 క. కులమును [1]రూపము శీలముఁ, గలకన్యలఁ దెచ్చి తెచ్చి గాంగేయుం డీ నలఘుఁడు ధృతరాష్ట్రుఁడు కుల, తిలకుండు [2]పరిగ్రహించె దేవీశతముల్.

14 వ. [1]అంత.

15 సీ. వేదంబులందుఁ బ్రవీణుఁడై మఱి [1]సర్వశాస్త్రంబులందుఁ గౌశలము మెఱసి యసికుంత కార్ముకాద్యాయుధ విద్యల యందు జితశ్రముఁడై తురంగ సింధు రారోహణ శిక్షల దక్షుఁడై నీతిప్రయోగముల్ నెఱయ నేర్చి యతిమనోహరనవయౌవనా[2]రూఢుఁడై [3]కఱలేని హిమరశ్మి కాంతి దాల్చి

మొదలగు పట్టు చీరలు గలవు రజ్జుయుక్త వస్త్రంబున - భా.కు. 10. తోడం బుట్టిన — అ.ఖ.వ. 11 ఇచ్చట మూల శ్లోకము - సత్యవ్రతాం సత్యసేనాం సుదేష్ణాంచ సుసంహితామ్। తేజశ్శ్రవాం సుశ్రవాంచ తథైవ నికృతిం శుభామ్। శంభువాంచ దశార్ణాంచ గాంధారీర్దశ విశ్రుతాః। ఏకాహ్నా ప్రతిజగ్రాహ ధృతరాష్ట్రో జనేశ్వరః। 1_103 భం. అథసూచిక. సుధేష్ణామ్ - అనుటకు 'సుషేణామ్' అనియును. సుశ్రవామ్ - అనుటకు స్వశ్రవామ్ అనియును పి.పి.యస్. 1_104_62. ఈ సందర్భమున తాళపత్ర ప్రతులలో ఈ పేర్లు కాన్పించుచున్నవి తేజవ్రత, సుసేన, ఉర్వి, ధృతి, చిత్రశ్రవ, దేవవ్రత, వికృతి, శుభశార్ఙి, సుప్రశ, సుభగ. వీనిలో ఉర్వి యనుపేరు భండార్కరు ప్రతి అథసూచికలో నీయబడినది. 12. శంభువ - మూలము ; సంభవ - వా.శ. ఇతరములు.

13 1. రూపును — ఏ.ఔ.గ.ట ర ; శీలము రూపును-అ.ఆ.ఋ.ఊ.ర. 2. వివాహమయ్యె— వా. భాసం. పెక్కు ప్రతులు ; ప్రతిగ్రహించె — ఋ.ఒ.జ.స శ ; పరిగ్రహించె — ఇ.ఏ.ఐ.ఓ.ఖ.గ.

14 1. అంత - కొన్నింట లేదు.

15 1. ధర్మ - ర స. 2. రంభుసై - య. 3. కడలేని — ఊ.ఏ.ఐ.ఒ.ఓ ఔ.ఖ.జ.ట.

ఆ. పెరుఁగుచున్నకొడుకుఁ [4]బృథువక్షు నాయత, బాహు దీర్ఘ[5]దేహుఁ బాండుఁ జూచి
వీఁడు[6]వలనఁ గులము [7]వెలుఁగు నంచును [8]నెడ, బాహ్ని వీసుతుండు సంతసిల్లి.

16 వ. ఇక్కుమారున కెందు వివాహంబు సేయుదమని విదురుతో విచారించు చుండె [1]నంతఁ దొల్లి.

—: కుంతి చరిత్రము :-

సం. 1—104-1

17 సీ. యాదవకుల[1]విభుఁడగు శూరుఁ డనునాతఁ డాత్మతనూజలయందుఁ బెద్ద
దాని నంబుజముఖి [2]ధవళాక్షి వసుదేవు చెలియలిఁ బృథ యనుచెలువఁ బ్రీతిఁ
దనమేనయత్తనందనుఁ డపుత్త్రకుఁడైన [3]యాకుంతిభోజున కర్థితోడఁ
గూఁతుఁగా నిచ్చినఁ గోమలి యాతని యింటఁ దా నుండి యనేక విప్ర

తే. [4]వరుల కతి[5]థిజనులకు నవారితముగఁ, దండ్రి[6]పనుపున నిష్టాన్నదాన మొనరఁ
[7]జేయుచున్న దుర్వాసుఁడను సిద్ధ[8]మౌని, వచ్చె నతిథియై భోజనవాంఛఁ జేసి.

దనబలశస.శ. 4 ప్రియ దక్షిణాయత బాహు — య 5. నేత్రు — ఐ
6. చేత - ర. 7. వెలయు — అ ఊ త; పెరుగు - గి; వెలుగుబొమ్మనియెద - స;
వెలుగొందుననియెద - వ; వెలుగు నంచనివేడ్క - చ ల.శ.ష. వెలుగు బొమ్మను
చును - ర. 8. వేడ్క - అ ఈ.ఉ ఎ.ఔ.చ డ.ద.ప.భానం వీ.ష ; నెద - ఊ.ఐ.
ఓ.జ.త.న; నెడ్డ - వా.సూ , నెడ్డ - వా.శ.

16 1. నట - పెక్కు ప్రతులు.

17 1. వీరుఁడగు - వ 2. తరళాక్షి — ల. 3 నాకుంతి భోజునకు — ఏ.ఐ ఓ.ట.ద.శ.
కొన్ని ప్రతులు. 4. వరులకు నతిథులకును నవారితముగ — య.ర.స; వరులక
భ్యాగతులకునవా — న; వరుల కతిథులకు నభివాంఛితముగ - బ. 5. భిమునులకు —
ఐ ఒ; ధుతాయునులకవా — చ.వీ.శ.ష 6. పనినిష్ట మృష్టాన్న - ఒ.వా.శ; పనిచిన
నిష్టాన్న — ఎ.క.ఖ.డ.ర ; పనిచిన మృష్టాన్న — ల; పంచిన — ఏ ద; పనుపున
నిష్టాన్న — స. కొన్ని ప్రతులు. 7 జేయ దుర్వాసుడనియెడు సిద్ధమునియు — మ.
8. మునియు - వా పెక్కు ప్రతులు , మౌని - ఔ.త.

18 వ. [1]కుంతియు నమ్మునివ[2]రు [3]కోరిన యాహారంబు వెట్టిన సంతుష్టుండై యమ్ముని [4]వరుం డిట్లనియె నీ ఘంత్రంబున [5]నీవే వేల్పుల నారాధించి [6]తద్వేల్పులు నీకోరిన యట్టి [7]పుత్త్రకుల [8]నిత్తురని [9]యాపద్ధర్మంబుగా నొక్క దివ్య మంత్రంబుఁ బ్రసాదించి చనిన [10]నమ్మంత్రశక్తి యెఱుంగ వేఁడి కుంతి యొక్క నాఁడేకాం[11]తంబ [12]గంగకుంజని [13] యవగాహనంబు సేసి.

19 క. అమ్మంత్రముఁ దనదగు హృద, యమ్మున నక్కన్య [1]నిలిపి యాదిత్యున క ర్ఘ్యమ్మొత్తి నాకు నిమ్ము ప్రి,యమ్మున నీయట్టి [2]పుత్త్రి నంబుజమిత్త్రా.

20 క. అని కేలు మొగిచి [1]నిలిచిన, వనజాయత[2]నేత్ర కడకు వచ్చెను గగనం బున నుండి కమలమిత్త్రుఁడు, తన తీవ్రకరత్వ [3]ముడిగి [4]తరుణద్యుతితోన్.

21 వ. అక్కన్యకయు నట్టి తేజోరూపంబు సూచి [1]విస్మయంబునను భయంబునను గడు సంభ్రమించి [2]నడునడ నడుంగుచున్నదాని నోడకుండుమని సూర్యుండు

18 1. గొంతియు — అ బు ట.డ.ద.య.ల. 2 వరుండు కోరిన - జ ఖ 3. కోరిన యట్టియాహార — ర. 4. వరుండిమ్మంత్రంబున - పెక్కు ప్రతులు. 5. నీవే వేల్పు - అ.ఆ.ఈ.ఉ.ఋ.ఎ ఐ.గ$_1$ చ.న.ప.పీ శ ష ; నేదేనివేల్పు - టొ ; నీవే వేల్పులను కోరిన- గి.చ.శ ష.భాసం.భా.కూ.పీ.శ ష ; నీవెయ్యేని యొక్కవేల్పు నారాధించి తద్వేల్పు నీకోరిన - వా. 6. ననవ్వేల్పు - అ.ఆ.జ త ద.న.బ.య 7 వరంబు నిత్తురని — న. 8 నిచ్చునని — వా. పెక్కు ప్రతులు ; నిత్తురని - చ.పీ శ.ష. 9. పరమార్థంబుగా - మ.స. 10. దానిశక్తి — పెక్కు ప్రతులు. 11. తంబున — అ.ఆ.ఈ ఉ ఊ.ఏ.ఐ గ.డ.ద.బ. 12. గంగకు - పెక్కు ప్రతులలో లేదు. ఈ ఘట్ట మున కుంతి గంగకు వెళ్లినట్లు గాని సద్యోగర్భ విషయము గాని మూలము నందు కాన్పించదు. మంజూష ప్రనక్తి భండార్కరు ప్రతి అథస్సూచిక లో మాత్రమే కలదు పుట. 469 13. గంగనీళ్ల కాళ్లు మొగంబు గడిగికొని — వా.శ. పెక్కు ప్రతులు ; యవగాహనంబు సేసి - చ.పీ.శ.ష. భాసం. కుంతి భోజుని నగర సమీపమున గంగా నది లేదనియు, అశ్వనది యున్నదనియు కూలంకషవ్యాఖ్య వివరించెను

19 1. దలచి—ఓ. 2. కొడుకు—వా.శ. ఇతరములు ; పుత్త్రు—ఈ.ఏ ట.డ.ద. భాసం. ర.

20 1. మ్రొక్కిన - అ.ఋ ఐ.ఒ.క ఖ.గ.చ జ.ద.బ.వా. పీ శ.ష. 2. నేత్రి — పెక్కు వ్రాఁత ప్రతులు 3. ముడిపి — అ.ఆ.ఊ.క.గ$_1$.య.శ.ష.స. 4. తరుణ త్వమునన్ - ర.న.

21 1. విస్మయభయ సంభ్రమచిత్తయై - ఆ.ఇ.ల ; విస్మయంబును భయంబును గడుసంభ్ర మంబును బెనంగొన - చ. భాసం. ర.పీ.శ.ష ; విస్మయంబును భయంబును పొడము విస్మయంబునను — ఎ; విస్మయంబును భయంబును సంభ్రమంబును గదురు విస్మ యంబునను—బ 2. వడవడ వడంకుచున్న— పెక్కు ప్రతులు ; నడునడ నడుంగుచున్న-

ప్రసన్నుం[3]డై నీ కోరిన వరం[4]బిచ్చితి ననిన గొంతియు లజ్జావనత వదనయై యొక్క [5]బ్రహ్మవిదుండు నాకుం గరుణించి యిమ్మంత్రం బుపదేశించిన దాని శక్తి నెఱుంగ[6]వేఁడి యజ్ఞానంబున నిన్నుం [7]త్రిలోకైక దీపకుం త్రిపురుష మూర్తిం త్రివేదమయు [8]రావించిన యీ యపరాధంబు [9]నాకు సహింపవలయు.

22 ఆ. ఎఱుకలేమిఁ జేసి యింతులెప్పుడు నప,రాధ యుతలు సాపరా[1]ధలయిన వారిఁ గరుణ నెల్ల[2]వారును రక్షింతు, రనుచు సూర్యునకు లతాంగి మ్రొక్కె.

23 వ. సూర్యుండును నీకు దుర్వాసుండిచ్చిన [1]వరంబును మంత్రంబుశక్తియు నెఱుం గుదు [2]మదీయదర్శనంబు వృథగాదు [3]నీ యభిమతంబు సేయుదు ననిన గొంతి యిట్లనియె.

24 ఆ. ఏను మంత్రశక్తి యెఱుఁగక[1]కోరితిఁ, గన్య కిదియు [2]కోరఁగాదు నాక నాకు గర్భమయిన నా[3] తలిదండ్రులుఁ, జుట్టములును నన్నుఁ జూచి నగరె.

25 వ. అనిన విని సూర్యుండు [1]దానికిఁ గరుణించి నీకు సద్యోగర్భంబు[2]నఁ బుత్త్రుఁ డుద్భవి[3]ల్లు నీ కన్యాత్వంబును దూషితంబు [4]గాదని వరంబిచ్చినఁ దత్క్షణంబ యక్కన్యకకు నంశుమంతు నంశంబున గానీనుం[5]డై.

నడునడ—నడక మధ్యమందు—అవ్యయీ భావము—భా.కూ. 3. డై యాశ్వాసించి— ఆ.ఇ ఔ.త.మ ల. 4. బిచ్చెద—ఓ. మ; బిచ్చితి—ఐ ఔ.క ఖ.గ.గ$_1$.చ ట.య.శ ష 5. బ్రాహ్మణుండు—అ.ఈ ఉ మ వ; బ్రహ్మవిదుండైన బ్రాహ్మణుడు—స 6. వేడినాయ జ్ఞానంబున—ఖ.జ.ట ద.న 7 త్రైలోక్య దీపకు—ప; త్రిలోకదీప్తు—ఐ.క య; త్రిలోక వంద్యు—ఔ.త ఖ 8. నారాధించితినీ—ఆ.ఎ.ఓ.ఔ.క.ఖ ట త బ.ర; నారాధించిన — ఊ.ప.మ; రావించితినీ—న.య 9. నాకు — కొన్ని ప్రతులలో లేదు.

22 1. ధులయిన — పెక్కు ప్రతులు. 2. వారలు — ఇ.చ. భాసం, మ.వీ.శ.

23 1. వరంబును — పెక్కు ప్రతులలో లేదు. 2. మద్దర్శనంబు—య 3. నీకునభి — ఆ.ఏ.ఓ.ట.డ.ద.న; నీకభి — అ.ఇ ఈ ఉ ఊ.ఋ.ఐ ఒ.క.ఖ.గ జ బ.య.ర.

24 1. వేడితి — ఇ.ఔ.గి.చ.ట డ త.ద.న.బ.య వీ శ.ష. 2. గుణము గాదు — అ.ఆ.ఐ.ఒ. క.గ.చ.జ.ప.బ.వా.శ; వేడగాదనక — ఔ; వేడగాననాక — త; కోరఁగాదునాక — స. 3. తల్లిదండ్రులు — పెక్కు ప్రతులు

25 1. దానిం గరుణించి—ద.మ ర. 2. ననీకర్ణంబునం — ఔ. 3 ల్లుదీన నీకన్యా — మ. 4. గాకోడ కుందుమని—ఊ.ఋ.ఐ.ఒ.ఔ గ.గ$_1$.చ జ.త భాసం ల.వీ.శ.ష. 5. డై కర్ణంబున వెడలె—ఔ. కుంతికి సద్యోగర్భమయినను కర్ణజననము తొమ్మిది మాసముల యనంతర మని భా.కూ.

## —: కర్ణుఁడు జనియించి సూతగృహంబు సేరుట :—

సం. 1—104—10

26 చ. సలలితమైన పుట్టుఁగవచంబు నిసర్గజమైన కుండలం
బుల యుగళంబు నొప్పఁగ సుపుత్త్రుఁడు కర్ణుఁడు పుట్టె సూర్యమం
డలమొకొ భూతలంబున బెడంగయి దీప్తి సహస్రకంబుతో
వెలుఁగెడు నా నిజద్యుతి [1]సవిస్తరలీల వెలుంగు చుండఁగన్.

27 వ. అంత నాదిత్యుం [1]డాకాశంబున కరిగినఁ గొడుకుం జూచి కుంతి [2]దద్దయు విస్మయంబంది యెద్దియుం జేయునది నేరక.

28 తరువోజ. ఏల [1]యమ్ముని నాకు నిచ్చె నిమ్మంత్ర మిమ్మంత్రశక్తి యే[2]నెఱుఁగంగ వేఁడి
యేల పుత్త్రికుఁ గోరి యెంతయు భక్తినినుఁ దలంచితి బ్రీతి నినుఁడును నాకు
నేల సద్యోగర్భ మిచ్చెఁ గుమారుఁ [3]డేల యప్పుడ యుదయించె నింకెట్టు
లీలోక పరివాద[4]మే నుడిగింతు నింతకు నింతయు నెఱుఁగరె జనులు.

29 వసంతతిలకము. ఈబాలు నెత్తుకొని యింటికిఁ జన్న నన్నుఁ
నాబంధు లందఱు మనంబున [1]నే మనారె
[2]ట్లీబాలసూర్యనిభు [3]నిట్టుల[4]డించి పోవం
గా బుద్ధి [5]పుట్టునని కన్య మనంబు లోనఁ.

26 1. సువిస్తృతము—భాసం ; సవిస్మయము—ర; సవిస్తరమై విలసిల్లుచుండగఁ—డ ద.

27 1. డాకాశ మార్గంబున — అ ఆ.ఊ.ఋ.ఒ.చ.ట.డ.త.ద బ.య.ర.వీ.శ.ష 2 యెంతయు — ట.డ.ద.న.ర ; పెద్దయు — య.

28 1 యిమ్ముని-పెక్కుప్రతులు ; యమ్ముని—అ ఐ.ఖ.చ.ట.ద.వీ.శ. 2 నెరుగక—ఉ.ఊ. ఋ. 3 డెలమి యిప్పుడు— ద. 4 మెట్లుడిగింప నేర్తునింతకు—త ఈ పాఠమున అఖండయతి.

29 1. నేమియంద్రో – న; నేమియంద్రిట్లే - ప; నేమినారె – శ సం; నేమినారే యీ బాలు – గ్రి$_1$.చ. భాసం. ర.వీ.శ.ష.స నేమినారెట్లీ బాలు – వ ; నేమినారు – అని నన్నయ ప్రయుక్త మనదగునని వజ్ఝలవారు. (801 వ పుట వ్యా.సం.స.) 2. రెట్లీబాలు సూర్యనిభు – ఆ ఈ.ఉ.ఋ ఏ.ఔ.క.వ భాసం. వా.శ.ష. రేయీ బాల సూర్యనిభు – స.శ. 3. నెట్టుల – ఎ.ద.బ.య ; నిచ్చట – న. 4. బెట్టిపోవం – పెక్కు ప్రతులు. 5. పుట్టదని – అ.ఇ.చ.ట.ర.వీ.శ.ష.

30 వ. [1]వందురి వగచుచున్న దాని[2]పుణ్యంబున నాదిత్య ప్రేరితంబయి యనర్ఘ్యరత్నవసు భరితం బయిన యొక్క [3]మంజస నదీప్రవాహవేగంబునం దన యొద్దకు వచ్చిన దానిలోఁ జెచ్చెరఁ దనకొడుకుం బెట్టి కుంతి నిజగృహంబునకు వచ్చె నంత.

31 ఆ. ఘనభుజుండు రాధయను దానిపతి యొక్క, సూతుఁ [1]డరుఁగు దెంచి చూచి రత్న పుంజభరితమయిన మంజసలో నున్న, కొడుకు దానితోన కొనుచు వచ్చి.

32 క. తన భార్యకు రాదకు నిచ్చిన నదియును గరము సంతసిల్లి [1]కుమారుం గని చన్నులు సేఁపి ముదం, బునఁ బెనిచెను [2]సుహృదులెట్టి పుణ్యమొ యనఁగన్.

33 వ. ఇట్లు వసువివహంబుతో [1]వచ్చుటం జేసి వసు[2]షేణుండను నామంబునం బరగి కర్ణుండు రాధేయుండై సూతగృహంబునం బెరుఁగుచుండె నంత నిట.

## —: *పాండురాజు వివాహమై దిగ్విజయము సేయుట* :—

సం. 1—105—1

34 సీ. యదుకులవిమలపయఃప యోనిధిసుధాకర రేఖఁ గమనీయ కాంతినిలయ
నిరవరతాన్నదానాభితర్పిత మునివిప్ర జనాశీఃపవిత్రమూర్తి
వినయాభిమానవివేకసౌజన్యాదిసదమలగుణరత్న జన్మభూమిఁ
బరమపతివ్రతాభర[1]ణాభిశోభితఁ దానురసేతుణఁ దాల్మియందుఁ

ఆ. బృథివిఁ బోనిదానిఁ బృదయను కన్యక, నధిక వీరుఁడై స్వయంవరమునఁ బడసి పరనరేంద్ర [2]పరిభావి [3]పాండుభూ, వరుఁడు [4]పేర్మితో వివాహమయ్యె.

30 1. ఎంతయు వందురి - ఖ. 2 పుణ్యస్వరూపంబనా - వా ; పుణ్యోదయంబున - ఇ.జ ; పుణ్యావశేషంబున - న ; పుణ్యంబున - పెక్కు ప్రతులు. 3. మందసము - త మందసము ఖ.గ.డ

31 1. పరిపోవాని - అ ఉ.ఎ.వ

32 1. తనూజుం - కొన్ని ప్రతులు. 2. సుదతులెట్టి - ఈ.

33 1. వచ్చినదానం జేసి - ఇ.ఖ. 2 సేనుండను - పెక్కు ప్రతులు

34 1. నైకశోభిత - అ ఉ వ ; ణాభిజననుత - య 2. ప్రతిభావి - య. 3. పాండు భూవరుడు— భాసం ర ; యప్పాండు భూవరుడు—వా. పెక్కుప్రతులు. 4. నెమ్మి— ఊ.ఓ.డ ; వేడ్క - భాసం. ర.

35 వ. మఱియు భీష్మానుమతంబున మద్రరాజతనయ మాద్రి యనుదాని[1]మహోత్స
వంబున వివాహంబై పాండురాజు భరతకుల [2]రత్నాలంకారుండై పరాక్ర
మంబున నెవ్వరిని మెచ్చక యపారచతురంగబల [3]సమన్వితుండై.

36 మ. ధ్వజినీపాతభరంబునం [1]దలరఁగా ధాత్రీధరాహీంద్ర మూ
ర్ధజరత్నప్రకరంబు లున్నతగజేంద్ర స్యందన ప్రోల్లస
ద్ధ్వజ వాతాహతిఁ దూలఁగా జలదబృందం బీక్రియన్ సర్వది
గ్విజయార్థం బరిగెం గురుప్రభుఁడు దోర్వీర్య ప్రకాశార్థియై.

37 క. [1]అతుల ప్రతాప లీలా,యుతుఁడై ప్రాంగ్దక్షిణాపరోత్తర దిగ్భూ
పతుల [2]నిజశాసన వశీ,కృతులం [3]గావించెఁ దనదు కీర్తి వెలుంగన్.

38 మహాస్రగ్ధర. [1]అతిరౌద్రాకార [2]కీలాయత దవదహనోగ్రాగ్ర సేనానిపీడా
హతులై నానావిధోపాయనములు గొని సౌహార్ద వాంఛన్ జయశ్రీ
శ్రితబాహుం గానఁగా వచ్చిరి [3]సకల జగత్సేవ్యమానున్ మహేంద్ర
ప్రతిముం గౌరవ్య వంశప్రభు నఖిలమహీపాలు రాంబాలికేయున్.

39 చ. లలితహయ ద్విపంబుల విలాసినులన్ మణి[1]రౌప్య కాంచనా
వలుల [2]నజాదిగోమహిషవర్గములన్ బహుభూషణంబులన్
బలువిడిఁ గప్పముల్ ధరణిపాలురచేఁ గొని నూఱువేల్ గజం
బులఁ బెఱికించి తెచ్చెఁ గురుముఖ్యుఁ[3]డకుప్యధనమ్ము [4]లిమ్ముగన్.

35 1. మహోత్సవంబున - ఐ.బ.య. ప్రతులలో లేదు. 2. రత్నాలంకారుండై - అ.ఇ
ఎ.ఐ.ఓ క.గ జ ట డ భాసం; స రత్నాకరుండై - వా.శ. ఇతర ప్రతులు. 3. సమే
తుండై - పెక్కు ప్రతులు.

36 1. జెదరగా - భాసం. పెక్కు ప్రతులు; తరలగా— ఖ.య.ర.; గదలగా—ఔ.త.

37 1. దీనికి పూర్వము 'అంత' అనువచనము య ర ప్రతులలో కానవచ్చుచున్నది 2.
నని నోర్చియవశీకృతుల - ఔ. 3 గాజేసె - ఆ ఇ.ఔ.త.

38 1. అతివాతాయాత — ఊ. 2. కీలాయత - భాసం; గీలాయత — వా. పెక్కు
ప్రతులు 3. రిపులు — ఒ జ; నిఖిల - ఆ.ఇ.ఏ.ఓ.ఔ.త.ల.

39 1. రౌప్య - భాసం. పెక్కు ప్రతులు; రూప్య—వా. కొన్ని ప్రతులు. 2. నజాది —
పెక్కు ప్రతులు ప ప్రతిలో అజాదికి బదులుగా సవర్ణ అని కలదు. అర్థము
విచార్యము. 3 డసంఖ్య — ద బ. 4. లిమ్ములఁ—అ.ఆ.ఈ.ఋ.ఒ.క.ఖ ట.డ.బ.

40 క. శరనిధి [1]పరివృత[2]విశ్వం, భరఁ గల భూపతులు పాండుపతి [3]కృతమునఁ గిం
కరులై [4]ప్రతి సమకల్పిత, కరులై రదిమొదలుగాఁగఁ గౌరవ్యులకున్.

—: పాండురాజు సత్కృత్యములు :—

సం. 1-106-1

41 వ. ఇట్లు పాండురాజు దిగ్విజయంబు సేసి తదుపార్జితంబులైన యపరిమిత ధనం
బులఁ దెచ్చి ధృతరాష్ట్రనను మతంబున భీష్మునకు సత్యవతికిం దమతల్లులైన
కౌసల్యలకు విదురునకు సుహృజ్జనులకు బ్రాహ్మణులకు నిచ్చి [1]వారి[2]వలన
ననే[3] కాశీఃప్రశంసలు వడసి సుఖం[4]బున్నంత.

42 చ. వినుతయశుండు పాండు[1]నృపవీరుఁడు దిగ్విజయంబు సేసి పెం
పునఁ గొని వచ్చి యిచ్చిన యపూర్వ [2]మహాధనరాశి పేర్మి వా
రని విభవంబుతోడ ధృతరాష్ట్రుఁడు సేసె [3]శతాశ్వమేధముల్
[4]దనిసన భూసు[5]రేశులకు దక్షిణ లిచ్చి యథోచితంబుగన్.

43 వ. మఱియు నప్పాండురాజు వినయ విధేయత్వం[1]బున ధృతరాష్ట్రునకు నభి
మత కార్య[2]కరణంబున బాంధవులకు [3]ననుకూలత్వంబున సుహృజ్జనులకుఁ
బరిశ్రమజ్ఞానంబున విద్వాంసులకుఁ గారుణ్యదానంబు[4]న ననా[5]థులకు [6]నభ
యంకరత్వంబున మహీప్రజలకు సంతోషంబు సేయుచు.

---

40 1. పరీత - ఊ. 2. విశ్వంభరమున - మ 3. తర — గ$_1$. చ. భాసం. వీ.శ.ష.స.
4. సతతంబువశం — ప.

41 1. వారల—పెక్కుప్రతులు. 2 చేత-ర. 3. కాశీర్వచన ప్రశంసలు - ఆ.ఒ.చ.జ.ద ప ; కాశీర్వాద ప్రశంసలు—అ ఉ.ఎ ఔ.క.ఖ ట ద న.బ. భాసం, కాశీర్వచనంబులు వడసి-చ.వీ.శ.ష ; కాశీర్వాదంబులు వడసి-ఈ బు.గ. 4. బున్నయంత-ఔ.త;బున్నయెడ - మ.య.

42 1. పృథివీపతి-ద. 2. ధనప్రకరంబు-య. 3. దశాశ్వమేధముల్—ఆ.ఐ.ఒ.ఔ.త.ల. 4. దనిసన-ఐ.ఓ క ; దనియగ-న; దనరఁగ-వా. కొన్నిప్రతులు. 5. రేంద్రులకు-ఐ.న.ర.

43 1. బుల - ఆ.చ ల.శ.ష. 2. పరత్వంబున - ఎ ; కరణత్వంబున?-అ.ఈ.ఖ.ద. 3. అభయంకరత్వంబున మహీ [పతు] ప్రజలకు — స. 4 నదీనానాథులకు — మ ; నదీనానాథజనంబులకు — చ. భాసం. వీ శ.ష 5. థలకు — కొన్ని ప్రతులు ; 6. నభయదానంబున - ఐ ఓ.చ.త. భాసం.వీ.శ.ష ; నభయంబున - అ.ఈ.ఉ.బు.ఓ.ఔ.గ. జ.డ ; నయంబున మహీపతులకు - వా.శ.

44 క. మండిత గుణ సంపద నధి,[1]కుం డగుచుం బూరుభరత కురుపతులకుఁ దు
[2]ల్యుండయి వంశకరుండగుఁ, బాండుమహీశుఁ డని బుధసభలు దనుఁ బొగడన్.

45 క. నానాద్రవ్య నిరంతర, దానముల ననూనయజ్ఞదక్షిణలను ధా
త్రీనాథుఁడు బ్రాహ్మణులను, శ్రీనిలయులఁ జేయుచుండె శిష్ట[1]ప్రియుఁడై.

*-: వేఁటకుఁబోయిన పాండురాజునకు శాపంబు గలుగుట :-*

సం. 1-109-5

46 వ. మఱియు [1]ననేక వినోదంబులను ననవరతకామానురూపవిషయసుఖాను భవంబులనుం [2]బ్రొద్దు పుచ్చుచు నాతండు మృగయా[3]వ్యసనంబునం దగిలి.

47 ఉ. వాసవసన్నిభుండు హిమవన్నగదక్షిణపార్శ్వభూములన్
శ్రీసతిఁ[1]బోనికుంతియును జెల్వగు మాద్రియుఁ [2]దోడ రాఁగ బా
ణాసనబాణభాసితమహాభుజుఁడై విహరించుచుండె ని
చ్చాసదృశంబుగా గజవశాద్వయమధ్యగజేంద్రలీలతోన్.

48 వ. మఱియుఁ దనకు ధృతరాష్ట్రుం డిష్టాన్న పాన మాల్యాను లేప[1]న [2]భూషణా దులు నిత్యంబునుం [3]బుత్తెంచుచుండ నిట్లు [4]వనవాస వ్యాసంగంబున నుండి యొక్కనాఁడు పెక్కుమృగంబుల [5]నెగిచి [6]యొక్కటినేనియు నేయం గానక కినిసి యొక్కయెడ.

44 1 కుండై మరి - న.య 2. ల్యుండై - పెక్కు ప్రతులు.

45 1 ప్రీతిఁ - ఔ.త.ర.వ.

46 1 ననేకవిధ - పెక్కుప్రతులు. 2. ప్రొద్దులు – కొన్ని ప్రతులు. 3. వినోదంబునం - ఋ.ఏ.ఐ.ఒ.క గ.జ ఝ.వ.

47 1. బోని — ఐ.ఓ చ.వీ.శ.ష ; వోని—వా. 2. దోడు — క.ఖ ద.మ ; రాఁగృపాణ బాణాసన – స.

48 1. న వస్త్ర భూషణాదులు — ఉ.ఐ.ఒ.ఔ.క.ఖ గ త. భాసం. య. 2. భూషణాంబ రాదులు — అ.ఆ.ఇ ఊ ఎ ఏ ఓ.చ.ట.డ.ద.ప.వీ.శ.ష. 3. బుచ్చుచుండ — ఊ. 4. మృగయావ్యాసంగంబున — న ; మృగవ్యసనంబునం దగిలి – గ$_1$.చ.ల.శ.ష ; మృగ యావ్యసనంబున - య.వీ. 5. నెగిచి – భాసం. శ ష. మొదలగు ప్రతులు ; నెగచి- వా.శ, కొన్ని ప్రతులు. 6. యొక్క టేనియు — య ; యొక్కటియునేయం గానక - శ.ష. కొన్ని ప్రతులు.

49 క. మనసిజరాగంబునఁ బెనఁగిన యిఱ్ఱిని లేడిఁ జూచి కృతహస్తుఁడు పె
ల్చన [1]యేనమ్ముల నారెంటిని ద్రెళ్ళఁగ నేసెఁ గడుఁ గఠినహృదయుండై.

50 వ. ఇట్లేసి యప్పాణంబులు పుచ్చికొని యున్న యప్పాండురాజుం జూచి [1]యమ్మృగ మిథునంబునం దల్పావశిష్ట[2]జీవం బై పడియున్న మృగంబు మనుష్యవచనంబుల నిట్లనియె.

51 తరలము. హరిపరాక్రమ యేను [1]గిందముఁ డన్మునిన్ మృగముల్ నిరం
తరము నిట్లు రమింపఁ [2]గాఁగని [3]త[4]ద్రతం [5]బెడఁగోరి సుం
దర మృగాకృతి నేను భార్యయు దారుణాటవిఁ గామభో
గరతి [6]నుండితి మిష్టచారి మృగవ్రజంబుల [7]పొత్తునన్.

52 వ. మృగంబులమై యున్న మమ్ము వధియించిన దీన నీ[1]కు పాతకంబు లేదు వేఁట లాడుటయు మృగంబులఁ జంపుటయు రాజులకు [2]ధర్మంబ యయినను.

53 తే. పఱవనోపక యున్న [1]మైమఱచి పెంటిఁ, బెనఁగి యున్నను బ్రసవింప మొనసి యున్నఁ
దెవులు [2]గొనియున్న మృగములఁ [3]దివిరి యేయ, [4]రెఱచి యాహారముగ [5]మను నెఱుకు లయిన.

49 1. నేనమ్ములు — శ ష శ ర. సూ

50 1 యామృగమిథు — ఒ ఖ.త; యమ్మృగ — చ. భాసం ర.ల వీ.శ.ష; యమ్మిథునంబు — వా.శ కొన్ని ప్రతులు 2 జీవితంబై — భాసం

51 1. గిందవుడన్ — శ ష పెక్కు ప్రతులు. 2 గాఁగని — న; పోయిన — వా. పెక్కు ప్రతులు; 3 దద్ర్వతం — ఎ జ త బ.య ర. 4. ద్రతిన్ మది గోరి — న 5. బెద — భాసం. కొన్ని ప్రతులు. 6 సల్పితిమిష్ట — య. 7 పొందునన్ — బొ; పొంతలన్ — న, పొంతనః — ఈ ర.

52 1. కుం బాతకంబు — పెక్కు ప్రతులు; కుదోషంబు — ఈ.ఋ.ఐ.క.ఖ గ జ బ.వా.శ 2 కర్తవ్యంబ — ఋ ఐ.క.ఖ గ.చ.భాసం వా.శ.ష.శ; స్వధర్మం బైనను — అ; ధర్మంబ — పెక్కు ప్రతులు.

53 1 మేన్మరచి — ఉ. 2. వడి — అ.ఎ.ఔ ట.డ.ద.య.ర.ల. 3. దవిలి — ఎ.ట ష ర; తెగి వధింప — అ ఔ 4. వెరతురా — జ ద ప 5. గొను — అ. ఓ జ డ.ద

54 చ. ఇన[1]సమతేజులై ధరణి [2]నెన్నడుఁ ధర్మపథంబు దప్పఁ ద్రొ
క్కని భరతాది రాజుల జగన్నుత వంశమునందుఁ బుట్టి [3]నీ
కనఘచరిత్ర యిట్లు దగునయ్య య[4]ధర్మువు సేయ నీ [5]యెఱుం
గని నృప[6]ధర్మువుల్ గలవె కౌరవపుంగవ గౌరవస్థితిన్.

55 వ. అని తన్ను నిందించి పలికిన నామ్మృగంబు పలుకుల[1]కలిగి పాండురాజిట్లనియె,

56 తే. పగఱఁగని సైఁతురేని[1]యు మృగకులంబు, గని సహింపరు రాజులు మొనసి వాని
[2]గ్రచ్చఱగఁ జంపుదురు నమ్మికిచ్చి చంపఁ, జనదు మాయా[3]బలంబునఁ జనదు చంప.

57 వ. తొల్లి యగస్త్యమహామునీంద్రుండు మృగమాంసంబున నిత్య[1]శ్రాద్ధంబు సేయు చుండి [2]రాజులకు మృగవధ దోషంబు లేకుండ [3]నిర్మించె దీని నీకు నిందింప దగునే యనుచున్న [1]నమ్మృగంబులు బాణఘాతక్షతవేదన సహింపనోపక సర్వప్రాణు[5]లకు సాధార[6]ణం బయి యిష్టంబగు సుఖావసరంబున నున్న

54 1 నిభ — ర.ల.స 2. నెన్నన ధర్మపదంబుచక్క — గణ. 3. యత్యనఘ — ఇ.ఋ.ఏ.ఓ.ఔ ఖ.ఠ బ.శ; నీన ద.ల.శ ష. 4. ధర్మము— ఇ.ఋ.ఐ.ఓ గ.గణ త.బ.రా 5. ౯ - — అ.ఆ.ఏ.గణ ప. 6. ధర్మముల్ — ఉ.ఋ ఐ ఒ.ఓ గ.గణ.వ జ. థాసం పి శ ష.

55 1. కలసి — పెక్కు ప్రతులు

56 1. యమ్మృగ గణంబు — ర. 2. గ్రచ్చరగి జంపుదురు నమ్మనిచ్చిచంప — ర; గ్రంచరంగ జంపుదురు నమ్మించిచంప — వా శ శక ; క్రిచ్చఱగఁ జంపుదురునమ్మికిచ్చి — ఖ.పీ.శ.ష మున్నగు ప్రతులు 3 చ (చ్ఛ) — అ.ఇ.ఈ.ఉ.ఎ ఏ.ఐ.ఒ క. ప బ శక

57 1. ఎన్. బి :— ఇచ్చట అగస్త్యప్రశంస భండర్కారు ప్రతియందును, చిత్రశాలా ప్రతి యందును కనబడదు పి.పి.ఎస్. ప్రతియందు అగస్త్య ప్రశంస యున్నది. కాని నిత్య శ్రాద్ధ ప్రసంగము లేదు ఇచ్చటి శ్లోకము — అగస్త్యస్సత్రమాసీనః చచార మృగ యాంబుషిః 693 పుట. 2. రాజులకు — (?) పెక్కు ప్రతులలో లేదు ; ఉన్న ప్రతులు; చ.థాసం.న.ష.వా.శ. 3. నిర్ణయించె, నియమించె—అ.ఈ.గ్ర.చ. థాసం.య.ల.వీ.శ ష. 4. నమ్మిధునంబును—ఊ.ల 5. లందు—ర.స. 6. ణరూపంబై —

మమ్ము ననపరాధు[7]ల వధించితి గావున [8]నీవునుం బ్రియాసంగమం బయిన యప్పుడ పంచత్వం [9]బొందెదు మని నీ[10]ప్రియయు నిన్ను ననుగమించు [11]నని పాండురాజునకు శాపంబిచ్చి గతప్రా[12]ణములై పడియున్న మృగంబులం జూచి శోకించి పాండురాజు పరమనిర్వేదనపరుండయి.

58 క. [1]ఎట్టి విశిష్టకులంబునఁ, [2]బుట్టియు సదసద్వివేకములు గల్గి[3]యు మును
గట్టిన కర్మఫలంబులు, నెట్టన భోగింపకుండ నేర్తురె మనుజుల్.

59 వ. కామవ్యామోహితుండయి [1]కొండొకనాఁడు మదీయజనకుండు పరలోకగతుండైనఁ దత్క్షేత్రంబు[2]న ధర్మమయుండయిన కృష్ణద్వైపాయనముని వల[3]న నుద్భవిల్లి ధర్మ[4]ప్రవృత్తుండనై యున్న నాకిట్టిదుర్వ్యసనంబు [5]కర్మవశంబున సంభవించె నింక మునివృత్తి[6]యః యుచితంబు గావున సర్వ[7]సంగంబులు విడిచి సర్వభూతంబులయందు సమచిత్తుండనై హింస దలంపక నిత్యంబు నొక్కొక్క వనస్పతియందు నొక్కొక్క వన్యఫలంబు భిక్షగొని [8]యసంభవం బయిన నాఁ[9]డుపవాసంబు సేసి వృక్షమూలంబున నుండి పాంసుపరిచ్ఛన్నదేహుండ నయి.

ఔ.త.ర.స. 7. లనపరిక్షుతుండవై — ఆ ఔ.మ. 8. నీకుం — కొన్ని ప్రతులు. 9 బయ్యెడమని — అ.ఆ.ఈ.ఎ ఏ ఓ.ర; బయ్యెదుమని — ఉ.చ ట డ.ద భాసం. వీ.శ.ప. 10. ప్రియపత్ని — మ.ర. 11. నదియని — ఔ.త.ర. 12. ణులై — కొన్ని ప్రతులు.

58 1. ఇట్టి — ఉ ఊ.ఋ.ఎ ఏ.క.గ.బ.య. 2 బుట్టిన — ద.య.శర.వీర.వృ.రఘు. అక. 3 నదా — వీర.వృ రఘు.అక (?)

59 1. కొండుక — అ ఇ.ఋ.క.వా.శ , కొండిక — గి[1] చ.శ.ష. కొండొక — పెక్కు ప్రతులు 2 నపరమధర్మ — అ.ఉ ఎ.గి[1].జ.ట డ.ద న.య. 3. న గురుకుల వృద్ధి పొందె — ఔ.త; నకురుకులము వృద్ధిపొందనేముద్భవిల్లి — న. 4 ప్రవృద్ధుండనై — ఇ.చ. భాసం. మ.ల.ర.వీ శ.ష. 5. సంభవించెని(న)ది కర్మవశంబుననైనయది గావున — ఇ.చ. భాసం. ల.వీ శ.ష 6. యనాకు — కొన్ని ప్రతులు 7. సంగమంబులు — వా పెక్కు ప్రతులు ; సంగంబులు — ఋ.చ. 8. యది సంభవింపనినాడు — న. 9. డుపవసించి — గి[1].చ.డ.న.ల.వీ.శ.ష.

60 సీ. ఇంద్రియార్థంబులం దింద్రియవ్యాపార ముడిగించి క్రియలెల్ల [1]విడిచి [2]పుణ్యా
పాపబంధంబుల నోపి బంధింపంగఁ బడక మనోవృత్తి [3]నొడిచి నాకు
సిద్ధిప్రియం బప్రియంబిది నింద యిది మహాస్తుతియిది యనక సంతత నితాంత
సంతోషయుతుఁడనై వంతయు భయమును శీతాతపంబులు వాతగతియు

ఆ. నెఱుఁగ కివ్విధమున [4]మఱచి శరీరంబు, మరణ జీవితముల కురువిపాద
[5]తోష వృత్తు[6]లుడిగి భీషణాటవి నుండి, చేసెదను దపంబు భాసురముగ.

61 వ. అని నిశ్చయించి గొంతిని మాద్రినిం జూచి [1]మీరలిందుండి నవయక హాస్తి
పురంబునకుం జని నాతపోవృత్తి నునికి రాజునకు సత్యవతీదేవికి భీష్మునకు
విదురునకుం గౌస[2]ల్యలకు [3]వృద్ధపురోహిత బ్రాహ్మణులకుం జెప్పి యందుం
డుండనిన వారలు [4]బాష్పపూరిత నయనలయి యిట్టి యుగ్రతపంబు విడిచి
మమ్ము విడువనియట్టి యాశ్రమంబుననుండి తపంబు సేయునది యేము
నిన్నువిడిచి పోవనోపము మమ్మువిడిచితేని యిప్పుడ ప్రాణంబుల విడుతు
మనిన వారల నిశ్చయం బెఱింగి యట్లేని నాయొద్దన యుండుండేను వాన
ప్రస్థాశ్రమంబున వల్కలంబులు గట్టి రేపును [5]మాపును మధ్యాహ్నంబు
నప్పుడును స్నానంబు సేసి వేల్చుచుం గందమూలఫలాశనుండనై పితృదేవ
తల వాక్సలిలవన్యఫలంబులం దనుపుచుఁ గ్రమంబున దేహమోక్షణంబు
[6]సేయుదునని యప్పుడు.

60 1 నొడిచి — త 2. పుచ్చి — ర.ల.న. 3. విడిచి - చ య.ర.వీ.శ.ష. 4. వరలి —
ఆ.మ, నురక—ఓ.ఔ త ; నివురశరీరంబు — స; నేచి శరీరంబు—న ; నేర్చి — ర : ఈ
పాఠములందు ప్రాసయతి నియమము తప్పినది. 5 రోష — అ ఇ.ఊ.ఎ.ఏ.
ఓ.ఔ.క.గ $గ_1$ చ జ.డ.త ద.బ.వీ శ.ష.స ; దోష — ఉ ఋ.మ.య.ర. 6. లురుల —
ఓ.గ, లురిలి — య; లుడిచి — ఊ.స; లుడిపి — ఐ చ.జ వీ.శ.ష, లురివి —
ఇ.ఔ.

61 1. మీరిందుండి — ఆ.ఇ బ.య ర. 2 ల్యకు — ఔ.బ.య. 3. వృద్ధామాత్య పురో
హిత — ఊ.ఏ.ఔ చ.త.వీ.శ.ష 4. బాష్పధారాపూరిత — ఈ.వా. 5. మాపును —
ఉ.ఓ.ఔ.క.చ.త.బ.వీ శ.ష. 6. చేసెద — పెక్కు ప్రతులు.

62 పృథ్వీ అమూల్యమణిభూషణంబులు గజాశ్వబృందంబులున్
సమృద్ధ ధన ధాన్య రాసులుఁ బ్రశస్త గోవర్గముం
గ్రమంబునను భూసు[1]రేశుల కగణ్యపుణ్యార్థియై
యమర్త్యనిభుఁ డిచ్చెఁ బాండువిభుఁ డత్యుదారస్థితిన్.

63 వ. మఱియుం గలవస్తువు లెల్లను ధృతరాష్ట్రున[1]కిచ్చి పుచ్చి మమత్వాహంకార విముక్తుండై ధర్మపత్నులయ్యిరువురుఁ దన యట్ల తపస్వినులై తోడఁగా నుత్తరాభిముఖుండై యరిగి [2]నాగశైలంబును జైత్రరథంబును [3]వారిషేణంబును హిమవంతంబునుం గడచి సుర సిద్ధ సేవితంబయిన [4]గంధమాదనంబునం గొండొక కాలంబుండి యింద్రద్యుమ్నంబను కొలనును హంసకూటంబును [5]నతిక్రమించి.

—: పాండురాజు శతశృంగంబున తపోవృత్తి నుండుట :—
సం. 1-111-1

64 మ. యతి సంఘంబుల సంగతిన్ దురితకర్మాపేతుఁడై యేఁగి సం
తత సిద్ధామర యక్షసేవిత సముద్యచ్ఛృంగమై యున్న యా
శతశృంగం బనుపర్వతంబున [1]శుభాచారుండు నిష్ఠావ్రతో
ద్యతుఁడై ఘోరతపంబు సేసె మునిబృందం బద్భుతం బందఁగన్.

65 వ. ఇట్లు శతశృంగంబున నుత్తర భాగంబునందుఁ దపంబు సేయుచు [1]బ్రహ్మరుషి సమానుండై దివ్యవిమానంబు లెక్కి వచ్చుచుం బోవుచున్న దేవ

62 1. రేంద్రుల — కొన్ని ప్రతులు.

63 1. నకుంబుత్తెంచి - చ. భాసం. ల వీ.శ ష 2. నాగశత. నాగసహ. నాగసభ — అని మూలపాఠములు. 3. వారిషేణంబును — భండార్కరు ప్రతిపుట; 491 పారిషేణము — ఆ మ. పి.పి ఎస్ ప్రతి 702 పుట 4. గంధర జోవహంబును — అ.మ. పి.పి.ఎస్. ప్రతి 702 పుట 5. గడచి — అ.ఈ.ఉ.ఎ.ల.

64 1. నయా — ర.

65 1. 'బ్రహ్మఋషి' అని వ్రాసిన ప్రతులు
ఈ.ఉ ఊ.ఏ ఔ.చ.ద.ప.వా వీ.శ.ష.
బ్రహ్మర్షి — కొన్ని ప్రతులు.
బ్రహ్మరుషి — క.డ ద.
బ్రహ్మరిషి — బ

గణంబుల చేత సంకీర్ణం బైన స్వర్గమార్గంబున [2]నుత్తరాభిముఖులై నూర్ధ్వ లోకంబున [3]కనాయాసంబున నరిగెడు మునిసహస్రంబుం జూచి [4]మీరలెందు లకుం బోయెదరని యడిగిన నప్పాండురాజునకు వారలిట్లనిరి.

66 క. అమవస గావున నేఁడ,క్కమలజుఁ [1]గొలువఁగ మహర్షిగణములు పితృసం ఘములును బోదురు, బ్రహ్మం,డమునం గల[2]వారలం దొడంం గూడంగన్.

67 వ. [1]అది కారణంబుగా నేమును బ్రహ్మలోకంబునకుం బోయెదమనిన నమ్ము నుల పిఱుంద భార్యా[2]ద్వయ [3]సహితుండై సమవిషమప్రదేశంబులం జను చున్న యప్పాండురాజుం జూచి ఋషులిట్లనిరి.

68 క. [1]వీరలతి లలిత మృదులాం,[2]గారలు [3]గిరి విషమ గహన గహ్వరముల రా నేరరు గావున నిట చను, దేరక [4]మీరుండు డివిపయు దేవపథంబుల్.

69 క. అనిన విని నరుల కక్కడఁ, జన[1]బోలమి యెఱిఁగి పాండుజనపాలకుఁ డి ట్లని యెను స్వర్గద్వారం, బనపత్యులు [2]గాన నోపరెు మును లయ్యుం.

'ఋ' వర్ణము తెనుఁగులో లేనందున అది 'రు' 'రి' రూపములతో వ్రాయబడు చుండెడిది 2. ఉత్తరాభిముఖులై — పెక్కు ప్రతులలో గానరాదు. పి.పి.ఎస్. ప్రతిలో ఆధారము గలదు పుట 703 శతశృంగాదు దఱ్ఱుఖమ్ శైలరాజము దఱ్ఱుభాః 3 కనాయాసంబున — పెక్కు ప్రతులలో లేదు 4 మీరెందులకు — పెక్కు ప్రతులు.

66 1 గానంగ బ్రహ్మగుడి - య. 2. వారు తోడనరు దేరంగన్ — అ.ఈ.ఉ.వ. ఇందు ఖండయతి చూచుకొనవలెను.

67 1 ఇది — ర. 2. ద్వయ — పెక్కు ప్రతులలో లేదు. 3. సమేతుండై — ఆ.గ. డ.ద.ర

68 1 మీ - పెక్కు ప్రతులు 2. కారులు — పెక్కు ప్రతులు. 3. గిరిగహనకుం జగహ్వర - స 4. నిలువుండయువియు — వా.శ.ష శ. కొన్ని ప్రతులు ; నీవుండు మివియ — ఇ. భాసం. ర స ; యుండుండు డివియ — ల; మీరుండు డివియు — అ ఏ ఐ ఓ ఖ.

69 1 జాలమి - ఆ.బ. 2 గాన నేరరట - ఇ ఎ.గి$_1$ భాసం.య ర.ల వి.శ.ష ; గాన నేరరెు — అ.ఉ ఊ.ఐ.ఒ ఓ.చ.జ డ.ద.మ ; చొరగనేరరట — త.

70 వ. అపుత్రస్య గతిర్నాస్తి యనువేదవచనం[1]బుం గలదు [2]గావున నే నపుత్త్రకుండ నేమి సేయుదు ననిన మునులును గరుణించి యోగదృష్టి ననాగతం బెఱింగి నీ వపుత్త్రకుండవు గావు [3]దైవాధిష్ఠితం బైన సంతానంబు నీకు ధర్మానిలశక్రాశ్వినులవరంబున నగు నక్షయలోకంబులుం బడయుదువు గావున సంతానార్థంబు యత్నంబు సేయు మనిన [4]విని పాండురాజాత్మగతంబునఁ బురుషుండు పుట్టుచుండి దేవఋషి పితృ మనుష్యుల ఋణంబులు నాలుగింటి [5]తోడం బుట్టి యథాకాల విధు[6]ల [7]వానివలన విముక్తుండు గావలయు నట్లుగాని వానికిఁ బుణ్యలోకంబులు లేవు యజ్ఞంబులం జేసి దేవతల ఋణంబును దపస్స్వాధ్యాయ [8]బ్రహ్మచర్యవ్రతంబులం జేసి ఋషుల ఋణంబును శ్రాద్ధపుత్త్రలాభంబులం జేసి పితరులఋణంబును [9]నానృశంస్యంబునం జేసి మనుష్యుల ఋణంబునుం [10]బాపవలయు నందుఁ బితరులఋణంబు దక్కఁ దక్కిన మూఁడు ఋణంబుల [11]వలన విముక్తుండ నయితి.

71 తే. దేహనాశంబు తోడ[1]న [2]తీఱునెల్ల, [3]ఋణములును మఱి పితరులఋణము దేహ
నాశ మయినను దీఱదు నాకు [4]నదియ, తక్కియున్నది యే నెట్లు దానిఁ
[5]బాతు.

72 వ. అని దుఃఖించి మృగశాపంబు దలంచి తనవలన సంతానం [1]బయ్యెడి విధంబు లేమి యెఱిం[2]గి యొక్కనాఁ డేకాంతంబ గొంతి కిట్లనియె.

70 1. బులువిందు – కొన్ని ప్రతులు ; బులవినంబడు – ఒ జ న. 2. గావున – కొన్నిట లేదు 3. దైవదిష్టమ్, దైవాదిష్టమ్, దైవోద్దిష్టమ్ – అని మూల పాఠములు 4 విని – కొన్నింట లేదు. 5. తోడనుంబుట్టి – అ.ఇ.ఉ.ఋ ఎ.ఏ ఒ ఓ.గ.జ.ట.త ; తో బుట్టి – ర. 6 లం జేసివీని – త. 7. వీని – ఆ ఇ.ఉ.ఎ ఏ ఓ చ ట.డ.ర.వీ.శ.ష. 8. బ్రహ్మచర్య–ఉ.య. ప్రతులలో లేదు. 9 సూనృతధనార్జనంబులం – ఉ.గ[1].చ. భాసం. ల.వీ శ ష.స; అనృతంబు పొరయమిం జేసి – స 10. దీర్ప – ఔ; నీగుచుండు — బ. 11. యందును — ఐ.ఓ ట.ప.ర.

71 1. నే — ల ; నె — ఆ.క.ఖ.య. 2. తిరుగు — ఉ. 3. వారి ఋణములు మఱిపితృవరుల ఋణము – ఖ.గ[1].చ.ర ల.వీ.శ.ష ; 'ఋణములు' తాళపత్ర ప్రతులు ; 4. నిదియ – కొన్ని ప్రతులు ; నిదియు – ఉ ద వీ.శ.ష. 5. దీర్తు – ఈ.ఐ.

72 1. బయ్యెడు—కొన్ని ప్రతులు. 2 గినవాఁడై –వా.శ. కొన్ని ప్రతులు.

73 ఉ. దానములం దపంబుల సదక్షిణయజ్ఞములన్ విహీనసం
తానుల కూర్ధ్వలోకసుపథంబు [1]లవశ్యము[2]గాపు లబ్ధసం
[3]తానుల యొందుఁ [4]బుణ్యులిది తథ్యము గావున నొందు దక్కి సం
తానము నాకు నయ్యెడు విధం బొనరింపుము ధర్మ[5]సంస్థితిన్.

74 క. అనపత్యుఁడనై జీవించిన మృతిఁ బొందినను నిర్విశేషంబ యిహం
బును బరమును [1]నఫల[2]మఁ గా, వున సంతతి వడయు ధర్మువున ధర్మ[3]సతీ.

75 వ. ఔరస క్షేత్రజ దత్తక [1]కృత్రిమ గూఢోత్పన్నాపవిద్ధులను నార్వురు పుత్త్రులు బంధువులు దాయాదులు నగుదురు కానీన సహో[2]ఢ క్రీత పౌనర్భవ స్వయందత్త [3]జ్ఞాతు లను నార్వురు పుత్త్రులు బంధువులగుదురు గాని దాయా

73 1. లువశ్యము—ఆ.స. 2 లేవు — అ.ఈ ఉ.ఎ.ఐ క.గి$_1$ చ ట.ద.ప.బ.పి.శ.ష 3. తానుడయెందు బూజ్యుడగు—మ 4 బూజ్యులిది —వా.శ కొన్ని ప్రతులు ; బుణ్యులిది—గి$_1$.భాసం.ల పి.శ.ష. ఇంకను కొన్ని ప్రతులు. 5. పద్ధతిన్—ర , సుస్థితిన్ —ఋ.

74 1. బొందదుగావున — భాసం. 2. మ — ఆ.డి ; ము — ఐ.గి$_1$ చ.జ.త.ద.న బ పి.శ ష. 3. సఖి—ఆ.ఇ.ఋ.ప.భా కూ.భాసం ; మ ర.

75 గమనిక. సంస్కృతమూలము సంతానమును బంధుదాయాదులు, అబంధు దాయాదులు — అని రెండుగా విభజించినది. అందు బంధుదాయాదులు. (1) స్వయం జాతుఁడు (2) ప్రణీతుఁడు. (3) పరిక్రీతుఁడు. (4) పౌనర్భవుఁడు. (5) కానీనుఁడు. (6) స్వైరిణీసుతుఁడు. అబంధుదాయాదులు. (1) దత్తుఁడు. (2) క్రీతుఁడు—కృత్రిముఁడు. (3) స్వయందత్తుఁడు. (4) సహోఢుఁడు. [5] జ్ఞాతరేతుఁడు. (6) హీనయోని ధృతుఁడు. క్షేత్రజ్ఞుఁడు—అనుటకు బదులు పి.పి.ఎస్. ప్రతిలో 'క్షేత్రిక' పదము కలదు. మూలము నందు 'క్షేత్రజ్ఞుఁడు' అను పేరు లేదు. ప్రణీతుఁడనియే కలదు. "ఊఢాయా మేవ ఉత్తమాను గ్రహోజ్జాతః ప్రణీతః" అని నీలకంఠీయవ్యాఖ్య. బంధుదాయాద అబంధు దాయాదవిభాగమునందు నన్నయ మార్పులు చేసెను. దత్తక కృత్రిమాపవిద్ధులు— అను వారిని నన్నయ బంధుదాయాదులలో చేర్చెను. బంధు దాయాదులనుండి పరిక్రీతుఁడు పౌనర్భవుఁడు, కానీనుఁడు—అనువీరిని తొలగించెను. హీనయోనిధృతుఁడు మూలములో అన్ని ప్రతులయందును పేర్కొనఁబడెను. ఆంధ్రమునం దితఁడు విడువఁబడెను. షట్సం తానమును పూర్తిచేయుటకై క్రీతుఁడు, కృత్రిముడు వేర్వేరుగా పరిగణింపఁబడిరి 1. క్రీత — చ.శ ష ; కృతక — స. 2. కృతక — ఈ.ఋ.ఊ ఔ.ఖ.జ.త ద.శ$_1$. 3. జ్ఞాతిరేతులు — స.శ ; దౌహిత్రులు — స శ. పెక్కు తాళపత్రప్రతులు. దీనికే ఇంకను పాఠభేదములు — శౌద్ర,పౌత్ర,సౌభద్ర,సహోత్రు ; పారశవులు భాసం ; ర.

దులు గారట్టి పుత్త్రులలో నౌరసున కించుకయ తక్కువగాని తక్కటి పుత్త్రులకంటె క్షేత్రజుం [6]డుత్కృష్టుం డండును దేవరన్యాయ జాతుం డుత్తముండండ్రు గావున నస్మన్నియోగంబునం జేసి ధర్మమార్గంబున క్షేత్రజులం బడసిన నేనును బుత్త్రవంతుల పుణ్యలోకంబులు వడయ [7]నేర్తు నెట్లనినఁ దొల్లి గేకయరాజైన [8]శారదండాయని పుత్త్రోత్పాదనంబునం దశక్తుండయి తనధర్మపత్ని [9]నీచెలియలి శ్రుతసేనం బుత్త్రార్థంబు నియోగించిన నది బ్రాహ్మణవచనంబునం [10]బుణ్యస్నాతయై పుంసవన హోమంబు సేయించి ఋత్విజులవలన [11]దుర్జయాదులయిన కొడుకుల ముర్వురం బడసెఁ బుత్త్రలాభంబున ననంత పుణ్యఫలం బగుటనది ధర్మ్యంబయిన యాచారం బనిన విని కుంతి యిట్లనియె.

76 క భరతకుల శ్రేష్ఠుఁడవయి, పరగిన నీకేమి ధర్మపత్నులమయి యిం
కొరుల మనుష్యుల నంతఃకరణంబులఁ దలఁపఁ బొందఁ గా నోపుదుమే.

77 వ. భవత్ప్రసాదంబున మాయందుఁ బుత్త్రోత్పత్తి[1]యగు నెట్లనిన దీనికనుగుణం బయినది యొక్క పుణ్యకథఁ దొల్లి పౌరాణికులవలన [2]నావినిన దానిం జెప్పెదఁ జిత్త[3]గించి వినుమని పాండురాజునకుఁ గుంతి యిట్లనియె.

వీ ; శాలిక పుత్త్రులు – య 4. రట్టి పన్నిద్దరపుత్త్రుల—ఊ. 5. లకెల్ల— పెక్కు ప్రతులు , లందెల్ల — కొన్ని ప్రతులు 6. డయుత్కృష్టుండు – ఆ.ప ఐ.ఒ.గ ట.ద. 7. నేర్తు నెట్లనిన దొల్లి – చ ల.వీ శ ష ; నేర్తుదొల్లి – ఈ.ఖ ప ; నేర్తు దొల్లి కేకయ రాజైన – భాసం ; ఎట్లనిన దొల్లి-యను పాఠము గల ప్రతులలో నిచ్చలు విడువఁబడినది 8 శారదంతాయని — ఇ చ.శ ష ; భా కూ. సారదంతాయని – ఐ.ఒ ; ఇచ్చట సంస్కృతమునందు శారదండాయినీ అనియే కలదు 9. నీ – పెక్కింట విడువఁబడినది. కాని పి పి.ఎస్ ప్రతియందిట్లు కలదు పుట 709. యాహితే భగినీ సాధ్వీ శ్రుతసేనా తపస్వినీ. 10. పుష్పస్నాతయై–భాసం ; పుష్పవతియై శుచి స్నాతయై — ఊ మూలమిట్లు కలదు. పుష్పేణ ప్రయతాస్నాతా నిశి కుంతీ చతుష్పథే. 11 దుర్దమాదులయిన – పెక్కు ప్రతులు , దుర్జయాదులు–భాసం

77 1 యగుదీనికనుగుణంబయిన — కొన్ని ప్రతులు. 2. నా–కొన్నిట.లేదు. 3. గింపుమని – భాసం వీ.శ.ష. కొన్ని ప్రతులు.

## —: వ్యుషితాశ్వుం డను ముని వృత్తాంతము :—

సం. 1-112-7

78 చ. అతులబలప్రతాపమహి[1]మాధికుఁడై వ్యుషితాశ్వుఁ డన్మహీ
పతి నయధర్మతత్పరుఁడు పౌరవవంశజుఁ డశ్వమేధముల్
శత మొనరించు చుండి భుజశక్తి జయించె మహీశులం బ్రవ
ర్ధితయశుఁడై [2]ప్రతీచ్యుల నుదీచ్యులఁ బ్రాచ్యుల దాక్షిణాత్యులన్.

79 క. అతని యజ్ఞంబున బురుహూత పురస్సర మరుద్గణోత్తము లధిక
ప్రీతిఁ జనుదెంచి హవ్యము, లాతతహస్తములఁ [1]గొందు రగ్నిముఖమునన్.

80 వ. అట్టి వ్యుషితాశ్వుండు [1]కాక్షీవతి యైన భద్ర యను తన భార్యయందు ననవ
రతకామాసక్తిం జేసి యక్ష్మరుజాక్రాంతుం డయి యస్తమించిన నది
పుత్త్రాలాభ దుఃఖిత యయి పతివియోగంబు సహింపనోపక.

81 తే. పతియులేక జీవించు నయ్యతివ[1]కయిన, జీవనముకంటె దానికిఁ జావలగ్గు
కాన నీతోన చనుదెంతుఁ గానినన్ను, బాసి [2]యిందుండఁ గానోప వాసవాభ.

82 వ. కాదేని [1]నాకు నీపుణ్యమూర్తిప్రతిమూర్తులైన పుత్త్రులం బ్రసాదింపు మని
దర్భాస్తరణ [2]శాయినియై యాశవంబుఁ గౌఁగిలించుకొని [3]విలాపించు
చున్న దానికి వాని[1]శరీరమువనుండి యొక్కదివ్యవాణి యిట్లనియె.

78 1 మాన్వితుడై—కొన్ని ప్రతులు 2. ప్రదీచ్యుల – శ.ష పెక్కు ప్రతులు.

79 1. గొంద్రు — ఋ ఎ.ఔ గ.డ.ద ప ఇచ్చట గొంద్రు రగ్నిముఖమునన్ అని యుండినగాని సరిపడదు

80 1. కాక్షీవతియైన–ఎ.ఖ.చ.భాసం.వీ.శ ష లలోలేదు. మూలమునందు కాక్షీవతియని కలదు.

81 1 దైన, దయిన – కొన్ని ప్రతులు 2. యుండంగ నేనొల్ల – కొన్ని ప్రతులు ; యుండగనే నోప – ర

82 1. నాకు బుణ్యమూర్తులైన – ఇ.ఉ ఋ.ఐ ఒ.ఓ.క.గ $గ_1$.చ జ ట.వ.ల.వీ శ ష , నాకు నీపుణ్యమూర్తి మూర్తులైన–అ.ఈ.ఊ.ఔ.డ.య స శ ; నాకు నీపుణ్యాత నువువలనఁ బుత్త్రులం – భాసం. ర; నాకు నీ పుణ్యమూర్తితో సములైన – ఖ. 2 శాయియైన తన పతి శవంబు – అ ; శాయియై తన పతి శవంబు – ఊ.ఋ.ఓ.ఔ.క.త బ ; మూలమునందు రాజపత్నియే దర్భాస్తరణ శాయినియైనట్లు కలదు. ఏషాహమద్య రాజేంద్ర కుశానాస్తీర్యశాయినీ. పి పి ఎస్ ప్రతిపుట 713. 3. విలపించుచున్న – ఆ.ఇ.ఊ.ఋ ఖ.ట. 4. శరీరంబునందుండి – ఇ ఏ చ.ద.బ భాసం. ల శ ష

83 క. విదితముగ నీకు వరమి,చ్చెద నోడ[1]కులెమ్ము గుణవశీకృతభువనుల్
సదమలచరిత్రు లాత్మజు, లుదయింతురు వగవకుండు ముదితేందుముఖీ.

84 వ. [1]ఋతుమతి వయి[2]న యష్టమదివసంబున[3]నేనిం జతుర్దశదివసంబున నేని శుచివై శయనంబున నుండి నన్నుఁ దలంపు మనిన నదియుం దద్వచనాము రూపంబుసేసి మువ్వురు [4]సాల్వులను నల్వురు [5]మద్రులునుంగా నేడ్వురు గొడుకులం బడసె నది గావున నీవు మాయందు [6]దైవానుగ్రహంబున నపత్యంబు వడయు మనినం గుంతిం జూచి పాండురాజు ధర్మ్యంబయిన యొక్క పురాణకథఁ జెప్పెదఁ దొల్లి స్త్రీలు పురుషులచేత [7]ననావృతలయి స్వతంత్ర వృత్తి నఖిలప్రాణి సాధారణంబైన ధర్మంబునం గమతమ వర్ణంబుల యందు ఋతుకాలంబు [8]దప్పక నియతానియత పురుషలయి ప్రవర్తిల్లుచున్న నుద్దాలకుండను నొక్కమహాముని భార్య నతిసాధ్వి నధిక తపోనిధియైన శ్వేతకేతు తల్లి ఋతుమతియైన దానినొక్క వృద్ధవిప్రుం డతిథియైవచ్చి పుత్త్రార్థంబు గామించిన శ్వేతకేతుం డలిగి యిది ధర్మవిరుద్ధంబని [9]యాక్రోశించి దాని [10]సహింపనోపక.

83 1. కలెమ్ము – కొన్ని ప్రతులు.

84 1. ఋతుస్నాత — ఆ; మూలము ఋతుస్నాతా సంవిశేథా. 2. 'న' — కొన్ని ప్రతులలో లేదు. 3. నేనియు — ఇ.ఔ.చ.ట.త.భాసం వీ.శ.ష. 4. సాల్వుల — అ.ఆ.ఖ; సాల్వుర — ఇ ఎ.ఒ ఔ.గ.ట.త. 5. మాద్రులు — పెక్కు ప్రతులు; మద్రులనంగా — వీ. మాద్రులనంగా – పెక్కు ప్రతులు. 6. దైవానుగ్రహంబున – పెక్కు ప్రతులు. మూలము. శక్తోజనయితుమ్ పుత్రాం స్తపోయోగ బలాన్వయాత్. 7. నవారితలయి — ఈ.ఉ ఋ.ఎ ఐ ఒ ఔ ఖ ట. డ.త.ద.ప; ననాదృత – శ.ష ; అనావృతలయి – అ ఆ ఇ వా.వీ.శ. 8. గడపక – ఈ.ఉ.ఏ ఖ.ప.ల. 9 యాక్రోశించి – పెక్కు ప్రతుల యందు లేదు. 10. సహింపక – పెక్కు ప్రతులు;

## —: శ్వేతకేతుఁడు స్త్రీపురుషుల విషయంబున గావించిన కట్టడి :-

సం. 1-113-1

85 సీ. ఇది యాదిగా సతులెన్నఁడుఁ బరపురుషార్థినుల్ గాఁ జనదన్య [1]పురుషు
సంగమంబునఁ జేసి సకలపాతకములు నగుఁ బరిగ్రహాభూతలయినసతుల
కిట్టి[2]ద మర్యాద యిమ్మనుష్యుల కెల్లఁజేసితి లోకప్రసిద్ధి గాఁగ
నని ధర్మ్యమైన మర్యాద మానవులకుఁ దద్దయు హితముగా ధర్మమూర్తి

ఆ. యబ్జభవసమానుఁడగు శ్వేతకేతుండు, నిలిపె నదియు ధారుణీజనంబు
నందు లోకపూజ్యమై ప్రవర్తిల్లుచు, నుండె శిష్టసంప్రయుక్తిఁ [3]జేసి.

86 వ. మఱియుఁ దిర్య[1]గ్యోనులయందును ను త్తరకురు[2]దేశంబుల యందును
మొదలింటి ధర్మంబ యిప్పుడుం బ్రవర్తిల్లుచున్నది నట్లు మనుష్యుల యందు
[3]శ్వేతకేతుండు సేసిన [4]ధర్మస్థితి కారణంబున నాటంగోలె.

87 క. పురుషులచే ధర్మస్థితిఁ, బరిగ్రహింపంగఁ బడిన భార్యలకు నిరం
తరము నిజపురుషభక్తియుఁ, బరపురుష [1]వివర్జనంబుఁ బరిచితమయ్యెన్.

88 తే. భర్తచేత నియోగింపఁబడక సతికి, నెద్దియును జేయఁగాఁ [1]దగ [2]దెద్దియైన
భర్తచేత నియోగింపఁ బడినదానిఁ, జేయకునికి దోషంబని చెప్పె మనువు.

85 1 పురుషసంగమంబు - పెక్కు ప్రతులు 2. ది - కొన్ని ప్రతులు. 3 నొప్పి - పెక్కు ప్రతులు.

86 1. జ్ఞాతుల - పెక్కు తాళపత్రప్రతులు. న య.ర 2 భూములం — ఊ. 3. శ్వేత కేతు చేసిన — అ.ఋ ఐ ఒ క ట.ప. భాసం. య. 4. మర్యాద కారణంబున - అ.ఊ.ఋ ఐ.ఒ.క గ జ.ట.బ; ధర్మంబున — వ.వీ శ ష.

87 1. వివర్జనంబు — అ.ఇ.ఋ ఎ.ఏ.ఐ.ఒ.ఓ.ఔ.క.ఖ.జ ; వివర్జితంబు — ఆ.గ.ట త.డ.బ. య.ర; విసర్జనము - వా. కొన్ని ప్రతులు.

88 1 జనదెద్ది — కొన్ని ప్రతులు. 2. దెట్టిదైన — ఈ ఒ.ఔ క.జ డ.బ.

89 వ. పతి నియోగించిన దానిం జేయనినాఁడు భార్యకుం బాతకంబని యెఱింగి కాదె తొల్లి [1]సౌదాసుండైన కల్మాషపాదుం డను రాజర్షి చేత నియుక్తయై వానిభార్య మదయంతి యనునది వసిష్ఠువలన నశ్మకుండను పుత్త్రుం బడసె నస్మజ్జన్మంబు నిట్టిద మహాముని యయిన కృష్ణద్వైపాయను వలనఁ గురుకుల వృద్ధిపొంటె నేము ద్భవిల్లితిమి కావున నీవిన్ని కారణంబులు [2]విచారించి నా నియోగంబు సేయుము.

90 చ. అఱయక ధర్మశాస్త్రముల యందుఁ బురాణములందుఁ జెప్పను త్పలదళ[1]నేత్ర [2]విందుమ యపత్యము మేలని కావునన్ యశో నిలయులఁ బుత్త్రులం బడయు నీ కొనరించెద సంగతాంగుళీ దళ విలసన్మదీయ కరతామరసద్వయయోజితాంజలిన్.

91 వ. అని పుత్త్రముఖావలోకనలోలత్వంబున దీన[1]వదనుండై దేవిం బ్రార్థించినఁ గుంతియుం బుత్త్రోత్పాదనోన్ము[2]ఖయై కుంతిభోజునింటఁ దన [3]కొండుక నాఁడు [4]దుర్వాసునిచేతం బడసినమంత్రంబు తెఱంగు పతికెఱింగించి యమ్మంత్రంబున కిది యవసరం బయ్యె [5]నేవేల్పు నారాధింతు నానతిమ్మనిన [6]సంతసిల్లి కుంతీదేవికిం బాండురా జిట్లనియె.

92 క. లలితాంగి [1]యెల్ల లోకంబులు ధర్మువునంద [2]నిలుచుఁ బోలుపుగ ధర్మం దలఁ[3]పుమయాతఁడ మఱి వేల్పుల లోపలఁ బెద్ద [4]ధర్మమున సత్యమునన్.

89 1 సౌశీనరుండైన – బ దీనికి మూలము కాన్పించదు. 2 భావించి – ఈ.ఉ.ఎ

90 1. నేత్రి — పెక్కు తాళపత్రప్రతులు 2. విందుమునపత్యము — ఆ.ఇ.ఈ. ఉ.ఊ.ఋ ఎ ప.బ గ; వింటిమి — ఓ.ట బ

91 1. ముఖుండై – ఆ.ఇ.ఖ.మ.య.ర ల 2 ఖయై – అ.ఎ.వా 3 కొండిక — ఆ.ఇ ప చ గ.ర.శ ష; కొండొక – ఈ.ఋ ఐ ఒ.జౌ.క.ఖ జ.ట.డ.త.ద.ప.బ. భాసం. య.వీ. 4 దుర్వాసుం డిచ్చిన – ఊ.ఋ ఐ.ఓ క.గ.జ ప ల, దుర్వాసుచేత — ఉ.ఖ చ డ.ద బ భాసం య.ర.వీ శ ష పెక్కు తాళపత్ర ప్రతులలో దూర్వాసుడు అని కలదు. 5 నేనేవేల్పు – ఈ.ఎ.ఓ.చ ల.వీ శ.ష. 6. సంతోసిల్లి – ఎ.జ ట.య.

92 1 మూడు లోకంబులు – య. 2. నిలిచె – కొన్ని ప్రతులు 3. పుమయాతడ మరి – య; పుముమఱి యాతడె — భాసం.శ.ష వా శ. మొదలైన ప్రతులు ; పుమయాతడు మరి — ఋ.ఒ.వ. 4 ధర్మువున — వా.శ కొన్ని ప్రతులు ; ధర్మమున – భా.కూ పెక్కు ప్రతులు.

93 వ. అని నియోగించినఁ గుంతియుం బతికిఁ బ్రదక్షిణంబుఁ జేసి సమాహిత చిత్తయై మహాముని యిచ్చిన మంత్రంబు [1]విధివంతంబుఁ జేసి ధర్ముని నారాధించిన నా ధర్ముండును యోగమూర్తిధరుండై [2]వచ్చి వరం బిచ్చినం గుంతియుఁ దత్ప్రసాదంబున గర్భంబు దాల్చి [3]సంవత్సరంబు పరిపూర్ణంబైన.

*—: కుంతీదేవియందు ధర్మరాజు జననము :—*

సం. 1-114-3

94 ఉ. [1]శాత్త్రవ జైత్ర తేజము సర్వదిశల్ వెలుగంగ నైంద్ర న
క్షత్త్రయుతుండు గా శశిప్రకాశ జయోన్నతమైన యష్టమీ
మిత్రముఖ గ్రహప్రతతి మేలుగ నాభిజితోదయంబునం
బుత్త్రుఁడు ధర్మునంశమునఁ బుట్టె నతిస్థిరధర్మమూర్తియై.

95 క. ధరణీ సురులాదిగ నుర్వరలోఁ గల సర్వభూతవర్గం బెల్లం
బర మోత్సవ మొందెను గుణ,[1]శరణ్యుఁ డగు ధర్మ[2]జన్ము జన్మదినమునన్.

93 1, విధివత్తు — వ; విధిమంతంబు — భా కూ. 2. వచ్చి — కొన్నింటలేదు యభిగమించిన — ఆ.ఔ త.న; మూలము. ధర్మేణసహ సంగమ్య యోగమూర్తి ధరేణసా పి పి.ఎస్. 726 పుట 3 దీనికి మూలము కన్పించదు. కుంతీదేవి ధర్ము నాహ్వానించునప్పటికి గాంధారి యొక సంవత్సరము గర్భవతియై యున్నది సంవత్సర ధృతే గర్భే గాంధార్యా జనమేజయ. ఖం ఆది పుట. 505

94 1. యుధిష్ఠిరుఁడు వి. కృతి సంవత్సర ఫాల్గుణ బహుళ అష్టమియందు జన్మించినట్లు భారత కూలంకష వ్యాఖ్యాకారుఁడు నిరూపించెను: కలియుగాది ప్రమాది సం॥ చైత్ర శుద్ధ పాడ్యమి గనుక, ఆపయిని నూట యెనిమిది యేళ్ళ యెనిమిది దినముల క్రిందట యుధిష్ఠిర జననము ఆతిథికి — అనగా ఫాల్గున బ॥ అష్టమికి — జ్యేష్ఠా నక్షత్రము వచ్చును. జయతిథిస్నీ అవును.
ధర్మరాజు తరువాత సంవత్సరమునకు భీముని పుట్టుక — ఖర సం॥ ర ఫాల్గున శుక్ల త్రయోదశి, మాఘ నక్షత్రము.
దుర్యోధనుఁడు భీమునికన్న మూఁడు యామములు 'చిం్న్న' చిన్న.
అర్జునుఁడు నందన సం॥ ర ఫాల్గుణ శుక్ల పౌర్ణమాసి.

95 1 శరణుండగు — ఆ బు.ఔ.క.ఖ.చ.వ భాసం. య. 2. రాజు — ఆ.ద. వ.న; తనయు — జ

96 క. శతశృంగనిలయులగు [1]సం,శ్రితవ్రతులు [2]విప్ర[3]వరులు సేసిరి ధర్మ
స్థితి జాతకర్మ మత్యు, న్నతిఁ బాండుప్రథమపుత్రునకు హర్షమునన్.

97 క. కురుకులవిభుఁడగు ధర్మ, స్థిరమతియగు [1]నితఁడనుచు ధృతిఁ జేసి యుధి
ష్ఠిరుఁ డను నామముఁ దాను,చ్చరించె నాకాశవాణి జనవినుతముగన్.

-: గాంధారి ఉదరతాడనంబు గావించుకొనుట :-

సం 1-107-8

98 వ. ఇట్లు పుత్త్రోదయంబునఁ బరమహర్ష [1]సంపూర్ణహృదయుండై పాండురాజు కుంతీ మాద్రీ [2]సహితుండై శతశృంగంబున [3]నుండునంతనట [4]ముందఱ ధృతరాష్ట్రువలనన్ గాంధారి కృష్ణద్వైపాయనువరంబున గర్భంబు దాల్చి యొక్కసంవత్సరంబు నిండినఁ బ్రసూతి గాకున్నం బదరుచు బుత్త్రలాభలాలస [5]యయి యున్న యది యప్పు డయ్యుధిష్ఠిరు జన్మంబు విని [6]మనస్తాపంబున నుదరతాడనంబుఁ జేసి[7]కొనిన గర్భపాతం [8]బగుడును.

99 క. దాని నెఱింగి పరాశర,సూనుఁడు చనుదెంచి సుబలసుతఁ జూచి మనో
హీన వయి గర్భపాతము, గానిట్టులు [1]సేయు టిదియుఁ గర్తవ్యంబే.

100 క. ఇమ్మాంస[1]పేశి నేకశ,త మ్ముదయింతురు సుతులు ముదమ్మున నిది త
థ్యమ్మింక నైన నతి య,త్నమ్మున రక్షింపు దీని నావచనమునన్.

96 1 సంశ్రిత – పెక్కు ప్రతులు; సంశ్రిత వ్రతులును — ఆ.వ.ఐ.ఔ.ఖ.న. 2 సిద్ధవరులు – త.న. 3 వరులు జేసిరి — శ ష. పెక్కు ప్రతులు

97 1. నితఁడయనుచు – ర.

98 1. పరిపూర్ణ – కొన్ని ప్రతులు; 2 సహితంబుగా నుండునంత నటమున్న – న. 3. నున్న యవసరంబున - భాసం.వా.శ. కొన్ని ప్రతులు 4. మున్న – అ.ఉ. ఊ ఖ.గ$_1$ చ.న.య.ర వి శ.ష 5. యైయుండి – ఔ.త.న 6. మన్యుతాపంబున – ఊ.ఎ డ వా.శ. 7 కొనుడు – ఈ.ఉ ఎ. 8. బగుడును. – అ.ఋ.ఎ.ఐ.ఒ.ఓ. క.ఖ.గ జ.ట.డ.ద.ప.బ.య.ర; బగుటయు — ఆ.ఇ.ఈ.ఊ.ఔ త.ల; బగుటయు నంత – ఆ.ఔ.త.మ.

99 1. సేయుటదియు - ఉ; సేయనదియు - ప; సేయనిదియు – ద.

100 1 రాశి – ఏ.న. మూలము 'ఇయం మాంసమయీ పేశీ' పి.ఎస్. ప్రతిపుట. 727.

101 వ. అని [1]గాంధారిం [2]బదరి తొల్లి వేదంబులు [3]విభాగించిన [4]మహానుభావుం డమ్మాంసపేశి నేకోత్తర శతఖండంబులుగా విభాగించి వీని వేఱువేఱ ఘృతకుండంబులం [5]బెట్టి శీతలజలంబులం దడుపు[6]చు నుండునది యిందు నూర్వురు గొడుకులు నొక్క కూఁతురుం బుట్టుదురని చెప్పి చనినం దద్వచ[7]నప్రకారంబు చేయించి గాంధారీధృతరాష్ట్రులు సంతసిల్లి యున్న నిట శతశృంగంబున.

102 చ. నిరుపమకీర్తి పాండుధరణీపతి వెండియుఁ గుంతిఁ జూచి యం బురుహదళాక్షి యింక నొకపుత్త్రు నుదారచరిత్రు నుత్తమ స్థిర జవసత్త్వ నయ్యనిలదేవు దయం [1]జనియింపు పెంపుతోఁ గురుకుల[2]రక్షకుం డతఁ డగున్ బలవద్భుజవిక్రమోన్నతిన్.

103 వ అని పనిచిన నెప్పటియట్ల కుంతీదేవి వాయుదేవు నారాధించి తత్ప్రసా దంబున గర్భంబు దాల్చి సంవత్సరంబు సంపూర్ణం [1]బగుడును.

104 చ. సుతుఁడు నభస్వదంశమున సుస్థిరుఁడై [1]యుదయిం[2]చినన్ మహా యతికృత జాతకర్ముఁడగు నాతని కాతత [3]వీర్యవిక్రమో న్నతునకు భీమసేనుఁ డనునామముఁ దానొనరించె దివ్యవా క్సతి శతశృంగశైల [4]నివసన్ముని సంఘము [5]సంతసిల్లఁగన్.

101 1. గాంధారి కలిగి — ఏ.జ.డ.ద.య.ర స. 2. గినిసి — ఆ.మ. 3. విభ జించిన — ర. 4. మహాభాగుండ — ఇ ఉ.ఐ.ఒ.ఓ.గ.ట.త ద.ప.మ.య. 5. బెట్టించి — తన. 6. చునుండనందు - మ; చుండునదియందు — కొన్ని ప్రతులు. 7. నానురూపంబు సేయుచు - ఔ

102 1. గలిగింపు — ఆ.ఇ ఖ.చ.వా.శ.ష.శ 2. రక్షుడాతడ యగున్ — ఆ.ఊ.ఎ.ఒ ఖ జ ట డ.ద.న.బ ల స.

103 1 బగుడును — అ.ఇ.ఈ.ఉ.ఋ.ఐ.ఒ.ఓ.క.ఖ.గ జ.ట.య; బగుటయు — ఔ.త

104 1. ప్రభవించినన్ — త. 2. చెసమ్మహా — ఉ.ద.వ. 3. బాహు — అ; కీర్తి — ఆ.ఈ.ఉ.ఎ.గ.చ.ద భాసం.ల.వీ శ ష. 4. విలసన్ముని — వ. 5. సన్నుతింప గన్ — ఊ.

## —: దుర్యోధనాదుల జననము :—

సం. 1-107-24

105 క. అనిలజు పుట్టిన [1]దివసము,నన యట దుర్యోధనుండు నరసుత ధృతరా
ష్ట్రునకున్ గాంధారికి న,గ్రనందనుఁ[2]డు ఘనుఁడు పుట్టెఁ గలియంశమునన్.

106 శా. ఆ దుర్యోధనుఁ డుద్భవిల్లుడును గ్రవ్యాదారవంబుల్ శివా
నాదంబుల్ మద ఘూక [1]ఘూంకృతులు నానారాసభ ధ్వానముల్
భూదిక్కంపముగాఁ జెలంగె నిగతాంభోభృన్నభో [2]వీథియం
దాదిత్యద్యుతి మాయఁగాఁ గురిసె నుగ్రాస్ృఙ్మహావర్షముల్.

107 వ. మఱియు దుర్యోధన జన్మానంతరంబున ధృతరాష్ట్రునకు వైశ్యాపుత్త్రుం
డయిన యుయుత్సుండు పుట్టెనంత గాంధారికి నొక్కొక్క దివసంబున
నొక్కొక్కరుండుగాఁ గ్రమంబున దుశ్శాసన దుస్సహ దుశ్శల జలసంధ
సమ సహ విందానువింద దుర్ధర్ష సుబాహు దుష్ప్రధర్షణ దుర్మర్షణ
దుర్ముఖ దుష్కర్ణ కర్ణ వివింశతి వికర్ణ శల సత్త్వ సులోచన చిత్రోప
చిత్ర చిత్రాక్ష చారుచిత్ర శరాసన దుర్మద దుర్విగాహ వివిత్సు వికటాన
నోర్ణనాభ సునాభ నందోపనందక చిత్రబాణ చిత్రవర్మ సువర్మ దుర్వి
మోచ నాయోబాహు మహాబాహు చిత్రాంగ చిత్రకుండల భీమవేగ
భీమబల బలాకి బలవర్ధ నోగ్రాయుధ సుషేణ కుండధార మహోదర
చిత్రాయుధ నిషంగి పాశి బృందారక దృఢవర్మ దృఢక్షత్త్ర సోమకీర్త్య
నూదర దృఢసంధ జరాసంధ సద సువాగుగ్రశ్రవ ఉగ్రసేన సేనానీ
దుష్పరాజ యాపరాజిత కుండశాయి విశాలాక్ష దురాధర దుర్జయ

105 1. దివసంబునయట దుర్యోధనుండు పొలుపున ధృతరా — వ, సంబున......... ముదమున — ఊ; సంబున......... పురమున — భాసం (అధోజ్ఞాపిక) 2. డనగను — ఊ.ద.

106 1. ఘూత్కృతులు — పెక్కు ప్రతులు. 2 భూమి — ప వా.

107 ధృతరాష్ట్రుని నూర్గురు కొడుకుల పేర్ల పట్టిక నిచ్చుటలో (1) వావిళ్ల ప్రతి, చిత్ర శాల ప్రతి ననుసరించినది. (2) లండను ప్రతి, పి.పి ఎస్. మూలమును అనుస రించినది. (3) ఆంధ్ర చరిత్ర యందు ప్రసిద్ధమైన దుర్జయనామము వావిళ్ల ప్రతిలో లేదు. లండను ప్రతిలో నున్నది. దుర్జయనామము పి.పి.ఎస్. ప్రతి (పుట.

దృఢహస్త సుహస్త వాతవేగ సువర్చ ఆదిత్యకేతు బహ్వాశి నాగదత్తా గ్రయాయి కవచి క్రథన కుండి ధనుర్ధరోగ్ర భీమరథ వీరబాహ్వా లోలుపాభయ రౌద్రకర్మ దృఢరథాశ్రయానాధృష్య కుండభేది విరావి ప్రమథ ప్రమాథి దీర్ఘరోమ దీర్ఘబాహు వ్యూఢోరు కనకధ్వజ కుండాశి విరజసు లనంగా నూర్వురు గొడుకులు పుట్టిన.

108 తే. ఆ తనూజుల కందఱ కనుజయై లతాంగి [1]దుశ్శల యనుకూఁతు రమరఁ బుట్టె
నందు దౌహిత్రవంతుల దైన పుణ్యగతియుఁ గాంతు నేనని పొంగె గౌరవుండు.

109 వ. ఇట్లేకోత్తర శతపుత్త్రులం బడసి కృతార్థుండై యున్న ధృతరాష్ట్రుకడకు భీష్మవిదురాది బంధుజనంబులుఁ బురోహిత ప్రముఖ బ్రాహ్మణవరులును వచ్చి యొక్కనాఁడేకాంతంబున నిట్లనిరి.

110 క. మన దుర్యోధను జన్మంబునఁ బెక్కులు దుర్నిమిత్తములు పుట్టె జగ జ్జన సంశయ [1]జననుండగు, ననిపలికెద రెఱుక గల మహాత్ములు వానిన్.

111 క. కులమునకు నఖిలలోకంబులకు నపాయంబు సేయు పురుషాధముని మ్ముల [1]దూషించి జగంబును, గులమును [2]రక్షించు [3]టుఱదె కువలయ నాథా.

7తె8 నం. 59 పేరు) లోను 25 ప్రతుల యందును కలదు. వావిళ్ల ప్రతిలో యుయుత్సుని విడిచి దుర్యోధనుని కలుపుకొని 99 పేర్లు అగుచున్నవి 100 వ పేరు క్రింద దుర్జయనామము గ్రహింపఁబడినది.

108 1 దుస్సల — పెక్కు ప్రతులు ; దుశ్శల — మూల భారతము. దుః — దుఃఖమ్ — శం — సుఖాంతే — లాతీతి దుశ్శలా.

110 1. కరుడీతండని — బౌ త.

111 1. వధియించి — ల.స. 2. రక్షింపదగదె — ఋ ; రక్షింపుమయ్యకురుకుల నాథా — ఖ. 3. టరుదె — పెక్కు ప్రతులు.

112 వ. కావున నిప్పుడు దుర్యోధను దూషింతము నీకువెండియుఁ బుత్త్రశతంబు సంపూర్ణం బయి పెరుఁగు చున్నయది యనిన ధృతరాష్ట్రుండు పుత్త్రమోహంబున నప్పలుకు[1]లు విన [2]నొల్లకుండె నంత నట శతశృంగంబునఁ గుంతీదేవి భీమసేను సుపుత్త్రుం బడసి దశమదివసంబున వేల్పులకు మ్రొక్కఁ గొడుకు నెత్తికొని దేవగృహంబునకుఁ బోవునెడ నతివిషమ గహనగిరిగహ్వరంబున నుండి యొక్కపులి వెలువడి యామిషార్థి యయి పయికి లంఘించిన.

*—: భీముని శరీరదార్ఢ్యము :—*

సం. 1-114-11

113 క. వీరుఁడు పాండుమహీపతి, దారుణ బాణత్రయమునఁ దద్వ్యాఘ్రుంబున్ ధారుణిఁ ద్రెళ్ళఁగ నడుమన, భూరిభుజుండేసి కాచెఁ బుత్త్రుం దేవిన్.

114 క. ఉరుశార్దూలభయంబునఁ, బరవశయయి కుంతి యున్న బాలకుడు శిలోత్క రము పయిఁ బడియెఁ [1]దనని,ష్ఠురతనుహతిఁ జేసి రాలు చూర్ణంబులుఁగన్.

115 వ. దానిం జూచి పాండురాజు సంభ్రమంబునఁ బఱతెంచి విస్మితుండై కొడుకు నెత్తికొని కుంతీదేవిం దోడ్కొని [1]వేల్పులకు మ్రొక్కించి మగుడి నిజాశ్రమంబునకు వచ్చి సుఖం[2]బుండి గాంధారీ ధృతరాష్ట్రులకుఁ బుత్త్రశతంబు పుట్టుట విని ఋషులవలన దివ్యమంత్రోపదేశంబుఁ గొని.

*—: ఇంద్రప్రసాదంబునఁ గుంతి కర్జునుఁ డుదయించుట :—*

సం. 1-114-15

116 క. కొడుకుం ద్రిలోకవిజయుం, బడయుదు నని [1]ఘోరమగు తపం బొనరింపం [2]దొడఁగె సురరాజు [3]నెడలో నిడికొని [4]యేకాగ్రబుద్ధి నేకాంతమునన్.

112 1. లు పెడచెవినిబెట్టి — న ; లు పెడచెవులంబెట్టి — ఖ. 2 నోపకుండె — వా

114 1. దద్భాసురతను......... చూర్ణంబయ్యెన్ — పెక్కు ప్రతులు.

115 1. వేల్పులకు మ్రొక్కించి మగుడి — పెక్కు తాళపత్రప్రతులలో లేదు 2. బుండెనంత - కొన్ని ప్రతులు , బున్నంత — కొన్ని ప్రతులు 3. ఘోరతపము పాయక సేయన్ — న.య ; ఘోరతపము పాండుడు సేయన్ — ?

116 1. ఘోరతపము పాయక సేయన్ — న.య; ఘోరతపము పాండుడు సేయన్ — అ. 2 గడగె — పెక్కు తాళపత్రప్రతులు 3. నెదలో — కొన్ని ప్రతులు 4. యేకాంతబుద్ధి నిష్ఠాత్ముండై — $గ_1$.ర.స ; యేకాంత బుద్ధి నిశ్చలమతియై — య. ఈ పాఠములలో అఖండయతి కలదు.

117 వ. ఇట్లతినిష్ఠ నేక[1]పాదస్థితుం డయి తపంబు సేయుచుఁ గుంతినొక్క
సంవత్సరంబు వ్రతంబు సేయంబంచి యున్న నప్పాండురాజున కింద్రుండు
ప్రత్యక్షుండై.

118 క. పుత్త్రుఁడు నీకుదయించు న,మిత్త్రక్షయకరుఁడు బంధు[1]మిత్త్రాంబుజ స
న్మిత్త్రుండని వరమిచ్చిన, ధాత్త్రీపతి పొంగి పృథకుఁ దా నిట్లనియెన్

119 క. [1]ధనమున విద్యను సంతతిఁ, దనిసినవా రెందుఁ గలరె ధవళేక్షణ కా
వున నా కింకను [2]బలువురఁ దనయులఁ బడయంగ వలయు ధర్మువు పేర్మిన్.

120 చ. అమరగణంబులోన బరమార్థ[1]ము యింద్రుఁడు పెద్ద సర్వలో
కములకు వల్లభుం డతఁడ కావున నయ్యమరాధిపప్రసా
దమున సుతుఁ సురేంద్రసము ధర్మసమన్వితు నస్మదీయవం
శము వెలుఁగింపఁగాఁ బడయు సర్వజగత్పరిరక్షణక్షమున్.

121 వ. అని నియోగించినఁ గుంతియుఁ [1]దొల్లిటియట్ల దుర్వా[2]సుండిచ్చిన మం
త్రంబున నింద్రు నారాధించినఁ దత్ప్రసాదంబున గుంతికి

122 క. స్థిర [1]పౌరుషుండు లోకో, త్తరుఁ డు త్తరఫల్గు[2]నీ ప్రథమపాదమునన్
సురరాజుసంశమున భా,సుర తేజుఁడు వంశకరుఁడు సుతుఁ డుదయించెన్.

123 వ. అయ్యవసరంబున.

117 1. పాదస్థుండై — అ ఆ.ఇ ఓ.క గ.డ.ద.బ.

118 1. మిత్రాంబుధి - ఊ.క. భా.కూ.

119 1. ధనమునను విద్యసంతతి — య 2 బలువురు — కొన్ని ప్రతులు.

120 1. ము నింద్రుడు — స.శ. పెక్కు ప్రతులు. 2. యెల్ల — ఊ. భాపం ర.

121 1 యెప్పటియట్ల — కొన్ని ప్రతులు. 2. దుర్వాసు నిచ్చిన — వా.శ

122 1 శౌర్యయుతుడు — ర. 2 నిం బ్రథమ — ఖ.య.

124 సీ. [1]విను కార్తవీర్యుకంటెను వీరుఁడగు[2]ట నర్జున నాను మీతండ్రి యొరపుఁ దాల్చు
నీతండ యనిఁ బురుహూతాది సురుల నోడించి ఖాండవము దహించు బలిమి
నీతండ నిఖిలావనీతలేశుల నోర్చి రాజసూయము ధర్మరాజు [3]నునుచు
నీతండ వేల్పులచేత దివ్యాస్త్రముల్ వడసి విరోధుల నొడుచుఁ గడిమి

ఆ. ననుచు నవపయోదనినదగంభీరమై, [4]నెగసె దివ్యవాణి గగనవీథిఁ
గురిసెఁ బుష్పవృష్టి సురదుందుభిధ్వనుల్, సెలఁగె సకల భువన వలయ మద్రువ.

125 వ. మఱియు మరీచ్యాది ప్రజాపతులును ధాత్రాది ద్వాదశాదిత్యులును మృగవ్యాధాది రుద్రులును [1]ధరాది వసువులును భరద్వాజాది మహర్షులును భీమసేనాది గంధర్వులును శేషాది మహానాగ ముఖ్యులును వైనతేయాది ఖచరులును మేనకాద్యప్సరసలును నాశ్వినులును [2]విశ్వేదేవత[3]లును మఱియు స్వర్గంబున నున్న రాజులుం జనుదెంచిన.

126 క. శత శృంగ నగేంద్రము శత, ధృతి సర్గ దినంబ పోలెఁ ద్రిభువన భూత
ప్రతతిఁ బరిపూర్ణ శోభా, ధృతి నింద్ర తనూజు జన్మదినమున నొప్పెన్.

124 1. ఘనకార్త — ల.స ; వినగార్యవీర్యు — కొన్ని ప్రతులు. 2. టనునర్జునుండను నామ మమరదాల్చు — య. (ప్రాసయతి నియమము తప్పినది ) 3 ననుచు - బు.ఎ.ప.ఐ.చ.ట.డ త.వ.న.ప.ల.స ; నూన్చు సూని ; నునుచు — ద్వికర్మకమని భా.కూ. 4. యెగసె —— ర·వ; గగన వాణియెసగె గగనవీధి — చ భాసం. వీ.శ ష.

125 1. ధరాదివసువులును — ట; మూలము ధరో ధ్రువశ్చ సోమశ్చ అపశ్చైవానలోనిలః ప్రత్యూషశ్చ ప్రభాసశ్చ వసవశ్చావతస్థిరే పి.పి.ఎస్. ప్రతిపుట 746, శ్లోకము 56 ; వరుణాది వసువుల — భాసం. వా.శ. మొదలగు పెక్కు ప్రతులు. కాని వరుణుఁడు ఆదిత్యగణములో కన్పించును. వసువులలో లేఁడు ; వరుణాది దేవతలు — య. 2. విశ్వదేవతలును — పెక్కు ప్రతులు 3. లును మరియు స్వర్గంబున నున్న రాజులుం —— అ.ఇ.చ.ఖ.గి. భాసం. మ.ల.వీ.శ ష.స.

127 మాలిని. సరస సుర వధూ లాస్యంబులున్ [1]సిద్ధ విద్యా
ధర పటు పటహా [2]తోద్యంబులుం గిన్నరీ కిం
పురుష లలిత గీతంబుల్ మహా రమ్య మయ్యెన్
వరముని దివిజాశీర్వాద నాదంబు తోడన్.

128 వ పాండురాజును బరమోత్సవంబునం గుంతివలనం బురుషత్రయ సమానం బయిన పుత్త్రత్రయంబు వడసి [2]భువనత్రయ రాజ్యంబు వడసినంతియ సంతసిల్లి కుమారుల[3]తోడి వినోదంబులం దగిలియున్నంత మాద్రి దన యందుం బుత్త్ర[4]జన్మంబు వడయు నుపాయంబు [5]లేమికి దుఃఖించి యాత్మగతంబున.

129 ఉ. కోరిన [1]కోర్కికిం దగంగ గుంతి సుతత్రితయంబుం గాంచె గాం ధారియు నక్కడన్ సుతశతంబు ముదం బొనరంగం గాంచె నేం [2]బోరచి [3]యాండుం బుట్టువునం బుట్టి నిరర్థక [1]జీవనైతి సం సార సుఖావహం బయిన సత్సుత జన్మముం గానం బోలమిన్.

—: మాద్రికి నకుల సహదేవులు పుట్టుట :—

సం. 1-115-1

130 వ. అని వగచుచు నొక్కనాం డేకాంతంబునం బతియొద్ద గద్గద వచనయై తన మనోవాంఛితంబుం జెప్పి కుంతీదేవి యనుగ్రహంబుం బడయ [1]నగు నేని కొడుకులం బడయుదు నట్లయిన నాకును నీకును లోకంబులకును

127 1 సిద్ధ — చాల ప్రతులు; హృద్య — వా. కొన్ని ప్రతులు. 2. తోద్యధ్వనుల్ మీరగా గిం — చ పి.శ.ష, తోద్యధ్వనుల్ గిన్నరీకిం - భాసం

128 1. నుతైన — అ.ప ట.ద. 2 త్రిభువన — వా.శ. కొన్ని ప్రతులు ; భువనత్రయ - పెక్కు ప్రతులు. 3. తోడియిష్ట వినోదంబుల - ఔ.జ.త.న.య 4 లాభంబు — అ ఇ.ఊ న.ల. 5 లేమిం జేసి — ఋ.ఓ.ఔ.గ.త.

129 1. కోర్కెకుం — ర. 2. పోరచియాడుపుట్టువున - ఇచ్చట భారతకూలంకష వ్యాఖ్యలిట్లునగా, పోరసి యాడుపుట్టువున — నేను సాటువగా ఆడుజన్మమెత్తి — పోరసి అనగా సామ్యము — ఇదంతు మేమహద్దుఃఖమ్ తుల్యతాయామపుత్రతా అనియున్నది. పోరసి అను పాఠము ఏ ప్రతి ఒక్క దాని యందు మాత్రము కానవచ్చినది. 3. యాండుపుట్టువు — శ.ష; యాడుపుట్టువు — గి.శక. 4. జీవినైతి — శక. సూని. పెక్కు తాళపత్ర ప్రతులు.

130 1 నేర్తునేని — ఓ.గి$_1$.చ.జ.ట.డ.ద.న. భాసం య.ర.ల పి.శ.ష ; నేర్తేని —

హితంబగుఁ గావున నాకుఁ బుత్త్రోత్పాదనంబు [2]దయసేయం గుంతీ దేవికి [3]నానతి యిమ్మనిన మాద్రికిఁ బాండురా జిట్లనియె

131 క. నా వచనమున నపత్యముఁ, గావించును గుంతి నీకుఁ గడు నెయ్యముతో నీవగచిన యీయర్థము, చూవె మనంబునఁ [1]దలంచుచుండుదు నేనున్.

132 వ. అని పలికి యప్పుడ కుంతీదేవిం బిలిచి మద్రరాజపుత్త్రియయిన మనో వాంఛితంబుఁ జెప్పి సకలలోకకల్యాణ[1]కారు [2]లాశ్వినులు గావున వారి నారాధించి యపత్యంబు పడయు మనిన గొంతియుం బతి వచనాను రూపం[3]బుసేసిన మాద్రికి.

133 తే. కవలవారు సూర్యేందు ప్రకాశతేజు [1]లాశ్వినుల యంశము[2]లఁ బుట్టి రమ[3]ర గుణులు
[4]వారలకుఁ బ్రీతి [5]నాకాశవాణి సేసె, నకుల సహదేవు లనియెడు నామ యుగము.

ఇ.బు.ఐ.ఒ.ఔ.గ.త.బ. 2 దయ – కొన్నింట లేదు. 3. నానతి యిండనిన, నానతిండనిన — అని కొన్ని ప్రతులు

131 1. దలంతుఁ జొలయక — వా.శ సూని; దలంతు సొలవక — ఎ ఐ.ఒ.క. గ[1] చ.జ ప.బ.శ.శర.ష; తలంతుసొలయక — పీ దలంచుండుదునేనున్ — అ.ఆ.ఇ.ఈ.ఉ.ఊ ఏ.ఖ.ఛ.ట డ.త ద.న.మ య.ర.ల ఆనం గణ. రఘు ఈపాఠము నందు అఖండయతి; దలంతు సుంవరి యెపుడున్ — అక.

132 1 కారణుల — ఆ.ఇ మ; కాముల — బు; ణాకారులు — భాసం. 2. లశ్వినులు — పెక్కు ప్రతులు. ఇచ్చట భా.కూ. వ్యాఖ్య ఇట్లున్నది. అశ్వినులు అనే శబ్దము ఈ కారాంత స్త్రీలింగరూపముగా నున్నది. గనుక దాని విశేష ణము – సకలలోక కల్యాణకారిణులు — అని స్త్రీలింగ రూపముగా నున్నది. అశ్వినులు అను శబ్దము మహద్వాచకమగుటచే సకల కల్యాణకారినులు అను పాఠ మెట్లు సమర్థనీయమో తెలియదు. 3. సేసిమాద్రికి నపత్యంబు వడసిన — వా.శ. కొన్ని ప్రతులు; సేసిన మాద్రికి – చ జ. భాసం. పీ.శ.ష.

133 1. అశ్వినుల – పెక్కు ప్రతులు. 2. న – ఎ.ఏ.ఓ.ఔ.క.ఖ.గ జ.ట.డ ద.ప. 3. లగుణులు — అ.ఆ.ఇ.ఈ.ఎ ఐ.ఒ.ఖ.జ డ త.ద.బ.ర. సూని. 4. వారి కతి ప్రీతి – య (ఈ పాఠమున ప్రీ తేల్చి పలుకవలెను.) 5. నాకాశవాణి జేసె — భా.కూ. కొన్ని తాళపత్ర ప్రతులు. ఈ దిక్కున జి కారము వచ్చుటకు 'ఆత్మా స్మదోర్విసైసైతే' అను సూత్రమే ఉపలక్షకమని కూలంకషము వివరించెను

134 క. ఊర్జితులు యుధిష్ఠిర భీ,మార్జున నకుల సహదేవు [1]లన నిట్లు వివే
కార్జితయశు లుదయించిరి, నిర్జరుల వరప్రసాదనిర్మితశక్తిన్.

135 వ. [1]అంత నట.

136 సీ. మృగశాపభయమున జగతీశుఁ డప్పాండుపతి శతశృంగ పర్వతము నందుఁ
బత్నీసమేతుఁడై యత్నంబుతో ఘోరతప మొనరించుచు విపులశక్తి
నమరవరప్రసాదమున ధర్మస్థితిఁ గొడుకుల నేవురఁ బడసె ననియు
విని వసుదేవుండు మనమున [1]హర్షించి యనుజను మఱఁదిని ఘనుఁడు
చూడఁ

తే. దన పురోహితుఁ గశ్యపుండను మహాత్ముఁ [2]జీరి పుత్తెంచె నవ్విప్రు చేత
భాగి
నేయులగు కుమారులకు నమేయ రత్న, భూషణావళు లిచ్చి [3]విశేషలీల.

137 వ. అక్కాశ్యపుండును జనుదెంచి పృథామాద్రీసహితుండయి యున్న
యప్పాండురాజుం గని [1]వసుదేవసందేశంబుఁ జెప్పి యక్కుమారులకు
[2]రత్నభూషణాంబరంబు లిచ్చి క్రమంబునఁ [3]జౌలోపనయనంబు లొనరించి

134 1. లన వినయ వివే — ఆ.ఇ.భాసం.వ.

135 1. అంతనట — ఇ.భాసం.మ. కొన్ని ప్రతులలో అంత లేదు

136 1. హరుషించి — వ; హరిషించి — య. 2. జీరి — ప్రీతిబుత్తెంచె — పెక్కుప్రతులు. 3. యశేషలీల — ఆ.ఆ.ఎ.ర చీరి యను పాఠము గ్రహించుటచే పద్యమందలి ప్రాసయతి నియమము సడలినది. కాని సుఖాన్వయమున కిదియే తగియున్నది.

137 1. వసుదేవా దేశంబు — ఆ.ఇ.ప ఐ 2. రత్నభూషణాంబరంబులిచ్చి — చాల ప్రతులలో లేదు. వసుదేవుఁడు తన పురోహితుని పాండురాజు కడకు పంపెననుటకు మూలము పి.పి.ఎస్. ప్రతిలో నున్నది. 754—755 పుటలు. నీలకంఠ ప్రతిలో నీయంశము కన్పడలేదు 3 చౌలోపనయనంబులు — ఈ సంద

[4]వేదాధ్యయనంబు సేయించుచున్నంత వసంతసమయం బఖిలజీవలోకా
నందజననం[5]బై యేర్పడం జనుదెంచిన

—: వసంత వర్ణనము :—

సం. 1–116–1

138 లయగ్రాహి.

కమ్మని లతాంతముల[1]కు మ్మొనసి వచ్చు మధుపమ్ముల సుగీతనినదమ్ము
లెసఁ[2]గెం జూ
తమ్ముల లసత్కిసలయమ్ముల [3]సుగంధిముకుళమ్ములను నానుచు [4]ముద
మ్మొనర వాచా
లమ్ములగు కోకిలకులమ్ములరవమ్ము మధురమ్మగుచు [5]విన్చె ననిళమ్ము
సుమనోభా
రమ్ముల నశోకనికరమ్ములును జంపకచయమ్ములును గింశుకవనమ్ము
లును నొప్పెఁ.

139 లయగ్రాహి.

చందనతమాల[1]తరులందునగరుద్రుమములందుఁ గదళీవనములందు లవలీమా
కందతరుషండములయందు [2]ననిమీలదరవిందసరసీ[3]వనములందు వనరాజీ

ర్భుమున భా కూ లో విశేషాంశములు పేర్కొనబడినవి 4 వేదాధ్యయనంబులు —
ప భా.కూ. వేదాధ్యయనములు సేయించుచు అనుటచే ధనుర్వేదాధ్యయనమున్ను
చేయించి అనుట అని వ్యాఖ్య. సంస్కృతమూలము దీనిని సమర్థించుచున్నది.
పి పి ఎస్ ప్రతి పుట 755. 5. బైచనుదెంచుచున్న— అ.ఇ చ.శ.ష; వా బైచను
దెంచిన—ఊ గ.ల ; యేర్పడనరుగుదెంచిన—అ.ఖ.మ ; యేర్పడుదెంచిన — ఒ గ్రి₁ శ.

138 1. కున్మొనసి —— అ.ఋ.ఒ ఓ.ఖ. గణ.ప ; కుంమొనసి — సం. కుంమొనసి ——
ఇ.ఔ.క ట.జడ ద. 2. గన్—కొన్ని ప్రతులు. 3 సుగంధముల నిమ్ముల‌ను
నానుచు — న ర; సు (స) గంధ (ధి) వకుళమ్ముల— చ.ల.శ ష.స; సుగంధము
కుళమ్ములు— పెక్కు ప్రతులు ; సుగంధకుసుమమ్ములను— ఆ.ఇ ఋ.డ ద మ.య.
4. ముదమ్ములర — ర ; మదమ్మొనర — భాసం. 5 వీచె — పెక్కుప్రతులు

139 1. లతలందు — పెక్కు ప్రతులు ; తరులందు — అ ఇ.గ్రి₁.చ.వీ.శ.ష. 2. దరమీల
దరవింద —— క ; ననిమీలదర—ల.శ ష. కొన్ని ప్రతులు. 3. చయము——

[4]కందళితపుష్పమకరంద రసముం దగులుచుం దనువు సౌరభము[5]నొంది జనచిత్తా
నందముగఁ బ్రోషితుల డెంద[6]ములలందురఁగ మందమలయానిల
[7]మమంద గతి [8]వీచెన్.

—: పాండురాజు మరణము :—

సం. 1-116-4

140 వ. ఇట్లు సర్వభూతసమ్మోహనం బయిన వసంతసమయంబునం బాండురాజు మదనసమ్మోహన[1]మార్గణబందీకృతమానసుండై మద్రరాజపుత్త్రి [2]దైన మనోహరాకృతియందు మనంబు నిలిపి[3]యున్నంత నొక్కనాఁడు కుంతీదేవి బ్రాహ్మణ[4]భోజనంబు [5]సేయించుచుండి మాద్రీ రక్షణంబునం దేమ[6]ఱి యున్న యవసరంబున,

141 ఉ. చారుసువర్ణ[1]హాసినవచంపకభూషయు [2]సిందువారము
క్తారమణీయయున్ వకుళదామవతంసయునై యపూర్వశృం
గారవిలాసలీల యెసఁగం దనముందటనున్న మాద్రి నం
భోరుహ[3]నేత్రఁ జూచి కురుపుంగవుఁ డంగజరాగమత్తుఁడై.

142 క. [1]కిందము శాపము డెందము, నం దలపక శాపభయమునన్ మాద్రి గడున్
వందురి వారింపఁగ బలి, మిం దత్సంభోగసుఖసమీహితుఁ డయ్యెన్

జొ.గ.ము.న. 4. సందళిత—అ.ఉ.ఋ ఐ.ఓ ట క గు.ప.బ భాసం.స.ళ 5. నొంది — కొన్ని ప్రతులు. 6. ములువందురగ — వ ల శ.ష స ; ములరంగగడు — య. 7. మనిందగతి — ఋ.ట.న ; ములంపు ంగ పిచెౕ — ఊ ; ము గ్రందుకొనిపిచెౕ— ఓ ; ము మందగతిపిచెౕ — జొ.క.ద. 8 ఏంచెన్ — గ.ర, 'పిచె' కొన్నిచోట్ల సానుస్వారముగా నున్నది — స.

140 1 మార్గణ విదళన ముందీ కృత—గి$_1$.చ.ర.ల పి శ.ష స, మార్గణ మందీకృత — పెక్కు ప్రతులు. 2. దైన — ఓ.గ.ర లలో లేదు 3. యున్న నొక్కనాడు— కొన్ని ప్రతులు. 4. భోజనయత్నంబు — గి$_1$.చ.జ. భాసం. పీ.శ.ష. 5. పెట్టు చుండి — ఏ.న ర. 6. రి మఱచి — గి$_1$.వా.శ. కొన్ని ప్రతులు పాండురాజు మరణ దివసమును గూర్చి భా.కూ. చూడఁదగినది.

141 హాస — ఐ.వ ; భాసి — అ.వ ; హార — ఊ ; భా కూ 2. సింధువార — భాసం. కొన్ని ప్రతులు. 3. నేత్రి — పెక్కు తాళపత్రప్రతులు. 4. రాజ—అ.ట.క.వ ; రాగమగ్నుడై —ఖ.డ.ద.మ; రాజమగ్నుడై — గ జ.

142 1. కిందవు — కొన్ని తాళపత్రప్రతులు. భా.కూ, క్రిందటి—క.మ.

143 వ. [1]దానం జేసి విగతజీవుం[2]డై ... కౌఁగిలించి కొని [3]మాద్రి యఱచుచున్న దాని యాక్రందనధ్వని విని [4]వెఱచి కుంతీదేవి గొడుకులుం దానును బఱతెంచి పతియుఁ బుగులుపయిం బడి యేడ్చుచున్న నెఱింగి శతశృంగనివాసులగు మునులెల్లం [5]దెరలి వచ్చి చూచి శోకవిస్మయాకులితచిత్తు లయి రంతఁ గుంతీదేవి మాద్రి కిట్లనియె.

144 ఉ. నా కెడ యిమ్ము లెమ్ము కురునాథమనఃప్రియధర్మపత్ని [1]నే నేకత [2]మెట్టు లుండుదు మహీపతితోడన పోదుఁ బుత్త్రులం జేకొని పెన్పు నా [3]పనుపుఁ జేయుము నావుడు మాద్రి దద్దయుఁ శోకపరీతచిత్త యగుచుం బృథ కిట్లనియెం [4]బ్రియంబు[5]నన్.

మాద్రి సహగమనము చేయుట

సం. 1-116-25

145 తరువోజ. కురు[1]వంశ [2]నిస్తారకుఁ ధర్మ[3]యుక్తిఁ గొడుకులఁ బడసి యిక్కురుకుంజరునకుఁ గరము మనఃప్రీతి గావించి పుణ్యగతికిఁ గారణ[5]మవై కమలాక్షి నీవు దిరముగా [6]నిష్టంబు దోఁచితే నిందు ధృతిఁ బతియిష్టంబు దీర్పన కాన యరిగెదఁ బతితోడ నస్యలోకంబు సందైనఁ బ్రీతిసేయఁగఁ గాంతు ననియు.

143 1. దానననిని — అ ఇ ఎ.ఓ.ఔ క గ.జ ట. 2. డై పడియున్న — ఆ ఇ చ.బ.ర. ల వీ శ.వ. 3 యేడ్చుచున్నమ ... ఆ.ఇ.ఔ వ.స. 4. వెరచి— కొన్నింట లేదు 5. వెడలివచ్చి—ఖ.య.

144 1. నై — ఋ.ఐ.ఒ.బ డ.ద వ ల స. 2. మేలయుండుదు — పెక్కు ప్రతులు 3 పలుకు — ఇ.చ భాసం. ల.వీ.శ.వ. 4. భయంబుతోన్—స. 5. తోన్—ఆ.ఇ ఉ. ఋ.ఐ.ఒ.క.ఖ.ట బ య.

145 ఔ ప్రతిలో తరువోజకు 'తఱుపు' అని మఱియొక పేరు కలదు ; తరువజ, తరువుజ — అనియు రూపములు కలవు. 1. కుల — ఊ వ 2. నిస్తారకుల—ఇ ఋ.ఐ త భాసం వు.స.శ , విస్తారకుల — శ ష వా. కొన్ని ప్రతులు 3. వృత్తి — ఈ ; నియతి — ఉ 4 చు — వా.శ. కొన్ని ప్రతులు. 5 మైన—అ.ఆ.ఉ ఊ క జ డ ద.బ ర.స ; మైతి — ఓ గ.త ర. 6. పతికోర్కి —అ.ఊ.ఔ త స. 7. యె — పెక్కు ప్రతులు.

146 వ. [1]మఱియు మృగశాపభయం [2]బెఱింగియు నిశ్లేమఱిన [3]యతిప్రమత్తురాల [4]నే నిందుండి పుత్త్రుల రక్షింప నేర నన్ను వారింప [5]వలవదు కొడుకుల నేమఱక రక్షించునది యని చెప్పి కుంతీదేవి వీడ్కొని [6]మునిసహస్రంబు నకు [7]మ్రొక్కి మద్రరాజపుత్త్రి పతితోడన [8]చితారూఢయై యగ్నిశిఖల నపగతప్రాణ యయ్యె నంత నయ్యిరువుర యంగంబులు సంగ్రహించు కొని మహామునులు కుంతీదేవిం గొడుకుల నూఱార్చి.

147 క. ధరణీరాజ్యవిభూతి[1]యు, పరిజనులను బాంధవులను బ్రజవిడిచి తప శ్చరణ తపస్వుల [2]దనరుఱ, శరణంబని నమ్మి పాండుజనపతి నెమ్మిన్.

148 క. కొడుకుల [1]నిందఱ [2]కిల్లడ, యిడి [3]పరలోకమున కరిగె నెడసేయక యి ప్పుడ వీరలఁ గురువృద్ధుల, కడకుం గొని పోవవలయు గజపురమునకున్.

—: మునులు పాండవులను హస్తిపురంబునకుం గొనివచ్చి ధృతరాష్ట్రున కొప్పగించుట :-

సం. 1-117-6

149 వ. అని తమలో విచారించి కుంతీదేవిని గుమారులం దోడ్కొని మునులెల్ల హాస్తిపురంబునకు వచ్చిరంత.

150 చ. సురలవరప్రసాదమునఁ [1]బూనె సుపుత్త్రులఁ బాండురాజు భా సురముగఁ గాంచెఁ దత్సుతులఁ బూతము లండని పౌరులెల్లఁ నొం డొరులకుఁ జెప్పుచుం [2]దెరలి యొండొరులం గడవంగ [3]వచ్చి చూ చిరి భుజవిక్ర[4]మాధరిత సింహకిశోరులఁ బాండవేయులన్.

---

146 1. మఱియు — కొన్ని ప్రతులలో లేదు. 2. బెఱింగి యెఱింగి—అ.ఈ.ఉ.ఏ.ప.గ. ఓ.త. 3. యతి—కొన్నిట లేదు. 4. నేనిందుండి — పెక్కు ప్రతులలో లేదు. 5. వలవదు — భాసం.శ. పెక్కు ప్రతులు ; వలదు — వా; దగదు— చ.పీ. శ.వ. 6. ముని సహస్రంబునకు మ్రొక్కి — పెక్కు తాళపత్రప్రతులలో లేదు ; ముని సంఘంబున (ల) కు — బొ.త. 7. మ్రొక్కి వారినేల సముజ్ఞ వడసి మద్ర — అ. 8. చితార్యారూఢ — గ$_1$.చ. భాసం. పి.శ.వ.

147 1. ని — ఎం.శ. కొన్ని ప్రతులు. 2. నదరగన్ — ఉ; నడకును — క.

148 1. నందర—కొన్ని ప్రతులు. 2. నిక్కడనిడి—ఊ.చ.పి.శ.వ ; కిల్ల(ల్లె)డయిడి—ఋ. ఒ.ఖ.గ.య.ర ; నిల్లడయిడి- వా.శ. కొన్ని ప్రతులు. 3. సురలోక—కొన్ని ప్రతులు.

150 1. బూనె—పెక్కు ప్రతులు ; బూరె—ఉ.ఒ.బొ.వా. 2. గడగి-ఐ.ఓ.గ.య.వ; గదలి- ఖ.న ; తరలి—గి.న. 3. బారి—అ.ఉ.ఋ.ఒ.జ.ల. 4. మోన్నతుల—గ$_1$.చ.ల.పి.శ.ష. స ; మూర్జిత —అ.ఈ.ఉ.ఎ.ఐ.ఓ,క.ఖ.ద.బ.న ; మోద్ధత — స ; మోపమిత—స.

151 ఉ. వీరలు [1]దైవశక్తిఁ బ్రభవించిన [2]వారగు టేమిసందియం
బీ రమణీయకాంతి [3]నుపమింపఁగ వేల్పు[4]లకారె యిట్టి యా
కారవిశేషసంపదఁ బ్రకాశితతేజము పేర్మిఁ జూడ సా
ధారణమర్త్యులే యని ముదంబునఁ బౌరులు దమ్ముఁ జూడగన్.

152 వ. మునిసహస్రపరివృతులయి జననీసహితంబు పాండురాజకుమారులు రాజమార్గంబు దఱి[1]య వచ్చి రాజమందిర[2]ద్వారాసన్ను లగు నంత మంత్రిపురోహితబ్రాహ్మణనివహం[3]బులు దుర్యోధన దుశ్శాసన ప్రముఖ ధార్తరాష్ట్రశతంబును నెదురువచ్చి పాండవులం దోడ్కొని [4]తెచ్చిన భీష్మ విదుర ధృతరాష్ట్ర సత్యవత్యంబికాంబాలి[5]కలు [6]మొదలుగా నమ్మునులకు నమస్కరించి పంతం దమకు మ్రొక్కిన కుమారుల నతి స్నేహంబున నెత్తికొని కుంతిని బ్రియపూర్వకంబున సంభావించి పాండు రాజవియోగదుఃఖితులయి మహాశోకంబునం దేలుచున్న విదురధృత రాష్ట్రుల గాంధారీసహితం బూరార్చి యమ్మునుల యందొక్క వృద్ధ తపస్వి మునిసహస్రాను[7]మతంబున నిట్లనియె.

151 1. ధర్మ – ఔ.డ ; దేవ – ఆ·ఈ.ఉ.ఋ ఎ.ఏ.ఐ.ఒ.ఓ.ఖ.య.ర.వీ. 2. వారను టేమి – ఊ.ఋ ఐ.ఒ.ఖ గ$_1$ డ బ భాసం. పీ.శ.ష. 3. నుదయించినవేల్పులకాక – ర , నిపహింపగ వేల్పుల కాక – భాసం ; వీ. 4. లకాక – ఆ.ఋ.ఏ.ఐ.ఔ.జ. ట.డ ద బ య వీ , లెకాక – గ$_1$.ఖ.చ.శ.ష. ఇచ్చట భా.కూ. వ్యాఖ్య ఇట్లున్నది. ఈపద్యము ప్రథమ, ద్వితీయ చరణములలో నిత్యసమాసవడి పదము విభజించి చెప్పఁజొప్పడని యదియు। నన్యశబ్దంబుఁ గొని విగ్రహంబుఁ జెప్పు। నదియు నిత్య సమాసమై యలరుచుండు । నట్టి సంధులనచ్చు హల్లైన విరతి. అనిలక్షణము.

152 1. యంజొచ్చి — ఊ.ఎ ఏ గ.గ$_1$ చ భాసం.పీ.శ.ష 2 ద్వారంబు సేరం జనుదెంచునంత — ఞ.చ ఖ. భాసం. మ.పీ.శ.ష; ద్వారాసన్నులగునంత – య. 3. బుతో – ఊ.ఔ త య. 4. వచ్చిన – ఆ.ఓ.జ.ట.డ ప మ.ర.వీ. 5. క, గాంధారి పురోహిత విద్వజ్జనంబు లమ్మునులకు — చ భాసం. ల.పీ.శ.ష. 6 మొదలుగా – కొన్నిటలేదు. 7. మతుండై – న.

153 ఉ. భానునిభుండు పాండుజనపాలుఁడు సంతతపంబు సేసి ధ
ర్మానిలవాసవాశ్వినుల[1]దైన వరంబు[2]న [3]శక్తిఁ బెంపుతో[5]
నీ నరనాథనందనుల నేర్పర వంశ[4]వివృద్ధిఁ బొందెఁ బం
చాననసత్త్వులం బడసె నాశతశృంగమహానగంబునన్.

154 క. త్రిదశాధినాథసదృశుఁడు, త్రిదశాలయమునకు మాద్రిదేవియుఁ దానున్
ముద[1]మొనర నరిగె నేఁటికిఁ. [2]బది[3]యేడగునాఁడు దురితబంధచ్యుతుఁడై.

155 క. [1]కమనీయలీల నొక్కట, [2]నమరపురంబునకుఁ జనిన యయ్యిరువుర యం
గము లివి పితృమేధవిధి, క్రమ మొనరఁగ సంస్కరింపఁ గడఁగుఁడు మీరల్.

156 వ. ఈదేవియును బతితోడ సహపోవ సమకట్టినం బుత్త్రరక్షణార్థంబు మునిగణ ప్రార్థితయై కౌంతేయయు ధృతప్రాణ యయ్యె నిక్కుమారులు కురుకుల [1]విస్తారకులు దేవమూర్తులు యుధిష్ఠిర భీమార్జున నకుల సహదేవులనంగా దేవాధిష్ఠితనామంబులు దాల్చి బ్రహ్మర్షి[2]ప్రణీతోపనయనులై [3]శ్రుతాధ్యయనసంపన్నులగుచుఁ [4]బెరుఁగుచున్న వారు వీరలం జేకొని కురువృద్ధులు ధర్మబుద్ధి రక్షించునది యనిచెప్పి సిద్ధచారణగణంబులతో నమ్మహామును లంతర్ధానంబు సేసినం గాంగ వ్యాస భీష్మ ధృతరాష్ట్రుల యనుమతంబున.

153 1. దైవ — వా. కొన్ని ప్రతులు, దైన — పెక్కు ప్రతులు. 2 లశక్తి — అ.ఊ.ఋ ఎ.ప.ఐ.ఒ.ఖ.జ.త.మ. 3. భక్తి పెద్మతో — ఈ, చేసి — ఊ. 4. సమృద్ధి పొంద — ఆ.యు; సువృద్ధిపొంది — ఒ.ఖ, వివృద్ధిపొందు — ఊ.ఐ.

154 1. మొదవు — ... పి.శ.వ. 2. పదియేనగు — ఓ.ర; మూలము సప్తదశేతి. 3. యేడవ — ఊ.ఎ.గ గ$_1$.చ.డ.త వి.శ వ. మాద్రిదేవి అను శబ్ద భాగము. వ్యాఖ్య చూడదగినది. ఈదంతా ఇద్వదేవకృత ప్రాచ్యాంధ్రసూత్రేసుపి గీర్వాణోపయోగి భవతి.

155 1. రమణీయ — అ.ఈ.ఎ.ఐ.గ$_1$.చ.జ.ట ద వ. 2 యమపాదనమునకు — స;

156 1. నిస్తారకులు — 2. కృతోపనయనులై — ప 3. కృతాధ్యయన — అ.ఎ.ల; సదాధ్యయన — య. 4 పెఱుగు — గ$_1$ (శకటరేఫముతో); పెరుగు — శ.వ. (అర్ధానుస్వార రహితము)

157 సీ. వెలయంగఁ బితృమేధవిధివిచక్షణ[1]శీలసద్భూసురోపదేశక్రమమున
నధికవిభూతితో నతిపవిత్రప్రదేశమున నయ్యంగముల్ సంస్కరించి
పుణ్యాస్వధా[2]మృతంబుల నొప్పఁగా శ్రాద్ధవిధి యొనరించి సద్విప్రతతికి
నగ్రహారములు దివ్యాంబరాభరణ శయ్యాసన చ్ఛత్త్రి గవాశ్వకరుల

ఆ. నిచ్చి సర్వజనులకెల్లను భోజన,దానమొనరఁ జేసి ధర్మనిధుఁడు
[3]విదురుఁ డట్లు పాండువిభునకుఁ జేయించె,నన్యలోక[4]హితములైన విధులు.

158 వ. అంత గృష్ణద్వైపాయనుండు వారి కందఱకు దుఃఖోపశమనంబు సేసి యొక్కనాఁడు సత్యవతికి నేకాంతంబున నిట్లనియె.

159 క. మతిఁ దలఁపఁగ సంసారం, బతిచంచల మెండమావు లట్టుల సంప
త్ప్రతతు లతిక్షణికంబులు, గతకాలము మేలు వచ్చుకాలము [1]కంటెన్.

160 క. క్రూరులు [1]విలుప్త ధర్మా,చారులు ధృతరాష్ట్రసుతు లసద్వృత్తులు ని
ష్కారణవైరులు వీరల, కారణమున [2]నెగ్గు వుట్టుఁ గౌరవ్యులకున్.

161 వ. దాని ధృతరాష్ట్రుండు తాన యనుభవించుం [1]గాని మీ రీ దారుణంబుఁ జూడక వీరి విడిచి తపోవనంబున కరుగుండని చెప్పి చనిన సత్యవతియుఁ బారాశర్యు నుపదేశంబు భీష్మవిదురుల కెఱింగించి కోడండ్ర నంబికాంబాలికలం దోడ్కొని వనంబునకుం జని తానును వారు నతిఘోరతపంబు సేసి కొండొక కాలమునకు శరీరంబులు విడిచి పుణ్యగతి[2]కిం బోయిరట ధృతరాష్ట్రుండును.

157 1 విలసద్భూసుర — ప.ఒ.గ్1.ర.న.ష; తాలసద్భూసుర — ఖాసం, లీల — స పెక్కు తాళపత్ర ప్రతులు. 2. కృ — అ. మూలము స్వధామృతమయమ్. 3. విదురరాజు — ' ద.స 4. హితవులైన — య.

159 1 కన్నన్ — ఎ ఒ ఖ ట ద.స వ.ర స ఇచ్చట మూలము — అతిక్రాంత సుఖాః కాలాః। పర్యుపస్థిత దారుణాః। శ్వః శ్వః పాపిష్ఠ దివసాః। పృథివీ గత యౌవనా — చిత్రశాలా ప్రతి.

160 1 ధర్మవిలుప్త విచారులు — అ.ఈ.ఉ. 2. నెగులు — ఊ.వా.

161 1. గాని — కొన్ని ప్రతులలో లేదు. 2. పొందిరిట — కొన్ని ప్రతులు.

—: కురుపాండు కుమారుల బాలక్రీడలు :—

సం. 1—119—13

162 క. తనసుతులు పాండుసుతులని, మనమున భేదింప కతిసమంజసభావం
బున నొక్కరూపకాఁ జేకొని యుండెం బాండురాజుకొడుకులఁ బ్రీతిన్.

163 క. ధృతరాష్ట్రునెయ్యమున సం, తతవర్ధితులగుచుఁ బాండుతనయులు వినయా
న్వితులు కుమారక్రీడా, రతులయి యొడఁగూడి ధార్తరాష్ట్రులతోడన్.

164 క. [1]గిఱుపునెడ నేయునెడ వడిఁ, బఱచు నెడం బెనఁగునెడ నపారబలంబుల్
మెఱయునెడ భీమునకు నం,[2]దొఱుఁ గిడ్వడఁ దొడఁగి రుద్ధ[3]తులు రాజ
సుతుల్.

165 క. వదలక [1]పెనఁగి పదుండ్రం, బదియేవుర నొక్కపెట్ట పట్టి ధరిత్రిం
[2]జెదరఁ [3]బడవైచి పవనజుఁ, డదయుండయి [4]వీపు [5]లొలియ నందఱ
నీడ్చున్.

166 సీ. కూడి జలక్రీడ[1]లాడుచోఁ [2]గడఁగి యా ధృతరాష్ట్రతనయుల [3]సతులశక్తి
[4]లెక్కించి[5]యుఁ బదుండ్ర నొక్కొక్క భుజమున నెక్కించుకొని వారి
[6]యుక్కడంగ

---

164 1. గిరపు — ఊ.ఋ.ఎ.ఓ.గ.బ.డ; కిరచు — గి$_1$.చ.ద.వీ.శ.ష. కసం. సం. భాసం. న; గిరవు — అక.ఛ; కిరుపు — ర.న.ద్వి. శక; కెరపు — య; కిరుపునెడ — ఠ; విరుపునెడ — న; ఇతర రూపములు — కెరపు, గిరివు; గిరపు. 2. దరు — ల. కసం. శక. పెక్కు తాళపత్రప్రతులు. 3. తను — అ.ఎ.ణ.ఖ.ట.ఢ.

165 1. పెనంగిపదుపుర — న; పెనంగి బదురం — ర. 2. జదల — క; బెదర — ఎ. 3. వడి — ఊ.ఋ.ఎ.ఏ.ఎ.ద.ప.బ.య.ర.న. 4. వీపు — గి$_1$.వీ.శ.ష. అరసున్న లేనిరూపము. 5. లొరయ — అ.య.ల; లొలయు — ఈ.ఉ.ఊ.ఋ.ఎ. ఖ.ద.బ.

166 1. లాడుచు — ఋ.గి$_1$.చ.వీ.శ.ష ; లాడుచు నొక్కట — ఊ. 2. బెనగి — య. 3. బలశక్తి — ఊ. 4. లెక్కించి పదురను — మ.ర; లెక్కించక — స; ద్రుక్కించుచు — న. 5. పదుగుర — ఊ.ఐ.ద. 6. నక్కజముగ — ఆ.మ;

[7]గ్రంచఱ [8]నీరిలో ముంచుచు నెత్తుచుఁ [9]గారించి తీరంబు చేరఁ బెట్టుఁ
గొని ఫలార్థులై వారల యెక్కిన మ్రాఁకుల [10]మొదళుల వీఁకఁ బట్టి
ఆ వడిఁ గదల్పుఁ బండ్లు దడఁ[11]బడువారల, తోన ధరణి మీఁదఁ దొరఁగు చుండ
నిట్టిపాటు గాడ్పుపట్టిచే దుశ్శాసనాదు లెల్ల బాధితాత్ములై రి.

167 వ. దాని సహింప [1]నోపక [2]యొక్కనాఁడు దుర్యోధనుండు శకునిదుశ్శాసనాదులతో విచారించి యిట్లనియె.

168 పృథ్వి. ఉపాంశువధఁ జేసి మధ్యము మదోద్ధతుం జంపి ని
స్సపత్నముగ ధర్మనందను నశక్తు బంధించి యే
నపాండవముగా సముద్రవలయాఖిలక్షోణి మ
త్కృపాణపటుశక్తి సత్యధిక కీర్తినై [1]యేలెదన్.

-: *దుర్యోధనుఁడు భీమునిఁ జంపింపఁ దివురుట* :-

సం. 1–119–28

169 వ అని పాపబుద్ధి యందుఁ గృతనిశ్చయుండై దుర్యోధ[1]నుండు భీష్మ [2]విదురు లెఱుంగకుండ భీమున కపాయంబు [3]సేయ సమకట్టి యంతరం బన్వేషించుచున్నంత నొక్కనాఁడు జల[4]క్రీడావసరంబున.

నుక్కడంగ – పెక్కు ప్రతులు 7. గొంచక – ఊ.ఐ.చ.ట త వీ శ శర.ప స; గ్రచ్చర నీటిలో గ్రుచ్చుచు – స; ఎనుకొని నీటిలో ముంచుచు – ఎ. (ఈ పాఠమున ప్రాసయతి నియమము తప్పినది); గ్రచ్చర నీటిలోనుచ్చుచు – క. 8 నీటిలో – ఆ ఓ.క.త 9. తీరంబునలమట తేరఁబెట్టు – స 10 మూలముల్ – న.ల ప 11. బడ – పెక్కు ప్రతులు; బడి – ఖాసం. వ.శ, బడు – ఔ.య

167 1. జాలక – వా.శ. కొన్ని ప్రతులు. 2. నొక్కనాడు – ఎ $గ_1$ మ ల.శ.

168 1. యేలుదుణ – య.

169 1. నుండుశకుని దుశ్శాసనులుం దానును — ఈ.ఉ.వ. 2 విదురాదు లెఱుంగకుండ — న య. 3. సేయునంతరము — పెక్కు ప్రతులు; సేయునుపాయం బన్వేషించుచున్నంత — ఏ న ర; సేయరంధ్రాన్వేషణంబు సేయుచున్నంత — బి. 4. క్రీడలాడుచున్న సమయంబున — ఖ

170 ఉ. వేడుక [1]నొక్కరుండు శతవీరకుమారులతోడఁ జల్లుఁబో
రాడి జయించి [2]యందఱు సొంతపరిశ్రమ పార[3]వశ్యముం
గూడి [4]ప్రమాణకోటి [5]ననఘుండు సమీరణనందనుండు [6]మే
యాడక నిద్రవోయె శిశిరానిలముల్ పయి [7]వీచుచుండఁగన్.

171 క. ఆ పవనజు నతిఘనలతి,కాపాశావలుల సంటఁ గట్టించి మహా
కోపమున గంగమడువునఁ, ద్రోపించె సుయోధనుండు [1]దురితకరుండై.

172 క. అనిల[1]సుతుం[2]డంతన మేల్కని నీల్గుడు నతని వజ్రఘనకాయముఁ బొం
దిన లతికా[3]పాశము లెల్లను ద్రెస్సె మృణాళ[4]నాళ[5]లతికలపోలెన్.

173 ఆ కర్మబంధనములు గ్రక్కునఁ బాయుడుఁ, బుణ్యగతికి [1]నెగయు పురుషు నట్లు
బంధనంబు లెల్లఁ బాయుడు భీముండు, నీగిలోన నుండి [2]నెగయు దెంచె.

174 వ. మఱియు నొక్కనాఁడు.

170 1 నొక్కరుండ — ఋ.క.ఖ.ట.న.య. 2. యంతట — ఆ.ఈ.ఋ.ఎ.ఐ.ఢ.స. 3. వశ్యతన్ — ఓ.జ.స. 4. ప్రమారకోటి — ర; ప్రయాణకోటి — ఈ. మూలము. ప్రమాణకోట్యాం గద్దేశం స్థలం కించిదుపేత్యచ ప్రమాణకోట్యాం — గంగాయాం ప్రదేశవిశేషే — చిత్రశాలాప్రతి. పుట 224; ప్రఘూణకోటి — భా.కు. 5. నలఘుండు — ఖ.య 6 మెయ్యాడక — అ.ఊ.ఋ.ఓ.ద.వ; మెయ్యాడక — ఆ.ఎ.ఒ.ఔ.క.గ.జ.ట.డ.త.బ.య.ర 8. వీంచుచుండగన్ — ర వీఁచు (అఱుస్న తోడిరూపము.)

171 1. దురితోద్ధతుడై — అ.ఈ.ఊ.క.త.వ.ల; దుష్టాత్ముండై — గ[1].చ.పి.శ.ష.స; దుష్కార్యమునన్ — ఎ.ప.ల, దురితాత్మకుడై — ఓ.జ.డ.బ; దురితాత్ముండై — ఋ.ప; దురితపథుండై — వ.

172 1 సుతుండంత మేల్కనిన — భాసం; యల, సుతుడంతదా మేల్కని — స. 2. డల్లన — ఐ; డంతట — ఓ; డంతనె — క.ర; డంతటన — చ.పి.శ.ష. 3. పాశము — పెక్కు ప్రతులు; జాలము — వా. ముద్రిత ప్రతులు. 4. జాల — పెక్కు ప్రతులు 5. లలితములగుచున్ — ఉ.క.ర.ల.వి.

173 1. నగయు — పెక్కు ప్రతులు; నేగు — వా కొన్ని ముద్రిత ప్రతులు. 2. నేగు — ఈ.ఋ.ఖ.ట.డ.ద.ప.బ; యేగు — గ.

175 క. జనపతి [1]పనుపఁగ సారథి, ఘనవిషకృష్ణోరగములఁ గఱపించె భ్రశం
బునఁ నిద్రితుఁడైన ప్రభం, జనసుతు సర్వాంగమర్మసంధుల నెల్లన్.

176 క. అవిరళవిష[1]ఫణిదంష్ట్రిలు పవనజు వజ్రమయతనువుపయి తాఁకులును నో
[2]పవ భేదింపఁగఁ బాప, వ్యవసాయుల చెయ్వు లర్థనాశము లగునే.

177 చ. అలఘు[1]బలుండు భీముఁడును నంతన మేల్కని యవ్విషోరగం
బులఁ జరణంబులం [2]జమరి ముక్కున వాతను నెత్తురొల్కఁగాఁ
దలరఁగ సారథిం జఱచెఁ [3]దానవహస్తమునన్ వసుంధరా
తలమునఁ [4]బ్రెళ్ళ సారథియుఁ దత్క్షణమాత్రన ముక్తజీవుఁడై.

178 క. మఱియును నొకనాఁ డెవ్వరు, నెఱుఁగక యుండంగఁ గౌరవేంద్రుఁడు ధర్మం
బెఱుఁగక విషమన్నము[1]తోఁ, గుఱుకొని పెట్టించె గాడ్పుకొడుకున కలుకన్

179 క. సముఁడై యయ్యుత్సుఁ డయ్యన్నము దుష్టంబగుటఁ [1]జెప్పినను గుడిచె విషా
న్నము [2]నాఁకటి[3]పెలుచను నది, [4]యమ్మృతాన్నంబయ్యె జీర్ణమై
మారుతికిన్.

175 1 పనుపగ — ఆ.ప.బ.ఔ.ఖ.జ.త.స. భాసం. యల, పనుపున — $గ_1$.చ.బ.పి.శ.ష, పంపఁగ — వా కొన్ని ప్రతులు.

176 1 ఫణీంద్ర దంష్ట్రలు — ర, 2. పవు — పెక్కు ప్రతులు

177 1 భుజుడు — అ.ఈ.ప.ఔ.క.చ.త.ప. భాసం. వీ.శ.ష 2. జదిపి — ప 3 దాపలి — క.ఖ.ల.వీ; దాఘున — వ; దానవ — ఊ.ఎ.ప.ఒ.ఓ.జ.ప.బ సూని; దానవహస్తము — భా.కూ సారథించా స్వదయితం మదహస్తేనజఘ్నివాన్ — అని మూలము. 4. బ్రెళ్ల — కొన్ని ప్రతులు.

178 1. లో — ఖ.చ.ర.శ.ష.

179 1. జెప్పినం — వా కొన్ని ప్రతులు. 2 నాకలి పెలుచను — $గ_1$ చ.పి.శ.ష. 3 పెల్లని — ఆ.ప.డ.బ.ల ; పెంపున — ర; పెలుచన — ఈ.ఉ.ఊ.ఋ.ఎ.ఓ.క.ఖ.స 4 యమృతంబై జీర్ణమయ్యె నమ్మారుతికిన్ — ఔ.గ.త.స.

180 వ. ఇట్లు దుర్యోధనుఁడు భీమునకుఁ జేసిన యెగ్గులెల్లను గృతఘ్నునకుం జేసిన యగ్గులునుం బోలె నిష్ఫలంబులైన సిగ్గువడి వెండియుఁ బాండవుల కెల్ల నపాయంబు [1]సేయ నుపాయంబుఁ జింతించుచుండె నంత భీష్మునియోగంబున.

181 క. విలువిద్యఁ గఱచుచుండిరి, బలయుతులు కుమారకులు కృపద్రోణాచార్యులతోడఁ [1]గలసి యొక్కట, నలఘుపరాక్రమసమేతు లధిక[2]స్పర్ధన్.

182 వ. అనిన విని జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె.

183 తే. కృపుఁడు ద్రోణుండు ననఁగ సత్కీర్తులైన, వారి జన్మప్రకారంబు వారు వచ్చి కౌరవుల కెల్ల గురులైన కారణంబు నిప్రముఖ్య నాకెఱుంగంగ విస్తరింపు.

184 వ. [1]అని యడిగి[2]న వైశంపాయనుం డిట్లనియె.

-: కృపాచార్యుల జన్మవృత్తాంతము :-

సం. 1–120–2

185 సీ. వినవయ్య గౌతముండనఁ బ్రసిద్ధుండైన మునికి శరద్వంతుఁడను మహాత్ముఁ డురుతరతేజుఁడై శరసమూహంబుతో నుదయించి వేదముల్ చదువ నొల్ల కతిఘోరతపమునఁ బూతభూసురోత్తముల్ వేదముల్ [1]చదువు నట్లాదరమున
సర్వాస్త్రవిదుఁడు ధనుర్వేద మొప్పంగఁ బడసి మహోనిష్ఠఁ గడఁగి తపము
ఆ. సేయుచున్న బలిమిఁ నాయకుఁ [2]డతిభీతి, నెఱిఁగి వానితపముఁ జెఱుపఁ బనిచె

180 1. బనుపుటకు — కొన్ని ప్రతులు. 2. సేయను పాయంబు — కొన్నిట లేదు.

181 1 గూడి — ... 2. శ్రద్ధన్ — ...

184 1. అని జనమేజయుండడగిన వాని (కి) తెలుంగు వైశంపాయనుం డిట్లనియె — ప.ల.పి.శ.ష. 2 న జనమేజయునకు — కొన్ని ప్రతులు; న విని వానియడిగిన తెరంగు — జ.డ.ప.ర.న.

185 1 పఠింపుచున్నట్లు —... జ.ఖ.స.ర; పఠింపునట్లు — ప్రౌ శ.ష 2. దంతనా వెరచి—

జలజనయనఁ దరుణి [3]జలపద [4]యనియెడు, దాని నదియు వచ్చె వాని కడకు.

186 క. అమ్మదితఁ జూచి కాముశ,రమ్ములచే [1]విద్ధుఁడై శరద్వంతుఁడు చి
[2]త్తమ్మల[3]ర మదనరాగర, సమ్మరఁ దన్నెఱుఁగకుండెఁ [4]జంచలతనుఁడై.

187 క. ఆతరుణికటాక్షేక్షణ, పాతము గౌతమున కపుడు పటుబాణధనుః
పాతముతోడన రేతః, పాతము గావించె రాగపరవశుఁ డగుటన్.

188 వ. దాని నెఱింగి శరద్వంతుం డయ్యాశ్రమంబు విడిచి చని యొండుచోటం దపంబు సేయుచుండె [1]నవ్వీర్యంబొక్క శరస్తంబంబున ద్వివిధంబయి పడిన నందొక కొడుకునుం గూఁతురుం బుట్టిరంత శంతనుండు మృగయా వినోదార్థం బరిగిన వాని [2]సేనాచరుం డాశరస్తంబంబున నున్న కొడుకుం గూఁతుఁ దత్సమీపంబున నున్న శరచాపకృష్ణాజినంబులు జూచి [3]యివి [4]యెయ్యేనియు నొక్క ధనుర్వేద[5]విదుండయిన బ్రాహ్మణు నపత్యం [6]బగునని శంతను[7]నకుం జూపిన శంతనుండును వారలఁ జేకొని కృపా యత్తచిత్తుండయి పెనుచుటం జేసి యయ్యిరువురుఁ గృపుఁడును గృపియు [8]నసం బెరుఁగుచున్నంత.

ఔ.త 3. జలపద — పెక్కు ప్రతులు ; జలవతి — భాసం మూలము — తతో జానపదీం నామదేవ కన్యాం — చిత్రశాలా ప్రతి. తతోజాలపదీం నామ దేవకన్యాం సురేశ్వరః — భండార్కరు ప్రతిపుట 535. తతోజాలవతీంనామ పి.పి ఎస్. ప్రతి. జలవతి యని మఱియొక పాఠము. 4. యనుదాని నదియు వచ్చెవానిగదియ[క్రితి]— య ఈ పద్యము తరువాత అట్లు వచ్చిన అను వచనము ఔ.త ప్రతులలో నున్నది.

186 1 వివశుడై—ఐ.ఔ.త. 2 త్తమ్మున విభ్రమ రాగవశమ్మున — య. 3 రి— పెక్కు ప్రతులు. 4. సంచలితుండై—క.గ ద స.

188 1 నవ్వీర్యంబు తత్సమీపంబుననున్న శరస్తంబంబున — ఐ ఒ.ఔ.ట. 2. సేనాగ్రచరుడు — ఋ.ప ఐ క.ఖ.గ.చ.ప.బ.వీ.శ.ష. 3. యిది — కొన్ని ప్రతులు 4. యెవ్వడేనొక్క — భాసం. ల.వీ , యెవ్వడేనియొక — $గ_1$.శ.ష , యెవ్వడేని నొక్క — చ , యెయ్యేని నొక్క — $గ_1$ ; యెవ్వరేని యునొక్క — $గ_1$ ; యెయ్యేని యొక్క — $గ_1$ య. 5. పారగుండయిన—చ.జ వీ.శ.ష. 6. బులగు నని—$గ_1$.చ. భాసం వీ.శ.ష. 7 నకెరుంగించిన — ఔ.త.య. 8. ననంబరగి పెరుగుచున్నంత — ఆ ఉ ఋ.ఒ ఖ.బ.

189 క. చనుదెంచి శరద్వంతుం, [1]డనవద్యుఁడు దన యపత్యమని వారిని శం
తనున కెఱిఁగించి కృపు న,త్యనుపమ మనుపనీతుఁ జేసె నధికప్రీతిన్.

190 శా. వేదంబుల్ చదివించె భూసురులతో విఖ్యాతిగా నాత్మనం
వేదిం జేసెఁ జతుర్విధం బగు ధనుర్వేదంబు నానాస్త్రవి
ద్యాదాక్షిణ్యముతోడఁ దాన కఱపెం [1]దద్విత్తముల్ [2]సూచి సం
వాదుల్[3]గాఁ దనసందనుం గృపు శరద్వంతుం[4]డు దాంతాత్ముఁడై.

191 వ. అట్టి కృపాచార్యు రావించి భీష్ముండతిభక్తిం బూజించి వానితోడఁ
దగ[1]మనుమల నందఱ విలువిద్య [2]గఱవం బంచిన.

192 క. సవిశేషముగ ధనుర్వే, దవిశారదులైరి కడు జితశ్రములై పాం
డవధృతరాష్ట్రాత్మజయా, దవు లాదిగ రాజసుతులు తత్కృ[1]పు శిక్షన్.

-: ద్రోణాచార్యుల జన్మవృత్తాంతము :-

సం. 1-121-3

193 వ. మఱియు వారల కాచార్యుండైన ద్రోణుజన్మంబును వాని [1]చరిత్రంబును
జెప్పెద వినుమని జనమేజయునకు వైశంపాయనుం డిట్లనియె.

194 క. [1]సద్వినుతచరిత్రుండు భ,రద్వాజుండను మునీశ్వరప్రవరుఁడు గం
గాద్వారమునఁ దపంబు జ,గద్వంద్యుఁడు సేయుచుండె గతకల్మషుఁడై.

189 1. దనసూనుండు — ఖ ; డనఘుడు దనకునపత్యమని — య.

190 1 దద్వృత్తముల్ — పెక్కు ప్రతులు భా.కూ. 2. మెచ్చి—అ భా.సం.
3. మేలననాత్మజుం గృపు — $గ_1$ ల. 4. డుదాత్తాత్ముఁడై — చ.జ. భాసం. పీ.శ.వ.

191 1 మనముల — కొన్ని ప్రతులు 2. గరపించిన — ఊ.ప.వ య.

192 1. పరీక్షన్—వా. కొన్ని ప్రతులు.

193 1. చరితంబు—కొన్ని ప్రతులు.

194 1. సద్వ్రతుల — ల.ఈ.ఊ.వ.

195 సీ. అమ్ముని యొక్కనాఁ డభిషేచనార్థంబు గంగకుఁ జని [1]మున్న కరము[2]లీల
నందు జలక్రీడలాడుచున్న యప్సరస ఘృతాచి య[3]స్సదమలాంగి
పటుపవనాపేత పరిధానయై యున్న యయ్యవసరంబునఁ జూచి యమ్మృగాక్షిఁ
గామించి యున్నఁ దత్కామ[4]రాగంబున నతిరేకమునఁ జేసి[5]యాక్షణంబ

తే. తనకు శుక్లపాతంబైన దానిఁ [6]దెచ్చి, ద్రోణమున సం[7]గ్రహించిన ద్రోణుఁ [8]డనఁగఁ
బుట్టె [9]శుక్రునంశంబునఁ బుణ్యమూర్తి, ధర్మతత్త్వ[10]జ్ఞుఁడగు భరద్వాజ మునికి.

196 వ. మఱియు ననంతరంబ భరద్వాజసఖుండైన పృషతుండను పాంచాలపతి మహాఘోరతపంబు సేయుచు నొక్కనాఁడు దనసమీపంబున వాసంతికా కుసుమాపచయవినోదంబున నున్న యప్సరస మేనక యనుదానిం జూచి మదనరాగంబునఁ జేత[1]స్కందం బయిన దానిఁ దనపాదంబునఁ బ్రచ్ఛాదించిన నందు ద్రుపదుండను కొడుకు మరుదంశంబునఁ బుట్టిన వాని భరద్వాజాశ్రమంబున బెట్టి చని పృషతుండు పాంచాల[2]దేశంబున రాజ్యంబు సేయుచుండె ద్రుపదుండును ద్రోణునితోడ నొక్కట వేదాధ్యయనంబు సేసి విలువిద్యయుం గఱచి యాపృషతుపరోక్షంబునం బాంచాల దేశంబున నభిషిక్తుండయ్యె [3]ద్రోణుండును నగ్ని[4]వేశ్యుండను మహాముని వలన ధనుర్విద్యాపారగుండై తత్ప్రసాదంబున నాగ్నేయాస్త్రం బాదిగా ననేక దివ్యబాణంబులు వడసి భరద్వాజుని యోగంబునఁ బుత్త్రలాభా

195 1. మున్న — ఊ బు.ఓ.ఔ.క ఖ.డ ద.ల 2 లీల — పెక్కు ప్రతులు; వేడ్క — వా.శ.ష.ళ. కొన్ని ప్రతులు. 3. స్సరసిజాక్షి — గ. 4 రాగాతిరేకమ్మునఁ జేసి తత్క్షణమునందు — చ.ల వీ.శ ష. 5. యక్షణంబ — పెక్కు ప్రతులు. 6. చేతి ద్రోణమున — ఈ.ఒ.ఓ.ఔ.గ.డ. భాసం. మ. 7. గ్రహింపుడు, గ్రహించుడు, గ్రహింపంగ — అని పాఠములు. 8 డందు బుట్టె — ఆ.బు ఒ ఓ.ఖ జ.ద.బ.ర. 9. గురునియంశంబున — భాసం వీ. ద్రోణుఁడు శుక్రునంశమున, గురుని యంశమున పుట్టెననుటకు మూలము కాన్పించలేదు. మూలమిట్లున్నది. తతః సమభవద్ద్రోణః కలశే తస్య ధీమతః. 10. జ్ఞుడగు — ఆ.చ భాసం. మ ల.వీ.శ.ష; జ్ఞుడై — వా.ళ కొన్ని ప్రతులు

196 1 స్ఖలనం—ఏ.ఔ.మ. 2 దేశంబున—పెక్కు వ్రాతప్రతులలో లేవు 3 ద్రోణుం

ర్గంబు కృపునిచెలియలిఁ గృపి యనుదాని వివాహంబయి [5]దాని[6]యం దశ్వత్థామ యనుకొడుకుం బడసి యొక్కనాఁడు.

197 క. అనవరతము బ్రాహ్మణులకుఁ, దనియఁగ ధనమిచ్చు జామదగ్న్యుఁడు రాముం
డను జనవాదపరంపర, [1]విని యరిగెను వానికడకు విత్తాపేక్షన్.

198 క. అరిగి మహేంద్రాచలమునఁ, బరమతపో[1]వృత్తి నున్న భార్గవు లోకో
[2]త్తరు భూరికర్మనిర్మల,చరితుని ద్రోణుండు గాంచి సద్వినయమునన్

199 వ. ఏను [1]భారద్వాజుండ ద్రోణుం డనువాఁడ నర్థార్థినై నీకడకు వచ్చితి ననినఁ బరశురాముం డిట్లనియె.

200 చ. కలధనమెల్ల ముందఱ జగన్నుత విప్రుల కిచ్చి వార్ధిమే
ఖలనిఖిలోర్వి యంతయును గశ్యపుఁ డన్మని కిచ్చితిన్ శరం
బులును శరీర[1]శస్త్రములుఁ బొల్పుగ నున్నవి వీనిలోన నీ
వలసినవస్తువుల్ గొను [2]ధ్రువంబుగ నిచ్చెద నీకు నావుడున్.

201 క. ధనములలో నత్యుత్తమ, ధనములు శస్త్రాస్త్రములు ముదంబున [1]వీనిం
గొని కృతకృత్యుఁడ నగుదును, జననుత [2]నాకొసఁగు మస్త్రశస్త్ర చయంబుల్.

డగ్ని—భాసం. వా.శ. మొదలైనవి. 4 వేశుఁడు—వా.పీ.శ చిత్రశాలాప్రతి; దేశ్యుఁడు—శ.ష; వైశ్యుడు—పెక్కు ప్రతులు. వేశుఁడు లేక వేశ్యుఁడు సరియైన రూపముగాఁదోచుచున్నది. 5. దానియందు—ర. ప్రతిలో లేదు. 6 వలన నశ్వ—వ.

197 1. విని ద్రోణుం డరిగె నధికవిత్తాపేక్షన్ – ర

198 1. నియతి – ర 2. త్తర – కొన్ని ప్రతులు.

199 1 భరద్వాజసుతుండ– అని కొన్ని వ్రాఁత ప్రతులు

200 1. వస్త్ర – అ.బు.ఔ.ఖ.య; మస్త్ర – చ.ల.వీ.శ.ష. 2. మువారకయి—ఓ.

201 1. వానిన్ – ర. 2 నాకిమ్ము కరుణ శస్త్రచయంబుల్ – ఈ.ఉ.వ.

202 వ అని పరశురాముచేత [1]దివ్యాస్త్రంబులు ప్రయోగరహస్యమంత్రంబుల తోడం బడసి ధనుర్విద్య[2]యు నభ్యసించి ధనార్థియయి తనబాలసఖుం డైన ద్రుపదుపాలికిం జని యేను ద్రోణుండ నీ[3]బాలసఖుండ సహాధ్యాయుండ నన్నెఱుంగుదే యని ప్రణయపూర్వకంబుగాఁ బలికిన విని యప్పలుకులు[4]విన సహింపక ద్రుపదుం [5]డలిగి యిట్లనియె.

*-: ద్రోణుఁడు ద్రుపదునిచే నవమానితుఁ డగుట. :-*

సం. 1-122-2

203 చ. కొలఁది యెఱుంగ కిట్టి పలుకుల్ వలుకం[1]దగుఁ [2]గాదు నాకనన్
[3]బలుగుఁదనంబునం బలుకఁ జాడియె నీ[4]సఖినంచు బేదవి
ప్రులకు[5]ను ధారుణీశులకుఁ బోలఁగ సఖ్యము సంభవించునే
పలుకక వేగ పొ మ్మకట పాఱుఁడు [6]సంగడికాఁడె [7]యెందునన్.

204 చ ధనపతితో దరిద్రునకుఁ దత్త్వవిదుండగు వానితోడ మూ
ర్ఖునకుఁ బ్రశాంతుతోడఁ గడుఁగ్రూరునకున్ రణశూరుతోడ భీ
రునకు వరూథితోడ నవరూథికి సజ్జనుతోడఁ గష్టదు
ర్జనునకు నెవ్విధంబునను సఖ్యము దా నొడఁగూడ నేర్చునే.

202 1 దివ్యాస్త్ర శస్త్రంబులు సంప్రయోగరహస్యంబులతో — అ.ఊ ఎ.ఓ క.ర ; దివ్యాస్త్రంబులు మంత్రోపదేశ ప్రయోగరహస్యంబులతో— ఖ బ; దివ్యాస్త్ర శస్త్రంబులు మంత్రోపదేశ ప్రయోగరహస్యంబులతో — ఐ ఒ; దివ్యాస్త్రంబులు మంత్రప్రయోగరహస్యంబులతోడం — ఇ; దివ్యాస్త్రంబులు మంత్రోపదేశ సంప్రయోగరహస్యంబులతోడం — డ 2. యభ్యసించునాడు ద్రుపద సహితంబుగా గురుశుశ్రూషానుకూల స్నేహంబులగుటంజేసిధనార్థి — య. 3. బాలసఖుండ — పెక్కు ప్రతులలో లేదు. 4. విన — పెక్కు ప్రతులలో లేదు 5 డలిగి యిట్లనియె — పెక్కు ప్రతులు, డిట్లనియె — భాసం. వా.శ. కొన్ని ప్రతులు. రోషాత్ సంరక్తలోచనః. అని మూలము. పి పి ఎస్. పుట 809.

203 1. దగ — ఈ క ఖ.గ్రి$_1$.చ.వీ.శ ష 2 గాద — అ ఆ ఐ ఓ ఔ జ.ట త.ర వ. 3 బలుచ — గ.గ్రి$_1$.చ.జ డ త ల.వీ శ ష. 4. సఖునంచు — అ ఆ.ఈ.ఉ ఎ.ఒ క. ఖ.గ జ త.ద.ప.బ ; సఖుడంచు — ఊ ; సఖినంచు — వా పీ. కొన్ని ప్రతులు 5 ధరాధినాథులకు – బు న వ 6 సుజ్జుడు – అ.ఊ ; ఇచ్చట సుగ్గడి, సుగ్గట మున్నగు రూపములు కన్పించు చున్నవి. అర్థము చింత్యము. 7. యయ్యెడన్ — ఈ.ఉ గ్రి$_1$ చ ట ల వీ.శ.ష.

205 క. సమశీల[1]శ్రుతయుతులకు, సమధనవంతులకు సమసుచారిత్రులకుం
దమలో సఖ్యమును [2]వివాహముననగుఁ గాకగునె రెండు నసమానులకున్.

206 వ. మఱి యట్లుంగాక రాజులకుఁ గార్యవశంబునం జేసి మిత్రామిత్ర [1]సంబంధంబులు సంభవించుం [2]గావున మాయట్టి రాజులకు మీ[3]యట్టి [4]పేదపాఱువారలతోఁ గార్యకారణంబైన సఖ్యం బెన్నండును గానేర దని ద్రుపదుం డైశ్వర్యగర్వంబు[5]న మెచ్చక పలికిన విని ద్రోణుం డవమానజనితమన్యుఘూర్ణమానమానసుండయి యెద్దియుం జేయునది నేరక పుత్త్రకళత్రాగ్నిహోత్రశిష్యగణంబులతో హస్తిపురంబునకు వచ్చె నంత నప్పుర[6]బహిరంగణంబున ధృతరాష్ట్రపాండునందను లందఱుఁ గందుకక్రీడాపరులయి, వేడుకతో నాడుచున్నంత కాంచనకందుకం బొక్కనూతం బడిన.

207 ఆ. నీరిలో[1]నఁ [2]దోఁచు తారక ప్రతిబింబ, మొక్కొ యనఁగ వెలుఁగుచున్న [3]దాని
రాచ[4]కొడుకు లెల్లఁ జూచుచునుండిరి, దానిఁ బుచ్చుకొను విధంబు లేక.

208 వ. అట్టియవసరంబున.

205 1. వ్రత – ఆ.గ్రి.చ.శ ష ; శ్రుతి – ఈ ఊ.ఐ ల.పీ 2. వివాదము – ఋ.క ఖ ప.బ.ల.

206 1 సంభవంబులు — అ చ ల శ ష 2 గాక — అ ఉ.ఊ ఓ.ట. 3. బోటి — ప.చ.పీ.శ.ష. 4 పేదపారులకు — మ, కొన్నిటిలో పారు శబ్దము లేదు 5. న వెగ్గులాడి మెచ్చకపలికి — ఔ త 6 బాహ్యంబున — ఐ.ఒ.ఓ.ఔ ఖ చ.డ.త ప బ.వీ.శ ష; బాహిరంబున — ఆ.

207 1. నఖండ — న; నకాండ – ఈ ఉ ఎ ఒ.ఔ.క జ.ట.త.ర. 2. గాఢ – ఓ.య. 3. యపుడు — వా.శ. కొన్ని ప్రతులు ; దాని — పెక్కు ప్రతులు. 4. కొమరులెల్ల – భాసం స.

-: ద్రోణుఁడు హస్తిపురంబునకు వచ్చుట :-

సం. 1–122–14

209 క. నానావిధశరశరధుల,తో నున్నతచాపధరుఁడు ద్రోణుఁడు వారిం
గానఁ జనుదెంచి యంతయుఁ, దా నప్పు డెఱింగి రాజతనయుల కనియెన్.

210 చ. భరతకులప్రసూతులరు భాసురశస్త్రమహాస్త్రవిద్యలం
గరము ప్రసిద్ధులై పరగు గౌతమశిష్యుల రిట్టి [1]మీకు దు
ష్కరముగ నూతిలోఁ బడిన కాంచన[2]పిండు గొనంగనేర కొం
డొరుల మొగంబు చూచి నగుచుండఁగఁ జన్నె యుపాయ [3]హీనతన్.

211 వ. దీని బాణపరంపరం జేసి [1]పుచ్చి యిచ్చెదఁ జూడుఁ డీవిద్య యొరులెవ్వరు నేర రని ద్రోణుం డొక్కబాణం బభిమంత్రించి [2]దృష్టిముష్టిసౌష్ఠవంబు లొప్ప నక్కందుకంబు [3]నాటనేసి దానిపుంఖంబు మఱియొకబాణంబున నేసి తత్పుంఖం బొండొకబాణంబున నేసి వరుసన బాణరజ్జువు గావించి దానిం దిగిచికొని యిచ్చినం జూచి రాజకుమారులెల్ల [4]విస్మయంబంది ద్రోణుం దొడ్కొని చని భీష్మున కంతయు నెఱింగించిన నాతండును

212 క. ఆసన్నపలితు ననఘు శ,రాసనగురు భూరిసత్త్వు [1]నసితకృశాంగున్
[2]భూసురవరు ద్రోణు గుణో,ద్భాసితు వినినట్లు చూచి పరమప్రీతిన్.

210 1. మీరు — బొ.ఖ.గు.త.తి.ద 2 వీట — వా.శ. కొన్ని ప్రతులు. మూలమున వీట అనియె కలదు క్రీడంతో వీటయాత్ర వీరాఃపర్యాచరన్మదా ; పిండు — భాసం. వీ శ.ష. మున్నగు పెక్కు ప్రతులలో కలదు 3. శూన్యతన్ — భాసం.

211 1. పుచ్చుకొని మీకిచ్చెద' — గ$_1$ వీ శ ష. పెక్కు ప్రతులు. 2. దృఢ — ఆ.బొ త. 3. గాఢ — అ. 4. విస్మయపడి — ఋ.ఐ.ఒ ట.డ ద.

212 1. నధిక — ఆ.మ; నశనకృశాంగున్ — ర. 2. భాసురయశు — ఉ.క. జ.ట; భాసితయశు — ఓ.

213 క. ఎందుండి వచ్చి తిందుల, కెందుండఁగ నీకు నిష్ట మెఱిఁగింపుము స
ద్వందిత యని యడిగిన సా,నందుఁడు ద్రోణుండు భీష్మునకు నిట్లని యెన్.

214 వ. [1]ఏను ద్రోణుండను వాఁడ భరద్వాజ పుత్త్రుండ నగ్ని[2]వేశ్యుండను మహాముని వరునొద్ద బ్రహ్మచర్యాశ్రమంబున వేదాధ్యయనంబు సేసి ధనుర్వేదం బభ్యసించుచున్న నాఁడు పాంచాలపతియైన పృషతుపుత్త్రుండు ద్రుపదుం డను వాఁడు నాకిష్టసఖుండయి యెల్లవిద్యలు గఱచి యేను పాంచాల[3]విషయంబునకు [4]రాజయిననాఁడు నా యొద్దకు వచ్చునది నారాజ్యభోగంబులు నీవు ననుభవింప నర్హుండ వని నన్నుఁ బ్రార్థించి చని [5]పృషతు పరోక్షంబునఁ దద్దేశంబునకు రాజయి యున్న నేను గురు నియుక్తుండనై గౌతమిం బాణిగ్రహణంబు సేసి యిక్కుమారు నశ్వత్థామ నధిక[6]తేజస్వి నాత్మజుం బడసి ధనంబులేమిం గుటుంబ[7]భరణంబునం దసమర్థుండ నయి యుండియు.

215 క. పురుషవిశేషవివేకా, పరిచయులగు ధరణిపతులపాలికిఁ [1]బోవం
బరులందు [2]దుష్ప్రతిగ్రహ, [3]భర మెదలో రోసి ధర్మపథమున నున్నన్.

216 క. [1]ధనపతుల బాలురు ముదం,బున [2]నిత్యముఁ బాలుద్రావఁ బోయిన నస్మ
త్తనయుండు వీఁడు బాల్యం,బున నేడ్చెను బాలు[3]నాకుఁ బోయుం డనుచున్.

214 1 ఏనుద్రోణుండను వాఁడ భరద్వాజ పుత్త్రుండ — $గ_1$.చ. భాసం ల పీ.శ.ప. ఏనగ్ని వేశుండను — వా కొన్ని ప్రతులు. 2. వేశ్యుఁడు — భం, పి.పి,ఎస్. ప్రతులు, వేశుఁడు — చిత్రశాలా ప్రతి; వా.శ, దేశ్యుఁడు — భాసం శ ష 3. దేశంబునకు — పెక్కు ప్రతులు 4 రాజనయిననాడు — య.వా.శ. 5 పృషదు — ఉ.ఋ.ఓ ఖ.గ చ.డ.ద.బ.య ర శ.ష 6. తేజు — అ,ఈ.ఉ.ఊ.ఋ ఐ.ఒ.ఓ.ఖ.జ.ట.డ.ద ప బ భాసం య; తేజోమయు — ఆ.ర 7. భారంబు — ఆ ఒ.జ ట.డ.త బ.మ.ర.

215 1. నరుగన్ — ఆ. 2 దుష్పరిగ్రహము — ఎ.ల 3. భరమునకుఁరోసి — య.

216 1. ధనపతుల బాలకులు ముదమున — పెక్కు ప్రతులు. 2. నిచ్చలు — ఔ.త.బ 3. తనకు — $గ_1$.చ.జ త ల.పీ.శ.ష, త్రావ — అ.ఔ ర.

217 వ. దాసింజూచి దారిద్ర్యంబునకంటెఁ గష్టం బొండెద్దియు లేదు దీని నాబాల సఖుండగు పాంచాలుపాలికిం బోయి [1]పాచికొందు నాతండు దన దేశంబున [2]కభిషిక్తుండుగాఁ బోవుచుండి నన్నుఁ రాఁబనిచి పోయె.

218 మత్తకోకిలము. వేఁడు టెంతయుఁ గష్టమైనను వేఱు లేని సుహృజ్జనున్
వేఁడికో లుచితంబ కావున వేడ్కతోఁ జని సోమకుఁ
వేఁడినఁ ధన[1]మొపఁడేనియు వీని[2]మాత్రకు నాలుగేఁ
పాఁడి[3]కుఱ్ఱుల నీఁడె వీనికిఁ బాలు ద్రావుచు నుండఁగఁ

219 వ. అని నిశ్చయించి ద్రుపదు [1]నొద్దకుం బోయి నన్నెఱింగించిన నాతండు దన రాజ్యమదంబున నన్నును దన్నును నెఱుంగక యేను [2]రాజను నీవు [3]పేదపాఱుండవు నాకును నీకును నెక్కడి సఖ్యంబని పలికిన వానిచేత నవమానితుండనయి వచ్చితినని ద్రోణుండు దన వృత్తాంతంబంతయుఁ జెప్పిన.

220 క. విని రోయు [1]తీఁగ గాళ్ళం, [2]బెనఁగెం దాననుచుఁ బొంగి భీష్ముఁడు ద్రోణుఁ
ఘనభుజు నభీష్ట[3]పూజా,ధన[4]దాన[5]విధానముల ముదంబునఁ దనిపెన్.

221 వ. మఱియును.

217 1 బాపికొందు — అ ఐ క.త భాసం. వీ శ; బాపుకొందు — $గ_1$ చ.ద శ.ష.
2. కుంజనుచుండి — ఈ.ఉ.ఎ క

218 1 మీయఁడేనియు — భాసం. వీ; మివ్వఁడేనియు — $గ_1$.చ.ద.శ.ష ; మియ్యఁడెనియు — ఓ.వ 2 మాత్రము — $గ_1$ భాసం.శ ష కొన్ని ప్రతులు 3. కుర్రల — పెక్కు ప్రతులు

219 1 పాలికిం — అ 2 రాజు — ఓ క.గ జ.త.య ; రాజను — భాసం. ర.శ రాజును — వా 3. వేదవిప్రుండవు, పేద బ్రాహ్మణుండవు — కొన్ని పాఠములు.

220 1 తీగె — కొన్ని ప్రతులు 2. బెనగెగదాయనుచు — చ.ల.వీ శ.ష.స. 3. పూజల — అ ఖ.న. భాసం వీ శ.ష.స 4. ధాన్య — పెక్కు ప్రతులు. 5 వితానముల — ఐ; నిధానముల — ఔ

-: భీష్ముఁడు కురుపాండుకుమారులను ద్రోణుని గురువుగా నియమించుట. :-

సం. 1-122-40

222 చ. [1]మనుజుల నెల్లఁ జూపి మతిమంతుఁడు శాంతనవుండు వీరిఁ జే
కొని గురువృత్తిమైఁ గఱపు ఘోరశరాసన విద్యలెల్లఁ బెం
పున జమదగ్నిసూనుఁడును బోలఁడు నిన్నని యిందు [2]విల్లునే
ర్పున [3]నయనైపుణంబునను భూరిపరాక్రమ [4]గర్వసంపదన్.

223 వ. అని కుమారులనెల్లం జూపి ద్రోణునకు శిష్యులంగా సమర్పించిన ద్రోణుండును వారలం జేకొని యందఱ కిట్లనియె.

224 తే. అస్త్రవిద్యలు గఱచి నాదైన యిష్ట, [1]మొగిన [2]తీర్పంగ నిందెవ్వఁ డోపు ననినఁ
బాయ మొగమిడి కౌరవుల్ పలుకకుండ, నేను[3]దీర్చెద నని [4]పూనె నింద్రసుతుఁడు.

225 వ. ఇట్లుదన యిష్టంబు [1]దీర్పం బూనిన యర్జును నాచార్యుం డతిస్నేహంబునఁ గౌఁగిలించుకొని కరంబు సంతసిల్లి కుమారుల కెల్ల విలువిద్యఁ గఱపుచున్న [2]నానాదేశంబులంగల రాజపుత్త్రులెల్లవచ్చి వారి[3]తోడఁ గలసి కఱచుచుండిరి మఱియు సూతపుత్త్రుఁడయిన రాధేయుండును ధనుర్విద్యాకౌశలంబున నర్జునితో[4]డ మచ్చరించుచు దుర్యోధనపక్షపాతియై యుండెనంత.

222 1 మనుజుల — కొన్ని వ్రాతప్రతులు. 2. వింటి — అ ప్రా. 3 రణ — ఖ. 4 బాహుసంపదన్ — అ జౌ.గి$_1$.చ త ల.వి.శ ష ; సర్వ — ఋ డ ప.బ.య

224 1 మొనర — గ న.య 2 జేయంగ — న.య 3 సేయుదు, జేయుదు — కొన్ని ప్రతులు ; జేసెద — ఖ న. 4. పల్కె — ఖ.గి$_1$ చ మ. ల.వి.శ.ష.స.

225 1. చేయం, సేయం — కొన్ని ప్రతులు. 2. నానాదేశంబుల రాజపుత్రులు — కొన్ని ప్రతులు, నానా దేశ రాజకుమారులెల్లవచ్చి — గి$_1$ చ.పి శ.ష. 3. తోడన — పెక్కు ప్రతులు. 4. డ — పెక్కు ప్రతులలో లేదు

226 క. నరుఁ డస్త్రశస్త్రవిద్యా, పరిణతి నధికుఁడయి వినయపరుఁడయి శశ్వ
ద్గురుపూజాయత్నంబునఁ, బరగుచు సంప్రీతుఁ జేసె భారద్వాజున్.

227 వ. అయ్యర్జునుతోడి విద్యామత్సరంబునఁ జీఁకటి నాతండేయ నేరకుండ వలయునని తలంచి యశ్వత్థామ రహస్యంబున నన్నసాధకుం బిలిచి యెన్నండును నరునకు నంధకారంబునఁ గుడువం బెట్టకు[1]మీ యని పంచిన వాఁడును దద్వచ[2]నానురూపంబు సేయుచున్న నొక్కనాఁటి రాత్రియందు.

228 ఉ. వాసవనందనుండు గుడువం గుడువం బటుమారుతాహతిం
జేసి చలించి దీపశిఖ చెచ్చెరఁ [1]బాయుడు భోజనక్రియా
భ్యాసవశంబునం గుడిచి పన్నుగ నిట్టుల విద్యలెల్ల న
భ్యాసవశంబునం బడయ భారము లేదని నిశ్చితాత్ముఁడై,

229 క. పాయక చీఁకటి యందును, నేయం[1]గా నభ్యసించు నిట్టియెడం గాం
తేయు ధనుర్జ్యాధ్వని విని,ధీయుక్తుఁడు ద్రోణుఁ డరుగుదెంచి [2]ముదమునన్.

230 సీ. ఆతని యస్త్రవిద్యా[1]భియోగమునకుఁ బ్రియశిష్యవృత్తికిఁ బెద్దమెచ్చి
యన్న ధనుర్ధరు లన్యులు నీకంటె నధికులు [2]గాకుండునట్లు గాఁగఁ
గఱపుదు విలువిద్య ఘనముగా నని పల్కి ద్వంద్వసంకీర్ణయుద్ధముల దెలుఁగు
రథమహీవాజివారణములపై నుండి దృఢచిత్రసౌష్ఠవస్థితుల[3]నేయ

227 1 మనిపంచిన — పెక్కు ప్రతులు. 2 నప్రకారంబు — ఐ ట ; నమార్గంబున — అ ఐ ఓ.ఔ ఖ డ త.ద ర.స.

228 1 బోవుడు — వా.శ ; బాయుడు — పెక్కు ప్రతులు.

229 1. దానభ్యసించె — పెక్కు ప్రతులు. 2. రయమునన్ — $గ_1$.చ భాసం. ల.వీ.శ.ష.

230 1 తిశయమునకు — ఋ.ష. 2 లేకుండు — పెక్కు ప్రతులు. 3. మెఱసి —

తే. బహువిధవ్యూహభేదనోపాయములను. [4]సంప్రయోగ రహస్యాతిశయము గాఁగఁ
గఱపె నర్జునుఁ[5]దొంటి భార్గవుఁడు వింట నిట్టి[6]డే యని పొగడంగ నెల్ల జనులు

-: ఏకలవ్యుం డనువాఁడు ద్రోణు నారాధించి విలువిద్య గఱచుట :-

సం. 1-123-10

231 వ. మఱియు గదాకార్ముకప్రాసాసితోమరకుంతశక్త్యాదివివిధాయుధంబుల యందును గుమారుల నందఱ జితశ్రములం జేయుచున్న ద్రోణాచార్యుల [1]మహాప్రసిద్ధి విని హిరణ్య[2]ధన్వుండను నెఱుకురాజుకొడు కేకలవ్యుండనువాఁడు ధనుర్విద్యాగ్రహణార్థియయి వచ్చిన వాని నిషాద [3]పుత్త్రుండని శిష్యుంగాఁ [4]జేకొనకున్న వాఁడును ద్రోణుననుజ్ఞ వడసి చని వనంబులోన.

232 తే. వినయమున ద్రోణురూపు మన్నున నమర్చి, దాని కతిభక్తితోడఁ బ్రదక్షిణంబుఁ
జేసి మ్రొక్కుచు సంతతాభ్యాసశక్తి, నస్త్రవిద్యా[1]రహస్యంబు లర్థిఁ బడసె

233 క. [1]ఇట పాండవ కౌరవులొ, క్కొట నందఱు గురుననుజ్ఞఁ గొని మృగయాలంపటులై వనమున కరిగిరి, పటుతరజవ సారమేయభటనివహముతోఁ.

---

గి$_1$ చ.శ ష 4 సంప్రయోగోపసంహరసరణిగాగ — మ. 5. దొల్లి — స
6. వాడని — ఊ.ఋ.ఓ.జ.ద.మ.ర.

231 1. మహా — క.ఙ.ర వ. ప్రతులలో లేదు; మాహాత్మ్యంబు విని — మ. 2 ధను వను నెరుకు — అ.ఆ.ఈ.ఊ ఎ.క.త.ప.య ర , ధనుండను నెరుకు — ఋ ఐ ఒ. ఓ ఔ.గ.ద. మూలము. హిరణ్యధనుషస్సుతః, భండార్కరు — 550 పుట. చిత్ర శాల పి.పి.ఎస్. ప్రతులు కూడ 3. పుత్రుగా నెరింగి శిష్యుంగా — ఓ.గి$_1$.చ.వ. పీ శ.ష. 4. జేకొన నొల్లకున్న — ఓ గి$_1$.చ.వ.పీ.శ ష

232 1. విశేషంబు — అ.

233 1. ఇటఁబాండవ — గి$_1$.పీ.శ.ష.

234 వ. [1]ఇట్లరిగి వనంబులోఁ గ్రుమ్మరుచున్న నందొక్క భటునికుక్క తోడుదప్పి పఱచి యొక్కెడ నేకతంబ యేయుచున్న నేకలవ్యు సమీపంబున [2]మొఱింగిన నయ్యేకలవ్యుండు [3]దాని ముఖంబునం [4]దేడుబాణంబు [5]లొక్కటఁ దొడిగి యక్కజంబుగా నతిలాఘవంబున [6]వాఁడేసిన నది శరపూరిత[7]ముఖంబయి కురుకుమారుల యొద్దకుం [8]బాఱిన దానిం జూచి విస్మయంబంది యక్లేసినవాఁడెవ్వఁడో యని రోయుచు వచ్చువారు ముందఱ

235 ఉ. తేజితబాణహస్తు దృఢదీర్ఘమలీమసకృష్ణదేహుఁ [1]గృ
ష్ణాజినవస్త్రు నస్త్ర [2]విషయాస్తవిషాదుఁ నిషాదుఁ జూచి యా
రాజకుమారు లందఱుఁ బరస్పరవక్త్రవిలోకనక్రియా
వ్యాజమునం దదీక్షణనివారితులై రతిమత్సరంబునన్.

236 వ. అక్కుమారులు వాని [1]శరలాఘవంబునకు మెచ్చి నీవెవ్వండ వెవ్వ[2]రిచేత విలువిద్యఁ గఱచి తని యడిగిన [3]వారికి [4]నయ్యేలు [5]కిట్లనియె.

237 క. [1]వినుఁడే హిరణ్యధన్వుం,డనువనచర[2]నాథు[3]కొడుక [4]నాచార్యుఁడు ద్రో ణు[5]నకున్ శిష్యుఁడ నెందును, ననవద్యుఁడ నేకలవ్యుఁ డనువాఁడ మహిన్.

234 1 మఱియు నందొక్క — వా శ. కొన్ని ప్రతులు 2 మొరిగిన — $గ_1$.శ ష; మొఱిగిన— భాకూ 3. నకు — కొన్ని ప్రతులు 4. దేను — ఊ ఓ ఔ ఖ. ట.త.న.ప.బ మూలము. సప్తశరాన్ ముఖే. 5. లొక్కయమ్మేసినట్లక్క జముగ — $గ_1$ శ ష. కొన్ని ప్రతులు 6 నాటనేసిన — డ మ 7. ముఖయై — పెక్కు తాళపత్ర ప్రతులు. 8. బరతెంచిన — ఋ.ఐ ఒ జ.ర; బోయిన—ఆ.ప.మ

235 1. సింహాజిన — న 2 విషయాస్త — ఐ.ఒ.గ. భాసం; విషయాస్త — వా. మున్నగు ప్రతులు.

236 1 కరలాఘవము -- మ య. 2 నిచేత — మ. 3. వారికి — మ లో లేదు 4 నయ్యేకలవ్యుం డి — గ.న. 5 కయిట్లనియె — య.

237 1. వినుడేను హిరణ్యధనుం — అని పెక్కు తాళపత్ర ప్రతులు. 2. నాథను తుడ — ఔ త , నాథుసుతుడ — న. 3. కొడుకు — చ య. 4. నార్యుం డగుద్రో — మ. 5 నకున్ప్రియశిష్యుడనే — అ మ.య.

238 వ. అనిన విని కురుకుమారు[1]లందఱు మగుడివచ్చి ద్రోణున[2]కంతయుఁ జెప్పిరంత నర్జునుం[3]డేకాంతంబ యొక్కనాఁ డాచార్యున కిట్లనియె.

239 క. విలువిద్య నొరులు నీకగ్గలముగ లేకుండ [1]నిన్నుఁ గఱపుదునని మున్
బలికి[2]తిరి నాక కాదీ, త్రిలో[3]కముల కధికుఁ జూచితిమి యొక [4]యెఱుకున్.

240 క. నాకంటెను మీకంటెను, లోకములో నధికుఁ డతిబలుండు ధనుర్వి
ద్యాకౌశలమున నాతఁడు, మీకుం బ్రియశిష్యుఁ[1]డఁట [2]యమిథ్యా
వచనా.

241 వ. అనిన విని ద్రోణుం [1]డదరిపడి వానిం[2]జూతము రమ్మని యర్జునుం దోడ్కొని యనవరత[3]శరాసనాభ్యాసనిరతుం[4]డయి యున్న యేకలవ్యు కడ [5]కేఁగిన [6]నెఱింగి వాఁడు నెదురు పఱతెంచి ద్రోణునకు [7]మ్రొక్కి తనశరీరంబు [8]సర్వ[9]స్వంబును నివేదించి యేను మీశిష్యుండ మిమ్మారాధించి [10]మీప్రసాదంబున నివ్విలువిద్యఁ గఱచితి నని [11]కరంబులు మొగిచియున్నం జూచి ద్రోణుం డట్లేని మాకు గురుదక్షిణ యిమ్మనిన [12]సంతసిల్లి వాఁడిట్లనియె.

238 1 అందరు — పెక్కు ప్రతులలో లేదు. 2. అంతయు — పెక్కు ప్రతులలో లేదు 3 డేకాంతంబున — ఖ.చ.ద.బ.శ.ష ; డొక్కనాడే కాంతంబున - గ.వీ.

239 1 నన్ను — ఓ ఔ.ట.త.ను ర.వ. 2. తివి — అ ఆ ఈ.ఊ వ. 3 కములనధికు — ల.ఒ.గ.తి.బ. 4 ఎరుకన్ — ఐ ఒ.గ.ట ద బ.

240 1 డట — ఒ ప్రౌ ఖాసం. పీ.ష. 2 సమీహితబుద్ధిన్ — య

241 1. దుదరిపడి — త.బ ఖా.కూ.మ. 2. జూపుమనియర్జు — ము. 3. శరాభ్యాస — పెక్కు తాళపత్ర ప్రతులు. 4 డయిన — ఎ ఖ.న. 5. పగిన — $గ_1$; పగినంగని — ఔ త. 6 నెఱింగి — ఔ గ.జ.త పర లలో లేదు. 7 దండప్రణామంబు లాచరించి — అ.ఇ. (చేసి) ము 8 వస్త్ర[9]శస్త్ర[9]ంబులు సర్వ — పెక్కు ప్రతులు. 9. సంపదలును — అ.ఈ.ఉ.ఊ క. 10. యివ్విలువిద్య — వా. కొన్ని ప్రతులు 11. కరకమలంబులు — కొన్ని ప్రతులు 12. సంతోసిల్లి — డ.బ స.

242 క. [1]ఇది దేహం[2]బిది యర్థం, [3]బిది నా పరిజనసమూహ మిన్నిటిలో నె
య్యది మీకిష్టముదానిన, వందె[4] మొదవంగ నిత్తుఁ గొనుఁడ మోఘం బనినన్.

243 క. [1]నెమ్మిని నీ దక్షిణహ, స్తమ్మున పెనువ్రేలు దునిమి దక్షిణ యిమ్మి
ష్టమ్మి[2]ది నాకనవుడు విన,యమ్మున వాఁడిచ్చె [3]దాని నాచార్యునకున్.

244 తే. దక్షిణాంగుష్ఠ మిచ్చిన దానఁజేసి, బాణసంధానలాఘవ[1]భంగ మయిన
నెఱుకు విలువిద్య [2]కలిమికి హీనుఁడయ్యెఁ, బార్థున[3]కును మనోరుజ
పాసెనంత.

245 క. విలువిద్య [1]నొరులు నీక, గ్గలముగ లేకుండ నిన్నుఁ గఱపుదు నని మున్
బలరిపుసుతునకుఁ బలికిన, పలుకప్పుడు గురుఁడు సేసెఁ బరమార్థముగన్.

246 మత్తకోకిలము. భూపనందను లివ్విధంబున [1]భూరిశస్త్రమహాస్త్రవి
ద్యోపదేశపరి[2]గ్రహస్థితి నున్న నందఱ యందు వి
ద్యోపదేశము దుల్యమైనను నుత్తమోత్తముఁడయ్యె వి
ద్యాపరి[2]శ్రమ[3]కౌశలంబున దండితారి నరుం డిలన్.

242 1 2.3. ఇదె ఇదె ఇదె యని గ1 వా శ; ఇది — మూ. సం. పెక్కు ప్రతులు.
4 మొందగ — ఋ.ఖ.న; మొనరగ — అ ఈ ఊ ఎ
బ.మ. య.ల

243 1. నెమ్మిన్నీ — ర స. 2. దియనాకునన — ఆ.మ వ స. 3. నప్పుడా — అ;
దునిమి — ఓ ట.డ; నదియు — ఔ.త.

244 1. బంధమైన — స 2 గ్రిడికి — న.స; నేర్చియు — ప; గరచియు —
ఎ.గ. 3 కునుమనోరుజ పాసెనంత - ఖ.జ; కుమనోరుజయును బాసెనంత —
భాసం. వా శ కొన్ని ప్రతులు.

245 1. నొరుల — ఒ ఓ.య.

246 1. బూని — అ ఆ.ఈ.ఋ.ఐ ఒ.గ.డ య ర.వ. 2. గ్రహ — గ ట. 3 కౌతు
కంబున — క.

247 క. అనిలాత్మజుబలమును వ,ర్జును కార్ముక కౌశలంబు [1]శూరగుణంబుల్
మనమున సహింప నోపక, [2]వసరుచు ధృతరాష్ట్రసుతులు [3]వందిరి తమలోన్.

—: ద్రోణుఁ డస్త్రవిద్యం దనశిష్యులఁ బరీక్షించుట :—

సం. 1-123-15

248 వ. అక్కుమారుల ధను[1]ర్విద్యాకౌశలం బెఱుంగ వేఁడి యొక్కనాఁడు ద్రోణుండు [2]కృత్రిమంబయిన భాసం బను పక్షినొక్కవృక్ష శాఖాగ్రంబున లక్ష్యంబుగా [3]రచియించి దాని నందఱకుఁ జూపి మీ మీ ధనువుల బాణంబులు సంధించి నావంచిన యప్పుడ యిప్పక్షితలఁ [4]దెగ నేయుండే [5]నొకళ్ళొకళ్ళన పంచెదనని ముందఱ ధర్మనందనుం బిలిచి యీ వృక్ష శాఖాగ్రంబున నున్న పక్షి నిమ్ముగా [6]నీక్షించి మద్వచనానంతరంబున శరమోక్షణంబు సేయు మనిన నతండును వల్లెయని గురువచనంబు సేసి యున్న నయ్యుధిష్ఠిరునకు ద్రోణుం డిట్లనియె.

249 తే. వృక్షశాఖాగ్రమున నున్న పక్షి[1]శిరము, దెల్లముగఁ జూచితే [2]మహీవల్లభుండ
యనిన నిమ్ముగఁ జూచితి ననిన వెండియును గురుఁడు ధర్మజున కిట్టు లనియెఁ బ్రీతి.

250 క. జననుత [1]యాచార్యమానిని నన్నును మఱి నీభ్రాతృవరులనుం జూచితె నీ
వనవుడుఁ జూచితి నన్నిటి, ననఘా వృక్షమున నున్న యవ్విహగముతోన్.

247 1 శూరగుణంబున్ — కొన్ని ప్రతులు; శూరత్వంబున్ — ఔ.త. 2. వసరిరి — చ వీ.శ ష స. 3. వందురి — పెక్కు ప్రతులు. ఈ పాఠమున వసరిరి సమాపక క్రియయగును.

248 1 (ధను) విద్యాకౌశలంబు — ఊ.ఔ.ఖ.త. 2. కృత్రిమంబయిన — కొన్ని ప్రతులు. 3. నిర్మించి — ట 4. త్రెవ్వ — ఔ. 5 నొక్కొక్కళ్లన — అ.ఊ.ఋ.ఒ క.ట ర ; నొక్కొక్కనిం — చ.ద.వ.భాసం య.వీ.శ.ష. నొక్కొక్కరున — న. 6. నిరీక్షించి — ఖ గ.జ న.బ.

249 1. నిపుడు — కొన్ని ప్రతులు. 2. మహీవల్లభుండ — శర.

250 1 యీ — కొన్ని ప్రతులు

251 వ. అనిన విని ద్రోణుండు ధర్మజుం బదరి నీదృష్టి చెదరె [1]నీవు దీని నేయ [2]నోపవు పాయుమని యివ్విధంబున దుర్యోధనాదులైన ధార్తరాష్ట్రు లను భీమసేననకులసహదేవులను నానాదేశాగతులయిన రాజపుత్త్రు లను గ్రమంబున నడిగిన వారలు ధర్మనందనుచెప్పినట్ల చెప్పిన నందఱ నిందించి పురందరనందనుం బిలిచి వారికడిగినయట్ల యడిగిన నాచార్యు నకు నర్జునుం డిట్లనియె.

252 క. పక్షి[1]శిరంబు దిరంబుగ, నీక్షించితి నొండు గాన [2]నెద్దియు ననినన్ లక్షించి యేయుమని సూ, క్ష్మేక్షణు ద్రోణుండు పనిచె నింద్రతనూజున్.

253 క. గురువచనానంతరమున, నరుఁ డప్పుడు శరవిమోక్షణము సేయుఁడుఁ జె చ్చెరఁ బక్షిశిరము దెగి త,ద్ధరణీరుహశాఖనుండి [1]ధారుణిఁ [2]బడియెన్.

254 వ. ఇట్లు క్రమంబునఁ గృత్రిమపక్షి [1]తలఁ దెగనేసిన యర్జును [2]నచలితదృష్టికి లక్ష్య[3]వేధిత్వంబునకు మెచ్చి ద్రోణుం డాతనికి ధనుర్వేదరహస్యంబు లుపదేశించె నంత.

—: అర్జునుఁడు ద్రోణుని మొసలి నుండి విడిపించుట :—

సం. 1-123-68

255 క. మానుగ రాజకుమారుల, తోనొక్క[1]ట నొక్కనాఁడు ద్రోణుఁడు గంగా [2]స్నానార్థమరిగి యందు మ, హానియమస్థుఁడయి [3]నీళ్ళ నాడుచు [4]నున్నన్.

251 1. నీవేయనోపవు — య.ర 2 నేరవు — ఔ.త.

252 1. శిరంబ — ఎ. 2. నెవ్వియు — కొన్ని ప్రతులు.

253 1. ధరణిన్ — ట డ ల. 2. ద్రెళ్ళెన్ — ఔ త.

254 1. శిరంబు — క $గ_1$ చ.త.ద. భాసం. ల.పీ.శ.ష. 2. దృష్టికి—ఉ.వ. 3. భేదిత్వంబు నకు — ఓ.గ.ర ; వేదిత్వంబునకు — పెక్కు ప్రతులు.

255 1. టయొక్కనాడు — అ.ఆ.ఈ ఋ.ఖ.జ.ట.న. 2. స్నానమునకరిగి — వు. 3. నీళ్లులాడుచు — ఆ; నీటనాడుచు... నున్నన్ — ల.స. తీర్థమాడుచు — స; జలములాడుచు — ఖ న, నీళులాడుచు — ఐ స. 4. నుండన్ — త మ

256 క. వెఱ[1]చఱవ [2]నీరిలో [3]నొ,క్కౌఱగా నొక మొసలి చూడ్కికి నగోచరమై
పఱతెంచి కుంభసంభవు, [4]చిఱు[5]దొడ వడిఁ బట్టికొనియె శిష్యులు
[6]బెదరన్.

257 క. దాని విడిపింప ద్రోణుఁడు, దా నపుడు సమర్థుఁడయ్యు దడయక పనిచెన్
దీని విడిపింపుఁ డని సృప,సూనుల శరసజ్యచాపశోభితకరులన్.

258 శా. [1]దానిన్ నేరక యందఱున్ వివశులై తారున్న [2]సన్నీరిలోఁ
[3]గానంగాని శరీరముంగల మహోగ్రగ్రాహమున్ గోత్రభి
త్సూనుం డేనుశరంబులన్ [4]విపులతేజుం డేసి శక్తిన్ మహా
సేన[5]ప్రఖ్యుఁడు ద్రోణుజంఘ విడిపించెన్ విక్రమం బొప్పఁగన్.

259 వ అమ్మహోగ్రగ్రాహంబు [1]పార్థబాణపంచక[2]విభిన్నదేహంబయి పంచ
త్వంబుఁ [3]బొందినం జూచి ద్రోణుం డర్జునుధనుఃకౌశలంబునకుఁ దన[4]యం
దతి[5]స్నేహంబునకు మెచ్చి వీనిచే ద్రుపదుండు బంధుసహితంబు
[6]పరాజితుం డగునని తనమనంబున సంతోషించి వానికి ననేకదివ్య
బాణంబులిచ్చెనని యర్జును[7]కొండుకనాఁటి పరాక్రమగుణసంపదలు
వైశంపాయనుండు జనమేజయునకుం జెప్పెనని.

256 1. చరచి — అ బొ.గ జ.త ద్వి య. 2. నీటి — శ.ద్వి. 3. నుక్కొఱగాన్ —
ద్వి.ల; నుక్కిఱిగాన్ — ద్వి; నక్కొరగాన్ — కసం.తి 4 చిరి — $గ_1$ శ.ప.
5 తొడ — ఋ ర.కసం డ.త.బ ర. 6 చెదరన్ — కసం. ట

258 1 దానిన్నేయః — ర; దానిన్ వేయః — జ.ద 2. య — పెక్కు తాళ
పత్రప్రతులు 3. కానన్ రాని — మ. 4. వినులతేజుండు — కొన్ని ప్రతులు.
5. ప్రజ్ఞుడు — అ.

259 1 పార్థు — కొన్ని ప్రతులు. 2 విచ్ఛిన్న — అ.ఉ.ఓ.డ.మ.య. 3. నకుంజ
నినం — కొన్ని ప్రతులు 4. యందలి — ఎ.గ చ డ.త.ద.బ.వీ శ ష.
5 స్నిగ్ధుండగుటకు — అ.ఈ; స్నేహుండగుటకు — ఒ.ట.న. అక. 318.
ఉత్కళిక. 6. పట్టువడునని — $గ_1$ చ.ద.వీ.శ.ష. 7. కొండిక — $గ_1$.చ.
భా కూ.ర శ.ష.

## ఆశ్వాసాంతము

260 క. వ్యసనవివర్జిత [1]మానవ్యసగోత్రపవిత్ర విష్ణువర్ధననృప స
ప్తసముద్రముద్రితాఖిల, వసుధాజన [2]గీతకీర్తి [3]వాసవమూర్తీ.

261 పనమయూరము.

రాజకులశేఖర పరంతపవివేక, భ్రాజిత జగద్వలయభాసురసముద్య
త్తేజ నిరవద్య [1]యువతీమదన వీరో, గ్రాజివిజయా త్రిభువనాంకుశ
నరేంద్రా.

## గద్యము

262 ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్ట ప్రణీతంబైన శ్రీమహాభారతంబునం
దాదిపర్వంబున ధృతరాష్ట్రపాండు[1]రాజుల వివాహంబును
పాండురాజదిగ్విజయం[2]బును పాండవధార్తరాష్ట్రసంభవంబును
పాండు[3]రాజనిర్యాణంబును కృపద్రోణజన్మకథనంబును
గుమారాస్త్రవిద్యాగ్రహణంబును నన్నది
పంచమాశ్వాసము

1 మానవ్యసగోత్ర — పూర్వమందు వైయాఘ్రపాదగోత్రుడైనప్పటి కిన్ని, మధ్యకాలమందు విష్ణువర్ధనుని మానవ్యసగోత్రుడైన హారితపుత్రుడు పెంచుకున్నందుచేత మానవ్యస గోత్రుడైనాడని తెలియవలసినది— భా.కూ.

260 2. వినుత — య 3. సిత — త. ఇచ్చట భారతకూలంకష వ్యాఖ్య చూడఁదగినది.

261 1. సుదతీ — ఆ.గి$_1$ ద.పీ.శ.ప.

[గద్యము] 1. రాజుల జన్మంబును వారల వివాహంబును — య. 2. బును పాండురాజు తపశ్చరణంబును పాండవ — ఒ జ.ప.య. 3. రాజ — కొన్ని ప్రతులలో విడువబడినది

ఆదిపర్వము పంచమాశ్వాసాంతమున నీయఁబడిన భారతము లక్ష్మీపతి గద్య.
ఇతి శ్రీ మదుభయకవితాపూర, సూరమాలక్ష్మీనృసింహసూరికుమార, భారతా న్వయధీర, కైశోరప్రభృతి సమారాధితశ్రీపతి, లక్ష్మీపతి ప్రణీతంబైన శ్రీ మహాభారతకూలంకషవ్యాఖ్యానంబునందు.

—:o:—

# శ్రీమదాంధ్రమహాభారతము

## ఆదిపర్వము - షష్ఠాశ్వాసము

1 క. శ్రీజయ విభాసి వినమ, ద్రాజన్యకిరీటమణివిరాజితపాదాం
భోజ భుజనైకసుందర, రాజాన్వయ[1]తిలక రాజరాజనరేంద్రా.

2 వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం జెప్పెనట్లు [1]కృతాస్త్ర[2]శస్త్రు లయిన రాజకుమారులవిద్యాకౌశలంబు వ్యాసగాంగేయవిదురకృప [3]శల్య[4]శకునిసోమదత్తాదుల సమక్షంబునం జూప సమకట్టి యొక్కనాఁడు ద్రోణుండు ధృతరాష్ట్రున కిట్లనియె.

### —: కుమారాస్త్రవిద్యాసందర్శనము :—

సం. 1—124—1

3 క. ఘోరాస్త్రశస్త్రవిద్యల, [1]నారూఢత మిగుల నిపుణులైరి కుమారుల్
[2]మీరలు వీరల విద్యా,పారము [3]సనుఁ దెలియఁగ వలయు భవదీయసభన్.

1 1. రాజ — కొన్ని ప్రతులు.

2 1. గృహీతాస్త్ర — ఆమ. 2. శస్త్రపారగులైన — ఓ.జ.ట.డ. 3. శల్యుని ప్రశంస ఈ సందర్భమున మూలభారతమున లేదు. భారతకూలంకషవ్యాఖ్యలో నిచ్చట శల్యునికి బదులు శలుఁడు అని యున్నది. శలుఁడనువాఁడు సోమదత్తుని కొడుకు. సోమదత్తుఁడు బాహ్లీకుని కుమారుఁడు. శల్యశకుని — వా. 4. శకుని పెక్కు ప్రతులలో విడువఁబడినది. మూలభారతమునందును లేదు

3 1. నారూఢతమిగుల — అ ఔ.గ$_1$. భాసం.మ.ర.వీ.శ.ష స ; నారూఢము లందు — వా.శ. కొన్ని ప్రతులు. 2. వీరల యవిరల విద్యా — వా.శ 3. సనుదెరుగ — ఉ.ఒ.ఓ.ఔ.క.ట.డ.ప.

4 వ. అనిన నట్ల చేయు[1]దు నని ధృతరాష్ట్రుండు [2]గుమారులవిద్యాసందర్శన రంగంబు రమ్యంబుగాఁ జేయింపుమని విదురుం బంచిన [3]నతండును దాని [4]శాస్త్రవిహితప్రమా[5]ణోపేత[6]వృత్తాయామంబును నపాకృతవృక్షగుల్మ [7]వల్మీకంబును నంగీకృతపూర్వోత్తర[8]ప్లవంబును సమీకృతనిమ్నోన్నత ప్రదేశంబును దూరీకృతకంటకపాషాణశల్యాశకలంబును [9]విరజీకృతరజో ధూసరస్థలంబును విరచితబహువిధ[10]ప్రేక్షాగారాంచితమణిమయమంచ ప్రపంచంబును నానాధ్వజనవపల్లవ[11]రంభాస్తంభమాలాలంకృతద్వారతోరణంబును బ్రతి[12]దిశనిర్వర్తితశాంతిక[13]బలివిధానంబునుంగాఁ జేయించినం బంచాంగశుద్ధదినశుభముహూర్తంబున ధృతరాష్ట్రుండు గాంధారీపురస్కృత దేవీశత[14]పరివృతుండై వివిధభూషణభూషితానేకవిలాసినీనివహంబుతోఁ జనుదెంచి [15]విలంబితకదంబకస్థూలముక్తాఫలదామరమణీయంబై యాబద్ధ మరకతవజ్ర వైడూర్యపద్మరాగప్రవాళప్రభాప్రకరవ్యతికరవిరచితాపూర్వ [16]సురచాప[17]చారుగౌరవంబై యతిమనోహరంబయిన శాతకుంభమయ ప్రేక్షాగారంబున [18]నున్న.

5 తే. అందుఁ గర[1]మొప్పి సుందరీబృంద మఖిల, రత్నరాజితకనకధరాధరేంద్ర కందరాంతరమున నున్న సుందరామృతాశనాంగనాబృందంబు ననుకరించె.

4 1. దమని ధృతరాష్ట్రుడు — కొన్నిప్రతులు. 2. గుమార విద్యాసందర్శన — అ.ఈ ఒ గ.ట; గుమారాస్త్రవిద్యా — ఉ.ఎ.ఐ ప. 3 నతండు వల్లెయని — భాసం. వా.శ మొదలగునవి. 4 శాస్త్రోపదిష్ట — ఔ $గ_1$.చ.ద.బ. భాసం. వీ శ ష; శాస్త్రోపవిహిత — ల. 5. ణోచితవృత్త — $గ_1$.చ.డ.శ ష. 6. వృత్తాయతంబును — ఒ ఓ.ద.ర ల.శ ష. 7. వల్మీకవల్లికంబును — వా.శ. 8. ప్రవణంబును — భా.కూ. 9. విదళీకృత – జ బ, విరళీకృత – ల కొన్నిప్రతులు. 10. ప్రేక్షాగారరచితమంచ — ఈ.ఐ.వా, ప్రేక్షాగారాంచితమణి మయమంచ – ప ల; ప్రేక్షాగారమంచక ప్రపంచంబును — భాసం.మ. కొన్ని ప్రతులు; ప్రేక్షాగారంబును సమంచితమంచ — ఖ. 11. రంభాస్తంభ — $గ_1$ చ.ద.భాసం వీ.శ.ష; తోరణచందనమాల్యాలంకృత — వా.శ. 12 దిఙ్నిర్వర్తిత – ఆ మ; దిశా – ర.ల, దిన — పెక్కు తాళపత్ర ప్రతులు. 13. బహువిధానంబు — క.ట. 14 సమేతుండై — ప. 15. విమల కదంబక — అ.ఔ.చ.ద.బ.శ ష 16. శుభావహసురచాపప్రభావంబై — స. 17. ప్రభాభాసురంబై — ఎ; భాసురంబై — క.బ. 18. నున్నంత — అ.ఈ ఊ. ఎ.జ.డ.మ ; నుండునంత — ఉ ఋ.ఒ.క.ఖ గ.ల.

5 1. మొప్ప — కొన్ని ప్రతులు.

6 తే. సుతుల విద్యాప్రవీణతఁ జూచువేడ్క, నెంతయును సంతసంబునఁ గుంతిదేవి
రాజసన్నిధి గాంధారరాజపుత్త్రి, కెలననుండె నున్మీలితనలిన[1] నేత్ర.

7 వ. మఱియును.

8 సీ. వ్యాసపుర[1]స్కృతావనిదేవనివహంబుఁ గృప శల్య శకుని గాంగేయ విదుర
[2]సోమదత్తాది [3]భూసురగురుబాంధవమిత్త్రవర్గంబు నమేయమంత్రి
సామంత మండలేశ్వరసమూహంబును గాయక వైతాళిక ప్రవరులుఁ
దమతమ నియమితస్థానంబులం దోలి నుండిరి [4]బోరన నులిసె భేరు

ఆ. లస్త్రదర్శనాగతాఖిల క్షత్త్రియ, వైశ్య శూద్రవివిధవర్ణజనుల
కలకలంబు ప్రళయకాల సంక్షోభితాం,[5]భోనిధిస్వనంబుఁ బోలెఁ [6]జెలఁగె.

9 వ అట్టి [1]యవసరంబున నాచార్యుండు శుక్లాంబరాభరణమాల్యానులేపన యజ్ఞోపవీతపలిత[2]కేశశ్మశ్రుశోభితదేహుండై రంగమధ్యంబున నశ్వత్థామ సహితుండై విముక్తజలద[3]జాలవియన్మధ్యంబున నంగారకసహితుండైన [4]యాదిత్యుండునుంబోలెనున్న నగణ్యభూసురవరేణ్యపుణ్యాహవాచనానంతరంబున.

6 1. నేత్రి — పెక్కు తాళపత్త్రప్రతులు.

8 1. స్సరా — అ. 2. బాహ్లికకు (గు) రు ముఖ్యభూసురబాంధవ — ఆ.మ. 3. భూసురబంధుబుధజన — బ; భూసురసర్వబాంధవ — ఐ; భూసురగురు — భా కూ. కొన్ని ప్రతులు. ఇచ్చట మిత్రవర్గము శకున్యాది మిత్రవర్గము. అని భా.కూ. 4. భోరన — పెక్కు ప్రతులు, భోరున — ఐ ఒ.జ.వ, బోరున — ఎ. ద.శర; భోరనియులిసె — కొన్ని ప్రతులు. 5. భోధినిస్వనంబు — శ.వ. పెక్కు ప్రతులు 6. నెగసె, నెసగె — అని పాఠములు

9 1. సమయంబున — ఋ.ఖ.న. 2. శ్మశ్రుకేశకలాపోపశోభితుండు — వ.ద.వీ. శ.వ. 3. విమలవియన్మధ్యంబున — ఒ క.త. 4. ఇక్కడ మూల మిట్లున్నది. సాంగారక ఇవాంశుమాన్. సాంగారకః సభౌమః, అంశుమాన్ చంద్రః. అని నీలకంఠీయము, చిత్రశాలా ప్రతిపుట 236.

10 శా. ద్రోణాచార్యు పిఱుంద నొప్పి [1]దృఢహస్తుల్ బద్ధగోధాంగుళి
త్రాణుల్ మార్గణపూర్ణతూణులు మహాధన్వుల్ కుమారుల్ తను
త్రాణోపేతులు రంగమధ్యమున నంతఁ నిల్చి రుద్యద్గుణ
[2]శ్రేణీరమ్యులు ధర్మజప్రముఖులై జ్యేష్ఠానుపూర్వంబుగన్.

11 వ. అట్లు నిలిచి [1]రక్తచందనదిగ్ధాంగులు రక్తమాల్యాంబరాభరణులు రక్త పతాకులు రక్తాంతలోచనులై యాచార్యుననుమతంబున.

12 సీ. అసి [1]చర్మ కౌశలం బమరంగఁ జూపెడు వారును దృఢ సౌష్ఠవంబు లొప్పఁ
దమతమ నామాంకితములైన శరముల నేర్పడ లక్ష్యంబు లేయువారు
హయ మదద్విరద రథా[2]రూఢ దక్షతఁ బ్రకటించువారును బ్రాసశక్తి
కుంతతోమరగదాకుశలత్వ మెఱిఁగించువారును గానిట్లు [3]వసుధలో[4]ని

ఆ. రాజసుతుల[5]తోడ రమణఁ బాండవ ధృతరాష్ట్రసుతులు వృద్ధరాజులొద్దఁ
[6]దద్దయును ముదమునఁ దమతమ[7]విద్యలు, మెఱసి రెల్లజనులు మెచ్చి పొగడ.

10 1. దృఢహస్తుల్ — భాసం. శ ష. పెక్కు ప్రతులు; కృతహస్తుల్ — వా శ. కొన్ని ప్రతులు. 2 శ్రేణుల్ ధన్యులు — బ.

11 1. రక్తచందన ఇత్యాది — అ ఆ.ఖ గ.బ. భాసం. య; ఇచ్చట పి.పి.యస్. ప్రతిలో. రక్తచందనదిగ్ధాశ్చ, రక్తమాల్యానుధారిణః, సర్వే రక్తపతాకాశ్చ, సర్వే రక్తాంతలోచనాః. అని యుండుట గమనింపఁదగినది. పుట 841 భం. అధస్సూచిక లోను కలదు. పుట 559.

12 1. వర్మ — ఈ ఊ.ఏ.ట గ$_1$.చ.జ ట త.య ర వీ.శ ష.స; ధర్మ — క.గ.ప; మర్మ — అ; కర్మ — అపం. 2 రోహ — ఐ.ర 3. వరుసతోడ — అ. 4. న — వా శ. కొన్ని ప్రతులు; ని — పెక్కు ప్రతులు. 5. లోన — న 6. దఱుచు ముదముతోడ — గ$_1$.చ.ద.శ.ష; దద్దముదముతోడ — భాసం. మ.వీ. 7. నేర్పులు — ఔ.గ$_1$.చ.త.ద.శ.ష; విద్యల — భాసం. శ; నేర్పుల — వీ.

–: భీమదుర్యోధనులు దమ గదాకౌశలంబు సూపుట :–

సం. 1-124-30

13 వ. అంత ననంతబలపరాక్ర[1]ములగు భీమదుర్యోధను లుద్యద్గదాహస్తులయి మహామత్సరంబుతో నేకశృంగసముత్తుంగశైలద్వయంబు ననుకరించుచు [2]వశానిమిత్తక్రుద్ధగంధసింధురంబులుం బోలె నొండొరులం దాఁకి సవ్యాపసవ్యచిత్రమండలమార్గంబుల గదాకౌశలంబు మెఱయుచునెడ.

14 మ. అవనీచక్రము పాద [1]ఘాతహతి నల్లాడంగ నత్యు[2]గ్రభై
రవహుంకారరవంబునన్ వియదగారం బెల్ల [3]భేదిల్లఁ బాం
డవకౌరవ్య[4]గదావిఘట్టన మకాండప్రోత్థమై ఘావి పాం
డవకౌరవ్యరణాభిసూచన పటిష్ఠం బయ్యె ఘోరాకృతిన్.

15 క. ఆరాజసుతుల విద్యా,పారగ పటుచేష్టితము[1]లఁ బరువడి నగ్గాం
ధారిధృతరాష్ట్రుల [2]కతి, ధీరుఁడు విదురుండు సెప్పి తెలుపుచునుండెన్.

16 వ. [1]అంత భీమదుర్యోధనుల గదాకౌశలంబు సూచు జనుల పక్షపాత [2]జనిత పరస్పరక్రోధవచనంబులు విని ద్రోణుండు రంగభంగభయంబున నశ్వత్థామం బంచి వారి నిద్దఱ వారించి వారాశియుంబోలె [3]బోరన మ్రోయుచున్న [4]వాదిత్రశబ్దంబు[5]లుడిపి నాప్రియశిష్యుండయిన యర్జును [6]ధనుర్విద్యా కౌశలంబుఁ జూడుండనిన నయ్యాచా[7]ర్యువచనానంతరంబున.

13 1 ములుభీమ — పెక్కు ప్రతులు ; లైన — అ.స. 2. పాశానిరుద్ధగంధ సింధురంబులుంబోలె — య.

14 1. పాత — కొన్ని ప్రతులు ; ఘాతమున — $గ_1$ పి శ.మ.శర.సూని. 2. చ్చ — వా.శ. కొన్ని ప్రతులు 3. ఘూర్ణిల్ల — క.గ. 4. గదాభిఘట్టన — ఖ.ల.

15 1. లుపరు — పెక్కు ప్రతులు 2. కును — కొన్ని ప్రతులు.

16 1. అయ్యవసరంబున — గ.స 2. జనిత పరస్పరక్రోధ — గ౹ చ ద.బ పి.శ. 3. బోరన — కొన్ని ప్రతులలో లేదు. 4. వాదిత్రనాద జనశబ్దంబులు — అ.ఋ.క.ఖ.డ.బ 5. లుడిగించి — పెక్కు ప్రతులు ; లుడిచి — కొలది ప్రతులు. 6. ధనుఃకౌశలంబు — వా.శ. 7. ర్యునుమతంబున — ఐ య.

17 ఉ. హారివిచిత్రహేమ కవచావృతుఁ డున్నత[1]చాపచారు దీ
ర్ఘోరుభుజుండు భాస్వదసితోత్పలవర్ణుఁ[2]డుసేంద్రచాపశం
పారుచిమేఘమో యనఁగఁ బాండవమధ్యముఁ [3]డొప్పి బద్ధతూ
ణీరుఁడు రంగమధ్యమున [4]నిల్చె జనంబులు [5]దన్నుఁ జూడఁగన్.

18 క. నరు నింద్రాత్మజు [1]నింద్రా,వరజ[2]సఖున్ వీరుఁ బాండవప్రవరు ధను
ర్ధరుఁ జూచి [3]చూపఱె[4]ల్లం, బరమాద్భుతచిత్తులగుచుఁ బలికిరి తమలోన్.

19 తే. వీఁడె [1]కృతహస్తుఁ డఖిలాస్త్రవిద్యలందు, వీఁడె యగ్రగణ్యుఁడు [2]ధర్మవిదుల లోన
వీఁడె భరతవంశంబెల్ల వెలుఁగఁ గుంతి, కడుపుచల్లఁగాఁ బుట్టినఘన[3]భుజుండు.

20 క. అని పలుకు జనులపలుకులు, వినిగొంతి [1]యనంతహర్షవిస్తారితలో
చనయై నందను నృపనం, దనసంఘములోనఁ జూచి తద్దయుఁ బొంగెన్.

21 క. చారుమనస్సమ్మద జన, పూరము వెలి [1]వేర్చునట్లు పొలఁతికి విగళ
ద్వారిస్తనజనితపయో, ధారలు నానందబాష్పధారలు నొప్పెన్.

---

17 1 చారుచాప — పెక్కు ప్రతులు 2 డుసైంద్రచాప — పెక్కు ప్రతులు; డుపేంద్ర — ర. కొన్ని ప్రతులు, ఇంద్రచాప — బా.కూ. వర్ణుడు ఇంద్రచాప ఇచ్చట సంధి రాకపోవును. బిచ్చికమని భా కూ 3. డొప్పె — పెక్కు ప్రతులు 4 నిల్చి — కొన్ని ప్రతులు 5 దన్నెచూడఁగన్ — భాసం వా. కొన్ని ప్రతులు.

18 1. దైవత వరసమునిన్ — మ 2 సమున్ — ఊ.ఎ.ఐ.న.ర.స. 3. భూమిపతులున్ — య. 4 ల్లను — కొన్ని ప్రతులు.

19 1. ధృఢ — జ.ట.డ. 2. ధనుర్విదులలోన — అ.ఈ.ఓ.ర.స. 3. యశుండు — ఓ.క.న.

20 1. యునంతహర్ష — పెక్కు ప్రతులు.

21 1. విరియు — అ.ల; వచ్చినట్లు — చ.ద.వి.శ.ష.

22 వ. అయ్యర్జు[1]ను స్తుతివచనంబు లొక్క[2]ట జనసంఘంబు వలన నెగసి వియత్తల విదళ[3]నం బయిన నమ్మహాధ్వని విని [4]యదరిపడి ధృతరాష్ట్రుం డిది యేమి [5]రభసంబని విదురు నడిగిన నాతం డిట్లనియె.

23 క. భూరిభుజుం డర్జునుఁ డతి,శూరుఁడు దన యస్త్రవిద్యఁ జూపఁగ రం[1]గ
త్ప్రారంభుఁడయిన [2]నతని న,వారితముగఁ బొగడు జనరవం బిది యధిపా.

24 క. అనవుడు ధృతరాష్ట్రుఁడు దన,మనమున [1]సంతోషమంది మానుగ [2]వినుల్
గనిన ఫల[3]మిపుడు గంటిన్, విన[4]గంటినిఁ బాండుసుతులవిద్యాశక్తుల్.

25 క. భూరినిజద్యుతితోడఁ బృ,థారణిసంభూతపాండవాగ్నిత్రితయం
బారఁగ నస్మత్కులదురి,తోరుతరారణ్యదాహ మున్నతిఁ జేయున్.

—: అర్జునుండు దన యస్త్రవిద్యాకౌశలంబు సూపుట :—

సం. 1-125-18

26 వ. అని పొగడుచుండ నర్జు[1]నుం డాచార్యు ననుమతంబున నస్త్రలాఘవ [2]వైచిత్ర్య ప్రకాశనపరుండయి యెల్లవారును [3]జూచుచుండ.

22 1. నస్తుతి — అ ఋ.ఎ య. 2. పెట్ట — అ.ఖ.న.ర. 3. నంబై పీతెంచిన — అ.ఖ న. 4. యుదరిపడి — అ.ట.ట.డ.త.బ 5. మహాస్వనంబని — ఆ గ; రవంబని — అ·గ్ని.డ.ద.ర వీ శ.ష.

23 1. గప్రారంభుడయిన – పెక్కు ప్రతులు. 2. నతనిని వారక వర్ణించు - పెక్కు ప్రతులు ; నతనిని వారకనుతియించు — ర.

24 1. కడుసంతసిల్లి — ఋ.ఖ. 2. శ్రుతులన్ — అపం 3 మునకు నిప్పుడు — వా.శ; మిపుడు గంటిని — భాసం. వీ.శ.ష మున్నగు ప్రతులు; ఫలంబొడ గూడెను — అ.గ.మ. 4 గాంచితి — ర ; గల్గెను — ల.వీ.

26 1. నుండును నాచార్యు — కొన్ని ప్రతులు. 2. విచిత్ర — పెక్కు ప్రతులు ; విచిత్ర ప్రకారపరుఁడై — య ; విచిత్రప్రకాశితపరుండై — భా.కూ స. 3. జూడ — పెక్కు ప్రతులు.

27 సీ. ఆగ్నేయశరమున నతిభీకరాగ్నియు [1]వారుణాస్త్రమున దుర్వారజలము
ననిలబాణంబున నధికానిలంబును మేఘాస్త్రమున మహామేఘచయముఁ
బుట్టించు మఱియును భూమిబాణంబున భూప్రవిష్టుండగు భూరిఘోర
శైలబాణంబున శైలరూప[2]ము దాల్చు వీరుఁ డదృశ్యాస్త్రవిద్య పేర్మిఁ

తే. దానదృశ్యదేహుండగుఁ దక్షణంబ, హ్రస్వుఁడగు దీర్ఘుఁడగు సూక్ష్ముఁడగు రయంబు
తోడ రథమధ్యగతుఁడగు [3]ధూర్గతుండు,నగు మహీతలగతుఁడగు [4]నద్భుతముగ.

28 వ. మఱియుం బొఱెడుసింహవ్యాఘ్రవరాహాదిమృగంబులముఖంబులం దొక్కొక్క యమ్మేసి నట్లయే[1]నేసి యమ్ము లతిలాఘవంబున నేసియు రజ్జుసమాలంబితంబయిన గోశృంగంబునం దేకవింశతి శరంబులు వరుసన నాటనేసియు నిట్లస్త్రవిద్యా[2]వైచిత్ర్యంబు [3]మెఱసి గదాఖడ్గాదివివిధాయుధదక్షతం జూపి యర్జునుండు జనుల [4]కాశ్చర్యంబు సేయుచున్నంతఁ గర్ణుండును నిజవిద్యాకౌశలంబు మెఱయ సమకట్టి రంగద్వారంబున [5]నిలిచి భుజాస్ఫాలనంబు సేసిన.

29 మ. జనులెల్లం గడు సంభ్రమింపఁగ నజస్రంబై భుజాస్ఫాలన
ధ్వని శైలప్రకరంబుపైఁ బడు మహాదంభోళిశబ్దం[1]బొకో
యన వీతెంచినఁ బాండవుల్ సనిరి ద్రోణాచార్యు డాయన్ సుయో
ధను వేష్టించిరి తమ్ములందఱును [2]దద్ద్వారంబు వీక్షించుచున్.

27 1. వరుణబాణమున — బొ. 2. మొనర్చు — అ.మ. 3. తురగగతుడు — కొన్ని ప్రతులు, దూరనతుఁడగు — స 4. నశ్రమమున — స; నక్షణంబ — ఐ.వ. 1-6-23. పొఱెడుసింహ — ఇచ్చటి రంగస్థలమునందు పొఱెడుసింహాదులకు ప్రసక్తి యెట్లని సందేహము కలుగుచున్నది. ఆ జంతువులు కృత్రిమములు (లోహమయములు) కావచ్చునను సూచన మూలపాఠమునలభించుచున్నది. భ్రమతశ్చవరాహస్యలౌహాస్య ప్రముఖేసమమ్, పంచబాణా నసంసక్తాన్సమ్ముమో చైకబాణవత్. లౌహాస్య అనుటకు భ్రమరస్య, కామస్య, సింహాస్య, అను పాఠములు కూడ కలవు.

28 1. నమ్మేసి—కొన్ని ప్రతులు. 2. విచిత్రంబులు—కొన్ని ప్రతులు. 3. నెఱపి—మ 4. కాశ్చర్యజననంబు — కొన్ని ప్రతులు. 5. నిలిచి—పెక్కు ప్రతులలో లేదు.

29 1. బొకో — చ.వీ.శ.ష; బయో — వా.శ. కొన్ని ప్రతులు; బకో — కొన్ని ప్రతులు. 2. దద్ద్వానంబు నాలింపుచున్ — ఓ.

30 వ. అంత.

-: కర్ణుఁడు ప్రవేశించి యర్జును నధిక్షేపించుట :-

సం. 1-126-2

31 శా. సాలప్రాంశు నిజోజ్జ్వలత్కవచు శశ్వత్కుండలోద్భాసితుఁ
బాలార్కప్రతిమున్ శరాసనధరున్ [1]బద్ధోగ్రనిస్త్రింశు శౌ
ర్యాలంకారు సువర్ణవర్ణు ఘనుఁ గర్ణాఖ్యుఁ జగత్కర్ణపూ
ర్ణాలోలద్గుణుఁ జూచి చూపఱు ప్రభూతాశ్చర్యులై [2]రచ్చటన్.

32 వ. కర్ణుండును జనుల [1]నందఱ నదల్చి చొత్తెంచి రంగమధ్యంబున నిలిచి కలయం జూచి కృపద్రోణాచార్యులకు నమస్కరించి సజలజలధరధ్వానగంభీర[2]వచనంబులనర్జును నాక్షేపించి యిట్లనియె.

33 క. [1]నీవ కడునేర్పుకాఁడవు, గావలవదు వీనిఁ గొన్ని గఱచితి [2]మేముఁ
నీవిద్యలెల్లఁ [3]జూపుదు, మే[4]వీరుల సూచి మేలు మేలని పొగడన్.

34 క. అనిన [1]నినతనయుపలుకులు, జనులకు విస్మయము సవ్యసాచికిఁ గోపం
బును సిగ్గును మఱి దుర్యోధనునకుఁ బ్రీతియును జేసెఁ దత్క్షణమాత్రన్.

35 వ. అంత ద్రోణుచేత ననుజ్ఞాతుండయి కర్ణుం డర్జునుచూపిన యస్త్రవిద్యావిశేషంబు [1]లెల్ల నశ్రమంబునఁ జూపినఁ జూచి దుర్యోధనుండు దానుం దమ్ములును గర్ణునిం గౌఁగిలించుకొని నాతోఁబద్ధసఖ్యుండవయి నాకును బాంధవులకును హితంబుసేసి [2]నారాజ్యభోగంబులను నీవును నుపయోగింపు మనిన నట్ల

31 1 బద్ధాంగుళిత్రాణు — త. 2. రందఱున్ — ఈ.ప.ఐ.ఔ.ఖ.బ. భాసం.

32 1. నందఱ — కొన్ని ప్రతులలో లేదు 2 వచనంబుల — పెక్కు ప్రతులు, రవంబున — ఫా.శ. మున్నగు ప్రతులు.

33 1. నీ వొకడు — గ. $గ_1$.శ.ష; నీ వొకడ - య. 2. నేమున్ - ఖ $గ_1$.చ.ద.మ.శ.ష 3. జూపెద మీ వీరులు చూచి — గ1.చ.ద.శ.ష ; జూపుదుమే వీరలుసూచి — ఒ.ఓ.ఖ. భాసం. ఇచ్చట అఖండయతిగా చూడవలెను. 4. వీరలు — అ.ఒ.ఓ చ.జ. డ.త.ద భాసం.య.ర. భాసం.

34 1. రవి — ఎ.త.బ.

35 1. లన్నియు — పెక్కు ప్రతులు. 2. నన్నుం గురురాజ్యం బేలించి నా యైశ్వ

చేయుదునని [3]కర్ణుం డాతనితోడి యిష్టసఖిత్వంబున కోడంబడి యిమ్మొగిన రాజలోకంబును నీవునుజూడఁ బార్థుతో ద్వంద్వయుద్ధంబు సేయవలయు ననిన ధార్తరాష్ట్రమధ్యంబుననున్న యక్కర్ణుంజూచి పార్థుం డిట్లనియె.

36 క. [1]పిలువంగఁ బడక సభలకు, బలిమిం జని పలుకు పాపభాగులలోకం
బులకుఁ జన వేఁడి పలికెదు, [2]పలువ యెఱుంగవు పరాత్మ [3]పరిమాణంబుల్.

37 క. అనిన విని పార్థునకు ని,ట్లనియె నినాత్మజుఁడు దుర్బ[1]లాశ్వాసక్షే
పనిబంధమ్ములు పలుకక, ఘన[2]నిశితాస్త్రములఁ బలుకఁ గడఁగుము నాతోన్.

38 క. ఈరంగభూమి యస్త్ర వి,శారదులగు వారికెల్ల సామాన్యముగా
కారయ వీరికిఁ జొరనగు, వీరికిఁ గాదను విచారవిషయము గలదే.

39 వ. అని గర్వించి దుర్యోధనానుమతంబునఁ బార్థు[1]తో ద్వంద్వయుద్ధంబు సేయం [2]బూని రణసన్నద్ధుఁడయి రవితనయుండు రంగమధ్యంబున నున్నంత నర్జునుండును నాచార్యభ్రాతృచోదితుండై యుగాంత [3]కాలానలుండునుం బోలెఁ బ్రతిఘటించి నిలిచిన.

ర్యంబు — వా. కొన్ని ప్రతులు — మూలము 'అహంచ కురురాష్ట్రం చయథేచ్ఛము పభుజ్యతామ్' పి పి యస్. ప్రతి పుట 850. నా రాజ్యభోగంబులను నీవును నుపయోగింపు — పెక్కు ప్రతులు. 3 కర్ణుండోడంబడి — వా కొన్ని ప్రతులు; కర్ణుం డాతనితోడి యిష్టసఖిత్వంబున కోడంబడి — ఆ.ఐ.గ.

36 1. పిలువంబడకయ — ఆ య.ర. 2 పలుదెఱుఁగుల నాత్మవినుతి పరిమాణంబుల్ — న స, పలుకులెరుంగవు — వ ఔ బ; పలుక నెఱుఁగవు — గ. 3. ప్రామాణ్యంబుల్ — మ; పరభావంబుల్ — క.

37 1. లాశ్వాసాక్షేప — ఈ ఋ ఎ.ఒ.ఓ.క ఖ ట త.న.భాసం.వీ స; లాశ్వాసక్షేప — భా.కూ. ఇచ్చటమూలము "కింక్షేపైః దుర్బలాశ్వాసైః శరైఃకథయ భారత"; లాయాసక్షేప — వా.శ; లాన్వితసంక్షేప — జ బ; లాస్పద సంక్షేప — ఊ. 2 నిశితశరముల — పెక్కు ప్రతులు.

39 1. తోబోరంబూని — య; తోడంబూనిరణ సన్నద్ధుడయి — కొన్ని ప్రతులు. 2. బోధితుండై — క ఖ జ.ట.త.ద.య. 3. కాలకాలుండు నుంబోలె — కొన్ని ప్రతులు

## —: కర్ణార్జునుల ద్వంద్వయుద్ధము :—

సం. 1—126—23

40 మ. జనితామర్షణుఁ డంతఁ బార్థుపయిఁ బర్జన్యాస్త్ర మక్కర్ణుఁ డే
[1]సె నపారంబయి భూనభోంతరముఁ ద మ్మూత[2]యూథంబు గ
ప్పినఁ దద్ధ్వాంత [3]తిరోహితాపఘనుఁడై భీత్సుఁ డుండెన్ విరో
చనుఁ డాత్మద్యుతి విస్తరించె సుతుపై సంప్రీతచేతస్కుఁడై.

41 వ. అయ్యవసరంబున దుర్యోధనుం దొట్టి ధృతరాష్ట్రనందను లందఱుఁ గర్ణువలన నుండిరి [1]భీష్మద్రోణకృపపాండవులు పార్థువలన నుండి రంత.

42 క. రవిసుతపార్థులఘోరా,హవమునకును [1]వెఱచుచున్న యది [2]కుంతి తదు
ద్భవఘనతరశరతిమిరా,ఘవృతాంగుఁ దనూజుఁ జూడఁ గానక వంతన్.

43 క. ధృతి దఱిఁగి మోహమూర్ఛా,న్వితయైనను సంభ్రమించి విదురుఁడు ప్రత్యా
గత [1]జీవఁ జేసె నప్పుడ, యతిశీతలచందనోదకాసేకమునన్.

44 వ. అంత నర్జునుం డనిలబాణంబున నమ్మేఘపటలంబు పఱవనేసి యాదిత్య [1]సమ
తేజుండయి [2]యుండెనంత విదురదర్శితులైన యక్కర్ణార్జునులంజూచి కుంతి సంతసిల్లె నపుడు ధర్మవిదుం డఖిలద్వంద్వయుద్ధసమాచారనిపుణుండు కృపాచార్యుం డయ్యిద్దఱనడుమ నిలిచి కర్ణున కిట్లనియె.

40 1. సినఘోరంబయి — ఓ.ఖ.చ.ద.ర పీ.శ.ప స, సెనఘోరంబయి — $గ_1$ స; సిన భూభాగ దిశానభోంతరము — ఆ.ఐ.ఔ.మ. 2 సంఘుంబు — ఖ; తండంబు — త 3 ముహాయవాయుశరముం భీభత్సుడేసెన్ విరో — ఏ న, మూలము మేఘచ్ఛాయోపగూఢస్తుత తో౽దృశ్యతపాండవః సూర్యాతపపరిష్వక్తః కర్ణోపిసమదృశ్యత

41 1 భీష్మకృపద్రోణులు పార్థువలన నుండిరి — ర

42 1 వెఱచియున్నయది — న; వెరచుచుండె నాకుంతి — ఆ.ఐ. 2 కుంతియుఁద ద్రవిభవఘనశర — గ భాసం పీ.శ.ప.

43 1 జీవితఁ జేసె నపుడ — ర; జీవి — కొన్ని ప్రతులు

44 1. సమానులై యెదురదర్శితు — చ పీ.శ.ప. 2. యుండె నంత — కొన్ని ప్రతులు; యున్న — వా. కొన్ని ప్రతులు.

45 చ. కురుకులజుండు పాండునకుఁ గుంతికిఁ బుత్త్రుఁడు రాజధర్మబం
ధురచరితుండు నీవితనితోడ రణం బొనరించెదే[1]ని వి
స్తరముగ [2]నీదువంశమును దల్లిని దండ్రిని జెప్పు [3]చెప్పినన్
[4]దొరయగు [5]దేని నీకెదిరి దోర్బలశక్తి నితండు సూపె[6]డిఁ.

46 వ. అనిన విని కర్ణుండు దనకులంబును దల్లిదండ్రులను జెప్ప సిగ్గువడి తలవాంచి యున్నఁజూచి దుర్యోధనుండు గృపున కిట్లనియె.

47 క. కులముగలవాఁడు శౌర్యము, గలవాఁడును నధికసేనగలవాఁడును భూ
తలమున రాజను నామము, [1]విలసిల్లఁగఁదాల్చు [2]మూఁడువిధముల పేర్మిన్.

48 తే. [1]రాజవరుఁడైన పార్థుతో రాజుగాని, యీతఁడనిసేయఁగాఁ దగఁడేని వీని
నెల్లవారును జూడంగ నీక్షణంబ, రాజుఁ[2]జేసెద నే నంగరాజ్య[3]మిచ్చి.

*-: దుర్యోధనుఁడు కర్ణుని నంగరాజ్యమున కభిషిక్తుం జేయుట :-*

సం. 1-126-36

49 వ. అని యప్పుడ భీష్మధృతరాష్ట్రులకుం జెప్పి వారి యనుమతంబున మహామహీ సురసహస్రంబు[1]నకు గోసహస్రాయుతంబు దానంబు సేసి యంగరాజ్యంబునకు

45 1. సవిస్తర — డ. 2 నీయుదంతమును — అపం 3 పేర్మితో — డ 4. దొరసినయేని నీ కెదురు — ర. 5 నేని — పెక్కు ప్రతులు. 6. డున్ — పెక్కు ప్రతులు.

47 1 వెలయంగా — అ.ప.జ బ 2. మూడు (అర్ధబిందువులేని రూపము) గ$_1$

48 1 రాజవరుఁడైన పార్థివరాజుగాని యీతఁడని సేయఁగాఁదగఁడేనివాని — తి గు
2. జేయుదు — ఈ.తి న.ర. 3. ము కు — ల న.

49 1. లకు గోసహస్రంబులిచ్చి యపరిమితధనంబులు దానంబుచేసి — చ.ద.వి.శ.ష.

పి దర్పుండ[2]య్యెడ[3]మను బ్రాహ్మ[4]ణవచనంబు వడసి కర్ణుం గాంచన పీఠంబున నునిచి యంగరాజ్యమున కభిషిక్తుం జేసినఁ గర్ణుండును మణిమకుట కేయూరహారాదిభూషణభూషితుండై సకలరాజచిహ్నంబుల నొప్పి [5]పరమహర్షంబుతో[6]డం గురుపతికిట్లనియె.

50 క. బృహదబ్ధిమేఖలాఖిల, మహీతలక్షత్త్రివరసమక్షమున మహా
మహిమాన్వితుఁగా నన్నును, [1]మహీశుఁగాఁ జేసి తతి సమర్థత వెలయన్.

51 క. దీనికి [1]సదృశముగా మఱి, యేనేమి యొనర్తు నీకు నిష్టంబనినన్
మానుగ నాతోఁ జెలిమి మ,హీనుతముగఁ జేయు మిదియ యిష్టము నాకున్.

52 క. అనిన విని దుర్యోధనున కెంతయు సంతోషంబుగాఁ గర్ణుం డతనితోడి యిష్ట [1]సఖత్వంబున కొడంబడియె నంతఁ గొడుకు రాజ్యాభిషేకోత్సవంబు సూచి హర్షపరవశుండయి సూతుండు రథంబు డిగ్గి కర్ణునొద్దకుం బఱతెంచినఁ గర్ణుండును బితృగౌరవంబున [2]సంభ్ర[3]మించి వానికి వినయవినమితోత్తమాంగుం డయిన.

53 తే. కడఁగి సూతుండు పుత్త్రుకుఁ గౌఁగిలించి, కొని తదీయ [1]మూర్ధాఘ్రాణ మొనరఁ జేసి
యంగరాజ్యాభిషేకార్ద్రమైనశిరముఁ,దడిపె వెండియు హర్షాశ్రుతతుల[2]నొప్ప.

54 వ. దానిం జూచి భీముండు గర్ణుని సూతకులసంభవుంగా నెఱింగి నగుచు నిట్లనియె.

2. య్యెడమను — అ.ఆ ఊ.ఔ.క.గ౹.ట.త య ర 3. మని—భాసం. శ ష — కొన్ని ప్రతులు 4 ణాశీర్వాదంబులు వడసి—చ.ద భాసం.వీ శ.ష. 5. మహా— కొన్ని ప్రతులు. 6. డం — కొన్ని ప్రతులలో లేదు.

50 1. మహిపుంగా — ఆ.ఐ.ట.ద.శ.ష.

51 1. సాదృశ్యముగానేనేమి — గ₁.శ.ష. కొన్ని ప్రతులు.

52 1. సఖిత్వంబున — ష. పెక్కు ప్రతులు 2. సంభావించి — ఔ.గ౹.ద.భాసం.ల.వీ.శ.ష. 3. మించివానికి వినయ — ఆ.ఏ.ఐ.క.ఖ.ట.ప ; మించి వినయ—వా. పెక్కు ప్రతులు.

53 1. మూర్ధ్నిఘ్రాణ — అ.ఆ.ఊ.ఋ.క.ట.త.బ. భా.కూ. ర.స. 2. జేసి — ఔ.ఖ.వా.శ ; నొప్ప— పెక్కు ప్రతులు.

55 క. నీదుకులమునకుఁ దగఁగఁ బ్రతోదము [1]గొని రథము గడపఁ దొడఁగుము నృపధ
ర్మోదయుఁ[2]డగు నర్జునుతోఁ, గాదనక రణంబు సేయఁగా [3]నీకగునే.

56 వ. [1]మఱి యదియునుంగాక.

57 తే. ఉత్తమ[1]క్షత్త్రియప్రవరోప [2]యోగ్య, మైన యంగరాజ్యంబు నీ కర్హమగునె
మంత్రపూతమై గురుయజమానభక్ష్య,మగు పురోడాశమది కుక్క కర్హమగునె.

58 వ. అనినం గర్ణుండు [1]వెల్లనయి యెద్ది[2]యుం జేయునది నేరక దీర్ఘోష్ణనిశ్వాస
వ్యాకు[3]లితవదనుండయి యాకాశంబు[4]వలన నున్న యాదిత్యుం జూచుచు
మిన్నకుండె నంత [5]నంతర్విలులితుండయిన యక్కర్ణుం జూచి ఛాత్రపద్మ
వనమధ్యంబున నుండి దుర్యోధనమదాంధగంధసింధురంబు వెలువడి వచ్చి
కడు నలిగి భీమున కిట్లనియె.

59 క. అనిలజ నీకిట్లని ప[1]ల్కను దలపనునగునె లేడికడుపునఁ బులి పు
ట్టునె యిట్టి దివ్యతేజం, బునవాఁ డధమాన్వయమునఁ బుట్టునె చెపుమా.

55 1. తో—ఓ.కసం.బ. 2 డర్జునుతోడను—కసం. గు. 3. నేమిటికిన్—క.

56 1. కొన్నిట నీవచనము లేదు.

57 1. క్షత్రకులపురుషోపయోగ్య—క. 2 భోగ్యమైన — ఊ ఒ.డ. ఛాసం. ల

58 1 వెలువెల్లినయి — ఛా.కూ 2. యు ననేరక— అ.బ.య ; యుం జేయనేరక—
ఔ. 3. లవదనుండయి—పెక్కుప్రతులు. 4. వల — పెక్కు ప్రతులలో లేదు. 5. నతి
వ్రీడితుండయిన — చ.మ.ల.వీ.శ.ష ; నతి లజ్జితుండైన — ఊ ; నతి విభ్రాంతుం
డైన—వ.

59 1. ల్కను జనునే దలఁప లేడి—అ.ఔ ద. ఛాసం. మ.వీ.శ.ష.

60 సీ. [1]శూరులజన్మంబు సురలజన్మంబును నేఱులజన్మంబు నెఱుఁగ నగునె
మొగిని దధీచి [2]యెమ్ముననఁ బుట్టదయ్యేనే వాసవాయుధమైన వజ్రమదియు
గాంగేయుఁ డన మఱి కార్తికేయుండన నాగ్నేయుఁడన రౌద్రుఁ డనఁగ శరవ
ణోద్భవుండన గుహుం డుద్భవిల్లఁడె శరస్తంబజన్ముఁడు గాఁడె ధర్మవిదుఁడు

తే గృపుఁడు ఘటసంభవుఁడుగాఁడె కీర్తిపరుఁడు, వరుఁడు ద్రోణుండు విప్రుల వలనఁ బుట్టి
రె రెసక్షత్రి[3]యుల్ ఘనులవనిఁ గావఁ, గడఁగి మీజన్మములు నిట్లకావె [4]వినఁగ.

61 వ. [1]వానితోడి దే[2]మి దివ్యలక్షణలక్షితుండును సహజకవచకుండలమండి[3]తుండును
గాని [4]ప్రకృతిపురుషుండు గాఁడు తనబాహుబలంబున నీ యంగరాజ్యంబునక
కాదు సకలమహీరాజ్యంబునకు నర్హుండగు ననుచున్నయంత నాదిత్యుం
డస్తగతుండైన నస్త్రసందర్శనరంగంబు వెలువడి దుర్యోధనుండు గర్ణుం
దోడ్కొని కరదీపికాసహస్రం[5]బుతో నిజమందిరంబున కరిగెఁ బాండవులును
భీష్మద్రోణవిదురకృపాచార్యులతో నిజనివాసంబుల కరిగిరి.

62 ఆ. కుంతియంత సహజకుండలకవచాభి,రాముఁ గర్ణుఁ జూచి రవిసమానుఁ
బ్రత్యభిజ్ఞ నెఱిఁగి ప్రథమపుత్త్రి స్నేహ, మెఱుకపడ[1]కయుండ [2]నింతియుండె.

63 క. వినుత ధనుర్విద్యావిదు, ఘనుఁ గర్ణు సహాయుఁ బడసి కౌరవవిభుఁడ
ర్జును వలని [1]భయము సెడి తో, మ్మనఁ జేయిడి నిద్రవోయె ముదితాత్ముండై.

60 1. మూలము — శూరాణాంచ నదీనాంచ దుర్విదాః ప్రభవాః కిల. చిత్రశాలాప్రతి
2. యెమ్ముల — కొన్ని ప్రతులు. 3 యుల్ ఘనులవని — గ్1.చ.ద. భాసం. వీ.శ.ష ;
యప్రభులవని — వా.శ. కొన్ని ప్రతులు. 4. తెలియ — న ; తలప — అ.త.

61 1 దా — కొన్ని ప్రతులు. 2 మి వీడు దివ్య — కొన్ని ప్రతులు. 3. తుండు
గాని — పెక్కు ప్రతులు. 4. ప్రాకృత — గి.చద. భాసం. శ.ష. 5. బులు
వెలుంగ — అ.చద.వీ.శ.ష.

62 1. గనీక — ఓ.ల. 2. యింతి — ఓ.క.జ.డ.

63 1. భయము విడి — ఋ.

-: *కౌరవ పాండవులు గురుదక్షిణార్థంబు ద్రుపదుం బట్టఁ జనుట* :-

సం. 1-127-1

64 వ. అంతఁ బ్రభా[1]తంబగుటయు [2]సమయనియమంబులు దీర్చి యాచార్యుండు శిష్యులనెల్ల [3]రావించి మీరు నాకు గురుదక్షిణ యిండనిన నందఱు మ్రొక్కి యెదురనిలిచి మీకెద్ది యిష్టంబు సెప్పుండనిన విని యవివేకకారణదారుణై [4]శ్వర్యావలిప్తుండైన ద్రుపదు [5]నోడిచి పట్టి తెం డిదియ [6]నాకిష్టంబైన గురుదక్షిణ యని పంచిన.

65 క. వల్లెయని రాజనందను, లెల్లను సమకట్టి రథములెక్కి దిశల్ భే దిల్లఁగ గర్జిల్లి నిశా,తోల్లసితకృపాణకార్ము[1]కోద్యతకరులై.

66 ఉత్సాహము. ఏలదీని నెడయుఁ జేయ నీక్షణంబ యేఁగి పాం
చాలుఁ బట్టి తెత్త మధికశౌర్య[1]లీల మెఱయఁగాఁ
బోలు ననుచుఁ బెరిఁగి రాజపుత్త్రు [2]లెల్ల నరిగి పాం
చాలుపురము [3]ముట్టికొని రసంఖ్యబలసమేతులై.

67 వ. పాండవులును రథంబు[1]లెక్కి ద్రోణుం బరివేష్టించి పిఱుంద నరిగిరంత నర్జునుం డాచార్యున కిట్లనియె.

64 1 తసమయంబగుటయు – పెక్కు ప్రతులు 2. దత్సమయనియమంబులు— ఔ.గి$_1$. చ.ద. భాసం. వీ.శ.ష ; సమయకృత్యంబులు - వా శ. కొన్ని ప్రతులు, కొన్ని ప్రతులలో నీ మాటలు లేవు. 3. రావించి నాకు — వా. కొన్ని ప్రతులు ; రావించి మీరు నాకు – ఔ.చ ద.వీ.శ.ష. 4 శ్వర్యలతావలిప్తుడు—అ.ఋ.ఐ.ఔ.స ; శ్వర్య గర్వితుండగు – గి చ.ద. భా.సం. వీ.శ.ష ; శ్వర్యబలావలిప్తుడు — ఎ.ఒ.జ.ట ; శ్వర్యమదావలిప్తుఁడు – స. 5. నోడించి — కొన్ని ప్రతులు. 6. నాకిష్టంబైనగురు— ఔ.గి.గ.చ.ద.వీ.శ ష ; నాకు గురు - వా కొన్ని ప్రతులు

65 1. కోద్యత్కరులై - ఊ.ఐ.జ త ద. భాసం.ల

66 1. శక్తి—కొన్ని ప్రతులు ; రేఖ — ప. 2. లెల్ల నరిగి పాంచాలు — ఆ.ఐ.క.గి$_1$.చ. జ.ట.ద.ప.భాసం. వీ.శ ష ; లరిగి యార్చి పాంచాలు—వా కొన్ని ప్రతులు. 3. చుట్టుకొని — ఎ.ఓ.బ.మ.య.

67 1. లెక్కియాయుధ సన్నద్ధులై—ఈ.ఎ.

68 క. వడిగొని కౌరవు[1]లొండొరుఁ, గడవఁగ [2]మునుచనిరి వారిగర్వము హూడం
[3]గడిమిని ద్రుపదాధిపుతోఁ, బొడువఁగఁ దమకలవి యగునె భుజవీర్యమునన్.

69 క. [1]అతగులచే ద్రుప[2]దుఁడనవ, హితుఁడై పట్టువడ నంతహీనుఁడె శౌర్యో
న్నతుఁ డధికధనుర్విద్యా,న్వితుఁడు భవత్సఖుఁడఁగంగ విన[3]రొక్కొ వానిన్

70 వ. అనుచుఁ బాంచాలుపురం బాసన్నంబుగాఁ జనుదెంచు నంతకు [1]ముందఱ చని దుర్యోధన యుయుత్సు దుశ్శాసన వికర్ణ జలసంధాదులైన ధార్తరాష్ట్రు లనేకనృపకుమారసహితులై పాంచాలుపురం [2]బవరోధించినఁ బాంచాలపతి [3]యలిగి యపారచతురంగబలసమేతుండై కౌరవులం దాఁకి

71 క. శరనికరసహస్రంబులఁ, బరువడి నందఱను గప్పెఁ బ్రావృడ్ధారా
ధర మురుధారాజలముల, సరసిజములఁ గప్పునట్లు సంరంభమునన్.

72 క. కలయ ససిముసలదండం, బులు గొని కాంపిల్యనగరమున జనులెల్లన్
నలిరేఁగి యార్చి కౌరవ, బలసుభటులఁ బొడిచి రాజి బడలువడంగన్.

73 క. ధృతరాష్ట్ర[1]కుమారకు లవ,హితులై పాంచాలుమీఁద నేసిరి సాంద్రా
తతబాణప్రకరతతిరో, హితమై రవికిరణజాల మేర్పడ కుండన్.

74 క. వారలశరములు నడుమన, వారించుచు నధికలాఘవంబున వారిన్
ఘోరశరవిద్ధ[1]మర్ములఁ, గారణమున సోమకుండు ఘనుఁడై యేసెన్.

68 1. లందఱుగడువఁగ — క.గి1.చ.ల.శ.ప. 2. నేగెదరు — ఐ.క.ట; మునుఁజనిరి—గి1.చ.ద.ల.శ.ప. 2. పొడవు సెడి మరలివత్తురు — ఖ.

69 1. ఇతరులచే — గి.చ.ట.డ.ద.య.పీ.శ.ప, మతిమంతుడుద్రుప — అ; అతగుఁడు, హాతకశబ్దతద్భవమని భా కూ. 2 దుఁడు బలహృతుఁడై — ఋ.ఊ.ఎ.ఐ.ఒ.ఓ.క.జ.త.ప.బ.భా సం.మ. 3. రోవానిన్ — ఐ.డ, రకో — ఎ.జ.త.బ.భా.కూ.

70 1. ముందరఁ జని — గి1.శ.ప. 2 బుపై విడిసిన — ఋ.ఒ.క.గి1.చ.జ.ట.ద.పీ.శ.ష. 2. యెఱింగి — గి1.చ.త.ద.బ.పీ.శ.ప.

73 1. కుమారకులవహితులై — గి1.చ.ద.శ.ప; కుమారులునవహితులై — వా. పెక్కు ప్రతులు.

74 1. వర్ములఁగా — గి1.శ.ప. కొన్ని ప్రతులు.

75 క. నానావిధమార్గణముల, నానామార్గముల నేసినం గురువీరుల్
వానిఁజూచి [1]భయంపడి, నానాతనుఁగా మనంబునన్ [2]వగచి రనిన్.

76 వ. ఇట్లు పాంచాలుబాణవృష్టి[1]కి [2]నిలుపోపక కురుకుమారులు కుమార[3]శర నిహతసురారికుమారులుంబోలె [4]వెఱచఱచి పాండవులయొద్దకుం బఱ తెంచినం జూచి యర్జునుం [5]డాచార్యధర్మజులకు నమస్కరించి [6]మీరలింద యుండుం డే నీక్షణంబ యప్పాంచాలుం బట్టి తెచ్చెదనని విజృంభించి సంరంభంబున భీమసేనుండు [7]దనకు సేనాగ్ర[8]చరుండుగా మాద్రేయులు రథ చక్రరక్షకులుగా ద్రుపదరాజవాహినీసముద్రంబు దఱియం [9]జొచ్చిన.

*—: భీమార్జునులు ద్రుపదునిసేనను దునుమాడుట :—*

సం. అను 1-78-40 పంక్తి

77 క. కరిఘటలఁ దాఁకి భీముఁడు, [1]కరటి[2]కటీకుంభ[3]దంతకర[4]ముఖముల జ
ర్జరితములఁ జేసె నిష్ఠుర, తరవజ్రనిపాతపటుగదాఘాతము[5]లన్.

78 ఉ. దారుణమౌ వృకోదరుగదాకులిశాహతి నన్యవాహినీ
వారణసంచయం బభినవక్షత [1]జారుణధార లొప్ప సం
చారితధాతునిర్ఝరవిశాలశిలోచ్చయసంచయాభమై
వీరరణంబునం బడియె విక్షతహస్తిపవృక్షపంక్తితోన్.

---

75 1. సహింపక-ఔ.గి.చ.ద ర.శ.ష.స. 2 దలచిరొగిన్-ఐ; దలచిరనిన్-పెక్కుప్రతులు.

76 1, కి వెరచరచి, కి వెరచి—కొన్ని ప్రతులు. 2 నిలువనోపక — అ.క గి$_1$.చ.డ.ద.బ. య.ర.వీ శ ష. 3. శరాసనశరాసారనిహత — గి$_1$ చ.ద.శ ష, శరనిహతికింగాక పారుసురారి—ల.స. 4 వెఱచి — పెక్కు ప్రతులు 5. డాశ్చర్యంబు నాంది నగుచు నాచార్య—ల.స. 6. మీరిందయుండు — కొన్ని ప్రతులు. 7. దనకు — పెక్కింట లేదు. 8 సరుండుగా — ఆ మ. 9 జొత్తెంచిన — ఓ.బ.స.

77 1 కరటీకటికుంభబింబకముల్లెను — న ; కరటి — పెక్కు ప్రతులు ; గరట తటీకుంభ బింబ — వా. 2 కటీ — ఈ.ఊ.ట.డ భాసం. 3. దంత — భాసం. ల ; బింబకముల్లెను — కొన్ని ప్రతులు. 4. ముఖమును — భాసం. ఇతరత్ర కాన్పించదు. 5. నన్—పెక్కు ప్రతులు.

78 1. జారుణ — ఋ.ఒ.జ.డ.త భాసం. వ-స ; దారుణ — అ.ఈ.గ.య ; శోణిత — వా. కొన్ని ప్రతులు.

79 చ. అనిలజుఁ డుగ్రుఁడై ద్రుపదుహస్తిఘటావలి నశ్వసంహతిన్
ఘనరథకోటి భగ్నములుగా సమరంబునఁ జేసి పేదదు
ర్మనుజులఁ జంపనేల యని మానుగ గోపుఁడు గోగణంబులన్
గొనకొని రొప్పు[1]నట్టు లధికుం డెగిచెం బృథుదండహస్తుఁడై.

80 స్రగ్ధర. అంతం గౌంతేయుఁ డత్యాయత[1]భుజుఁడు నరుం డగ్గి పాంచాలుదంతి
ధ్వాంతంబున్ వాని వాహోత్తమ[2]తుహినతతిం దద్భటోదారతారా
సంతానంబున్ శరాంశూచ్చయవిభవమునన్ శాంతిఁ బొందించి యుద్య
ద్ధ్వాంతారాతిప్రభుండై [3]తనరుచు వెలిఁగెం దద్రణవ్యోమవీథిన్

81 క. అతనిఁ జూచి సహింపక, యాతతకార్ముకుఁడు ద్రుపదునసుజుఁడు శౌర్యో
[1]పేతుఁడు సత్యజితుం డను, నాతఁడు [2]ధీరుఁడయి తాఁకె నతిరభసమునన్.

82 క. కడఁగి ద్రుపదానుజుఁడు నెవ్వడిఁ గవ్వడి నేసె నూఱువాఁడి[1]శరములం
గడు నలిగి వాని నన్నియు, నడుమున తునియంగ నేసె నరుఁ డస్త్రములన్.

83 క. వివిధాస్త్రకోవిదుఁడు వా,సవి వాని[1]రథంబుఁ [2]బార్ష్ణిసారథుల మహిం
[3]గువలువడ నేసె నుగ్రా,హవమునకును వాఁడు విముఖుఁడై చెడి పఱవన్.

84 వ. అంత.

79 1. చందమున గుండడిచెం—ఋ, నట్లయధికుండు—ర.

80 1. యశుఁడు – వా శ. కొన్ని ప్రతులు ; భుజుఁడు – వీ.శ.ష కొన్ని ప్రతులు. 3. తనరుచి వెలుగన్ – ఐ.వ.స.

81 1. పేతుఁడగుసత్యజిత్తునునాతఁడు — అ ఆ ఔ.క.ఖ డ య. 2. భీభత్సుదాకె — అ. ఈ.ఖ.త.ర ల.వీ ; వీరుడయి — కొన్ని ప్రతులు.

82 1. శరంబుల్ — పెక్కు ప్రతులు.

83 1. రథాశ్వములను సారథిని వడిన్ — మ. 2 రథ్యసారథుల మహిన్ — పెక్కు ప్రతులు. 3. తివిరి వడినేయ — స ; భువిగూలనేసె నుగ్రా — కొన్ని ప్రతులు ; గవులు — ఋ ఎ.ట ; కువులువడ — భా కూ. ఏక పదవివక్షచే 'పా' కు 'వా' రాలేదు. అని యిచ్చటి వ్యాఖ్య.

85 క. శరమోక్షణవేగస్థిరం, తరమండలితోరుచాప[1]దండుఁ డకాండో
ద్ధురదండధరు[2]ఁడ పోలెను, హరినందనుఁ దాఁకె ద్రుపదుఁ డత్యుద్ధతుఁడై.

86 మ. పరమాస్త్రిక[1]విశారదుల్ బలయుతుల్ పాంచాలకౌంతేయు లొం
డొరులన్ మార్కొని యేయునప్పుడు దదీయోగ్రాజిరంగంబు దు
స్తరనీరంధ్రనిశాతసాయకతమస్సంఛన్నమైనం బర
స్పరయుద్ధంబులు దక్కి[2] యోధులు [3]నిశాభ్రాంతాత్ములై [4]రచ్చటన్.

-: అర్జునుఁడు ద్రుపదుం బట్టి కట్టి తెచ్చుట :-

సం. 1—128—3

87 వ. అట్టి మహాద్వంద్వయుద్ధంబున విజిగీషుండయి పాంచాలుండు పాండవమధ్యము ధనుర్మధ్యంబు భగ్నంబుగా నొక్కబాణంబున నేసి యార్చిన నలిగి వాసవసుతుం డు[1]ద్యతాసిహస్తుండయి శైలస్థలంబుమీఁదికి లంఘించు కొదమసింగంబునుంబోలె ద్రుపదురథంబుమీఁదికి లంఘించి వానిం బట్టి కొనినఁ దత్సైన్యంబు [2]హాహాకారంబు లెసంగ మహార్ణవంబునుంబోలె మ్రోయుచుండె నంత.

88 క. [1]ప్రక్షీణదర్పు ద్రుపదు ర,థాక్షముతోఁ గట్టితెచ్చి యరునుఁడు క్రియా
దక్షుండయి గురునకు గురు,దక్షిణ[2]గా నిచ్చిచేసెఁ దత్సమ్మదమున్.

89 వ. ద్రోణుండును నర్జునుచేసిన పరాక్రమంబునకుఁ బరమ[1]హృష్టహృదయుండై ద్రుపదుం జూచి నగుచు నిట్లనియె.

---

85 1. ధరుఁడునఖండోద్ధుర — ర; ధరుఁడునకాండోద్ధుర—య; దండునకాండోదుర—భాసం. పి.శ.ప. 2. డని — అని పాఠములు.

86 1. విధుల్ మహాబలయుతుల్ — న. 2. యోధలు — ఆ.గి.చ.శ.ష; జోదులు — ర.స. 3. భయభ్రాంతాత్ము—అ ఇ.ట.డ.త.ల.న; దిశాభ్రాంతాత్ము — పెక్కు ప్రతులు. 4. రందఱున్ — రత్తఱిన్, రెంతయున్ — అని పాఠములు.

87 1. ధృతాసి — కొన్ని ప్రతులు. 2. మహాధ్వనులెసంగ — కొన్ని ప్రతులు; హాహాధ్వనులెసంగ—వా. కొన్ని ప్రతులు; హాహాకారంబు—ఐ.గ.

88 1. అక్షీణబలుఁడు ద్రుపదు రథాక్ష — స. 2. దానిచ్చి—కొన్ని ప్రతులు.

89 1. ప్రీత — పెక్కు ప్రతులు.

90 క. వీ రెవ్వరయ్య ద్రుపదమహారాజులె యిట్లు కృపణులయి పట్టువడన్
[1]వీరికి వలసెనె [2]యహహా మహారాజ్యమదాంధకారమది వాసెనొకో.

91 ఆ. ఇంకనైన మమ్ము నెఱుఁగంగ [1]నగునొక్కొ, యనుచు నుల్లసంబులాడి [2]ద్రుపదు
విడిచిపుచ్చె [3]గురుఁడు విప్రుల[4]యలుకయుఁ, దృణహుతాశనంబు దీర్ఘమగునె.

*—: ధృతరాష్ట్రుఁడు యుధిష్ఠిరుని యౌవరాజ్యాభిషిక్తుని జేయుట :—*

సం. 1-79-191

92 వ. ఇట్లు ద్రుపదుండు ద్రోణుచేత విముక్తుండయ్యుఁ గోపపాశబద్ధుండయి యప్పరిభవంబునకుం బ్రతీకారంబు [1]సేయ సమకట్టి బ్రాహ్మణోపాస్తి [2]సేయుచుండె నంత నిట ధృతరాష్ట్రుండు యుధిష్ఠిరు రాజ్యభారధురంధరుంగా నెఱింగి భీష్మ[3]విదురులతో విచారించి యౌవరాజ్యాభిషిక్తుం జేసిన.

93 చ. [1]నలువురు దమ్ములున్ [2]బలిమి నాలుగుదిక్కులు నోర్చి సర్వభూ
తల[3]మున రాజనందనుల దర్పమడంచుచు భూరి వస్తురా
సులు [4]గొని [5]వచ్చి [6]యీఁగొని విశుద్ధయశోనిధి యొప్పె ధర్మజుం
డలఘుఁడు యౌవరాజ్యయుతుఁడయ్యును బెంపున సార్వభౌముఁడై.

90 1. వీరికిని వలసెనె యహహా, యారాజ్య — య 2 యిపుడు — చ ద.వీ శ ష.స.

91 1. తగునొక్కొ — న 2. కడిమి — డ. 3 ద్రుపదు — డ 4. కోపంబు — ఉ.ఎ ఔ. ఇచ్చట మూలము "మాభైః ప్రాణభయాద్వీర। క్షమిణో బ్రాహ్మణా వయమ్" ద్రోణుఁడు ద్రుపదుని రాజ్యములోఁ గొంత భాగము నాక్రమించుట నన్నయ విడిచెను. ఖా.కూ.

92 1. సేయందలంచి — ఐ.ఔ గ$_1$.చ.త.ద.వీ.శ.ష. 2. సేయుచు పురంబు సొర నొల్లకయుండె — మ; సేయుచుండె ద్రోణుడు రాజకుమారసహితుండై హస్తిపురంబునకు మగుడి వచ్చెనంత — ఉ. 3 విదురాదులతోడ - అ.ఆ.ఖ.న.ర ల.

93 1. నలుగురు — ఖ గ.డ.బ.ర. 2. దగఁగ — చ.ద.వీ.శ.ష. 3. ముల — ఈ.ఔ.య. 4. వడి — ఉ. 5. తెచ్చి — ఉ.వ. 6. యిచ్చిన — ఋ.క.ఖ.డ.ల.వ; నం గొని — ద య.

94 వ. [1]మఱియును.

95 క. [1]బద్ధపరంపర [2]నొప్పె మ, దోద్ధతగజరథతురంగయుద్ధముల గదా
యుద్ధములఁ జూడ నెందుఁ బ్ర,సిద్ధుఁడు మధ్యముఁడ [3]యను విశిష్టస్తవముల్.

96 చ. అనుపమకార్ముకాదివివిధాయుధ[1]విద్యలయందుఁ గోవిదుం
డనఁగ [2]నజయ్యుఁడై పరగు నర్జునుఁ బోలఁగ నన్యులెందు లే
[3]రను జనఘోష [4]ముచ్చరితమయ్యె మరు[5]చ్చలితోచ్చవీచిని
స్వనముఖరాబ్ధివేష్టితవిశాలమహీవలయాంతరంబునన్.

97 క. యము లమితశౌర్యు లరినృప, యము[1]లమలచరిత్రనిరతు లనఁగా సత్యు
త్తమశక్తి నన్నలకు విన,యము మెఱయుచు నుండి రథికులై బహుకళలన్.

—: భారద్వాజుం డర్జునునకు బ్రహ్మశిరోనామకదివ్యబాణం బొసఁగుట :-

సం. అను 1-80-20 పంక్తి

98 వ. ఇట్లు పాండుకుమారు [1]లపారగుణంబుల నెల్లవారికి నారాధ్యులయి [2]పరగు
చున్న నందు ధనుర్విద్య నర్జును దృఢముష్టిలాఘవలక్ష్య[3]వేధిత్వదూరాపాత
జితశ్రమత్వంబులకు నసి[4]గదాశక్తి[5]తోమరాదిప్రహరణప్రవీణతకుం బరమహీ

94 1. కొన్నింట నీవచనము లేదు

95 1 యుద్ధపరంపర — న య. 2. నొప్పి — ఉ ఎ.ఓ.బొ.క జ.ట డ.బ ర. 3. యని వి
శిష్టులు పొగడఁ — ఋ.బొ ట ద.ర ల

96 1. యుద్ధములందు — ఐ. 2. నజేయుడైన — అని వ్రాఁతప్రతులు. 3. డను —
$గ_1$ చ.ద వి శ ష 4. ముచ్చలితమయ్యె — అ.ఉ.క ఖ.$గ_1$ చ.జ.డ.ద.వి.శ.ష.
5 చ్చలితాభ్రవీధి — బొ

97 1 లతులచరిత్ర — వ

98 1. లపారగుణంబుల — త ర లలో లేదు 2 పెరుగు — కొన్ని ప్రతులు.
3. భేదిత్వ — ఓ.గ.ర ; వేధ — మ. 4 గదాది వివిధ — $గ_1$.చ.ద.ఖాసం.వి.
శ.ష. 5. తోమరకుంతాది ప్రహరణ — న ; తోమరాది వివిధప్రహరణ — మ.ల.

పాలపరాజయో[6]త్పాదనపరాక్రమంబునకుఁ దనవలని భక్తిస్నేహంబులకు మెచ్చి భారద్వాజుండు వానికి [7]బ్రహ్మశిరంబను దివ్యబాణంబు [8]సప్రయోగ నివర్తనంబుగా నిచ్చి యిట్లనియె.

99 ఉ. దీని నగస్తి నాఁబరగు దివ్యమునీంద్రుఁడు దొల్లి ప్రీతితో
భూసుత [1]యగ్నివేశుఁడను భూరిమునీంద్రున కిచ్చె [2] వారలున్
మానుగ నాకు [3]నిచ్చిరి క్రమంబున నేనును నీకు నిచ్చితిన్
దీనికి నీవ యర్హుఁడవు తేజమునం గడుఁబెద్ద గావునన్.

100 వ. దీని మానవులయందుఁ బ్రయోగింపకుండునది యల్పతేజులయందుఁ బ్రయుక్తంబయి యిది జగంబులఁ గాల్చు [1]నిన్ను బాధించునట్టి మానవులు గలిగిరే[2]ని ప్రయోగించునది వారి[3]సత్త్వమంబున సాధించునని దాని మహిమ సెప్పి నీవు నీబంధు[4]సమేతుంబున నాకు గురుదక్షిణ యిమ్మది యెయ్యది యనిన [5]నాయుద్ధంబు సేయునపుడు [6]నాతో నెన్నఁడుఁ బ్రతి యుద్ధంబు సేయ[7]కుండు మిదియ నాకు గురుదక్షిణ యనిన నర్జునుండు వల్లెయని యాచార్యునకు నమస్కరించి దాని కొఁడంబడియె నంత దుర్యోధనుండు యుధిష్ఠిరుయౌవ[8]రాజ్యాభిషేకంబునకు భీమార్జునయముల పరాక్రమం[9]బునకు మనంబున [10]సహింపనోపక కర్ణశకునిదుశ్శాసనులతో మంతనంబుండి యిట్లనియె.

6. త్పాదిత — పెక్కు ప్రతులు 7. బ్రహ్మశిరోనామకంబగు — అ.ఈ.గ.ట. డ.న.బ.య. 8. సంప్రయోగరహస్యనివర్తన పూర్వకంబుగా నుపదేశించి — ల.

99 1. యగ్నిదేశ్యుఁడను— $గ_1$ భాసం ల శ ష 2. నాతడున్— ష 3. నిచ్చెను గ్ర— ష

100 1 మరి నిన్ను - పెక్కు ప్రతులు. 2. నివారి మీఁదఁ - $గ_1$ చ.ద.బ.పి శ ష. 3 నక్షణంబున — ర , సత్త్వమంబున సాధించు సురాసురమానవుల యందు నీ కసాధ్యంబు లేదు కలిగిరేని వారి నీ దివ్యాస్త్ర బల్రమంబున జయించునని — ఒ.బ.ర. 4 జననము — అ ఆ.ఒ.ఖ మ. 5. నేను యుద్ధంబు — $గ_1$.చ.జ.ద. భాసం వి.శ.ష. 6. నాతో నెన్నండు — కొన్ని ప్రతులలో లేదు. 7. కుండు నది యిది — ఆ.ఐ ల. 8. రాజ్యాభిషేకంబును — పెక్కు ప్రతులు. 9. బును — పెక్కు ప్రతులు. 10. సహింపనోపక — పెక్కు ప్రతులు ; సహింపక — వా కొన్ని ప్రతులు.

-: కణికనీతి :-

సం. 1–81–10

101 సీ. ఆయుధవిద్యలయందు [1]జితశ్రములనియును రణశూరులనియు సంత
తోత్సాహులనియు [2]సత్యుద్ధతులనియును భయమందుచుండుదుఁ బాండ
వులకు
దానిపై నిప్పుడు ధర్మజు యువరాజుఁ జేసె రా జే నేమిసేయువాఁడ
నృపనీతి యెయ్యది నిరతంబుగా [3]మీర[4]నా కెఱిగింపుఁడు నయముతోడ

ఆ. ననిన వినియుఁ [5]గణికుఁ డనువాఁడు సౌబలు, నాప్తమంత్రి నీతులందుఁ
గరము
కుశలుఁడైనవాఁడు [6]కురుకులవల్లభు, నిష్టమునకుఁ దగఁగ నిట్టులనియె.

102 తరువోజ. ధరణీశుఁ [1]డుద్యతదండుఁడై యుచితదండవిధానంబుఁ దప్పక
ధర్మ
చరితులఁగా మహీజనుల రక్షించి సద్వృత్తుఁ డగు[2]నది సర్వవర్ణములు
వరుసన తమతమవర్ణధర్మముల వర్తిల్లుదురు గడవక దండభీతి
నరిమిత్రవర్జితుఁడై సమ[3]బుద్ధియగు మహీవల్లభు ననుశాసనమున.

101 1. జితశ్రమ·ల్ రణశూరులనియునురయిముతోడ, సంతతోత్సాహులుసత్యసంధులు
నని ......భయ — న 2 సత్యుత్తములనియు — అ. 3. మీరు —
పెక్కు ప్రతులు. 4. నా కెఱిగింపు డీ నయముతోడ — ఉ.మ. 5. కణింకుఁడను
వాఁడు — చ శ.ష ; గణికుఁడు — $గ_1$. ''తతః కణింకమానాయ్య ధృతరాష్ట్రో ఽ
బ్రవీదిదమ్. మూలము పి.పి.యస్ ప్రతి 904 పుట. కణికం మంత్రిణాం శ్రేష్ఠం
ధృతరాష్ట్రో ఽ బ్రవీద్వచః అని చిత్రశాలా ప్రతి, 244 పుట 6. కువలయా
ధీశ్వరు — ఐ.

102 1. డుద్ధత — కొన్ని ప్రతులు ; డుద్యత దక్షుడై — న. 2. నేని — కొన్ని
ప్రతులు . 3 వృత్తి — ఉ ఊ ఋ ఎ.జ.ల.స ; వర్తి — ఈ.ఒ.

భండార్కరు ప్రతియందు (అధ్యాయములు 128,129) కణికనీతి విడువఁబడినది.
574 పుట లోని జ్ఞాపిక చూడనగును.

నన్నయ (క్రీ.శ. 1050) భారతములో కణికనీతి ప్రశంసలేదని భండార్కరు ప్రతి
నుడువుచున్నది క్షేమేంద్రుని భారతమంజరిలోఁ గూడ కణికనీతి లేదని భండా

103 క. గుఱుకొని కార్యాకార్యము, లెఱుఁగక [1]దుశ్చరితుఁడై యహితుఁడగు నేనిన్
మఱవక [2]గురునైనను జను, లెఱుఁ[2]గఁగ శాసించునది మహీశుఁడు బుద్ధిన్.

104 క. ధీరమతియుతులతోడ ని, చారము సేయునది మును విచారితపూర్వ
[1]ప్రారబ్ధమైన కార్యము, పారముఁ బొందును విఘాతపదదూరంబై.

105 క. జనపాలుఁడు మృదుకర్మం, బున నైనను గ్రూరకర్మమున నైనను నే
ర్పున నుద్ధరించునది [1]ద, న్ననపాయతఁ బొందిచేయునది [2]ధర్మంబుల్.

106 క. అమలినమతి నాత్మచ్ఛి, ద్రము లన్యు లెఱుంగకుండఁ దా నన్యచ్ఛి
ద్రము లిమ్ముగ నెఱుఁగుచు దే, శముఁ గాలము నెఱిఁగి మిత్రసంప
న్నుండై.

107 క. బలహీనుఁ డైనచో శ, త్రులఁ [1]జెఱుచుట నీతి యధికదోర్వీర్యసుహృ
ద్బలుఁ డైనవారిఁ [2]జెఱుపఁగ నలవిఱె యక్లేశసాధ్యులగుదురె మీఁదన్.

ర్కరు సంస్థవారు వ్రాయుచున్నారు జావా ప్రతి (క్రీ.శ. 1000) లోఁ గూడ ఇది లేదని వారే చెప్పుచున్నారు. మూలభారతము మీఁద రచింపఁబడిన వ్యాఖ్యలలో మిక్కిలి పురాతనమైనదిగా భావింపఁబడు దేవబోధవ్యాఖ్యలో కణికనీతి వ్యాఖ్యా నింపఁ బడలేదని భండార్కరు ప్రతి తెలుపుచున్నది శాంతిపర్వమునందు శత్రుంజయునకు భరద్వాజునిచే నుపన్యసింపఁబడిన రాజనీతి సారాంశమే కణికనీతి యని వీరిమతము. కాని మేము చూచిన తాళపత్రప్రతులలోను, ముద్రితప్రతుల లోను కణికనీతి కనఁబడుచున్నది. నన్నయ భారతములో నిది ప్రక్షిప్తమనుటకు నాధారమేమో తెలియదు. పర్వానుక్రమణిక, పర్వసంగ్రహ భాగములందు మాత్రము కణికనీతి ప్రశంసలేదు

103 1 దుశ్చిత్తుఁడయి యహితు — వ. 2 సుతు — వ.స 3. గక — అ.ఉ. ఒ ఓ.ఔ క.ఖ.గ.జ.డ త ద ప మూలము నందు దీనికి సరిపడు శ్లోకము కాన్పించదు.

104 1 ప్రారంభమయిన - వీ.శ.ష. పెక్కు ప్రతులు

105 1 దా ననపాయత — అ.ఓ.ఖ.గ.త.బ ; దన్ననపాయతఁ బొందఁ జేయువది కర్మంబుల్ — గ$_1$.చ.ద.య.ల వీ శ.ష. 2. కార్యంబుల్ — కొన్ని ప్రతులు.

107 1 జదుపుట — గ$_1$.చ ద.శ.ష.శర ; జరచుట—వ. 2. జదుపఁగ — చ.ద.శ ష.

108 క. అలయక పరాత్మకృత్యం,బు[1]లఁ [2]బతి యెఱుఁగునది దూతముఖముసఁ బరభూ
ములవృత్తాంతము తెలుఁగఁగఁ, బలుమఱుఁ [3]బుచ్చునది వివిధ[4]పాషండ తతిన్.

109 క. నానావిహారశైలో, ద్యానసభాతీర్థదేవతాగృహమ్ముగయా
స్థానముల కరుగునెడ మును, మానుగ శోధింపవలయు మానవ[1]పతికిన్.

110 తే. వీరు నమ్మంగఁ దగుదురు వీరు నమ్మఁ,దగరు [1]నాకు నా వలవదు తత్త్వబుద్ధి
నెవ్వరిని విశ్వసింపక [2]యెల్లప్రొద్దు, నాత్మరక్షా [3]పరుండగునది విభుండు.

111 ఉ. [1]ఇమ్మగ నాత్మరక్ష విధియించు[2]విధంబున మంత్రరక్ష య
త్నమ్మునఁ జేయఁగావలయుఁ దత్పరిరక్షణశక్తి నెల్లకా
ర్యమ్ములు సిద్ధిఁబొందుఁ బరమార్థము మంత్రవిభేదమైనఁ గా
ర్యమ్ములు నిర్వహింపఁగ బృహస్పతికైనను నేరఁబోలునే.

112 క. పలుమఱు శపథంబులు నం,[1]జలియును నభివాదనమును [2]సామప్రియభా
షలు మిథ్యా[3]వినయంబులుఁ, గలయవి దుష్టస్వభావకాపురుషులకున్.

108 1 లు – చాల ప్రతులు. 2 మతినెరుగునది — మదినెరుగునది – యని పాఠములు 3. బంచునది – కొన్ని ప్రతులు. 4. బహురూపకులక – మ

109 1. తతికిన్ – వా. కొన్నిప్రతులు; పతికిన్ – పెక్కుప్రతులు

110 ఈపద్యము ద ప్రతిలో లేదు. 1. నాగను వలవదు – గ[1] చ.వీ శ.ష ; నాకన వలవదు – కొన్ని ప్రతులు. 2. నెల్ల – కొన్ని తాళపత్రప్రతులు. 3. రతుండగునది – ఆ.గ.

111 ఈ పద్యము క ప్రతిలో లేదు. 1. ఇమ్మల – ఖ గ.త బ ల 2. తెరంగున – న బ.

112 ఈ పద్యము క ప్రతిలో లేదు 1. జలులును – గ[1] చ ద.వీ.శ.ష. 2. సాధుప్రియ – ఋ.ఓ.య ; సానుప్రియ – ఏ.వా ; సామప్రియ – పెక్కు ప్రతులు. 3. వచనంబులు – ఔ.చ.జ.ద శ ష.

113 క. తన కిమ్మగునంతకు దుర్జనుఁ డిష్టుఁడపోలె నుండి సర్వ[1]మపోలెం
దన కిమ్మగుడును గఱచును, ఘనదారుణకర్మ గరళ[2]ఘన[3]దంష్ట్రములన్.

114 క. కడునలుకయుఁ గూర్మియు నేర్పడ నెఱిఁగించునది వాని ఫలకాలమునన్
బిడుగురు గాఢ్పును జనులకుఁ, బడుటయు వీచుటయు నెఱుక [1]పడియెడు
భంగిన్.

115 క. తఱి యగునంతకు రిపుఁదన, యఱ[1]కటఁ బెట్టికొని [2]యుండునది దఱి
యగుడుం
జెఱుచునది ఱాతిమీఁదను, వఱలఁగ [3]మృద్ఘటము నెత్తి వైచిన భంగిన్.

116 క. [1]తన కపకారము మునుజే, సిన జనుఁ డల్పుఁడని నమ్మి చేకొని యుండం
జన దొకయించుకము ల్లయి,[2]నను బాదతలమున నున్న [3]నడవఁగ [4]నగునే.

117 క. బాలుఁడని [1]తలఁచి రిపుతో, నేలిదమునఁ గలసి యునికి [2]యిది కార్యమె యు
త్కీలానలకణ మించుక, చాలదె కాల్పంగ నుగ్రశైలాటవులన్

113 ఈ పద్యము క డ ప్రతులలో లేదు 1 ముకరణిన్ – ఒ.జ ర. 2. ఖర —
కొన్ని ప్రతులు. 3. దంష్ట్రములన్ – పెక్కు తాళపత్ర ప్రతులు; దంష్ట్రలచేన్–
వా మున్నగు ప్రతులు

114 ఈ పద్యము క.య. ప్రతులలో లేదు 1 పఱచెడి భంగిన్ – మ ల.

115 ఈ పద్యము ఈ క.గ్రీ$_1$ చ ద.ప శ ష. ప్రతులలో లేదు 1. కడఁ బెట్టికొని– భాసం
వా శ; కటబెట్టి – పెక్కు ప్రతులు. 2. నిల్చునది – వ 3. మృద్భాండమెత్తి–
ఋ ఒ.జ.త

116 ఈ పద్యము క ప్రతిలో లేదు 1. మును దన కపకారము చేసిన — ఆ ఎ.ల;
తన కపకారము చేసిన
జనుఁ డల్పుం డనుచు నమ్మి జడమతియై చే
కొనఁ జన దించుక ముల్లయి
నను బద్దతు లందు నున్న నడువఁగ నగునే — ఓ.గ్రీ$_1$.చ.ప.పీ.శ.ష 2. నను బాద
తలమున నున్న నడువఁగ నగునే — భాసం.శ. 3 నలవియె నడువన్ — న.
(అఖండయతి) 4. లావే – ఈ; వశమే – ఖ.

117 ఈపద్యము క డ ప్రతులలో లేదు 1. తలచి—పెక్కు ప్రతులు; నమ్మి—వా.శ
కొన్నిప్రతులు 2 యిది కార్యమెయు–పెక్కు ప్రతులు: యెంతయువలదు–వా.

118 క. మొనసి యపకారిఁ గడ నిడి, కొని యుండెడు[1]కుమతి దీర్ఘకుజశాఖాగ్రం
బునుండి నిద్రవోయెడు, మనుజునకు [2]సమానమగుఁ బ్రమత్తత్వమునన్.

119 చ. తడయక సామభేదముల దానమునన్ దయతోడ [1]నమ్మఁగా
నొడివియు సత్యమిచ్చియు జనున్ జననాథకృతాప[2]కారులం
గడఁగి వధింపఁగా [3]గనుట [4]కావ్యమతం బిది గాన [5]యెట్లులుం
గడుకొని శత్రులం జెఱుపఁ గాంచుట కార్యము రాజనీతి[6]మైన్.

120 వ. కావున సర్వప్రకారంబుల [1]నపకారకారణు లయినవారిం బరుల నయిన బాంధవుల నయిన నుపేక్షింపక యాత్మరక్షాపరుండవయి దూరంబు సేసి దూషింపు మనది యనినఁ గణికుమతంబు విని దుర్యోధనుం[2]డు చింతాపరుండై యొక్కనాఁడు ధృతరాష్ట్రు[3]న కేకాంతంబున నిట్లనియె.

*-: దుర్యోధనుఁడు దండ్రితోఁ దనమనోదుఃఖంబు దెలుపుట :-*

సం. 1-129-10

121 తే. వీరులని పాండుసుతులకు వెఱతు నేను, వెఱచుటకుఁ [1]దోడుగా నిప్డు విభుఁడ వీవు
పాండవజ్యేష్ఠునకుఁ బ్రీతిఁ బరమయావ, రాజ్య మిచ్చితి కురువృద్ధరాజులొద్ద.

118 ఈ పద్యము క ప్రతిలో లేదు. ఉ ప్రతిలో 'బాలుఁడని తలఁచి' అను పద్యము 'మొనసి యుపకారియు' యను పద్యము తరువాత నున్నది 1. నృపతి-ఇ.ఏ.వా; కుమతి - శ.ప. పెక్కు ప్రతులు 2 సమానమగు - పెక్కు ప్రతులు; సమానుఁడగు - ఏ.ఐ ప.వా శ

119 ఈ పద్యము, క ప్రతిలో లేదు. 1. నిమ్ముగా—ఔ.గి ద.ప.బ.శ.ప. 2. రాధులన్—ఐ.గి$_1$ చ.ద.వీ శ.ష. 3 గనుట—ఊ ఐ ట.ట.బ.స; నగుట—ఔ స; జనుట—బుస,ననుట—వా శ. కొన్ని ప్రతులు 4 కావ్యమతంబిది—భాసం; కార్యమతంబిది—పెక్కు ప్రతులు; కావ్యమతంబిది — వా.శ.శ.ష.భా.కూ. కొన్ని ప్రతులు. 5. యెట్టునున్, యిప్పుడున్ — అని పాఠములు 6. కిన్ - కొన్ని ప్రతులు

120 ఈ వచనము క ప్రతిలో లేదు 1. నపకారులయిన — పెక్కు ప్రతులు. 2. డు చింతాపరుండై, డు చింతాక్రాంతుండై — పెక్కు ప్రతులు; డొడంబడి చింతా — వా. 3. నకేకాంతంబున నిట్లనియె—ఈ.ఐ; నికడకుం జనియిట్లనియె—ఈ.ఊ.ఎ.ట.డ; న కిట్లనియె — వా. కొన్ని ప్రతులు.

121 1 దగగనిప్డు - పెక్కు ప్రతులు.

122 వ. [1]దాననచేసి [2]పౌరజానపదబ్రాహ్మణప్రధానవరులు ధర్మజున కనురక్తులయి నిమ్నను భీష్ముని నాదరింపక ప్రజ్ఞాచక్షుండు [3]రాజ్యరక్షణంబు సేయ సమర్థుండుగాఁడు భీష్ముండు సమర్థుండయ్యును ముందఱ రాజ్య[4]భారనివర్తనంబునందుఁ గృత[5]ప్రతిజ్ఞుండయ్యెం గావునఁ బాండవజ్యేష్ఠుండైన యుధిష్ఠిరునకు రాజ్యాభిషేకంబు సేయుద మతండు [6]తరుణుం డయ్యును గుణవృద్ధుండు ధర్మశీలుం[7]డు పరాక్రమవంతు[8]లైన తమ్ములుగలవాఁడు రాజ్యప్రతిష్ఠితుం[9]డయ్యేనేని వృద్ధుల సమాత్యుల బంధుమిత్త్రులను దొల్లింటికంటె మిక్కిలిగాఁ బూజార్హుల నెల్లం బూజించుఁ బితామహుం డైన భీష్ముని సపుత్త్రకుండైన ధృతరాష్ట్రుని నతిభక్తి నభీష్టభోగానుభవ పరులంగా సుఖంబున నునుచు దీనికి విదురుండును నొడంబడునని యెప్పుడుఁ దమలో విచారింతు[10]రని వింటిఁ గర్ణశూలాయమానంబులైన మూర్ఖ [11]ప్రకృతుల పలుకులు విననోపఁ బాండవుల నిప్పురంబు[12]వలనఁ బాయునట్లుగాఁ జేయ[13]వలయు నేమిసేయుదుననినఁ గొడుకునకు ధృతరాష్ట్రుం డిట్లనియె.

123 చ. జనప[1]తియైనవానికిఁ బ్రచండ[2]మహోత్తుములాహవాంతరం బున మృతిఁ [3]బొంది యుండెనుటి [4]పుత్త్రులపైఁ దనరాజ్యభార మె ల్లను నియమించి [5]యోఁగి గిరులం దపమొప్పఁగఁ [6]జేసి యుండెఁ గా కనిమిషలోకభోగసుఖ మందఁగఁ బోలునె శాశ్వతంబుగన్.

---

122 1. దానంజేసి —, కొన్ని ప్రతులు 2. పౌరజనబ్రాహ్మణ — పెక్కు ప్రతులు. 3. రాజ్యరక్షణంబు — పెక్కు ప్రతులు ; రాజ్యంబు — వా. కొన్ని ప్రతులు. 4 'భార' పెక్కు ప్రతులలో లేదు. 5. నిశ్చయుడయ్యె — ప ద 6 తరుణ వయస్కుండయ్యును — అ జ.ల. 7 డు నదిగాక పరాక్ర — బౌ.క.గి$_1$ చ.ద. భాసం శ.ష 8. లై విధేయులైన – కొన్ని ప్రతులు. 9. డయ్యెనేని – కొన్ని ప్రతులు ; డయి వృద్ధుల — వా. కొన్ని ప్రతులు. 10. రు దీని నింటె—వా కొన్ని ప్రతులు 11. జనుల వచనంబులు — పెక్కు ప్రతులు. 12. వలన – కొన్నిట లేదు. 13. వలయు నవిన – కొన్ని ప్రతులు.

123 1. తులైనవారికి — బౌ ర. 2. మహోగతులాహ — గి$_1$.చ.ద.శ.ష; మహాత్మున (ల) కాహవ — బ.భాసం.య.ర.వీ ; మహాత్మతనాహవ — స. 3. బొందు టొండె – భ.గి$_1$.చ.ద న.శ.ష. 4. పుత్త్రిపయిన్ – పుత్త్రినిపయి – కొన్ని ప్రతులు. 5. యేగి – (అర సున్న లేని రూపము) గి.శ.ష. 6. జేయుటొండె– గి$_1$.చ.ద.శ.ష

124 వ. [1]రాజయ్యెడువాఁడు దనరాజ్యభారంబు దాన చూచి యరయవలయు నేను షడంగసహితంబుగా వేదాధ్యయనంబు[2]సేసియు నర్థశాస్త్రంబు నందుఁ గృతనిశ్చయుండ నయి బలంబు గలిగియు నంగవైకల్యంబునం బర చక్రంబులకుం బ్రతివ్యూహంబులు రచియింపనేరమిం జేసి రాజ్యంబు నకుఁ [3]దగకున్న.

125 ఉ. లోకనుతుండు పాండుఁ డమలుండు మహాగుణరత్నపూర్ణర
త్నాకరుఁ డత్యుదారమ[1]తి నంధుఁడనైనను నన్ను రాజుఁగాఁ
జేకొని [2]నాకు భక్తిఁ బని సేయుచు సర్వజగజ్జిగీషుఁడై
యీ కురువంశరాజ్య[3]భర మింతయుఁ దాల్చెఁ బరాక్రమంబునన్.

126 క. పరచక్రపతులచే భీ, కరుఁడై ధనరాసు[1] లదిమి [2]కప్పము గొని చె
చ్చెరఁ దెచ్చి యిచ్చి నన్నును, భరతకులశ్రేష్ఠుఁ[3]డునిచె బహు[4]యజ్ఞములన్.

127 వ. మఱియు వాని[1]కంటె గుణంబుల మిక్కిలి యయి జనంబులకు ననురక్తులై పరగుచున్న పాండు[2]రాజుకుమారుల నెవ్విధంబునఁ బాపనేర్తునని దుఃఖం చి[3]న ధృతరాష్ట్రునకు దుర్యోధనుం డిట్లనియె.

124 1 రాజైనవాడు — కొన్ని ప్రతులు 2. సేసి శాస్త్రంబులందు— చ.ద.భా సం వీ.శ ష 3 దగకయున్న — కొన్ని ప్రతులు.

125 1. తి యంధుఁడ – ఖ.$గ_1$ చ.వీ.శ.ష. 2. భక్తితోడ బని – ఔ.చ.ద.శ.ష ; భక్తి యుక్తి–మ.ల 3 భర మెంతయు – $గ_1$.చ ద వీ.శ.ష.

126 1 లెల్లగప్పము – య 2. కప్పంబులు చెచ్చెర – $గ_1$.చ.ద.ల.శ.ష. 3. డనిచె బహు — $గ_1$.జ శ.స ; దూన్చె – సూ. 4. యజ్ఞములన్ — ఐ ఔ క.చ.ద.మ. వీ.శ.ష ; యజ్ఞంబుల్ – వా. కొన్ని ప్రతులు

127 1. కంటెను — అ ఋ.ఒ.క గ.ట.జ.త.ల. 2. రాజు – కొన్ని ప్రతులలో లేదు. 3. పలికి – చ ద.వీ శ.ష

128 సీ. పైతృకంబగు నీమహి పాండుభూపతి [1]మున్ను తాల్చుటఁ జేసి తత్తనయుఁడైన
ధర్మజుఁ డిప్పుడు [2]దాల్చిన నాతనితనయుండు మఱి [3]దానిఁ దాల్చు మీఁద
[4]నిప్పాటఁ బాండువంశేశు[5]ల [6]వసుమతీ రాజ్యార్హు లగుదురు రాజ్యమునకుఁ
బరువడి [7]మే మింతఁ బాసిన మాపుత్రపౌత్రవర్గం[8]బునుఁ బాయు [9]నింక

ఆ. నొరులఁ గొలిచి [10]కుడువ[11]నోప మేమట్లుగా, కుండ మమ్ముఁ జేయ నోపుదేని
పాండురాజు[12]తోంటిభక్తియు నప్పాండు, తనయులందు దయయుఁ
దలఁపకుండ.

-: *దుర్యోధనుఁడు పాండవులను వారణావతంబునకుఁ*
*బంపుమని తండ్రితోఁ జెప్పుట* :-

సం. 1-130-8

129 వ. ఈ రాజ్యంబు మొదలింటంగోలె [1]భవదీయం బయినది ప్రకృతిజనులు వశ్యులు గాకు[2]న్నను గ్రమాగతంబయి మాకు నప్రయత్నలభ్యం బగుఁ [3]దొల్లి పాండురాజు రాజై గుణంబులం బ్రజానురాగంబు వడయుటం జేసి యెల్లవారును ధర్మరాజురాజ్యంబ వలతురు దాని నెఱింగియకాదె యేను [4]నిత్యదానసమ్మానంబులం బ్రకృతిజనంబులకు సంతోషంబు సేయుచు నుండుదు నిందుల దుష్టజనులపక్ష[5]పాతవచనంబు లుడుగు[6]నంతకు నుపాయంబునఁ గొంతిని బాండవులను దదీయభృత్యామాత్యవర్గంబుతో వారణావతంబునకుం బుత్తము మనకు రాజ్యంబు సుప్రతి[7]ష్ఠితంబైన మఱి వారలిందులకు [8]వత్తు రనిన దుర్యోధనునకు ధృతరాష్ట్రుం డిట్లనియె.

128 1. మున్న-చ.వీ.శ.ష. 2. దాల్చుట - ఓ 3. దాను దాల్చు — య 4. నిప్పాండవులును వంశేశులై-మ. 5. లు — కొన్ని ప్రతులు. 6 రాజ్యార్హులగుదురు వసుమతీ రాజ్యమునకు — గి$_1$ చ ద.శ.ష. (ఈ పాఠమునందు అఖండయతి తోడి 'రల' యతి.) 7 నేమింత — కొన్ని ప్రతులు. 8 బెల్ల-ఉ.చ.ద.వీ.శ.ష. 9. నంత - ర. 10 తిరుగ - ఔ. 11. నోపము నట్లుగాకుండ — కొన్ని ప్రతులు. 12. తోడి — ట.డ.నయ.

129 1. భవదధీనంబైన (య) ది — ల; భవదీయులైన ప్రకృతి — అ.ఋ గి$_1$.చ.ద.వీ.శ.ష. 2. న్ననుగ్రమక్రమాగతంబయి—అ.చ.ద.వీ.శ.ష 3. దొల్లియు — కొన్ని ప్రతులు 4. నిత్యదాన — కొన్నిటలేదు 5 పాతంబులుడుగు— ఐ య.ర ; పాతం బడంగు నంతకు—న 6 నట్లుగా—చ.జ.ద.వీ.శ.ష. 7. ష్ఠంబైన - ఒ.ప. 8. వత్తురుగాకయని—ఒ.త.

130 తరువోజ. [1]ఏ నెల్లప్రొద్దు నా[2]యెడలోనఁ దలఁతు నీయభిప్రాయంబ యిది దారుణంబు
గాన [3]వాకునకుఁ జుల్కన తేర నోపఁ గడఁగి పాండవుల నేకత [4]మెట్టులనుప
[5]గా నగు మఱి దీని గాంగేయవిదురకలశజాశ్వత్థామ గౌతముల్ బుద్ధి
గా నొడంబడుదు[6]రె కాదయ్య యనిన౯ గౌరవజ్యేష్ఠుండు [7]ఘనుఁ డిట్టు
లనియె.

131 వ. భవ[1]దనుజ్ఞాగౌరవంబున గాంగేయాదులు దీనికి నొడంబడుదురు వారు కౌరవులకెల్ల సములై యుండియు నావారల యెట్లనిన నశ్వత్థామ నాకిష్టుండగు[2]ట [3]నన్నుఁ బాయకుండు పుత్త్రస్నేహంబున ద్రోణుండు[4]ను భారద్వాజుని భాగినేయునిం బాయ నేరమింజేసి కృపాచార్యుండును నాయొద్దన యుందురు మఱి భీష్ముండు మధ్యస్థుం డగుటఁ బాండవులం బరిగ్రహింపఁడు విదురుండు పాండవపక్షపాతియయ్యును నొక్కరుండు నా కహితంబు సేయ నోపండు గావున నిక్కార్యంబున దోషంబు లేదు [5]వినిద్రకరణం బయిన నా హృదయశల్యంబు [6]బాచి [7]నన్నుద్ధరింపుమని ధృతరాష్ట్రు నెట్టకేలకు నొడంబఱిచి దుర్యోధనుం డప్పుడు

132 క. పలనుగల మంత్రివరులం, బిలిచి పృథానందనులకుఁ బ్రియముగ మీ ర
మ్మ్రుల వారణావతంబును, వెలయఁగఁ బొగడుండు వారు [1]విని [2]తగుల
నెడన్.

130 1. ఏను నిక్కార్యంబ (బు) హృదయంబులోన నెప్పుడు జింతింతు నిది దారుణంబు — ఒ.జ.త 2. యెద — శ.ష. మొదలైన ప్రతులు; యెడదలో దలఁతు — ల 3. వాక్కునకు — కొన్ని ప్రతులు. 4. మేను బంప — చ.ద.వీ.శ.ష ; మేను బనుప - గి. 5. గానేర — ఆ.ఈ ఉ ఊ.ఋ ఐ.గ.చ ద ల.వీ.శ.ష 6. రేకతమయ్యె — ఆ.స. 7. కడక నిట్లనియె—అ.

131 1 దాజ్ఞాగౌర — అ ఋ.ఖ చ.ట.ద.బ.భాసం వీ శ ష 2. టం జేసి — పెక్కు ప్రతులు. 3. నన్నుబాయకుండు — పెక్కు ప్రతులలో లేదు 4. నన్నువిడువండు— పెక్కు ప్రతులు 5. వినిద్రాకారణంబయిన — అ.ఋ.ఎ ఔ $గ_1$.చ.త.ద.బ.శ.ష; వినిద్రాకరణంబైన — కొన్ని ప్రతులు. 6. వాపి - ఈ ఉ.గ. 7. నన్నుద్ధరింపుమని దృతరాష్ట్రునెట్టకేలకు — పెక్కు ప్రతులు, నన్నుద్ధరింపవలతేని యిక్కార్యంబున కొడంబడుదుమని ధృతరాష్ట్రునెట్టకేలకు - వా.

132 1 విస్మయమొందన్ — న. 2 తగులనెదన్ — ఆ.చ.త.ద.భాసం.వీ.శ ష.

133 వ. అని పంచిన [1]వారును వారణావతంబు ననవరతసురభికుసుమఫలా భార నమ్రశాఖావిశాల తరువన[2]రేఖాలంకృతం బనియును వనజలకేళీకందు[3]క మృగయాది వివిధవిహారహారిప్రదేశాభిశోభితం బనియును నవసుధాధౌత సౌధ[4]సుధాకరనికరప్రభాపటల ప్రధ్వంసితాసిత పక్షదోషం బనియును నిరస్తదోషానుషంగ మంగళమహారత్నరాజివిరాజిత విపులవిపణివీథీ [5]విహా సితాలకావిలాసం బని[6]యును మనోరమానేకసుఖానుభోగభోగిమహాభాగ జనసమృద్ధం బనియును [7]బుణ్యానదీప్రవాహశోభితం బనియును వర్ణించి యప్పురంబు[8]నంద పాండునందనుల జాత[9]కౌతూహలచిత్తులం[10]జేసి యున్నం గొండొకకాలంబునకు ధృతరాష్ట్రుండు దుర్యోధనదుష్టవచన ప్రబోధితుండయి యొక్కనాఁడు.

*-: ధృతరాష్ట్రుండు పాండవులను వారణావతనగరంబునకుఁ బోవఁ బనుచుట :-*

సం. 1-131-2

134 ఉ. పాండుకుమారులం బిలువఁ బంచి సుహృన్నివహంబు నొద్ద న
ప్పాండుఁ దలంచి నిర్గళితబాష్పకరాళకపోల[1]యుగ్ముఁడై
పాండుమహీశుకంటె నతిభక్తు[2]ల మిమ్మొకఁడేను బంచెదం
బాండుయశోర్థులార యిది పథ్యముకాఁగఁ దలంపుఁ డాత్మలోన్.

135 క. విదితంబుగఁ బుణ్యామర, నదీసమీపమున వారణావతనగరం
బది సర్వసుఖాస్పదమని, వదలక వర్ణింతు రెల్ల[1]వారును దానిన్.

133 1 వారును పౌరజనంబును వారణా — కొన్ని ప్రతులు. 2. మేఖలాలంకృత — ఆ.ఓ.బ.మ. 3. కక్రీడా — అ ఋ.క డ 4. సుధాకరనికర — కొన్ని ప్రతులలో లేదు. 5. విలసితాలంకారంబనియును — వీ శ.ష. కొన్ని ప్రతులు. 6. యును, మనోహర మనోరమా సఖసుఖానుభోగజనసమృద్ధంబనియును (దీని యర్థము విచారింపఁదగినది) — చ.ద శ ష ; మనోహరానేక సుఖానుభవ భోగ భాగి మహాభాగ — భాసం.ర. కొన్ని ప్రతులు 7. పుణ్యానదీ ప్రవాహ శోభి తంబనియును — పెక్కు ప్రతులలో లేదు. 8. నందు — కొన్ని ప్రతులు 9. కౌతుకాయత్త — ఉ. 10 జేయుచున్న — అ.గి$_1$ చ.జ ద.వీ.శ ష.

134 1. వక్త్రుడై — ట 2. లు — అ.ఆ.బ.

135 1. వారలు — శ.ష. కొన్ని ప్రతులు.

136 క. మీరును గుంతియు సహోదరి, వారఘహోమాత్యభృత్యవర్గులరై నా
నారాజ్యలీలతోఁ జని, సారమతిం జేయుఁ డందు సతతోత్సవముల్.

137 వ. పశుపతినివాసంబయిన యప్పుణ్యస్థానంబునం బాండుహితంబుగా నగణ్య
గోహిరణ్యాదిమహాదానంబుల బ్రాహ్మణ [1]సంతర్పణంబులు సేసి యందుఁ
[2]గొండొకకాలం బుండి వచ్చునది యని పంచిన వల్లెయని పాండవులు
గాంధారీధృతరాష్ట్రులకు మ్రొక్కి వీడ్కొని దుర్యోధనాదుల సందఱం
బ్రియపూర్వకంబుగ సంభావించి [3]భీష్మ ద్రోణవిదురకృపాదులకు మ్రొక్కి
యనేక వృద్ధబ్రాహ్మణులకు నమస్కారంబుసేసి వారలవలన దీర్ఘాయు
రారోగ్యస్వస్తివచనంబులతోఁ బునర్దర్శనం [4]బయ్యెడమని దీవనలు
సేకొనుచు జననీసహితంబుగా వారణావతంబు[5]నకు గమనోన్ముఖు
[6]లయి రంత.

—: దుర్యోధనుఁడు లాక్షాగృహనిర్మాణమునకై పురోచనుని
వారణావతంబునకుఁ బంపుట :—

సం. 1—132—2

138 క. తన [1]వగచిన కార్యము దొరకొనుటకు ధృతరాష్ట్రపుత్త్రకుఁడు పొంగి పురో
చనుఁ బిలిపించి రహస్యంబున వానికిఁ గరము నెయ్యమున నిట్లని యెఱ.

139 తరలము. అలఘుతేజుల వారణావత [1]మన్పురంబునఁ బాండవే
యులఁ బ్రియంబున నుండఁ బంచె [2]గుణోన్నతుండు కురుప్రభుం

137 1. సంతర్పణలు చేసి — అ, సంతర్పణంబులు (లం) చేసి — పెక్కు ప్రతులు. 2. కొండిక, కొండుక — అ ఘా.కూ 3 విదురసోమదత్త బాహ్లిక కురు వృద్ధులకున్ ద్రోణకృపాచార్యాది [illegible] బ్రియపూర్వకంబుగ — క.ట; విదురసోమదత్త బాహ్లికకురువృద్ధులకు ద్రోణకృపాచార్యాశ్వత్థామాది బ్రాహ్మణ సమూహంబునకు బ్రియపూర్వకంబుగా నమస్కరించి — ర. 4. బయ్యెడుమని — ఈ కొన్ని ప్రతులు. 5. నకు నరుగ నిశ్చయించి — ర ల. 6. లైన — పెక్కు ప్రతులు; లయిరంత—వా.

138 1. తలచిన — అ.గ డ.య ; పనిచిన — ఉ.స.

139 1. మన్పురంబున—చ ఠ.ష 2 గుణోత్తరుండు—వా. కొన్ని ప్రతులు ; గుణోన్న

డలయ కిప్పుడ సీవు మున్ చని యందు [3]వారికి నుంపఁగా
నిలయముల్ రచియింపు నీవగు నేర్పుఁ [4]జూతము చెచ్చెరన్.

140 వ నాకుం బరమ [1]విశ్వాసివి నీవొక్కరుండవ యిది యనన్యవిషయం బయిన [2]కార్యంబు కావున నీవ దీనిం జేయవలయు వాయుజవంబులయిన [3]వేసడంబులం బూనిన యరదం బెక్కి నేఁడ చని వారణావతంబున లాక్షాసర్జరసమిశ్రంబై ఘృతతైలార్ద్రింబయిన మృత్తికాపుంజంబుల నొక్క చతుశ్శాల విశాలంబుగా నాయుధశాల సమీపంబున మనోహరంబుగా [4]నవిరళసుధాధవళితంబుగా నిర్మించి యందుఁ బాండవుల నునిచి వార లేమఱి నమ్మి కొండొక[5]కాలం బుండ నిన్నొరు లెఱుంగకుండ నిమ్మయిన యవసరంబునం దద్గృహద్వారంబు నందు [6]ఘోరానలంబు నరికొలిపి పగఱ పంచత్వం బెఱింగి రమ్ము.

141 క. ఈకార్యసిద్ధి యగుడును, నీకతమున నఖిలధారుణీరాజ్యము నా
కేకాధిష్ఠితమగు నిగ్గి, నీకును [1]నిత్యోపభోగ నిలయము కాదే.

—: వారణావత ప్రస్థానము - విదురోపదేశము :—

సం. 1-133-4

142 వ. అని పంచినం బురోచనుం డతిత్వరితగతి నరిగి దుర్యోధను కఱపిన రూపున వారణావతంబున లాక్షాగృహంబు రచియించుచుండె నిట యుధిష్ఠిరభీమార్జునయములుం గ్రమంబునం దొల్లి షోడశ పంచదశ చతుర్దశ త్రయో

తుండు - పెక్కు ప్రతులు 3. వారలకుండగా - అ య. 4. చూచెద - స.

140 1. విశ్వాసివి - క గ$_1$ చ.య శ ప ; విశ్వాసుండవు - ఊ.ఎ.ఐ ఖ ట.బ ; విషయుండవు - కొన్ని ప్రతులలో లేదు ; విశ్వాసవిషయుండ - పీ. వా. కొన్ని ప్రతులు. 2 కార్యంబుకావున నీవ - పెక్కు ప్రతులు; కార్యంబు అప్రమత్తుండవు కావున గాదనక నీవ — వా 3. రాసభంబుల — పెక్కు ప్రతులు; వాహనంబులు — కొన్ని ప్రతులు. 4 విమల సుధాధవళంబుగా రచియించి — ల 5. కాలం బున్న — పెక్కు ప్రాఁతప్రతులు 6. దహనంబు — వా.శ. కొన్ని ప్రతులు ; ఘోరానలంబు — ఐ.చ.ఎ.డ.ద.వీ శ.ప.

141 1. నిష్టోపభోగ — అ న.

దశవర్షజాతులయి శతశృంగంబుననుండి హాస్తిపురంబునకు వచ్చి యందుఁ
గౌరవులం గలసి యస్త్రవిద్యలం గఱచుచుం బదుమూఁడేం డ్లుండి యపుడు
ధృతరాష్ట్రుని యోగంబున వారణావతంబునకు జననీసహితంబుగాఁ బోవ
సమకట్టి మహాజవసత్త్వసమేతంబులయిన హయంబులం బూనిన రథంబు
లెక్కి ధనుర్ధరులయి హాస్తిపురంబు వెలువడునపు డప్పురంబునంగల
బ్రాహ్మణ క్షత్త్రియ ప్రముఖానేకజనంబులు శోకసంతప్తహృదయులయి.

143 సీ. ఇప్పాండుపుత్త్రుల నేలొకో ధృతరాష్ట్రుఁ డేకతమనుపంగ [1]నిచ్చగించె
నిది యధర్మంబని యెఱిఁగి గాంగేయాదు లేల [2]వారింపరో యెఱుఁగ
రొక్కొ
పితృ పితామహులచే [3]శ్రుతపూర్వమై క్రమాగతమైన రాజ్యంబుఁ గరము
నెమ్మిఁ
బాండుసుతజ్యేష్ఠు భరతకులశ్రేష్ఠు ధర్మజుఁ బూన్పక ధర్మువుడిపి

ఆ. యేల వృద్ధరాజు లెడ సేసిరో పార్థుఁ [4]డరుగు నెడక మనము నరిగి యతని
యున్నచోన ప్రీతి నుండుద మిందుండ నేల యనుచుఁ బౌరు లెల్లఁ [5]దెరలి.

144 వ. తన పిఱుందన వచ్చువారిం బ్రియపూర్వకంబున నూరార్చి పితృవచనంబు
సేయకునికి ధర్మవిరుద్ధంబు గావున వారణావతంబునకుం బోయివచ్చెద
మని యందఱం గ్రమ్మఱించి చనుచున్న ధర్మనందను పిఱుంద నొక్కింత
నేలయరిగి విదురుండొరులు వినియును నెఱుంగరానివచనంబుల బహు
ప్రకారవచనరచనావిశారదుండై న యుధిష్ఠిరున కెల్లకార్యంబులు గఱపి
కొడుకులం గౌఁగిలించుకొని కుంతీదేవికి మ్రొక్కి పాండురాజుం దలంచి
బాష్పపూరితనయనుండై క్రమ్మఱి చనియె నిట కుంతియు ధర్మరాజు
డాయవచ్చి యిట్లనియె.

143 1 నెట్లుదలచె — ఆ ఐ.ఔ. 2. వారింపఁగా నెఱుఁగ రొక్కొ — ల; వారింపఁగ
నెరుగరొక్కొ — న.య ర. 3. ప్రీతి — ఓ ర; ప్రియ — జ.ట.త.న. 4. నరిగి —
వా.శ; లరుగునెడకు మనము నరిగి — వారి యున్నచోట ప్రీతినుండుదమని —
మ; లరుగునెడకు — పెక్కు ప్రతులు. 5. కదలి — ల.

145 తే. విదురుఁ డేతెంచి యొరులకు వినియు నెఱుఁగఁ, గాని [1]యట్లుండఁ బలికి నిన్ గఱపె బుద్ధి
నట్లు చేయుదు నంటి వీ వతని మతము, [2]సెప్పనగునేని యెఱుఁగంగఁ [3]జెప్పుమయ్య.

146 వ. [1]అనిన నగుచు ధర్మతనయుండు విదురువచనంబుల [2]యభిప్రాయంబులు దల్లి కిట్లని చెప్పె.

147 ఆ. ఎల్లకార్యగతులు [1]నెఱుఁగుదు రయినను, నెఱుఁగఁ జెప్పవలయు నెఱిఁగినంత
పనియులేక మిమ్ముఁ [2]బనిచిన కురుపతి, హితుఁడపోలె మీఁద నెగ్గుసేయు.

148 వ. కావున మీర లేమఱక విషాగ్నులవలన [1]నప్రమత్తులరై [2]యెఱుక గలిగి యుండునది యని [3]బుద్ధిగఱపి మఱియు దుర్యోధనుచేసెడు [4]దుష్క్రియ లిమ్ముగా నెఱింగి వానికిం బ్రతీకారంబు సెప్పి పుత్తెంచెద ననియె నని చెప్పిన విని విదురుబుద్ధికిఁ దమవలని నెయ్యంబునకు సంతసిల్లుచు నిట్లు పాండవులుఁ గతిపయప్రయాణంబుల వారణావతంబున [5]కరుగునంత.

---

145 1. యట్టులు — ఖ.మ ; యట్లుగ — గ్1.ద.వీ.శ.ష. 2. చెప్పదగునేని — అ.ర. 3. తెప్పవయ్య — మ.

146 1. అనిన విని — అ.ఐ ఔ.గ.జ.ప మ.య ల. 2. యర్థంబులు — భాసం స. పెక్కు వ్రాఁతప్రతులు.

147 1. నెరిఁగిచెప్ప — య. 2. పాపిన — వా.శ; బంచిన, బనిచిన — అని పాఠములు.

148 1. నప్రమాదులరై — వా.శ భాసం. పెక్కుప్రతులు; నప్రమత్తులరై — జ.ద. వీ.శ.ష. 2. బుద్ధి — కొన్ని వ్రాఁతప్రతులు. 3. బుద్ధి — కొన్ని ప్రతులలో లేదు. 4. దుష్టక్రియలు — పెక్కు ప్రతులు. 5. కరిగిరంత — మ.

## —: పాండవులు జననీసహితంబుగా వారణావతంబుఁ జేరుట :—

సం 1-134-1

149 సీ. వారణావతమునఁ వారెల్లఁ బాండవాగమనంబు విని సంతసమునఁ [1]బెరిఁగి
కరమొప్పఁ గరిరథతురగబలాఢ్యులై యెదురువచ్చిరి [2]మహోముదము తోడఁ
గలయంగ గృహములఁ [3]గలువడములు గడు[4]విలసిల్లె నంబరతలము [5]గప్పి
మలయజ[6]మృగమదానిల సలిలంబుల నిమ్ముగా నార్ద్రీకృతమ్ము లయిన

తే. [7]యంగణముల నొప్పెఁ గర్పూరరంగవల్లు, లంగనలు గయిసేసి యుత్తుంగ హర్మ్య
తలము లెక్కిరి తత్పురీవిలసనంబుఁ, జూచు[8]పాండుకుమారులఁ జూచు వేడ్క.

150 వ. పాండుకుమారు లనేకభూసు[1]రాశీర్వాదనాదాభినందితులై ఫాల్గున మాసంబున శుక్లపక్షమున [2]నష్టమియు రోహిణినాఁడు వారణావతంబు సొచ్చి సర్వాలంకారసుందరంబైన రాజమందిరంబున [3]నున్న కొన్ని దినంబులకుం బురోచనుండు దనచేసిన[4]చతుశ్శాల సకలజననయనాభిరామంబై నదానిం జూపినం జూచి పాండుసుతులు సంతసిల్లి పురోచన శిల్పాచార్యులం బూజించి [5]పుణ్యాహవాచనపురస్సరంబుగా గృహప్రవేశంబు

149 1 బొంది — అ.ఆ.ఓ.ఔ.ఖ బ మ; నపుడు — ఈ ఏ ఐ వ.య; పెఱిఁగి — $గ_1$. భాసం., పెఱిగి — న ష 2 కడు — $గ_1$.చ ద వీ శ ష. 3. గలవడంబులుజల్లి — య , గలువడంబులు గట్టి బ ల, గలువడగలు — భా కూ. మ.స; కలిగిన పడగలు—$గ_1$. 4 విలసిల్లె నంబరవీధి — య 5 నొరగి — చ.ద.వీ శ ష; నందు — మ. 6 మృగమదసలిలంబులను మరి — న ; మలయజమృగమదవిలసనసలిలమ్ముచే నలంకారమై చెలఁగుచుండ కర్పూరపు రంగవల్లుల కరము మెఱయ, నంగనలు జేసి యుత్తుంగ హర్మ్యతలము — య. 7. యంగణముల నొప్పె — ఖ.ట.ర.శ 8 రాజకుమారుల — ర

150 1 రాశీర్వాదాభినందితులై — పెక్కు ప్రతులు. 2. నష్టమిరోహిణినాడు — పెక్కు ప్రతులు ; శుక్లపక్షాష్టమి రోహిణినాడు — చ ద.వీ.శ ష, శుక్లాష్టమి రోహిణినాడు — ల ; సిద్ధార్థిసంవత్సర ఫాల్గునశుద్ధ అష్టమిరోహిణి యందు భా కూ 3. నున్నంత — క; నుండునంత — చ ద.మ వీ.శ ష 4. చతుశ్శాల విలాసంబై — చ.ద మ.ల.వీ.శ.ష. 5. పుణ్యాహవాచపురస్సంబుగ — ర.

సేసిరంతం బరాభిప్రాయమూ యోపాయ [6]ప్రయోగ [7]విదుండైన ధర్మతన యుండు దాని కృత్రిమరమణీయత సుపలక్షించి [8]యల్లన భీమున కిట్లనియె.

151 క. ఈ గృహకుడ్యంబులు లా,క్షాగర్భము లాజ్యసిక్తలగంధులు మఱి శ
స్త్రాగ్నిగారసమీపము మా,యాగృహమునునిది యవశ్యమాగ్నేయం బై.

152 క. దీని తెఱఁగెఱిఁగినట్లు మ,హానిపుణుఁడు విదురుఁ [1]డురువిషాగ్నులవలనన్
మానుగ నేమఱ[2]కుండని, [3]తాను ప్రబోధించె [4]నేకతమ ననుఁ బ్రీతిన్.

153 వ. కావున [1]మన మిందు విశ్వసించి యుండవలవ దవశ్యం బగ్నిభయంబగు ననిన విని భీముం డిట్లనియె.

154 ఆ. [1]ఇట్టిదేని మనకు నిందుండఁగా నేల, యరిగి [2]ముందునున్న యంద యుండి
[3]యెఱిఁగి దీనితోన యిప్పురోచనుఁ గాల్చి, పోదమనిన ధర్మపుత్త్రుఁ
డనియె.

155 క. ఎఱిఁగితిమి దీని తెఱఁ గే,మఱకెఱుఁగని [1]యట్లు గూఢమతి నుండుద మిం
[2]దఱముఁ బురోచను కృతకము, నెఱి నేర్పడునంతకును వినీతాత్ములమై.

పుణ్యాహరవ – ఇందు 'రవ' అనునది కొన్ని ప్రతులలో లేదు. 6. ప్రయోగ – కొన్నింట లేదు. 7 నిపుణుఁడైన – న. 8. మెల్లన – న.

152 1. డుమ విషాగ్నులవలనన్ – య. 2 వలదని – ఆ. 3. తానును బోధించె నేకతమమున బ్రీతిన్ – ర; 4. నేకతమునను బ్రీతిన్ – కొన్ని ప్రతులు

153 1. మన – పెక్కు ప్రతులలో లేదు.

154 1. ఇట్టిదైన – పెక్కు ప్రతులు. 2 ముందదున్న – వా. కొన్ని ప్రతులు; ముందు నున్న – చ.శ.ష. 3. యేర్చి – వ.

155 1. యట్లు – పెక్కు ప్రతులు. 2 దర మింద (దు) పురోచనుకృతినెరి – ఎ.ఖ.గ.ట.త.ప.బ.

156 వ. ఇప్పాపగృహప్రకారంబు మన మెఱుంగుట పురోచనుం డెఱింగెనేని దుర్యోధను [1]నియోగంబు విఫలంబగు నట్లు [2]గాకుండ శీఘ్రకారులమై దీని దహించిన నక్కడ భీష్మ[3]విదురులు విని కోపించినం గురుకులసముద్ర క్షోభంబగు మఱి దాహభయంబున మనమొండుగడకుం బోయిన నెఱింగి మనయంతరంబ రోయుచు నద్దురాత్ముండు దుర్యోధనుండు [4]వెండియు మన కపాయంబు సేయు నెట్లనిన.

157 సీ. రాజ్యపదస్థుండ రాజ్యపదస్థులఁ బహులాఢ్యుఁడ పశుబలుల
విపులార్థవంతుండు విగతార్థ[1]సార్థుల నవసరం బెఱిఁగి [2]వాఁ డక్రమమున
[3]దూష్యులఁ దుదిదాఁక దూషించు మనల నన్నిష్ఠురునకు నది నీతిగాదె
కావున నొరులెఱుంగక యుండఁ గడునమ్మి [4]నట్టుల యుండుద మని దినంబు

తే. లెల్ల వేఁటలాడుచు [5]గాత్రులెల్ల నుద్యతాయతాయుధహస్తులై యను దినంబు
నప్పురోచను వంచించి యనఘు లుండి, రప్రమాదులై పాండవు [6]లప్పురమున.

-: లాక్షాగృహ దహనము :-

సం. 1-135-1

158 వ. అట హస్తిపురంబున విదురుండు దుర్యోధనుదుర్మంత్రం బంతయు నిమ్మగా నెఱింగి కడు విశ్వాసి నొక్క [1]ఖనకు నతికుశలుం బాండవుల పాలికిం బుత్తెంచిన వాఁడును వచ్చి రహస్యంబునం బాండవులంగని తన్ను [2]నమ్మునట్లుగా

156 1 దుర్మంత్రంబు - ప.స. 2. కాక — వా. కొన్ని ప్రతులు; గాకుండ - పెక్కు ప్రతులు 3. విదురాదులు - ఆ.ఖ.చ.ద.య.ల పి.శ ష. 4. వెండియు — ఈ ఉ.ఎ ఐ.గ.

157 1. వంతుల — కొన్ని ప్రతులు ; సాధుల — త.మ.య. 2 తానక్రమమున — ర. 3. దూషించు - ల 4 నట్ల - పెక్కు ప్రతులు. 5 గాత్రులు వెలయ నుద్యతాయత — మ ; గాత్రుల వివిధసన్నతాయుధోజ్వల — స. 6 భరతకులైక భూషణులు పాండవసింహములున్న ధారుణీ, శ్వరసదృశప్రభావులు విశాల యశోనిధు లన్యసైన్యసం, హరణవిచిత్రభంగులు శరాసనచక్రగదా కృపాణ ము, ద్గరవివిధాస్త్రశస్త్రఘనకౌశలముల్ దమలోన జెప్పుచున్ — స.

158 1. ఖనికు — అని కొన్ని పాఠములు. 2. విశ్వసించునట్లుగా — పెక్కు ప్రతులు.

[3]విదురుసాభిజ్ఞానవచనంబు లెఱింగించి యీ కృష్ణచతుర్దశినాఁటి రాత్రి పురోచనుండు లక్కయింట దహనంబు దరికొల్పుం గావున నిందుండి [5]మీకు వెలువడి పోవునట్టి యుపాయంబు మారాజు నియోగంబునం జేయవచ్చితి నని చెప్పి లక్కయిల్లు వెలువడు నట్లుగా నొక్క బిలంబు నెవ్వరు నెఱుంగ [6]కుండం జేసి వారల కెఱింగించిన భీముండు దాని నిమ్ముగా శోధించి యెఱింగి యుండునంత.

159 క. ధనదానములను బ్రియభో, జన దానములను విశిష్టసద్ద్విజతతులం దనుపుచు నుండఁగఁ దత్పుర, మున షణ్మాసములు భరతముఖ్యుల కరిగెన్.

160 వ. ఆకృష్ణచతుర్దశినాఁడు కుంతీదేవి యప్పురంబునంగల [1]బ్రాహ్మణపుణ్యాంగనాజనంబుల కెల్ల నిష్టాన్నపానదానంబులం దుష్టిసేసి దేవపూజ గావించి యున్నెడం బురోచనుపంపిన నిషాద[2]వనిత సపుత్త్రి యైన బహువిధవన్యమూలఫలంబులు దెచ్చి యిచ్చుచుం గుంతీదేవిం బాయక [3]సేవించి పాండవకృత్యంబులు నిత్యంబును నెఱింగించుచుండెడునది నాఁటిరాత్రి యుత్సవంబునం గాలచోదితయై తానునుం దన [4]యేవురు కొడుకులు నధికమధుపానమదంబున మెయియెఱుంగక లక్కయింటి [5]పక్కంబున నిద్రవోయిన నర్ధరాత్రంబునప్పుడు భీముండు మేల్కని పురోచనుకంటె [6]ముందఱఁ దాన యుత్సహించి వానిశయనగృహద్వారంబున ఘోరానలంబు దరికొలిపి చెచ్చెరఁ దల్లిని [7]నన్ననుం దమ్ములను

3 విదురునాభిప్రాయ వచనంబులు — మ; విదురుకఅపిన సాభిజ్ఞానవచనంబులు — చ.ద ల వీ శ.ష. 4. ఈ కృష్ణచతుర్దశి — ఇది రౌద్రి సంవత్సర భాద్రపద బహుళ చతుర్దశియని భా.కూ 5 మీరు — అ బు.ఖ.ట.బ. 6. కుండునట్లుగా అ.ఆ బు బ

159 ఈ పద్యము ఏ ప్రతియందు లేదు.

160 1 బ్రాహ్మణ — పెక్కు ప్రతులలో లేదు. 2. వనిత తనయేవురుపుత్త్రులుం దానును — న ల; వనితయేవురుకొడుకులుం దానును వన్యమూలఫలంబులు — చ.ద.వీ.శ.ష 3. సేవించుచు — చ.డ.ద మ వీ.శ ష ; సేవింపుచు — ఓ.గి$_1$. 4 యేగురు — మ. 5 ప్రక్కన — గి$_1$ డ.ద.వీ.శ.ష ; పక్కను — న; పక్కంబడి—ల; చక్కన — మ ; పక్కన-ఐ గ చ.వ. 6. మున్న—న వీ.శ.ష. 7. అన్న దమ్ములను—

ఏంబులోని కసిచి ...ముఖంబున ... దన లాక్షాగారంబు పొలుతా
శనున కశనంబుచేసి ఖ కుమారకుం దమకుశల[3]గమనం బెఱింగించి బిల
ప్రవిష్టుండయి కుంతిని ధర్మార్జుననకులసహదేవులను బిలంబు వెలువరించి
తోడ్కొని చను నప్పుడు

161 సీ. కడునిబ్బరం[1]గా నక [2]తొడరుచు వడిగొని నడపంగ నేరక [3]తడయుచున్న
నెఱిఁగి చెచ్చెరఁ దల్లి [4]నకటకటి ధర్మసుత విజయులఁ దన[5]వితత బాహు
[6]యమళంబు నెక్కించి యముల నుత్సంగంబు లెక్కించికొని భీముఁ
డక్కజముగ
నరిగెడురయమునఁ దరులు సొల్పడి బ్రుంగ్గఁ [7]బదఘట్టనంబులఁ జదిసి[8]ఱాలు

ఆ. నుఱుములుగాఁగ నిట్లు వెఱయుంగ సత్త్వంబు, మెఱసి [9]రాతిరెల్ల నుఱక పవన
తనయుఁ డరిగెఁ బవలు [10]సనినట్లు[11]చీఁకటి, యనక ముండ్లు [12]గండ్లు
ననక తెరలి

162 వ. ఇట వారణావతంబున.

163 చ. అనుపమనిత్యసత్య[1]రతు[2]లై వినయాన్వితులైన పాండునం
దనులకు ధర్మమూర్తులకు [3]ధర్మువెఱుంగక యిట్లు లెగ్గు సే
సిన ధృతరాష్ట్రజాధము విశేష[4]సుహృత్సుతబంధుదాహసూ
చన మయి లక్కయిల్లతికృశానుశిఖాహతిఁ గ్రాఁగె గ్రక్కునన్.

ఐ మ 3. వార్త నెఱింగించి – న.ఐ; కుశలం బెఱిగించి – ఆ ఆ.యు.ర ; కుశలం
బెరుంగించి – ఖ బ

161 1 కానమి – పెక్కు ప్రతులు భా.కూ 2. తొడసుచు – ర 3. తడవు
చున్న – కసం శర పెక్కు ప్రతులు. 4. నరకడ – క. భాసం. వా.వీ.శ
5. విపులబాహు – వ 6. లమరంగ నెక్కించి – స. 7 పదఘట్టనంబున –
కొన్ని ప్రతులు 8 శిలలు – వ, రాలు – కసం గి।శష, ఱాలు – వీ శ.ర;
అరిగెడి రయమునఁబరులు బాల్పడి బ్రుగ్గ బదఘట్టనంబునఁ జదిసిరాలు – తి;
రయమున దరులు సాల్పడిబ్రుగ్గ – ఆ ఐ ఓ.కసం.ఖ.శ. 9. శీఘ్రగతినినుఱక – ర.
సత్వరమున – ఎ ప; జత్రువదల – శక 10 సనునట్లు – పెక్కు ప్రతులు.
11. చికటి – గి। వీ శ ష అర్ధానుస్వారము లేనిరూపము ; చీంకటి – ర.
12; కంట్లులు – భా కూ ; గుండ్లు – కొన్ని వ్రాఁతప్రతులు.

163 1 మతులై –కొన్నిప్రతులు; యుతులై –ఊ 2. లైన నయా – న. 3. ధర్మమెరుం
గక –అ ఈ.ఋ ఒ న వ 4 సుహృజ్జన – ఈ గ; సుహృద్వ్యత–గి। చ ద.శ.ష

164 వ. తదనంతరంబ[1] ప్రభాత సమయంబగుడును.

165 చ. అతిదురితక్రియాభిరతుఁడై పురోచను[1]తోన భస్మసా
త్కృతమయి చెడ్డ తద్విపులగేహముఁ దక్షణదగ్ధమైన యా
కృతకవిభూతిజాతుసనికేతనమున్ మఱి శస్త్రవేశ్మముం
ధృతిసెడి చూడఁగా బరుగుదెంచి [2]జనుల్ గడుసంభ్రమంబు[3]తోన్.

166 మధ్యాక్కర. బ్రోవైన భస్మంబు [1]వాయఁద్రోచి యబ్బాదిలో నడఁగి
యేవురు గొడుకులతోడ నొండొక్కయింతి యత్యుగ్ర
పావకదగ్ధయైయున్నఁ జూచి యప్పౌరులు దాని
భావించి కుంతియు సుతులునని శోక[2]పరవశు లగుచు.

167 మ. బలవంతుల్ భరతాన్వయస్థితికరుల్ భాస్వ[1]ద్భుజావీర్యని
ర్దళితారాతులు భూరి[2]భూధర మహాధౌరేయకుల్ పాండవే
యులు నిష్కారణ మిట్లు [3]వచ్చి ధృతరాష్ట్రోపాయ మాయోత్థిత
జ్వలనజ్వాలలఁ [4]గ్రాఁగిరే యనుచు [5]సంజాతార్తులై [6]రెంతయున్.

168 వ. అంత విదురప్రేషితుం డయినఖనకుండు పౌరులంగలసి భస్మంబు వాయఁ [1]ద్రోచువాఁడపోలె నెవ్వరు నెఱుంగకుండఁ దనచేసిన [2]బిలంబు ద్వారంబు గప్పి యక్కయింటి నొక్కనిషాదవనిత యేవురు గొడుకులతో [3]దగ్ధయగుట యెఱింగి [4]గజపురంబునకుంజని తద్వృత్తాంతంబును బాండ

---

164 1. ప్రభాతంబగుటయు — మ; ప్రభాత సమయంబున — గ.చ.ద.భాసం. పి.శ.ష.

165 1. తోడ — పెక్కు ప్రతులు. 2. నరుల్ — య. 3. నన్ — పెక్కు ప్రతులు; గన్. ఖ.

166 1. పాయ - కొన్ని ప్రతులు. 2. పరవశులైరి - ర.

167 1. ద్భుజాదండ - ర. 2. భూధర - కొన్ని ప్రతులు; భూధరమహాధైర్యాన్వితుల్ - ఎ. 3. క్రూర - ఐ. 4. ప్రమందిరే — అ.ఐ; పొందిరే — న.య. 5. సంతాపార్తులై — ప; సంతాపాత్ములై — మ. 6. రంధరున్ - అ.ఆ. ఈ.ఎ.ఐ.ఔ.చ.ద.శ.ష; రచ్చటన్ — ట.

168 1. ద్రోయుచున్నవాఁడపోలె - న; ద్రోచువాడునుంబోలె - ఐ.ఓ.ఖ.ప.మ. 2. బిలద్వారంబు — పెక్కు ప్రతులు. 3. దగ్ధంబగుట — కొన్ని ప్రతులు. 4. గజపురంబున కరిగి — ప; గజపురంబునకుంబోయి — చ.ద.పి.శ.ష.

వుల కుశలగమనంబును విదురునకుం జెప్పెనిట [5]వారణావతమ్మున
వారెల్ల నిట్టి[6]దారుణంబు దుర్యోధనకారితంబ కా నెఱింగి శోకించి [7]కుంతీ
పాండవుల పంచత్వంబు ధృతరాష్ట్రునకుం జెప్పి [8]పుచ్చిన.

*—: పాండవులు లక్కయింటఁ జచ్చిరని ధృతరాష్ట్రుండు దుఃఖించుట :—*

సం. 1-137-10

169 ఉ. బాధితశత్రువర్గులగు పాండు[1]కుమారుల [2]దుఃఖవార్త మ
ర్త్యాధములైన సౌబల దినాధిపసూనులయొద్ద నప్డు దు
ర్యోధనుఁ డాది[3]గాఁగ సుతులున్న [4]సభన్ విని దుఃఖితాత్ముఁడై
యా ధృతరాష్ట్రుఁ [5]డావఱచి నట్లఱచెన్ వివిధప్రలాపుఁడై.

170 వ. మఱియు [1]గాంధారిందొట్టి దేవీజనుల యాక్రందన ధ్వని[2]లంతఃపురంబున
నెగసె భీష్మాదికురువృద్ధులును విప్రులుం బౌరులును శోకాక్రాంతు
లయిరి విదురుండు పాండవుల [3]కుశలస్థితి యెఱింగియు నెఱుంగని
[4]యట్లుందఱుం గలసి [5]దుఃఖితుండపోలె నుండె నంత ధృతరాష్ట్రుండు
గొడుకులుం దానును [6]బాంధవులును [7]గుంతీపాండవుల కు[8]దకదా[9]నంబు
సే[10]సి సంస్కారాదిపరలోకక్రియలు గంగాతీరంబునం జేయ [11]సమకట్టించి
తగువారి బ్రాహ్మణుల నపారధనంబుల తోడం [12]బుచ్చిన.

5. వారణావతంబువారెల్ల — అ.ఆ ఊ.ఋ ఎ.ఏ,ఐ.ఒ ఓ.ఖ త బ.య.ర. 6. దారుణంబయిన కృత్యంబు దుర్యోధను కృత్యంబుగా — చ.వీ.శ ష 7. కుంతీ — న లో లేదు, 8. వుత్తెంచిన — ఆ ఈ.ఖ.చ.జ.డ.ద.వీ.శ.ష.

169 1. తనూజుల — ద.ర 2. దగ్ధవార్త — స. 3. గాసుతులునున్నయెడన్ — య ర.ల ; సుతులు యున్న యెడన్ — కొన్ని ప్రతులు. 4. యెడన్ — కొన్ని ప్రతులు. 5 డాలఱచి నట్లఱచెఁ — వా. కొన్ని ప్రతులు ; డావరచి నట్లరచెన్ — ఆ.ఐ ద వీ శ.ష.

170 1 గాంధారిదొట్టి — య ర. 2. లొక్కపెట్ట — క.వా ; లంతఃపురంబున — పెక్కు ప్రతులు. 3 కుశలగ మనం బెఱింగియు — గ.చ.ద.ల.వీ.శ.ష. 4. వాడపోలెనంనఱం — ఔ.చ.బ వీ శ ష. 5. దుఃఖితుండైన యట్లనుండె — ల; దుఃఖితుండైయుండె — ఓ.ఔ.చ.డ.ద.శ.ష 6 బాంధవులును — కొన్నింట లేదు. 7. పాండవులకు గుంతికినుద — న. 8 తిలోదక ప్రదానంబు — ఔ 9. సియగ్ని సంస్కారాది — గ చ.ద వీ.శ.ష.స. 10. సమకట్టి — అ ఆ.ఊ.ఐ.గ.ట.డ.బ.య; సమకట్టించి—కొన్ని ప్రతులలో లేదు. 11 బంచిన—ఒ ఓ జ త త.ప; బంచినంత—ల.

171 క. మతిఁ బాండుకుమారుల పంచత విని దుర్యోధనుండు సంతసపడియెఁ
హితుఁడయిన పురోచను పంచత కెంతయు జాతదుఃఖ[1]చంచలుఁడయ్యెన్.

—: పాండవులు వారణావతమువనుండి దక్షిణదిశగా నడచుట :—

సం. 1-137-17

172 వ. అట పాండవులును భాగీరథి [1]లంఘించి దక్షిణాభిముఖులయి మారుత
మార్తాండమరీచిగోచరంబు గాని [2]గహనంబున నరుగుచు నధికతుష్ణి
పాసాపరవశులయి నడవ [3]నోపక యున్న నెప్పటియట్ల యందఱ నెత్తి
కొని వాయుతనయుండు వాయువేగంబునఁ జని [4]సాయాహ్నంబున
నొక్క వటమహీజాత[5]శీతలశిలాతలంబున నునిచి దాని యగ్రవిటపం
బెక్కి నీరారయుచు[6]న్నంత ననతి దూరంబున.

173 మ. ప్రమదాపాదిపయఃప్రపూర్ణమిది[1]యోఁ బద్మాకరంబంచుఁ ద
త్కమలామోదసుగంధమారుతము వీఁకన్ [2]మున్నె లింగించినన్
రమణం బిల్చె సరోవరం బనిలజున్ రాజీవరాజీ[3]వస
త్సముదాళివ్రజచక్రవాకబకహంసక్రౌంచనాదంబులన్.

174 వ ఆ దిక్కున [1]కాతుణంబ యరిగి యక్కొలను గని యందుఁ గృతావ[2]గా
హుండై కడుపునిండ నీళ్లుద్రావి యచ్ఛిద్రకమలపత్త్రపుటికల నీళ్లుగొని
భీముండు గ్రమ్మఱ వచ్చునంత.

171 1 సంచయుఁడయ్యెన్ — ట.గి$_1$ చ.ట.ద న.భాసం ర శ.ష; సంచలు డయ్యెన్ — పెక్కు ప్రతులు

172 1 యుత్తరించి — జ 2. గహనంబులలో నరుగు — అ బొ.య ; గహనంబు లోన నరుగుచు — ఆ గి$_1$ ఖ డ న.శ.ష 3. నేరక — ఓ. 4.సాయాహ్న సమయంబున — కొన్ని ప్రతులు, సాయాహ్నకాలంబున — కొన్ని ప్రతులు 5. శీతలప్రదేశంబు — అ.చ.ద య.శ.ష ; శిలాతల ప్రదేశంబు — న. 6 చున్ననతి దూరంబున — ఎ.ఐ గి$_1$ త.ప.

173 1. మిదియో — వా. కొన్ని ప్రతులు ; మిదిగోప — గి$_1$.చ.ద భాసం.పి శ ష.స. 2. తన్నె లింగింపుచుఁ — స.శ; మున్నెరింగించుచున్ — ఐ.జ.ప ; మున్నెలిం గించినన్ — పి.శ.ష. కొన్ని ప్రతులు 3. పతత్ — గి$_1$.శ.న.

174 1. కు నతుణంబ — ఏ గ.జ.ర; కుఁదతుణంబ — గి$_1$.భాసం. కొన్ని ప్రతులు. 2. గాహనుండై — వా.శ. కొన్ని ప్రతులు ; గాహుండై — కొన్ని ప్రతులు

పరులైన కొడుకులఁ బడసినయది పుష్పసకుమార[4]తనుమూర్తి [5]శుచి పరార్ధ్య
శయనతలంబున శయనించి యున్న నిద్రపోవని యది దప్పిఁ బొంది [6]కటికి

ఆ. నేలఁ [7]గండ్లులొత్త [8]నిద్రపోయినయది, తల్లికంటె నిద్రఁ దగిలి సుతులు
[9]వాలుమృగములున్న వనమున[10]వగపక, సుఖించి[11]యుండి రేమి[12]మాడ్కి యొకొ.

180 వ. వీరికి నిద్రాభంగము సేయనోపఁ దమకుం బార మేల్కని [1]నీళ్లు ద్రావుదురు గాక యని యక్కమల[2]పత్త్రపుటికల నీళ్లుమ్మగా సంగ్రహించి వెండి యుం దనమనంబున.

181 క. ఖలుఁడై ధృతరాష్ట్రుఁడు పుత్త్రులఁ దానును గూడి మమ్ము [1]దూరస్థులఁగా
నిలు వెలువరించి లాక్షా[2]నిలయంబున [3]నునిచెఁ బాప[4]నిష్ఠితబుద్ధిన్.

ఖ: పాండు మహీపతి భార్య ధర్మ — యు 4 తనుమూర్తి — ఒ బొ వ.యు, మూర్తి యుశుచి — $గ_1$ చ వి శ ష. 5 శుచిమనోజ్ఞ — న 6 కడిది—ఐ 7. గల్లులొత్తి—స.శ ;గరళ్లొత్తి — ఐ; గడ్డలొత్త — స; గాళ్లు, గడళు --- స; క ఱలొత్త — భా కూ. 8 నిద్రబోయెడునయ్యో—$గ_1$ చ.ద వి.శ ష. 9 వాలు మృగము లున్నవనమని—$గ_1$.చ వీ శ. శర.ష , వాలుమెకము లున్నవనమని — ద.వి , వాత్మెకముల ఘోరవనమని—ల.స , వాలుజంతుల ఘోరవనముని — న , వాల్మృగముల ఘోరవనమని — వా కొన్ని ప్రతులు. 10 యెరుగక—ఆ.ఈ. బు ఒ క.ఖ ట త.బ ; తలపక—అ ఓ ఔ.చ ద.వి శ.ష 11 యునికియేమి— ఈ ఊ.ఐ ఓ.గ ప 12 మాయయొక్కొ—ల ; మాడ్కినొక్కొ — య , చుండ్కి యొక్క — భా.కూ.

180 1. నీళ్లు ద్రావుదురని — $గ_1$. పెక్కు ప్రతులు. 2 పత్ర — ఖ ట న.లలో లేదు ; పత్రపుట్టికల — పెక్కు ప్రతులు

181 1. దూరస్థులుగా — కొన్ని ప్రతులు; దురవస్థలగా — $గ_1$. 2. నిలయస్థుల జేసె — వ. 3. జొనిపె — అ గి.చ.ద వీ శ ష స. 4. నిష్ఠురు డగుచుఁ — క , నిష్ఠుర బుద్ధిన్ — స ; నిశ్చలబుద్ధిఁ — ప; నిశ్చితబుద్ధిన్ — బ , నిశ్చయబుద్ధిన్ — ఐ

182 క. కులపాంసనులై యహితంబుల సేఁయుచు నుండు చుట్టములఁ బొందక యి
 మ్ముల నుండు[1]వాఁడ పుణ్యుఁడు, వెలయఁగ గ్రామస్థితైక[2]వృక్షము
పోలెన్.

183 క. పరహిత [1]ఫలవంతులు సుస్థిరమూలాన్వితు [2]లపాపధీరతులు పర
స్పరసంశ్రయమున జీవింతురు [3]మనుజులు వనములోని ద్రుమముల
పోలెఁ.

184 వ. అని ధృతరాష్ట్రబాంధవంబు [1]నిందించుచు నిబిడాంధకారనీ
రంధ్రంబులయిన [2]దిశలు [3]సూచి యున్నంత జనరభసంబు దవ్వుల
వీతెంచిన [4]ముందటం బురంబు గలుగవలయు [5]వీరలు మేల్కొనునంతకు
నేనిచ్చోట [6]నేమరకుండవలయునని.

185 క. ఆకాననాంతరంబునఁ, [1]ప్రాకటభుజవిక్రముండు పాండవవజ్ర
ప్రాకారుఁడు [2]జాగరమున, [3]శోకమనస్కుఁడయి పవన[4]సూనుం డుండెన్.

182 1 వాడు – కొన్ని ప్రతులు 2. వృక్షముపోలెన్ – ఋ.ఖ.చ.ప.శ ష.

183 1. ఫల – పెక్కు ప్రతులు: బల – అ.ఎ ఔ.ఖ డ బ.భాసం య శ; ధన — వా 2. లపారధీయుతులు – చ.జ.ద.వీ శ స ; లపారధీమతులు – య ; లపారధి క్కృతుల్ – ఆ.ఖ 3. పుణ్యులు – ఈ.ఊ ఎ ఒ ఔ.గ జ.త.ప.వ

184 1. నిందించి – ఔ.ర.ల ; నిందింపుచు – ఆ ఐ.ఓ.డ.త 2. నలుదిశలు – న 3 చూచుచు – ఒ.ఖ.త.భాసం.ర కొన్ని ప్రతులలో 'యున్నంత' లేదు; కలయం జూచి – ఔ.న. 4 ముందరనగరంబు — మ. 5. నిచ్చోటనేమఱియునికి యుచితంబుగాదని – వా.శ. కొన్ని ప్రతులు. 6. ఏమరకయుండవలెనని – మ ఏమఱియునికి కార్యంబుగాదని – వ; ఏమఱకుండవలయునని – గ1.చ.ద.వీ.శ.ష.

185 1. ప్రాకటముగ ధైర్యుండగుచు – క. 2. కాపుండెను – ఐ.మ ; దానుండెను – న. జాగరమున – భాసం.స; జాముండెను — వా; డుండనంతనశోక – ఔ ; నంతట ఘనశోకమనస్కుఁ డయి – ఖ 3. శోకస్థితితోఁ – న. 4. సూనుడు కడిమిఁ – పెక్కు ప్రతులు ; సూనుండున్నన్ – జ.స , సూనుండుండెఁ – భాసం ; సూనుండంతన్ – వా కొన్ని ప్రతులు.

186 వ. తత్సమీపంబున [1]బాలసాలతరుషండమండపంబుననుండి హిడింబుఁడను నొక్కరక్కసుండు [2]వారిదవ్వులం జూచి మైపెంచి రూక్షకేశంబులు [3]విద్రిచి యావులించి నీల్గి నీరసవన్యమృగమాంస[4]ఖాదనజాత[5]నిర్వేదన పరుండనయి [6]పెద్దకాలంబునకు [7]మానవమాంస[8]మాస్వాదింపం గంటి నని తనచెలియలి హిడింబ యనుదానిం బిలిచి యిట్లనియె.

187 ఉ. ఇందుల [1]కిమ్మొయిన్ మనుజులెన్నఁడు వత్తురె [2]వత్తురేని యా నందముఁ [3]బొంది నిర్భయమునన్ శయనింతురె యిట్లు వంటయిల్ కుందెలు సొచ్చె వేగచని కోమలి వారలఁ జంపి తెచ్చి [4]నా కొందఁగ వండిపెట్టుము [5]రసోత్కటమానవమాంసఖండముల్.

*—: హిడింబ భీమసేనునింజూచి మోహించుట :—*

సం. 1-139-1

188 వ. అని [1]పనిచిన నదియును నతిత్వరితగతిం జని ముందఱ వారల డాయ శంకించి యొక్కవృక్షంబుమఱువునం [2]గొండొక ప్రొద్దుండి.

186 1 బాలరసాల తరుషండమండిత మంటపంబున – ర. బాలసాల రసాలతరు – య.ల, బాలరసాలతరుషండమధ్యమండపంబున — మ, బాలలతాతరుషండ మండపంబున – చ ద వీ శ ష, మంటపము – అని పెక్కు ప్రతులు 2. వారలం జూచి – పెక్కు ప్రతులు. 3. విదిర్చి – $గ_1$ పెక్కు ప్రతులు ; విదల్చి – న, విదిల్చి – ల 4. ఖాదనచేతోనిర్వేదనపరుండయి – ము 5 నిర్వేదనుండనై — ఋ.ఎ.ఐ ఒ ఖ.గ. 6 పెద్దగాలంబు – ర. కొన్ని ప్రతులు. 7. మానుష – $గ_1$.చ.ద.ము.ర వి.శ.ష, మనుష్య — అ ఆ ఔ. 8. బాస్వాదించగలిగెనని — ఒ.త

187 1. కెమ్మొయిన్ – పెక్కు ప్రతులు. 2. వచ్చిరేని – భాసం. వా.శ. కొన్ని ప్రతులు ; వత్తురేని – అ.ఋ.ఐ.జ.త 3 తోడ — ఊ. 4 నాకుందగ — ఆ.ఈ.ఊ ఎ.ఓ.ఔ.క గ.జ డ.ద న ప.బ ర.ల ; యింపొందగ — అ. 5 రసోత్కర మానవమాంస – ర.

188 1 పంచిన – కొన్ని ప్రతులు 2 కొండొకప్రొద్దు – $గ_1$.ల.ర పెక్కు ప్రతులు, గొంత ప్రొద్దుండి — నా

189 మ. వనజాతాయతనేత్రు నున్నతబృహద్వక్షస్స్థలుఁ సింహసం
హననుం బాండవసింహమున్ హృదయజన్మాకారు నుద్యన్మహో
శనికల్పస్థిరబాహుఁ జూచుచు మనోజాతాగ్నిసంజాతవే
దనయై రాక్షసి [1]కామరూపధరమర్త్యస్త్రీస్వరూపంబు[2]తోన్.

190 క. వితతబహురత్నరుచిశో,భితభూషణములు వెలుంగ బెడఁగగు నవపు
ష్పితజంగమలత[1]క్రియను,న్నతకుచ సనుదెంచెఁ బవననందను డాయన్.

191 క. రమణి నిజభ్రాతృనియో,గముఁ దలఁపక యపుడు భీముఁ[1]గదిసెఁ బతిస్నే
[2]హము కామినులకు బలవం,తము వెఱనెయ్యములు వేయుఁ దత్సదృశము లే.

192 వ. ఇట్లు మన్మథ[1]వ్యథాశిథిలితమానమానసయయి తనయొద్దకు వచ్చు దానిం బవమానసూనుం డవమానపూర్వకంబున నీవెందులదాన విం[2]ప్రొద్దిందుల కేలవచ్చి తెటవోయె దెడగలిగి పొమ్మనిన విని హిడింబ యిట్లనియె.

193 క. జననుత యేను హిడింబుం,డను [1]రక్కసుచెలియలం బ్రియంబున నినుఁ జూ
చినయప్పుటఁ గోలెను గడు, [2]మనోభవనిపీడ్యమానమానస నయితిన్

189 1. కామరూపధరి — అ ఐ ఔ జ డ 2. నఁ — అ ఋ.ఊ.ఎ.ఐ.ఓ.ఔ. క.జ.ప.ర.

190 1. పోలెను లతాంగి — ప ఐ.క ద ప శ.ష, పు,ష్పితజంగమలతపోలె, న్లతాంగిసను దెంచె పవననందనుడాయన్. అని రెండు పాదములు నుండును — గ[1].భాసం. ల ర పీ.

191 1. గవిసె — వ, గలసె — కొన్ని ప్రతులు. 2 హము — పెక్కు ప్రతులు.

192 1. వ్యథాశిథిలమానమానసయై — ల; వ్యథాకులితమానసయై — చ.ద.పీ శ.ప. వ్యథాశిథిలీకృతి — ఖ, వ్యథాపీడితయై — ఆ.బ 2 ప్రొద్దిందులకేల వచ్చితి — చ.భాసం పీ. శ ష: ప్రొద్దేలవచ్చితి — వా.శ. కొన్ని ప్రతులు.

193 1. రాక్షసు — వా. కొన్నిప్రతులు; రక్కసు — పీ.శ.ష. కొన్ని ప్రతులు. 2. మనసిజశర — ఆ ఈ.ఊ.ఔ.క ఖ.జ భాసం. ల; మనోజశర— అ.చ.ద.య.పీ. శ.ష.స; మనసిజబాణప్రభిన్నమానసనైతిన్—స.

194 క. నాకుఁ బతివయిన నిన్నుం, జేకొని మాయన్న యెగ్గుసేయక కాచున్
నాకు మఱి నీవ పతివి గు,ణాకర యిజ్జన్మమున మహాస్నేహమునన్.

195 చ. [1]ఉఱుఁడు సురేంద్రుఁడైన బలియుండు హిడింబుఁడు వాని[2]బారికిన్
వెఱవనివారలుం గలరె వీరలు ముందరెఱుంగ రక్కటా
యెఱిఁగిరయేని యిట్లు దమ [3]యిండుల నుండినయట్లు మెచ్చకే
మఱి శయనింతురే కడుఁ బ్రమాదము సేసిరి [4]బుద్ధిహీనులై.

196 వ. ఇది హిడింబు వనంబు దీనిం జొచ్చి [1]వెలువడుట యపుకుత్తుకఁ జొచ్చి వెలువడునట్లు యాతండింతకు వచ్చు వీరితోడిదేమి నీవు నాకుఁ బతివై ప్రాణంబు రక్షించుకొని నావలన నిష్టోప[3]భోగంబులందు మేనును గామచారిణిని నీకిష్టంబై [4]నచోటికి నిన్నుఁ [5]దోడ్కొని పోవనేర్తు ననిన దానికి భీముం డిట్లనియె

197 క. విను[1]బేల యెట్టికష్టుఁడుఁ, దన [2]పురుషగుణంబు సెడఁగఁ దల్లిని దోఁబు
ట్టినవారి విడిచి రాగం,బునఁ జపలస్త్రీసుఖంబుఁ బొందునె చెపుమా.

198 వ. అనినవిని హిడింబ వీరి[1]నిందఱ రక్షించుట [2]నీకుఁ బ్రియంబేని [3]యప్పురుషా[4]దుండు [5]రాకుండ ముంద [6]వీరి నెత్తికొని పోయెద [7]వీరలఁ బ్రబోధింపు మనిన భీముండిట్లనియె.

195 1 ఉఱుకుసురేంద్రుఁడైన—ల.స. 2 దాడికిన్ — మ, బారికిన్—గ₁ చ ద భా సం వీ శ.ప ; వాతికిన్—అ.ఔ.య.ర భాకూ శి; ఘాతకున్ — ఋ.ఐ ఔ.క జ ప ల ; ఘాతికిన్—వా.శ. కొన్ని ప్రతులు. 3 యిండ్లను నిద్రితులైనయట్లయేమరి—అ.ఆ బ ర.ల.స ; ఇండ్ల బరుండినయట్లు — స; యిండ్లను నిద్దురబోవునట్లుయే — జ యిళ్ళను నుండినయట్లు — య. 4. కార్యహీనతన్—ఐ

196 1. వెడలుట - ఈ. 2. నాయందు—స. 3. భోగంబు లనుభవింపు — క.డ 4. యున్నెడలకు — క. 5 దోకొని పోవ — ల ; గొని పోవనేర్తు—అ బ య.

197 1 బాల — ప.య 2 పౌరుషగుణము సెడగ—అ; పురుషగుణంబు నెడగ— య

198 1 నిందఱ — పెక్కు ప్రతులలో లేదు. 2. నీకిష్టంబేని — క న 3. యిపుడ యాపురు — గ₁.చ.ద ల వీ.శ ప 4 ధముండు — పెక్కు ప్రతులు 5. రాక మున్న — ఆ.క ; రాకముందరనిందర నెత్తికొని — య 6. నెటకేని వీరి నిందఱ నిన్ను నెత్తికొని పోయెద — ల. 7. వీరల ప్రబోధింపు — పెక్కు ప్రతులు ; వీరి నందఱం బ్రబోధింపు - వా.

199 తే. అధికవీరుండు రక్కసుఁ డరుగుదెంచు, నని మనంబున భయమంది [1]వనజ నేత్ర
వీరి సుఖసుప్తులై యున్నవారి నిద్ర,సెడఁగ బోధింప [2]నోప నాకడిమి వినుము.

200 ఉ. [1]క్రచ్చఱ నొక్కరక్కసుఁడ కాఁడు సురాసురు లెల్ల [2]నొక్కలై
వచ్చిన నీవచూడఁగ సవార్య[3]బలోన్నతిఁ జేసి వారలన్
వ్రచ్చి వధింతుఁ[4]గాక యిటువచ్చి [5]శ్రమంపడి యున్న నిచ్చట
[6]న్మెచ్చగు వీరిదైన సుఖనిద్రకు భంగము సేయ[7]నేర్తునే.

201 వ. [1]పెక్కులు వలుకక యారక్కసు [2]రాఁబనుపు మని భీమసేనుండు[3]విజృంభించి పలుకుచున్నంత నట హిడింబుండు [4]హిడింబ మసలుటకు [5]మహాక్రోధానల[6]జ్వలితచిత్తుండయి.

202 సీ. కాలమేఘంబును[1]బోలె విశాలమై [2]నీలమై దేహంబు గ్రాలుచుండ
[3]ఘనతటిల్లతల యట్లెనిమిదిదంష్ట్రలు[4]మెఱవంగఁ బండులు గొఱికి[5]పెలుచ

199 1 వనజనేత్రి — భాకూ పెక్కు ప్రతులు ; 'వనజనేత్రి' అని ఈ కారాంతమును కలదు – భా.కూ. 2 నేర - కొన్ని ప్రతులు.

200 1. క్రచ్చు + అఱ ; 'క్రచ్చు' అనగా మాంద్యము అఱ అనగా పోగా క్రచ్చఱ నిలవంచి చక్కసగమక్కడ నెవ్వరికేని మచ్చిలం / భెఱుగక ' అని యతితో నున్నది — భా.కూ. 2. నొక్కలై — గ$_1$.భాసం. పెక్కు తాళపత్రప్రతులు; నొక్కఁలై — వా శ 3 బలోద్ధతి జేసి—ఆ.ఔ ఖ.ల.పి. 4. గా కిటుల వచ్చి— క ల ; గాక యిట వచ్చి — పెక్కుప్రతులు. 5 శ్రమంబడియున్న—ఖ డ.యు. 6 నిచ్చలు — అ.ఔ న.స ; నిచ్చగ — ఆ.ఉ ఊ.ఓ.గ.చ.ద.వ.బ.ల.పి.శ.ష ; నిచ్చగు (పొడవగు) భా.కూ , నిచ్చగు — జ.డ.త. 7 నెట్లగున్—ఔ.ట.

201 1. అని నీవు నాయొద్దఁ బెక్కులు వలుకక — గ$_1$ చ జ.ద.పి శ.ష. 2. రావింపు మని — ఆ.గ.గ$_1$ చ ద.ల.పి శ ష. 3 విజృంభించి యున్న సటహిడిం — య. 4. హిడింబ రాక మసలుటకు – ఆ బ.ర.ల 5. మహాక్రోధజ్వలితచిత్తుండై—స.ర. 6 జ్వలితుండై—ఊ.ఎ ఐ.గ

202 1. బోలి—ర. 2 లీలమై—ల. 3 ఘనతటిల్లతికలట్లెనుమిది—ఖ ; ఘనత టిల్లతలట్ల యెనిమిదిదంష్ట్రలు—య ; ఘనతటిల్లతికెలట్లె నిమిది దంష్ట్రలు—స. 4. మెఱయంగ ఐ ఒ.గ.జ.ద.బ.పి శ.ష ; కడుబండ్లు గొరికి పెలుచ—న ; పండ్లు, పంళ్లు లేఖనవిశేషము భాకూ లో గలదు. 5. కొసుచు — గ$^1$.య పి శ.ష. పెక్కు తాళపత్ర

నతి[6]రోషలోహి[7]తాయత[8]వృత్తనేత్రముల్ దిరుగంగఁ బెట్టుచుఁ బరుష కేశ
[9]జాలంబు గాడ్పునఁ దూలంగఁ గాలోపమానుఁడై [10]చనుదెంచి మాను
పాదుఁ

ఆ. డనుజఁ జూచి [11]కష్టమనుజులఁగూడి నా,పనుపు[12]సేయ కుండఁ జనునె
నీకు
ననుచు [13]నుదరిపలుక విని [14]హిడింబయుఁ గడు, వెఱచి భీమసేను
మఱువు సొచ్చె.

-: *భీమసేన హిడింబాసురుల యుద్ధము* :-

సం 1--141--15

203 వ. అంత.

204 ఉ. పన్నగవైరివిక్రముఁడు పాండవ[1]సింహము దానిఁ జూచి మీ
యన్నను నన్నుఁ జూడుము భయంపడకుండు[2]మ యంచు వాని [3]స
త్యున్నతిఁ దాఁకి రాక్షస[4]వధోచిత [5]నీబలగర్వ[6]మేదఁగా
నిన్ను వధించి యివ్వనము నెట్టన [7]చేసెద నిర్భయంబుగన్.

205 క. [1]చక్కఁగను మనిన రక్కసుఁ, డక్కజముగఁ [2]నిలిచి యియ్యా యగు
[3]నిప్పుడు నీ

ప్రతులు 6. కోప—కొన్ని వ్రాతప్రతులు 7. తాహిత — య 8 వృత్త— పెక్కు ప్రతులు ; వృత్తి - కొన్ని ప్రతులు. 9. జాలముల్ — పెక్కు ప్రతులు. 10. పరతెంచు—న. 11. కష్టమనుజుని గూడి—ర. 12 సేయకుంట— ఖ.స. 13 నదిరి— గి। చ శ ష; దూరిపలుక—న. 14. హిడింబయు నుండ—న

204 1 సింహుఁడు — అ.ఐ.చ.త ద ప.ల వి.శ.ష. 2. మటంచు — మ.వీ.శ.ష. పెక్కు వ్రాత ప్రతులు 3. నత్యున్నతు - వా.శ ; నత్యున్నతి — పెక్కు ప్రతులు. 4. మదోద్ధత — ఆ.ఖ.గి। చ.ద.ప వ.వి.శ ష. 5 నీబలదర్పమేదగా - చ.ద వ.వి. శ ష. 6. మింకగా - య 7. సేయుదు నిర్భయంబునన్ — అ.

205 1. చక్కనిలుమనిన రక్కసు - మ 2. నిలిచి మానుషాధమయికనీ - న ; బెరిగి వచ్చి యయ్యనిలజు — గి।.చ.వి శ.ష. 3 నిప్పుడ — ర. కొన్ని ప్రతులు.

యుక్కను బీరముఁ [4]జూచెదఁ, [5]జిక్కక నిలుమనుచుఁ గడు [6]విజృంభించి
వడిన్

206 క. [1]చేసమరికొంచుఁ బోడువఁగ, [2]డాసినఁ దద్భుజము [3]తోనడగ్గలఁగ జయో
ద్భాసియయి పట్టికొనియె మహాసత్త్వుఁడు భీమసేనుఁ [4]డమ్మను జాదున్.

207 క [1]నిరుపద్రవసుఖనిద్రా, నిరతాత్మకులయిన వీరినిద్రకు నస్మ
చ్చరణభుజఘాత[2]శబ్దం, బరుదుగ విఘ్నంబు సేయునని [3]వగచి[4]మదిన్.

208 క. వడముడి యారక్కసు న,య్యెడ [1]కష్టధనుఃప్రమాణ మెడగలుగఁగ [2]నె
వ్వడి నీడ్చె నల్పమృగమును, విడువక [3]గజవైరి యీడ్చువిధమునఁ
[4]బెలుచన్,

209 వ. [1]అట్టియెడ.

210 చ. చరణహతిఁ [1]మహాతరులు [2]సాల్వడి జర్జరితంబులై మహిం
[3]దొరఁగఁగ నిట్టులొండొరులతోడ మదోద్ధత[4]వృత్తిఁహాయు

4. చెఱిచెద — మ.స ; నడచెద — ఓ.త య ; నుడిపెద — అ.ఔ.ర.స.
5 చిక్కక — ఐ.భాసం. చిక్కన — వ; జిక్కన — వ.వా శ. కొన్ని ప్రతులు.
ఇయ్యయగు — అంగీకారమగుమ — భాకూ. 6. విజృంభించుటయున్ — ల

206 1. దీనికిముందు భీముండును సన్నద్ధుండై యెగురుసనుదెంచిన రక్కసుం డగిగి — అనువచనము — ల ప్రతియందు కలదు 2. డాసిన — దడయోరభేదః. భా.కు. చేసరచు — ఒ ; చేసఱిచికొంచు — క.వీ.శ ష స 3. తోన — పెక్కు ప్రతులు ; తోడ — భాసం వా శ కొన్ని ప్రతులు. 4. డమ్మను జాళిఁ — య.ర వ.

207 1 దీనికిముందు 'ఇట్లు పట్టుకొని' అనువచనముల ప్రతిలో కలదు. 2. శబ్దము లరుమిగ — ఆ.ప య.ల. 3. వెరచి — అ 4 వడిన్ — ఊ.వ.స.

208 1 నష్ట — ఋ.ఓ గి। చ.ద వీ శ.ష 2. చేడ్వడ — స. 3. మృగవైరి — కొన్ని ప్రతులు 4 పోలెన్ — వా శ కొన్ని ప్రతులు; బెలుచన్ — పెక్కు ప్రతులు.

209 1 ఈ వచనము పెక్కు ప్రతులలో లేదు.

210 1. మహాతరులు — స, లతాతరులు — వా పెక్కు ప్రతులు ; శిలాతతులు — బ. 2 చాల్పడి — ఆ తి న. భా.కూ ; సాల్పడి — ఒ.డ.య 3. దొరుగగ — పెకు— ప్రతులు ; దొరుగుచు నుండ నొండొరుల — ఋ.క ఖ.గ. 4. వృత్తినుద్ధత క—

ద్విరదములట్లు ఘోరరణవీరులు సేసిరి మల్లయుద్ధము
ద్ధురబలులై సమీరణసుతుండు హిడింబుఁడు [5]దద్వనంబునన్.

211 క. ఘూర్ణపదఘాతజాతఘ,నార్ణరేణుప్రకరధూసర [1]శరీరకులై
వారిద్దఱు నొప్పిరి నీ,హారచ్ఛన్నంబు లయిన యద్రుల పోలెన్.

212 క. ఆరాక్షసుండు భీము న,పారభుజాబంధన[1]మున బంధించి మహా
[2]ధీరధ్వని రోదోంతర, పూరితమగు[3]నట్లుగాఁగ బొబ్బిడి యార్చెన్.

213 వ. అమ్మహాధ్వని విని కుంతియుఁ గొడుకులును మేల్కని తమసమీపంబున నతిమానుషం బైన రూపసౌందర్యంబులతో నున్న హిడింబం జూచి యిది వనదేవతయో సురకన్యయో యనుచు విస్మయంబంది రంతం గుంతి [1]శాంతవచనంబుల [2]నీవెందులదాన విట [3]కేలవచ్చితని యడిగిన నది యిట్లనియె

214 సీ. నీలజీమూతంబులీల [1]నాఁకేపించి నల్లనై [2]తోఁతెంచు నల్ల[3]గృహము
గల హిడింబుండను [4]బలితంపురక్కసు చెలియల నాతండు వెలయ మీకు
రోయక యహితంబు [5]సేయనన్ బంచినఁ జనుదెంచి యేను మీతనయు [6]నందు
బలిబుద్ధిఁ [7]దాల్చి [8]యుద్ధత[9]మన్మథార్తనై మసలిన నసుర వచ్చి

ము క.ఖ గ జ; భీమునకు అదియుసనై బొమ్మిబోయేడు — భా.కూ. 5 తద్వ నంబులోఁ — న

211 1. శరీరులునై — ఖ.ఐ

212 1. ముల — కొన్నిప్రతులు, ముల బొబ్బడుచుమహా—య 2. వీరధ్వని — కొన్ని ప్రతులు. 3. నట్లయుండ బొడుచు చునార్చెన్—ఓ మ; నట్టుబుండ—చ.ద శ.ష

213 1. సాంత్వన వచనంబుల — అ ఐ ఉ. 2. నీవెవ్వరి — వా శ. కొన్ని ప్రతులు నీవెందుల — అ.ఓ చ.ద.వీ.శ.ష. 3. యేల — వా శ. కొన్ని ప్రతులు; యేక తంబవచ్చితి — ఆ.స, యేకతంబ యిచ్చటికేల వచ్చితివని — ఔ, కేలవచ్చితని — వీ.శ.ష కొన్ని ప్రతులు.

214 1. నాఁకేపించు — కొన్ని ప్రతులు 2. యున్నట్టి యల్లగృహము — ఆ 3. యొడలు — మ; తనువు — న. 4. బలితంబు - ఎ. 5 సేయంగ — ఈ.ఎ.ఐ. డ.త.ప. 6 వలన — గి.చ.వీ.శ ష 7. దలఁచి — మ; జేసి — ఖ. 8. యున్నత - కొన్ని ప్రతులు, యుద్ధత — అ స. 9. మదనార్తనై — ము.

తే. యలిగి మీ[10]తోడ నన్నును [11]గలయఁబట్టి, మ్రింగనున్న నయ్యసుర తోడం గడంగి
మల్లయుద్ధంబు సేయుచు నల్లచోట, [12]నున్నవాఁడు మీసుతుఁడు దర్పోన్నతుండు.

215 వ. నన్నును మిమ్మును [1]రక్షించి యారక్కసు నుక్కడంగ నక్షణంబున [2]యిప్పుడు చంపుం జూడుండనిన నందఱు లేచి యుద్ధతులై మల్లయుద్ధంబు సేయుచున్న భీమహిడింబులం జూచిరంత నచ్చోటి[3]కిం జని యర్జునుండు భీమసేనున కిట్లనియె.

216 ఉ. [1]తూర్పరుణంబుగాఁ దొడఁగె దుష్ట [2]నిశాచరవేళ యయ్యెడున్
మార్పుము కాలయాపన [3]మమర్పక యప్పిశితాశిఁ బట్టి పా
[4]లార్పఁగనేల నావుడు బలాఢ్యుఁడు భీముఁడు మల్లవిద్య నే
ర్పేర్పడఁగా [5]హిడింబు బలహీనపరాక్రముఁ [6]జేసెఁ జెచ్చెరన్

10 తోన — కొన్ని ప్రతులు; 11 గలయఁబెట్టి — ఒ గి, ట డ య.శ.ష.
12 నున్నతఁడెమీ సుతుడు దర్పోన్నతుండు — య.

215 1 నుద్ధరించి — ఋ ఖ $గ_1$.చ.ద.వీ శ ష 2. సీతక్షణంబ — ఋ.ఒ గ.బ; నీ క్షణంబు — ఖ 3 కిడాయంజని — ర

216 1 తూఱ్పరు...మాఱ్పుము...ప/ ల్లాఱ్పగ...నే ర్పేఱ్పడ — అనువిధముగా సంయుక్తతా దశయందును - శకటరేఫముండవలయు ననుటకు ద్విరేఫవర్ణ పర్ణనములో నీ పద్యము ప్రమాణముగా నీయఁబడినది. పుట 105 భారతము 'అప్పకవి కృతశకట రేఫనిర్ణయము' అను గ్రంథము నందీపద్యమే 'శకటరేఫము సంయుక్తతా దశయందు సాధురేఫముగా మాఱు' ననుటకుదాహరింపఁబడినది. పుట 97. 2 నిశాచరవేళతీరెడున్ — తీరెడున్ — ప్రవర్తించఁగలదు రాత్ర ముహూర్తము వస్తున్నదనుట భాకూ ఇచ్చటి మూర్తము పురస్సంరజ్యతే ప్రాచీ పూర్వాసంధ్యా ప్రవర్తతే రాత్రేముహూర్తే రక్షాంసి భవంతి బలవంతిచ. 3 మొనర్పక — ప ఓ మ. 4. లార్పుమటన్న — ఊ 5. హిడింబుని విహీన పరాక్రముఁజేసి — వ్వ; హిడింబు నతిహీనపరాక్రముఁజేసి — ల స. 6. జేసి — అ.ఒ ఐ.ట.య.

217 క. వడి నసురవాత ముక్కున, నుడుగక రక్తప్రవాహ [1]ములుకుచు నుండన్
గడ[2]కాలు వట్టి వానిని, [3]మడవక పవనజుండు నూఱుమాఱులు [4]వీచెన్.

218 ఆ. లావు సెడఁగ నిట్లు వీవంగఁ బడి గత, [1]చేష్టుఁడయిన యసురఁ జిక్కఁబట్టి
నేలఁ బెట్టి వాని[2]కోలెమ్ము [3]బల్లిన, విఱిచి నడుము [4]ద్రుంచి [5]వీచివైచె.

219 వ అట్టిచిత్రవధం జూచి [1]చిత్రీయమాణచిత్తులై భీమసేనుపరాక్రమంబు
వొగడుచు నందఱు హిడింబానుగమ్యమానులై [2]చని రట్లరుగునెడ
భీముండు హిడింబ రాకఁ గోడంబడక రాక్షసులు వైరంబుఁ దలంచి
[3]మాయలు సేయుదురు కావున నీవు మాతోడ రావలవదు నిన్ను విశ్వ
సింపము [4]నీవును మీయన్న వోయిన [5]తెరువున పొమ్మనిన నది భయంపడి
వడవడ వడంకుచున్న దానిం జూచి కరు[6]ణారసార్ద్రచిత్తుండయి ధర్మ
రాజు భీమున కిట్లనియె.

220 తే. వధకు [1]నర్హుఁడై వచ్చినవానిఁ జంపి,తదియు ధర్మువయిది [2]చాల నబల దీని
కలుగఁ [3]జనదాత్మరక్షకు నగ్గలంబు, ధర్మరక్షయ యుత్తమధార్మికులకు.

221 క. ఆపద [1]లైనను ధర్మువ, ప్రాపుగ రక్షింపవలయుఁ బరమార్థము ధ
ర్మాపాయము ధార్మికులకు, [2]నాపద జన్మాంతరమున ననుగత మగుటన్.

217 1 ములుకఁగనలుకన్ — ఓ.వా శ. 2 కాలు - పెక్కు ప్రతులు భా.కూ.శ; కాళ్ళు — భాసం.వా వీ కొన్ని ప్రతులు. 3 నుడువక — ఋ.ఓ చ శ ష; నుడవక — ప ఖ గ.ద.ర 4 నీడ్చెన్ — జ

218 1. వేవుడయిన — పెక్కు ప్రతులు 2 నెమ్ములచప్పున — గ. 3. భల్లన — కొన్ని ప్రతులు; పెల్లున - మ, లెల్లను - స. 4 దెంచి - పెక్కు ప్రతులు. 5 విసరివైచె — ల స

219 1 చిత్రాయణ—పెక్కు ప్రతులు; విస్మయమాన-మ. 2 యరిగిరంత — కొన్ని ప్రతులు 3 పెక్కుమాయలు — ల 4 నీవును - కొన్ని ప్రతులలో లేదు 5 తెరువునం బొమ్మనిన — అ య. 6 ణాయత్త చిత్తుండై-$గ_1$ మ. కొన్నిప్రతులు

220 1 నర్హుమై-ప క ట 2. జాల యబల-పెక్కుప్రతులు. 3 దగదాత్మ - య.ల.

221 1 లైనను-కొన్ని ప్రతులు. 2 నాపదలెడ బాపు నిశ్చితాత్ములఁ జేయున్ —క; నాపద జన్మాంతరంబు - ఊ.ఎ ప.

222 వ. [1]దీనియందు రాక్షసభావం బుపలక్షింప వలవదు మాకు నాత్మీయ[2]బుద్ధియ యుండు గనిన హిడింబ ధర్మరాజునకుం గుంతీదేవికి మ్రొక్కి యేకాంతంబునం గుంతికిట్లనియె నవ్వా సర్వప్రాణులకు సామాన్యంబయ్యును మనోజరాగంబు వనితల [3]కసహ్యంబయి [4]విశేషంబయి యుండు నేను వృకోదరునిమిత్తంబు మదనబాణబాధితనయి నాచుట్టంబులనుం జెలులను విడిచితి నాయిష్టంబు మీరు [5]గావింపని [6]నా డిప్పుడ ప్రాణంబులు విడుతు నన్ను రక్షించిన మీకు నిష్టంబులయిన వానినెల్లం [7]దలంచి చేయుదు నిమ్ముగ్గానియెడ మిమ్మందఱ నెత్తికొని మీ[8]మెచ్చిన చోటికిం బోవనేర్తు నాపలుకులు నమ్మునది యే నతీతానాగతవర్తమానంబు లెల్లను దెల్లంబుగా నెఱుంగుదు వలయు[9]నేని యనాగతంబు సెప్పెద వినుండు [10]ముందట నొక్కసరోవరంబును నొక్క వనస్పతియునుం గలవవి రెండును శాలిహోత్రుండను మహామునిచేతం దపఃప్రభావంబునం బడయంబడినయవి యక్కొలనినీళ్లు [11]ద్రావిన వారికి నెన్నండును నాఁకలియును నీరువట్టును [12]లేవ్వనస్పతియు శీతవాతాతపవర్షంబులవలన రక్షించు మీరలందున్న మీకడకుం గృష్ణద్వైపాయనుండు వచ్చి [13]మీకు హితోపదేశంబు సేయునని చెప్పిన

222 1. 'క' ప్రతిలో నీ వచన మీ క్రిందివిధముగా నున్నది. అనియుధిష్ఠిరుండు వృకోదరు కోపం బుపసంహారణంబు చేసి హిడింబ భయంబువలనబాపె అంతనది కుంతికే కాంతంబ యిట్లనియె — క. 2 బుద్ధియయ్యెడు — అ.ఆ, బుద్ధికి ననుగుణంబై యుండు — ఖ.ట, బుద్ధియైయుండు — స. కొన్ని ప్రతులు ; బుద్ధి కొన్నింట లేదు. 3 కగ్గలంబయి — వి.శ.ష కొన్ని ప్రతులు; కసహ్య విషయంబై యుండు — జా 4 విశేషంబయి — కొన్నింట లేదు. 5 సలుపకున్న నిప్పుడ — య; తీర్పని నాఁడు — ఛా కూ. 6 నాడు ప్రాణంబులు — కొన్ని ప్రతులు. 7 దలంచి నప్పుడ — అ చ.ద.వి.శ ష; దలంచిన యప్పుడ — ల. 8. చెప్పిన — ఈ.ఎ.ఏ.గ.బ, వలసిన — ఓ చ ద.వి.శ.ష. 9 నేని ననాగతంబు — గి. భాసం పెక్కు ప్రతులు ; నేని యొక్క యనాగతంబు — ల ; హిడింబ తాను 'అనాగతవృత్తాంతవేదిని' అని చెప్పిన యంశము ఒక్క పి.పి.యస్. ప్రతియందు మాత్రము కలదు ఆది — 151 అధ్యాయము — 991 శ్లో — ప్రతిలోను చిత్రశాలా ప్రతియందును కానరాలేదు 10 ముందర — కొన్ని ప్రతులు. 11. ద్రావిన నవ్వనస్పతి ఫలంబులుపయోగించిన వారికి నెన్నండును నాకలియు నీరువట్టును లేదు — ఊ.జ; ద్రావిన వారి కెన్నడును నీరు వట్టులే దవ్వనస్పతి ఫలోపయోగంబున నాకలియును లేదు మీరలం దున్న — ర. 12. వవ్వనస్పతియు శీతవాతాతపవర్షంబులవలన రక్షించు — అను నీ భాగము పెక్కు ప్రతులలో లేదు. 13. మీకు — కొన్ని ప్రతులలో లేదు.

223 క. విని కుంతియుఁ బాండవులును, మనమున విస్మయముపడి సమంజసభావం
బున దాని దివ్యవనితయ,యని తద్దయు నాదరించి రప్పుడు కరుణన్.

224 వ. అంత దాని వినయంబునకు ననాగతంబెఱుంగుటకు సంతసిల్లి కుంతి భీమున కిట్లనియె.

—: భీముఁడు తల్లియనుమతంబున హిడింబను పరిగ్రహించుట :—

సం. 1-143-1

225 క. అన్న యిది [1]ధర్ముఁవని మీ,యన్నను నన్నును నతిప్రియంబుగ నెదలో
మన్నించి యేమి [2]వనిచినఁ, గ్రన్నన మాపనుపు సేయఁ గడఁగుము [3]బుద్ధిన్.

226 క. ఇది పరమసాధ్వి దీనిని, మదినొండుగఁ దలఁప [1]వలదు మానుగఁ బుత్త్రా
భ్యుదయ[2]మగుఁ బాండుహితముగ, నిది కార్యంబని పరిగ్రహింపుము [3]నెమ్మిన్.

227 వ. అని భీమసేను నొడంబఱచి హిడింబ కనురాగంబుగాఁ జెప్పి నీవు [1]శుచి వయి యుత్తమ[2]స్త్రీగుణంబులు దాల్చి భీమునకు మనఃప్రియంబు [3]సేయుము పగళ్ళెల్లను మీ [4]యిష్టంబున విహరించి [5]రాత్రులు మాయొద్దన యుండునది యని [6]నియమించిన భీముండును బుత్త్రజన్మంబగు నంతకు దీని మీవచనంబునఁ బరిగ్రహించెదనని వారల సమక్షంబున సమయంబు సేసెనంతఁ బాండవులు జననీసహితంబు శాలిహోత్రునాశ్రమంబునకుం జని ప్రభాతసమయంబున నక్కొలనఁ గృతస్నానులయి సంధ్యావంద నంబులుదీర్చి శాలిహోత్రుచేతం బూజితులయి [7]తద్వనస్పతిచ్ఛాయా శీతలతలంబున విశ్రమించి విగతక్షుత్పిపాసులై సుఖంబున్నంత.

225 1. ధర్ముఁవగు - కొన్ని ప్రతులు 2 పంచిన — పెక్కు ప్రతులు. 3. భక్తిన్ — పెక్కు ప్రతులు

226 1. జనదు — పెక్కు ప్రతులు 2 ముగమాకు హితముగ — ల 3. పేర్మిన్ — అ జ, దీనిన్ — క ; బుద్ధిన్ — త

227 1 సుచిత్తవై — ఈ.ఊ.ఋ.ఎ.ఒ.క.ఖ గ జ ట 2. స్త్రీరూపగుణంబులు — అ.ప.మ.ర. 3 సేయుచుబగ - పెక్కు ప్రతులు 4. యిష్టంబైనచోటుల — చ ద.మ.ల వీ.శ.ష. 5. రాత్రులెల్ల — అ ఓ.ఔ.త. 6 హిడింబ నొడబఱచి — గ౹.ల ; హిడింబ నియమించిన. 7. తద్వనస్పతిచ్ఛాయాతలంబున — అ ఇ.య, చ.ద.వీ.శ.ష. తద్వనస్పతి తలంబున — ర. కొన్ని ప్రతులు.

-: పాండవులకు వ్యాసుఁడు హితోపదేశము చేయుట -

సం. 1-144-7

228 ఉ. పుణ్యతపో[1]మయుండు మునిపూజ్యుఁడు బ్రహ్మసమప్రభుండు బ్ర
హ్మణ్యుఁడు ప్రాంశు పైణ్యజలదాసితవర్ణుఁ డశేషకిల్బిషా
రణ్యదవానలుండగు పరాశరనందనుఁ [2]డేఁగుదెంచెఁ ద
త్పుణ్య[3]చయస్వ[4]రూపమునుబోలెఁ గరంబు మనో[5]ముదంబుగన్.

229 వ. ఇట్లు వచ్చిన వేదవ్యాసమునీంద్రునకు నందఱు నతిభక్తి నమస్కరించి యాసనార్ఘ్యాదివిధులం బూజించి యున్నవారలం [1]గరుణార్ద్రదృష్టిం జూచి కృష్ణద్వైపాయనుం డిట్లనియె.

230 [1]పద్మకము. కొడుకుపల్కు వినికూడ[2]దు నాక దురాత్ముఁడై
కడఁగి మీకు నపకారము సేసి ధరిత్రి వె
ల్వడఁగఁ బంచెఁ గడుఁ బాపమతిన్ ధృతరాష్ట్రుఁడె
య్యెడల దుర్జనుల నేమఱి నమ్మఁగఁ బోలునే

228 1. ధనుండు — ప. 2. ఏగు— అరసున్నలేనిరూపము — గ్రి.శ.ప 3. ఫల — చ.త.ద వీ శ.ష. 4 రూపుడును — ద వీ శ ష. 5 హారంబుగన్ — అ బు. ఐ ఒ.క ద.బ.మ.ర ; ముదంబునన్ — ల.

229 1 కరుణారసభరిత దృష్టింజూచి — గ్రి చ.ద య ల పీ.శ.ష.

230 1 పద్మకమునకు బదులు ద్రుతవిలంబితము అని అ బు ఐ.ఖ.ట డ.బ మ య. ప్రతులందు కలదు. ఇది ప్రామాదికము. అప్పకవి చెప్పిన పద్మకవృత్తయతిస్థానము దీనికి సరిపడుట లేదు. 2 దనాక - ర. కొన్ని ప్రతులు.

231 వ. దీని నెఱింగి మీకు హితోపదేశంబు [1]సేయవచ్చితి [2]నిఖిల ధర్మవిదులరయి [3]వినీతులరయిన మీకు బాంధవ[4]వియోజనంబయిన యీకర్మంబు పురాకృతంబు దీనికి శోకింపవలవదు కొండొకకాలంబునకు మీరును బాంధవులం గలసి యెప్పటియట్ల [5]రాజ్యంబు సేయుదు రిది శాలిహోత్రు తపఃప్రభావంబున నైన కొలను దీనిజలంబు లుపయోగించిన వారికి బుభుక్షాపిపాసలు [6]లేవివ్వనస్పతియును శీతవాతాతపవర్షంబులవలన రక్షించు నిందొరు లెఱుంగకుండఁ [7]గార్యార్థులరై కతిపయ [8]దినంబులుండి యేకచక్రపురంబున[9]కేఁగి యందు బ్రాహ్మణభావంబున బ్రాహ్మణగోష్ఠి నుండి నారాక [10]ప్రతీక్షించి యుండునది యని [11]కఱపి తనకు వినయావనతులయి కృతాంజలులయిన మనుమల దీవించి కౌఁగిలించుకొని [12]బాష్పపూరితనయనయయి [13]మ్రొక్కియున్న కోడలి నూరార్చి [14]నీకొడుకు ధర్మనిత్యుం డీయుధిష్ఠిరుండు నారాయణభుజంబులంబోని తన[15]నలువురు దమ్ముల బలంబున సర్వపార్థివుల [16]శాసించి సార్వభౌముండై రాజసూయాశ్వమేధాదిక్రతువులు సేసి పితృపైతామహంబైన రాజ్యలక్ష్మి ననుభవించుచుం గురుకులంబు నెల్లఁ బవిత్రంబు సేయునని శోకోపశమనంబుఁ జేసి హిడింబం[17]జూచి దీనిపేరు కమలపాలిక యిది భీమునకు వశవర్తినియయి పరిచరించి మహాసత్త్వుండయిన కొడుకుం[18]గాంచు నాతండు మిమ్మందఱ [19]నాపద్విషయంబుల నుద్ధరించు నని చెప్పి మునివరుండు తిరోహితుండైన.

231 1. సేయుదునని వచ్చితి – పెక్కు ప్రతులు. 2. నిఖిల ధర్మవిదులయిన మీకు – మ, ధర్మార్థవిదులై 3 వినీతాత్మకులైన–ఆ.ఎ.ఔ ట న.య ర; వినీతాత్ములరయిన–ఋ ఓ.ట. 4 విరోధంబైన – ఖ.గ$_1$ చ.ద.భాపం.వీ.శ.ష. 5. సుఖంబుగన రాజ్యంబు – అ గ$_1$ చ జ న ప ర.ల.పీ శ ష. 6. లేవు మరియు నివ్వనస్పతియు – కొన్ని ప్రతులు 7 కార్యార్థులై – అ ఐ ఒ క య 8 కాలంబుండి – పెక్కు ప్రతులు. 9. కరిగి – పెక్కు ప్రతులు. 10 ప్రతీక్షించుచుండునది – కొన్ని ప్రతులు 11. పలికి – మ 12. బాష్పాకులిత – ఊ ఋ ఎ.ఒ.త. 13. తనకు మ్రొక్కి – ఓ.డ.న య.ర. 14. కొడుకులు ధర్మనిత్యు లీయుధిష్ఠిరుండు – గ$_1$.చ ద.బ.భాసం.పీ శ ష. 15. నలువురు తమ్ముల – గ$_1$.య. కొన్ని ప్రతులు 16. సాధించి – ఏ ఖ జ త ర; జయించి – ఓ.ఔ 17 జూపి – ఋ ఏ.ఒ.ఖ.ట. డ.య ల 18. బడయు – గ చ.ద వీ శ.ష 19. నాపత్సమయంబున – ల; నాపద్విషయంబుల – ఆ.ఈ.ఊ.ఏ ఔ బ మ.ర.

232 క. అమ్మునివరుకఱపిన మార్గమ్మునఁ బాండవులు విగత[1]కల్మషు లవిషా
దమ్మున సుఖముండిరి విన,[2]యమ్మొప్పఁగ శాలిహోత్రునాశ్రమభూమిన్.

233 వ. [1]అంత.

234 చ. పవన[1]తనూజుఁ డక్కమలపాలిక చేత [2]వినీతుఁడై మహా
ర్ణవవృత[3]భూమిలోఁ గల వనంబుల హంసబలాకసారసా
రవరుచిరాపగావరసరఃపులినంబుఁ బర్వతంబులన్
వివిధవిహారుఁడై యనుభ[4]వించె నభీష్టమనోజభోగముల్.

*—. హిడింబయందు ఘటోత్కచుండు పుట్టుట :—*

సం. 1—143—27

235 చ. నరవరుఁడైన భీమువలనం బ్రభవించె హిడింబకున్ సుతుం
డురుతరభీమరూపుఁడు ఘటోత్కచనాముఁడు విస్ఫురద్భయం
కర[1]వదనంబు [2]శంకునిభకర్ణములున్ [3]వికృతాకులుం బయో
ధర[4]వరవర్ణమున్ [5]వికటదారుణదంష్ట్రిలు నొప్పుచుండఁగన్.

232 1. కల్మషులుప్రమో - గి. చ.ద.పీ.శ.ష. 2 యమ్మొనరగ — క గ.జ.

233 1 ఈ వచనము పెక్కింట కానరాదు

234 1. సుతుండునక్కమల - $గి_1$.చ.ద.పీ.శ.ష. 2. గృహీతుఁడై - ల.ఖాసం. అధో జ్ఞాపిక. 3. భూములంగల - చ.ద శ.ష 4. వించుచునుండెనభీష్ట - య

235 1. వదనుండు — ఋ ఓ. 2. శంఖ — పెక్కు ప్రతులు మూలము వందు, 'శంకుకర్ణం విభీషణమ్' అని యున్నది. 3. వివృతాకులు — మ 4. సమ — గ.న.స ; రుచివర్ణముం — య 5. కుటిల — స.

236 వ. ఇట్లు సద్యోగర్భంబునం గామరూపధరుండై ఘటోత్కచుండు పుట్టి తత్క్షణంబ నవయౌవనుండును ననేకాస్త్రశస్త్రకుశలుండును నపరిమిత రాక్షసపిశాచబలపరివృతుండును నై తల్లిదండ్రులకుం గుంతీదేవికి మ్రొక్కిన నగ్రనందనుండగుట నందఱును [1]గరంబు గారవంబునం గొని యాడం గొన్నిదినంబులుండి యొక్క[2]నాఁడంజలిపుటఘటితమస్తకుం డయి రాక్షసపిశాచబలంబులతోడ నాయిమ్ముల నుండెదం బనిగల యప్పుడు నన్నుం దలంచునది [3]యక్షణంబవత్తునని యందఱిచేత ననుజ్ఞాతుండై తల్లిందోడ్కొని యుత్తరాభిముఖుండయి యరిగె[4]నిట పాండవులును శాలిహోత్రునొద్ద ననేకధర్మశాస్త్రనీతిశాస్త్రంబు లభ్యసించి యమ్మునివరు వీడ్కొని [5]చని విదర్భమత్స్యత్రిగర్తకీచక విషయంబులు గడచి [6]యేకచక్రంబను నగ్రహారంబు[7]గని.

*-: పాండవులు ఏకచక్రపురంబున విప్రగృహంబున నుండుట :-*

సం. 1-145-1

237 క లలితజటాజిన[1]కుశవల్కలధరులై వేద మొప్పఁగాఁ జదువుచు ని మ్ముల బ్రహ్మ[2]చారివృత్తిని, [3]వెలయఁగ నందుండి రొక్క విప్రగృహము నన్.

236 1 గరంబు — కొన్నింట లేదు. 2 నాడు కృతాంజలి — పెక్కు ప్రతులు. 3 యక్షణంబ — పెక్కు ప్రతులు, తత్క్షణంబ — మ; యాక్షణంబ — డ.ల.వీ; యప్పుడ — వా శ. 4 నిటఁ బాండవులు — గ్రా.భాసం వీ.శ.మ. 5. చని విదర్భ — కొన్నింటలేదు 6 ఏకచక్రాపురము, అని మూలము. ఏకచక్రామ్ గత్వా స్తేతు. చిత్రశాలాప్రతి ఘటోత్కచజన్మము చైత్రబహుళాష్టమి యందు — ఖా.కూ. 7. గనియందు — అ.ర ల.

237 1. వర — అ ఋ.ప ఒ మ.య. 2. చర్య — ఐ.త.న.ప ర.ల. 3 వెలయంగా నుండి రొక్కొకవిప్రగృహమునన్ — మ.

238 క. [1]ధృతిఁజదువుచు భిక్షార్థము. [2]ప్రతిగృహమున కరుగుచున్న భవ్యుల మౌన
వ్రతులం [3]దృప్తులఁ జేసిరి, సతతము నందుల గృహస్థసద్ద్విజులు దయన్.

239 క. జలజప్రియతేజుల [1]వీరల [2]ధీరుల ధరణీవలయ రాజ్యశ్రీయో
గ్యుల నిట్లేలొకో [3]భిక్షాశులఁ జేసె [4]విధాతృఁడంచు [5]శోకింప జనుల్.

240 క. పరమాన్న[1]భక్ష్యభిక్షా, పరిపూర్ణతరంబు లయిన పాత్రము లయ్యే
వురు నిత్యంబు నివేదింతురు దల్లికిఁ గరము భక్తితో వినయమునన్.

241 వ. కుంతియును దాని రెండుభాగంబులు సేసి యందొక్క భాగంబు భీము
నకుం బెట్టి తక్కినభాగంబు గడమకొడుకులుం దానును గుడుచుచు నిట్లు
[1]ప్రచ్ఛన్నులై యేకచక్రపురంబున [2]నున్నంత నొక్కనాఁడు ధర్మార్జున
యములు భిక్షార్థం [3]బరిగిన [4]నిట కుంతియు భీముండును దమబిడిసిన
విప్రగృహంబున [5]నున్నంత నందొక్క[6]పెట్ట యార్తధ్వని యెగసిన విని
కుంతీదేవి యెంతయు సంతాపించి భీమున కిట్లనియె.

238 1. శ్రుతి – భాసం స 2 ప్రతిగేహంబునకు నరుగుభవ్యుల – చ ద వీ శ ష.
3. ప్రీతుల – భాసం వా శ, తుష్టుల – మ, దృప్తుల – పెక్కు ప్రతులు

239 1 నవిరళవీరుల ధరణి – స.శ 2. నధికుల – చ.ద వీ శ ష. 3 భైక్ష్యాశుల –
అ.బు ఎ ఒ.ఓ.ఖ ట వ 4. విధాతయనియు – ఊ; విధాతయనుచు – ఖ.న.
5. శోకింపంగన్ – వ

240 1 భైక్ష – ర కొన్ని ప్రతులు, భైక్షభిక్షా – $గ_1$ చ.వీ శ ష; భక్ష్యభిక్షా –
భాసం.

241 1 ప్రచ్ఛన్నవేషంబుల – ఔ; ప్రచ్ఛన్నవేషులై – త. 2. నుండునంత –
$గ_1$.చ.ద ల వీ శ ష. 3. బరిగినవారైన – ఖ.గ ట ర.ల. 4.
నిటగుంతియు – $గ_1$.వీ శ.ష. 5. నుండునంత – పెక్కు ప్రతులు. 6.
పెద్దయాక్రందన – ఔ.క త

242 తే. ఇందు సుఖ ముండితిమి [1]యొరులెఱుఁగకుండ, నేలొకో యిప్పుడీ విప్రునింట నార్త
రవము వీతెంచె దీని నారసి యెఱుంగ, వలయుఁ దత్ప్రతీకారంబు వలయుఁ జేయ.

243 వ. [1]పరమోపకారియైన యీబ్రాహ్మణునకు నేమిప్రియము సేయ సమకూరునోయని చింతించు[2]చున్నచో నిప్పుడెద్దియేనియు నొక్కదుస్తరం బయిన దుఃఖం బీగృహస్థున కయ్యెం గావలయు నానునంబు [3]మలమల మఱఁగెడుఁ గావున దీనిం[4]దలఁగి వీరికి మనఃప్రియంబు సేయవలయు.

244 క. కృతమెఱుఁగుట పుణ్యము [1]స,స్మతిదానికి [2]సమముసేఁత మధ్యము మఱి త
త్కృతమున కగ్గలముగ స,త్కృతిసేయుట యుత్తమంబు కృత[3]బుద్ధులకున్.

245 వ. అనిన విని భీమసేనుం డిట్లనియె.

246 వ. ఆ [1]ఎఱిఁగి నాకుఁజెప్పు [2]మిదియేమి యెవ్వరి,వలన నింతయయ్యె వగవనేల
యెంతకడిఁదియైన [3]నిదియేను దీర్చి యీ,విప్రునకుఁ బ్రియంబు విస్తరింతు.

247 వ. అనినం గుంతి యట్లచేయుదు నని చని దుఃఖపరవశులయి పరిదేవనంబు సేయుచున్న వారలంజూచి యడుగ నేరక మిన్నకున్నంత బ్రాహ్మణుండు దన బాంధవులు విన నిట్లనియె.

242 1. పరులెరుగ — పెక్కు ప్రతులు.

243 1. ఈ వచనము య ప్రతిలో లేదు. 2. చుండుదు నిట్టిచో — ఖ.గ$_1$.చ.ద వీ శ.ప. 3. మలు — వా శ; మల — పెక్కు ప్రతులు. 4. నెరింగి — అ; దలగి — ఈ; దలంగించి — జ వీ; దగిలి — వా.

244 ఈ పద్యము డ ప్రతిలో లేదు. 1. సమ్మతి — ఈ.ఖ గ.చ ద. 2. మధ్యమమది — గ. 3. పుణ్యులకున్ — అ.ఆ.ఊ.ఐ.ఒ.ఓ.గ.జ.ద.ఛానం.

246 1. ఇ ప్రతియందీ భాగము లేదు. ఉ ప్రతిలో 246 నుండి 260 వఱకు పద్యములు లేవు. ప ప్రతిలో పత్రములు లోపించినవి. ఎరుగ నాకు — ఔ.య. 2 డిదియేమి — పెక్కు ప్రతులు. 3. యెదిరివిదర్చి — ఋ; యెదిరిని దీర్చి — ఎ.

—: బకున కాహారముగాఁ బోవుటనుగూర్చి బ్రాహ్మణ
కుటుంబము విచారించుట :—

సం. 1-145-20

248 క. [1]నలసారము సంసార మ,ఖిలదుఃఖావహము భయనికేతన మతిచం
చలము పరాధీనం బిం,దుల జీవనమేల నమ్ముదురు [2]తత్త్వవిదుల్.

249 క. ఆదిని సంయోగవియో,గాది ద్వంద్వములు [1]దేహి యగువానికి సం
పాదిల్లక తక్కవు [2]పూ, ర్వోదయ కర్మమున నెట్టి యోగికి నయినన్.

250 తరువోజ. [1]ఏనును బ్రజలును నీధర్మసతియు నేయుపాయంబున నిబ్బారిఁ గడవఁ
గానేర్తు మెయ్యది గర్జ[2]మిందుండఁగా దేగుదమ యొండుగడ కని ముంద
రేనెంత సెప్పిన నెన్నండు వినదు యిది యిట్టిదారుణ మిమ్మెయిఁ జేయఁ
గానున్న విధియేల [3]కడవంగ నిచ్చుఁ గర్మవిపాకంబు గడవం[4]గ లావె.

251 సీ. మంత్ర[1]యుక్తంబుగా మత్ప్రణీతయైన ధర్మచారిణి [2]యగుదాని వినయ
వతిఁ బ్రజావతి ననువ్రత నెట్టు లసురకు భక్ష్యంబ [3]వగుమని [4]పనుపనేర్తు
ధర్మాభివృద్ధిగాఁ దగు[5]వరునకు నీగ నిల్లడబ్రహ్మచే నిడఁగఁ బడిన
[6]యిక్కన్య యతిబాల యిందుద్భవంబగు దౌహిత్రలాభంబు [7]దలఁగనెట్లు

248 1. ఋ ప్రతిలో నీపద్యము లేదు. నలస్య తృణస్యసార ఇవసారో యస్యసః — భా.కూ. 2. తత్త్వజ్ఞుల్ —చ.ద న.భాసం.య.వీ శ.ష.

249 1. దేహులగు వారికి — గ$_1$ చ.ద.శ.ష. 2. పూర్వోదితకర్మంబులెట్టి — చ ద శ.ష; పూర్వోదయకర్మంబులెట్టి — భాసం.

250 1. ద ప్రతిలో నీభాగములేదు. 2. మిందుండగా నేలపోద మెక్కడికైననుచు—భా 3 కదలంగ — ఊ ఋ.ఐ ఓ.ఖ.గ.వీ ; గడువంగ— గ$_1$ య.ర శ.ష. 4. గలారె — అ.ల.స ; గలదె — ఖ.

251 1. వంతంబుగా — గ$_1$ చ.ద.భాసం.వీ శ.ష ; పూతంబుగా — ఖ.ప. 2. యైన — పెక్కు ప్రతులు. 3. గమ్మని — అ. 4. పంచనేర్తు, పంపనేర్తు — అని పాఠములు ; పంతు నేను — అ ఊ.ఐ.ప.వ ; పలుకనేర్తు — స. 5. వరునకు నీగ — పెక్కు ప్రతులు ; వడువునకునీన్ — వా.శ. కొన్ని ప్రతులు. 6. యిక్కన్యనతిబాల నిందుద్భవంబగు—శ ష కొన్ని ప్రతులు. 7. దరుగనిట్లు—

ఆ. దీనిఁబుత్త్రు మఱి మదీయపిండోదక, [8]నిధిఁ దనూజుఁ గులము నిస్తరించు
వానిఁ బితృగణంబువలని [9]ఋణంబుఁ బాచిన మహోపకారిఁ జెఱుతవాని.

252 ఆ. [1]ఎట్టుసూచి చూచి యిది పాపమనక య,య్యసురవాతఁ ద్రోతు నదయవృత్తి
నరిగి యేన యిప్పు డసురకు నాహార,మగుదు [2]వీరిఁ బుచ్చనగునె నాకు.

253 వ. అని యాత్మపరిత్యాగంబునందుఁ గృతనిశ్చయుండై యున్న బ్రాహ్మణుం
జూచి బ్రాహ్మణి యిట్లనియె.

254 క. మనుజులకు నెవ్విధంబున, ననతిక్రమణీయమైన యాపద్విషయం
బున [1]సంతాపింపఁగఁ జన,దని యెఱిఁగియునగునె యిట్టులని శోకింపన్.

255 వ. ఆరక్కసున కే నశనం బయ్యెద మీరువగవ కుండుఁడు భార్యయందుఁ బడ
యంబడు నపత్యంబు నాయందు [1]మున్నపడసితి రేనును ఋణవిముక్త
నయితిం బ్రాణవియోగంబుసేసి యయినను భార్య పతికి హితంబు సేయ
వలయు మఱి యట్లుంగాక.

256 ఆ. పురుషుకంటె [1]మున్ను పరలోకమేఁగిన,సతియ నోఁచినదియు సతులలోనఁ
బురుషహీనయైనఁ బరమపతివ్రత, యయ్యు జగముచేతఁ[2]బ్రయ్యఁబడదె.

పెక్కు ప్రతులు; దరగనిట్లు — ఋ. 8. విధి దనూజు కులము పి స్తరించు — కొన్ని ప్రతులు. 9 ఋణంబెల్లఁ జెఱచునట్టివానిఁ జెఱుతవాని — భాసం స, ఋణం బెల్లఁ బాపనోపుసుతు మహోపకారి — త న.బ ; ఋణంబును బాచుచిఱుతవాని నీచగతిని(కి) — గి$_1$.చ.ద.ప.పీ.శ.ష.

252 1. ఇట్లు సూచిచూచి — పెక్కు ప్రతులు. 2. గాక వీరి నగునె చూప — ల.

254 1 సంతాపింపగఁ జనదని యెఱిఁగియు నగునె యిట్టులని శోకింపన్ — భాసం శ.ష.స. కొన్ని ప్రతులు; సంతాపింపంగాఁ జనదని యెఱిఁగియును దగునె సంతాపింపన్ — ఎ.ఏ వా.పీ శ.

255 1. ముందర నా యందు బడసితిరి — త.ద.ప.భాసం.పీ.శ ష.

256 1. మున్న — కొన్ని ప్రతులు. 2. ప్రయ్యఁబడదె — భాసం.శ.ష. పెక్కు ప్రతులు. ఈ పాఠము విచారణీయము. శ ప్రతియందలి పాదసూచిక చూడ నగును; ప్రయ్యువడును — ఔ.జ; ప్రయ్యబడును — కొన్ని ప్రతులు

257 ఆ. పడిన యామిషంబు పతులపేక్షించు, నట్లు పురుషహీన యయిన యువతిఁ
జూచి యెల్లవారుఁ జులుక నపేక్షింతు,రిదియుఁ బాప[1]మనక హీనమతులు.

258 ఆ. సతి విముక్త యయినఁబతికిఁ బునర్దార, సంగ్రహంబు[1]సేఁత శాస్త్రమతము
పతి[2]విముక్తుఁడయిన సతికన్యపురుష సం,గ్రహము సేఁత లోకగర్హితంబు.

259 వ. కావున నేను భవ[1]ద్విహీన నయి యొక్కనిమిషంబేనియు జీవింప[2]నేర నేర్చితినేనియు నిక్కుమారుల రక్షింపనేర నెట్లనిన శూద్రులు వేద[3]శ్రుతిం బ్రార్థించునట్లు కులాచారసదృశులుగాని వారిక్కన్యం బ్రార్థించినం దత్ప్రతీకారంబు సేయను నిక్కుమారు[4]నందు గుణాధానంబు సేయను నాకొలంది గాదు మత్పరోక్షంబునం బునర్దార [5]పరిగ్రహంబు సేసి గృహస్థ ధర్మంబును నగ్నిహోత్రంబునుం బుత్త్రులను రక్షించునది యనుచు మరణవ్యవసాయంబు నందున్న [6]తల్లిని దండ్రిం జూచి కూఁతు రిట్లనియె.

260 ఆ. ఒలసి యెంతకాలముండిన నేను మీ, దానఁ గాన యొరుల ధనమ నన్ను
నెన్నఁడయిన నొరులకిచ్చుచో నసురకు, భోజనముగ [1]నిచ్చిపుచ్చుఁడిపుడ.

261 తే. తండ్రిచేయు తిలోదకదానవిధులు, పొందుఁ బరలోకగతయైన పుత్త్రి యందుఁ
బుత్త్రిచేసిన విధులుదత్పురుషుఁగాని,తల్లిదండ్రులఁ[1]బొందవు ధర్మయుక్తి.

257 1 మనరుహీన — ఆ.స.

258 1. సేత (అర్ధానుస్వార రహితరూపము) — $గ_1$. 2. విముక్తుఁడయిన — $గ_1$. భాసం. ల.వీ.శ.ష.శ; విముక్తయైన సతికి — వా. కొన్ని ప్రతులు; విముక్తుడైన — ఆ.బు.క.చ.

259 1. ద్వియోగిని నయి — చ.ద.వీ.శ.ష. 2. నోపనోపితినేని — ఐ. 3. శ్రుతం బర్థించినట్లు — ఈ గ. 4. నియందు — కొన్ని ప్రతులు. 5. సంగ్రహంబు — కొన్ని ప్రతులు. 6. తల్లిదండ్రులు — అ.బు.చ.శ.ష; తల్లిని దండ్రిని — భాసం. కొన్ని ప్రతులు.

260 1. నన్ను బుచ్చుడిపుడు — బు.ఐ.బ.ల.

261 1 బొరయవు — స.

262 వ. మీకు నాయందయ్యెడు దౌహిత్రలాభంబున కంటె మీరిద్దఱు జీవించిన ననేకపుత్త్రపౌత్త్రలాభంబగు దానంజేసి కులంబు[1]నిలుచుం గావున [2]నన్నుఁ బుచ్చుండనినఁ గూఁతుం గౌఁగిలించుకొని యేడ్చుచున్న [3]వారల కన్నీళ్లు దుడుచుచు.

263 తే. [1]బాలకుం డొక [2]కొండుకకోలచేతఁ, బట్టికొని యేనరక్కసుఁ గిట్టి చంపి [3]చులుక వత్తు మీ రేడ్వఁగా వలవదనుచుఁ, గలయ నూరార్చెఁ దన[4]తొక్కుఁ బలుకు లొప్ప.

264 వ. వాని యవ్యక్త వచనంబులు విని యందఱు నేడ్పుడి[1]గిన నయ్యవసరంబునం గుంతీదేవి వారల [2]డాయంబోయి.

265 క. ఇది యేమి తెఱఁగు దీనికి, మొదలెయ్యది నాకుఁ దెల్లముగఁ జెప్పుఁడు తీ ర్చెద నని విగతాసులఁ దన,మృదు[1]వచన ప్రశ్నమను నమృతమున [2]నెత్తెఁ.

266 వ. ఇట్లడిగినఁ గుంతీదేవికి నవ్విప్రుం డిట్లనియె.

*—: కుంతీదేవికి బ్రాహ్మణుండు తనదుఃఖకారణంబును దెలుపుట :—*

స్కం. 1-148-1

267 సీ. ఏనేమి సెప్పుదు దీని నెవ్వరికిని మానుషంబునఁ దీర్ప[1]రానిదాని నయినను జెప్పెదఁ [2]బ్రియహితవచన యీ ప్రోలికి నామడ [3]నేలనల్ల

262 1. విస్తరిల్లు — ఋ.ఒ.క.జ.ట.ద. 2 నన్ననుపుండనిన — చ.భాసం.వీ.శ.ష; నన్ను బనుపుండు — ఈ.హొ.గి₁.ల. 3. వారింజూచి — గి₁.చ.ద.వీ.శ.ష.

263 1. బాలకుం డొక్కరుం డొకకోల — చ.ట.ద.ప.శ.ష. 2. కొండొకకోల — భాసం స. కొన్ని ప్రతులు. 3 చులుకననువత్తు మీరేడ్వవలవదనుచు — చ.ద.శ.ష. 4. ముద్దుపలుకు — అ.ఋ.ఓ.క.ఖ.గి₁.జ.ల; తొట్రుపలుకు — ఆ.ఐ.డ.బ.వ, గొత్తుపలుకు — ప.

264 1. గిరయ్యవసరంబున — వ.ద.బ.వీ.శ.ష. 2. డాయవచ్చి, జేరంజని — కొన్ని ప్రతులు.

265 1 మధురప్రశ్నమను — డ; వచనపుచయమును......దేర్చెఁ — స. 2. దేర్చెఁ — అ ఈ.ఖ.ర.

267 1. గానిదాని—ఈ.ఒ.క.ట.డ. 2. వయహిత—ఋ.గి₁.చ.శ.ష. 3. నేలయున్న —

యమునానదీ గహ్వరమున బకుండను రక్కసుం[4]డుండి వాఁడక్కజముగ [5]నిందుల[6]కాఁపుల నందఱఁ [7]దొల్లి యిల్వరుస గ్రింగుచునున్నఁ బరమసాధు

ఆ. లగు ధరామరేంద్రు లగణిత జపహోమ, దానవిధులఁ జేసి వానివలనఁ [8]గ్రమము వడసి యొక్క సమయంబుఁ జేసి[9]రి, యొనరదాని తెలఁగు వినుము తల్లి.

268 వ. నిత్యంబు నిలువరుస నొక్క [1]మానిసి రెండెనుపోతులం [2]బూన్చిన శకటంబుగ నపరిమితభక్ష్యపిశిత మిశ్రాన్నంబు [3]నించికొనిపోయిన దానిని వానిని నయ్యెనుపోతులను [4]భక్షించుచు.

269 ఆ. మనుజభక్షుఁ[1]డిది[2]య తనకు[3]నప్పనముగా, నొరులవలని[4]బాధ నొరయకుండ దీనిఁ గాచుచుండు [5]నీనాటి[6]రాజును, దలఁపఁ డసుర నోర్వ[7]బలిమిలేమి.

270 ఉ. పోలఁగధర్మ [1]శీలుఁడయి భూరిబలాధికుఁడైన ధారుణీ పాలకురక్ష[2]మున్వడసి భార్యను బుత్త్రిల [3]నర్థయుక్తితో నోలిన మేలుగాఁ బడ[4]సి [5]యాళ్ళను నున్నది [6]యట్లు గాని నాఁ డేల గృహస్థవృత్తి సుఖ[7]మేఁగి వనంబున [8]నున్కి కష్టమే.

ఏ.ఐ గ గి చ ద ప.పీ.శ.ష ; మేలయున్న — ర.స. 4. డుండు—భాసం.వా 5. నిందలి— గి₁.చ.ద ల పీ.శ.ష 6. విప్రుల—అ.బు.మ ర. 7. బట్టి — బ 8. సరగఁ గ్రమము వడసి సమయంబుఁ జేసిరిం దొనర—య. ఈ పాఠమున ప్రాసయతి నియమము తప్పును. 9. రిందొనర — అ.ఆ.ఉ బు.ఎ ఓ.స.

268 1. మానిసిని — ఉ.ఊ గి₁.చ శ.ష ; మానిసియు — అ.బు.ఎ.ఐ ఒ.క ఖ జ.ట.డ త. బ.ర. 2 బూన్చిన—గి₁ చ.ద.పీ శ.ష ; బూనిన — భాసం.వా.శ. కొన్ని ప్రతులు ; గట్టిన—ప. 3. నునిచికొని — ఆ.న ల 4. భక్షించు — కొన్ని ప్రతులు.

269 1. డిట్లు—కొన్ని ప్రతులు 2. యు దనకు—కొన్ని ప్రతులు ; య తన కశనంబుగా— ల. 3 జీవితము, వర్తనము, వేతనము, జీవనము — అని పాఠాంతరములు. 4. భయము—గ.చ ద పీ శ.ష. 5. నేనాటి—పీ.శ.ష. కొన్ని ప్రతులు. 6. రాజులు దలఁప రసుర—గి₁ ద.న య.పీ.శ.ష. 7. బలము లేక—కొన్ని ప్రతులు.

270 1. మార్గమున—ద. 2. ణంబడసి — ఐ గి₁.చ ద.శ.ష ; ముంగలిగి—అ.భాసం.స. 3 ధర్మయుక్తితో — అ.ఒ.స. 4. యు నూళ్ళను — చ.శ.ష. 5. యూళ్ళుల, యూళుల — అని పాఠములు. 6. యున్కి — ఊ ఔ.చ. పీ శ.ష. 7. ఏగి — అరసున్న లేనిరూపము—గి₁. 8. నున్నఁగష్టమే—గి₁.శ.ష. కొన్ని ప్రతులు.

271 క. అరియని [1]విప్రులచేతను, ధరణీశులు [2]పోఁకయును మొదలుగాఁ గొన[3]రె
వ్వరు నిప్పాపుఁడుమానిసి, [1]నరిగొని యెడు భక్షణార్థియై విప్రులచేన్.

272 వ. పెద్దకాలంబునకు నీయిలువరుస నేఁడు మాకువచ్చె నిచ్చియుత్తవాని నారాక్షసునకు [1]భక్ష్యంబుఁగాఁ బుచ్చనోప నేను పోయెదనని దుఃఖించి పలికిన బ్రాహ్మణునకుఁ గుంతి యిట్లనియె నయ్యా దీనికి సంతాపింప వలవదీ యాపద [2]దలఁగునట్టి యుపాయంబు గంటి నీకుం గొడుకొక్కరుండ వాఁడును గడుబాలుండు బలిగొనిపోవ [3]నర్హుండుగాఁడు నాకేవురు గొడుకులు గలరు వారలలో నొక్కరుం డారక్కసునకు భవదర్థంబుగా బలి గొనిపోయెడు ననిన దాని విననోడి బ్రాహ్మణుండు [4]చెవులు మూసి కొని యిట్లనియె.

273 మధ్యాక్కర. అతిథిగాఁ వచ్చిన బ్రాహ్మణున్ జీవి[1]తార్థినై నాకు
హితముగా రక్కసువాతఁ ద్రోవనే నెట్లొడంబడుదు
మతి నవమానింపఁ గాదనిన విప్రుమరణంబు దలఁచు
[2]టతిపాతకము పాతకములలో [3]బ్రహ్మహత్య[4]యె పెద్ద.

274 క. ధృతిసెడి వేఁడెడు వానిని, నతిథిని నభ్యాగతుని భ[1]యస్థుని శరణా
గతుఁ[2]జంపఁగ నొడఁబడు దు,ర్మతి కిహాముం బరముఁగలదె [3]మదిఁ[4]బరికింపన్.

271 1. బ్రాహ్మణులచేతను — గి$_1$.వ ద.భాసం పి.శ.వ. 2. పోఁకయును — గి$_1$.క. భాసం శ వ. కొన్ని ప్రతులు; పోఁకయు — శ.ట.ద్వి.శ; యూఁకయు — వా. నంస్థ 3. ఏ పురుషాధముండును మానిసి — జా. 4. యరి — కొన్ని ప్రతులు

272 1. భక్షణంబుగా — కొన్ని ప్రతులు. 2. దలఁగు — పెక్కు ప్రతులు; దలుఁగు — వా శ. కొన్ని ప్రతులు. 3. దక్షుండు, సమర్థుండు — అని పాఠాంతరములు. 4. వీనులు — బు ఐ.

273 1. తార్థము — న. 2. పతిపాతకము — బు.ఓ.ట ర. 3 బ్రాహ్మణ హత్య పెద్ద — గి$_1$.చ.ద.భాసం పి.శ.వ. 4 యపెద్ద — త ర; యుఁబెద్ద — వా. కొన్ని ప్రతులు.

274 1. యార్తుని — అ. 2. జంపుటకొడఁ — పెక్కు ప్రతులు. 3. మతి — పెక్కు ప్రతులు. 4, దలపంగనె — అ.ర.

275 వ. మఱి యాత్మ[1]ఘాతంబు మహాపాతకంబు దాని కెట్లొడంబడితం[2]చేని యది యనతిక్రమణీయం[3]బయి యప్రతీకారంబయి యొరులచేతం జేయం బడుటం జేసి నాకుం బాతకంబు లేదు దానిం జేసినవానికి మహాపాతకం బగుం గావున బ్రాహ్మణహింస [4]కేనొడంబడనోప ననినం గుంతియిట్లనియె.

*—: బకునిం జంప భీమునిం బంపుటకుం గుంతినిశ్చయించుట :-*

సం. 1-149-13

276 క. ఏనును దీనిన తలంచి మ,హీనుత విప్రవధ యెద సహింపక మఱినా
సూను సమర్పించితి మ,త్సూను వధింపంగ రక్కసునకు వశంబే.

277 క. ఖలు నసుర నోర్వనోపెడు, బలయుతుంగా నెఱింగి కొడుకుం [1]బనిచెదంగా కి
మ్ముల శతపుత్త్రిలు గల ధ,న్యులకైన ననిష్టుండగు తనూజుండు గలండే.

278 వ. ఈతనిచేతం దొల్లియుం బెక్కం డ్రసురలు నిహతులయిరి వీండు మహాబల [1]సంపన్నుండు మంత్రసిద్ధుండని భీముం బిలిచి యీ బ్రాహ్మణు నాపదం [2]దలంగి నాకు మనఃప్రియంబు సేయుమనిన నట్లెయని భీముం డారక్కసుం జంపం బూనె బ్రాహ్మణుండును దనబంధువర్గంబుతో సంతసిల్లె నంత ధర్మార్జుననకులసహదేవులువచ్చి పరమ[3]హర్ష పరిపూర్ణుండై యున్న పవన తనయు నాకారం బుపలక్షించి విస్మితులగుచుండ ధర్మతనయుం డల్లనం దల్లికి నిట్లనియె

275 1 వధ — పెక్కు ప్రతులు 2. చేనినది — కొన్ని ప్రతులు. ఏనిన్ ద్రుతాంతముగా గ్రహింపఁబడినది. 3. బయియ ప్రతీకారంబయి — పెక్కు ప్రతులు; బయియొరుల — వా. 4. కేనెట్లొడంబడ నోపుదునని — కొన్ని ప్రతులు.

277 1 బంచితి — వా.శ కొన్ని ప్రతులు; బనిచెద — గు.చ.ఘాసం.ల.పీ.శ.ష; బంచెద — కొన్ని ప్రతులు.

278 1 వంతుఁడు — పెక్కు ప్రతులు; పరాక్రముండు — గు.చ.ఘాసం. పీ.శ.ష. 2. దలగించి — పెక్కు ప్రతులు. 3. హర్షరస పూర్ణుండై యున్న — కొన్ని ప్రతులు; హర్షపరిపూర్ణుండై — పెక్కు తాళపత్ర ప్రతులు; హర్ష పరిపూర్ణ హృదయుండై — వా.

279 చ. నరనుతకీర్తి యీ యనిలనందనుఁ డెవ్వరితోడ నేని భీ
కరసమరంబు సేయ సమకట్టినయట్లు మహానురాగని
ర్భరమున నున్న వాఁ డితని భావము సూడఁగ [1]వేఁడు వీని సు
స్థిరబలు మీరు పంచితిరొ చెప్పెరఁ దాన యుపక్రమించెనో.

280 వ. అనియడిగిన ధర్మతనయునకుఁ గుంతీదేవి యీ యేకచక్రపురంబున బ్రాహ్మణుల బకాసురుండు బాధించుటయుఁ దమ విడిసినయింటిబ్రాహ్మణునికైన యాపదయు దానిం దీర్పం బవనతనయు బ్రాహ్మణార్థంబుగాఁ దన [1]సమర్పించుటయుం జెప్పిన విని ధర్మజుండు దుఃఖించి యిది యేమి సాహసంబు సేసితి [2]రొడ్లకొడుకులకుంగాఁ దమకొడుకుల విడుచు దుర్బుద్ధులునుం గలరె యిది లోకాచారవిరుద్ధంబు మఱి భీమసేనుఁడు మీకు విడువం దగియెడి కొడుకే.

281 సీ. ఇతనివిక్రమ మాశ్రయించియకాదె యయ్యెడ లక్క[1]యిల్లు వెల్వడఁగఁ గంటి
మడవిలో నిద్రావశాత్ములమై యున్న మననిద్రఁ జెఱుపఁగాదని హిడింబు
నెడగల్గఁ గొనిపోయి యెక్కటి సంపిన దండితశత్రుఁ డీపండ కాఁడె
యితని[2]బల్మిన కాదె [3]యెంతయు భీతులై [4]ధృతరాష్ట్రనందనుల్ [5]ధృతియుఁ దఱిఁగి

ఆ. నిద్రలేక తమకు నిలచునుపాయంబు, లొండుదక్కి వెదకుచున్న వారు
బలియు నిట్టిభీము బ్రాహ్మణార్థమ్ముగా, నసురవాతఁ ద్రోతు[6]రవ్వ యిట్లు.

279 1. నేడు — ఉ.య.

280 1. బనుపుటయు — క. 2. రొకళ్ళ, రిమెరుల, బరుల — అని పాఠములు.

281 1. యిల్వాసివెడలగంటి — ఐ; యిల్వెలువడగ గంటి — ఖ. 2. బల్మికి గాదె — ఎ.వ.బ.ర.ల; బల్మినికాదె — చ.డ.ద.శ.వ. 3. ధృతరాష్ట్ర నందనుల్ మతిలోన భీతిల్లి — ల. 4. ధృతరాష్ట్ర తనయులు ధృతియు దరిగి — ఖ.డ. 5. ధృతియుఁదరిగి — పెక్కు ప్రతులు; ధృతిదలంకి — వా. కొన్ని ప్రతులు. 6. రమ్మ — ఔ.త.

282 వ. అక్కట దుఃఖాతిశయంబున మతిభ్రమణం బయ్యెంగాకేమి యనినం గొడుకునకుం గుంతి యిట్లనియె.

283 ఆ. భ్రమవిమోహాలోభభయపరిభూతనై, కొడుకు విడువ నంపవెడఁగనయ్య యేను భీముశక్తి యెఱుఁగక పంచిన, దానఁగాను వినుము వీనిశక్తి.

284 తే. వీఁడు పుట్టిన పది[1]యగు నాఁడు [2]వెలుచఁ,బడియె నాచేతనుండి యప్పర్వతమునఁ
బడిన వడిఁ జేసి బాలకు నొడలుదాఁకి, [3]యచటిరాలెల్ల బెల్లునుగ్గయ్యెఁ జూవె.

285 వ. అట్టి వజ్రకాయుండు వజ్రధరునయిన నోర్వనోపునట్టి [1]సమర్థుండు రక్కసు నశ్రమంబునఁ జంపి యిందుల బ్రాహ్మణుల [2]బాధ [3]యుడుచుం బవనతనయు నుద్దేశించి సంతాపింప వలవదు మనకు సుఖనివాసంబు సేసి పరమోపకారియైన యీబ్రాహ్మణున[4]కుఁ బ్రత్యుపకారంబు సేయ [5]సమకూరె.

—: *కుంతి ధర్మజునకుఁ బరదుఃఖనివారణము పరమపుణ్యంబని తెలుపుట* :—

సం. 1-150-20

286 సీ. ఉత్తమక్షత్త్రియుం డొరులదుఃఖంబులు దలఁగంగఁ బుట్టిన ధర్మశీలుఁ
డలయక మృత్యుభయంబైనచో విప్రుఁగాచి సత్పుణ్యలోకములు వడయు
ధన్యుఁడై క్షత్త్రియు దయఁగాచి బుధలోక కీర్తనీయంబగు కీర్తి వడయు
వైశ్యశూద్రులఁ గాచి వసుధాతలస్థితసర్వప్రజానురంజనము వడయు

284 1. యవ — ఖ చ ద ర.వీ శ ష; యవు —ఈ 2 నేలఁ — భాసం 3 యతుణంబ రాలెల్ల నుగ్గయ్యె జూవె — కొన్ని ప్రతులు; యతుణమ రాళులెల్ల నుగ్గయ్యెఁ జూవె — గ$_1$.శ.ష. కొన్ని ప్రతులు.

285 1 మగండుయా — బ 2 యాపద — కొన్ని ప్రతులు 3. యుడుపు — కొన్నిప్రతులు. 4. కాపద తలంగవలయు — ఐ. 5. సమకూరెనూఅడుము — వా: సమకూరె నదియునుంగాక — ఋ.క.ఖ.

ఆ. ననఘ సన్మునీంద్రుఁడయిన వేదవ్యాసు, వలన దీని నిక్క[1]వముగ వింటి
బ్రాహ్మణులకుఁ [2]బ్రియము పాయక చేయంగఁ, [3]గాన్పచూవె పుణ్యకర్మ
ఫలము.

287 క. [1]జననుత బ్రాహ్మణకార్యము, సనఁజేసిన బ్రాహ్మణప్రసాదంబున నీ
కును నీతమ్ములకును నగు, ననవరతశ్రీసుఖాయు [2]రైశ్వర్యంబుల్.

288 వ. అనిన విని ధర్మతనయుండు గుంతీదేవికారుణ్యబుద్ధికి [1]బ్రాహ్మణభక్తికి
ధర్మనిత్యతకు సంతసిల్లి తానును భీమసేను నియోగించె నంత భీముం
డవ్విప్రున కిట్లనియె.

289 ఆ. కడుపునిండఁ గుడువఁగానమి రేయెల్లఁ, గన్ను[1]వొంద కున్నఁగరము డస్సి
యున్నవాఁడ నాకు నోపుదురేని యాహారతృప్తి సేయుఁ డట్టులయిన.

290 ఆ. బలము పెద్దగలిగి [1]పాపిష్ఠు రక్కసుఁ, జంపి యిప్పు[2]రమునజనుల కెల్ల
హర్షమే నొనర్తు ననవుడు విప్రుఁడు,దానుఁ జుట్టములును దక్షణంబ.

291 తరలము. పలుదెఱంగుల పిండివంటలుఁ బప్పుఁ [1]గూడును నేతికుం
డలు గుడంబు దధిప్రపూర్ణఘటంబులుం గొనివచ్చి యా
నలఘుసత్త్వుఁడు మారుతాత్మజుఁ డన్నిటన్ [2]గతఖేదుఁడై
బలము గల్గి కడంగె నప్పుడు బ్రాహ్మణార్థము సేయఁగన్.

286 1. వంబుగంటి — ఋ ఐ 2. హితము — కొన్ని ప్రతులు; మేలు — ర.
3. గాన్ప — $గ_1$ భాసం. కొన్ని ప్రతులు.

287 1. గ ప్రతిలో నీ పద్యము లేదు 2. రారోగ్యంబుల్ — డ.

288 1. బ్రాహ్మణుల యందు ధర్మనిత్యతకు — ఐ.చ.ద.వీ శ.ష; బ్రాహ్మణ భక్తికి
ధర్మనిత్యతకు — భాసం; పెక్కు ప్రతులు. బ్రాహ్మణభక్తికి ధర్మచిత్త
యగుటకు — వా. కొన్ని ప్రతులు.

289 1. పొరయకుండ — $గ_1$.చ.ద.శ.ష.

290 1. పాపిష్ఠి — య.ర.వ కొన్ని ప్రతులు. 2 రంబుజనుల — కొన్ని ప్రతులు.

291 1. గూరలు — ఐ. 2. గడుతృప్తుఁడై — ర.ల.స.

-: భీముఁడు బకాసురునిఁ జంపఁబోవుట :-

సం. 1-151-1

292 వ. ఇట్లు భీమసేనుం డిష్టా[1]న్నోపభోగంబునం దృప్తుండయి భక్ష్యాన్నపూర్ణం బయిన శకటంబు నెక్కి దక్షిణాభిముఖుండయి బకాసురుండున్న [2]చోటికిం జని యార్ద్రశుష్కకళేబరదుర్గంధనిందితంబయిన బకస్థానంబు డాయక యెడ[3]గలిగి యమునాతీరంబున శకటంబు నిలిపి యారక్కసుం బిలుచుచు [4]వానివచ్చునంతకు మిన్నకుండనేల యని [5]కాళ్ళు సేతులుం గడిగికొని యాచమించి యాశకటంబు[6]పయి కూడుగుడుచుచుండె నట బకాసురుండును.

293 ఆ. ప్రొద్దునేఁడు పెద్దవోయె నిత్యము నిట, తెచ్చియిచ్చు బలియుఁ దెచ్చి యీఁగ నొల్ల కెలుఁగు లిచ్చుచున్నవాఁ డన్ను[1]ను,జాధముండు మెచ్చఁడయ్యె నునుచు.

294 ఆ. అలిగి యాఁడుగఱచి యాఁకటి[1]పెలుచన, నిలువనోప కసుర నింగిదాఁకఁ [2]బెరిఁగి యరుగుదెంచె భీమరూపంబుతో, నుగ్రభంగి భీముఁ డున్న[3]దెసకు

295 సీ. చనుదెంచి ముందటశకటంబుపైనుండి యోడక కుడుచుచునున్న భీము దవ్వులఁ జూచి నిత్యము నాకు నియమించికొని వచ్చుకూడేల కుడిచె దీవు గడుఁగ్రొవ్వి రేకచక్రంబునవారల కేనింతయెల్లి[1]ద మేలయైతి నని డాయవచ్చి యయ్యనిలనందను [2]వీపుఁబిడికిటఁ బొడిచిన బెదర కసుర

292 1. న్న భోజనంబునం — ఖ.చ జ.భాసం వీ.శ ష 2. చక్కటికిం — ఆ.ఒ జ. 3. గలుగ — ఒ.ఓ ట ద.వీ.శ ష. 4 వాడువచ్చునంతకు — వీ.శ.ష. కొన్ని ప్రతులు. 5. కాళ్లసేతులు — గ౹.చ ద.వీ శ.ష ; కాళ్ళు గడిగికొని — భాసం శ ; కాళ్ళు మొగము — వా కొన్ని ప్రతులు. 6. నందున్న — వీ. కొన్ని ప్రతులు

293 1. నన్ను — ఆ ఔ.ఖ.జ.

294 1. పెల్లున—ఆ జ.బ ల 2. బెఱిగి—$గ_1$.శ ష ; శకటరేఫముతో నున్న రూపము. 3. యెదకు — పెక్కు ప్రతులు.

295 1. దంబేలనైతి — ఆ.క ఖ ల. 2. వీపు—$గ_1$. పెక్కుప్రతులు, అర్ధానుస్వారముతో—వా.

ఆ. వలను సూడ కొండువగవక యెప్పటి,యట్ల కుడుచుచున్న నలిగి బకుఁడు
వీని [3]బాగు సూడ [4]వేఱంచు డాసిన, తరువుఁ బెఱికికొనుచుఁ [5]దాఁకుదెంచె.

296 వ అంతకు ముందఱ భీమసేనుం డంతకూడునుం గుడిచి యనంతబలసమే
తుండై [1]యంతకాకారంబున మల్లసఱచుకొని యార్చుచు.

297 ఉ. ఇంచుకయేని పాపమున కెన్నఁడు రోయక [1]యెల్లవారి బా
ధించి మనుష్యమాంసములు దించును గ్రొవ్వితి వానినెల్లఁ గ్ర
క్కించెద నీమదాంధ్య ముడిగించెద నిప్పుడ కాలుఁబ్రోలి కే
గించెదఁ జక్కనై [2]నిలుము గిట్టి రణంబున రాక్షసాధమా.

—: *భీమసేనుఁడు బకాసురుం జంపుట* :—

సం. 1—151—15

298 వ. అనుచు సమీరణసుతుండు వనసమీపంబున నున్న విశాలసాలవృక్షంబు
పెఱికికొని రక్కసుపై వైచినఁ వాఁడును దనచేతివృక్షంబున దాని
భగ్నంబుఁ జేసె నిట్లిరువురు నొక్కవడి వృక్షయుద్ధంబు[1]సేసి యాసన్న
మహీరుహంబులు [2]సమసిన మల్లయుద్ధసన్నద్ధులై.

299 చ. పరువడి నొండొరుం [1]బెనఁగి పట్టుచుఁ ద్రోచుచు నీడ్చుచుం బర
స్పరజయకాంక్షులైన బకపాండవవీరుల పాదఘట్టనన్
ధరణితలంబు గ్రక్కదలెఁ దన్నికటద్రుమవల్లులెల్ల [2]జ
ర్జరితము లయ్యె నిష్ఠురవిశాలశిలల్ నుఱుము లయ్యె నయ్యెడన్.

లేని రూపము ; పీంపు—ఒ.త. 3. బాస — పెక్కుప్రతులు ; లావు—బ ; భంగి—జొ. 4. వెఱగంచు—ఐ.జ.బ.ల. 5. డాయవచ్చె—అ గ1.చ.జ.ద.బ.భాసం.శ.ష.

296 1. యంత్యకాలాంతకుండునుంబోలె — గ1.చ.ద.వీ.శ.ష.

297 1. విప్రకోటి — అ. 2 నిలువు మిట్టిరణంబున — మ.య. (ఇంచుకాగమయతి) నిలుము కిట్టి — ఒ.ఖ.త.

298 1. సేసి యొల్లక మల్లయుద్ధ — ఆ.ఎ.ఒ. 2. సమయుటయు — గ1.చ.వీ.శ.ష.

299 1. బెనచి — ఆ.ట ; బెఱచి — అ.చ వీ.శ.ష ; దిగిచి — స. 2. జర్ఝరితము — గి.శ.ష — పెక్కు ప్రతులు.

300 ఉ. ఇద్దఱ హుంకృతిధ్వనులు నిద్దఱ భూరిభుజారవంబు న
య్యిద్దఱ ముష్టిఘాతజని[1]తేరితదారుణనిస్వనంబు న
య్యిద్దఱ పాద[2]ఘట్టితమహీరవముల్ విని చూపఱెల్లనుం
దద్దయు భీతి నచ్చటికిఁ దారెడగల్గఁగఁ బాటి రొక్కఁ[3]డై.

301 వ. ఇట్లు భీమబకాసురు లాసురంబునం బెనంగి మల్లయుద్ధంబు సేయునెడ.

302 క. కడఁగి వృకోదరుఁ డసురం,[1]బడఁగా ధరవైచి వామపాదంబునఁ జే
డ్పడ వాని ఱొమ్ముఁ ద్రొక్కెం, గడుకొని యసురయును లేచి కడు
నుద్ధతుఁడై.

303 క. అనిలసుతుఁ బట్టికొని పెల్చన త్రోచి కడంగి [1]కనకశైలనికుంజం
బును బోని వానివక్షముఁ, దన దృఢతరముష్టిఁ బొడిచెఁ దద్దయు
నలుకన్.

304 వ. భీముండును [1]వాని[2]హీనసత్త్వుంగా [3]నెఱింగి సురహస్తిహస్తానుకారంబు
లైన సవ్యదక్షిణహస్తంబుల నమ్మనుజకంటకుకటికంఠప్రదేశంబులు వట్టి
కొని.

305 ఉ. దారుణ[1]జానుదండమున దండధరప్రతిముండు భీకరా
కారుఁడు వానివీపు విఱుగం బొడిచెం బిశితంబుతో నవ
ద్వారములన్ మహారుధిరధారలు [2]బోరన[3]నొల్క మాంసపం
కారుణవారి[4]ఘోర[5]నదులై పఱవన్ విపినాంతరంబునన్.

300 1. తేరితదారుణ — పెక్కు ప్రతులు ; జనితేద్ధభయంకర — వా. కొన్నిప్రతులు
2 ఘట్టనమహీ — పెక్కు ప్రతులు. 3. కై — కొన్ని ప్రతులు ; టన్—మ

302 1. బడఁగా ధరవైచి—భాసం. స ; బడఁగవడిన్ వైచి — వా. కొన్ని ప్రతులు.

303 1. శైలోచ్ఛ్రాయంబునుంబోని—మ. ఇచ్చటి మూలము 'వ్యాత్తాననేనఘోరేణ లంబజిహ్వేన రక్షసా తేనాభిద్రుత్యభీమేన భీమోమూర్ధ్ని సమాహతః'.

304 1. వాని పోటునం జేసిహీన—స. 2. హీనబలుంగా — అ.బొ. 3. నెరింగి యలిగి — కొన్ని ప్రతులు.

305 1. బాహు—అ ఊ.ట. 2. బోరున—బొ , భోరున — ఓ.ఖ గ$_1$.ద.య.ర. 3. నొల్క — చ.ద ర ల వీ శ ష ; యొల్క — అ.ఆ.ఋ.ఖ.త.ప.బ.య. 4. పూర నదులై - భాసం. వీ శ.ష. కొన్ని ప్రతులు 5. నదియై — య.ర

306 వ. ఇట్లు బకాసురుండు భీముచేత [1]నిహతుండయి [2]విగతజీవితుం డగుచుండి యఱచిన నమ్మహాధ్వని విని వానిబాంధవులైన రక్కసులు [3]పెక్కండ్రు పఱతెంచిన వారలం జూచి భీముం డిట్లనియె

307 తే. ఇంక నెన్నండు రక్కసులిద్దురాత్మ, నట్లు మనుజులఁ దినకుండుఁ [1]డడరి మనుజ
[2]భక్షణము సేసితిరయేని బకునియట్లు, చత్తురని రక్కసులకెల్లఁ [3]జాటె వినఁగ.

308 వ అంత నారాక్షసులు భీతులై భీముచేసిన సమయంబున కొడంబడి నాఁటం గోలె నేకచక్రనివాసులకు నుపద్రవంబుఁ [1]జేయ నోడిరట్లు భీముండు బకాసురుం జంపి [2]వానిం జంపుట జగద్విదితంబుగాఁ దత్కళేబరం బీడ్చుకొని వచ్చి నగరద్వారసమీపంబున వైచి యందుల విప్రులకు సంతోషంబు సేసి నిజనివాసంబునకుం జని తద్వృత్తాంతం బంతయుఁ దల్లికి సహోదరులకుం జెప్పియు న్నంత.

309 ఉ. పేఁడొక మంత్రసిద్ధుఁడగువిప్రుఁ డసాధ్యబలున్ బకాసురున్
నేఁ డనిఁ జంపె[1]నట్టె యితనిం జని చూతమ యంచుఁ జెచ్చెరం
బోఁడిగ [2]వేత్రకీయమున భూసురులాదిగ వచ్చి చూచి ర
వ్వాఁడిమగంటిమిన్ [3]వెలయు వాని వృకోదరు నెల్లవారలున్.

306 1. నిహతుండగుచుండి యఱచిన — గ1.చ.ద పీ.శ.ష. 2 విగత జీవితుఁడగుచు నఱచిన - ర. 3. పెక్కండ్రు — పెక్కు ప్రతులలో లేదు.

307 1. నదియు — గ1.చ త.ద ను ర స.ష ; డనియు — అ ఙ ట 2 భక్షణము సేసి రేనియు - న , భక్షణంబు సేసితిరేని బకునియట్ల - ఐ ఙ గ1.చ డ ద భా సం శ ష ; భక్షణము సేసితిరి యేని—ఋ.య. 3. జాటిచెప్పె—ఆ గ1 చ ద భా సం మ పీ.శ ష.

308 1. జేయకుందురు(రి)ట్లు — గ1 చ.డ త భాసం. పీ శ ష. 2. వానిం జంపుట జగద్విదితంబుగా — పెక్కు ప్రతులలో లేదు.

309 1 నట్టియ(యి)తనింజని—అ.ఋ.ఐ.ఖ గ1 శ.ష; నట్టె ఘను నీతని చూతమ యంచు-న. (ఈ పాఠమున నఖండ యతి) 2. వేత్రకీయము అనునది యేకచక్రాపురమునకు సంజ్ఞ ఇచ్చట భారత కూలంకషమున నిట్లున్నది. వేత్రకీయమున — ఏకచక్రాపురమున అద్యప్రభృతి స్వప్యంతే వేత్రకీయ నివాసినః నేకచక్రమున—గ1. భాసం పీ.శ.ష పెక్కు ప్రతులు. 3 వెలుగువాని - పెక్కు ప్రతులు

310 క. అని యిట్లు పాండునృపనందనులచరిత్రంబు సెప్పెఁ దా వైశంపా
యనుఁడు [1]జనమేజయునకని, జనవినుతచరిత్రపాత్ర[2]సౌజన్యనిధీ.

—: ఆశ్వాసాంతము :—

311 క. [1]మలహారినాథ విలసచ్చళుక్యకులతిలక రాజసర్వజ్ఞ రిపు
ప్రలయప్రతాప పరనృపలలనాననకమలహరిణలాంఛనమూర్తీ.

312 మాలిని. ప్రణమదఖిలధాత్రీపాలకాలోలచూడా
మణిగణ[1]కిరణ[2]శ్రీమండితాంఘ్రీనరేంద్రా
గ్రణి నిఖిలమహీరక్షామణీ రాజనారా
యణ విమలమతీ శీతాంశువంశ[3]ప్రకాశీ.

313 గద్యము

ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్టప్రణీతంబైన శ్రీమహాభారతంబునం
దాదిపర్వంబునం గుమారాస్త్ర [1]విద్యాసందర్శ[2]నంబును ద్రుపదగ్రహణ
మోక్షణంబును దుర్యోధనుదుర్మంత్రంబును వారణావత
యాత్రయు జతుగృహదాహంబును విదురోపదిష్టద్వారంబునం
బాండవాపక్రమణంబును హిడింబువధయును హిడింబా
వివాహంబును వ్యాససందర్శనంబును ఘటోత్కచ
సంభవంబును విప్రగృహంబున నజ్ఞాతచర్యయును
బకాసురవధయును నన్నది
షష్ఠాశ్వాసము.

310 1. జనమేజయునకున్ — మ ల ; జనమేజయునకును — అ.ద శ.ష. 2. సౌజన్యున కుఁ—మ.య.

311 1. మలయహరినాథ—అ.ల.స ; మలహరనాథా—చ.ద.వీ.శ.ష ; మలహరినాథా—భాసం ; మలహరినాథ — న; కలుషహరినాథా—య.

312 1. నికర — బ.ర. 2. మంజుతాంఘ్రీ — ల 3. ప్రదీపా - ర ; ప్రకాశా—ఉ. క.జ.ట.త.య.స.

313 1. విద్యా — కొన్ని ప్రతులలో లేదు. 2. నంబును గర్ణార్జునుల పరస్పర క్రోధం బును — కొన్ని ప్రతులు.

—:o:—

# శ్రీమదాంధ్రమహాభారతము

## ఆదిపర్వము - సప్తమాశ్వాసము

1 శ్రీరాజరాజ వీర, శ్రీరమణీరమ్యాగంధసింధురవాహాయ[1]శ
శా[2]రూఢిదక్ష దక్ష[3]మ, ఖారిదయాలబ్ధసుస్థిరైశ్వర్యపదా.

—: ధృష్టద్యుమ్న ద్రౌపదుల యుత్పత్తి వృత్తాంతము :-

సం. 1—153—1

2 వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం [1]జెప్పెనట్లు పాండవులు విప్రవేషంబున నేకచక్రపురంబునందు వేదాధ్యయనంబు సేయుచు విప్రగృహంబు[2]న నున్న కొన్ని దినంబులకు నొక్క బ్రాహ్మణుండు ద్రుపదుపురంబున[3]నుండి [4]చనుదెంచి విశ్రమార్థియైన నాగృహస్థుండు వాని నభ్యాగతపూజల సంతుష్టుం జేసి యున్నంతఁ గుంతీదేవి గొడుకులుం దాను నవ్విప్రు నతి[5]ప్రీతి నుపాసించి యయ్యా [6]మీరలెందుండి [7]వచ్చితి రేదేశంబులు రమ్యంబు లెందులరాజులు గుణ[8]వంతులని యడిగిన నవ్విప్రుం డిట్లనియె.

3 చ. సొల[1]యక యెల్లదేశములుఁ జూచితి నందుఁ బ్రసిద్ధులైన రా
జుల సుచరిత్రసంపదలుఁ జూచితి నాద్రుపదేశుదేశముం
[2]బోలుపున నొండుదేశములు [3]పోల్పఁగ నెవ్వియు లేవు సద్గుణం
బులఁ [4]బరులెవ్వరుణ ద్రుపదుఁ బోలఁగ లేరు ధరాతలంబునన్.

1 1. రక్షా—అ.ఋ. 2. రూఢి—ఒ.వీ; రూఢ—వా. పెక్కుప్రతులు. 3. మఘారి—ఉ.ఖ

2 1. జెప్పి — య.ర.ల. కొన్ని ప్రతులు. 2. న సుఖమున్నం గొన్ని — చ.ద. భాసం.వీ.శ.ష. 3. మండి తీర్థయాత్రాపరుండై — ఖ. 4. చనుదెంచి — కొన్ని ప్రతులలో లేదు 5. భక్తి — కొన్ని ప్రతులు. 6. మీరలు — పెక్కు ప్రతులలో లేదు. 7. వచ్చితిరి యేదేశంబులు—చ.ద.శ.ష. 8. గరిష్ఠులని—అ.ఈ.గ.

3 1. వక — భా.కూ.శ.ష. పెక్కు ప్రతులు. 2. బొలుపుగ — పెక్కు ప్రతులు; బొలయగ — ఐ. 3. బోలగ — ఆ.ఉ.ఓ.జ.డ య.ర. 4. బవులె — భాసం. వా.శ. కొన్ని ప్రతులు; నృపులె — య; పరులె — గ$_1$.చ.ద.వీ.శ.ష.

4 వ. అద్రుపదుండు దనకూఁతు నగ్నికుండ సముద్భవయైన దాని నయోనిజ నగణ్యపుణ్యలావణ్యగుణసమన్విత[1]ననురూపుఁడైన రాజపుత్త్రునకు వివాహంబు సేయంగానక స్వయంవరంబు రచియించుచున్నవాఁ డనినం గుంతియు ధర్మతనయుండును విస్మితులై [2]యదియేమి [3]కారణంబున నయోనిజయయ్యె నక్కన్య యెవ్విధంబున [4]ద్రుపదుండు వడసె దీని సవిస్తరంబుగాఁ జెప్పు[5]మనిన నవ్విప్రుండు వారల కిట్లనియె.

5 సీ. ఆది భరద్వాజుఁడను మునికలశంబునం దుద్భ[1]వించిన యజ్ఞమూర్తి
ద్రోణుండు మఱి [2]పృషతున కుద్భవించిన ద్రుపదుండు నొక్కటఁ దొడఁగి యిష్ట
సఖులయి వేదముల్ సదివి ధనుర్వేద[3]మగ్నివేశుల[4]తోడ [5]నర్థిఁ గఱచి
చని ద్రుపదుండు పాంచాల[6]భూములకు రాజైన భారద్వాజుఁ డతని కడకు

ఆ. నరిగి వానిచేత నవమాని[7]తుండయి, హస్తిపురికి వచ్చి యఖిలకురుకు
మారవరుల నెల్ల మానుగా [8]శస్త్రకో, విదులఁ జేసె లోకవిదితయశుఁడు.

6 వ. ఇట్లు దన[1]వలన విలువిద్య గఱచిన పాండవకౌరవకుమారులం జూచి ద్రోణుండు నా కవమానంబు సేసిన యప్పాంచాలు నోడించి పట్టికొని [2]తెండిదియ నాకు గురు[3]దక్షిణ యగునని పంచిన వల్లెయని యందఱు నా ద్రుప[4]దుపయింబోయి వానిచేత [5]నిర్జితులయిన నర్జునుండు ద్రుపదుతోడ మహాయుద్ధంబు సేసి వానిం బట్టికొనివచ్చి ద్రోణున కొప్పించిన నతండును.

---

4 1. నభిమతంబైన, నభిమతుండైన — పాఠాంతరములు 2. యిది —— పెక్కు ప్రతులు. 3 గారణమున — య.ర.స.శ$_1$; కారణంబకన్యయయోనిజ — గి. చ.ద. వీ.శ.ష; కారణంబయోనిజయయ్యె — అ ఉ.గ. 4. ద్రుపదుండుబడసె — ఆ.ఐ.గ. 5. మని యడిగిన — పెక్కు ప్రతులు.

5 1. విల్లిన — ఖ.గి. చ వీ.శ.ష; వంబైన — గ ద బ. 2. పృషదున — అ.ఆ.ఊ.ఏ. గి. చ.ద.ర.శ.ష. 3. మగ్నిదేశ్యులతోడ —— గి. చ;భాసం.శ ష; మగ్నివైశ్యులతోడ — తాళపత్రప్రతులు. 4. చేత — ఉ.ఔ.ఖ.త. 5. నభ్యసించి — ఉ.ఖ.గి. చ.ద.వీ.శ.ష. 6. భూమికిని — న.య. 7 తాత్ముఁడై — పెక్కు ప్రతులు. 8. శస్త్రాస్త్రవిదుల — పెక్కు ప్రతులు.

6 1. చేత—ఉ.జ. 2. రండిదియ నాకు—పెక్కుప్రతులు. 3. దక్షిణకాయని పం(పని)చిన— పెక్కు ప్రతులు. 4 దుపురంబునకు బోయి — కొన్ని ప్రతులు; దుపురంబువయిం బోయి — కొన్ని ప్రతులు. 5. పరాజితులైన — ఔ; ద్రుపదునిచే నిర్జితులైన వారు కౌరవులని పూర్వకథ 1–6–76.

7 ఆ. ఉల్లసంబు లాడి యోడ[1]కుపొమ్మని, ద్రుపదు విడిచిపుచ్చె ద్రోణుచేత
నట్లు విడువఁబడి [2]తదవమానతప్తుఁడై, పృష[3]తనందనుండు పెద్దయలిగి.

8 వ. రణరంగంబున ద్రోణు వధియించునట్టి కొడుకును నర్జునునకు దేవియగునట్టి కూఁతునుం బడయుదునని బ్రహ్మవిదులయిన బ్రాహ్మణుల నివాసంబులకుం జని నిత్యంబును బ్రాహ్మణోపాస్తి సేయుచు నొక్కనాఁడు గంగాకూలంబునందు వానప్రస్థవృత్తినున్న యాజోపయాజులనువారి నిద్దఱ ననవర[1]త వ్రతవ్యాసక్తులం గాశ్యపగోత్రులం గని వారికి నమస్కరించి యందుఁ [2]గొండుక యయ్యును దపోమహిమ నెవ్వరికంటెఁ బెద్దయైనవాని నుపయాజు నుపాసించి యిట్లనియె.

9 క. మునినాథ నాకు సత్సుత, జననంబగు నట్టిక్రతువు సద్విధిఁ గావిం
చినఁ గృతకృత్యుఁడ నగుదుం, గొనుమిచ్చెద నీకులక్ష [1]గోధేనువులన్.

10 వ. అనిన నుపయాజుం డేనిట్టి ఫలంబు నపే[1]క్షింప నెవ్వరే[2]ని ఫలార్థులగుదు[3]రందుల కేఁగుమనిన ద్రుపదుండు వెండియు వానిన యొక్కసంవత్సరం బారాధించిన నమ్ముని వాని కిట్లనియె.

11 తే. [1]అనఘుచరితుఁడు మాయన్న [2]వనములోనఁ, జనుచు [3]నొక్కనాఁడొక్క పండొనరఁగాంచి

7 1. కపొమ్మని – పెక్కు ప్రతులు 2. యు నవమాన — ఉ.ఔ.వా. 3. దనందనుండు – పెక్కు ప్రతులు.

8 1. తవేదప్రత వ్యాసక్తులం – ర ; తప్రవణాసక్తులం – ఛాసం.వీ.శ.ష. కొన్ని ప్రతులు. 2. కొండిక – చ.శ.ష ; వయస్సున గొండికయయ్యును – య.

9 1. గోధనచయమున్ – అ.ఈ.స ; లక్షగోధేనువులన్ అనుసందర్భమున భా.కూ. చూడఁదగును.

10 1. క్షింపనోప నెవ్వరేని – పెక్కు ప్రతులు. 2. నియు – క.ఖ.డ. 3. రు వారల కడకు నరుగు మనిన – చ.ద.వీ.శ.ష ; రువారి (వారల) పాలికరుగుమనిన – కొన్ని ప్రతులు.

11 1. అలఘు – ఊ.డ. 2. యడవి – ఊ. ఈ పాఠమున పద్యమునందంతట నున్న ప్రాసయతి నియమము తప్పినది. 3 నొకనాడు నొకపండు నొనరగాంచి – య ;

కొనియె [4]శుచియగు శుచియుఁగాదని యెఱుంగఁబడని భూమి
[5]తలంబుపైఁ బడినదాని.

12 వ. [1]ఫలార్థి యయినవాఁడు తత్ఫలానుబంధంబు లయిన దోషంబులు [2]పరికింపండు గావున నమ్మునివరుండు [3]నీకభిమతంబు సేయుం బొమ్మనిన ద్రుపదుం డరిగి [4]సంహితాధ్యయ[5]నాది పంచమహాయజ్ఞంబులు సేయుచు శిలోంఛవృత్తి [6]భైక్ష[7]సంపాదితకుటుంబ[8]భారుండై ఘోరతపోవృత్తినున్న యాజుంగని నమస్కరించి యిట్లనియె.

13 క. మునినాథ నాకు సత్సుత, జననంబగునట్టి క్రతువు సద్విధిఁ [1]గావిం
చినఁ గృతకృత్యుఁడ నగుదుం, గొనుమిచ్చెద నీకు లక్ష[2]గోధేనువులన్.

14 వ. [1]అని ప్రార్థించి వెండియు నా ద్రుపదుండు యాజున కిట్లనియె.

15 క. [1]భారతవంశాచార్యుఁడు, భారద్వాజుండు నాకపాయము సేసెన్
ఘోరాజి నతని నోర్చు న, పార [2]పరాక్రమునుపుత్త్రుఁ బడయఁగ[3]వలయున్.

నొక్కనా డొకఫల మొనరగాంచి — ఊ. 4. శుచియిది యౌనుగాదని యెఱుంగఁ బడని — గి$_1$ ద.భాసం.వీ.శ.ష 5. తలంబున — ఆ.క.ఖ.జ.ట.ల.

12 1. ఫలానుబుద్ధియైనవాడు — య. 2. పరిహరింపడు — ఔ.క.ట.త ర.ల. 3. నీయభిమతంబు — భాసం.వా.వీ శ.ష.శ. 4. సంతతా — ఉ ఖ.న య 5. నాగ్నిహోత్రాదులయిన — వా. కొన్ని ప్రతులు 6. భైక్ష ఫలాశన సంభావిత కుటుంబాధారుండై — ల స. 7. సంచారిత — కొన్ని ప్రతులు ; సంపాదిత — భాసం ల ; సంధారిత — వా. కొన్ని ప్రతులు. 8. ధారియై — ఔ.జ.

13 1. సేయించిన — ఔ. మూలమునందు ద్రుపదుఁడు యాజునితో — 'అయుతాని దదామ్యష్టౌ గవాం యాజయమాంవిభో, ద్రోణవైరాగ సంతప్తమ్, ప్రహ్లాదయితుమర్హః' ఇచట సం.మూ చూ. అని పలికినట్లు కలదు. చిత్రశాల ప్రతిపుట 278. 'మునినాథ నాకు' అనునీ పద్యము వెనుక (అనగా 7—9 లో) నున్నట్టిదే. ఇట్లు సందర్భాను సారముగా నొకపద్యమే— ఒకటికన్న నెక్కువ పర్యాయములు వాడుట నన్నయకు పరిపాటియే ఇది పెక్కు ప్రతులలో నిట్లే కానవచ్చుచున్నది. కాని 'య' ప్రతియందు ఈ పద్యమును దీనితరువాతి వచనమును విడువఁబడినవి. 2. గోధనచయమున్ — అ.ప.ల.

14 1. ఈ వచనము పెక్కు ప్రతులలో కానరాదు.

15 1. కౌరవ వంశాచార్యుడు — వ. 2. పరాక్రమునిసుతుని — ఆ.ఔ.వ ; పరాక్రమునిఁ బుత్త్రు - ఆనం. గణ. గి$_1$.చ.ద.వీ.శ.ష. 3. వలతున్ — ఋ.ఐ.భాసం.స.

16 క. [1]పడరత్ని ధనుర్ధరుఁ డె, య్యెడ నజితుఁడు [2]గాన వాని హీనుంగాఁ జే
యుఁడు నాకుఁ జతుర్వర్గము, వడయుట యని పృషతసుతుఁడు ప్రార్థించె
మునిన్.

17 వ. [1]అయ్యాజుండును యాజకత్వంబున కొడంబడి నీకోర్కికిం దగిన యట్టి కొడుకునుం గూఁతురుం బుట్టుదు రోడకుండుమని యజ్ఞోపకరణద్రవ్యంబులు సమకట్టికొని యథావిధి నుపయాజుండు [2]సహాయుండుగా సౌత్రామణి యయిన కోకిలాదేవి [3]పత్నిగా[4]ద్రుపదుం బుత్రకామేష్టి సేయించిన [5]నందు మంత్రాహుతులం దృప్తుండయిన [6]యగ్నిదేవువలన.

18 క. జ్వాలాభీషాంగుఁడు కర,వాలబృహచ్చాపధరుఁడు వరవర్మ కిరీ
టాలంకారుఁడు వహ్నియ, పోలె రథారూఢుఁడొక్క [1]పుత్త్రుఁడు పుట్టెన్.

19 వ. [1]మఱియు.

20 తరలము. కులపవిత్రసితేతరోత్పలకోమలామలవర్ణ యు
త్పలసుగంధి లసన్మహోత్పలపత్త్ర[1]నేత్ర [2]యరాళకుం
తలవిభాసిని దివ్యతేజముఁదాల్చి యొక్క కుమారి ద
జ్వలన[3]కుండమునందుఁ బుట్టెఁ బ్రసన్నమూర్తి [4]ముదంబుతోన్.

16 1. కడుగర్వ—కొన్ని ప్రతులు. 2. గాని – ఉ పౌ ఖ డ.య.

17 1. మఱియు (పాండవమధ్యముండైన) యర్జునునకు దేవియయ్యెడు (ఇచ్చునట్టి) కూతురు పుట్టవలయుననిన (బడయవలయుననిన) యాజుండు సహాయుండుగా — న.బ. 2. హోతగా — య 3 ధర్మపత్నిగా – ఊ.ట డ.ప.య ర. 4. ద్రుపదుం బుత్ర కామేష్టి సేయించిన – అ.ఈ ఉ.గ ట.ర ; ద్రుపదుఁడు పుత్రకామేష్టి చేసిన – భాసం.య. కొన్ని ప్రతులు ; ద్రుపదునకుం బుత్రకామేష్టి సేయించిన – ఖ.చ.ద.వా. పీ శ.ష. 5. వందుల – య. 6. యజ్ఞదేవు – ఖ.య

18 1. పురుషుడు పుట్టెన్ – వ.

19 1. ఇది కొన్ని ప్రతులలో లేదు.

20 1. నేత్రి-పెక్కు ప్రతులు. 2. మదాలి (?) కుంతల — పెక్కు ప్రతులు. 3. కుండము లోన – వ 4. ముదంబునన్ – ఉ.

21 వ. ఇట్లు పుట్టి[1]నయక్కొడుకు నంం గూఁతునకు ధృష్టద్యుమ్నుండును గృష్ణయు ననునామంబు లాకాశవాణి [2]జనవిదితంబుగా నుచ్చరించె నట్లు ద్రుపదుండు లబ్ధసంతానుండయి [3]సంతసిల్లి యాజునకు [4]యథోక్త దక్షిణలిచ్చి బ్రాహ్మణు లం బూజించి ధృష్టద్యుమ్నుని ధనుర్వేదపారగుం [5]జేయించి యున్నంత [6]నక్కన్య యిపుడు [7]వివాహసమయప్రాప్తయయిన.

—: ద్రౌపదీవివాహప్రయత్నము :-

అమూలము.

22 ఉ. మానితులైన పాండవకుమారులుఁ గుంతియు లక్కయింట ను
గ్రానలదగ్ధులైరని ధరామరముఖ్యులెఱింగి చెప్పఁగా
నానరనాయకుండు విని యాతతశోకమహానలజ్వల
న్మానసుఁడయ్యె [1]బంధుజనమంత్రిపురోహిత[2]విప్రసన్నిధిన్.

23 వ. [1]మఱియును.

24 సీ. ఇంద్రసమానున కిందీవరశ్యామసుందరాంగున క్రింద నందనునకు
దేవిఁగాఁ బ్రీతితో దీని నీఁగాంచితి నని యున్నచో విధాతృనకు నిట్లు
పాడియె విఘ్న మాపాదింప [1]నమ్మహాధ్వరమునఁ [2]బుట్టిన సరసిజాక్షి
నేనెట్టు[3]లొరులకు నీనేర్తు నని దుఃఖ[4]పరవశుఁడయి యున్న ధరణిపతికిఁ

ఆ. దత్పురోహితుండు దానిట్టులనియె న,ప్పాండవులను గుఱిచి బహు[5]విధంబు
లగు [6]నిమిత్తములు నయంబునఁ జూచితి,నెగ్గులేదు వారికెల్ల లగ్గు.

21 1. న యక్కొడుకు—భాసం; న కొడుకు—వా. పెక్కుప్రతులు. 2. జగద్విదితంబుగా — అ.ఆ.ఊ.ఒ.ఖ.గ.త.మ.ల ; జనవినుతంబుగా—భా.సం.వా.శ. 3. సంతోసిల్లి—ల. కొన్ని ప్రతులు 4. యథోచిత—ఔ.క త.య 5. జేసి—గ$_1$. పెక్కు ప్రతులు 6. కన్యకకు నిప్పుడు వివాహ ప్రాయంబైన—ర. 7. వివాహ సమయోచిత — ల.పీ.స ; వివాహ ప్రాప్త సమయమైన — మ ; వివాహ ప్రాప్తయయిన—వా. కొన్ని ప్రతులు.

22 1. యి[ని]ష్టజన — ఓ.ఔ.త బ 2 మిత్ర — ఓ.ఖ.ర.

23 1. ఈ వచనము కొన్నింట లేదు.

24 1. నిమ్మహా—పెక్కుప్రతులు. 2. బడసిన—ఉ. 3. లొరునకు—మ. 4. పరవశుండైన య(త)ద్ధరణి పతికి — పెక్కుప్రతులు. 5. ఫలంబు — పెక్కు ప్రతులు 6. నిమిత్తములును ననయంబు—త.మ.

25 వ. [1]తొల్లి దేవేంద్రుండు గొండొకకాలం బదృశ్యుండై యుండిన నతనింగానక శచీదేవి [2]శోకింపంబోయిన నుపశ్రుతింజేసి బృహస్పతి దానికి దేవేంద్రాగమనంబు సెప్పెనని [3]వేదంబుల వినంబడుం గావున నేను నుపశ్రుతిం జూచితి నిది దప్పదు పాండవులు పరలోకగతులు గారు పరమానందంబున నున్నవారు వార[4]లెందుండియు నిందులకు వత్తురు నీవును [5]సుచిత్తుండవయి స్వయంవరం [6]బిప్పురంబున ఘోషింపం బంపు మిది [7]కన్యాదానంబునందు రాజులకు శాస్త్రచోదితం బనియుం బురోహితువచనంబునం జేసి [8]యూఅడి ద్రుపదుండు నేఁటికి [9]డెబ్బదియేనగు దివసంబునం [10]బౌషమాసంబున శుక్ల[11]పక్షంబున నష్టమియు రోహిణినాఁడు స్వయంవరంబని ఘోషింపం బంచి.

26 క. ఎవ్వరికిని మోపెట్టను, దివ్వను శక్యంబుగాని దృఢకార్ముకమున్ దవ్వై దినమునఁ దిరిగెడు, [1]నవ్విలసత్కనకమత్స్యయంత్రముఁ జేసెన్.

27 క. ధరణిఁ గల రాజు లెల్లను, [1]బురుడునఁ గాంపిల్యనగరమున కరిగెద రొం డొరులం గడవఁగ నని భూసురవరుఁ డెఱిఁగించెఁ బృషతసుతుకథ యెల్లన్.

25 1. అది యొల్లనిన గొల్లి — ఓ 2 శోకింపుచున్న — బౌ; శోకంచుచున్న — భాసం ల వీ; శోకింప — చ ద.శ.ష. 3. వేదవచనంబుల — ప్రా. కొన్ని ప్రతులు; వేదంబుల — వీ శ.ష. పెక్కు ప్రతులు. 4. లెందుండియైన — అ.ఉ ఓ.జ.య; లెందుండియేనియు — ఖ చ.ద.న. భాసం శ.ష. 5. స్వస్థచిత్తుండవై — మ. 6. బిప్పు డిప్పురంబున — ల 7. కన్యాదానంబునకంటె — జ ల స ఇచ్చటి మూల మిట్లున్నది స్వయంవరః క్షత్రియాణామ్ కన్యాదానే ప్రదర్శితః. 8 యూరడిల్లి— కొన్ని ప్రతులు 9 డెబ్బదియేనవ — ద న.వీ.శ.ష. 10 పౌషమాసంబున పంచమియురోహిణినాఁడు — చ.న.వీ.శ ష ; 11. పక్షపంచమి—బౌ.ఖ ; (1) ఇంద్రుని వృత్తాంతమును బృహస్పతి ఉపశ్రుతిచే తెలిసికొనుట మున్నగు సందర్భము భండార్కరు ప్రతిలోను, చిత్రశాలా ప్రతిలోను, వావిళ్ళ తెలుఁగు ముద్రణము నందును కాన్పించలేదు పి.పి యస్. ప్రతియందు కలదు. ఆది — 163 అధ్యాయము 1062 పుట భండార్కరు ప్రతియందు పాదసూచిలో దీని ప్రశంస యున్నది. (2) 'పుష్యమాసేతు రోహిణ్యామ్ శుక్లపక్షే శుభేతిథౌ। దివసైః పంచసప్తత్యా భవిష్యతి స్వయంవరః' అని యున్నది. ఆది 163 అధ్యాయం , 1063 పుట. దీనిలో తిథి ప్రశంస లేదు. పుష్యశుద్ధ అష్టమి — భా కూ ఈ వచనము నందలి నేటికి డెబ్బదియేనగు దివసంబునం — నేటికి యనగా ఆశ్వయుజ బహుళ అష్టమినాటికి — 'షణ్ణాసానేకచక్రాయామిత్యుక్తత్వాత్ భా.కూ.

26 1. నవ్విలసిత కృతకమత్స్య యంత్రము జేసెన్ — అ; బంగారపుచేపను — భా.కూ.

27 1. పురుడువున — బౌ.జ.

28 వ. దాని విని పాండునందను లందులకుం [1]బోవనున్నఁ గొడుకుల యభిప్రాయం బెఱింగి కుంతీ[2]దేవి యిట్లనియె.

—: పాండవులు పాంచాలపురంబునకు బయలుదేరుట :—

సం. 1-156-2

29 క. కడుఁ బెద్దకాల[1]ముండితి, మొడఁబడి [2]యిందెంతకాలమున్నను మనక య్యేడు లాభమేమి మఱి యెప్పుడు నుచితమె యొరుల[3]యిండ్ల పొత్తు[4]న నుండన్.

30 వ. [1]దక్షిణ [2]పాంచాలంబు గరంబు రమ్యంబనియును బాంచాలపతి పరమధార్మికుండనియును [3]వింటిమి మఱి యట్లుంగాక.

31 క. అడుగ[1]కయు విప్రవరులకు, నడరఁగ నద్దేశమున గృహస్థులు భక్తిం గుడువఁగఁ బెట్టుదు రెప్పుడుఁ, గడుహృద్యములయిన మోదకంబులతోడన్.

32 వ. అందులకుం [1]బోవుదమనినం గొడుకులెల్ల వల్లెయని మీ[2]పంచినవిధంబ చేయం గలవారమని యొడంబడి తమయున్న యింటి [3]బ్రాహ్మణునకుం జెప్పి వీడ్కొని.

28 1. బోవ సమకట్టియున్న — బౌ న.ర ; బోవ సమకట్టిన — అ.త.2. దేవి — కొన్ని ప్రతులలో లేదు

29 1. ముంటిమి యొడబడి — బౌ 2. యిల్లెంత కాలము — కొన్ని ప్రతులు. 3. యింటిపొత్తున — పెక్కు ప్రతులు ; యిండ్ల పొంతనయుండన్ — క. 4. లనున్నన్, లమనగన్ — అనియు పాఠములు.

30 1. మూలమునందు పాంచాలమనియె కలదు. 2. పాంచాల దేశంబులు కరంబు రమ్యంబులనియు — ల వీ.శ.ప ; కొన్ని ప్రతులు ; పాంచాలంబులు — ర. 3 విందుము — పెక్కు ప్రతులు.

31 1. కయ — అ.ఐ.త.బ.శాసం.ప.

32 1. బోదమని — పెక్కు ప్రతులు. 2. యానతిచ్చిన — కొన్ని ప్రతులు. 3. బ్రాహ్మణున కొడంబడం జెప్పి — స.

-: పాండవులు ద్రుపదుపురంబున కరుగుచు వ్యాసమహర్షిం గనుట :-

సం. 1-157-1

33 చ. ఉరుసరసీవనంబులు మహోగ్రనగంబులు నేఱులున్ సుదు
స్తరవిపినంబులుం గడచి ధన్యులు పాండుకుమారకుల్ నిరం
తరగతి [1]నేఁగుచుం గనిరి ధర్మసమేతుఁ బితామహుం దమో
హరు హరిమూర్తి నార్తిహరు నాదిమునీంద్రుఁ బరాశరాత్మజున్.

34 వ. కని [1]వినయమ్మున నమ్మునీంద్రునకు నందఱు [2]నమస్కారంబు సేసినవారలం
జూచి కరుణారసపూరితాంతఃకరణుండయి వ్యాసభట్టారకుం డిట్లనియె.

35 క. ధర్మసుతుఁ డున్నచోటను, ధర్మువునకు హానిగలదె ధారుణినైనన్
[1]ధర్మువతాత్పర్యముగా, నిర్మలమతి [2]నెగడునది వినీతాత్ములరై.

36 సీ. తానొక్కమునికన్య దనకర్మవశమునఁ బతిఁ బడయంగ నోపక [1]యుపేత
దౌర్భాగ్యయై ఘోరతప[2]మొనరించిన దానికి శివుఁడు ప్రత్యక్ష[3]మయ్యె
వేఁడుము వరమన్న వేడ్కతోఁ బతిదానమని యేనుమాఱులయ్యబల [4]వేఁడె
[5]నట్లేని నీకు దేహాంతరంబునఁ బతులగుదు రేవురు పరమార్థమనియు

ఆ. హరుఁడు కరుణ నిచ్చె నదియిప్డు పాంచాలపతికిఁ గృష్ణయనఁగఁ బంకజాక్షి
యుద్భ[6]విల్లి పెరుఁగుచున్నది తత్స్వయంవరము సేయుచున్నవాఁడు [7]నేఁడు.

33 1. నేగుచుం — అరసున్న లేని రూపము గ$_1$.

34 1. వినయమ్మున — కొన్ని ప్రతులలో లేదు 2. నమస్కరించి కృతాంజలులై యున్న వారలం జూచి — ఐ.న.

35 1. ధర్మువె — అ ఖ.గి చ ద.వీ.శ.ప ; ధర్మువు — కొన్ని ప్రతులు. 2 నుండు నది — కొన్ని ప్రతులు.

36 1 యుపేత — గి.వీ.శ ప. పెక్కు ప్రతులు 2. మొప్పజేసిన — స. 3. మయ్యె, మగుచు — పాఠాంతరములు 4. వేఁడ, పలికె — పాఠాంతరములు. 5. నట్లైన నీకు — ఖ.జ.ర. 6. విల్లె — వా కొన్ని ప్రతులు ; విల్లి — పెక్కు ప్రతులు. 7. నేఁడు — అ.న వ ; వాడు — వా. కొన్ని ప్రతులు.

37 వ. మీరు ద్రుపదుపురంబునకుం[1] జక్క నరుగునది యందు మీకు లగ్గగునని చెప్పి కృష్ణద్వైపాయనుం డరిగినం బాండునందనులు జననీసహితం బనవరతంబు రాత్రులుం బగళ్లును బయనంబు [2]వోవువారొక్కనాఁ డర్ధ[3]రాత్రంబున గంగ యందు సోమ[4]శ్రవంబను తీర్థంబున స్నానార్థులై యర్జునుండు ప్రకాశార్థం బును రక్షణార్థంబునుం గా నొక్కకొఱవి సేతఁ బట్టుకొని ముంద[5]ఱంబోవ నందఱు నరుగునెడ నంగారపర్ణుఁడను గంధర్వుం డంగనా[6]సహితంబు గంగకు [7]నంత ప్రొద్దు జలక్రీడార్థంబు వచ్చినవాఁ డప్పాండవుల పాదధ్వని విని యలిగి విల్లుగొని గుణధ్వనిం జేసి వారికిట్లనియె.

38 క. ఇల నర్ధరాత్ర[1]మును సంధ్యలు రెండును [2]ఘోరయక్షదానవ [3]గంధ
ర్వులు గ్రుమ్మరియెడు ప్రొద్దులు, వెలయఁగ నిందవనిచరులు వెఱతురు
నడవన్.

—: అర్జునుఁ డంగారపర్ణుని జయించుట :—

సం. 1-158-9

39 వ. ఇవ్వేళ[1]లయందుఁ గ్రుమ్మరియెడువారి నెంత బలవంతులనైనను రాజుల నయినను నిగ్రహింతుము నన్ను డాయ[2]కుం డెడగలిగి పొం డేనంగారపర్ణుండను గంధర్వుండఁ గు[3]బేరుసఖుండ నెప్పుడు నిందు విహరించుచుండుదు నన్నెఱుం గరె [4]యివ్వనంబును గంగాతీరంబును నంగారపర్ణంబులు నా జగద్విదితంబులు దీని మానవులు సొరనోడుదు రనిన వాని కర్జునుం డిట్లనియె.

37 1. కు నరుగు—వా. కొన్నిప్రతులు ; కుం జక్కనరుగు—చ ద.పీ శ ష 2. సేయువారు— కొన్ని ప్రతులు. 3. రాత్రి—ఊ.ఖ.న.ప ల ; రాత్ర సమయంబున—టొ.గ ; రాత్రము నప్పుడు—ర. 4. శ్రవసంబను, శ్రవస్సను—అనిరూపములు. 5. టంబోవ—కొన్నిప్రతులు. 6 సహితుండై—పెక్కుప్రతులు. 7 నంత ప్రొద్దు — చ ద శ.ష. ప్రతులలో లేదు

38 1. ములు — ఖ.గ.ట.భా.కూ య 2. ఘోరి — ర. 3. గంధర్వులు గ్రుమ్మరియెడు— పెక్కు ప్రతులు , గంధర్వుల త్రిమ్మరియెడు — భాపం.వా.శ

39 1. లగ్రుమ్మరియెడు — ఒ ఖ.డ.ద.ప.పీ.శ.ష 2 కుండేనంగారపర్ణుండను — పెక్కు ప్రతులు. 3. రసఖుఁడ — భాసం కొన్ని ప్రతులు , చూడునీసఖనంచు — నన్నయ (5—203) 4. యిష్వనంబున గంగయు నంగారపర్ణ యను పేరిట జగద్విదితంబు — శ.ష పెక్కుప్రతులు;ఇచ్చటమూలమిట్లున్నది. 'అంగారపర్ణమిత్యేవంఖ్యాతంచేదంవనంమమ'

40 క. నడు[1]రేయి సంధ్యలందెపుడు, నడవఁగ నోడుదు రశక్తనరు లొరులు భయం
బడుదు[2]మె యేమెయ్యెడ నెప్పుడు [3]నడతుము యధికశక్తి పురుషుల
మగుటన్.

41 క. అడవులు నేలులు [1]నివి నీ, [2]పడసినయవి [3]యట్టి పుణ్య భాగీరథి యి
ప్పుడమిఁ గల [4]జనులకెల్లను, నెడపక సేవ్యంబ [5]కాక[6]యిదినీయదియే.

42 సీ. హైమవతోత్తుంగ [1]హేమశృంగంబున నుండి భూమికి వచ్చియుదధిఁ [2]గూడె
గంగనా [3]మూఁడుదెఱంగుల నదియును మందాకిని నా [4]నభ్రపథంబునందు
సురసిద్ధమునివియచ్చరు [5]సేవ్యయయ్యె న[6]య్యధమలోకంబున యందు భోగ
వతి యను [7]నొప్పె నున్నతి నిట్లు త్రిభువన పావ[8]ని యైన యిప్పరమ[9]మూర్తి

ఆ. పార్వతీశమకుటబంధబంధురత రా, వాన గంగ నాడ వచ్చి నీవు
వలనదనిన నుడుగువారము గాము నీ నిష్ఠుర వచనములకు వెఱతు[10]మెట్లు.

40 1. రేయి — ఋ.ఒ చ.ప బ. 2. రు మేమెయ్యెడ — శ.ష. కొన్ని ప్రతులు ; రె యేమెయ్యెడ — ఔ.భాసం ; ర యేమెయ్యెడ — ర. 3. నడి(డ)చెద మధిక శక్తి — చ ద పి.శ.ష.

41 1. నవి — గి$_1$ భాసం.సూ. కొన్ని ప్రతులు ; నీవని — శ$_1$. 2. పడ — ఓ.గి$_1$.చ. ద.భాసం శ.ష సూ.శ ; వడసిన — వా. కొన్ని ప్రతులు ; బడసిన — ఆ.ఎ.ఓ.ఔ. క.ఖ.గ.ఘ 3. యెట్లు — భాసం శ.ష.స. కొన్ని ప్రతులు. 4. వారికెల్లను — ఓ.గి$_1$.చ.ద.భాసం.పి.శ ష. 5. కాదె — ల. 6. యవినీయవియే — ఉ.ఓ.త.బ.

42 1. హైమశృంగ — ఆ చ.ద భాసం.పి శ.ష 2. గూడి — కొన్ని ప్రతులు. 3. మూఁడుదెఱంగుల — చ గి$_1$. భాసం. పి.శ.ష ; పెక్కు ప్రతులు ; నేఁడు దెఱంగుల — వా.శ. ఇప్పుడు సూత్రము పురాహిమవతశ్చైషా హేమశృంగాద్వినిసృతా। గంగాప్రతిదిశం గత్వా సప్తధా ప్రతిపద్యతే పి పి.ఎస్. ప్రతి పుట 1073. త్రిభువన పావని — గి$_1$. నన్నయ 'మూఁడు దెఱంగుల' అనియే వ్రాసియుండును. ఈసందర్భమున చిత్రశాలాప్రతియం దీశ్లోకమును గలదు. 'గంగాంచ యమునాం చైవ ప్లక్షజాతాం సరస్వతీం। రథస్థాం సరయూం చైవ గోమతీం గండకీం తథా। అపర్యుషిత పాపాస్తే నదీః సప్త పిబంతియే' పుట 282 'మూఁడు దెఱంగుల కల్పితపాఠమని—సఁడు దెఱంగుల' యను పాఠమే యుక్తమని — భా.కూ. 4. వియత్పథమునందు — ఉ.ఒ.త ; యనవియత్పథము నందు — గ.మ ల. 5. సేవితంబయ్యె — అ.ఇ.ఊ ఎ ; సేవ్యము యయ్యె — ఆ.ఔ.క.గి$_1$.చ.త ప.శ.ష. 6 య్యురగలోకంబున నొనరభోగ — మ.ల.స ; య్యురగ లోకంబునం దొనరభోగ — చ.భాసం.పి.శ.ష. కొన్ని ప్రతులు. 7. నొప్పియున్నతి — చ.ద.పి.శ.ష. 8. న — క. 9. నదిని — గి$_1$.చ.పి శ.ష ; తీర్థ — కొన్ని ప్రతులు. 10. మెట్లు — ఆ.ఐ.ప ; మిట్లు — ఉ.వ.

43 వ. అనుచు [1]నిజజననీభ్రాతృసహితుండయి గంగాభిషేకార్థం[2]బు చనుదెంచు నయ్యర్జును పయి నంగారపర్ణుం డతినిశితసాయకంబు [3]లేసిన నర్జునుండలిగి తన చేతి కొఱవి [4]విదిర్చి యయ్యమ్ములు దన్నుం దాఁకకుండం గాచికొని వాని కిట్లనియె.

44 ఆ. వెఱఁగ యిట్టి[1]పాటి వెఱపించుటలును మాయలును నేమిసేయు నస్త్రవిదులఁ
బెక్కులయ్యు నీ[2]బిభీషికల్ నుఱుపులు, విరియునట్లు లిందు విరియుఁ బోవె.

45 సీ. [1]అగ్నిదేవుండు బృహస్పతికిచ్చె మున్నతఁడు భరద్వాజుఁడనఁగఁ బరగు
మునికిచ్చె [2]నమ్మహాముని భార్గవునకిచ్చె భార్గవుండును గుంభభవున కిచ్చె
నమ్మహాత్ముండు నాకతిదయ నిచ్చె నియ్యనలాస్త్రమని దాని నమ్మహోగ్ర
గంధర్వుపై వైచె ఘనుఁ డింద్రసుతుఁ డంతఁ దద్రథం [3]బప్పుడ దగ్ధమయిన

ఆ. నగ్నిదాహభీతి నంగారపర్ణుండు, [4]బమ్మరిల్లి నేల బడినవానిఁ
గొప్పు[5]వట్టి యీడ్చికొని [6]వచ్చె ధర్మజుకడకు నింద్రసుతుఁడు కడిమి మెఱసి.

46 క. వాని మనో[1]వల్లభ [2]కుంభీనసి యనునది గరంబుభీతి నశేషో
ర్వీనాథులార దయఁ బతి, దానము నాకిందు మీకు[3]ధర్మువు [4]పెరుఁగుఁజా.

43 1. నిజ – పెక్కు ప్రతులలో లేదు. 2. బరుగుదెంచు – కొన్ని ప్రతులు; బరుగు నయ్యర్జును – చ ద.భాసం.వీ శ.ష. 3 వఱపిన – భాసం.పీ.శ.ష ; వరపిన – అ గ$_1$.చ ద (లఘురేఫము) 4. త్రిప్పి – భాసం. పెక్కు ప్రతులు.

44 1. దారి – స. 2. విభీషికల్ – ఒ చ.ద.శ.ష

45 1. అనిలదేవుఁడు — వ. (అనలదేవుఁడు కావచ్చును.) ఆగ్నేయాస్త్రలాభమును గూర్చి నన్నయ పేర్కొన్న గురుపరంపర పి.పి.యస్. ప్రతిలో కలదు. పుట 1074. చిత్రశాలా ప్రతి మున్నగు వానియందలి పరంపర దీనికి భిన్నముగా నున్నది. 2. నమ్మహాత్ముడు — న. 3. బంతయు — బు ఐ.ఖ.న.బ. 4. బమ్మరించి — ఆ ఎ.ఒ.క ; బమ్మరిల్ల – ఓ.డ. 5. బట్టి – శ ష. కొన్ని ప్రతులు 6. వచ్చి...... మెఱసె — కొన్ని ప్రతులు.

46 1. వల్లభి – పెక్కు తాళపత్ర ప్రతులు. 2. కుంభీనస – కొన్ని ప్రతులు. 3. ధర్మము – న. 4 పెఱుఁగన్ – ఐ.వీ శ.ష

47 క. అని యఱచుచున్న [1]దానికి, ననఘుఁడు గరుణించి పాండవాగ్రజుఁ డయ్యా
ర్జునుఁ జూచి వీని విడువుమ, యనినోడినవాని హీను [2]నపగతశౌర్యున్.

48 ఆ. అనిన నరుఁడు వల్లెయని వానికని యె గంధర్వునిన్నుఁ గరుణ ధర్మరాజు
[1]కురుకులేశ్వరుండ శరణశరణ్యుండు, విడువఁ బనిచె నింక వెఱవకుండు.

49 వ. అని వాని నాశ్వాసిం[1]చి [2]విడిచిన నట్లు [3]నిర్జితుండై యర్జునున కంగార
పర్ణుం డిట్లనియె.

*-: అంగారపర్ణుం డర్జునునితో సఖ్యము సేయుట :-*

సం. 1-158-35

50 మ. అని నీచేతఁ బరాజితుండనయి నా[1]యంగారపర్ణత్వ మిం
కను దాల్పన్ మది నంత [2]నిర్లజుఁడనే గర్వంబడం[3]గన్ రణం
బున మున్నోడియుఁ బూర్వనామమునఁ బెంపున్ [4]గర్వముం దాల్చు వాఁ
డనఘా సత్సభలందు [5]మెచ్చఁబడునే [6]హాసాస్పదీభూతుఁడై.

47 1. వానికి — య 2. నపగత శౌర్యున్ — ఉ.గ్రి₁.చ.ద.ప.మ.వీ.శ.ష ; నయశో
వీర్యున్ — భాసం.వా.శ. కొన్ని ప్రతులు.

48 1. కురు — భాసం.శ.ష. పెక్కు ప్రతులు ; గురు. వా. కొన్ని ప్రతులు.

49 1. చిమందల విడిచిన — ఊ బౌ.ప.వా.శ ; పెక్కు ప్రతులలో మందల లేదు.
2. విడిచిన నర్జునునకు నంగారపర్ణుం డిట్లనియె — య. 3. లజ్జితుండయి — గ.బ,
నిర్భీకుండయి యంగార — శ.ష.

50 1. అంగారవత్ భాస్వరం దుస్పర్శమ్ చపణం వాహనం రథోయస్య సోఽంగార
పర్ణః అని చిత్రశాలాప్రతి వ్యుత్పత్తి చూపినది. పుట. 283. 2. నిర్లజుఁడనే —
న.భాసం.ర.ల స. సూ. కొన్ని తాళపత్రప్రతులు ; లజము లజప్రీతాయాం అను
భౌవాదిక ధాతువునఁ బుట్టిన నామవాచకమని — భాసం ; నిస్త్రపుఁడనే — వా.
కొన్ని ప్రతులు. 3. గన్ — ఉ.ఒ.క ఖ.గ.డ.ల. 4. శౌర్యముం — కొన్ని
ప్రతులు. 5. చెప్పఁబడునే, నెంచఁబడునే, నెన్నఁబడునే, పూజ్యుఁడగునే — ఇత్యాది
పాఠములు గలవు ; నవ్వబడడే — ఉ. 6 హాస్యాస్పదీ — ఐ.వ.

51 వ. నీయాగ్నేయాస్త్రంబున దగ్ధరథుండ నయ్యును గంధర్వమాయ ననేకరత్న విచిత్రితంబై[1]న రథంబు వడసి యిది మొదలుగాఁ జిత్రరథుండ నయ్యెద నీ పరాక్రమంబునకు మెచ్చితి నీతోడి సఖ్యంబు నాకభిమతంబయినయది నాతపంబునం బడయంబడిన చాక్షుషి యనువిద్య నీకిచ్చెద దీనిం దొల్లి మనువు [2]వలన సోముండు వడసె సోమునివలనఁ గంధర్వపతియయిన విశ్వావసుండు వడసె నాతనివలన నేను [3]బడసితి నెవ్వండేని మూఁడులోకంబులుం జూడ నిచ్చగించు నాతండు దనయిచ్చకుం దగ నివ్విద్య పెంపున [4]సర్వంబునుం జూచు నేము దీనన చేసి కాదె మానవులకు [5]విశేషులమై వేల్పులచేత శాసింపంబడక జీవించెద మిది కాపురుషప్రాప్తంబై ఫలియింపదు నీవు తాపత్య వంశవర్ధనుండవు మహాపురుషుండవు నీకు సఫలంబగు నీ [6]దివ్యవిద్య గొను మిచ్చెద దీనిఁగొనునప్పుడు [7]షణ్మాసవ్రతంబు సేయవలయు నీవు నాకు నాగ్నే యాస్త్రం బిచ్చునది మఱి మహాజవసత్త్వంబులుఁ గామగమనంబులు నయిన గంధర్వహయంబుల మీకేవుర[9]కుం వేఱు నూఱేసి యిచ్చెద.

52 సీ. వృత్రుపై గీర్వాణ[1]విభుఁ డల్గి వజ్రంబు వైచిన నది వాని వజ్రకఠిన
పటుమస్తకంబునఁ బడి పాతఱియమునఁ బడె వ్రయ్యలైనఁ దద్భాగచయము
క్రమమున బ్రాహ్మణ క్షత్త్రియ విట్ఛూద్రుల యందు వేదంబులు నాయుధములు
హలము శుశ్రూషయు నయ్యె [2]వజ్రంబులు వాహంబులందు [3]జవంబునయ్యె

తే. నట్టిజవమున నభిమతంబగుచు నున్న, యట్టి హయసమూహంబయ్యె యవనిపతుఁ
కఖిలభువనముల్ రక్షించునపుడు [4]సకల, సాధనములలోను త్తమ[5]సాధనంబు.

51 1. న చిత్రరథంబు—మ. 2. చేత—య. 3. వడసితి— పెక్కు ప్రతులు. 4. సర్వలోకంబులుం జూచు—ప.ల. 5. విశిష్టులమై—చ.ద.ఖాసం.వీ.శ.ష. 6. దివ్య—పెక్కు ప్రతులలో లేదు. 7. షాణ్మాసిక–ల వీ శ ష. కొన్నిప్రతులు. 8. సత్త్వసంపన్నంబులు–అ.ఖ.చ.ద.వీ.శ.ష; సత్త్వంబులుగామగమనంబులు–అనియే పెక్కుప్రతుల పాఠము. సత్వంబులు కామవర్ణంబులు కామగమనంబులు — వా.శ. 9. కున్ వేరువేర — కొన్ని ప్రతులు ; కు నూఱేసియిచ్చెద—ఖాసం.వ.శ.ష. పెక్కు ప్రతులు

52 1. విభుడల్గి — ఓ.గ్రి.చ.ఖాసం.ల.వీ.శ ష ; విభుఁడు ముఱ — వా.శ. కొన్ని ప్రతులు; విభుడు వజ్రంబెత్తి వైచిన — ఏ.ర. 2. వజ్రంబున - వా.శ. కొన్ని ప్రతులు. 3. వజ్రమయ్యెనట్టి జవంబున నభిమతంబులగుచు నున్న హయంబులె(ల)య్యవనిపతుల— పెక్కు ప్రతులు. 4. సర్వ — కొన్ని ప్రతులు. 5 సాధనములు — కొన్ని ప్రతులు.

53 వ. అనిన వాని కర్జునుం డిట్లనియె.

54 ఆ. ఎంతమిత్రులైన నెన్నండు నొరులచే, విద్యయును [1]జయంబు విత్తచయము
గొనఁగ నొల్లనాకుఁ [2]గూర్తేని యనలాస్త్ర, మనఘ నీవుగొనుము హయము
లిమ్ము.

55 వ. నీ[1]తోడ [2]సఖ్యంబుఁ జేసెద మఱి మమ్ముఁ బరమధార్మికులం బరమబ్రహ్మణ్యుల
నేమి[3]కారణంబున [4]నుదరిపలికి తనిన గంధర్వుం డిట్లనియె

56 క. విమలములయి లోకస్తు, త్యమునఁ బ్రవర్తిల్లు మీమహాగుణములు ని
త్యమువిందు నారదప్రముఖ మునీశ్వర సిద్ధసాధ్య గణములవలనన్,

57 క. వేరునగోత్తంస మహీ, భారదురంధరుల మిమ్ముఁ బాండవుల [1]గుణో
దారుల ధీరుల నెఱుఁగసి, వా రెవ్వరుఁ గలరె భరతవంశోత్తములన్.

58 వ. ఏను మిమ్ము నెఱింగియు మీకు నగ్నిపరిగ్రహంబును బ్రాహ్మణసంగ్రహంబును
లేమిం జేసి పరుసంబులు పలికితి మఱియును.

59 ఉ. ఇంతులగోష్ఠి [1]నున్నయతఁ డెంత వివేకము గల్గె[2]నేని య
త్యంతమదాభిభూతుఁడగు ధర్మువు [3]దప్పు బ్రియంబెఱుంగఁ డే
నెంత వివేకినయ్యు నసహింపక యింతులయొద్దఁ బల్కితిన్
వింతయె కాముశక్తి [4]యుడివింపఁగ శక్యమె యెట్టివారికిన్

54 1. శ్రుతంబు, శుభంబు – అని పాఠములు. 2 గూర్తేనినాయన, లాస్త్రమీవుగొని
హయమ్మునిమ్ము – ర

55 1. తోడి – కొన్ని ప్రతులు. 2. బద్ధసఖ్యంబు–వా.శ ; బద్ధ – పెక్కు ప్రతులలో
లేదు. 3. కారణముదరి పలికితి – గ. $_1$ చ.ద శ.ప. 4. నదలించి పలికితి – ఋ ;
నోడక పలికితి – వ.

57 1. గుణాధారుల — పెక్కు ప్రతులు.

59 1 యున్నజనుఁడెంత, నున్న నరుడెంత — అని పాఠములు. 2. నేని నత్యంత —
కొన్ని ప్రతులు ; ఏని కొన్నింటద్రుతప్రకృతికముగను, కొన్నింట కళగను గాన్పించు
చున్నది. 3. దప్పి నయంబెరుంగడే — ఖ ; దప్పి ప్రియం బెఱుంగఁడే — అ గ.గ$_1$.
పి.శ.ప. 4. యుడిపింపఁగ, యుడిగింపఁగ — అని పాఠములు.

60 క. సుర[1]గరుడవిషోరగ యక్షరాక్షసపిశాచభూతగంధర్వులు నో
పరు ధిక్కరింప [2]బ్రాహ్మణపురస్కృతులఁ బుణ్యమతుల భూతలపతులన్.

-: అంగారపర్ణుఁడు కౌరవులకుఁ బురోహితునిఁ బురస్కరింపుఁడని చెప్పుట :-

సం. 1–159–17

61 సీ. [1]అనవద్యు వేదవేదాంగవిశారదు జపహోమయజ్ఞప్రశస్తు సత్య
వచను విప్రోత్తము వర్గచతుష్టయ [2]సాధన[3]సఖు సదాచారు సూరి
[4]సేవ్యుఁ బురోహితుఁ జేసిన భూపతి యేలు నుర్వీతలంబెల్ల నిందుఁ
బరలోకమునఁ బుణ్యపరుల లోకంబులు వడయు [5]జయస్వర్గ ఫలము సూవె

ఆ. రాజ్యమదియు [6]నుర్వరాసుర విరహితుఁడయిన పతికిఁ గేవలాభిజాత్య
శౌర్యమహిమఁ [7]బడయ సమకూరునయ్య తాపత్య నిత్యసత్యభాషణుండ.

62 వ. మీరు ధర్మానిల శక్రాశ్వినుల[1]వరంబునం బాండురాజునకుం [2]గుంతీ మాద్రు
లకుం బుట్టిన[3]వారలు ధర్మవిదులరు వేదవేదాంగధనుర్వేదపారగుండయిన
భారద్వాజుశిష్యుల రఖిలలోకహితులరుం గావునం బురోహిత [4]రహితు[5]లరై
యుండఁదగదు.

63 ఆ. పాండుపుత్త్రి నీవు బ్రహ్మచర్యస్థుండ వగుటఁ జేసి మన్మథార్తు నన్ను
నొడిచి [1]తిందు రాత్రి యుద్ధంబుసేసి కామోపభోగనిరతుఁ డోటు వడఁడె.

---

60 1 ఖచరయక్షరాక్షస గరుడోరగ సిద్ధసాధ్య గంధర్వులునో, పరు — స. 2. భూసుర పురస్కృతుల – పెక్కు ప్రతులు

61 1. అనవద్య – పెక్కు ప్రతులు. 2. సాధను, సంయతాచారుసూరి – ఋ.భాసం. 3. కరు, రతున్ — అని పాఠములు. 4. శిష్టు — $గ_1$ చ ద.శ.ష. 5. చతుర్వర్గ ఫలము – భాసం.ర.శ, య (యి) ది స్వర్గ – ఊ.క ఖ ; ట యుత్తమపదముసూవె–ల. 6. సత్పురోహితవిరహితుడైన - అ. (?) 7. మెఱయసమ — $గ_1$.చ.ద.వ.శ.ష.

62 1. వలన, ప్రసాదంబున, వరప్రసాదంబున — అని పాఠములు. 2. గుంతికిం బుట్టిన — వా.శ.భాసం. కొన్ని ప్రతులు; కుంతీమాద్రులకుం బుట్టిన — ఒ.ఓ.జ. 3. వారలరు - ఎ.ఏ.ఒ. 4. సహితులై యుండవలయు - మ. 5. లై – అ.ఉ. ఋ.ఖ.జ.ట.

63 1. తిందు – కొన్ని ప్రతులు , తెందు — వా. కొన్ని ప్రతులు

64 వ. మఱియుఁ గామప్రవృత్తుండయ్యును మహీపతి మహీసురవరపుర[1]స్సరుం డగునేని యెల్లయుద్ధంబుల శత్రుల జయించు.

65 ఉ. వేదము వేదియుం గలుగు విప్రవరేణ్యుఁ డగణ్యపుణ్యసం
పాది పురోహితుండయినఁ బాపమువొందునె భూపతిం బ్రతా
పోదయ కాన మీదగు గుణోన్నతికిం [1]దగ ధర్మతత్త్వసం
వేదిఁ బురస్కరింపుఁడు పవిత్రచరిత్రు మహీసురోత్తముల్.

66 తే. అనిన వానికి నర్జునుం డనియె మమ్ము, ననఘ తాపత్యులనిపల్కి తతిముదముగ
నేము కౌంతేయులము మఱి యెట్లు సెప్పు, మయ్య తపతి కపత్యులమైన తెఱఁగు.

—: తపతీసంవరణోపాఖ్యానము :—

సం. 1-160-3

67 వ. అనిన నర్జునునకు నంగారపర్ణుం డిట్లనియె.

68 సీ. [1]ఆదిత్యునకుఁ బుత్త్రి యనఘ సావిత్రికి ననుజ యుత్తమలక్షణామలాంగి
తపతి [2]యన్కన్యక ధవళాయతేక్షణ యౌవనసంప్రాప్తయైన దానిఁ
జూచి యక్కన్యక సురుచిరగుణముల కనుగుణుండగు నిర్మలాభిజాత్యుఁ
బతినెవ్విధంబునఁ బడయుదునోయని తలఁచుచునున్న యత్తపను [3]గుఱిచి

ఆ. భక్తిఁ దపము సేసెఁ బ్రభుఁ [4]డజామీఢ నందనుఁడు భరతకులుఁడు ధర్మవిదుఁడు
సర్వగుణ[5]యుతుండు సంవరణుండను, వాఁడు [6]కృతజపోపవాసవిధుల.

64 1. స్కృతుండగునేని — ఈ బు.పౌ.ఖ.మ.

65 1 దగు — కొన్ని ప్రతులు.

68 1. ఆదిత్యునకు బుత్త్రియైన సావిత్రికి—మ. 2. యన్నన్యక—$గి_1$ ; యక్కన్యక—బు.పౌ. భాసం. 3. గూర్చి — గ.$గి_1$.చ.ద.భాసం పి.శ.ప 4. సంవరణుఁడు ఋక్షపుత్రుడు అని చిత్రశాలా ప్రతి పుట 285 పి పి.ఎస్. 1083 మఱియు భండార్కరు ప్రతులు (673)—అథర్క్షపుత్రః కౌంతేయ, కురూణాం నృపభో బలీ। సూర్యమారాధ యామాస నృపస్సం వరణస్సదా. సంవరణుఁడు అజామీఢ నందనుఁడని ఈ మూఁడు ప్రతులలోను లేదు కాని సోరన్‌సన్ సంపాదించిన మహాభారతాను క్రమణిక అను గ్రంథమునందు 618 పుటలో సంవరణుఁడు 'సన్ ఆఫ్' అజామీఢ అని వ్రాయఁబడి యున్నది. ఇది యింకను విచారింప దగినది. 5. హితుండు — బు.$గి_1$.చ ద శ.ప 6 జపతపోపవాసవిధుల — జ.

69 చ. గగనమునందు నెందు నధికప్రభ నేను వెలుంగునట్టు లి
జ్జగతిఁ బ్రసిద్ధుఁడై [1]వెలుఁగు సంవరణుండ మదీయపుత్త్రికిం
దగుపతి వీనికిచ్చెద ముదంబున నీలలితాంగి నంచు మా
నుగ [2]నెడ నిశ్చయించెఁ దపనుండు దదీయతపఃప్రసన్నుఁడై.

70 వ. అంత నొక్కనాఁడు సంవరణుండు మృగయావినోదార్థియయి వనంబునఁ బరిభ్రమించి యధికక్షుత్పిపాసాపీడిత[1]పతితతురంగుండయి యేకతంబ పాదచారియై చని యొక్కపర్వత[2]వనోద్దేశంబునందు.

71 క. కనియె నొకకన్య గోమ[1]లిఁ, గనకప్రభ నిజశరీరకాంతి నుపాంతం
బున వృక్షలతావలిఁ గాం,చనమయముగఁ జేయుచున్న చంద్రనిభాస్యన్.

–: *సంవరణుండు దపతింజూచి మోహించుట* :–

సం. 1–160–25

72 వ. కని యనిమిషలోచనుండయి మనంబున నిట్లని వితర్కించె.

73 సీ. త్రిభువనలక్ష్మి యేతెంచి [1]యేకాంత మిచ్చోటలోకో యున్నది యివ్వనమున
గగనమణిప్రభ గగనంబునందుండి యవనీతలప్రాప్తమయ్యె నొక్కొ
[2]శంభుండు లావణ్యసద్గుణసముదాయ మింద యిమ్ముగ సంగ్రహించె నొక్కొ
[3]దీనియంగములబొందిన యివ్విభూషణశ్రీ యేమిపుణ్యంబుఁ జేసెనొక్కొ

ఆ. యమరకన్యయొక్కొ యక్షకన్యకయొక్కొ, సిద్ధకన్యయొక్కొ శ్రీసమృద్ధి
సర్వలక్షణప్రశస్తాంగి యిది దివ్య,[4]కన్య యగు ననంతకాంతి పేర్మి.

69 1. పరగు, వెలయు — అని పాఠములు. 2. మదినుంచి యాతపనుఁ డుండెఁ దదీయతపఃప్రసన్నుఁడై — మ.

70 1. పతిత — కొన్ని ప్రతులలో లేదు. 2. వనప్రదేశము నందు — పెక్కు ప్రతులు

71 1. లిఁగనకప్రభ – య ; లకనకప్రభ — వా పెక్కు ప్రతులు.

73 1. యిచ్చేలకో, యేకాంతమున నున్న దివ్వనమున—బ.మ; యిచ్చేలకో యేకతంబున్నది యివ్వనమున—ల. 2. శంభుఁడు—బ్రహ్మ అని భాసం. 3. దీనియంగముల బొందిన యివ్విభూషణ శ్రీయేమి — పెక్కు ప్రతులు ; పొలఁతియంగంబులఁ బొందిన భూషణశ్రీ— వా. కొన్ని ప్రతులు. 4. కన్యకయ యనంతకాంతి — న.

74 చ. [1]నెఱికురులున్ విలోలసితనేత్రయుగంబును [2]నొప్పులొల్కు వా
తెఱయును దీని [3]యాననము [4]తెల్వి కరంబు మనోహరంబు [5]నా
యెఱిఁగిన [6]యంతనుండి సతి నిట్టి లతాలలితాంగిఁ [7]జూచి యే
నెఱుఁగ [8]సురేంద్ర[9]కన్యకలు నిట్టిరె రూపవిలాస సంపదన్[10]

75 వ. అని వితర్కించుచు మదనకర్కశమార్గణలక్షీభూతచేతస్కుండయి[1]తదీయ గుణమయపాశబద్ధుండునుంబోలెఁ గదలనేరక తన్ను వేశిత[2]చేతనుండునుం బోలెఁ దన్నెఱుంగక తద్రూపామృతపానంబున ననిమిషత్వం[3]బునం బొందిన తన నయనంబులు దానియందు నిలి[4]పి సంవరణుం డక్కన్యక కిట్లనియె.

76 ఆ. ఎఱుఁగఁ జెప్పు మబల యెవ్వరిదానవి, క్ష్మేల యున్న దాన వేకతంబ
[1]క్రూరవనమృగములు గ్రుమ్మరుచున్న యీ, విజనవిషమశైలవిపినభూమి.

74 1. నెఱికురులున్ — క నం.గి$_1$ పీ.శ.ష.భాసం. సూ.శక.శర కొన్ని తాళపత్ర ప్రతులు; నెఱిగుఱులున్ — వా.శ తి.ద్వి. భా.కూ. కొన్ని ప్రతులు. 2. నొప్పు లొప్పు — ఏ.చ గి$_1$.భాసం.య.శ.ష; నొప్పు కెంపువాతెఱ — వ; నొప్పు తెప్ప వాతెఱ — శ; తేనెలొల్కువాతెఱ — ద్వి.కనం. శర.తి. 3. హాసముల — మ. 4. తేట — బు.య; తెల్పు — కొన్ని ప్రతులు; తెల్వి — ఐ.గి$_1$.చ.జ.ద.భాసం. పీ.శ.ష; తెల్వుకరంబు — ఉ.ఏ.ఓ.ర.శ. 5. నేనెఱిఁగినయంత — పెక్కు ప్రతులు. 6. యంతనుండియును నిట్టిలతాంగినిఁ జూచి యెందు నేనెఱుఁగ — న. 7. జూచి యున్నెఱుఁగ — ర. 8. నరేంద్ర కన్యకలు — ఓ. 9 కన్యకల దట్టిరూప విలాస సంపదల్ — ఓ.భాసం పాదసూచిక. 10. దీని తరువాత 'క' ప్రతిలో అధికపాఠమైన పద్యము గలదు.

కం. లాలితమణిమయగంధి
రోల్లాసితనవకుసుమలిప్తనాగరు
లీలాదరి మరాళగామిని
ఖేలానతిజూచె వరుణుకే లాన్వితుఁడై
కాని పద్యము అనన్వితముగా నున్నది.

75 1. తదీయ — దన్నెఱుంగక — ఈ నడిమిభాగము న ప్రతిలో లేదు. 2. చేతస్కుండు నుంబోలె — అ.ఈ.ఐ.ఖ.ల; మానుసుండునుంబోలె — చ.ద.భాసం.పీ.శ.ష. 3. బుఁబొందిన,బునొందిన — అని పాఠములు. 4. పిసంవరణుం డక్కన్యక — పెక్కు ప్రతులు; పియక్కన్యక — వా.

76 1. క్రూరతరమృగాళి గ్రుమ్మరుచున్న — స.

77 క. అని పలుకుచున్న నృపనందనునకు [1]మఱుమాట యీక తామరసనిభా
నన మేఘమధ్యసౌదామని వోలె నడంగె దృష్టిమార్గము గడవన్.

78 వ. ఇట్లు[1]దృశ్యంబయిన యక్కన్యకం గానక మానవపతి మానరహితుండయి మహీతలంబు పయింబడి [2]ప్రలాపించుచున్న నాతని నభినవ[3]యౌవనవిభ్రమోద్భాసితు నంగజాకారుంజూచి [4]తపతి తానును మదనబాణబాధిత[5]యై తనరూపంబుఁ జూపి మధురవచనంబుల నిట్లేల మోహాగతుండ వయితని [6]పలికిన దానికి సంవరణుం డిట్లనియె.

79 చ. ధరణి నతిప్రతాప బలదర్పము[1]లన్ విను నేన పెద్ద నె
వ్వరికిని మున్ భయంపడనివాఁడ భయార్తుఁడ నైతి [2]నిప్డు పం
కరుహదళాయతాక్షి దయఁ గావుము నన్ను భవన్నిమిత్త దు
ర్భరతరపంచబాణహతిఁ బంచతఁ బొందక యుండునట్లుగన్.

80 వ. నన్ను గాంధర్వవివాహంబున [1]వరియింపుమనిన సంవరణునకుఁ దపతి యిట్లనియె.

81 క. భువనైకదీపకుండగు, సవితృనకుఁ దనూజ మఱియు సావిత్రికి నే
నవరజ నవినయవర్జిత, నవనీశ్వర వినుము తపతియను సురకన్యన్.

77 1. మార్మాటయీక — ర.

78 1. దృశ్యంబయిన — పెక్కు ప్రతులు; దృశ్యయయిన — ఏ.ఐ.ఔ. వా.వీ. 2. ప్రలాపించు — గ$_1$.య.శ.ష. పెక్కు ప్రతులు; విలాపించు — వా.శ.భాసం; విలపించు — ఖ.డ.త.ల. 3. యౌవనోద్భాసితు — ఓ.ఔ.చ ద శ.ష. 4. తపతి తానును మనోజబాణ — ల. పెక్కు ప్రతులు; తపతియుందానును — వా. 5. యైక్రమ్మరం దనరూపంబు — ఋ.చ.త.ద.ప ల పీ.శ ష. 6. యడిగిన — కొన్ని ప్రతులు

79 1. నంగడునేన పెద్ద — గ$_1$.చ.ద.ప.భాసం.పీ.శ.ష. 2. నీవు — పెక్కు ప్రతులు.

80 1. పరిగ్రహింపుమనిన — ఏ.న.

82 వ. నాయందు నీకుం[1]బ్రియంబు గలదేని మదీయజనకు [2]నడుగుము నన్నిచ్చు నింతులకు స్వాతంత్ర్యంబు లేమి నీ[3]వెఱుంగుదువు గాదె కావున ననవరతజపనియమ [4]ప్రణిపాతంబుల నాదిత్యు నారాధింపుమని చెప్పి తపతి యాదిత్యమండలంబున కరిగె నంత సంవరణుండు మూర్ఛాగతుండయి [5]పడియున్న నాతని యమాత్యుండు వచ్చి శీతలపరిషేచనంబు సేసిన మూర్ఛదేఱి యమ్మహీపతి [6]మహాభక్తి నప్పర్వతంబున నుండి సూర్యు నారాధించుచు.

—: వసిష్ఠుఁడు తపతినిఁ గొనితెచ్చి సంవరణునకు
వివాహంబు సేయించుట :—

సం. 1-162-12

83 చ. ప్రతిహత రాగకోపభయుఁ బంకరుహప్రభవప్రభావు దూ
రితదురితున్ మునీశ్వర[1]వరిష్ఠు వసిష్ఠమహామునిం బురో
హితు నతిభక్తితోఁ దలఁచె నిష్టమెఱింగి వసిష్ఠుఁడున్ సమా
హితమతి [2]నేఁగుదెంచి కనియెం బ్రభు సంవరణుం [3]బ్రియంబునన్.

84 వ. ఇట్లు దలంచిన పండ్రెం[1]డగు దివసంబునకు వచ్చి వసిష్ఠుం [2]డవిరతవ్రతోపవాస [3]కృశీభూతశరీరుండయి యున్న సంవరణుం జూచి యాతండు తపనసుత యయిన తపతియందు బద్ధా[4]నురాగుండగుట తనయోగదృష్టి నెఱింగి.

82 1. బ్రియంబు — పెక్కు ప్రతులు; బ్రీతి — వా.శ. కొన్ని ప్రతులు. 2. నడుగునది యాతండు — గ$_1$ చ.త.ద.బ.మ.వీ.శ ష. 3. వెరుంగవె — పెక్కు ప్రతులు. 4. వ్రతోపవాసంబుల — కొన్ని ప్రతులు 5 పడి — కొన్ని ప్రతులలో లేదు 6. మహాభక్తి — కొన్నిట లేదు

83 1. గరిష్ఠు — కొన్ని ప్రతులు. 2. నేఁగుదెంచి — ఏఁగు (సార్ధబిందుక రూపము) వా.వీ శ. 3. బ్రియంవదుఁ, బ్రియంవదఁ — అని పాఠములు.

84 1. డవ — కొన్ని ప్రతులు. 2. డు నిరంతర, డవిరళ — అని పాఠములు. 3. కృశశరీరుండయి — వా.శ కొన్ని ప్రతులు కృశీభూతశరీరుం — వీ. పెక్కు ప్రతులు. 4. భిలాషుండగుట — ఔ.క.ఖ.త.న.ల.

85 చ. జగదభివంద్యుఁ[1]డాతఁ డమ [2]సమ్మతి సంవరణప్రయోజనం
బొగి నొనరింపఁగా [3]నయుతయోజనముల్ చని లోక[4]లోచనుం
డగుదినినాథు నాతతసహస్రకరుంగని [5]సంస్తుతించె న
త్యగణితవేదమంత్రముల నమ్మునినాథుఁ డతిప్రియంబునన్.

86 వ. సూర్యుండును వసిష్ఠమహాముని నతిగౌరవంబున సంభావించి భవదాగమన ప్రయోజనంబు సెప్పుమనిన వసిష్ఠుం డిట్లనియె.

87 సీ. అలఘుండు [1]పౌరవకులశేఖరుండు సంవరణుఁ డన్వాఁ డనవరతకీర్తి
విదితుండు ధర్మార్థవిదుఁడు నీపుత్త్రికి నగణితగుణములఁ దగువరుండు
గావున నతనికి దేవిఁగాఁ దపతి నీవలయుఁ గూఁతులఁ గన్న ఫలము దగిన
వరులకు సద్ధర్మ[2]చరితుల కీఁ[3]గాన్పకాదె నావుడు సూర్యుఁ డాదరించి

ఆ. వరుఁడు రాజవంశ[4]కరుఁడు సంవరణుండ, యనుగుణుండు దీనికని కరంబు
గారవమున నిచ్చి [5]యార్షుషితోడఁ [6]బుత్తెంచెఁ దపతిఁ గురుకులాంచితునకు.

88 వ. ఇట్లొక్క నిమిషంబున [1]మున్నూటయిరువదినాలుగు యోజనంబులు పఱచు నాదిత్యురథంబుతో నక్రమంబున నరిగి తపనదత్తయయిన తపతిం

85 1. డతఁడమ — పెక్కు తాళపత్ర ప్రతులు. 2 సన్మతి — య.ర. కొన్ని ప్రతులు. 3 నయుత — కొన్ని ప్రతులు ; నియుత — వా. 4 లోచనంబగు దినినాథు — కొన్ని ప్రతులు. 5. సన్నుతించె — చ.వ.వీ.శ.ష. ఇచ్చట పి. పి యస్. ప్రతిలో సూర్యస్తుతి సంబంధమైన మూడు శ్లోకములు కలవు.

87 1 'కౌరవ' — అని కొన్ని పాఠములు గలవు కాని కురువు సంవరణుని కుమారుఁ డగుటచే సంవరణుని కౌరవకులశేఖరుఁ డనుట పొసగదు. 2. వరుల(న)కు — కొన్ని ప్రతులు. 3. గాన్పకాదె — అని పాఠము. 4. వరుఁడు — అ.ఊ ఎ.గ.ర. 5. యారసితోడ బుత్తెంచె – అ ఆర్షుషియను పాఠమున ర – బు ప్రాసము. ఇచ్చట భారతకూలంకష పుట్టున్నది. గారవమున నిచ్చి యార్షుషితోడ అనే దిక్కున ప్రాసయతి ఆరుషియనేది కర్మధారయసమాసముగావున రేఫోకారములు వ్రాయ వలసినది. 6. బుత్తెంచెఁ గురుకులాగ్ర దీపకునకు – $గ_1$ చ.ద.శ ష. ఈ పాఠమునందు ప్రాసయతి నియమము తప్పినది.

88 1. లతయు నూటయిరువదినాలుగు యోజనంబులు — $గ_1$.ద.భాసం.వీ.శ ష; లతయు న్నూట యిరువది నాలుగు (వేల) యోజనంబులు – అని కొన్ని ప్రతులు. ఇచ్చట మూలము. యోజనానాం చతుష్షష్టిం నిమేషాత్ త్రిశతం తథా। అశ్వైర్గచ్ఛతి

దోడ్కొని వచ్చి వసిష్ఠుండు విధివంతంబు[2]గా సంవరణునకుం దపతి వివాహంబు సేయించెఁ గావున మహాత్ములయిన పురోహితులం బడసినరాజుల కభీష్టంబులయిన శుభంబులగుట నిశ్చయం[3]బిట్లు సంవరణుండు దపతి వివాహంబయి

89 క. ఆతరుణియందుఁ జేతో,జాతసుఖప్రీతిఁ దగిలి శైలాటవులన్
వీత[1]నృపకార్యధర్మ,వ్రాతుండయి పదియురెండు వర్షములుండెన్.

90 వ. దానంజేసి మహీతలంబున కనావృష్టియయిన నెఱింగి వసిష్ఠుండు శాంతి[1]క పౌష్టిక విధులొనరించి సంవరణుందోడ్కొని హస్తిపురంబున కరిగిన నఖిల ప్రజకు ననురాగంబయ్యె ననావృష్టి దోషంబునుంబాసె నంత సంవరణునకుఁ దపతికిం దాపత్యుండై [2]వంశకరుండు కురుండు పుట్టె నదిమొదలుగా మీరును దాపత్యుల రయితిరని గంధర్వుండు చెప్పిన నర్జునుండు వెండియు నిట్లనియె.

91 క. నుతముగ నస్మత్కుల భూ,పతులకు [1]నాద్యులకుఁ బుణ్యభాగులకుఁ బురో
హితుఁడయిన వసిష్ఠు మహా,త్మతఁ జెప్పుము వినఁగవలతు మది నేర్పడఁగన్.

92 వ. అనిన గంధర్వుం డిట్లనియె.

93 క. ధృతి నెవ్వనినేని పురో,హితుఁగాఁ బుణ్యమునఁ బడసి యిక్ష్వాకుకులో
[1]దితులైన పతులు రాజ్యో,న్నతి [2]నొప్పంజేసి రుర్వి నానాక్రతువుల్.

నిత్యంయః. పి పి.ఎస్. ప్రతిపుట 1093. ఇచట తెలుఁగులో నింకను పాఠభేదములు గలవు. 2. గావేల్చి సంవరణునకు — అ.ఈ గ.ల. 3. బ యిట్లు సంవరణుండు మహోత్సవంబునం దపతి — వా. కొన్ని ప్రతులు.

89 1. ధర్మకార్య — కొన్ని ప్రతులు.

90 1. కపౌష్టిక — కొన్నిటలేదు. 2. కురువంశకరుండు — వా.శ. కొన్ని ప్రతులు.

91 1. నార్యులకు — త బ వ.స.

93 1. క్షితులైన — $గ_1$.గు.చ మ వీ.శ.ష ; ద్ధితులైన (లేఖనము) — ఋ.జ.డ.ఖ.
2. నొప్పుచు జేసిరి — కొన్ని ప్రతులు.

94 క. బలమఱి కామక్రోధం, బులు రెండు జయింపఁబడి తపోవీర్యబలం
బులఁ జేసి చేయునవి ని, చ్చలు నెవ్వనియేని పాదసంవాహంబుల్.

95 సీ. శమహీనుఁడైన విశ్వామిత్రు చేసిన యప[1]కారమునఁ జేసి యాత్మసుతులు
యమ[2]సదనంబున కరిగిన వారలఁ దనతపోవీర్య [3]సత్త్వముల పేర్మిఁ
గ్రమ్మఱింపఁగ శక్తిగలిగియు వేల నయ్యంబుధి గడవనియట్లు శాంతుఁ
డయి యెవ్వఁడేని కృతాంతకుఁ గడవంగ నొల్లండ యట్టి యత్యుగ్రతేజుఁ

ఆ. డగు వసిష్ఠముని మహాత్మతఁ జెప్ప [4]నా,యలవి యయ్యె యనిన నవ్వసిష్ఠ
గాధిసుతుల కేమికారణంబున నిట్టి, వైరమయ్యె నెఱుఁగ వల[5]తుదీని.

-: అంగారపర్ణుఁ డర్జునునకు వసిష్ఠుమహిమ సెప్పుట :-

సం. 1—165—2

96 వ. చెప్పుమని యర్జునుం డడిగిన గంధర్వుం డిట్లనిచెప్పెఁ దొల్లి కన్యాకుబ్జంబున గాధిపుత్త్రుండు విశ్వామిత్రుండనురాజు నిరమిత్రంబుగా ధాత్రినేలుచు నొక్క నాఁడు మృగ[1]యార్థంబరిగి యపారబలసమేతుండయి ఘోరారణ్యంబునం గ్రుమ్మరి [2]వడంబడి కడుడస్సి వసిష్ఠునాశ్రమం బాశ్రయించిన నమ్మునివరుండు విశ్వామిత్రు నతిప్రీతిం బూజించి వానికిని వానిసేనకు నభిమతంబులైన యాహారంబులు గురియ నందినియను తనహోమధేనువుం బంచిన నదియు.

97 క. ఘృతనదులును [1]నోదనప,ర్వతములు దధి[2]కుల్యములు నవారితరసపూ
రితబహు[3]విధోప దంశో,న్నతపుంజంబులును దక్షణంబునఁ గురిసెన్.

95 1 రాధమన — ఆ ఊ.ఔ.డ.మ.ల. 2. సాదనంబునకు — గ్రి$_1$.చ.ల.శ.ష. 3. సత్యముల పేర్మి — ఆ.ల; మంత్రముల పేర్మి — న.స. 4. నాకలవియగునె — ఔ గ.జ.ట య.వీ; నాయలవియగునె—ఊ.ద.శ.ష. 5. యు దీని—కొన్ని ప్రతులు.

96 1. యావినోదార్థంబపార — పెక్కు ప్రతులు 2. వడంబడి — ఉ న.వ; వడివడి — వా; బడలుపడి — డ; నడవడి — వీ. కొన్ని ప్రతులందిది లేదు.

97 1. మోర(దు)ః — ఖ.డ.న.బ.వ 2. కుల్యాలును నవారిత — ర. 3. విధాప — వా. కొన్ని ప్రతులు, విధోప — పెక్కు ప్రతులు.

98 వ. ఇట్లు చతుర్విధాహారంబుల నందఱం దృప్తుం జేసియున్న యానందినిం జూచి విశ్వామిత్రుండు విస్మితుండయి యాత్మగతంబున.

99 మధ్యాక్కర. మృదురోమములును [1]శంకునిభకర్ణముల్ మెత్తని వలుఁద పొదుఁగును నిడుదచన్నుఁగను గురుచలై [2]పొలుచుకొమ్ములును సదమలశరదిందు[3]శంఖనిభమైన చాయయుఁ గలుగు మొదవిది నిగిచేరినట్లు చేరె నిమ్మునికిఁ బుణ్యమున.

100 వ. అని పెద్దయుంబ్రొద్దు ప్రశంసించి తత్పరిగ్రహకుతూహల[1]హృదయుండయి విశ్వామిత్రుండు వసిష్ఠున కిట్లనియె.

101 తే. దీనికంటెను [1]నొప్పెడివానినొక్క, లక్షమొదవుల[2]నిచ్చెద [3]నక్షయముగ రాజ్యమయిన నిచ్చెద జగత్పూజ్య నాకు, నిమ్ము నీహోమధేనువు నెమ్మి తోడ.

102 చ. అనిన వసిష్ఠుఁ డిట్లనియె నంతధనంబును [1]నట్టిరాజ్యముం గొననగునయ్య [2]యిచ్చెడిపికుట్టికి నీకిదియేల యేను దీ నన పితృదేవతాతిథిజనంబులఁ దృప్తులఁ జేయుచుండుగున్ జనముల దీనిఁ బ్రోచుట[3]య చాలుఁ దపస్వులకేల సంపదల్.

103 వ. దీని నొరుల కీఁగాదన్నిన నలిగి విశ్వామిత్రుండు నేను క్షత్త్రియుండ నిగ్రహానుగ్రహసమర్థుండ నీవుబ్రాహ్మణుండవు [1]శాంతుండ వేమిసేయ నోపుదు దీనికి లక్షమొదవు[2]ల నీఁబోయిన [3]నొల్లవ యిమ్మొదవు

99 1. శంఖనిభ — పీ.న.మ.సూ పెక్కు ప్రతులు. 2 పొదలు — అ. 3. హంస, ఫేన, తార — అని పాఠములు

100 1. పరుండయి, చిత్తుండయి, స్వాంతుండయి — అని పాఠములు.

101 1. నొప్పెడుధేనువులను లక్ష నీకిచ్చిపుచ్చెదనక్షయముగ — భాసం. 2. నీకిత్తు — గ$_1$ చ ద.శ ష. 3 నీ క్షణమున — మ

102 1. నంతరాజ్యముం — పెక్కు ప్రతులు; 2. యిచ్చిఋత — ఔ. 3. యె — వా. కొన్ని ప్రతులు; య - పెక్కు ప్రతులు.

103 1. ప్రశాంతుండవు — పెక్కు ప్రతులు. 2. లంగొనుమని యీ వచ్చిన నొల్లవైతి విమ్మొదవు — గ$_1$ చ.ద.న.భాసం.వీ.శ.ష. 3. నొల్లవయితేని, నొల్లవేని —

నవశ్యంబును బలిమినైనం బరిగ్రహింతునని నందినిం బట్టికొనం బంచినం బలుకక [4]వసిష్ఠుండు చూచుచుండె.

104 ఆ. పసులవలన బాధ వొరయకుండంగ సాధు,జనుల గృహము గాచు జననిభుండు
కరుణ దప్పి [1]తాన హరియించువాఁడగు, నేని సాధులోకమేమి సేయు.

105 వ. ఇట్లు విశ్వామిత్రుండు వసిష్ఠుహోమధేనువుం బట్టికొనం బంచిన నది [1]పట్టీక జనులవలని కశాదండతాడనంబులం బీడింపంబడి యఱచుచు వసిష్ఠునొద్దకు వచ్చి యిట్లనియె.

106 క. నన్నేల యుపేక్షించితి,రిన్నరుల కధర్మపరుల కిచ్చితిరే వి
ద్వ[1]న్నాథ యిదియు ధర్మమె, యన్నను విని పలుకకుండె నమ్ముని యంతన్.

107 వ. తదీయాభిప్రాయంబెఱింగి నందినియుఁ దనవత్సంబుఁ బట్టికొన వచ్చిన జనులకలిగి చిందఱరేఁగి నిదాఘసమయమధ్యందినదినకరమూర్తియుం బోలె దుర్ని[1]రీక్ష్యయయి యంగవిక్షేపంబున నంగారవృష్టిఁ గురియుచు వాలంబున శబరులను శకృన్మూత్రంబుల శకయవన[2]పుండ్రపుళిందద్రవిళ సింహళులను ఫేనంబున [3]దరదబర్బరులను బుట్టించిన.

---

కొన్ని ప్రతులు 4. వసిష్ఠుం డూరకయుండె — ర

104 1. దాని — య.

105 1 పట్టనీక — ఊ.క.జ.ట.డ.న వీ , పట్టియీక — వ.

106 1 న్నుత — కొన్ని ప్రతులు.

107 1. రీక్షయయి — కొన్ని ప్రతులు 2 పుండ్ర — కొన్ని ప్రతులు ; పౌండ్ర — వా. కొన్ని ప్రతులు. 3. ఆంధ్ర బర్బరులను — న ; కిరాత — ర. ఇచ్చట పి.పి యస్. ప్రతిపుట 1105 ఇట్లున్నది మూత్రతశ్చాసృజన్మ్లేచ్ఛాన్ । మూర్ధ్నా చాంధ్రాన్ సృజత్తదా

108 క. నలిరేఁగి [1]కడఁగి తద్బలములు విశ్వామిత్రు సైన్యముల కేనుమడుం
గులు [2]పెరిఁగి మూఁడు యోజనములు [3]వాఱఁగ నెగిచె నొక్క మొగిఁ
బ్రతిబలమున్.

109 వ. అట్టి బ్రహ్మతేజోజనితంబయిన ప్రభావంబుఁ జూచి విశ్వామిత్రుండు [1]విలక్ష
ముఖుండై [2]క్షాత్రబలంబు నిందించి యెల్లబలం[3]బులకు మిక్కిలి తపో
బలంబ యని.

110 చ. [1]పొలుపగు రాజ్యసంప[2]దుపభోగములెల్లఁ దృణంబుగా మదిం
దలఁచి విరక్తుఁడై [3]విడిచి దారుణశైలవనాంతరంబులన్
వెలయఁ దపంబు సేసి గుణవిశ్రుతుఁడై పడసెన్ మహాతపో
బలమున సర్వసంపదలు బ్రహ్మ[4]ఋషిత్వము దివ్యశక్తియున్.

111 వ. ఆవిశ్వామిత్రుం డిక్ష్వాకుకులసంభవుండైన కల్మాషపాదుండను రాజునకు
యాజకత్వం బపేక్షించి తత్పురోహితుండయిన వసిష్ఠుతో బద్ధ[1]వైరుండయి
తదప[2]కారంబు రోయుచున్నంత నొక్కనాఁడు కల్మాషపాదుండు వేఁట
పోయి రమ్యా[3]రణ్యభ్రమణఖిన్నుండయి విశ్రమార్థంబు వసిష్ఠాశ్రమంబు
నకుం జనువాఁడు దనకభిముఖుండయి వచ్చువాని వసిష్ఠుపుత్త్రుం
బుత్త్రశతాగ్రజు నధికతపశ్శక్తియుక్తు శక్తియను మహామునింగని తెరువు
దొలంగుమని రాజాభిమానంబున[4] మెచ్చక పలికిన నమ్మునివరుం డిట్లనియె.

108 1. కలగి, చెలగి — అని పాఠములు కడఁగి - ఐ.ఒ.క.ట భాసం.మ; యార్చి - ఆ ఔ 2. పెరిగి — గి.శ.ష. అరసున్న లేని రూపము. 3. ప(వ)అవఁగ — ఔ.గి.చ.ద.భాసం. మ ల.వీ.శ ష.

109 1. విలక్షపాండురముఖుండై — ఐ.భాసం.వీ; విచలక్షమాబలుండు, విలక్షణ ముఖుండునై — ల. 2 క్షత్రియబలంబు, క్షత్రబలంబు — అని పాఠములు. 3. బులకంటె(ను) — ఋ.ఔ

110 1 పొలుపుగ — యరవ. కొన్ని ప్రతులు. 2. దల — చ.ద.వీ.శ.ష. 3. వెడలి — ఉ. 4. మునిత్వము — పెక్కు ప్రతులు.

111 1. మత్సరుండయి — కొన్ని ప్రతులు. 2. కారద్వారంబు(బ)రోయు — ఆ.ఐ. ఒ.క. ఖజ.డ.మ.ల. 3. రణ్యగిరి (పరి) భ్రమణ — కొన్ని ప్రతులు. 4. మెచ్చక — పెక్కు ప్రతులలో లేదు.

112 ఆ. ఎట్టి[1]రాజులును మహీసురోత్తము లెదురుగు దెంచు నప్పు[2]డధికభక్తి
[3]దెరలి ప్రియము వలికి తెరువిత్తురిట్టిద, దర్మ[5]వీవు దీనిఁ దలఁప వెట్టు.

—: శక్తిమహాముని కల్మాషపాదుని శపియించుట :—

సం. 1_166_7

113 వ ఏను ధర్మపథంబున నున్నవాఁడ నేల తొలంగుదు ననిన నలిగి కల్మాష
పాదుండు దనచేతి[1]కశకోల నమ్మునీంద్రుని వ్రేసిన నవమానితుండయి
కోపారుణితనయనంబుల నతనిం జూచి నీవు [2]రాక్షసభావంబున నకారణంబ
[3]నాకు నికారంబు సేసితి కావున రాక్షసుండవయి మనుష్యపిశితం బశ
నంబుగా నుండుమని శాపం బిచ్చినఁ గల్మాషపాదుం డమ్మహామునివరు
వసిష్ఠతనయుంగా నెఱింగి నాకు [4]శాపవ్యపాయంబు ప్రసాదింప వలయు
నని ప్రార్థించుచున్న యచ్చోటికి విశ్వామిత్రుం[5]డు వచ్చి[6]వారలు దన్నె
ఱుంగకుండ నంతర్హితుండయి కల్మాషపాదు నంతర్గతుండయి యుండ
నొక్కరక్కసుం గింకరు డనువానిం బంచిన వాఁడు విశ్వామిత్రునాదేశం
బునను శక్తిశాపంబునను జేసి కల్మాషపాదు నంతరాత్మ నావేశించి
యున్నంత.

114 తే. రాక్షసావిష్టుఁ డైనప్డు రాజ్య[1]లీల, విడిచి తన్నెఱుంగక తదావేశరహితుఁ
డైన యప్పుడు [2]రాచకార్యంబులందు, బద్ధబుద్ధియై కల్మాషపాదుఁ డుండె.

112 1 వారును — ఉ. 2 డతిముదమున – వ 3. దెరలి — అ.న; దిరిగి —
ఒ, పరత — ఋ; తిరిగి — భాసం.న; నెరఁగి — వా పీ.శ ష. కొన్ని
ప్రతులు. దీనిపై భాకూ. చూడఁదగినది. 4 తోఁప — కొన్ని ప్రతులు.
5 వగుట — ల; వెఱఁగిదీని — చ డ ద న.భాసం పీ శ.ష.

113 1 కశచే — చ.ద.భాసం.పీ శ ష ; నె(శ)లకోల నమ్ముని—కొన్ని ప్రతులు 2. రాక్ష
సాకారంబున — వా.శ. కొన్ని ప్రతులు ; రాక్షసభావంబున — ఖ చ ద వీ.శ ష ;
రాజసాహంకారంబున– ఉ. 3 నాకవమానంబు — పెక్కుప్రతులు. 4. శాపావసా
నంబు, శాపమోక్షంబు — అని పాఠములు. 5. డరిగి — $గ_1$ భాసం.పీ శ.ష పెక్కు
ప్రతులు. 6. వారలు దన్నెఱుంగకుండ — $గ_1$.చ శ.ష. ప్రతులలో లేదు

114 1 లక్ష్మి — బ 2. రాచ — ఉ.ఋ.ఖ.గ౧.చ ద మ శ.ష , రాజ్య — వా
రాజ — అ.ఊ క.జ య.ర.

115 వ. ఆకల్మాషపాదు నొక్కనాఁ డొక్కబ్రాహ్మణుం డధిక [1]క్షుధార్తుండయి వచ్చి సమాంసంబయిన భోజనం బడిగిన నిచ్చి [2]పోయిన వాఁ డంతఃపురంబున నుండి మఱచి యర్ధరాత్రంబునప్పుడు [3]దలంచికొని తనబానసంబు వానిం బిలిచి యేనొక్కబ్రాహ్మణునకుం గుడువనిచ్చి వచ్చి మఱచి [4]యుండితిం దెచ్చెర నవ్విప్రునకు మాంసంబుతోఁ గుడువం బెట్టుమని పంచిన వాఁడు నిండ్రప్పొద్దు మాంసంబు వడయనేర ననిన [5]నప్పుడారాజు రాక్షసాధిష్ఠితుం డగుటం జేసి మనుష్యమాంసంబుతో నయినం [6]గుడువం బెట్టుమనిన సూపకారుండు వధ్యస్థానంబునకుం జని మనుష్యమాంసంబు దెచ్చి యిమ్ముగా వండి పెట్టిన నవ్విప్రుండు తన దివ్యదృష్టిం జూచి దాని మానవమాంసంబుగా నెఱింగి కడు నలిగి.

116 క. ఇవిరి యభోజ్యంబగు మానవమాంసముతోడ భోజనము పెట్టిన వాఁ
డవు [1]నీవు మనుష్యాదుండ వగుమని వాఁ డిచ్చె శాప మన్నరపతికిన్.

117 వ. ఇట్లు బ్రాహ్మణశాపంబునం గల్మాషపాదుండు మానుషభావంబు విడిచి రాక్షసుండై శక్తి యొద్దకు వచ్చి నీకారణంబున నిట్టి [1]శాపవ్యాపారంబు సంభవించె దీనిఫలంబు ముందఱ నీవ యనుభవింపుమని శక్తి నపగతప్రాణుం జేసి విశ్వామిత్రుచేతఁ [2]బ్రచోదితుండయి పదంపడి వసిష్ఠపుత్త్రుల నందఱ వధియించిన.

115 1. క్షుధాతురుండయి — ల; క్షుత్పీడితుండై — ఆ. 2. పోయిన — ఊ ఋ; పోయియంతఃపురంబున — భాసం వి. 3 దలంచి(చు)కొని – అ.ఉ ఒ.ఖ.గ.జ.డ; దలంచిదన – వా. కొన్ని ప్రతులు. 4. యుంటి — చ.ద వి.శ.ష. 5 నప్పుడు రాక్షసా — వా. కొన్ని ప్రతులు; నప్పుడా (డు)రా జురాక్షసా — ఆ.ఈ.ఋ.ఐ. ఒ.ఖ జ.డ.బ 6. గుడువం — పెక్కు ప్రతులలో లేదు.

116 1. నీవు......దవుకమ్మని శాపమిచ్చె నన్నరపతికిన్ — ఆ.ఉ ఊ.ఔ న. ఈ పాఠమున యతి చింత్యము

117 1. పాపవ్యాపారంబు – కొన్ని ప్రతులు ; పాపవ్యవసాయంబు – ఋ.న. 2. బ్రబోధితుండయి — కొన్ని ప్రతులు.

-: పుత్త్రశోకమున వసిష్ఠుఁడు ఆత్మహత్యకుఁ

ప్రయత్నించుట :-

సం. 1—166—40

118 తే. సుతుల రాక్షసనిహతులఁ జూచి పరమ, యోగధరుఁడయ్యుఁ బుత్త్ర వియోగశోక
భరము దాల్చె వసిష్ఠుండపార భూరి, ధరణిభరము [1]నగేంద్రుండు దాల్చునట్లు.

119 చ. అమిత [1]వివృద్ధశోక వివశాత్మకుఁడై మది నాత్మఘాత దో
షమును దలంప కెంతయు[2]విషాదమునన్ బలవద్దవాగ్నిమ
ధ్యము వడిఁ జొచ్చినన్ [3]బృహదుదగ్రశిఖానల మాతఁడంబ యు
ష్ణము చెడి శీతమయ్యె మునినాథు[4]న కుగ్రతపంబు పెంపునన్.

120 ఉ. పంబిన శోకభారమునఁ బ్రాణ[1]విమోక్షముఁ గోరి కంఠదే
శంబున రాయిగట్టికొని సన్మునినాథుఁడు నిశ్చితాత్ముఁడై
యంబుధిఁ జొచ్చినం గడు భయంపడి వార్ధి లసత్తరంగహ
స్తంబుల నెత్తి[2]పట్టె నుచితస్థితిఁదీరముఁ జేర నమ్మునిన్.

121 చ. సుతశతవర్జితాశ్రమము చూడఁగ నోపక మేరుపర్వతో
న్నతపృథుశృంగమెక్కి పడినన్ మునివల్లభు దేహబంధమ
క్షతమయి తూలసంచయనికాశత నొప్పె ననంతసంతత
వ్రత[1]నియమ[2]ప్రభావులగు [3]వారలఁ బొందునె దేహదుఃఖముల్.

18 1. రగేంద్రుండు — పెక్కు ప్రతులు; నాగేంద్రుండు దాల్చునట్లు — ఖ.బ.ర.వ స..

1119 1. తనూజ — స. 2. నసహ్యమునన్ — ల.స. 3. జ్వలదుదగ్ర — న
4. ని యుగ్రతపంబు — వ.

120 1. వియోగము — పెక్కు ప్రతులు. 2. పట్టెనుచితస్థితి దీరము జేరనమ్మునిన్ — పెక్కు ప్రతులు; పెట్టెఁదన సైకతతీరముఁజేర — వా.శ కొన్ని ప్రతులు

121 1. నియమస్థులై నెగడువారల — ప; నియమోపవాసులగువారల — న. 2 ప్రకాశులగు వారల — డ బ.మ. 3. వారికిగల్గునె — ఉ.

122 మధ్యాక్కర. [1]వదలక మరణార్థియగుచు మునినాథవరుఁడు దానొక్క
నది నుదగ్రగ్రాహవతిఁ బ్రవేశించినను ముని సంట
నది యోడి శతవిధంబులఁ బరిద్రుతయయి స్థలంబయిన
నది యాదిగాఁగ శతద్రునామమయ్యె యన్నది యొప్పె.

123 మధ్యాక్కర. [1]ఘనపాశములఁజేసి యెల్లయంగముల్ [2]గలయ బంధించి
కొని యొక్కనదిఁజొచ్చి మునిఁగినను వంతఁగూరి యన్నదియుఁ
దన దివ్యశక్తి నప్పాశముల విడిచి తన్మునినాథుఁ
[3]బనుగొనఁ దీరంబుచేరఁబెట్టి విపాశనాఁ బరగె.

124 వ. ఇట్లు పెక్కు విధంబుల [1]నాత్మ పరిత్యాగంబునందుఁ గృతనిశ్చయుం డయ్యును నప్రాప్తమరణుండయి వసిష్ఠుండు నిజాశ్రమంబునకు వచ్చువాఁడు దన పిఱుంద వచ్చుకోడలి నదృశ్యంతి యనుదాని శక్తిభార్య నప్పుడెఱింగి దాని యుదరంబుననుండి షడంగాలంకృతవేదధ్వని గరంబు మధురంబై వీతెంచిన విని విస్మితుండయి,

125 తే. శక్తిచదువునుబోలెసువ్యక్తమగుచు,వీనులకు నిది యమృతోపమానమయ్యె
వేదనాదంబు దీనిపుణ్యోదరమున,నున్న వాఁడు [1]సుతుండు విద్వన్నుతుండు.

126 వ. అనవరతవేదాధ్యయనశీలుం డయినశక్తి చదువు వినుచుం బంద్రెండేఁడులు గర్భంబు[1]నుఁడి సకలవేదంబులు ధరియించినవాఁ డీ[2]పౌత్రుముఖంబు చూచి యేను గృతార్థుండ నగుదునని వసిష్ఠుండు మరణవ్యవసాయ నివృత్తుండై నిజాశ్రమంబున నుండునంత నొక్కనాఁడు రాక్షసరూప

122 1. వదలకను మరణార్థియయి మునినాథ – ల.

123 1. ఘనపాశములను సర్వాంగములు దానగదియ బంధించి – స. 2. గదియ – కొన్ని ప్రతులు. 3. బనిగొనితీరంబు — ఉ.ఐ.గ$_1$.య.ర.ల.

124 1. శరీర పరిత్యాగంబు — చ.ద.వా.వీ.శ.ష.శ, నాత్మపరిత్యాగంబు — పెక్కు ప్రతులు.

125 1. పుత్రుండు – పెక్కు ప్రతులు.

126 1. బుననయుండి — ఏ.ట. 2. పౌత్రుముఖంబు — ల కొన్ని ప్రతులు.

ధరుండై రౌద్రాకారంబున [3]వచ్చు కల్మాషపాదుంజూచి యదృశ్యంతి
వెఱచిన దాని నోడకుండుమని మునివరుండు [4]హుంకారంబున రాక్షసు
వారిం[5]చి వానిపయి మంత్రపూతంబులైన కమండలుజలంబు[6]లొలికిన.

### -: వసిష్ఠువలనఁ గల్మాషపాదుండు శాపవిముక్తిఁ జెందుట :-

సం. 1-168-5

127 క. భూ[1]పాలకుండు బ్రాహ్మణ,శాపంబున బడియు రెండు సంవత్సరముల్
పాపమతినుండి రాక్షస, రూపము చెడి యప్పుడు మనుజరూపముఁ దాల్చెన్.

128 వ. ఇట్లు శాపవిముక్తుండై కల్మాషపాదుండు వసిష్ఠునకు నమస్కరించి ముకుళితకరకమలుండై మునీంద్రా నీప్రసాదంబున [1]శాపంబువలనం బాసి కృతార్థుండ నయితి ననిన వానికి వసిష్ఠుం డిట్లనియె.

129 చ. గుణములనొప్పి బ్రాహ్మణులకుం గడు భక్తుఁడవై సమస్తధా
రుణిప్రజ [1]గూర్చఁగా విగతరోషుఁడవై సుఖముండుమింక బ్రా
హ్మణుల కవజ్ఞ[2]సేయక [3]శమంబును చేకొను మింద్రుఁడైన బ్రా
హ్మణుల కవజ్ఞసేసి యవమానముఁబొందుఁ బ్రతాపహీనుఁడై.

3. కదియు — ఐ. 4. హుంకారమాత్రంబున — బ. 5. చినవాఁడు నతిక్రమానుగమనంబు సేయనోడియంత నిలిచినవానిపై — ఋ. 6. లు చిలికిన — పెక్కు ప్రతులు; లు జల్లిన — కొన్ని ప్రతులు.

127 1. పాలకుండు — ఉ.వ; పాలుఁడును — భాసం పీ; పోత్తముండు — కొన్ని ప్రతులు; పాథముండు — వా.శ. కొన్ని ప్రతులు.

128 1. శాపమువాసి — శ.ప. కొన్ని ప్రతులు.

129 1. బ్రోచుచున్ — చ ద పి శ.ప; కొప్పుగా; గొల్వఁగా — స, మెచ్చగా — మ. 2. సేయకు — స. 3 సమత్వము — కొన్ని ప్రతులు; శమంబును జేకొను — గ్రి$_1$·చ.ద పి.శ ష; శమత్వము — వా. కొన్ని ప్రతులు.

130 వ. అని కఱపిన నట్లచేయుదునని యమ్మహీపతి వసిష్ఠుం దోడ్కొని యయోధ్యా పురంబున కరిగి సకలప్రజానురాగకరుండయి యమ్మునివరు నతిభక్తిం బూజించుచుఁ దొల్లి రాక్షసుండయి మదయంతీ[1]సహితంబు వనంబునం [2]గ్రుమ్మరియెడికాలంబొక్క బ్రాహ్మణమిథునంబు ఋతుకాల ప్రవృత్తి నున్నంగని యాఁకటి [3]పెలుచన నందు బ్రాహ్మణుం బట్టికొని భక్షించిన నతిదుఃఖితయై యాబ్రాహ్మణభార్య పరమపతివ్రత [4]యాంగిరసి యనునది పురుషవియో[5]గంబునం బుత్త్రార్థంబయిన నిజప్రయత్నంబు విఫలంబగుటకు శోకించి వనితాసంభోగంబున నీవును నాపురుషునట్ల పంచత్వంబునుం బొందుమని [6]శాపంబిచ్చి వసిష్ఠువలన నీకుఁ బుత్త్రలాభం బగునని చెప్పి యగ్నిప్రవేశంబు సేసినం బదంపడి దీనినంతయు మదయంతివలన నెఱింగినవాఁడై తనకుఁ బుత్త్రోత్పాదనసామర్థ్యంబులేమిం దలంచి కల్మాషపాదుండు పుత్త్రార్థియయి వసిష్ఠున కిట్లనియె.

*—: వసిష్ఠ ప్రసాదంబునఁ గల్మాషపాదుఁడు పుత్త్రవంతుఁడగుట :—*

సం. 1—168—11

131 క. మనుకులపవిత్రుఁ బుత్త్రకు, నినసన్నిభు నాకుఁబడయు [1]మేనట్లయినన్
మునినాథ నీప్రసాదనం, బునఁ బితరులవలన ఋణవిముక్తుఁడ నగుదున్.

130 మూలమునందు బ్రాహ్మణీశాప వృత్తాంతమిక్కడ చెప్పఁబడలేదు మఱియొక యధ్యాయమున ప్రత్యేకముగాఁ జెప్పఁబడినది భండార్కరు పుట. 709. పి.పి.ఎస్. ప్రతి 1133. 1 సమేతుండయి – చ.ట.డ.ద వీ శ.ష; సమేతంబు – కొన్ని ప్రతులు. 2 గ్రుమ్మరుకాలంబున నొక్క – కొన్ని ప్రతులు. 3. పెలుచననందు – పెక్కు ప్రతులు; పెల్లున – వా. కొన్ని ప్రతులు 4. యాంగిరస – కొన్ని ప్రతులు. 5. గంబు సహింపక – మ 6 శాపంబిచ్చి మరియు మదయంతి ప్రార్థనం జేసి – అ.బు ; శాపంబిచ్చి మరి కరుణించి – కొన్ని ప్రతులు.

131 1. మీ యట్లయినన్ — న.

132 వ. అని తన భార్యయైన మదయంతి యనుదానిని ఋతుమతి సమర్పించిన నదియు వసిష్ఠుప్రసాదంబున గర్భిణియయి పండ్రెండేఁడులు గర్భంబుమోచి వేసరి యొక్క యశ్మశకలంబున నుదరభేదనంబుఁ జేసిన నశ్మకుండను రాజర్షి పుట్టె నట యదృశ్యంతికిం బరాశరుం డుదయించి వసిష్ఠనిర్మిత జాతకర్మాది కుండయి పెరుఁగుచు నొక్కనాఁడు రాక్షసభక్షణంబునం దనజనకు పంచత్వంబు దల్లివలన విని [1]కోపదహనదందహ్యమానహృదయుండయి తపోమహత్త్వంబున నఖిలలోకసంహారంబు సేయుమనసి యున్న మనుమని వారించి వసిష్ఠుం డిట్లనియె.

133 సీ. వినవయ్య కృతవీర్యుఁడనుజనపతి దొల్లి భృగువంశయాజ్యుఁడై పెక్కు క్రతువు
లొనరించి యగణిత ధన[1]దానముల వారిఁ దృప్తులఁగా వించి దివికిఁ జనిన
నతని [2]వంశమునవా రతిధనలుబ్ధులై కృతవీర్యు[3]ధన మెల్లఁ[4]గ్రస్తిసేసి
కొని డాఁచియున్నవారని భార్గవులనెల్లఁ బలికిన భార్గవుల్ భయమువొంది

తే. కొంత యర్థము వారి[5]కఁ గూర్చియిచ్చి, రవని[6]సుర[7]వంశ్యులకు నిచ్చిరందుఁ గొంద
ఱెవ్వరికి నీక తమతమయిండ్లఁ బాఁతి, కొని సుఖంబుండి రధముతై కొంద ఱందు.

132 1. కోపశోక — కొన్ని ప్రతులు.

133 1. ధాన్యముల – అ ఖ.ప.మ.వ. 2. వంశంబు వారతి – ఐ.ప. 3. నర్థంబు గిలుబుసేసి – గ్[1].చ ద వీ శ.ష.శర. క సం.సూ భాసం. 4 గుప్తిసేసి — న.య.సూ. (ఇచ్చట యతి గమనింపఁదగినది.) గృత్తుజేసి — పెక్కు ప్రతులు ; గృత్తివేసి — పెక్కు ప్రతులు ; గృత్తిసేసి – కొన్ని ప్రతులు. 5. కి గూడియిచ్చిరి — ఉ.ప. చ ద శ.ష; కకూ(గూ)డని యిచ్చిరి — అ.ఎ.జ.భాసం ; న కూడియిచ్చిరి — కొన్ని ప్రతులు. 6. సురులకు నిచ్చిరి యందుకొంద – బ.బా.మ. 7. వర్యులకు — ఉ.ఎ.ఐ.

134 వ. అంత నాక్షత్త్రియు లొక్కభార్గవునియిల్లు[1] గ్రొచ్చి యనంతం బయిన యర్థం బుంగని యలిగి రాజ[2]ధనవంచకులై రని భార్గవులనెల్ల నిగ్రహించి గర్భంబుల నున్న యర్భకులు మొదలుగా వధియించిన వెఱచి భార్గవుల భార్యలెల్ల హిమవంతంబునకుం బాఱిన సందొక్క[3]భృగుపత్ని భయంపడి తన యూరు దేశంబున గర్భంబు ధరియించిన నెఱింగి క్షత్త్రియులు దాని భేదింప సమకట్టి వచ్చిన నంతకుముందఱ.

—: *భార్గవుండయిన ఔర్వునిజననము* :—

సం. 1-169-20

135 క. భువనోపప్లవ సమయో,ద్భవభానునిభప్రభావిభాసితుఁడయి భా
[1]ర్గవుఁ డూరుదేశమున[2]ను,ద్భవించె మహి వెలుఁగుచుండఁ[3]బ్రథనౌర్వుఁ డనన్

136 మ. [1]అమితౌజుండగు వానిఁ జూచి కృతవీర్యామ్నాయజక్షత్త్రియా
ధము లెల్లన్ హతదృష్టులై కృపణతం దత్పర్వతారణ్యదే
శములం గ్రుమ్మరుచుండి రంధులయి [2]నిశ్శంకం బతిక్రూరక
ర్మములం దుద్యతులైనవారికి [3]నశర్మప్రాప్తి గాకుండునే.

137 వ. అట్లా క్షత్త్రియులంద[1]ఱు నంధులై భృగుపత్నియొద్దకువచ్చి మాకు దృష్టిదానంబుఁ బ్రసాదింపవలయు నని వేఁడిన నది వారల కిట్లనియె.

134 1. సొచ్చి - ఊ.గ.య, జొచ్చి - కొన్ని ప్రతులు; త్రవ్వించి - ఉ. 2 ధనాపహారులై తిరని - కొన్ని ప్రతులు. 3 భార్గవ(వు)పత్ని — అ.గ.చ.ట.ద.వీ.శ.ప.

135 1. ర్గవియూరుదేశమున - భాసం. 2 నుద్భవిల్లి మహి వెలుగుచుండె - కొన్ని ప్రతులు. 3. ప్రథనౌర్వుఁడనన్ - అ.ఈ.క.డ. కొన్ని ప్రతులు ; ప్రభుఁడౌర్వుఁ డనన్ — భాసం.వా.శ. కొన్ని ప్రతులు.

136 1. అమితోద్భాసితతేజు - అ.ఈ.ఊ ఎ.ప.గ.వ.మ.వ.వీ ; అమితోగ్రుండగువాని జూచి - ఐ.డి.క.ఖ.గి.చ.జ.ద.బ భాసం.ల.శ.ష. 2. యగ్రశాంతం బతిక్రూర - భాసం. (పాదసూచి) నిశ్శంకనఁబతిక్రూర - శ.మ. మున్నగు ప్రతులు; నిశ్శంకన్నతిక్రూర - ఆ ఈ. 3. వధర్మప్రాప్తి - పెక్కు ప్రతులు.

137 1. ఱుభృగు - వా. కొన్ని ప్రతులు ; రునంధులై భృగు — పెక్కు ప్రతులు.

138 మధ్యాక్కర. ఏను మీదృష్టులు గొన్న దానఁగా నిక్కుమారుండు
భానుతేజుండు మీచేఁ దనగురులు పరిభూతు లయిన
దానికి నలిగి మీ[1]పాపబుద్ధికిఁ [2]దగనిట్లుసేసె
వీని మీ రెఱుఁగరె భార్గవకులము వెలిఁగించువాని.

139 వ. ఇక్కుమారుండు నూఱుసంవత్సరములు నా[1]యూరుగర్భంబున నుండి సకలవేదవేదాంగంబులు నేర్చినవాఁడు మహాతపోనిధి మీకుం గరుణించు నితనిం బ్రార్థింపుఁడనిన నాక్షత్త్రియులు నతిభక్తులై యౌర్వుంబ్రార్థించి తత్ప్రసాదంబున దృష్టులు వడసి చనిరంత నౌర్వుండు దనపితృ బంధు జనులెల్ల నొక్కటం బరలోకగతులగుటకు దుఃఖించి సకలలోక ప్రళ యార్థంబుగా ఘోరతపంబు సేయందొడంగిన.

140 చ. అతనితపంబు [1]పెంపునఁ జరాచరసంభృతమైన విష్టప
త్రితయము ఖేదిఁబొందిన ధృతిం బితృలోకనివాసులైన త
త్పితృపరు[2]లెల్ల వచ్చికడుఁబ్రీతి నపాకృతగర్వు నౌర్వు న
ప్రతిమతపోవిభాసిఁగని పల్కిరి తద్దయుశాంతచిత్తులై.

*—: పితృదేవత లౌర్వుని శాంతచిత్తునిఁ జేయుట :—*

సం. 1—170—14

141 వ. అయ్యా నీతపోమహత్త్వంబుఁ జూచిలోకంబులెల్ల భయంపడియెడు [1]లోకానుగ్రహంబుగా నీరోషం[2]బు విడువుము మేమసమర్థులమై క్షత్త్రి యులచేత వధియింపంబడిన వారముగాము ధనలుబ్ధులమయి ధనంబు దాఁచినవారము గాము ధనము వలసినం గుబేరుండు దాన మాకుఁ దెచ్చి యిచ్చుం దపోమహత్త్వంబున మాకు నాయువు గడుంబెద్దయైన నిర్వే దించి మనుష్యలోకంబున నుండనొల్లక యాత్మఘాతంబునం బుణ్యలోకం బులు లేమింజేసి దానిం బరిహరించి యాక్షత్త్రియులతో వైరం బమర్చి

138 1. కొరవబుద్ధికి – వ. 2. తగినట్టుజేసె – బ.

139 1. యూరుదేశ గర్భంబున – ల.

140 1. పేర్మిన – ఏ. 2. లేగుదెంచి – న.

141 1. లోకనిగ్రహాకారణంబైన – అ. 2. బుడుగుము – మ.ల కొన్ని ప్రతులు.

కొని తన్నిమిత్తంబున దేహంబులు విడిచితిమి భార్గవుల తేజంబు నొరులు
పరి[3]భవింప నోపుదురె కావున నీవు దీనికింగా సర్వజనోపద్రవంబు సేయ
వలవ దిది [4]మాకభీష్టంబనిన నౌర్వుండు వారల కిట్లనియె.

142 మత్తకోకిలము. మానితంబగు [1]నాతపోమహిమం ద్రిలోకపరాభవం
బేను జేయఁగఁ బూని చేసితి నిట్టిదొక్క ప్రతిజ్ఞమున్
దీని నెట్టులు గ్రమ్మఱింతు మదీయ భాషిత [2]మెన్నఁడు
న్నేని మోఘముగాదు దిగ్ధరణీరపీందు లెఱుంగఁగన్.

143 క. మతిమఱచి యని స్త్రీర్ణ ప్రతిజ్ఞుఁడగు వానికోపపటుదహన మని
ర్గతమయి వడి నరణి సముత్థిత [1]దహనమపోలె నాత్మదేహము నేర్చున్.

144 క. అలయక నిమిత్తజంబగు, నలుకను క్షమియించి శాంతుఁడగుపురుషుం డి
మ్ముల రక్షింపఁగనోపునె, పొలుపుగ ధర్మార్థకామములు [1]సమములుగన్.

145 తే. పాపులై క్షత్త్రియాధముల్ భార్గవులకు, నట్లు హింస గావించు నాఁడా ర్త
[1]నాద
మూరుగర్భగతుండనై యుండి వినిన, నాఁడ కోప మసహ్యమై నన్నుఁబొందె.

146 తే. ఎఱుకగలఁ[1]డేని మఱిశక్తుఁ[2]డేని [3]యన్యు, లన్యులకు[4]హింసగావించు నపుడు
దానిఁ
బూని వారింపకున్న నప్పురుషుఁడేఁగు, హింస[5]చేసిన[6]వారల యేగుగతికి.

3. హరింపనోపుదురె -- పెక్కు ప్రతులు 4. మాకు నిష్టం బనిన - పెక్కు ప్రతులు

142 1. మత్తపోమహిమం — మ. 2. మెన్నడొ నేని మోఘముగాదు — గ్రి.శ ప.
ఎన్నడున్ + నేని. అని భాసం. భారత కూలంకషము కూడ ఈ పదచ్ఛేదము నే
సమర్థించుచున్నది.

143 1. వహ్నియ(యు) - ఖ.ప.మ వ.

144 1. సమబుద్ధిన్ — వ; సరిగాగన్ - న.

145 1. రవమునూరు - ప.మ ల.

146 1 దేనిమరి - అ.ఈ.క ఖ.చ.ల.శ 2 డేని నన్యులన్యులకు — ఆ.ఈ.గ్రి. ప్రౌ.మ.
శ ష.స. 3. క్రూరు లన్యులకు - భాసం.ల వీ.స 4. నెగ్గు గావించు నట్టియెడల - న.
5. చేసినయట్టివాఁడేగుగతికి — ల. 6. కుజనులు యేగుగతికి - ఖ

147 వ. కావున లోకంబులయందు సామర్థ్యంబుగలిగి పాప[1]ప్రతిషేధంబు సేయని వారల నుద్దేశించి యలిగితి నేనును మీవచనం బతిక్రమింపనోడుదు నఖిల లోకదహనోద్యతంబయిన నాకోపదహనంబు నిగృహీతంబయిన నన్ను దహించు నేమిసేయువాఁడ మీరు [2]సర్వలోకహితులరు నాకును లోకంబులకును హితంబగునట్లుగా నుపదేశింపుఁ డనిన నౌర్వునకుం బితరు లిట్లనిరి.

148 ఆ. జలములం[1]దయుండు సర్వ[2]లోకంబులు, గాన నీమహోగ్రకలుషవహ్ని
జలధిలోన విడిచి [3]సత్యప్రతిజ్ఞుండ, వగుము జలధిజలము[4]నదిదహించు.

149 వ. అనిన నౌర్వుండు పితృదేవ[1]తాదేశంబునఁ దనకోపానలంబు సముద్రంబులో వైచిన నది యౌర్వానలంబు నానశ్వముఖంబున నబ్ధిజలంబుల ద్రావుచుండునిది వేదంబులయందు వినంబడియెడు కథగావున నీవును నౌర్వునట్ల ధర్మవిదుండవు భువనపరిభావివయి యీక్రోధంబు విడువుమనిన వసిష్ఠు వచనంబునం బరాశరుండు గోపం బుపసంహరించి రాక్షసవినాశార్థంబుగా సత్త్రయాగంబు సేయం గడంగిన

*-: పరాశరుఁడు రాక్షసవినాశార్థంబు సత్త్రయాగంబు సేయుట :-*

సం. 1-172-2

150 తే. శక్తి రాక్షసనిహతుఁడై చనినశోక, దహనహతుఁడై వసిష్ఠుండు దానిఁ దలఁచి
కడుఁబ్రశాంతాత్ముఁడయ్యు రాక్షసవినాశ, [1]మొలసి మనుమని వారింపకుండెనంత.

147 1. ప్రభేదనంబు — ల. 2. సత్వహితులరు — బ.

148 1. దునుండు — గి.చ.ద.వీ.శ.ష. 2. సత్వంబులు — ర.స. 3. శాంత ప్రతిజ్ఞుండ — ప. 4. లదిదహించు — మ.ర.ల. పెక్కు ప్రతులు ; నదివహించు — స.

149 1 తోపదేశంబున — మ

150 1. మొనసి, మొనర — కొన్ని ప్రతులు.

151 క. ఘోరాకారులు కృతహో,మోదవులు సబాలవృద్ధులయి పడిరి దురా
చారులు రాక్షసులు ముని,ప్రారబ్ధాధ్వర [1]సమిద్ధపావకశిఖలన్.

152 వ. ఇట్లు పరాశరుండు గావించు సత్త్రియాగంబున నైన రాక్షసకులప్రళ
యంబు జూచి పులస్త్యపులహాక్రతువులు మహామునిసంఘంబులతో
వసిష్ఠాశ్రమంబునకువచ్చి.

153 క. అగ్నిహతిఁ జేసి మానవ,భుగ్నివహము మరణ[1]బాధఁ బొందించుచు మూఁ
డగ్నుల [2]యొద్దను [3]నాలవ,యగ్నియనన్ వెలుఁగుచున్న యమ్ముని
నాథున్.

154 క. పరమతపోనిలయు దినే,శ్వర[1]దీప్తిసహస్రతేజు శాక్తేయుఁ బరా
శరుఁగని యందఱుఁ బ్రార్థిం,చిరి రాక్షసమారణంబు సేయ[2]కుమనుచున్.

155 వ పరాశరుండును బులస్త్యాది మహాముని[1]ప్రార్థితుండై రాక్షస సత్త్రి
యాగం బుపసంహరించి తన్నియోగంబున నయ్యగ్ని హిమవదుత్తర
పార్శ్వంబున నైచిన నదియును [2]బర్వంబుల నందు వృక్షలతాగుల్మశిలా
భక్షణంబు సేయుచుండెనని యిట్లు గంధర్వుండు తాపత్యవసిష్ఠార్వో
పాఖ్యానంబు చెప్పిన విని యర్జునుండు వానికిట్లనియె.

156 ఉ. మాకుఁ బతిప్రియుండవు సమస్తవిదుండవు చెప్పుమయ్య యీ
లోకములోని వర్తనములుం దగువారి నెఱుంగుదెవ్వ[1]నిం
బ్రాకటధర్మతత్త్వవిదు బ్రాహ్మణముఖ్యుఁ బురోహితుండుగాఁ
జేకొనువార మట్టి బుధసేవితుఁగానఁగ [2]మాకు నెందగుఁ.

151 1 సమృద్ధ — ఏ.ఖ.గి$_1$ చ ప.బ.శ ష.

153 1. భయము — వ.ల. 2. సన్నిధి — బు. 3 నాలగు — వ.

154 1. తీవ్రసహస్రతేజు — గి$_1$.చ.ద శ.ప ; దీప్త — ఆ.బు.ఎ.ఏ ఔ గ.జ.ట.బ.
భాసం.య.ర.పి. 2. కయుండన్ — పెక్కు ప్రతులు.

155 1. ప్రార్థనం జేసి—ఆ.ఔ. 2 పర్వతంబులందు అని 'శ ష' మున్నగు పెక్కు ప్రతు
లందు గలదు. కాని మూలమునందిట్లున్నది. సత్రాత్తాద్యాపి రక్షాంసి, వృక్షా నశ్మన
ఏవచ. భక్షయ న్దృశ్యతేవహ్నిః సదాపర్వణిపర్వణి పి.పి.ఎస్. ప్రతి పుట 1133.
భం. పుట 708.

156 1. రిం — పెక్కు ప్రతులు. 2. మాకు నీదగున్ — ప.స ; నెందుమాకగున్ — ఏ.

157 వ. అనిన గంధర్వుండు పెద్దయుం బ్రొద్దు విచారించి యిచ్చోటికిం [1]గుఱుంగట [2]నుత్కచంబను పుణ్యతీర్థంబునం దపంబు సేయుచున్న వాని ధౌమ్యుండను బ్రాహ్మణునిఁ బురోహితుఁగాఁ బ్రార్థింపుం డమ్మహాత్ముండు మీకుఁ బురోహితుండైన సర్వార్థసిద్ధియగు ననిన సంతసిల్లి వానికి నాగ్నే యాస్త్రంబు విధ్యుక్తంబుగా నిచ్చి మాకు నీ యిచ్చిన హయంబుల [3]నీయంద సంగ్రహించి యుండుము [4]ప్రయోజనంబుగలనాఁడు గొని పోయెదమని గంధర్వు వీడ్కొని పాండవులు భాగీరథి నుత్తరించి యుత్కచంబను పుణ్యతీర్థంబున కరిగి యందు.

*-: పాండవులు ధౌమ్యునిఁ బురోహితుఁగా వరియించుట :-*

సం. 1-174-6

158 ఉ. వీతసమస్తదోషుఁ[1]డయి వేడ్కఁ దపం బొనరించుచున్న వి
ఖ్యాతుఁ బురోహితప్రవరుఁగా వరియించిరి [2]భక్తితో జగ
త్ప్రూతచరిత్రు సాధుజనపూజితు ధార్మికు ధౌమ్యు దేవల
భ్రాతృవరున్ మహాత్ము [3]హితభాషణు [4]భూసురవంశభూషణున్.

159 వ. ధౌమ్యుండును వారి నతిప్రీతిం బూజించి పురోహితత్వంబుం [1]బరిగ్రహించె నట్లు [2]తేజోరూప [3]బుద్ధివిభవంబుల [4]బృహస్పతి సదృశుండై వేదవేదాంగ విదుండైన ధౌమ్యుం బురోహితుంగాఁ బడసి [5]పాండునందను లశేషమహీ రాజ్యంబు వడసినంతియ సంతసిల్లి తత్కృతస్వస్త్యయను లయి జననీ సహి తంబు దక్షిణపాంచాలంబున కరుగువారు ముంద[6]ఱ ద్రుపదుపురంబునకుఁ బోయెడు బ్రాహ్మణులంగని మీ రెందులకుం బోయెదరని యడిగిన వారిట్లనిరి.

157 1. కుఱుంగట — ఉ.ఒ.బ 2 ఉత్కోచ — మూలము. శ. 3. నీయంద యుండనిమ్ము - ఊ.ఎ.ప.న.మ 4. మాకుం బనిగల యప్పుడు — వ.

158 1. కడు — ఋ 2. వేడ్కతో — ఖ. 3. మితభాషణు — గ1.చ.ద.శ.ష. 4 భూసురమానభూషణున్ — అ.

159 1. ప్రతిగ్రహించె — పెక్కు వ్రాఁతప్రతులు. 2 తేజోరూప — పెక్కు ప్రతులు; తేజోవచోరూప-వా. 3. బుద్ధి-ఋ ఓ.క ట.లలో లేదు 4. సదృశుండై నధౌమ్యు- పెక్కు ప్రతులు 5. పాండవు లశేష — ఖ.ట.డ.బ. 6. ట - కొన్ని ప్రతులు.

160 సీ. యజ్ఞసేనప్రభు యజ్ఞమహావేదిఁ గవచశరాసనఖడ్గబాణ
రథయుక్తుఁడై మహారథుఁడు ధృష్టద్యుమ్నుఁడన నుదయించిన నతని తోడ
నొక్కటఁ [1]బుట్టిన యక్కన్యకను కృష్ణ నసితోత్పలశ్యామలామలాంగి
మెఱపునుంబోలెను వఱలునుత్పలగంధి బంధుర[2]తను సౌరభంబు గలుగు
ఆ. దాని ద్రుపదరాజతనయఁ దదీయస్వయంవరోత్సవంబునపుడు చూడఁ
గనిన వారు దృష్టి గనిన ఫలంబెల్లఁ, గనిన వారు పరమకౌతుకమున.

161 వ. అట్టి మహోత్సవంబు చూడ ద్రుపదుపురంబునకుం బోయెద మందులకు [1]నుత్సవదర్శనోత్సుకులై దర్శనీయులుం దరుణులును నపారభూరిదక్షిణ యజ్ఞకరులును ననేకశస్త్రాస్త్రవిదులును నయిన నానాదేశాధిపతులు నింతకుఁ జనుదెంతు[2]రనంతధనంబును బ్రాహ్మణులకు వారిత్తు రట్టె మీరునుం వారింజూడ వచ్చెదరేని [3]యొక్కటఁ[4]బోదము రండు.

162 క. [1]మీయం దీకృష్ణు[2]నుదం, సాయతభుజుఁ జూచి తానహర్షముతోడం
దోయజముఖి వరియించును, మాయెఱిఁగిన [3]కార్యమిది సమంజసబుద్ధిన్.

163 వ. అని మాటలాడుచు వచ్చు బ్రాహ్మణులతోడఁ బాండవు[1]లు ద్రుపదుపురంబున కరుగువారెదుర.

160 1. బుట్టిన యక్కృష్ణయనుకన్య — స. కొన్ని ప్రతులు; గృష్ణనానుదయించె నక్కన్య — స. కొన్నిప్రతులు; బుట్టెను నొకకన్య కృష్ణనా — కసం చ.ద.వీ శ ష. శర; వీనిలో గొన్నిట ప్రాసయతి నియమము తప్పినది. 2. తను — కొన్ని ప్రతులు; తమ - కొన్ని ప్రతులు.

161 1. దదుత్సవ — జ.ల 2. రనంతంబులైన ధనంబులు — కొన్ని ప్రతులు. 3. నొక్కిటఁ — గి$_1$.ఛాసం.వీ.శ ష. కొన్ని ప్రతులు. 4. గూడి పోదండు రండు — బౌ.

162 1 మీయందుఁ గృష్ణవర్ణుమ, హాయతభుజుఁ జూచితాన హర్షముతోన, త్తోయజ ముఖి - ల. 2. నుదాత్తాయతభుజు — కొన్ని ప్రతులు. 3. మార్గమిది — కొన్ని ప్రతులు.

163 1. బు బ్రాహ్మణ రూపధారులై — పెక్కు ప్రతులు.

164 క. కృష్ణమృగాజినధరుఁ దరుణోష్ణద్యుతితేజుఁ బంకజోద్భవసదృశుం
గృష్ణద్వైపాయను గత, తృష్ణామయుఁ గాంచి రరుగుదెంచు మహాత్మున్

165 వ. కని వినయమ్మున నమ్మునీంద్రునకు నందఱు నమస్కరించి కృతాంజలులై యున్న వారికి హృదయానందంబుగా సత్యవతీనందనుం డాగామిశుభంబుల[1]వేదించి చనినఁ బాండవులును గతిపయదినంబులకు ద్రుపదుపురంబు నొచ్చి నాలుగుసముద్రంబులుంబోలె ఘూర్ణిల్లి మ్రోయుచుం బురంబు నాలుగుదిక్కుల విడిసియున్న నానాదేశాగత మహీనాథుల బహువిధ స్కంధావారంబులఁ జూచుచుం జని యొక్క కుంభకారగృహంబున విడిసి తమ్మెవ్వరు నెఱుంగకుండ బ్రాహ్మణ[2]వృత్తి నుండునంతఁ బాంచాల పతి పార్థునకుఁ గూఁతు నీసమకట్టి పాండవుల నన్వేషించి యెందునుం గానక.

-: ద్రౌపదీస్వయంవరము :-

సం. 1-176-11

166 సీ. వైహాయసంబైన వర[1]మత్స్యయంత్రంబు నీవిల్లు మోపెట్టి యెవ్వఁడేను
శరములనేసి నఱ్ఱమనుచు నతఁడ నాతఁయకు పరుఁడగు ధర్మయుక్తి
ననిచాట బంచిన [2]నాఘోషణము విని నుర్వీశులెల్ల నొండొరులఁగడవఁ
గడు[3]వేడ్కఁదొడిపూసికట్టివిభూతితోఁ దమతమచిహ్నముల్ దనరియెఱుక

ఆ. పడఁగ వేఱువేఱ పన్నిభూతలము గ్రక్కదల సైన్యపాదఘట్టనమునఁ
బొలుచు ద్రుపదరాజ పుత్రీస్వయంవర,రంగమునకుఁ జనిరి రమణ[4]తోడ.

167 వ. అదియును బురంబు పూర్వోత్తరదిగ్భాగంబునం జందనోదకసంసిక్తసమీ కృతస్థలంబయి యగాధోన్నత పరిఖాప్రాకారంబులను విశాలద్వారతోర ణంబులను గైలాసశైలవిలాసాపహాసిభాసురగగనతలోల్లేఖిశిఖరరమ్య హర్మ్య[1]తలంబులను బహుప్రకారంబులైన [2]సానువులనుం జేసి యొప్పు

165 1 దేశించి — పెక్కు ప్రతులు. 2. వేషంబుననుండునంత — కొన్ని ప్రతులు.

166 1. యంత్రమత్స్యంబు — పెక్కు ప్రతులు 2. నగ్గోసనము — ఊ ఎ.ట.స; నఘ్ఘోషణము — స, నఘ్ఘోషణము — ఒ.ల. 3. వేడ్కతోఁ బూసికట్టి — కొన్ని ప్రతులు 4. నొప్పి — పెక్కు ప్రతులు; మెరసి — న.

167 1. రేఖలను—కొన్నిప్రతులు ; కనకరేఖలను—కొన్నిప్రతులు. 2. సానువులమం

చున్న నందు యథాస్థానంబుల నానాదేశాధిపతుల నుండంబంచి ద్రుప
దుండు వారలనెల్లం బూజించెఁ బరమబ్రహ్మణ్యు[3]లగు బ్రాహ్మణుల
తోడం గలసియున్న పాండవులును బ్రాహ్మణసమూహంబులో నుండి
పాంచాలరాజు సమృద్ధినిం జూచి సంతసిల్లి గంత.

168 సీ. ధవళవిభూషణ దామానులేపనామలినాంగి సితపుష్పమాలచేతఁ
గొని పుష్పసాయకుకును మేతరంబైన యాఱ[1]గుసాయకం బనఁగ జనులు
ధవళాక్షి రంగ[2]మధ్యంబునఁ దనుమధ్య దానొప్పి పాంచాల తనయయున్న
భూసురప్రవరుల స్వాహాఘోషంబు విలసిల్లె నాశీర్వ్వృద్ధి[3]తోడ

ఆ. ద్రుపదపతి పురోహితుండును గృతపరిస్తరణుఁడై ప్రయోగదక్షుఁడగ్ని
ముఖముచేసి వేల్వ మొనసి వివాహోప, కరణవస్తుచయము గాచియుండె.

169 వ. అట్టి యవసరంబున [1]భోరనమ్రోయు జనులయులివును వాదిత్రనాదంబును
వారించి ధృష్టద్యుమ్నుండు మూఁగిన రాజలోకంబు నెల్లంజూచి యగ్ని
సమీపంబున గంధ[2]పుష్పధూపదీపార్చితంబైన విల్లును నమ్ములను వైహా
యసంబైన [3]లక్ష్యంబును వారలకుం జూపి యిట్లనియె.

170 తరువోజ. ఈవిల్లు మోపెట్టి యేనుబాణముల నీయంత్రమత్స్యంబు నేసిన
వాఁడ
భావజప్రతిముఁ డిబ్బాలకుఁ దగినపతి యిది మునిశక్తిఁ బడసినవిద్య
గావున మీరిప్డు గావింపుఁడిదియ ఘనశరకార్ముకకౌశలోన్నతియు
లావును గలవారలకు నవసరము లలితయశంబుఁ గల్యాణంబుఁ బడయ.

171 వ. అని ధృష్టద్యుమ్నుండు [1]మూఁగినరాజ[2]పుత్త్రులకు నెల్లనెఱుంగం జెప్పి
ద్రుపదరాజపుత్త్రిం జూచి యఖిలజలధివేలావలయవలయితమహీతలం

జేసి — కొన్ని ప్రతులు. 3. లగుబ్రాహ్మణుల తోడం గలసియున్న — చ ద
వి.శ.వ, లగు బ్రహ్మణ్యులైన పాండవులును — వా

168 1. వసాయకంబనగ — పెక్కు ప్రతులు. 2 మధ్యస్థలి — వ. 3 పొంటె — స.

169 1. భోరన, భోరని — అని పాఠములు. 2. పుష్పాక్షత — కొన్ని ప్రతులు.
3. యంత్రమత్స్యంబును — ర.

171 1 మూఁగిన — పెక్కు ప్రతులలో లేదు. 2. లోకంబునకెల్ల — కొన్ని ప్రతులు.

బున్గల రాజనందనులెల్ల నీ స్వయంవరంబునకు వచ్చినవారు వీరలం జూడుమని దుర్యోధన దుశ్శాసన దుర్ముఖప్రముఖులయిన ధృతరాష్ట్ర నందనుల నూర్వురం దత్సమీపంబుననున్న కర్ణాశ్వత్థామ సోమదత్త భూరి శ్రవశ్రుతసేనాదులను బుత్త్రభాతృసమేతులయియున్న శల్యవిరాట జరాసంధ గాంధారపతులను సక్రూర సారణ సాత్యకి సాంబ సంకర్షణ ప్రద్యుమ్న కృష్ణకృత వర్మానిరుద్ధ యుయుధాన ప్రముఖులైన యదు వృష్ణి భోజాంధకవరులను సుమిత్రసుకుమార సుశర్మ[4]సుదక్షిణ సుషేణ సేనాబిందు చంద్రసేన సముద్రసేనౌశీనర చేకితాన శిశుపాలశ్రేణి మజ్జన మేజయ జయద్రథ బృహద్రథ సత్యవ్రత చిత్రాంగద శుభాంగద [5]భగీరథ భగదత్త పౌండ్రక వాసుదేవ వత్సరాజ ప్రభృతులయిన నానాదేశాధీశు లను వేదధ్వనిసనాథంబై యొప్పుచున్న బ్రాహ్మణ సమూహంబునుం జూపి.

-: రాజపుత్త్రిలు మత్స్యయంత్రమును భేదింపఁబోయి
భంగపడుట :-

సం. 1—177—22

172 ఆ. ఇందులక్ష్య మెవ్వఁడేసె నాతని వరి,యింపు నెమ్మితోడ నిందువదన
యనిన రాజపుత్త్రి లవ్విల్లుమోపెట్టి, యేయఁగడఁగి [1]కదలిరెల్లవారు.

173 సీ. అమ్మహోత్సవము [1]నెయ్యమ్మునఁ జూడంగఁ దివిరి యేతెంచిన దివిజఖచర
గరుడ గంధర్వ[2]కిన్నరుల విమానముల్ విలసిల్లె నంబరతలము నందుఁ
బణవవీణావేణురణితానుసారమై రసగీతరవమెల్ల దెసల[3] నెసఁగె
బోరన వివిధతూర్యారవంబులు మహావ.నిధిధ్వానంబు ననుకరించె

ఆ. దివ్యమాల్యములయు దివ్యానులేపన,ములయు సౌరభంబువెలయఁ దాల్చి
రంగమధ్య జనులకుం గడు [4]తనుపుగాఁ,జేరి వీచె దివ్యమారుతంబు.

3. వరోద్దేశంబునకు, వరోత్సవంబునకు — అని పాఠములు. 4. సుదక్షిణ — పెక్కు ప్రతులలో లేదు 5. భగీరథ — కొన్ని ప్రతులలో లేదు

172 1. కదిసి, వచ్చి — అని పాఠములు.

173 1. నెయ్యమ్ముతో, నెయ్యంబుతో—అని పాఠములు. 2 కిన్నరవిమానంబులు—బు. ఓ.డ.ల. 3. చెలఁగె, నెగడె—అనిపాఠములు. 4. ఁనుపుగా—కొన్నిప్రతులు;ప్రీతిగా—మ, ముదముగా-వా. కొన్ని ప్రతులు 5. నంద—ఉ.బు.ఏ.న.వ.స; మలయ—సల.

174 చ. అవిరళభస్మమధ్యమున నగ్నికణంబు[1]ల పోలె బ్రాహ్మణ
ప్రవరులలోన నేర్పడక పాండవులేవురు నున్నఁజూచి యా
దవవృషభుండు కృష్ణుఁడు ముదంబు వారినెఱింగి పార్థుఁడీ
[2]యువతిఁ బరిగ్రహించునని[3]యుం దలఁచెఁ హృదయంబులోపలన్.

175 వ. అంత నా రాజనందనులు ద్రుపదరాజనందనం జూచి కందర్పబాణ[1]బాధితు
లయి తమ్మును దమసామర్థ్యమ్ము నెఱుంగక యర్థిత్వంబున నవ్విల్లు
మోపెట్టఁబోయి.

176 క. వడి నౌడుగఱచి వలకేల్, నిడుచన [1]గనయమునఁ[2]జెనఁచి నీల్గి బలం బే
ర్పడ విల్లు[3]వంపనోపక, [1]యుడిగిరినృపసుతులు గొంద ఱొయ్యన లజ్జన్.

177 క. బలవంతుల బలమఱఁగా, [1]మలువక[2]మ్రాన్మానిపాట మాయాధను వి
మ్ములఁ జేసిన మోపెట్టఁగఁ, గొలఁదియె యని డాయరైరి కొందఱుదానిన్.

178 మ. ఇది యెట్లున్ సమకూ[1]ర దెవ్వరికి మున్నీవిల్లు మోపెట్టఁబో
లదు మోపెట్టియు నంతరిక్షమున నాలక్ష్యంబు భేదింపఁగా
నది బ్రహ్మాదులకైన [2]నిందలవి గాదంచున్ విచారించి [3]ని
ర్మదులై కొందఱు రాజులేఁగిరి నిజస్థానమార్గముల్ చూచుచున్.

174 1. లువోలె — అ ఋ గ జ.ద.వీ శ ష. 2. యువిద — ఋ.ఖ. 3. యుండె
మనంబున సంతసంబుతోన్ — న; యుండెను దా హృదయంబులోపలన్ — స.

175 1. పీడితులయి, విద్ధులై, భిన్నహృదయులై — అని పాఠములు.

176 1. గొనయమున — పెక్కు ప్రతులు. 2. జేర్చి — ల. 3. వంచ — తి.

177 1. మలపక — కొన్ని ప్రతులు. 2. మ్రాన్మానిభంగి — జ.బ స; మ్రాన్మాని
పాట — ఖ గి ల ; మన్మానిపాట — ఖాసం.వా.శ; మ్రాన్మానిపాట — ఐ.క.చ.
ట.ద.శ ష.

178 1. డదెవ్వరికి — న. 2 దానలవి — ఏ ఖ.బ మ. 3. దుర్మదులై — ఓ.న
బ.య.

## —: అర్జునుఁడు మత్స్యయంత్రంబు దెగఁనేయుట :—

### సం. 1-179-4

179 వ. ఇట్లు రాజపుత్రు లవ్విల్లు మోపెట్టనోపక నివృత్తులయిన మఱి యదువృష్ణి భోజాంధకులు కృష్ణానుమతంబున [1]సజ్యకర్మంబునం [2]దనారంభులయి మిన్నకుండిరంత శిశుపాల జరాసంధ శల్యకర్ణులు దర్పితులై తమతమ లావులు మెఱసి క్రమంబున నలువురు మాష యవ ముద్గ రోమమాత్రం బులు దక్క గొనయం బెక్కించియు మోపెట్ట [3]నశక్యంబయిన నుక్కు సెడి [4]స్రుక్కిన వారలంజూచి యగ్రజు ననుమతింబున విప్రసభ వెలువడి విజయుండు ధనుస్సమీపంబున కరిగిన నాతని యుత్సాహంబున కచ్చెరు [5]వడి కొందఱు బ్రాహ్మణులు దమలో నిట్లనిరి.

180 ఉ. ఇమ్మునిజేంద్రనందను లహీనబలుల్ దృఢదీర్ఘబాహు[1]వీ
ర్యమ్ముల[2]వార లోపర శరాసనకర్మము[illegible] దపుక్తద
ర్పమ్మున నిప్డు నవ్వ పలుపన్ సమకట్టె నితండు విప్రవం
శమ్మున వారి[3]నెల్లఁ దనశక్తి యెఱుంగక దుర్వి[4]దగ్ధుఁడై.

181 క. అనువారు నందుఁగొందఱు, ఘనుఁ డీతఁడు వీరికంటెఁ గార్ముకవిద్యం
దనరిన వాఁడయి దీనికి, మొనసెంగా [1]కన్యుఁడిట్లు [2]మొనయంగలఁడే.

179 1. నశక్య కర్మంబున — కొన్ని ప్రతులు. 2. దనారబ్ధులయి — వా.శ. కొన్ని ప్రతులు; దనారంభులయి — అ.ఆ.ఊ.ఋ.ఐ.ఓ.క.గ.జ.ప.బ. 3. నోపక వెక్కి చిక్కినవారలం జూచి — న.మ.స. 4 చిక్కిన, తక్కిన, స్రుక్కిన — అని పాఠములు, పెక్కిన — వా.శ. 5. వంది — వీ.శ.ష. కొన్ని ప్రతులు.

180 1. శౌర్యమ్ముల వార — కొన్ని ప్రతులు. 2. వారిలోపల — పెక్కు ప్రతులు. 3. కెల్ల — కొన్ని ప్రతులు. 4. వేకుడై — ఆ, చారుడై — ఓ.

181 1. కన్యులిట్లు మొనయంగలరే — ఉ.ఋ.జ.ల. 2. మొనయగ జేలే — పెక్కు ప్రతులు.

182 మ. అమితోత్సాహుఁడు దీర్ఘబాహు [1]పరిఘుం డత్యంతతేజస్వి స
ద్విమలాచారుఁడు [2]విప్రభక్తిపరుఁడీ విప్రుండు విప్రప్రసా
దమునన్ విప్రులకెల్ల సంతసముగాఁ ద[3]త్కర్మసంసిద్ధి ను
త్తముఁడై పొందె[4]డమంచు [5]నుండిరి దయన్ ధాత్రీసురుల్ ప్రీతులై.

183 వ. అంత నయ్యర్జునుండు నవ్వింటి సమీపంబునకు వచ్చి గురువు[1]లందలంచి నమస్కారంబు సేసి ధనువునకుఁ బ్రదక్షిణంబుఁ జేసి మ్రొక్కి [2]దాని నెత్తికొని పూర్వపరిచితంబైన విల్లు మోపెట్టినట్లు శ్రమంబున మోపెట్టి [3]జనులాశ్చర్యంబునం బొందుచుండ నేనమ్ముల నమ్మత్స్యయంత్రంబు [4]నాక్షణంబ యురులనేసినం జూచి బ్రాహ్మణక్షత్రియ ప్రముఖులయిన జనులెల్ల విస్మితు[5]లయి.

184 చ. ఫలపవనాంబుభోజన శుభవ్రత[1]వృత్తులఁ జేసి చూడ దు
ర్బల తనులయ్యు బ్రాహ్మణులపారతపోబలసంపదన్ మహా
బలయుతు లట్టి వారలకు భవ్యుల కెందు నసాధ్యమెద్దియుం
గలదె చరాచరాఖిల జగంబులఁ [2]బెద్దల కారె సద్ద్విజుల్.

185 క నిమి[1]షాంతరమున నిట్లు శ్రమమున మత్స్యలకు నేయసమకూరునె యు
త్తముఁడీతఁడు బ్రాహ్మణరూపమున సురేశ్వరుఁడో హరుఁడో గుహుఁడో.

182 1. డనఘుండత్యంత — క; డలఘుండ — అ. 2. విష్ణుభక్తి — గి.చ.ద. పీ.శ.ష; ఇచ్చటి చిత్రశాలాప్రతియందీశ్లోకము కలదు ప్రణమ్యశిర సాదేవమీశానం వరదం ప్రభుమ్। కష్టంచమనసాకృత్వాజగృహేచార్జునోధనుః. పుట 304. 3. త్కార్యసంసిద్ధి — ఈ.ఓ గ.ప. 4. డమంచు — అ.బు.ఏ.ఐ ఒ క.ట, డునంచు — పౌ.గ జ; దుమంచు — వా.శ కొన్ని ప్రతులు. 5. బల్కిరి — ల.స.

183 1. లం దలంచి నమస్కరించి — న ప.మ.ల; లకు నమస్కారంబు సేసి — వా. కొన్ని ప్రతులు 2 పుచ్చుకొని పూర్వ — చ ద.పీ.శ.ష. 3. జనులాశ్చర్యంబునం బొందుచుండ — కొన్ని ప్రతులలో లేదు. 4. నక్షణంబ — పెక్కు ప్రతులు. 5. లయి యిట్లనిరి — చ.ద.పీ.శ.ష.

184 1. తృప్తులఁ జేసి — ఆ. కసం. 2 పూజ్యులు కారె — ఐ.న.

185 1. షార్థంబున — ఎ

186 క. అని ధరణినుండి పొగడెడు, జనులనిరంతరరవంబు జలధరమార్గం
బుననుండి పొగడుదివ్యుల, [1]యనవరతరవంబు నొక్కఁడయి[2]కడునొప్పెన్.

187 క. చెలఁగె సురదుందుభిస్వనములు ముదమున భూసురోత్తములు పయిపుట్టం
బులు [1]పీచి పీచియార్చిరి, వెలయఁగ నరుమీఁదఁ బుష్పవృష్టియుఁ గురిసెన్.

188 వ. అయ్యవసరంబున ధర్మనందనుండు నకుల సహదేవానుగమ్యమానుండయి నిజనివాసంబునకుం జనియె నిట ధృష్టద్యుమ్న సహితుండయి [1]యజ్ఞసేనుండు మహాసేనతో నర్జునునకు సహా[2]యుండుగా నరిగెనంత.

*-: ద్రౌపది యర్జునుని వరించుట :-*

సం. 1-179-22

189 సీ. ధరణీశనందనుల్ దన్నతిప్రీతితోఁ జూచుచు నుండంగ సుందరాంగి
తోయజదళ[1]నేత్రి ద్రుపదరాజాత్మజ కమనీయగజరాజగమనలీలఁ
జనుదెంచి సురరాజసన్నిభు నభినవయౌవనోద్భాసితు నసితరత్న
రుచిరాంగు నంగజరూపు ధనంజయుఁ దనచేతి [2]సితపుష్పదామకమునఁ

ఆ. బొలఁతిముదముతోడఁ బూజించెనట్టియు, త్సవముఁజూచి దానిసైఁపకపుడు
కౌరవేంద్రుఁడాదిగాఁగల భూపతు,లెల్ల నలిగి[3]కలయ నేపురేఁగి

186 1. యనివారితము నొక్క పెట్టయొప్పెన్ — ఖ 2. వితెంచెన్ — బు.ప. ల.స ; విలసిలెన్ — ఉ.

187 1. వీచి వీచి యార్చిరి — పెక్కు ప్రతులు ; విడిచి వీచియార్చిరి — వా.శ. కొన్ని ప్రతులు.

188 1. భీమసేనుండు — బు.ప. 2. యంబుగా — కొన్ని ప్రతులు.

189 1. నేత్రి - పెక్కు ప్రతులు ; నేత్ర — వా.శ. మున్నగు ప్రతులు. 2. నవ - ఉ.ఓ. 3. తెరలి — ఔ. కడగి — క; కలయ బలికి రేపుమీరి — ఆ.

190 మత్తకోకిలము. ఏల రాఁ బనిచెన్ మహీశులనెల్లఁ జుట్టమపోలె ము
న్నేల సత్కృతిఁ జేసె నిందఱ [1]కిమ్మహారథులుండఁగా
నేల[2]కన్యక నిచ్చె విప్రున కిందు నేఁడు శఠుండు పాం
చాలుఁ డిప్పుడ [3]వీని నిర్గతసత్త్వుఁ జేయుద మాజిలోన్.

191 క. తనవిద్య పేర్మి నృపనందనఁ బడసెను విప్రుఁ డితని తప్పేకడు దు
ర్జనుఁడీ ద్రుపదుఁడు నృపతుల,[1]ననయంబున మెచ్చఁ డయ్యె నతిగర్వితుఁడై.

192 వ. ఏమిదోషంబు సేసియు బ్రాహ్మణుండు వధ్యుండుగాఁడు మనరాజ్యం బును నర్థంబును బ్రాహ్మణార్థంబ కావున నవ్విప్రుతో డి దేమియని ద్రుపదుపయి [1]నెత్తుదెంచిన ద్రుపదుండును కదు భీతుండై బ్రాహ్మణుల మఱువు సొచ్చె నిట్లు శరణాగతుండయిన ద్రుపదు నోడకుండుమని బ్రాహ్మణులు దమతమ [2]దండాజినంబులెత్తికొని ప్రతిబలంబులపయి [3]వీచు చున్నంత వారలం జూచి నగుచు నర్జునుం డిట్లనియె.

193 క. కడఁగి మదీయాస్త్రములని, యెడు పటుమంత్రముల నిప్పుడీ [1]నృపురిపుల
[2]న్కడిఁడివిషాహులదర్పం, [3]బుడిగించెదఁ [4]దొలఁగి చూచుచుండుఁడు మీరల్.

190 1. కిమ్మహీపతు లుండగా — ప.బ.న. 2. విప్రుల కిచ్చె కూతురు, నెందు నేడు శఠుండు — ర. 3. పట్టి — ఆ.బ.ర.

191 1. ననయము మది — అ.ఓ.ఖ.గ.ట ; ననయముకడు, ననయము నెద — అని పాఠములు.

192 1. ఏగుదెంచిన — పెక్కు ప్రతులు ; ఎత్తివచ్చిన — కొన్ని ప్రతులు ; ఏతెంచిన — అనియు పాఠము. 2. దండంబులెత్తి — ఋ.ఎ.ఏ.ఓ. 3 వీఁచు — సార్ధబిందుక మని, $గ_1$ ; వైచుచున్నంత — బ.

193 1. యరినృపుల — కొన్ని ప్రతులు. 2. న్గడిఁది — $గ_1$.చ.ట.ద.శ.ష. 3. బుడిపించెద — ర. 4. తలఁగి — క.ఖ స.

—: అర్జునుండు కర్ణునితో యుద్ధంబుసేసి జయించుట :—

సం. 1-181-3

194 వ. అని తానును భీమసేనుండును గడఁగి రిపుబలంబుపయి నపరిమితశరంబు [1]లేసె భీమసేనుండు నొక్కవృక్షంబు పెఱికికొని దండహస్తుండయిన దండధరుండునుంబోలె నర్జునునకు సహాయుండయి నిలిచె నంత న[2]య్యిద్దఱ మహాసంరంభంబుఁజూచి విస్మితుఁడై కృష్ణుండు బలదేవున కిట్లనియె.

195 సీ. తాలాభమగువిల్లు దాల్చివిరోధుల [1]నెగచుచు నున్నవాఁడింద్ర[2]తనయుఁ
[3]డాతనికెలన మహావృక్షహస్తుఁడై యున్నవీరుండు వృకోదరుండు
యంత్రంబు నరుఁడేసినప్పు[4]డుపోయిన యగ్గౌరవర్ణుండు యమ[5]తనూజుఁ
[6]డాతనితోడన యరిగిన యిరువురుఁ గవలవారర్క[7]ప్రకాశతేజు

ఆ. లనిన లక్కయింట నగ్నిదాహంబున,నెట్లు బ్రదికిరొక్కొ యిమ్మహాత్ము
లెట్టిపుణ్యాదినమొ యేవురఁజూచితి, మనుచు సంతసిల్లె హలధరుండు.

196 వ. అంత.

197 క. కురుపతి సూడఁగఁ గర్ణుఁడు,నరుఁడాఁకెను శల్యుఁడనిలనందనుఁ డాఁకెన్
సరభసమున విస్మయ,మందిరి ధరణీదేవమనుజ [1]దేవప్రవరుల్.

198 శా. కర్ణుండున్ విజయుండు నొండొరులఁ [1]జుల్కందాఁకి చాపంబు లా
కర్ణాంతం[2]బగుచుండగా దిగిచి యుగ్రక్రోధులై యేసి రా
పూర్ణంబయ్యెఁ దదీయబాణతతి నంభోభృత్పథంబెల్ల నా
స్తీర్ణంబయ్యె ధరిత్రి యెల్ల[3]నవిసెన్ దిక్చక్ర మెల్లన్ వడిన్.

194 1. లేసిరంత భీమసేనుండు — ఋ.మ.ల. 2. య్యిరువుర — చ.ద.వీ.శ.ష.

195 1. నేయుచు నున్న — న; నేచుచు నున్న — బ 2 సుతుడు — ఆ.ఏ.ఐ.న. 3. ఆ — ఏ.జ.న (సుతుఁడు అను పాఠము గ్రహించినచో) 4. డయరిగిన — కొన్ని ప్రతులు. 5. సుతుండు — ఎ.న. 6. ఆ — న. 7. సంకాశ — మ.

197 1. దివిజగణంబుల్, దివ్యగణంబుల్, దివిజప్రవరుల్ — అని పాఠములు.

198 1. వీకందాకి—ఐ.ఓ.య ల. 2. బులుగావడిందిగిచి—వా.శ ; బగుచుండగా — పెక్కు ప్రతులు. 3. కదలెన్ - ప.మ ; వణకెన్—ఋ.న.ల ; కలగెన్—ఎ ; కుదిసెన్—స.

199 క. [1]పిరుఁడగు నరుని యేయు[2]న, పారశరావలుల నడుమ వారింపంగా
నేరక యేటుడిగి మహో, శూరుఁడు రాధేయుఁ డింద్రజున కిట్లని యెఁ.

200 క. నా యెదురఁ జక్కనై యని, [1]సేయఁగ భార్గవునకును శచీవరునకుఁ గౌం
తేయుఁడగు విజయునకుఁగా, కాయతభుజశక్తి [2]నోరులకలవి యె ధరణిన్.

201 క. నీ వప్రాకృతబలుఁడవు, నీవిక్రమమునకు విల్లునేర్పునకు మహీ
దేవకులోత్తమ మెచ్చితి, నావుడుఁ బార్థుండు గర్ణునకు నిట్లని యెన్.

202 మధ్యాక్కర. ఏను నీచెప్పినవారిలోపల నెవ్వఁడఁగాను
గా[1]ని నే సర్వశస్త్రాస్త్ర విద్యలఁ గడుఁ బ్రసిద్ధుండ
ఘూనుతబ్రహ్మతేజోధికుఁడ నిన్నుఁబోరిలో[2]నోర్వఁ
గానున్న వీరుండ నొండు దక్కులోఁగక చక్కనిలుము.

203 వ. అనిన విని కర్ణుండు బ్రహ్మతేజం బజేయంబని విజయుతోడి[1]యుద్ధం బొల్లక
క్రమ్మఱియె మఱి శల్యభీమసేనులు పెనంగి మల్లయుద్ధంబు సేయునెడ
భీముండు భీమబలంబునం బట్టుకొని శల్యుం ద్రెళ్ళవైచిన.

204 ఆ. నెల్లుఁడట్లు నేలద్రెళ్లి చెచ్చెరలేచి, యొడలు దుడిచికొనుచు నొయ్యఁ [1]జనియె
వానిఁజూచి నగుచు [2]మానుగా విప్రులు, భూరిసత్త్వ భీముఁ బొగడి[3]రంత.

199 1. వీరుండర్జునుఁడేయు — గ$_1$.చ.ద భాసం.వీ శ.ష. 2. న,వారితశరసమితి — వ.ల.స. (ఈ పాఠమున, ప.వ , యతివారింపఁబడినది.)

200 1. సేయంగా భార్గవునకు, శివునకు నాకౌంతేయు—వీ.స. 2. నిలువనల వియె— చ.ట.ద.శ.ష.

202 1. నీవసర్వ – వా. భాసం. కొన్ని ప్రతులు. 2. గెల్వ – ఐ.

203 1. పోటుడిగిమగిడె — భాసం.

204 1. నరిగె — కొన్ని ప్రతులు. 2. వలనుగా — మ. 3. రోలి, రొప్ప — అని పాఠములు.

205 ఆ. పరశురాముఁ డొండె హరుఁ డొండె నరుఁ డొండె, గాక యొరులు గలరె కర్ణునోర్వ
బలిమి భీముఁడొండె బలదేవుఁడొండెఁగా, కొరులు [1]నరులు శల్యునోర్వఁ గలరె.

206 వ. వీ రెవ్వరో [1]యెందుండుదురో యెఱుంగవలయునని దుర్యోధనాదులయిన రాజపుత్త్రులెల్ల విస్మితులయి యున్న వారలంజూచి కృష్ణుం డిట్లనియె.

207 చ. పరులకు [1]దుష్కరంబయిన భాసుర[2]కార్యముసేసి తత్స్వయం
వరమునఁ బత్నిఁగాఁబడసె వారిరువాయత [3]నేత్రఁగృష్ణ[4]నీ
ధరణిసురాన్వయోత్తముఁడు ధర్మవిధిం జెపుఁడయ్య యింక నె
వ్వరికిని జన్నె[5]వీని ననవద్యపరాక్రము నాక్రమింపఁగన్.

208 వ. వలవ దుడుంగు డని వారించిన నట్లు కృష్ణుచేత నివారితులయి రాజపుత్త్రులు దమతమదేశంబులకుం జనిరంత భీమార్జునులు బ్రాహ్మణపరివృతులయి ద్రుపదరాజపుత్త్రిం దోడ్కొని [1]వచ్చునంత.

209 సీ. ఉత్సవసందర్శనోత్సుకులై పోయి కడుఁ బెద్ద[1]ప్రొద్దయ్యెఁగొడుకులేల
మసలిరొ కౌరవుల్ విసువక వైరంబు [2]గావించు పాపస్వభావు లెఱిఁగి
క్రందునఁ [3]జంపిరో యందుల కేవురు లీలతో నొక్కట నేలయరిగి
రవ్య[4]యుండయిన వేదవ్యాసువచనంబు నిక్కంబుగాకుం[5]డు నొక్కొ వేల్పు

205 1. కడిమి — ల.

206 1. యెందుండుదురో — కొన్ని ప్రతులలో లేదు.

207 1. దుర్లభంబయిన — స ; దుస్తరంబై (బయి) న — ఖ. 2. యంత్రము నేసి — ఐ.ల.స. 3. నేత్రి — పెక్కు ప్రతులు. 4 నిద్ధరణి సురాన్వయో — కొన్ని ప్రతులు. 5. పోర — ఖ.ల.స.

208 1. చనిరంతకు ముందర — పెక్కు ప్రతులు.

209 1. తడవయ్యె — డ. 2. భావించి — పెక్కు ప్రతులు ; పాటించి — స. ప్రాసయతినియమము సడలినది. 3. నోర్చిరో — ర. 4. యంబయిన — ఔ.య.ర. 5. డనేర్చునొక్కొ — బ. ఇక్కడ ప్రాసయతి సడలినది.

ఆ. లార ఘూసు[6]రేశులార మీశరణంబ, కాని యొండు[7]గతియుఁ గాన వాకు
శరణ [8]మగుఁడు సుతులఁ గరుణతోరక్షింపుఁ, డనుచు గుంతి[9]వగచి
వనరుచుండె.

-: అర్జునుండు ద్రౌపదిం దెచ్చి తల్లికి నివేదించుట :-

సం. 1-182-1

210 వ. అట్టి యవసరంబునఁ దల్లి యొద్దకు ధర్మరాజును గవలవారు మున్న వచ్చి యున్నఁ దదనంతరంబ భీమార్జునులు ద్రౌపదీస[1]హితులయి [2]చనుదెంచి మ్రొక్కి మే మొక్క [3]భిక్షదెచ్చితిమని తల్లికి [4]నివేదించిన నెఱుంగక యప్పటియట్ల కా[5]వగచి కుంతీదేవి సంతసిల్లి దాని మీరేవురు నుపయోగింపుఁడని కొడుకుల [6]నియోగించి [7]భువనత్రయరాజ్యలక్ష్మియుంబోలె నున్న యక్కన్నియం జూచి లజ్జించి [8]యధర్మభీతయయి ధర్మతనయున కిట్లనియె.

211 సీ. ఈతన్విఁ [1]దోడ్కొని నీతమ్ములిరువురు ప్రీతి నేతెంచి యీభిక్ష[2]యొప్ప
[3]గొనుమనినాకుఁ జెప్పినను నేవురు నుపయోగింపుఁ డంటి నాయుక్తి దొల్లి
యనృత మెన్నండుఁగా[4]దనఘ మీ రెప్పుడు మద్వచనాతిక్రమంబు సేయ
రిదిలోకముఁ లేనియది యేమి సేయంగ నగునని చింతాకులాత్మ యైనఁ

తే. దల్లిమూఁరార్చి వాసవతనయుఁ జూచి. పార్థ నీచేతఁబడయంగఁ బడిన[5]దీని
నగ్నిసన్నిధిఁ బాణి[6]గ్రహణంబు నీవ, చేయుమన ధర్మజునకును జిష్ణుఁడనియె.

6. రవరులార — మ. 7. శరణు — ఉ.ప న.ర ల. 8. మగుచు — ర.ల ; మగుడి — ఉ. 9. వగల — మ.

210 1. హితంబుగా — ప న.మ. 2. వచ్చి మేమొక్క - పెక్కు ప్రతులు. 3. భిక్షంబు — ఆ.ఋ ఎ.ప.ఔ ఖ.ద.ప జా. 4. నివేదించియున్న, నెఱింగించిన, చెప్పిన — అని పాఠములు. 5. తలంచి — న. 6. నియమించి — కొన్ని ప్రతులు. 7. త్రిభువన — కొన్ని ప్రతులు. 8. ధర్మభీతయయి — కొన్ని ప్రతులు.

211 1 దోకొని - అ.ఊ.ట. 2. మొప్పగొనుమని — కొన్ని ప్రతులు ; యొప్పఁ గొనుమని — అ.ఈ చ.ద.వీ.శ.ష ; యొప్పుగొనుమని — వా.శ. కొన్ని ప్రతులు. 3 గొనుడని - కొన్ని ప్రతులు. 4. దనక - $గ_1$.చ.ద.శ.ష. 5. దాని — ఆ.ఐ.క.డ ; కన్య — ఋ. 6. గ్రహణము — కొన్ని ప్రతులు.

212 వ. పెద్దవాఁ[1]డుండఁ [2]గొండుకవానికి వివాహంబగుట ధర్మవిరుద్ధంబు గావున దీని నగ్రమహిషిఁగాఁ బరిగ్రహిం[3]పుము మానలువుర యనుమతంబును నిట్టిద [4]యనుచున్న యవసరంబున విధి[5]ప్రేరణవశంబున.

213 ఉ. ఆ లలితాంగియందు హృదయంబులు [1]దృష్టులు నిల్పి పాండు భూ
పాలతనూజ పంచకము పంచశరాహతిఁ బొందె నొక్క [2]తన్
[3]బాలికఁ దొల్లి యేవురకు [4]భామినిఁగా సృజియించి యున్నయ
య్యాలరిబ్రహ్మ [5]చెయ్ది పరమార్థముగా కది యేల యొండగుఁ.

214 వ. ఇట్లు పాంచాలియందు బద్ధానురాగులయి యున్న తమయేవుర యభిప్రాయం [1]బెఱింగి వేదవ్యాసవచనంబులుం దలంచి ధర్మతనయుండు దమ్ముల కిట్లనియె.

215 క. గురువచ[1]నస్థితి మన[2]కే, గురకును నిదిపత్నిగాఁదగుం గావున ని
త్తరుణిని బరిగ్రహింతము, తిరముగ గురువచనమొండు దెఱఁగేలయగున్.

216 వ. అని పలుకుచున్న యవసరంబున.

-: శ్రీకృష్ణ బలరాములు ధర్మరాజాదులఁ జూడవచ్చుట :-

సం. 1—183—2

217 శా. రాజన్యోత్తములు వచ్చి కాంచి రనఘుల్ రాముండు గృష్ణుండు న
య్యాజామీఢు నజాతశత్రు నృపలోకారాధ్యు నుద్యద్గుణ
భ్రాజిష్ణుం దమమేనయత్తకొడుకుఁ బాలార్కతులోజ్జ్వల
త్తేజున్ భ్రాతృచతుష్క మధ్య[1]గతుఁ గౌంతేయాగ్రజుఁ ధర్మజున్.

212 1. రుండకొండిక వారికి — పెక్కు ప్రతులు. 2. గొండికవాఁడు — గి$_1$.ద.న.ర.శ.ష. 3. పుడు — ఉ.ఒ.ఖ.ట డ.ల. 4. యగుననుచున్న - కొన్ని ప్రతులు. 5. ప్రేరణంబున ; ప్రేరణంబు జేసి — అని పాఠములు.

213 1. చూడ్కులు—వ. 2. టన్—ఒ.మ.ల. 3. బాలకి—అ ఉ ఊ.ఋ.ఏ.ఐ.ఒ.క.ఖ గ.జ.ట.డ.ష. 4. భార్యనుగా—ఖ. 5 చెయ్వు—కొన్ని ప్రతులు ; చేత - ఋ.ఙ.డ.ర.ల.

214 1. బుతెరింగి - కొన్ని ప్రతులు.

215 1. నసిద్ధి - ల.స. 2. యేవురకునునిది ధర్మసతి యవుంగావున — మ.

217 1. మున - గి.చ ద.శ.ష.

218 వ. కని తమ్మెఱిం[1]గించి యతిస్నేహంబున నయ్యుధిష్ఠిరునకుం గుంతీదేవికి [2]మ్రొక్కి భీమార్జుననకులసహదేవులం గౌఁగిలించుకొని పరమసమ్మద రస[3]పూరితహృదయులై యున్నవారల కుశలం బడిగి ధర్మరాజిట్లనియె.

219 క. ఒవ్వమిఁ గౌరవులకుఁ గడు, దవ్వయి మఱి విప్రవేషధారులమయి మ మ్మెవ్వరు [1]నెఱుంగకుండఁగ, నివ్విధమున నున్న నెట్టు లెఱిఁగితి రిరల్.

220 వ. అనిన నగుచు వాసుదేవుం డిట్లనియె.

221 ఉ. అంబుజమిత్త్రుఁ డంబుద [1]చయాంతరితుండగుడుం దదీయ తే
జంబు జగజ్జనంబులకు శక్యమె కప్పఁగ మీరు గూఢభా
వంబున నున్న మీదగు నవారితతేజము భూజనప్రసి
ద్ధంబగుఁగాక దానిఁ బిహితంబుగ నెవ్వరుఁ జేయనేర్తురే.

*-: పాండవులవంశాదికము నెఱింగి ద్రుపదుండు ధృష్టద్యుమ్నుం బనుచుట :-*

సం. 1–184–3

222 వ. సకలరాజసమక్షంబున నిట్టి యతిమానుషంబయిన యద్భుతకర్మం బర్జుననకకా కన్యులకుఁ జేయ[1]శక్యం బెయని యెఱింగితిమి మీపరాక్రమంబ మిమ్ము నెఱింగించె [2]సధర్మనిరతులగు ధృతరాష్ట్రదుర్యోధనులు సేసిన

218 1. గించుకొని - కొన్ని ప్రతులు. 2. మ్రొక్కి భీమార్జుననకుల – పెక్కు ప్రతులు ; మ్రొక్కి తమకు మ్రొక్కిన భీమార్జున – వా. కొన్ని ప్రతులు. 3. పూరితులై – గ.చ.ద.వీ.శ.ష ; పూరితాంతఃకరణులై — ఒ.

219 1. నెరుగకయుండగ — ఋ.ప.ర.

221 1. చయాంతరితుండ — $గ_1$.చ జ.ద భాసం వీ.శ.ష ; లతాంతరితుండ - కొన్ని ప్రతులు ; లవాంతరితుండ – వా.శ. కొన్ని ప్రతులు.

222 1. నగునే — చ.ద.వీ.శ.ష. 2. ధర్మరహితులగు — చ. ద. వీ. శ. ష.

లాక్షా[3]గారదాహ[4]ప్రయోగంబువలన విముక్తుల రయితి రింక మీకు లగ్గగు ననిచెప్పి బలదేవసహితుండయి వాసుదేవుం డరిగిన నిట ద్రుపదుండు దన కూఁతునకు వరుండైన వాఁడెవ్వఁడో యేవంశంబునవాఁడో వాని చరితం బెట్టిదో యెఱింగి రమ్మని ధృష్టద్యుమ్నుం బనిచిన నతండు భీమార్జున ద్రౌపదుల పిఱుందనవచ్చి తన్నొరు లెఱుంగకుండ నక్కుంభకారగృహం బున నుండి [5]యంతవృత్తాంతంబు నెఱింగి పోయి ద్రుపదున కిట్లనియె.

223 సీ. అయ్యిద్దఱును గృష్ణ[1]నట్లొప్పఁ దోడ్కొనిచని యొక్క ముదుసలిసాని [2]కపుడు
మ్రొక్కి యక్కన్యను మ్రొక్కించి మఱియొక్క గౌరవర్ణుఁడు పంపఁ గడఁకతోడ
నలువురు భూసురనాథగృహంబుల కరిగి [3]భైక్షము దెచ్చియంతగూడు
నొగి[4]న యయ్యవ్వకు నొప్పించియున్న నయ్యవ్వయు ద్రౌపది[5]నర్థిఁబిలిచి

ఆ. బలివిధానములకు బ్రాహ్మణాతిథులకు, నన్నకాంతులైన [6]యధ్వగులకు
నగ్రమిందుఁ [7]బుచ్చి[8]యయ్యగ్రశేషంబుఁ, జెలువ రెండుపాళ్లు సేయు మొనర.

224 క. వెడఁదయురంబును నున్నవ, కడుపును దృఢ[1]కఠినతనువుఁగల యాతని[2]కిం
[3]దడర నొకపాలువెట్టుము, వడి నాగాయుతబలంబువాఁ డతఁ డబలా.

3. గృహ — పెక్కు ప్రతులు. 4. ప్రయోగంబు—కొన్నిట లేదు. 5. యంతయు నెఱింగి — వా. పెక్కు ప్రతులు; యంత వృత్తాంతంబు నెరింగి — ఏ.ఓ.ఖ.జ.ప.

223 1. నప్పుడు — ఋ.ల. 2 కొనర, కర్థి — అని పాఠములు. 3. భిక్షము — పెక్కు ప్రతులు 4. దమయవ్వకు — న. 5. నంత — వీ.శ.ష. కొన్ని ప్రతులు. 6 యతిథులకును — కొన్ని ప్రతులు; యన్యులకును — భాసం. 7. నునిచి, నుంచి — కొన్ని ప్రతులు. 8. యన్నశేషంబు — చ.ద.వ.వీ.శ.ష.

224 1. దీర్ఘతనువు — అ.ఐ.ఓ. 2. కేర్పడ నొక్కపాలు — ఏ డ.న. 3. దొడర నొకపాలు — వీ.శ.ష. కొన్ని ప్రతులు; దొడఁగి యొక — ర.

225 వ. మఱియు [1]రెండగు పాల్పన్నులుపురకుం బెట్టి తద్భుక్తశేషంబేనును నీవు నుపయోగింతమని పంచినఁ గృష్ణయు నయ్యవ్వ పంచిన[2]రూపున నందఱకుం గుడువం బెట్టి తాను గుడిచి దర్భసారులు [3]విద్రిచి యందఱకు వేఱువేఱ శయనస్థలమ్ములుగా రచియించి వానిపయి వారల కృష్ణాజినంబులు పఱచి సుఖశయనులై యున్న వారిపాదంబులకు నుపధానభూతయై [4]శయనించి.

226 ఆ. కఱకు[1]దర్భపూరి పఱపులు భిక్షాన్నమశన మట్టివారి నతిముదమున
నాదరించెఁ బ్రీతి నాదిగర్భేశ్వరి, యయ్యు సేవగింపదయ్యెఁ గృష్ణ.

227 క. కడవసములుఁ గోలలుఁ గృష్ణాజినములు వీరలధనంబు పరికింపంగ నె
క్కడిదేశికులని [1]వగచెక, [2]మడవక తనుమధ్య నిండుమనమున నుండెన్.

228 సీ. అంత నయ్యేవురు నయ్యాయికథ లొప్పఁ జెప్పుచు మఱి రథసింధురాశ్వ
విషయంబులును సమవిషమ మహావ్యూహ నిర్భేదనోపాయ నిపుణ[1]విధులు
నాయుధవిద్యారహస్య ప్రయుక్తులు [2]బలికిరి పలికిన బాసఁ జూడ
[3]సత్యోత్తమక్షత్రియాన్వయు లగుదురు చరితఁ జూడఁగ విప్రజాతు లగుదు

ఆ. రెఱుఁగరాదు వారి నీరెండుజాతుల, వారకాని కారు వైశ్యశూద్ర
హీనజాతు లని యెంతయు సంతస, మందెఁ బృష[4]తపుత్త్రిఁ డాత్మలోన.

225 1. రెండవ — పెక్కు ప్రతులు. 2. రూపంబున — పెక్కు ప్రతులు. 3. విదిర్చి, విదల్చి — అని పాఠములు. 4 శయినించె — కొన్ని ప్రతులు.

226 1 దబ్బపూరి పఱపులు — అ.పం. కఱకు దర్భపూరి పఱపులు ఇత్యాద్యాచార్య ప్రయోగే — దబ్బపూరి పఱపులు — ఇత్యేవపాఠస్సాధుః.

227 1. యెదలో — న. 2. మడవక — ఆ.గ$_1$.ద.శ.ష.

228 1. తలును — వ. 2. బలికినయట్టి యబ్బానచూడ — వ ; పలికిరి వారలబాస జూడ — య. 3. సత్యాగ్రిమక్షత్రియ — స. 4. దపుత్త్రిఁడాత్మ — ఉ.క.చ.ప.బ.శ.ష.

229 వ. వెండియు వారల నిమ్ముగా నెఱుంగవేఁడి ద్రుపదపురోహితుం [1]బు త్తెంచినం బురోహితుండును బ్రాహ్మణసమూహంబుతోడ వచ్చి పాండవులంగని ధర్మరాజు నియోగంబున భీమసేనుచేత [2]నర్ఘ్యాదినిధుల నర్చితుండయి యిట్లనియె.

230 ఉ. మీ కులగోత్రనామములు మిమ్మును నెమ్మి నెఱుంగవేఁడి చిం
తాకులుఁడై నవాఁడు ద్రుపదాధిపుఁ డాతనికిం బ్రియంబుగా
నాకెఱిఁగింపుఁ డింతయు [1]ఘనంబుగ [2]నద్భుత యంత్రమత్స్యమున్
[3]వీకున నట్టులేసిన సువిక్రము నాతఁడు [4]గోరుఁ జూడఁగన్.

231 వ. అనిన విని నగుచు ధర్మతనయుండు ద్రుపదపురోహితున కిట్లనియె.

232 క. ఇవ్వైవాహోయస[1]లక్ష్యం, బివ్విల్లుమోపెట్టి [2]నెట్టనేసిన వీరుం
డివ్వనితకు [3]వరుఁడగునని, నెవ్వగ మీరాజు [4]చులుకనియమము సేసెన్.

233 తే. [1]అతని నియమించి[2]నట్ల యయ్యంత్రమేసి, యీతఁ డిక్కన్యఁ బడసె నుర్వీశులొద్ద
[3]నేలమమ్ముఁ దానెఱిఁగెడు నెఱిఁగియేమి, సేయువాఁడింక మీపతి సెప్పుమయ్య.

229 1. బంచిన - పెక్కు ప్రతులు. 2. నర్ఘ్యాదివిధుల — పెక్కు ప్రతులలో లేదు.

230 1. మనంబున — కొన్ని ప్రతులు. 2. నాతతయంత్ర - వా శ ; నద్భుతయంత్ర — పెక్కు ప్రతులు. 3 వీకను — కొన్ని ప్రతులు 4. చూడ గోరెడున్ — కొన్ని ప్రతులు.

232 1. యంత్రంబ — డ. 2. యురుల నేసిన — న.స. 3 తగువరుడని — అ.ఈ. ఖ ల.స ; బతియగునని — చ ద.పీ.శ.ష ; పతియగు, విభుడగు — ఇత్యాది పాఠములు గలవు 4 చులక — ఋ.క.గి$_1$ ద.బ.య.శ.ష ; బలుకు నియమము — ఉ.ఔ ఖ.

233 1. అతని నియమించినట్ల - అ.ఈ.ఋ.ఎ.ఏ.డ ; అతఁడు నియమించినట్ల - వా.శ. కొన్ని ప్రతులు. 2 నట్టులయంత్రమత్స్యమేసి యిక్కన్య — స ; నట్టుల య్యంత్ర — ద.పీ.శ.ష. 3. నేలమమ్ము దానెరిగెడు — పెక్కు ప్రతులు ; నేలతామమ్ము — వా. కొన్ని ప్రతులు.

234 క. బలహీనుఁడై నహానికి, నలవియె మోపెట్టి 1తివియ నక్కార్ముకమున్
గులహీనున కకృతాస్త్రున, కలవియె 2యాలక్ష్యమేయ నశ్రమలీలన్.

-: *పాండవులు ద్రుపదమహారాజు గృహంబునకుఁ బోవుట* :-

సం. 1-185-25

235 వ మీరాజు మనోరథంబు సఫలం 1బయ్యె వగవనేల యనిన ధర్మరాజు పలుకు విని పురోహితుండు వోయి ద్రుపదున కెఱింగించిన ద్రుపదుండు ధృష్టద్యుమ్నుంజూచి చాతుర్వర్ణ్యోచితంబు లయిన రథంబులు గొనిపోయి వారలం దోడ్కొనిరమ్మని పంచిన వాఁడును 2నాక్షణంబ పాండవుల పాలికి వచ్చి యీ రథంబులెక్కి మా రాజునొద్దకు రండనినఁ బాండవులు రాజయోగ్యంబులయి రత్నాంచితంబులయిన కాంచనరథంబు లెక్కి కుంతీదేవిని ద్రౌపదిని నొక్కరథం బెక్కించి తోడ్కొని ధృష్టద్యుమ్నుతో ద్రుపదరాజ 3నివేశంబున కరుగు4దెంచునంత ద్రుపదుండును వారల కనేక 5విధంబులైన వస్తువు లతిప్రీతిం బుత్తెంచినఁ బరార్ధ్యంబులైన యొండు వస్తువులఁ 6బరిగ్రహింపక సాంగ్రామికంబులైన యసి7చర్మ కార్ముక బాణ తూణీర8రథవరూథ వాజి వారణనివహంబులఁ బరిగ్రహించి తన యొద్దకు వచ్చువారి.

236 సీ. అజినోత్తరీయుల 1నతిసంభృతబ్రహ్మతేజుల సముదితాదిత్యసముల
నాజానులంబిమహాబాహుపరిఘుల నత్యున్న2తాంసుల నతివిశాల
వక్షుల నవిర3ళవ్యాయామదృఢకఠినాంగుల 4వృషభాక్షులయినవారిఁ
బాండుకుమారుల భరతవంశేశులఁజూచి సుతభ్రాతృ సుహృదమాత్య

234 1. తిగువ — ఒ.హా.క.మ.య.ల.స. 2. యీ యంత్రమేయ — హా.న.

235 1. బగు వగవనేల — కొన్ని ప్రతులు. 2. నక్షణంబ — కొన్ని ప్రతులు. 3. మందిరంబునకు — పెక్కు ప్రతులు 4. దెంచునంత — గ$_1$ చ.ద.శ.ష ; నంత — ఖ య ; దెంచు నవసరంబున— ఏ.న; దెంచిరంత — వా. 5. వస్తువాహన నివహంబు — చ.ట.జ డ.ద భాసం.పి.శ.ష. 6. గైకొనక — చ.ద.భాసం. పి.శ.ష. 7. వర్మ — పెక్కు ప్రతులు. 8. రథ — పెక్కు ప్రతులలో లేదు.

236 1. నభిసంభృత — పెక్కు ప్రతులు ; నధిసంభృత — న. 2. తాంగుల — కొన్ని ప్రతులు 3. త — కొన్ని ప్రతులు. 4. కమలాక్షులై — ఏ.న.

ఆ. బంధుజనులతోడఁ బరమవిద్వన్మహీ, సురగణంబుతోడ సోమకుండు
గరము సంతసిల్లె ఘనులనత్యుత్తమ, క్షత్త్రివంశ్యవరులఁ గా నెఱింగి.

237 వ. మఱియుం దన యొద్దకు వచ్చి [1]యశంకితులయి క్షత్త్రియోచితంబులైన మహోర్వాసనంబుల నున్నవారల రాజపుత్త్రులంగా నెఱింగియు సంశయాపనోదనపరుండై ధర్మతనయునకు ద్రుపదుం డిట్లనియె నయ్యా మీరు క్షత్త్రియులరో బ్రాహ్మణులరో మాయావులయి క్రుమ్మరుచున్న మంత్రసిద్ధులరో కాక [2]కృష్ణాపరిగ్రహణార్థంబు దివంబుననుండి వచ్చిన దివ్యులరో [3]యెఱుంగము మాకు సందేహంబయి యున్నయది మీకలరూ పెఱింగి కాని యిక్కన్య వివాహంబు సేయనేర మనిన ద్రుపదునకు ధర్మతనయుం డిట్లనియె.

238 క. క్షత్త్రియులము పాండు[1]ప్రియ, పుత్త్రుల మేనగ్రజుండ ఘనుతులు మరుత్పుత్త్రార్జునయము[2]లమలచరిత్రులు నలువురును వీ రరిందము లెందున్.

239 వ. వీరు కుంతీమహాదేవులని తన్నునుం దమ్ములనుం దల్లిని నెఱింగిం[1]చిన ద్రుపదుం డతిహర్షరసావేశపరవశుండయి పెద్దయుం బ్రొద్దునకుఁ దెలిసి యానంద[2]జలభరితనయనుండగుచు నాపుణ్యంబున లాక్షాగృహ[3]దాహంబువలనఁ విముక్తులరయితిరని సంతసిల్లి తద్వృత్తాంతంబంతయు ధర్మతనయువలన విని ధృతరాష్ట్రదుర్యోధనుల నిందించి [4]సామప్రియ భాషణంబుల నభీష్టసత్కారంబులను వారిం బూజించి యొక్కనాఁడు పుత్త్రమిత్త్రామాత్యబాంధవబ్రాహ్మణపరివృతుండయి ద్రుపదుండు సుఖాసీనులయి యున్న పాండవుల కిట్లనియె.

---

237 1. నిశ్శంకులయి — కొన్ని ప్రతులు 2. కన్యా — గ$_1$,చ.థ.వీ శ.ష. 3. యెఱింగింపుడు — బ.మ.

238 1. ప్రభుపుత్రుల — ఋ ఔ బ య. 2. లతుల — వ.

239 1. చిననెఱింగిద్రుపదు — వా కొన్ని ప్రతులు; చినద్రుపదు — పెక్కు ప్రతులు. 2. రస — ఓ 3. దాహంబు వలన — పెక్కు ప్రతులు; ప్రయోగంబు వలన — వా. 4. సాధుప్రియ — కొన్ని ప్రతులు.

240 క. సుత్రామపుత్త్రుఁ డభి[1]జన, పాత్త్రుండు విచిత్రవీర్యపౌత్త్రుఁడు శుభచా
రిత్త్రుండీ విజయుఁడుమ, త్పుత్త్రికి వరుఁడయ్యె నెట్టి పుణ్యోదయమో.

241 వ. స్వయంవరలబ్ధ యయిన యిక్కన్యక సర్జునుండు ధర్మవిధిం బాణి
గ్రహణంబు సేయువాఁడని ద్రుపదునకు ధర్మతనయుం డిట్లనియె నది
యె ట్లేను వివాహంబైన నంబడపడి భీమసేనుండు వివాహంబయిన మఱి
యర్జునుండు వివాహంబగుఁగాక మువ్వు రర్జునకుఁ బాణిగ్రహంబు సేయ
నెట్లగు ననిన ద్రుపదుండు ధర్మతనయున కిట్లనియె.

242 తే. [1]అట్లయగు నేని యిక్కన్య నభిమతముగ, వసుమతీనాథ నీవ వివాహ మగుము
ధర్మ[2]మార్గ మెవ్వరికిని దప్పనగునె, యనిన నాతనికనియె ధర్మాత్మజుండు.

243 వ. ఏన కా దిక్కన్యక నేమేవురము వివాహంబయ్యెద మస్మన్మాతృని యో[1]గం
బిట్టిద యది మాకు నలంఘనీయం బనిన విని విస్మితుండై ద్రుపదుం
డిట్లనియె.

244 క. ఒక్క పురుషునకు భార్యలు, పెక్కండ్రగు నెందుఁగలదు పెక్కండ్రకునా
లొక్కతయగు నేయుగముల, నెక్కథలను వినియునెఱుఁగ మెవ్వరి[1]వలనన్

245 వ. నీవు లౌకికవైదికధర్మ [1]స్వరూపవిదుండవు ధర్మాత్మజుండవు నీ పలుకులు
ధర్మవిరుద్ధంబులు గానోపుదు మయినను లోకంబుననిది యశ్రుతపూర్వం[2]బు
దీనినింక నీవును నేనును గుంతీదేవియును ధృష్టద్యుమ్నుండును
విచారించి యెల్లి నిశ్చయింతమని.

240 1. నుతి — భాసం , నుత — బొ.వ.వ

242 1 అట్టులైనను నిక్కన్య — కొన్ని ప్రతులు. 2. పథ మెవ్వరికినైన — ల.

243 1. గంబును నిట్టిద — కొన్ని ప్రతులు.

244 1. చేతన్ — కొన్ని ప్రతులు

245 1. స్వరూప వేదివి—$గ_1$ చ ద.భాసం పి.శ వ ; స్వరూపుండవు— కొన్ని ప్రతులు.
2. బింకను దీని నేనును — కొన్ని ప్రతులు.

-: వ్యాసమహాముని ద్రుపదుని యొద్దకు వచ్చుట :-

సం. 1—186—38

246 ఉ. ఈహితకార్యసిద్ధి [1]యిది యెట్లొకొ తా సమకూరునంచు సం
దేహముఁ బొంది సోమకయుధిష్ఠిరులున్నఁ దదీయధర్మ సం
[2]దేహనివృత్తి[3]పొంకెఁ జనుదెంచెఁ బరాశరసూనుఁ డాత్మతే
జోహృతసూర్యతేజుఁడగుచున్ దిశలెల్ల వెలుంగుచుండఁగన్.

247 వ. ఇట్లు వచ్చిన కృష్ణద్వైపాయనునకుఁ గుంతీదేవియుఁ బాండవులును
బాంచా[1]లుండు నతిభక్తి మ్రొక్కి యమ్మహామునిం గాంచనమణిమయో
చ్చాసనంబున నునిచి యర్ఘ్యపాద్యాదివిధులం బూజించి యున్న వారల
కుశలం బడిగి హితమధురసత్యసంభాషణామృతరసప్రవాహసందోహం
బున నందఱం బరమానంద హృదయులం జేసి[2]యున్న యమ్మునీంద్రునకు
ముకుళితకరకమలుండయి ద్రుపదుం డిట్లనియె.

248 క. తన పలుకు లోకమెల్లను, గొనియాడఁగఁ దగిన లోకగురుఁడీ యమనం
దనుఁడే మేపురమును నీ, తనుమధ్య వివాహ[1]మయ్యెదము నని పలికెన్.

249 క. మీ రెఱుఁగ[1]నట్టి లోకా,చారము గలదయ్య తొల్లి చన్న మహాత్ముల్
ధీరమతు లిట్లు సేసిన, వా రెవ్వరుఁ గలరె యాప్తవచనానుమతిన్.

250 క. విమలమతి [1]యన్యులకువిష, యమె ధర్మాధర్మనిర్ణయము సేయఁగ ది
వ్యమునీంద్ర దీనిసువిచా,రము [2]సేయుము ధర్మసంకరము గాకుండన్.

246 1. యగుటెట్టులొకో సమకూరు — కొన్ని ప్రతులు. 2 దేహముపాచుపొంకె — వ; దేహము బాపుపొంకె — ఓ.ప. 3. పొంకె — పెక్కు ప్రతులు ; పుట్ట — గి.చ.ద.వా.వీ.శ.ష ; సేయ — య.

247 1. లురునతి — పెక్కు ప్రతులు. 2. ననమ్మునీంద్రునకు — కొన్ని ప్రతులు.

248 1. మయ్యెదంబని (?) పలికెన్ — వ ; మయ్యెదమని పలికెదున్ — $గి_1$.ద.వీ.శ.ష.

249 1 నిట్టిలో కాచారము — చ.ట.స

250 1 నన్యులకు — భాసం.ల. కొన్ని ప్రతులు. 2. సేయగదయ్య సంకరము — ఐ.

251 వ. అనిన నా ద్రుపదునకుఁ గృష్ణద్వైపాయను సమక్షంబున ధర్మజుం డిట్లనియె.

252 చ. నగియును బొంకు[1]నందు వచనంబు నధర్మువునందుఁ జిత్తముం
దగులదు నాకు నెన్నఁడును ధర్మువవశ్యమునట్ల కావునన్
వగవక మాకు నేవురకు వారిజ[2]లోచనఁ గృష్ణనీఁదగుం
దగదను [3]నీవిచారములు దక్కి వివాహ మొనర్పు మొప్పుగన్.

253 వ. [1]మఱియుం దొల్లి [2]గౌతమియయిన జటిలయను ఋషి[3]కూఁతురు తపః ప్రభావంబున వేడ్వురు ఋషులకు నొక్కతియ భార్యయయ్యెననియును [4]దాక్షాయణియను మునికన్యక యేకనామంబునఁ [5]బ్రచేతసులనం బరగిన [6]పదుండ్రకు నొక్కతియ భార్య యయ్యెననియును గథల వినంబడు మఱియట్లుంగాక.

254 ఆ. గురులలోనఁ బరమగురువు దల్లియ యట్టి, తల్లివచనమును విధాతృ[1]కృతము
నన్యథాకరింప నలవియే యనిన[2]నం,దఱకు నిట్టులనియె ద్రుపదవిభుఁడు.

255 వ. ధర్మ[1]సూక్ష్మత[2]నిర్ణయింప మన[3]కశక్యంబు [4]త్రిలోకవంద్యుండు త్రికాల ప్రవర్తనవిజ్ఞాననిధి యీ కృష్ణద్వైపాయనుండు విచారించి యెద్ది యాన[5]తిచ్చె నదియ యిప్పుడు కర్తవ్యం బనిన విని యమ్మునివరుండు ద్రుపదున కిట్లనియె.

252 1. గాదు — మ. 2. నేత్రిని — ప 3. దుర్విచారము — ఒ.క.చ.జ ట.ద య.వీ.శ ష

253 1 మఱియు — పెక్కు ప్రతులలో లేదు. 2. గౌతమియైన జటిలయను ఋషి కూతురు — భా.సం.వీ. ఇచ్చట సంస్కృత మూలము — శ్రూయతేహి పురాణేపి జటిలానామ గౌతమీ ఋషీనధ్యాసితవతీ సప్తధర్మభృతాంవర. చిత్రశాలాప్రతి — పుట 317. మఱియు మహాభారతానుక్రమణిక సోరెన్సన్ పుట 356. గౌతముం డైన జటిలుండను ఋషికూతురు — వా. పెక్కు ప్రతులు. 3. కూతురు జితమతి యనునది — ల. 4 వార్క్షి — అని సంస్కృతమూలము. తథైవమునిజా వార్క్షి తపోభిర్భావితాత్మనః । సంగతాభూద్దశ భ్రాతౄనేకనామ్నః ప్రచేతసః 5. ప్రాచేత సులనంబరగిన — ఐ.ఓ 6. పదుగురకు — మ ; పదునొక్కండ్రకు — వ.

254 1. కృతియు — పెక్కు ప్రతులు. 2. నందరకుననియె బృషతనందనుండు — కొన్ని ప్రతులు ; నందఱకు నిట్టులనియె ధరణివిభుఁడు — మ ; నందఱకు ననియె పృషదతనయుఁడిట్లు — న.వ

255 1. సూక్ష్మంబు — అ.ఐ.గ 2. నిశ్చయింప — కొన్ని ప్రతులు. 3. కవశ్యంబు — ఋ.య. 4. త్రికాలవేదియు — న. 5. తిచ్చునదియ — మ.

256 సీ. ధర్మతత్త్వజ్ఞుఁడీ ధర్మతనూజుండు ధర్మమార్గంబేల తప్పఁబలుకు
దేవతామూర్తి యిద్దేవి మాధవి యేల తానెఱుంగక [1]యనృతంబు వలుకు
వీరలపలుకులు వేల్పులమతమును [2]నొక్కండ కావున నొండుదక్కి
యీయేవురకుఁ గూఁతునిచ్చి వివాహంబుఁ గావింపు మఱి దీనికల తెఱంగు

ఆ. వినఁగ నిష్టమేని వినుమని ద్రుపదుచే, యూఁదియింటిలోని కొనర [3]సరిగి
తాను నతఁడు నేకతమయుండి వానికం, తయును జెప్పఁ దొణఁగె ధర్మ
విదుఁడు.

## —: ద్రుపదునకు వేదవ్యాసుండు ఇంద్రసేనయను పతివ్రత కథ సెప్పుట :—

1-100-60

257 వ. [1]ఇది తొల్లి నాలాయనియైన యింద్రసేన యనంబరగిన పరమపతివ్రత మౌద్గల్యుండను మహామునికి భార్యయయి కర్మవశంబున నమ్మునిం గుష్ఠవ్యాధిబాధితత్వగస్థి[2]భూత[3]కష్టశరీరు వయోవృద్ధు [4]వలిపలిత[5]ధరు దుర్గంధవదను దుఃఖజీవు నతికోపను [6]విశీర్యమాణ[7]నఖత్వచుం బరమభక్తి నారాధించి తదుచ్ఛిష్టం[8]బు కుడుచుచున్న నొక్కనాఁడు.

258 తే. కుడుచునెడవాని వెనువ్రేలు కూటిలోన, దునిసిపడియున్న వ్రేలుపుచ్చి
తోయజాక్షి
యేవగింపక యుచ్ఛిష్టమిష్టలీలఁ, దగిలి కుడుచుచున్నంత నత్తరుణిఁ జూచి.

256 1. యేలతప్పబలుకు—ప. 2. నొక్కటిగావున — కొన్ని ప్రతులు. 3. దిగిచి — ఆ.హై

257 1 ఈ నాలాయన్యుపాఖ్యానము భండార్కరు ప్రతి, నీలకంఠప్రతి, వావిళ్ల ప్రతి, మొదలగు సంస్కృత భారత ప్రతుల యందు మూలగ్రంథ భాగములో చేర్చఁబడ లేదు. నీలకంఠీయ వ్యాఖ్య యందు దీని ప్రశంస యిట్లున్నది. అత్ర యత్తద్దేవాదదుః ఇత్యాదినా త్రిపథగాం నదీమిత్యన్తో నారాయణ్యుపాఖ్యానగ్రంథోఽధ్యాయద్వయాత్మకః క్వచిత్పుస్తకే పఠ్యతే. ఇచ్చట దీనికి నారాయణ్యుపాఖ్యానము అను పేరు కాన్పించుచున్నది.

భండార్కరు ప్రతి అనుబంధము 100 పుట943 లో ఇది సవిస్తరముగ నీయఁబడినది. అట్లే వావిళ్ల తెలుఁగు ముద్రణ సంస్కృత ప్రతియందును కథాశేషముగా 463—66 పుటలలో నీయఁబడినది. 2. శోషితభూత — ఒ.జ. 3. కష్ట — పెక్కు ప్రతులలో లేదు. 4. వలి — చ.పీ.భాసం.ష. 5. దేహు — కొన్ని ప్రతులు; తను — కొన్ని ప్రతులు. 6. వికీర్యమాణ — ద.శ.ష. 7. దంతనఖుండైనవాని — ఉ. 8. బగుకూడుకుడుచుచున్న — ఐ.

259 వ. [1]దానిదయిన పతిభక్తిగుణంబునకు మెచ్చి మౌద్గల్యుండు ప్రసన్నుండయి నీకెద్ది యిష్టంబు వేఁడు మిచ్చెద ననిన నది యిట్లనియె మునీంద్రా [2]నాకుం గా మోప[3]భోగేచ్ఛ పెద్దగలదు నీవునుం దప[4]శ్శక్తిఁ గామరూపధరుండవయి యీ బీభత్సంబగు రూపం బుడిగి మనోహరం బయిన [5]రూపంబునం [6]బంచధావిభక్తుండవయి నన్ను రమియించి కామభోగంబులం దనుపు మనిన నమ్ముని దాని[7]కిష్టం బైనవిధంబున నేను దేహంబులుదాల్చి మర్త్యదేవలోకంబులయందు బ్రహ్మర్షి దేవర్షి పూజితుండై [8]సూర్యరథం బెక్కి చనియాకాశగంగాజలంబుల నాప్లుతదేహుండయి శీతాంశునంశుజాలంబుల వసియించి [9]మేరుకైలాసంబుల యందుఁ గ్రీడించుచు ననేక[10]స్థానంబుల ననేకసహస్రవర్షంబులు నాలాయనిదైన యింద్రసేన నుపభోగించి తృప్తుండై మౌద్గల్యుండు దాని విడిచి ఘోరతపంబు సేసి బ్రహ్మమయుండై [11]బ్రహ్మలోకంబునకుఁ జనిన నది కామభోగంబులం దనియక కాలవశంబున శరీరంబు విడిచి కాశిరాజను రాజర్షికిం బుట్టి పెరుఁగుచుం గన్యాత్వమునఁ బెద్దకాలంబుండి తనదౌర్భాగ్యంబునకు నిర్వేదించి పతింగోరి పశుపతి నుద్దేశించి యుగ్రతపంబు సేయుచున్నంత.

260 తే. దానికడకుఁ [1]బ్రత్యేకంబ ధర్మవాయు, వాసవాశ్వినుల్ ప్రీతులై వచ్చిదాని
నాత్మదేహాంశుజులకు దేహాంతరమునఁ, బత్నిఁ గాఁ గోరి రధికసౌభాగ్య
[2]యుక్తి.

259 1. బ్రహ్మసమానుండగు నప్పరమమునిముఖ్యుండు దాని — ఏ.న. 2 నాకు నీయందుగా మోప — న. 3. భోగంబులయందభిలాష పెద్దయుంగలదు — ఇ. 4. శక్తిం జేసి — ల. 5 ఆకారంబునం — వా; రూపంబుఁదాల్చి - ఓ చ.ద.శ ష. రూపంబునం - పీ. పెక్కు ప్రతులు. 6. పంచవిధభర్తవయి - ప; పంచదేహవిభక్తుండవయి — య. 7 కోరినట్లు — డ. 8. సూర్యప్రకాశంబైనరథం బెక్కి — మ; కాని మూలము నందిచ్చట సూర్యరథమనియే కలదు. సూర్యస్యచ రథందివ్య మారుహ్య భగవాన్ప్రభుః. 9. కైలాసమేరువులయందు — చ.ద. పీ శ.ష. 10. విధంబుల — ల. 11. బ్రహ్మలోకంబునకుంజనిన — పెక్కు ప్రతులలో లేదు.

260 1. బ్రత్యక్షమై — డ. 2. వృత్తి - న.

261 వ. అదియును గొండొకకాలంబు [1]జలానిలాహారయై కొండొకకాలంబు నిరాహారయై కొండొకకాలం బేకపాదంబున నిల్చి కొండొకకాలంబు పంచాగ్ని మధ్యంబుననుండి యత్యుగ్రతపంబుసేసిన నీశ్వరుండు ప్రసన్నుండయి వరంబు వేఁడుమనిన నక్కన్యక నాకుం బతిదానంబుఁ బ్రసాదింపుమని యర్థిత్వంబున నేను[2]మాఱులు వేఁడినం గరుణించి [3]యీశ్వరుండు నీకు దేహాంతరంబున నేవురుపతు లగుదురనిన నదియిట్లనియె.

262 ఆ. పతికి నొక్కరుండ పతిగాక యెందును, బతులు పలువు రవుట కతలఁ గలదె
లోకనాథ యిట్టి లోకవిరుద్ధంపు, వరమువడయ నమరవరద [1]యొల్ల.

263 వ. అనిన దానికి రుద్రుం [1]డిట్లనియె.

264 క. నావచనంబున నీక, య్యేవురుపతులందు [1]ధర్మ మెడపక యుండుం
గావున నిట్టివరం బిం,దీవరదళ[2]నేత్ర యిచ్చితిని దయతోడన్.

265 వ. అనిన నది యట్లేని నయ్యేవురు పతు లయందును బ్రత్యేకసంగమంబునను నాకుఁ [1]గౌమారంబును బతిశుశ్రూషా[2]సిద్ధియుఁ గామభోగేచ్ఛయు సౌభాగ్యంబునుం బ్రసాదింపవలయు ననిన రుద్రుండు దానికోరిన[3]వరంబు లెల్ల నిచ్చి గంగాతీరంబువనున్న యింద్రు నాయొద్దకుం దోడ్కొని రమ్మని పంచిన వచ్చెయని.

261 1. న యేక పాదంబున నీరిలో నిలిచి — ఖ.వ; నిరాహారయై — గ.ర.ల. 2. మారులుగ్గడించిన - ఎ. 3. యీశ్వరుండు - పెక్కు ప్రతులలో లేదు.

262 1. యెట్లు - ర.

263 1. డు కరుణించి యిట్లనియె — ద.బ.ల

264 1. ధర్మమెడపక — ఒ.ఖ జ ద; ధర్మమెడలక - మ. 2. నేత్రి — పెక్కు ప్రతులు; నేత్రి నీకు నిచ్చితి కరుణన్ - ఆ.

265 1. కౌమారత్వంబును — పెక్కు ప్రతులు 2. వృత్తియు - కొన్ని ప్రతులు. 3 వానినెల్ల — కొన్ని ప్రతులు.

266 క. దక్షాధ్వర[1]మథనునకుఁ బ్ర, దక్షిణపూర్వమున మ్రొక్కి తడయకచని ప
ద్మేక్షణ సహస్రచక్షుఁ బ్ర, తీక్షించుచు నుండె సురనదీతీరమునన్.

—: ద్రుపదునకు వ్యాసుండు పంచేంద్రోపాఖ్యానంబు సెప్పుట :—

సం. 1—189—1

267 వ. అట వైవస్వతుండును నైమిశారణ్యంబున సత్త్రయాగదీక్షితుండయి ప్రాణిహిం[1]స సేయకుండుటం జేసి మానవు లప్రాప్తమరణులయి [2]వర్తించుచున్న దాని సహింపనోపక యింద్రాదిదేవత లందఱు బ్రహ్మపాలికిం జని భట్టారకా మర్త్యు లమర్త్యులయి వర్తిల్లు వారయిన వారికిని మాకును విశేషం బెద్దియని దుఃఖించిన పయ్యనుసుల [3]కమరజ్యేష్ఠుండిట్లనియె.

268 క. [1]ఎంతకుఁ గృతకార్యుండగు, నంతకు డీ రంతకును భయం బందక ని
శ్చింతమున నుండుఁ డాతం, డంతము నొందించుఁ దొంటి [2]యట్టుల నరులన్.

269 క. ఆవైవస్వతువీర్యము, మీవీర్యముఁ దాల్చి [1]సూర్యమిత [2]తేజులు [3]దా
రేవు రుదయింతు రాతని, కావించు విధానమునకుఁ గారణ మగుచున్.

270 వ. అనిన నమరపతిపురోగము లయిన యమరు లెల్ల నమరాపగాసమీపంబునకుం జనునప్పుడు తత్సలిలమధ్యంబున నొక్కకన్యక యేడ్చుచున్న దాని [1]కన్నీళ్ళు కనకకమలంబులయినం జూచి వేల్పులుం దానును విస్మయం బంది [2]యింద్రుఁడక్కన్యక యొద్దకుం జని యేడ్చెద వెందుల దాన వని యడిగిన నది యింద్రున కిట్లనియె.

266 1. దమనునకు — కొన్ని ప్రతులు.

267 1. సకునోపకుందుటం – కొన్నిప్రతులు. 2 వర్ధిల్లుచున్న—న.ఱ ; వర్తిల్లుచున్న—మ. కొన్నిప్రతులు. 3. కమల సంభవుండిట్లనియె – ఆ ఉ.వ ; కమలభవుం డిట్లనియె – కొన్ని ప్రతులు.

268 1. ఇంతకు – భాసం.పీ.శ ష. పెక్కు ప్రతులు 2. యట్లజనములన్ – పెక్కు ప్రతులు ; యట్లన జనులన్—కొన్ని ప్రతులు.

269 1. హర్యమిత—ల.స. 2. తేజము వారేవురు—భాసం 3. వారేవురు—పెక్కుప్రతులు.

270 1. కన్నీటిబిందువులు — ల. 2. యక్కన్యక యొద్దకుంజని యింద్రుండెందుల దానవేల యేడ్చెదవని – చ.ద.పీ.శ.ష.

271 ఆ. నాదురోదనంబు నన్నునెఱుంగఁగ, [1]వలతయేని యమరవల్లభుండ
నాపిఱుంద రమ్ము నావుడు నప్పుడ,వ్వనిత[2]పజ్జ నంగె వాసవుండు.

272 వ. ఇట్లక్కన్యకపిఱుంద [1]నరుగువాఁడు ముందఱ హిమవదచల [2]కందరారచిత రత్నవేదికాతలంబున సింహాసనాసీనుండయి [3]తరుణరూపంబున నొక్క [4]తరుణితో జూదంబాడుచున్న [5]యాదిదేవుంగని [6]తరుణుండ కా[7]వగచి [8]సురపతి కరంబలిగి యిట్లనియె.

273 మ. అమితస్థావరజంగమంబయిన బ్రహ్మాండంబు దా[1]నింతయున్
మమతాగోచర మీత్రిలోకములు నన్మద్బాహువజ్రానుపా
ల్యము లే నింద్రుఁడ నిట్టి నన్నుఁ ఇక లీలన్ జూద మాడంగ ను
త్తమసింహాసన మెక్క నీకుఁ [2]జనునే దర్పించి నా[3]ముండటన్.

274 వ. అనిన [1]రుద్రుం డలిగి రౌద్రాకారంబున వానింజూచి మదీయ [2]క్రీడారస భంగంబుఁ జేసిన [3]యిద్దుర్మదుం బట్టితెమ్మని యక్కన్యకం [4]బంచిన నప్పుడు దానికరస్పర్శనంబున నిచేష్టితుండయి మహీతలంబు పయిం బడిన యయ్యింద్రునకు రుద్రుండిట్లనియె.

---

271 1. వలతువేని యమర ; వలయునేని యమర — కొన్ని ప్రతులు. 2. పిరుద ఆ.ఖ జ ప.బ.

272 1. నరిగి యరిగి ముందట — అ. 2. కందరాగ్రరచిత — కొన్ని ప్రతులు ; కందరాంతర రత్నవేదికా— ల. 3. తరుణరూపంబున — భాసం.ల స. ఇచ్చట మూలమున, సోపశ్యదారా త్తరుణమ్ దర్శనీయమ్, అనియే కలదు. చిత్రశాలా ప్రతిపుట 317 ; వరుణరూపంబున — వా.శ. పెక్కు తాళపత్ర ప్రతులు. 4. రమణితో—ఒ య. 5 మహాదేవుంగని—ఆ.ఒ. 6. తరుణుండకా—భాసం ; వరుణుండకా—వా.శ. మున్నగు ప్రతులు. 7. దలంచి — ఆ 8. సురపతి—అ డ.లలో లేదు.

273 1. నంతయున్ — కొన్ని ప్రతులు ; నెంతయున్ — ఒ.ద.శ ష. 2. దగునే — కొన్ని ప్రతులు. 3 ముందరన్ — కొన్ని ప్రతులు.

274 1. (విని) రుద్రుండు రౌద్రా — అ ఏ ఓ.ఔ. 2. క్రీడాసమయ — ఏ. 3. యిద్దురాత్ముంబట్టి - పెక్కు ప్రతులు. 4. బుచ్చిన — అ.

275 క. గర్వించి [1]పలికి తగు నీ, గర్వము భుజవీర్యమును బ్రకాశంబుగ నీ
పర్వత [2]వివరము [3]దెర్చి[4]పి, గుర్వింపుము చూతమనిన గోత్రభిదుండున్.

276 సీ. హరువచనమున నాగిరిరాజ [1]వివరంబు గరములఁబట్టి చెచ్చెర దినేశ
చండమయూఖముల్ రెండువిధంబులై యుండంగఁ [2]దెర్చి యాఖండలుండు
దనయట్టివారల ఘనశరీరుల నందు నలువుర నన్యుల వెలయఁజూచి
యేనిట్టు లేలొకో యేను[3]ప్రకారంబు లయితి నిం దనుచు విస్మయముఁ
బొంది

ఆ. యున్నఁ జూచి హరుఁడు గ్రన్న నయ్యింద్రుల, నేవురను మహానుభావ
మెసఁగ
మనుజయోనిఁ బుట్టుఁడని పంచె గీర్వాణ, హితము సేయుపొంతు మతిఁ
దలంచి.

277 వ. [1]వారలు ధర్మానిలశక్రాశ్వినులు దమకు నాధారకర్తలుగా ధర్మజ
భీమార్జుననకులసహదేవు[2]లనంగాఁ బుట్టిరి, కమలభవప్రముఖనిఖిల[3]సుర
గణప్రార్థితుండయి నారాయణుసితాసితకేశద్వయంబు బలదేవవాసు
దేవులై దేవహితార్థం బుద్భవించిన నందు వాసుదేవుండు వారలకుఁ గార్య
సహాయుండయ్యె నయ్యింద్రుల కేవురకును నేకపత్నిగాఁ దపంబుసేసి
శ్రీమూర్తియయిన యాజ్ఞసేని యజ్ఞవేదిం బుట్టె నమ్మవేని వీరల పూర్వ
దేహంబులఁ జూడుమని కృష్ణద్వైపాయనుండు ద్రుపదునకు దివ్యదృష్టి
యిచ్చి చూపిన.

275 1. పలికితివినీ — గ$_1$ చ ద.వి.శ.ష 2. శిఖరము — పెక్కు ప్రతులు ; శిఖరంబెత్తి — వీ. కొన్ని ప్రతులు 3. ద్రిప్పి — ఆ; దీర్చి — పెక్కు ప్రతులు. 4. ఇగిర్పింపుము — అ సం. ఈ పాఠమున ప్రాసభంగమగుచున్నది.

276 1. శిఖరంబు — పెక్కు ప్రతులు. 2. ద్రిప్పి — ఆ; దీర్చి — పెక్కు ప్రతులు ; ద్రచ్చి, దెచ్చి, దించి — స; దించి — వీ. 3. శరీరంబులైతి — ట.డ.

277 1. వారును — కొన్ని ప్రతులు. 2. లయిపుట్టిరి — పెక్కు ప్రతులు. 3. సురమునిగణ — ఆ.ఋ.ఖ ప.ల.

278 ఉ. చారుమణిప్రభాపటలజాలవిచిత్రకిరీటమాలికా
హారములన్ సముద్యదినపావకవర్ణములన్ సువర్ణకే
యూరవిభూషణావళుల నొప్పుచునున్న తదీయదేహముల్
ధీరుఁడు సూచెఁ దాళసమదీర్ఘతఁ బోల్చినవాని నేనిటన్.

279 వ. మఱియు సకల[1]లావణ్యమూర్తులయి వారల కేవురకుఁ బత్నిగాఁ దపంబు సేసిన యక్కన్యక పూర్వదేహంబును జూచి విస్మితుండయి [2]హర్షించి యున్న ద్రుపదునకు వెండియుం గృష్ణద్వైపాయనుం డిట్లనియెఁ దొల్లి [3]నితంతుండను రాజర్షికొడుకు లనంతబలపరాక్రములు సాల్వేయ శూరసేనశ్రుతసేన [4]బిందుసారాతిసారులను వారేవురుం బరస్పరస్నేహ వినయంబుల నతిప్రసిద్ధులయి పెరుఁగుచు నౌశీనర[5]పతి కన్యక నజిత యను దాని స్వయంవరంబునఁ బడసి వివాహంబయి.

280 క. కాంతివిశేషవిలాసా, నంతశ్రీఁ దనరు నజితయం దనఘులు నై
తంతువు లేవురుఁబడసిరి, సంతానము వేఱువేఱ సత్కులమెసఁగన్.

281 వ. తొల్లింటి మహాత్ములయందును నిట్టిచరితంబులు గలవుం గావునఁ బాండవుల [1]కేవురకు ద్రౌపదిం గ్రమంబునఁ బాణిగ్రహణంబు సేయింపు మిది మనచేసినయది గాదు దైవాధిష్ఠితంబని ద్రుపదు నొడంబఱిచి కుంతియుఁ బాండవులు నున్న చోటికి ద్రుపదసహితుండయి [2]కృష్ణ ద్వైపాయనుండు వచ్చి యుధిష్ఠిరున కిట్లనియె.

279 1. లావణ్య పుణ్యమూర్తి — కొన్ని ప్రతులు. 2. హర్షించి — కొన్నింట లేదు. 3 సితతంతుఁడను, శీలావంతుండను — మున్నగు పాఠములు కలవు. కాని నితంతుర్నామ రాజర్షిర్బభూవ భువివిశ్రుతః అని మూలపాఠము చూ. పి.పి. ఎస్. ప్రతిపుట 1222. 4 బిందుసారునకు మాఱుగా తిందుసారుఁడు అనియును ;అతి సారునకు మాఱుగా అద్రిసారుఁడు అనియును మూలపాఠములు. తిందుసారో౽ద్రిసారశ్చ క్షత్రియాః క్రతుయాజినః పి.పి ఎస్. ప్రతి 1222 పుట. 5 పతి— పెక్కు ప్రతులలో లేదు

281 1. కేవురకుం గ్రమంబున నిక్కన్యక పాణిగ్రహణంబు — అ.ఊ.ఎ.ఒ.ఔ.క.గ.జ. 2. కృష్ణ — కొన్ని ప్రతులలో లేదు.

—: ద్రౌపదీ వివాహమహోత్సవము :—

1-190-5

282 ఆ. నేఁడు పుణ్యదినము నెమ్మితోరోహిణీ,[1]యుక్తుఁడయిశశాంకుఁడున్న వాఁడు
మంత్ర[1]వంతముగఁ గ్రమంబున సేవురుఁ, బెండ్లియగుఁడు కృష్ణఁబ్రీతితోడ.

283 వ. అని నిశ్చయించి పంచినం బాంచాలపతియును గరం బనురాగంబునఁ [1]బురం
బష్టశోభనంబు సేయించి సమారబ్ధవివాహమహోత్సవుం డయ్యె నంత
నిరంతరక్రముకకదళీస్తంభ[2]కుంభత్సంఛ్ఛ్రత[3]సహకారాశ్వత్థ పల్లవమాలాలం
కృతద్వారతోరణంబులను జందనోదకసంసిక్తప్రాంగణరంగవల్లికృత
కర్పూరమౌక్తికపరికరంబులను గౌతుకోత్సవమంగళశృంగార [4]వారాం
గనాప్రవర్త్యమాన నృత్యయోగ[5]కృత్యంబులను నుత్సవసందర్శనాగతా
నేకరాజన్య సుహృద్బాంధవబ్రాహ్మణసంకులంబుననుం జేసి యొప్పుచున్న
ద్రుపదరాజమందిరంబునం బూర్వోత్తరదిగ్భాగంబున విచిత్రనేత్రవితత
వితానముక్తమౌక్తికకుసుమ[6]మాలాలంబనాభిరామంబును సమీచీన
[7]చీనాంశుకవిరచితస్తంభవేష్టనంబును బ్రత్యగ్రపల్లవశాల్యక్షతాంచిత
కాంచనపూర్ణకలశోపశోభితంబును లాజాజ్యసంపూర్ణ సౌవర్ణపాత్ర[8]నవ
సౌరభబహువిధపుష్పసమిత్కుశాశ్మశమ్యాభిరమ్యంబును నవగోమయ
శ్యామమరకత[9]మణిప్రభాపటలవిలిప్తహిరణ్మయవేదీమధ్యసమిద్ధాగ్నికుండ
మండితంబును [10]సర్వాలంకారసుందరంబు నయిన వివాహమంట
పంబునకుం జని నిజపురోహితుండయిన ధౌమ్యుం డాదిగా ననేకవిద్వన్మహీ
సురనివహంబుతోఁ గరంబొప్పి.

282 1. యుక్తముగ — ఏ.ఖ.న.ల.

283 1. పురంబు శృంగారించంబంచి — ల; పురంబష్టశోభనంబు సేయించి — సూ.
2. కుంభత్ — పెక్కు ప్రతులలో లేదు. 3. నవాశ్వత్థ — పెక్కు ప్రతులు.
4. వారాంగనా — పెక్కు ప్రతులు; వరాంగనా, పౌరాంగనా — ఖు.
5. నృత్యంబులను — ఓ 6. మాలాలంకృతంబును — పెక్కు ప్రతులు.
7. చీనాంబర — కొన్ని ప్రతులు. 8 నవసౌరభ బహువిధ పుష్ప — పెక్కు
ప్రతులలో లేదు. 9. మణిమౌక్తిక (గణ) ప్రభా — ఖు.ఏ.ఓ ఖ. 10. సర్వా
లంకార సుందరంబు — పెక్కింట లేదు.

284 సీ. అనఘులు కృతమంగళాభిషేకులు ధృతసముచితవేషప్రశస్తరత్న
భూషణుల్ కౌరవపుంగవు లేవురు నేతెంచి రంతఁ బూర్ణేందువదన
యధికవిదగ్ధ పుణ్యాంగనావిరచితలలితప్రసాధనాలంకృతాంగి
కమలాక్షి కమనీయకాంతాసహస్రంబుతోఁ జనుదెంచె నాద్రుపదతనయ

ఆ. భూరిభూసురేంద్రపుణ్యాహరవమును, మంగళప్రగీతమధురరవము
వివిధతూర్యవేణువీణారవంబును, విస్తరిల్లె [1]దిశలవిభవ[2]యుక్తి.

285 క. వితతప్రదక్షిణావ,ర్తిత[1]దీప్తశిఖానలమున ధృతివేల్చెఁ బురో
[2]హితుఁడగు ధౌమ్యుఁడు బుధస,మ్మతుఁడు వివాహప్రయుక్తమంత్రా
హుతులన్.

286 వ. ఇట్లు వేల్చి ముందఱ ధర్మపుత్రునకు ద్రుపదరాజపుత్త్రిం బాణిగ్రహణంబు
సేయించి తొల్లి యేవురకు వివాహంబు సేయునప్పుడు కన్యా
త్వంబు దూషితంబు గాకుండ నీశ్వరువరంబునం [1]గౌమారంబు వడసిన
యక్కన్యకం గ్రమంబున భీమార్జున నకులసహదేవులకుం బాణిగ్రహణంబు
సేయించిన.

287 తే. జనులయాశీరవంబును జదలఁ[1]దివురు, దేవదుందుభినాదంబు దివ్యగంధ
మందగంధవహామోదమానకుసుమ, వృష్టియును మహాముదముతో విస్తరిల్లె.

288 వ. అని వైశంపాయనుండు జనమేజయునకుం [1]జెప్పెనని.

284 1 దిశల — భాసం.ల.స ; విపుల — వా.శ. పెక్కు ప్రతులు. 2. మొప్ప — ఉ

285 1 దీప్తి - ఐ ఖ.ట.ద య ల. 2. హితుడా ధౌమ్యుడు — కొన్ని ప్రతులు.

286 1. గౌమారంబు — భాసం పీ కొన్ని ప్రతులు, కౌమారత్వంబు - వా.శ
కొన్ని ప్రతులు

287 1. జెలగు — ఔ.ల ; దేవదుందుభిస్వనంబులును బంధురసుగంధమానితానూన
పవనోద్యమాన కుసుమవృష్టి — ఊ; దేవదుందుభిధ్వానములును బంధురసుగంధ
మంద — ఎ.ఒ జ.

288 1. జెప్పిన విధంబు సవిస్తరంబుగా - అని పెక్కు ప్రతులు.

## ఆశ్వాసాంతము

289 క. విద్యావిలాసపార్థివ, విద్యా[1]ధర నిఖిలరాజవిద్యానిధి శ్రీ
తద్యుతి [2]విశదయశః[3]ప్రసరద్యోతితసర్వలోకరాజ[4]మహేంద్రా.

290 స్వాగతము. రాజరాజ గుణ[1]రాజిత రాజ, త్తేజ రాజకులదీప విశిష్టాం
భోజమిత్ర నృపపూజిత, పాదాంభోజ భూవినుత [2]పుణ్య[3]వరేణ్యా.

## గద్యము

ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్ట ప్రణీతంబైన శ్రీమహాభారతంబు
నందు నాదిపర్వంబున ధృష్టద్యుమ్నద్రౌపదీసంభవకథనంబును
గృష్ణద్వైపాయన సందర్శనంబును గంగాతీరంబున నంగార
పర్ణు నర్జునుండు జయించుటయుఁ దాపత్యవసిష్ఠౌర్వోపా
ఖ్యానంబును ద్రౌపదీస్వయంవరంబును బంచేంద్రో
పాఖ్యానంబును ద్రౌపదీవివాహంబును నన్నది
సప్తమాశ్వాసము

289 1 ధిప - స 2. విమల - ర, నిజవిశదయశః। ప్రద్యోతిత - స. 3 ప్రకర - కొన్ని ప్రతులు. 4. నరేంద్రా - కొన్ని ప్రతులు.

290 1. రాజవిరాజ త్తేజ - పెక్కు ప్రతులు. 2. భూప - ఖ. 3. చరిత్రా - ఐ

—:o:—

# శ్రీమదాంధ్రమహాభారతము

## ఆదిపర్వము - అష్టమాశ్వాసము

1 క. శ్రీవిభవ[1]నిత్య[2]నిలయ ద,యావర్ధితధారుణీసు[3]రాన్వయ వేంగీ
భూవల్లభ నిఖిలజగ,త్పావనశుభచరిత భావభవనిభసుభగా.

*-: పాండవులు ద్రుపదురాజు పురంబున నిష్టోపభోగంబు లనుభవించుచు*
*సుఖం బుండుట :-*

సం. 1-190-25

2 వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం [1]జెప్పెనట్లు [2]పాండవులేవురకుం బాంచాలిం బరమోత్సవంబున వివాహంబు [3]సేయించి ద్రుపదుం డయ్యేవురకు వేఱువేఱ యనర్ఘ్య[4]మణిఖచితంబులైన యాభరణంబులను నపరిమితంబులైన యర్థరాసులను [5]సౌవర్ణంబులయిన శయ్యాసనపరికరంబులను [6]నూఱేసి భద్రగజంబులను నూఱేసి కాంచనరథంబులను [7]వేయేసి కాంభోజహయంబులను పదివేవురేసి [8]వరవస్త్రాభరణ భూషితులగు దాసదాసీజనంబులను [9]నూఱేసి వేలు పాఁడి మొదవులను నగ్నిసాక్షికంబుగా [10]నరణం బిచ్చిన.

1 — 1. నీతి నిలయ — వ.స 2. సత్య — మ. 3. స్వయవరవే (వేం) గీవల్లభ — ; నుతవేఁగి వల్లభ—గ ర.భాసం ; న్వయ వేంగీవల్లభ—కొన్నిప్రతులు ; వేగీ—(నిరనుస్వార రూపము) గ1.

2 — 1 జెప్పినట్లు — పెక్కు ప్రతులు. 2. పాండవులకు — పెక్కు ప్రతులు. 3. చేసి — పెక్కు ప్రతులు 4 రత్న ఖచితంబులు, రత్న రచితంబులు — అని పాఠములు. 5. స్వర్ణమయంబులైన — బ.న. 6. నూఱునేసి , వేయునేసి — శ1. 7. వెయ్యేసి — అ.డ.ర. 8. వరవస్త్రాభరణభూషితులగుదాస—కొన్ని ప్రతులలో లేదు. 9. నూఱు వేలు మొదవులు — గ1.చ.ద.బ.శ.వ. శ.ష. ప్రతులయందు నూఱు శబ్దమందలి శకటరేఫము 'ఱ' రూపముతోఁ గనఁబడుచున్నది. 10. నరణంబు — చ శ ష భాసం. మున్నగు పెక్కు ప్రతులలో లేదు.

3 క. చతురుదధివలయవిఖిల, క్షితితలసామ్రాజ్యలక్ష్మికిని మూలం బై
సతి యాజ్ఞసేని పతులకు, నతిముద[1]మొనరించెఁ దుష్ప్రాపుగు [2]శుశ్రూషన్.

4 సీ. కోడలి యుత్తమగుణముల కెంతయు [1]సంతోషమునఁ బొంది కుంతిదేవి
లలితాంగి హరియందు లక్ష్మి[2]సి మఱి చంద్రునందు రోహిణి నింద్రునందుశచి[3]ని
నవ్వసిష్ఠమునీంద్రునం దరుంధతిఁ బోలి సుందరి నీపతులందుఁ బ్రీతిఁ
బతిభక్తియొప్ప నపత్యంబుఁ బడయుము [4]గురువృద్ధబాంధ[5]వాతుర[6]విశిష్ట

ఆ. జనుల నతిథిజనుల సతతంబుఁ బూజింపు, మన్నదానమున ధరామరేంద్ర
వరులఁ దనుపు మఖిలవసుమతీప్రజకెల్లఁ, [7]గరుణ గలుగు[8]మమ్మ కమల[9]నేత్ర.

5 ఉ. పూని పరాక్రమం [1]బెసఁగ భూతలనాథుల నోర్చి వీరులై
యీ నవఖండ[2]మండితమహీతలమేలుచు నీపతుల్ పయో
జానన రాజసూయమఖమాదిగ నధ్వరపంక్తిసేయుచో
మానుగఁ బత్ని వీవగుము [3]మానితధర్మ [4]విధానయుక్తితోన్.

6 క. ఇందీవరలోచన నీ, యందే నభినందితాత్మ [1]నై నట్టులు నీ
నందనులయందుఁ బౌత్త్రిల, యందును నభినంద్య వగు[2]మ యని దీవించెన్.

7 వ. అట వాసుదేవుండు ద్రౌపదిని బాండవులేవురు వివాహంబగుట విని సంతసిల్లి
వారేవురకు వజ్రవైడూర్యమరకతమౌక్తికవిభూషణంబులును నానాదేశ

3 1. మొదలించె — వ. 2 పరిచర్యఁ — ఉ.న.వ స.

4 1. సంతుష్టచిత్తయై, సంతోషచిత్తయై — అని పాఠములు 2—3. 'ని'కి బదులుగా 'యు' గానంబడియెడి. 4 కురువృద్ధ, కులవృద్ధ — అని పాఠములు 5 వోత్కర-ట. 6. విపన్న — ల స 7. గలుగమనుముకమల — ప.జ. 8. మబల కమలనేత్రి—కొన్ని ప్రతులు 9 నేత్రి — గు. పెక్కు తాళపత్ర ప్రతులు.

5 1. బెనయ — వ. 2 మండల — కొన్ని ప్రతులు. 3 మానిని — చ.ద.శ వ.
4. విచార — ఉ.

6 1. నగునట్టులు నీ — బ.ల. 2. దువని — క.

విచిత్ర [1]వస్త్రంబులును ననేకకంతుంగరథరత్న[2]శిబికావిలాసినీనివహంబులుం [3]బుత్తెంచిన.

8 చ. విలసితరాజ్యలీలం బరివీరభయంకరులై గుణంబులన్
[1]వెలయుచుం బాండవుల్ విదితవిక్రము లుండుటం జేసి దేవతా
దులవలనన్ భయంబు ద్రుపదుం [2]డెఱుంగండ తదీయదేశముల్
[3]దలరక యొప్పె రోగభయతస్కర [4]డాపురవర్జితంబులై.

-: చారులవలన పాండవుల యభ్యుదయమును విని
దుర్యోధనుఁడు నిర్వేదించుట :-

సం. 1-191-1

9 వ. ఇట్లు పాండవులు ద్రుపదుపురంబున [1]నఖిలరాజ్యవిభవసమన్వితులయి యొక్క సంవత్సరం బుండునంత నంతయు నెఱింగి దుర్యోధన[2]గూఢాచారు [3]లరిగి కర్ణదుశ్శాసనసౌబలసోమదత్త[4]పరివృతుండయి యున్న దుర్యోధనునకు మ్రొక్కి యిట్లనిరి.

10 సీ. కర్ణశల్యులు మొదల్ గాఁగల భూపతు లత్యంతబలవంతు లస్త్రవేదు
లుద్ధతుల్ మోపెట్ట నోపనిచాప మక్రియమున మోపెట్టి చదలఁదిరుగు
నయ్యంత్ర మేసి మీయందఱ [1]ముందరఁగృష్ణఁ[2]దోడ్కొని యొక్క కృష్ణవర్ణుఁ
[3]డెక్కటి రణములో నేపునఁ గానీను నోడించి జయలీల నున్నయాతఁ

7 1 వస్తువులును — ద.శ.ష. 2 రథ్యశిబికాందోళవిలాసినీ — చ.జ.ట.ద.శ.ష 3. గొని వచ్చి యిచ్చి దుప్రిపదు పురంబున నున్న (నున్నంత) — చ.ట.డ.వ.వీ.శ.ష ; మూలమునందు, ప్రాహిణోద్వాసుదేవశ్చ పాండవేభ్యో రిపుంజయః,ముక్తావైదూర్య. వాసుదేవుఁడు కానుకలు పంపినట్లే కలదు గాని, అతఁడు స్వయముగ వచ్చినట్లు లేదు. పి.పి.ఎస్ ప్రతి. పుట 1232

8 1. వెలుగుచు — ఆ.బు. 2. డెరుగండు — పెక్కు ప్రతులు 3. దలఁకకయుండు — గి$_1$.చ.వ.శ.ష ; తలఁగక — ప 4. డాంబర — కొన్ని ప్రతులు ; డంబర — య.

9 1. నధిక - కొన్ని ప్రతులు. 2 గూఢ — పెక్కు ప్రతులలో లేదు. 3. లెరింగి చని — ట 4. సహితుండై యున్న — కొన్ని ప్రతులు.

10 1. ముందర — పెక్కు ప్రతులు ; ముందట — ట వా 2. చేకొని — ఒ ట.జ. బ య.ల. 3. డెకట్కిరణములో నేపునఁగానీను — న; డెక్కటఁగానీను నేపు

ఆ. డర్జునుండు మఱి మహాబాహుబలమున, శల్యుఁ ద్రెళ్ళవైచి శత్రువరుల
నెల్లఁ దల్లడిల్ల [5]నెగచినయాతండు, భీమసేనుఁ డమితభీమబలుఁడు.

11 చ. అనిమొన నట్లుదాఁకిన మహా[1]రథులఁ ధృతరాష్ట్రరాజనం
దనుల [2]బలాఢ్యులన్ [3]దళితదర్పులఁ జేసినవారు ధర్మనం
దనయము లుగ్రవీరు లని తద్విధ మంతయు నేర్పడంగఁ జె
ప్పిన విని కౌరవప్రభుఁడుఁ బెల్కుఱి తద్దయు [4]దుఃఖితాత్ముఁడై.

12 వ. అక్కట పురోచనుం డొక్కరుండ లక్కయింట దగ్ధుండయ్యెం గాకేమి దైవానుకూల్యంబు లేక మానుషం బెంత యయ్యు నేమి సేయుఁ బాండవు [1]లేమి [2]దైవసంపన్ను[3]లైరో యని వగచి యీయవసరంబున ద్రుపదు భేదించి పాండవుల [4]నుత్పాదింపవలయు నెట్లనిన.

13 ఉ. యాదవవృష్ణిభోజవరు లందఱుఁ బాండవపక్షపాతు ల
చ్చేదివిభుండు [1]వారలన[2]చేకొనువాఁడగు వీర లెల్ల నా
త్మోదయ[3]వృద్ధి[4]బొంటెను దదున్నతిఁగోరుదు రట్లుగావునన్
భేదము సేయఁగా వలయుఁ [5]బెల్చన యందఱుఁ గూడ కుండఁగన్.

14 వ. అని దుర్యోధనుండు పాండవపాంచాల విభేదనోపాయంబుఁ జింతించుచుండె నంత విదురుండు పాండవాభ్యుదయంబును బాంచాలీస్వయంవరంబును దుర్యోధనాదులు భగ్నదర్పులగుటయు విని సంతసిల్లి పాండవులు ద్రుపదరాజ పుత్త్రిం బెండ్లియై ద్రుపదుపురంబున సుఖంబున్న వారని ధృతరాష్ట్రునకుం జెప్పిన నతండిట్లనియె.

నరణములో—చ.శ.ష. కొన్నిప్రతులు ; డెక్కటికానీనునేపు రణంబులో—వా. కొన్ని ప్రతులు. 4 త్రుళ్లడంచి—ల.స ; డొల్లవేసి—బొ. 5. నేచిన, నేసిన—అని పాఠములు

11 1. బలులఁ—ఎ. 2. ననేకులఁ—స. 3. విగత — కొన్ని ప్రతులు. 4. భీతచిత్తులై—ఓ.డ.

12 1. లెంత దైవసంపన్నులో — వ.వీ శ ష. కొన్ని ప్రతులు. 2. దైవమానుష సంపన్నులైరో — కొన్ని ప్రతులు 3 లోయని — కొన్ని ప్రతులు. 4. నుత్పాటింప, సాధింప - అని పాఠములు.

13 1. వీరలన—వ. 2. చేకొనియుండును—గ్రి ౧ చ.ద.శ ష. 3. సిద్ధి—క.గ్రి.చ.ట.ద వీ.శ.ష ; బుద్ధిపొంటెను — భాసం. 4 కంటెను — అత్యధికసంఖ్య ప్రతులు 5. చేర్చిన యందరు — క.ట; పెల్లున (గ) నందరు—గ.వ; పెల్చననందరు — కొన్నిప్రతులు.

15 ఆ. యజ్ఞసేనుకూఁతు నఖిజాత నాతని, యజ్ఞవేది [1]నుదిత యయినదాని
ననఘవిధి వివాహమయి పాండునంద[2]నుల్, మిగుల మిత్రబలసమృద్ధు లయిరి.

16 క. కొడుకుల యభ్యుదయమువిని, కడుసంతసమయ్యెనిపుడు కౌరవకుల మే
ర్పడ [1]వెలుఁగె నెల్ల[2]రాజుల, [3]నొడిచిన భుజవీర్యమున మహోత్సాహమునన్.

17 వ. అని విదురునకు [1]మనఃప్రియంబుగాఁ బలికి యంతఃపురంబునకుంజని [2]యంత
స్తాపం బేర్పడకుండ నుండునంతఁ గర్ణదుర్యోధనులు ధృతరాష్ట్రుపాలికిం జని
యిట్లనిరి.

*—: దుర్యోధనుఁడు తండ్రితోఁ బాండవపాంచాల*

*విభేదనోపాయంబు నాలోచించుట :—*

సం. 1-192—25

18 క. రేయును బగలును విదురుఁడు, నీయొద్దన యునికిఁ జేసి వేరము పలుకన్
[1]మాయిష్టం బెఱిఁగింపఁగ, ధీయుత[2]యెడఁగంటి మిన్ని దివసంబులకున్.

19 క విదురుఁడు పాండవహితుఁడని, మొదలన యెఱిఁగియుము నతివిమోహంబున న
వ్విదురు[1]వచనంబ నిలుపుదు, హృదయంబున నతఁడు పెద్దయిష్టుఁడు మీకున్.

20 వ. అనిన వారలకు ధృతరాష్ట్రుం డిట్లనియె.

15 1. బుట్టినట్టి దాని — ఓ 2. నుల్ మిగిలి — కొన్ని ప్రతులు.

16 1. చెలగె — ఓ; వెలుగె — ఆ.క.గ.జ.డ ; వెలిఁగె — వా. కొన్ని ప్రతులు. 2. వారల — గి.శ ష స. 3. నొడిచిరి, నొడిచితి — అని పెక్కు పాఠములు.

17 1. మనః—కొన్నిప్రతులలో లేదు. 2. యంతస్సంతాపంబు—గ.గి.చ.ద.ఛాసం.ల.వి.శ.ష.

18 1. మాయభిమత మెఱిఁగింపఁగ — మ. 2. పొడగంటిమి — డ.

19 1. వచనములు — వి.శ ష. కొన్ని ప్రతులు.

21 సీ. పలుకులఁ [1]జెయ్యులఁ బాండవు[2]లకుఁ బ్రీతి[3]గలయట్లు యుండుదుఁగాని నాదు
హృదయంబు విదురున కెన్నండు నెఱిఁగింప నేను మీతలఁచిన యివ్విధంబ
తలఁచుచు నుండుదు దైవసంపద గలవారలఁ బాండవవరుల నేమి
సేయంగ నగు [4]నెద్ది చెప్పుఁడిష్టం బిఁక ననిన విచిత్రవీర్యాత్మజునకు

ఆ. దుష్టచేష్టితుండు దుర్యోధనుం డిట్టు, లనియెఁ జిత్తగింపు మవనినాథ
పాండురాజసుతులఁ బాంచాలపతియొద్ద, నుండకుండఁ జే[5]యు టుచిత[6]మిపుడు.

22 వ. అది యెట్లనినం బుత్త్రమిత్త్రబాంధవ బల[1]సంపన్నుండైన ద్రుపదునొద్దఁ బాండవు లుండువారైన వారలం గృష్ణబలదేవులు యదువృష్ణిభోజాంధక [2]వర్గములతో వచ్చి కూడిన నెవ్వరు సాధింపనోపరు గావున నెడసేయక ద్రుపదుండు పాండవుల విడుచునట్లుగా భేదింత మొండె వలను గలవారలం [3]బంచి కౌంతేయమాద్రేయులను దమలో [4]విరక్తులగునట్లుగాఁ జేయింత మొండె నతిలలితప్రమదాజనంబులఁ బ్రత్యేకంబ యేవురకుం బ్రయోగించి ద్రౌపది [5]వలన [6]విరక్తిఁ బుట్టింత మొండె నేవురకు నొక్కతియ యాలగుట కష్టంబని ద్రౌపదిఁ బాండవులవలన విగతస్నేహఁ గావింత మొండె నుపాంశుప్రయోగంబుల భీము వధియించి [7]తక్కినవారల బలహీనులం జెయుద[8]ము.

23 ఆ. గాడ్పు[1]చూలి పి[2]ఱుఁదుఁ గావంగనగ్గును, నోర్వ నమరులైన నోపరాజి
నతఁడు నిహతుఁ[3]డగుడు నశ్రమంబున, బార్థు నొక్కరుండ కర్ణుఁ డోర్వ[4]నోపు.

21 1. చెయ్యులు — ద.భాసం.పీ.ష. 2. లెడ — ఆ. 3. గలిగినట్లుండుదు — గి.చ.ద పీ.శ ష 4. నదిచెప్పుడిష్టంబనిన — అ ఋ గ బ. 5 యనుచితమిపుడు - ఈ.య. 6. మిపుడ — వ

22 1. సహితుండైన, సమేతుండైన — అని పాఠములు. 2 గణములతో — కొన్ని ప్రతులు. 3 పుచ్చి, పిలిచి — అని పాఠములు 4. విభక్తులగునట్లు — ఊ. 5. యందు — కొన్ని ప్రతులు 6. విరక్తులం జేయుద — బ. 7. తక్కిన — కొన్ని ప్రతులలో లేదు. 8. మొండె — అ.ఋ.క.న

23 1. చూలు — అ.ఆ.ఋ.క.ఖ.ప మ.య.స 2 ఱుద - కొన్ని ప్రతులు. 3. డైన - కొన్ని ప్రతులు. 4. జాలు, గలడు - అని పాఠములు.

24 వ. ఈయుపాయంబులలో నెయ్యది [1]యుచితంబును నపగతదోషంబును [2]నదీర్ఘసూత్రంబును నగునట్టిదానిం జెచ్చెర ననుష్ఠించునది యనినఁ గర్ణుం డిట్లనియె.

25 సీ. [1]ఆర్యవృత్తుండు [2]రాజాన్వయసమ్మతుఁ డభిమత[3]సంబంధుఁ డయినవాఁడు
గుణవంతులగుచున్న కొడుకులు గలవాఁడు పాంచాలుఁడేల యప్పాండుసుతుల
వినయసంపన్నుల విడుచువాఁడగు మఱి పాండునందను లేకపత్ని[4]యంద
కరమనురక్తులు గావునఁ దమలోన నేల భేదిల్లుదు రెన్నఁడయ్యు

ఆ. నొక్కసతికిఁ బతులు పెక్కండ్రు[6]డు రగుటది, సతులకొక్క[7]గాన యతివక్ష్యత్ర
సుందరాంగి వారియందేల య[8]పరక్త, యగు మనో[9]ముదంబుఁ[10]దగులుఁగాక.

26 వ. మఱి భీమసేనుండు దొల్లి మీచేసిన యుపాంశు[1]వధల నేమియయ్యె నింకనునట్ల
కావున నీయుపాయప్రయోగంబులన్నియు నుడిగి యిప్పుడ పాండవుల
యందు విక్రమంబు ప్రయోగించుట కార్యం[2]బు.

24 1. యభిమతంబును — పెక్కు ప్రతులు. 2. న – శ.ష. మున్నగు పెక్కు ప్రతులలో లేదు. అప్పుడు అపగతదోషంబును దీర్ఘసూత్రంబును అని వారమేర్పడను మూలమిట్లున్నది. తస్య ప్రయోగమాతిష్ఠ పురాకాలోఽతివర్తతే। యావత్ప్రత్యక్షత విశ్వాసాద్రుపదే పార్థివర్షభే। తావదేవహి శక్యాస్తేన శక్యాస్తుతతఃపరం। పి.పి.ఎస్. ప్రతిపుట. 1255.

25 1. ఆర్యవర్తనుఁడు — గి₁.చ.ద.ఛాసం.ల.వీ.శ.ష. మూలము — ఆర్యవృత్తశ్చ పాంచాలః పి.పి.ఎస్. ప్రతి పుట 1256. 2. రాజాన్వయ సమ్మతుఁడు – గి.చ.ద ఛాసం.వీ.శ.ష ; రాజాన్వయ వర్ధిష్ణుఁడు – ల.ష ; రాజాధర్మవర్జితుఁడు – స ; రాజాధమవర్జితుం – వా. కొన్ని ప్రతులు. 3. సద్బంధుడైనవాడు – ఉ 4. యందు – కొన్ని ప్రతులు. 5. డైన — పెక్కు ప్రతులు. 6. డ్రులగుట — గి₁.శ.ష. ఛా.కూ ; పెక్కండురగుటది — సం. 7 గావునతివ — గి₁.గు.చ.ద.వీ.శ.ష.సూ. 8. విరక్త — కొన్ని ప్రతులు 9. రథంబురగులు – చ.శ.ష. 10. నందుగాక — ఋ.వ; ఇచ్చట ప్రాసయతి తప్పినది

26 1 ప్రయోగంబుల — ఒ.ఖ.గ.గి₁.చ.జ ద.ఛాసం.య వీ.శ.ష. 2 బుమరియు—న.

27 చ. ఘన మగువిక్రమంబునన కాదె జగత్త్రితయంబుఁ బాకశా
సనుఁడు జయించె భూతలము సర్వము [1]మున్ భరతుండు విక్రమం
బునన జయించె విక్రమ[2]ము భూరియశఃప్రియుటైన రాజనం
దనులకు సర్వసాధనము ధర్మువు శత్రునిబర్హణం[3]బులన్.

28 వ. [1]కావునఁ జతురంగబలసాధన [2]సన్నద్ధులమయి యుద్ధంబునం బాంచాలు [3]భంజించి పాండవుల నొండు[4]గడనుండనీక తోడ్కొని[5]తెత్తమనినఁ గర్ణు పలుకు లాకర్ణించి ధృతరాష్ట్రుం డిది య[6]కార్యంబగు నయిన[7]ను మతిమంతులతో విచారించి చేయుదమని భీష్మద్రోణవిదుర[8]శల్యకృపాశ్వత్థామ సోమదత్తాదులం బిలువం బంచి యంతయు నెఱింగించిన భీష్ముండు దుర్యోధనుం జూచి యిట్లనియె.

29 మత్తకోకిలము. ధీరు[1]లౌ ధృతరాష్ట్రపాండు లతిప్రశస్తగుణుల్ ప్రసి
ద్ధోరుకీర్తులు నాకు [2]నిద్దఱు నొక్కరూప తలంపఁగా
వీరు వారను నట్టిబుద్ధి [3]విభేద మెన్నఁడు లేదు గాం
ధారి పుత్త్రశతంబునందుఁ బృథాతనూజుల [4]యందునున్.

27 1. నున్ — ట.ద.శ.ష; నాభరతుండు — క.ట.గ న.వ.బ. 2. విభూతి — ఏ.ఖ.న. 3. బిలన్ — కొన్ని ప్రతులు.

28 1. కావున విగతస్నేహులమయి చతురంగ — గి.చ.ద.వీ.శ.ష. 2. సమృద్ధులమయి — ట. 3 భేదించి, వధియించి, బంధించి — అని పాఠములు; పాంచాలుర అనికూడ గలదు 4. కడ — శ.ష. కొన్ని ప్రతులు. 5. తెమ్మని, వత్తమని — అని పాఠములు. తెత్తమనినకర్ణు పలుకులు — సమాసము కనుక పరశాదేశముకాదని భా.కూ. 6. కార్యంబయి(బై)నను — గి$_1$.శ.ష. పెక్కు ప్రతులు. 7. ను మంత్రులతో — కొన్ని ప్రతులు 8. మూలమున ఈ సందర్భమున శల్యుఁడు మున్నగువారి ప్రశంస లేదు. భూయ ఏవచభీష్మశ్చ ద్రోణోవిదురఏవచ। యువాంచకురుతం బుద్ధింభవేద్యావత్సుఖోదయః పి.పి.ఎస్. ప్రతి. పుట. 1258.

29 1. లీ — పెక్కు ప్రతులు. 2. నిం(నం)దరు — ఆ.ప. 3. విభేదమెన్నడు — గి$_1$.వీ. శ.ష.తి.వీర.వృ అక.భాసం. కొన్ని వ్రాఁతప్రతులు; వివేకమెన్నడు — వా.శ. కొన్ని ప్రతులు. 4. యందునన్ — బు అక.వృ; యందు నున్ — య.స.తి భాసం.భా.కూ. కొన్ని ప్రతులు; యందుమున్ — వా. కొన్ని ప్రతులు.

-: భీష్మద్రోణులు దుర్యోధనునకు బుద్ధిసెప్పుట :-

సం. 1–195–1

30 వ. అప్పాండవులతోడి విగ్రహంబు సేత కెన్నండును నొడంబడ[1]నేరఁ బిత్రు పైతామహం బయిన రాజ్యంబునకు [2]నీయట్లవారు నర్హులు గావున వారికి నర్ధరాజ్యంబిచ్చిన నీకును నీబాంధవులకును [3]లోకంబులకును బ్రియంబగు నట్లు గానినాఁ డపకీర్తియగుఁ గీర్తి [4]నిలుపుటయకాదె [5]రాజులకు జన్మఫలంబు

31 ఆ. కీర్తిలేనివానికిని జీవనంబు ని,రర్థకంబ చూవెయవనిమీఁద నిత్యమయిన ధనము నిర్మలకీర్తియ, యట్టికీర్తి వడ[1]యు టక్రమంబె.

32 క. ఇలఁగీర్తి యెంతకాలము, గలిగి ప్రవర్తి[1]ల్లె [2]నంతకాలంబును ని త్యుల కారెకీర్తిగల పు,ణ్యులు కీర్తివిహీనుఁడెందునుం బూజ్యుండే.

33 వ. కీర్తియు నపకీర్తియు జనులకు స్వర్గనరక [1]నిమిత్తంబులు గావున నపకీర్తి పరిహరించి [2]కీర్తింబ్రతిష్ఠించి పైతృకంబగు రాజ్యంబు పాండవులకిచ్చి వారి తోడ బద్ధ[3]ప్రణయుండవయి కీర్తి నిలుపుమనిన భీష్మువలుకులకు సంతసిల్లి ద్రోణుండు దుర్యోధనున కిట్లనియె.

30 1. నేర – పెక్కు ప్రతులలో లేదు 2 మీ – పీ.శ.ష. కొన్ని ప్రతులు. 3. లోకంబులకు – శ.ష. మున్నగు కొన్ని ప్రతులలో లేదు 4 రక్షించుటయ – పెక్కు ప్రతులు. 5. రాజులకు – పెక్కు ప్రతులు ; జనులకు – వా. కొన్ని ప్రతులు.

31 1. యుడక్రమంబు — కొన్ని ప్రతులు : యుఁడక్రమమున – ల

32 1. ల్లు — పెక్కు ప్రతులు. 2 నంతకాలము కృతపుణ్యులు కారెకీర్తనీయులు నిల గీర్తిహీనుఁడెందు నెన్నంబడునే — మ.

33 1. హేతువులు — ఆ. 2. కీర్తింబ్రతిష్ఠించి – చ ద.శ.ష. 3. సఖ్యుండవై — కొన్ని ప్రతులు.

34 చ. బహుగుణ [1]ము త్తమో త్తమము పథ్యము [2]ధర్మ్యము సాధుసమ్మతం
బహితబల[3]ప్రమాథి విపులార్థయుతం [4]బగుటఁ భవత్పితా
మహువచనంబుఁ జేకొనుము మానుగ వారలతోడ [5]నీవు వి
గ్రహ మొనరింప నేమిటికిఁ [6]గౌరవ సౌబల కర్ణ శిక్షులఁ.

35 మ, విలసద్ధర్మ [1]విశుద్ధ[2]వృత్తులు [3]వయోవృద్ధుల్ [4]కుశాగ్రీయ బు
ద్ధులు మధ్యస్థులు కార్యనిర్ణయసమర్థుల్ మానమాత్సర్య దూ
రు[5]లు నాఁజాలిన వారిపల్కులకు వైరుద్ధ్యంబు గావించు న
జ్ఞులు భూనాథున కాప్తులున్ సఖులునై [6]శోషింతు రత్యంతముఁ.

36 చ. తనరుచు [1]దైవ[2]యుక్తి మెయి ధర్మువు సత్యముఁ దప్పకున్న య
[3]య్యనఘులపై తృకం బయిన యంశము మిన్నక వజ్రపాణికై
ననుగొనఁ బోలునయ్య కురునందన పాండుతనూజు లున్న వా
రని విని వారికిందగు ప్రియం బొనరింపక [4]యున్కి [5]ధర్మువే.

37 వ. వారితో [1]విగ్రహించుట కార్యంబుగాదు కావునఁ బాండవద్రుపదధృష్ట
ద్యుమ్న కుంతీద్రౌపదులకుఁ బ్రియపూర్వకంబున నుచితభూషణాంబరావళులు
వేలువేలు [2]యిచ్చి[3]పుచ్చి పాండవుల నిందులకుఁ దోడ్కొని [4]వచ్చువారుగా

34 1. వస్తుభూషణము — స. పెక్కు ప్రతులు; బహుగుణదూర దూషణము — క. 2. ధర్మ్యము — గ$_1$ చ.ద శ ష; తథ్యము — వా. కొన్ని ప్రతులు. 3. ప్రభేది — గ$_1$.చ.ద.పీ.శ.ష. 4. బరయన్ — బు.బ. 5. నిప్డు — కొన్ని ప్రతులు. 6. కౌరవ — సంబోధనమని భా.కూ.

35 1. పరుల్ ప్రసిద్ధులు — ల 2. వృద్ధులు — ర. 3. యశోవృద్ధుల్ — గ$_1$ చ.ద. శ ష. 4. సుశాస్త్రీయ — అ.బు. 5 లనంజాలిన — గ. 6. క్షోభింతు, శోభింతు — అని పాఠములు

36 1. ధర్మయుక్తి — అ ఐ.క.ఖ మ. 2. శక్తి — బు ట.జ.డ ర. 3. త్యనఘుల — కొన్ని ప్రతులు. 4. యున్న — ఊ డ ర.వ. 5. యుక్తమే — పెక్కు ప్రతులు; బాడియే — అ.ఖ.

37 1. విగ్రహము, విగ్రహించుట — కొన్ని ప్రతులు 2 నిచ్చి పాండవుల — గ$_1$.శ.ష. కొన్ని ప్రతులు. 3 పుచ్చి—పెక్కు ప్రతులలో లేదు. 4. తెచ్చు—బ.ర; వచ్చువారిఁగా—

దుశ్శాసనవికర్ణప్రభృతుల [5]సమకట్టి పంపుమనిన ద్రోణుపలుకు [6]లవకర్ణించి కర్ణుండిట్లనియె.

38 తే. ముదుస[1]ళులు దమకిమ్ముగాఁ జదివికొంద్రు, గాక పతులకు హితమగు కర్జమేల
[2]యొలసి చెప్పదు రహితులఁ గలపికొనుట, ధర్మువని [3]రిది నయవిరుద్ధంబు
గాదె.

39 వ. మంత్రులు దమ[1]తమ బుద్ధిదోషంబుల [2]నెట్లునుం బలుకుదురు [3]వారల [4]సాధుత్వంబును [5]నసాధుత్వంబును నెఱుంగవలయు నెట్లనినఁ దొల్లి[6]నితంతువను మగధరాజు వికలేంద్రియవర్గుండయి శ్వాసమాత్రంబతక్కి రాజ్య[7]తంత్రంబు నందసమర్థుండై యున్న నాతనిమంత్రి యేకప్రధానుండయి రాజ్యతంత్రం బెల్లఁ దనవశంబయగుటంజేసి వాని నవమానించి తదీయరాజ్య విభవంబెల్లఁ జేకొనియె వాఁడును విక్రమహీనుండయి రాజ్యంబు గోల్పడియెం గావున మంత్రులు హితులపోలెనుండి యహితం బాచరిం[8]తురు మీయిద్దఱపలుకులు మాకుంజూడ నహితంబు లనిన నలిగి వానికి [9]ద్రోణుం డిట్లనియె.

40 క. ఉడుగక [1]యేమహితముఁ [2]బలి,కెడువారమునీవు [3]హితవుక్రియగొనఁగాఁ బ
ల్కెడు వాఁడవు మాకంతెను, గడుహితుఁడవు నీవకావె కౌరవ్యులకున్.

ఐ.గీ$_1$ చ భాసం పి.శ ష. 5. సమర్పింపుము — కొన్ని ప్రతులు ; ప్రముఖులం బనుపుము, సంపుము — అని పాఠములు ; నమర్చుము—వ. 6. లాకర్ణించి — కొన్ని ప్రతులు

38 1. ళుల్ — ఓ.క పి.ల. 2. చెప్పదురు శత్రుకన్నుల గప్పుకొనుట — క. 3. వినయవిరుద్ధంబు — అ.బు.ఎ.క.జ డ

39 1. తను — పెక్కు ప్రతులలో లేదు 2 నెట్లునుంబలుకనేర్తురు - మ ; యెద్దియేని యుంబలుకనేర్తురు - య. 3 హితులపోలెనుండియు యహితం బాచరించు వారల — పెక్కు ప్రతులు 4. సామర్థ్యంబును — కొన్ని ప్రతులు. 5 న సాధుత్వంబును — పెక్కు ప్రతులలో లేదు, 6. వితంతుండను, విదితుండు, అవధ్యుండు, నీతుండు, నిరవధ్యుండు, చిదానందుండు, పితానందుండు, వినందుండు (స) అని యిది యనేక విధములుగాఁ గానవచ్చుచున్నది. భండార్కరు ప్రతియందు—శ్రూయతే హి పురాకశ్చి దంబువీచ ఇతిస్మృతః పుట 781 అని యంబువీచుఁడు చెప్పఁబడినాఁడు. శ్రూయతే హి పురాకశ్చిద్విసిందఇతివిశ్రుతః అని పి.పి.ఎస్. ప్రతి పుట 1263. 7. భారంబు నందు — కొన్ని ప్రతులు. 8. తురుగావున మీ యిద్దర — కొన్ని ప్రతులు. 9. ద్రోణభీష్ము లిట్లనిరి — ఎ.ఓ ఖ.జ.బ.పి.

40 1. నేమ — అ.క.ట 2. చెప్పెదు — ఓ. 3. హితము — పెక్కు ప్రతులు.

41 క. నీ[1]కలపుల నిక్కురుకుల, మాకు[2]లతం బొందుశేమి యాశ్చర్యము సౌ
మ్యాకృతులు గానివారల, వాకులు శిశులు నుపద్రవంబు[3]ల కావే.

42 వ. అనుచున్న సమయంబున నయ్యుద్ధలవారించి విదురుండు ధృతరాష్ట్రున
కిట్లనియె.

43 సీ. ధర్మార్థ [1]వి_త్తముల్ తథ్యవాదులు వయోవృద్ధులు మధ్య[2]స్థవిమలమతులు
ద్రోణగాంగేయులు దురితవిదూరులు నిన్నెద్దిగఅపి[3]రి నెమ్మితోడ
దానిన చేయుట ధర్మువు వారలకంటె [4]హితుల్ నీకుఁగలరె యొరులు
దుర్యోధనుండును దుశ్శాసనుండును గర్ణుండు శకునియుఁ గరము బాలు

ఆ. రెఱుఁగరిదియు ధర్మువిది యధర్మంబని, యట్టివారిపలుకు లాచరించి
వినక పాండుసుతుల వేగరావించి వారలకుఁ బ్రీతినర్ధరాజ్యమిమ్ము.

44 మ. తమకుం దార యశేయు లెవ్వరికి దోర్దర్పంబునఁ దానిపై
శమితారాతిబలుండు వారలకుఁ బాంచాలప్రభుం డిప్డు సు
ట్టము [1]దానయ్యెఁ దదాత్మజుండయిన ధృష్టద్యుమ్నుడున్ వారితో
సమ[2]వీర్యుం డొడఁగూడె [3]నిష్టసఖుఁడై సంబంధబంధంబునన్.

45 మ. బలదేవాచ్యుతసాత్యకుల్ దమకు నొప్పన్ మిత్రు[1]లుం గూర్పు మం
త్రులుఁగా దైవము మానుషంబుఁగల నిత్యుల్ నీకు దుర్యోధనా
దులకంటెం గడుభక్తు లెంతయు [2]వినీతుల్ [3]వీరు లప్పాండుపు
త్త్రులు నీపుత్త్రుల కారె వారిఁదగునే దూరస్థులం జేయఁగన్.

41 1. కతమున — న ; కలపుల వినికురుకుల — ల 2 లతంబొందుట — పెక్కు ప్రతులు ; ల్యముబొందుట — ఘా.కూ.వా.శ. 3. లుకావే — పెక్కు ప్రతులు.

43 1. వేత్తలు — ఆ.ఉ ; వృద్ధులు, వృత్తులు — అనియు పాఠములు. 2. స్థిరబుద్ధిమతులు — ఆ. 3. న నెమ్మితోడ — అవం కొన్ని ప్రతులు. 4. మ నీకొరుల్ గలరెహితులు — పెక్కు ప్రతులు ; కంటె నీకతిహితుల్ గలరె యొరులు — వ.

44 1. గానయ్యె — సం. 2. వీరుండొడగూడె — కొన్ని ప్రతులు. 3. నిష్టుఁడయి దాసంబంధబంధంబునన్ — గ్రా.చ.ద.శ.ష.

45 1. ంగూర్పు — ర. కొన్ని ప్రతులు. 2 మహాదోర్వీర్యుల — క. 3. ధీరుల ప్పాండు — గ్రా.చ.వి.శ.ష.

46 ఉ. ఆహవభూమిలోనఁ బరమార్థము పార్థుఁడు వైరివాహినీ
వ్యూహము [1]వ్రచ్చుచోట మఘవుండును వానికి మార్కొనంగ ను
త్సాహము సేయఁడన్న ఘుసారుల ధీరుల సాహసుల్ నిరు
త్సాహులు [2]ద్రోహులై యెదిరి[3]చత్తురొ [4]మందురొ మానవేశ్వరా.

47 ఉ. ఆయతబాహుఁడాతనికి నగ్రజుఁ డగ్రణి [1]పోరులందు నా
గాయుతసత్త్వుఁ [2]డుద్ధతయుగాంతకృతాంతనిభుండు భీముఁడ
వ్వాయుజసవ్యసాచుల నవార్యబలోన్నతిఁ బోలుచున్న మా
ద్రేయులఁ జేయుటెవ్వరికి దేవసముల్ సమరాంతరంబునన్.

48 క. తమ్ముల[1]యట్టుల తనకు వశమ్మయి ధర్మువును ధృతియు సత్యముఁగారు
ణ్యమ్మును నొప్పఁగఁ బేర్మిని, జమ్ముగ మనుధర్మజున కసాధ్యము గలదే.

49 వ. వారల బలపరాక్రమంబు లెల్లవారికి దృష్టపూర్వంబుల యట్టివారితోడ విగ్ర
హంబుసేయు దుర్బుద్ధులుం గలరె నీపుణ్యమ్మున నమ్మహాత్ములు జననీసహి
తంబు లక్కయింట బ్రతికిరి నీయందుఁ బురోచన[1]దిగ్ధంబయిన దుర్యశఃపం
కంబుఁ బాండవానుగ్రహజలంబులం జేసి కడిగికొనుము దుర్యోధ[2]నాపరాధంబున
నఖిలమహీప్రజకు [3]నపాయం బగునని తొల్లియు నీకుం జెప్పితి నట్లు[4]గాకుండ
రక్షింపుమనిన విని ధృతరాష్ట్రుండు విదురున కిట్లనియె.

50 క. నీవును భీష్ముఁడు ద్రోణుఁడు భూ[1]వినుత విశుద్ధధర్మబుద్ధులరగుటన్
మీవచ[2]నమున కపజ్ఞత, గావింపఁగ [illegible]కార్యగతి మూఢుఁడనే.

46 1. వేల్చుచోట — ర. 2. వైనవారెదిరి — ఉ 3. చావకమందురె — న.స.
4. వొత్తురొ — ఉ గి.చ.ద వీ.శ.ష ; నిల్తురొ — ఖ.

47 1. వీరులందు — పెక్కు ప్రతులు. 2. డుద్యత — పెక్కు ప్రతులు ; డుద్భట — ర.

48 1. యట్లన — కొన్ని ప్రతులు ; యటువలె — వ.

49 1. కృతంబయిన — చ.ద.వీ.శ.ష. 2. నుకారణంబున — కొన్ని ప్రతులు ;
నకృతాపరాధంబున — చ.ద.వీ.శ.ష. 3. నపకారంబగు — కొన్ని ప్రతులు.
4. గాకుండ సకలజనంబులను కులంబును — ఆ.ఉ.

50 1. విదిత — క.వ. 2. నంబులపార్థత — పెక్కు ప్రతులు ; నమునకనర్థము —
గి.చ.ద.ను.వ వీ.శ.ష ; నకపార్థత (ము) — స.

-: *పాండవులను దోడ్తేర ధృతరాష్ట్రుండు విదురునిఁ బంచుట* :-

సం. 1—198—3

51 వ. [1]మీపంచిన విధంబున నప్పాండవుల కర్ధరాజ్యం [2]బిచ్చెదనని భీష్మవిదుర ద్రోణాదులయిన బాంధవప్రధానులయు దుర్యోధనాదు లయినపుత్త్రులయు సమక్షంబున నిశ్చయించి యప్పుడ పాండవులం [3]దోడ్తేర విదురుం బంచిన నాతండును ధృతరాష్ట్రశాసనంబున ద్రుపదుపురంబునకుం జని పుత్త్రభ్రాతృ పరివృతుండై యున్న ద్రుపదుని వాసుదేవసహితులై యున్న పాండవులనుం గాంచి ధృతరాష్ట్రుండు పుత్తెంచిన వివిధరత్నభూషణాదుల [4]వేలువేలు యిచ్చి తానును వారిచేతఁ బ్రతిపూజితుండై కేశవపాండవసమక్షంబున విదురుండు ద్రుపదున కిట్లనియె.

52 మ. అభిజాతుండవు ధర్మశీలుఁడవు నీయం దైన సంబంధ మిం
దభిరమ్యం బనురూప [1]మిష్టమని సౌహార్దంబునం జాహ్నవీ
ప్రభవుండున్ ధృతరాష్ట్రుఁడుం గృపుఁడుఁ గుంభప్రోద్భవుండున్ యశో
విభవాలంకృతసంతసంబు వడి [2]రుర్వీవంద్యులిష్టంబునన్.

53 ఉ. తల్లియుఁ [1]బుత్త్రులేవురు ను[2]దాత్తమతుల్ దమయొద్ద వాసినం
దల్లడమంది యందఱును దద్దయు దుఃఖితచిత్తులైరి నీ
యల్లురఁ బాండుపుత్త్రులఁ బ్రియంబునఁ జూడఁగఁ గోరుచున్న వా
రెల్లజనంబులుం గురుకులేశ్వరుఁ డాదిగ బంధువర్గముల్.

54 క. [1]గురుగుణయుతులగు కొడుకులఁ, గురుకులము వెలుంగ[2]నయిన కోడలిఁ గృష్ణం
బరమపతివ్రత గొంతిని, గరుణను రాఁబనిచెరాజు గజపురమునకున్.

---

51 1. మీ వచనంబున — బ. 2. బిచ్చితినని — గ.ట.డ. 3. దోడ్కొనితేర — పెక్కు ప్రతులు. 4. వేలువేలనిచ్చి — $గ_1$.శ.ష. కొన్ని ప్రతులు.

52 1. మాప్తమని — అ. 2. రుర్విన్వైశ్యులిష్టంబునన్ — అపం.

53 1 బుత్త్రులేవురు — పెక్కు ప్రతులు; గన్నయేవురు — వా. కొన్ని ప్రతులు. 2. దారమతుల్ — పెక్కు ప్రతులు; దాత్తయశుల్ — ఖ.వ.

54 1. ఉరుగుణ — క.వ. 2. జేయు — జ.ఛాపం ల.స.

55 వ. నీచేత ననుజ్ఞాతులై కాని వీరలు రానేరరు గావున వీరలం బుత్తెంచునది యనిన విదురునకు ద్రుపదుండిట్లనియె.

56 చ రవినిభ తేజుఁడైన ధృతరాష్ట్రుఁడు పంపఁగ నీవు కార్యగౌ
రవమున వచ్చినప్పుడ తిరంబుగ వీరికి నిష్టసిద్ధి దా
[1]నవు టది యేమి సందియమె యంబుజనాభుఁడు నీవుఁ బాండవ
ప్రవరుల కెల్లప్రొద్దును శుభంబ తలంతురు [2]కాదె నెమ్మితోన్.

57 క. నీవును [1]ద్రోణుండును వసు, దేవతనూజుండు భీష్మధృతరాష్ట్రులు స ద్భావమున నెద్దిసేయం,గా వగచితి రది హితంబ కాకొం డగునే.

58 వ. అనిన వాసుదేవుం డిట్లనియె.

59 క. ఎవ్వరును నేమిసేయుదు, రివ్విదురుఁడు పాండవులకు హిత మొన[1]రింపన్ [2]నెవ్వగనొండు దలంపకుఁ, డివ్వీరుల కగు నభీష్ట [3]మిది మొదలుంగాన్.

60 వ. అనిన నందఱకు ధర్మనందనుం డిట్లనియె.

61 క [1]కురుముఖ్యులు ధృతరాష్ట్రవి,దురభీష్ములు గురులు మాకుద్రుపదపతిఁభుఁడున్ గురుఁడు మురాంతకుఁడు జగ,ద్గురుఁ డిందఱమతమునను నగున్ శుభయుక్తుల్.

—: పాండవులు హస్తిపురంబునకు వచ్చుట :—

సం. 1-199-10

62 వ. అని యుధిష్ఠిరుండు [1]వారియనుమతంబు [2]వడసి తమ్ములు దానును హస్తి పురంబునకుఁ బోవ[3]నిశ్చయించి ద్రుపదు వీడ్కొని ప్రయాణోన్ముఖుం డయ్యె

56 1. నవుడిది — ఒ.ఙ.స ; నవుటిది — కొన్ని ప్రతులు. 2. కారె — చ.శ.ష.

57 1. ధర్మజుడును వసు — పెక్కు ప్రతులు ; కలశజుఁడును — ఒ.ఖ.ల.వీ.

59 1. రించుఁగ — కొన్ని ప్రతులు. 2. నెవ్వగలొండు — ల. 3. మిదియు మొదలు గాన్ — భాసం. పెక్కు ప్రతులు.

61 1. కురుముఖ్యులు — కొన్ని ప్రతులు ; గురుముఖ్యులు — వా. కొన్ని ప్రతులు

62 1. వారి యనుమతంబు — పెక్కు ప్రతులు ; వారియనుమతంబు — వా. కొన్ని ప్రతులు. 2. నదమ్ములుం — పెక్కు ప్రతులు. 3. సమకట్టి — ఒ.క.ఙ.

నిట్లు విదురుండు పాండవులఁ బాంచాలిని గుంతీదేవినిం దోడ్కొని వాసుదేవ ధృష్టద్యుమ్ను లపరిమిత సేనాసమన్వితులై తోడరాఁగా వచ్చునంత వారల రాకవిని ధృతరాష్ట్రుండు వికర్ణచిత్రసేనద్రోణకృపాచార్యుల నెదురు పుత్తెంచినం దత్సైన్య సమేతులయి మహోత్సవంబుతోఁ బాండవులు గజపుర ప్రవేశంబు సేయునప్పుడు వారలంజూచి.

63 సీ. పురజను[1]లెల్లను గర[2]మనురక్తులై ధర్మస్వరూపుఁడీ ధర్మతనయుఁ
డనుజులుఁదాను జనుదెంచెఁ బాండుభూజనపతి జీవించి మనలఁ గావఁ
బ్రీతితోఁ దానిప్పు [3]డేతెంచె మేలయ్యె నిమ్మహాత్ములకుఁ దైవమ్ముఁ బురుష
కారంబుఁ గలుగంగ ధారుణీరాజ్యంబు వాయునే యాపదల్ వాయుఁ గాక

ఆ. దానహోమజపవిధానముల్ మనకివి, గలవయేని ధరణివలయురాజ్య
మిందయుండి ధర్మనందనుఁ డొనరించు చుండుఁ గావుతమ యఖండితముగ.

64 వ. అని పౌరులెల్ల దీవించుచుండఁ గౌరవపుల [1]నందనులయిన పాండునందనులు వచ్చి భీష్మధృతరాష్ట్రాదికురువృద్ధులకు మ్రొక్కి సకలజనాను[2]రాగం బొనరించుచు దుర్యోధనాదులతోఁ గలసి యెప్పటియట్ల రాజ్య[3]విద్యావినోదంబుల [4]నేనుసంవత్సరంబు లుండునంత నొక్కనాఁడు ధృతరాష్ట్రుండు భీష్మ విదురద్రోణదుర్యోధనాదుల సమక్షంబునఁ బాండవుల కిట్లనియె.

65 ఆ. సర్వలోక [1]కర్మసాక్షి యీ కృష్ణుండు, సాక్షిగాఁగ మీకు సకలవృద్ధ
రాజులొద్ద నర్ధరాజ్యమిచ్చితిఁ బాండు, రాజవిభవమెల్ల రమణఁ గొనుఁడు.

63 1 లెంతయు — ఊ. 2. మనురాగులై. అనురాగము కలవారై — భా.కూ. 3. డేతెంచెముదమున — కొన్ని ప్రతులు; డేతెంచెమంటిమి యిమ్మహాత్ముల — ఏ.ఓ.ర; డేతెంచెకంటిమియిమ్మ — ఖ; డేతెంచువిధమున — ఋ.

64 1. వర్ధనులైన — ఋ. 2. రంజనం బొనరించి — ఆ.ఉ. 3 విద్యా — కొన్ని ప్రతులలో లేదు. 4 నొక్కసంవత్సరంబు — ఆ ఉ; పాండవులు హస్తినాపురమున నైదు సంవత్సరములుగాని యొక్క సంవత్సరము గాని యుండి రనుటకు మూలమునందాధారము కన్పించదు. మూలమిట్లున్నది విశ్రాంతాస్తే మహాత్మానః కంచిత్కాలం మహాబలాః। ఆహూతా ధృతరాష్ట్రేణ రాజ్ఞా శాంతనవేన చ. చిత్రశాలా ప్రతి. పుట 330. కించిత్కాలమ్. అని పాఠభేదమును కలదు.

65 1. ధర్మ — ఋ.ఓ.

66 వ. అని ధర్మరాజు నభిషిక్తుం జేసి.

67 క. నెమ్మిఁ జని ఖాండవప్రస్థమ్మున నివాసమ్ముఁ జేసి తద్దయు ననురా
గమ్మెసఁగ నుండుఁ డందుఁ డి, రమ్ముగ నని పనిచెఁ బాండురాజాత్మజులన్.

68 వ. పాండవులును ధృతరాష్ట్రుశాసనంబునను భీష్మాదులయనుమతంబునను
తులయి ఖాండవప్రస్థమ్మున[1]కుం జనిరంత.

—: విశ్వకర్మ యింద్రప్రస్థపట్టణమును నిర్మించుట :—

సం. 1-199-28

69 క. హరి యింద్రుఁదలఁచె నింద్రుఁడు, కరమను[1]రాగమున విశ్వకర్మను [2]బనిచెన్
సురపురమునకెన యగు పుర, మరుదుగ [3]నిర్మింపు ముర్వి నని [4]కడుఁ బ్రీతిన్.

70 సీ. ద్వైపాయనుండును ధౌమ్యుండు నాదిగా భూసురుల్ సూత్రవిన్యాస[1]మమరఁ
జేసి శాంతికవిధుల్ [2]సేయంగ సుప్రశస్తంబైన [3]రమ్యదేశంబునందు
వాసవాదిష్టుఁడై [4]వసుధకు నేతెంచి పేర్మితో నవ్విశ్వకర్మపురము
నిర్మించె నదియును నిరుపమలీలఁ దనరి యింద్రప్రస్థ మనఁగ నింద్రు

ఆ. పురముతోఁ గుబేరుపురముతో [5]వరుణేంద్రు, పురవరంబుతోడ నురగరాజ
పురవిభూతితోడ నురువిలాసంబుల, సరియనంగ నొప్పు ధరణిమీఁద.

71 ఉ. ఇమ్ము[1]గ విశ్వకర్మ రచియించిన కాంచనహర్మ్యతుంగశృం
గమ్ముల రశ్మిరేఖలు ప్రకాశములై కడుఁ బర్వ తత్సమీ
పమ్మునఁ బాఱుచున్న ఘనపంక్తులయం దచిరద్యుతిప్రతా
నమ్ములఁ [2]గ్రేణిసేయుచు నవారతముౕ విలసిల్లుఁ [3]దత్పురిన్.

68 1 కరిగిరంత, కరుగునంత — అని పాఠములు

69 1. రక్తుడయి — పెక్కు ప్రతులు. 2. దలచెన్, వనిచెన్ — అని పాఠములు.
3. రచియింపుముర్వి — పెక్కు ప్రతులు. 4. రమ్యముగాన్ — గ.

70 1. మొప్ప — ప.ఐ.క 2. సేయించి — అ. 3. శుభముహూర్తంబునందు — స.
4. వసుమతికేతెంచి — ప.గ.న. 5. వరుణునిపుర — కొన్ని ప్రతులు.

71 1. ల—అ.ప.ఐ.వ. 2. గ్రేడి సేయుచు—చ.ద.వి.శ.ష. 3. నప్పురిన్—కొన్నిప్రతులు.

72 చ. అలఘుతరంబులై తుహిన[1]హారిసుధారుచి నిందురోచిరా
కులశశికాంతవేదిపృథు[2]కుంజగళజ్జల నిర్ఝరంబులన్
విలసితజాహ్నవీవిమలవీచివిలోల[3]లసత్పతాకలం
బొలు[4]పగుఁ దత్పురీభవనముల్ హిమశైలముఁబోలి యున్నతిన్.

73 చ. వననిధిలోని రత్నములు వాసుకిమూర్ధజరత్నసంఘముల్
గొనఁగ [1]నవశ్యముల్ జనులకున్ సమకూరదు గాననెప్పుడుం
గొనుఁడు పరా[2]ర్థ్య [3]రత్నములు గోరినవానిన [4]యిత్తు మత్తైఱం
గునఁ బచరింతు రంగడులఁ గోమటు లప్పురి నిద్ధరత్నముల్.

74 సీ. [1]వలరాజు సచివుల వడువున బెడఁగగు కర్కశస్తనములఁ గరముపాఁడి
చూడ్కుల [2]నతిరాగసురుచిరాధరముల మద[3]విలాసాలసమందగతుల
[4]వక్రాలకంబుల వలుఁదపిఱుందుల [5]దర్పగద్గదభాషితములఁ జేసి
జనుల చిత్తములకు [6]సంతోష మొనరించు కామినీజనములు గలిగిసకల

తే. కామభోగములకు [7]సదేకాంతగృహముఁ బోలి పొలిచియు ధర్మార్థములకు నిదియ
యాస్పదంబు నా వర్గత్ర[8]యా విరుద్ధులైన జనుల కెంతయు నొప్పు నప్పురంబు.

75 క. శరనిధినినాద నిభమగు, పురఘోషముఁ [1]గీడుపఱిచి [2]పొలుపగుఁ గరమ
ప్పురి బ్రహ్మపురి మహీసుర,వర వేదాధ్యయన రవమవా[3]ర్యం బగుచున్.

72 1. హార — కొన్ని ప్రతులు 2 కుడ్యగళత్ — భా.కూ. 3 బహుప్రతీకలన్ — ఉ 4. పుగదత్పురీ — కొన్ని ప్రతులు.

73 1. నశక్యమై — ఒ.జ.బ. 2 ర్ఘవస్తువుల్ — న 3 వస్తువులు — పెక్కు ప్రతులు. 4. యంచు నిత్తైఱంగున — ర, యిత్తుమత్తైఱంగున — భాసం.వి ; యిత్తుమత్తెఱంగున — వా. కొన్ని ప్రతులు.

74 1 వలరాజు గజకుంభములఁబోలి, బెణగగు — ర. 2. ననురాగ — అ. 3. హంస విలసన — బ. 4 వక్త్రాలకంబులు — ఓ జ.ట. 5. నర్తనమృదుభాషణముల జేసి — ఉ. 6 సంతోష మొనరించు — కొన్ని ప్రతులు 7. నవైకాంత — ర 8 యావిరుద్ధులైన—పెక్కు ప్రతులు ; యానుబంధులైన—భాసం ; యానురుద్ధులైన—వా.

75 1. గీడుపఱిచి — ఆ.గి.ద.భాసం.వీ.శ.ష ; గీడ్పరించి — వా. కొన్ని ప్రతులు. 2. పొలుపుగ గరమప్పురవరమున.........రవమవారిత మయ్యెన్ — గి.చ.ద.ర. వీ.శ.ష. 3. రితమగుచున్ — కొన్ని ప్రతులు.

76 చ. పరిఘుజలంబులం [1]దమలపంకరుహోత్పల కైరవాదిసుం
దరకుసుమంబు[2]లుఁ ఘనపథంబున నుజ్జ్వలతారకానిరం
తరకుసుమంబు[3]లున్ వెలయుఁ దత్పురవప్రము పాదపీఠికా
శిరముల కొప్పుసర్చనలు సేసిన పువ్వుల యవ్విధంబునన్.

77 చ. తమము నడంచుచున్ వెలుఁగు తత్పురగోపురశాతకుంభకుం
భముల విచిత్రసన్మణిగభస్తివితానములన్ విచిత్రవ
ర్ణములగు నాత్మవాహముల నమ్మక పల్మఱుఁజూచి యన్యవా
హములని సంశయప్రణిహితాత్ముఁడగున్ హరిదశ్వుఁ[1]డెప్పుడుఁ.

78 చ. సరళతమాల [1]తాల హరిచందన చంపక నారికేళకే
సర కదళీ లవంగ పనస క్రముకార్జునకేతకీ [2]లతా
గరు ఘనసార సాల సహకార [3]మహీరుహరాజరాజిసుం
దర నవ[4]నందనావళులఁ దత్పురబాహ్యము లొప్పుఁ జూడఁగన్.

79 మ. అని[1]లం బప్పురిఁ బౌరచిత్తముల కత్యానంద [2]మొందంగ [3]సం
దిని [4]యన్నేటితరంగలం బెనఁగుచుఁ దివ్యద్రుమాకీర్ణనం
దనసందోహముఁ దూఱుచున్ వికచకేతక్యాదినానాలతాం
తనవామోదముఁ బొందుచున్ సుడియు నిత్యంబుం గరం బిష్టమై.

76 1 దరుల — ఖ.గ. 2. లన్ — పెక్కు ప్రతులు. 3 లన్ — పెక్కు ప్రతులు.

77 1. డెంతయుఁ, డప్పురిన్ — కొన్ని ప్రతులు.

78 1. సాల — ఏ ఖ. 2. ఘనాగరు — ఆ. 3. కదంబక — ఓ.ట ; ధరాజవిశేష రాజి — ఆ.ఒ.స ; కురంటక కోవిదారసుందర — ల.స ; ముఖార్హమహీజరాజి — చ ద.పీ.శ.ష.స ; ముఖార్హమహీరుహాభిసుందర — బ. 4. చందనా — ఈ.బ.

79 1. లుండప్పురి - వ. 2. మొప్పంగ — న. 3. నర్థినిమిన్నేటి — ఋ.గి గు.చ. జ ద న.ల.పీ.శ.శర.ష. మూలమునందిట్లున్నది — నదీచ నందినీనామసాపురీ ముపగూహతే. కావున నందిని యన్నేటి తరంగలం అనునదియే యుక్తముగానున్నది. 4. యన్నేటి — ఆసం.సం.సూ. మొదలగునవి.

80 వ. ఇట్టి యింద్రప్రస్థపురంబున నింద్రవిలాసంబుతో వ్యాసవాసుదేవానుమతుండై ధర్మతనయుండు ధౌమ్యపురస్సరమహీసురప్రవరవేదఘోషంబులు సకలజనాశీర్వాదనాదంబులు మృదుమధురమంగళసంగీతరవంబులు వివిధతూర్యధ్వనులు నతిసమృద్ధంబులై [1]యెసంగ [2]వర్గచతుష్టయంబునుం బోని యనుజవర్గంబుతో శుభముహూర్తంబునం బురప్రవేశంబు సేసి సర్వ[3]ప్రకృతిజనాను[4]రాగకరుండయి.

81 చ. అనుజులు నల్వురుం దనకు నత్యనురాగమునన్ విధేయులై
తనరుచు నుండ వేదవి[1]హితంబగు యజ్ఞమపోలె సర్వ[2]పా
వనశుభమూర్తియై భువనవంద్యుఁడు ధర్మపరుండు ధర్మనం
దనుఁడు ధరాధిరాజ్యము ముదంబునఁ జేయుచునుండెఁ [3]బేర్మితోన్.

82 సీ. అనఘు వేదాధ్యయనాసక్తు నారభ్యమాణమహాధ్వరు [1]మనుచరిత్రు
సర్వవర్ణాశ్రమ సంరక్షణ[2]క్షము సత్యసంధాను నజాతశత్రు
భరతవంశోత్తముఁ బ్రభుధర్మనందను రాజుఁగాఁ బడసి [3]సురాజయయ్యె
వసుధ [4]యధిష్ఠానవతి యయ్యె మఱి లక్ష్మి[5]బంధు మంతం బయ్యెఁ బరమధర్మ

ఆ. మన్న రేంద్రునందు నాపూర్ణతరశర, చ్చంద్రవాతపంబునందుఁ బ్రీతి
[6]సమముగా సమస్తజనుల చిత్తంబులా,నందరస[7]భరంబు నొందదాల్చె.

80 1. చెలంగ — కొన్ని ప్రతులు. 2. చతుర్వర్గంబునుం బోనియనుజ — గ్రి$_1$.చ.పీ.శ.ష; వర్గచతుష్టయంబునుంబోని యనుజచతుష్టయంబుతో — ఋ.స. 3. ప్రజానురంజకుండయి — వ. 4. రాగుండయి — పెక్కు ప్రతులు.

81 1. ొదితంబగు — కొన్ని ప్రతులు. 2. సాధనశుభ మూర్తియై భువనరక్షుఁడుధర్మ — శ.ష. కొన్ని ప్రతులు. 3. ప్రీతితోన్ — కొన్ని ప్రతులు.

82 1. మహితచరిత్రు — గ్రి$_1$.చ.ద.ఖాసం.పీ.శ.ష 2 క్రము — స; శ్రము — ఋ. 3. సురాజయయ్యెవసుధ — అ.అపం.ఐ.సం; సురాజ్ఞియయ్యె — ఖాసం.వా.శ. కొన్ని ప్రతులు. 4. యధిష్ఠాన్నవతియయ్యె — ల.స. 5. బంధురతరమయ్యె — ల; బంధురంబయ్యెను పరమధర్మ — చ ద.ఖాసం.పీ శ ష.శ. 6. సమముగా — ఓ.గ్రి$_1$.చ.డ.ద.బ.శ.ష. 7. సమృద్ధి — ఋ.ఐ.

83 క. ధరణిప్రజ ధర్మసుతును, స్థిరనిష్ఠల ధర్మచరితఁ జేసి రుజాత
స్కరపర[1]రాష్ట్రవిబాధలఁ, బొరయక సంతతసమృద్ధిఁబొందె విభూతిన్.

84 క. తనరిరి తద్దేశం[1]బున,ననవరతము యజనయాజనాధ్యయనాధ్యా
పనదానములుఁ బ్రతిగ్రహ,మును ననుషట్కర్మములను భూసుర[2]వంశ్యుల్.

85 క. పంబి యజనాధ్యయనదా,నంబుల వర్తిల్లె బ్రాహ్మణప్రియ మయి ధ
ర్మ్యంబయి క్షత్రియవైశ్యకు, లం[1]బవిరత పుణ్యకర్మలాలస మగుచున్.

86 క. పరమద్విజ శుశ్రూషా, పరులయి శూద్రాదు లవనిఁ బరగిరి ధర్మ
స్థిరమతులయి ధర్మజుధ,ర్మరాజ్య మభివృద్ధిఁబొందె మహి[1]మాన్వితమై.

87 వ. అంత.

88 క. నారదుఁడు వచ్చుఁ దద్వచ,నారంభుల రగుఁడు మీర లని కఱపి మహో
దా[1]రుఁడు వారల వీడ్కొని, నారాయణుఁడరిగెఁ దత్క్షణమ తనపురికిన్.

89 వ. పాండవులును బరాక్రమప్రణయవశీకృతాఖిలరాజన్యులయి సుఖంబుండు నంత నొక్కనాఁడు.

83 1. రాజులబాధ — క.గ్రి$_1$.చ.ద.వీ.శ.ష ; రాజభయంబుల — న.భాసం ; రాజ విబాధల — అ.ఈ ఎ.ఒ ఓ ఔ.జ.ల.

84 1. బుల — ఉ.ఐ.ఒ.బ. 2 ముఖ్యుల్ — కొన్ని ప్రతులు.

85 1. బవితథ్యపుణ్య — చ.ద.శ ష ; బవిరళ — ఈ.ఉ.ఓ.జ.డ.

86 1. మాస్పదమై — ఏ.గ్రి$_1$ చ.ద.భాసం,వీ.శ.ష.

88 1 రుల — ఆ.ఊ.ఋ.ఐ.ఒ య.వ

-: నారదుఁడు పాండవులపాలికి వచ్చుట :-

సం. 1-200-8

90 తరలము. ప్రవిమలాగమతత్త్వవేది తపఃప్రభాసి జగత్త్రియీ
శివకరుండు హితోపదేశము సేయఁగాఁ గడు[1]వేడ్కతో
దివిజ [2]వంద్యుఁడు ప్రీతితోఁ జనుదెంచె నారదుఁ డంబుజో
ద్భవ తనూజుఁడు [3]భానుతేజుఁడు పాండవేయుల పాలికిన్.

91 మానిని. తమ్ములుఁ దాను ధర్మతనూజుఁడు తత్క్షణ[1]సంభృతసంభ్రముఁడై
యమ్మునినాథవరేణ్యునకుం వినయమ్మున మ్రొక్కి సమున్నత పీ
ఠమ్మున నుంచి [2]యథావిధిపూజ లొడంబడఁ జేసి మునీశ్వర నె
య్యమ్మున [3]నీవిట వచ్చుటఁ జేసి కృతార్థుల మైతిమి యిందఱముం.

92 వ. మాపుణ్యంబునం జేసి భవద్దర్శనంబు సంభవించెనని పరమప్రీతహృదయులై పలికి పరమభక్తిం బాంచాలి మ్రొక్కించి యున్నంత నందఱ నాశీర్వచనంబుల నభినందించి వారలకుశలం బడిగి నారదుండు ద్రౌపదిం బోవం బనిచి వారేవురకు నేకాంతం[1]బున నిట్లనియె.

93 సీ. సర్వ[1]ధర్మజ్ఞుల రుర్వీశపూజ్యుల రవ్యోన్య[2]నిత్యసౌ[3]హార్దయుతుల
రగణితగుణయుక్తిఁ బొగడంగఁ దగువారలిట్టి మీ[4]కేవుర కిపుడు ద్రుపద
సుతయొక్కతియ ధర్మ[5]మతి ధర్మపత్నియైనది యీక్రమంబులోకాగమంబు
లందు విరుద్ధ మీసుందరికారణంబున మీకు విప్రీతి పుట్టకుండ

ఆ. నుండవలయుఁ బ్రియసహోదరుల్ దొల్లిసుందోపసుందులొక్కయువతి[6]కడఱి
విగ్రహించి యసురవీరులు దమలోనఁ, [7]బొడిచి మృత్యునిలయమునకుఁ జనిరి.

90 1. వేడుకన్ — పెక్కు ప్రతులు 2. ముఖ్యుడు — కొన్ని ప్రతులు. 3. లోకపూజ్యుడు — ఔ ; సన్మునీంద్రుడు — క.

91 1. సంభ్రమసంభృతులై — కొన్ని ప్రతులు 2. యథోచితపూజ — ల.వ. 3. మీరిట — వా. కొన్ని ప్రతులు ; నీవిట — పెక్కు ప్రతులు.

92 1. బుననిట్లనియె — పెక్కు ప్రతులు. బయిట్లనియె — ప.వా.

93 1. తత్వ — ఐ. 2. విమల — బ.స. 3. హార్దహృదయులగణిత — వ. 4. యేవురకు — పెక్కు ప్రతులు. 5. సతియునునై యున్నయది — ద.శ.ష. 6. కదిసి, కతన, వలన అని పాఠములు ; కొఱకు—ఖ.ర.ల. 7. బోరి—పెక్కుప్రతులు.

94 క. అనిన నదియెట్టులని యమ, తనయుఁడు గడువేడ్కతోడఁ దన్నడిగిన నా
తనికిఁ దదీయానుజులకు, నిరసన్నిభుఁ డమ్మునీంద్రుఁ డిట్లని చెప్పెన్.

—: సుందోపసుందోపాఖ్యానము :—

సం. 1—201—1

95 వ. తొల్లి దితిపుత్త్రుండైన హిరణ్యకశిపు[1]వంశంబున నిసుంభుండనువానికి సుందోప
సుందులన నిద్దఱు గొడుకులు పుట్టి నియతాత్ములయి తపంబుననకాని సర్వంబు
నుం బడ[2]యంగాదని యేకనిశ్చయులై వింధ్యాచలంబున కరిగి నిగృహీతేంద్రి
యులై నిదాఘకాలంబెల్లఁ బంచాగ్నిమధ్యంబున నిలిచి వానకాలంబును శీత
కాలంబును జలాశయంబుల వసియించి మఱియు వాయు[3]భక్షులు నేకపాద
స్థితులు నూర్ధ్వబాహులు నధోముఖులును నై పెద్దకాలంబు తపంబుసేసిన.

96 సీ. వారిదారుణతపోవహ్నిదాహంబున వింధ్యాద్రిదరుల నావిర్భవించి
యత్యు[1]చ్చమయి ధూమ మాకాశ మెల్లను గప్పిన నమరులు గరము వెఱచి
రత్నంబులను వధూరత్నంబులను [2]జేసి తత్తపోవిఘ్నవిధాన నిరతు
లయి ప్రబోధింపంగ నలవిగాకున్నఁ దోయజగర్భుపాలికి నరిగి యసుర

ఆ. వరులతపముఁ జెఱుపవలయునావుడుఁ గమలాసనుండు త్రిభువనార్చితుండు
[3]సురహితంబుపొంచు సుందోపసుందుల, కడకు వచ్చె వరము కరుణ [4]నీఁగ.

97 వ. ఇట్లు పితామహుండు సుందోపసుందుల తపంబునకుమెచ్చి సన్నిహితుండయి
మీకిష్టంబైన వరం బిచ్చెద వేఁడుం డనిన వారలు వారిజాసనునకు ముకుళిత
కరకమలులయి [1]దేవా మాయిష్టంబు దయసేయ మీకిష్టంబేని మాకుఁ గామ
[2]రూపత్వంబును గామ[3]గమనత్వంబును సకలమాయావిత్వంబును నన్యులచేత
నవధ్యత్వంబును నమరత్వంబునుం బ్రసాదిం[4]పుం డనిన.

95 1. వంశంబున — కొన్నిప్రతులు 2. యరాదని — పెక్కుప్రతులు ; య బోలదని — ఖ
3. భక్షులు — చ ద.శ.ష.

96 1. గ్రమయి—కొన్నిప్రతులు. 2 బంచి—వ ; నిచ్చి—క. 3 సుర(రు)లహితముపొంచు — ఆ.ఉ.బు.ఖ.ద.బ.ల. 4. నొసగ - కొన్ని ప్రతులు ; నిగుడ — జొ ; తోడ - ఓ.

97 1. స్వామీ - కొన్ని ప్రతులు. 2. రూపంబును — ప క.న వ. 3. గమనత్వంబును — కొన్ని ప్రతులు ; గామిత్వంబును — భాసం.పీ ; గమనంబును — వా.శ.ష. కొన్ని ప్రతులు. 4. పుమనిన — కొన్ని ప్రతులు

98 ఆ. కమలభవుఁడు వారికమరత్వ[1]మొక్కటి, దక్కఁగోర్కులెల్ల నక్కజముగఁ
గరుణ నిచ్చె నిట్లు సరసిజగర్భుచే, వరము వడసి యసురవరులు పెఱిగి.

99 క. అనుపమరాజ్యవిభూతిం, దనరి జగద్విజయకాంక్ష దైత్యులకు ముదం
బొనరఁగ నకాలకౌముది,యనునుత్సవ మొప్పఁ జేసి రగణితబలులై.

100 క. సురగరుడోరగకిన్నరపురములు వడిఁ జూఱకొనుచు భూలోకమునం
బరగిన రాజర్షిమహీ, సురవరులకు బాధసేయుచును గర్వమునన్.

101 క. ద్విజవర [1]వినిర్మితములగు, యజనస్వాధ్యాయకవ్యహవ్యవ్రతపోదా
నజపంబులఁ బితృదేవత,లజస్రమును దృప్తు లగుదు రని కడు నలుకన్.

102 వ. పుణ్యవంతుల నిత్యనైమిత్తి[1]కకర్మంబులకు విఘ్నంబులు సేయుచు సింహవ్యాఘ్రగజరూపధరులై వనంబులం [2]దిరుగుచు మునిపల్లియలు సొచ్చి మునులకుఁ బ్రాణభయంబు సేయుచున్న వారల క్రూరకర్మంబులకు వెఱచి వేల్పులును మునులును బురాణమునియైన బ్రహ్మపాలికిం జని కృతాంజలులయి జగంబులకు సుందోపసుందులు సేయు నుపద్రవంబులు సెప్పిన విని విశ్వగురుండు విస్మితుండయి వార లన్యులచేత వధ్యులుగారు గావున పరస్పరయుద్ధంబునఁ బంచత్వంబుఁ బొందవలయు నని విచారించి విశ్వకర్మ రావించి రూపలావణ్యవతియైన యొక్క[3]యువతి సృజియింపు మని పంచినఁ బ్రసాదం బని మ్రొక్కి [4]యప్పుడు.

103 పృథ్వి తిలా[1]ణుమణికోటిసంఘటితదివ్యదేహంబుతోఁ
దిలోత్తమ యనంగ [2]నొక్క యువతీలలామంబు సు
త్పలాక్షి [3]నొనరించె సర్వగుణభాసి రూపక్రియా
కలావిదుఁడు విశ్వకర్మ తనకౌశలం బేర్పడన్.

98 1. మొక్కఁడు, మొక్కండు, మొక్కొండు, మొక్కొంటి — అని పాఠములు.

101 1. సమర్పిత — ఉ.

102 1. కాది షట్కర్మంబులకు — వా శ. కొన్ని ప్రతులు. కకర్మంబులకు — కొన్ని ప్రతులు. 2 దిరుగుచు — కొన్నిటలేదు. 3. స్త్రీని — పెక్కు ప్రతులు. 4. యప్పుడ — కొన్ని ప్రతులు.

103 1. సుమణి — $గ_1$ వీ శ ష. 2. నొప్పు — కొన్ని ప్రతులు. 3. సృజియించె — భాసం.వా వీ శ, నొనరించె — శ ష. పెక్కు ప్రతులు.

104 వ. అదియును సురేంద్రప్రముఖ[1]బృందారక మునిబృందపరివృతుండై యున్న పరమేష్ఠికిం [2]బరమభక్తిం బ్రణమిల్లి పనియేమి యని ముందట నిలిచిన నరవిందసంభవుం డాసుందరిం జూచి సుందోపసుందు లనుదైత్యులు దర్పితులయి జగంబుల కహితంబులు సేయుచు [3]వింధ్యాచల కందరంబున నున్నవారు వారలిద్దఱు నీకారణంబునం [4]దమలోఁ దొండొరులతోఁ [5]బొడిచి దండధరు[6]పురంబున కరుగునట్లుగాఁ జేయు మని పంచిన వల్లె యని

105 సీ. అబ్జజువీడ్కొని యది దేవసభకుఁ బ్రదక్షిణం [1]బొనరించెఁ దక్షిణంబ
తద్రూప[2]సౌందర్య దర్శనలోలుఁడై యజుఁడు [3]నాలుగు దిక్కులందుఁ దనకు
గావించుకొనియె ముఖంబులు మఱి రెండు కన్నులఁ జూచినంగాదు తృప్తి
యని సురేంద్రుండు సహస్రాక్షుఁడయ్యె నయ్యమరు[4]లు కామమోహాంధులైరి

ఆ. ముదిత యిట్లు సర్వమోహినియై మర్త్య, భువనమునకు మెఱుఁగుఁబోలె [5]నొప్పి
యరుగుదెంచె సుందరాంగి వింధ్యాచల, విపిన[6]దేశమెల్ల వెలుఁగుచుండ.

106 క. అమ్ముదితఁ జూచి యన్నయుఁ, దమ్ముఁడు నొక్కట మనోజ[1]తాడితులై రా
గమ్మున నన్యోన్య స్నేహమ్ము[2]లుచెడి [3]దృష్టి నిలిపి[4]రయ్యువతిపయిన్.

104 1. సురబృంద పరివృతుండై — కొన్ని ప్రతులు. 2 ప్రదక్షిణంబు సేసి — గి.చ ద.శ.ష. 3. వింధ్యకుధరంబున — కొన్ని ప్రతులు. 4. దమలోన — పెక్కు ప్రతులలో లేదు. 5. బోరి — పెక్కు ప్రతులు 6. పాలికి — ఔ క.జ.ల

105 1. బొనరింప — ఖ.భాసం. 2. లావణ్య — న. 3. నాసుందరియనువు జూడ — య. 4. లపారకామ — మ. 5 నొప్పనరుగుదెంచె — కొన్ని ప్రతులు. 6. దేశమెల్ల — పెక్కు ప్రతులు; భూమియెల్ల — వా.

106 1. తాడితులై — పెక్కు ప్రతులు; తాపితులై — వా. 2 లుడిగి — కొన్ని ప్రతులు; లెడవాపి నిలిచి రయ్యువతికడఁ — గి.చ.శ.ష. 3 దృష్టి — కొన్ని ప్రతులు 4 రమ్ముద్దియపైన్, రమ్ముదితపయిన్ — అని పాఠములు.

107 క. ఘను లయ్యిరువురు నేకా,సనభోజనయాననిలయశయనక్రియలం
దన[1]రెడువా రేకస్త్రీ, వినిహితకాము లయి రపుడు విధి[2]నియమమునన్.

108 క. ఇది నావల్ల[1]భ యిది నా,హృదయేశ్వరి యనుచుఁ[2]గోరి యిరువురు మదనో
న్మదులయి పరిగ్రహించిరి, తదీయకమనీయసవ్యదక్షిణకరముల్.

109 వ. ఇట్లు పట్టుకొని.

110 క. [1]సుందరి మాయిద్దఱలో, [2]నిందెవ్వరి వలతు చెప్పు [3]మీ వనవుడుఁ [4]బూ
ర్ణేందుముఖి వారి కను మీ,యం దెవ్వఁడు వొడిచి యొడుచు నతనినవలతున్.

*—: సుందోపసుందు లొండురులతోఁ బోరి చచ్చుట :—*

111 క. [1]అనవుడు నిద్దఱుఁ [2]దమలోఁ,[3]బోనుపడ కొండొరులతోడ [4]భుజబలు లలుకన్
ఘనవజ్ర[5]తనులు దాఁకిరి, తనరఁగ[6]నటఁ గొండగొండఁ దాఁకినభంగిన్.

107 1. రిన – కొన్ని ప్రతులు 2 ప్రేరేపన్ – ఐ.

108 1 భి – పెక్కు తాళపత్ర ప్రతులు. 2. గూడి – ఋ.

110 1. కొన్ని ప్రతులలో నీ పద్యము లేదు. ఈపద్యస్థానమునందీ క్రిందివచనముకలదు. నీ వెవ్వరివలతనిన, అది రూప సౌందర్యంబుల మీరొక్కరూప, కావున మిమ్మొకళ్ళ గోరనేర మీలో పొడిచిన వాని వలతు ననిన. 2. నిందెవ్వరి — పెక్కుప్రతులు ; నందెవ్వరి – వా.శ 3. మీ వనవుడు — పెక్కు ప్రతులు, మాయనవుడు — వా.శ. కొన్ని ప్రతులు. 4. పైపారము — భాసం.వ ; పూర్ణేందుముఖి వారితో మీ యందెవ్వఁడు పొడిచి యొడిచె నతనినవలతున్ — ల.

111 1. అనవుడు నయ్యిద్దఱు నేపుననొండొరులతోడఁ గినిసి పొడిచిరి యలుకన్ – ఋ. 2. దమకంబున, తమరొండొరులతోడ బొడిచిరి యలుకన్ — ప.స. 3. మొన సిరి యొండొరులతోడ భూభుజు లలుకన్ — ఊ.ఎ.బ ; మునుకొని యొండొరుల తోడ పోరగనలుకన్ — ఔ ; పొనుప [వ] డ కొండొరులతోడ భూసు (ను) తు లలుకన్ — గ$_1$.చ.ద. భాసం. పీ.శ.ష ; పెనగిరి యొండొరులు పొడిచి పేర్చిన యలుకన్ — జ.డ ; పెనగిరి యొండొరులతోడ బిట్టగు నలుకన్ — ర.స 4. భుజబలులలుకన్ — ల స. భూభుజులలుకన్ — వా. కొన్ని ప్రతులు. 5. కాయులట్టిరు — స ; కాయులిమ్మోయి—ఋ ; కాయులట్టులు – ప.ర ; కాయసదృశులు — జ.డ ; తనులు — ఐ ; కరులు – వా. కొన్ని ప్రతులు. 6. నొక కొండ — ఋ.ఐ గ.న.వ ; మరి—బ , నడగొండ – ఊ.జ.

112 క. విపరీత[1]మతిని సుందుఁడు, నుపసుందుఁడుఁదాఁకి పొడిచి రొండొరు[2]తోడం
గుపితాత్ములయి తిలో_త్తమ, నెపమున దృఢముష్టిఘాతనిర్ఘాతములన్.

113 క. అన్యోన్యప్రియభాషణు, లన్యోన్యహితైషు లసుర లన్యులపోలెన్
మన్యు[1]పరిప్రేరితులై, యన్యో[2]న్యాభిహతిఁ జనిరి యమపురమునకున్.

114 క. ఇంతుల నిమి_త్తమున ధృతి,మంతులుఁ బొందుదురు భేద[1]మతి గావునఁ మీ
రింతయు నెఱింగి యొండులు, చింతింపక సమయ[2]మిందు సేయుఁడు
బుద్ధిన్.

-: నారదుప్రేరితులయి పాండవులు సమయము సేయుట :-

సం. 1_204_27

115 సీ. అనిన నారదమహాముని పల్కు చేకొని దమలోన నొడంబడి విమలబుద్ధి
నేవురయందును ద్రోవది ప్రీతితో నొక్కొక్కయింటఁ దా నొక్కయేఁడు
క్రమమున నుండను గమలాక్షి యెవ్వరియింటఁదా నుండె నయ్యింటివలనఁ
బెఱవారు చనకుండ నెఱుఁగక చని రేని వెలయఁగఁ బండ్రెండు నెలలు తీర్థ

ఆ. సేవసేయుచును [1]విశేషవ్రతంబులు, ధీర[2]వృత్తిఁజలుపువారుగాను
నమ్మునీంద్రునొద్ద సమయంబు సేసిరి, [3]రాజనుతులు పాండురాజసుతులు.

116 వ. ఇట్లు హితోపదేశంబు సేసి నారదుండరిగినం బాండవులు దమచేసిన సమయ
[1]స్థితిం దప్పక సలుపుచు సుఖం[2]బుండఁ గొండొకకాలంబున కొక్కనాఁ
డొక్క బ్రాహ్మణుండు ముచ్చులచేతఁ దనహోమధేనువు గోల్పడివచ్చి

112 1. గతిని — ఉ.ఎ.ఐ.ట ద.వ పీ శ.ష.స. 2 లు (ల) మహాకుపిత— పెక్కుప్రతులు.

113 1. ప్రేరితమతులై — ఆ. 2. న్యాహతిని — గి.చ.బ శ.ప.

114 1. మతి గావున — కొన్ని ప్రతులు; మది గావున — వా. కొన్ని ప్రతులు. 2. మిపుడు — కొన్ని ప్రతులు ; మింత — గి.

115 1. విశిష్టవ్రతంబులు—చ.ద.వీ శ.ప. 2. యుక్తి—కొన్నిప్రతులు. 3. రమణతోడ—ఆ.

116 1. స్థితి సలుపుచు — పెక్కు ప్రతులు. 2. బున్నంత — పెక్కు ప్రతులు.

యాక్రోశించిన [3]నశ్రుతపూర్వంబయిన యయ్యాక్రోశంబు విని విస్మితుం డయి విజయుండు విప్రులకయిన బాధ దీర్పక యుపేక్షించుట [4]పాతకం బని యప్పుడ యవ్విప్రు రావించి యిది యేమి కారణం బని యడిగిన నర్జునుకు విప్రుం డిట్లనియె.

117 క. యమతనయు ధర్మరాజ్యము, తమ రాజ్యమ యని మహాముదంబున విప్రో త్తము లున్నచోటనే బ, న్నముఁవడి కోల్పడితి గోధనము ముచ్చులచేన్.

118 సీ. వదలక ముచ్చుల వధియించి నాహోమధేనువుఁ గ్రమ్మఱఁ దెచ్చియిమ్ము జనసుత దానివత్సంబు నిన్నటఁగోలె నుడుగక యఱచుచు నున్నయదియు బలుకుల కెడలేదు శరాసనముగొని చనుదెమ్ము నాతోడఁ [1]బట్ట ననిన ద్రౌపదీసహితుఁడై ధర్మరాజాయుధాగారంబునం దున్నఁగార్ముకంబుఁ

ఆ. [2]బుచ్చికొనఁగఁ దనకుఁ బోలమి యెఱిఁగియు, విప్రునార్తరవము వినఁగనోప కర్జునుండు నిజశరాసన గ్రహణార్థ, మాయుధాలయమున కరిగె నపుడు.

119 క. ధరణీసురవరులకుఁ [1]గడు, [2]సెరగై నెడనెఱిఁగి యెడయుఁ జేయుదురె మహా పురుషులని నరుఁడు విలుగొని, యరిగెను ముచ్చులపిఱుంద నవ్విప్రు[3]తోనిన్.

3. శ్రుతపూర్వంబయిన యయ్యాక్రోశంబు—అని కొన్ని ప్రతులు; అశ్రుతపూర్వం బైన యయ్యాక్రోశంబు — చ.ద.శ.ష. ప్రతులలో లేదు. 4. పావనంబని — పెక్కు ప్రతులు.

118 1 బంటననిన — గ్రా.భాసం. పెక్కు ప్రతులు; బక్క — న.వ.స. 2. బుచ్చు కొనక — పెక్కు ప్రతులు.

119 1. నగుచిరిచెడుకెరిగియును నెడయు సేయుదురె — బ. 2. చెఱదగిలిననెఱిఁగి — స; సెరగైయుండు నెడ నెడయు — చ.ద.శ.ష.స, సెరగైన నెఱింగియెడ యుఁ జేయుదురె — భాసం; సెరగైనపు డెఱిఁగి యెడయుఁ జేయుదురె — వ. 3. బడిన్ — కస; నితోన్ — బు.శక; నకై—ఖ.న.స.

120 వ. ఇట్లరిగి యర్జునుం [1]డతివీరులయిన చోరుల వధియించి బ్రాహ్మణునకు గోధనంబు నిచ్చి క్రమ్మఱి వచ్చి ధర్మజునకు మ్రొక్కి లోకంబుల మర్యాదలు [2]విచారించి రక్షించుచున్న మనయందు [3]మర్యాదాభంగం[4]బయ్యెనను నింతకంటె [5]దుర్యశంబొం డెద్ది[6]యు లేదు గావున నాకు ద్వాదశమాసిక వ్రతంబు సలుపవలయు[7] నని పోవ సమకట్టియున్న నర్జునునకు యుధిష్ఠిరుం డిట్లనియె.

121 ఆ. క్రూరకర్ములయ్యు గోబ్రాహ్మణులకగు, బాధ [1]లుడుచు జనులఁ బాప [2]చయము
ఱెట్టియెడలఁ బొంద విం్రదసందర నీకు, సమయభంగభీతిఁ జనఁగ నేల.

122 వ. మఱి యట్లుంగాక తస్కరవధో[1]పేతుల నశ్వమేధభ్రూణహత్యల ఫలంబగు నని [2]వేదంబులయందు వినంబడుఁ దస్కరుల వధియిం[3]చి బ్రాహ్మణహితంబు చేసినవాఁడవు నీకు సమ[4]యోల్లంఘనప్రాయశ్చిత్తంబు సేయ నేల యనిన నర్జునుం డిట్లనియె.

123 క. భూజనపరివాదం బ, వ్యాజంబునఁ బరిహరింపవలయును మఱకున్
వ్యాజమున ధర్మలోపం, బాజిజయా పరిహరింతు రయ్య మహాత్ముల్.

120 1. దలిస్వరితంబున గూడముట్టిచోరుల — కొన్ని ప్రతులు 2. విచారించి — పెక్కు ప్రతులలో లేదు; పరిరక్షించుచున్న — య ర 3. మర్యాద—కొన్ని ప్రతులు. 4. బయ్యెనేనియింతకంటె — స 5 దుర్యశః పంకంబునుం గలదె కావున — క. 6. యులేదు - పెక్కు ప్రతులలో లేదు. 7 నరిగెదననిన యర్జునునకు — పెక్కు ప్రతులు.

121 1. లుడుపు - కొన్ని ప్రతులు 2. భయము — ఋ.ఒ ఓ.క.గ ట.ల.న

122 1. పేతులవలన నశ్వమేధ — పెక్కు ప్రతులు. 2. వేదంబులయందు — పెక్కు ప్రతులలో లేదు మూలమునందును కాన్పించదు తస్కరవధోపేతుల నశ్వమేధ భ్రూణహత్యల ఫలంబగు నను విషయము మూల భారతమున లేదు. ఇచ్చట సంస్కృత భారతమునం దిట్లున్నది. గురోరను ప్రవేశో హి నోపఘాతో యవీయసః। యవీయసోఽనుప్రవేశో జ్యేష్ఠస్య విధిలోపకృత్ చిత్రశాలాప్రతి. పుట 338. 3. చి గోబ్రాహ్మణ — ఏ.న. 4. యలంఘన — పెక్కు ప్రతులు; యభంగ-ర.

—: సమయభంగ కారణమున నర్జునుండు తీర్థయాత్రకుం జనుట :—

సం. 1-206-12

124 వ. కావున వ్రతదానంబు నా కనుగ్రహిం[1]పవలయు నని మ్రొక్కి యర్జునుం డగ్రజు వీడ్కొని గురుజనానుమతుండై యఖిలవేదవేదాంగపారగులైన బ్రాహ్మణులు ననేకశాస్త్రవిదులయి వివిధకథాకథన[2]దక్షులయిన పౌరాణికులు[3]ను దనకు సహాయులుగా నరిగి సకలతీర్థసేవచేయుచు నయ్యైతీర్థంబులందు.

125 ఆ. ధరణి[1]సురుల గురులఁ బరమయోగుల మహా, భాగులయిన యట్టి భాగవతుల
రాజవంశ[2]వరుఁడు బూజించుచును వారి, వలనఁ బుణ్యకథలు [3]వెలయ వినుచు.

126 క. గంగాధరపింగజటా, [1]సంగమమంగళవిశాల[2]చటులతరంగన్
గంగానది సేవించెను, గంగాద్వారమున విగతకల్మషుఁడగుచున్.

127 వ. అందు నిత్యంబును [1]గంగాస్నానంబు సేసి తత్తీరంబున హోమంబు సేయుచు వాసవసుతుండు మహీసురవరసహితుండయి కొన్ని దివసం[2]బులు వసియించి యొక్కనాఁడు ప్రభాతం[3]బ విధిపూర్వకంబు[4]నం గృతాభిషేకుండయి దేవర్షి పితృతర్పణంబులు [5]సేసి.

124 1 పుమని — కొన్ని ప్రతులు. 2. ప్రౌఢులయిన— పెక్కు ప్రతులు ; ప్రవీణులైన—ఊ.ఒ.జ.భాసం పీ. 3. ను విద్వాంసులును దనకు — కొన్ని ప్రతులు

125 1 సురల—ఋ.ఏ.ఒ.ఓ.ఖ.స. 2. వరుడు—అ.ఆ ఈ.ఏ.ఐ ఔ.య.ల ; కరుఁడు—భాసం.వా కొన్ని ప్రతులు. 3. తెలియ — ల.స.

126 1 సంగత — కొన్ని ప్రతులు. 2. సలిల — పెక్కు ప్రతులు.

127 1. గంగా — ఋ ఐ.గ. ప్రతులలో లేదు. 2. బులు — పెక్కు ప్రతులు ; బులకు — వా. 3. బున — కొన్ని ప్రతులు. 4. గా — కొన్ని ప్రతులు. 5. దీర్చి — ఆ.

-: ఉలూచి యర్జునునిఁ గామించుట :-

సం॥ 1-206-12

128 సీ. వేల్వంగ సమకట్టి వెలువడ నున్న నయ్యైంద్రనందను రుచిరేంద్రనీల
సుందరశ్యామాంగు సురరాజకరికరాకారమహాబాహుఁ [1]గట్టిఁజూచి
నలినాక్షి యందొక్క నాగకన్యక కామపరవశయై వానిఁబట్టి తిగిచి
కొని నాగపురమున[2]కును జని తన నిజరమ్యహర్మ్యంబునందు నెయ్యము
నననిచె

ఆ. నందు నగ్ని తొంటియట్టు లభ్యర్చితం, బయి వెలుంగుచున్న నర్జునుండు
హోమకార్య మొప్ప నొనరించి యప్పు[3]డ,య్యైంతిఁ జూచి నగుచు నిట్టు
లనియె.

129 క. తామరసనే[1]త్ర నీపే,[2]రేమీ యెవ్వరితనూజ వి ట్లేల మహా
వ్యామోహిత వై తనవుడుఁ, గోమలి సురరాజపుత్త్రకున కిట్లనియెన్.

130 వ. ఏ [1]నులూచి యనునాగకన్యక నైరావతకులసంభవుం డయిన కౌరవ్యు
కూఁతుర నిన్నుం జూచి మనోజబాణబాధిత నయితి నామనోరథంబు
[2]సలుపుము.

131 క. నీగుణములు దొల్లియు నా,గీగీతములందు విని తగిలి[1]యిపుడు మనో
రాగమునఁ జూడఁగంటిని, భాగీరథియందు నిన్నుఁ బరహితచరి[2]తా.

128 1. గలయ, గరిమ, కలితు, గరను, ఘనుని — అని పాఠములు ; గాంచివేడ్క —
వ. 2. కునుజని తన నిజ — పెక్కు ప్రతులు ; కొనరంగ జనిరమ్య — ఈ.ఉ.
వా.శ. 3. డయ్యైంతి — పెక్కు ప్రతులు ; డయింతి — ప.వా , డయ్యైంద్ర
తనయు డింతి కిట్టులనియె — ఋ.

129 1. త్రి — పెక్కు తాళపత్రప్రతులు. 2. రేమంద్రెవ్వరి — ఏ.న.స ; రేమిటి
యెవ్వరి — ఎ.ఐ.చ.జయ , రేమివెవ్వరి — భాసం.

130 1. నులూపి — ఓ.గ్రి.ద.భాసం.వీ.శష మూలము నందు ఉలూపి యని కలదు.
అంతర్జవే మహారాజ ఉలూప్యా కామయానయా చిత్రశాలా ప్రతి పుట 338.
2. సఫలంబు సేయుము — కొన్ని ప్రతులు.

131 1. యిపుడు — కొన్నిప్రతులు ; యపుడు — వా. కొన్ని ప్రతులు. 2. తున్ —
కొన్ని ప్రతులు.

132 వ. అనిన దాని కర్జునుం డిట్లనియె.

133 మధ్యాక్కర. ద్వాదశమాసికవ్రతము సలుపుదుఁ దరుణి మాయన్న
యాదేశమునఁ జేసి సర్వతీర్థము లాడుచు బ్రహ్మ
వాదులసంగతి బ్రహ్మచర్యసువ్రతుఁడనై యుండి
నీదుమనోరథ మెట్లు సలుపంగ నేర్తునే[1]నిపుడు.

134 వ. అనిన నవనతానన యయి నాగకన్యక యర్జునుంజూచి ద్రుపదరాజపుత్త్రి
యందు మీచేసిన సమయంబును దవత్తీర్థా[1]గమననిమిత్తంబును వ్రతంబును
నెఱుంగనిదానఁగాను సర్వతీర్థసేవనంబును సర్వవ్రతంబులు సలుపు
టయును సర్వదాన[2]ధర్మక్రియలును బ్రాణదానంబుతో సమానంబులు
గావు నామనోరథంబు విఫలంబయిన మనోజానలంబునం బ్రాణపరిత్యాగం
బగుం గావున నన్ను రక్షింపుము దీన నీకు వ్రతభంగంబు గా దనిన నర్జునుండు
దాని మనోరథంబు [3]సలిపి యారాత్రి నాగభువనంబున వసియించి నాగ
కన్యక[4]యందు సద్యోగర్భంబున [5]నిరావంతుండను కొడుకుం బడసి నాగ
లోకంబు వెలువడి యాదిత్యోదయంబు[6]తోడన గంగాద్వారంబునకు వచ్చి
తద్వృత్తాంతం బంతయుఁ దనసహాయులు అయిన విప్రులకుం జెప్పి వారలకు
హృదయానందంబు సేయుచు.

135 క. వితత[1]యశుఁ డరిగి హిమవత్పర్వతపా[2]ర్శ్వంబున నగస్త్యవటమును నత్యు
న్నతభృగు[3]తుంగముఁ జూచుచు, ధృతి[4]నేగి హిరణ్యబిందుతీర్థంబునకున్.

133 1 నిపుడ — ల స.

134 1. గమనవ్రతనిమిత్తంబున— ఐ ఒ ఔ గ.ట.బ భాసం , గమననిమిత్తవ్రతంబును —
స. 2. ధర్మ — పెక్కింట లేదు. 3. సఫలంబుసేసి — కొన్ని ప్రతులు 4 యంది
రావంతుండను కొడుకుం— పెక్కు ప్రతులయందు సద్యోగర్భంబున అనుమాటలు
లేవు. 5 నిలావంతుండను — పెక్కు తాళపత్రప్రతులు మూలము, ఇరా
వంతం మహాభాగం ఇచ్చట నన్నయరచనకు మూలము పి పి యస్. ప్రతిలో
కనఁబడుచున్నది. ఆదిపర్వము. పుట 1130 6. తోడ — పెక్కు ప్రతులలో
లేదు.

135 1. బలుడ — ఒ.జ. 2 పార్శ్వమునందగస్త్య — వీ.శ ష. కొన్ని ప్రతులు. 3
శృంగము — పెక్కు ప్రతులు. 4. నేగ — కొన్ని ప్రతులు

136 వ. అందును గోదానభూదానహిరణ్యదానంబు లాదిగాఁ బెక్కుదానంబులు సేసి యజ్ఞార్థంబుగా భూసురోత్తములకు గోసహస్రంబు లిచ్చి ప్రాగ్దేశంబున కరిగి నైమిశారణ్యంబునందు జగన్నాథు నారాయణు నారాధించి యుత్ప[1]లిని యుఁ గౌశికియు నందయు నపరనందయు గయయు [2]గంగయు గంగాసాగరసంగమంబును జూచుచు.

137 క. ఏలావనరమ్యములగు, వేలావనములను బవనవిచలద్వీచీ
లాలితసముద్రవిద్రుమ, మాలాపులినస్థలముల మసలుచు లీలన్.

138 వ. కళింగవిషయంబు [1]సొచ్చునంతఁ దోడిబ్రాహ్మణు[2]లు కొందఱు కళింగద్వారంబునఁ గ్రమ్మఱి యుత్తరకురుదేశంబులకుం [3]జనిన [4]నందుఁ గతిపయబ్రాహ్మణసహాయుండయి పార్థుం డరిగి పూర్వసముద్రతీరంబునఁ బురుషోత్తమ[5]దేవరకు నమస్కరించి మహేంద్రపర్వతంబు చూచుచు.

139 సీ. దక్షిణగంగ నాఁ దద్దయు నొప్పిన [1]గోదావరియు జగదాది యైన
భీమేశ్వరంబును బెడఁగగుచున్న శ్రీపర్వతంబును జూచి యుర్విలోన
ననఘులై శిష్టాగ్రహారభూయిష్ఠమై ధరణీసురోత్తమాధ్వరని[2]ధాన
పుణ్యస[3]మృద్ధమై పొలుచు వేంగీదేశవిభవంబుఁ జూచుచు విభుఁడు దక్షి

తే. ణాంబురాశితీరంబున కరిగి దురిత, హారి యైన కావేరీమహాసముద్ర
సంగమంబున భూసురేశ్వరుల కభిమ, తార్థదానంబు[4]ఁ జేసి కృతార్థుఁడగుచు.

136 1. లియు — కొన్ని ప్రతులు. 2. గంగయు — పెక్కు ప్రతులలో లేదు

138 1. సొత్తెంచునంత — బు.ఎ 2. లుకళింగ — వా ; లు కొందఱు కళింగ — పీ. శ ప పెక్కు ప్రతులు. 3. జనిరి కతిపయ — చ.ద.పీ శ.ష 4. నందు — పెక్కు ప్రతులలో లేదు. 5. దేవునకు — కొన్ని ప్రతులు

139 1. ఇచ్చట గోదావరి ప్రశంస పి.పి.యస్. ప్రతియందు మాత్రము కలదు. పుట 1332. 2 తాన — ఈ ఊ.ప ఓ.ర. 3. మృద్ధియై పొలుచు — ఈ జ ; మృద్ధిమై — అ.ఆ బు ఖ.ట వ 4. లిచ్చి — బు.బ.స.

-: అర్జునుండు చిత్రాంగదను వివాహంబగుట :-

సం. 1-207-14

140 వ. పదుమూఁ[1]డగుమాసంబున [2]మణిపూరపురంబునకుంజని యందున్న రాజుఁ జిత్రవాహనుం గని వానిచేతం బూజితుండయి తత్పుత్త్రిఁ జిత్రాంగద యనుదాని వివాహంబు గా నపేక్షించిన నయ్యర్జునునభిప్రాయం [3]బాప్తుల [4]వలన [5]నెఱింగి చిత్రవాహనుం డర్జునున కిట్లనియె.

141 క. [1]ధన్యుండ నైతి నీకీ, కన్యక నీఁగాంచితయైనఁ గలతెఱఁగు జగ న్మాన్య యెఱిఁగింపవలయున, నన్యమనస్కుండవయి దయన్ విను మనఘా.

142 క. మాకులమునందుఁ దొల్లి ప్రభాకరుఁడను రాజవరుఁ డపత్యము దనకున్ లేకున్న నుమేశ్వరునకుఁ, బ్రాకటముగ భక్తితోఁ దపం బొనరించెన్.

143 వ. పరమేశ్వరుండును వానికిం గరుణించి నీకు నొక్కపుత్త్రుం [1]డుద్భయించు నీకులంబున వారికెల్ల సంతానం [2]బిట్ల యగునని వరంబిచ్చిన నదిమొదలుగా [3]మావంశంబు[4]న వారికెల్ల నొక్కొక్క [5]పుత్త్రుండ కా జన్మించుచు వచ్చిన నిప్పుడు నాకు నిక్కన్యక పుట్టె నేను దీనిం [6]బుత్త్రికరణంబునం [7]బెనిచితి.

---

140 1. డవ — కొన్ని ప్రతులు 2 మణలూరు — చ.శ.ప.స. పి.పి.యస్. ప్రతియందు మణలూరు అనియు, చిత్రశాలా ప్రతియందు మణిపూర మనియు కలదు. 3. బాప్తచరులవలన—అ 4. చేత నెఱింగి—జ 5. విని—ఊ.క.

141 1. ధన్యుడ నైతినినీకి - కొన్ని ప్రతులు.

143 1. డుద్భవిల్లు — వా. కొన్ని ప్రతులు ; డుదయించు — పెక్కు ప్రతులు 2 బిట్లనయగు — ఐ.డ. 3. మాకులంబున — కొన్ని ప్రతులు 4. న - పెక్కింట లేదు. 5. పుత్త్రుండు జన్మించుచు — పెక్కు ప్రతులు. 6. బుత్రాకారంబున - ఉ.ఎ ; బుత్రికాకరణంబున - కొన్ని ప్రతులు ; పుత్రకారణంబున — కొన్ని ప్రతులు. 7 వర్ధంచితిమి — బు స ; రక్షించితిమి — ర.స.

144 తే. ఇందుఁ[1]బుట్టిన [2]సుతుఁడు [3]నాకిందువంశ్య, వంశ[4]విస్తారకుండు గావలయు నిదియ
యీలతాంగికి నుంకు [5]విట్టిఁగనొప్పు,దేని పెండిలియగుమ యీయింతిఁ బ్రీతి.

145 వ. అనిన నర్జునుండు చిత్రవాహనువచనంబున కొడంబడి చిత్రాంగద వివాహంబై.

146 ఉ. అంగజరాజ్యలక్ష్మి [1]పొడవై నది యొక్కొ యనంగ నొప్పు [2]చి
త్రాంగద యందుఁ బార్థుఁడు మహాప్రణయప్రవణాంతరంగుఁడై
యంగజభోగసంగమున [3]నమ్మణిపూర పురిఁ సమస్తలో
కాంగణరంగసంగతవిహా[4]ర [5]యశోంగదుఁ డుండె లీలతోన్.

—: అర్జునుఁడు పంచతీర్థంబులం దప్సరసలను శాపవిముక్తల నొనరించుట :-

సం. 1-208-1

147 వ. ఇట్లుండి యొక్కనాఁడు తపోధనబ్రాహ్మణసమేతుండై తత్సమీపంబున సముద్రతీరతీర్థంబు[1]లు చూచుచుం జని సౌభద్రం బను తీర్థంబుఁగని యందు స్నానంబు సేయ సమకట్టిన నర్జునుం జూచి [2]యందుల మునులిట్లనిరి.

148 తరలము. ఇది సొరంగ [1]నసాధ్య మెవ్వరి కిందువంశవరేణ్య వి
న్మిదియ కా దివి యేనుతీర్థము లీసముద్రతటంబునన్
విదితముల్ దురితాపహంబులు వీని [2]నెన్నఁడు నాడ[3]న
డుదురు సన్మును లిందుఁ గోల్మొస[4]ఖుల్ గొనున్ వడిఁ [5]జొచ్చినన్.

144 1. బుట్టెడు – అ 2. కొడుకు – ఊ ఎ 3. దానిందయుండి-ఐ.స, మాకిందయుండి-పెక్కు ప్రతులు. 4 నిస్తారకుండు — వా. కొన్ని ప్రతులు. 5. విట్టీఁగ — ర.

146 1. కెనయైనది — జ 2. నయ్యంగనయందు — ఒ.ఖ.జ.బ.య. 3. నమ్మణలూరు పురంబునంద్రిలో — చ.ద.శ.ష.స. 4. రి — పెక్కు ప్రతులు 5 యశోధనుఁడు ; యశోఘనుఁడు — కొన్ని ప్రతులు.

147 1. లాడుచుంజని — కొన్ని ప్రతులు. 2. యందలి — కొన్ని ప్రతులు.

148 1. నశక్యమేరికినిందు — పెక్కు ప్రతులు ; నభేద్య, నయోగ్య — అనియు పాఠములు. 2 నెవ్వరు – ఆ.తి. 3. నల్కుదురు — పీ.స. 4. ఖుల్ – శ.ష. కొన్ని ప్రతులు ; లుల్ — ఏ ఖ ; దుల్ — భాసం.తి.వా.సం.సూ 5. జొచ్చినన్ - పెక్కు ప్రతులు ; జొచ్చుదున్ — వా.

149 వ. సౌభద్ర పౌలోమ [1]కారంధమ ప్రసన్న భారద్వాజంబు లను నామంబుల [2]దక్షిణ [3]సముద్రతీరంబునం [4]బ్రసిద్ధంబులయిన యిప్పంచ తీర్థంబు లిప్పుడు నూఱేండ్లంగోలె నుగ్రగ్రాహగృహీతంబులయి దుర్జనగృహీతంబులయిన రాజుల విభవంబులుంబోలె సాధుజనవర్జితంబులయి యుండు ననిన విని విజయుం డశేషతీర్థసేవార్థనయి వచ్చిన నాకు నీతీర్థంబు [5]లాడకునికి [6]పౌరుషంబు గాదని యందు.

150 క. [1]సాహసికుండై నరుఁ డవఁగాహము [2]సేయుటయు జలము గ్రక్కదల మహో గ్రాహము [3]బీభత్సుబృహద్బాహుబలుం బట్టికొనియెఁ బఱతెంచి వడిన్.

151 ఆ. దాని నక్రమమునఁ[1]దజ్జలాశయము వెల్వడఁగ వైచె నరుఁడు బాహుశక్తి నది[2]యుఁ దత్క్షణంబ యభినవయౌవనోద్భాసమానదివ్యభామ యయ్యె.

152 ఉ. ఆ లలితాంగిఁ జూచి నరుఁ డద్భుతమంది మృగాయతాక్షి యి ట్లేల జలేచరత్వమున నిజ్జలధిన్ వసియించి తిప్పు డి ట్లేల సురూపభామ వయి తెందుల[1]దానవు నీవు నావుడున్ [2]బాలిక పాండుపుత్త్రునకుఁ బార్థుఁ కిట్లని[3]యెం బ్రియంబు[4]నన్.

149 1 కారండవప్రసన్న — కొన్ని ప్రతులు, కారసంక్రమ — కొన్ని ప్రతులు కాని యిక్కడ మూలమున. అగస్త్యతీర్థం సౌభద్రం పౌలోమంచ సుపావనం కరం ధర్మప్లవం చైవహయమేధ ఫలం చయత్, భారద్వాజస్యతీర్థంచ పాపప్రశమనం మహత్ ఏతానిపంచతీర్థాని అని కలదు పి పి ఎస్ ప్రతి. పుట 1834. 35, మఱియు వావిళ్ల తెలుఁగులిపి మూలప్రతియందు. కారంధమం ప్రసన్నంచ. (పుట 429) అని తెలుఁగుభారతమునందున్నట్లే కలదు 2 దక్షిణాపథంబున — చ.ట.ర. శ.ష.స. 3. సముద్ర — పెక్కు ప్రతులలో లేదు. 4. ప్రశస్తంబులైన — య. 5. లాడకుండుట — ఔ.గ 6. పౌరుషంబేయని — ఆ

150 1. సాహసకరుఁడై — న; సాహసముచేసి — బ. 2. సేయుడును — ఆ.ఉ.ఋ. ఏ న ల.వీ. 3. వివ్వచ్చు — కొన్ని ప్రతులు.

151 1. దజ్జలాశయమున వెల్వడంగవైచె విపులశక్తి — న. 2. యునక్షణంబ — ఒ.ఖ.చ.జ ద.య.ర.శ ష; యునాక్షణమున — మ వీ.

152 1 చానవు — చ.శ. 2 బాలకి — పెక్కు ప్రతులు. 3. యెమ్మదంబునన్ — ఉ ఋ.ఏ 4 తోన్ — కొన్ని ప్రతులు.

153 వ. ఏను [1]వందయను నప్సరసఁ గుబేరుపనుంగ నాసఖులు సౌరభేయియు సమీచియు [2]బుద్బుదయు లతయు ననువారలు [3]నలువురు నాయట్ల యతీర్థంబులఁ దున్నవారలు [4]వారిని శాపవిముక్తలం జేసి రక్షింపుమనిన దానికి నర్జునుం డిట్లనియె.

154 క. వనజాక్షి యేమికారణమున నుగ్రగ్రాహరూపములు దాల్చితి రీ
రని యడిగిన వేడుక[1]నా,తని కది యిట్లనుచుఁ జెప్పె దద్విధమెల్లన్.

155 వ. వినుమయ్య యేమేవ్వురము నఖిలలోక[1]పాలపురంబులు చూచుచు భూలోకంబునకు వచ్చి యొక్కవనంబునం దుగ్రతపంబు సేయుచున్నవాని నత్యంతశాంతు నేకాంతచారి [2]నగ్నికల్పు నొక్కబ్రాహ్మణుం గని వాని తపంబునకు విఘ్నంబు సేయ సమకట్టి

156 క. [1]వేడుక నమ్మునిముందటఁ, బాడితి మాడితిమి పెక్కుపరిహాసంబుల్
[2]రూఢిగఁ బలికితి మెట్లుం, జూడఁడు మా[3]వలను నీరసుం డన నుండెన్.

157 క. ధృతి[1]హీనుల చిత్తములట్లతివల యందేల తగులు నత్యంతదృఢ
వ్రతులమనంబులు వారల, మతులఁ దృణస్త్రైణములు సమంబు[2]ల కావే.

153 1 నంద — పెక్కు ప్రతులు భండార్కరుప్రతి యథస్సూచికయందు, వర్గా, పర్చా, వృందా, వర్దా, నందా, పిందా, నందాయనువిధముగాఁ బెక్కుపాఠములు గలవు వర్గాయనునది ముఖ్యపాఠముగా స్వీకరింపఁబడినది. పుట 817 2. తాళపత్ర ప్రతులలో నీ పేరులు పెక్కురీతుల నున్నవి. మూలభారతమునందు అహంచ సౌరభేయీచ సమీచీ బుద్బుదాలతా. అని కలదు. వావిళ్ల వారి తెలుఁగు లిపి ప్రతి పుట 430. 3. నలువురు — చ.ద.య శ ష ప్రతులలో లేదు. 4. వారలను నాయట్ల శాపవిముక్తలంజేసి — ఏ.ఖ

154 1. నాతని కిట్లని యెలుఁగ జెప్పె — ల.

155 1. పాలురపురంబులు — ఆ ఉ.ఖ.ల.వీ; పాలకపురంబులు — చ ద.శ ష
2. నగ్నికల్పుండను నొక్కబ్రాహ్మణుం — ట.వ.

156 1. ఈ పద్యమున డ — ఢ ప్రాసము 2 రూడిగ — ద.వీ.ఖాసం.సూ. 3 వలన — వీ శ ష. కొన్ని ప్రతులు

157 1. రహితులు—చ.ద.ఖాసం వీ.శ.ష. 2. లుకా(గాఁ)వే — వీ.శ.ష. కొన్ని ప్రతులు.

158 వ. ఏము రాగకారణ [1]వికారంబులు గావించిన నవి దనకుం గోపకారణంబు లయిన నతికుపితుండయి బ్రాహ్మణుండు మమ్మేవురను [2]మహోగ్రగ్రాహంబులుగా శపియించిన నమ్మునివరునకు ముకుళిత [3]హస్తలమై యిట్లంటిమి.

159 చ. అలుగుదురయ్య విప్రులు మహాపురుషుల్ [1]పరుషాపరాధముల్
[2]దలిఁగెడువారు ధర్మువులు దప్పక సల్పెడువారు సత్యముల్
పలికెడువారు వారల కపాయము డెందములం దలంచు మూ
ర్ఖులకు విధాతృ[3]చెయ్వున నగున్ దురితంబులు దుర్యశంబులున్.

160 వ. కావున మాచేసిన [1]యజ్ఞానంబు సహించి మాకు శాపమోక్షంబుఁ బ్రసాదింపు మనిన నవ్విప్రుండును గరుణించి యెవ్వండేని మీచేత గృహీతుండయి [2]మీయున్న జలాశయంబు మిమ్ము వెలువరించు నాతండ మీకు శాపమోక్ష[3]కారణుం డగునవిన.

161 సీ. అట్టి మహాబాహుఁ డత్యంతబలుఁడెవ్వఁ డగునొక్కొ యనుచు నేమరుగు దెంచు
వారము త్రైలోక్య [1]వర్తి నంబుజభవ[2]ప్రభవు నారదుఁగని భక్తితోడ
మ్రొక్కిన మమ్మునమ్ముని చూచియిల్లేల వగఁబొంది [3]కందినవారలనియు
నడిగి మావృత్తాంత మంతయు మాచేతవిని విప్రునలుకయు విధికృతంబుఁ

ఆ. గ్రమ్మఱింప [4]లావె కావున దక్షిణ, జలధితీరమునఁ బ్రశస్తపంచ
తీర్థములకు నేఁగి ధృతినందు [5]నూఱేఁడు,లుండుఁ డట్లుమీర లుండునంత.

158 1. విధానంబులు — ఓ.జ.య 2 మహోగ్ర గ్రాహంబులుగా — పెక్కు ప్రతులు. 3. హస్తులమై—పెక్కు ప్రతులు ; కరకమలలమై—ట.మ.వ.భాసం.

159 1. పురుషాపరాధముల్ — పెక్కు ప్రతులు. 2 దలగెడువారు — అ.ఆ.ఐ. య.ల.పీ. 3. చేతనయగున్ — ఐ గ

160 1. యపరాధంబు_ఋ. 2. మిమ్ముల జలాశయంబు వెలువరించు_కొన్ని ప్రతులు. 3. కరుండగు — ఋ.ఖ.చ.ద.పీ.శ ష ; ణంబు సేయంగారణంబగు ననిన — ర.

161 1. వంద్యు — భాసం స. 2 సద్భుకునారదుఁగని సవినయముగ — $గ_1$.చ.ద. భాసం.మ.వీ శ.ష. 3. కుందినవారలు — ఔ.ల; వందినవారలు — కొన్ని ప్రతులు. 4. రాదు గావున — ఆ.ట; గలమె - న ; గలరె - బ. 5. నూరేండ్లునుండుడట్లు — కొన్ని ప్రతులు.

162 క. జనను‌తుఁడు పాండుతనయుఁడు, ధనంజయుఁ డశేషతీర్థదర్శనకాంక్షుం
జనుదెంచి మీకు దయ న, మ్మునిచెప్పిన యట్ల శాపమోక్షము సేయున్.

163 వ. అనిన నన్నారదువచనం[1]బులు విని యచ్చి మహోగ్రగ్రాహములమై భవదా
గమనంబు [2]ప్రతీక్షించుచు నిప్పంచతీర్థంబులనుండి నేఁడు నీకారణంబునం
గృతార్థుల మయితి మనిన నర్జునుండును గరుణాయత్తచిత్తుండయి [3]వంద
చెప్పిన యన్నలువురకు శాపమోక్షణంబు సేసిన నమరకన్యక లతిహర్షంబున
నమరేంద్రనందను దీవించి దేవలోకంబున కరిగి రది మొదలుగా
నిప్పంచతీర్థంబులు [4]నారీతీర్థంబులునాఁ బరగె నర్జునుండును గ్రమ్మఱ
[5]మణిపూరపురంబునకు వచ్చి రాజ్యలీల సుఖంబుండి చిత్రాంగదయందు
బభ్రువాహనుండను [6]పుత్త్రింబడసి చిత్రవాహనునకు వంశ[7]కరుంగా నిచ్చి
వానివీడ్కొని గోకర్ణంబుఁ జూచుచుఁ బశ్చిమసముద్రపార్శ్వంబునఁ
బ్రభా[8]సంబను తీర్థంబు[9]నకుఁ జని యందులకు [10]ద్వారవతి పురంబు[11]కుఱం
గలి యని విని.

164 సీ. అందుల[1]కేఁగి యే నిందీవరశ్యాము నరవిందనాభునంబురుహనేత్రు
సన్మిత్రుఁజూచి నాజన్మంబు సఫలంబుసేయుదు నఘములు వాయుపొంకె
నదియునుంగాక మున్ గదుఁడను వానిచే వింటిఁ దిలోత్తమకంటె రూప
వతి [2]యట్టె సద్గుణాన్విత యట్టె నాకట్టి భద్రేభగమన సుభద్రఁ జూచు

ఆ. వేడుకయును గలదు విష్ణుభట్టారకు, దయనభీష్టసిద్ధి దనరు [3]ననుచుఁ
దద్ద సంతసిల్లి తద్ద్వారకాపురి, కరుగ నిశ్చయించె నర్జునుండు.

163 1. బున భవదాగమనంబు - పెక్కు ప్రతులు. 2 నిరీక్షింపుచు – గ. 3. వంద
చెప్పిన - కొన్ని ప్రతులు 4. నారీతీర్థంబులు — కొన్ని ప్రతులలో లేదు
5. మణలూరు – చ.ద.శ.ష. 6 కొడుకుంబడసి - కొన్ని ప్రతులు. 7. కరుం
డుగా - కొన్ని ప్రతులు. 8. స యను – కొన్ని ప్రతులు. 9. గనియందులకు -
కొన్ని ప్రతులు. 10. ద్వారావతి, ద్వారకా – అని పాఠములు. 11. కుఱంగటఁ,
కుఱంగటి - గి.చ.ద.ర.శ ష.

164 1. కరిగి - కొన్ని ప్రతులు. 2 యఁట...... యఁట – ద.శ.ష ; యకె......
యకె — పీ. కొన్ని ప్రతులు. 3. ననుచు — పెక్కు ప్రతులు ; ననియె - వా;
ననియు - చ.ద.వీ.శ.ష.

165 వ. మఱియు నప్పురంబునం [1]దన్నొరు లెఱుంగకుండవలయు ననియు యాదవులు యతుల[2]కతిభక్తు లనియును [3]మనంబునం దలంచి కృతకయతివేషధరుండయి.

166 క. పరమబ్రహ్మణ్యు జగద్గురు గరుడధ్వజు ననంతగుణు నేకాగ్ర
స్థిరమతియై నిజహృదయాంతర[1]సుస్థితుఁ జేసి భక్తిఁదలఁచుచు నుండెన్.

167 క. నరుననికి యెఱిఁగి కృష్ణుఁడు, తిరముగ దయతోఁ బ్రభాసతీర్థమునకు నొ
క్కరుఁడ చనుదెంచె సర్వేశ్వరుఁ డెప్పుడు భక్తులకుఁ బ్రసన్నుఁడ కాఁడే.

*—: అర్జునుండు ద్వారకానగరంబునకుఁ జనుట :-*

సం. 1-210-4

168 వ. ఇట్లు దనకడకు వచ్చిన [1]యాదిదేవునకు [2]దేవకీనందనునకు నతిసంభ్రమంబున నమస్కరించి పురందరనందనుం డానందజలభరితనయనుండయి యిట్లనియె.

169 ఉ. ద్వాదశమాసికవ్రతము ధర్మవిధిం జలుపంగ నేఁగి గం
గాదిమహానదీ హిమవదాదిమహాగిరిదర్శనంబు మీ
పాదపయోజదర్శనముఁ బన్నుగఁ జేయుటఁ జేసి పూర్వసం
పాదితసర్వపాపములుఁ బాసె భృశంబుగ నాకు నచ్యుతా.

170 వ. అనిన విని నగుచు నబ్జనాభుం డర్జును నతిస్నేహంబునం గౌఁగిలించుకొని యెల్ల[1]వారల కుశలంబును నడిగి యాతని తీర్థాభిగమన[2]నిమిత్తంబును సుభద్రయందు బద్ధానురాగుండగుటయు నుపలక్షించి ద్వారకాపురంబునకుఁ దోడ్కొని యరిగి.

165 1. దన్నులు తన్నెఱుంగకుండను — ర. పెక్కు ప్రతులు. 2. కువిధేయు లనియు — చ ద.శ.ష. 3. మనంబునందలచి — పెక్కుప్రతులలో లేదు.

166 1. సంస్థితు — వ.

168 1. యాదిదేవుండయిన — ఐ.గ.చ.ట.ద య.ల పీ.శ.ష 2. దేవకీనందనునకు — కొన్ని ప్రతులలో లేదు.

170 1. వారి కుశలంబడిగి — పెక్కు ప్రతులు. 2. నిమిత్తంబడిగివిని — ల.

171 ఉ. భ్రాజితశాతకుంభగృహపంక్తులఁ బుష్పితవల్లి వేల్లితో
ర్వీజ వనావృతిజ్ విమలవిద్రుమవజ్రవిచిత్రవేదికా
రాజిఁ గరంబు రమ్యమగు రైవతకాచలకందరంబునన్
రాజకులైకసుందరుఁ బురందరనందను [1]నుంచి లీలతోన్.

172 క. శ్రీపతి గడునెయ్యంబున, నాపోవక పార్థునొద్ద నారాత్రి ప్రియా
లాపములఁ దగిలి యుండెను, దీపమణుల్ వెలుఁగ భువన[1]దీపుఁడు దానున్.

173 వ. ఇట్లు పరమపురుషులయిన నరనారాయణులు దమపూర్వజన్మ సహవా
సంబున యట్లప్పుడు పరమానందంబునఁ బరస్పరప్రియమధురసంభాష
ణంబుల నొక్కటనుండి యారాత్రి సలిపి రంతఁ బ్రభాతంబ వాసుదేవుండు
వాసవనందను నందయుండం బంచి కాంచనరథారూఢుండయి పురంబు
నకుం జని పౌరజనప్రధానసమక్షంబున [1]రైవతకమహోత్సవంబు
ఘోషింపం బంచిన.

174 చ. పొలుపుగఁ బూసి కట్టి తొడి భూరివిభూతి ప్రకాశితంబుగాఁ
గలయఁగఁ దత్పురీజనులు కాంస్య[1]మృదంగ[2]ముకుందవేణుకా
హాళ[3]పటహధ్వనుల్ చెలఁగ నాటలుఁ బాటలు నొప్ప నెల్లవా
రలుఁ జని చేసి రర్చనలు రైవత[4]కాద్రికి నుత్సవంబుతోన్.

175 చ. గురుకుచయుగ్మముల్ గదలఁ గ్రొమ్ముడు[1]లందుల పుష్పముల్ పయిం
దొరఁ[2]గ నిదాఘబిందువితతుల్ [3]చెదరన్ మదిరామదంబునం

171 1. నుంచెఁ బ్రీతితో — ల.వి.శ ష.స. కొన్ని వ్రాఁతప్రతులు.

172 1. దీపకుఁడంతన్ — భాసం.వి.

173 1. రైవతకాద్రికి — బు.ప.

174 1. మృదంగకశంఖభేరి — చ.ద.భాసం.వి.శ.ష. 2. నినాదమొప్పగా — ఏ. 3. మురళీ — డ. 4. కాచలకందరంబునన్ — ఓ.

175 1. లందలి — గ్రి.చ ద.శ.ష. 2. గగఘర్మబిందు — ఉ. 3. చెలఁగజ్ — అ

బరవశలయ్యు నింపెసఁగఁ బాడుచుఁ దాళము గూడ [4]మెట్టుచుం
దరు[5]ణియ లొప్పనాడిరి ముదంబునఁ [6]దమ్ముఁ జనాలి మెచ్చఁగన్.

176 సీ. సారణ [1]సత్య కాక్రూర [2]విదూరథ సాంబ సంకర్షణ శంబరారి
భానుసుషేణోగ్రసేన శైనేయానిరుద్ధ హార్దిక్య గదోద్ధవాది
యాదవు లధికప్రమోదులై యొక్కటఁ దరుణులుఁ దారును గరికరేణు
హయశిబికారూఢులయి తదుత్సవమున కరిగిరి మఱి జగద్గురుఁడు గృష్ణుఁ

ఆ. డింద్రలీలతో నుపేంద్రుండు రుక్మిణీ, దేవి మొదలుగాఁగ దేవులెల్ల
[3]నొప్పతోడరాఁగ నప్పర్వతమునకుఁ, జనియె సకలజనులుఁ[4]దనకు నెరఁగ.

177 వ. ఇట్లరిగి జనార్దనుండు ధనంజయుం దలంచి తత్సమీపగతుండయి [1]తోడ్కొని
యాతనికి నప్పర్వతరమణీయప్రదేశంబు[2]లం జూపుచు విహరించి యిద్దఱు
నొక్క విమలమణివేదికయం దభిమతసంభాషణంబుల నుండునంత.

178 చ. క్వణ[1]దణుకింకిణీకలిత కాంచనకాంచికలాపముల్ రణ
న్మణికలనూపురంబులు [2]సమధ్వని నొప్పఁగ భక్తిఁ బాదచా
రిణి యయి కన్యకాజనపరీత సుభద్ర తదద్రిపూజన
[3]ప్రణతులు సేసె నింద్రసుతుఁ బార్థు నిజేశ్వరుఁగాఁ దలంచుచున్.

4 బెట్టుచుం, దట్టుచుం — అని పాఠములు. 5 ణులునొప్పనాడిరి — ఐ.ఓ.చ. ద.భాసం.ర.వీ.శ.ష. 6 కాంతులు తమ్ముఁజూడగన్, గాంతలు తమ్ము చూడగన్, పౌరులు తమ్ముఁజూడగన్ — అని పాఠములు.

176 1 సాత్యకాక్రూర — శ.ష. పెక్కు ప్రతులు. 2 విదూరణ — కొన్ని ప్రతులు. 3. నొప్పితోడరాగ — పెక్కు ప్రతులు. 4. సన్నుతింప — ఔ.వ ; సంతసిల్ల — ఖ ; నొనరనడవ — ల.స.

177 1. తోడ్కొని — పెక్కు ప్రతులలో లేదు. 2 లు జూపుచు — కొన్ని ప్రతులు.

178 1 దురుకింకిణీ — ఏ.య ర ; దనుకింకిణీ — చ.ట.డ బ.వీ.శ.ష. 2. సమద్యుతి నొప్పసభక్తి — స ; సమధ్వని ప్రమోయుచునుండ — ఉ.ఋ.ఓ.న.ల. 3. ప్రణుతులు సేసె — ర.

179 ఉ. దాని సుభద్రఁగా నెఱిఁగి తత్క్షణజాతమనోజసంచల
న్మానసుఁడైన యవ్విజయు మానుగఁజూచి [1]మునీంద్ర నీకుఁ జ
న్నే నలినాక్షులందు [2]మది నిల్పఁగ నంచును మందహాసగ
ర్భాననుఁడై రథాంగధరుఁ డాతని కిట్లనియెం బ్రియంబునన్.

180 వ. నీవు సుభద్రయందు [1]బద్ధానురాగుండ వగుట తొల్లియు నేనెఱుంగుదు నోడకుండుము నీకోర్కి [2]వసుదేవదేవకీదేవులకుం జెప్పి సఫలంబు సేయుదు నని యర్జునునకు హృదయానందంబుగాఁ బలికి యప్పుడ వడిగల చారుల [3]రావించి ద్వారవతియందర్జునుండున్న వాఁ డ[4]ను కుశలవార్త ధర్మజున కెఱింగింప నింద్రప్రస్థ పురంబునకు [5]బుచ్చియున్నంత నచ్చటికి వచ్చి బలదేవాదియాదవు లతిభక్తులై యతియ కా[6]వగచి యర్జునునకు నమస్కరించి యాతనివలన సర్వతీర్థంబులఁ దత్సేవాఫలంబులును విని సంతసిల్లి యివ్వర్షా[7]కాలంబు మాయందయుండి చాతుర్మాస్యంబు సేసి మమ్ముం గృతార్థులం [8]జేయుండని ప్రార్థించి పార్థుం దోడ్కొని చని వానికి నన్న [9]పానాదివిధులం [10]బరిచరింప సుభద్రం బంచి [11]కన్యాపురంబునందు నివాసంబు[12]సేసిన.

—: అర్జునుండు యతిరూపంబున కన్యాపురంబున నుండుట :—

సం. అను 1—114—64 పంక్తి

181 క. అందు ధృతిమందరుండు పురందరనందనుఁడు దనకు [1]రమణిగుణశ్రీ
సుందరి సుభద్ర నెయ్యం బొందఁగఁ బరిచర్య సేయుచుండఁగ నుండెన్.

179 1, యతీంద్ర — ఆ. 2 మతి — ఏ.న ర

180 1. బద్ధస్నేహుండవగుట — పెక్కు ప్రతులు. 2. దేవకి వసుదేవులకుం జెప్పి — మ.ర. 3. రావించి గోప్యంబున ద్వారవతి — ఏ ల.స. 4 ని — కొన్ని ప్రతులు. 5. బంచి — పెక్కు ప్రతులు. 6. దలంచి — ఈ.ఐ. 7. కాలం బిందయుండి — కొన్ని ప్రతులు; కాలంబు మాయొద్ద (న) యుండి — ఏ.ఓ. 8. జేయుమని — పెక్కు ప్రతులు. 9. పానవిధులొనర్ప — ఓ. 10 పచరింప — అ $గ_1$ య 11. కన్యాంతః పురంబునందు, కన్యాగారంబునందు — అని పాఠములు. 12. చేయించిన — వ.

181 1. రమ్యగుణశ్రీసుందరి — పీ.స.ల ; రమణిగుణశ్రీసుందరి — ఆ.ఈ.బు.ఏ.బ. భాసం.య.ర.స ; రమణ — వా. కొన్ని ప్రతులు.

182 క. ధీరుఁడు యతిరూపంబున, [1]నారఁగ నిందున్న యాతఁడర్జునుఁడని స
త్యారుక్మిణులకుఁ జెప్పె ము,[2]రారాతి రహస్యమున ననంతప్రీతిన్.

183 చ. అలయక[1]నాఁడునాఁటికి లతాంగి [2]యపూర్వములైన భోజనం
బులు గడుభక్తిఁ బెట్టుచు నపూర్వ[3]ములైన [4]వపుర్విలాసయు
క్తులు వెలయించుచుణ్ ముదముతోఁ బెనిచెన్ [5]మఱినాఁడునాఁటి క
గ్గల మగుచుండ నెయ్యమును గామవికారము సవ్యసాచికిన్.

184 వ. [1]మఱియును.

185 సీ. అలినీలకుంతలుం డనియును హరినీలసమవర్ణుఁ డనియు నాజానులంబి
తాయతస్థిరబాహుఁ డనియు[1]ను రక్తాంతనలినదళాకారనయనుఁ డనియు
నుత్తుంగఘనవిశాలోర[2]స్కుఁడనియును గవ్వడి యనియును గరమువేడ్క
విష్ణుచు నెప్పుడు [3]విని యెఱుఁగుదని దనవినినట్లు యతిఁజూచి వీఁడు విజయుఁ
ఆ. డొక్కొ యనుచు సంశయోపేతచిత్తయై,యుండి [4]యుండనోపకొక్క
నాఁడు
భోజనావసానమున నున్న య[5]మ్మునిఁ, కిందువదన ప్రీతి నిట్టులనియె.

182 1. నారయనిందున్నవాఁడు — స.ల. 2. రారి రహస్యమున దానినంతయు ప్రీతిన్ — న.ర.

183 1. నాఁటినాఁటికి — $గ్ర_1$.వి. 2 మనోహరమై — హె స. 3. విలాస విశేషభక్తి యుక్తులు — ఓ.క.ఖ.న.బ.య.ల. 4. వచోవిలాసయుక్తులు — వ. 5. మదినాడు నాటికి — ఆ.న.మ.ల.స , మరినాడు నాటికి — ఉ.ఋ.ఐ.ఓ.బ ; మఱునాఁడు నాఁటికి - వా. కొన్ని ప్రతులు.

184 1. కొన్నిటలేదు.

185 1 నురక్తాంతనలిన — పెక్కు ప్రతులు ; నారక్తాంత — వా. కొన్ని ప్రతులు. 2. స్థలుఁడనియు గవ్వడి - అ.ఆ.ఎ.ఒ.ఓ.డ.బ. 3. వినియుండునది - ఉ.ల.వి ; విని మఱియది — $గ్ర_1$.చ.ద.శ.ష. 4 యుండి యోపకొక్కనాడు — ఉ. 5 మ్మునికిట్టులనియెఁ ప్రీతినిందువదన — $గ్ర_1$.చ.ద.ఖాసం.వి.శ.ష.

186 వ. మునీంద్రా [1]నీయాడని తీర్థంబులుం జూడనిపురంబులు నెఱుంగని రాజకులంబును [2]లేవని విచా[3]రింతు.

187 సీ. అమరావతికి [1]నెనయనఁగ నివ్వసుమతిఁ బరగు నింద్రప్రస్థపురవరంబు చూచితిరే పాండు[2]సుతు లందు సుఖమున్న వారె మాయ త్తయంభోరుహాక్షి కుంతీమహాదేవి [3]కుశలయే [4]యమ్మహావీరుఁ డర్జునుఁడు జితారి తీర్థ గమ[5]నో[6]త్సుకుం డయ్యెఁ గ్రమ్మఱి వచ్చెనే యెఱుఁగుదురేని నాకెఱుఁగఁ జెప్పుఁ

ఆ. డనిన నేన చూవె యయ్యర్జునుండ నీ, యొద్ద నివ్విధమున నున్నవాఁడఁ దరుణి నీకు నాకు ధరణీధ[6]రుండను, జలజభవుఁడు సేసె సంగమంబు.

188 వ. బ్రాహ్మంబు మొదలుగాఁగల యెనిమిదివివాహంబులయందును గాంధర్వరాక్షసంబులు క్షత్త్రియులకు నుత్తమవివాహంబులు గావున నిది గాంధర్వవివాహం[1]బున కవసరం బనిన సుభద్ర లజ్జావనతవదన యయి.

189 తే. [1]నన్ను నీ సర్వులెల్ల నిందున్నవారు, [2]వారయెఱిఁగి చేయుదురు వివాహమనుచు వనజనే[3]త్ర [4]యంతఃపురంబునకుఁ జనియె, నరిగెఁ దనలతాగృహమున కర్జునుండు.

186 1 మీ - పెక్కు ప్రతులు. 2 లేదని - వా 3 రింతుకావున నొక్కటి యడిగెదనని యిట్లనియె - ఏ

187 1. నెనయనగ బొల్పెసగుచుబరగు — య. 2. సుతులు సుఖంబున్న - చ.ద.శ.ష. 3. కుశలినియే మహావీరుఁడ — ఋ.ఓ గ్రి₁.ద.పీ.శ ష ; కుశలియే — కొన్ని తాళపత్ర ప్రతులు 4. మరి మహావీరుఁడ — అ.ఐ ఓ.ఔ.క డ.మ.ల.స. 5. నోత్సుం కుండయ్యె - పెక్కు ప్రతులు ; నోద్యతుండయ్యె - వా ; నోన్ముఖుండయ్యె — ఋ ఏ.ఒ.ఓ.క.జ బ.భాసం మ.వ.పీ స. 6 రుండును — వా. కొన్ని ప్రతులు ; రుండను — అ.ఓ.ఖ.డ.వీ

188 1. బునకు సమయంబనిన — క.గ్రి₁.ద.భాసం.పీ.శ.ష.

189 1. నన్ను నీకియ నర్వు లిందున్నవారు - క ల. 2. వారలెరిగి — కొన్ని ప్రతులు. 3 త్రి — పెక్కు తాళపత్ర ప్రతులు. 4 యంతఃపురంబునకు — పెక్కు ప్రతులు ; కన్యాపురంబునకు — వా.శ ; కన్యాగారమునకు, కన్యాగృహమునకు — అని పాఠములు.

190 వ. అయ్యి[1]రువుర యన్యోన్యప్రణయంబులు దనదివ్యజ్ఞానంబునం జేసి దివ్య పురు[2]షుండు పురుషోత్తముం డెఱింగి యర్జునునకు భోజన[3]విధు లమర్చ రుక్మిణీదేవిం బంచి యొక్కనాఁ [4]డేకాంతంబున [5]దేవకీవసుదేవ ప్రద్యుమ్నసాంబసంకర్షణ సారణ సాత్యకులకు నర్జునుస్థితియును నాతని యందు సుభద్రనెయ్యంబును నెఱింగించి తమతొల్లింటి విచారంబున కను [6]గుణం బగుటకు సంతసిల్లి బలదేవాదు లెఱుంగకుండ సుభద్రార్జునుల వివాహంబు సేయ [7]సమకట్టి తమనిశ్చయం బయ్యిరువురకుం జెప్పి పశుపతి పూజామహోత్సవవ్యాజంబున నఖిలయాదవభోజాంధకవృష్ణివరులతో నంతర్ద్వీపంబునకుం జని.

191 క. అందమరబృందవంద్యున, కిందుకళా[1]భరణునకు [2]నుమేశ్వరునకు నా
నందం[3]బొందఁగ [4]నందలు, నందకధరుఁ డుత్సవం బొనర్చఁగఁ బంచెన్.

192 క. [1]తగఁగ వివాహం బెన్నం, డగునొకొ యెన్నండు సంగమావాప్తియు మా
కగునొకొ యని [2]యొడఁగోరుచు, నొగి[3]నిటయుండిరి సుభద్రయును విజ
యుండున్.

193 క. హరిఁ దలఁచె సుభద్ర పురం, దరుఁ దలఁచె ధనంజయుండు దడయక వార
[1]య్యిరువురఁ బెండిలిసేయఁగ, వరదులు తద్ద్వారవతికి వచ్చిరి ప్రీతిన్.

190 1. ద్దర — కొన్ని ప్రతులు 2. షుండగు — కొన్ని ప్రతులు. 3. విధు లొనర్చ, విధులుదీర్చ — అని పాఠములు. 4 డేకాంతంబ — పెక్కింట లేదు 5. దేవకీవసుదేవులకు — అని పెక్కు ప్రతులు. 6 రూపంబగుట — పెక్కు ప్రతులు; కూలంబగుట — కొన్ని ప్రతులు. 7. నిశ్చయించి — పెక్కు ప్రతులు.

191 1 ధరునకును నుమేశ్వరు — ఈ. 2 మహేశ్వరునకు — వ. 3. బందగ — ద.భాసం పీ.శ ష. 4 జగదానంద కరుండుత్సవం బొనర్చఁగఁబంచెన్ — ఏ.న.స.

192 1. దీనికిముందు అయ్యవసరంబున అనువచనము — ఔ.ర. ప్రతులలోఁ గలదు. 2. యొద, మది — అని పాఠములు. 3. నిటనుండిరి — ద.పీ.శ.ష.

193 1 య్యిరువురను బెండ్లి సేయఁగ—కొన్నిప్రతులు, య్యిరువుర పెండిలి — $గ_1$.ద.శ.ష, య్యిరువురకుఁ బెండ్లి సేయఁగ — భాసం

—: అర్జునుండు సుభద్రను వివాహం బగుట :-

సం. అను 1-144-270 పంక్తి

194 వ. ఇట్లు వాసుదేవుండు వసుదేవాక్రూర సారణసాంబ సాత్యకిసహితంబుగా నంతర్ద్వీపంబుననుండి వచ్చిన యనంతరంబ యమరావతినుండి యమరసిద్ధ సాధ్యమునిగణపరివృతుండై యమరేంద్రుండు వచ్చె నంత బృహస్పతి యిచ్చిన [1]యుత్తమలగ్నంబున నగ్నియమ[2]నిర్ఋతివరుణవాయు ధన [3]దేశానాదిసురవరులు నత్రిభృగునారదవసిష్ఠవామదేవ ప్రభృతిమహామును లును సదస్యులుగాఁ గశ్యపప్రజాపతి హోమకర్తగా నరుంధతియు శచియు సత్యభామయు రుక్మిణియు నప్సరోగణంబులతోడం బురంధ్రీ కార్యంబులు [4]నిర్వహింప సుభద్రార్జునుల వివాహమహోత్సవం బతి రమ్యం బయ్యె నంత.

195 తరువోజ. అనిమిషప్రభుఁడు నిజాత్మజు నసఘు నర్జునుఁ బ్రీతితో నభిషిక్తుఁ జేసి [1]మనుజేంద్రుఁ గాంచనమణిమయోత్తుంగమకుటవిభూషణ మస్తకుఁ జేసి యనుపమకేయూరహారాదిభూషణాభిశోభితుఁ జేసి యప్పుడా నంద జనితాంబు[2]కణికార్ద్రచతుస్సహస్రజలరుహంబులు దాల్చె[3]సమ్మదం బెసఁగ.

196 మాలిని. సరున[1]కు దయ నిట్లానంద మొందించి యింద్రుం డరిగె దివికి దివ్యానంతరత్నాంశుజాల స్ఫురితసురవిమానంబుల్ నభోభాగ మెల్ల [2]స్మెరసి వెలుఁగుచుండ నిర్జరశ్రేణితోడన్.

194 1. శుభ — కొన్ని ప్రతులు, యుత్తమ — పెక్కింట లేదు. 2. నిర్ఋతి — పెక్కు ప్రతులలో లేదు 3. దాదిసురవరులు — కొన్ని ప్రతులు. 4. సేయ — పెక్కు ప్రతులు.

195 1. మనుజేంద్రుగా మణిమయసముత్తుంగమకుటవిభూషితమస్తకుజేసి — అ.ఈ.ఖ.ర. 2. కణసాంద్రచతుస్సహస్ర — ర 3. సమ్మతులెసఁగ — ర; సంరంభ మెసగ — అ.

196 1. కొనరనిట్లానంద—బు. 2. న్, మెరసి—అ.ఉ.ఓ.డ ద.బ.మ; న్, నెరసి — భాసం.వా ళ కొన్ని ప్రతులు.

197 వ. ఇట్లు నారాయణుండు [1]నిజారంభంబు సఫలంబగుటకు సంతసిల్లి సంప్రాప్త మనోరథుం డయిన యప్పార్థుం గౌఁగిలించుకొని య[2]క్షయ బాణతూణీర బాణా[3]సన[4]సనాథంబయి పవనజవనహయంబులం [5]బూన్చిన యక్కాంచనరథం బెక్కి సుభద్రం దోడ్కొని యింద్రప్రస్థపురంబున కరుగుమని [6]పంచి యనంతరం బంతర్ద్వీపంబున [7]కరిగిన.

198 క. హరి పంచినమార్గంబునఁ, గురువిభుఁడు సుభద్రఁ దోడుకొని చనునెడఁ ద
[1]త్పురపరిరక్షకు లతిభీకరులు [2]పృథుశ్రవసుఁ డాదిగాఁగల వీరుల్.

199 ఉ. వీరుఁడు [1]వీఁడు పాండవుఁడు వృష్ణికులోత్తములైన సీరి దై
త్యారు లెఱుంగకుండఁగ మహారథుఁడై తరుణీ సుభద్ర సం
భోరుహనే[2]త్రఁ దోడ్కొనుచుఁ బో[3]యెడి నీతనిఁ బోవనిచ్చినన్
[4]ధీరుఁడు మాధవుండు బలదేవుండు నల్గుదు రంచు నడ్డమై.

200 క. వీరికిఁ బఱతెంచి నలుగడఁ, దాఁకినఁ గడునలిగి ఘోరతరశరహతి న
మ్మూఁకలు విరియఁగ నర్జునుఁ, [1]డాఁకరమున నేసె నుగ్రుఁడయి రణభూమిన్.

201 చ. హరితనయుండు పార్థుఁడు రయంబున నందఱ నాహవక్రియా
[1]విరతులఁ జేసి యప్పురము వీథుల వేదుల రమ్యహర్మ్యగో
పురములఁ దద్గిరీంద్ర[2]మణిభూముల భూరితటాకపంకజా
కర[3]నవనందనావళులఁ గాండమయంబులఁ [4]జేసె సీసునన్.

197 1 నిజప్రారంభంబు — కొన్ని ప్రతులు. 2 [illegible] — కొన్ని ప్రతులు. 3 సనోపేతంబయి — ఉ.ప. 4 సన్నద్ధంబై, సన్నాహంబై — అని పాఠములు. 5 బూనిన — కొన్ని ప్రతులు 6. పంచి యంతర్ద్వీపంబున — వా. కొన్ని ప్రతులు. 7. కుంజనియెనంత — కొన్ని ప్రతులు

198 1. త్పురి — కొన్ని తాళపత్ర ప్రతులు. 2. శ్రుతశ్రవసుడాది — ఋ.ఓ.బ

199 1. పాండవుండు యదువృష్ణి — కొన్ని ప్రతులు. 2. త్రి — పెక్కు తాళపత్ర ప్రతులు 3. డు నీతని — భాసం. పీ.శ.ష. కొన్ని ప్రతులు 4. ధీరులు — ల.

200 1. డాఁకతమున — అ.క ; మూకలు, ఆకరముగ — తి. (అర్ధబిందువు లేని రూపములు) ; డాఁకరమున — శర.

201 1. విరథుల — కొన్ని ప్రతులు ; [illegible]రహుల — $\text{గ}_1$.చ ద పీ.శ.ష. 2. తల భూముల — న [illegible] నందనావళుల — పెక్కు ప్రతులు. 4. నేసె నీసునన్ — కొన్ని ప్రతులు.

202 క. అమరేంద్రసుతుఁడు దనకుం, గమలాక్షి సుభద్ర [1]రథముఁ గడపఁగ ననిలో
నమితయదుసైన్యముల న,శ్రమమున నోడించి లబ్ధజయుఁడయి యరిగెన్.

203 వ. అంత సభాపాలుండు ప్రబలజలధరధ్వానగంభీరభేరీధ్వనిచే నర్జును
పరాక్రమం బెఱింగించిన దాని విని యంతర్ద్వీపంబున నున్న బలదేవాది
యాదవులందఱు [1]నాతఁణంబ పురంబునకు వచ్చి సభాసీనులయి.

204 క. యాదవుల నాదరింపక, యాదవిఁ [1]దోడ్కొని కిరీటి యరిగెను గంభీ
రోదధిఁ[2]గరముల నీఁదం,గాదనక కడంగె నధికగర్వోద్ధతుఁడై.

205 మత్తకోకిల. ఏల పార్థుపరాక్రమంబు సహింప నాతని నాహవ
వ్యాలు నిప్పుడ పట్టి తెత్తము వాతధూతదవానల
జ్వాలకున్ వనరాశివేల కసంఖ్యయాదవసేనకున్
[1]దేలిపోవక చక్కనయ్యెడు ధీరులెవ్వరు [2]పోరిలోఁ.

206 వ. అని విజృంభించి విలయసమయసముద్ధూతవారాశియుంబోలె ఘూర్ణిల్లు
చున్న యాదవవీరుల వారించి వాసుదేవుం జూచి బలదేవుం డిట్లనియె.

207 క. నీ వెఱుఁగకుండ గర్వము,తో విజయుఁడు దా సుభద్రఁ దోడ్కొని బలిమిం
బోవఁగ నంతసమర్థుఁడె, నావుడుఁ గృష్ణుండు రామునకు నిట్లనియెన్.

202 1. తేరుగడపఁగ — ఉ ప ఐ.న వ.

203 1. నతఁణంబ — కొన్ని ప్రతులు.

204 1. గొని పాండుతనయుఁ డరిగెను — ల. 2 జేతుల — స ల.

205 1 దేలిపోవక — పెక్కు ప్రతులు; జేలుపోవక ... వీరులెవ్వరు — స.ల; దీలపోవక — వా. 2 పోరులన్ — పెక్కు ప్రతులు.

208 సీ. భరతకులాగ్రణి పాండవ [1]సింహంబు సర్వధర్మజ్ఞుఁ డాసవ్యసాచి
దనమేనమఱఁదలి ధవళాక్షిఁ దోడ్కొని చనియె నాతని కది చనదె [2]చెపుడ
యప్పార్థుపిఱుఁద మిరరుగంగ వాఁడంత యశ్రమసాధ్యుఁడె యాహవమున
నఖిలాస్త్రవిదుఁడు ద్రోణాచార్యశిష్యుండు జిత[3]కాశియని వానిఁ జెప్ప[4]వినరె

ఆ. వలవ దుడుగుఁ డనిన వామనుపలు[5]కను, వేలఁ గడవ దయ్యె వృష్ణిభోజ
యాదవాంబురాశి యట దనంజయుఁ డవి, జేయుఁ డభిమతార్థసిద్ధిఁబొంది.

-: అర్జునుఁడు సుభద్రాసహితుండై యింద్రప్రస్థపురంబునకుఁ జనుట :-

సం. 1-213-13

209 వ. [1]ఇట్లింద్రప్రస్థపురంబున కభిముఖుండై [2]యానర్తక[3]దేశంబులకుం జని
యందు ముందఱ ముకుంద[4]ప్రేషితులయిన దాశార్హవీరులతో నగణ్యా
రణ్యంబులు గడచుచుఁ బుణ్యతీర్థంబుల [5]నాడుచు నానాజనపదంబుల
విహరించుచు వచ్చి యింద్రప్రస్థపురసమీపంబున

210 ఆ. ఘనభుజుండు నరుఁడు దన[1]తోఁటపట్టుల, విశ్రమించి భువనవిశ్రుతుండు
మతిఁ దలంచి యాత్మహితమగునట్లుగా, నిష్టమున సుభద్ర కిట్టులనియె.

211 వ మన మిత్తెఱంగున ఁజనునప్పుడు నిన్నుఁజూచి ద్రుపదరాజపుత్త్రి యప్రి
యంబులు వలుకునో యప్పరమపతివ్రతపలుకు నిక్కువంబగుం గావున
నీవేకతంబ గోపాలబాలికలతో ముందఱ నరిగి యక్కోమలిం [1]గనుమని
పనిచిన సుభద్రయు నిజేశ్వరుపంచినమార్గంబున నింద్రప్రస్థపురంబునకుం
బోయి కుంతీదేవికి ద్రౌపదికి మ్రొక్కిన.

208 1 సింహుండు — ఏ ఐ జ న. 2. చెపుమ — కొన్ని ప్రతులు. 3. వైరియని' శత్రుఁడని — పాఠములు 4 వినమె — పెక్కు ప్రతులు 5. కులవేల — మ

209 1. అట్లింద్రప్రస్థ, ఇట్లింద్రప్రస్థ — అని పాఠములు 2 అనేక దేశంబులకు — ఎ.గి$_1$.జ ద.శ ష. 3. దేశంబునకు — కొన్ని ప్రతులు 4. ప్రేరితులైన — పెక్కుప్రతులు 5. నాడుచు — ర ల వీ స , చూచుచు — వా పెక్కు ప్రతులు.

210 1. తోఁటపట్టుల — ఐ ఔ.క.ఖ గ.మ ల శ.స ; మూలము. క్రోశమాత్రే పురస్యాసీత్ గోష్ఠం పార్థస్యశోభనం. పి.పి ఎస్ ప్రతి. పుట 1388.

211 1. గని యడుగులంబడుమని పంచిన సుభద్రయు — వీ.శ.ష. కొన్ని ప్రతులు

212 తే. పంకజాక్షి నీపతి ప్రతిపక్షవీర, విజయుఁ [1]డయ్యెడు నీవును వీరపుత్త్రి
జనని వగుమని దీవించె సంతసంబు, తోడ వసుదేవపుత్త్రి నాద్రుపదపుత్త్రి.

213 వ. ఇట్లు ద్రోవదిచేత దీవనలు [1]సేకొని కుంతీదేవియొద్ద సుభద్ర యున్నంత
నట యర్జునుండును నసం[2]ఖ్యాతదాశార్హసైన్యా[3]సమేతుండై యనేక
బ్రాహ్మణాశీర్వాదంబు లెసఁగ నింద్రప్రస్థపురంబుం బ్రవేశంబు సేసి
ధౌమ్యు[4]నకు ధర్మరాజునకు భీమునకుఁ గుంతీదేవికి మ్రొక్కి తనకు
మ్రొక్కిన కవలం గౌఁగిలించు[5]కొని పర[6]మానందంబున నుండు నంత.

214 క. చెలియలు [1]మఱఁదియుఁ జని యిమ్ముల నింద్రప్రస్థనగరమున నభిమతబం
ధులయొద్ద నున్నవారని, జల[2]శయనుఁడు విని కరంబు సంతుష్టుండై.

—: శ్రీకృష్ణబలదేవాదులు పాండవులకుఁ గానుకలు తెచ్చియిచ్చుట :—

సం 1—213—23

215 సీ. బలదేవ సాత్యకి ప్రద్యుమ్న వసుదేవు లాదిగా [1]బెరసిన యాదవాగ్ర
గణ్యులుఁ దాను నగణ్యమహావస్తువాహనంబులు గొని వాసుదేవుఁ
డనుజకు నరణ మీ నర్థితోఁ జనుదెంచె హరిరాక యెఱిఁగి ధర్మాత్మజుండు
[2]గరము గారవమునఁ గవలను గృష్ణున కెదురు పుత్తెంచిన [3]నింద్రలీల

---

212 1. డయ్యెడ — య.ర. కొన్ని ప్రతులు.

213 1. వడసి — అ.ఏ.ఖ.ర ; గొని - గ్ర$_1$ వి.శ.ష. కొన్ని ప్రతులు. 2. ఖ్యాదాశార్హ — కొన్ని ప్రతులు. 3. సమన్వితుండై — కొన్ని ప్రతులు. 4 లకు — అ.ఋ.ఓ 5. కొని ద్రౌపదీహృదయానురాగకరుండయి పరమానందంబున—వా. 6. మాను రాగంబున — కొన్ని ప్రతులు

214 1. మఱఁదియుఁ జనియి, మ్ముల — అ గ.చ జ.ద.భాసం వి.శ ష ; మఱందియు నుని, మ్ముల — వా. కొన్ని ప్రతులు, 2 జాతుఁడువిని — ఎ.ఐ.ఖ.ర.

215 1. గలిగిన — అ.ఈ.ఉ. కొన్నిప్రతులు ; బరఁగిన — భాసం.వి.శ.ష. కొన్నిప్రతులు. 2. గౌరవంబున భీముఁగవల నాకృష్ణున — స. ఇచ్చట మూలము — తతో యుధిష్ఠిరోరాజా శ్రుత్వా మాధవమాగతం, ప్రతిగ్రహార్థం కృష్ణస్య యమౌ ప్రస్థాపయద్గృహాత్. పి పి.ఎస్. ప్రతి.పుట 1395 3. ముదముతోడ — ఏ.జ.ట.బ.

ఆ. ఇందువంశ[4]విభుఁ డుపేంద్రుఁ డింద్రప్రస్థపురము సొచ్చె సతివిభూతి[5] మెఱసి
యనుజవరులతోడ నంతఁ బ్రత్యుద్గతుం, డై యుధిష్ఠిరుండు హర్ష మెసఁగ.

216 వ. వసుదేవాది యాదవవృద్ధుల కెల్ల మ్రొక్కి బలదేవవాసుదేవ సాత్యకి సారణ
ప్రద్యుమ్నాదుల నుచిత[1]ప్రియపూర్వకంబున సత్కృతులం జేసిన.

217 ఉ. ఆనకదుందుభి[1]ప్రభృతియాదవులుం గురుముఖ్యులున్ మృదం
గానకదుందుభుల్ సెలఁగ నత్యనురాగముతో నిరంతర
శ్రీనుతు లొప్ప నుత్సవము సేసిరి సప్తదినంబు లిష్టస
[2]మ్మానములన్ మహీసురసమాజ[3]సమీహిత[4]పూజనంబులన్.

218 వ. [1]అంత.

219 క. నిరుపమపరార్థ్యరుచిసుందరరత్నావళుల శోభితము లగు వానిన్
వరదుఁడు సహస్రసంఖ్యాభరణంబులఁ బార్థునకు సుభద్రకు [1]నిచ్చెన్.

220 వ. [1]మఱియును.

221 సీ. అవిరళ[1]ఘరితదానార్ద్రగండస్థలగజసహస్రంబును గనకరత్న
రచితమై తురగసారథి [2]సహితంబైన రథసహస్రంబును రమ్యభూష
ణాలంకృత స్త్రీసహస్రంబుఁ గాంచనశిబికాసహస్రంబుఁ జిత్ర[3]లలిత
గతినొప్పు నేనూఱు [4]గాడిదలను సింధు బాహ్లిక కాంభోజ పారసీక

4. వరుడు పేంద్రు — ఎ.ప.ఐ ఖ.గ న ర. 5. మెఱయ — ఖ.న.ర.

216 1. ప్రతిపత్తి — ఒ.

217 1. ప్రముఖ — క.ట.ల 2. న్మానములన్ — కొన్ని ప్రతులు. 3. సమాహిత — ఆ.ఈ.ఎ.ఓ.గ.డ. 4 కార్యపూజలన్ — ఓ.

218 1. కొన్నిట లేదు.

219 1. నొసఁగెన్ — వ.

220 1. కొన్నిట లేదు.

221 1. గళిత, స్ఫురిత — అని పాఠములు. 2. సమేతంబైన — ఉ.ప.ఖ.న.ల.వ. 3. రూప, లీల — అని పాఠములు. 4. గాడి(ద)దెలను — అ.ఆ.ఇ.ఊ.ఎ.ఐ. ఓ ఔ.ఖ.త ప.ర; గాడీలు మఱిసింధుజ — ఈ.గ.గ1.జ.ద.వీ శ.ష. శర.సం, గార్దభంబులు — వీ; ఖరములు మరి — క.ల; ఘనతరోష్ట్రంబులు — బ;

ఆ. జాతమైన తురగశతసహస్రము లతు,[5]గోధనంబు నధికఘోరవీర
[6]దర్పయుక్తులైన దశలక్షదాశార్హ్య,వరుల నరణ మిచ్చె వామనుండు.

222 క. క్రమము[1]నను గొంతిదేవిని, యమనందను భీముఁగవల నాద్రౌపది ను
త్తమరత్నాభరణాదుల, నమరఁగ వేర్వేఱ నెయ్యుఁడయి పూజించెన్.

223 వ. మఱి[1]యు బలదేవాదియాదవముఖ్యులెల్ల సుభద్రార్జునులం బూజించి పాండవులచేతం బ్రతిపూజితులై ద్వారవతికిం జని రుపేంద్రుం డింద్ర నందనుతోడి యిష్టవినోదంబుల నింద్రప్రస్థపురంబున [2]నుండెనంత

—: అభిమన్యుప్రభృతుల జననము :—

సం. 1—213—58

224 ఉ. ధన్యుల కాసుభద్రకు శతక్రతుపుత్త్రిన కుద్భ[1]వించె స
[2]మ్మాన్యయశుండు పుత్త్రుఁ డభిమన్యుఁడు [3]వైన్యవిభుం డనన్య సా
మాన్య [4]పరాక్రమప్రబలమాన్యుఁడు పుణ్యచరిత్రుఁ డన్యరా
జన్యభయంకరుండు [5]రణశౌర్యుఁడు పాండవవంశకర్తయై.

గంధర్వహయంబులు — న భాసం ఇచ్చట మూలము. తథై వాశ్వతరీణాంచ దాంతానాం వాతరంహసామ్. పి పి ఎస్. ప్రతి. పుట 1398. 5. గోగణంబు — ఉ.
6. దర్పయుక్తులైన దాశార్హపతులను, మరవెకరణమిచ్చె మాధవుండు — క.

222 1 నఁగుంతీదేవిని — వి శ.ష. కొన్ని ప్రతులు.

223 1 యు వసుదేవ బలదేవాది — కొన్ని ప్రతులు. 2 నుండునంత — కొన్ని ప్రతులు

224 1. విల్లె — ఆ.డ.వ. 2. న్మాన్యయశుండు - కొన్ని ప్రతులు. 3. సూర్యాని భుండు —ప; ధైర్యఘనుండు — మ. 4. పరాక్రముండు శతమన్యుని పౌత్రుఁడు పోరనన్యరాజన్య—ఉ.న ; పరాక్రముండుశతమన్యుని పౌత్రుఁడు పుణ్యుఁ డన్యరాజన్య—ప ; పరాక్రమ ప్రబలమాన్యుఁడు—ఆ క.గ$_1$.ట.డ ద.వి శ.ష య ర ; పరాక్రమ ప్రబలమన్యుఁడు — వా. కొన్ని ప్రతులు. 5. పటుశౌర్యుఁడు — ల.వి.

225 చ. సుతజననోత్సవంబున విశుద్ధయశుండు యుధిష్ఠిరుండు సం
భృతహృదయప్రమోదుఁడయి పెంపున నిచ్చె సువర్ణభూషణ
ప్రతతు[1]లు గోధనాయుతము బ్రాహ్మణముఖ్యులకున్ నిరంతర
వ్రతులకు వేదవేదులకు వారిజసంభవు [2]నట్టివారికిన్.

226 వ. ఇట్లుదయించిన యభిమన్యుండు దల్లిదండ్రులకు సకలజనులకు నానందం
బొనరించుచు ధౌమ్య[1]నిర్మితజాతకర్మచౌలోపనయనుండయి [2]పెరుఁగుచు.

227 మత్తకోకిలము. ఆదిఁగోలెను గృష్ణుచే దయ[1]నావృతుండయి ధౌమ్యుతో
వేద [2]మంగయుతంబుగాఁ జదివెన్ ధనంజయుతో ధను
ర్వేద మిమ్ముగ నభ్యసించెఁ బ్రవీర[3] వైరిపతాకినీ
భేదమార్గము లెల్ల నేర్చె [4]నభేద్యవిక్రమసంపదన్.

228 వ. అంత ద్రుపదరాజనందనయుం గ్రమంబునఁ బాండురాజనందనులవలనఁ
బ్రతివింధ్య శ్రుతసోమ శ్రుతకీర్తి శతానీక శ్రుతసేనులను [1]వారిఁ
బంచోపపాండవులను సుపుత్త్రులం బడసిన.

229 క. [1]సుతవంతులయి విశుద్ధశ్రుతనయవంతులయి పాండుసుతు లతుల [2]గుణా
న్వితులు జగజ్జననుత [3]వి, శ్రుతులు మహారాజ్యలీల సుఖమున్నంతన్.

---

225 1. లతోదరత్నములు — ఐ. 2. నంత, వంటి — అని పాఠములు.

226 1. నిర్వర్తిత — ఉ.ల. 2. పెరిగి, పరగి — అని పాఠములు.

227 1. నాదృతుండయి — ల. 2. మర్థయుతంబుగా — అ. 3. వైరిసమూహాని. ర్భేద — ల. 4. నుపేతవిక్రమసంపదన్, నుపేంద్రవిక్రమసంపదన్ — అని పాఠములు.

228 1. నేవురసుపుత్రుల — గ్ర$_1$.చ.భాసం.వీ.శ ష.

229 1. మతిమంతులయి — ఏ.న. 2. గుణోన్నతులు — కొన్ని ప్రతులు; గుణో న్నత కీర్తిసమేతులు వి/శ్రుతులు — వ. 3. విశ్రుతచరితులు, రాజ్యాలల — పెక్కు ప్రతులు.

230 చ. ఉరుతరదావపావకశిఖోత్కలిత[1]శ్వసనంబులున్ [2]సితే
తరగతి తీవ్రతిగ్మకరధామసహస్రము[3]లుఁ బహుప్రవా
హరహితనిమ్నగాతతులునై కడుదీర్ఘములై నిదాఘవా
సరములు సర్వజీవుల కసహ్యము లయ్యెను దారుణంబులై.

231 వ. అట్టి ఘర్మ[1]దివసంబులు సహింపనోప [2]కర్జునుం డొక్కనాఁడు కృష్ణున
కిట్లనియె.

232 చె. జలరుహనాభ రమ్యగిరి[1]సానువనంబుల వేఁటలాడుచున్
[2]జలుపుద మీ నిదాఘదివసంబు[3]ల నీవును నేను [4]నున్మిష
న్నలినరజస్సుగంధియమునా[5]హ్రదతుంగతరంగసంగతా
నిలశిశిరస్థలాంతరవినిర్మితనిర్మలహర్మ్యరేఖలన్.

233 వ. అని పురందరనందనుండు గోవిందునను[1]మతంబు వడసి మిత్రామాత్య
భృత్యసమేతులయి యిద్దఱు నరిగి [2]యథారుచిప్రదేశంబుల [3]విహరించుచు
నొక్కనాఁడు ఖాండవ[4]వనసమీపంబున నొక్కచందనలతా [5]భవన చంద్ర
కాంతవేదికయందు [6]మందశీతలసురభిమారు[7]తం బనుభవించుచు నిష్ట
కథావినోదంబుల నుండునంత.

230 1. శ్వసనంబులన్ — కొన్ని ప్రతులు; శ్వసనంబులై — అ; శ్వసితంబులున్ — స
2. నిరంతరగతి — కొన్ని ప్రతులు. 3. లన్ — కొన్ని ప్రతులు; లై — అ

231 1. దివసంబులయందర్జునుండొక్క — గ$_1$.చ.ద.వీ.శ.ష 2. కయర్జునుండొక్క —
కొన్ని ప్రతులు.

232 1. సానుతలంబుల — ఋ. 2. జలుపుదుమే — ఔ. 3. లు — పెక్కు ప్రతులు.
4. ప్రీతితో — అ.క; నిచ్చలుఁ — ఔ.న. 5. నది — అ.పం.ఐ.బ.య.సం.

233 1. తి వడసి — ఋ ఔ. 2. యథార్హప్రదేశంబుల — న.బ.ల; యథార్హచిత్ర—
ఖ.ఛాసం.య.ర; రుచిర ప్రదేశంబుల — గ$_1$.చ.ద.వీ.శ.ష. 3. విశ్రమింపుచు —
ఎ.ఔ. 4. వన — పెక్కు ప్రతులలో లేదు. 5. భవనంబున — ల. 6. మంద
స్మితసురభి — కొన్ని ప్రతులు. 7. తంబులు పైవీచుచుండగ — ఋ.ఓ.

-: అగ్నిదేవుఁడు ఖాండవసమీపమున విహరించుచున్న
కృష్ణార్జునుల కడకు వచ్చుట :-

సం. 1-214-29

234 మాలిని. అసితపథుఁడు విప్రుండై మహాక్రాంతలీలన్
మసృణకపిలకేశశ్మశ్రుఁ డొప్పంగఁ దేజం
బెసఁగ [1]ముదముతో నయ్యిద్దఱన్ డాయ వచ్చెన్
వసునిధు లగువారిన్ వాసవిన్ వాసుదేవున్.

235 వ. వారు నవ్విప్రు నతిభక్తిం బూజించిన వారలకు నవ్విప్రుం డిట్లనియె.

236 క. ఏ నమితభోజనుండ న, హీనాగ్నిబలుండ నాకు నిష్టాన్నము స
మ్మానముగఁ బెట్టుఁడోపుదు,[1]రేని [2]సుతృప్తుండ నగుదు నే న ట్లయినన్.

237 వ. అనిన నీ[1]కెద్ది భోజనం బిష్టంబు దానిన పెట్టెద మడుగు మనిన వారికి
నవ్విప్రుం డిట్లనియె.

238 ఆ. అగ్ని నేను నాకు నాహార మయ్యెంద్రు, ఖాండవంబు [1]దీనిఁగాల్పఁగడఁగి
[2]యెగువఁబడితి ముంద రింద్రుపంచిన మహా, దారుణాంబుధరశతంబుచేత.

239 వ. తక్షకుండను పన్నగేంద్రుఁడింద్రున కిష్టసఖుండ[1]యి ఖాండవంబు[2]నం
దుండుటంజేసి దీని నమృతంబు రక్షించు[3]న ట్లతిప్రయత్నంబున నింద్రుండు
రక్షించుకొనియుండు నది నిమిత్తంబుగా సర్వ[4]సత్త్వంబులు నిందు సుఖం

234 1. ప్రియముతో — ల.

236 1. రేనిని దృప్తుండ — చ.ద.శ.ష ; రేనియుఁ దృప్తుండ — ఏ జొ. 2. సతృ
ప్తుండ — వా.

237 1 కెట్టిభోజనంబు - కొన్ని ప్రతులు.

238 1. దాని — కొన్ని ప్రతులు 2. యెగువఁ బడితి — పెక్కు ప్రతులు ; యెగవఁ
బడితి — వా ; యెగువఁ బడితి ముందరేనింద్రుపంచిన దారుణాంబు — ర.

239 1. యిక్ఖాండవంబున — ర ; యిఖ్ఖాండవంబున—ల. 2. న నాశ్రయించియుండు—
కొన్ని ప్రతులు. 3. చునదినిమిత్తంబుగా—కొన్ని ప్రతులు. 4 జంతువులు—ఖ.

బుండు మీరు మహాసత్త్వుల రఖిలాస్త్ర[5]విదుల రమరేంద్రుండు గావించు విఘాతంబులు మీయస్త్రబలంబున వారింప నోపుదు రేనును దీని [6]ననాకులంబున నుపయోగించి కృతార్థుండ నగుదు.

240 క. అని యగ్నిదేవుఁ డయ్యర్జున దామోదరుల శౌర్యశోభితులఁ బ్రియం బునఁ బ్రార్థించెను బలసూదనరక్షితఖాండవప్రదాహోత్సుకుఁడై.

241 వ. అనిన విని జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె.

242 ఆ. ఏమికారణమున నింద్రుఖాండవ మగ్ని, దేవుఁ డట్లు గాల్పఁ దివిరె దీని విప్రముఖ్య నాకు వినఁగ వేడుక యయ్యె, నెఱుఁగఁ జెప్పుమయ్య[1]యిదియు ననిన.

—: శ్వేతకియను రాజర్షి వృత్తాంతము :-

సం. 1-215-11 (అను 1-18)

243 వ. [1]జనమేజయునకు వైశంపాయనుం [2]డిట్లనిచెప్పెఁ దొల్లి శ్వేతకి యను రాజర్షి ఘృతసంపూర్ణదక్షిణానేకాధ్వరుండయి శతవార్షికసత్త్రి యాగంబు సేయ సమకట్టి ఋత్విజులం బ్రార్థించిన ఋత్విజు[3]లు నేము నిరంతరక్లేశంబున [4]కోపము నీవనవరతయజనశీలుండవు [5]నీకు నీశ్వరుండ యాజకత్వంబు సేయ నోపుంగాని యొరు లోపరని [6]విసివి పలికిన నాతండును గైలాసంబున కరిగి కైలాసవాసు నిఖిలలోకవంద్యు నిందుశేఖరు నీశ్వరునుద్దేశించి యుగ్రతపంబు సేసినఁ బరమేశ్వరుండు [7]ప్రత్యక్షంబయి వాని కిట్లనియె.

5. వేదులరు — కొన్ని ప్రతులు. 6. నిరాకులత్వంబున — ఖ.ర.

242 1 యిదియుననిన — పెక్కు ప్రతులు ; యిద్ధచరిత — భాసం.వా.శ.

243 1. అనిన జనమేజయునకు - కొన్ని ప్రతులు. 2. డిట్లనియె — కొన్ని ప్రతులు. 3. లునునేము — అ.ఋ.ఎ. 4. కోర్వము — ఈ.ర. 5. నీయాజకత్వంబు నీశ్వరునకు సేయనోపుంగాని మేమోపమనిన — ఓ. 6. విసివి — కొన్నింట లేదు. 7. ప్రసన్నుండై — ఐ ; ప్రత్యక్షుండయి — చ.వి.శ.ష.

244 క. శ్వేతకి నీతపము[1]నకేఁ, బ్రీతాత్ముఁడ నయితి నీకుఁ బ్రియ మెయ్యది వి
ఖ్యాతముగ నిత్తు దానిన, యాతత[2]మతి వేఁడు మనిన నన్నరపతియున్.

245 వ. దేవా నీప్రసాదంబున శతవార్షికసత్త్రియాగంబు చేసెద నాకు [1]నీవు ఋత్విజుండవు గావలయునని ప్రార్థించినం గరుణించి యాజకత్వంబు బ్రాహ్మణులకు [2]విధిదృష్టం బగుటం జేసి దాని నొరులకుఁ జేయం గాదు గావున నింక నీవు బ్రహ్మచర్యంబునఁ బంద్రెండేండ్లు నిరంతర[3]ఘృతధారం జేసి హుతాశనుఁ దృప్తుం జేయు మనిన వాఁడును బరమేశ్వరు పంచిన [4]విధంబున నగ్నితర్పణంబు సేసిన సంతుష్టుండై యీశ్వరుండు వాని పాలికి వచ్చి యప్పుడ [5]దుర్వాసు రావించి.

246 క. ఈతఁ డనవరతయజన, ప్రీతుం డీతనికి దురితభీతునకు మనః
ప్రీతిగ నార్త్విజ్యమ్ము మ,హాతేజోధికుఁడ చేయుమని [1]దయఁ బంచెన్.

247 వ. శ్వేతకియుఁ దనకు దుర్వాసుండు ఋషిగణంబు[1]లతో ఋత్విజుండుగా నభిమతంబయిన సత్త్రియాగంబు సేసె [2]నట్లా శ్వేతకి చేసిన. [3]నిరంతర [4]ఘృతధారాకారణంబున [5]నగ్నిదేవుండు దన కగ్నిమాంద్యంబును దేజో హీనతయు దప్పియు నైనఁ బితామహు పాలికిం జని తన శరీరస్థితి చెప్పినఁ బితామహుండును దాని నపరిమితఘృతోపయోగంబున నయిన మహా వ్యాధిఁగా [6]నెఱింగి యగ్నిదేవున కిట్లనియె.

244 1 నకుం బ్రీతాత్ముఁడ — ల. 2. ముగ — కొన్ని ప్రతులు.

245 1. నీవు—పెక్కు ప్రతులలో లేదు. 2. విధికృతంబు, విధియుక్తంబు — అని పాఠములు. 3. ఘృతధార—ఖ $గ_1$ చ.ద.భాసం.వీ.శ.ప ; ఘృతవసుధార — వా.శ. కొన్ని ప్రతులు. మూలము సతతం త్వాజ్యధారాభిః యది తర్పయసేఽనలమ్—పి పి యస్. ప్రతి. పుట 1416. 4. మార్గంబున — బొ. 5. దూర్వాసు — పెక్కు తాళపత్రప్రతులు ; దుర్వాసు — $గ_1$.చ.భాసం.వా.వీ.శ.ప.

246 1. నియమించెఁ — ఋ.గ.

247 1. ల — పెక్కింట లేదు. 2. నట్టిశ్వేతకి - కొన్ని ప్రతులు. 3. నిరంతర — కొన్నింట లేదు. 4. ఘృతవసుధారా - వా. కొన్ని ప్రతులు ; ఘృతధారా — చ.ద.వీ.శ.ష. 5. నగ్నికి నగ్నిమాంద్యంబు — ఉ.ఐ.ఓ. 6. నెరింగి యిట్లనియె — పెక్కు ప్రతులు.

248 క. ఈవ్యాధి[1]యొంటఁ దీఱదు, దివ్యౌషధయుక్తమైన [2]దివిజవనంబున్
హవ్యాశన భక్షింపు మ,హావ్యాధిశమంబు దాన నగు నీ కనినన్.

249 క. చని ఖాండవంబుఁ [1]గాల్పఁగ, మొనసి మహాహస్తియూథములఁ బోని ఘనా
ఘనములచే బాధితుఁడయి, వనజజుకడ [2]కరిగి హవ్యవాహనుఁ డనియెన్.

250 వ. ఏను [1]మీయానతిచ్చిన విధంబున ఖాండవం బుపయోగింపం బోయి తద్రక్షకులు గావించు విఘాతంబులు వారింపనేరక [2]యేడుమాఱులు విఫలప్రయత్నుండనైతి [3]నింక నెద్ది యుపాయంబు నాకు నెవ్విధంబున ఖాండవభక్షణం[4]బు [5]దొరకొను నని దుఃఖించిన యతనిం జూచి కమలభవుండు కరుణించి [6]భావికార్యం బప్పుడు దలంచి[7]యుఁ గొంతకాలంబునకు నరనారాయణులను నాదిమునులు నరలోకంబున దేవహితార్థం బర్జునవాసుదేవులయి జన్మించి యాఖాండవసమీపంబున విహరింతురు వారు భవత్ప్రార్థితులై తమ యస్త్రబలంబున నఖిలవిఘ్నంబుల నపనయించి నిరాకులంబున నీకు ఖాండవోపయోగంబు [8]ప్రసాదింతు రనిన నగ్నిదేవుండు గరంబు [9]సంతసిల్లి కమలజువచనం బవలంబంబుగాఁ బెద్దకాలంబుండి తద్వచనమార్గంబున నప్పుడు కృష్ణార్జునులం గని ఖాండవదహనార్థంబు ప్రార్థించిన నగ్నిదేవున కర్జునుం డిట్లనియె.

248 1. యిట్లుదీఱదు — వ. 2. దేవవనంబున్ — ఉ.

249 1. గాల్వఁగ — అ.ఆ.ఋ.ఖ. 2. కేగి — పెక్కు ప్రతులు.

250 1. మీరానతిచ్చిన — గ.గి$_1$.చ.జ.ద.శ.ష. 2. యేడుమాఱులు — గి$_1$.చ.ద.శ.ష. 3. నింకెద్ది — కొన్ని ప్రతులు; నింకేది — కొన్ని ప్రతులు. 4. బెన్నండు దొరకొను — కొన్ని ప్రతులు. 5. దొరకునని — ఖ.గి$_1$ చ.ట.బ.ల.శ.ష. 6. భావికాలకార్యంబు — చ.ద.పీ.శ.ష. 7. యు — కొన్ని ప్రతులలో లేదు. 8. నిత్తురని — ఋ.ప. 9. సంతోసిల్లి — అ.ఎ.ట.

—: అగ్నిదేవుండు కృష్ణార్జునులకుఁ జక్రకార్ముకాదు లొసంగుట :—

సం. 1-215-12

251 సీ. వారణహస్తానుకారంబు లగువారిధారలు గురియు దుర్వారఘోర
తరవారివాహప్రకరములు వారింప సుర[1]నివహంబుతో సురగణేశు
నైన నోర్వను[2]శక్తమైన మహాదివ్యశరసంచయము నాకపరిమితంబు
[3]గల దట్టిసాయకావలికి నాదగుభుజబలశీఘ్రసంధానములకుఁ దగిన

ఆ. ధనువు సర్వవహనఘనరథాశ్వములుఁగృష్ణునకు నాయుధములు ననఘ యిపుడు
లేమిఁ జేసి చూవె [4]యీమహాకార్యంబు, [5]గడఁగకున్న వార మెడయుఁ జేసి.

252 వ. అనిన నగ్నిదేవుండును నప్పుడ వరుణుం దలంచి వానిం దనకు సన్నిహితుం జేసికొని తొల్లి [1]నీకు సోముండిచ్చిన బ్రహ్మనిర్మితకార్ముకంబు [2]నక్షయ తూణీర[3]యుగళంబును గంధర్వ[4]జహాయంబులం బూన్చిన రథంబు నియ్యతి రథుండయిన యర్జునున కిమ్ము మఱి చక్రంబును గదయును వాసుదేవున కిమ్మని పంచిన.

253 మ. అమరాహీంద్రవియచ్చరాదుల [1]కజేయం [2]బప్రధృష్యం బభే
ద్యము వజ్రస్థిరమన్యసాధనఖిదాదక్షంబునై సర్వలో
కమనోజ్ఞం బయి దివ్యమై వెలుఁగు నగ్గాండీవ [3]మన్ చాపర
త్నము నిచ్చెన్ వరుణుండు పార్థునకు నుద్యద్విక్రమోదాప్యసికిన్.

251 1. గణంబులతోడ – ఆ ఋ.గి$_1$.చ.ద.శ.ష ; నికరంబుతో – అ.ఎ.ఔ.క.జ.డ. 2. శక్యమైన – ఆ.ఋ.ఐ.ఖ.న ల. 3 గలవట్టి – ఆ ఒ.క.ఖ.ట డ. 4. నీ – అ ఒ.ఓ.గ.జ.య 5 దొడఁగకున్న – భాసం.వీ.శ.ష. కొన్ని ప్రతులు ; దొడర – ఋ.స.

252 1 నీకు – పెక్కు ప్రతులలో లేదు. 2. నక్షయతూణీర – అ,ఆ.ఈ.ఋ.ఐ.క, గి.చ.శ.ష , నక్షయబాణతూణీర – వా.వీ. కొన్ని ప్రతులు. నక్షయతూణీరంబులును—అని పాఠము. 3. యుగళం— పెక్కు ప్రతులలో లేదు ; 4. జ – పెక్కు ప్రతులలో లేదు

253 1 కజయ్యంబును – భాసం. 2. బప్రతర్క్యంబభే – వీ. 3. ముంజాపరత్నము— ఒ ఓ.క గ.ట.బ.య.ర ; మన్జాపరత్నము – ఖ.గి$_1$.

254 వ. మఱియు బ్రతిపక్ష సంక్షయకరంబులయిన [1]యక్షయబాణంబులుగల తూణీరంబులును వివిధాయుధభరితంబై సింహలాంగూల[2]కపిధ్వజ వి రా[3]జమానంబై మహాంబుధరధ్వానబంధురంబై మనోవాయువేగసిత వాహ వాహ్యమానంబై రణిత[4]రమణీయ మణికింకిణీకలాపాలంకృతంబై సకల దిగ్విజయాధిష్ఠానంబై యొప్పుచున్న దివ్యరథంబు నర్జునునకిచ్చి సహస్ర కర [5]సహస్రదుస్సహ [6]మహఃపటలభాసురంబగుచు దేవదైత్యదానవ యక్షరాక్షస పిశాచోరగ ప్రశమనంబయి వెలుంగుచున్న సుదర్శనం బను చక్రంబును గౌమోదకి యను గదయును నారాయణున [7]కిచ్చె నట్లు సంప్రాప్తదివ్యచాపరథాయుధులయి యున్న నరనారాయణులం జూచి యగ్ని దేవుం డిట్లనియె.

255 క. ఘనభుజ యిది గాండీవం, బనఁ బరగిన ధనువు దీని నస్త్రావలి పె
ల్చన తాఁకి భగ్నమగు స, త్యానుపమవజ్రాభి[1]హతశిలావలివోలెన్.

256 క. ఈరథ మప్రతిహతము స, మీరజవోపేతహయసమేతము దీనిన్
భూరిబలుఁ డెక్కి సోముఁడు, ధీరుండయి తొల్లి యెల్ల దిక్కు[1]ల నోడిచెన్.

257 క. ఈ చక్రము మధుసూదన, నీచేత విముక్తమగుచు నీరిపులఁ [1]గ్రియా
మాచరులఁ జంపి క్రమ్మఱ, నీచేతికి వచ్చు దేవనిర్మితశక్తిన్[2].

254 1. యక్షయ్యశరధులును — వా. కొన్ని ప్రతులు; యక్షయ బాణాదులు - ఒ. యక్షయ బాణంబులు గల తూణీరంబులను — చ.ద.వీ.శ.ప. 2. కపిధ్వజ — గి ద.భాసం.వీ.శ.ప, లాలిత గోలాంగూల - వా. కొన్ని ప్రతులు. 3. జితంబై — కొన్ని ప్రతులు. 4 రమణీయ — పెక్కు ప్రతులలో లేదు. 5. సహస్ర — ఎ బ. ప్రతులలో లేదు; సహస్రకిరణ దుస్సహ — ద.ప. 6. ప్రభాపటల — పెక్కు ప్రతులు. 7. కిచ్చిననట్లు — కొన్ని ప్రతులు.

255 1. హతినగావళిపోలెన్ — కొన్ని ప్రతులు.

256 1. లునోర్చెన్ — పెక్కు ప్రతులు; ల నొంచెన్ — మ; ల గెల్చెన్ - ల.స; లు గెలిచెన్ — ఉ.ఐ.

257 1. క్రియాగోచరుల — ఎ.ప ఓ.ఔ.గ.జ డ. 2 దీని తరువాత ఈ గదయు సర్వ మాయాభేదనకారణంబై దైత్యదానవప్రాణాపహారణంబై యుండునని — అన వచనము. భాసం.ల.వీ ప్రతులందు కలదు.

-: కృష్ణార్జును లగ్నిహోత్రునిచే ఖాండవంబు దహింపఁజేయుట :-

సం. 1-216-28

258 వ. అని తత్ప్రభావప్రకారం[1]బు చెప్పినఁ గృష్ణార్జునులు సంతసిల్లి సన్నద్ధులయి రథంబెక్కి యగ్నిదేవుం జూచి సురాసురపరివృతుండయి సురపతి వచ్చినను జయింతు మింక శంకింపక ఖాండవదహనార్థం బుపక్రమింపు మనిన నగ్నిదేవుండు హర్షించి [2]తైజసంబయిన రూపంబు ధరియించి.

259 చ. పెడిలి సువర్ణపర్వతము పెక్కు[1]దెఱంగుల వ్రయ్యునట్టు ల
ప్పుడు వివిధప్రకారముల భూరిశిఖా[2]వళి ఖాండవంబున
గ్గడఁ గడుఁ బర్వఁగాఁ [3]బెఱిగి [4]కాల్పఁదొడంగె హుతాశనుండు [5]సే
డ్పడఁగ వనంబులోని మృగపక్షిభుజంగమభూతసంఘముల్.

260 వ. [1]అంత.

261 సీ. చక్రధరుం[1]డయ్యు జలరుహనాభుండు గాండీవధరుఁ[2]డయ్యుఁ బాండవుండు
నుండి రవ్వనమున [3]కుభయపార్శ్వంబులఁ దొల్లింటి[4]యట్టులు వెల్లురేఁగి
యనలంబు నార్పంగ నార్చుచుఁ బఱతెంచి వనరక్షకులు పార్థునిశితాస్త్ర
ధారల నపగతదర్పులై యరిగిరి యమ[5]సదనంబున కమితబలులు

ఆ. శిఖియు నుగ్రదీర్ఘజిహ్వలు సాఁచియు,ద్ధురసమీరణంబు తోడుసేసి
కొని [6]యుగాంతకాలకుపితానలాకారుఁ,డయ్యె ఖాండవమున[7]కద్భుత
ముగ.

258 1. బులు — కొన్ని ప్రతులు. 2. తేజోమయంబయిన — కొన్ని ప్రతులు.

259 1. విధంబుల — ఆ.జ న.ల. 2. తతి — కొన్ని ప్రతులు. 3. బెరసి — గ$_1$.చ.ద.శ ; గణఁగి — న. 4. కాల్వదొడంగె — ఆ.ఋ.ఖ. 5. చేడ్వడఁగ — ఐ ఖ.గ$_1$.డ.శ.ష.

260 1. అంత — పెక్కింట లేదు.

261 1. డయి — గ$_1$.చ.భాసం.పి ; శ.ష. 2. డయి పాండవుండు — గ$_1$.భాసం. పి శ.ష. 3. నుభయపార్శ్వ — న.పి.శ.ష. కొన్ని ప్రతులు. 4. యట్లను బెల్లురేఁగి — ఆ.ఓ.క.చ.శ.ష. 5. సాదనంబున — ఖ. 6. యుగాంత్యకాల — పెక్కు ప్రతులు. 7. నద్భుతముగ — చ.ద.భాసం.పి.శ.ష.

262 మ. ఘనధూమధ్వజదహ్యమాన [1]లవలీ కర్పూర తక్కోలచం
దన కాలాగరు సల్లకీ తరు[2]ల యుద్యద్ధూమ[3]ధూపానువా
స[4]న నొప్పెన్ సురభీకృతంబు లగుచున్ సంక్రీడమానామృతా
శనవిద్యాధరసద్విమానవితతుల్ సావిత్రవర్త్మంబునన్.

263 చ. జ్వలనశిఖాలియుఁ విజయు [1]సద్విశిఖాలియుఁ జుట్టుముట్టినం
దలరి భయాకులంబులగు తద్వనజీవుల యార్తనాద[2]మం
దులియుచు నొక్కపెట్ట దివి నుద్గతమయ్యెనమందమందరా
చలపరివర్తన[3]ప్రసభసంక్షుభితార్ణవ [4]ఘోషఘోరమై.

264 క. [1]నెగయుడు నెగసి పిఱుందం, దగిలెడు [2]మిడుఁగుఱులచేత దగ్ధచ్ఛదమై
గగనమునఁ బఱవ[3]నోపక, ఖగనివహము వహ్నియంద [4]కడువడిఁ బడియెన్,

265 క. తన తేజోజాలము పర్విన దగ్ధములగు ననేకవిధ[1]దేహుల దే
హానికాయంబుల బహువిధ, తనువులు గలవాఁడపోలె దహనుం డొప్పెన్.

266 చ. అమితకృశానుదగ్ధ మగు నయ్యమరేం[1]ద్రువనంబులోని యు
త్తమసలిలాశయావళుల తప్తజలంబులయం దపేతజీ
వములయి తేలుచుండె [2]వరవారిచరంబులు వారిపక్షులుం
[3]గమరె నశేషకోకనద కైరవపంక్తులు శైవలంబులున్.

262 1. కదలీ — ఈ. 2 సముద్యద్ధూమ — ఋ.ల 3. ధూపాది — ఋ. 4. నబొల్చెన్ — ఋ

263 1. శస్త్ర — ఖ.వ. 2. మెందులియుచు — చ.ద వీ.శ.ష ; మట్లులియుచు — ఖ; మందొలయుచు — ల. 3. ప్రభవ — అ.గ.జ.ల ; ప్రళయ — న. 4. ఘోరఘోషమై — కొన్ని ప్రతులు

264 1. ఎగయుడు — కొన్ని ప్రతులు. 2. మిణుగురు — కొన్ని ప్రతులు. 3. నేరక — పెక్కు ప్రతులు 4. క్రమ్మర — ఆ.

265 1 జీవుల — ఉ.ఖ.

266 1. ద్రునికానలోని — వ. 2 వనచారి చయంబులు — ల ; ఘనవారి చరంబులు — ఋ.ఖ.న ; వనరాశిచరంబులు — గ. 3. గమిరె, గమితె — అని పాఠములు.

267 క. అలుగు[1]లపడి ఖాండవమునఁ, గలయాశీవిషమహోరగము లెల్ల విషా
గ్నులు గ్రక్కుచు నత్యుగ్రా, [2]నల బహులజ్వాలలందు నాశము వొందెన్.

268 వ. అంత దేవతలెల్ల [1]మహావహ్నిశిఖాహతికిఁ [2]వెఱచి దేవేంద్రుపాలికిం బోయి ఖాండవంబునకైన యకాండప్రళయంబు సెప్పిన విని [3]యదరిపడి యింద్రుండు తటకరత[4]ణాపేత నకేకధారాధరనివహంబుతో [5]నతి త్వరితగతి ఖాండవంబునకు వచ్చి హుతాశనుమీఁద మహావారిధారలు గురియించిన.

269 క. ఆవారిధారలెల్ల మహావహ్ని శిఖాహతంబులయి శుష్కములై
లావఱి నడు[1]మన యడఁగుటఁ, బావకుపయి నొక్కచినుకుఁ బడదయ్యె
వడిన్.

270 క. ఉఱుముచు [1]మెఱుముచుఁ బిడుగులు, వఱలఁగ నలుగడలఁ బడ నవారిత
వృష్టుల్
గుఱుకొని కురియఁగఁ బంచెను. మఱియును నయ్యనలు మీఁద మఘవుం
[2]డలుకన్.

267 1. లు — ఖ.ర. 2. నలతీవ్రతరార్చు లందనాశము వొందెన్ — న.స.

268 1. మహావహ్నిశిఖాహతికి — పెక్కు ప్రతులలో లేదు. 2. వనరి —. స. 3. యదరిపడి — ఐ ఒ ఓ ఖ.ట.డ వీ. 4. ణార్థంబుగా — చ ద శ.ష. 5. నతిత్వరితగతి — చ.ద.శ ష. ప్రతులలో లేదు

269 1. మనెయుడుగుచు — $గ_1$ ట.ద శ.ష ; మన యుడుగుడు — ఖ

270 1 మెఱయుచు, మెఱియుచు — ఆ.క.సం.$గ_1$.చ.ద్వి.శ.శక.ష. 2. డలుకన్ — ఇచ్చట 'స' ప్రతియందు అధిక పాఠము గలదు అంత నగ్నిదేవుండు వెఱచి యర్జునున కిట్లనియె.

కం. వానకు నోడుదు సకలో
ర్వీశాధా వజ్రికైన వెఱవఁగిరీటీ
వానసుమీ వానసుమీ
వానను నీవోర్వు నేను వానవు గెలుతున్"

'ఆ' ప్రతియందు కొంత భేదముతో నిట్లున్నది.
"వాన సుమీ నన్నొడుచును
వానకునై వెఱతుఁగాని వానవు గెలుతున్
అనిన నగ్నిదేవు నోడకుమని"

271 క. పాండుసుతుఁ[1]డంత నానా, కాండసహస్రముల[2]నేసి ఘనముగఁ జేసెన్
ఖాండవ[3]గృహమున ఖండా, ఖండలధారలకుఁ దూఱఁ [4]గాకుండంగన్.

272 వ. [1]ఇట్లు కావించిన.

273 తే. దాని వెల్వడనేరక [1]తద్వనంబు, జీవులెల్లను పావకశిఖలఁ జేసి
దగ్ధులగుచున్నఁ దక్షకతనయుఁ డశ్వసేనుఁడను [2]భుజంగము మగ్నిశిఖల
కపుడు.

274 ఆ. వెఱచి తల్లిఁదోఁకఁ గఱపించుకొని దివిఁ, బఱచు[1]వానిఁజూచి పార్థుఁ[2]డలిగి
వానితల్లి శిరముతోన తత్పుచ్ఛంబు, దునిసి యగ్నిశిఖలఁ దొరఁగనేసె.

275 వ. [1]వెండియు నశ్వసేనునేయ సమకట్టిన యప్పార్థునకుఁ దత్క్షణంబ మోహిని యను మాయ గావించి యమరేంద్రుఁ డశ్వసేను విడిపించి యందుఁ దక్షకుండు దగ్ధుండయ్యె[2]ను కావగచి కడు నలిగి.

—: ఇంద్రుండు కృష్ణార్జునులతోఁ బోరుట :—

సం. 1—218—13

276 ఉ. ఆ నరుమీఁద ఘోరనిశితాశని వైచె నఖండచండఝుం
ఝూనిల[1]జర్జరీకృతమహాజలధారలతో నిరంతరా
నూనపయోధరప్రకర[2]ముద్ధతమై హరిదంతరంబులన్
భానుపథంబు నొక్కమొగిఁ బర్వి భయంకరలీలఁ[3]గప్పఁగన్.

271 దునునానా — న. 2. జేసి — పెక్కుప్రతులు. 3. మునకు గృహంబా ఖండల ధారలకు — ఉ.ఖ.చ.ద.భాసం.వి.శ.ప.స. 4. గాకుండవడిఁ - కొన్ని ప్రతులు.

272 1. ఈ వచనము పెక్కింట లేదు.

273 1. తద్వనమున— పెక్కు ప్రతులు. 2. వాడు పావకశిఖలకపుడు — గి$_1$ చ.ద. శ ప ; పన్నగుండగ్ని శిఖలకపుడు — భాసం వి.

274 1. చున్న - ఐ.ల.స. 2 డెరిగి — ఋ.ఐ.ఓ.

275 1. మరియు—ప.న. 2. డు కావగచి — ద.

276 1. జర్ఘరీకృత - గి$_1$. కొన్ని ప్రతులు. 2. ముద్గత - ఒ.ఓ.పౌ.గి$_1$.ట.డ.య.ల. 3. పర్వగన్ — డ ; నొప్పగన్ — కొన్ని ప్రతులు

277 ఉ. అన్నవవారివాహ[1]నివహమ్ములఁజూచి భయప్రపన్నుఁడై
యున్నహుతాశనున్ విజయుఁడోడకు మంచు[2]ను మారుతాస్త్ర మ
త్యున్నత [3]చిత్తుఁడేసె నదియుఁ విరియించె రయంబుతో సము
త్పన్నసమీరణాహతి నపారపయో[4]దకదంబకంబులన్.

278 వ. [1]అంత.

279 సీ. బల[1]వైరి కృష్ణుపైఁ బార్థుపైఁ గడునల్గి పంచినఁ [2]గలయంగఁ బన్ని[3]కడఁగి
సురగరుడోరగాసుర[4]సిద్ధ గంధర్వు లార్చుచుఁదాఁకి యుగ్రాహవంబు
సేసిన నమరులఁ జెచ్చెరఁబార్థుండు [5]భంజించె దనదివ్యబాణశక్తిఁ
జక్రధరుండును జక్రబలంబున గరుడోరగాసుర ఖచర[6]వరులఁ

ఆ. దత్క్షణంబ విగతదర్పులఁజేసె న, య్యిద్ధఱకు సురాసురేశు[7]లెల్ల
భీతులగుట [8]చూచి [9]పెద్దయు విస్మిత, హృదయుఁడయ్యె సురగణేశ్వరుండు.

280 వ. మఱియును వారల బలపరాక్రమంబు లెఱుంగవేఁడి శక్రుండు శిలా
వర్షంబుఁ [1]గురియించిన.

281 క. నిశితశరవర్షమున ను, గ్రశిలావర్షమ్ముఁ జిత్రగతి నస్త్రకలా
కుశలుఁడు నరుఁడశ్రమమునఁ,బ్రశాంతిఁ బొందించె నమర[1]పతి వెఱఁగందన్.

277 1. నిచయమ్ముల — ఐ.గి$_1$.చ.ద.వ.వీ.శ.ష. 2. సమీరణాస్త్ర — ల. 3. శక్తి
నేసియవి — ఐ. 4. ధరమండలంబులన్ — జా.

278 1. ఈ వచనము కొన్నింట లేదు.

279 1. భేది — డ.ల. 2. గడువేగఁబన్ని — వ. 3. రేఁగి — గి$_1$.చ.ద.భాసం వీ.శ.ష.
4. యక్ష—చ.ద.భాసం.వీ.శ.ష. 5. భంగించె — య 6. తతుల — జొ.డ.
7. లిట్లు — పెక్కు ప్రతులు; లట్లు — అ.ఎ.జొ.క. 8. జేసి — ఐ చ ద.ల.శ ష.స.
9. భీతుఁడై . పెల్కురి — అని పాఠములు; పెద్దయు — ఐ ల.స; ప్రీతుఁడై—వా
కొన్ని ప్రతులు

280 1. గురిసిన — జా.

281 1. పతివెఱగందఁ — ఋ; పాలకుమ్రోలన్ — వా. పెక్కు ప్రతులు.

282 క. కొడుకు [1]భుజవిక్రమమునకుఁ, గడుసంతసపడియుఁ దృప్తి[2]గానక చలమే
ర్పడఁగ హుతాశను[3]నార్పం, గడఁగి మహా రౌద్రభంగిఁ గౌశికుఁడు వడిన్.

283 చ. అరుదుగ దివ్యరత్ననివహంబులఁ[1]జేసి వెలుంగుచున్న మం
దరశిఖరంబునెత్తికొని [2]తద్దహనార్చు లడంగునట్లుగాఁ
దెరలఁగ వైచినం దపనతేజుఁడు పాండుసుతుండు దాని జ
ర్జరితము సేసె వజ్రమయశాతశిలీముఖ [3]చండధారలన్.

284 క. ధరణీధరు చక్రమునకుఁ, బురుహూతతనూజు బాణములకనిలో నె
వ్వరు మార్కొన [1]నోపరు సుర,గరుడోరగసిద్ధసాధ్యగణములలోనన్.

285 వ. అంత నొక్క యశరీరవాణి పాకశాసనున కిట్లనియె.

286 క. [1]పరమమునులయిన తొల్లిటి, నరనారాయణులు కృష్ణనామంబుల ను
ర్వర [2]నుదయించిరి [3]నీక, య్యిరువుర పేర్మియును వింతయే[4]దివిజేంద్రా.

287 చ. అలఘులు కృష్ణపార్థులు మహాత్ములు యాదవకౌరవాన్వయం
బులు [1]వెలుఁగించుచున్న [2]నృపపూజ్యులు వీరల నీకు నోర్వఁగా
నలవియె వీరుదొల్లి[3]యు సురాసురయుద్ధమునాఁడు దైత్యులన్
వెలయఁగ నోర్చి [4]యున్నరణ[5]వీరులు గావుట [6]మున్నెఱుంగవే.

282 1 జయవిక్రమమునకు — శ ష. 2. గాకచలంబేర్పడ — కొన్ని ప్రతులు. 3. నార్వఁగఁగడఁగి — ల.

283 1. తోడ — గ$_1$.చ శ.ష. 2. తద్బహుశార్చుల — క; తద్దయు నర్చులడంగు నట్లుగా — ర. 3. చారుధారలన్ — పెక్కు ప్రతులు; వారి ధారలన్ — ఋ.గ$_1$.చ.ద్వి.శ ష; భూరి — అ; శస్త్ర — ఖ.ర.

284 1. నోపర — ఒ.ఖ.ర.సం.

286 1 పరమఋషులయిన — వా; పరమమునులయిన — పెక్కు ప్రతులు; వరపురుషులైన — ఔ. 2. జనియించిరి — ఐ చ.ద.శ.ష. 3. నీకియ్యిరు వుర — ఏ ఖ ర.ల; వీరియ్యిరువుర — ఆ.య; వీరయ్యిరువుర — చ.ద.శ.ష. 4. యమరేంద్రా — ఋ.

287 1. వెలుఁగింపుచున్న ఘనపుణ్యులు — వ. 2. కృతపుణ్యులు — ల.స. 3. యమ రాసుర — గ$_1$.చ.ద.శ.ష; యసురాసుర — అ.ఆ.ఋ.ఏ.క.ఖ.ట.వీ; యసురా సుర — వా. కొన్ని ప్రతులు. 4. నట్టి — ఆ. 5. వీరల — అ,ఏ.ఖ. 6 నీవెరుంగవే — పెక్కు ప్రతులు.

288 వ. [1]నీయిష్టసఖుండయిన తక్షకుం [2]డిందుండక మున్దరన కురుక్షేత్రంబు[3]న కరిగి ఖాండవప్రళయంబునకుఁ [4]దప్పె ఖాండవం బగ్నిచేత దగ్ధంబగునని [5]తొల్లి బ్రహ్మవచనంబు [6]గలుగుటంజేసి యిది పాలుతాళనున కళసం బయ్యె [7]నింక దీనికి [8]వగవం బనిలేదనిన దాని[9]విని సురపతి సురగణంబుల[10]తో [11]మరలిన.

289 క. బలయుతులు మనుజ [1]సింహులు, నలిఁగృష్ణార్జునులు సింహనాదముల వియ త్తలమును దిక్కులు బధిరం, బులు[2]గాఁజేసిరి త్రిలోకములు [3]భయమందన్.

290 వ. అట్టి [1]యవసరంబున నముచి యనుదనుజు [2]ననుజుండు మయుం డను వాఁడు ఖాండవంబు [3]వెలువడ నేరక తక్షకుగృహంబునఁ బరిభ్రమించు [4]చున్నంతఁ దన్నగ్ని [5]చుట్టు ముట్టిన నచ్యుతుండును జంపవచ్చిన నతి భీతుండయి యర్జును మఱువు సొచ్చిన.

291 క. శరణాగతరక్షణత, త్పరుఁడు ధనంజయుఁడు మయుని ప్రాణము గాచెం గరుణను శరణాగతులగు, పురుషుల రక్షించు[1]నంత పుణ్యము గలదే.

288 1. నీకు నిష్ట — పెక్కు ప్రతులు; నీకిష్టసఖుఁడు — కొన్ని ప్రతులు. 2. డింతకు మున్న — అ.ఋ ఎ.ఒ.ట డ; డింతకుఁగురుక్షేత్ర — క.గ$_1$ చ.ద.శ.ష. 3 నకరిగె— ఉ.ఒ క య; నకరుగు — చ.ద.వి.శ ష. 4. దొలంగె — ట 5. తొల్లి — కొన్ని ప్రతులలో లేదు 6. కలదుగావున — ఖ.ర. 7. నింక — పెక్కింట లేదు. 8. వగవనేలయనిన — పెక్కు ప్రతులు 9. వినియిది యిట్టిదయని సురపతి — ఖ.ర 10 తోనమరావతికి, తోదివికి — అని పాఠములు. 11. నరిగిన — పెక్కు ప్రతులు.

289 1. సింహంబులుకృష్ణులు సింహనాదములు సేసి వియత్తల — పెక్కు ప్రతులు. 2. గావించిరి — ట.మ. 3. భీతిల్లన్ — ఐ

290 1. సమయంబున — జ. 2. సూనుండు — అ; తనూజుండు — ఋ. ఇచ్చట మూలమిట్లున్నది తంపార్థేనాథయేద త్తేనముచేర్భ్రాతరంమయమ్. చిత్రశాలా ప్రతి. పుట 359. 3. వెడలనేరక — ఔ. 4. చున్ననగ్నియు నచ్యుతుం డును జంపవచ్చిన — పెక్కు ప్రతులు. 5. చుట్టుముట్టిన — పెక్కు ప్రతులలో లేదు.

291 1. నంతపుణ్యము గలదే — కొన్ని ప్రతులు; కంటెఁబుణ్యము — వా; నట్టిపుణ్యము — గ.

292 తే. మయుఁడు నశ్వసేనుండును మందపాల, సుతులు నలుగురు శార్ఙ్గకు [1]లతుల
దావ
[2]దావాహభీతి కయ్యార్వురుఁ దప్పి రన్య, జీవులెల్ల నం దపగత జీవు [3]లైరి.

-: మందపాలోపాఖ్యానము :-

సం. 1-220-1

293 వ. అనిన విని జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె.

294 క. మయభుజగ మోక్షణము ని, ర్ణయముగ నెఱిఁగితి నెఱుంగ [1]నాకర్థిత్వం
బయినది [2]నలుగురు [3]శార్ఙ్గకు, లయి మోక్షణ మెట్లు నిర్మలజ్ఞాననిధీ.

295 వ. అని యడిగిన జనమేజయునకు వైశంపాయనుం డిట్లనియె.

296 క. జనపాల మందపాలుం, డనుముని ముఖ్యుండు దొల్లి యత్యుగ్రతపం
బొనరించె బ్రహ్మచర్యం, బున దివ్యసహస్రవర్షములు నైష్ఠికుఁడై.

297 క. అమ్ముని యోగాభ్యాసవ, శమ్మున దేహంబు విడిచి చని [1]పుణ్యులలో
కమ్ములు [2]సొరఁగానక వడిఁ, ద్రిమ్మరి దేవతలఁ గాంచి ధృతి నిట్లనియెన్.

298 వ. నాకుఁ [1]బుణ్య లోకంబులు లేకుండ [2]నేనేమి దుష్కృతంబు సేసితి ననిన
నమ్మునీంద్రునకు [3]దేవత లిట్లనిరి.

292 1. లతులితోగ్ర । దావవహ్నికి నార్వురు దప్పిరన్య — న ల.న. 2. దహన శిఖల నయ్యార్వురు దప్పిరన్య — ఓ.జ ; దావాహభీతికి నార్వురు — ఈ.ఖ గ.గ[1].చ.ట. ద.శ ష. గమనిక:— 'అఱ్వురు' అని గ[1] శ.ష. ప్రతులలో శకటరేఫ సంయుక్తాక్షరముగా వ్రాయఁబడినది. ఇది ప్రాచీన సంప్రదాయముగాఁ దోఁచుచున్నది ; దావాహభీతి నయ్యార్వురు । దప్పిరి — ఈ.డ. 3. లయ్యె — ఋ.ఐ.చ.శ.ష.

294 1. కాశ్చర్యం — ఉ. 2. నలువుర — ఔ.గ.డ. 3. శార్ఙ్గికులయి — శ.ష. పెక్కు ప్రతులు.

297 1. దివ్యుల — ఖ.ర. 2. వడయంగానక త్రిమ్మరి — ఋ.

298 1. నుత్తమలోకంబులు — ల. 2. నే — కొన్ని ప్రతులలో లేదు 3. నమరు లిట్లనిరి — ఖ.ట.ర.

299 క. ఎంత తపం బొనరించియు, సంతానము లేనివారు సద్గతిఁ [1]బొందం
గాంతురె నీ తపమేటికి, సంతానము వడయు [2]మరిగి సన్మునినాథా.

300 వ. అనిన విని మందపాలుండు [1]మర్త్యలోకంబునకుఁ దిరిగి వచ్చి నాకుం జెచ్చెరం బెక్కండ్రు పుత్త్రుల నెవ్విధంబునం బడయ నగునో యని చింతించి పక్షులయందు వేగంబ యపత్యంబు [2]పెద్ద యగుటం జూచి తాను [3]శార్ఙ్గకుండై జరిత యను లావుక వెంటియందు [4]రమియించి దాని [5]వలన [6]జరితారి [7]సారిసృక్క స్తంబ మిత్ర ద్రోణు లను వారల నలువురఁ గొడుకులఁ బరమబ్రహ్మ విదులం బడసి వారల ఖాండవంబునం బెట్టి తన పూర్వ భార్యయైన లపితయుం దానును విహరించు[8]చు నొక్కనాఁడు ఖాండవ [9]దహనోద్యతుండై వచ్చుచున్న యగ్నిభట్టారకుం గని [10]యగ్ని సూక్తంబుల స్తుతియించి యిట్లనియె.

301 క. నీ వఖిల ధర్మమూర్తివి, నావీర్యప్రభవు లయిన నలువురుసుతులన్
[1]లావుకలఁ గరుణఁ గావుము, పావక భువనోపకార[2]పర్యాప్తమతీ.

299 1. వడయం — ఏ.ఖ.న.ర ; గాంచం — క. 2. మరలి — $గ_1$ చ.ద శ ష ; మగిడి — ఋ ; మీవు — కొన్ని ప్రతులు ; పొమ్ము — వ

300 1. మర్త్యంబునకు వచ్చి — అ ఆ.ఐ.ఒ ట.య. 2. వడయనగునగుటం జూచి — కొన్ని ప్రతులు. 3. శార్ఙ్గి కుండై — శ.ష. పెక్కు ప్రతులు ఇచ్చట మూల మిట్లున్నది. శార్ఙ్గికాం శార్ఙ్గకోభూత్వాజరితాం సముపేయివాన్ — చిత్రశాలా ప్రతి. పుట 360. 'శార్ఙ్గకోభూత్వా' అని పి.పి.యస్. ప్రతి పుట 1443. 4. రమించి— చ.ల. 5. యందు — కొన్ని ప్రతులు. 6. జితారి — అ.ఈ.ఎ.క.గ.ద.శ.ష. మూలము జరితారి అనియే కలదు. 7. సారిసృక్వ — చ.శ.ష $గ_1$. ప్రతులలో నీ పేరు కన్పించుట లేదు ; ఇచ్చడ మూలమునందు, సారిసృక్కః ప్రజాయేత పిత్రూ ణాం కులవర్ధనః. చిత్రశాలా ప్రతి. పుట. 361. 8. చున్నవాఁడు — కొన్ని ప్రతులు. 9. దహనోత్సుకుండై, దహనోద్దతుండై — అని పాఠములు ; దాహోద్యతుండై — చ.ట.ద.భాసం.పీ.శ.ష. 10. యగ్నిసూక్తంబుల నిట్ల నిస్తుతియించె — వా.శ. ఇచ్చట మూలమునందు అగ్నిస్తోత్రాత్మకమైన శ్లోకములు గలవు. నన్నయవానిని విడిచెను.

301 1. లావుకను — క.స ; లావుకుల — ద.ష.స. 2. పరమాప్తనిధీ — ఔ ; పర్యాప్త నిధీ — ఖ.జ.డ.న.ర.వ ; పరహితచరితా — గ.

302 వ. అనిన నమ్మందపాలు ప్రార్థనం జేసి యా నలువురు శార్ఙ్గకులను నగ్ని దేవుండు రక్షించువాఁడయ్యె నంత [1]నిట.

303 క. తనయుల నజాతపక్షుల, ననలశిఖా[1]భీతి [2]చంచలాత్ముల [3]నెటయుం
జన నేరని బాలకులను, జనని[4]యు వీక్షించి శోకసంతాపితయై.

304 క. వీరలఁ దోడ్కొని పోవఁగ, నేరను బాలకులఁ బెట్టి నిర్దయబుద్ధిన్.
[1]వీరల తండ్రి[2]క్రియం జన, నేరను విధికృతము గడవ [3]నేరఁగ లావే.

305 చ. [1]ఇది ప్రళయాగ్నిపోలె [2]దెస లెల్లను [3]గప్పఁగ విస్ఫులింగముల్
వదలక వాయుసారథి [4]జవంబునఁ దానిట వచ్చె నేమిసే
యుదు సుతులార యీ బిలము [5]నొయ్యన పోయి చొరుండు దీనిఁగ
ప్పెద ఘనపాంసుజాలము[6]ల భీమ[7]శిఖావళి దాఁక కుండఁగన్.

306 చ. కొడుకుల బ్రహ్మ[1]విత్తములఁ గోరిన [3]యట్టుల వీరి నల్వురం
బడసితి నిమ్మహాత్ముల నపాయము [4]నొందక యుండఁ బెంచుచున్
[5]నడపు మటంచు [6]నన్ను మునినాథుఁడు మీ జనకుండు పంచి [7]యి
ప్పుడ [8]యెటయేనిఁ బోయె హుతభుక్ప్రళయంబు దలంప [9]కక్కటా.

302 1. నిక్కడ—క.

303 1. భీతచంచలాత్ముల — కొన్ని ప్రతులు. 2. యుతుల నటయిట దొలగన్/జననేరని — స. 3 నెటకున్, నెచటం — అని పాఠములు. 4. యు వీక్షించి— ఊ.ట. ఖ గ ; నిరీక్షించి — వా. కొన్ని ప్రతులు.

304 1. వీరలు తండ్రిక్రియంజననేరరు — ఉ.గి$_1$.చ.ద.శ ష ; వీరలతండ్రిక్రియంజన నేరను — ఒ.ట.డ భాసం.వీ 2. క్రియఁజన నేరను — వా. ఇందు 'డ్రి' గురువగుట గమనించ తగినది. 3. నేరంగలరే, నేరంగలదే, నేరగనగునే ; నేరను లావే - అని పాఠములు.

305 1. ఇది — గి$_1$.శ.ష.భాసం. తాళపత్ర ప్రతులు ; ఇదె — వా. 2. దిశలెల్లను — పెక్కు ప్రతులు. 3. గప్పుచు - కొన్ని ప్రతులు 4. వశంబున — గి$_1$.చ.ద.శ.ష. ఈ పాఠమున యతి తప్పినది. 5. నొయ్యనఁబోయి — గి$_1$.శ ష. కొన్ని ప్రతులు. 6. న — కొన్ని ప్రతులు 7 శిఖల్ వడిఁదాఁక — గి$_1$.చ ద శ.ష.

306 1. వేత్తలను—అ.ఏ.క 2 ముదంబున — స 3. యట్లన — ఆ.ఉ ఖ.ల. 4 బొందక యుండునట్లుగా / నడుపుము — ఏ స. 5. నడుపుమటంచు—అ ట. ఖ గి$_1$ జ.ద.శ.ష. 6. మున్ను—య. 7. యప్పుడ—ఆ.డ.య. 8 యెటనేనియేగె—గి$_1$.చ.భాసం.శ.ష , యెటయేనిఁనేఁగె — భాసం.వీ. 9. దక్కటా — కొన్ని ప్రతులు.

307 వ. అని దుఃఖితయైయున్న తల్లిం జూచి యగ్రతనయుండైన జరితారి యిట్లనియె.

308 తే. బిలము సొచ్చితి మేని నంతెలుక చంపు, నింద యుండితి మేనిఁ [1]దా నేర్చు నగ్ని
యెలుకచేఁ జచ్చు [2]కంటె నీజ్వలనశిఖలఁ, గ్రాఁగి పుణ్యలోకంబులఁ గాంతు మేము.

309 వ. మఱియు మాంసపిండంబుల మయి యున్న మాకు బిలప్రవేశంబున మూషకభయంబు నియతం [1]బింద యుండిన నగ్నిభయంబు [2]సంశయితం బెట్లనిన.

310 క. జ్వలనంబు వాయువశమునఁ, [1]దొలఁగుడు జీవన[2]ము మాకు [3]దొరకొనుఁ [4]గృచ్ఛం
బుల సంశయ[5]యుతకార్యం, బులు గర్తవ్యములు నియతములు వర్జ్యమ్ములే.

311 వ. కావున నీవు [1]మెచ్చిన చోటికిఁ బోవనోపము మావలని మోహంబు విడిచి యరుగు మేము దహనక్లేశం[2]బునం బొందినను నీవు [3]జీవించి పుత్త్రలం [4]బడయ నోపుదువు [5]నీ పుణ్యవశంబున మాకు నగ్నిభయంబు దొలంగె నేని నీవు మాయొద్దకు వచ్చి యెప్పటియట్ల [6]రక్షింతు వని కొడుకు లెల్ల

308 1 దహించునగ్ని — ఏ.న. 2. కంటెను — ఆ.ఐ.ఒ.ఖ.జ.న.య.

309 1. బిందున్న మాకు — కొన్ని ప్రతులు. 2. సంశయం బెట్లనిన — కొన్ని ప్రతులు.

310 1. దొలఁగును — ఏ ఖ.గ్రి$_{1}$.చ.శ.ష ; దొలగుట—న. 2. ములు — ఋ.క.జ. 3. దొరకును — గ్రి$_{1}$.ద.శ.ష. 4. గష్టంబుల — గ్రి$_{1}$.వ.భాసం.వి శ.ష. 5. గత — ఋ.

311 1. వలసినచోటికిఁ బోవనోపుదు (వు) — పెక్కు ప్రతులు. 2. బుఁబొందినను — ఓ ఖ గ్రి$_{1}$.చ.ద.య.ర.శ.ష. 3. జీవించిన బుత్త్రిల—అ.ఆ ఉ.జ.న.ల 4. బడయుదువు—పెక్కుప్రతులు. 5. మా (నీ) పుణ్యంబున—పెక్కు ప్రతులు. 6. మమ్ము రక్షించుకొని యుండుదు మా పంచినట్లచేయుమనికొడుకులెల్ల మ్రొక్కిన నలువురం జూచి బెదరి బాష్ప — ఉ ; రక్షించుకొని యుండుదని తనకు మ్రొక్కిన

ద్రొక్కనం జూచి జరితయు బాష్పపూరితనయనయై యానన్న[7]తరు
గుల్మగహనదహనమహోత్సాహుండయి వచ్చుహవ్యవాహనుం జూచి
ప్రాణభయంబున [8]గగనంబున కెగసి చనె నంత.

312 క. నలుగురు నాలుగు వేద, మ్ములు [1]మంత్రము లొప్ప బ్రహ్మ [2]ముఖములు
వోలెన్.
[3]వెలయంగ సంస్తుతించుచు, నలఘులు [4]మాకభయ మభయ మనిరయ్యున
లున్.

313 వ. అగ్నిదేవుం డప్పుడు మందపాలుప్రార్థనం [1]దలంచి యన్నలువురు [2]శార్ఙ్గ
కులు నున్న వృక్షంబు [3]భక్షింపక [4]పరిహరించిన జరితయు దానిం జూచి
సంతసిల్లి కొడుకుల యొద్దకు వచ్చి సుఖంబుండె నంత [5]నక్కడ మంద
పాలుండు పురందరువనంబు దహనుచేత దగ్ధం బగుట యెఱింగి యందున్న
జరితను బుత్త్రులం దలంచి [6]యతిదుఃఖతుండయి [7]లపిత కిట్లనియె.

314 క. తరుణుల నజాతపక్షులఁ, జరణంబులు లేనివారి [1]శార్ఙ్గేయుల న
ల్వుర [2]నొక్కతెయొట దోడ్కొని, యరుగంగా నేర్చు జరిత యాపద
గడవన్.

కొడుకుల – ఒ. 7 తరుదహ నోత్సుకుండయి – పెక్కు ప్రతులు. 8. గగనంబు
నంబరచెనంత – పెక్కు ప్రతులు; గగనంబున కెగసెనంత – గ్రి₁.చ ద వీ.శ వ.

312 1. మంత్రములొప్ప – ఆ.ఏ.ఖ; మంత్రంబులను – వా. కొన్ని ప్రతులు.
2. ముఖములపోలెన్ – కొన్ని ప్రతులు. 3. వెలయఁగ సంస్తుతిఁ జేయుచు –
ఆ.ఐ.న.వ; వెలయంగసన్నుతింపుచు – డ. 4. మాకిప్పుడభయమని రన్నలు
వుర్ – డ.

313 1. జేసి – కొన్ని ప్రతులు: 2. శార్ఙ్గికులు – కొన్ని ప్రతులు. 3. భక్షింపక –
ఆ.ఓ. ప్రతులలో లేదు 4. పరిహరించె – పెక్కు ప్రతులు 5. నట – కొన్ని
ప్రతులు. 6. యతి – పెక్కింట లేదు. 7. తనయగ్ర భార్యయైన లపిత – ఐ.న;
పూర్వభార్యయైన లపిత – డ.

314 1. శార్ఙ్గ (ర్ఙ్గి) కులనన్నలువుర–ఆ.ఋ.ఏ. 2. నొక్కతి, నొక్కట–అని పాఠములు.

315 క మఱచు నొకొ మఱవకుండియు, నెఱుఁగక యుండునొకొ యనలుఁ
దెలిఁగి యు[1]నెడనే
మఱునొకొ పుత్త్రులఁ [2]గావక, గుఱుకొని నమ్మంగ [3]నగునె క్రూరాత్మ
కులన్.

316 వ. అనిన విని లపిత యిట్లనియె.

317 క. నా యొద్దన ప్రార్థించిన, వాయుసఖుం డపుడు నీకు వరదుం డయి శా
ర్ఙ్గేయుల [1]నలువురఁ గాతును, ధీయుత యని పలికె మఱచితే మునినాథా.

318 వ. [1]అలికి నెయ్యుండ[2]వయి దాని యోగ క్షేమం[3]బరయం దలంచితది పులుఁ
గెట యేనియుం [4]బఱచుం గా కేమియయ్యెడు వగవకుండు మనిన
మందపాలుండు మందస్మితవదనుండగుచు వసిష్ఠునట్టి[5]పురుషునైన నరుం
ధతియట్టిభార్యయైనను నిర్నిమిత్తంబున స్త్రీవిషయంబునందు సంశ
యింపకుండ దిది స్త్రీలకు నైజంబ యని పలికి [6]లపిత వీడ్కొని ఖాండ
వంబునకు వచ్చి [7]పుత్త్రసహితయయి కుశలినియయి యున్న జరితంజూచి
సంతుష్టుండై నిశ్చేచ్ఛ నరిగె [8]నగ్నిదేవుండు నిట్లు నిర్విఘ్నంబున ఖాండవ
వనౌషధంబు లుపయోగించి విగత[9]రోగుండయి కృష్ణార్జునుల దీవించి
చనియెనంత.

315 1. నెడ — గ.గి$_1$.చ ద.శ.ష. 2. గావంగుఱుకొని — క.గి$_1$ చ.ద.వీ శ.ష.సం; గావఁగ — ఐ.ఓ.గ ట.సూ. 3. దగునె - కొన్ని ప్రతులు.

317 1. నందఱగాచెద — చ ద.శ ష ; నందఱగాతును - గి$_1$.

318 1. అనిపలికి — గ.ఙ య.స ; దానికి నెయ్యుండవయి — ద.ఖాసం.శ.ష.స. 2. వయినాయొద్ద దాని — గ.గి.చ.ట.ద.ఖాసం.శ ష. 3. బులు దలంచితది — కొన్ని ప్రతులు. 4. బోవుగాకేమి — ఉ. 5 పురుషుండరుంధతివంటి భార్య యైనను నిర్నిమిత్తంబున స్త్రీలయందు సంశయింపకుండ రదిస్త్రీలకు స్వభావం బనిపలికి — గి$_1$ చ.ద.శ ష. ఈ వాక్యములు మూలము నందు మందపాలుఁడు లపితతోఁగాక జరితతోఁ బలికినట్లు కలదు. చిత్రశాలా ప్రతి. పుట. 366. 6. లపిత వీడ్కొని—ఒ.ఖ ఙ.వీ. 7. పుత్త్రసహితంబుగాఁ గుశలినియై యున్న - క.ఖాసం. 8. నగ్నియునిట్లు—పెక్కు ప్రతులు. 9. జ్వరుండయి — పెక్కు ప్రతులు.

—: ఇంద్రుం డర్జునునకు నాగ్నేయ వారుణ వాయవ్యాది దివ్యబాణంబు లిచ్చుట :—

సం. 1—225—7

319 క. అతిమానుష మత్యద్భుత, మతి[1]దుష్కరమయిన కేశవార్జునకృతి గో
పతిచూచి మెచ్చి సురపతి, వ్రతుఁడయి చనుదెంచెఁ గృష్ణవిజయులకడకున్.

320 క. అనఘులు నరనారాయణు,లన నాదియుగంబునన్ సురాసురనుతుల
య్యును నపుడు మనుజులగుటను, వినయంబున మ్రొక్కి రమరవిభునకు
నంతన్.

321 వ. ఇంద్రుండు [1]నుపేంద్రార్జునుల నతిస్నేహంబునఁ గౌఁగిలించుకొని యర్జు
నునకు నాగ్నేయ వారుణవాయవ్యాది దివ్యబాణంబులిచ్చి [2]వీనికెప్పుడు
[3]నిష్టసఖుండ[4]వయి యుండుమని కృష్ణుం బ్రార్థించి దివ్యవిమానా రూఢుం
డయి [5]దివిజాప్సరోగణసేవితుఁడయి దివంబున కరిగె నిట వాసుదేవార్జు
నులు మయుం దోడ్కొని [6]మగిడి యింద్రప్రస్థపురంబునకువచ్చి ధర్మ
రాజునకు మ్రొక్కి ఖాండవదహనప్రకారంబుసెప్పి మయుంజూపి సుఖం
బుం[1]డిరని.

—: ఆశ్వాసాంతము :—

322 క. జనమేజయజనపాలున, కనఘచరిత్రునకుఁ బ్రీతుఁడయి వైశంపా
యనుఁ డాదిపర్వ [1]కథయెల్లను [2]నిమ్ముగఁజెప్పె[3]నని విలాసమహేంద్రా.

319 1. వార్షము సెసఁగఁ గేశవార్జున — గ$_1$ చ.శ.ష.

321 1. కృష్ణార్జునుల — చ ద పీ శ.ష. 2. యీతనికి నీవెప్పుడు — గ$_1$.చ.ద.
పీ.శ.ష. 3. ప్రియసఖుండవై — కొన్ని ప్రతులు. 4 వుగమ్ము, వగుము—
అని పాఠములు. 5 దివిజాప్సరోగణ సేవితుండయి — చ.ద.శ ష ప్రతులలో
లేదు. 6. మగుడి — కొన్ని ప్రతులు. 7 డిరంత — కొన్ని ప్రతులు

322 1. కథలెల్లను — కొన్ని ప్రతులు 2. నేర్పడఁజెప్పె — న ; నొప్పుగఁజెప్పె — ఆ
3. నురువిలాస మహేంద్రా — ల.

323 క. అభిమానమహోర్ణవ హరి, నిభ[1]విభవ విభాసమాన [2]నిరవద్య రవి
ప్రభ రాజమనోహరవై, రిభయంకర శౌర్య నృపవరేణ్యాశరణ్యా.

324 మత్తకోకిలము. రాజభూషణ [1]నిత్యసత్య సరస్వతీవిలసన్ముఖాం
భోజ రాజమనోజ భూజనపూజ్యమాన మహోయశో
రాజహంసపయోజినీవనరమ్యదిఙ్ముఖ విక్రమో
ద్వేజితాహిత [2]విష్ణుసన్నిభ విష్ణువర్ధన [3]భూపతీ.

గద్యము

ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్ట ప్రణీతంబైన శ్రీమహాభారతంబునందాదిపర్వం
బున విదురాగమనంబును కృష్ణసందర్శనంబును రాజ్యార్థలాభంబును [1]ఖాండవ
ప్రస్థనివాసంబును సుందోపసుందోపాఖ్యానంబును నారదువచనంబున ద్రౌపది
యందు సమయక్రియయు నర్జునుతీర్థాభిగమనంబును నులూ[2]పీసమాగ
మంబును జిత్రాంగదయందు బభ్రువాహనుజన్మంబును ద్వారకాగమనం
బును వాసుదేవానుమతుండయి యర్జునుండు సుభద్రవివాహంబగు
టయు సుభద్రాహరణంబును [3]హారణహారికయు నభిమన్యు
సంభవంబును గాండీవ దివ్యరథాశ్వలాభంబును ఖాండవ
దహనంబును నగ్నిభయంబు వలన మయభుజంగ
మోక్షణంబును మందపాలోపాఖ్యానం
బును నన్నది సర్వంబును
నష్టమాశ్వాసము.
శ్రీమహాభారతము నందలి యాదిపర్వము సమాప్తము.

323 1. వైభవహరి సమాన — న. 2. నృపవీర్య — గ[1].చ.ద శ ప.

324 1. సత్యనిత్య — ఈ. 2. వీరమర్దన — ఈ; వీరవిక్రమ — ల.
3 భూభుజా — వ

326 1. ఇంద్రప్రస్థ — పెక్కు ప్రతులు. 2. చీ — పెక్కు ప్రతులు. 3. హారణ
హారికయు నభిమన్యు సంభవంబును — గ[1].చ.ద.శ.ప. ప్రతులలో లేదు.

—:o:—

గరుడశబ్దప్రయోగము; ఆది 2–47

అకారాంతమైన గరుడ శబ్దమునకు ఉత్వడుజ్ఞులు రాఁగా గరుడుఁడు, గరుడుండు అనురూపములు కలుగును. డుజ్ఞుమాత్రము వచ్చి ఉత్వమురాని గరుడఁడు, గరుడండు అను రూపములు కూడ నన్నయనాఁడు వాడుకలో నుండవచ్చును.

గరుడ శబ్దమునకుఁ దత్సమరూపములు వాడుటలో ఆంధ్రమహాభారత పూర్వ ప్రకాశకులలోఁ గొందఱు గరుడుఁడు అనురూపమును, గొందఱు గరుడఁడు అనురూపమును గొందఱు రూపద్వయమును అంగీకరించినట్లు కన్పించును.

మాకు లభించినంతవఱకుఁ బూర్వతర ముద్రణములుగాఁ దోఁచుచున్న శ ష ప్రతులును, 1901 ప్రాంతమునకుఁ జెందిన వీ ప్రతియు, ఆనందముద్రణమును, భారత సంజీవినీ వ్యాఖ్యయు (భా సం.) కీ. శే గిడుగు రామమూర్తిపంతులుగారు సేకరించిన గి॥ పాఠములును గరుడుఁడు అను ఉత్వసహిత పాఠమునే గ్రహించినవి ఆనందముద్రణమున ద్వితీయాశ్వాసము నందలి 71 న పద్యము నొద్ద "వ్రాఁతప్రతులందు గరుడఁడు, గరుడ అను రూపములు చూపట్టుచున్నవి. ఇది వైకృతమైన శిష్టశబ్దమువంటిది గానోపు"నని సూచింపఁ బడినది.

కీ. శే. చిలుకూరి నారాయణరావుగారు తాళపత్ర ప్రతుల సాయమున సంశోధించి ఆం. భా. చరిత్రము రెండవసంపుటమునఁ బ్రకటించిన గరుడోపాఖ్యానము నందును, కీ శే గిడుగు రామమూర్తి పంతులుగారు గుర్తువేసికొన్న తంజావూరు తాళపత్ర పాఠములందును గరుడఁడు అను ఉత్వరహిత రూపమే కనపచ్చుచున్నది. కీ శే. నారాయణరావుగారు భాషాచరిత్రమందలి విభక్తి ప్రకరణమున "నన్నయకుఁ బూర్వకాలమున తక్కిన ద్రావిడ భాషలందువలెనే తెనుఁగునందును ఈ ఉత్వములేకుండగనే ప్రాతిపదికమేర్పడి యుండును. నన్నయకాలమున అత్వముతోను ఉత్వముతోను గూడ ప్రాతిపదికములు కాన్పించుచున్నవి. గరుడ, గరుడఁడు; దేవ, దేవఁడు (యస్.ఐ ఐ వాల్యూమ్. 4 పుట 1357)" అని వ్రాసియుండిరి. వారు తాము సంశోధించి ప్రకటించిన గరుడోపాఖ్యానము నం దధస్సూచికలో కొన్ని తాళపత్రప్రతులలో 'గరుడుఁడు గరుడుండు' అను పాఠములుకూడ నున్నట్లు సూచించిరి.

వావిళ్ళవారి భారతముద్రణమున గరుడఁడు, గరుడుండు అను రెండురూపములును గ్రహింపఁబడినవి. కాని మొత్తము 35 స్థానములలో రెండుమూఁడింట మాత్రమే ఉత్వసహిత రూపములు కనఁబడుచున్నది ఆది 2–41వ పద్యమున గరుడుఁడు అనురూపమును గ్రహించి అధస్సూచికలో వారు "వ్రాఁతప్రతులం దెల్లెడ గరుడఁడనియే యున్న" దని సూచించిరి.

శబ్దరత్నాకరము, సూర్యారాయాంధ్ర నిఘంటువు, వావిళ్ళ నిఘంటువు అను నిఘంటువులలో గరుడుఁడు, గరుడి అనురూపములే కాని గరుడఁడు అను రూప మొసంగఁబడి యుండలేదు.

మేము పరిశోధించిన తాళపత్రప్రతులలో ఉత్వసహిత, ఉత్వరహిత రూపములు కొంచెమించుమించుగా సమానముగా నున్నవి. ఉత్వరహితరూపమే ప్రాచీనమై యుండు నను నూహచేతను, ద్వైవిధ్యమును బరిహరింప వలెనను భావముచేతను మేము గరుడఁడు అను ఉత్వరహిత రూపమునే ఆదరించితిమి. దీనినిబట్టి నన్నయ కీయొక్కరూపమే సమ్మతమని భావింపరాదు. ఆయనకు పై రెండు రూపములును సమ్మతములై యుండుననియే ప్రస్తుత జ్ఞానమునుబట్టి చెప్పవలయును.

సంధి యందు 'ఋ'కారము ; ఆది. 5–65. వ.

బ్రహ్మఋషి సంధిచేసినచో బ్రహ్మర్షి (గుణసంధి). ఋత్యకః అనుసూత్రముచే బ్రహ్మ ఋషి అనురూపమును సిద్ధించును. పదాద్యంబులు ఋ ౡ వర్ణంబులు ర ల తుల్యంబులు— అని చిన్నయసూరి. (బాల. ప్రకీర్ణ. 1 సూ.) ఈ సూత్రము ప్రకారము ఆఋషియని యుండవలెను. ఉచ్చారణమునందు 'రల' తుల్యత్వము నీతఁ డంగీకరించెను. వ్రాఁతయందు కాదు. ఇచ్చట భారతకూలంకష వ్యాఖ్యలో మఱియొక పద్ధతి సూచింపఁబడినది. "ఋషులు— కర్మధారయ సమాసము తెనుఁగుపదముతో వుంటే 'రు' కారము వ్రాయవలసినది. వొక్క పద మేవుంటే ఋకారము వుంచున్నది. ఆరుషికుమారుకట్టినచీరలు, ఎల్లరుణములు. ఇది కర్మధారయము గనుక రేఫోకారములు వున్నవి. పితరుల ఋణము— ఇది తత్పురుషము గనుక 'ఋ' కారము వున్నది" కూలంకషముచేసిన ఈవ్యవస్థకు ఆకరము తెలియదు. ఋవర్ణ మునకు 'రి'తో యతి పాటింపఁబడుట ప్రసిద్ధము. ఇంతేకాక ఋవర్ణమునకు 'రు'తో యతి వేయుటయు కొందఱు ప్రాచీనకవులందు కనఁబడుచున్నది.

"రురువర్ణ దేహంబు—ఋగ్వేదమునకు." పండితారాధ్య చరిత్ర.

———o———

# శ్రీమదాంధ్ర మహాభారతము
## సభాపర్వము - ప్రథమాశ్వాసము

1 క. శ్రీదయితోరస్స్థల విమ, లాదిత్యాత్మజ నిరంతరానందమతీ
కోదండపార్థ నిఖిలక్ష్మాదేవస్తుత్య రాజరాజనరేంద్రా

—: మయుం డొక్కసభను నిర్మించి ధర్మజున కిచ్చుట :—

సం. 2—1—1

2 వ. [1]అక్కథకుండు శౌనకాదిమహామునులకుం [2]జెప్పె నట్లు ధర్మతనయునొద్ద వాసుదేవసహితుండయి యున్న యర్జునున కతిప్రీతిం గృతాంజలి యయి మయుం డిట్లనియె.

3 క. ఘనముగఁ బ్రాణము రక్షిం, చినయుపకారికిఁ బ్రియంబు సేయుదు నన నే
ర్తునె యైనను నీకుఁ బ్రియం, బనఘా [1]చేయంగ నిష్టమైనది నాకున్.

4 వ. ఏను దానవ విశ్వకర్మ ననేకవిధ[1]శిల్పకళాకుశలుండ [2]మీకిష్టంబయినదాని నిర్మించెదం [3]బనుపుం డనిన నర్జునుం డచ్యుతుముఖంబు చూచి [4]యతని [5]నెద్దియేనియు నొక్క యపూర్వం బయినదాని నిర్మింప[6]నియోగింపుమని[7]నం గృష్ణుండు పెద్దయుంబ్రొద్దు విచారించి మయున కిట్లనియె.

2 1. అక్కథికుండు — కొన్ని ప్రతులు 2. జెప్పినట్లు — ఉ.ఓ.ఖ.ఘ.చ.ఝ.

3 1. సేయంగ — ఝ.ట

4 1. శిల్పి — ఇ.ఓ.ఔ.ఖ.గ.ఝ.ణ. 2. నీకెద్ది యిష్టంబు దానిన — ఉ.క.డ.ణ.ల ; నీకు నిష్టంబయిన దాని — కొన్ని ప్రతులు ; మీకెద్ది యిష్టంబు — ఉ.ద.ల 3. నియోగింపుండనిన — కొన్ని ప్రతులు ; బనుపుమనిన — ఓ.గ.ఘ.ఝ.ప. 4. యితని — కొన్ని ప్రతులు. 5. నెద్దియేనియు నొక్క — ఈ.ఉ.ఊ.ఏ.ఐ.ఓ.క.గ.ణ.శ.ష. 6. పనియోగింపుండనిన — పెక్కు ప్రతులు ; పంబనుపుండనిన — ఝ.ణ. 7. నచ్యుతుండు — అ.ఆ.ఏ.ఒ

5 చ. కురుపతి[1]కిన్ యుధిష్ఠిరునకుఁ సకలక్షితిపాలసేవ్య సు
స్థిరవిభవాభిరామున [2]కతిప్రమదంబుగ రత్నరాజిసుం
దర మగు[3]దాని నొక్కసభ ధాత్రి కపూర్వముగా [4]నొనర్చ చె
చ్చెరఁ గొని రమ్ము నీదయిన [5]శిల్పకలాకుశలత్వ మేర్పడన్.

6 వ. అనిన వాసుదేవునకు మయుం డిట్లనియె.

7 ఉ. ఇమ్మనుజేంద్రుఁ డింద్ర దనుజేంద్రుల కంటె [1]మహా[2]విలాస సౌ
ఖ్యమ్ములఁ బెద్ద యిద్ధరణిఁ [3]గావున నీతని పేర్మికిం దగన్
[4]నెమ్మి నొనర్చెదన్ [5]సభ మణిప్రభ [6]నొప్పఁగ దేవతావిమా
నమ్ములు నిట్టివే యని జనమ్ములు దానిన [7]మెచ్చిచూడఁగన్.

8 వ. తొల్లి వృషపర్వుండను [1]దానవేంద్రున కొక్కసభ నిర్మింప సమకట్టి వివిధరత్న మయంబు లయిన యుపకర[2]ణంబు [3]లొడఁగూర్చి బిందుసరంబను కొలన సంగ్రహించినవాఁడ నయ్యుపకరణంబుల దాని విచిత్రంబుగా రచియించి [4]తెచ్చి ధర్మరాజున కిచ్చెద మఱియును [5]యౌవనాదిత్యుండను రాజర్షి చేత [6]నిహితం[7]బయి సకల [8]శత్రుఘాతిని యైనదాని భీమసేనున కొక్క[9]గదను దారుణం బయిన దివ్య[10]ఘోషంబు గలుగు దేవదత్తంబను శంఖం బర్జునన[11]కును నిచ్చెద నని

5  1 యయ్యుధిష్ఠిరునకున్ — ఇ; కియ్యుధిష్ఠిరునకున్ — ఊ.ఎ  2. కుధీరునకుం దగ సర్వలోక సుందర — మేము పరిశీలించిన ప్రతు లన్నిటియందును. మఱియు, స. అయినను పునరుక్తి కలుగకుండుటకై పైపాఠమే గ్రహింపఁ బడినది. 3. చున్న యొక్క — ల వ  4 గజేసి — ఘ  5. శిల్పి — పెక్కు ప్రతులు

7  1. విలాసభోగసౌ — ఝ  2 విభూతి — ఉ.ణ ల స.  3 గావుత — ఎ ణ. 4. నెమ్మది చేసెదన్ — మ  5. వినుము నేర్పున నొప్పగ — ఛ. 6. యొప్పగ— ఎ; లొప్పగ — ఝ.వి  7. వచ్చి — ణ ; మెచ్చుచుండగాన్ — ఇ.

8  1. దానవేంద్రుండు సకలవిభవోపేతుండై యుండ నొక్క సభ — ఛ  2 ణాద్ర వ్యంబు — ఇ.క.చ.డ ణ.వ  3 లొనగూర్చి — ఆ.ప ఔ ఘ.ఝ ; సమకూర్చి—చ ; లొనగూర్చుకొని - ఆ  4 తెచ్చిసభ — కొన్ని ప్రతులు  5 సార్వభౌముండను — ఇ.ల ; నిష్టితో యౌవనాశ్వేన రాజ్ఞా హాత్యార ణేరిపూన్. అని మూలము. భం. 2-3-5 పి పి.యస్. యువనాశ్వేన—శా వ్యా  6. నిగృహీతంబయి—ఇ ఉ.క.ఛ ణ ; పూజితంబయి — ఖ.  7. బయినదాని — ఇ ఏ ఒ.  8 శత్రునిర్ఘాతిని — ఇ.ఊ.ఛ. 9. గదయును — పెక్కు ప్రతులు.  10. ఘోషంబగుచున్న — ఊ ; ఘోషంబు గలుగుచున్న — కొన్ని ప్రతులు.  11. కిచ్చెదనని — పెక్కు ప్రతులు.

[12]చెప్పి [13]ధర్మరాజుచేత సత్కృతుండై మయుం [14]డరిగె నంత[15]నిట నారాయణుండును బాండవుల వీడ్కొని పితృదర్శనలాలసుండై [16]ద్వారావతీ పురంబున కరిగె నట మయుండును బూర్వోత్తరదిశాభిముఖుండై [17]పోయి కైలాసంబు నుత్తరంబున మైనాకశైలంబునందు హిరణ్యశృంగంబున.

9 సీ. ఎందేని సర్వ[1]భూతేశుండు సృజియించె సచరా[2]చరములైన జగములెల్ల
గంగఁబ్రత్యక్షంబు [3]గావింప నెందేనిఁ [4]గృతవాసుఁడయ్యె భగీరథుండు
నలినసంభవనరనారాయణస్థాణు వాసవ[5]ప్రభృతిగీర్వాణముఖ్యు
లెందేనిఁ గ్రతువు లనేక[6]యుగంబులఁ జేసిరి [7]రత్నవిచిత్రవితత

ఆ. [8]చైత్యములు మహావిశాలహిరణ్మయ, యూప[9]తతులు నోలినొప్పు[10]చుండ
నట్టి బిందుసరము[11]నం దున్న వివిధర, త్నోపకరణచయము లొనరఁ గొని యె.

10 క. దేవబ్రాహ్మణులకు నానావిధ [1]పూజనఁ దర్పణము సేసి ధరి
త్రీ[2]వనిత కపూర్వశ్రీఁ, గావింపఁ [3]దొడంగె మయుఁడు గడు[4]రమ్యముగన్.

12. చెప్పి — అ.ఓ.వ ఝ. లలో లేదు. 13. కృష్ణుచేత — చ. 14. డరిగిన నారాయణుండును — డ. 15 నిట — పెక్కు ప్రతులలో లేదు. 16. ద్వారావతి — పెక్కు ప్రతులు. 17. చని — ల పి శ ష.

9 1. లోకేశుండు — ఓ 2. చరంబైన జగమునెల్లి — పెక్కు ప్రతులు 3. గావించి యెందేని — ఆ.ఈ.ఐ ఒ.గ.ట.ణ.ల శ.ష.స. 4. గృతకృత్యుడయ్యె — జ.ల.శ.ష.స. 5. ప్రముఖ — ఉ.ల. 6. యుగంబులు — ఆ ఊ.ప.ఓ.ఝ. 7 రత్నవిచిత్రవితతి చిత్రములు మహావిశేషహిరణ్మయ, యూపతతుల నోలి నొప్పుచున్న యట్టిబిందుసరము నందున్న—అను పాఠము పెక్కు ప్రతులందున్నది. 8. చిత్రములు మహావిశేష— అ.ల. ప్రతులలో తప్ప తక్కిన అన్ని ప్రతులందును. సువర్ణమాలినో యూపాశ్చి త్యాశ్చాప్యతి భాస్కరాః అని భం. 2-3-15. యత్ర యూపా మణిమయాః చైత్యాశ్చైవ హిరణ్మయాః పి.పి యస్. 2-3-15. చిత్రాంశ్చాప్యతి భాస్వరాన్ . అని భం. పాఠాంతరము. 9 తతుల — పెక్కు ప్రతులు. 10. చున్నయట్టి — పెక్కు ప్రతులు. 11. నందొప్పుచున్న రత్నోప — ఏ.

10 1 పూజలను — స ; పూజనసమర్పణము — ఓ. 2. విభున — ల. 3. గడంగె— స ; దొడంగి — స. 4. వేడుకతోన్ — చ.

11 క. విమలమణిమయములగు దూలములం గంబముల గోడలను వేదులఁ [1]గట్టిమములఁ జుట్టిన ప్రాకారము[2]లను [3]గడ నొప్పుచుండ రచియించె సభన్.

12 వ. [1]మఱియును.

13 సీ. సురుచిరహరినీలకిరణ[1]జాలంబులఁ బద్మరాగారుణ పద్మములను
రాజితరాజీవ రాజహంసావళి నిర్మలసౌవర్ణ కూర్మములను
గమనీయవైదూర్య [2]కుముదంబులను సత్ప్రభాసమౌక్తికనవ ఫేనములను
మరకతశైవలోత్కరముల [3]విలసిల్లఁ గొలనని సన్మణిస్థలముచూచి

ఆ. [4]పలుఁగుగోడలకుడ్యములరుచుల్ గప్పిన, జలములున్న [5]యెడల[6]వెలయఁజూచి
[7]యననుపస్థలంబులని జనులెఱుఁగక, యుండునట్లుగా మయుండు సేసె.

14 వ. మఱియు సకలజన [1]మనోహరంబులైన నానావిధయంత్రంబులును ననవరత కుసుమఫలభరితంబులైన తరువనంబులును [2]వికచకమల కుముదాభి రామంబులైన జలాశయంబులును [3]వివిధ [4]విచిత్ర[9]పతాకావలంబితతోరణవిటంక ప్రదేశంబులునుం గలిగి దశకిష్కుసహస్ర ప్రమాణ వృత్తాయతంబును సహస్రకర ప్రభా[5]ప్రసర [6]విస్తార [7]విభూతియును వివిధరత్నవిభవాభి [8]శోభితంబునుంగా

11 1 గట్టిమలం జుట్టిస — భా సం 2. లంగర — అ ఊ ఐ ఓ. 3 గడు నొప్పు చుండ ఐ జ.ట ణ.తి.

12 1. ఈ వాక్యము పెక్కు ప్రతులలో లేదు

13 1. జాలంబుల – పెక్కు ప్రతులు. 2. కమలంబులను – ఛ. 3. విలసిల్లు — పెక్కు ప్రతులు 4 పులుగురాల – క.ఖ. భాసం. (గరుడు పచ్చరాళ్ళ – అను నర్థమున) 5. కడలు — వ. 6 గలయఁజూచి — ఈ ఐ ప, వెలయఁగాంచి – ఊ. 7. యను పమస్థలంబులని – పెక్కు ప్రతులు

14 1. మోహనంబైన — ఉ 2. నవవికచ — ఓ.గ. 3. వివిధ — పెక్కు ప్రతులలో లేదు. 4. విచిత్రోపవనకువలయాభిరామంబులైన — అ.ప ఔ ; విచిత్రోపవనకమలాభిరామవిటంక —ణ ; విచిత్రోపలవరకమలకువలయాభిరామంబులైన — ఉ.వీ ; విచిత్రకువలయాభిరామంబులైన — ఓ. 5. భాసితంబును — ఉ. 6. విస్తార— కొన్ని ప్రతులలో లేదు. 7. విభూతియును – కొన్నింట లేదు 8. రామంబునుం– ఘ.చ.

న పూర్వసభాభవనంబు [9]నందఁ బదునాలుగు నెలలు[10]నిర్మించి దాని నెనిమిదివేల రాక్షసకింకరుల మహాకాయుల మహాజవ[11]సత్త్వ సంపన్నుల నంతరిక్షచరులం బనిచి మోపించికొని [12]వచ్చి ధర్మరాజున కిచ్చి గదయును శంఖంబును భీమార్జునుల కిచ్చి [13]ధర్మరాజుచేత సత్కృతుండయి మయుం[14]డరిగిన.

—: ధర్మరాజు సభాప్రవేశము కావించుట :—

సం. 2—4—1

15 ఉ. వీరుఁడు ధర్మజుండు పదివేవురు విప్రుల కొప్పెఁ బాయసా
హారము [1]భక్తిఁ బెట్టి మఱి యందఱకుం [2]దెలు [3]వేయునేసి వి
స్తారయశుండు ధేనువుల ధర్మవిధిన్ మణిముద్రికాద్యలం
కారదుకూల పుష్పఫలగంధయుతంబుగ [4]నిచ్చి [5]బ్రీతితోన్.

16 వ. అనుజసహితుండయి దైవజ్ఞదత్తశుభ [1]ముహూర్తంబున ధౌమ్యాది భూసురాశీర్వా[2]ద పుణ్యాహనాదం[3]బు లెసంగ సభాప్రవేశంబు [4]సేసి, యంత.

17 ఉ. మంచిగ [1]భూరిభూసురసమూహము [2]నెల్లను భక్తితోడఁ బూ
జించి యభీష్టదానములు సేసి ధనార్థులఁ దన్పి [3]దిక్కులన్
నించె యశంబు బంధులకు [4]నెయ్యురకుఁ హృదయప్రియంబుగా
వించె విభూతి యేర్పడఁ బవిత్రుఁడు ధర్మసుతుండు [5]నెమ్మితోన్.

9. నంద — పెక్కు ప్రతులలో లేదు 10. నిర్మించిన — అ.ఆ.ప.ఐ.ఒ.ఓ.క.గ.చ. 11. సత్త్వుల — అ.ఈ.ఊ.ఐ.ౕ.ఖ. 12. వచ్చిసభ — ఆ.ఉ.ఐ.ఓ.క.ఖ.గ.చ.ల. 13. వారలచేత — ఇ.ఈ.ఐ.డ. 14. డరిగెనంత — ప.చ.

15 1. దృష్టి — ఇ; నర్తి — ప. 2 దగవేఁబువేల — స.ల. (వేబువేర) 3 వేయుఁజేసి — ఒ.క.డ.ణ; వేయిజేసి — ల; వేయిచేసి — ఖ.ఘ. 4. నిచ్చె — పెక్కు ప్రతులు. 5. ప్రీతితోన్ — ప.

16 1. లగ్నంబున — ఇ.క.ఖ.చ.ఝ.డ. 2. దంబులు పుణ్యాహనాదంబు లెసంగ ధర్మజుండు సభా — ల. 3. బులు సెలంగ — అ.ఇ.ఉ.ఓ. 4. సేసెనంత — పెక్కు ప్రతులు.

17 1. దేవభూసుర — ఆ 2. లెల్లను — అ 3. దిక్కులన్నించి — అ.ణ.ల. 4. నెయ్యులకున్ — ఊ.క.ఖ.గ.ణ. 5. పేర్మితోన్ — ల.

18 వ. [1]తదవసరంబున.

19 మ. మదమాతంగ తురంగ కాంచనలసన్మాణిక్యగాణిక్యసం
పద లోలిం గొనివచ్చి యిచ్చి ముదమొప్పం గాంచి సేవించి ర
య్యుదయాస్తాచల సేతుశీతనగమధ్యోర్వీపతుల్ సంతతా
భ్యుదయుః ధర్మజుఁ దత్సభాస్థితు [1]జగత్పూర్ణప్రతాపోదయుః.

20 వ. [1]మఱియును.

21 సీ. [1]సుబల మార్కండేయ శునక మౌంజాయన మాండవ్య శాండిల్య మందపాల
బక దాల్భ్య రైభ్యక శాలుకి జతుకర్ణ గౌతమ కౌశిక కణ్వ కుత్స
సావర్ణి పర్ణాద సత్యగోపతి గోపవేష మైత్రేయ పవిత్రపాణి
ఘటజాను కాత్రేయ కఠకలాప సుమిత్ర హారీత తిత్తిరి యాజ్ఞవల్క్య

18 1. అంత, తదనంతరంబ, అయ్యవసరంబున — అని భిన్న ప్రతులలోఁ గలదు.

19 1. జగత్పూజ్య — చ ల.

20 1. మఱియును — పెక్కు ప్రతులలో లేదు; అట్టియెడ – ఖ; అంత — పి.ప

21 1 పేర్ల విషయమున ప్రతులలో భేదములున్నవి. మూలమున (భం) ఈక్రిందివిధమున గలదు.

అసితో దేవలః సత్యః సర్పమాలీ మహాశిరాః
అర్వావసుః సుమిత్రశ్చ మైత్రేయః శునకో బలిః.
బకోదాల్భ్యః స్థూలశిరాః కృష్ణద్వైపాయనః శుకః
సుమంతు ర్జైమినిః పైలో వ్యాస శిష్యా స్తథావయం
తిత్తిర్యాజ్ఞవల్క్యశ్చ ససుతో రోమహర్షణః
అప్సుహోమ్యశ్చ ధౌమ్యశ్చ అణిమాండవ్య కౌశికౌ
దామోష్ణీష స్త్రైవణిశ్చ పర్ణాదో ఘటజానుకః
మౌంజాయనో వాయుభక్షః పారాశర్యశ్చ సారికౌ
బలవాకః సినీవాకః సుత్యపాలః కృతశ్రమః
జాతూకర్ణః శిఖావాంశ్చ సుబలః పారిజాతకః
పర్వతశ్చ మహాభాగో మార్కండేయస్తథామునిః
పవిత్రపాణి సావర్ణి ర్భాలుకిర్గాలవస్తథా
జంఘాబంధుశ్చ రైభ్యశ్చ కోపవేగశ్చ్రవాభ్రుగుః
హరిబభ్రుశ్చ కౌండిన్యో బభ్రుమాలీ సనాతనః
కక్షీవానౌ శిజశ్చైవ నాచికేతోఽథ గౌతమః

ఆ. వాయుభక్షు భార్గవ వ్యాసజైమిని, శుకసుమంతు పైల సువరితాదు
లయిన మునులు నేము నరిగితి మెంతయు, రమ్యమయిన ధర్మరాజుసభకు.

22 వ. అమ్మహామునులనెల్ల నతిభక్తిం బూజించి [1]లబ్ధాశీర్వచనుండై ధర్మతనయుండు వారలవలన ధర్మకథలు వినుచుఁ దమ్ములుం దానును సుఖం[2]బుండునంత నొక్కనాఁడు.

—: నారదుఁడు పాండవుల యొద్దకు వచ్చుట :—

సం. 2—5—2

23 ఉ నీరజమిత్రుఁడేల ధరణీగతుఁడయ్యెడు నొక్కొ యంచు వి
స్మేరమనస్కులై జనులు [1]మెచ్చి నిజద్యుతి చూచుచుండఁగా
నారదుఁ డేఁగుదెంచె గగనంబుననుండి సురేంద్రమందిర
స్ఫారవిలాస[2]హాసి యగుపార్థుగృహంబునకుం [3]బ్రియంబునన్.

24 క తనపిలుఁద ధర్మసంబో,ధనవాంఛను వచ్చుదేవతాఖచరమహా
మునివరులఁ దపనమార్గం,బునఁ గ్రమ్మఱఁబంచె బ్రహ్మపుత్త్రుఁడు నెమ్మిన్.

25 వ. [1]పర్వతపారిజాత రైవత [2]సుముఖు లనుమహామునులతో నిట్లు వచ్చిన నారద మహామునికిం బ్రత్యుద్గతుండయి ధర్మ[3]రాజు దమ్ములుం దానును [4]నమస్క రించి తోడ్కొనితెచ్చి యున్నతాసనంబున నునిచి యడుగులు గడిగి యర్ఘ్య

పైంగో వరాహః శునకః శాండిల్యశ్చ మహాతపాః
కర్కరో వేణు జంగశ్చ కలాపః కఠపతచ.
మునయోధర్మ సహితా ధృతాత్మానోజితేంద్రియాః
ఏతేచాన్యేచ బహవో వేదవేదాంగ పారగాః. 2—4—8—16.

22 1. లబ్ధాశీర్వచనుండై — పెక్కు ప్రతులలో లేదు 2. బున్నంత — అ.ఆ.ట.చ పి.

23 1. మించి — ఎ. 2. భాసి — ఉ ఊ.ట.గ.భాసం. 3. బ్రియంబుతోన్—అ.ఇ.ప. ఘ.జ.ఝ.ల.

25 1. పారిజాతేన రాజేంద్ర రైవతేనచ ధీమతా। సుముఖేనచ సౌమ్యేన అని మూలము భం. 2—5—9 2. సుమంతప్రముఖులైన — కొన్ని ప్రతులు. 3. తనయుండు — కొన్ని ప్రతులు. 4. నెదురవోయి నమస్కరించి — అ.ఆ.ఇ.ఎ.ఏ.ఒ.క.ణ.పి శ.ష

పాద్యాది విధులం బూజించిన [5]వారల కుశలం బడి[6]గి నారదుండు రాజనీతి విషయంబుల నయ్యుధిష్ఠిరు [7]నిట్లని యడిగె.

-: నారదుండు ధర్మరాజును రాజనీతివిషయములం గొన్నిటి నడుగుట :-

సం. 2–5–7

26 సీ. మీవంశమున నరదేవోత్తములు[1]దైన సద్ధర్మమార్గంబు నలుపుదయ్య
ధర్మవిదుండవై [2]ధర్మార్థకామంబు లొండొంటి బాధింపకుండ నుచిత
కాలవిభక్తముల్ [3]గా లీలసేవింతె ధర్మమునందు చిత్తంబు నిలిపి
[4]యిమ్ముల నపరరాత్రమ్ములం దెప్పుడుం జింతింతె నిజబుద్ధిం జేయందగిన

ఆ. రాజకృత్యములం దిరంబుగా నిఖిలని, యోగవృత్తులందు యోగ్యులయిన
వారిం గరము గౌరవమ్మునం [5]బంచితె, నీవు వారిదైన నేర్పెఱింగి.

27 క. అనఘుల శాస్త్రవిధిజ్ఞుల, ననురక్తులం బితృపితామహక్రమమున వ
చ్చిన విప్రుల మంత్రులంగా, నొనరించితె కార్యసంప్రయోగము [1]పొందెన్.

28 క. [1]రాజునకు విజయమూలము, రాజిత[2]మంత్రంబు [3]సుస్థిరంబుగ దానిన్
[4]రాజాన్వయ రక్షించితె ధర, రాజనులకుం గర్ణగోచరము గాకుండన్.

నెదురువచ్చి నమస్కరించి — జ.ల. 5. వారి — కొన్ని ప్రతులు 6. గినయ నంతరంబ — క ఖ.డ. 7. నకిట్లనియె — పెక్కు ప్రతులు.

26 1. రీతి — ఇ. 2. ధర్మకామంబులొండొంటిని — సం. 3. గాంజేసి — ఔ.చ.జ.ణ. వా.వీ శ ష ; గ్రాలంగ — ఓ.ల ; గాలిల — ఏ.వీ. 4 యిమ్ముల నపరరాత్రంబులం దెప్పుడు — ణ 5. బనుపుదె — ఉ.ఝ.ల.వీ ; బనుపుదెనెమ్మివారి — స.

27 1. లందున్ — వ ; నొందెన్ — స

28 1. రాజులకు — కొన్ని ప్రతులు. 2. తంత్రంబు — ఇ సిం.సూ. 3. సుస్థిరంబున — ఈ.ఓ.ఛ జ.వా, 'కార్యమెట్టిదియు గాసియూ మంత్రంబు, దలప నొరుల నెవ్వలు సిలికె నేని, కాన నాల్గు నెవ్వల నూసంగ రక్షింప, వలయు నెఱుక గల్గువారు ధరణి: — ఈ పద్యము సకలనీతిసమ్మతమున (690) సభాపర్వములోనిదని కలదు. కాని యిది యే ప్రతియందును కానరాలేదు. ఈసందర్భమున నుండం దగును. 4. రాజోత్తమ—ఈ ఐ.

29 క. ధీరుఁ[1]డు ధర్మాధర్మవి, శారదుఁడు బహుశ్రుతుండు సమచిత్తుఁడు వా
ణీరమణీ[2]శ్రితవదనస, రోరుహుఁ డనఁ [3]జనునె నీ పురోహితుఁ[4]డధిపా.

30 క. జన[1]వర నీయజ్ఞములం, దనవరతనియుక్తుఁ డయిన [2]యాజ్ఞికుఁడు ప్రయో
గనిపుణుఁడై యేమఱకుం,డునె [3]నిజకృత్యముల నెప్పుడును సమబుద్ధిన్.

31 క. నానా[1]విధరణవిజయ మ,హానిపుణు లవార్యవీర్యు లనఁ[2]దగువారిన్
సేనాధ్యక్షులఁ [3]జేసితె,నీనమ్మిన[1]వారి మాననీయుల హితులన్.

32 చ. [1]కడుఁ జనువాఁడునై పురుషకారియు దక్షుఁడునై నమంత్రి పెం
పడరఁగ రాజపుత్త్రుల మహాధనవంతులఁ జేసి వారితో
[2]నొడఁబడి పక్ష మేర్పడఁగ నుండఁడుగా ధన మెట్టివారికిం
గడుకొని చేయకుండునె జగన్నుత గర్వము దుర్వ్యమోహముల్.

33 క. క్షితినాథ శాస్త్రదృష్టి, ప్రతిభను దివ్యాంతరిక్షభౌమోత్పాత
ప్రతికారు లగుచు సన్మా,నితులయి వర్తింతురయ్య నీ దైవజ్ఞుల్.

34 క. అనిశము సేవింతురె ని,న్ననఘా యష్టాంగ మైనయాయుర్వేదం
బున దక్షులైన వైద్యులు, ఘనముగ ననురక్తులై జగద్ధితబుద్ధిన్.

29 1. ఉదారుడు ధర్మ విశారదుడు — ఈ.
తన యింటిచేటు పరులకు
వినిపింపగఁ దగదు కార్యవేళనె తక్కన్
వినగఁ బురోహితుఁ డర్హుఁడు
విని చక్కం జేయు దనదువిద్యామహిమన్.
ఈపద్యము సభాపర్వమందలిదిగా సకలనీతి సమ్మతములో (318) కలదు. కాని యిది యే ప్రతియందును కానరాలేదు. ఈ సందర్భమున నుండఁ దగును. 2. యుత — ఊ. 3. దగునె — సిం. పెక్కు ప్రతులు. 4 డనఘా — క.ఖ.ఝ.డ.స.

30 1. నుత — సిం. పెక్కు ప్రతులు 2. యాజకుడు — వ 3. బహు — వ.

31 1. వితరణ — ఘ.ఝ.ణ శ.ష. 2. జనువారిన్ — వ. 3. జేయుదె — ఎ. 4. వారి లోన నెయ్యుల హితులన్ — ఓ.

32 1. కులీనాశ్చాను రక్తాశ్చ కృతాస్తే వీరమంత్రిణః. అని మూలము భం. 2-5-16.
2. నొడబడ — అ.ఊ.ఎ.ఏ.ఔ.ణ ; నొడబడనిష్ట — ఐ.

35 క. సారమతిఁ జేసి మానస, శారీర[1]రుజావళులకు సతతంబుఁ బ్రతీ
కారములు సేయు చుండుదె, [2]యారఁగ వృద్ధోపసేవ నౌషధసేవన్.

36 క. [1]ఉపధాశుద్ధులఁ బాప, వ్యపగతబుద్ధుల [2]వినీతి[3]వర్తుల సములన్
[4]సుపరీక్ష నియోగించితె, నిపుణుల నర్థార్జనాదినృపకార్యములన్.

37 ఉ. ఉత్తమమధ్యమాధ[1]మనియోగ్యత బుద్ధి నెఱింగి వారి న
య్యుత్తమమధ్యమాధమనియోగములన్ నియమించితే నరేం
ద్రోత్తమ భృత్యకోటికి ననూనముగాఁ దగు[2]జీవితంబు లా
యత్తము సేసి [3]యిత్తె దయ నయ్యయి కాలము దప్పకుండఁగన్.

38 క. తమతమకనియెడుతఱి జీ, తము గానక నవయు[1]భటులదౌర్గత్య [2]విషా
దము లేలినవాని కవశ్యము నెగ్గొనరించు నతఁడు [3]శక్రుండైనన్.

39 క. [1]కులపుత్రులైన సద్భృత్యులకును సత్కార మర్థితోఁ జేయుదె వా
రలు నీప్రస్తవమునని, మ్ముల [2]గృతము దలంచి ప్రాణములు విడుతురనిన్.

35 1. రుజావళికిని — ఓ. 2. యారయ — పెక్కు ప్రతులు.

36 1. ఉపగతశుద్ధులు బాప
వ్యపగతబుద్ధులు వినీతి వంతుల — అనం. 2. వినీతివంతులు — గణ. 3. వంతుల — పెక్కు ప్రతులు. 4. సపరీక్ష — సిం.

37 1. ముల — స.ల ; మనియోగత (?) — అ.గ. 2. వైభవం — ఎ. 3. యిచ్చెదవె—ణ.

38 1. బంట్ల — ఇ. 2. విచారము — ఖ.ట. 3. శక్తుండైనన్ — వ.

39 1. కులభృత్యులైన — పెక్కు ప్రతులు. కాని మూలమున, 'కులపుత్రాః' అని కలదు. శం. 2-5-40. 2. గృతములు దలచి — అ.ల ; గృత్యముదలచి — సిం

40 క. [1]అనఘా నీ ప్రస్తవమున, నని నీల్గిన వీరభటుల[2]యనుపోష్యుల నె
ల్లను బ్రోతె భోజనాచ్ఛా, దనముల వారలకు [3]నెమ్మి దఱుఁగక యుండన్.

41 క. [1]ధనలుబ్ధుల ముచ్చులఁ గూ, ర్పని [2]వారలఁ బగఱ వలనివారల ధృతి చా
లనివారల దుర్జనులం, బనుపవు[3]గా [4]రాచకార్యభారము [5]దాల్పన్.

42 క. చోరభయవర్జి[1]తముగా, ధారుణిఁ[2]బాలింతె యధికధనలోభమునం
జోరుల రక్షింపరు[3]గా, వారలచే ధనముగొని భవద్భృత్యవరుల్.

43 క. ధరణీనాథ భవద్భుజ, పరిపాలిత[1]యైనవసుధఁ బరిపూర్ణము లై
కర మొప్పుచున్నె చెఱువులు, ధరణి కవగ్రహాభయంబు [2]దనుకక యుండన్.

40 1. ప్రాణమిచ్చియు రణమునఁ బ్రతికెనేని
నతని రక్షించుఁ దనకొఱకైన రాజు
శూర వృత్తిని మోక్షంబు సూరగొన్న
వారి వారల బ్రోవంగ వలయుఁ గాని
జనపతి ప్రాణము లిచ్చిన
జనువారలఁ బ్రోవకున్న సత్యము పాపం
బునఁ బొరయు వారి బ్రోచిన
తనవారిని బ్రోచు మీఁద దైవము కరుణన్.
ఈ రెండు పద్యములును సకలనీతిసమ్మతమున సభాపర్వమునందలివిగా గలవు. (428, 429) కాని యివి యే ప్రతియందును గానరాలేదు. ఈ సందర్భమునందుండఁ దగును. 2. కగు పుత్త్రుల — వ ; యప్పుత్త్రుల — ఓ; యనుగు జనుల — సిం. 3. నేమి — ఐ.ట.వ.

41 1. ధనవృద్ధుల (బుద్ధుల) [?]—సం. 2. ఈపద్యమంతటను 'వారిని' అను రూపము 'వారల' అనుదాని స్థానమున పెక్కు ప్రతులందు గలదు ; వారిని ప్రీతిలేని ; వారి ప్రియము సాలని — చ. 3. గద — ఉ ఏ.ఘు.ణ.ల.శ. 4. రాజకార్యభారము — ట.ణ.ల.వి ; రాజు కార్యభారము — ఆ. 5. దీర్పన్ — ల.శ.ష.స ; బూనన్ — ఓ

42 1. తంబుగ — ఓ.ఔ.ఘు.ణ.ల. 2. రక్షింతె — పెక్కు ప్రతులు. (పూర్వమందర్ధానుస్వారలోపము). 3. గద — ఔ.ల.స.

43 1. మైన — సిం. పెక్కు ప్రతులు. 2. దాఁకకయుండన్ — ఓ.ల.స; దలగుచునుండన్ — ఊ. స; దగులకయుండన్ — ఎ గ స.సిం.

44 క. [1]హీను లగుకర్షకులకును, భూనుత [2]ధాన్యంబు బీజములు వణిజులకున్
మానుగ శతైకవృద్ధి న,నూనముగా [3]ఋణము లిత్తె యుత్తమబుద్ధిన్.

45 క. [1]పంగుల మూకాంధుల విక,లాంగుల[2]ను నబాంధవుల దయం బ్రోతె [3]భయా
ర్తుం గడిఁదిశత్రునైనను, [4]సంగరరంగమునఁ గాతె శరణం బనినన్.

46 క. కృత మెఱిఁగి కర్త నుత్తమ, మతుల[1]సభల [2]సంస్తుతించి మఱవక తగున
త్కృతి సేయుదె కృత మెఱిఁ[3]గెడు, పతియె జగ[4]జ్జనుల నెల్లఁ [5]బరిపాలించున్.

47 సీ. ఆయంబునందు [1]నాలవభాగ మొండె [2]మూఁడవభాగ మొండె [3]నం దర్ధమొండె
గాని మిక్కిలి సేయఁ గాదు [4]వ్యయం బని యవధరించితె బుద్ధి నవనినాథ
[5]యాయుధాగారధనాఢ్యతములయందు వరవాజివారణావళులయందు
[6]బండారములయందుఁ బరమవిశ్వాసుల భక్తుల [7]దతులఁ బంచితయ్య

ఆ. గురుల[8]వృద్ధ [9]శిల్పివరవణిగ్బాంధవ, జనుల నాశ్రితులను సాధు[10]జనులఁ
గరుణఁ బేదఱికము వొరయ కుండఁగఁ బ్రోతె, సకలజనులు నిన్ను సంస్తుతింప.

48 క. వలయు నమాత్యులుఁ జుట్టం,బులు [1]మూలబలంబు రాజపుత్త్రులు విద్వాం
సులు బలసి యుండ [2]నిచ్చలుఁ, గొలువుండుదె లోకమెల్లఁ [3]గొనియాడంగన్.

44 1. హీనులకుగర్షకులకు — ఓ స; హీనులకుంగర్షకులకు, భూనుత — సిం. 2. ధన ధాన్య — బొ; ధాన్యములు — ల.వీ. 3. ధన — స. కొన్ని ప్రతులు.

45 1. పంగులు మూకాంధులు వికలాంగులు నగు బాంధవుల — గ.ఘ ఝ.డ.శ ష 2. దగు బాంధవులను దగ — ణ. 3. భయార్తుం — ష 4 సంగరమున గాతె. నీవు — ఘ.చ; సంగరమున నీవుగాతె — వ.

46 1. ను సభ సంస్తుతించి—ఇ.ఉ. 2. సంస్తుతింతె— ఉ.ధ జ ణ.ల. 3. గిన—ఉ.ల. 4. జ్జనము — ఎ.ఒ.ఓ.బొ.చ.డ.ణ ల 5. బ్రతిపాలించున్— ఇ ఉ.ఊ.ఎ.ఐ ఓ.ఝ

47 1. నాలగు — స; నాల్గవ — ఇ.ణ.ల; నాల్గగు — వ. 2. మూడగు — అ.ఇ. ఉ.ఝ; మూడవు—బొ. 3. దదర్థమొండె — ఆనం 4 వ్రయంబని — పెక్కు ప్రతులు. 5. యాయుధద్వార — గ.చ జ. 6. బండారముల — పెక్కుప్రతులు; బండరువుల — గ.స. 7. హితులను బనిచితయ్య — ఝ. 8. బ్రభుల — ణ. 9. విప్ర—అ.ఖ.గ; విప్రకుల—ఉ; సచివ—ఊ; జనుల—చ. 10 హితుల — ఓ.

48 1. పరిహాసికులు—చ. 2. నిత్యము—ఖ.డ. 3. గొలువగ నిన్నున్—సిం. పెక్కు ప్రతులు.

49 క. [1]పరికించుచు బాహ్యాభ్యంతర[2]జనములవలన సంతతము నిజరక్షా
పరుఁడ వయి పరమహీశుల, [3]చరితము వీక్షింతె [4]నిపుణచరనేత్రములన్.

50 క. వెలయఁగ విద్వజ్జనము,ఖ్యులతోడ నశేషధర్మకుశలుఁడ వయి యి
మ్ముల లోకవ్యవహార,మ్ములు దయఁ బరికింతె నిత్యమును సమబుద్ధిన్.

51 ఆ. వార్త[1]యంద జగము వర్తిల్లు [2]చున్నది, యదియు లేని[3]నాఁడ యఖిలజనులు
నంధకారమగ్న లగుదురు గావున, వార్త నిర్వహింపవలయుఁ బతికి.

52 ఆ. దారసంగ్రహంబు ధరణీశ రతిపుత్త్ర,ఫలము [1]శీలవృత్తఫలము శ్రుతము
దత్తభుక్తఫలము ధనము వేదము లగ్ని,హోత్రఫలము [2]లనియు నొగినెఱుంగు.

53 చ బహుధనధాన్యసంగ్రహము బాణశరాసనయోధవీరసం
గ్రహము నిరంతరాంత[1]రుదకంబు[2]లు ఘాసరసేంధనౌఘసం
గ్రహము ననేకయంత్రములుఁ గల్గి యసాధ్యములై ద్విషద్భయా
[3]వహు లగుచుండ నొప్పునె భవత్పరి[4]రక్ష్యము లైన దుర్గముల్.

54 చ. వదలక బుద్ధి [1]నంతరరివర్గము నోర్చి జితేంద్రియుండ వై
మొదలన దేశకాలబలముల్ మఱి దైవబలంబుఁ గల్గి భూ
విదిత[2]బలుండ వై [3]యహితవీరుల [4]నోర్వఁగ నుత్సహింతె దు
ర్మద [5]మలినాంధచిత్తులఁ బ్రమత్తుల నింద్రియనిర్జితాత్ములన్.

49 1. పరికింపఁగ – భాసం. 2. ములలోపలననారతమునిజ — సిం. 3. చరితలు — ఓ.ల ; చరితల్ — క.గ. 4. గూఢచర – ఉ.స ; నీవుచర – ఐ.

51 1. యందు – భాసం. పెక్కు ప్రతులు. 2. గావుననదియు — ఆ.ఝ. 3. నాడున — కొన్ని ప్రతులు.

52 1. వృత్తశీల – కొన్ని ప్రతులు. 2. లనుచు – ఎ.ల.

53 1. రశరంబులు – ఉ ; రవనంబులు – ఊ. 2. నుఁజాలగ నింధనంబు సంగ్రహము — సిం. 3. వహములనంగ – డ ణ.ల స.సిం పెక్కు ప్రతులు. 4. రక్షములైన — పెక్కు ప్రతులు ; రక్షణమైన — ఝ.

54 1. నాత్మరిపువర్గము — అ.ఓ.శ.ష. 2 యశుండవై —అ.ఓ.ఘ. 3. యితర — క.ఖ. 4. నోర్పగ — సూ. 5. మదనాంధ — ల ; మలినాత్మవృత్తుల — చ ; మలినాత్మబుద్ధుల – ఝ.

55 తే. కడిఁది [1]రిపులపైఁ బోవంగఁ గడఁగియున్న, నీకు ముందఱఁ జని రిపు[2]నృపుల యందు
పగిలి సామాద్యుపాయంబు లొగిన[3]సంప్ర, యోగమునఁ జేసి వర్తిల్లు[4]చున్నె చెప్పుమ.

56 వ. మఱియు నాస్తిక్యం బనృతంబు ప్రమాదం బాలస్యం [1]బనర్థజ్ఞులతోడి చింత నంబు [2]క్రోధంబు దీర్ఘచింత దీర్ఘసూత్రత యెఱుకగలవారి నెఱుంగమి యర్థంబులయం దనర్థకచింత నిశ్చితకార్యంబులు సేయమి మంత్రంబుల రక్షింపమి శుభంబులఁ బ్రయోగింపమి విషయంబులం దగులుట యనం బరగిన పదు నాలుగు రాజదోషంబులఁ బరిహరింతె యని యడిగిన నారదునకు ధర్మరా జిట్లనియె.

—: *ఇట్టిసభ నెచ్చటనైనఁ జూచితిరా యని ధర్మజుఁడు నారదునడుగుట* :—

సం. 2_6_8

57 తే. నాయథాశక్తిఁ జేసి యన్యాయపథముఁ, బరిహరించి మహాత్ములచరితలందు
[1]బుద్ధినిలిపి మీయుపదేశమున శుభంబు,లయినవాని ననుష్ఠిం[2]తుఁ బ్రియముతోడ.

58 వ. అని కృతాంజలి యయి మునీంద్రా యీత్రిలోకంబులయందును [1]మీచూడ నివి లే వెందే నిట్టి [2]యపూర్వంబైన సభ చూచి యెఱుంగుదురే యని మయ నిర్మితం బయిన సభ చూపినం జూచి విస్మితుం డయి నారదుండు ధర్మరాజున కిట్లనియె.

---

55 1. శత్రులపై బోవగడగి — ఉ.డ వీ ; వీరులపై బోవగడగి — ఘ. 2. నృపతులందు — ఔ.క.ఖ.డ.ణ. 3. నీప్రయోగమున — ఊ.ఔ.క ఖ.గ.ఘ.చ.ణ ; నీతియోగమున — ఎ.ల. ; విప్రయోగమున — అ.ఇ.ఉ.ఓ. 4 చుండునయ్య — ఇ.ఔ.ణ.

56 1. బనర్థకచింత — అని పెక్కుప్రతులు. అనర్థజ్ఞైశ్చచింతనమ్ అని మూలము. భం. 2-5-97. 2. వృథాక్రోధంబు — ఉ ; చిరక్రోధంబు — ల.

57 1 మనసు నిలిపి — భాసం. 2. తునసుదినంబు — ఉ.గ.ల.స.

58 1. మీరు చూడనివి — ఇ.ఈ.ఔ.క.చ.జ.ఝ. 2. యపూర్వంబయిన — పెక్కుప్రతులలో లేదు. మూలమునందును లేదు. భం. 2_6_8.

59 క. భూనాథ యిది యపూర్వమ,మానుషము విచిత్రరత్నమయ మిట్టిసభల్
మానవలోకేశ్వరులం, దేనెన్నఁడుఁ [1]జూచి వినియు నెఱుఁగ ధరిత్రిన్.

60 క. సురపతి యమ వరుణ ధనే,శ్వర కమలాసనులదివ్య[1]సభ లెల్ల నరే
శ్వర చూచితి నవి దీనికి, సరి[2]గా వత్యంతవిభవ [3]సౌందర్యములన్.

61 వ. అనిన విని యవి యెట్టివి వాని వినవలతు నాన[1]తిం డని లోకపాలసభా[2]విభవ
శ్రవణ[3]ప్రభూత[4]కుతూహల [5]చేతస్కుండై యడిగిన ధర్మరాజునకు నారదుం
డిట్లనియె.

—: *ఇంద్రసభా వర్ణనము* :—

సం. 2—7—1

62 క. శతముఖుసభ శుభరత్నాం,చితకాంచన[1]రచిత మతివిచిత్రము లోక
త్రితయాఖిల లక్ష్మీసం, శ్రిత మలవియె దానిఁ బొగడ శేషున కయినన్.

63 వ. అది[1]యును నూఱుయోజనంబుల వెడల్పును [2]నూటయేఁబది యోజనంబుల
నిడు[3]పును [4]నేను యోజనంబుల తనర్పునుం గలిగి వైహాయసంబయి కామ

59 1. జూడ - పెక్కు ప్రతులు.

60 1 సభలను నఖలేశ్వర — ణ. 2. రా — ఏ.భాసం. 3 సౌందర్యమునన్—చ.సం.

61 1. తిమ్మని — అ.ఆ ఇ ఘ. 2. విభవ - పెక్కు ప్రతులలో లేదు. 3. ప్రభూత—
పెక్కు ప్రతులలో లేదు. 4. కుతూహలపరుండై — ఇ.ఊ.ణ ; కుతూహలాయత్తచేత
స్కుండై— జ వీ శ.ష ; 5. పూరితచేతస్కుండై — ల ; చిత్తుండై —ఝ.

62 1. రమ్య — ఛ ల.

63 1. యును — కొన్ని ప్రతులలో లేదు. 2. నూటడెబ్బది — యని పెక్కు ప్రతులు.
కాని మూలమున శతమధ్యర్థ మాయతా ॥ భం. 2_7_2 అని కలదు. 3. పు నయిదు
యోజనంబుల—[?]శ. 4. ప్రతులలో నేనూరు నెనుబది అని పాఠ భేదములు కలవు.

గమనంబయి [5]వ్యపేతశీతాతపంబయి సకలకాలకుసుమఫల[6]భరిత[7]పాదపవన సంకీర్ణ సరోవర విరాజితం బయి తపఃప్రభావంబున నమరేంద్రుచేత నిర్మితం బయి కరం బొప్పుచుండు నట్టిసభయందు.

64 చ. అతులవిభూతితో మణి[1]మయాభరణద్యుతు లొప్పఁగా శత
క్రతుఁడు శచీసమేతుఁ డయి కాంచనచారువిమానమాలికా
గతదివిజోత్తముల్ గొలువఁగాఁ గొలువుండు [2]వరాప్సరోంగనా
యతవిలసత్కటాక్ష[3]కుసుమార్చిత సుందర[4]వక్త్రచంద్రుఁడై.

65 వ. [1]మఱియును.

66 సీ. వదలక యేలినవాని ప్రస్తవమునఁ బోరిలో నీల్గిన వీరభటులుఁ
దమకులధర్మముల్ దప్పక[1]సలిపిన గృహమేధులును జగన్మహితకీర్తిఁ
బరగినధన్యులుఁ బరహితవ్రతులైన పురుషులు [2]రుగ్జరామరణశోక
భయ[3]బుభుక్షార్తి పిపాసావ్యపేతులై కొలుతురు సురరాజు నొలసి యర్థ

ఆ. ధర్మకామములు సదక్షిణ[4]క్రతువులు, శ్రీవిలాసములు విశేష[5]యజ్ఞ
వాహమంత్రతతులు వచ్చి[6]సేవింతురు, మూర్తి[7]మంతులగుచు ముదముతోడ.

కాని మూలమున పంచయోజనముచ్ఛ్రితా యని యున్నది భం. 5. వ్యపగత — ఇ.ఊ.ఐ.జ, వ్యపేతశీతాతపవాతవర్షంబయి — ఉల; వ్యపేతశీతాతపప్రపంచంబయి — ణ. 6. భరితంబయి — ఇ.ఊ ఎ.ఏ ఘ.జ; భరితంబయిన — అ ఆ.ఒ. ఝ. 7. పాదపాకీర్ణ — ల; పాదపవనాకీర్ణంబయి — అ.ఇ.ఉ ఔ క.గ.చ.ష; పాదపవనాపూర్ణ — ఝ; పాదపవన సరోవర — ఐ

64 1. మయాద్యుతులెంతయునొప్పగా — ఝ. 2. వరాంగనాప్సరా — ఇ; వరాప్సరాంగనా — ఆ ఉ.ఏ ఐ.క.ఖ.గ.ఘ; వరోత్సవాంగనా — ఎ. 3. కుసుమాంచిత — ఘ.వ; కుసుమాక్షత — ణ. 4. చారువక్త్రుడై — అ.

65 1. ఈవచనము పెక్కు ప్రతులలో లేదు.

66 1. నడిచిన — ఒ ఔ.ణ వీ శ ష; నడచిన — ఇ ఘ.వీ; సలిపెడు — ఆ ఒ క.ఖ.డ.ల 2. రుజజరా — ఖ ణ. 3. బుభుక్షాది — శ.ష.స. 4. క్రతువులశేషయజ్ఞదానశీలములును వరుసమంత్ర — అ ఏ ఔ.ణ. 5. హవ్య — ఎ.ల.స. 6. సేవించును — ఐ ఒ ఔ.ల.వీ.శ.ష.స. 7. వంతములై — పెక్కు ప్రతులు; మంతములై — వీ.ష.

67 వ. మఱియు శుక్రబృహస్పతులు [1]నగ్నిషోములు [2]నాశ్వినులును విశ్వదేవత[3]లును ధాతయు విధాతయు [4]హరిశ్చంద్రుండను రాజర్షియు సురేంద్రసభ నుండుదురు.

-: యమసభా వర్ణనము :-

సం. 2–8–1

68 క. ధర్మసభ లోకధర్మా, ధర్మవివేకాస్పదంబు తై జనము లస
ద్ధర్మమణితతుల దానిన్, నిర్మించెను విశ్వకర్మ నిపుణత[1] యొప్పన్.

69 వ. అది శత యోజనవిస్తా[1]రాయామరమణీయంబును గామ[2]గామియును [3]సూర్యతేజోనిభశుభతేజంబును [4]సర్వసుఖ[5]సంపాదనంబు నయి చూడ నొప్పుచుండు నట్టిసభయం [6]దగస్తిమతంగాదిసిద్ధమునులును బితృదేవతలును గాలకింకరులును మూర్తి[7]మంతు లైనకాలచక్రక్రతుదక్షిణ దిగ్దేవతలును [8]నుగ్రతపంబులును గృతవీర్య జనమేజయ జనక బ్రహ్మదత్త [9]పృషదశ్వ శంతను వైన్య

67 1. నగ్నిష్టోములు—అని పెక్కు ప్రతులలో గలదు ; అగ్నిష్ట్రోమనులు - క.ఛ.జ.ఝ. 2. నశ్వినులు – పెక్కు ప్రతులు. 3. లు విశ్వకర్మయు – అ ఉ ట.ఖ.చ.ల. ప్రతులలో మునులపేర్లుకూడ పేర్కొనఁబడినవి కాని పేర్లవిషయమున సామ్యములేదు మూలమున పెక్కు మంది ఋషులపేర్లు గలవు. 2–7–8 భం. 4 విశ్వకర్మయు విశ్వావసు చిత్రసేనులును విద్యాధర గంధర్వాది దేవయోనులును హరిశ్చంద్రుండను రాజర్షియు వరాహకర్ణ కాలనేమి హోమనేత్ర గరుడ కంఠ మాణి భద్ర విభీషణ పింగళ కాదులైన యక్షులును (యక్షిణులును?) నలకూబరుండును నూర్వశియు తిలోత్తమా ఘృతాచీమేనక రంభా ప్రభృతులయిన యప్సరసలును సేవింతురెప్పుడు నేమును ననేక ఋషి గణంబులతో నరిగి చూచుచుండుదుము – ఓ.

68 1. వెలయన్ – అ ఆ ఇ ఊ.ఓ.ఔ.ఖ.ఘ.స; మెరయఁగ – క.గ.డ.ల.స.

69 1. రాయత – క ఖ; 2. గమనంబును – ఆ.ఉ.క.ఖ. 3. సూర్యనిభతేజంబును – ఐ.ల.వీ.శ.ష.స 4. వ్యపేతక్షుత్పిపాసా జరాశోకభయంబును శీతోష్ణ దైన్యకార్పణ్య రహితంబును బహురసవద్భక్ష్య భోజ్యపరిపూతంబును . . అను నధిక పాఠము ఓ.చ. ప్రతులలో గలదు. 5. సంపత్ప్రదంబునై – ఐ.ణ.వీ.శ.ష.స. 6. దగస్త్య – పెక్కుప్రతులు. 7. వంతంబులైన – పెక్కుప్రతులు. 8. నుగ్రతపంబులును – పెక్కుప్రతులలోలేదు. మూలమునను లేదు. 9 బృహదశ్వ - అని కొన్నిప్రతులు – పృషదశ్వ – రుషదశ్వ – భం. 2–8–13. పి.పి.ఎస్ 2–8–14.

భూరిద్యుమ్నేంద్రద్యుమ్న [10]మన్మథ మధుకంఠోపరిచరులును [11]పిజన కుం డయిన పాండు[12]మహారాజును నాదిగాఁ గల యనేక[13]రాజ [14]ఋషు[15]లు నుండురు వీరిచేత ననవరతం[16]బు సేవితుండయి [17]యమరాజు సమస్తజీవుల శుభాశుభకర్మంబు లారయుచుండు.

—: వరుణసభా వర్ణనము :—

సం. 2—9—1

70 క. [1]వరుణసభ సర్వలోకో, త్తర ముజ్జ్వలమణిమయము సితప్రభ [2]మతిసుం
దర మందుండు వరుణుఁడును, వరుణానీసహితుఁడై [3]ధ్రువంబగు మహిమన్.

71 వ. అది [1]యమరాజు సభయంతియ విస్తారాయామ [2]రామణీయకంబులును గామ గామిత్వంబునుంగలిగి విలసిల్లు జలస్తంభంబుసేసి జలంబులలో నుండి విశ్వకర్మ దాని [3]రమణీయంబుగా [4]రచియించె.

72 సీ. అందు సుఖాసీనుఁడైన యప్వరుణేంద్రు [1]నంబుధుల్ నాల్గును [2]నధికభక్తిఁ
గాళింది నర్మద గంగ గోదావరి [3]విదిశ విపాశ కావేరి [4]కృష్ణ
వేణి సరస్వతి [5]పెన్న హైరావతి యనఁగఁ బ్రసిద్ధంబు లయిననదులు
సరసీ తటాక నిర్ఝర దీర్ఘికాదులు దిక్కులు [6]నఖిలధాత్రీధరములు

10. మన్మథ అనునది క.ఘ. ప్రతులందును మూలమునను లేదు. 11. భవజ్జనకుం డయిన — పెక్కుప్రతులు. 12. మహా — పెక్కు ప్రతులలో లేదు 13. రాజర్షి దేవర్షులచేత — ఎ. 14. ర్షిగణంబులచేత — ఔ. 15 లచేత — పెక్కు ప్రతులు. 16 బును — ఎ.ఐ ఔ.ఖ.చ.ఝ.ఞ.ల. 17. యమధర్మరాజు — ఇ.ఘ.ఛ.ఝ ల.

70 1. వరుణుని సభయును ... ... మణిమయంబునాత్తత నతిసుం — ఇ; వరుణపురి — తి 2. నతిసుం—అ ఉ ఒ.ఘ.వ 3. ధ్రువంబుగ — ఆ ల ; ధ్రువంబుగ నెమ్మిన్—కవి తి.

71 1. సురరాజు — స. కాని మూలమున ప్రమాణేన యథాయామ్యా అనికలదు భం. 2—9—1. 2. రమణీయంబును — పెక్కుప్రతులు 3. రమ్యంబుగా — కొన్ని ప్రతులు. 4 నిర్మించె — పెక్కుప్రతులు.

72 1. నంబుధులేడు — ఉ.చ.ల కాని, సముద్రాశ్చత్వారో — అని మూలము భం. 2—9—18 2. నతుల — వ. 3. పెక్కుప్రతులలో విదిత యని యున్నది. కాని మూలమున విదిశాయని కలదు. భం; 3—3—18. 4. కృష్ణవేణ్ణా—భం; కృష్ణవేణీ – పి పి.ఎస్. భాసం. 5. పెన్న — మూలము కాళిందీ విదిశావేణ్ణా 2—9—19 అని కలదు. వేణ్ణకు తద్భవము పెన్న అని భాసం. ఉ. 6. నధిక — పెక్కు ప్రతులు. కాని తథా

ఆ. [7]వసుమతియును [8]దేహవంతంబులై వచ్చి, మకర కూర్మ శింశుమార సింహ
శరభ సామజాది జలచర స్థలచర, తతులతోడ సంతతంబుఁ గొలుచు.

73 వ. మఱియు [1]వాసుక్యైరావతాది నాగరాజులును [2]ప్రహ్లాద విరోచన బలి నరక
నముచి విప్రచిత్తి [3]కాలకంఠ కైటభ ఘటోదర దశగ్రీవ విశ్వరూప విరూపా
క్షాదు లయిన దైత్యదానవవరులును వరుణు[4]సేవించు చుండుదురు.

-: కుబేరసభా వర్ణనము :-

సం. 2-10-1

74 క. ధనదుసభ యింద్రసభతోఁ, నెన యగుచు మహావిభూతి నెంతయు నొప్పుం
దన[1]దివ్యశక్తి నాతం, డొనరఁగ నిర్మించె దాని నుత్తమమణులన్.

75 వ. అదియును నూఱుయోజనంబుల[1]నిడుపును డెబ్బదియోజనంబుల వెడల్పునుం
గలిగి [2]సితప్రభం బయి [3]గగనచరం బయి కనకమయతరులతాలంకృతం బయి
తటిల్లతా[4]విచిత్ర[5]శరదంబుదంబు ననుకరిం[6]చు చుండు.

76 క. అందుఁ గుబేరుఁడు పరమానందంబున నుండు ధర్మనందన విలస
న్మందార పారిజాతక, [1]నందన మందానిలాభినందితుఁ డగుచున్.

సర్వేమహీధరాః అని మూలము భం 2-9-22. 7. మహియు నమలమూర్తి
మంతంబులై — వీ శ.ష స 8. మూర్తివంతంబులై — కొన్నిప్రతులు.

73 1. ఇంతకంటె నధికముగా నాగరాజులపేర్లు మూలమునఁగలవు. 2. ఇందు పేర్కొనఁ
బడిన పేర్లన్నియు మూలమునఁ గలవు భం. 2-9-8 . నముచి — పేరుమాత్రము
మూలమున లేదు 3. కాలఖంజ అని మూలము భం. 2-9-12. కాలఖంగళ్ళ
రూపాంతరము 4. సేవింపుచుండుదురు. అ.ఆ.ఈ.ఐ. ఔ.క.

74 1. విద్య — ఘ.

75 1. ఈకొలతలు భిన్నప్రతులలో భిన్నభిన్నముగ నున్నవి. కాని గృహీతపాఠము
మూలముననుసరించినది భం. 2-10-1. 2. వైహాయసంబై సిత — ఉ.ఐ.ల. 3. గగన
చరంబయి — పెక్కుప్రతులలోలేదు. 4. విచిత్రంబగు శరదభ్రంబు — ఆ.ఇ.ఈ.
ణ ల.వీ శ.ష 5. శారదాభ్రంబు — కొన్నిప్రతులు. 6. పుచుండు — అ.ఇ.ఈ.

76 1 చందనమందానిలాభిసంస్థితు డగుచున్ — ఛ.

77 వ. అతని ననవరతంబును నర[1]కిన్నరనాము లైన గంధర్వులును వరాహకర్ణ గజకర్ణ మాణిభద్ర హేమనేత్ర విభీషణ పింగళక ప్రవాళకాదు లయిన యక్షులును నలకూబరుండును నూర్వశీ [2]తిలోత్తమా ఘృతాచీ మేనకా [3]విభావరీ రంభా పరిభృతులయిన యప్సరసలును సేవింతు రే నెప్పుడు ననేకదేవర్షిగణంబులతో నరిగి [4]చూచు చుండుదు.

78 ఉ. వానికి నెయ్యుఁడై యమరవంద్యపదాంబుజుఁ డంబికాబృహ త్పీనపయోధరాగ్రపరిపీడితవక్షుఁడు భూషణీకృతా హీనుఁ [1]డశేషలోకగురుఁ డీశ్వరుఁ డెప్పుడు నందయుండు నా నా[2]నిశితాయుధాయుతసనాథమహాద్భుత భూతకోటితోన్.

:— బ్రహ్మసభా వర్ణనము :—

సం. 2—11—1

79 వ. [1]ఏను దొల్లి మనుష్యలోకంబునం[2]గొండొక కాలం బున్న నాకడకు సూర్యుండు వచ్చి పితామహుసభ వర్ణించినఁ దద్దర్శన [3]కుతూహలుండ నయి యాదిత్యు తోడ[4]న యరిగి యక్కమ[5]లగర్భుసభం జూచితి.

80 చ. దళితవిరోధి యిట్టి దని దాని[1]తెఱం గెఱుఁగంగ బ్రహ్మకుం గొలఁదిఁయె తా నవాఙ్మనసగోచర మద్భుతరూప [2]మీ వియ త్తల మను[3]కంబ [4]మొక్కటియ తాల్పఁగ సుస్థిరమై నిజప్రభా వళి [5]వెలుఁగించు చుండు శశివారిజమిత్రుల [6]మండలంబులన్.

77 1. కిన్నరాదులైన గంధర్వులును — అని కొన్ని ప్రతులు కాని కిన్నరానామ గంధర్వా నరా నామ తథాపరే — అని మూలము భం. 2—10—14. 2 తిలోత్తమా — మూల మునను లేదు 3 విభావరీ — పెక్కు ప్రతులలో లేదు. మూలమునను లేదు. 4. చూతుము — కొన్నిప్రతులు

78 1. డుసర్వ—ఘ. 2. నిశితాయుధోత్కరసనాథ—ఇ; నిశితోజ్జ్వలాయుధ—ఉ.క.ఖ.

79 1. వినుమేను — ల. 2. గొండికకాలంబు — భాసం. 3 కుతూహలపరుండనయి — ఝ.ల; కుతూహలాయత్తచిత్తుండనయి — ఏ.న. 4. నరిగి — పెక్కు ప్రతులు. 5. లభవు - ఉ,లానను — చ.

80 1. విధంబెరుగంగ — పెక్కుప్రతులు 2. మావియ — ఝ ఞ. 3 కంభ — అ అ.ఉ.ఒ ఖ ఘ.చ 4. మొక్కడయ — ఞ. 5. వెలిగింపు — ఇ ఖ.వా. 6. మండలంబునన్ — వా. కొన్నిప్రతులు; కాంతి చాద్పునన్ — ఆ ఇ.

81 వ. అం దనేక[1]విధజీవరాసుల [2]సృజియించుచు నధికతపస్వుల తపఃఫలంబులు విధించుచు విశ్వకర్తలైన మన్వత్రి మరీచి భృగు భరద్వాజ దక్ష వసిష్ఠ వాల ఖిల్య పులస్త్య పులహక్రతు కశ్యప గౌత[3]మాంగిరః ప్రచేతసులును జంద్రా దిత్యగ్రహనక్షత్ర గణంబులును [4]దేవగణంబులును వసురుద్ర సిద్ధసాధ్యులును [5]బ్రజావంతులైన పంచాశత్సహస్రమునులును నూర్ధ్వ[6]రేతసు లయిన యష్టా శీతిసహస్ర [7]మునులును [8]నాశ్వినులును విశ్వదేవతలును విశ్వకర్మయుం బితృ దేవతలునుం [9]దన్నుం [10]బరివేష్టించి యుండ ధర్మార్థ కామ మోక్షంబులును శబ్దస్పర్శరూప రసగంధంబులును [11]దపశ్శమ దమంబులును ధృతి[12]స్మృతి మేధా బుద్ధి క్షమాకీర్తులును[13]సంకల్పవికల్ప ప్రణవంబులును క్షణ లవ[14]త్రుటి కాష్ఠా ముహూర్తాహో[15]రాత్ర పక్షమాస ఋతు సంవత్సర యుగాత్మకంబైన కాల చక్రంబును ఋగ్యజుస్సామాథర్వణవేద వేదాంగంబులును బురాణేతిహాసంబు లును బహుప్రకార [16]భాషలును సమస్తవిద్యలును మూర్తిమంతంబులై కొలువ సరస్వతీసమేతుండై పరమానందంబునం బరమేష్ఠి పద్మా[17]సనంబున నుండు నని లోకపాలురసభలను బ్రహ్మసభను వర్ణించిన నారదునకు ధర్మ రా జిట్లనియె.

---

81 1. విధ — కొన్ని ప్రతులలో లేదు. 2. సృజించుచు — ఇ; సృజియించుచు — డ. 3. మాంగిరస — పెక్కు ప్రతులు. 4 దేవగణంబులును — పెక్కు ప్రతులలో లేదు. మూలమునందును లేదు. 5. ప్రభావంతులైన — అ.ఉ.ఎ.ఏ.ఔ.క.జ.ఝ ప్రజావ తాంచ పంచాశదృషీణామపి — భం. 2-11-34. 6. రేతస్కులయిన — పెక్కు ప్రతులు. 7. ఋషులును — ల. 8. నశ్వినులును — పెక్కు ప్రతులు 9. దన్నుం బరివేష్టించి యుండ — ఉ ఎ ల. ప్రతులలో లేదు. 10. గొలిచియుండ — ఒ.డ.వి. శ ష. 11. దపోదమశమసత్యంబులు — ల. 12. శ్రుతి - ల.వి.శ.ష. మూలము నందును శ్రుతి - యనియే కలదు. మేధాధృతిః శ్రుతిశ్చైవ ప్రజ్ఞాబుద్ధిర్యశః క్షమా భం 2-11-25 13 సంకల్పః ప్రాణఏవచ — అని మూలము భం. 2-11-17. 14. త్రుటికాష్ఠా — పెక్కు ప్రతులలో లేదు, మూలమునందును లేదు. క్షణా లవా ముహూర్తశ్చ రాత్రిస్తథైవచ భం. 2-11-29 ఖ ప్రతిలో ఈ విషయము లన్నియు ముందు వెనుకలుగను, కొన్ని యెక్కువగను నున్నవి 15. రాత్రంబులును- ఊ.ఎ.ఐ.ల. 16. భాష్యాణి తర్కయుక్తాని దేహవన్తి-అని మూలము భం. 2-11-26. 17. సనాసీనుండై యుండునని — ఇ.ఎ.ఐ.ఓ.క.ఖ.గ.డ.ల.

-: హరిశ్చంద్రు మాహాత్మ్యము :-

సం. 2-11-48

82 మధ్యాక్కర. [1]పరమధర్మాత్మకుఁ డయిన పాండుభూపతిఁ[2]దొట్టి సకల
[3]ధరణీశులెల్ల యమసభ నుండంగఁ దా నేమిపుణ్యా
చరితఁ బ్రవర్తిల్లె నయ్య దేవేంద్రసభ హరిశ్చంద్రుఁ
[4]డురుతర [5]మహిమతో దేవపూజ్యుఁడై యుండంగఁ [6]గనియె.

83 వ. [1]అని యడిగిన ధర్మరాజునకు హరిశ్చంద్రు [2]మహిమాతిశయంబు నారదుం
డిట్లని చెప్పె.

84 ఉ. [1]దీపితసత్యసంధుఁడు ధృతిస్మృతిధర్మపరాయణుం డయో
ధ్యాపురనాయకుండు జలజాప్తకులైక విభూషణుండు వి
ద్యాపరమార్థవేది [2]శరదబ్జసముజ్జ్వలకీర్తిచంద్రికా
[3]స్నాపిత సర్వలోకుఁడు త్రిశంకునరేంద్ర సుపుత్త్రుఁ డున్నతిన్.

85 సీ. జయశీలుఁ డయి హరిశ్చంద్రుండు దొల్లి స ప్త[1]ద్వీపములఁ దనబాహుశక్తిఁ
జేసి జయించి నిశ్శేషితశత్రుఁడై ధారుణిలోఁ గల ధరణిపతుల
నిజ[2]శాసనంబున నిలిపి నిత్యంబైన మహిమతోసకలసామ్రాజ్య మొప్ప
రాజసూయంబు [3]తిరంబుగా నొనరించి తనరి యథోచితదక్షిణలకు

ఆ. నేను [4]మడుఁగు లర్థ మిచ్చి యాజకులఁ బూజించి భక్తితో విశిష్టవిప్ర
జనుల [5]కభిమతార్థ [6]సంప్రదానంబులఁ, దృప్తిసేసె వంశదీపకుండు.

82 1. పరమధార్మికుఁడైన పాండుభూపతిఁ దొట్టి సకల — ఎ ఏ.ఓ ఔ.గ. (ఛందస్సు?) 2. దొంటి — ఝ.ల. (?). 3. ధరణీశులెల్లనయ్యము సభనుండ దానేమిపుణ్యా — ఆ.ఈ.ఎ.ఏ.క.ఖ. [ఛందస్సు?] 4 డురుతరమహిమతో దేవపూజ్యుడై యుండగనియె— ఈ.ఊ ఎ.ఓ. (ఛందస్సు?) 5. సుఖలీలదేవ—ఞ.ఛ.జ.ణ. 6. బడసె — ఒ.క.ఖ.వీ శ.ప.

83 1. అనవుడు — అని మాత్రమే కొన్ని వ్రాత ప్రతులలో నున్నట్లు — స. 2. మాహాత్మ్యంబు సవిస్తరంబుగా చెప్పందలంచి నారదుం డిట్లనియె - ఏ ఓ.ఛ ణ

84 1. ఉ.ఓ.ఖ వీ — ప్రతులలో తప్ప తక్కిన ప్రతులలో నీ పద్యము లేదు. 2. శరదభ్ర— ఉ.స.ల. 3. స్థాపిత — ఉ.ఓ.ఖ.

85 1. ద్వీపములు — పెక్కు ప్రతులు 2 శాసనమునందు నిలిపి—ఈ ఉ.ఐ గ. 3. విరాజితంబుగ జేసి — పెక్కు ప్రతులు. 4. మణుగు — పెక్కు ప్రతులు. 5. నభిమతార్థ — ఈ.ఒ.వీ.శ.ష. 6. సత్ప్రదానంబుల — క.

86 క. ఉరుతరధనసంతర్పిత, ధరణీసురు ంతని నతిముదంబున [1]దీవిం
చిరి రాజులందు [2]లోకో, త్తర తేజో[3]ధర్మయుక్తిఁ దనరు[4]మ యనుచున్.

87 వ. వాఁడును బ్రాహ్మణవచనంబు[1]నం జేసి యెల్లరాజుల[2]కు నధికుండయి రాజసూయమహా[3]యజ్ఞకరణంబునం జేసి [4]దేవేంద్రుసాలోక్యంబు వడసె నట్టి హరిశ్చంద్రుమహిమాతిశయంబు రాజసూయ నిమిత్తంబున నయినదిగా నెఱింగి రాజలోకంబుతో వైవస్వత[5]సభ నుండు భవజ్జనకుండు పాండురాజు [6]నాతో నిట్లనియె.

-: నారదుఁడు పాండురాజు వచనంబులు ధర్మజుని కెఱింగించుట :-

సం. 2-11-65

88 క. జనపతులు రాజసూయం, బొనరించినవారు శక్రునొద్దను సురపూ
జన [1]లొందుచుండుదురు కోరినకోర్కులు [2]వడయుచును హరిశ్చంద్రుక్రియన్.

89 చ. [1]గొనకొని మర్త్యలోకమునకుం జని సన్మునినాథ [2]యిందు నా
యునికిని రాజసూయ[3]మఖ [4]మున్నతిఁ జేసిన ధన్యు [5]లింద్రునం
దునికియు నాతనూ[6]జున కనూనయశోనిధి యైన ధర్మనం
దనున[7]కుఁ జెప్పి వాని నుచితస్థితిఁ [8]బన్పుఁడు దానిఁ జేయఁగన్

86 1 దీవింతురు — వీ.శ.ష. 2. నేకోత్తర — ఎ.ఐ 3. ధర్మవృద్ధి — ఎ.ల 4. మటంచున్ — కొన్ని ప్రతులు

87 1. నన్నెల్లరాజులకు — పెక్కు ప్రతులు. 2. కంటె — క ఖ.గ డ. 3. యజ్ఞంబు కారణంబున — పెక్కు ప్రతులు ; యజ్ఞంబు జేసిన కారణంబున-క.ఖ డ. 4. దేవేంద్ర సమానంబున నుండ బడసె — ఖ.డ ; దేవేంద్రు సాయుజ్యంబు - ట. 5. సభనుండి- పెక్కు. ప్రతులు. 6 నాకిట్లనియె – కొన్ని ప్రతులు.

88 1. లందు చుండుదురు — ఘ.ఝ.డ.వీ. 2. వడయుదురు — ఆ.ఇ.ఉ ఎ.గ ఈ పద్యము తరువాత కావున అను వచనము — అ ఆ గ.ఘ ఝ. ప్రతులలోఁ గలదు.

89 1. గొనకొని — డ.భాసం.వీ ; కొనకొని — వా. పెక్కు ప్రతులు. 2. యిట్లు — పెక్కు ప్రతులు 3 మఘ - అ ఆ.ఎ ఏ.క. 4. ముద్దతి — వ. 5. లట్టులం — ఝ. 6. భవుడనూన యశోధనుడైన — వీ.శ.ష స 7. కెరుంగజెప్పుముచిత ... బన్పుము — ఒ.వీ.శ.ష. 8. బంపుము — ఊ ఎ.ఏ.ఔ.క ఖ.ఝ వీ.

90 చ. అనుపమ శక్తిమంతులు మదాత్మజు లేవురు దేవతావరం
బున [1]నుదయించి యున్న కృతపుణ్యులు వారలలోన నగ్రజుం
[2]డనఘుఁడు రాజసూయము మహామతిఁ జేయఁగ నోపు శత్రుసూ
దనుఁ డయి [3]సార్వభౌముఁ డయి తమ్ముల బాహుబలంబు పెంపునన్.

91 వ. [1]అట్లేని నాకు నస్మత్పితృపితామహనివహంబుతోడ నాకాధిపలోక[2]సుఖావాప్తియగు ననిన నప్పాండురాజు[3]వచనంబు నీ కెఱింగించువేడుక నిట వచ్చితి.

92 క. న్యాయమున రాజసూయము, సేయుము నీపితృ[1]గణంబుఁ జెచ్చెర నధిక
శ్రీయుత సురగణపూజ్యులఁ, జేయుము [2]శక్రుసభనుండఁ జేయుము[3]వారిన్.

93 వ. దిగ్విజయోపార్జితంబు లయిన [1]ధనంబుల బ్రాహ్మణ[2]సంతర్పణంబును ధర్మమార్గంబునంజాతుర్వ[3]ర్ణ్యాశ్రమ రక్షణంబునుం జేసి సామ్రాజ్యం[4]బు పూజ్యంబై యొప్పం బ్రకాశింపుము [5]మఱి [6]రాజసూయంబు బహువిఘ్నంబు బ్రహ్మరాక్షసులు [7]దాని [8]రంధ్రంబ [9]రోయుచుండుదు రదియును [10]నిర్విఘ్నంబున సమాప్తం బయ్యె నేని నిఖిలప్రజా[11]పరిక్షయకారణం బయిన రణం బగునని

90 1. జనియించి — ఒ శ.ష. 2. డొనరగ ... మఘమున్నతిఁ — అ ఐ.ఘ ఛ.ట. 3. వీరులైన తన — ఛ జ.

91 1. అట్లయిన— పెక్కు ప్రతులు 2 సుఖంబు గలుగు — క.ఖ.డ, సుఖప్రాప్తియగు — ఊ.ఝ. 3. వచనంబులు — పెక్కు ప్రతులు.

92 1. వరులను — వీ శ.ష 2. సమ్మోదమలరజేయుము వారిన్ — ణ 3. నెమ్మిన్— ఝ ; కరుణన్ — జ.

93 1. యపరిమితధనంబుల — ఉ.ల.వీ. 2. తర్పణంబును — పెక్కు ప్రతులు. 3 ర్ణరక్షణంబు — పెక్కు ప్రతులు. 4. బునప్రకాశింపుము - పెక్కు ప్రతులు ; బు ప్రకాశింప జేయుము — క.ఖ.డ 5. మరియు — అ ఆ.ఇ ఉ.ఎ.ఏ.ఐ గ ల. 6 రాజసూయంబునకు బహు విఘ్నంబులు — ఊ.ల. 7. దాని రంధ్రంబు నిరంతరంబు బ్రహ్మరాక్షసులు — ఎ.ఛ.జ.ణ ల 8 రంధ్రంబు—పెక్కు ప్రతులు. 9. రోయుదురది నిర్విఘ్నంబు — పెక్కు ప్రతులు. 10. నిర్విఘ్నంబుగా — ఆ.ల వీ. 11 క్షయంబైన రణం — ఓ ; క్షయకారణం-గ.ఛ.జ ; యుద్ధం చ పృష్ఠ గమనమ్ పృథివీ క్షయ

చెప్పి నారదుం డరిగి[12]నఁ దమ్ములం జూచి ధర్మతనయుండు ధౌమ్య ద్వైపా యన సుహృద్బాంధవమంత్రి [13]సమక్షంబున నిట్లనియె.

**—: ధర్మరాజు నారదవచనప్రబోధితుండై రాజసూయ యజ్ఞంబు సేయుటకు నాలోచించుట :-**

సం. 2-12-1

94 క. పితృసంకల్పము సేయఁగ, సుతుల కవ[1]శ్యమును వలయు సుతజన్మఫలం
బతిముదమునఁ బితృవరులకు, హిత మొన[2]రించుటయ కాదె యెంతయు భక్తిన్.

95 క. పరలోకనిలయు లగుమీ, గురులకు [1]దీనిన హితం బగున్ లోకభయం
కరసంగరమును గాలాం,తరమున నగు నని విరించితనయుఁడు [2]సెప్పెన్.

96 క. పితృగణహితార్థ[1]ముగ స, త్క్రతు వొనరింపంగ బుద్ధి గలదు ప్రజా[2]సం
హృతి తత్క్రతువున నగు నని, [3]మతి నాశంకయును గలదు మానుగ నాకున్.

97 వ. ఏమి సేయుదు నని డోలాయమానమానసుం [1]డయి యున్న ధర్మరాజునకు ధౌమ్యప్రభృతు లిట్లనిరి.

98 ఉ. చేయుము రాజసూయ మెడ సేయక [1]దాననచేసి దోషముల్
వాయు [2]నిలేశ భూప్రజకుఁ బార్థివు లెల్ల [3]భవత్ప్రతాప [4]ని
ర్జేయులు సర్వసంపదలు చేకొనఁగాఁ దఱి యయ్యెఁ [5]గౌరవా
మ్నాయలలామ నీ [6]కెనరె మానవనాథులు మానుషంబునన్.

కారకమ్, కించిదేవ నిమిత్తంచ భవత్యత్ర భయావహమ్ — భం. 2-11-69. 12 నంత — ఎ.క.ఖ.ల. 13. సమక్షమంబున — పెక్కు వ్రాఁత ప్రతులు. కాని యీ రూపము నిఘంటువులందు మృగ్యము.

94 1. శ్యంబవలయు — అ.ఊ.ఎ.ఐ.ఒ.క.ఖ ల.శ.ష 2. రింపంగ వలదె — ఏ ఔ ణ, రింపంగగాదె — పీ.శ.ష.

95 1. దీనవ — క.ఖ.గ.ఘ పీ.శ.ష ; దీనను — అ.ఇ.ఊ.ఎ.ఏ.ఒ.ఔ. 2. పలికెన్ — ల

96 1. మగు—ఇ ణ ; ముగదక్రతు — ఉ ల 2. సంహతి — ఢ (?) 3. మతిలో శంక—ఆ.

97 1. డై య్యడిగిన — అ.ఇ.ఏ.ఔ.ఛ.జ.ణ ; దైనధర్మ — కొన్ని ప్రతులు.

98 1. దీనన — పెక్కు ప్రతులు ; దీననవేక — ఉ ; దీననశేష — ఘ ట.ల.పీ. 2. నరేంద్ర— ఉ.వ ; నరేశ — ఇ.పీ.శ.ష ; నశేష — ఆ.ఐ.ఓ ఖ.ఘ.ట.ల. 3. నిజప్రతాప — చ. 4. నిర్జేయుల — ఆ.అ.ఇ.ఏ.ఓ.ఔ.గ.ఘ. 5. పౌరవా — ల. 6. కెదురె — ఓ.

99 వ. అనిన [1]వారల వచనంబు[2]ల కనుగుణంబుగా ననుజానుమతుం డయి ధర్మరాజు రాజసూయంబు సేయ సమకట్టి దీని [3]నిర్విఘ్నంబున నిర్వహించు[4]ట కనాది నిధనుం డాదిపురుషుండు పురుషోత్తముండు పుండరీకాక్షుం [5]డజుం డయ్యును జగద్ధితార్థంబుగా మర్త్యంబున [6]జనియించిన [7]యమ్మహాత్ముండు వాసు దేవుండ యోపుం గాని యన్యుల కశక్యం బని యప్పుడ యాప్తచరులం [8]బిలు వం బనిచి.

100 క. అనిలజవాశ్వంబులఁ [1]బూ, నిన యరదం బెక్కి ధారుణీధరు మధుసూ దను [2]దోడ్తెం డని ముదమునఁ, బనిచి తదాగమన[3]కాంక్షుఁ బార్థివుఁ డుండెన్.

-: కృష్ణుఁ డింద్రప్రస్థ పురంబునకు వచ్చుట :-

సం. 2—13—30

101 వ. [1]అయ్యుధిష్ఠి[2]రు సందేశంబున దాశార్హుండు[3]ను దద్దర్శనోత్సుకుం డయి ద్వారవతి [4]గదలి యతిత్వరితగతిం [5]జని నిరంతరప్రయాణంబుల నింద్ర ప్రస్థ పురంబు[6]నకు వచ్చి.

99 1. వారి — కొన్ని ప్రతులు. 2. న ననుజానుమతుండై — ఉ ఊ.ట.డ. 3. నిర్విఘ్నం బుగా—అ.ఆ.ఈ.ఎ.ఏ ఔ ఖ ఘ.చ.వీ.శ. 4 నప్పుడనాది — పెక్కు ప్రతులు. 5. డధోక్షజుండయ్యును — కొన్ని ప్రతులు. మూలమున కామాజ్జాత మజం నృషు అని కలదు భం. 2-12-26 6. నుదయించిన — ఇ ఊ చ. 7. మహాత్ముండు— పెక్కుప్రతులు. 8. బిలిచి, బిలిపించి, రావించి—అని పాఠములు.

100 1. బూనిన రథమెక్కి-చనిధారుణీ — పెక్కు ప్రతులు ; బూన్చిన రథముల నెక్కి ధారుణీ — గు.ఘ వీ.శ.శర.ష. 2. దోడ్కొని చనుదెండనిబనిచి— పెక్కుప్రతులు. 3. వాంఛ — అ ఉ.ఊ.క.ఖ.ఛ.జ.

101 1. అంతనయ్యుధిష్ఠిరాదేశంబున ...... ద్వారవతికతిత్వరితగతింజని యదుదేవుం గాంచి భక్తిం బ్రణమిల్లి తన వచ్చిన కార్యం బచ్యుతునకు నెరింగించిన ...... ల. ఈ పాఠమే ఈ ప్రతి యందును గలదు. కాని — దాశార్హుండుకు బదులు దవ్వారి కుండు అని కలదు. వాక్యాదియందు అంత లేదు. 2 రాదేశంబున—అ.ఇ.ఈ. ఎ.ఐ.ఒ.ల.శ.ష ; రుశాసనంబున — అ ఊ.ఏ.ఔ.ఛ.ణ ; రునాదేశంబున — జ ; రునుపదేశంబున — ఝ. 3. ను — పెక్కు ప్రతులలో లేదు. 4. వెడలి— కొన్ని ప్రతులు 5. జని — పెక్కు ప్రతులలో లేదు 6 ప్రవేశంబు చేసి — ఎ.ఐ.ట.ల.

102 ఉ. కుంతికి ధర్మనందనునకున్ వినయంబున మ్రొక్కి భీము ధీ
మంతునిఁ గౌఁగిలించుకొని మధ్యమపాండవు మాద్రిపుత్త్రులన్
సంతతభక్తినమ్రులఁ బ్రసాద[1]నయోత్కటదృష్టిఁ జూచి తా
నెంతయుఁ [2]బ్రీతి నెత్తికొనియెన్ మహి నెత్తిన పుణ్యుఁ డున్నతిన్.

103 వ. [1]తదనంతరంబ ధర్మతనయుండు.

104 క. పరమాసనమున నునిచి య, పరిమితహర్షంబుతో సపర్యావిధులన్
గురుఁ బూజిం[1]చిన విధమునఁ, గురువృషభుఁ డశేషలోకగురుఁ బూజించెన్

105 క. ఏమఱక [1]జనుల యోగ, క్షేమంబుల నడపుచున్న కృష్ణుని యోగ
క్షేమంబు [2]లడిగి యపుడు మ, హాముదమున ధర్మసుతుఁడు హరి కిట్లనియెన్.

106 క. [1]ధ్యేయుఁడవు సకల[2]లోక, శ్రేయుండవు [3]నమ్రులకు విధేయుఁడవు నయో
[4]పాయజ్ఞుఁడ విజ్జగముల, నీ యెఱుఁగనియవియుఁ [5]గలవె నీరజనాభా.

107 వ. అయినను నాయర్థిత్వంబునం జేసి నీకెఱింగించెద.

108 సీ. పాండుమహీపతి [1]పనిఁ జేసి నారదముని వచ్చి వీరెల్ల వినుచునుండ
రాజసూయంబు [2]తిరంబుగాఁ జేసి నీ పితృపితామహులకు [3]హితము సేయు

102 1. దయామృత — ల.స, మృదూకృత — ఊ.ఐ ఒ శ.ష.స ; మృదూత్కట — ట ; పురస్కృత — క.ఖ.ఘ.డ ; ప్రియాకృతి — ఝ ; పృథూకృత — అ.ఏ.ఓ.ఔ.ణ ; పృథూత్సుక — ఛ.జ. 2. వేడ్క — క.ఖ.

103 1. ఈవచనము ఞ.వీ.శ.ష.లలో తప్ప తక్కిన ప్రతులలో లేదు.

104 1. చువిధంబున — పెక్కు ప్రతులు.

105 1. గురుల యోగక్షేమంబుల నరయుచుండు కృష్ణుని–ఝ. 2. లరసి–అ.ఇ.క.ఖ.ఘ.

106 1. ధీయుతుడ వఖిల కార్య — అ.ఝ. 2. కార్యస్థేయుండవు — పెక్కుప్రతులు. 3. నీవు మరి యజేయుడవు నయో — ఏ.స 4. పాయుండ విజ్జగంబున — ఎ ; పాయజ్ఞుడవుజగంబుల — చ. 5. లేవు — ఆ.ఇ.ఐ.ఔ.

108 1. పనిపూని — ఐ.ల.స ; పనుపున — క ; పనిచిన — ఘ. 2. విరాజితంబుగ జేసి పితృ — ఘ.వీ.స; పెక్కు ప్రతులలో విరాజితంబుగా జేసి పితృ అని కలదు. కాని గణభంగమగును. 3. ప్రియము — ఓ.క ; ప్రీతి — ఏ.ఘ. ఈపాఠములలో రెండవ

మని [4]పంచె నన్ను నెయ్యమునఁనో నా కట్టి బలము సామర్థ్యంబుఁ గలుగు
తెలిఁగి
[5]పంచెనో తత్క్రతుప్రారంభమున కొడంబడితి [6]పీ రిందఱుఁ గడఁగి దీని

ఆ. నిత్యసత్యవచన [7]నిపుణనిర్మలబుద్ధి, నిర్ణయించి [8]పనుప నీ నియోగ
కాంక్ష నున్న వాఁడఁ గమలాక్ష[9]యనిన ధ, ర్మాత్మజునకు నిట్టు లనియెఁ జక్రి.

-: *కృష్ణుఁడు ధర్మజునికి జరాసంధునిసామర్థ్యము నెఱిఁగించుట* :-

సం. 2-13-1

109 క. కురువృషభ సర్వగుణముల, సురుచిర[1]తేజమున రాజసూయాఖ్య మహా
ధ్వరమునకు నీవ యర్హుఁడ, వరిసూదన శౌర్య[2]లయిన యనుజుల[3]బలిమిన్.

110 వ. తొల్లి [1]జమదగ్నిసుతుండయిన[2]రామునిచేత ధాత్రి యపగతక్షత్త్రం బయిన
నంతనుండి [3]యైలవంశంబును నిక్ష్వాకువంశంబునుదక్కఁ దక్కిన క్షత్త్రియ
వంశంబు లెల్లం గృత్రిమంబు[4]లు గాని [5]విమల మకుటార్హంబులు గా వీరెండు
వంశంబులవలన [6]నేకోత్తరశతవంశంబు లయ్యె మఱి యయాతిభోజ

పాదము పితృపితామహులకు అని ఆరంభించి యున్నది. 4 నన్ను బనిచె (బంచె) అని అన్ని ప్రతుల యందును. 5. పలికెనో — అ.ప ఓ.ఔ.గ ఝ. పనిచెనో— కొన్ని ప్రతులు. 6. మీరందరు — అని పెక్కు ప్రతులు. కాని, మూల మున తం రాజసూయం సుహృదః కార్యమాహుః సమేత్యమే అని కలదు. శం. 2-13-3. 7. నీదు — ఇ ఉ ఎ.ఐ.ఞ.ల ; నీవు — గ.ఝ 8. పనుపు — పెక్కు ప్రతులు. 9. ధర్మాత్మయనిన ధర్మజునకు ననియె ప్రీతి — ఓ.

109 1. తేజుడవు — అ.ఆ.ఏ.ఒ.ఔ ఞ.వీ.శ.ష ; విభవమున — ఛ.ఝ. 2 లైన అను రూపము పెక్కు ప్రతులలో పాటింపఁబడినది 3. కలిమిన్ — ఊ.ల.

110 1. జామదగ్న్యుండైన రాముచేత — పెక్కు ప్రతులు. (వ్రాఁతప్రతులలో 'జామదగ్నుండైన' అని యకార రహితముగ నున్నది.) 2. పరశురాముని— అ.ఝ.ల వీ శ.ష. 3. హైహయ, యదు — అని కొన్ని ప్రతులు. కాని మూల మున ఐలస్య అని కలదు. శం. 2-13-4. 4. ల లె — అని కొన్ని ప్రతులు ; లైన యవి — క.ఖ.గ ; లు గావు రామ [విమల] కురారాహతంబులుగాని యీరెండు— ఇ.స. 5. విమల — పెక్కు ప్రతులలో లేదు. 6. మూలమున తానిచైకశతం

వంశంబుల వలనం [7]జతుర్దశవంశంబు లయ్యె [8]నిట్టి సకల[9]క్షత్త్రంబు లెల్ల జయించి జరాసంధుం డున్నవాఁడు వాని సామర్థ్యంబు చెప్ప[10]నశక్యంబు.

111 క. అతి[1]దర్పోద్ధతుఁడు మహో,ద్ధృత భూరిబలుండు చేదిభూపతి సేనా
[2]పతియయి శిశుపాలుఁడు సం, తతమును నాతనినఁ గొలుచుఁ దద్దయు[3]
భక్తిన్.

112 క. ఆయతభుజవీర్యులు మా,యాయోధులు హంస[1]డిభకు లను[2]వార లని
ర్జేయులు పరస్పరస్నే, హాయత్తసుచిత్తు లతనియాప్తు [3]లధీశా.

113 వ. [1]అయ్యిద్దఱును గౌశికచిత్రసేను లను నామంబులతో మహా[2]సేనాన్వితులై వానికి వామదక్షిణభుజంబులుంబోలె సర్వసాధనసమర్థు లయి వర్తిల్లుదురు [3]మఱియు వరుణు నంతియ [4]బలవంతుండు పశ్చిమదిఙ్మహీపతి భగదత్తుం డనువాఁడు పాండురాజసఖుం [5]డగుటం జేసి నీకు మనంబున [6]భక్తుం డయ్యును భయంబున జరాసంధునకు వాక్కర్మంబులం బని సేయుచుండుఁ జేదిపతులలోనఁ బురుషోత్తముండును [7]వంగవంగ [8]పుండ్ర కిరాతపతులలోనఁ బౌండ్రకవాసుదేవుండు మదీయనామంబులు[9]దాల్చి

విద్ధి కులాని అని కలదు. భం 2-13-5. 7. విస్తరః సచతుర్దశమ్ — భం. 8. నట్టి— పెక్కు ప్రతులు. 9. క్షత్రియుల నెల్ల— పెక్కుప్రతులు ; క్షత్రియ వంశంబులు [కులంబులు] అని కొన్నింట. 10. నలవికాదు — చ

111 1. దర్పోన్నతుడు— ఈ ; గర్వోద్ధతుడు — చ. 2. న్వితుడై —ఉ.ఔ.చ. కాని మూలమున సేనాపతిర్జాతః శిశుపాలః ప్రతాపవాన్ అని కలదు భం. 2-13-9. 3. నెమ్మిన్ — అ.ఒ.ఘ.ల.

112 1. డిచికులు—అను పాఠమున్నదని స లో కలదు. కాని మూలమున నీరూపము. మృగ్యము 2 వారలు — పెక్కు ప్రతులు. 3. లు నధిపా — ఇ.ఈ.చ.

113 1. ఆయిరువురు — కొన్ని ప్రతులు. 2. సేనా సమన్వితులై — ఆ.ఊ.ఐ.ఒ. చ జ.ల. 3. మఱి — వా. కొన్ని ప్రతులు. 4. మహాబలవంతుండు — ఆ ఈ. ఐ.క.ఖ.గ. 5. డయ్యును నీకు — కొన్ని ప్రతులు. 6. భక్తుండైభయంబున— ఈ.ఎ ; భక్తుండై యుండి — అ.ఓ.ఘ. 7. అంగ — ఇ.ఈ ఉ.ఊ. ప్రతులందును మూలమునను లేదు. 8. పౌండ్ర — అని పెక్కు ప్రతులలో కలదు. కానిమూలమున పుండ్ర — అనియే కలదు. భం. 2-13-19 9. చే [సే] కొని — కొన్ని

జరాసంధుఁగొలుతురు ప్రాగ్దక్షిణ[10]దిగ్భాగముల రాజులు భగదత్తుండును [11]గరూశ కలభ నకుల సంకర్షణ సూపహిత సనోదర్త చ[illegible] యవనులును వానిన సేవింతు రుదీచ్యు లయిన యష్టాదశ[illegible] వారును నుత్తరపాంచాల శూరసేన [12]పుష్కర పుళింద కళింగ కుణింద మత్స్యదేశంబుల రాజులెల్లను దద్భయంబునఁ దమతమదేశంబుల విడిచి యున్న[13]వారలు మఱియును.

114 ఉ. ఘోరరణంబులోన నధికుం గృతబంధుజనాపకారు నే
దారుణలీలఁ గంసు నతిదర్పితుఁ జంపుటఁ జేసి యమ్మహా
క్రూరుఁడు కంసుభార్య దనకూఁతురు గావున దాని సంగత
ప్రేరణ నా కుపద్రవముఁ బెక్కు[1]విధంబులఁ జేసె నీసునన్.

115 క. భూమీశ హంస[1]డిభకులు నా మగధాధీశ్వరుండు నమ్మువ్వురు ను
ద్దామభుజవీర్య సంపద, తో [2]మూఁడుజగములు నోపుదురు సాధింపన్.

116 వ. ఆ జరాసంధుండును నాయుధనిహతులుగాని హంసడిభకులతో వచ్చి మధురపై విడిసిన నతివీరులయిన యదువృష్ణిభోజాంధకవరు లష్టాదశ [1]సహస్ర రథవ్రాతంబులతో నేమును సమకట్టి మహాయుద్ధంబు సేయుచు

ప్రతులు 10. దిఙ్మహీపతులు — ప.ఔ.ఛ.ణ. 11. గరూశ కొన్ని ప్రతులలో లేదు. గ్రథన, ప్రథన అని కొన్నింట నున్నది. మూలమున—కరూష. భం. 2—13—12. 12 కుణింద (కుళింద) — అను రూపములు మూలమునఁ గలవు. 13. వారని చెప్పి మరియును — పెక్కు ప్రతులు. సూచన — ఈ వచనమునఁ గల పేర్లు మూలమును బట్టి చూడ తారుమారుగ నున్నవి. మఱియు ఇందున్నవి కొన్ని మూలమున లేవు మఱికొన్ని పేర్లు మూలమున నధికముగఁ గలవు

114 1. తెరంగుల — ఇ ఊ ఎ.ఔ.గ చ.ణ.

115 1. డిచ (చి) కులు— అను రూపములు వేఱ్వేరు ప్రతులలోఁ గలవు. 2. ముజ్జగములును — ఒ.ఘ.చ.ల ; మూఁడుజగంబు నోపుదురు — సం. (?).

116 1. సహస్రబలవ్రాతంబు — గ.ఘ ; వాసరంబులు సమకట్టి — ల ; సంగ్రామే ౨

[2]వాని నెట్లును జయింపరాకున్న [3]నుపాయంబున హంసుండు సమరనిహతుం డయ్యె నని డిభకునకుం జెప్పంబంచిన నప్పలుకులు నిక్కువంబ కా వగచి.

117 చ. అనవరతంబు నిష్టుఁ డగు హంసుఁడు లేనిజగంబు[1]లోని జీ
వన మది యేల [2]నాకనుచు [3]వారినిమగ్నశరీరుఁడై క్షణం
బున డిభకుండు మృత్యుగతిఁ బొందె [4]ఘనంబుగ దాని [5]నక్కడన్
విని మృతుఁ డయ్యె హంసుఁ డతివీరుఁడు [6]తద్గతసౌహృదంబునన్.

118 వ. [1]అట్లు కౌశికచిత్రసేనులు పరలోకగతు లయిన నసహాయుండై జరాసంధుండు మగిడి మగధపురంబునకుం జనియె నేమును వానితోడి [2]వైరంబు బలవంతంబైన నమ్మధురనుండ నొల్లక కుశస్థలంబునకువచ్చి [3]రైవతక పర్వతంబున ఘనంబుగా దుర్గంబు నిర్మించి[4]కొని [5]భవదాశ్రయంబున సుఖం బున్నవారము.

119 చ. ఖలుఁడు బృహద్రథాత్మజుఁడు గర్వితుఁడై మహిలోనిరాజులం
బెలుకుఱఁ బట్టి తెచ్చి చెఱఁబెట్టి గిరివ్రజ మన్పు[1]రంబులోఁ
[2]బొలయక నిత్య మొక్కొకని నూనరివోలె వధించి [3]నేమమున్
బలిమియు నేర్పడం గడఁగి భైరవపూజ యొనర్చు నుగ్రుఁడై.

ష్టాదశావరైః [రే] — మూలము భం. 2-13-31. 2 వాని నెట్లును జయింపరాకున్న — పెక్కు ప్రతులలో లేదు. 3 హంస ఇతిఖ్యాతః కశ్చిదాసీన్మహాన్నృపః। సచాన్యైః సహితో రాజన్ సంగ్రామేఽష్టాదశావరైః. హతోహంస ఇతి ప్రోక్త మథ కేనాపి భారత । తచ్ఛ్రుత్వాడిభకో రాజన్యమునాంభస్య మజ్జితః మూలము — 2-13-49.

117 1. లోన — ఉ.ఎ. 2. సంకుననివార్ధి — ఉ ల. 3. వారిధిమగ్నశరీరుడై — ఓ శ.ష ; వార్ధినిమగ్న — చ వీ. 4. నిజంబుగ — గ. 5. నిక్కడన్ — కొన్ని ప్రతులు 6. తద్దయు — అ.ఈ ఎ.ఐ.క.

118 1. ఇట్లు — పెక్కు ప్రతులు 2. విరోధంబు — ఆ 3. రైవత — పెక్కు ప్రతులు. రైవతేనోపశోభితమ్ అని మూలము. భం. 2-13-49. 4. కొని — కొన్ని ప్రతులలో లేదు. 5. సామర్థ్యవంతః సంబధాద్భవన్తం సముపాశ్రితాః — అని మూలము 2-13-49. వావిళ్ళ ప్రతిలోని భవదాశ్రమంబున అను పాఠము ప్రమాదమై యుండును.

119 1. రంబునన్ — పెక్కుప్రతులు. 2. సొలవక — అ.ఎ.ఏ.ఓ.ఖ.చ.జ.ఝ.భాసం.ల.ణ; సొలయక — క.వీ.శ.ష. 3. పాపమున్ — ఉ వీ. తప్ప తక్కిన అన్నిప్రతులయందును.

120 క. [1]ధరణీశ వానిఁ జంపుడు, నురుతరసామ్రాజ్యవిభవ మున్నతితో సు
స్థిర మగు నీకును మఱి భా,సురముగ సమకూరు రాజసూయము సేయన్.

121 సీ. రక్షణంబున భగీరథుఁడు జయంబున [1]నయ్యౌవనాశ్వుండు [2]నత్యుదగ్ర
బాహుబలంబున భరతుండు తపమునఁ గార్తవీర్యుండును గరముబుద్ధి
నమ్మరుత్తుండును నఖిలసామ్రాజ్యంబుఁ బడసిరి తొల్లి భూపాల యిప్పు
డిన్నిగుణంబులు నెన్నంగఁగలవు నీ [3]కిది యేమి దుర్లభ మిద్ధరాత్మఁ

ఆ. డెంతబలియుఁ డయ్యు నెంత[4]గర్వితుఁ డయ్యుఁ, దనకతోరదుష్ప్రతాప
మునను
విగతవిభవుఁ డగు వివేకవిహీనుల, కై నలక్ష్మి సుచిర[5]మగునె యొందు.

*—: భీమసేనార్జునులు ధర్మరాజున కుత్సాహంబు గల్గించుట :—*

సం. 2-14-7

122 వ. అనిన [1]విని భీమసేనుండు ధర్మరాజున కిట్లనియె.

123 క. ఆరంభ[1]రహితుఁ బొందునె, [2]యారయ సంపదలు హీనుఁ డయ్యును
బురుషుం
డారంభశీలుఁ [3]డయి యక్క, తారంభుల నోర్చు[4]నెంత యధికుల నయినన్.

120 1. ఈ పద్యమునకు ముందు — అ ఇ.ఎ.ఏ ఔ ఐ. ప్రతులలో నీ క్రింది పద్య మధిక
ముగఁ గలదు

ఉ. అమ్మగధీశు నుగ్రబలు నాయుధయుద్ధమునం జయింపగా
నిమ్మహి నెవ్వరోపరు నుమేశ్వరు డట్టి వరంబు వారికిన్
నెమ్మిగ నిచ్చె గావున వినీతుడు వాయుసుతుండు మల్లయు
ద్ధమ్మున జంపు నాతని నుదగ్రమహాభుజశక్తి యేర్పడన్
ఈ పద్యమే వావిళ్ళవారి ప్రతిలో 162 వ పద్యముగా నున్నది.

121 1. నయ్యువనాశ్వుండు— ఈ రూపము పెక్కు ప్రతులలోఁ గలదు. 2. నతిసముగ—
ఊ. 3. కదియేమి దుర్లభమద్ధరాత్మ — కొన్ని ప్రతులు. 4. దర్పితు—ఉ.వీ.
5 యగునె యొందు — అ.ఏ.ఔ క.ఖ.

122 1. విని — కొన్నింట లేదు

123 1 హీను — ఊ ఎ గ. 2. యారగ — అ ఈ ఊ.ఎ.క.గ.ఘ.ఝ ల. 3. డగుచు —
వ.. 4. నెట్టి — అ ఓ.ఘ.

124 క. కడు నధి[1]కుతోడఁ [2]దొడరినఁ, బొడిచిన నొడిచినను బురుషు పురుషగుణం బే
ర్పడుఁగాక హీను నొడుచుట, [3]కడిదియె పౌరుషము దానఁగలుగునె
చెపుమా.

125 క. ఈహరికరుణయు నర్జును, సాహాయ్యముఁ గలుగ నీప్రసాదమున జగ
ద్ద్రోహు జరా[1]సంధు మహా, [2]సాహసు వధియింతు [3]నుగ్రసంగ్రామమునన్.

126 తే. అనఘ [1]యేము ముప్పురము మూఁడగ్నులట్లు, నీమహాయజ్ఞకార్యంబు
నిర్వహింతు
మా [2]జరాసంధ పశువు[3]న నఖిలశాత్ర, వాహుతులఁ జేసి తృప్తుల మగుచు
బలిమి.

127 వ. అనిన భీమసేనువిక్రమవచనంబుల కనుగుణంబుగా నర్జునుం డిట్లనియె.

128 ఉ. భూభుజులన్ జయింపుము విభూతి నొసర్పుము రాజసూయమున్
నాభుజవీర్యవిక్రమగుణంబులకుం దగుచున్న యీధన
శ్లాఘము దివ్యబాణరథలాభము శోభితమైన యీ సభా
లాభము నొందుపాట సఫలత్వముఁ బొందునె [1]కౌరవేశ్వరా.

129 క. [1]కలరూపగుణద్రవ్యం,బులు విక్రమనంతు[2]నందు భూవిదితములై
నిలుచు నవిక్రమునకు నవి, గలిగియు లేనిక్రియ నప్రకాశంబు లగున్.

124 1. కులతోఁ దొడరిన — ఎ.ఐ 2. దలపడి — క.ఖ.డ.వ 3. కడిమి — ఆ.ఈ.ఎ.ఐ.

125 1. సంధుని నతి సాహసు — ఐ. 2. సాహసికు వధింతు — క.ఖ.జ. 3. నేను [నేన] — పెక్కు ప్రతులు; నధిక — అ.ఊ.ఏ.ఒ.ఐ.

126 1. మేము — ఘ.చ.సం. 2 జరాసంధ పశువఖిల — ఉ.డ. 3. శస్త్రాస్త్ర తీవ్రహతిని జేసియు తృప్తులమగుచు బలిమి — అ.ఊ.ఒ; దివ్యాస్త్రశస్త్రహతునిగా జేసి — ఆ.ఇ. (జరాసంధుడు శస్త్రాస్త్రములచే నవధ్యుడు కావున ఈ పాఠములు చింత్యములు.) న నస్త్ర నిహతి నాహుతుం జేసి — ల.

128 1. పార్థివేశ్వరా — క.ఖ.డ.

129 1. కులరూప — పెక్కు ప్రతులు. కాని మూలమున ద్రవ్యభూతాః గుణాః సర్వే తిష్ఠంతిహిపరాక్రమే — భం. 2-15-11. 2. లకును — అ.ట.ఘ.చ.

130 వ. మఱియు రాజసూ[1]యమహాధ్వరంబు కారణంబుగాఁ బరాక్రమంబున జరాసంధు వధియించి నిఖల [2]క్షత్త్రియనిగ్రహమోక్షణంబు సేయు నంతకంటె మిక్కిలి [3]యశోధర్మం[4]బు లెం డెవ్వి యనిన భీమార్జునుల పలుకులకు సంతసిల్లి నారాయణుం డిట్లనియె.

131 క. వెలయ [1]విధిదృష్ట[2]నయమున, వలయుఁ బరాక్రమము సేయ వసుధేశ్వర యగ్గల మగు బుద్ధియుఁ గడ[1]కయుఁ, గల[3]పురుషుల కిదియె చూవె కర్తవ్యమిలన్.

132 వ. కావున మేము మువ్వురముఁ [1]గ్రమంబునం బరాక్రమించి [2]జరాసంధు [3]డాసి నదీప్రవాహంబులు వృక్షోన్మూలనంబు సేయునట్లు [4]క్రమంబున వాని నిర్మూలితుం జేసెద మద్దురాత్ముండు భూతంబుల యం దంతరాత్మ యుంబోలెఁ దన యంతరం బెఱుంగక యేకాంతశీలుండై సుఖం బనుభవించుటం జేసి వాని యంతికంబున కరుగుట యుక్తమం బనిన నారాయణునకు ధర్మరా జిట్లనియె.

133 క. దనుజాహిత నీ కాహవమున నెదిరి మహోగ్రగదహనమునఁ బడియును గాలని మిడుతవోలె నతికో,పనుఁడు జరాసంధుఁ డెట్లు బ్రదుకఁగ [1]నేర్చున్.

130 1. యార్థంబుగా పరాక్రమంబున — అ.ఆ ఇ.ప ఒ క.ఖ.గ.ఘ.ఝ ; యార్థంబు పరాక్రమంబున—వీ శ.ష ; యాధ్వరార్థంబుగా జరాక్రమంబున—ల. 2 క్షత్రియ మోక్షణంబు [మోక్షంబు] ఎ.ఒ చ.ఛ ఝ ; క్షత్ర మోక్షంబు — ఉ 3. యశోధనం బొం డెద్ది — ట 4 బొం డెద్ది — ఈ ఉ ఊ ప ఐ ఔ.ఛ జ.ణ ; బెద్దియులేదనిన — ఆ ఇ.ల ; బెద్దియనిన — క ఖ.డ.

131 1. విధిదృష్టి — అను రూపము పెక్కు ప్రతులలో కలదు. 2. నయమున—అనుటకు బదులు విధమున అని కొన్ని ప్రతులు. నయేన విధిదృష్టేన యదుపక్రమతే పరాన్. అని మూలము భం. 2-16-13. 3. పురుషున — పెక్కు ప్రతులు.

132 1. రయంబున—ఈ.ఎ.క.ఖ.ల ; నయంబున — ఐ.గ ఝ.డ 2. యాజరాసంధు — వా. 3. దాకి — అ.ప ఔ ఘ ; దొడరి — ఎ. 4. రయంబున — కొన్ని ప్రతులు.

133 1. నేర్చెన్ — ఖ. యస్త్వాం స్పృష్ట్వాగ్ని వద్భశం న దగ్ధః శలభో యథా అని మూలము. భం. 2-16-10

134 క. అట్టి యతిదారుణవ్యసను, నట్టి యజేయ భుజవిక్రమాధిక్యము వాఁ
డెట్టి క్రియఁ బడసె నాతని, పుట్టిన విధ[1]మెట్లు చెప్పు పొలుపుగ [2]నాకున్.

-: కృష్ణుఁడు ధర్మజునకు జరాసంధుని జననక్రమ మెఱిఁగించుట :-

సం. 2-16-12

135 వ. అని యడిగిన ధర్మరాజునకుఁ [1]గృష్ణుం డిట్లనియె.

136 సీ. అతిసమర్థుండు బృహద్రథుం డనువాఁడు మగధాధినాథుఁ డుస్మార్గదూరుఁ
డక్షౌహిణీత్రితయంబు బలంబునఁ బరుల నోడించిన [1]బలిమికాఁడు
కాశిరాజనువాని గాదిలి కూఁతులఁ గవల వారల రతికాంతిమతుల
సమరంగఁ బెండ్లియై [2]యనుపమప్రీతి నయ్యిరువురయందు భోగేచ్ఛ సలిపి

తే. యం దపత్యంబు వడయుదు నని [3]తలంచి, విప్రముని దేవపూజల వివిధవిధులఁ
బుత్త్రికామేష్టులను నొండు పుణ్యకర్మ, యుక్తులను జేసి పడయంగ నోప
కలసి.

137 వ. పుత్త్రిందు లేని[1]విభవంబు లన్నియు నేల యని [2]నిర్వేదించి పత్నీద్వయ
సమేతుం డయి వనంబున కరిగి.

138 ఉ. ఆ విపినాంతరంబున నిరంతరనిష్ఠ ననంత మోక్షకాం
క్షావిధి నొక్కబాలసహకార [1]మహీజముక్రింద నుజ్జ్వల
త్పావకతేజుఁడై తపము పాయక చేయుచు నున్నధన్యుఁ[2]గా
క్షీవతుఁ గాంచె గౌతము నకిల్బిషమానసుఁ జండకౌశికున్.

134 1 మెల్ల – అ ఎ.ప ఓ.ఔ.ఘ. 2. మాకున్ – వ.

135 1. నారాయణుం డిట్లనియె – పెక్కు ప్రతులు.

136 1. బలిమివాడు — స పెక్కు ప్రతులు ; బల్లిదుండు — స. 2. సమవృత్తి –
ఆ ఉ ఐ ఓ ఘ.వీ ; సమవృత్తి వేడ్క — ల ; సమమైన – వా ; యతిసమ—డ ;
యనుపమ – శ.ష. 3. కడంగి – ఇ.ఊ.ఒ ఝ

137 1. జీవనంబు లవి యన్నియు – క.ఖ. 2. నిర్వేదించి – ఉ ణ. ప్రతులలో లేదు.

138 1. ముక్రిందను బర్వునుజ్జ్వల — [illegible] 2. [illegible]ంక్షీవరు — అని పెక్కు ప్రతులు.
కాని మూలమున కాక్షీవతః – అని యున్నవి. భం. 2-16-22.

139 క. ధరణీశ్వరు నమ్మునివరుఁ, బురాతన[1]మునిఁగ నిరాశుఁ బుణ్యాత్ము నిరం
తరకృత[2]నియమసపర్యా, వరివస్యం దగుచు భక్తి వదలక కొలిచెన్.

140 వ. ఇట్లుపాస్యమానుం డయి చండకౌశికుండు బృహద్రథునకు మెచ్చి [1]నీకిష్టంబు చెప్పు మిచ్చెద ననిన వినయవినమితోత్తమాంగుం డయి వాఁ డిట్లనియె.

141 ఉ. సంతత మైన సర్వసుఖసంపద గల్గియు దానికిం దగన్
సంతతి లేమిఁ జేసి యది సర్వ[1]ము హేయము కాఁ దలంచి ని
శ్చింతుఁడ నై ధృతిం దపము సేయఁగ వచ్చితిఁ బుత్త్రజన్మ మై
[2]నంతన యేను మీదయఁ [3]గృతార్థతఁ బొందుదు [4]నమ్మునీశ్వరా.

142 వ. అనినం గరుణించి [1]మునివరుండు పరమధ్యానముకుళిత[2]నయనుండై [3]యున్నంత.

143 క. పవనవిధూతము శుకచం, చువిలూనముఁ గాక యొక్క చూతఫలం [1]బ
య్యవనిజమువలన నమ్మునిప్రవరుపృథూత్సంగతలముపై [2]వడిఁ బడియెన్.

139 1 మునిప్రకాశు — శ ర. పెక్కు ప్రతులు. 2. భక్తిసపర్యావరివస్యం — శ ష ; నియమశమస్యావరి వస్యం — ల.

140 1 నీకిష్టంబెద్ది — కొన్ని ప్రతులు ; నీకిష్టంబయిన దాని నిచ్చెద వేడుమనిన ముకుళిత శరకమలుండై వాడిట్లనియె — శ ష.

141 1 మనిత్యముకా — క డ ; ముహేయముకా — సం ; మునేవముకా — భాసం. మూలము — కిం వరేణాల్ప భాగ్యస్యకింరాజ్యేనా ప్రజస్యమే— భం. 2-16-26. 2. నంతకునేను — పీ.శ.ష. 3 గృతార్థుడనౌదును — ల. 4 సంయమీశ్వరా- ఓ ఘ.

142 1. మునీశ్వరుండు — ఉ పీ శ.ష. 2. లోచనుండై — ఝ.పీ.శ ష - 3. యుండునంత — కొన్ని ప్రతులు.

143 1. బయ్యవనీజమువలన ముని ప్రవరు — ఐ.ల. (మూలమందలి ప్ర తేల్చి పలుకవలెను.) 2 బడియె వడిన్—కొన్ని ప్రతులు : పైనింబడియెన్ — ట. [చింత్యము]

144 వ. దానిం బుచ్చికొని యభిమంత్రించి చండకౌశికుండు బృహద్రథున కిచ్చి యీ [1]ఫలంబువలన నీకొక్కపుత్త్రుం డుద్భవిల్లు నని చెప్పిన నాతండును [2]కృతార్థుండై క్రమ్మఱ నిజపురంబునకు వచ్చి తన యిద్దఱు భార్యలకు నప్పండు సమంబుగా [3]విభాగించి పెట్టినం దత్ఫలోపభోగంబున నయ్యిద్దఱు గర్భిణు లయినఁ బదియగు మాసంబున నొక్కనాఁటి రాత్రియందు వారలకు.

145 క. ఒక్కొక కన్నును జెవియును, జెక్కును [1]జనులొద్దు మూఁపుఁ జెలువగు చేయుఁ
బ్రక్కయుఁ [2]గుఱువును గాలును, నక్కజముగ మనుజ[3]శకలమై యుదయించెన్.

146 క. అమ్మానిసి వ్రయ్యలు గని, యమ్ముదితలు వెఱచి పీని నాత్మజుఁ డని నె
య్యమ్మున నెట్టులు చూపుదు, మిమ్మనుజేశ్వరున కనుచు నెంతయు లజ్జన్.

147 వ. పీని నెవ్వరు[1]ను నెఱుంగకుండ [2]వెలుపలవైచి రండని తమదాదులం బంచి[3]న వార లారెండువ్రయ్యలుం గొనిపోయి రాజగృహద్వారతోరణసమీపంబునఁ జదుకం[4]బునొద్ద నొక్కచోట [5]వైచిన నచ్చదుకంబున నుండెడు [6]రాక్షసి జర యనునది [7]దాని బలియ[8]కా వగచి పఱతెంచి.

144 1. ఫలోపయోగంబున — పెక్కు ప్రతులు. 2. కృతార్థుడవై తినని — ఉ 3. విభాగించి యిచ్చినం — ఊ.ఎ.చ , పంచిపెట్టిన — ట.ల.

145 1. చనుపుఱ — అని అర్థము. భాసం 2. బిరుదు — అ.ఉ.ఒ క.ఖ.ద.ప్రౌ.వ.వీ. శ.ష ; నూరువుగాలును — ల. 3. శకల మది జనియించెన్ — స ; శకల మప్పుడుదయించెన్ — శ ష.

147 1. ను — కొన్ని ప్రతులలో లేదు 2. గొనిపోయివెలుపల — ఈ.ఎ.ఐ.ల. 3. ననప్పుడ — ఏ.ఐ.ఒ. 4. బుననొక్క — అ.ట.ఘ. 5. వైచివచ్చిన — పెక్కు ప్రతులు , వైచిపోయిన — ఆ.ఇ ఊ.ఒ.చ.ఖ.సూ. 6. జరయను రాక్షసి దాని — ఉ. 7. వాని — వా. కొన్ని ప్రతులు ; దాని — కొన్ని ప్రతులు. 8. నా వగచి — వా ; కావగచి — పెక్కు ప్రతులు.

—: జరయను రాక్షసి బాలకునిఁ దెచ్చి బృహద్రథుని కొసంగుట :—

సం. 2-16—38

148 ఆ. ఎత్తికొని చనంగ నిమ్మగునట్లుగా, మెదలు చున్న వ్రయ్యల దిమి రెంటిఁ గూడఁ[1]బట్టె నవియుఁ గూడి యొండొంటితోఁ, జక్కనంటి రెండునొక్కఁ [2]డయ్యె.

149 క. ఆరాక్షసి కెత్తికొనఁగ, భారముగా వజ్రకఠినబంధురతనుఁడై ధీరుఁడు బాలకుఁ డేడ్చె మ.హారవమున దాని[1]చేతు లాడక యుండఁగ.

150 వ. అబ్బాలకురోదనధ్వని విని [1]యంతిపురంబున నున్న ముదుసలియవ్వ లెల్లం బఱతెంచి మహా[2]హర్షంబుతో వాని నెత్తికొని రట్టి సంభ్రమం [3]బెఱింగి బృహద్రథుండు వచ్చి తేజోధికుం డయి [4]తామ్రతలముష్టిం దన[5]ముఖ పద్మంబునం బెట్టికొని దిక్కులు సెలంగ నేడ్చుచున్న కొడుకుం జూచి [6]కృతార్థీకృతలోచనుం డయ్యె నట్టి [7]యవసరంబున నారాక్షసి కామ రూపిణి గావున మనుష్యస్త్రీ[8]రూపధారిణి యయి యమ్మగధరాజున కిట్లనియె.

148 1. బెట్ట — ఐ.ల. 2 డయ్యె — పెక్కు ప్రతులు: ఈ పద్యము తరువాత క ఖ డ. ప్రతులలో ఇట్లంటిన అను వచనము అధికముగా కలదు. కర్తుకామా సుఖవహేశకలే సాతురాక్షసీ! సంయోజయామాస తదా విధాన బలచోదితా అని మూలము భం. 2-16-39.

149 1. తతః సారాక్షసీరాజన్ విస్మయోత్ఫుల్లలోచనా। నశశాక సముద్వోఢుం వజ్ర సార మయం శిశుం — అని మూలము — 2-16-41.

150 1. యంతః పురంబున - పెక్కు ప్రతులు.
తేనశబ్దేన సంభ్రాంతః సహాసాంతఃపురే జనః
నిర్జగామ నరవ్యాఘ్ర రాజ్ఞాసహపరంతప
తేచాబలే పరిగ్లానే పయః పూర్ణ పయోధరే
నిరాశే పుత్ర లాభాయా సహసై వాభ్యగచ్ఛతామ్॥

మూలము — భం 2-16-43, 44. 2. హరుషంబు — అ.ఉ.ఊ. 3 బువిని — ఏ.ఒ.ఔ. 4 సాంఘ్రికరముష్టిం — ట ; తామ్రముష్టి తలంబు దన ముఖంబునం — ఐ. 5. ముఖంబునం బెట్టి — పెక్కు ప్రతులు. 6. కృతార్థుండై బాష్పీకృత— ల. 7. సమయంబున — క.ఖ గ. 8. రూపంబున వచ్చి — పెక్కు ప్రతులు ; రూపంబు ధరియించి — ఐ.ట.

151 తే. ఏను జరయను రాక్షసి నిప్పు[1]రంబు, చదుకమునఁ బాయకుండుదు సంతతంబు
నీకు [2]నిష్టంబు సేయంగ [3]నెమ్మితోడఁ, గోరుచుండుదు నది సమకూరె [4]నేఁడు.

152 వ. [1]నీ యిద్దఱుదేవులకు నుద్భవిల్లిన యిమ్మనుష్యశకలంబులు [2]రెండును నీదాదులు దెచ్చి యిచ్చుదుకంబు[3]నొద్ద నొక్కచో వైచిపోయిన నేను వానిం గూడఁ[4]బట్టుడు నప్పు[5]డు [6]వజ్రఘనఘటితకఠినశరీరుండై యిక్కుమారుండు మేరుగిరిశృంగంబునుంబోలె నాకెత్తికొన [7]నశక్యుండయ్యె వీని [8]నొప్పుగొను మనిన విని బృహద్రథుండు ముదితహృదయుండయి దాని కిట్లనియె.

153 ఉ. [1]ఇచ్చుకు వచ్చుపూజనల నెంతయు సంతస మంది తొల్లి నా
కిచ్చె మునీశ్వ[2]రుఁడు దయ నిత్తనయున్ మఱి యిప్డు నెమ్మితో
[3]నిచ్చితి వీవు రాక్షసివె యిక్కుల మెల్లను [4]నుద్ధరింపఁగా
వచ్చిన [5]పుణ్యదేవత[6]వు వారిరుహాయతచారులోచనా.

154 వ. అని దాని నతిప్రీతిం బూజించి కొడుకు నెత్తి[1]కొని [2]దేవీద్వయంబునకు నిచ్చి [3]జరయను రాక్షసిచేత సంధింపఁబడినవాఁడు గావున జరాసంధుం డను

151 1. రమున — ఉ.ప ఓ ఘ ఝ సూ. 2. ప్రియమును — ఇ 3. నెమ్మినెపుడు — ఐ; నెపుడు నెమ్మి — ఘ (యతి?) 4 నాకు — ఎ

152 1. అది యెట్లంటేనినీ — ల, అది యెట్లనిన — ఉ జ. 2. రెంటిని — పెక్కు ప్రతులు 3 నొద్దవైచిపోయిన — పెక్కు ప్రతులు. 4. బెట్టిన, బెట్టుడు, బెట్టుటయు — అని భిన్న ప్రతులు. 5 డవి రెండును (నవియు రెండును) నొక్కటియై — క ఖ.డ. 6 వజ్రకఠినశరీరుండై — పెక్కు ప్రతులు. 7. నశక్యంబయ్యె — పెక్కు ప్రతులు. 8 నొప్పగొనుమని — ఘ ట; నొప్పుకొనుమనిన — సూ

153 1. నిచ్చలు — ఆ.ఇ. [యతి?] 2 రుప్రవరు డీ తనయుణ్ — ఈ.ఎ.వ 3. విచ్చితి నీవు — కొన్ని ప్రతులు. 4 నిస్తరింపగా — ణ; విస్తరింపగా — కొన్ని ప్రతులు. 5. ధర్మదేవతవు — ప ఛ ణ. 6. వవశ్యముపంకజచారులోచనా — ఊ

154 1. కొనివచ్చి — ఈ ఎ ల 2. పత్నీ — ఖ జ.డ. 3 జరచేత — పెక్కు ప్రతులు. జరయాసంధితో యస్మాత్ జరాసంధస్తతో భవత్. అని మూలము భం. 2-17-6.

పేరిడి [4]పురం బష్టశోభనంబు సేయించి యారాక్షసి కేఁచేఁట మహోత్స
వంబు సేయించుచుం గొడుకు నతి[5]గారవంబునం [6]బెంచిన.

155 క. ఈహితవిధానముల లో, కాహితదుస్సహా[1]న తేజుఁడయి వాఁడు మహో
త్సా[2]హముతో వర్ధిల్లె [3]ఘృతాహుతులఁ బ్రవృద్ధి[4]నొందు నగ్నియపోలెన్.

-: *జరాసంధుని యొద్దకుఁ జండకౌశికుండు వచ్చుట* :-

సం. 2-17-8

156 వ. ఇట్లు జరాసంధుండు పెరుఁగుచున్నఁ గొండొక కాలంబునకు [1]నొక్కనాఁడు
చండకౌశికుం డందులకు వచ్చిన నతి[2]ముదంబుతోఁ బుత్త్రికళత్రమిత్ర
భృత్యామాత్య[3]సహితుం డయి బృహద్రథుం డెదురు[4]వోయి యమ్ము
నీంద్రునకు నమస్కరించి తోడ్కొని[5]వచ్చి యుచితాసనంబున నునిచి
యడుగులు గడిగి [6]యర్ఘ్యపాద్యాదివిధులం బూజించి [7]తనరాజ్యంబుతోడ
సర్వస్వంబును నివేదించి కొడుకుం [8]జూపినం జూచి సంతసిల్లి మునివరుం
డిట్లనియె.

157 క. జర యను రాక్షసి నీకుం, గర ముపకారంబు సేసె ఘనముగ [1]దీనిన్
[2]ధరణీశ యే నెఱింగితి, నిరుపమనిరతిశయయోగ[3]నిష్ఠితబుద్ధిన్.

---

4. పురంబష్టశోభనంబు సేయించి - కొన్ని ప్రతులలో లేదు - మూలమునను లేదు.
5. గారవం - అ.ఈ ఉ.ప ఐ.ఒ.ఓ.గ. 6 బెంచిన బెరుగుచు — ఉ.ల.

155 1. శరీరుడై — ఘ 2. హంబున— ఉ వ. 3. హుతాహుతిరివానలః— మూలము
భం. 2-17-7. 4. బొందు — ఝ.ఞ.

156 1 నొక్కనాడు - అ.ఇ.ఉ.శ.ష. ప్రతులలో లేదు. 2. ముదంబున—కొన్ని ప్రతులు.
3. పురోహిత సహి — ల 4. వోయి మునీంద్రునకు—పెక్కు ప్రతులు. 5. తెచ్చి —
ఈ ఎ.ఓ.ఔ.ఘ.ఝ.ట.ల.శ.ష ; వచ్చియుచ్చాసనంబున—ఈ.స. 6. యర్ఘ్యంబిచ్చి —
అ.క.ఖ.ఘ. 7. రాజ్యంబుతోడ తన సర్వస్వంబును - ఞ. 8. జూపిన సంతసిల్లి —
ఏ.ఔ.ఘ.

157 1. దానిన్ — కొన్ని ప్రతులు. 2. ధరణీశ్వర యే నెరిగితి — అ.ఇ.ఈ.ఒ.వ.
3. నిశ్చిత — డ.

158 వ. [1]ఇక్కుమారుండు కుమారునంతియ[2]శక్తిసంపన్నుం డయి [3]త్రిపురాంతకు నంతకహారుం బరమేశ్వరుం దనకు [4]సన్నిహితుం జేయు నెంత బలవంతు లయ్యును వైరివీరులు వీనిం [5]దాఁకి యగ్నిఁ దాఁకిన శలభంబులుం [6]బోలె నడంగుదురు [7]గరుడనిగతి నన్యవిహంగంబు లనుగమింప నోపనియట్లు మానవులు వీని [8]వీర్యంబు [9]ననుగమింప నోపరు తేజస్వులలోన నాదిత్యుండు [10]వెలుంగునట్లు వీఁడు మూర్ధాభిషిక్తులలోన [11]మిగిలి వెలుంగు నది[12]రయంబులు మహాపర్వతంబుల ఛేదింపనోపనియట్లు [13]దివ్యాస్త్రంబులు వీని దేహంబు భేదింప నోపవు సముద్రంబు [14]మహానదులం జేకొనునట్లు వీఁడు పరమహీపతులసంపదలు చేకొను నని జరాసంధుసామర్థ్యంబు చెప్పి చండకౌశికుం డరిగిన.

159 క. [1]తనయుని [2]నభినవయౌవను, ననుపము భిషిక్తుఁ జేసి యవనీభర మా తనిఁ బూన్చి సభార్యుం డయి, యనఘ తపోవనమునకు బృహద్రథుఁ డరిగెన్.

*-: కృష్ణుఁడు భీమార్జునులను దనతోఁ బంపుమని ధర్మజు నడుగుట :-*

సం. 2-17-25

160 వ. [1]ఆ జరాసంధుండును [2]నాయుధనిహతులుగాని హంసడిభకులు దనకు సహాయులుగా నపరాజితం బయినపరాక్రమంబు సం బర[3]చక్రపతుల[4]భంజించుచు.

158 1 అని పలికి మరియు నిక్కుమారుండు — ఏ.ల 2. శక్తిమంతుండై — ఇ.ఈ.ఊ ఎ.ఐ.ఒ క గ.ఘ జ.ఝ.శ.ష ; శక్తివంతుండై — అ.ఏ ట.బౌ.ఖ.ణ 3. పురాంతకు — పెక్కు ప్రతులు. 4. హారం...... స్వయంద్రష్ట్యతిమాగధః అని మూలము భం 2-17-19. 5. దాకిననగ్ని — ఇ. 6. బోలెనందయణం గుదురు — ల. 7. గరుడుని — కొన్ని ప్రతులు 8 భుజవీర్యంబు—బౌ.ల, శౌర్యంబు — ఏ. 9. సహింపనోపరు — ఊ. 10. మిగులవెలుంగు — క.ఖ డ. 11. మిక్కిలి – ఆ.ఒ ఓ ; మిగుల — ఎ ; మీరి — ధ.జ 12 ప్రవాహంబులు – అ.ఓ.గ.ఘ ; ప్రవాహవేగంబులు — క ఖ 13. శస్త్రాస్త్రంబులు – ఎ.ఏ ఐ. దేవైరవివిసృష్టాని శస్త్రాణ్యస్య. మూలము 14. మహా – పెక్కు ప్రతులలో లేదు.

159 1. తనయు నతిరూపయౌవను — పెక్కు ప్రతులు. 2. నిరూఢయౌవను – ట.

160 1. అనంతరంబ యాజరా — ల 2. నస్త్రనిహతులు గాని — ఈ ఊ.ఎ.ఐ. ఓ.ఖ.చ.ఝ ట.శ.ష ; శస్త్రనిహతులు గాని—ఏ.క. 3 చక్రంబుల(లు)—అ.ఓ. 4. భంజింపుచు—ఝట ల ; జయింపుచు — క.ఖ.డ.

161 చ. [1]అయనవిహీనుఁడౌ సవితృనట్లు విఖండితపక్షతిద్వయుం
డయిన ఖగేంద్రునట్లు నుతి హంసుఁడు నాడిభకుండు నంతక
క్షయగతు లైన [2]నిప్డు గతగర్వమునన్ మగధేశ్వరుండు ని
శ్చయమతి నున్నవాఁడు [3]నిజసంక్షయకాల[4]విశంకితాత్ముఁడై.

162 ఉ. [1]అమ్మగధేశు నుగ్రబలు నాయుధయుద్ధమునన్ జయింపఁగా
నిమ్మహి నోప రెవ్వరు [2]సుమేశ్వరుఁ డట్టివరమ్ము వానికిన్
నెమ్మి[3]నయిచ్చెఁ గావున వినీతుఁడు వాయుసుతుండు మల్లయు
ద్ధమ్మున [4]నోర్చు నాతని నుదగ్రమహోభుజ[5]శక్తి యేర్పడన్.

163 క. బలిమిమెయిఁ జూర్ధరజా, బలమును [1]జవనసుతుబాహుబలమును [2]నాని
ర్మలనీతిబలము నీకుం, [3]గలుగ [4]నసాధ్యంబు గలదె కౌరవనాథా.

164 చ. తడయక యేఁగి నీతిబలదర్పము [1]లొప్పఁగ వాని డాసి క
వ్వడియును నేను భీముఁడు నవశ్యముఁ బోర బృహద్రథాత్మజుం
గడిఁదిరిపున్ జయింతుము జగన్నుత నన్నెద నమ్ముదేని యి
ల్లడ యిడు [2]భీము నర్జును నలంఘ్యబలాఢ్యుల నావశంబునన్.

161 1. అయనయ హీనుడైనపతియట్లు — అ.ఈ.ఔ.క.ఝ.డ.ణ.శ.ష.స; అయన విహీనుడైన రవియట్లు — ఇ.ఉ.ఓ.గ.చ.వి. 2. చోనివృతగర్వమునన్ — ఓ. 3. పతితౌ హంసడిభకౌ కంసామాత్యౌ నిపాతితౌ జరాసంధస్య నిధనే కాలోఽయంసము పాగతః భం. 2-18-1. 4. విడంబితాత్ముడై — క.ఖ, నిశ్చితాత్ముడై — చ.

162 1. ఈ పద్యము - ఏ.ఔ.చ.ణ. ప్రతులలో లేదు అ.ఇ.ఎ.ఏ.ఔ.ధ. ప్రతులలోనీ పద్యము 120 గా నున్నది. 2 మునీశ్వరు — అ.ఎ. 3. గనిచ్చె — ఉ.ఓ.ల; నొసంగె — క.ఖ.డ.వి.శ.ష. 4. జంపు — పెక్కు ప్రతులు. 5. గర్వమేర్పడన్ — ఝ.

163 1. వాయుసుతు — అ.ఓ.ఘ 2 నీ నిర్మల — ఎ.స. (కాని యిది మూల విరుద్ధము); నీ నిర్మల నీతిదివ్యబలమున్ గలుగ — ఇ. 3 గలుగు — గ.ఘ. 4. నసాధ్యములుగలవె — ఝ.వి.శ.ష.

164 1. తేర్పడ - ఖ. 2. భీముపార్థుల — ఉ.ఊ.ఓ; భీమపార్థుల - ఔ.క.డ

165 వ. అని నిశ్చయించి పలికిననారాయణుని [1]విజయశ్రీవిభాసితముఖులైన భీమార్జునులం జూచి [2]సంతుష్టాంతరంగుం డయి ధర్మతనయుం డిట్లనియె.

166 చ. [1]ప్రియహితసత్యవాక్య యరిభీషణ కృష్ణ భవన్ని[2]దేశసం
శ్రయమున నున్న మా[3]కధికశత్రుజయం బగు టేమి పెద్ద ని
శ్చయముగ నింక మోఱితుల సర్వమహీ[4]శులు నిమ్మహాధ్వర
క్రియయును సిద్ధిఁ [5]బొందె నయకిల్బిషకీర్తి వెలుంగు[6]చుండఁగన్.

167 క. ధరణీధర సర్వగుణా, కర కరుణానిరత సర్వకార్యైకధురం
ధర [1]నినుఁ బడసిన మాకును, హరివిక్రమ పడయరాని [2]యవియుం గలవే.

168 వ. అని [1]సంతసిల్లి మఱియు నాత్మగతంబున.

169 క. నయనములు నాకుఁ బవనత,నయవిజయులు మనము కమలనాభుఁడు పిఱం
బ్రియహితులఁ బాసి [1]నిమిషం,బయినను [2]నెట్లుండ నేర్తు నవిచేష్టుఁడనై.

165 1. వీరశ్రీ - పెక్కు ప్రతులు. 2 సంతోషాయత్త చిత్తుండై — సంతోషమగ్న మానసుండయి — సంతోష మందస్మితాననుండై - ఇత్యాదిగా భిన్నప్రతులలో కలదు.

166 1. ప్రియహిత కార్యవైరికులభీకర - అ.ఈ.ట, ప్రియహిత వాక్యవైరికులభీకర- ఆ.ఇ ఎ ఏ.ఐ.ఒ.ఔ.క.ఖ గ.ఛ.జ ణ.ల.శ.ష. 2. యోగ — ఆ.ఉ.ఊ.ఎ.ఏ.ట.ణ. ల.వి.శ.ష. 3 కరయ — క ఖ.గ. 4 పతులెల్లన — ఈ.ఎ.ఐ; పతులిమ్మహా - ఇ.గ.శ. 5. బొందుననకిల్బిష - అ, బొందుకృతకృత్యత - ఓ; బొందెకృతకృత్యత - ఔ.ఛ.జ ణ.ల.శ ష. 6 నట్లుగన్ - ణ.

167 1. నిమ్న బడసి నూకును - అ.ఇ ఈ ఎ.ఐ ఓ.ఘ.స ; నిను గొలిచిన మాకును — వ. 2. యదియుంగలదే — ఊ.

168 1. సంతోషించి — పెక్కు ప్రతులు, సంతోషించి యాత్మగతంబున — ఇ.ఊ.ట.

169 1. నిమిషం - ణ; నిముసం — డ. (నిముషము — అనురూపమిందు కనఁబడుచున్నది గాన — నిముసము అను వికృతికి మూలరూపమై యుండవచ్చును) 2. వర్తింపజాల - అ.ఓ.ఘ.

170 వ. అయినను నాహ్లాదయంబు గరంబు [1]హృద్యంబగుచున్న యది కృష్ణార్జునులం దలంచినవారికి శ్రీవిజయం[2]బు లగు ననిన [3]నమ్మహాత్ములం దనకు సహాయులంగాం బడసిన భీమసేనునకు శ్రీవిజయంబు లగుట యేమి సందేహం బని నిశ్చయించి [4]మీకుం గార్యసిద్ధి [5]యయ్యెడ మరుగుం డని పంచిన.

171 క. [1]ఘోరరిపుం [2]జంప నరిగెడు, వీరుల వార్ష్ణేయ పాండవేయుల సింహాకారులం జూచి మనంబున, ధీరుండు ముద మందె నయ్యుధిష్ఠిరుం డంతన్.

-: కృష్ణభీమపార్థులు జరాసంధుం జంపంబోవుట :-

సం. 2-18-26

172 వ. కృష్ణ[1]భీమపార్థులు [2]కృతకస్నాతకు లయి చని [3]యేకపర్వతప్రభవంబులైన కాలకూట శోణ [4]గండకీ సదానీర లను నేఱుల లంఘించి సరయూనదియునుం బూర్వకోసల మిథిలాదేశంబులును గంగయుం గడచి పూర్వాభిముఖు లయి [5]నిత్యప్రయాణంబుల నమ్మగధదేశంబు సొచ్చి గోరథం బనుపర్వతం బెక్కి.

170 1. ముదితంబగుచున్నది-అ.ఓ; ప్రముదితంబగుచున్నది-ఘ, సంతుష్టంబగుచున్నది-ఐ.ట. 2. బులుగలుగుననన-ల.ణ; బులుగలుగుననిన—ఒ.డ 3. నమ్మహాపురుషుల - ఈ.ఏ.ఐ.ట వీ శ.ష. 4. ఈ వచనమున—దలంచిన వారికి విజయంబగుననిన ... విజయంబగుట — అనికొన్నిప్రతులు మీకు కొన్ని ప్రతులలో లేదు 5. యయ్యెడ మరుగుండని — ఝ; యయ్యెడు మరుగుండని — వా పెక్కు ప్రతులు.

171 1. పోరరిపు — అ.ఈ.ఖ గ.ఘ శ.ష; పోరి — ఐ.క. 2. గెలువ — ఇ.

172 1. భీమార్జునులు — క.ఖ చ; భీమవిజయులు — అ.ఇ.ఈ.ఎ.ఐ.గ.ఘ. 2. వీరశ్రీవిభాసితముఖులై కృతస్నా(ను)తకు లయి — ఐ.క.ఖ.ట ణ.ల.వీ.శ.ష.స; కృతస్నానులయి — అ ఏ.గ ఘ.చ.ఛ జ మూలము. వర్చస్వినాం బ్రాహ్మణానాం స్నాతకానాం పరిచ్ఛదాన్ ఆచ్ఛాద్య — భం. 2-18-22 3. యనేక పర్వతంబులు గడచి తత్ప్రభవంబులైన — ల.వీ.శ.ష.స. 4. కంటకీయ గోదావరీసునామ సదానీర—ఐ.ట; మఱియు భిన్నప్రతులలో కంటకీయ సాధాఫరము, కంటకీయ జనపదానికరంబు — ఇత్యాదిగా భేదము లున్నవి. కాని మూలమున — రమ్యం పద్మసరోగత్వా కాలకూటమతీత్యచ గండకీయాం తథాశోణం సదానీరాంతదైవచ। ఏకపర్వతకేనద్యః క్రమేణేత్య వ్రజంతి తే। సంతీర్యసరయూం రమ్యాం దృష్ట్వాపూర్వాంశ్చ కోసలాన్ అతీత్యజగ్మర్మిథిలాం ములాం చర్మణ్వతీం నదీమ్ అని కలదు. భం. 2-18-26,27,28. 5. నిరంతర — ఈ.ఎ ఏ.ఐ.క.ఖ.డ.ల.వీ.శ.ష.

173 చ. ఉరుతరహర్మ్యమాలికల నొప్పు గిరివ్రజ మన్పురంబుఁ గాం
చిరి [1]నవసౌరభప్రసవచిత్రవనావళి గల్గుదాని నె
వ్వరికి [2]దురాసదంబు లగు వజ్ర[3]మయోన్నత[4]వప్రచారుగో
పురములదాని నయ్యలకఁ [5]బోలెడుదాని మహార్థసంపదన్.

174 వ. కని [1]దాని యపూర్వరామణీయకసమృద్ధి కచ్చెరువడి [2]యచ్యుతుండు భీమార్జునుల కిట్లనియె.

175 క. [1]గోరథమును ఋషభము వైహారము ఋషిగిరియుఁ [2]జైత్యకాద్రియు ననఁగా
[3]భూరిగిరు లేను [4]దీనికి, శూరభటులువోలెఁ [5]గాచి చుట్టును నుండున్.

176 వ. దానఁజేసి యిప్పురంబు గిరివ్రజంబు నాఁబరగె నిందుఁ దొల్లి గౌతముం డౌశీనరి యను [1]శూద్రయందుఁ [2]గాక్షీవాదుల సృజియించె [3]నట్టి గౌతమానుగ్రహంబును [4]ను నీదుర్గబలంబును [5]నుం జేసి యిమ్మాగధుల నెవ్వరు[6]ను జయింప నోప [7]రనుచుఁ దద్ద్వారంబు[8]నం బురంబు సొర నొల్లక [9]చైత్యకగిరి శృంగంబున కరిగి యందున్న మూఁడు భేరులం[10]జూపి [11]తొల్లింటి మాగ

173 1 వర — చ 2. నగోచరం—ఇ.ఉ.ఛ.జ.ణ.వ 3 ఘనోన్నత — పెక్కు ప్రతులు 4 చారువప్ర—అ.ఆ ఊ.ట క.ఖ.గ. 5. బోలిన—పెక్కు ప్రతులు.

174 1 దాని రమణీయ సమృద్ధి — అ.ఊ.ఎ.ఏ ఒ ఔ చ.ణ ; దాని సమృద్ధి — ఇ.ఈ. ఐ.క.ఖ గ.ఝ.శ.ష. 2 నారాయణుండు — కొన్ని ప్రతులు.

175 1. గోరథమును వృషభమునుపై — శ.ర. పెక్కు ప్రతులు. వైహారోవిపులః శైలోవరాహోవృషభస్తథా। తథైవార్షిగిరిస్తాత శుభాశ్చైత్యక పంచమాః — అని మూలము భం 2-19-2 వరాహో అను దానికి వరార్హో అని పాఠాంతరము 2 జైత్రకాద్రి — యని పెక్కు ప్రతులలోఁ గలదు కాని యిది మూల విరుద్ధము. 3 సూరెలగిరు లేనుననివి — ఝ.పీ శ ష స.సూ ; సారగిరు — గ.ల ; బూరుగిరు — క.ఖ 4. దీనిని — కొన్ని ప్రతులు. 5. గొల్చి — అ ఆ.ఊ ఏ.ఔ ల స ; గొల్చునూరెల — ట ; నిల్చిచుట్టును — స.

176 1 శూద్రిక (శూద్రి)—అని కొన్ని ప్రతులు కాని మూలమున శూద్రాయాం యని కలదు. భం. 2-19-5. 2 కక్షపాదుల, గక్షపాదుల, గక్షపాదాదుల—ఇత్యాదిగా రూపములు భిన్న ప్రతులలోఁ గలవు. కాని మూలము కాక్షీవాదీన్సుతాన్ అని యున్నది. భం. 2-19-5. 3. గావున నట్టి—ఉ.క.ఖ.డ. 4.5 6. సముచ్చయార్థకములు పెక్కుప్రతులలో లేవు. 7. రని చెప్పుచు — ఇ ఎ.ఏ.ఔ.ణ.ల 8. సొర నొల్లక—ఆ.క 9. చైత్యకాద్రి — ల 10. జూచి—పెక్కు ప్రతులు. 11 తొల్లి

ధులు [12]మానసపాదం బను ఋషభంబు వధియించి దానిచర్మంబున వీని [13]నిర్మించి రవి యిప్పురంబు వింతవారు [14]చొచ్చునప్పు డమ్మునికీర్తిం జేసి [15]మ్రోఁగియు [16]ననిన.

177 ఉ. దారుణ[1]వజ్రచారుభుజదండములన్ బలవ[2]ద్వైచారగం
భీరులు [3]ధీరులాక్షణమ భేరులు [4]మూఁటిని వ్రచ్చి చైత్యక
స్ఫారనితంబ[5]దేశమును భగ్నము సేసి గిరివ్రజంబు [6]న
ద్వారము[7]నందుఁ జొచ్చి రతి[8]దర్పితు లా యదుకౌరవోత్తముల్.

178 క. [1]ఘోరాకారులు మాలా, కారగృహంబు[2]లకు గంధికగృహంబునకుం
దా రరిగి మువ్వురు బలా, త్కారంబునఁ గొనిరి [3]పుష్పగంధము లొప్పన్.

179 వ. అందు [1]మాల్యాలంకృత[2]మౌళులుఁ జందనాగరు[3]రూషితహస్తులు విస్మయమాన[4]మాగధనిరీక్ష్యమాణులు నయి రాజమార్గంబు [5]గడియం జని [6]యనవరతంబును బ్రాహ్మణులకు [7]సుప్రవేశం బగుచున్న జరాసంధు

మాగధులు—ఝ. 12. మాషాదంబను—ఈ.ట, మహీషాదంబను — క డ మా షాదమృషభమానసాద బృహద్రథః అని మూలము భం. 2-19-15 పి.పి.యస్. 2-21-51 13 నిర్మించిననవి (నివి)—పెక్కు ప్రతులు 14 వచ్చినప్పుడ—ఇ ఓ.ట 15. తమ యంతనమ్రోయు — ఆ. 16 నని తత్క్షణంబున — అ.ప ల.

177 1. వజ్రపాతభుజ — ఇ (?) 2. ద్విధాన — ఈ.ఎ ఐ శ.ష. 3. వీరులక్షణమ — అ.ఆ.ఈ ఊ ప ఒ ఓ ఔ.ఘ చ.ఝ ణ 4 మూడును — ఈ.ఎ.ఐ.శ ష. 5. దేశ మున — పెక్కు ప్రతులు 6. దద్ద్వారము — ల.ష. 7. త్రోవ — ట 8. దర్పితయాదవ — పెక్కు ప్రతులు ; దర్పులుయాదవ — ఉ.ఐ ట.ప.

178 1 బలాద్గృహీత్వా మాల్యాని మాలాకారాన్మహాబలాః విరాగవసనాః సర్వే స్రగ్విణో మృష్టకుండలాః — అని మూలము భం. 2-19-24. 2. నకు నపుడు కడువేడుకతో — కొన్ని ప్రతులు ; లకు గంధకర గృహములకున్ - ట.వీ.శ ష. 3 మాల్యగంధములర్థిన్ - స ; మాల్యగంధము లొప్పన్ - ఊ.ఘ.ల.

179 1. గంధమాల్యాలంకృతదేహులు — ఊ. 2. వేషులు — శ.ష. 3. రజో భూషిత (శరీరులు. దేహులు, వక్షులు, హస్తులు) — ఇత్యాదిగా భిన్నప్రతులు. 4. పౌరనిరీక్ష్య - అ.ప ఔ ; పౌరజన నిరీక్ష్య - ఎ.ల 5. దరియంజని - పెక్కు ప్రతులు 6. యందనవరతంబును — పెక్కు ప్రతులు. 7 సులభప్రవేశం —

సుందరంబు గోవాసంబు [8]హిమవత్సింహంబులు సొచ్చునట్లు యాదవ పాండవ [9]సింహంబులు సొచ్చిన.

—: జరాసంధుఁడు కృష్ణభీమసేనార్జునుల కెదురువచ్చుట :—

సం. 2—19—29

180 ఆ. అర్ధరాత్రమయిన నభ్యాగతద్విజ,స్నాతకులకు నెదురుచని కరంబు
భక్తిఁ బూజ[1] లిచ్చు పరమ[2]వ్రతుం డప్పు, డెదురు [3]వచ్చి వారి కిష్ట మెసఁగ.

181 క. ధీయుతుఁడయి మధుపర్కము, సేయఁగ సమ[1]కట్టి దానిఁ జేకొనని[2]మహో
పాయుల గర్వంబు నఖి, [3]ప్రాయంబు నెఱింగి మగధపతి యిట్లనియెన్.

182 తే. స్నాతకుల రేని పూవులుఁ [1]జందనంబుఁ, జనునె బలిమి[2]మైఁ గొని తాల్పఁ జైత్యకాద్రి
తటము [3]మీరిట్లు వచ్చి దోర్దర్ప మెసఁగఁ, జులుకన ద్వారమునఁ బ్రోలు సొరఁగ నగునె.

183 వ. మఱియు నాకావిం[1]చిన మధుపర్కంబు [2]ప్రతిగ్రహింప [3]నొల్లమి యిది యేమి [4]మీరలు వేషధారుల కావలయు మీవేషంబున బ్రాహ్మణత్వం

అ.ఊ.ఒ.ఘ. 8 హైమవత్సింహంబులు—పెక్కు ప్రతులు; హైమవత సింహంబులు—ట.డ.పీ; హైమవత సింహకిశోరంబులు—ల.శ.ష స. గోవాసమివ వీతుంతఃసింహా హైమవతాయథా — అని మూలము భం. 2—19—25 9. కౌరవ — క.ఖ.గ.ఝ డ పీ.

180 తాన్ పాద్యమధుపర్కార్హాన్ మానార్హాన్ సత్కృతింగతాన్ । ప్రత్యుత్థాయ జరాసంధ ఉపతస్థేయథావిధి — అని మూలము. భం. 2—19—29. 1. సేయు — ల. 2. ధర్మవ్రతుం డెదురు — ఇ 3. పోయి — క.ఖ డ ల.

181 1 కట్ట — శ. 2. మహాపాయుల — ఒ.ఖ 3. ప్రాయమును నెరింగి — ఔ.ణ; ప్రాయము దా నెఱిగి — ఎ.ల

182 1. బూతనంబు — భాసం 2. చేకొని — స, గైకొని — ఈ ఊ.ఎ; నిగొనితాల్ప — పీ.శర. 3. భేరులు — పెక్కు ప్రతులు.

183 1. మమధుపర్కంబు — పెక్కు ప్రతులు. 2. పరిగ్రహింప — పెక్కు ప్రతులు 3. నొల్లకున్నవారు — క.ఖ గ మీ రెందుండి వచ్చితి రెవ్వరు — ఖ.గ.డ.స. ప్రతులలో నధిక పాఠము 4. మీరు — పెక్కు ప్రతులు

బును మహాసత్త్వ దీర్ఘబాహు [5]పృథులవక్షోలక్షణంబుల క్షత్రియత్వంబును ప్రకాశించు[6]చున్న యవి యనిన వానికి నారాయణుం డిట్లనియె.

184 క. స్నాతకులు పుణ్యకర్మన, నాతను [1]లగుచున్న బ్రాహ్మణక్షత్త్రియ వి
జ్ఞాతులయందును క్షత్త్రియ, జాతిస్నాతకుల మేము [2]జనవినుతమతిన్.

185 వ. [1]ద్వారంబున మిత్త్రనివాసంబును నద్వారంబున [2]నమిత్త్రనివాసంబును జొచ్చుట యిది బాహువీర్యసంపన్ను లయిన క్షత్త్రియులకుం గర్త వ్యంబు మఱి గంధమాల్యంబులయందు లక్ష్మి యుండుం గావున బలాత్కా రంబున గంధమాల్యంబులు గొంటిమి [3]నీయందుల మాకు [4]నొండు కార్యంబు గలుగుటం జేసి [5]నీయిచ్చునర్ఘ్యంబు గొన నొల్ల [6]మనిన [7]జరాసంధుం డిట్లనియె.

186 ఆ. మీరు నాకు నేను మీకు [1]నెన్నండు ము, న్నహిత మాచరించినదియు లేదు
మీకు నేల నే నమిత్త్రుండ నైతి ని, రాగసుండ సద్గుణాన్వితుండ.

187 క. సురమునివరులకు వసుధా,మరులకు భక్తుండ నుత్తమక్షత్త్రికులా
చరితుండ ననిన [1]ధరణీ,ధరుఁ [2]డమ్మగధేశ్వరునకుఁ దా నిట్లనియెన్.

5 పృథువక్షో — పెక్కు ప్రతులు 6. చున్నవారనిన— పెక్కు ప్రతులు.

184 1. లనబరఁగు - ఝ పీ.శ.ష స 2 జనవినుతనిధీ — పెక్కు ప్రతులు ; జనవిను తమతీ - స ల ; సౌజన్యనిధీ — స.

185 1. మరియు ద్వారంబున — అ.ఆ ఒ ఘ.ల 2 శత్రు — అ.ఊ.ప.ఔ.జ. 3 నీ యందు మాకు — పెక్కు ప్రతులు. 4. నొండొక్క — ల. 5. నీయిచ్చు — కొన్ని ప్రతులలో లేదు. 6. మైత్రిమనిన—ఉ.ణ. 7. వారికి జరా - ఈ.ఎ.పీ. శ ష ; వారలకు జరా - ఓ ఝ.

186 1. మున్నెన్నడును నహిత - ఈ.ఉ.ఎ.ఐ.గ.ల

187 1. నవనీధరు - పెక్కు ప్రతులు. 2. డమ్మను జేశ్వరునకు — వ ; డమ్మగధేశు నకును—ప ఒ ఝ.

188 క. [1]కుల [2]రక్షార్థ మఖిలనృప, [3]కలోద్వహుని యోగమున నకుంఠితశస్త్ర
ప్రళయ[4]విధాయుల మయి యిం, దులకున్ వచ్చితిమి దుష్టదూషణబుద్ధిన్.

189 సీ. కడఁగి యత్యుత్తమక్షత్త్రియచరితంబునందు [1]వర్తిల్లుదు నంటి జనుల
కెవ్వరి కెప్పుండు నెగ్గొనరింప నే నంటి సత్క్షత్త్రియు లవని నొరులు
నీయట్లు క్రూరులై నృపతులఁ జెఱఁబెట్టి [2]పశువరించుచుఁ బశుపతి నుమేశు
వరదుఁ బూజించిన[3]వారును గలరె మున్నింతకు నగ్గలం బెద్ది యెగ్గు

ఆ. కారణంబు లేక [5]దారుణుఁ డయి సాధు, హింస సేయు కుజనుఁ డెల్లవారి
కప్రియుండ కాక యప్రియలక్షణం, బొండు[6]గలదె తలఁప నుత్తములకు.

190 వ. [1]నిర్దయుండవై [2]సవర్ణుండు నిర్దోషులైన [3]సవర్ణుల వధియించునంతకంటె
మిక్కిలి పాతకం బొం డెద్ది [4]నీయట్టి పాప[5]కర్ముల నుపేక్షించిన సఖిల[6]ధర్మ
రక్షణక్షముల మైన మమ్ముఁ [7]దత్పాపంబు వొందు నని పాపభయంబున
నిన్ను నిగ్రహింప వచ్చితిమి నాకంటె [8]నధికుం డైన క్షత్త్రియుండు లేఁడని
గర్వించి యొరుల నవమానిం[9]చి పలుక [10]వలదు.

188 1 కులరక్షణార్థమై నృపకులమౌళిని యో – ఆ 2 రక్షణార్థముగన్నృప – గ; రక్షణార్థముగ గురుకులో — ఊ; రక్షణార్థముగా మత్కులనృపతిని — ఓ. 3. కులోద్భవ – ఆ ఊ ఒ.ఘ. 4 విధేయులమై — ఇ.క గ.డ.

189 1. వర్తిల్లెడునట్టి జనుల – డ. 2 పశువుగావధియించి వరునుమేశు — ట. 3. వారలు – ఎ.ఒ కె.గ.ఝ 4. కలదు – ఆ ణ. 5. దారుణంబగు – క.ఖ. పీ.శ.ష.స; దారుణంబున – ఈ.ఎ.ఐ.ట 6. తలపగలదెయుత్త – ఔ క.ఖ.ఘ.డ.

190 1. నిర్దయుండవై నిర్దోషులగు — పెక్కు ప్రతులు. 2. నవర్ణుండు — వా. కాని సవర్ణోహి సవర్ణానాం పశుసంజ్ఞాం కరిష్యతి అని మూలము. 3. స్వవర్ణుల – ఆ.ఊ ఏ.ఒ; సద్ధర్ముల – క.ఖ డ; సధర్ముల — శ.ష 4. (అట్టి) ఇట్టి పాపకర్ముల – అ.ఇ ఉ ఎ.ఐ.ఒ.ఔ.గ ఘ.ఝ. 5. కర్మ నుపేక్షించిన – ఉ ఊ ఏ ఒ.ఔ.ఘ.ఝ ణ. 6. ధరాధర్మరక్షణక్షముల — ఏ.ల; ధరారక్షణపరులైన (తత్పరులైన) – కొన్ని ప్రతులు. 7. దత్పాతకంబు – ఉ.ఊ ఏ.ఒ.ఓ. 8. నధికుండు క్షత్రియుండు — పెక్కు ప్రతులు 9 ప వలవదు – ఉ.ఎ ఏ.ఖ ఘ. 10. జనదు — ఔ.ఛ.ఝ.ణ

191 క. అవినీతు లయి మహాత్ముల, కవమానము సేసి నహుష జయద్రథ దంభో
ద్భవ కార్తవీర్యు[1]లనువా,రవజితు లయి రౌరులచే మహాబలు లయ్యున్.

192 తరలము. అతులవిక్రమసంపదన్ రణయజ్ఞదీక్షితులై రిపు
ప్రతతి నోర్చినవీరు లుగ్రతపంబు సేసినవారు స
ద్గతికిఁ బోదురుగాక యిట్లపకారదారుణవృత్తి[1]ను
ద్ధతిని భైరవపూజ సేసిన దాన సద్గతి గల్గునే.

193 తరలము. [1]చెడక నావచనంబు సేయుము చెచ్చెరన్ [2]ధరణీశులన్
విడిచి [3]పుచ్చుము యేను కృష్ణుఁడ వీఁడు భీముఁడు వాఁడు గ
వ్వడి భవత్కృతదారుణం [4]బనుపహ్ని యార్పఁగ నున్న య
క్కడిఁదివీరులు వీర లిద్దఱు గర్వితుల్ కురుసింహముల్.

194 క. కడుఁ గ్రూరుఁడ వయి నృపతుల,విడువనినాఁ డాజి ఖాండవేయులు నీయు
క్కడఁచి భుజశక్తి యేర్పడ, విడిపింతురు గడిమి [1]నిఖిలవిషయాధిపులన్.

195 వ. అనిన విని జరాసంధుండు సటా[1]సముత్పాటనకుపితకుంజరవైరియుం
బోలెఁ గడు నలిగి పటుకుటిలభ్రుకుటీ[2]ఘటిత[3]నిటలుం [4]డగుచుఁ బురు
షోత్తమున కిట్లనియె.

191 1. లణగరెయ — ఇ.

192 1. నుద్ధతుడవై సురపూజ — ఓ.క ఖ గ.ట ; నుద్ధతుడవై శివపూజ — ఘ. నుద్ధతుడవై నరహింస చేసిన — . స.

193 1. చెడకు — ఒ.వీ స 2 వసుధీశులన్ — ఇ. 3. పుచ్చుము నేను — అ.ఈ. ఎ ప ఐ.ఒ.గ ల వీ.శ ష 4 బగు — కొన్ని ప్రతులు ; బనువహ్నినార్పగ — సం.

194 1 నఖిల — పెక్కుప్రతులు

195 1 సముత్పాటితకుంజరవైరి — ఐ ; సముజ్జ్వలకుపిత — ఘ. 2. ఘటిత — కొన్నింట లేదు. 3. నిటలతటుండగుచు — అ.ఎ.ఏ.ఔ.ఝ ణ.ల. 4. డగుచు నిట్లనియె — పెక్కు ప్రతులు.

196 క. అమితపరాక్రమమున నా, క్రమించి పరనృపుల నోర్చి [1]గర్వించుట [2]దో
సమె యిది [3]సత్క్షత్త్రియు [4]ధ, ర్మము సేసె నెప్పుడుఁ బరాక్రమప్రతుఁడ నిలన్.

197 క. [1]దేవార్థముగాఁ దెచ్చిన, యీవసుధాధిపుల నేల యే విడుతుఁ బ్రతా
[2]పావజితరిపుఁడఁ [3]గావున. నీవెఱుఁగవె [4]తొల్లి ధారుణీధర నన్నున్.

-: జరాసంధుఁడు యుద్ధమునకు భీమునిఁ గోరుకొనుట :-

సం. 2—20—25

198 సీ. సమకట్టి సైన్యంబు సైన్యంబుతో నొండెఁ దొడరి మీముగ్గురతోడ నొండె
[1]నిద్దఱతో నొండె [2]నెక్కటి యొక్కనితో నొండెఁ బోడిచెద దోర్బలమున
[3]నేయాయుధంబున [4]నెమ్మెయిఁ బోరంగ నిష్ట [5]మయ్యది యుత్సహింపుఁ
డనిన
నొక్కనితోఁ [6]బల్వు రుద్ధతు లయి పూని యుద్ధంబు [7]సేయుట యుచిత
మగునె

ఆ. యధికబాహుబలుల మయిన మాముగ్గుర, [8]యందు నొక్కరుని మహా
బలాఢ్యుఁ
గోరికొనుము వాఁడు ఘో[9]రాజిలో నిన్ను, మొనసి మల్లయుద్ధమున
[10]జయించు.

196 1. గర్వించిన — అ.ఒ.ఘ. 2. పాపమె — ఝ. 3. క్షత్త్రియులకు ధర్మమ — ఘ.
4. ధర్మము నే — శ.ష.

197 1. దేవార్థంబుగ — ఆ ఇ. 2. పావిదితరిపుఁడ — ఓ.ఔ; పావర్జితరిపుఁడ —
క.ఖ.డ; పావర్జితరిపుఁడ — ఇ.ఊ.ఐ.గ; పావహితుండనుగావున—ఝ.ణ. 3 నగు
టను (యు) — ఏ ఔ స. 4 మున్ను — ఆ.ఓ.

198 1. నిద్దఱితో — ఆ ఐ.ఓ.ఔ ఖ.గ.ణ. 2. నేర్పడ — స. 3. నేయాయుధంబుల —
పెక్కు ప్రతులు. 4. నెమ్మిం — ఇ; నెమ్మియు — ఉ.ఐ; నెమ్మితో — ఊ.
(అఖండయతి) 5. మెయ్యది — పెక్కు ప్రతులు; మయ్యోడిను — క.డ.
6. బల్వురుద్ధతితోఁబూని — ఊ; ముగ్గురుద్ధతిమై — ల. 7. సేయంగను —
క.డ. 8. యందులోన నుజ్వలాత్మనొకని — ఆ.ఘ.ల. 9, రంబుగా నిన్ను —
పెక్కు ప్రతులు. 10. నడంపు — స.

199 క. అనిన మురవైరి పలుకులు, విని బార్హద్రథుఁడు భూరి[1]వీర్యు మరుష్టుం
దనుఁ గోరికొనియె నీతం, డని [2]నెన యగు నాకు ననుచు నతి[3]దర్పితుఁడై.

200 వ. [1]ఇట్లు జరాసంధుండు భీమసేనుతో మల్లయుద్ధంబు సేయ [2]నిశ్చయించి తనతనయు సహదేవుని [3]రాజ్యంబున కభిషిక్తుం జేసి [4]పురోహితకృతస్వస్త్యయనుండై.

201 ఆ. [1]బలియుఁ డపుడు [2]వెంట్రుకలు పాచిముడిచి[3]గం, టెసఁగ [4]దాల్చి వీర[5]రసిక వృత్తి
నుద్ధతుండు మల్లయుద్ధ ప్రసాధనం, బమర [6]నిలిచె వేడ్క నమితబలుఁడు.

199 1. వీరు — పెక్కు ప్రతులు 2. కెనయగు — అ ఘ.ల 3. గర్వితుడై — ఇ ఎ.ఔ.చ.ఝ.

200 1. 'స' లో — అధిక పాఠము. అని యిట్లు భీమసేనుం గోరికొని జరాసంధుండు వాసుదేవునితో నీవిధంబంతయు మున్న యెఱుంగుదు కిరీటి కొండొకవాఁడు గాన నాకెనగాఁడు ఈ భీమసేనుండు మత్సమానబలుండయి యుండనోపు ఇతనిఁ దొడరి జయింతుమనిపలికి కృతనిశ్చయుండై భీమసేనుతో మల్లయుద్ధంబు సేయ సమకట్టి తన ......... జేసిన మంత్రి పురోహిత భూసురకృత, కాని మూలమున అస్మదన్యత మేనేహసజ్జీభవతు కోముధిః ఏవముక్తస్స కృష్ణేన యుద్ధంవవ్రే మహా ద్యుతిః భం. 2–21–2 ఉవాచ మతిమాన్ రాజా భీమం భీమ పరాక్రమమ్. భీమయోత్స్యేత్వయా పార్థశ్రేయసా నిర్జితంవరం. అని కలదు. భం 2–21–7. 2 సమకట్టి — అ.ఊ.ఐ ట శ.ష 3. నిజరాజ్యంబున 4. భూసుర— క.ఖ.డ.స.

201 1. బలియుడప్పుడు వెంట్రుకల్ పాచి (య)ముడిచి
గండెసగదాల్చి వరవీర ఘనతవృత్తి
యుద్ధతుడు మల్లయుద్ధ సన్నద్ధుడగుచు
నలరె నెంతయు వేడుక నమితబలుడు అను పాఠము శ ష స. 2. వెంట్రుకలు — పెక్కు ప్రతులు ; వెంట్రుకు సాచి ముడిచి — సూ. 3. గండెసగ— ఆ ఎ.ఐ ఔ.ఖ ఝ ట.శ.ష; గట్టిసగ — క.డ. [?] 4. దాల్చి బీర మెక్కంగ నుగ్ర, లీల నుద్ధతి బాహాప్ఫళించి మల్ల, యుద్ధసారణ మమరంగ నుత్సహించె॥ — ఘ.స। ['బాహాప్ఫళించి' ప్రయోగము నన్నయలో గమనింపఁ దగినది.] 5. రసైక వృత్తి — కొన్ని ప్రతులు ఛందస్సు?. 6. సన్నహించె నమితబలుడు — ఇ ఈ ఐ.గ ; సంగ్రహించె నధికబలుడు — క ఖ.డ ; నుత్సహించె — అ.ఎ.ఏ ఔ.ఛ.ఝ.

202 వ. భీమసేనుండును వానికి నక్కజంబుగా మల్లయుద్ధసన్నద్ధుం డయి ప్రతి
[1]భటించి నిలిచె నంత.

-: భీమసేన జరాసంధుల మల్లయుద్ధము :-

సం. 2-21-10

203 మ. సమసత్త్వాతిశయుల్ వృకోదరజరాసంధుల్ [1]మహోద్యత్పరా
క్రమ మొప్పం గడు నల్గి యొండొరులఁ జుల్కం దాఁకి రన్యోన్యదు
ర్దమదోర్దండపటుప్రహారజనితధ్వానంబు బ్రహ్మాండభాం
డము [2]నిండన్ లయకాలదండధర[3]చండక్షోభ మోనా జనుల్.

204 క. [1]కర్షితరిపు లన్యోన్యా,కర్షణసంకర్షణాపకర్షణముల సా
మర్షు లయి పెనఁగి రాహవ, హర్షంబునఁ బవనసుతబృహద్రథపుత్త్రుల్.

205 క. వ్యాయామకర్కశస్థిర, కాయుల యుద్ధము భయానకం బయ్యె మహో
[1]గ్రాయస పరి[2]ఘాయిత కరి,నాయత భుజదండదారుణాఘాతములన్.

206 చ అతులబలుల్ పరస్పరజయార్థులు పార్థివపుంగవుల్ మరు
త్సుతమగధేశ్వరుల్ సమరశూరులు దారుణలీలఁ బోరి రూ
ర్జిత [1]భుజదర్ప మేర్పడఁగ సింహా[2]గజేంద్రములట్లు వజ్రప
ర్వతములయట్లు ఘోరతరవాసవవృత్రుల[3]యట్లు నిద్దఱున్.

202 1. ఘటించి — పెక్కు ప్రతులు.

203 1. సముద్య — పెక్కు ప్రతులు 2. నిండెన్ — ఎ.ణ. 3. దండ — స.

204 1. ధర్షిత — జ.ల.స ; ఘర్షిత — అ.ఏ.ఔ.క.స.

205 1. గ్రాయత — పెక్కు ప్రతులు. 2. ఘాయత — పెక్కు ప్రతులు.

206 1. నిజదర్ప — ఇ.ఈ.ఐ ఓ ; నిజశక్తియే — ఊ.గ ; నిజశక్తులే — వీ.శ.ష. 2. గజంబుల యట్లు [ట్లు] — ఇ.ఔ ; గజేంద్రములయట్లు — ఘ.ఝ.ణ.శ.ష. 3. యట్టు లిద్దరున్ — కొన్ని ప్రతులు.

207 వ. ఇట్లు [1]కార్తికమాసంబునం బ్రథమదివసంబునం [2]దొడంగి భీమజరాసంధు [3]లెడయుడుగక [4]యొండొరులంబట్టి[5]యుఁ గిట్టియు నడిచియుం బొడిచియుఁ దాఁచియుం ద్రోచియు మహాయుద్ధంబు సేయుచుం ద్రయోదశి [6]నాఁ డిద్దఱుం గిట్టి మల్లయుద్ధ [7]కౌశలం బేర్పడం బెనంగునెడఁ జతుర్దశి నాఁటిరాత్రియందు [8]జరాసంధు నతిశ్రాంతభావం బుపలక్షించి యధోక్షజుండు భీమున కిట్లనియె.

-: భీముఁడు జరాసంధుని సంహరించుట :-

సం. 2-22-3

208 చ. విరహితసత్త్వుఁ డయ్యెఁ బ్రతివీరుఁడు వీని నశేషధారుణీ
శ్వర [1]నికరాపరాధు నతిసాహసికున్ [2]వధియించి నీభుజ
స్థిరత [3]యెలర్ప నయ్యనిలదేవుబలంబును [4]నీబలంబు భా
సురముగ [5]మాకుఁ జూపుము విశుద్ధయశోనిధి మారుతాత్మజా.

209 వ. అని [1]ప్రబోధించిన ననిలతనయుం డనిలదేవుం దలంచి తత్ప్రసాదంబున నధికసత్త్వ [2]సమేతుండై.

207 1 కార్తిక — ఎ.ఐ.గ. 2 గడంగి — ఐ. 3. అనారతం దివారాత్ర మవిశ్రాంత మవర్తత - అని మూలము భం 2-21-17. 4. మీరంబారియు, బోరలంబడియును, డాసియు ద్రేసియు, చాసియు కడిసియు నానా ప్రకారంబుల మహాఘోర యుద్ధంబు సేయుచు — ల. 5 యు విడిచియు — కొన్ని ప్రతులు (కాని అనుప్రాసకు భంగము) 6 నాటిరాత్రి [రేయి] — ఎ.ఓ.గ ఐ. 7 కౌశలంబునం బెనంగు — క.ఖ.డ 8. జరాసంధునందు — ఒ

208 1. నికరాపకారు - పెక్కు ప్రతులు ; విహితాపకారు — అ [?] నికరాపరాద్ధు— శ ; సుజనాపకారు — గ. 2. వధియింపు — వ. 3. వెలుంగ — పెక్కు ప్రతులు. 4. నుల్లసిల్లభా — ఘ. 5. నాకు — ఊ.ఎ.ఓ.క.ఘ.డ ; నీవు — ఝ

209 1. పద్మనాభుండు ప్రబోధించి పలికిన నయ్యనిలతనయుండు సభక్తిపూర్వకంబుగా నయ్యనిల దేవుందలంచి — ఎ ఊ.ల 2 సమన్వితుండై [సంపన్నుండై]- కొన్ని ప్రతులు

210 ఉ. ఆతని బట్టి యెత్తి [1]నిహతాహిత[2]వీరుఁడు వానిముక్కునన్
వాతను గర్ణరంధ్రముల వారక శోణితధార లొల్కఁగా
వాతసుతుండు వీచె శతవారము లుద్ధతచండవాతసం
ఘాతవివర్తమానతృణఖండసముం డగుచుండ మాగధున్.

211 వ. [1]మఱియును.

212 క. వెఱచఱవఁ బట్టికొని పడఁ, [1]జఱిచి జరాసంధుసంధిసంధల[2]యెమ్ముల్
విఱిచి వధియించి చూర్చెను, వఱలఁగ భీముండు భువనవలయం బద్రువన్[3].

213 చ. అవనితలంబు [1]వ్రస్సెనొ హిమాచలశృంగము [2]వ్రయ్య లయ్యెనో
శ్రవణ[3]విదారణం బయిన శబ్దము దా నిది యేమియొక్కొ భై
రవ మయి [4]వీచె నంచును బురంబునవారు భయంబు[5]వొంది [6]రం
దువిదలగర్భముల్ [7]గలఁగె నుక్కఁడఁగెఁ [8]మగధేశుసైన్యముల్.

214 వ. ఇట్లు భీమసేనుండు జరాసంధుఁ [1]జంపి వానివధియించుట జగద్విదితంబుగాఁ
బడియ[2]గృహద్వారతోరణసమీపంబునం దత్కళేబరంబు [3]వైచిన నది సర్వ
జనభయంక[4]రం బయి యుండె నంత నాదిత్యోదయం[5]బున.

210 1. నిజితా - ఘు ప, నిసుతా - స 2. వీర్యుఁడు - ఓ. గ

211 1. ఇది కొన్ని ప్రతులలో లేదు.

212 1. జరచి — పెక్కు ప్రతులు. 2. యెముకల్ - అ.ఓ.ఘు.చ 3. ఈ పద్యము తరువాత అయ్యవసరంబున అను వచనము కొన్ని ప్రతులలోఁ గలదు.

213 1. ద్రెస్సెనో - గ. 2 భగ్నమయ్యెనో - పెక్కు ప్రతులు. 3. నిభేదనంబైన—చ 4. వీచె — పెక్కు ప్రతులు. 5. వొందగానునిదల - కసం.క 6. రయ్యువిదల — పెక్కు ప్రతులు. 7. దలఁగె - సం. 8. మగధేశ — కసం

214 1. జంపుట - పెక్కు ప్రతులు. 2. నగర — అ.ఒ.ఔ గ.ఘు ల.శ ష. 3. వైచి సర్వజనభయంకరుండై - పెక్కు ప్రతులు 4. రుండై యుగాంత్యకాలరుద్రుండునుం బోలె నున్నంత - ఉ.ఊ.వ ట డ ఝ.ల శ.ష.స 5. బైన — పెక్కు ప్రతులు.

*-: జరాసంధు నభిషిక్తుఁ గావించి కృష్ణుఁడు భీమార్జునులతో నింద్రప్రస్థమున కరుగుట :-*

సం. 2-22-40

215 సీ. గరుడధ్వజుం డప్డు కరుణాసమేతుఁడై యమ్మాగధుల కెల్ల నభయ మిచ్చి
[1]మొగి జరాసంధుచే నిగ్రహీతు లయి యున్న పృథివీపతుల [2]విడిపించి చెఱలు
మోక్షితులైన సర్వక్షత్త్రియులచేత సంశుద్ధరత్నపుంజములఁ జేసి
పూజితుం డయి తనతేజంబు వెలుఁగంగ సహదేవు నజ్జరాసంధతనయు

ఆ. నోడ కుండు మని తదున్నతరాజ్యంబు, నందు నిలిపి హృదయ[3]హారివివిధ
రత్న [4]రాజిసుందరంబైన మగధేశు, రథముఁ దేరఁ బనిచె [5]రమణతోడ.

216 వ. తొల్లి తారకాసురసంగ్రామంబున నింద్రారూఢం బయినదాని నింద్రు వలన వసు వసురాజు వడసె వానివలన బృహద్రథుండు వడసె నని [1]తద్దివ్య రథప్రభావంబు సెప్పుచు భీమార్జునసమేతుం డయి [2]యారథం బెక్కి చక్రధరుం డఖిలరాజచక్రంబుతో నింద్ర[3]ప్రస్థగమనోన్ముఖుండై [4]గరుడనిం దలంచుడుఁ [5]దత్క్షణంబ.

217 క. అనలప్రభాభిశోభిత, ఘనతరతనుదీప్తు [1]లొప్పఁగా వచ్చి వడిన్
వినతాతనయుఁడు వినయా, వనతోరుశిరస్కుఁ డయ్యె వనజాతునకున్.

218 వ. ఇట్లు వచ్చిన వైనతేయు [1]నతిప్రీతిం దద్దివ్యరథసారథ్యంబు[2]నందు నియోగించి [3]మనోవాయువేగంబునం గృష్ణ[4]భీమవిజయు లింద్రప్రస్థ[5]పురంబు ప్రవేశించి రంత.

---

215 1. యొగి—పెక్కుప్రతులు 2. విడిపించె పేర్మి—అ.ఈ.ఏ.ఐ ఔ.క ఖ.గ.ఛ.జ ఝ.వ 3. మలరహారియు_జ. 4. ఖచిత—ఇ; రాజ_ఊ.ఎ.ప. 5. రయముతోడ—ఊ.ఒ.వి శ.ప.

216 1. తదీయ – అ ఆ.ఈ ఊ.ఐ.ఒ.ఔ.క.ఖ గ.ఘ. 2. దానినెక్కి — కొన్ని ప్రతులు. 3 ప్రస్థపుర గమనో – ఏ.ఒ.క.ఖ.ఘ. 4 గరుడునిం – కొన్నిప్రతులు. 5 నతు ణంబ – ఔ.గ.చ.

217 1. లెసగగా – ఉ ఎ.ఓ ఔ.క.ఖ.గ.వ

218 1. నాదరించి – ట, నతిప్రీతిం – కొన్ని ప్రతులలో లేదు 2. సేయనియోగించి- క ఖ డ 3. యతడు తేరు గడప మనో – వా. కాని, ఇది ఛ.జ ప్రతులలో తప్ప తక్కిన వానిలో లేదు. మూలమునను లేదు 4 భీమార్జునులింద్ర – కొన్నిప్రతులు. 5. పురప్రవేశంబు చేసిరంత – అ ఆ ఇ.ఊ.ప.

219 మ. జన[1]సంతాప్రకరుఁ [2]మహోద్ధతు జరాసంధుఁ [3]హరి ప్రేరణం
బున భంజించెఁ బ్రభంజనాత్మజుఁడు [4]భూభుగ్వీరులం దన్నిరో
ధననిర్ముక్తులఁ జేసె నింకఁ జతురంతక్షోణికిన్ ధర్మనం
దను సామ్రాజ్య[5]ము పూజ్య మయ్యెనని మోదం బంది రుర్వీజనుల్.

220 క. ఆయుధనిహతుఁడు గాని య, జేయు జరాసంధు భీమసేనుఁడు [1]విజయ
శ్రీ యెసఁగ నోర్చెఁ గాక, త్వాయతభుజశక్తి నొరుల కలవియె[2]యంచున్.

221 క. పురజను లాశ్చర్యంబునఁ, గర మనురాగమునఁ బరమకౌతుకమునఁ జూ
చిరి [1]భోరన వచ్చి వృకో, దర దామోదర సురేంద్రతనయులఁ [2]బ్రీతిన్.

222 వ. కృష్ణభీమవిజయు[1]లిట్లు విజయవిభాసితులయి వచ్చి ధర్మరాజునకు మ్రొక్కి జరాసంధుబంధనంబువలనం దమచేత మోక్షితులైన మహీపతు[2]ల నెల్లం జూపిన.

223 క. సవినయ[1]నతోత్తమాంగుల, నవనీశుల నందఱను [2]యథార్హప్రియగౌ
రవమునఁ బూజించి కురుప్రవరుఁడు తద్దేశములకుఁ [3]బరువడిఁ బంచెన్.

219 1. సంతాప – ఊ.ఝ. 2. మదోద్ధతు — అ.ఊ.ఐ.ఒ.ల.శ.ష ; బలోద్ధతు—ఆ. ఔ.చ.ఝ.స ; మతోద్ధతు – స 3. మదాంధున్ – పెక్కుప్రతులు ; బలాఢ్యున్— ఏ.వీ.శ.ష.స , సముద్యద్రణం — ఊ.ల. 4. భూభృద్వీరులం — ఆ.ఇ ఈ.ఉ.ఊ.ఎ. ఐ.ఒ.ఓ.క.గ.ఘ.శ.ష. (వీనినిబట్టి ఉకార ఋకారములకు యతి అంగీకార్యము); తాభూభృత్తులన్ — ఖాసం ; దాభూమీశులం — ఝ. 5. ము [మ] పూజ్య మంచును బ్రమోదం — అ.ఆ.ఏ.ఒ.ఓ.ఔ.ఘ.జ ; మయయ్యెనంచును బ్రమోదం— ఝ.స.

220 1. వీరశ్రీ — భ ప్రతి తప్ప తక్కిన అన్ని ప్రతులు. 2 యెందున్ — ఐ.వ.

221 1. భోరన — పెక్కు ప్రతులు. 2. నెమ్మిన్ — వ

222 1. లు విజయ — పెక్కు ప్రతులు ; లు వీరశ్రీ విభవ విజయ — ల. 2. లం జూపిన — కొన్ని ప్రతులు.

223 1. వినమితగాత్రుల — ఆ.ఒ.ఘ. 2. దయార్ద్ర — ఎ.ఓ. 3. బంపెరయమునన్ — ఘ ; బరువడి బుచ్చెన్ — ఇ.ఈ.ఎ.ణ.

—: కృష్ణుఁడు ద్వారకానగరమున కరుగుట :—

సం. 2-22-53

224 వ. నారాయణుండును [1]ధర్మరాజు వీడ్కొని తద్దివ్యరథారూఢుం డయి [2]ద్వారవతీపురంబున కరిగె నంత నిక్కడ.

225 చ. భరతకులైకభూషణుఁడు భాసురతేజుఁడు ధర్మనందనుం
డురుభుజవిక్రమంబున జయోన్నతిఁ బోల్పఁగ [1]వీరు లోకపా
లుర యని భీముఁ బార్థు నకులున్ సహదేవునిఁ[2]బంచెఁ దూర్పు ను
త్తరమును బశ్చిమంబు మఱి దక్షిణముం వరుసన్ జయింపఁగన్.

226 వ. ఇట్లు పంచిన నలువురు [1]నపారచతురంగ[2]బలసమేతులై నాలుగు సముద్రంబులపై నడచు నపూర్వసముద్రంబు[3]లుంబోలె నాలుగు దిక్కుల [4]పై నడచిరనిన విని జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె.

227 క. [1]నరసుతు లయ్యైదిక్కుల, కరిగి మహీపతులచేత నర గొని ధనముల్
[2]దెరలఁగఁ దెచ్చినమార్గముఁ, బరువడి నెఱిఁగింపు [3]నాకు బరమమునీంద్రా.

228 వ. అని యడిగిన జనమేజయునకు వైశంపాయనుం డిట్లనియె.

224 1. పాండవుల — కొన్ని ప్రతులు ; భీమార్జున యమళుం దిగ్విజయంబు సేయ నాలుగు దిక్కులకుం బనుపుమని ధర్మరాజునకుం జెప్పి పాండవుల నందరి గని వీడ్కొని — వ. [ఇది మూలానుగుణము కాదు]. 2. ద్వారావతి కరిగెనంత — పెక్కు ప్రతులు.

225 1. వీర — కొన్ని ప్రతులు 2. బుచ్చె — ఈ.ఎ.వ.

226 1 తమ్ములును నపార—ఆ.మ 2. బలసమన్వితులై —ఇ.ఉ.ఔ.చ 3. లునుం — కొన్ని ప్రతులు. 4. కరిగి రనిన — పెక్కు ప్రతులు.

227 1 నరపతి పనుపున దిక్కుల — ఈ ణ ల ; నరపతు లయ్యాయి దిక్కుల — ఏ. నరవరులయ్యాయి — ఝ శ.శర ష. 2 పొరిబొరి — ణ. 3. మాకు—అ.ఆ. ఊ.ఓ.క.ఖ చ.

-: అర్జునుం డుత్తరదిగ్విజయంబు సేయుట :-

సం. 2-23-7

229 సీ. అగ్నిదత్తం బైన[1] యద్దివ్యరథ మెక్కి గాండీవధరుఁ డతిఘర్మసమయ
[2]ఘర్మాంశుఁడునుఁబోలెఁ [3]గౌబేరదిగ్విజయార్థ ముగ్రప్రతాపాగ్ని వెలుఁగఁ
జని [4]పుళిందావనీశ్వరునోర్చి [5]ప్రతివింధ్యుఁ డను వాని నోడించి యుక్రమమున
మఱి యఖిలద్వీపమండలేశుల నెల్ల [6]వశవిధేయులఁ జేసి వారుదన్ను

ఆ. [7]భక్తిఁ గొలిచి రాఁగఁ బ్రాగ్జ్యోతిషంబుపై, విడిసెఁ [8]దత్పురమున [9]విభుఁ డనంత
[10]బలముతోడఁ బన్ని భగదత్తుఁ [11]డేతెంచి, విజయుఁ దాఁకె సమరవిజయ కాంక్ష.

230 వ. [1]ఇట్లు శబరసాగరానూపవాసులైన [2]యోధవీరులతోఁ బన్ని భగదత్తుండు పార్థుతో నెనిమిది దివసంబులు మహాయుద్ధంబు సేసి తదీయ[3]బాణభగ్న బలుండై పార్థున కిట్లనియె.

231 క. ఏ నింద్రసఖుఁడ నీవును, భూనాథ సురాధి[1]నాథ పుత్త్రుండవు నీ
తో నని సేయుట యుచితమె, యే[2]నోడితిఁ [3]జెప్పు మెద్ది యుష్టము నీకున్.

---

229 1. ఆదిత్యరథ మెక్కి — ఇ. 2. ఖరకరుండును — ఆ. 3. ఘనుడును— చ 4. కుళింగావనీశ్వరు — స. 5. ప్రతివింధ్యుడను — ఆ.ఎ.ఐ.ఔ.ఖ.గ.చ.ఝ.శ.ష మూలమున ప్రతివింధ్యుడు. భం 2-23-15. 6. వశవర్తులుగ — గ; వీర విధేయులుగ — చ.ల. 7. బలిసిగొలిచి — ఖ.చ. 8. దత్పురంబు విభు — పెక్కు ప్రతులు. 9. విభుడు తన్ను బలము — చ. 10. బలిమితోడ — ఊ, బలము తోడ గూడ — ఆ.ఇ ఒ.ఘ. 11. డెదురించి — ణ.

230 1. ఇట్లు సాగరానూప — పెక్కు ప్రతులు; ఇట్లు సాగరోప వనవాసులైన యాభీర శబర వీరగణంబుతో — ఝ. 2. యోధవీరబలంబులతో — ఈ.ఉ.ఎ ఐ.క.డ.ణ ల వి.శ.ష ; యోధబలంబులతో—ఊ. 3, బాణభగ్న రథుండై — అ ఈ.ఎ.ఐ.ఔ. గ.చ.ణ ల ; బాణాభిల భగ్నుండై —-క ; బాణభగ్న బాహుబలుండై — ఉ.

231 1. పునకు — ఆ.ఇ ఘ ; నాథపుత్రుడవట — ఝ; నాథ పుత్రుడవగుటన్ మానితి సమరము సేయగ — ఆ.ఇ.ఘ. 2. నోడుదు బంపు మేది — క. 3. గోరు—అ.

232 వ. దానిన చేయుదు ననిన [1]విని భగదత్తున[2]కుఁ బార్థుం డి ట్లని యె.

233 క. కురువిభుఁడు రాజసూయా, ధ్వర మొనరింపం గ[1]డంగె ధర్మజుఁడు [2]నిరం
తర ధర్మశీలుఁ డాతని, కరివెట్టుము రమ్ము[3] ప్రీతి నమ్మఖమునకున్.

234 వ. [1]అని యాభగదత్తుచేత నపరిమితధనరాసులు గొని [2]ధనదదిశాభిముఖుం
డయి ధనంజయుం డరిగి.

235 క. అతులచతురంగ సేనా, యుతుఁ డంతర్గిరి [1]బహిర్గిరోపగిరుల భూ
పతుల నని నోర్చి శౌర్యో, న్నతిఁ గొనియెను వారిచేత నానాధనముల్.

236 వ. మఱియు [1]నులూకదేశాధిపతి యగు [2]బృహంతునిఁ బరాజితుం జేసి [3]యుత్త
రోలూక వామదేవ [4]మోదాపుర సుదామ [5]సుసంకులంబు [6]లనుదేశం
బుల రాజుల జయించి దేవప్రస్థంబున సేనాబిందు నోడించి [7]విష్వగశ్వుం

232 1. విని – పెక్కు ప్రతులలో లేదు. 2. కర్జునుం డిట్లనియె, కునర్జునుం డిట్లనియె—పెక్కుప్రతులు.

233 1 బూనె – చ. 2. దయాపరదానశీలు—ఝ. 3. నీవు — అ.ఇ.ఒ.ల.

234 1. అని భగదత్తుచేత – అ.ఇ.ఒ ఝ. 2. ధనంజయుండు మరియు ధనదదిశాభిముఖుండై యరిగి— ఏ.ఔ.ణ

235 1. బహిర్గిరీశ్వర భూమిపతుల — ఊ ల.
అంతర్గిరించ కౌంతేయస్తథైవచ బహిర్గిరిమ్ । తథోపరిగిరిమ్ అని మూలము. భం. 2–24–2. బహిర్గిరమ్ అని [భం] పాఠాంతరము ననుసరించి బహిర్గిరోపగిరుల అను రూపము సాధువు సిద్ధాంతకౌముది యందలి 'గిరేశ్చ సేనకస్య' అను అవ్యయీభావసమాస ప్రకరణములోని తుది సూత్రము వలన గిర్యంతమైన అవ్యయీభావసమాసమునకు అచ్ ప్రత్యయము వైకల్పికముగా నగును. దీనిని బట్టి అంతర్గిరి, అంతర్గిరమ్, బహిర్గిరి. బహిర్గిరమ్, ఉపగిరి, ఉపగిరమ్ అను రూపములు కలుగుట కవకాశమున్నది. నన్నయ బహిర్గిర + ఉపగిరుల అనుచోట అచ్ ప్రత్యయము వచ్చిన రూపము వాడియున్నాఁడు. (పాణిని. 5–4–112. సి. కౌ. 683).

236 1. గరూళ – అ.ఒ.క.ఖ.ఘ.డ.స; గులూత – ఇ ఈ.ఔ.గ శ.ష స 2. బృహద్బలున్ – పెక్కుప్రతులు ; బృహదశ్వున్ – అ ఘ.చ.స. 3. యుత్తరకులూత-పెక్కు ప్రతులు — మూలమున. కులూతవాసినం రాజాన్ బృహన్త ముపజగ్మివాన్ – అని కలదు. భం. 2–24–4. 4. గోదావరి — అని పెక్కుప్రతులు. కాని యిది మూల విరుద్ధము 5 సు నంద–కొన్ని ప్రతులు. కాని మూలవిరుద్ధము. 6. లను నేనుదేశంబుల — ఉ.ఊ.ఎ.ఏ.ఐ.ఔ.ల. 7. విష్వదశ్వుండను —

డనురాజు విక్రమం [8]బడంచి పార్వతేయుల గర్వం [9]బుడిపి బర్బర [10]శబర తురుష్కపతుల వశగతులం జేసి [11]మాళవ[12]పౌండ్ర కాశ్మీర త్రిగర్త లోహిత సుధన్వ గాంధార కాంభోజ [13]కోసలపతులచేత విచిత్ర[14]రత్న కాంచనవస్తు వాహననివహంబులు గొని చిత్రాయుధరక్షితంబైన సింహపురంబు [15]మథించి సింహాసనాసీను లయిన వనచర[16]దస్యుల వశ్యులంజేసి శ్వేత పర్వతం [17]బతిక్రమించి యట చని [18]కాంభోజకటకుం డనురాజుచేతం బూజితుండై హాటకదేశంబున [19]మానసం బనుకొలను ఋషికుల్యంబును జూచి యందుల రాజులచేత [20]నపరిమితపదార్థంబులం దిత్తిరి కల్మాష [21]మండూకాఖ్య మయూరహంస [22]శుక సవర్ణంబు లైన హయంబులం బర్వతనిభంబులైన యిభంబులం గొని ([23]హేమకూట నిషధాచలంబులు గడచి గంధర్వనగరంబులు గెలిచి శతసహస్ర యోజనాయతం బయి శుద్ధ సువర్ణమయం బయి తేజోరాశియయిన మేరుమహీధరంబు నాలోకించి జంబూమహావృక్షంబును జంబూమహానదియునుం జూచి తత్తీరంబున మేరువునకుం బ్రదక్షిణంబుగాఁ జని గంధమాదనపర్వతం బతిక్రమించి తద్దిశాధిపతులైన సిద్ధ విద్యాధర చారణ గంధర్వులచేత నానావిచిత్రవస్తు

పెక్కు ప్రతులు. 8. బుడిపి — అ.ఊ.ఎ.ఐ.ఓ ఖ. 9. బడంచి — పెక్కు ప్రతులు. 10. పారశీయ, పారశీక — అని భిన్న ప్రతులు. 11. మాళవ — పెక్కు ప్రతులలో లేదు. మూలమందును లేదు. 12 పౌండ్ర — కొన్నింట లేదు. మూలమునను లేదు. 13. కోసల — పెక్కు ప్రతులలో లేదు. మూలమందును లేదు. 14 రత్నకాంచన — పెక్కు ప్రతులలో లేదు. 15. సాధించి — పెక్కు ప్రతులు. 16. పతుల — పెక్కు ప్రతులు; నాథుల — ఈ ఊ.ప. కాని మూలమున వినిర్జిత్యదస్యూన్ పర్వతవాసినః—అని కలదు. భం. 2–24–15. 17. బతిక్రమించిచని — పెక్కు ప్రతులు 18 భోజకటకుండను -- పెక్కు ప్రతులు. కాని మూలమున కాంభోజ. భం. 2–24–22 19. మానసం సర ఉత్తమమ్। ఋషికుల్యాశ్చతాః సర్వా దదర్శకురునందనః—అని మూలము భం. 2–25–4; మానసం బను కొలన — అని వా. 20. నపరిమిత పదార్థంబులం — ఇది పెక్కు ప్రతులలో లేదు. 21 మండూకాక్ష - పెక్కు ప్రతులు; మండూకాక్షాన్—అని భం 2–25–6; మండూకాఖ్యాన్ - అని భం పాఠాంతరము 22. శుకవర్ణంబులైన — పెక్కు ప్రతులు. 23. హేమకూట నిషధాచలంబులు — మొదలుకొని మాల్యవన్నీర పర్వతంబులు గడచి — అనునంతవరకు గల భాగము—ఉ ఓ. ఖ.ల పి. ప్రతులలో మాత్రమే కలదు. తక్కిన ప్రతులలో నీ భాగము లేదు కాని యీ భాగమునకు మూలము — పి పి యస్. ప్రతిలో 2–25–6 నుండి 49 వరకు కలదు భం. ప్రతిలో లేదు. పూర్వము ముద్రితములైన శ ప. ప్రతులయందును

వాహనంబులు గొని మాల్యవ న్నీలపర్వతంబులు గడచి) యుత్తరకురు [24]దేశములకుం జని హరివాసం బను పురంబుపై విడిసిన.

237 సీ. తద్ద్వార[1]పాలకుల్ దారుణాకారు లపారబలాఢ్యులు పార్థుకడకుఁ
[2]జనుదెంచి సురరాజసన్నిభు నాతనిఁ జూచి యచ్చెరువడి శూరు లెందు
నీయట్టిరే కురున్నృప[3]వీర పర్యాప్తమయ్యె నీవిజయ[4]విఖ్యాతిశయము
వసుమతీనాథులెవ్వరు [5]నిట్లు బలిమిమై [6]నిటవచ్చిరే తొల్లి యేయుగముల

ఆ. నున్నతప్రతాప యుత్తరకురుభూమి, లంద్రు జనులు వీని నవనిచరుల
కివి యగోచరంబు లిందు సాధించి[7]యె, ద్దియును [8]గొనఁగ లేదు తివిరె నీకు.

238 వ. అయినను నీవచనంబు సేయం గలవారము [1]మమ్ముఁ బనుపు [2]మనిన వారికి నర్జునుం డిట్లనియె

239 తే. రాజసూయాధ్వరము ధర్మరాజు సేయ, నుత్సహించి[1]నవాఁడు
తదుత్సవమున
కిందు మీయందుఁ గలవస్తువెద్దియైన, నమ్మహీనాథుసామ్రాజ్య [2]మతిశ
యిల్లు.

నిది లేదు. వావిళ్ళ ప్రతిలో నీ భాగము కుండలీకృతమై యున్నది. 24. దేశంబుల [న] హరివాసంబను — పెక్కు ప్రతులు.

237 1 పాలురు — పెక్కు ప్రతులు. 2 జనుదెంచిసురసన్నిభునిఘను । నాతని—ఙ ఈ పాఠమున ప్రాసయతి కాని యీ పద్యము సర్వయతి సీసము. 3. వర్య ప్రఖ్యాతమయ్యె — ఉ; వరపర్యాప్త—కసం. 4. శౌర్యాతిశయము — ల; విద్యాతిశయము — క.ఖ.ఙ. 5. బల్మిమైబూనియిట — ఙ. 6. నిందువచ్చిరె—ల. 7. యె/య్యవియుగొనగలేరు తివిరిజనులు [యొరులు] — ఆ.ఇ.ఎ.ప.క.ఖ ఘ.డ.ఙ [ప్రాసయతి యగును]; యెయ్యవిగొనంగ లేవు తివిరి నీవు—స. [ప్రాసయతి] 8. గొనగ లేవు నీవు — ఙ.గ శ.ష మూలమున — నచాపికించిజ్జేతవ్యమర్జునాత్రప్రదృశ్యతే భం. 2–25–11 అనియు పార్థనేదం త్వయాశక్యం పురం జేతుం కథంచన ఉపావర్త స్వకల్యాణ పర్యాప్తమిదమచ్యుత భం 2–25–9. అనియుకలదు.

238 1. మమ్ము — పెక్కు ప్రతులలో లేదు; 2. మనిన నర్జునుం డిట్లనియె — కొన్ని ప్రతులు

239 1. యున్నాడు మహోత్సవమున — ఙ (ఉన్నాడు — అను రూపము గమనింపఁదగినది) 2. మతిశయిల్ల — ఆ.ఇ.ఉ ఊ.చ.ల.వి.సూ ; మతిశయముగ — పెక్కు ప్రతులు.

240 వ. అనిన నయ్యుత్తరకురు [1]భూముల రాజులెల్ల నర్జునున కతి[2]ప్రీతచిత్తులయి యమూల్యంబు లైన యపరిమిత[3]దివ్యరత్నాభరణంబులు దెచ్చి యిచ్చిన.

241 తరలము. [1]తరణిసన్నిభు ధర్మపుత్త్రు నుదారతేజము [2]పర్వ భా
స్వర [3]సుసంపదఁ బాకశాసనిశాసనంబున నిట్టు లు
త్తర [4]కురూత్తముఁ దొట్టి యుత్తరధారుణీశులు [5]వశ్యులై
[6]కరధనంబులు దెచ్చియిచ్చిరి [7]గౌరవంబున ధన్యులై.

-: *భీమసేనుండు పూర్వదిగ్విజయంబు సేయుట* :-

సం. 2-26-1

242 వ. [1]అట భీమసేనుండునుం [2]బరచక్రమర్దనం బయిన [3]బలచక్రంబుతోఁ బూర్వ [4]దిక్కునకుం జని [5]పాంచాలపతిచేత సత్కృతుం డయి విదేహరాజు జనకుం డనువాని [6]జయించి [7]దశార్ణపతియయిన సుధన్వుతో మహాయుద్ధంబు సేసి తత్పరాక్రమంబునకు మెచ్చి వానిం దనకు [8]సేనాపతిం జేసికొని

240 1. దేశంబుల — పెక్కు ప్రతులు. 2. ప్రీతులయి యపరిమిత — పెక్కు ప్రతులు 3. దివ్యాంబర రత్నాభరణంబులు — ల; దివ్యాంబరాభరణంబులు నపరిమిత దనంబులు — వీ.శ ష.

241 1. ధరణిపుండను - ఎ.క ఖ.డ; ధరణినిభుడగు — ఇ; ధరణితేజుడు — చ.స; ధరణిలోపల — ఝ. 2 పర్వ — ఝ. 3. బలాఢ్యుడు — భాసం; బలుండగు — ఏ.ఔ; బలంబున - వీ.శ ష. 4. నృపాలుర - కొన్ని ప్రతులు; కురూద్వహులాదిగాగల - ట 5. వచ్చి యక్కర - ణ. 6. కలధనంబులు దెచ్చియిచ్చిరి గౌరవంబున - ఊ ఓ.గ చ.ఛ.ష (దీనినిబట్టి 'రల' లకు ప్రాసచెల్లవచ్చునని తెలియుచున్నది.) 7. గారవంబున నెయ్యులై — ల; గారవంబున వశ్యులై - ఝ; గారవంబున రమ్యులై — కొన్ని ప్రతులు.

242 1. అంతనట - ఇ ఉ,ఏ.ఒ ఔ.చ.ల 2. బరమహీచక్రభేద (మర్ద) నంబైన బలంబులతో — ఓ.క ఖ.ణ. 3. బలంబు (ల) తో — కొన్ని ప్రతులు 4. దిక్కునకరిగిన — పెక్కు ప్రతులు. 5. పాంచాలాన్ వివిధోపాయైః సాంత్వయామాసపాండవః — అని మూలము భం. 2-26-3. 6. నోడించి పెక్కు ప్రతులు. 7. దాశార్ణవ - అ.ఎ.క.ఖ.గ.ఝ; దశార్ణవ — చ.ణ. 8. సేనాధిపతిం గావించుకొని — అ.ఒ.ట; సేనాపతిం గావించుకొని — ఆ.ఇ.ఏ.గ.ఘ.ల;

[9]యశ్వమేధేశ్వరుం డయిన రోచమాను ననుజ[10]సహితుం బరాజితుం జేసి చేదివిషయంబునకుం [11]జనిన.

243 చ. అతని నతిప్రతాపు ననిలాత్మజుఁ గానఁగ వచ్చి చేదిభూ
పతి శిశుపాలుఁ డెంతయును భక్తిపరుం డయి రాజసూయ ము
న్నతి [1]నొనరింప నున్న యమనందనుయత్న మెఱింగి రత్నశో
భితధనరాసు లిచ్చెఁ గడుఁ బ్రీతి [2]సమన్వితుఁడై [3]ముదంబునన్

244 వ. భీనుసేనుండును శిశుపాలుపురంబునం గొన్ని దినంబు లుండి పూర్వదిక్కున కరిగి పుళిందపురంబున [1]సుకుమార సుమిత్రులం గుమార విషయంబున శ్రేణిమంతునిం గోసలదేశంబున బృహద్బలు నయోధ్యాపురంబున [2]దీర్ఘప్రజ్ఞునిఁ గాశీరాజును సుపార్శ్వుని [3]రాజపతి యైన[4]సుధన్వుని మత్స్యమలదపతులను [5]గర్ణాట దక్షిణమల్లులను మర్దించి వారిచేత నపరిమితధనంబులు గొని మగధపతియయిన జరాసంధతనయు సహదేవు నాశ్వాసించి హిమవత్పర్వతపార్శ్వంబునం జలోద్భవం బనుదేశంబును భల్లాటదేశంబును

సేనాధ్యక్షుం జేసికొని — శ.ష 9. యశ్వమేధాధ్వరుండయిన — ఏ.జ. కాని యిది మూలమునకు విరుద్ధరూపము. 10. రోచమానం సహానుజమ్। జిగాయ సమరే వీరో బలేన బలినాంవరః, అని మూలము భం 2_26_8. సహితుంబరాజితుం జేసి - ఐ వీ, సహితంబుగా బరాజితుం జేసి — ఊ ; సహితంబువశ్యుం జేసి — శ.ష ; సహితువిధేయునిం జేసి — గ ; సహితునిహతుం జేసి — వా. కొన్ని ప్రతులు. 11. జనియెనంత — ఉ.ప ఓ.ఔ.ల.

243 1. మెయిజేయ — ల. 2. పరుండగుచున్ ముదంబునన్ — అ.ఆ.ఇ.ఊ.ఒ.ఘ.చ 3 ప్రియంబునన్ — ఝ.

244 1 సుకుమారును గుమార — అని పెక్కుప్రతులు — కాని సుకుమారం వశేచక్రే సుమిత్రంచ నరాధిపమ్ — అని మూలము భం. 2_26_10. 2. దీర్ఘప్రజ్ఞుని — పెక్కుప్రతులు — మూలము దీర్ఘప్రజ్ఞం మహాబలమ్ భం. 2_27 — 2, వా. ప్రతిలో దీర్ఘయజ్ఞుని అని ముద్రితము. 3. గజపతియైన — పెక్కు ప్రతులు. 4 కందర్పును, సుకుమారును, కుశాయుధుని - ఇత్యాదిగా భిన్నప్రతులు. సూచన:- ఈరాజుల పేర్లవిషయమున భిన్నప్రతులు భిన్నవిధముగ నున్నవి. అంగీకృతపాఠమే చాలవరకు మూలానుగుణముగ నున్నది తెలుఁగుప్రతి యందలి పేరుల వరుసకును, మూలమందిచ్చిన పేరులవరుసకును భేదమున్నది. 5. కర్ణాట—

జయించి యింద్రపర్వతసమీపంబునం గిరాతపతుల నేడ్వురను [6]శర్మక వర్మకులను జంద్రసేన సముద్రసేనులను గర్ణవత్సపతులను బుండ్రపతినిం బౌండ్రకవాసుదేవుని వశగతులం జేసి.

245 ఉత్సాహము. అతులశౌర్యుఁ [1]డనిలతనయుఁ [2]డమితవాహినీపదా
హతి ధరిత్రి [3]దలర నిట్టు లరిగి పూర్వదిఙ్మహీ
పతులచేత రత్నరజత[4]ఖర్మతతులఁ గొనియె భూ
నుతయశుండు వేలు వేల [5]నూఱుకోట్ల సంఖ్యలన్.

-: సహదేవుండు దక్షిణదిగ్విజయంబు సేయుట :-

సం. 2-28-1

246 వ. [1]అట సహదేవుండు దక్షిణ[2]దిక్కున కరిగి [3]సుమిత్ర శూరసేన దంతవక్త్ర యవనులను గోశృంగగిరి నివాసులను జయించి కుంతిభోజుచేతం బ్రియపూర్వకంబున సత్కృతుం డయి

247 ఆ. జలజనాభు పగతు జంభకుం డనువాని, [1]భూరిబలునిపుత్త్రుఁ బోరిలోన
నోడిచి వానిచేత నుత్తమగజహయ, రత్నతతులు గొని పరాక్రమమున.

మూలమునలేదు. 6. కశ్యప కౌశికులను సుధర్మ ధార్మికులను చంద్రసేన సముద్రసేన (ను) లను, కర్ణవత్సపతులను — అని కొన్ని ప్రతులు, కాని మూలాను గుణము కాదు.

245 1. డనలతేజుడమిత — స. 2. డఖిల వాహినీ — ఉ.ఎ.క.ఖ డ ; డధికవాహినీ- ఝ. 3. దలక — స. 4. భస్మ — అని వా. కాని మూలము - కాంచనం రజితం వజ్రం విద్రుమంచ మహాధనమ్ భం.2-27-26. పెక్కుప్రతుల యందును ఖర్మ యనియే కలదు. 5 నూరుకోటి — ల.

246 1. మరియు — పెక్కుప్రతులు ; మరియు నట— ల. 2. దిగ్భాగంబునకుంజని — ఉ ఎ.ఓ గ. 3. సుమిత్రవసుమిత్ర — ఉ.ఎ.ఓ.క.ఖ. కాని మూలమున వసుమిత్ర లేదు.

247 1. భూరిబల సమేతు — ఆ.ఉ.ఊ.ఎ.ఒ ఓ ఔ.ఘ.ఛ.ల.వీ.స ; భూరిబల సమగ్రు— ఝ.శ.వ ; భూరిబలు సుమిత్రు — ఎ.క.ఖ.ఛ.డ ణ.స.

248 వ. నర్మదాసమీపంబున నవంతిపతుల విందాను[1]విందుల [2]మందదర్పులం జేసి చని మాహిష్మతీపురంబు పయి విడిసిన.

249 క. [1]వీరుఁడు తత్పురవిభుఁడు, గ్రారిమర్దనుఁడు నీలుఁ డనువాఁడు మహా దారుణబలుఁడై సమర, [2]ప్రారంభాత్యుగ్రుఁ డయ్యెఁ బాండవుతోడన్.

250 వ అంత.

251 క. దరికొని [1]దహనుం డెగసెను, వరుసను సహదేవుసకలవాహినిమాద్య త్కరులపయిఁ దురఁగములపయి, వరరథములపయిఁ బదాతివర్గములపయిన్.

252 వ. అనిన విని జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె.

-: అగ్ని సహదేవుసేనపైఁ బ్రచండశిఖలు కప్పుటకుఁ గారణము :-

సం. 2-28-16

253 ఆ. [1]కడఁగి యనలుఁ డేమికారణంబున సహ, దేవు సేన[2]పయి నతిప్రచండ శిఖలు గప్పె దీనిఁజెప్పు [3]మేర్పడ నాకు,నసఘ వినఁగవేడ్క యైన యదియు.

254 వ. [1]అనిన వైశంపాయనుం డిట్లని చెప్పెఁ దొల్లి నీలువంశంబున నిషధుం డను రాజు రాజ్యంబున [2]జాతవేదుండు విప్రుండయి వేదాధ్యయనంబు సేయుచు

248 1 విందులనిద్దర — ఆ.ప ఓ ఔ.చ ల. 2. మంద దర్పితులం జేసి — కొన్ని ప్రతులు

249 1. వీరుండప్పురవిభుడు — వీ శ ష. 2 ప్రారంభుండయ్యె నపుడు బాం— ఎ ; ప్రారంభసమగ్రుడయ్యె బాం — ఝ.ణ ; ప్రారంభోదగ్రుడయ్యె బాం— ఐ.ఘ.ల , ప్రారంభోద్యతుడు నయ్యె - క.ఖ.డ.

251 1. దహనుడుగవిసెను — ల

253 1. కనలి — ఐ.ఒ.ఖ.ఝ స 2. పయినిదీవ్రచండ — వీ.శ ష. 3. మేర్పడగ నాకనఘ — అ.ఆ.ఊ.ప.ఐ.ఔ.ఝ శ ష; మునాకదివినగవేడుకయ్యె వీనులలర — క.ఖ.డ.

254 1. అనినవానికి — పెక్కు ప్రతులు. 2. జాతవేదుండు వేదాధ్యయనంబు

మాహిష్మతీపురంబున [3]నుండి [4]ప్రమాదవశంబునం [5]బారదారికుం డయిన నెఱింగి రాజని యోగులు వానిం బట్టికొనిపోయి రాజసమక్షంబున శాస్త్ర విహితదండంబున దండింపం బోయిన.

255 క. అవమానదుఃఖితుండయి, [1]పొవయుచు [2]రోషానలంబు పోఁడిమి వెలుఁగం
బవన[3]సఖుఁ డుగ్రకణములు, నెవయఁగఁ దనపొడవు [1]చూపె నిషధుని
మ్రోలన్.

256 వ. వాఁడును గడుభీతుం డయి యగ్నిదేవునకు [1]నమస్కరించి [2]మహాపురుషా [3]నాయజ్ఞానంబు సహింపవలయు నని ముకుళిత[4]కరకమలుం డయిన వానికి వైశ్వానరుండు [5]ప్రసన్నుం డయి నీకోరినవరం బిచ్చెద వేఁడు మనిన [6]వాఁ డిట్లనియె.

257 తే. ఇప్పురంబు [1]జయింపంగ నెవ్వరేని, వత్తు రుద్ధతు లయి శత్రువరులు [2]వారు
దర్ప [3]మేది నీచేత నిర్దగ్ధులై వి,హీను [4]లవుసట్లుగా వర మిమ్ము నాకు.

సేయుచు విప్రుండై మహిష్మతి — పెక్కుప్రతులు. 3. నుండి యొక్కనాడు — కొన్ని ప్రతులు. 4. ప్రమోదంబున — ఓ.క.ఖ ఝ.డ ; ప్రమాదంబున — పెక్కుప్రతులు. 5. బరదారాగమనుండయిన — పెక్కు ప్రతులు.

255 1 పొవులుచు — ఓ.క.ఖ. 2. రోషానలమున — ఐ శ.శర.ప. 3 సఖుదగ్నికణములు — అ.ఉ.ప.ఐ.ఒ ఔ.క.ఖ చ డ.ల.వీ.శర. 4 చూపు — వా ; కాని పెక్కుప్రతులలో చూపె అనియున్నది. సూ. అదియే మూలానుగుణము. ప్రజజ్వాల తతః కోపాద్భగవన్ హవ్యవాహనః.

256 1. నమస్కరంబుచేసి — పెక్కు ప్రతులు 2. మహాపురుషా – కొన్నింటలేదు. 3 నాచేసిన – ఎ. 4 హస్తుండయిన — ఇ.ఈ.ఐ.క ఖ.చ. 5. కరుణించి — ఉ చ; ప్రత్యక్షుంబై — ఎ.ఓ. 6. నతండిట్లనియె – అ ఊ ల.వీ.శ.ష ; వాడిట్లనియె — కొన్నింటలేదు.

257 1. సాధింపంగ — ఐ ; సాధింపగా — క.ఖ. 2. పూని – అ ; దారు– ఐ.ణ. 3. మెడలియు నీచేత – ణ ; మెడలి నీచేత దగ్ధులై (లగుచు) – పెక్కు ప్రతులు. 4. లగు — పెక్కు ప్రతులు.

258 వ. [1]అనిన నారాజునకు నగ్ని[2]దేవుం డభిమతం బయినవరం బిచ్చి మఱి నీవు [3]నాకుం [4]బ్రతిప్రియంబు సేయు [5]మిప్పురంబు నింతులెంతయు మనోజ రాగిణులు [6]గావున వీరల[7]స్వైరిణీ[8]వృత్తి యెల్లకాలంబు సహింపవలయు నని యడిగిన నాఁటంగోలె మాహిష్మతీ[9]పురంబుస్త్రీలకు [10]స్వైరిణీత్వంబు నిర్దోషం బయ్యె నగ్నిదేవుండును నప్పురంబుపై వచ్చినవారల నెల్ల [11]దగ్ధ సైన్యులంజేయుచు [12]దాని [13]రక్షించు చుంటంజేసి పరరాష్ట్రపతు లగ్ని భయంబు[14]న నప్పురంబు [15]పరిహరింతు రది కారణంబుగా [16]సహదేవు సైన్యం బెల్ల నగ్ని[17]పరీతం బయినం జూచి [18]సంచలింపక సహదేవుండు శుచియై [19]వార్చి దర్భశయంబున [20]శయనించి యగ్నిసూక్తం[21]బుల నగ్నిభట్టారకు నిట్లని స్తుతియించె.

259 సీ. [1]నీతదర్థంబులై నిఖిలవేదంబులు [2]వర్తిల్లు లోకపావనము లగుచుఁ
బావనంబులలోనఁ బావనుండవు నీవ యజ్ఞంబులును నీవ హవ్యవాహ
[3]ధర్మనిత్యుండైన [4]ధర్మజుకావించుక్రతువు భవత్ప్రీతికరము గాదె
దానికి విఘ్నంబు దలఁచుట [5]ధర్మువె వరద వైశ్వానర వాయుమిత్ర

---

258 1. అని యడిగిన (యా) రాజునకు — కొన్నిప్రతులు. 2 దేవుండు కరుణించి యభి - ఓ.ఖ.ఛ జ.ల; దేవుండభీష్టంబయిన — అ ఘ. 3. నాకతి పి్రియంబు - ట. 4 ప్రత్యుపకారంబు సేయునది — ఎ.ఓ గ. 5. మప్పురంబున నింతులు — పెక్కు ప్రతులు. 6 గావున — పెక్కు ప్రతులలో లేదు. 7 స్వేచ్ఛవృత్తి — ఎ.ఔ ; స్వేచ్ఛావృత్తి — జ ; స్వైరవృత్తి — క.ల; స్వైరణవృత్తి — ఈ.ఖ.గ. 8 వృత్తులెల్లకాలంబును — ఎ.క.ఖ 9 పురంబున — పెక్కు ప్రతులు. 10 స్వేచ్ఛావృత్తి ; స్వైరిణీవృత్తి ; స్వైరవృత్తి, స్వైరణవృత్తి — అని భిన్నరూపములు. 11. దగ్ధులం — ఈ. 12. వారిని శిక్షింపుచుదాని — ల 13. రక్షించుటజేసి — అ.ఊ ఎ.ఐ.ఒ.ఓ.క.ఖ.గ.ఝ ణ. వీ.శ.ష. 14. నంజేసి యప్పురంబు సొరనొల్లక — ల 15. పైవిడియ రది కారణం — జ. 16. నట్లు సహ — అ.ఊ.ఖ.ఛ.జ.వా వీ శ.ష. 17 పరివృతం. పరితప్తం — వీ శ.ష. భిన్నప్రతులు 18 చలింపక — ఆ ఇ.ఊ ఏ ఓ ఔ.ఝ.ష. 19. వార్చి - పెక్కు ప్రతులలో లేదు కాని మూలమున ఉపస్పృశ్య శుచిర్భూత్వా అనియున్నది భం. 2—28—27.20నుండి—కొన్నిప్రతులు. 21. బులం బరియించుచు - ఉ.ఛ.జ.వా.

259 1. నీనిమిత్తంబులై — ఈ. 2. వర్ధిల్లు — ణ. 3. ధర్మాత్ములైనట్టి — ఓ. 4 ధర్మజుండొనరించు — ల ; ధర్మరాజొనరించు—ఘ. 5. ధర్మమె—ఎ.ఐ ఓ.ఘ.

ఆ. యనిన నగ్నిదేవుఁ డతని[6]కి సంప్రీతుఁ,డయి తదీయసేన కగ్నిభయముఁ
[7]బాచె దాని నెఱిఁగి భక్తుఁడై నీలుండు, కౌరవేంద్రుననుజుఁ గాన[8]వచ్చి.

—: సహదేవుఁడు దక్షిణ దిఙ్మహీపతులచేఁ గప్పంబులు గొనుట :—

సం. 2–28–37

260 క. దేవ [1]ప్రభావుఁ డగుసహ,దేవునకు హయద్విపేంద్రదివ్యాంబర నా
నావిధరత్న [2]మయాభర,ణా[3]వలి లలిఁ దెచ్చియిచ్చె నధికప్రీతిన్.

261 వ. ఇట్లు మాహిష్మతీపురంబు సాధించి నీలుచేత నరిగొని [1]సహదేవుండు దక్షిణదిక్కున కరిగి సౌరాష్ట్రదేశంబున నుండి [2]రుక్మి భీష్మక శూర్పారక దండకపతులచేత దూతముఖంబున నసంఖ్యాతధనంబులు గొని [3]సాగర ద్వీపనివాసులైన నిషాదులం బురుషాదుల నేకపాదులం [4]గాలముఖులం గర్ణ[5]ప్రావరణుల నరరాక్షసయోనుల రామశైల [6]కోలశైల తామ్రద్వీప [7]సంజయంతీపురనివాసులను [8]వశగతులం జేసి.

6. కతిప్రీతుడయి—అ.ఇ.ఊ ఎ.ఓ.ఔ.క.గ.డ ; కిసుప్రీతుడయి–ణ. 7. వాపె— ఐ ఖ.చ.ఝ ; బాపె—ల.స , బాసె–అ 8 వచ్చె–కొన్ని ప్రతులు.

260 1 ప్రాభవు – ఆ ; ప్రసన్నుండగు – చ 2. మహాభరణావళులును – ణ. 3. వలులు (ల)ను, వళులును – అని భిన్నరూపములు ; వళులని – స.

261 1 సహదేవుండరిగి సౌరాష్ట్ర – కొన్నిప్రతులు. 2. రుక్మక – కొన్ని ప్రతులు. సూచన;– కొన్ని తెలుఁగుప్రతులలో శూర్పకశూద్రకాదులైన అనియు, శూద్రక వర్ధకుల – అనియు భిన్నముగానున్నది. కాని ఇది మూలానుగుణముకాదు. 3. సాగరానూపవాసులైన – ఆ.ఈ.ఒ.చ.ట కాని, మూలమున సాగరద్వీప వాసాంశ్చ అనికలదు. భం 2_28_44. 4. కాకముఖులం, కాశముఖులం, కాలా ముఖులం-అని భిన్నప్రతులు. గోముఖులం అని 'ల'లో అధికపాఠము కాని మూలా నుగుణముకాదు. 5. ప్రపరులను – పెక్కుప్రతులు కాని యిది మూలాను గుణముకాదు. 6. కాలశైల, కామశైల – అని కొన్నిప్రతులు, కాని మూలమున లేవు ; కోలశైల అనునది పెక్కుప్రతులలో లేదు కాని మూలమున కోల్లగిరిం చైవ– అని యున్నది. భం.2_28_45. 7. జయంతీపుర – పెక్కుప్రతులు–కాని మూలమున సంజయంతీ అనియే యున్నది భం. 3-28–41. 8 వశవర్తులం–వ.

262 క. [1]తాళవన పాండ్య కేరళ, కాళింగ[2]ద్రవిడ యవన కరహాటకభూ
పాలకుల [3]నొడిచి దక్షిణ, వేలావనభూములందు [4]విడిసి కడంకన్.

263 చ. [1]కురువిభురాజసూయమునకుఁ ధన మిచ్చిరి రాజు లెల్ల నా
[2]దరమునఁ బ్రీతి సేయునది దాను దప్పక యంచు లంక క
చ్చెరువుగఁ [3]బుచ్చె దూతలఁ బ్రసిద్ధిగ నంత విభీషణుండు చె
చ్చెర సహదేవుశాసనము చేకొని సేసెఁ గరంబు నెమ్మితోన్.

264 మ. [1]పరగఁ దక్షిణదిఙ్మహీపతులచేఁ బౌలస్త్యుచే నిట్లు దు
ర్ధర[2]శక్తిన్ సహదేవుఁ డర్థములు రత్నవ్రాతముల్ చందనా

262 1. తాళధర — వీ.శ.ష. తప్ప మిగతప్రతులలో. మూలమున ఆంధ్రాం స్తాళవనాం శ్చైవ అనియున్నది భం.2–28–48 తాళాంధ్ర పాండ్యకేరళ అని పూర్వపాఠమై యుండనోపు. 2. ద్రవిళరూపము పెక్కు ప్రతులలో కలదు 3. నొర్చి— పెక్కు ప్రతులు. 4. విడిసెగడంకఁ — ఉ బొ.ఝ.డ స ; విడిసెఁగడకన్ — ల.వీ.శ ష.

263 1 కురుపతి - ట ; కురువరు — ఘ. ఈ పద్యమునకు పూర్వమున 'ఇట్లు సేతుబంధనసమీపంబున విడిసిన సహదేవుండు ఘటోత్కచుం దలంచిన తత్క్షణంబ వచ్చి దండప్రణామంబు సేసి ముకుళితహస్తుండయి పనియేమి యనుటయు నీవు విభీషణు కడకుం జని యుపాయినంబు గొనిరమ్మని పంచిన వాడును గగనమార్గం బున లంకకుం జని రాక్షసేంద్రుండగు విభీషణుని గాంచి కృష్ణసహాయుండగు ధర్మ రాజు రాజసూయారంభంబును, తత్కారణంబున భీమార్జున నకుల సహదేవులు దిగ్విజయార్థం బరుగుటయు వారలలోన దక్షిణదిశకుం జనుదెంచిన సహదేవు శాస నంబున తాను దూతయై వచ్చుటయు తన పేరు భీమసేనపుత్రుండయిన ఘటోత్క చుండని విన్నవించి' వఱకు గల వచనము ఉ.ఓ.ఖ.వీ.స.శ. ప్రతులందు కలదు. దీనికి మూలము పి పి.యస్ ప్రతియందు 2–27–125 నుండి 203వరకు కలదు. అందీ వృత్తాంతము విస్తారముగా వర్ణింపఁబడి యున్నది. భం. ప్రతిలోలేదు. 2. దర మున ప్రీతతోడ నదిదప్పక చేయుమటంచు లంకక — ఏ బొ.ల 3. బంచె — ఈ. ఊ.ఓ ఖ వ.శ ష ; జెప్పిపుచ్చెను బ్రసిద్ధిగ - ట.

264 1. ఈపద్యమునకు పూర్వము.

క. పంచశతరాక్షసులచే
కాంచనమయ తాళయూప ఘననవరత్నో
దంచిత భూషాంబరములు
చంచద్గతి నొసగి పనిచె సహదేవునకున్.

అనుపద్యమధికపాఠముగా ఉ.ఓ.స.శ ప్రతులలో కలదు. మూలమున తాని సర్వాణి రత్నాని అష్టాశీతి నిశాచరాః ఆజహ్రుస్సముదా రాజన్ హైడింబేన తదా సహ—అని పి.పి యస్. ప్రతియందున్నది 2–27–216. 2. శీలన్—అ.ఇ.ఈ.ఏ.ఒ.బొ.

[3]గురు[4]కాష్ఠాదులు గప్పముల్ గొనియెఁ బెక్కుల్ [5]పేర్మితో నుర్వరా
[6]మరలక్ష్మీకరుఁడైన ధర్మసుతుసామ్రాజ్యంబు పూజ్యంబుగన్.

-: నకులుఁడు పశ్చిమదిగ్విజయంబు సేయుట :-

సం 2-29-2.

265 క. నకులుఁడు పశ్చిమదిక్కున, కకుటిలశౌర్యంబు [1]మెఱయ [2]నరిగి యరాతి
ప్రకర [3]భయానకసేనా,ధికుఁడయి నిజతేజమెల్ల[4]దిక్కుల [5]వెలుఁగన్.

266 ఉ. యోధుల సింహనాదము [1]మదోత్కటవారణబృంహితంబు వే
గాధికవాజిహేషితమహారవమున్ రథనేమిఘోషమున్
బాధితకర్ణరంధ్రమయి [2]పర్వె దిగంతము లెల్ల ప్రోయ నం
భోధిరవంబ పోలెఁ గురుపుంగవు నచ్చతురంగవాహినిన్.

267 వ. ఇట్లు మాద్రేయుండు రౌద్రాకారంబునఁ [1]గసిమసంగి మహాసేనా[2]న్వితుం
డయి యరిగి మహాసేనరక్షితంబైన [3]మహితకవిషయంబున [4]దత్తక
మయూరకాదిశూద్రులతోఁ గయ్యంబు చేసి మరు మాళవ బర్బర [5]కర్బర

ణ ల ; వృత్తిన్ — అ ఉ ఊ 3. గురుకాష్ఠాదులు గప్పముల్ గొనియె వేడ్కన్ బెక్కుగానుర్వరా — ణ ల, గురువస్త్రాదులు గప్పముల్ గొనియె బెక్కాధిక్యతన్ — ఆ (అఖండయతి) 4. వస్త్రాదులు—ఇ.ఈ ఏ ఓ.ఔ.గ.ఛ ఝ వ 5 నెమ్మితో — అ ఉ ఏ ఒ క.ఛ.జ ; పేర్మితోడంధరన్ — ట 6. వరలక్ష్మీధరుడైన ధర్మసుతు సాంబ్రాజ్యంబు పూజ్యంబుగన్— ణ. (సాంబ్రాజ్యము — అనురూపము గమనింపఁ దగినది )

265 1. వెలయ — కొన్నిప్రతులు ; వెలుగ — ఇ ; నెరయ — ట. 2 నరిగెన రాతి — పెక్కుప్రతులు. 3. భయంకర — పెక్కుప్రతులు. 4. దిక్కులు — ఐ.ఓ ఖ డ. 5. వెలయన్ — ఓ.ల.

266 1. మదోద్ధత — ఓ.గ. 2. పర్విదిగంతము లెల్ల ప్రోసె—ణ ; పర్వ....ప్రోసె- ఎ.సం ; పర్విదిగంతములందు ప్రోసె — వీ.శ.ష.

267 1. గసిమసంగి — పెక్కు ప్రతులలో లేదు 2 సమన్వితుండయి — అ.ఆ. ఉ.ఖ ; సమేతుండయి — ఈ ఊ ఘ. 3. రోహితాంక — భాసం ; రో (రా) హితక — ల.వీ.స.శ. 4 మత్తమయూరకాది— ల.స.శ ; మత్తమయూర కులతో —వీ. మూలము కార్తికేయస్య దయితం రోహీతక ముపాద్రవత్, తత్ర యుద్ధం మహద్వృత్తంశూరైః మత్తమయూరకైః భం. 2-29-4-5. 5. కర్బర —

శైరీషక దాశార్ణదేశంబుల [6]రాజుల జయించి పుష్కరారణ్యనివాసు లైన యాభీరగణంబులను సరస్వతీ సింధుకూలాశ్రితులైన [7]గ్రామణీయుల[8]ను బంచనదామరపర్వతనివాసులను [9]వశగతులం జేసికొని [10]వాసుదేవు నకు నిజాగమనం బెఱింగించి పుచ్చి.

268 సీ. [1]శాకలపురమందు శల్యు మద్రేశ్వరుఁ [2]దమ మేనమామ ను త్తమ[3]గుణాఢ్యుఁ గానంగ నరిగి సత్కారపూర్వకముగా [4]వస్తువాహనములు వానిచేతఁ గొని పశ్చిమాంబుధి కుక్షినివాసులఁ బరమదారుణుల బర్బర కిరాత వీరుల నోడించి విభుఁ డిట్లు వరుణేంద్రపాలితదిఙ్మహీపతులచేత

ఆ. బలిమిఁ గొనినధనము పది[5]వేలు లొట్టియల్, [6]పెట్టఁగి రాఁగ వైరిభీకరుండు వచ్చె నకులుఁ [7]డమితవాహినీపదహతిఁ, దల్లడిల్లుచుండ ధరణితలము.

269 వ. ఇట్లు భీమార్జుననకులసహదేవులు పరాక్రమంబున దిగ్విజయంబు సేసి [1]చతురుదధి[2]పరీతమహీతలంబునం గలరాజులచేతన సంఖ్యా[3]తధనవస్తు

మూలమునలేదు. ఈవచనమందలి తక్కినపేళ్ళన్నియు మూలమునఁ గలవు. మూలమునందు ఇంకను అధికములు గలవు. తెలుఁగున భిన్నప్రతులలో భిన్నవిధములుగ నున్నవి. గృహీత పాఠమే చాలవరకు మూలానుగుణమైనది. శిరీషకరుష హూణపారసీయ (కర్ణాటహాటక) ధుర్ధరనివాసుల నోర్చి పుష్కరా—శ్రావణేయులను (ధనధామ) పంచనదారామపర్వ — స. 6. రాజుల—పెక్కు ప్రతులలో లేదు. శ్రావణీయులను – పెక్కుప్రతులు. కాని సింధు కూలాశ్రితా యేచ గ్రామణేయా మహాబలాః అని మూలము భం.2–29-8. 8. ను (ధన ధామ) బంచన దా—స. 9. వశ్యుల జేసి — కొన్నిప్రతులు. 10. ఘనదామర పర్వత నివాసుల పంచరథగరుడాదుల వశ్యులం జేసి వాసు — ఆ.ఓ.ఘ.ల.

268 1. శాకల్య — పెక్కుప్రతులు; కాని మూలమున శాకలమభ్యేత్య అని యున్నది. భం 12-39-13. శ ప్రతిపాఠాంతరములలో శాలక్య అని యున్నది. అదియు మూలవిరుద్ధమే 2. దన — పెక్కుప్రతులు. 3. బలాఢ్యు — ఉ.ట. డ.పీ. ప్రతులలో తప్ప తక్కిన అన్నిటియందును. 4. వాహన మహనీయ వస్తువు లను — ల 5 వేల యొంటెలు పెటికిరాగ — శర; వేలయొంటెలం బెటికి రాఁగ — గు. 6. పెటికిరాగ — వెటికిరాగ—శర.సూ 7. దళిల — పెక్కు ప్రతులు; డధిక – ఉ.చ.

269 1. చతుర్జలనిధి – క.ఖ; చతుర్జలధి – డ. 2. పరి (ర) వృత – ఆ.ఓ.ఘ ట.ల; పర్యంతంబునం – క.ఖ.డ; వలయిత – అ.ఇ.ఏ.ఔ.గ.ఝ. 3. తవస్తువాహన –

వాహననివహంబులు గొనివచ్చి వేలువేల ధర్మరాజు[4]నకుం జూపి యిచ్చిన.

270 క. [1]ఉరుగుణవిశుద్ధరత్నో, త్కరనానాధనసమృద్ధిఁ గడు నధికుండై
కురువృషభుఁడు గిడ్పఁటిచెను, వరుణధనేశ్వరుల [2]విభవవైభవయుక్తిన్.

-: రాజసూయము సేయుమని ధర్మజున కతనియాప్తులు సెప్పుట :-

సం. 2-30-8

271 వ. మఱియు ధర్మోపార్జి[1]తరక్షితప్రవర్ధితం బయినమహాధనవర్గంబుఁ జూచి [2]పాత్రప్రతిపాదనం[3]బు నియోగింప సమకట్టి [4]రాజసూయాధ్వరారంభ సుస్థిర [5]నివేశితబుద్ధియై [6]యున్న యయ్యుధిష్ఠిరు నభి[7]ప్రాయంబున [8]కను గుణంబుగా నాప్తమంత్రు లిట్లనిరి.

172 సీ. కురువీర నీధర్మపరిపాలనంబున నీగుణసంపద నీవిశుద్ధ
చారిత్రమునఁ జేసి ధారుణిప్రజ కెల్ల నభివృద్ధి యయ్యె నెయ్యంబుతోడ
[1]రాజవంచకులయు [2]రాజవల్లభులయుఁ [3]దస్కరులయు బాధ దఱిఁగె
రుజయు

పెక్కు ప్రతులు. 4 న కొప్పించిన — ఐ.ణ ; నకుంజూపి యొప్పించిన — ఎ.క.ఖ. గ.ఛ.ఝ డ.

270 1 ఉరుతర — ఇ ఈ ఎ.ఐ.ట.క.ఖ.గ 2. వినుత — ల వీ.శ.ష.స.శ , దైన వైభవ — ఐ.కఖా.

271 1. తంబులగు (లైన) ధనంబులుపాత్ర — అ.ఆ.ఊ.ఐ.ఒ.క.ఖ.గ.ఘ.చ.ణ.ల.శ.ష. 2. విశుద్ధపాత్ర — ట. 3. బున (బునందు) — పెక్కు ప్రతులు. 4. రాజ సూయారంభ నివేశిత — పెక్కు ప్రతులు. 5. నిర్దిష్టబుద్ధి — డ ; నిర్దేశిత — ఈ.క ఖ. 6. యున్న యుధిష్ఠిరున — పెక్కు ప్రతులు. 7. ప్రాయం బెఱింగి తదనుగుణంబుగా నతని యాప్తమంత్రులిట్లనిరి — పెక్కు ప్రతులు 8. కను రూపంబుగా — ల.వీ.శ.ష ; కనుకూలంబుగా — ఈ.గ.ణ.

272 1. రాజవంశజులయు — ఇ.ఈ.ఉ.ట.ఘ. కాని యిది మూలవిరుద్ధము మూలము — దస్యుభ్యో వంచకేభ్యోవా రాజప్రతిపరస్పరమ్ రాజవల్లభతశ్చైవ నాశ్రూయంత మృషాగిరః అవర్షం చాతివర్షం చవ్యాధి పావక మూర్ఛనమ్ - భం 2-30-4, 5 అని కలదు. 2. రాష్ట్రవంచకులయు — ల.శ.ష. 3. దస్కరబాధలు దఱిగె —

[4]పగయును భయమును వగయును [5]వెరపును నాదిగాఁ గల యెగ్గు లడఁగెఁ [6]బుడమి

ఆ. [7]నర్థులోలిఁ బెరిఁగె నవనీశులెల్ల నీ, యనుజవీర్యవిజితు [8]లయి త్వదీయ
శాసనస్థు లయిరి జగతీశ యిదియ నీ, యజ్ఞకార్యమునకు నవసరంబు.

273 వ. మఱియు నపరిమిత[1]పరార్ఘ్యరత్నరజతసువర్ణపరిపూర్ణం బయి మహామేరుశైలంబు సన్నిహితంబైన యట్లు యక్షేశ్వరునక్షయనిధులు ప్రత్యక్షంబైనయట్లు [2]భాండాగారంబు సమృద్ధం బైనయది [3]ఘృతలవణతైలతండులధాన్యాదిసమస్తవస్తు[4]విస్తృతం బయి కోష్ఠాగారంబు సకల సంకల్పసిద్ధికరంబై కల్పద్రుమంబు ననుకరించు చున్నయది వేదంబులన్నియు మూర్తిమంతంబు లయినయట్లు మహాయాజ్ఞికు లయిన మహీసురవరులు నీయభ్యు[5]దయంబు గోరుచున్నవారు గావున రాజసూయాధ్వరం బెడసేయక చేయుమని పలుకుచున్న [6]యవసరంబున.

పెక్కు ప్రతులు. 4. పగయును భయమును వగయు (పు) ను వెరపునువాదిగా — పెక్కు ప్రతులు : వాయుభయంబును వరదయు వెరపును – ట ; వహ్నియు భయమును వలపును గలవును – వా. ఈ పాఠమున ప్రాసయతి నియమము తప్పినది. గృహీతపాఠము పెక్కు ప్రతులందుండి యీ నియమము ననుసరించినది. కాని మూలమందలి పావకశబ్ద మిందులోపించినది. 5 వంతయు — కౌ ల. శ ష. 6. భువిని — క.ఖ. 7. నర్థువొప్పి (వొప్ప) బెరిగె – కొన్ని ప్రతులు ; నర్థమొప్ప – ఘ.ల ; నర్థువులును వెలిగె — ట ; నర్థువోలి బెరిగె — సం. నిన్నుగొలిచిరి యవనీశ్వరులెల్ల — ణ (అఖండయతి) 8. లైతదీయ — పెక్కుప్రతులు.

273 1. పదార్థ — ఎ.ఒ.చ. 2. భాండాగారంబులు సమృద్ధంబులైనయవి (లైయున్నయవి) – పెక్కుప్రతులు. 3. మరియు ఘృత — ఓ.ట 4 విస్తారంబయి — ఉ.ఎ క.ఖ.గ.ఝ. 5. దయంబభినందించు చున్నవారు — ఇ.ణ.స శ; దయంబయభినందించుచున్నవారు — ఈ ; దయంబున కభినందించు చున్నవారు — చ. 6. సమయంబున — కొన్నిప్రతులు.

-: కృష్ణుఁడు ద్వారకనుండి వచ్చుట :-

సం. 2-30-9

274 క. ద్వారవతినుండి జగదా, ధారుఁడు గృష్ణుండు వచ్చి [1]ధర్మజు ధర్మ
ప్రారంభనిత్యు [2]ను త్తము, భూరి [3]ధనంబులను రత్నములఁ బూజించెన్.

275 వ. [1]ధర్మరాజును జగదర్చితుం డయిన యచ్యుతు [2]నర్ఘ్యాదివిధులం బూజించి తమ్ములయు ధౌమ్యద్వైపాయనాదులయు ఋత్విజులయు నాప్తమంత్రులయు [3]సమక్షంబున నధోక్షజున కిట్లనియె.

276 మత్తకోకిలము. ధారుణీధర ధర్మతత్త్వ[1]నిధాన దానవదర్పసం
హార వారిజనాభ బంధుజనానురంజన[2] కారి నీ
కారణంబు[3]నఁ జేసి [4]మాకు జగంబునం గలభూపతుల్
భూరివిక్రమవశ్యులైరి [5]విభుత్వ మేర్పడుచుండగఁన్.

277 క. క్షితిపతుల [1]వలన సముపా, ర్జితమైన ధనంబు కొలఁదిఁ[2] జెప్పఁగ వాచ
స్పతికి నశక్యము దీనిం, బ్రతిపాదింపంగ వలయుఁ [3]బాత్రవశమునన్.

278 వ. దేవ[1]ముఖం బయిన యగ్ని దేవుముఖంబున విధ్యుక్తంబుగా వేల్చి దేవతర్పణంబును [2]యథోచితదక్షిణల నభీష్టదానంబుల మహీదేవతర్పణంబునుం

274 1. ధర్మజు యజ్ఞప్రారంభ — ఐ ; దర్భదానముఖ ప్రారంభ - చ 2. నుత్తమ — పెక్కుప్రతులు. 3. ధనావళుల — గ.

275 1. ధర్మజుండును — ఇ.ఉ.ఎ.ఝ.వీ.శ.ష. 2. నర్ఘ్యపాద్యాది — క.ల. 3. సుహృద్బాంధవ (వులయు)—అ.ఆ.ఈ.ప ఒ ఔ.ఘ ల.

276 1. విధాన — ణ.శ.ష. 2 కార - కొన్ని ప్రతులు. 3. నసూవెమాకు—ణ. 4. నాకు జగంబులో—పెక్కుప్రతులు. 5 ప్రభుత్వ మొప్పచునుండగాఁ — అ.ఇ. ఊ.ఐ.ఘ.వ.వీ.శ.ష ; విభూతి నొప్పచునుండగాన్ — ణ ; విభుత్వ మొప్పచు నుండగాఁ — కొన్ని ప్రతులు.

277 1. చేత — ఎ.క.ఖ.గ.డ. 2. జెప్పను — క.ఖ. 3. పాత్రుల యెడలన్—చ; పాత్రాంశమునన్ — ట.

278 1. ముఖుం (ఖ్యుం)డయిన — పెక్కు ప్రతులు 2. యథోక్త—కొన్ని ప్రతులు

చేయవలయుం గావున [3]నీకిష్టం బయిన యజ్ఞంబు [4]చేయించి నాకును లోకంబులకుం బ్రియంబు సేయు మెుండె నన్ను రాజసూయాధ్వరవిధానంబునందు నియోగించి యనుగ్రహింపు మనిన యుధిష్ఠిరునకు నారాయణుం డిట్లనియె.

279 ఉ. పూజ్యుఁడ వెల్లవంశముల భూపతులందును ధర్మనిర్మల
ప్రాజ్యవిభూతి [1]నద్దివిజపాలకు [2]నట్టిఁడ [3]నీక యొప్పె సా
మ్రాజ్యము దైవసంపదయు మానుషసంపదపేర్మి కావునన్
యాజ్యుఁడ విప్డు [4]నీవ భరతాన్వయ[5]భూషణ ధర్మనందనా.

280 క. [1]పంపం దగుఁ దగ దని శం, కింపక [2]నీకిష్ట మయిన కృత్యముల నియో
గింపుము నన్ను భవద్గుణ, సంపత్ప్ర[3]వణుల సమస్తజనుల జనేశా.

281 చ. అనిన [1]నుపేంద్రువాక్యమను నయ్యమృతంబునఁ జేసి ధర్మనం
దనుఁడు ముదంబు [2]నొంది విదితంబుగ [3]నాకు మనోరథంబు లె
ల్లను సమకూరె నిప్డు సఫలత్వము [4]వొందె ధనాగమంబు లం
చును [5]నెడ నిశ్చయించె మధుసూదనదేవు ననుగ్రహంబునన్.

3. నీధనంబున (బలవలన) నీకిష్టం—పెక్కుప్రతులు 4. చేసి – అ.ఇ.ఈ.ఊ.ఐ.ఓ.ఘ.ఝ.శ.ష; సేసి — వీ.

279 1. యద్దివిజపాలకు నట్టిద—స 2. నట్టిది నీకునొప్పు సా – క భూ. 3. నీకు నొప్పు సా — ఆ ఉ.ఓ.ఘ.ణ.ల, యొప్పు నీకు – ట. 4. నీవు – అ.ఒ.గ.చ.ఝ ల 5. దీపక — ఆ.ఒ.ఓ.ఘ; వర్ధన — ఏ.ఔ.చ.ఝ.

280 1. పంపగదగుదగదని శంకింపక యిష్టంబులైన – ఐ.ఒ.క.ఖ.ఝ. 2. యిష్టంబులైన – కొన్నిప్రతులు. 3. వరుల – అ.ఇ.ఉ ఊ.ఐ ఓ.క.ఖ.ఘ.చ.

281 1. మురారి — అ. 2. బొంది — ఎ.ఒ.చ.ఝ 3. నాదు – ఎ.జ.ఝ. 4. బొందెదు నామఖంబునంచును మది – ణ; వొందెనయాగ మొప్పునంచును– ఆ.ఘ; వొందెను నాదు యాగమంచును — ఝ; వొందెను నాదు జన్మమంచును — చ; 5. మది — ఈ.చ.ల.వీ.శ.ష.

## —: ధర్మరాజు రాజసూయంబు సేయ నారంభించుట :-

సం. 2—30—17

282 వ. ఇట్లు [1]నారాయణదేవుచేత ననుజ్ఞాతుం [2]డయి తమ్ములయు [3]ధౌమ్య ద్వైపాయనాదులయు [4]ననుమతంబున ధర్మరాజు రాజసూయంబు సేయ నుపక్రమించి సహదేవుం జూచి నీవు ధౌమ్యోపదిష్టంబు లయిన యజ్ఞోప[5]కరణద్రవ్యంబులు దేర నింద్రసేన[6]ప్రముఖులను నర్జునుసారథి యయిన [7]రుక్మను సమర్పించి యజ్ఞాయతనంబున నానాదేశాగతులైన రాజులకు [8]సన్నివేశంబులు [9]సేయించి నిఖిలమహీతలంబునం బ్రాహ్మణ [10]క్షత్త్రియ వైశ్యశూద్రులనెల్ల [11]రా బనుపు మని పంచిన నతండును [12]దద్వాక్యానంత రంబున నింద్రసేనాదుల ననేక[13]శిల్పివరుల నియోగించి.

283 సీ. శాస్త్రోపదిష్టప్రశస్తప్రమాణలక్షణముల యజ్ఞోపకరణతతుల
యజ్ఞాయతనము[1]న నతిరమణీయంబు లయి యుండ నొనరించి యందు సర్వ
[2]సంభారములు నించి [3]సకలదిక్కుల హారిప్రస్థంబుచుట్టు నపారభూరి
బహువిధాగారముల్ ప్రమదవనంబు[4]ల వాపుల దీర్ఘికా[5]వలుల [6]వెలసి

282 1 నారాయణునిచేత — పెక్కుప్రతులు ; దేవకీనందనుచేత — ఓ ఛ.ఝ 2. డయి ధర్మతనయుండు — ఈ పీ శ.ష 3. ధౌమ్య — కొన్నిప్రతులలో లేదు. 4. సమ్మతంబున — అ.ఆ.ఊ.ఐ.ఒ.ఓ.గ.ఘ ట ణ శ ష ; సమతంబున — క.ఖ. డ 5. కరణంబులు — ఆ ఇ.ఈ ఎ ఓ.గ ఘ.ఝ. 6. ప్రభృతుల (ను) — ఉ ; యా (య) జ్ఞ సేనులను — ఈ ఎ ఓ.క.ఖ.డ (మూలానుగుణముకాదు)7 రుక్మను— పెకు ప్రతులు ; రుక్మిని — ష.స.మూలమున ఇంద్రసేనో విశోకశ్చ పూరు శ్చా న సారధి అని భం.2-30—30 పాఠాంతరములలో కలదు. రుక్మశ్చార్జున సార థి. అని పి పి ఎస్ 2—30.49. 8. నివేశంబులు — పెక్కుప్రతులు ; మంది రంబులు — ఛ.ఝ ; 9. రచియించి — ఛ ; సేయింప నియమించి— ఐ.గ. 10. క్షత్త్రియ వైశ్యశూద్రుల — పీ ; క్షత్రియ వైశ్యశూద్రాదులు — అ.ప. ఔ.గ ; క్షత్రియాదుల — వా ; బ్రాహ్మణాన్ భూమిపానపి విశశ్చ మాన్యాన్ శూద్రాంశ్చ సర్వానానయేతిచ— అని మూలము. భం. 2—30—41. 11. రావింపు (డు) మని — పెక్కుప్రతులు 12. దద్వచనా — అ.ఐ.వీ.శ.ష 13. శిల్పా చార్యుల — ఎ.క.ఖ.గ.ఝ డ.

283 1. లు(ల) నతిరమణీయంబులై యుండ — పెక్కుప్రతులు. 2. సంభారువులు ఏ.ఔ. 3. సర్వ — పెక్కుప్రతులు. 4. లు బావులు — పెక్కుప్రతులు. 5. వలు(ళు)లు — అ.ఎ.ఏ. గ.ఝ. ల.వీ.శ.ష. 6. వెలయునాజ్ఞ — ల ; జేసి —

ఆ. యాజ్యతైల తండులాది నానావస్తు; పూరితంబు లయి విభూతి[7]దనర
జననుతుండు సేసె సహదేవుఁ [8]డపరభూ, తలముఁ [9]బోలి యొప్పెఁ
దత్పురంబు.

284 వ. మఱియు సహ[1]దేవానుశాసనంబునఁ [2]బుత్త్రమిత్రభ్రాతృ సమేతులై విరాట ద్రుపద శిశుపాల గాంధారరాజులును ప్రాగ్జ్యోతి[3]షంబున భగదత్తుండును [4]శక సాల్వ బృహద్బల చంద్రసేన [5]సముద్రసేన కుంతిభోజ [6]పౌండ్రక వాసుదేవులును [7]వసుదేవ [8]బలదేవ ప్రద్యుమ్న శూరసేనాది యదువృష్టిభోజాంధకవరులును నంగ వంగ కళింగ కాశ్మీర [9]కాంభోజ [10]గౌడాంధ్ర సింహళ కేరళ కుంతల [11]ద్రవిడ మరుయవనపతులును పార్వతేయులును [12]సాగరానూపవాసులును [13]నాదిగాఁ జతుస్సముద్రముద్రి[14]తవసుంధరాచక్రంబునం గల రాజచక్రంబును [15]సమగ్రవేదవేదాంగవిదులైన యగ్రజన్ములును [16]స్వకర్మనిరతులైన వైశ్యశూద్రులును వచ్చి [17]యథాపరికల్పిత [18]సన్నివేశంబుల నుండి రంత ధర్మపుత్త్రుండు [19]భీష్మాదులం [20]దోడ్కొని తేర గజపురంబునకు నకులుం బంచిన.

చ డ.ణ ; నిలిపి — ఓ ; వెలయనాజ్య — వీ 7. మెరయ — ఎ.క.ఖ.శ ష
8 డమర భూధరము — ఆ.ఊ ప ఒ ఘ. 9. వోలెనుండ — ణ ; బోలెనొప్ప — ల

284 1. దేవు శాసనం — కొన్నిప్రతులు. 2. పుత్త్రపౌత్త్ర. మిత్రకళత్ర భాతృ—ల. 3. షాధీశుండగు—ఉ.ఔ.చ ; షపురాధీశ్వరుండగు — ల. 4. శకయవనసాల్వ — శ ష కాని యవన శబ్దము పునరుక్తము. 5 సముద్రసేన — ప.ఒ.ఔ.ట. ప్రతులలో లేదు. మూలమునను లేదు ; చిత్రసేన—ల. 6. పౌండ్ర వాసుదేవు — పెక్కు ప్రతులు, 7 వసుదేవ — పెక్కు ప్రతులలో లేదు. 8. బలదేవాదియదు — పెక్కు ప్రతులు, రామశ్చైవానిరుద్ధశ్చబభ్రుశ్చ సహసారణః గదప్రద్యుమ్న సాంబాశ్చ చారుదేష్ణశ్చ ఉల్ముకోని శారశ్చైవవీరః ప్రాద్యుమ్నరేవచ అని మూలము భం. 2–31–15 బలదేవ సాంబాక్రూర సాత్యకిప్రద్యుమ్న శూరసేనాది — ఉ ల. 9 మగధ మాళవ నేపాళ కరహాట మరహాట [రాట] ఘూర్జర — ఇత్యాద్యధిక పాఠములు భిన్నప్రతులలోఁ గలవు. 10. వానవాస్యాంధ్రకాస్తథా-అని మూలము- భం 2–31–11 ; గౌడాంధ్ర సింధు — ట ; గౌంళాంధ్ర — క.ఘ ఝ. 11. ద్రవిళ — రూపము పెక్కు ప్రతులు. 12. సాగర ద్వీపవాసులు — డ.ఫి.శ.ష ; సాగరోపవాసులు — ణ. 13 నాదిగాగల — పెక్కుప్రతులు ; హిమవత్పర్వతంబు నందున్నరాజులు పదారుగురు నాదిగాగల — ఉ.చ.ల. 14. తాఖిల మహీ — కొన్ని ప్రతులు 15 సమస్తవేదవేదాంగ — ఆ.ఊ.ఎ.ప ఔ.ఘ.చ.ల. 16 సుకర్మ — అ.ఇ. 17. యథార్హసంకల్పిత — స ; యథార్హపరికల్పిత — ల.వి. 18. నివేశంబుల — పెక్కుప్రతులు. 19. భీష్మాదిబంధుజనులం — పెక్కు ప్రతులు ; భీష్మధృతరాష్ట్రాది బంధుజనులం దోడితేర — ల. 20. దోడ్తేర — కొన్ని ప్రతులు.

—: రాజసూయమునకు భీష్మాదు లరుదెంచుట :—

సం. 2—31—4

285 క. అనుపమధనరాసులు [1]గొను,చును ననురాగమున [2]రాజసూయమఖాలో
కనకౌతూహలపరు లయి, చనుదెంచిరి భీష్ముఁ దొట్టి సద్బంధు[3]జనుల్.

286 వ. ఇట్లు వచ్చిన భీష్మ ధృతరాష్ట్ర విదుర ద్రోణ [1]కృపాశ్వత్థామ [2]సోమదత్త
కర్ణ భూరిశ్రవ శ్శల్య శకుని సైంధవ దుర్యోధన దుశ్శాసన [3]వికర్ణాదుల
నెల్లం [4]బ్రియసత్కారంబులం బూజించి వారలతో ధర్మరా జిట్లనియె.

287 ఆ. మీయనుగ్రహమునఁ జేయంగఁ గడఁగితి, నిమ్మహాధ్వరంబు నెమ్మితోడ
దీని [1]నిందఱును ననూనంబు[2]గాఁ బూని, పెంపు [3]మెఱసి నిర్వహింపవలయు.

288 వ. అని [1]వారలయనుగ్రహంబు వడసి హిరణ్య [2]రజత [3]రత్న దక్షిణాదాన
విషయంబులందుఁ [4]గృపాచార్యునిఁ గృతాకృత [5]పరిజ్ఞానంబునందు భీష్మ
ద్రోణులను సకల[6]వస్తువ్యయంబునందు విదురుని నానాదేశాగతు లైన

285 1 గొన్చును విభవము మీర రాజసూయాధ్వర దర్శన — అ.ఆ ; గొనిసునిశిత మతులపుడు రాజ – ల ; గొని సునయోత్సాహమున రాజ – డ. 2. రాజసూయోత్సవమున్ గను కౌతూహల మెసగగ జను – ణ. 3. వరుల్ —కొన్ని ప్రతులు ; తతుల్ – అ.

286 1 కృప కృతవర్మాశ్వత్థామ — ల. (కాని, యిది మూలవిరుద్ధము. 2. బాహ్లికోధృతరాష్ట్రశ్చ సోమదత్తోజయద్రథః. భం. 2—32—7. బాహ్లికసోమదత్త –అ ఝ; సౌమదత్త — అ.ఇ ఈ వా కొన్ని ప్రతులు 3. చిత్రసేన, లక్షణ, దుర్మర్షణ. దుర్ముఖ, యుయుత్సు,వివింశతి, విందానువింద , సంజయ మున్నగుపేర్లు భిన్న ప్రతులలో నధికముగఁ గలవు. 4. ప్రియపూర్వకంబున — ఊ.ఏ.ట.

287 1. నందరును – ఎ.ఏ.ఓ.చ.ఛ ల.వీ.శ. 2. గావించి — అ.ఇ ఛ. 3. జేసి — ఆ.ఇ.ఈ.క ఖ.డ ; తోడ — ల ; నెరయ — ణ.

288 1. వారి – కొన్ని ప్రతులు 2. రజత – పెక్కు ప్రతులలో లేదు. 3 రత్న ధనధాన్య దక్షిణాదానవిధాన – ల ; రత్న ధనధాన్యదక్షిణా – అ.ఏ ఔ. 4. గృపాచార్య కృతవర్మలను – ల (ఇది మూల విరుద్ధము) దక్షిణానాంచ వైదానే కృపం రాజా న్యయోజయత్ అని మూలము భం. 2—32—6 5. పరిజ్ఞానవిషయంబులయందు — కొన్ని ప్రతులు. 6. వస్తుచయంబులయందు — ఇ.ఊ.ఘ.ఝ.ణ ; వస్తు ప్రచయప్రతయంబున విదురుని — ల.

రాజులు [7]దెచ్చి యిచ్చిన యుపాయనంబులు గైకొన దుర్యోధనుని [8]భక్ష్యభోజ్యాదివినియోగంబు[9]నందు దుశ్శాసనుని నియోగించి.

-: ధర్మజుఁడు యజ్ఞాయతనము ప్రవేశించుట :-

సం. 2—33—1

289 క. ప్రాజ్ఞుఁడు [1]విశేషధర్మ వి,ధిజ్ఞుఁడు ధర్మజుఁడు యజ్ఞదీక్షితుఁ డయి వి ప్రజ్ఞాతిపరివృతుం డయి, యజ్ఞాయతనమున కరిగె నధిక [2]విభూతిన్.

290 ఉ. సమ్మద మంది చూచిరి [1]కృశంబుగ [2]భూజను లెల్ల బ్రహ్మతే జమ్మును రాజతేజము[3]ను సద్బహుభూషణ [4]రత్నరాజి తే జమ్మును విస్త[5]రించుచు నిజద్యుతి [6]యొప్పఁగ [7]మూర్తమైన ధ ర్మమ్మునుబోలె నున్న గుణ[8]మండితు దీక్షితు ధర్మనందనున్[9].

291 క. బ్రహ్మవిదులయిననిఖిల, బ్రాహ్మణసత్తములచేతఁ బరివేష్టితుఁడై బ్రహ్మణ్యుఁ డొప్పెఁ గురుపతి, [1]బ్రహ్మర్షి[2]పరీతుఁ డయిన బ్రహ్మయ పోలెన్.

7. దెచ్చిన — పెక్కు ప్రతులు. 8. భక్ష్యభోజ్య వినియోగంబున—పెక్కు ప్రతులు. 9. లందు - కొన్ని ప్రతులు.

289 1. విశిష్టధర్మ - అ.ఇ.ఊ.ఐ.ఒ.ఘ ; ధర్మవిశేష - ఝ.ల. 2. ప్రీతిన్ — ఊ.ల.

290 1. ప్రసన్నత — అ.శ.ప. 2 భూపతులెల్ల — అ ఇ.ఊ.ఘ. 3. లసద్బహు — అ.ఎ ఐ 4. వస్త్రవస్తు - అ.ఇ 5. రింపగ - ఊ.ఒ.ఘ. 6. నొప్పగ — ప.ఔ. 7. మూర్తియైన — పెక్కు ప్రతులు. ధర్మో విగ్రహ వానివ అని మూలము భం 2-30-45. 8. మండను — ఊ.ఝ ; మండను డంచిత ధర్మ - ఘ. 9. ఈ పద్యము తరువాత 'మరియదియునుం గాక' అను వచనము అ.ప.ఔ. ప్రతులలో కలదు.

291 1. బ్రహ్మర్షులు గొలువనున్న బ్రహ్మయుబోలెన్ — వ. 2. సమేతుడైన — పెక్కు ప్రతులు ; పరిహృతుడైన — అ.ఈ.ఉ ఎ.ఒ ; పరివృతైక బ్రహ్మయు బోలెన్ — ఐ. (?)

292 క. [1]వేదనినాదము నాశీ,ర్వాదని[2]నాదము ననేకవాదిత్రమహా
[3]నాదంబుఁ జెలఁగె నన్యని,[4]నాదంబు జనంబులకు [5]వినంబడ కుండన్.

293 వ. అంత ననంతవేదమూర్తు లైన [1]పైలధౌమ్యులు హోతలుగా యాజ్ఞ వల్క్యుం డధ్వర్యుండుగా [2]ద్వైపాయనుండు బ్రహ్మగా [3]సుసాముం డుద్గాతగా వీరల[4]పుత్త్ర శిష్యగణంబులు క్రమంబున మైత్రావరుణుండును [5]నచ్ఛావాకుండును [6]గ్రావస్తుతుండును [7]ప్రతిప్రస్థాతయు నేష్టయు నున్నేతయు [8]బ్రాహ్మణాచ్ఛంసియు నాగ్నీధ్రుండును బోతయుఁ బ్రస్తోతయుఁ బ్రతిహర్తయు [9]సుబ్రహ్మణ్యుండునుంగా నారదాది [10]బ్రహ్మర్షులు సదస్యులుగా భీష్మాదిరాజర్షులు సహాయులుగా సర్వక్రియా[11]సమగ్రం బయి పడంగ [12]సమృద్ధంబయి సంపూర్ణదక్షిణాసనాథంబయి సకల [13]ధనధాన్య

292 1. ఈ పద్యమునకు ముందు — ఈ అధికపాఠము (వచనము) తదవసరంబున బ్రహ్మపురోగములైన బ్రహ్మర్షులును రుద్రపురోగములైన రుద్ర గణంబులును, నింద్రపురోగములైన విబుధగణంబులును పొడసూపినం బ్రత్యుత్థాన ప్రణామాది దివ్యోపచారంబుల నభినందితులం జేసి తత్ప్రసాదంబున నాసీనుండయ్యెనంత — అ.ఆ ఇ.ఈ.ఉ ఊ.ఏ ఒ.ఓ.ఔ.ఘ.జ. ప్రతులలోఁ గలదు. 2. నాదమును దూర్యవాదిత్ర — ఏ.ఔ. 3. నాదములు జెలగె — పెక్కు ప్రతులు. 4. నాదములు — ఉ.ఝ. 5. వినరాకుండన్ — ఆ ఇ ఏ.ఔ క.ఖ.గ.ల.శ.ష.

293 1. పైల — అ.ఉ.క ప్రతులలో లేదు. మూలమందును లేదు. 2. కృష్ణద్వైపాయనుడు — ఎ.క.ఖ డ. 3. సోముండుద్గాతగా అని—పెక్కు ప్రతులు. కాని మూలమున సుసామా సామగోఽభవత్ - అనియే యున్నది భం. 2-30-34. 4. పుత్త్రి(పౌత్త్రి) (మిత్ర) శిష్యగణంబులు — పెక్కు ప్రతులు. మూలమున ఏతేషాం శిష్యవర్గాశ్చ పుత్త్రాశ్చ అనియే కలదు. భం. 2-30-36. 5. నచ్ఛావాకయు — పెక్కు ప్రతులు; నచ్ఛావాకయు నద్వాకయు — ల. 6. గ్రావస్తో (స్థో) తయు — పెక్కు ప్రతులు. 7. ప్రతిస్తోతయు — కొన్ని ప్రతులు; ప్రతిస్తోతయు, గీతయు, బ్రహ్మభూతియు, నాగ్నిధ్రువుండును, ధాతయు విధాతయు, హోతయు ప్రతిహర్తయు, నేతయునున్నేతయు, నేష్ఠయు బ్రాహ్మణాచ్ఛంసియు — ఇత్యాదిగా భిన్న క్రమమున భిన్న ప్రతులలో కలదు. ఒక ప్రతికిని మఱియొక ప్రతికిని పొందుకుదరదు. ఇట్టి వివరములు మూలమున కానరావు. 8. బ్రాహ్మణాచ్ఛంసియు బ్రహ్మస్తోతయును బ్రహ్మణ్యుండును ఋత్విక్కులుగా నారదాది — ల. 9. బ్రహ్మణ్యుండునుం — కొన్ని ప్రతులు; సుబ్రహ్మణ్యుండు ను ఋత్విజులుగా — ట. 10. మహామునులును భీష్మాది రాజర్షులు సదస్యులుగా — పెక్కు ప్రతులు; దేవర్షులు భీష్మాది రాజర్షులు సదస్యులుగా — ల. 11. సమన్వితంబయి — ల; సమృద్ధంబయి — క.ఖ.ట.డ. 12. సమగ్రంబయి — క.ఖ డ. 13. జననయనానందకరంబై — ఆ ఇ.ఉ.ఎ.ల.

సమన్వితం బయి జగన్నాథరక్షితం బయి [14]సకలజనానందకరం బయి రాజ [15]సూయం బతిరమణీయంబయిన.

294 సీ. అమ్మహామఖమునం దగ్నిముఖంబున [1]విపులమంత్రాహుతివితతిఁ జేసి
సకలదేవతలను సంపూర్ణ[2]దక్షిణాదానోత్సవంబున ధరణిసురులు
సముచితసత్కారశతసహస్రంబుల నఖిలరాజన్యులు [3]నభిమతాన్న
దానంబు పెంపున [4]ధరణీజనంబులుఁ దద్దయుఁ దృప్తులై ధర్మచరితు

ఆ. ననఘు ధర్మతనయు ననుజసమన్వితు, [5]సంస్తుతించి రధికసమ్మదమున
నని కురు[6]ప్రభునకు నట్లు వైశంపాయ,నోక్తమైనకథ రసోత్కటముగ.

ఆ శ్వా సాం త ము

295 క. భూరిగుణరత్న [1]భూషణ, నారాయణమూర్తి రాజనారాయణ కం
ఠీరవవిక్రమ శారద, నీరదనీహార [2]హీరనిభశుభకీర్తి.

296 [1]అంబురుహవృత్తము.

రాజకులోత్తమ రాజమనోహర రాజసూరిసభాంతర
భ్రాజితసద్గుణ పార్థివశేఖర పార్థసన్నిభ బాంధవాం

14 సకల జనానందకరంబయి — ఇ.ఎ.క.ఖ.చ.డ ల. ప్రతులలో లేదు 15. సూయమహాయజ్ఞం — క.ఖ డ.ణ; సూయమహాధ్వరంబు — ఎ; సూయంబు మహారమ — ఏ.ఔ ట.

294 1. విప్రమంత్రాహుతి విధులజేసి —- పెక్కు ప్రతులు. 2. దక్షిణదానోత్స వంబున - పెక్కు ప్రతులు. 3. నభిమతార్థదానంబు పెంపున — ఐ ల. 4. ధారుణీజనులెల్ల — పెక్కుప్రతులు; ధారుణీజనములు - ఏ.ఔ ట. 5. సన్నుతించి - ఏ ష. 6 ప్రవరునకట్లు - ఏ.ఔ.క.ఖ.జ.డ

295 1. సాగర — ఛ.ఝ. 2. హార —– వా.వీ; హీర —– పెక్కుప్రతులు.

296 1. దీనిమారుగా మానినీవృత్తముగా యీక్రింది పద్యము పెక్కుప్రతులలోకలదు.
రాజకులోత్తమ రాజమనోహర [1]రాజితసూరి సభాంతర వి
భ్రాజితసద్గుణ పార్థివ శేఖర పార్థ[2]సుసన్నిభ బంధుజనాం
భోజవనద్యుమణి[3]మణి కాంచన పుంజ[4]విభూషిత భూరిమరు
[5]ద్రాజ సమాజ పరాక్రమ రాఘవ రాజిత రాజ [6]మహేంద్రపతీ.

భోజవనద్యుమణీ మణికాంచనపుంజభూషితభూమరు
ద్రాజసమాజ పరాక్రమరాఘవ రాజరాజనరేశ్వరా.

గద్యము

ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్టప్రణీతంబయిన శ్రీమహాభారతంబునందు
సభాపర్వంబున [1]ధర్మరాజునకు సభాప్రాప్తియుఁ [2]గింకరదర్శనంబును
నారదువలన [3]లోకపాలుర సభాశ్రవణంబును [4]రాజసూయమహాధ్వ
రారంభంబును జరాసంధ వధయు గిరివ్రజనిరుద్ధులయిన
రాజులం గృష్ణుండు విడిపించుటయు దిగ్విజయంబు[5]ను
రాజసూయంబు నన్నది
ప్రథమాశ్వాసము

1. రంజిత — ల 2. సమున్నత — డ 3. నిభ — ఞ. 4. సుపూజిత — డ. 5. ద్రా సమాన పరాక్రమ భాసురరాఘవ శ్రీరతి రాజనిభా — క.ఖ.డ 6. నరేంద్రమణీ — చ

297 1. మయసందర్శనంబును ధర్మ — ఆ ఇ ఘ. 2. గింకర దర్శనంబును — ఒ.గ.ల. ప్రతులలోలేదు ; సకలసన్ముని సమాగమంబును — ఈ ల. 3. మంత్ర పర్యాయంబును లోక — ల ; రాజనీతి విషయంబు లెరుంగుటయు లోక — ఆ.ఇ ఓ; లోకపాల సభాశ్రవణంబును — పెక్కుప్రతులు 4. హరిశ్చంద్రమాహాత్మ్యంబును పాండురాజ వర్తనంబును రాజ — ఉ.ల ; రాజసూయారంభంబును — పెక్కుప్రతులు. 5. నునానా దేశాధీశులైన రాజులు రాజసూయంబునకు వచ్చుటయు—ల.

—:o:—

# శ్రీమదాంధ్రమహాభారతము

## సభాపర్వము - ద్వితీయాశ్వాసము

1 క. శ్రీరమణీప్రియధర్మ విశారద [1]వీరావతార సౌజన్య[2]గుణా
ధారభువనైక సుందర వీరశ్రీరమ్య బుధవివేకనిధానా.

*—: ధర్మజుండు కృష్ణున కర్ఘ్యంబిచ్చుట :—*

సం. 2—33—10

2 వ. అక్కథకుండు శౌనకాదిమహామునులకుం [1]జెప్పెనట్లు రాజసూయ[2]మహోత్స[3]వంబు నొప్పును ధర్మరాజు [4]ధర్మనిత్యతయును స్తుతియించి నారదుం[5]డాసదనంబున [6]సకలరాజ[7]సమూహంబును రాజలోకంబులో మనుష్యసామా[8]న్యుండయి యున్న [9]జగన్మాన్యు జనార్దనుంజూచి [10]తొల్లి బ్రహ్మాది[11]సురగణప్రార్థితుండయి యఖిలమహీభారావతరణార్థంబు నారాయణుండు యదువంశంబున [12]నుదయించుటయు నయ్యాయిక్షత్త్రియ[13]కులంబుల సురదైత్యదానవయక్షరాక్షస గంధర్వాదుల [14]యంశావతారంబులుం దలంచి భవిష్యద్భారతరణంబునకు సంహృష్ట[15]హృదయుండయి యుండునంత.

---

1 1. లీలావతార — గ. 2. గుణోదార — ఊ

2 1. జెప్పినట్లు — ఇ.ఐ.ఒ.క.ఖ.ఝ. 2. మహాధ్వరంబు - ఇ. 3. వంబున నొప్పుచున్న ధర్మ — ఆ.ఊ.ఎ.ఘ ; వంబుసొంపును నతని - చ. 4. సత్యంబును — ఛ ; ధర్మనిత్యతయు — కొన్ని ప్రతులు. 5. డుయజ్ఞ సదనంబున — అ.ఐ.ఛ.జ.ఝ.ట.ల ; డానవనంబున — చ.ణ. 6 గల సకల — క.డ ; సకలరాజ సమూహంబును — ఈ.ఊ.ఔ డ.శ.ష. ప్రతులలో లేదు. 7. సముఖంబున — పెక్కు ప్రతులు ; సమాజంబున — చ ; సభామధ్యంబున — ఏ ; సమాగమంబున — ఖ. 8. న్యుకై వడినున్న — క.ఖ డ. 9 జగన్నాధు - పెక్కు ప్రతులు. 10. సంతసిలి తొల్లి — ఎ.ఐ.ట ; మోదంబు సంధిల్ల — ఖ.డ ; తొల్లి — ఐ.క.ఖ డ. ప్రతులలో లేదు. 11. సురమునిగణ — అ.ఊ.ఒ.ట.ణ. 12. నవతరించుటయు — అ.ఐ.ఏ.ట , జన్మించుటయు — ఇ ఔ.ఛ.ఝ.ణ. 13. కులంబులు, — శ.ష. 14. యంశంబుల నవతరించుటయు దలంచి—శ.ష. 15. హృదయుడయ్యెనంత — కొన్ని ప్రతులు.

3 క. [1]శాంతనవుఁడు భీష్ముండు ప్ర, శాంతుఁడు దత్క్రతువు[2]సూచి సంతుష్టుండై
యంతట[3]తనూజునకు ధృతి,మంతున కత్యంత ధర్మ[4]మతి కిట్లని యెన్.

4 మత్తకోకిలము. స్నాతకుండును ఋత్విజుండును సద్గురుండు[1]ను నిష్టుఁడున్
భూతలేశుఁడు [2]సంయుజుండును బూజ[3]నీయులు వీరితో
బ్రీతి[4]నెవ్వఁడు సద్గుణంబులఁ బెద్దయట్టి మహాత్ము వి
ఖ్యాతుఁ బూజితుఁ జేయు [5]మొక్కనిఁ గౌరవాన్వయవర్ధనా.

5 వ. అనిన నట్టి[1]వాఁ డెవ్వండు నాకెఱిగింపుమనిన ధర్మరాజునకు భీష్ముం డిట్లనియె.

6 సీ. రోదసీకుహరంబు రుచిరాంశు[1]తతిఁ జేసి యర్కుండు వెలుఁగించునట్లు లమృత
సందోహనిష్యంద చంద్రికఁ జేసి [2]శీతాంశుఁ డానందించు[3]నట్టు సకల
[4]జనులకుఁ దనదైన సదమలద్యుతిఁ జేసి తనరంగఁ దేజంబుఁ దనుపుఁ దాన
చేయుచున్నపత్సేవ్యుండు పుండరీ[5]కాక్షుండు గృష్ణుఁ డనాదినిధనుఁ

ఆ. డబ్జనాథుఁ [6]డుండ నర్ఘ్యంబు[7]నకు నిందు, నర్హులొరులు గలరె యజ్ఞపురుషు
నఖిలలోక[8]పూజ్యు నచ్యుతుఁ బూజింపు, [9]మధిప యదియచూవె యజ్ఞఫలము

3 1. శంతనుతనూభవుండు ప్ర — పీ శ ష 2 నందు — ఈ.క.ఖ డ. 3. తనయు నకును — డ. 4 మతినిట్లనియెన్ — ల.

4 1. సహిష్ణుఁడున్ — ఐ ల.స ; నభీష్టుడున్ — అ ఉ ఊ ఏ.ఔ.ఘ.చ.స , నుపుణ్యుడున్ — ఎ.క ఖ.గ.డ.స ; ను విష్ణుడున్ — ఝ.ణ ; నభిజ్ఞుడున్ — వ. 2. సంయముండును — పెక్కు ప్రతులు ; సంయమీంద్రుడు — ఈ.ఏ క ఖ గ.డ.స ; సంయతుండును — పీ.శ ష స ; నర్యముండును — ఘ ఝ 3. నీయుడు — అ.ఏ ఒ. ఝ.ణ ల. 4. నెవ్వరు — ఇ ఈ.ఎ.క.ఘ.చ. 5. మొక్కరు — అ.ఊ ఐ.ఒ గ ; మొక్కరి — ష.

5 1. వారెవ్వరగుదురు — కొన్ని ప్రతులు ; వాడెవ్వడగు నెరింగింపు — ఊ.ఐ.ఒ.గ.

6 1. గతి — ఆ.ఘ.ణ. 2. శీతాంశుం (శు) డు వెలిగించునట్లు — ఛ.ఝ.ణ.ల. 3 నట్లు - పెక్కు ప్రతులు. 4. జనులను దనదైన సదమలద్యుతిఁ జేసి తనరు తేజంబును దనుపుదాన — వ. 5. కాక్షుండధోక్షజు డచ్యుతుండు నబ్జ — ఝ 6. డీత డర్ఘ్యమునకు నర్హుడన్యు డొకడుగలడె — గ.డ. 7. గొనగనిందర్హులొరులు — శ.ష. 8. నాథు — ఛ. 9. మనఘు — ఔ.

7 వ. [1]అనిన భీష్మువచనంబున నప్పుడు సహదేవోపనీతంబయిన యర్ఘ్యం[2]బర్ఘణీయుం డయిన వాసుదేవునకు [3]శాస్త్రదృష్టవిధానంబున ధర్మతనయుం డిచ్చిన దానిం జూచి సహింపక శిశుపాలుం డు[4]పాలంభన పరుండయి [5]యధోక్షజు నాక్షేపించుచు ధర్మరాజున కిట్లనియె.

—: శిశుపాలుండు ధర్మరాజు నాక్షేపించుట :—

సం. 2-34-1

8 మ. అవనీనాథు లనేకులుండఁగ విశిష్టా[1]రాధ్యు [2]లార్యుల్ మహీ
దివిజుల్ [3]పూజ్యులు పల్వురుండఁగ ధరిత్రీనాథ [4]గాంగేయుదు
ర్వ్యవసాయంబునఁ [5]గృష్ణుఁ [6]గష్టచరితున్ వార్ష్ణేయుఁ బూజించి నీ
యవివేకం బెఱిఁగించి తిందఱకు దాశార్హుండు పూజార్హుఁడే.

7 1. ఈ వచనమున కాదిగా — స లో నిచ్చిన భాగము — ఉ.ఒ. ప్రతులందును కలదు. ఈ విషయమంతయు సువిస్తరముగా మూలమున వర్ణితమైయున్నది. భం. అనుబంధము. 1. ఈ క్రింది భాగము దానికి సంక్షేపము
అనుచు ధర్మతనయుం జూచి యాభూతలేశ్వరుండు తొల్లి యజ్ఞవరాహమూర్తియై దంష్ట్రాగ్రంబున ధాత్రీతలం బెత్తె, హిరణ్యాక్షుని సంహరించె, నరసింహరూపంబున నాదైత్యుహిరణ్యకశిపుకరనఖరంబుల వ్రస్సె, నదితికి గశ్యపునకు వామనుండై జన్మించి త్రివిక్రముండై బలిని బంధించె. భృగువంశంబున పరశురాముండై జన్మించి కార్తవీర్యుండాదిగాఁ సకలక్షత్రకులంబు నాశంబుచేసె, రవికులంబున దశరథుండను రాజునకు రాముండై జనియించి, రావణకుంభ కర్ణాదుల వధియించె; ఇప్పుడు బ్రహ్మాది సురగణ ప్రార్థితుండై యదువంశంబున నుద్భవించె, నిదియాదిగా నొన రించిన దివ్యలీలలు మహాద్భుతంబులు వినుము. పూతన ప్రాణంబులుగొనె, శకటం బులు విరుగదన్నె మద్దులనున్మూలించె, గోవృషంబుల గూల్చె, గోవర్ధనశైలంబెత్తి గోవులంగాచె, కాళీయ్యుని గీటణంగించె, కంసుని సమయించె నయ్యాది నారాయణుండీ కృష్ణుండర్ఘ్యంబున కర్హుండనిన విని — స. 2. బునర్ఘ్యనీయుండైన — పెక్కు ప్రతులు, బర్ఘణీయుండైన — భాసం; బర్హణీయుండైన — ఛ.ణ.వా. వీ శ.ష. 3. శాస్త్రోపదిష్ట — ఈ గ డ ణ.వీ శ ష. 4. కోపంబున నధోక్షజు — క ఖ.డ; యసూయాపరుండయి — చ. 5. స ఉపాలభ్య భీష్మంచ ధర్మరాజంచ సంసది అపాక్షిపత్ వాసుదేవం. భం. 2-33-32.

8 1. చార్యు — ఈ.ఐ ఔ.చ.జ ఞ స; చారులార్యుర్ — ల వీ.శ.ష స 2. లాఢ్యుల్ — క.ఖ.గ.డ 3. పల్వురు పూజ్యులుండగ — ఊ.ఔ.ఛ ఝ ; పూజ్యు లనేకులుండగ — వ. 4. గాంగేయ — అ.ఆ ఎ గ ఝ.డ. 5. నీవు దుష్టచరితున్ — ణ. 6. గ్లిష్టచరితుఁ — ఒ; దుష్టచరితుఁ — ఓ.ణ.ల.

9 చ. కడుకొని ధర్మతత్త్వ మెఱుఁగంగ నశక్యము ధర్మబాహ్యుని
న్నొడఁబడ నిష్టుఁడై [1]కఱపి యుత్తములుండఁగ వాసుదేవుఁ డ
న్జడునకుఁ బూజయిమ్మని విచార[2]విదూరుఁడు [3]భీష్ముఁడెంతయుఁ
వెడఁగుదనంబునం [4]బనిచె వృద్ధులబుద్ధులు [5]సంచలింపవే.

10 చ. ఇతనికిఁ గూర్తు రేని ధనమిత్తు రభీష్టములైన కార్యముల్
మతినొనరింతు రిష్టుఁడని మంతురుగాక [1]మహాత్ములైన భూ
పతులయు విప్రముఖ్యులసభన్ విధిదృష్ట [2]విశిష్టపూజనా
[3]యతికి [4]ననర్హు నర్హుఁడని యచ్యుతు [5]నర్చితుఁ జేయఁబాడియే.

11 సీ. [1]ఈతని వృద్ధనియెఱిఁగి పూజించితే వసుదేవుఁ డుండంగ వసుమతీశ
ఋత్విజుండని విచారించి పూజించితే ద్వైపాయనుండుండ ధర్మ[2]యుక్తి
యాచార్యుఁ డని [3]వినయమునఁ బూజించితే కృతమతుల్ ద్రోణుండుఁ గృపుఁడునుండ
భూనాథుఁడనియెడు బుద్ధిబూజించితే యాదవుల్ రాజులే యవని[4]మీఁదఁ

ఆ. బూజనీయులైన పురుషులలోపల, నెవ్వఁడయ్యెఁ గృష్ణుఁ డిట్టులేల
పూజ్యులయిన వారిఁ బూజింపనొల్లక, భీష్మ[5]పనుపుఁ జేసి బేలవయితి.

12 చ. పురుష[1]విశేషవిత్తముఁడు పూజ్యుఁడు రాజులలోన నీ యుధి
ష్ఠిరుఁడని నీగుణాళి [2]ప్రకటించి మనంబు[3]లలోన ధారుణీ

9 1. కరపెనుత్తము — అ. 2. విహీనుడు — ఉ.వ 3. భీష్ముడియ్యెడన్ — ఏ.ఔ. 4. బలికె — ఈ.క ఖ డ.ల.స. 5. చంచలింపవే — ఈ.క.ఖ.ణ.

10 1. మహాపులైన — క,ఖ. 2. విధాన — ఈ ; ములైన — క.ఖ.డ ; విశేష — చ. 3. యతవిధి కీతడర్హు — వీ శ.ష స.శ. 4. ననర్హుడర్హుడని — ల. 5. నర్చన — అ.క డ.ణ

11 1. ఈ తం(త)డు — అ.ఒ.క.ఖ.ఛ.ఛం డ ల.వీ.శ ష. 2. వృత్తి — చ ; తనయ — ఎ. 3. విచారించి పూజిం — ఊ.ఖ. 4. లోన — ఇ.గ.ల.వీ.శ.ష. 5. పలుకు — ఆ.ఉ.ఝ.వ.

12 1. వరెణ్యు డుత్తముడు — గ ; వరేణ్యు యుత్తముడు-అ ; విశేషుడుత్తము — వీ.శ ; విశేషయుత్తముడు—ణ ; వివేకసత్తముడు—జ ; విశేషయుత్తముడు పూజ్యులలోన సుపూజ్యుడీయుధి—ఘ. 2. ప్రకటింప—క.డ.శ.ష. 3. ననమ్మి—పెక్కు ప్రతులు ;

శ్వరులు భవన్ముఖంబునకు వచ్చిన [4]నిందఱ కివ్విధంబునం
బరగ నవజ్ఞ సేయుటిది [5]పాడియె ధర్మువె ధర్మనందనా.

13 క. నీ వెఱుఁగక యిచ్చిన[1]నిది, నావిషయమె యని మనంబు[2]నం దలఁపక ల
జ్జావిరహితుఁడయి యర్ఘ్యము, గోవిందుఁడు గొనియెఁ దనకుఁ [3]గొను టుచి
తంబే.

14 క. చనఁ బేడికి దారక్రియ, యును జెవిటికి మధురగీతియును [1]జీకున క
త్యనుపమసురూపదర్శన,మును జేయుటఁ [2]బోలుఁ గృష్ణుఁ [3]బూజించు టిలన్.

15 ఉ. ఈ యవనీశ్వర ప్రవరులిందఱు నిన్ను నగంగ [1]నిట్లుగాఁ
జేయుదె ధర్మరాజను విశేషసమాఖ్య నిరర్థకంబుగా
[2]ధీయుతయంచు ధర్మజ నదీసుతకృష్ణుల నెగ్గులాడుచుం
బోయె [3]సదంబు వెల్వడి సపుత్త్రబలుండయి చైద్యుఁ డల్కతోన్.

16 వ. ఆ శిశుపాలు పిఱుందన [1]చని ధర్మ[2]నందనుండు వానిం బ్రియవచనంబుల
ననునయించుచు నిట్లనియె.

17 క. భూరి[1]గుణోన్నతు లనఁదగు, వారికి ధీరులకు ధరణివల్లభులకు వా
క్పారుష్యము చన్నె మహా, దారుణ మది విషముకంటె దహనము కంటెన్

నబోంగి — ఏ ఔ ఙ.ల. 4. వీ (వా) రలని (కి) వ్విధంబునం — పెక్కు ప్రతులు
5. పన్నుగ ధర్మువె — ణ ; పాడియె నీకిట — ఉ.ల.న.

13 1. య (యి) ది — కొన్ని ప్రతులు. 2. ననువగవక — అ.ఘ ; నంవగవక — ఆ.వీ శ.ష 3. గొనుటర్హంబే — అ.ఉ.ఊ ఐ.ఘ.ణ.ల ; గొననుచితంబే — ఈ.ఖ

14 1. నంధునక — ఝ. 2. బోలె — ఔ.ఖ ఝ. 3. బూజించుటయుఁ —. ఆ ల.

15 1. నిట్లొగిం — ఆ ఏ.ఔ.ల.న ; నిచ్చటన్ — చ జ. 2. నీయెడనంచు — స. (యతి?) 3. సభ దొరంగి సహాపుత్త్రి — వీ.శ.ష ; సభ దొరంగి హితపుత్ర — ట ; సదస్సు వెల్వడి — ఊ.ఒ.ల.

16 1. యరిగి — పెక్కు ప్రతులు. 2. తనయుండు - పెక్కు ప్రతులు.

17 1. గుణాన్వితు — ఈ.ఊ.

18 ఉ. ఆదిజుఁడైన బ్రహ్మయుదయంబున [1]కాస్పదమైనవాఁడు వే
దాదిసమస్తవాఙ్మయములందుఁ [2]బ్రశంసితుఁడైనవాఁడు [3]లో
కాదిత్రిలోకపూజ్యుఁ[4]డని యాత్మనెఱింగి పితామహుండు దా
మోదరుఁ జెప్పెఁ బూజ్యుఁడని యుక్తము కాకిది యేమిదోసమే.

19 క. పరమా[1]ర్థ[2]ప్రతిభుఁ దమో, హరు నచ్యుతు భీష్ముఁ డెఱిఁగి నట్లెఱుఁగఁగ నీ
కరిది శిశుపాల పెద్దల, [3]చరితం బల్పులకు నెఱుఁగ శక్యమె యెందున్.

20 క. గురుఁడని సమస్తలోకో, త్తరుఁడని నీకంటె వృద్ధతములైన నరే
[1]శ్వరు లచ్యుతు[2]నర్చననెడఁ, గర[3] మభినందింప నీకుఁ గాద[4]నఁ దగునే.

21 వ. [1]అని యాశిశుపాలుం [2]బట్టువఱుచుచున్నంత ధర్మరాజునకు భీష్ముం డిట్లనియె.

-: *భీష్ముఁడు శిశుపాలుని నిందించుట* :-

సం. 2-35-6

22 ఉ. పాలితదుర్ణయుండు శిశుపాలుఁడు బాలుఁడు వీని నేల భూ
పాలక నీకుఁ బట్టువఱుపన్ [1]మఱి ధర్మువెఱుంగ వీనికిం
బోలునె రాగ[2]కోపరిభూతమనస్కున కల్పరాజ్యల
క్ష్మీలల[3]నాంధబుద్ధి కనిమిత్త[4]మహాత్పరివాద[5]శీలికిన్[6].

18 1. నాశ్రయుడైనవాడు — ఖ ; కాశ్రయుడైనవాడు — డ 2. బ్రకాశితు — ఉ.ఛ జ.ఝ.ల.శ.ష ; ప్రభాసితు-ఘ. 3 యోగాదివిశిష్ట-ఔ. 4. డుగనాత్మ — అ ఐ.

19 1. త్మప్రతిభుని మురహరు — ఞ 2. ప్రతిభుదామోదరు—ఇ.ఉ.ప ; ప్రతిపీతాంబరు-ఈ ; ప్రతి బింబితుహరు—ఆ ఊ.ఘ ల ; ప్రతిపాదకు—ఒ. 3. చరితంబులనెఱిగిపలుక-వీ.శ.ష ; చరితంబులు నొరులకెరుగ — ఞ ; చరితంబన్యులకు నెరుగ — ఫ.

20 1. శ్వరునచ్యుతు డర్చితుడని కరమానందింపనీకు — ఞ. 2 దర్చితుడని — వీ.శ.ష. 3. మానందింప — ఎ.ట. 4. ననేలా — ప.క.ఖ.డ వ ; ననగునే—గ.వ.

21 1. అని శిశుపాలు — పెక్కు ప్రతులు. 2. బట్టువఱుచుచున్న ధర్మ — శర.సూ ; పెక్కు ప్రతులు ; బట్టువఱచు — ఝ.భాసం.

22 1. మతి (ది) ధర్మమెరుంగ వీనికిం — ల. 2. లోభ — ఆ.ఐ ; దోష — ఉ.క ఖ. 3 నాత్త — ల. 4. మహాపరివాదఁ — ఝ ట. 5. దర్పికిన్ — ఞ. 6 ఇటకృష్ణుని మాహాత్మ్యమును, నతని పూర్వావతార వృత్తాంతములును, భీష్ముఁడు వర్ణించినట్లు, పి.పి.యస్. ప్రతిలో విస్తృతముగాఁగలదు. సభా 34-41—భం. అనుబంధము 1-

23 వ. అని ధర్మరాజును వారించి శిశుపాలుం జూచి భీష్ముం డిట్లనియె.

24 చ. అవినయ బుద్ధివై హరికి నర్ఘ్య మయోగ్య[1]మ యంటినీవు మూ
ర్ఖవు శిశుపాల యింకఁ బలుకన్ వలసెన్ సభలోన నున్న యీ
యవనిపులెల్ల నాతనిదయం [2]బరిముక్తులు [3]వానిచేత నా
హవ[4]జితులుం దదీయశరణార్థులుఁగా కొరులయ్యు చెప్పుమా.

25 తే. ఉత్తమజ్ఞానవృద్ధు నానుండెనేని, బాలుఁడయ్యును బూజ్యుండు బ్రాహ్మణుండు
క్షత్రియుఁడు [1]పూజ్యుఁ డమితవిక్రమసమృద్ధి, నుర్వీపతులలో [2]నధికుఁడై
యుండెనేని.

26 క. ఈరెండు కారణముల [1]ము, రారాతియ యర్ఘ్యమునకు నర్హుఁడు జగదా
ధారుండు మాక కాదు స,దారాధ్యుఁడు విష్టపత్రియావాసులకున్.

27 క. వృద్ధులోక లక్ష[1]యున్నను, బుద్ధియె యెవ్వరికి వారిఁ బూజింపంగా
నిద్ధరణీశులలో గుణ, [2]వృద్ధని పూజించితిమి త్రివిక్రము [3]భక్తిన్.

28 క. [1]పూజితుల తృప్తులగుదురు, భూజను లొరు లచ్యుతుండు [2]పూజితుఁ డగుడుం
దేజమున జగ[3]త్త్రితయముఁ, బూజితమయి [4]తృప్తిఁబొందుఁ బుణ్యసమృద్ధిన్.

24 1. మంటంటి – ఉ 2 బ్రవిముక్తులు – ఐ.గ.గు. 3. గారెయెందునా – ణ.
4. జితులై – ఆ.ఊ.ఘ; విజితుల్ – ల.

25 1. పూజ్యుడు విక్రమ — అని పెక్కు తాళప్రతులలో కలదు — క్షత్రియుండు పూజ్యుండు విక్రమ అని యుండనోపు. ఈ పాఠము ణ.ల. ప్రతులలో సక్రమముగ నీయబడి యున్నది. తాళపత్రములందు పూర్ణార్ధానుస్వారముల విషయమైన మార్పులు సాధారణము. పూజ్యుడగును – క; పూజ్యుడౌను–చ. 2. నెక్కుడై – ఉ.ఝ; నొక్కడై – ల.

26 1. మురారియెయీయర్ఘ్యమునకు–క.ఖ.ట.ణ; మురారి యెయర్ఘ్యముగొనంగ–చ.ఛ.

27 1. కలిగిన – ఈ.క.డ; యుండిన – ఉ.ల 2. వృద్ధుని – ణ; వృద్ధును – శ.
3. ప్రీతిన్ – ఈ.ణ; బుద్ధిన్ – ఐ.ఓ.చ.

28 1. పూజితులు – పెక్కు ప్రతులు; పూజనల – ఆ.ల; పూజలను – ఊ.ఘ, పూజితులు దృప్తులగుదురు — ట. 2. ప్యూజ్యుండగుడున్ — కొన్ని ప్రతులు.
3. త్రయమును – ఈ.ఉ. 4. తృప్తినొందు – ఆ.ఈ.

29 సీ. బుద్ధియు మనమును బురుషుండు నవ్యక్తమగుచున్న ప్రకృతియు నంబరంబు
ధరణియుఁదరణియు దహనుండుఁ జంద్రుండు గాడ్పును దిక్కులుఁ గాలములును
దానయై జంగమస్థావరాత్మకమైన సకలభూత[1]ప్రపంచంబు నెల్లఁ
[2]దనదివ్యశక్తిమై [3]దాల్చిన సర్వాత్మ సర్వభూతేశ్వరు సర్వవంద్యు

ఆ. [4]నధిక యోగ నిష్ఠితాత్మకులగుమహా, యోగివరులు తత్త్వ[5]యుక్తిఁ జేసి
యెఱిఁగి[6]నట్టు నీకు నెఱుఁగంగఁబోలునే, యనుచు[7]భీష్ముఁ డన్న యవసరమున.

30 చ. ఎడపక యర్ఘ్య మచ్యుతున కిచ్చితిమిచ్చిన [1]దీని[2]కిం దొడం
బడమని [3]దుర్జనత్వమునఁ బల్కెడు[4]వీరుల మస్తకంబుపై
నిడియెద [5]నంచు దాఁ జరణ మెత్తె[6]సభన్ సహదేవుఁ డట్టిచో
నుడిగి సభాసదుల్ వలుకకుండిరి తద్దయు భీతచిత్తులై.

31 చ. చెలువుగఁ బుష్పవృష్టి గురిసెన్ సహ[1]దేవుపయిన్ దివంబునన్
వెలయఁగ సాధువాదములు [2]వించె సభాసదులెల్ల విస్మయా
కులితమనస్కులైరి తనకుంచెయుఁ గృష్ణమృగాజినంబునుం
బలుమఱు వీచుచుం గలహబంధుఁడు నారదుఁ డాడె వేడుకన్.

32 వ. అంత శిశుపాలుసేనాపతి [1]సునీథుం డనువాఁ డతిరోషపరుష [2]వచనుం డగుచు [3]స్వపక్షక్షత్త్రియులనెల్ల [4]నొక్కంతం [5]జేర్చికొని శిశుపాలు ననుమతంబున యుద్ధ[6]సన్నద్ధుం డయి యున్న సమయంబున.

29 1. ప్రపంచకమునెల్ల — ణ. [రూపము గమనింపదగినది] 2. దనశక్తిమై కుశి దాచిన — చ. 3.తనరంగ దాల్చిన సర్వాత్మ సర్వేశు సర్వవంద్యు — క ఖ. 4. నఖల—కొన్నిప్రతులు 5 యుక్తివలన — ఈ.ఏ.ఒ.క.ఖ గ నట్లు—పెక్కుప్రతులు. 7. భీష్ముడున్న — ఏ.ఓ ఔ.ఝ ట ణ వీ శ.ష స.శ.

30 1. దాని — సం. 2 కేమొడం — డ.వీ.శ.ష స ; కిన్నొడం — ఝ.ట.ణ.ల ; కై యొడం — త. 3. దుర్ణయత్వమున — ఆ.ఈ ఊ.ఏ ఒ.ఔ ఘ. 4. వారల — ణ.ల. 5. నంచునుం — ణ. 6. వెసన్ — ఉ.స.

31 1. దేవునిపై — అ.ఆ.ఓ.ఖ.గ.ఘ.ఝ.ల 2. వీచె — పెక్కుప్రతులు.

32 1. సునీతుండను — అని పెక్కు ప్రతులు , కాని మూలమున సునీథః భం.2_36_13. సునీథుండతిరోష — ల 2 వచనుండై — కొన్నిప్రతులు. 3 ననేక బలంబులతో స్వపక్ష — స. 4. నొక్కచెంతఁజేసి (ర్చి) కొని — డ ర.వీ.ష.స. ; నొక్కింత చేసికొని—కొన్నిప్రతులు. 5. జేసికొని—డ. 6. సన్నద్ధుడయ్యె నంత, సన్నద్ధుండై యుండె నంత—వివిధప్రతులు.

33 చ. రయవిచలత్తురంగమతరంగములన్ మదనాగనక్రసం
చయముల [1]సంచలచ్చటులసై నికమత్స్యములన్ భయంకరం
బయి యదువృష్ణిభోజ కుకురాంధక [2]వాహినియుం గలంగె ని
ర్దయతరదోషమారుతనితాంత[3]సమీరితమై క్షణంబునన్.

34 వ. అట్టి సకలక్షత్త్రియక్షోభంబు సూచి భయసంభ్రమాక్రాంతహృదయుండయి ధర్మరాజు భీష్మున కిట్లనియె.

35 తరలము. ధరణిలోఁగల రాజులెల్లను దారుణక్షయకాలసా
గరములట్లు గలంగి రిప్డు మఖప్రయోగము విఘ్నముం
బొరయకుండఁ [1]బ్రజాపకారము వుట్టకుండఁగ [2]నీవు చె
చ్చెరఁ బితామహ వీరి కిచ్చటఁ జిత్తశాంతి [3]యొనర్పవే.

36 వ. అనిన ధర్మ[1]రాజునకు [2]భీష్ముం డిట్లనియె.

37 క. నీయజ్ఞమునకు విఘ్నము, సేయఁగ నోపుదురె యొరులు జితదైత్యుఁడు నా
రాయణుఁడు యజ్ఞపురుషుఁ డ, జేయపరాక్రముఁడు దీనిఁ జేకొని [1]కావన్.



33 1. జంచలచ్చటుల — అ.ఉ ఊ ఘ.చ.ల , సంచరచ్చటుల — ఏ.ఔ.ఝ.వీ శ.ష
2. వారిధియుం — పెక్కుప్రతులు. తతస్సాగర సంకాశం దృష్ట్వా నృపతిసాగరమ్ భం. 2-37-1. 3. సమాకూలమై — వీ.శ ప స.

35 1 ప్రజాపవాదము — ఇ.ఈ.ణ ; ప్రజావరోధము — ఉ.ఔ.క.ఖ.ల ; ప్రజావిరోధము — స ; ప్రజావరోధము — ఎ ఒ చ ర. 2. జేయు — పెక్కుప్రతులు ; గావు — ఆ.ఊ ల వీ శ ష స. 3. యొనర్చుచున్ — పెక్కుప్రతులు ; యొనర్పుచున్ — ఐ.ఏ.గ.ఝ

36 1. నందనునకు — ఆ.ఊ.ఒ.ఘ ; పుత్త్రునకు — ఇ.ప ఓ. 2. గాంగేయుం — అ ; నదీసూనుం డిట్లనియె — ఛ.

37 1. యుండన్ — ణ ; కాచున్ — గ.జ.

38 సీ. చైద్యునకై పూని సన్నద్ధులై యున్న యీరాజు[1]లిందఱు నీక్షణంబ
హరియల్గి [2]చూడుడు నంత[3]కక్షయమున కరిగెడు[4]వారఁ ఘోరాహవమున
దమ[5]ఘోషనందనుదర్పంబు నిప్పుడ యడఁగెడుఁ[6]గడుఁబెక్కులయ్యుఁ గుక్క
లిభకుంభదళన[7]మహిష్ఠనిష్ఠురనఖ[8]ముఖుఁ డగుహరిమీఁద మొఱఁగి యేమి

ఆ. సేయనోపుఁగృష్ణు సింహపరాక్ర[9]ము, నెఱుఁగకున్నవారె యెల్ల[10]వారు
[11]ననిన భీష్ముపలుకు లవి కర్ణశూలంబు, లయినఁ జేదినాథుఁ డాగ్రహించి.

-: *శిశుపాలుఁడు భీష్మునిఁ దూలనాడుట* :-

సం. 2-38-1

39 ఉ. ఇమ్మదివెట్టి వీనిఁ బరమేశ్వరుఁగాఁ గొని[1]యాడె ధర్మత
త్త్వమ్ములు [2]పాండవేయులును దానును గాని యెఱుంగ[3]రట్టె సా
మమ్మున నెల్లవారి నవమాన్యులఁ[4]జేసె నమాన్యుఁడంచు రూ
[5]క్షమ్మున భీష్ముఁజూచి [6]బలగర్వితుఁ డిట్లని పల్కె నల్కతోన్.

38 1. లందరు — పెక్కుప్రతులు. 2 చూచిన — ఎ.ప.ఒ ఔ.ఖ.చ. 3. కాలయమున — పెక్కుప్రతులు 4. వారు — పెక్కుప్రతులు. 5. ఘోషణంబులు తనదర్పమిప్పుడ — ఊ.ల, ఘోషణంబులు దర్పంబునిప్పుడ — ఒ; తమరోషంబు — చ; ఘోషనందను దర్ప భరంబిప్పుడడగెడు — అ 6. నది — క.ఖ. 7. పటిష్ఠ — ఉ ఔ.క.ఖ.భాసం.శ.ష. [నిత్య సమాసయతి]; భూయిష్ఠ — ణ. 8. ముఖరుడౌ — అ.ఉ.ఝ; ముఖమగు — ఎ గ వీ.స. 9. మమెరుగ — పెక్కుప్రతులు. 10 జనులు — అ 11 లటు — ప; లతి — ఒ.

39 1. యాడి — గ.శ ష. కొన్నిప్రతులు. 2. పాండు సూనులును — ఈ.క.గ డ. 3. రంచు — ఎ గ వీ.శ ష.స. 4. జేసిన మాన్యుడంచు — ఎ.ప.ఒ ఓ.ఔ.గ.ఘ చ. ఝ ణ; జేసెనుమాన్యు — ఇ ఈ.ఊ.క.గ. 5. క్షుంబు[మ్మ]గ — ఉ.శ.ష. సం. 6. యతి — ఉ

40 ఉ. నెట్టన ధర్మనందనుఁడు నిన్నవ[1]లంబము సేసి యోడతోఁ
గట్టిన [2]యోడవోలె గత[3]గౌరవుఁడై కడుఁ దూలెఁ గృష్ణుఁ జే
[4]పట్టి [5]బిభీషికల్ ధరణిపాలుర కిప్పుడు [6]సూపితెందు నీ
యట్టిదురా[7]త్ములుం గలరె [8]యంత యధీరులె ధారుణీ[9]పతుల్.

41 సీ. పూతనాఘాతంబుఁ జేతనేతరమైన శకటంబు త్రోపును జరణ [1]నిహతి
వీఁకతోఁ గడుఁ [2]బూచుమ్రాఁకుల విఱుపును వల్మీకమాత్రపర్వతము నెత్తి
[3]కొని లావుగలఁడు వీఁడన నేడుదివసంబు లునికియు వృషవధయును ననఁగఁ
[4]బమ్మినకృష్ణు బీరమ్ములు [5]వొగడుచు నున్ననీనాలుక యొక్కఁడయ్యు

ఆ. వ్రయ్యవలయు నూఱువ్రయ్యలు గాఁగన,ట్లయినగాని చాలవతనిఁబొగడ
[6]నెల్లదాని నేన యెఱుఁగుదు [7]నెందువాఁ,డర్ఘ్యదానయోగ్యుఁడయ్యెఁ జెపుమ.

40 1. లంబన – అ.ఆ ఈ ఉ.ఒ క ఝ ల ; లంబనచేసి – భాసం. [అవలంబయిత్వా — ఏకపదము]. 2. పీలి – వ స. నావి నౌరివసంబద్ధా యథాంధో వాంధమన్వియాత్ భం. 2–38–2. 3. గర్వమునన్ – ఎ ణ. 4. పట్టితిభీష్మయీధరణి పాలురకెల్లను జేసి తెగ్గునీ, యట్టి దురాత్మకుల్ గలరె యెంతయుభీరులె ధారుణీపతుల్ – ల.స ; పట్టితిభీష్మయీధరణిపాలున — అ 5. విభీషికల్ – అనురూపము పెక్కు ప్రతులలో గలదు. 6. సూపెదీవు — వీ శ ష ; సూపెదెందు – క డ. 7 త్మకుల్గలరె–ఆ.ఇ.ఉ.ఝ 8 యెంతయు భీరులె–గ డ.ణ ; యంతయు రిక్తులె–చ. 9 శ్వరుల్– అ.ఉ.

41 1. ములను – ఔ చ.ణ.ల. 2. బ్రొళ్ళ,బొల్చు – అనురూపములు భిన్నప్రతులలోఁ గలవు. అర్కప్రమాణౌ తౌవృక్షౌ యద్యనేననిపాతితౌ భం. 2–38–367. అధస్సూచిక. పి పి.ఎస్ 2–42–9. 3. కొనె – ణ 4. బెరిగినకృష్ణుని బీరంబు – ఆ.ఇ. ఘ.ఝ.ల , బేర్చినకృష్ణుని బీరంబు — ఈ.ఎ ; ప్రబ్బినకృష్ణుని బీరంబులు – క.ఖ. ఈపాఠములన్నింటను యతినియమము పాటింపబడినది ఇది పైపాదముల యందలి ప్రాసయతి నియమమునకు విరుద్ధము. బెరిగినకృష్ణునిదురములు – భాసం ; బంచిన కృష్ణుబీరంబులు – ఒ.గ.వీ శ ష. 5. కీర్తించు [పు] చున్న — కొన్నిప్రతులు ; వర్ణించుచున్న – ణ. 6. నెల్లవాని నీవ [వె]- క డ ; నెల్లయదియు – ఇ.ఊ వీ. నెవిధులు — ఐ. 7. నందు వీడర్ఘ్యదానయోగ్యుడగు నెచెపుమ — ఏ.ల.వీ.శ. ష. .

42 వ. స్త్రీలను గోబ్రాహ్మణులం గూడు[1]పెట్టువారిని విశ్వసించినవారిని వధియిం చుట మహాపాతకంబని [2]పెద్దలుసెప్పుదు [3]రట్టివానియందు గోవిందుఁడు స్త్రీవధయును గోవధయునుం జేసె [4]నీవునుం గడు ధర్మువెఱింగినవాఁడ వయి వీని కర్ష్యం [5]బిప్పించి తదియునుంగాక [6]యన్యకామ యయిన యంబ యనుకన్యక [7]నపహరించి నీవుదెచ్చిన నెఱింగి నీతమ్ముండు విచిత్రవీర్యుండు [8]ధర్మువెఱింగినవాఁడై దానివిడిచి [9]పుచ్చె

43 క. జననిందిత మయి నీయం,దనపత్యత యను నధర్మమదియుండఁగ [1]ధ
ర్మనివృత్తచరిత్రక నీ,యనుశాసన మెట్లు నమ్మనగు జనములకున్.

44 వ. తొల్లి సముద్రతీరంబుననుండి యొక్కవృద్ధహంస [1]ధర్మాధర్మంబులు సెప్పుచు ధర్మమార్గంబు[2]న వర్తిల్లుచుండుఁడని పక్షులనెల్ల శిక్షించుచుఁ బ్రాణిహింస సేయక తపోవృత్తినున్న దానికి [3]సముద్రజలచరంబులయినపక్షులు [4]రుచ్యంబు లగు భక్ష్యంబులు దెచ్చిపెట్టుచుం దత్సమీపంబునం [5]దమతమ యండంబుల నెల్ల నిక్షేపించి [6]భక్షణార్థం బొక్కనాఁ డతిదూరం బరిగిన[7]నిట యా హంసయు [8]నయ్యండంబు[9]ల భక్షించిన దాని నొక్కపక్షి[10]గని యాపక్షులకెల్లం జెప్పిన [11]నవి దద్దయు దుఃఖించి [12]యాయంచను వధియించెం గావున నట్ల[13]నీవు

42 1. వెట్టిన—పెక్కు ప్రతులు. 2. మహాపురుషులు—పెక్కు ప్రతులు ; విందు — అ స. 3. రకె — ః. 4 నీవు గడు — కొన్ని ప్రతులు 5 బీపంచితది — వీ శ ప. 6. యన్యకామిని (కాంత,భామిని,భామ)-యని భిన్నప్రతులు ; కాని అన్యకామాహి ధర్మజ్ఞకన్యకా భం. 2—38—21 7 నపహరించి — పెక్కు ప్రతులలో లేదు. 8 ధర్మువుగలవాఁడై -అ ఆ ఇ ఈ.ఊ ఏ ఒ.ఔ.క వ ; ధర్మం బెరింగెడువాడు గావున-ఝ 9. పుచ్చెమరియును — ఉ.ఓ.ఝ.

43 1 నిన్నును ధర్మచరితుడని— అ ఉ ఊ ఏ.ఐ జ.ల వీ.శ ష స.

44 1 ధర్మువులు సెప్పుచు-పెక్కు ప్రతులు. 2. దప్పివర్తించు పక్షులశిక్షించుచు-అ ఐ ; వర్తిల్లుం-అ ఇ ఊ.ఝ ; నప్రవర్తిల్లుం-ఊ.ఓ ఘ ; నప్రవర్తిల్లుచుండి-క ఖ ; నప్రవర్తింపుచుండి-చ 3. సముద్రచరులయిన-పెక్కు ప్రతులు. 4 రుచ్యంబులైన-కొన్నిప్రతులు. 5 దమయండంబులు—పెక్కు ప్రతులు. 6. భక్ష్యార్థంబతి-ఏ ఐ.ఒ ఓ.ఔ క.ఖ , భక్షణార్థంబతి—పెక్కు ప్రతులు. 7. వృద్ధహంసంబును-అ ఇ ఘ ; నిటవృద్ధ—అ.ఊ.ఒ.ఓ ఔ. వీ.శ. 8. నధిక క్షుత్పిపాసా పరవశంబై (యై) - ఉ ఒ.చ.ఝ. 9. లనెల్ల - పెక్కు ప్రతులు 10 జూచి - పెక్కు ప్రతులు. 11. విని దుఃఖించి-పెక్కు ప్రతులు. 12. వృద్ధ హంసను—పెక్కు ప్రతులు. 13. నీవును ధర్మశిక్షసేయుచు గౌరవుల—ఆ.ఇ.ఐ.ఘ; నీవు

నధర్మ ప్రవృత్తుండవై [14]ధర్మశిక్షసేయుచుఁ గౌరవుల[15]కాపద[16]యాపాదించు చున్నవాఁడవు.

45 క విదితముగ [1]నధికబలసం, పద[2]నోర్చె నుపేంద్రుఁ డవనిపాలురనంచున్ మదిఁ బొగడితి [3]నా యెఱుఁగని, యదియె జనార్దనుబలంబు నత్యున్నతియున్.

46 క. సకలక్షత్రభయంకరు,నకు [1]బార్హద్రథికి నని మొనన్ మార్కొన నో పక [2]వలియం బాఱఁడె యీ, ముకుందుఁడు భయాతిరేకమునఁ[3]బదిమాఱుల్.

47 వ. అమ్మహాసత్త్వు జరాసంధుం [1]బరమబ్రహ్మణ్యు బ్రాహ్మణవేషంబున భీమార్జును లం దోడుసేసికొని [2]వధియించె [3]నవి యెల్లం ద్రివిక్రము పరాక్రమంబులుగా [4]నక్రాంతవచనుండవయి.

48 ఆ. [1]బూతువొగడినట్లు [2]వొగడెదు పొగడంగ, వలయునేని [3]సుగుణవంతులయిన కర్ణశల్యు లాదిగాఁగల వీరులఁ, బొగడుచుండరాదె [4]ప్రొద్దువోక.

నధర్మయుక్తుండవై —ఒ.జ.ఝ. 14. ధర్మప్రవృత్తులైన కౌరవుల — అ.ప.ణ ; యధర్మ శిక్ష[లు]సేయుచు —ఖ ఝ 15. కపాయం బాపాదింపనున్నవాడవు — వీ.శ.ష. 16. లాపాదింప నున్నవాడవు — క ఖ ట.

45 1. బాహుబల—అ.ఇ ఊ ఘ ల; విపులబల — ఝ. 2. నోర్చు — ఈ ఉ ఊ.ఎ ఏ ఓ.క.ఖ వీ శ.ష ; నోర్చును గృష్ణుడవని — క ఖ ; నొప్పును పేంద్రుడవని పాలకుడంచున్ — ణ 3. మాయెరుగని — పెక్కుప్రతులు

46 1 బార్హద్రథున కనిమొనన్ — ఆ ఇ ఊ ఏ గ.ఘ 2. వెలవెల — ణ ; వెలియై — ఏ.ఛ ఝ ల 3 బలుమారుల్ — ఆ ఖ.ఓ ఔ గ.

47 1. బరమబ్రహ్మణ్యు — ఓ క.ఖ డ శ ష ప్రతులలో లేదు ; బరమబ్రాహ్మణ వేషం బున — అ ఉ ఏ ఔ.ఝ.డ. 2. మాయోపాయంబున వధియించె — ఈ ఎ.ణ.ల. 3 నివి — పెక్కుప్రతులు 4 దలంచి యక్రాంత — వీ.శ.ష.

48 1 యస్యసం స్తవ వక్తాత్వంబంది [వంది] వత్సతతోత్థితః భం. 2-41-6 2. వొగడితి - పెక్కు ప్రతులు 3. శౌర్యవంతులైన — ఈ ఎ.ఒ.క.ఖ ఛ.ఝ.డ ల స 4 ప్రొద్దువోవ — ఎ వీ.శ ష.

49 ఆ. [1]అన్యకీ ర్తనంబు నన్యనిందయుఁ దన్నుఁ, బరగఁ బొగడి[2]కోలుఁ [3]బబ్బికోలు
నాపగాతనూజ యార్యవృత్తములుగా, వనరి వీని [4]నాద్యులయినమునులు.

50 వ. అని [1]రూక్షాక్షర వచనంబుల [2]నాక్షేపించుచున్న శిశుపాలుంజూచి [3]సహింప
నోపక భీమసేనుం డతిరౌద్రాకారంబు[4]న నలిగిన

51 చ. ప్రకటితకోపవేగమునఁ బద్మదళాయతనేత్రముల్ భయా
నక[1]తరలీలఁదాల్చె నరుణద్యుతి [2]నుద్యతమై [3]త్రిశాఖమై
భ్రుకుటిలలాటదేశమునఁ బొల్చెఁద్రికూట[4]తటి [5]త్రిమార్గగా
నుకృతిఁ బ్రభంజనప్రియతనూజున కంతకమూర్తి కచ్చటన్.

-: భీమునకు భీష్ముండు శిశుపాలుని వృత్తాంతంబు సెప్పుట :-

సం. 2—40—1

52 వ. ఇట్లు [1]నిఖిల క్షత్రియ[2]త్రాస జననంబుగా [3]నలిగి దంత[4]సందష్టదారుణ
ముఖుండై శిశు[5]పాలనిర్మూలనాభీల సంరంభంబున నున్న భీమసేనువారించి
భీష్ముం[6]డిట్లని చెప్పె నిద్దుగాత్ముండు [7]తొల్లి చేదివంశంబున దమఘోషుం
డనువానికి సాత్వతికిం జతుర్భుజలలాట[8]నేత్రంబులతో [9]నుదయించి రాస

49 1 ఆత్మకీర్తనంబు – అ ఇ ఏ ఔ ఛ ఝ. ణ. 2. కొనుట — అ ఐ. ఖ. 3. బచ్చి
కోలు—వా, స సూ ; బబ్బికోలు-కొన్ని ప్రతులు. 4. నార్యు-గ.ర పెక్కు ప్రతులు.

50 1. రూక్షేక్షణవచనంబుల — పెక్కు ప్రతులు ; రూక్షేక్షణ పరుషవచనంబుల —
ఎ.ఓ.స 2 నధోక్షజు నాక్షే—ఎ క.ఖ డ ణ 3 సహింపక — పెక్కు ప్రతులు.
4. గానలిగి — పెక్కుప్రతులు ; నకడునలిగి – ఎ.ఒ ఘ

51 1 రస – గ. 2 నుజ్జ్వలమై — ఉ ; నుద్ధతమై - ఏ.ఓ గ ఛ.ఝ.వీ.శ ష ; నుద్ధృ
తమై – డ ; నద్భుతమై — ఈ 3 త్రిరేఖమై — స. 4. తట — ఎ.ఏ ఔ క.స,
5 త్రిమార్గభానుకృతి – ఈ ఒ.ఓ క ఖ ; త్రిమార్గగానుకృతి — ఏ ఔ చ ; త్రికూట
స్థాంగంగాం త్రిపథగామివ — భం 2–39–11

52 1 సకల — పెక్కుప్రతులు 2 సంత్రాస — అ.ఈ ఉ.ఔ వీ సంతాప — ఛ
జ ఝ ; సంత్రాసకరంబుగా – క ఖ. 3. కడునలిగి – ఎ.ఒ. 4. సందష్టోష్ఠ—ల.
5 పాలు నిర్మూల — అ.ఈ ఔ. 6 డాతనికిట్లనియె – పెక్కు ప్రతులు 7.
తొల్లి – పెక్కుప్రతులలో లేదు. 8. లోచనంబు – ఎ.ఒ.క.ఖ. 9. బుట్టి – క.ఖ.

భ[10]రవంబున నేడ్చుచున్నం జూచి [11]తల్లిదండ్రులు [12]భయవిస్మయాధీన[13]మన స్కులయి యున్న[14]వారికి నొక్కయశరీర[15]భూతం బిట్లనియె.

53 ఆ. వీని నొరులు చంపఁగా నోప రెవ్వరు, నెవ్వ రేని వీని నెత్తికొనుడు
మిగిలియున్న బాహుయుగళంబుఁ [1]గన్నును, నడఁగు [2]వీనికతఁడ యంత
కుండు.

54 వ. అనిన నయ్యశరీ[1]రి వచనంబులు విని వార లాశ్చర్య[2]మానసు లయి యాకుమా రుం జూడవచ్చినవారి [3]కెల్ల నెత్తికొన నిచ్చు[4]చున్నంత.

55 చ. అతివికృతస్వరూపధరుఁడైన కుమా[1]రకుఁ బ్రీతితోడ సా
త్వతిఁ దమమేనయత్తను ముదంబునఁ జూడఁగఁ గోరి యద్భుత
[2]ప్రతిభులు రామకేశవులు వచ్చిరి నేఁగిరి చేదిధారుణీ
పతిపురి కొక్కనాఁ డఖిలబాంధవమంత్రిసుహృత్సమేతులై.

56 వ. [1]ఇట్లు వచ్చిన రామకేశవులం బ్రియసత్కారంబులఁ బూజించి సాత్వతియు [2]నబ్బాలు బలదేవుచేతికి నెత్తికొన[3]నిచ్చి తదనంతరంబ [4]నారాయణు [5]చేతికి నిచ్చిన.

10 స్వరంబున — అ ఊ.ఏ ఒ ఔ.ఘ జ ల.వీ.శ.ష. 11. వీనితల్లి — అ ఆ.ఈ.ఎ. ఐ.ఒ.క.ఖ.ఘ.ఝ 12 భయాకులిత మానసులయిన — అ ఆ ఉ.జ ; వ్యాకులిత— గ. 13 మనస్కులయిన — పెక్కుప్రతులు 14. వారలకు — అ.ఈ ఉ ఓ గ.ల. వీ.శ ష ; వారలకొక్క — చ. 15. వాణియిట్లనియె — ఊ ఎ.ఓ క ఖ గ.డ.

53 1. తృతీయమేతద్బాలస్య లలాటస్థంతులోచనమ్ నిమజ్జిష్యతి యంచృష్ట్వాసోఽస్య మృత్యుర్భవిష్యతి భం. 2–40–10. 2. వీనినతడ(డె,డు); వీనికంతకుండు—కొన్నిప్రతులు.

54 1 రి పలుకులు — పెక్కుప్రతులు ; రవాణి పలుకులు—ఎ.ఖ. 2 హృదయులయి, చిత్తులయి—భిన్నప్రతులు 3. చేతికెల్ల — వా 4. చుండునంత — ఇ ఎ.ఏ.ఔ.క ఖ.ఘ.ణ.

55 1. రుప్రియంబుతోడ — ఓ.ఔ.ఝ ; రునిప్రీతితోడ — గ.ఘ.శ.ష. 2 ప్రతిములు— అ.ఆ.ఊ ఐ.ఓ గ.ఘ.చ.జ.

56 1. ఇట్లువచ్చిన......బూజించి వఱకు పెక్కు ప్రతులలో లేదని - స. 2. నక్కొడుకు ఇ.ఉ ; నక్కుమారు — క.ఖ ; నబ్బాలకు — ఏ.ఐ.ఔ.గ.శ. 3. నిచ్చియనంతరంబ — కొన్నిప్రతులు. 4 దామోదరు — వీ శ.ష 5. చేతికిచ్చిన — పెక్కు ప్రతులు ; చేతికెత్తుకొననిచ్చిన - ఎ.ఝ ; నెత్తికోనిచ్చిన — ఓ.

57 క. అక్కొడుకు [1]నబ్జనాభుం, డక్కజముగ నెత్తికొనుడు నందఱుఁ జూడన్
గ్రక్కున నొక్కట వడఁగెను, మిక్కిలిచేతులును వాని [2]మిక్కిలికన్నున్.

58 వ. దానిం జూచి సాత్వతి యద్భుతచిత్తయై యశరీరి[1]పలుకు లప్పుడు దలంచి తన పుత్త్రునకు మురవైరివలన మరణం బగుట [2]యెఱింగి యతని కిట్లనియె.

59 క. [1]కుపథప్రవృత్తుఁ డయి వీఁ, డపనయమున [2]నీ కనిష్టుఁ డయినను గరుణా
నిపుణుఁడవై నీమఱఁదికి, నపరాధ[3]శతంబు సైఁపుమయ్య యుపేంద్రా.

60 వ. అని వీని తల్లి [1]తొల్లి జగద్వల్లభుం డైన జనార్దనుం బ్రార్థించి [2]తత్ప్రసాదంబున వరంబు వడయుటం జేసి శతాపరాధంబులు నిండునంతకు వీఁ డన్యులచేత [3]నప్రతిహతుండు కృష్ణునిచేత [4]నిహతుం డగు [5]నది కారణంబుగా.

61 చ. ఇతనికి నిట్లు నన్నుఁ బలుక యెగ్గులు వల్కఁగఁ [1]బోలెఁగాక యు
ద్ధత[2]మతి నన్యు లీతని విధంబునఁ బల్కి మదీయ చాపని
ర్గత[3]చటులోగ్రమార్గణనికాయపయోధి మునుంగ [4]కిట్లు [5]ద
ర్పితు లయి పోవ నేర్తురె గభీరపరాక్రమ మారుతాత్మజా.

62 వ అని పలుకుచున్న [1]భీష్మభీముల నతిక్రమించి శిశుపాలుండు జనార్దనున కభిముఖుం డయి యిట్లనియె.

57 1 కమల — ఇ ప ఔ. 2. మిగిలిన — ఉ.ఛ.ఝ.

58 1 వచనంబులదలంచి — పెక్కు ప్రతులు 2 యెరింగి యిట్లనియె—పెక్కు ప్రతులు, నిశ్చయించి యతని కిట్లనియె—ల

59 1. కుపిత — ఉ ఓ చ. 2. నీకరిష్టుడై — అ.ఉ ఊ ప ఐ క ఖ.చ జ ఝ.ణ, 3 శతము సహింపవయ్య — అ, శతంబుగావుమయ్య — క ఖ.డ

60 1. తొల్లి — కొన్నిప్రతులలో లేదు 2 తత్ప్రసాదంబు వడయుటం జేసి — కొన్ని ప్రతులు. 3. నవధ్యుండు—ల వీ శ.ష. 4. నింకనిపుడనిహతుండగు — ఖ. 5 నిదె కారణంబుగా—కొన్నిప్రతులు

61 1. జెల్లె—ఉ.వీ. 2. మతులన్యులీతని—అ ఐ. 3 పటుతీవ్రమార్గణ—అ.ప క ఖ గ.ణ.ల; పటుశాత — ఆ ఒ ఘ.వ; పటుఘోర — వీ శ ష. 4. కెట్లు — ఇ ఊ ప ఔ.క.ఖ గ.ఘ చ డ వీ శ.ష. 5. గర్వితులయి — డ. [వకారభకారముల కిందుయతి].

62 1. భీష్ముని భీమసేనుని నతిక్రమించి — పెక్కు ప్రతులు

63 మ. అవమాన్యుఁ సభలోన మాన్యుఁడని [1]సౌహార్దంబునం గౌరవ
[2]స్థవిరప్రేరణ నిన్నుఁ బాండుతనయుల్ తప్పంగఁ [3]బూజించి ర
య్యవివేకాస్పదు లైన పాండవులు మోహాంధుండు భీష్ముండుఁ గే
శవ నీవుం [4]గడఁగుండు నాకు నెదురై సంగ్రామరంగంబునన్.

64 వ. అని శిశుపాలుండు గర్వించి పలికిన [1]విని చక్రధరుం డఖిల రాజ[2]చక్రంబువిన
నిట్లనియె.

65 సీ. ప్రాగ్జ్యోతిపంబున భగదత్తుపయి నేము వోయిన నీతఁ డన్యాయవృత్తి
నిటబాల వృద్ధుల కెల్ల భయంబుగా ద్వారకాపురిఁ [1]గాల్చె వీరులైన
భోజ[2]రాజన్యులు పొలఁతులతోడ రైవతకాద్రిఁ గ్రీడాభిరతిఁ బ్రమత్తు
లయి యున్న వారల [3]నదయుఁడై [4]వధియించె దేవాభుఁ డగు వసుదేవుచేయు

ఆ. నశ్వమేధమునకు [5]నభ్యర్చితంబైన, హయము నపహరించి యజ్ఞమునకు
విఘ్నమాచరించె వీఁడతిపాపుఁడై, బభ్రుభార్యఁ దనకు భార్యఁ జేసె.

66 వ. మఱియు వాగ్విషయంబు లయిన [1]యపకారంబు [2]లనేకంబులు సేసె
[3]మాయత్త [4]సాత్వతి నన్నుం బ్రార్థించుటం జేసి యిద్దురాత్ముండు సేసిన యప
[5]రాధశతంబు సహించితి నిప్పుడు మీరిందఱు నెఱుంగ నాయం దకారణ[6]వ్యతి
క్రమం బుపక్రమించి యత్యంత శత్రుం డయ్యె ననిన విని శిశు[7]పాలుండతి పరుష
వచనుం డగుచుఁ బురుషోత్తమున కిట్లనియె.

63 1. సౌహార్ద్రంబు — అను రూపము పెక్కు ప్రతులలో కలదు. 2 స్థవిధిప్రేరణ — ణ
3. బూజించి దా ర వివేకా — ఊ ల స. 4 గడు నాకు నిప్పుడెదు రే — ల. [ఇది
మూలానుగుణము కాదు]. ఆహ్వయే త్వాం రణం గచ్ఛమయాసార్థం జనార్దన।
యావదద్యనిహన్మిత్వాం సహితం సర్వపాండవైః. భం. 2-42-2

64 1. విని — కొన్ని ప్రతులలో లేదు 2 చక్రంబెల్ల — అ.ఈ ఉ.ఊ.గ; వల్లభులు-ఝ.

65 1. గాల్చి — కొన్ని ప్రతులు 2. రాజన్యుల — పెక్కు ప్రతులు. 3. ననయుసై —వా.
4. వధియించి — అ ఆ ఇ. 5. నర్చిత[ంబై]మైయున్న — పెక్కు ప్రతులు.

66 1. యపరాధంబు — పెక్కు ప్రతులు 2. లు పెక్కులు — ఈ.ఉ ఎ.క.ఖ.ఝ. 3. మా
మేనయత్త — అ.ప ఔ.ఛ ఝ 4. సాత్వతి — కొన్ని ప్రతులలో లేదు 5. రాధశ
తంబు నిండునంతకు — ఉ; రాధంబులు శతంబుదనుక — ఛ. 6. విగ్రహంబుప—ఆ.ఊ.
ఒ.గ.చ. 7. పాలుండు సహర్షణ వచనుం — ఇ; పాలుండు సామర్ష—ఆ.ఉ.ఊ.ఒ.
ఘ; పాలుండు రోషంబున — ఈ.

67 క. నీకూర్మియు నీయలుకయు, [1]నాకవి యేమిటికి [2]దుర్గుణప్రియ మొదలన్
నాకిచ్చిన [3]యక్కన్యకఁ, జేకొని [4]నీ కిట్లు వలుక సిగ్గును [5]లేదే.

—: చక్రాయుధముచే శిశుపాలుండు చచ్చుట :—

సం. 2-42-21

68 చ. అని శిశుపాలుం [1]డొండొకట నప్రియముల్ [2]హరిఁ బల్కుచున్న చో
ననల[3]శిఖా[4]లి దూల దనుజాంతకచక్రము రాజ[5]చక్ర మె
ల్లను భయమంద [6]మూర్ధవికలంబుగ నప్పుడు సేసెఁ జేదినం
దను తనువున్ బృహద్రుధిరధారలు [7]భోరన [8]మీఁది కొల్కఁగన్.

69 ఉ. ప్రల్లద [1]మేది యిట్లు శిశుపాలుఁడు వజ్రహతాద్రితుల్యుఁడై
[2]తెళ్లుడు వానిదైన [3]పృథుదేహము వెల్వడి తేజమంబరం
బెల్ల [4]వెలుంగ వచ్చి పరమేశ్వరు [5]దేహమునొచ్చె విస్మయో
[6]త్ఫుల్ల విశాలనేత్రులయి భూపతు[7]లెల్లను జూచుచుండఁగన్.

70 క. ఘనజాలము లేకయుఁ [1]బెలుచన పిడుగులతోడి [2]వృష్టి చైద్యు[3]నిపాతం
బునఁ గురిసె సముద్రమహాద్రినికాయము[4]తో ధరిత్రి దిర్దిరఁ దిరిగెన్,

67 1 నాకదియేమిటికి — కొన్ని ప్రతులు. 2. దుర్జనప్రియ — క ఖ. 3. కన్నియ దగజేకొని — ఈ ; యక్కన్నియ—అ.ఐ వీ శ ష ; యక్కన్నెక — ఇ. 4. నీకింక బలుక — ల. 5. గాదే — ఎ.ఒ భాసం

68 1. డెంతయును—అ ఎ ఏ ఒ ఓ.ఔ క.ఖ డ.స , డిట్లు సభ — ఆ ఊ ఘ ల.వీ.శ.ష.స ; డొండుగతి — ణ ; డొండ్లుహరి — ఐ ; డట్లుకడు — గ ; డల్కమరియ — ఝ ; డుగ్రముగ — ట. 2 వెస — ఐ. 3. సమానవేగ - చ 4. లిదూలి — అ.ఆ ఊ ఏ.ఓ.ఔ క.ఘ ; విధూత — ఖ. 5. లోక — పెక్కు ప్రతులు. 6. మూర్ధ్నవి కలంబుగ — ఘ.చ. 7. భోర(ని)న — పెక్కు ప్రతులు ; భోరున—ఘ చ 8 మీద నొల్కగన్ — ఒ.ఘ.

69 1. మాడి — ఏ.ఘ.ణ; మంది — ఈ ఖ 2. తెళ్లిన — శర. కొన్ని ప్రతులు ; ప్రతెళ్ళగ — చ. 3. యురుదేహము—ఘ ; ఘనదేహము—ల 4. వెలుంగుచుండ—ఝ 5. కంఠము-ఏ.ఔ. 6 త్ఫుల్లమనస్కులై యచటి భూపతులెల్లను వచ్చిచూడగన్—ణ. 7. లందరు — పెక్కు ప్రతులు.

70 1. బెలుచనఁ బిడుగుల — సూ. 2. వాన — ఇ.ఈ ఏ.ఔ ఝ.ణ. 3. నివాసం — ఎ.క.ఖ.ఝ.వీ.శ.ష. 4. తోడ దరణి — అ.ఇ.ఓ.ఝ.ల

71 క. జయజయ ని[1]నాదమున న,వ్యయు నంబుజనాభు భువనవంద్యు నుపేంద్రుం
బ్రియమునఁ [2]బొగడెడు జనముల, దయినమహా[3]ధ్వనియుఁ జెలఁగె నతితుములంబై.

72 వ. [1]అంత ననంతశయనుండు శిశుపాలు [2]సంస్కరింపంబంచి వాని కొడుకుం జేది [3]రాజ్యంబున కభిషిక్తుం జేసె [4]నట్లు ప్రశాంతవిఘ్నంబయి [5]సుఖారంభంబయి పరిభూతభక్ష్యాన్న [6]ధనదానసనాథంబయి [7]జగన్నాథరక్షితంబయి [8]రాజసూయ సూయ మహాధ్వరంబు [9]సమాప్తప్రయోగంబయిన.

73 ఉ. [1]దేవగురుద్విజ [2]ప్రకరతృప్తి[3]కరున్ వరరాజసూయయ
జ్ఞావభృథాభి[4]షేకవిమలాంగు విశుద్ధ[5]యశోనిధిఁ జగ

71 1 నాదముల—పెక్కుప్రతులు 2. బొగడు జనంబుల — ఝ వా ; బొగడెడు జనముల — వీ.శ.ప. కొన్నిప్రతులు. 3. ధ్వనులు — అ ఉ ; రవము — వీ శ ప.

72 1. దమఘోషాత్మజం వీరం సంసాధయత యతమాచిరం తథా చక్రతవం తస్తే భ్రాతుర్వైశాస నంతదా. భం. 2-42-30. మూలమున నిది ధర్మజు వాక్యముగా నున్నది. 2 నంతంబు నొందించి-ల 3. విషయంబున-ఎ.ఒ క డ. 4 నిట్లు — కొన్నిప్రతులు. 5. శుభారంభంబై—ఝ.స , రాజసూయంబు—క ఖ 6 ధనధాన్య సమన్వితంబై — పెక్కుప్రతులు ; ధనధాన్య సమృద్ధంబై—ఉ.ఛ.ఝ ; ధనధాన్య సనాథంబయి — గ చ. 7 జగన్నాథ రక్షితంబయి—ఈ.ఉ ఊ. ప్రతులలోలేదు ; జగన్మాన్యంబయి-గ. 8. రాజసూయంబు—పెక్కుప్రతులు 9. సమాప్తంబయిన—పెక్కుప్రతులు ; సమాప్తంబయి రమణీయం బయిన-క ఖ.డ

73 1. ఈపద్యమునకు ముందు అథర్వణాచార్యులవని పేర్కొనబడిన రెండు పద్యములు ఎ ఔ.ఝ ప్రతులలోఁగలవు మొదటిపద్యము స. లో గుర్తింపబడినది. కాని దీనికి మూలమునందాధారములేదు

సీ. తడసిన పచ్చనితడిచూడ్కులకు కొంత తొడలఁగ్రొమ్మెలుగులు తోడుసూప
కురులవంకలు దీర్చి,కురియు హార్బిందువుల్ చనుదోయికిని వింతసరముగాఁగ
పొదిబోసియున్న కొప్పెదచక్కద్రోయుచో దోర్మూలరోచులు దొంగలింప
కజ్జలరేఖల కరగినతెలిగన్ను లంబోజదళకాంతి నవహసింప
రాజసూయావభృథమున తేజరిల్లు
ద్రుపదరాజతనూజాతవిపులజఘన
తలము గనుగొని రాజకాంతాజనముల
మనములాపోవమిని మగమనములయ్యె

మ. ప్రణుతాశేషవసుంధరాధిప శిరస్స్రగ్గంధలుబ్ధభ్రమ
ద్క్వణదభ్రభ్రమకృద్ద్విరేఫగణ ఝుంకారాబద్ధ సంబంధస
ప్రణవృత్తి ప్రథితప్రవర్తితసమగ్రక్షత్ర సూయాధ్వర
క్షణ సింహాసనభాసితున్ దృఢధనుశ్శ్లోకానుజున్ ధర్మజున్.

2. న్మజనతృప్తి—ఇ.ఈ ఔ ఝ. 3. కరంబగు—ఎ.ఒ క ఖ.డ , కరున్ గృతరాజసూయ—అ.ఊ ఘ.ల.శ.ష. 4. షేకు—ఇ.ఈ ఊ.ఏ.ఓ ఔ.ఝ 5. యశోభిశోభితున్ పావను—ఘ

త్త్వావను ధర్మనందను [6]సభాస్థితుఁ జూచి ముదంబు [7]చెంది రిం
దాద్రివరజాది [8]మిత్రు లసహత్వముఁ బొందిరి ధార్తరాష్ట్రులున్.

74 వ. ఇట్లు మహావిభూతితో నున్న ధర్మరాజు[1]నొద్దకు [2]వచ్చి నానా[3]దేశాగతు లయిన రాజులిట్లనిరి.

75 మాలిని. జగ[1]దభినుత సామ్రాజ్యంబుతో [2]నొప్పునీయ
త్యగణిత గుణయుక్తం బైన ధర్మ[3]ప్రవృత్తిన్
మిగిలి వెలిఁగె [4]నాజామీఢవంశంబు [5]విద్వ
ద్గగనతపన [6]సర్వక్షత్త్రివంశంబులందున్.

76 వ. ఏము భవదీయ [1]రాజసూయ మహోత్సవ దర్శనంబునను భవత్కృతసత్కార గౌరవంబునను జేసి కృతార్థుల మయితిమి మామాదేశంబులకుం [2]బోయెద మని [3]చెప్పి [4]వీడ్కొని చనిరప్పు[5]డు ధర్మరాజువచనంబున భీష్మ[6]ధృతరాష్ట్రుల భీమసేనుండును [7]యజ్ఞసేను నర్జునుండును సపుత్త్రికులయిన [8](కర్ణ) శల్య

6 శుభస్థితి—ఉ 7. బొందిరి—పెక్కు ప్రతులు, నొందిరి—డ.ఖ. 8 మిత్రులు సు(స) హర్షము — ఊ.ఎ ఒ ఔ.క ఖ ; మిత్రులు నహర్షము—ఝ ; మిత్రులునుహర్షము — ఏ.గ ; మిత్రులు ప్రహర్షము నొందిరి యెల్లవారలున్ — ల ; మిత్రులునమర్షము — ఝ.డ ణ.శ.ష.స శ. (యతి?)

74 1. కడకు — ఓ.గ ; వద్దకు—అ.ఆ 2 వచ్చిన — ఈ. 3 దేశాధీశులయిన-ఉ.ఘ.చ ల.

75 1 దభిమత — ల 2 నొప్పె — ఊ.ఘ ల ; నొప్పి — ఆ ఇ.ఈ.ఎ.ఏ.ఒ.క.ఖ.గ ఝ. 3. ప్రయుక్తిన్ — అ.ఇ.డ.ల. 4. నాజామీఢు — ఊ ఖ.ఘ 5. శశ్వద్గగన— ఉ.ఒ.జ.ఝ. భాసం. ల.శ; నుద్యద్గగన — ఊ; దీవ్యద్గగన — చ. 6 శుద్ధక్షత్ర- అ.ఘ. ఝ.ణ.ల.

76 1. రాజసూయోత్సవ — పెక్కు ప్రతులు ; రాజసూయాధ్వరోత్సవ — ఐ 2 బోయివచ్చెదమని — ఉ.ఛ.ఝ డ ల 3. చెప్పి — పెక్కు ప్రతులలో లేదు. 4. వీడ్కొనిన నప్పుడు - ఈ ఓ.ఔ.గ.వీ శ ష ; వీడ్కొని నప్పుడు — ఊ ; వీడ్కొను నప్పుడు—ల. 5. డు, ధర్మనందనుండు రత్నమాల్యాంబరాభరణంబుల వేరువేర నిప్పించి యనిపినం దమతమదేశంబుల కరిగిరంత ధర్మరాజు—ల. ఈయధికపాఠము అ.ఐ. ప్రతులలో భిన్నభిన్న స్థానములందుఁగలదు. 6. ధృతరాష్ట్రాదుల — ఈ ఓ.గ.ల; ధృతరాష్ట్రాది జ్ఞాతుల — ఏ.ఔ. 7. యజ్ఞసేన పార్థాదుల — ల ; ద్రుపద యజ్ఞసేనుల — డ మూలవిరుద్ధము ధనంజయో యజ్ఞసేనమ్ భం.2–42–41. 8 కర్ణ - పెక్కుప్రతులలో లేదు. మూలమునందునులేదు. శల్యుడును మూలమున

[9]సుబలుల నకులుండును గృపద్రోణాశ్వత్థామల సహదేవుండును విరాట భగదత్తుల [10]ధృష్టద్యుమ్నుండునుం [11]బార్వతేయులైన రాజుల సౌభద్ర ద్రౌపదేయులును [12]ననిచిరంత.

77 క. సతతధన[1]దానములఁ బూ,జితులయి తృప్తులయి గుణవిశిష్టమహీదే
[2]వతవరులు ధర్మసుతు మా,నిత[3]గుణు దీవించి చనిరి నిజగృహములకున్.

78 వ. నారాయణుండును [1]పాండునందనుల నందఱం గ్రమంబున వీడ్కొని [2]ద్వారవతికిం బోవుచుండి ధర్మరాజున కిట్లనియె.

79 తే. సకలభూత [1]సంఘంబు పర్జన్యుఁ బఱ్ఱ,సమితిబహుఫలవృక్షంబు నమరులింద్రు
ననిశమును [2]నుపజీవించునట్లు బంధు,జనులు నిన్ను పజీవింప మనుము పేర్మి.

80 వ. మఱియు నప్రమత్తుండ వయి [1]నిఖిలప్రజారక్షణంబు సేయుమనినఁ గృష్ణునకు ధర్మరా జిట్లనియె.

పేర్కొనఁబడలేదు. 9 సౌబలుల — అని పెక్కుప్రతులు. కాని యిది మూల విరుద్ధము. నకులఃసుబలంరాజన్ సహపుత్త్రం సమన్వయాత్ భం. 2-42-43. 10. సౌభద్రుండును — అ.ఉ.ఎ.ఏ.ఒ.ఔ.ఖ.గ.వీ.శ.ష ; అభిమన్యుండును — వ. కాని యిదిమూల విరుద్ధము విరాటమన్వయాత్పార్థం ధృష్టద్యుమ్నః భం. 3-42-41. 11 పార్వతేయ సౌ [గో] రాష్ట్రపతుల — కొన్నిప్రతులు ; ద్రౌపదేయాః ససౌభద్రాః పార్వతీయాన్ మహీపతీన్ — భం. 2-42-43. 12. నతిప్రీతి [ప్రియంబున] ననిచి (పి) రంత — పెక్కుప్రతులు.

77 1. ధాన్య — పెక్కుప్రతులు. 2. వతలందరు- పెక్కుప్రతులు ; వతలాధర్మాత్మజు - ల; వతలు వరుసధర్మజు - ణ. 3. యశు — ఆ ఈ.ఉ.ఊ.ఏ ఘ.ఝ.ల.

78 1. పాండవులం గ్రమంబున — కొన్నిప్రతులు. 2. ద్వారావతికిం — పెక్కుప్రతులు.

79 1. సంఘములు—ఘ.ఝ.ల. 2 భజియించిన యట్లునీవు బంధుజనములు భజియించ (వ) బరగుపేర్మి — డ. (ప్రాసయతి నియమము తప్పినది), భజియించునట్లనఘ బంధుజనులు నిన్నును భజియింప మనుము పేర్మి — ఛ.ఝ ; భజియింపంగ (భజియింతురు) - భాసం.

80 1. యఖిల — పెక్కుప్రతులు.

81 ఉ. నీకరుణం గరంబు రమణీయతరం బయి సర్వవిఘ్న దూ
రీకృతమై సమాప్తినొనరెన్ ధరణీధర యిమ్మఖంబు భూ
లోకములోన [1]నేను నృపలోక[2]నమస్కృతికీర్తిఁ [3]బర్విటిన్
నాకులమున్ వెలింగె [4]సుగుణంబుల [5]కాస్పదమై [6]పవిత్రమై.

82 క. ద్వారవతినుండియును [1]నిట,యారసి యుండునది దానవాంతకలోకా
ధారసమీపస్థుండవ, దూరంబుననుండియుం జతుర్భుజ మాకున్.

83 వ. నిన్నుం బాసి [1]నిమిషంబయిన నిర్వహింప నేరమని [2]ధర్మరా జెట్టకేనియు గరుడ
గమను గమనంబున [3]కొడంబడియె నంత.

84 చ. అనిలజవాశ్వయుక్తమయి హాటకరత్నవిచిత్రతార్క్ష్యకే
తనమయి [1]మేఘనాదమయి దారుక[2]సారథియైన దివ్యకాం
చనరథమెక్కి [3]యాతఁడమ సాత్వతకుంజరుఁ డేఁగె భక్తి నా
తని [4]ననిచెన్ యుధిష్ఠిరుఁడు దమ్ములుదానును బాదచారియై.

85 క. తగిలి విలోచనగోచర, మగునంతకు [1]దృష్టినిలిపి యటవ్వాదయం బి
[2]మ్ముగఁ గొనిపి యెట్టకేనియు, [3]మగిడిరి హరి[4]ననిచి [5]దీనమతిఁ బాండు
సుతుల్

81 1. నేనుముద్రిలోక — పెక్కుప్రతులు 2. నుతస్థిరకీర్తి — ల.స ; నుతస్థితి [త] కీర్తి — ఓ.ఔ.ఘ చ ; ఘనస్తుత — వీ శ ష , మనస్కృతకీర్తి — భాసం 3. బొందితిన్ — అ ఐ.ఓ 4. నుగుణంబుల — ఇ ; భువనంబుల — ఉ.ఛ.ఝ. 5 కాశ్రయమై ధరిత్రిలోన్ — క; కాశ్రయమై — ఖ. 6. ధరిత్రిలోన్ — డ.

82 1. మమ్మారసి — ఓ ; నిటయారసి యుండునది... ... సమీపస్థుడవై దూరంబున నుండియును, జతుర్భుజమమ్మున్ — పెక్కుప్రతులు

83 1. యొక్కింత ప్రొద్దయిన— పెక్కుప్రతులు. 2. ధర్మతనయుం డెట్టకేలకు (కేనియు)– కొన్ని ప్రతులు. 3. కొడంబడిన — పెక్కుప్రతులు.

84 1. మేఘనామమయి— ణ. మేఘవర ప్రఖ్యామ్ భం. 2–42–54. 2 సారథికంబునైన కాం — ఏ.ఔ. 3. తతఁడమ — పెక్కుప్రతులు. 4. బనిచెన్ — సం

85 1. దృష్టు — ల. 2. మ్ముగనిలిపి — పెక్కుప్రతులు. 3. మగుడితి — ఝ.డ.శ. 4. దలచి — డ. 5. వినయమతి — కొన్నిప్రతులు.

—: పాండవసభామహిమకు దుర్యోధనుండు లజ్జితుండగుట :—

సం. 2—43—1

86 వ. [1]అట దుర్యోధనుండు శకునియుం దానును సభావిభవంబుఁ జూచు వేడుక నందుఁ గొన్ని దినంబు లుండి [2]యొక్కనాఁడు దాని యపూర్వరమణీయతకు[3]విస్మితుం డగుచు నయ్యయిప్రదేశంబులం గ్రుమ్మరువాఁడు వివృతంబైన ద్వారదేశంబు సంవృతంబుగా వగచి చొరనొల్లక సంవృతంబైనదాని వివృతంబుగా వగచి చొరంబోయి [4]లలాటఘట్టిత[5]గృహద్వారుం డయి సమప్రదేశం బున్నతంబుగా వగచి యెక్క సమకట్టి [6]నీలాశ్మరశ్మిస్థగితం బైన విమలమణిస్థలంబు [7]జలాశయంబుగా వగచి పరిధానం [8]బెగఁద్రోచికొని [9]స్ఫటికదీప్తిజాల పరివృతంబైన జలాశయంబు [10]స్థలంబుగా వగచి కట్టినపుట్టంబు దడియం [11]జొచ్చి క్రమ్మఱిన వానిం జూచి [12]పాంచాలియుఁ బాండుకుమారులును నగి రంత.

87 ఆ. దాని నెఱిఁగి ధర్మతనయుండు ధృతరాష్ట్రు, [1]తనయునకు సమీరతనయుచేత దివ్యవస్త్రములును దివ్యభూషణములు, నిచ్చిపుచ్చెఁ[2]బ్రీతి యేర్పడంగ.

86 1. అంతనట — కొన్ని ప్రతులు. 2. యొక్కనాడు — ఇ.ఎ.ఖ.చ.ఝ. ప్రతులలో లేదు. 3. విస్మయ మానసుండగుచు — ల 4. తత్కవాటస్ఫటికశిలాఘటితలలాటుండై — వి శ.ష.స ; ప్రతిహతుండయి—ఇ.ఐ.ఒ.ట.డ. 5. ప్రతిగృహ— అ.ఈ ఔ. 6 నీలమణిస్థగితంబైన — చ; నీలాశ్మస్థగితంబైన — ణ భాసం.వి.శ.ష. 7 జలంబు(లు)గ — అ ఆ.ఏ ఒ.క.ఘ.చ. 8. బెగసనద్రోచి — ఆ ; బెగయంద్రోచి — ఉ ణ 9. స్ఫటికదీప్తిజాలపరివృతంబైన — పెక్కుప్రతులలో లేదు. 10. నిర్జలస్థలంబు — ఊ ల : సమస్తలంబు — ఆ.ఈ ఎ ఐ.ఛ ఝ.ణ 11. ద్రెళ్ళి — శర. 12. పాండురాజకుమారులు నగిరంత — ఆ.ఇ.చ.ట పాంచాలి నవ్వినట్లు భం. లో లేదు పి.పి.యన్. ప్రతిలో గలదు. 2_50_5. భం పాఠాంతరమున గలదు. భం 2—43—6 అధస్సూచిక.

87 1. నాత్మజునకు గింకరాళి చేత — వి.స ఇది మూలానుగుణము భం 2—43—6. 2. ప్రేమ — క.ఖ

88 వ. దుర్యోధనుం [1]డట్లు సభా[2]ప్రలంభంబునకు లజ్జితుండయి పాండవుల వీడ్కొని గజపురంబున కరిగి ధర్మరాజు రాజసూయంబు దనకసూయా[3]జననంబగుటయు సకలజనమనోనయనోత్సవం బయిన తత్సభాలక్ష్మి దనమనోనయనంబుల కగ్ని [4]జ్వాలయై మహాదాహంబు సేయుటయు [5]సంతప్తుండై నిదాఘ[6]దాహంబున నింకి తఱుఁగు నల్పజలాశయంబునుంబోలెఁ దద్దయుం [7]దఱిఁగె.

89 క. కందుగలపసిఁడి గాఁచినఁ, గంది వివర్ణమయినట్లు కౌరవుకాయం
[1]బొందఁగ వివర్ణమయెఁ గడు, వందె మనస్తాపహవ్యవహదాహమునన్.

90 క. అవనీరాజ్య[1]వ్యాపా,ర[2]విహీనుండయి [3]సుహృద్విరంజనుఁడై కౌ
రవపాంసనుండు పాప,వ్యవసాయమునందు బుద్ధి వదలక నిలిపెన్.

91 వ. ఇట్లు [1]సకలసుఖోపభోగ [2]విముఖుండయి యెవ్వరితోడం బలుకకున్న దుర్యోధనుంజూచి శకుని యిట్లనియె.

92 ఆ. [1]ఇన్నిదినములయ్యె [2]నేటికినాతోడ,నిభపురేశ పలుకవిట్టులేల
నీముఖంబు దీర్ఘనిశ్వాసధూమసం, హతులఁజేసి కలుషమయిన యదియు,

88 1. డునునట్లు [నట్టి]—కొన్నిప్రతులు. 2. ప్రాభవంబునకు — ఒ ఓ ; ప్రాలంభం — ల 3. జనకం — ఆ.ఉ ఊ ఒ వీ సం 4. జ్వాలయుం బోలె — వా 5. సంతప్తహృదయుండై — పెక్కు ప్రతులు ; సంతప్తనిదాఘ ... బోలె దందహ్యమాన మానసుండై దద్దయుం దరిగిన — ల. 6. సమయంబున — ఉ.ఎ చ ణ ; శుచి శుక్రాగమే కాలే శుష్యేత్తోయ మి వాల్పకమ్ ఛం. 2–43–21. 7 డస్సి — క.ఖ.డ ; గృశుండై — ఉ.ఏ.జౌ.ఛ.జ ఝ.

89 1. బుందగ — ల

90 1. వ్యవహార - ఆ.ఊ.ఓ.ఘ.ణ ల. 2. విరహితుండయి — క. 3. సుహృద్విరహితుండై - ఆ.ఐ.ఓ.ఘ.ణ.ల.శ ష.

91 1. సకల — ఊ.చ.ఝ.ల. ప్రతులలో లేదు. 2. పరాఙ్ముఖుండై —ఉ.చ.డ వ.

92 1. ఎన్ని - కఘా. 2 నిష్టంబు - ఆ.ఊ ఒ.ఘ-చ.ల ; నేల నాతోడ నీవిభ — ఏ.వీ.శ.ష; నేల నాతోడుత - ణ ; నెన్నండు నాతోడ — వ.

93 క. నా కెఱిఁగింపుము [1]దీనిన, నేకాగ్రతఁ బొందనేల [2]యేనుండఁగ న
వ్యాకులభవత్ప్రతాపని, రాకృతులు ధరిత్రిలోని [3]రాజులు నీకున్.

94 వ. ఇంత సంతాపింప నేల[1]యనిన నాశకునికి దుర్యోధనుం డిట్లనియె.

-: *దుర్యోధనుని దురాలోచనము* :-

సం. 2–43–19

95 ఉ. [1]నీవునుజూచి తట్టిసభ[2]నేని వినంబడ దేయుగంబులన్
భూవలయంబు[3]లో నదియపూర్వము సర్వమనోజ్ఞ [4]మిష్టభో
గావహ మేక్రియం బడసె [5]నయ్యమహాత్ముఁడు [6]దాన[7]నేమి సం
భావితభాగ్యుఁ డయ్యె[8]ను బ్రభాకరతేజుఁడు ధర్మజుం డిలన్.

96 చ. కడుభయమంది [1]వానికిఁ దగన్ మఱి[2]వైశ్యులపోలె వశ్యులై
పుడమి నతి[3]ప్రసిద్ధులగు భూపతులెల్ల మహాధనావళుల్
దడయక తెచ్చి[4]యిచ్చి [5]కరదానము సేయుటఁ బార్థివత్వ మే
ర్పడియెఁ బ్రభాగ్రపుత్త్రునకుఁ బాండవతేజము [6]పర్వె నెల్లచోన్.

93 1. దీనికి నేకా రత – ల.స ; దీనికినేకాగ్రత — పీ స. అనేకాగ్రంతు తం దృష్ట్వాశకుని. ప్రత్యభాషత మూలము. భం 2-43-1२ 2 నేనుండగ – ఇ.ఈ ఒ 3. రాజులు నెల్లన్ – ల.

94 1. యని పలుకు – ఉ.ఛ.ఝ.

95 1. ఈవును – పీ.సం. 2. నెమ్మి – అ.ఊ ప ఘ ఝ ల ; నెన్న – క.వ ; యెందు – ఝ.పీ.శ.ష ; నెయ్యమెలర్పగనే యుగంబులన్ – ఉ ఓ ; నెన్నగనంబడ — భాసం. (వర్గయతి). 3 నంద [ది] ది – కొన్ని ప్రతులు ; నంగలయ పూర్వతరంబున నొప్పునిష్టభో – ణ. 4. మట్టిభో—ఖ ; మిట్టిభో—వ. 5. నమ్మహితాత్ముడు – గ. 6. దాని – కొన్ని ప్రతులు. 7. నెట్లు – అ ఊ జ ; నిట్లు – ల. 8. ను విభాకర– పెక్కుప్రతులు ; నుదివాకర — అ. (వ.భ. లకు యతి యగును) నొకొభాస్కర – ఎ.

96 1. దానికి [?] – కొన్నిప్రతులు. 2. ధన్యులు—ఈ.క. 3. ప్రతాపులగు—ఉ.ఓ.వ.స; ప్రసిద్ధిగల – ణ. 4. యొగొనుచు – ఔ.చ. 5 కడుదాస్యము—ఈ ; రవి–ణ.ల పీ; రది - స. 6. వెల్గెనెల్లచోన్ — ఒ ; పర్వెనెల్లెడన్ — ఐ ; పర్వెదిక్కులన్—ఐ

97 ఉ. యాదవుచేతి చక్రము భయంకరమై శిశుపాలమస్తక
చ్ఛేదము సేసినం గడుఁబ్రసిద్ధులు శూరులునైన రాజుల
య్యాదవుముందటన్ జయజయ[1]ధ్వను లిచ్చిరి గాని వానిశౌ
ర్యోదయవృత్తి [2]కట్టెదుర [3]నోపరయెవ్వరు [4]విక్రమింపఁగన్.

98 చ. అతులపరాక్రమార్జితములైన ధనంబులఁ పేర్మిఁ జేసి [1]యు
న్నతమగుచున్న పాండునరనాథతనూజులలక్ష్మి నాకస
మ్మత[2]మయి సూవెలింగె విను మాతుల మాన[3]ధనాఢ్యుఁడైన భూ
[4]పతి సహియింప నోపునె సపత్నుల[5]వృద్ధియు నాత్మహానియున్.

99 వ. [1]ఏమిసేయుదము పాండవులలక్ష్మి యెవ్విధంబున మనకపహరించి కొననగు ననిన దుర్యోధనునకు శకుని యిట్లనియె.

100 క. దీనికి ధృతరాష్ట్రనను, జ్ఞానము [1]వడయుడును మనకు సమకూరు ధరి
త్రీనాథ భవదభిప్రా, యానుగుణైశ్వర్యమతిశయం[2]బుగఁ బ్రీతిన్.

---

97 1. ధ్వనిచేసిరి — పెక్కుప్రతులు. 2. కంటెదుర — న 3. నోపరునెవ్వరు విక్రమంబునన్ — ఝ 4. విక్రమంబునన్ — పెక్కుప్రతులు.

98 1 యున్నతులగుచున్న— పెక్కుప్రతులు 2. మయివృద్ధిమై వెలిగె మాతుల— పెక్కుప్రతులు ; మయితద్దయున్ (పెద్దయున్)—ఉ.ఎ ఐ క.ఖ.గ డ.ల స. 3. నిధానుడైన— అ న 4. పతికిసహింపవచ్చునె—ఆ ఈ ఊ.గ.ఘ.ఝ.శ.ష స 5. పేర్మియు - వ పీ.శ.మ.

99 1. ఏమిసేయుదమనె [మె] వ్విధంబున పాండవుల లక్ష్మిన(య)పహరించి కొననగు ననిన — పెక్కుప్రతులు ; ఏమిసేయు వారమెవ్విధంబున పాండునృపతి సుతులలక్ష్మి యపహరించి మనకు గొనగవలయుననిన నాదుర్యోధనునకు నొనరనిట్లులనియె శకుని [ఆటవెలది]—ఈ—వచనమునకు మాఱుగాపద్యము.

100 1 వడయుటయు నీకు — అ.ఏ ; వడయుటను నీకు — ఓ.చ ; వడయుటయు (ను) మనకు — క.డ ; వడయుదము — ఉ.ఊ.ఒ.ఘ.ట.ణ.ల. 2. బుననీకున్ — వ ; బుగనీకున్ — అ.ఇ.ఈ. ఏ.ఐ ఔ.వ ; బగుబ్రీతిన్ — ణ ; బగునీకున్ — ఖ.

101 వ. అని యప్పుడ శకుని దుర్యోధనుం దోడ్కొని ధృతరాష్ట్రు [1]నొద్దకుంజని యాతని శరీర[2]కార్శ్యవైవర్ణ్యంబులు సెప్పిన విని [3]యదరిపడి ధృతరాష్ట్రుండు కొడుకు [4]నొడలంటిచూచి [5]కడుదుఃఖితుండయి యిట్లనియె.

102 సీ. కౌరవైశ్వర్యంబు గౌరవంబున [1]సమర్పితమయ్యె నీయంద పేర్మితోడ
ననుజులు మిత్రులు ననుచరులును నీకుఁ [2]ప్రీతులకాని యప్రియులు[3]లేరు
వివిధోపభోగముల్ దివిజేశునకుఁగల యట్టులకలవు నీ కనుభవింప
సకలభూపతులుఁ బాయకభక్తియుక్తులై [4]యొలసి నీపనుపు సేయుదురు [5]పేర్మి

ఆ. [6]నేమి గొఱఁతయయ్యె [7]నిట్లుడయ్యను దనుచ్ఛాయ దఱిఁగి యుండ సకలధరణి
రాజ్యభోగసుఖపరాఙ్ముఖత్వముఁ బొంద, నేల[8]నీకుఁ గురుకులేశ్వరుండ.

103 వ. అనిన[1]విని ధృతరాష్ట్రునకు దుర్యోధనుం డిట్లనియె

104 క. పాండవులవిభవమది యా, ఖండలు[1]విభవంబుకంటెఁ గడు[2]మిక్కిలియై
యొండొండ [3]పెరిఁగి దిక్కులు, నిండెఁ దదీయప్రతాప [4]నిర్మల[5]రుచితోఁ.

101 1. పాలికింబోయి—ఝ; పాలికింజని—ల. 2. కాంతి వివర్ణంబు—ఙ; కాంతి — ఈ.ఊ.ఓ.చ.ఛ ఝ.డ. 3. యదరిపడి — ఈ.ఉ ఊ.ఎ చ ఛ.ఝ 4 నొడలు తడ(డి) వి — ఇ.ఎ ఏ ఒ ఔ.క.చ.ఝ; నొడలు తడిమి వెదకి — భాసం. 5. కడు — కొన్ని ప్రతులలో లేదు.

102 1. సమర్పించితి నీయందు - ల. 2 ప్రియులర — ఈ. 3 గారు—ఙ. 4 బలసి — భాసం. 5. నెమ్మి — పెక్కుప్రతులు. 6. నేమిగొరత యయ్యె నీకు డయ్యంగ — అ (అఖండయతి); నేకొరంతయయ్యెనీకు డయ్యంగ — ఈ (ప్రాస యతి) 7 నింతతనుచ్ఛాయ దరిగి యుండ నేల ధరణిసకల - డ 8. నయ్యె—ఘ.

103 1. విని — పెక్కుప్రతులలో లేదు.

104 1. విభవమున కంటె గడునధికంబయి—ఈ.ల 2.నధికంబై — చ.వీ.శ; మిక్కుటమై — ఘ 3 బర్వె (ర్వి) — ఙ.ల. 4. నిర్మితరుచితోన్ — ఏ.ఔ. 5. రుచులన్ — కొన్నిప్రతులు; రుణముల్ — ఒ.క.ఖ.గ.డ; యశముల్ —ఆ.

105 క. సామాన్యమె యుత్తరకురు,భూములు మొదలుగ సమస్త[1]భూములు[2]విజయ
శ్రీమహిమను సాధించెఁ ద్రి,ధామపరాక్రముఁడు శక్రతనయుఁడు[3]బలిమిన్.

106 తే. సఖ్య[1]సంబంధములఁ జేసి చక్రధరుఁడు, ద్రుపదుఁడును దక్కఁ[2]దక్కిన నృపతులెల్ల
నరియుఁబెట్టనివారు లే రఖిలజలధి, వలయితక్షోణిలోఁ బాండవులకుఁ బ్రీతి.

107 తే. శైలకాననద్వీపవిశాల మయిన, వసుమతీచక్రమంతయు వారివశమ
యేను నొకరాజసుతుఁడనై యెట్లు[1]దీనిఁ, జూడ[2]నోపుదుఁ [3]బ్రాభవ శూన్యునట్లు.

108 తే. సన్నురత్నపరిగ్రహణంబునందుఁ, బాండ[1]వుండు నియోగించెఁ బార్థివేంద్ర
[2]సర్వరత్నా[3]కరైకప్రశస్తరత్న, పుంజముల కాస్పదము ధర్మపుత్త్రి గృహము[4].

109 తే. యజ్ఞదీక్షితుఁడయిన ధర్మాత్మజునకు, [1]గాడకాంభోజపతు లనేకప్రకార[4].
వర్ణ[2]కంబళములు శుకవర్ణవాహ, . . . దెచ్చియిచ్చిరి నెమ్మితోడ.

---

105 1 భూపతుల జయశ్రీ – చ. 2 వీరశ్రీ – ఇ 3. ప్రీతిన్ – ఏ ఔ ఘ.ల.

106 1 సంబంధమున – పెక్కుప్రతులు 2 దక్కటి — ట.

107 1 దీనిజూడ నెట్టులోపుదు ప్రాభవహీనునట్లు – క ఐ.గ. 2. నేర్తు ప్రతాప సంశూన్యునట్లు – అ.ఏ ఔ. 3. నభిమాన – ఛ.

108 1 వులునియోగించిరి–ణ. 2. సర్వసౌభాగ్య వస్తుప్రశస్తరత్నపుంజముల కాశ్రయము ధర్మపుత్త్రునగరు – ప స. 3. కరేంద్ర – కొన్నిప్రతులు ; కరంబు – ట 4. ఈ పద్యాంతమున మరియును అను వచనము. ఇ.ఒ ఘ.ల. ప్రతులలోఁ గలదు.

109 1. కాశి, కాంచి, కాంతి—అని భిన్నప్రతులు. మూలమున కాంభోజ మాత్రమే కలదు. 2. కములయిన సురుచిరవర్ణ — ఒ.ఖ.డ ; కంబళములును సువర్ణ – ఙ ; కంబుల శుకచారువర్ణ – ఛ.ఝ. కాంభోజః ప్రాహిణోత్ తస్మై పరార్ధ్యానపికంబళాన్ – భం. 2–45–19

110 ఉ. సాగర[1]సారవారిరుహశాక్తిక మౌక్తికవిద్రుమద్రుమై
లాగురుచందనంబులు ప్రియంబున నిచ్చిరి తెచ్చియున్నత
శ్రీగుణ[2]యుక్తిమైఁ [3]బరగు సింహళ కేరళ చోళ పాండ్య దే
శాగతరాజపుత్త్రిలు మహాగుణశాలి కజాతవైరికిన్

111 ఉ. [1]మందితసూర్యరశ్మి [2]రుచిమన్మణిహారచయంబుతోఁ గట
స్యంది సుగంధిదానజల[3]సంపద నొప్పెడువాని దేవకీ
నందనుఁ డిచ్చెఁ బ్రీతిఁ బదునాలుగువేలు గజంబుల జనా
[4]నందనకీర్తియైన యమనాథతనూజున కిష్ట[5]మిత్త్రుఁడై.

112 క. హరియును గిరీటియును నొం,డొరుల కభీష్టములు [1]సలుపుచుండుదు [2]రం
య్యిరువురు నేకాత్ములు జన, శరణ్యు లుత్తములు నిత్యసాంగత్యమునన్.

113 వ. మఱియు నయ్యుధిష్ఠిరున కనురక్తుండయి విరాటుండు రెండువేలు గజంబులు నిచ్చె ద్రుపదుండు [1]వేయిగజంబులను బదివేలుహయంబులను బదు నాలుగువేలువిలాసి[2]నీజనంబులం [3]బదివేలు [4]దాసీగృహస్థులనిచ్చెఁ గురు కుకు రోలూక కేకయ[5] కాశ్మీర కాంభోజ గాంధార మద్ర ద్రవిడ మాగధ మాళవ కళింగ గాంగ వంగ బంగాళ గౌడాంధ్ర కేరళ కోసలాంటి మహీశులును ప్రాగ్జ్యోతిషంబున భగదత్తుండును మరుకచ్ఛనివాసులును నీటివారు లును నాజానేయ బాహ్లిక హూణ పారసీయదేశంబులం గలవారునుంబులు

110 1. చారు — గ.వ.స. 2. యుక్తులైన — క.వ. 3. దనరు — [illegible] ; మెరయు — చ.

111 1. క్రందిన సూర్యరశ్మిరుచిరన్మణిహార — డ. 2. మణిమండన — [illegible]. 3. [illegible] నొప్పెడు (నొప్పిన) — ఉ.ఎ.ఒ.క.ఖ.చ ; సంగతి — ఇ.ఏ.ఓ.ఔ.ఝ ; సంపాతి — [illegible]. 4. నందిత - పెక్కుప్రతులు. 5. భృత్యుడై — ఔ.స ; పాత్రుడై — [illegible].

112 1. సేయుచుండుదు — కొన్నిప్రతులు. 2. రట్లయ్యిరువురు — [illegible].

113 1. పదివేల — ఎ.డ. ఇది మూలానుగుణము కాదు. 2. నుల (లు)ను — పెక్కుప్రతులు. 3. పదారువేలు దాసదాసీజనంబుల [నివహంబుల] - పెక్కు ప్రతులు. [ఇది మూలానుగుణముకాదు]. 4. దాసగృహస్థుల - [illegible]. 5. దేశములపేర్లు పెక్కుప్రతులలో భిన్నక్రమమున నున్నవి. కురు, ఉలూక, గాం ధార, ద్రవిడ, బంగాళ, గౌడఆంధ్ర, ఆజానేయ, పారశీయ, [illegible], కొంకణ, హిమశైల, రామశైల. ఇవి మూలమున లేవు కాని గాంధార

బర్వతనిభంబులైన యిభంబులను దివ్యాంబరాభరణభూషితంబు లయిన యోషిత్సహస్రంబులను నపరిమితంబులయిన యజావిగోమహిషంబులను హిరణ్యరత్నరజతకంబళాంబరాదుల నిచ్చిరి మఱియు మేరుమందర మధ్యకీచకవనవాసులయిన గుళింద పారద బర్బర తురుష్క కొంకణ కోంకణాధిపతులును వశగతులై హిమశైల రామశైల కురుదేశంబులైన కౌసుమక్షౌద్రపాత్రంబులను దివ్యౌషధంబులను నింద్రనీలేంద్రగోపపిక చంద్రమయూరకీరవర్ణ తురంగంబులను సౌవర్ణ కీటజ పట్ట జాండజ శయ్యలను నిశితదీర్ఘనిస్త్రింశంబులను మణికాంచన[6]ఖచితగజదంతమయ [7]శిబికాసనంబులను నిచ్చిరి వాసవసఖుండయిన గంధర్వపతి చిత్రరథుండను [8]వాఁడు నన్నూఱు గంధర్వహయంబుల నిచ్చెఁ దుంబురుం డనుగంధర్వుండు నూఱుహయంబుల నిచ్చె[9].

114 ఉ. భావిపురాతనాద్యతన పార్థివలక్ష్ములు పాండవేయుల
క్ష్మీవిభవంబుతోడ నుపమింప సమంబులు గా వశేషరా
జావళిలోన నత్యధికులైన సపత్నుల పేర్మిఁ జూచి యేఁ
జూచె సహింప నోపక కృశుండ వివర్ణుఁడ నైతి నెంతయున్.

115 ఆ. ఒక్కలక్షభూసురోత్తములు గుడిచిన, మొనసి[1] తనకుఁ దాన మ్రోయు[2] శంఖ
మొక్కనిమిష[3]మేని యుడుగక మ్రోసెన, య్యధ్వరోత్సవంబు నన్నినాళ్లు.

ద్రవిళగౌళ, కురుతురుష్క కొంకణ, కులుత, కులూత, మలయ, శబర, కాలశైల, అనుపేర్లు భిన్నప్రతులలో కనఁబడుచున్నవి 6. ఖచిత — పెక్కు ప్రతులు; రచిత — వా. 7. రథశిబికా — కొన్నిప్రతులు. 8. వాడేనూరు - కొన్ని ప్రతులు. (ఇది మూలానుగుణముకాదు) 9 పుష్పదత్తుండను (దంతుండను) గంధర్వుండు మున్నూరుహయంబుల నిచ్చె. చిత్రాక్షుండను గంధర్వుండు కామగమనంబులయిన వాని నేవురకు వేర్వేర నూరేసి హయంబుల, మున్నూట యేబండ్రు విలాసినుల నిచ్చెనదియును గాక — అని. ఉ.ఓ.ఛ జ.ఝ ల ప్రతులలో కలదు

115 1. యొక్కమారు మ్రోయుగంట — ల 2. ఘంట — అ.ఇ; భేరి — ఓ ఇవి మూలవిరుద్ధములు శంఖమనియే మూలము 3. మైననుడుగక — కొన్ని ప్రతులు.

116 సీ. జన్నంబుచూడంగ [1]సకలభూములనుండి వచ్చిన రాజన్యవరుల నవని
సురులను వైశ్యుల శూద్రులనాత్మీయ బంధు[2]సుహృద్వీరభటని యోగ
జనులను [3]బేదల సాధుల నిత్యంబుఁ [4]దాన పరీక్షించి తగ [5]వెలింగి
యన్నంబు దయఁబెట్టి యందఱుఁ [6]గుడిచినఁ దనుమధ్య యర్ధరాత్రంబు
[7]నపుడు

ఆ. గాని కుడువ[8]దట్టె కమలాక్షి ద్రౌపది, యదియుఁగాక యమ్మహాధ్వరమున
[9]నధముఁడయ్యుఁ గడుఁబ్రియంబున నభ్యర్చి, తుండ కాని[10]వంచితుండు
లేఁడు.

117 క. ధరణి హరిశ్చంద్రుఁడు భాసురయశుఁడయి చేసె రాజసూయం బదియున్
సరి[1]గాదని[2]యే వగతును, [3]సురుచిర[4]విభవమునఁ బాండుసుతుయజ్ఞము
తోన్.

118 వ. అట్టి రాజసూయాధ్వరంబున నవభృథ[1]సమయంబునందు బ్రహ్మర్షి రాజర్షి
[2]లోకపాల[3]పరివృతుండయిన [4]మహేంద్రుండునుంబోలె నున్న ధర్మతనయు
[5]నారదపారాశర్యాదిమహాముని[6]సమేతుండయి ధౌమ్యుం డశేషతీర్థ
జలంబుల [7]నభిషిక్తుం జేసిన.

116 1 సర్వదిక్కుల — పెక్కు ప్రతులు. 2. సుహృజ్జన — క.ఖ. 3. బేదలసాదుల — సూ ; బేదలసాదల — భాసం (సాదులు — ప్రతివచనాసమర్థులు), బీదల — అ ; బెద్దల — ఊ.ఏ.ఖ.గ; మరి పేదసాదల — ల. 4 దాని నిరీక్షించియు దగ — క.డ. 5. నెఱింగి—చ ఛ.ఝ శ.ష.స. 6. దనిసిన — పెక్కు ప్రతులు. 7. నందు గాని — ఈ.ఊ ఓ.ఝ ల శ ష 8. దట్టె — పెక్కు ప్రతులు ; 9 నల్పుడయ్యు — డ. 10. వారితుండు — స ; నార్చితుండు — ఖ

117 1. గాదనియుపమింపరు— వ ; గాదనిరి మునీంద్రులు — వీ శ.ష.స.శ. 2. యేవగ చెద — కఘా. 3 సురుచిర వైభవుడు పాండుసుతు యజ్ఞముతోన్—ణ. 4. రుచి పాండురాజసుతు — క.ఖ.

118 1 స్నాన సమయంబు - అ ఇ.ఊ.ఐ.ట. 2. లోకపాల — పెక్కు ప్రతులలో లేదు. 3 సమన్వితుండైన — ఏ.ఔ.ఝ. 4. సప్తర్షిలోకపాల పరివృతుండైన — ఎ.ట. ల ; దేవర్షిలోకపాల పరివృతుండైన — క.ఖ.ల. 5. పర్వతనారద — పెక్కు ప్రతులు. 6. పరివృతుండై — ట.ఔ చ.ఝ 7. నభిషేకించెనంత — ఎ.ఒ.క.ఖ ; నభిషేకించిన — ఓ.ఛ.ట.శ.ష

119 సీ. అభిషిక్తుఁ[1]డయిన యయ్యమరాజసుతునకుసాత్యకి మౌక్తికచ్ఛత్ర[2]మొప్పఁ
బట్టె భీముండును బార్థుండు మణిహేమదండచామరయుగధారు లయిరి
కమలనాభుండును గవలును ద్రుపదేశ[3]పుత్త్రిండు వేర్వేఱ భూమిపతుల
మూర్ధాభిషిక్తుల [4]మ్రొక్కించుచుండిరి దర్పంబు[5]వెలయంగ దానిఁ జూచి

ఆ. యేను మొదలుగా మహీపతులెల్లను, దీప్తిదఱిఁగి [6]యుండఁ దివిరి[7]మమ్ము
నగిరి కృష్ణపాండునందన [8]ద్రౌపదీ, సాత్యకులుఁ గరంబు సంతసమున.

120 వ. మఱియు నయ్యు[1]ధిష్ఠిరుండు.

121 సీ. అనఘుఁడై [1]యెనుబదియెనిమిదివేవురు బ్రాహ్మణప్రవరుల బ్రహ్మవిదుల
వెలయంగ [2]నల్లిండ్ల నిలిపి ప్రత్యేకంబ ముప్పండ్రుదాసుల నొప్పనిచ్చి
ముదముతో [3]రక్షించుఁ బదివేవురుత్తమ భూసురు [4]లతనియగ్రాసనమునఁ
గలధౌతమయపాత్రములఁ బ్రతిదినమును [5]గుడువను[6]గట్టను దొడువఁ
బూయ

ఆ. ననుభవింపఁ[7]గలుగుటదియేమి పురుషార్థ,[8]మయ్యు[9]కష్టపురుషు నట్టులోరుల
[10]పేర్మిఁజూచుచుండఁ బెద్దయు[11]నేనోప, ననినఁ బతికి నిట్టులనియె శకుని.

---

119 1. డైయున్న యమరాజ - పెక్కు ప్రతులు. 2 మమర - అ ఐ.ల. 3. తన యుండు వేర్వేర ధరణి పతులు - ట 4. మ్రొక్కింపుచుండిరి - ఎ ఏ.ఔ.ఖ.గ 5 మెరయంగ - ఎ క.డ. 6. యున్న - పెక్కు ప్రతులు. 7. నన్ను - ట. 8. ద్రుపదేశ - ట , ధృష్టద్యుమ్నః పాండవాశ్చసాత్యకిః కేశవోఽష్టమః — భం. 2-49-18.

120 1. ధిష్ఠిరు మాహాత్మ్యంబు వినుము - ఉ.ఓ.ఛ ఝ.

121 1 యెనబది — రూపము పెక్కు ప్రతులలో గలదు. 2 నన్నిండ్లు - ఏ.ల.ష ; నిల్లిండ్ల — ఇ ట 3. రక్షించె - పెక్కు ప్రతులు. 4. లకు నిర్మితాసనముల — క.డ. 5 గుడుతురు - పెక్కు ప్రతులు 6. వారికి గుడువగట్టి — ఆ.ఘ.శ.ష ; గట్టను ముడువ దొడువ — ట ణ.ప. 7 గల్గుడదియేమి — అ ; గలుగుడదియేమి— ఈ ఐ.ఔ. 8 మయ్యో — ఇ ఈ.ఉ ఊ ఏ.ఔ.ఝ.ణ 9. యల్ప — ఆ.ఇ. 10 కలిమి జూచుచుండగా సెట్టులోపుదుననిన — ణ.వీ ; యొప్పుజూచుచుండ నోపుదు నేనెట్టులనిన—ట, చుండ నిర్మించె విధి నన్ను. 11. ననిన శకుని యిట్టులనియె బతికి — ఏ.ల.శ.ష స.శ.

122 క. [1]భానుప్రభులగుపాండు మ,హీనాథాత్మజులలక్ష్మి యెల్లను[2]నీకున్
నే నపహరించి [3]యిత్తు ధ,రానుత మాయాదురోదరవ్యాజమునన్.

123 వ. ధర్మతనయుండు జూదంబునకుఁ బ్రియుండుగాని యందుల [1]యుక్తిప్రవం బెఱుంగం డే నక్షవిద్యయం దతి[2]దక్షుండ నాతని నక్రమంబున [3]నోడించి తదీయరాజ్య [4]విభూతి నీకిచ్చెద వగవకుండు[5]మని పలికిన శకునిపలుకు లకు [6]సంతసిల్లి దుర్యోధనుండు దండ్రిపాదం[7]బులపయిం బడి మ్రొక్కి యీశకుని మతంబున కొడంబడవలయు ననినఁ గొడుకునకు ధృతరాష్ట్రుం డిట్లనియె.

124 క. [1]ధీరమతి విదురుతోడ వి,చారింతము వాఁడు నయవిశారదుఁడు కళా పారగుఁడు [2]దీర్ఘదర్శి య, పారహితారంభుఁ డుభయపక్షంబులకున్.

122 1. దానవ్రతులగు — ఘ ; భానుప్రభులైన పాండవ మానము రాజ్యంబు లక్ష్మి మానుగ నీకున్ - చ. 2. దగనీకే — ఒ క.ఖ గ.ఙ. 3. యిడుదు - ఙ

123 1. యుక్తి విశేషం — ఎ.ఒ.క.ఖ డ. 2. కుశలుండ — పెక్కు ప్రతులు. 3. నోర్చి - క.డ ; నొడిచి - ఐ. 4. విభవంబు — ఎ ఒ.క.ఖ.డ.ఙ. 5 మనిన శకుని— పెక్కుప్రతులు. 6. సంతోసిల్లి — అ.భాసం 7 బులకుమ్రొక్కి — అ.ఏ.ల.

124 1. ఈ పద్యమునకు ముందు 'ఈ' ప్రతిలో నధికముగ నీ క్రింది పద్యమును, వచనమును గలవు.

క. ఈశకుని యక్ష విద్యా
కౌశల్యుఁడు పాండుసుతనికాయశ్రీమా
యాశక్తి నొడుచు గురు వం
శేశా యొడఁ బడుము దీని కిప్పుడు నెమ్మిన్.

వ. అనిన ధృతరాష్ట్రుండు కొడుకు కిట్లనియె.

2. దూరదర్శి — ఆ ఎ ఐ ; సముడు ధర్మప్రారంభ విశాలు — ఈ.

125 వ. సురపతిగురుండైన బృహస్పతి సేసిన నీతి[1]శాస్త్రరహస్యంబులం దెవ్వరి కంటె విదురుం[2]డెంతయు విశారదుం డాతని బుద్ధిబలంబునను నాపగేయు [3]బాహుబలంబుననుం జేసి యీ రాజ్యతంత్రంబు [4]వర్తిల్లు చున్నయది [5]గావున నవ్విదురానుమతంబున నెగడుట [6]లగ్గగు ననిన [7]దుర్యోధనుం డిట్లనియె.

126 తే. పాండుపుత్త్రుల కెప్పుడుఁ బక్షపాతి, విదురుఁడని [1]చెప్పఁదొల్లియు విందు దీని నెఱిఁగి వారించుఁ గాకతఁ[2]డేలశకుని. [3]కైతవంబున కొడఁబడుఁ గౌరవేంద్ర.

127 తే. దీని కొడఁబడు మొడఁబడవేని[1]నేఁడ, యీ ఋణము సర్వభక్షుచే భక్షితుండ నగుదుఁ [2]దెల్లమే నట్లైన వగపు దక్కి, విదురుఁడును నీవు నుండుఁడు ముదముతోడ.

128 క. అని [1]కడు [2]నడలుగఁ బలికిన, వినిధృతరాష్ట్రుండు [3]దుఃఖవివశాత్మకుఁడ య్యును [4]నెదనది యుచితముగాఁ,దని వగచుచు నాత్మజునకు నాహ్లాదము గన్.

129 వ. అప్పుడు వేవురు శిల్పాచార్యుల రావించి కనక[1]రత్నఖచిత స్తంభసహ స్రంబులను విచిత్రద్వారశతంబులను వివిధరత్న[2]రుచిరప్రదేశంబులనుం

125 1 శాస్త్రంబులం దందరికంటె — డ; శాస్త్ర రహస్యంబులందు నందరికంటె — ఐ.ఒ.క ఖ.గ. 2. డుతద్దయు — పెక్కు ప్రతులు. 3 భుజా - ఆ.ఉ.ఒ క.ఖ. 4. ప్రపర్తిల్లు - ఆ.ఇ ఎ.ఏ.ఒ.ఔ.ఖ గ జ.ఝ.ట.ల, వర్ధిల్లు - చ.ఞ. 5. గావున విదురా - పెక్కు ప్రతులు 6. లగ్గనిన - పెక్కు ప్రతులు. 7. విని దుర్యో - కొన్ని ప్రతులు.

126 1. తొల్లియును చెప్పవిందు - కొన్ని ప్రతులు. 2. డిపుడు శకుని కార్యమునకేల యొడబడు - అ ఈ.ఊ.ఏ ఔ ఘ.ఝ 3. కార్యమునకెట్లొడంబడు - జ; కార్య మున కిప్పుడొడబడు — ఉ.ఖ.గ ష; కార్యమునకు నొడంబడు - ట

127 1. యధిప (నధిప) — ఎ.ఒ.క.ఖ డ.స. 2. దలపోయ నిట్లైన వగయుదక్కి — ఞ.

128 1. కొడుకడలుచు - అ.ఞ 2 నడలుచు - పెక్కు ప్రతులు ; నడలున — సం. 3. శోక — కొన్ని ప్రతులు. 4. నిదితగ నుచితము — డ.

129 1. రత్న — పెక్కు ప్రతులలో లేదు 2 రచిత — ఆ.ఓ.శ.ష ; ఖచిత — వీ ;

చేసి రమ్యంబుగా నొక్కసభ నిర్మింపం బనిచి యొక్కనాఁ [3]డేకాంతంబ విదురునకు శకుని దుర్యోధనుల యభిప్రాయంబు చెప్పిన విని [4]యతండు విస్మితుండై [5]కలిద్వారసమీపంబగుటయు జూదం బఖిల[6]ప్రజాక్షయ[7]కరం బగుటయు నెఱింగి ధృతరాష్ట్రున కిట్లనియె.

-: విదురుఁడు ధృతరాష్ట్రునితో జూదమాడఁ దగదనిచెప్పుట :-

సం. 2-51-23

130 ఆ. ఇట్టి కార్యమునకు నే[1]నవశ్యంబును, నొడఁబడంగ నోపనుక్కివమున
సుతులతోడ [2]నేల సుతులకు [3]భేదంబు, సేయఁ[4]గడఁగి తిదియుఁ [5]జెట్ట
యనక.

131 తే. ఒలసి [1]నీపుత్త్రులెల్లనొండొరులతోడ, నెట్లొడంబడి యుండుదు రట్లచేయ
వలయుఁ దమలోన జూదంబు [2]వాదునగుటఁ, గలహమూలంబ యెట్టి
కాంతులకునైన.

132 వ. నీ నేర్చు [1]విధంబున [2]శకునిదుర్యోధనుల దుర్వ్యవసాయం బుడిగించి యిక్కురువంశంబు రక్షింపుమనిన విదురునకు ధృతరాష్ట్రుం డిట్లనియె.

విచిత్ర-ఘ ; విచిత్రితంబుగా నొక్క సభ-ణ 3. దేకాంతంబున - కొన్నిప్రతులు 4 విదురుండు — పెక్కు ప్రతులు. 5. కలిద్వాపర — పెక్కు ప్రతులు; కలియుగ ద్వాపర సంధి యగుటయు — ట, కలిద్వాపర సమీపంబగుటయు-భాసం.
తచ్ఛ్రుత్వా విదురోధీమాన్ కలిద్వార ముపస్థితమ్
వినాశ ముఖముత్పన్నం ధృతరాష్ట్ర ముపాద్రవమ్॥. భం. 2-45-50
6 రాజ ప్రజా-అల. 7. మూలం బగుటయు, కారణం బగుటయు-భిన్న ప్రతులు.

130 1. నెట్టిభంగిని — ఓ. 2. పాండుసుతులకు — ఇ.ఉ ఖ.చ.వీ శ.స. 3 వైరంబు — ఉ.ఎ ఒ.క.ఖ.ట.ల.వీ.శ ష స. 4 దలచె దిదియు — వీ.శ.ష; గడగితీవు — ఉ.ఊ. ఏ.ఒ.ఔ.గ.ఘ.ల. 5. జేటుగాదె — ఎ.స ; జెడ్డయనక — డ.

131 1. వారు నీపుత్త్రులొం — వీ.స. 2. వాదమగుట — ఎ.ఏ.ఒ.క.ఖ.గ.చ.ట.శ ష.

132 1. నుపాయంబున-అ.ఉ ఒ.ఘ.ల. 2. శకునికై తవంబును దుర్యోధను - ఐ.ఓ.గ.ణ.

133 ఉ. పుత్త్రిల కేలభేదమగు ఖ్యానుత [1]యేనును నీవు జాహ్నవీ
పుత్త్రుఁడునుండఁగా నహితముల్ [2]భయముల్ దొరకొన్నె నాకు నా
పుత్త్రిలకుం [3]బ్రసాదకృతబుద్ధులు [4]వేల్పులు గాన దీనికిన్
మిత్త్రనిధీ యొడంబడుము మిన్నక సంశయ మందనేటికిన్.

134 వ. వడిగలతురంగంబులం [1]బూనినరథంబెక్కి యింద్రప్రస్థపురంబునకుం జని యిందులకు ధర్మ[2]నందనుం దోడ్కొనిరమ్మని విదురుం బంచిన నాతండును నావగేయున కంతయు నెఱింగించి యిది [3]యపకర్మం [4]బనుచుండె నిట ధృతరాష్ట్రుండు దన నిర్మింపం బంచినసభ దుర్యోధనునకుం జూపి యాతని కేకాంతంబున నిట్లనియె.

135 క. జూదమిదియేల [1]దీనను, భేదముమీలోనఁ బుట్టుఁజెలుచన యుష్మ
ద్భేదమునఁజేసి యెగ్గు,శ్వాది[2]ల్లు ధరిత్రిఁబ్రజకు భయ[3]జననంబై.

136 ఉ. ఇమ్మహి నీవుఁ బాండవులు నెప్పటియట్లపరస్పరాను రా
గమ్మున నేలు[1]చున్కి యిదికార్యము పాండవలక్ష్మి నీకస
హ్యామ్మన నేలవంచనఁ బదార్థ పరిగ్రహబుద్ధిఁ జేసి పా
పమ్మగుఁ బాప[2]కారుల[3]కుఁ బాయు నవశ్యము [4]నర్థధర్మముల్.

133 1. నీవును నేను — పెక్కు ప్రతులు. 2. దొరకొన్నె మదిందలంపనా — ల. 3. ప్రశాంత — ఉ.ల.స. 4. వేల్పుల (లె) కారె కావునన్ — పెక్కు ప్రతులు.

134 1. బూన్చిన — ట.ణ శ.ష. 2. తనయుం—పెక్కు ప్రతులు. 3. యవకార్యం—ఒ ; యకార్యం — ఉ.ఓ ; కర్జంబుకాదని — పీ శ.ష ; యకర్మం — ణ ; యకర్జంబను—భాసం 4. బనుచుం జనియె — ట.

135 1 యుదుగుము — అ.ప.ఔ.క.ఖ.డ.ణ. 2. ల్లును మిగుల—వ 3. జనకంబై - ఉ.చ.ఝ.పీ.

136 1 చుండుటిది — ఆ.ణ ; చుండుడిది – ఊ ఏ.ఔ.ఘ ; చుండుటది—ల. 2. కరులకు — ఒ క.ఖ గ.డ. 3. కవశ్యముపాయును — చ. (ప.వ. లకుయతి) 4. న ధర్మువుల్ — అ.ఏ.ఐ.ఒ.ఔ.ఖ గ.ఝ వ

137 వ. [1]ధర్మాధర్మవిదుండైన విదురున కిది సమ్మతంబుగాదు ధర్మజు ధనసంపద కంటె [2]నేనుమడుంగులు నీకు ధనసంపద గలదు వానిచేసిన యజ్ఞంబు కంటె [3]విశేషంబుగా దక్షిణలిచ్చి నీకిష్టం బయిన యజ్ఞంబు సేయుము నీకును భూలోకంబునంగల రాజు[4]లెల్లం దమ[5]సర్వస్వమ్ములుం దెచ్చి యిత్తు రనిన [6]విని దుర్యోధనుండు దండ్రి కిట్లనియె.

138 క. [1]ఇమ్ముల ధర్మజుతో జూ,దమ్మాడఁగఁ [2]గాన్ప నాకు ధరణీశ్వర య
జ్ఞమ్మదియ సమస్తైశ్వ,ర్యమ్ములు వడయంగ [3]నుపాయ మభిమత[4]బుద్ధిన్.

139 క. [1]మీ రిందుల కందఱుఁ జను, దేరఁగ నే నంద యుండితిని సభ చూడన్
ధారుణి నట్టి[2]యపూర్వస, భారచనలు [3]వినఁగఁ జూడఁబడ [4]వెవ్వరిచేన్.

140 వ. [1]నిర్మలస్ఫటికశిలానిర్మితంబై [2]శశిప్రకాశంబై [3]వివిధరత్నప్రభా[4]భాసురంబైన యాసభ[5]విభవంబు [6]చూచు వేడుక నందుఁ గ్రుమ్మరువాఁడ [7]హరినీల బద్ధస్నిగ్ధమణిస్థలంబునందు [8]జలబుద్ధిం జేసి పరిధానోత్కర్షణంబు సేసి [9]విమలశిలాతలబుద్ధి నుదకపరిపూర్ణం బయిన [10]వాపి సొచ్చి కట్టినపుట్టంబు

137 1 ధర్మార్థవిదుం — పెక్కు ప్రతులు 2 నినుమడుంగులు — కొన్ని ప్రతులు ; నిను మణుగు — భాసం. 3 మిక్కిలి విశేషం—ఇ.ఈ ఉ.ఊ.ఎ.ఏ.ఐ.ఓ.ఔ.గ.ఘ.ఝ. 4. లెల్లను దమతమ—కొన్ని ప్రతులు 5. సర్వధనంబు – అ.ఏ.ఔ ; సర్వసంపద– ఓ.ఖ. 6. విని — పెక్కు ప్రతులలో లేదు.

138 1. నెమ్మిని – ఆ ఘ.శ ష. 2. గాన్పు – పెక్కు ప్రతులు , నాకు గలుగ — ఞ ; వలయునాకు – ల ; గనుట చువ్వె — ఔ. 3 దగునుపాయముబుద్ధిన్ – క.ఖ.డ. 4. సిద్ధిన్ — ఆ.ఈ.ఊ.ఏ.ఝ.శ.ష.

139 1. మీరందరు నిందుల కరుదే – ఒ గ. 2 విచిత్ర — పెక్కు ప్రతులు 3 గలవె చన్న పార్థివుల కిలన్—శ.ష స ; గలవె చెప్పపార్థివుల కిలన్ — అ. 4 దెవ్వరికన్ — ఇ.ఊ.ఎ.ఏ.ఓ.ఖ.చ.ఝ.ఞ.

140 1. అదియెట్లనిన నిర్మల — ఉ.ఝ.ల 2 శశిప్రకాశంబై — కొన్నింట లేదు 3. వివిధ·రత్న సువర్ణమయ ప్రభా — ల , వివిధసువర్ణరత్నమయప్రభా — కొన్ని ప్రతులు. 4. భాసితంబైన — కొన్ని ప్రతులు. 5. యొప్పుచూచు– పెక్కు ప్రతులు 6. చూచుచు గ్రుమ్మరవాడ–ఉ.ఛ.జ. ప్రతులు తప్ప తక్కినవానిలో. 7. హరి — కొన్నింట లేదు 8. జలబుద్ధిం జేసి — ఏ.ఛ.జ ప్రతులలో తప్ప తక్కిన వానిలో లేదు ; జలాశయంబుగా వగచి — అ.ఐ.ఔ.ల. 9 నిర్మలశిలాబుద్ధిన్ — ల.ఞ ; విమలమణిశిలాబుద్ధిన్ — ఆ.ఉ.ఊ.ఓ.శ.ష. 10. వావి — పెక్కు ప్రతులు.

దడియం ద్రెళ్ళిన నన్నుం జూచి వృకోదరుండు [11]నగియె దాని నంతయు నెఱింగి ధర్మరాజచోదితు లయిన కింకరులు నాకుం బరిధానంబులు దెచ్చి యిచ్చిరి మఱియు వివృతద్వారంబుఁ [12]గవాటఘటితం బని చొర నొల్లక [13]కవాటఘటితంబు వివృతంబుగా వగచి చొరం బోయి తత్కవాటస్ఫటిక[14]శిలాఘట్టితలలాటుండ నైన[15]నన్నుం జూచి యనేక సహస్రవిలాసినీపరివృత యయి[16]యున్న ద్రౌపది నగియె నంత నకుల సహదేవులు పఱతెంచి [17]యిదె వాకిలి [18]యిట వచ్చునది యని నన్నుం దోడ్కొని [19]పోయి రట్టి సభాప్రలంభంబు నాకు హృదయశల్యం బయి యున్నది.

141 క. పెద్దలు హీనతఁ బొందిరి, తద్దయు [1]హీనులు సమృద్ధిఁ దనరిరి [2]నియమం
బెద్ది విధియోగమున కసు, హృద్దర్పోన్నతులు సూచి యెట్లు సహింతున్.

142 క. పరమసుఖోపాయంబునఁ, బరసంపద చేకొనంగఁ బడునేని నరే
శ్వర యంతకంటె మిక్కిలి, పురుషార్థం [1]బెద్ది యొండు [2]భూనాథులకున్.

143 క. నముచి యనుదనుజుఁ డుగ్రత,పము సేయుచు నున్న [1]వాని [2]బలమథనుఁ డధ
ర్మమున వధియించె రిపు[3]ప,క్షము [4]నెమ్మెయి నైనఁ జెఱుపఁ గావలయు
[5]నిలన్.

11. నగియెనంత రాజచోదితు – పెక్కు ప్రతులు. 12. సంవృత ద్వారంబని – ఝ.డ.వి.శ.ష. 13 వివృతద్వారంబు సంవృత ద్వారంబని – ష, సంవృత ద్వారంబు వివృత ద్వారంబని – శ. 14. శిలాపట్ట ఘట్టిత – ఔ.గ. 15 నన్ను ననేక – ఔ.గ 16. యుండి – కొన్ని ప్రతులు. 17. యిది – పెక్కు ప్రతులు. 18 రమ్మని – క ఖ.డ ; యిట విచ్చేయుమని – ఏ.ఔ. 19. చనిరట్టి – కొన్ని ప్రతులు.

141 1 పిన్నలు – ఐ. 2. నీయందెద్దియును నెరుకలేదు — ఆ.ఊ ఒ.ఘ.

142 1. బొందుగలదె — ఇ.ఈ ఎ.చ.వ ; బెద్దితెలియ – ఐ. 2. భూపాలురకున్ – ఔ.ఝ.వ ; భూపాలులకున్ – ఉ.

143 1. దేవపతి యింద్రుడధ — చ 2. బలవైరియ — ఉ ; బలధమనుడధ — ఘ.ఝ. 3. వర్గము — ఈ ఎ ఒ.ఘ ; సంఘము — చ.ఛ.ఝ. 4. నేవిధినైన నిలుపగా వలదు మహిన్—క.ఖ ; నేవిధినైన—ల. 5. మతిన్, మదిన్, మహిన్, దుదిన్ — ఇట్లు భిన్న ప్రతులు.

144 ఆ. అల్ల్పుఁడయ్యు [1]మనుజుఁ డతిపరాక్రమమున, పేర్మిఁ దరతరంబ [2]పెరుగుచున్న
వాఁడు మ్రాని మొదలివల్మీక [3]మమ్రానిఁ, జెఱుచునట్లు గడఁగి చెఱుచుఁ [4]బగఱ.

145 తే. అహిత[1]వృద్ధి యుపేక్షితం [2]బగుడు నల్ప, మగు మహావ్యాధియునుబోలె నది యసాధ్య
[3]మయి యుపేక్షకు నిర్మూలితాత్మఁ జేయుఁ, గాన [4]పాండవశ్రీ యుపేక్ష్యంబుగాదు.

146 వ. దాని నెవ్విధంబున నయిన [1]నపహరింపవలయు నట్లు గానినాఁడు నా హృదయ [2]తాపంబున కుపశమనంబు [3]గా దనిన దుర్యోధనునకు శకుని యిట్లనియె.

147 సీ. నాగరథాశ్వసన్నాహ మొనర్పక యొడ్డనంబులు దీర్ప కుభయసైన్య
వీరులకరముల వివిధాయుధంబుల నన్యోన్యసంఘట్టనారవంబు
లెసఁగంగ సంగ్రామ మేర్పడఁ జేయక యక్ష[1]ముల్ దొలిచి యే నశ్రమమునఁ
[2]బ్రతిపక్షతతుల సంపదలు జయించి నీ కిచ్చెద వగవంగ నేల ధర్మ

ఆ రాజుఁ బ్రీతితోడ రావించి యతనితోఁ, గడఁగు జూద మాడఁ గౌరవేంద్ర
యొండుపాటఁ బాండవోన్నతి వేల్పుల, కయిన [3]నపహరింప నలవి గాదు.

144 1. నధికుఁడై పరా — ఎ ఒ క.ఖ.గ. 2. పెరుగునేని — ఛ ; పెనగునేని — ఝ. 3 మైమ్రాను — ఊ.ఓ. 4. బరుల — ఆ.ఊ.ఎ ప.ఔ ఘ పి.శ ష

145 1. వృత్తి — ఎ 2 బై యపాయమగు — ఎ, బై యపథ్యమై — ఒ ; బై కవిష్యమగు - క.ఖ.డ ; బగుడుజాడ్యమగు — శ ష.స; బగుడుజాడ్యమది — ల; బగుడు భయదమగు — స ; బగుడు-రోద్యమగు — ఆ.ఈ.ఊ.ఐ.గ ఘ.ణ 3. మైయుపేక్షకు — ఈ.ఎ.ఘ ఝ , మయ్యుపేక్షకు — ణ. 4 వారి నుపేక్షింపగాదు మనకు — అ.ఒ.వీ శ ష స.

146 1. నుపేక్షింపక యుపాయంబుననప — ఎ.ఒ ; నుపేక్షింపక యే (నే) నప — ఖ.డ. 2. రోగంబు — పెక్కు ప్రతులు 3. లేదని — అ ఔ.క.ఖ.గ.వీ శ ష

147 1. ములొడ్డియే (నే) — ఉ.ఓ ; ముల్ దాల్చి - ఐ.ఘ.వీ.శ.ష 2 పరమహీపతుల — శ ష.స ; బ్రతిపక్షపతుల — అ.ఇ.ఉ.ఏ.ఐ.ఓ.ఔ.క.ఘ.జ. 3 దొడరిగెలువ నలవికాదు — జ న.

148 వ. అనినఁ [1]ధృతరాష్ట్రుండు దాని [2]కొడంబడ నొల్లక యేను విదురుశాసనంబున [3]వర్తిల్లుచున్న వాఁడ నాతండర్థార్థవిదుండు [4]సకలకార్యసమర్థుండు జూదంబున విగ్రహం బగు ననియె బలవంతుల[5]తోడి విగ్రహంబు పరిహరించుట [6]లగ్గు నావచనంబు ధర్మోపేతంబు దీని నతిక్రమించి యనుతాపంబు సేయక [7]యిప్పుడు జూదం బుడిగి యెప్పటియట్ల యుండుట కార్యం బని[8]న విని దుర్యోధనుం డతని కిట్లనియె.

149 క. తన[1]కార్య మొరుమతంబున, [2]నొనరింపఁగ నేర నగునె యొరుని మతంబుం దనమతము [3]నొకఁడు గా[4]నొ.పునె చెచ్చెర [5]నిశ్చయింపఁ బోలునె[6]దానిన్.

150 ఆ. విదురుమతము పాండవేయహితార్థంబు, వానిబుద్ధి[1]నెగడ వలవ దన్యపక్షపాతబుద్ధిఁ బరగు[2]చు నుండెడు. నట్టివాని నాప్తుఁ డనఁగ [3]నగునె.

151 వ [1]జూదం బన్నది పురాణంబులయందును [2]వినంబడు దీన దోషంబులేదు [3]సుహృద్ద్యూతంబున [4]దేవతలు దేవసాయుజ్యంబు వడయుదురు గాన దీనిం బ్రవర్తింప శకుని కానతిచ్చి యిందులకు ధర్మనందను రావింపవలయు

148 1. వినిధృత — అ.ఉ ఒ ల 2 వినవొల్లక — క.ఖ. 3 ప్రవర్తిల్లు — పెక్కు ప్రతులు, వర్తిల్లు దునతండర్థ — క.ఖ 4 సకల కార్యసమర్థుండు — పెక్కు ప్రతులలో లేదు. మూలమునను లేదు 5. తోటి — ఇ ఒ.ఖ ; తోడివైరంబు కొరగాదు దానింపరి — ఓ ఛ జ ఝ 6 మేలు — ఎ ఒ.క.ఖ.గ.డ. 7. యిప్పుడుడుగుట కార్యంబనిన— పెక్కు ప్రతులు, యిప్పుడు జూదంబుడిగి యనుకూలుండవగుట కార్యం — ల 8 నదుర్యోధనుం డిట్లనియె — పెక్కు ప్రతులు.

149 1 కార్యంబొరుమతమున — కొన్ని ప్రతులు 2 నొనరించుట యుక్తమగునె — ఎ ఒ ఖ. 3. నొక్కటిగ నొప్పునె — అ.ఉ.ఎ.క ఖ , నొక్కటిగానో — కొన్ని ప్రతులు. 4. నేర్పునజెచ్చెర నిర్వహింప — స ; నేర్పునఁ జెచ్చెర — వీ. 5. నిర్వహింప — ఈ.ఎ.ఒ క.ఖ గ స. 6 చెప్పమా — వీ శ.ష.స , బుద్ధిన్ — ట.

150 1. నడువ — క.ఖ. 2. చుండెడువాని నాప్తుడనగదగునె యవనినాథ—శ ష. 3. జనునె — అ.ఉ ఘ ల ; దగునె — అ గ.ఘ ఙ.శ.ష.

151 1. జూదంబు పురాణం — పెక్కు ప్రతులు. 2. చెప్పంబడు — ల. 3. సుహృద్ద్యూతంబున దేవలుండు ధర్మంబులు వడయుదురని చెప్పెగావున — ట ; సుహృద్ద్యూతంబున ప్రవర్తిల్లుట ధర్మంబు పెద్దయందురు — అ.ఇ ; సుహృద్ద్యూతంబున వత్వంబును ధర్మంబును వడయుదురు — ఉ. 4. దేవతలు — కొన్ని ప్రతులలో లేదు. స్వర్గద్వారం దీవ్యతాం నోవిశిష్టంతద్వర్తినాం చాపితదైవయుక్తమ్ —

ననిన ధృతరాష్ట్రుండు పెద్దయుం బ్రొద్దు [5]చింతించి యెట్టకేనియు [6]దాని కొడంబడి విదురుం బిలిపించి వాని కిట్లనియె.

152 చ. అనుపమరత్నకాంచన[1]చయాంచిత మీసభ దీని ధర్మనం
దనుఁ డనఘుండు దానుఁ దనతమ్ములు నిందుల కేఁగుదెంచి చూ
చినఁ గడు [2]సంభ్రమం బగు విశిష్ట[3]జనస్తుత నీవు [4]వానిఁ దో
డ్కొని చనుదెమ్ము భూసురసఖున్ బుధబంధుజనానురంజనున్.

153 వ. [1]ఇట్టి విచిత్రరత్నసభావేదికాతలంబున [2]నతండును దుర్యోధనుతోడం బ్రొద్దుపోక సుహృద్ద్యూతం[3]బుఁ బ్రవర్తించు ననిన [4]విని విదురుండు విషణ్ణహృదయుండయి మాయాదురోదరంబు [5]దురర్థంబుగాఁ జింతించి దీని నుడిగి యుభయపక్షంబులకు లగ్గగు నని పెక్కుమాటలు [6]వారించి

*—: విదురుఁడు ధర్మరాజుం దోడ్కొని వచ్చుట :—*

సం. 2–52–1

154 క. అనిలంఘనీయ మిదు, ర్వ్యవసాయం బనుచు సత్యవచనుఁడు ధర్మా
[1]ర్థవిదుం డప్పుడు ధృతరాష్ట్ర[2]విధాతృని యోగమున కొడంబడి [3]యంతన్.

ధం 2-51-12 5. విచారించి — కొన్ని ప్రతులు. 6. దాని కొడంబడి — క డ. ప్రతులలో లేదు

152 1. సుయాంచిత — భాసం; పెక్కు ప్రతులు; చయి న్విత — ఈ.ఉ.ఓ; సముంచిత — అ. 2. సంభ్రమం — ఆ ఇ. 3 బుధస్తుత — డ. 4 వానితో — పెక్కు ప్రతులు

153 1 ఈ విచిత్ర సభావేదికాతలంబున — పెక్కు ప్రతులు. 2. నతండు దుర్యోధనుతోడం — పెక్కు ప్రతులు. 3 బున ప్రవర్తించు — ఉ, బు బ్రవర్తించునది యనిన — ఈ ఎ ఖ గ.ఝ డ. 4. విని — కొన్ని ప్రతులలో లేదు 5 దురుక్తంబు- ఆ ఇ ఈ.ఉ ఊ ప ఔ, దుస్తరంబని — ఝ శ.ష. 6. ప్రార్థించి — ఔ; చెప్పియు వారింపనేరక — ఝ.

154 1. ర్థవిదుడు విదురుడు — అ.ప.ఓ ఔ.క.ఖ. 2 విభుని యోగంబునకు నొడంబడి యెమదిన్ — ఉ.ల. 3. యెమదిన్ — పెక్కు ప్రతులు.

155 క. [1]ఇంద్రప్రస్థపురంబున, [2]కింద్రగురు[3]ప్రతిభుఁ డరిగి [4]యింద్రసమానుం
[5]జంద్రయశు ననుజసహితు [6]న్నృపేంద్రుని ధర్మ[7]సుతుఁ గాంచె నెంతయుఁ
ప్రీతిన్.

156 వ. [1]అతనిచేత నభ్యర్చితుం డయి కుశలం బడిగి నిజాగమనప్రయోజనం బెఱిం
గిం[2]చిన విని విదురునకు ధర్మతనయుం డిట్లనియె.

157 సీ. పుత్త్రవత్సలుఁడు విచిత్రవీర్యాత్మజుఁ డార్యుండు[1]ధృతరాష్ట్రుఁ డాదరించి
[2]నిన్ను నియోగించె నన్నుఁ[3]దోడ్కొనితేర నీవును వచ్చితి నెమ్మితోడ
లాలితాపూర్వసభాలోకనం[4]బునయందు జూదంబు కార్యంబె చెపుమ
జూదంబుకతమున భేదంబు గాకుండ నేరదు మాలోన నీనియోగ

ఆ. మనఘ మా కలంఘ్య [5]మయినట్లు ధృతరాష్ట్రు, పనుపు[6]సేయ నీకుఁ బాడి
యదియ
యనుచు విధినియుక్తుఁడయి యప్డు విదురుతో, నేఁగ నిశ్చయించె నిందు
కులుఁడు[7].

---

155 1. ఇంద్రప్రస్థంబునకు సురేంద్రగురు ప్రతిముడు — ఝ 2 రుంద్రయశ — భాసం. 3. ప్రతిముఁడ — పెక్కు ప్రతులు 4 ఇనసముతేజున్ — ఒ 5 సాంద్ర యశు — ఒల 6. నరేంద్రుని — ఆ.ఇ ఉ.ఘ 7 జునిగాంచి యెంతయు ప్రీతిన్ — ఆ ఇ ఎ ఒ క.ఖ.గ.

156 1. ఆధర్మరాజుచేత — కొన్ని ప్రతులు 2. చినవిదురునకు — పెక్కు ప్రతులు.

157 1 నెంతయు నాదరించి — చ. 2. మిమ్ముమ బుత్తెంచె మమ్ము — అఐ; నిన్ను నియోగించి — వా; నిన్నునియోగించె — పెక్కు ప్రతులు. 3 దోడ్తె రంగ — క.ఖ. 4. బునునందు జూదంబు కార్యంబునట్టి జూదంబు — పెక్కు ప్రతులు 5. మైనది ధృత — ఉచఘు మౌనట — ఐ 6. నీ (మీ) కు జేయబాడియదియ — కొన్ని ప్రతులు, నీకు జేయబాడియయ్యె — ఎ ఒ గ; నీకు జేయబాడియగును — వ. 7. ఈ పద్యము తరువాత కొన్ని వ్రాతప్రతులలో గల యధికపాఠమని 'స' లో నియ్యబడిన

వ. ఇట్లు కృతనిశ్చయుండై ధర్మతనయుండు దివ్యాంబరాభరణమాల్యగంధంబుల నలంకృతుండై ప్రయాణార్థంబు భూసురనికరంబునకు బహురత్న సువర్ణంబులు దానంబులిచ్చి, మంగళతూర్యనాదంబులును, విప్రాశీర్వాదంబులును మాగధమంజు లగానంబులును వందిజనవాక్యసంతానంబులును విలసిల్లుచు మందిరంబు వెడలి

158 క. అనుజులు ద్రుపదాత్మజయును, ననుచర[1]ముఖ్యులును ధౌమ్యుఁ డాదిగ విద్వ
జ్జ[2]నులును దోఁ జనుదేరఁగ, నిన[3]సన్నిభ తేజుఁ డరిగె నిభపురమునకున్.

159 వ. [1]అందు దుర్యోధనదుశ్శాసనాదిపుత్త్రశతంబుతో [2]భీష్మ శల్య శకుని పైం
ధవ కర్ణ గౌతమ ద్రోణాశ్వత్థామ సోమదత్త[3]సమేతుం డయి యున్న
ధృతరాష్ట్రునకు భానుమతీప్రభృతి [1]స్నుషాపరివృతయయి తారకా[5]పరి
వృతయయి యున్న రోహిణియుంబోలె నున్న గాంధారీదేవికిఁ గురు
వృద్ధజనులకు నతివినయంబున ననుజసహితుం డయి ధర్మతనయుండు
మ్రొక్కె నంత ద్రుపదరాజనందనయు గాంధారికి మ్రొక్కిన నక్కోమలిం
జూచి గాంధారికోడండ్రెల్లను [6]విస్మితలయి.

యనేకమణిమయప్రభాభాసురంబైన కాంచనరథారోహణంబు చేసి, కుంతీ
ద్రౌపదులును దమ్ములును దోడన జనుదేర నరిగి యన్నరనాథుండున్న నాగనగర
ప్రవేశంబుచేసి, పౌరజననయనానందంబు సేయుచుం జని రాజగృహద్వారసమీ
పంబున ననుచు వచనమును,

క॥ పరమోదారుడు ధర్మజు
డరద ముడిగి చనియె ప్రీతి ననుజులుదానున్
సురవిభవస్ఫురణతోడను (గణభంగము)
గురుతరమైనట్టి కొలువుకూటంబునకున్ —

అను కందమును, 'ఖ' ప్రతిలో మాత్రమే లభించినవి కాని యీ విషయము
పి.పి యస్. ప్రతిలో వర్ణితమైనది (54 45 నుండి 70 వఱకు)

158 1 వర్గంబు ధౌమ్యు — ఉ. 2 నములతో — ఆ.ఇ ఖ, నములతోనరు —
ఏ ఔ.ల 3. సన్నిభుదేగు దెంచెనిభపురమునకున్ — చ.ఝ వ శ ష.

159 1. అప్లరిగియందు — అ.ఏ.ఓ గ. 2. భీష్మశల్యశకుని — పెక్కు ప్రతులు
మూలమునందును గలదు ; భీష్మశకుని — వా. 3. బాహ్లికభూరిశ్రవసమే —
కొన్ని ప్రతులలో నధికముగఁ గలవు. కాని యిది మూలానుగుణము కాదు.
4. స్నుషాప్రభృతిసతీశతపరి — స. 5. పరివేష్టితయైన రోహిణి — ల. 6 తమలో
విస్మితలై — అ.ఆ.ఇ.ఊ ఎ.ఏ.ఔ.గ.ఘ; విస్మితలయి యిట్లనిరి — వా.శ.ష ;
విస్మితలయి — పెక్కు ప్రతులు.

160 తే. అఖిలలావణ్యపుంజంబు నబ్జభవుఁడు, [1]మెలఁతగా దీనియందు నిర్మించె నొక్కొ
కానినాఁ డిట్టికాంతి యేకాంతలందు, నేల [2]లే దని సామర్షహృదయు లయిరి.

161 వ. ఇట్లు పాండవకౌరవు [1]లతిప్రణయగౌరవంబున [2]నద్దివసంబు సలిపి రంతఁ [3]బ్రభాతంబ.

162 ఉ. ఆధృతరాష్ట్రు చేసిన యనర్ఘమణి[1]ప్రకరానుబద్ధశో
భాధృతి నొప్పుచున్న సభ పార్థివముఖ్యుఁడు ధర్మజుండు దు
ర్యోధనుఁ డర్థిఁ జూపఁగ సహోదర[2]వీరులుఁ [3]దానుఁ జూచి ల
క్ష్మీధరమూర్తి యెంతయును మెచ్చె మనంబునఁ దద్విభూతికిన్.

163 వ. అయ్యపూర్వసభా[1]మణికుట్టిమంబున నందఱు సుఖాసీను లయి యిష్ట సంభాష[2]ణాదిక్రీడావసరంబున నున్నంత దుర్యోధనుండు యుధిష్ఠిరున కిట్లనియె.

160 1. మేలుగా — పెక్కు ప్రతులు, మేలుగాగూర్చి దీని నిర్మించె — ఉ ఛ.జ ఝ. ల స, మెలతగాధాత్రి — ఖ వీ శ.ష.స 2. లేదంచు — పెక్కు ప్రతులు; కలదని — ఉ ప యాజ్ఞసేన్యాః పరామృద్ధిం దృష్ట్వా ప్రజ్వలితామివ స్నుషాస్తా ధృతరాష్ట్రస్య నాతి ప్రమనసోఽభవన్ — అని మాత్రమే మూలము. భం. 2_52_32

161 1. లన్యోన్యప్రణయ — ఎ స; లతిప్రియంబున నద్దిన — కొన్ని ప్రతులు; లతిప్రియ గౌరవం — ల. 2. నద్దినశేషంబును రాత్రియుం గడపిరంత — ల వీ 3. ప్రభాతసమయంబైన — కొన్ని ప్రతులు

162 1. ప్రకరప్రబద్ధ — ఆ ఇ ఏ.ఔ క.ఖ.ల, ప్రకరప్రబంధ — ఘ డ; ప్రకరానుబంధ — వ.వీ.శ.ష 2. ముఖ్యులు — ఐ.వ. 3. దానిజూచి — ఐ ఓ క.ఖ.ఘ.

163 1 విరచితమణి — కొన్ని ప్రతులు; మణివేదితలంబున తమ్ములుందానును — ట; రమణీయమణి — ఓ గ. 2. ణక్రీడా — పెక్కు ప్రతులు; ణక్రీడావినోదంబున (ల) — క డ. వీ.శ.ష స, ణక్రీడావినోదంబుల ప్రొద్దు పుచ్చుచున్న యవసరంబున ధర్మరాజునకు దుర్యోధనుం డిట్లనియె — ఛ.ఝ.

164 క. [1]అనఘ సుహృద్ద్యూతం బిం, దొన[2]రింతము ప్రొద్దుపోక[3]యును నగు [4]జూదం
బునకుం బ్రియుండవు దశుండ. [5]వగ వింతుము నిన్నుఁ బ్రీతి నక్షజ్ఞులచేన్.

165 వ. అనిన వానికి ధర్మతనయుం డిట్లనియె.

166 తే. [1]క్షత్త్రనీతిక్రమంబులు గావు సూవె, నికృతియును జూదమును ధర్మ[2]నిత్యులైన
వారి[3]కీరెండు వర్జింపవలయు [4]నెందుఁ, బాపవృత్తంబు జూదంబు పార్థివులకు.

167 ఆ. [1]కుటిలమార్గు లయిన కుత్సితకితవుల, తోడఁ[2]గడఁగి జూద మాడ[3]జనదు
దానఁ జేసి [4]యర్థ ధర్మవివర్జితు, లగుదు రెట్టివారు [5]జగములోన

168 వ. మఱియు మాయాద్యూతంబున జయించుట [1]మహాపాతకం బనియును ధర్మద్యూతంబున జయించుట ధర్మయుద్ధంబున జయించు నంతియ పుణ్యం బనియును నసితుండయిన దేవలుండు చెప్పె ననిన [2]నయ్యుధిష్ఠిరునకు శకుని యిట్లనియె.

169 క. ద్యూతకలాకుశలుండగు, నాతఁడు లోకజ్ఞుఁడును మహామతి[1]యును వి
[2]ఖ్యాతుఁడు[3]నగు సత్త్రక్రియ, నీతివిదుఁడు దగునె దాని నిందింవగన్.

164 1. అనఘాత్మ సుహృద్ద్యూతం బొనరింతము — ఐ.ల. 2 రింత మె — ఉ క.ఖ.గ. 3. యున్నగు — ఐ, యున్నది — ఎ.ఐ. 4. ద్యూతమ్మునకు — ల. 5. వని — పెక్కుప్రతులు.

166 1 క్షాత్రి — కొన్నిప్రతులు ; క్షాత్రవీరు విక్రమం — ᳚ ; క్షత్రియుల విక్రమం — క.ఖ డ, క్షత్రనీతికి గ్రమములు — ఘ ల.పి శ.ష 2. నిపుణులైన — అ ఐ ఝ వ. 3. కివిరెండు — కొన్ని ప్రతులు. 4. నండ్రు — అ ; నందు — అ.ఇ ఈ.ఎ.ఐ.ఓ గ.చ ; నెపుడు — ల

167 1. కుటిలబుద్ధులయిన — వ. 2. తొడరిజూద మాడదగదు — పెక్కుప్రతులు. 3. రాదు — ఒ.ఖ ఐ , గాదు — ఏ.ఔ.క డ 4. కాదె — గ ; యఖల — శ ష. 5 జగతి — ఉ.ఐ ఓ.

168 1. నధర్మయుద్ధమున జయించుట మహా — అ,ఇ. 2 విని యుధిష్ఠిరునకు — కొన్నిప్రతులు.

169 1 యతి విఖ్యాతుడును — స ల ; యు నతివిఖ్యాతుడును—ఊ. 2. ఖ్యాతుడును రాజనీతివినీతుడు నగుదగునె — అ ఇ ఈ.ఐ.గ.ఛ.శ.ష.స , ఖ్యాతుడురాజనీతివినీతుం డగుసేని యేఎ — ఎ ల ; జ్ఞాతుండు రాజనీతివినీతుండును నగునె వాని — ఐ. 3 రాజనీతివినీతజ్ఞుడండ్రు — క.ఖ.డ ; రాజనీతివినీతుడు నన నగునె — ఘ.

170 క. బలహీనులయినవా(రు, బలవంతుల నోడుచునపుడు బహు[1]మాయల న
చ్ఛలమునఁ [2]జేయుట యెందును, గలయది[3]య జయంబ కాదె కర్తవ్య
మిలన్.

171 వ. జూదంబున కీ వోడుదేని యుడుగు మనిన [1]నాతనికి ధర్మరా జిట్లనియె

—: ధర్మరాజు శకునితో జూదంబాడుట :—

సం. 2—53—13

172 క. [1]బలవద్ద్యూతార్థముగాఁ, [2]బిలువంబడి మగుడ [3]నగునె [4]పెక్కులు పలుకుల్
పలుకంగ నేల యని య, త్యలఘుండు ధర్మజుఁడు జూద మాడఁ[5]గడంగెన్.

173 వ ఇట్లు జూదంబునకు నయ్యేడు దోసం బెఱింగియు దైవానుశాసనంబున ధర్మ
జుండు [1]దాని కభిముఖుండయి చందనకర్పూర [2]కస్తూరీ [3]పరిషిక్తం
బయిన ద్యూతరంగంబునందు ముందఱ [4]గంధపుష్పార్చితంబు లయిన
యభిమతాక్షంబు [5]లమర్చికొనియున్న సౌబల వివింశతి చిత్రసేన [6]వికర్ణు
లం జూచి వీరిలో నెవ్వఁడు నాతో జూదం బాడెడువాఁడనిన నాతనికి
దుర్యోధనుం డిట్లనియె.

174 తే. అనఘ మామామ శకుని నాకై కడంగి, జూద మాడెడి నీతోడఁ[1]గాదు నాక
[2]యీతఁడొడ్డిన ధనరాసు లెల్లనయినఁ, [3]బోఁడిగా నీకు నీఁగలవాఁడ నేను.

170 1. విధమాయాచ్ఛలములు (ల)- పెక్కుప్రతులు 2. జేయుదురెందును —
అ ఏ క ఖ 3. యనిచెప్పగాదె కావ్యుడు మొదలన్ — స ; యుచితంబు (బ)
కాదె — కొన్నిప్రతులు.

171 1. నాతనికి — పెక్కుపతులలో లేదు

172 1. బలవంతము జూదమునకు బిలువం — పీ.శ శర ష స సూ. 2. బిలువగబడి —
కొన్నిపతులు 3 జనునె — ఎ.క ఖ. 4. పెద్దలకని తానలఘుడు ధృత
రాష్ట్రజతో నలయక ధర్మజుడు — శ ష స. 5. దొడంగెక — కొన్ని పతులు

173 1 వానికభి — ఇ.ఊ ఎ ఏ ఒ.ఓ.ఔ చ.ఛ 2 వారిపరిషిక్తం — పెక్కు ప్రతులు.
3 పరిలిప్తంబయిన — ఖ పీ శ.ష 4 పుష్పధూపదీపార్చితం - కొన్ని ప్రతులు.
5 లు బుచ్చుకొని — పెక్కుపతులు. 6 వికర్ణదుర్యోధనులం - కొన్నిప్రతులు.

174 1. గాదనాక — ఒ ఔ.క.ఖ , గాదనాకు — గ.చ ; గాదునాకు — ఘ. 2.
యీతడోడిన — ఈ ఊ చ , యితనియొడ్డిన — ఒ గ ; యితనినొడిచిన — ణ
3. బాడిగా — ఖ ఘ ణ.

175 వ. అని తనచేతి యనర్ఘ [1]రత్నకటకంబు లొడ్డిన నన్యులకయి యన్యులు జూదం బాడుట యెంతయు [2]విషమం బనుచు ధర్మతనయుండు సాగరావర్తసంభవంబు లయిన [3]పరార్ధ్యమణిహారంబు [4]లొడ్డె నిట్లు సుహృద్ద్యూతంబు ప్రవర్తిల్లు [5]నదిదైన నచ్చోటికి వచ్చి భీష్మ ధృతరాష్ట్ర విదుర కృప ద్రోణాశ్వత్థామలు [6]విచిత్రోచ్చాసనస్థు లయి దానిం [7]జూచుచు నప్రహృష్టహృదయులయి యుండి రంత.

176 తే. అభిమతాతుముల్ [1]దొల్చి మాయావిదుండు, సుబలరాజాత్మజుఁడు ధర్మసుతు జయించె
[2]నోడుతు నేనింక నని వెండియును [3]గడంగె, శకునితో జూద[4]మాడ నాశకులుండు.

177 వ. ఇట్లు యుధిష్ఠిరుండు బద్ధమత్సరుం డయి పెట్టఁగ[1]యొండొండ [2]యొడ్డుచు నిష్కసహస్ర భరితానేకాయుతకుండమండితంబు లయిన సువర్ణభాండాగారంబులును వజ్రవైదూర్య మరకతమౌక్తిక నీల[3]ప్రవాళ [4]పద్మరాగాది వివిధశుద్ధ[5]విపులరత్నపరిపూర్ణంబులైన రత్నభాండాగారంబులుం [6]బ్రత్యేకంబ పంచద్రోణకాంచన [7]సంచితంబు లయిన [8]చతుశ్శతనిధులును మణికింకిణీ [9]జాలాలంకృతంబు లయిన [10]యసంఖ్యాతహయయూథంబులును జాతరూప [11]వరూథంబులుం గనకకక్ష్యాకుథసనాథంబు లయిన మదాంధ

175 1 మణికట—ఓ క. ఖ ఛ జ డ 2 విరుద్ధంబనుచు—అ ఎ ఏ ఒ. ఓ. ఔ క ఖ గ. ఝ. డ. ల 3 పరార్ఘ్య—కొన్ని ప్రతులు. 4 లొడ్డిననిట్లు-కొన్ని ప్రతులు 5 చుండ నచ్చోటికి—గ. వీ. శ ష. 6 చిత్రాసనస్థులయి—ట ఝ 7 నాతీవప్రీతమనసస్తేఽన్వవర్తంత భారత భం 2-53-18. నాతి ప్రహృష్టమనసః అని మూల పాఠాంతరము; జూచియు నప్రహృష్ట—క ఖ; జూచుచుం బ్రహృష్ట-వా. ఇది మూలవిరుద్ధము; జూచుచు నప్రహృష్ట—శాసం

176 1. దాల్చి—కొన్ని ప్రతులు. 2. నోడుదు నె నీకునని — ల వీ. శ. ష. స 3. గడంగి శకునితో జూదమాడె-ట. ల స. 4. మాడంగ శకులుండు – పెక్కు ప్రతులు.

177 1 యొండొండ—పెక్కు ప్రతులలో లేదు. 2 యోడుచు—ఊ ఐ ; యోడుమని [?] ట. 3. మణిప్రవాళ—ఘ ఝ ల. 4 పుష్యరాగపద్మ-ఇ. 5 విపుల-కొన్ని ప్రతులలో లేదు. 6. ప్రత్యేకంబయొడ్డి — అ. ఆ. ఏ ఘ ; యొడ్డుచు—ఛ. 7 సమంచితంబు — ఆ. ఎ ఏ ఐ ఔ ఘ వీ శ. ష. 8. యసంఖ్యాతధనంబులును—క. ఖ డ 9. మాలా — పెక్కు ప్రతులు 10. యసంఖ్యాత జాతరూప— పెక్కు ప్రతులు. 11. వరూథయూథంబులును— పెక్కుప్రతులు ; వరరథయూథంబులు-ల ; యూథంబులం గల

గంధసింధుర[12]సందోహంబులుం [13]బరార్ఘ్యరత్నభూషణభూషితంబు లయిన [14]యోషిత్సహస్రంబులును [15]ననుదినాతిథిజన భోజనపాత్ర[16]హస్తలయిన శతసహస్ర పరిచా[17]రకులును నర్జునునకు [18]చిత్రరథుండిచ్చిన [19]గంధర్వ హయంబులందొట్టి దుగ్ధపాన శాలితండుల [20]ఖాదనంబులం బెరుఁగుచున్న జాత్యశ్వానేకాయుతంబులు నజావి గో మహిష ఖర రాసభనివహంబులు నొక్కొక్క యెడ్డునన యెడ్డి యోటుపడినం జూచి విదురుండు ధృతరాష్ట్రునకు రహస్యంబున నిట్లనియె.

178 క. కలుఁ డీదుర్యోధనుఁ [1]డెగ్గులతోడన యుద్భవిల్లె గోమాయు[2]రుతం బులు [3]వించె దుర్నిమిత్తంబులు పెక్కులు పుట్టె [4]వీనిపుట్టిన వేళన్.

179 వ. తొల్లి యెన్నండును [1]బాపంబుం బొరయని [2]మహాభిష [3]భీమసేన ప్రతీప శంతనుల కులంబు దుర్యోధనుకారణంబునం [4]బాపభూయిష్ఠంబుగా నున్నయది యొక్కనికారణంబునఁ గులంబున కెగ్గగునేని వాని దూషించి కులంబు రక్షించుట [5]ధర్మంబని శుక్రుండు చెప్పె గులరక్షణార్థం [6]బంధక యాదవ వృష్ణివీరులు కృష్ణు నియోగించి కులదూషకుండైన కంసుని [7]వధియించిరి గావున

నకుకూబరనాథంబులైన మహారథంబుల జూపట్టు వీరభటసమూహంబులునుం గనకకక్షణాక శానుశాసనంబులైన మహాంధసింధుర మొదలుగా–ఈ 12 శతసహస్రంబులును–కొన్ని ప్రతులు. 13. వరాఘ్య—బొల 14 దాసీశతసహస్రం — ఉ ఓ ఘ ఝ ; దాసీనిచయ–ఖ డ. 15 నానావిధభోజన–ఊ ఎ ఘ చ ఝ ల వీ.స ; దీనార్థి జనభోజన–ణ 16 హస్తలయిన–ఉ బొ ఛ.వీ.శ.ష. 17 రికలను–ఆ.ఉ.ఒ.బొ.ఘ.ఝ.వీ శ. 18 చిత్ర రథుండను గంధర్వుండిచ్చిన–పెక్కు ప్రతులు. 19. యేనూరు గంధర్వ—ఘ ల వీ శ 20 చణకాదిఖాదనం—అ ఇ ఉ ఎ ఏ ఓ బొ.

178 1. డెలుగుల — స శ[1] 2. రవంబులు – కొన్నిప్రతులు, చయంబు లరచె నగళ్ళ నద్భుతములు పెక్కులు — స. యద్వై పురా జాతమాత్రో రురావ గోమాయువద్విస్వరం పాపచేతాః దుర్యోధనో భారతానాం కులఘ్నః సోఽయం యుక్తో భవితా కాలహేతుః — అని మూలము భం. 2-55-2 3 చె (సె) లగె – ఆ గ.చ.ల వీ.శ.ష ; చెగసె — క ఖ డ. 4 వీడు — ప ఒ ఓ బొ. క ఖ ఘ ణ.

179 1. బాపంబునం—పెక్కుప్రతులు 2. మహాభిష–ఇ.ఉ ఎ ఓ.క ఖ.చ ణ ప్రతులలో లేదు మూలమునను లేదు. 3 భీమసేన — కొన్ని ప్రతులలో లేదు 4. బాపభయ యుక్తంబు–ఉ ఝ; బాపభయదోషయుక్తంబుగా – ఏ.బొ. 5 ధర్మంబగునని – ల. 6. బు [బ] గాదె–పెక్కు ప్రతులు ; బుగా యదువృష్ణి–ణ ; బయదువృష్ణి భోజాంధక–ఎ ఒ.క.ఖ.గ డ 7 వధియించిరి–పెక్కుప్రతులు ; వధింపించిరి — వా.

180 ముత్తకోకిలము. వాసవాత్మజుఁ బంపు మిప్పుడ వాఁడు ధర్మవిదుండు నీ
శాసనంబున నిగ్రహించు విచారదూరు సుయోధనున్
భూసతీశ్వర దీన నీకులమున్ మహీప్రజయున్ [1]గత
త్రాస[2]వృత్తి సుఖంబు వొందుఁ బ్రధాన[3]విగ్రహ మేటికిన్.

181 ఉ. ఇమ్మనుజాధముణ్ గుణవిహీను బహిష్కృతుఁ జేసి ధర్మమా
ర్గమ్మునఁ గౌరవాన్వయముఁ [1]గావుము [2]పాండుతనూజులం బ్రతా
పమ్మెసఁగంగ నేలు మిది పథ్యము [3]సుమ్మొక[4]నక్క నిచ్చి సిం
హమ్ముల [5]విల్చికో లుఱదె యన్యులె వారలు కౌరవేశ్వరా[6]

182 మధ్యాక్కర. అంగారములు గొనువేడ్కఁ బుష్పఫలావళీ[1]లలిత
తుంగద్రుమప్రకరంబుఁ గరుణావిదూరుఁడై కాల్చు
నంగారకారుఁ బోలంగ సమకట్టె నర్థలోభంబు
నం గురుకులహానికరుఁడు ధారుణీనాథ నీ సుతుఁడు.

183 ఆ. అధికదర్ప[1]యుక్తమై బలీవర్దంబు, [2]నగముదరి విదారణంబు సేయఁ
గాలు ద్రవ్వ[3]నట్లు గడు బలాఢ్యులతోడ, నేచి వీఁడు విగ్రహింపఁ దొడఁగె.

184 వ. ఇంక నయిన నుపేక్షింపక యీ దుష్టద్యూతంబు [1]వారింపు మనినఁ బుత్త్ర
స్నేహంబున [2]నెద్దియుం జేయునదినేరక ధృతరాష్ట్రుండు మిన్నకుండె
నంత విదురుండు [3]దుర్యోధనున కభిముఖుండై యిట్లనియె.

180 1. జితత్రాస — గ. 2 తృప్తి — శ ష. 3 విక్రమమేటికిన్ — క.డ.

181 1. గాజితమై వెలుగొందజేగు నీతమ్ముని పుత్రులన్ నిలుపుతథ్యము -- ఎ ఒ.స; రాజితమై వెలుగొందుచుండు [డ] నీతమ్మునిపుత్రులన్ నిలుపుతథ్యము — క ఖ డ 2 పాండవవీరులం — కొన్నిప్రతులు. 3 జంబుకమొక్కటిచ్చి — ఉ గ.ఛ.యు. 4. నక్కనుంచి సింహమ్ముల వెళ్ళదోలుదురె—ల 5. బుచ్చికోలు— ఛ.వీ.శ.ష ; దెచ్చికోలు — భాసం. 6 కాకేనేమాం శ్చిత్రబర్హాన్ శార్దూలాన్ క్రోష్టు కేనచ। క్రీణీష్వ పాండవాన్ రాజన్ మామగ్నః శోకసాగరే-అనిమూలము భం 2-55-9.

182 1 వినుత — అ ఆ.ఘ ; సంగతుంగ — ఎ.బొ

183 1. యుక్తిమై — ఆ.ల ; యుక్తమగునట్టి బలవర్ధనంబుతోడుతను రణంబు — క ఖ. డ. 2. నాగగణము తోరణంబు—వీ స. 3. నక్కగతి — ఖ.డ.

184 1. వారించి కులంబురక్షింపుమనిన — ఎ క ఖ.గ డ 2 నొండేమియు నన నేరక — క.ఖ డ. 3. దుర్యోధనునకిట్లనియె — పెక్కుప్రతులు.

185 క. న్యాయంబు విడిచి సౌబలు, మాయాద్యూతమునఁ బాపమతివై భరతా
మ్నాయు లగు పాండవేయుల, శ్రీయిమ్మెయిఁ గొనిన నిన్నుఁ [1]జీయనరె
[2]యొరుల్.

186 క. ధృతిమంతుల భుజవిక్రమ, జితశత్రులఁ బాండవేయ [1]సింహులను మదో
ద్ధతిమైఁ బరాజితులఁ జే, సితి [2]వారల కిట్లు నికృతి [3]సేయుట లగ్గే.

187 వ. [1]అనిన విని విదురున కలిగి దుర్యోధనుం డిట్లనియె.

188 సీ. పరులగుణంబులు పలుమాఱుఁ గీర్తింతు [1]పక్షంబ పలుకుదు పాండవులకు
ధార్తరాష్ట్రుల సంతతం[2]బు నిందింతువు కుడిచిన[3]చోటికిఁ [4]గూర్పవెపుడు
నుత్సంగతలము[5]న నుగ్రవిషోరగం బున్నట్లు నీవు మా యొద్ద నునికి
పరుల సంపద సుఖోపాయ[6]బలంబునఁ గొనుట భూపతులకు గుణముకాదె

ఆ. [7]యడుగకయును గర్జ[8]మది యిష్టుఁడై [9]చెప్పు, నతని[10]కాడఁ దగినయదియ
[11]నన్ను
నిట్టు నట్టు నననఁగ నేల నీ యిమ్ముల, [12]నుండు బుద్ధి సెప్పకుండు మాకు

189 వ. [1]అనిన విదురుం డిట్లనియె.

185 1. ఛీయనరె — ఉ.ఊ.ప ఘ. 2 జనుల్ — కొన్నిప్రతులు

186 1 సింహముల – పెక్కుప్రతులు 2 వారికి నిట్లు-కొన్నిప్రతులు 3. సేయం
దగునే — చ.

187 1. అనిన విదురునకు – కొన్నిప్రతులు

188 1. పక్షంబు — పెక్కు ప్రతులు 2 బునునిందింతు – కొన్ని ప్రతులు. 3.
యింటికి — ఊ.ఎ ఛ.ణ ; యింటినె కూల్పనగుదు — చ. 4. గుత్ససేతు —
ఐ.ఔ ; గూర్పవెందు — ఛ.ణ.ల.వ ; కొరతచేతు – ఎ.వ.స ; కురుచదలతు–
క.ఖ.ఘ డ.స సం 5. నందుగ్రమహోరగం – అ ; పైనుగ్ర — ఐ.ఝ. 6.
మార్గంబున - అ.ఐ. 7. యడుగకయును గర్జమతిదుష్టుడై చెప్పునతనికోడదగిన
యదియ — స ; యడుగకున్న — శ.ష. 8. మతి — పెక్కు ప్రతులు 9.
చెప్పుచుండ నీకుదగునె యుక్కివమున — ట. 10 తోడుదగిన యదియు
గాదె - వీ.శ.ష. 11. మమ్మునిట్టు నట్టనంగనేల – భాసం , నిన్నునిట్లు నంగనేల —
వీ శ.ష 12 నొండు బుద్ధిసెప్పకుండుమాకు — ణ.

189 1. అనిన దుర్యోధనునకు విదురుండిట్లనియె – పెక్కుప్రతులు.

190 క. చెడఁ గఱపు[1]వార చెలులుం, గడుకొని [2]నీయట్టివారి కర్జంబులు చె
ప్పెడువారుఁ గాక నీకుఁ, మడవక మాయట్టివారి మాటలు గొఱయే.

191 తే. ప్రియము [1]పలికెడు వారిన పెద్దమెత్తు, రప్రియంబును బథ్యంబునైనపలుకు
[2]వినఁగ నొల్లరు గావున[3]వేడ్క దానిఁ, బలుక రెవ్వరు నుత్తమ [4]ప్రతిభు
లయ్యు.

192 తే. మొదల నప్రియ మయ్యును దుదిఁ గరంబు, పథ్యమగు పల్కు[1]ప్రియులందు
బలిమి నైనఁ
బలుక వలయు మో మోడక [2]యొలసి యట్టి, వాఁడు దగు[3]సహాయుండు
భూ వల్లభునకు.

193 వ. [1]పను సపుత్త్రకుండైన [2]వైచిత్రవీర్యుకార్యంబునకు [3]హితుండనై నెగడుదు
నట్టి నన్నన్యథాబుద్ధి నొల్లక పలికితి పాండవులతోడి విగ్రహంబు [4]లగ్గు
గాదని [5]చెప్పి విదురుండు విగతవచనుం[6]డై యుండె నంత [7]శకుని ధర్మ
నందనున కిట్లనియె.

194 ఉ ఎల్లధనంబు[1]నోటు వడి తిందుకులేశ్వర యుంక [2]నొడ్డఁగా
[3]మొల్లము నాకుఁ [4]జూపు మని ముందట సారెలు ద్రోచి యాడఁగా

190 1 వారచుట్టలు — స ; వారుచెలులని — అ.ఊ.ఏ.ఓ ఔ.క ఖ ఘ.డ ణ ; వారు చెడు
గులు — శ.శర ష. 2. నీయిట్టివారు [ర]—అ ఇ ఏ.ఐ ఔ ఖ.ఘ.వీ.

191 1. పల్కినవారిన — కొన్నిప్రతులు; తగిలి విననొల్లరటు గాన —— అ.క.ఖ ఘ
ట.డ.వీ శ.ష.స 3. దానిప్రీతి — అ ఎ.ఒ.ఎ ఖ.ఘ.చ శ. 4 ప్రభులకైన — శ.
ష స ; ప్రతిభులైన — స , ప్రకృతులయ్యు — చ.ల.స

192 1. హితులందు — ణ ; హితులకు — ల 2 పలుకునట్టి — ఎ.ఒ.క.ఖ డ ;
వెలయునట్టి — ఐ ణ. 3. పుత్రుడగును — శ ష.

193 1. ఏనపుత్రకుండయ్యు — అ ఐ.ఔ ; ఏనపుత్రకుండనై — ఈ.క.ఖ ణ 2.
విచిత్ర వీర్యాత్మజు కార్యంబునకు సహాయుండ — వీ శ.ష. 3 సహాయుండ —
ల. 4. నీకులగ్గు — అ.ఊ.ఏ ఐ ఔ.ల. 5 చెప్పి — పెక్కు ప్రతులలో లేదు.
6. డయ్యెనంత — పెక్కుప్రతులు 7. శకుని ధర్మనందనున కిట్లనియె—పెక్కు
ప్రతులలో లేదు.

194 1. గోలుపడి — గ. 2. నాడగా —— ఉ.ఛ.ఝ.ల స. 3. నొల్లమినాకు జెప్పు
మని యొడ్డిన — ల.స. 4 జెప్పుమని — అ ఈ.ఒ.

నొల్లక యున్న సౌబలున కున్నతచిత్తుఁడు ధారుణీతలం
బెల్లను నొడ్డి యోటు వడియెఁ బలవద్వ్యసనాభిభూతుఁడై.

195 వ. ఇట్లు దేవ[1]భోగ బ్రాహ్మణ[2]వృత్తులు దక్కఁ దక్కిన [3]మహీతలంబును [4]బ్రాహ్మణులు దక్క సర్వప్రకృతిజనులను రాజపుత్త్రుల [5]నొక్కొక్క యొడ్డున నొడ్డి యోటువడి వెండియు.

-: ధర్మరాజు తమ్ములను ద్రౌపదిని జూదమునం దొడ్డి యోడుట :-

196 సీ. తమ్ముల నత్యంత ధర్మ[1]సమేతుల [2]నాయతబాహుల నాజిజయుల
[3]నాదిత్యతేజుల నాదిభూపాలకచరితుల నఖిమానసత్య[4]రతుల
సహదేవ నకుల వాసవసుత భీముల క్రమమున నలువురఁ గౌరవేంద్రుఁ
[5]డొక్కొక్క యొడ్డున [6]నొడ్డి తన్నును నొడ్డి యుక్కివంబున [7]నప్పు డోటు
వడిన

ఆ. [8]నతనిఁ జూచి శకుని యనియె నిల్లేల ని, న్నొడ్డి తధిప నీకు [9]నొండుధనము
గలదు మఱచి తెట్లు కమలాక్షి పాంచాలి, కన్య నీకు [10]ధనము గాదె యనిన

197 చ. అలయక వెండియుం గడఁగి యక్ష[1]రతుం డయి ద్రౌపదిఁ మహో
త్పలదళ[2]చారునేత్రఁ గులభామఁ బణంబుగఁ జేసి యొడ్డి సౌ
బలఖలుచేత నోటు వడి పాండుసుతుం డుడిగెఁ ధనంబు ల
గ్గలముగ [3]నొడ్డలేమి గతగర్వమునం గడు దీనవక్త్రుఁడై.

195 1 భోగ — కొన్ని ప్రతులలో లేదు. 2 భూముల — క.ఖ.డ. 3 సర్వమహీ — అ.ఈ.ఊ.ఒ.ఘ; నిఖిల — కొన్నిప్రతులు. 4 బ్రాహ్మణులు — అ.ఈ.ఊ.ఘ. ప్రతులలో లేదు 5 నునొడ్డియోటుపడి వెండియు — పెక్కు ప్రతులు.

196 1. స్వరూపుల — జ. 2. నాజానుబాహుల — ఊ.ల 3. నతులప్రతాపుల — క.ఖ.డ. 4. ధనుల — అ.ఐ.ఒ.క.ఖ.శ.వ.స, చరుల — ఎ.వ. 5. కొక్కొక్క యేటున నుక్కివంబున నొడ్డియోడి తన్నును నొడ్డియోటువడిన — త. 6. నోడి — అ.ఇ.ఈ. 7. నాడియోటువడిన — క.ఖ.గ.డ.స 8. యతని — ఝ.ట. 9. నొడ్డుధనము — స 10. నీధనంబుగాదె — పెక్కుప్రతులు.

197 1. ధరుండయి — ఉ.ఎ.ఔ. 2. చారునేత్రి — పెక్కుప్రతులు. 3. నొండు — క.ఖ.శ.ణ.న.

198 సీ. ఆతనిఁ జూచి ద్రోణాచార్య కృప భీష్ము లవిరళ స్వేదాంగు [1]లగుచు వృద్ధ
జనులును దారు నిశ్శబ్ద [2]నిరంతరముఖు లైరి విదురుండు మొగము వాయ
నిడి తలవాంచి తన్నెఱుఁగక దుఃఖితుండై యుండెఁ దక్కిన యా సదస్యు
లందఱుఁ బ్రబలబాష్పాంబుధారా [3]కులితాక్షులై రత్యుచ్చమై పయోధి

ఆ. పటురవాఢ్యమై సభాక్షోభ[4]మయ్యె దు, శ్శాసనుండుఁ గర్ణ సైంధవులును
నధిక [5]హర్ష వికసి[6]తాస్యంబు [7]లొప్ప నొం, డొరులఁ జూచి నగుచు నుండి
[8]రపుడు.

199 వ. ధృతరాష్ట్రుం[1]డును నిది యేమి సభాక్షోభం బెవ్వ రెవ్వ రేవస్తువు [2]లోడ్డి
రని విదురు [3]నడుగు చుండె నట్టి [4]యవసరంబున దుర్యోధనుండు పాండవు
లం దనకు దాసులంగా నోడిచినవాఁడై [5]పెఱిగి.

200 క. వరవుళ్ళఁ [1]గలసి తనయులు, పరువడిఁ దుడువంగఁ గృష్ణఁ బను[2]చువగ౯ భా
సురరాజ్య[3]దర్ప మొప్పవి, దురుఁ జెచ్చెరఁ బంచె దానిఁ దోడ్కొని తేరన్.

201 క. దాని సహింపక విదురుం, డానరపతి కిట్టు లనియె నజ్ఞానులు నీ
తో[1]నెన లే రొరు లిట్లు మ,హానిష్ఠుర వృత్తిఁ బనుప నగునే[2]నన్నున్.

198 1. తైరిబంధు — స. 2. నిరుత్తర — అ.ఇ.ఎ.ఐ. 3. కలితా — అ.ఉ.ఏ.ఝ. 4. మెసగె — ఆ.ఘ.వీ.శ.ష. 5. హర్షితాననాంభోజులగుచు — ఔ. 6. తాననాంభోరుహులగుచునుండి రొడ్లునగుచునుండ — ఛ.ఝ. 7. లమర — ఎ.ఒ.క.ఖ.డ. 8. రంత — పెక్కుప్రతులు.

199 1. డిదియేమి సభాక్షోభం బయ్యెనెవ్వ — కొన్నిప్రతులు. 2. లోడిచిరని — కొన్నిప్రతులు. 3. నడిగిన దుర్యోధనుండు కౌంతేయులచేత నెల్లధనంబు గెలిచె నని చెప్పుచున్న యవసరంబున — ఉ.ఛ.ఝ.ల.స. 4. సమయంబున — కొన్ని ప్రతులు. 5. గర్వంబున పెరిగి — అ.వీ.శ.ష.

200 1. గలపి — శర. 2. పుమనుచు — ఆ.ఇ.క.ఖ.ఝ; పదలచి — ట. 3. గర్వమొప్ప — అ.ఆ.ఇ.ఈ.ఏ.ఐ.ఒ.ఔ.ఘ ; గర్వమునను — ఝ.ల ; విభవమొప్ప— క.ఖ.శ.ష.

201 1. నెరినెనలేరిట్లు — ల. 2. నీకున్ — కొన్ని ప్రతులు.

202 క. మదమలిన[1]మనస్కుఁ డరుం, తుదుఁడు నృశంసుఁడనఁ బరగు దుర్జనునకు సం
పద[2]లెడ లయ్యెను నాతని, మొదలిటి సంపద[3]లతో సమూలంబు చెడున్.

203 క. అవనీతల సామ్రాజ్యో, త్సవమునకు[1]ను యోగ్యయైన సతి ద్రౌపది పాం
డవధర్మపత్ని [2]నీ కం, తవమానము సేయ నేమి యన[3]పాత్రయయే.

204 తే. [1]ఏల యాశీవిషంబుల నెఱిఁగి, యెఱిఁగి[2]మూర్ఖవై [3]యలిగించెదు మొనసి యొరుల
ధనము నికృతిమై గొను టిది ధర్మువగునె, శకునిమతముఁ బాపంబుఁ [4]జనునె చేయ.

205 వ. జూదంబున నెగ్గు పుట్టు దీన నయ్యేడు ఫలంబు వేణుఫలంబునుం బోలె సహామూలవినాశంబునకు [1]నిమిత్తం బగు ననిన [2]దుర్యోధనుండు విదురుం [3]దూల నొదరి ప్రాతికామి యనువానిం బిలిచి యీవిదురుం డెప్పుడు [4]నరిష్టంబ కాని పలుకండు పాండవులకు వెఱచు నీవు వోయి ద్రౌపదిం దోడ్కొని రమ్మని పంచిన.

---

202 1. మనస్కుండై తుదిలేక వినయముసేయు దుర్జనునకు సం — పెక్కుప్రతులు ; మనస్కుడు దుర్మనుడు నృశంసుడనబరగు మనుజు — ల ; మనస్కుండై తుద మొదలెరుగక చరించు దు నునకు సం, పదలేదారయనాతని మొదలిటి సంపదయు జెడునమోఘము బు న్ — ట. 2. పెద్దయయ్యెనాతని — గ.వీ.శ.ష ; లధికమయ్యె నాతని — ఎ. 3. యుజెడు నమోఘము దీనన్ — శ.ష ; లతోన (డ) మొగిమాయమగుః — అ.ఈ.ఏ.ఐ గ.ల ; లతోడ మూలము చెరుచున్—ఝ ; లతో సమూలాంతమగున్—డ ; యు జెడుసమూలము దీనన్—వీ.

203 1. నుపూజ్యమైన — అ ; సుయోగ్యమైన — ఛ. 2. నీచే నవమానము బొందనంత (నింత) యన — పెక్కుప్రతులు [ ఉ-ఓ-చ జ, ప్రతులలో తప్పు] 3. పాత్రంబే — ఉ ; పాత్రితయే — ఎ.

204 1. ఏలయాశింప విషమంబు లెరిగి — ణ ; ఏటికిట్టివిధంబుల నెరిగి — ఛ.జ. 2. మూర్ఖవై యెరియించెదు — వ ; మూర్ఖతన మొనరించెదు — ఉ.ఝ.ల ; మూర్ఖవై యిట్టులలచెదు — ఏ. 3. యిచ్ఛయించెదు — క.డ. 4 నలువదగునె — ణ.

205 1. కారణం — అ ణ ; నిమిత్తంబగుననిన నవ్విదురుం — పెక్కుప్రతులు. 2. దుర్యోధనుండు — పెక్కు ప్రతులలో లేదు. 3 బదరి — అ.ఫ 4. నహితంబ — క.ఖ. ; నికృష్టంబులేకాని—ణ

-: ప్రాతికామి ద్రౌపదిని సభకు దోడ్కొని వచ్చుట :-

సం. 2–60–3

206 ఆ. అవనినాథుచేత నాజ్ఞాపితుం డయి, సూతనందనుండు ప్రాతికామి
[1]పాండవాగ్రమహిషి పాలికిఁ జని భక్తి, [2]వినతుఁడగుచు నిట్టు లనియె సతికి.

207 తరువోజ.

ధనసంపదలు నిజధరణిరాజ్యంబుఁ దనయులం దమ్ములఁ దన్ను నుఁ నిన్నుఁ
దవరఁ జూదం బాడి ధార్తరాష్ట్రులకు ధర్మతనూజుండు దానోటు వడియె
వనజాక్షి [1]కౌరవవరుపని [2]నిన్ను వడిఁదోడుకొనిపోవ వచ్చితి [3]నిపుడ
చనుదెమ్ము [4]కౌరవేశ్వరుకడ కనిన జలజాయతాక్షి పాంచాలి యి ట్లనియె

208 ఆ. ఏ యుగంబునందు నెట్టి [1]దుష్కృతవుండు, భార్య నొడ్డి యోటు వడిన [2]భర్త
గలఁడె [3]యిది వినంగఁ గడు [4]నపూర్వంబయ్యె, నిట్లు సేయు వాఁ డొక్క-
యిందుకులుఁడు.

209 తే. మున్ను [1]దన్నోటువడి మఱి నన్ను నోటు, వడియెనో [2]నన్ను మున్నోటు వడి విభుండు
గ్రన్నఁ దన్నోటువడియెనో యన్న నాకు, నెఱుఁగఁ జెప్పుము దీని నీ వెఱుఁగుదేని.

206 1. పాండవేయ — ల. 2. వినయు — అ.ఏ.ఔ.ఝ.

207 1. కౌరవేశ్వరుడు పుత్తేర వడిని దోడ్కొని — ల; కౌరవవరుడన్న — ఎ.స; కౌరవుపనుపున — ఈ.క.ఖ.డ; కౌరవవరుడు పుత్తేర వడిగ దోడ్కొని — అ.ఇ.ఊ.ఛ.ఝ. 2. సేయ — ఏ.ఔ.ట; 3. నీవు — ఎ ట ; నిన్ను — అ.ఆ.ఇ.ఈ.ఊ.ఘ.ఝ. 4. కురుకులేశ్వరు సభకనిన — ల.

208 1. దుష్కృతమందు – ఉ; దుష్కర్ముండు — ఛ.ఝ. 2. వాడు — పెక్కు ప్రతులు. 3. యిదియు వినగగడుచోద్యమయ్యె దానిట్లు — ణ, 4. చోద్యమయ్యె దా — అ.ఇ.ఈ.ఊ.డ ల.

209 1. దానోటువడి — అ ఇ; మున్ననన్నోటువడి మఱి తన్నునోటువడియెనో — ఏ శర. 2. మున్ననన్నోటు — అ.ఇ; విభుండు నన్నోటువడియ పిదప — క ఖ.

210 వ. ఎఱుంగవేని యక్కితవు నడిగి వచ్చి మఱి నన్నుం దోడ్కొని [1]పోవ నగు
నేని తోడ్కొని పొమ్మనినం బ్రాతికామి క్రమ్మఱి [2]వచ్చి పాంచాలి పలు
కులు ధర్మరాజునకుం జెప్పిన [3]దురోదరపరాజయదుఃఖితచేతస్కుం డగు
టం జేసి యతఁడు వానికి నదత్తప్రతివచనుం [4]డైనఁ బ్రాతికామికి దుర్యో
ధనుం డిట్లనియె.

211 క. [1]సందిగ్ధ మయిన [2]యర్థము, నిందఱ సన్నిధి[3]న యడిగి [4]తిరిగి తెలియంగ
సుందరిఁ బాంచాలేంద్రసు,తం దోడ్కొని రమ్ముపొమ్ము తడయక యనినన్.

212 వ. వాఁడును ద్రౌపది పాలికిం బోయి దేవీ నీయడిగిన [1]యర్థంబ నిర్ణయించు
వారయి సభ్యులు నిన్ను రాఁ బంచిరి రమ్మనిన దుర్యోధను [2]దుశ్చేష్టితం
బునకు ధర్మరాజు సమ్మతంబునకు [3]వెఱచి యక్కోమలి ప్రాతికామి
పిఱుంద నేకవస్త్రయు [4]నధోనీవియు నవిరళగళిత [5]నయనోదకబిందు
సందోహ [6]పరిపీడ్యమానపీనస్తన [7]పరిధానాంతరయు నగుచు సభకుం జను
దెంచి కురు[8]వృద్ధు సమీపంబున నున్నంత ద్రౌపదిం జూడ[9]నోపక లజ్జితులయి

---

210 1. పోవందగునేని — ఇ.ఈ ఊ.ణ ; పోవలసెనేని — ల ; పొమ్మనిన — ఎ. ఏ.ఒ.ఔ.క.ఖ.గ.ఘ.ఝ శ.ష , పొమ్మనిన బ్రాతికామి – పెక్కు ప్రతులు. 2. చని — కొన్నిప్రతులు. 3. నతండు దురోదర పరాజయ దుఃఖచేతస్కుండగుట జేసి వానికి – పెక్కుప్రతులు. 4. డయ్యెనంత బ్రాతికామికి – పెక్కు ప్రతులు.

211 1. సందేహమైన – అ.ఏ ఛ ఝ. 2 యర్థం బందరిసన్నిధిని–ణ ; యర్థంబిందరి సన్నిధిని – ఒ.ఘ.ఝ ; వచనంబిందర — క.ఖ.ద. 3. కివచ్చి యిందరినడుగన్ – క.ఖ.డ; కివచ్చియేర్పడెనడుగన్ — ఎ 4. యెరిగెడుగాకా – ల; యరిగెడుగాకా — ణ.

212 1. యర్థంబు – పెక్కుప్రతులు ; యర్థంబచో్ప — ల. 2. దుర్వ్యవసాయంబునకు – ల.వీ శ.ష 3. నలుకుచు – ఒ స ; నులుకుచు – ఎ.ఐ.క.ఖ డ ; నలుగక– ఆ.ఇ ఈ ; గినియక — ణ ల ; నలిగి — ఊ ఘ శ ష. 4. నధోముఖియు– పెక్కుప్రతులు. 'అధోనీవి' మూలానుగుణము భం. 2–60–14.. 5 నయనాంబుజాశ్రుబిందు — ల ; నయనారవిందబిందు — ఘ. 6. నిష్యందమాన – పెక్కుప్రతులు : నిష్యందపరిషిక్తపీన – ఏ.ఔ.ఝ 7. విధానపరిధానాంత – స ; పరిధానాంతయు — కొన్నిప్రతులు. 8. వృ ల – పెక్కు ప్రతులు. శ్వశురస్యాగ్రతోఽభవత్ — భం. 2–60–15 ; వృ లలోనున్న నిజేశ్వరు సమీపంబున నుండెనంత — ఉ.ఏ.ఒ.ఛ.ఝ.ల. 9. నొల్ల — అ.ఈ.ఏ.ఐ ఒ.ఝ.

[10]దుఃఖాయమానమానసు లయి తలలు వాంచి యున్న పాండవుల వైలక్ష్యం బుపలక్షించి సంతసిల్లి దుర్యోధనుండు దుశ్శాసనుం బిల్చి ప్రాతికామి వృకోదరునకు వెఱచు నీవు వోయి ద్రౌపదిం దోడ్కొని రమ్మని పంచిన.

213 ఆ. నిర్దయాత్ముఁ బాపనిరతు దుశ్శాసనుఁ, [1]బనుచు వెఱఁగి కృష్ణ పంకజాక్షి
గడుభయంబు నొంది గాంధారి[2]యొద్దకు, నరిగెఁ [3]గడు నడంగి యతిర
యమున.

214 చ. తడయక కౌరవానుజుఁడు దాని పిఱుందన పాఱి యింక నె
క్కడ కరుగంగఁ [1]బోలుఁ జులుకం జనుదెమ్మిట సౌబలుండు ని
న్నొడిచె దురోదరంబునఁ [2]గురూత్తము నర్థమువైతి నిన్ను[3]నుం
[4]బుడమిని దమ్ముఁ గోల్పడిరి [5]పౌర్తిభవత్పతు లైన పాండవుల్.

215 వ. అనుచు డాయ వచ్చిన [1]నక్కోమలి రజస్వల నన్ను ముట్టకు మేకవస్త్ర నయి యున్న దాన [2]గురు బంధుజనాధిష్ఠితం బైన సభకు నెట్లు రా నేర్తు ననిన నీ వేకవస్త్ర[3]వై తేమి విగతవస్త్ర [4]వై తేమి నిన్నెట్లుం దోడ్కొని [5]పోదు నని బలాత్కారంబున.

10 దుఃఖాకులితమనస్కులయి — వీ.శ.ష.

213 1. బంపుచెఱిగి — ఎ. 2. యొద్దికి — క.ఖ. 3. వడకివడకి [వణకివణకి] — పెక్కుప్రతులు.

214 1. వచ్చు — ఐ, జాలు — ఐ; బోలుబలుకం జనదేమియు — వీ.శ.ష. 2. గురూద్వహు — ఐ ణ.వ; సుయోధను — ఆ.ఊ.ఘ. 3. నీబుడమియు — అ ఎ. 4. బుడమియు — పెక్కుప్రతులు. 5. పూని — ల; పోలభవద్వరు లైన — క.

215 1. నేను రజస్వల నన్నుముట్టకుండు మేక — పెక్కుప్రతులు. 2. కురుజనాధిక; గురువృద్ధ — ఉ.ట. 3,4. వై తేనేమి (వై తేమి) — స. 5. పోవక పోనని — ల.

-: దుశ్శాసనుఁడు ద్రౌపదిని సభలోని కీడ్చి తెచ్చుట :-

216 ఉ. అవనజాననం గురుకులా[1]పళదుండు గడంగి రాజసూ
యావభృథంబునందు వసుధామర మంత్రపవిత్రవారిధా
రావళిఁ జేసి పావనము లైన శిరోజము[2]లం దెమల్చి పా
పావహుఁ డీడ్చి తెచ్చె సభ కందఱు [3]సంభ్రమ మంది చూడఁగన్.

217 వ. ఇట్లు [1]వాతావధూతం బైన పతాకయుం బోలె దుశ్శాస[2]నాకృష్టయై ద్రౌపది వికీర్ణ[3]కేశయు వివర్ణవదనయునై కర్ణదుర్యోధన శకుని సైంధవాది దుష్టభూయిష్ఠం బైన సభకు [4]వచ్చి కోపలజ్జాపరవశ [5]యయి.

218 చ. అనుపమదైవయోగహతుఁ డయ్యు నవశ్యము ధర్మసంపదం
దనరు[1]నకాక ధర్మజుఁడు [2]ధన్యుఁడు ధర్మపథంబు తప్పఁ ద్రొ
క్కనె కురు[3]వృద్ధులార ఘృశకోపనుఁ డీతఁడు నన్ను నేల దు
ర్జనుఁ డిట [4]యీడ్చితెచ్చె [5]నవిచారపరుండయి దుర్మదంబునన్.

219 చ. ఇది యుచితంబు గాదనక యిక్కురు[1]ముఖ్యులు సూచుచుండ [2]దు
ర్మదుఁడయి వీఁడు నన్ను నవమానితఁ [3]జేసెడి సర్వధర్మసం
విదు లన [4]నున్న యీభరతవీరులవంశము నేఁ డధర్మ సం .
పద నతినింద్యమయ్యెనని భామిని గృష్ణఁ దలంచె భీతయై.

216 1. ధముడట్లు (డంత) - పెక్కుప్రతులు. 2. లంగ్రగహించి — పెక్కు ప్రతులు ; లంటబట్టి - ఏ.ఔ.ఛ.ఝ. 3. విస్మయమంది — పెక్కు ప్రతులు.

217 1. చకర్ష వాయుః కదలీమివార్తామ్ – భం. 2-60-24. 2. నకరాపకృష్ణ - ఈ.ఝ ; నకరాకృష్టయై – ఉ.ఎ.ఒ క ఖ.ఛ. 3. వేణియు — గ.పీ.శ.ష. 4. జనుదెంచి - పెక్కుప్రతులు. 5. యయి యిట్లనియె — పెక్కుప్రతులు.

218 1. ననంగ – అ.ఇ ; నుగాని – ల. నకాని - వీ.శ ; 2. ధర్మపథం బదియేల తప్పద్రొక్కొను (నె)–పీ.శ.ష. 3. ముఖ్యులార — పెక్కుప్రతులు 4. కీడ్చి — ఆ.ఊ.క.ఖ. 5. నువిచారవిదూరుడు—ఉ.చ.

219 1. వృద్ధులు - ఏ.ఔ. 2. నున్మదుడై – ఒ. 3. జేయునె – ఇ.ఈ.స ; జేయుడు- అ.ఆ.ఉ.ఊ.ఐ.క.చ 4. నొప్పు నిభ్భరత - ఉ.

220 వ. ఇట్లు [1]జగత్త్రియవిజయభుజవీర్యసనాథులైన నాథులు గలిగియు ననాథయుంబోలెఁ బాంచాలరాజ[2]పుత్త్రి భయార్తయై యార్తజన శరణ్యుండైన [3]జగన్నాథు జనార్దనుం దలంచుచుఁ గపటద్యూత[4]మధుమదోన్మత్తుం డయినధర్మపుత్త్రి నిమిత్తంబున నుద్గతం బయిన పాండవపరాజ[5]యదహనంబుఁ దన రూక్షకటాక్ష[6]వీక్షణవచనంబులఁ బ్రవర్తించుచున్నదానిఁ జూచి దుఃఖితుండై భీమసేనుండు ధర్మరాజున కిట్లనియె.

221 క. ధనకనక[1]రత్నవరవాహన ధరణీరాజ్యము[2]లును నాయుధములు మమ్మును నోటువడుట యుచితమ,[3]యినసన్నిభ వీని కెల్ల నీశుఁడ వగుటన్.

222 క. [1]ద్రుపదతనూ[2]జం బణముగఁ, గపటద్యూతమునఁ [3]జేయఁ గాఁ దగునె జనాధిప [4]యిది దుష్టద్యూతము, నెపమునఁ బరిభూతయయ్యె నిష్కరుణులచేన్.

223 వ. శకునికైతవం బెఱింగియుం బాపద్యూతంబునఁ బ్రవర్తించి యధర్మప్రవృత్తుండ వయితి కావున [1]భవద్బాహు [2]దాహంబు సేయవలయునని [3]కోపించి పలికినం బవనతనయునకు నర్జునుం డిట్లనియె.

220 1. జగత్త్రయాజేయ — ఊ.ఒ.ల.స ; జగత్త్రయ రక్షణ — ఎ.స. 2 నందన — కొన్ని ప్రతులు. 3. జగన్నాథు — అ ఊ ఐ ఘ ల. ప్రతులలో లేదు. 4. మద ... ఊ ; ... — ఎ.ఒ.క ఖ; మధురాపానమత్తుండ ; పరాజితుండై సధర్మ — గ ఘ. 5. యుం బను ననలంబు దన — ఊ.ఒ.ఘ.ల.వీ. శ.ష. 6. నిరీక్షణంబులం — వీ.శ ష.

221 1. వసు - ఒ.క.ఖ.చ.డ ; రత్నగజ — ల. 2. ను మహాయుధములును — పెక్కు ప్రతులు 3. యిన నిభ యిన్నిటికి నీవధీశుడ వగుటన్ — ఐ ;యిననిభ యింతటికి నీవ యీశుడ వగుటన్ — ఈ ఎ.ఏ.ఛ.ఝ ; యినసన్నిభ యింతకీ వధీశుడవగుటన్ — ఐ

222 1. ఈ పద్యమునకు ముందు అదియునుంగాక అను వచనము 'ల' ప్రతిలోఁగలదు. 2. జబణంబుగ — పెక్కు ప్రతులు. 3. నొడ్డగా — ల వీ.శ.ష.స ; నోడగా — క.ఖ.డ. 4. యీ దుష్ట — అ.ఈ.ఎ.ఏ.ఒ క.ఖ.డ.వీ.శ.ష.

223 1. బాహూ తే సంప్రధక్ష్యామి సహదేవాగ్ని మానయ భం. 2-61-6. 2. నికృంతనంబు — ఖ. 3. రోషావేశంబునంబలి — వీ శ ష.

224 సీ. ధర్మతనూజుండు ధర్మువు దప్పిన ధరణీతలం బెల్లఁ దల్లడిల్లుఁ
దగిలి సుహృద్ద్యూతధర్మయుద్ధములకుఁ బరులచేఁ బిలువంగఁబడి విభుండు
గడగక విముఖుండు గాఁ[1]జన దని శుభ[2]క్షాత్త్రధర్మంబు లోకంబునందు
నిలిపె దా నిది పతినేరమియే దైవవైపరీత్యంబైన [3]వనరఁ దగునె

ఆ. గురుల ధర్మపరులఁ గోపించి ధీరు ల,తిక్రమింతురే తదీయ[4]నిత్య
ధర్మగౌరవం బధార్మికులగు చున్న, పరులచేతఁ జెఱుపఁబడియె[5]నిట్లు.

225 వ. అనుచు దుఃఖితు లగుచున్న పాండవులను దుశ్శాసనాపకృష్టయై సభాంత
రంబున నున్న ద్రౌపదిం జూచి[1]వికర్ణుం డన్యాయశ్రవ[2]ణ వికర్ణుడై మిన్న
కున్న సభ్యులకి ట్లనియె.

226 క. సముచితవృత్తులగు బు,ద్ధిమంతులకు నిపుడు ద్రౌపదీప్రశ్నవిచా
రము సేయవలయు నవిచా,రమునఁ బ్రవర్తిల్లు[1]టది నరకహేతువగున్.

227 వ. [1]ఇక్కురువృద్ధులైన భీష్మధృతరాష్ట్ర [2]విదురాదులును నాచార్యులయిన
ద్రోణకృపాదులుం బలుకరైరి యున్నసభాసదులెల్లం గామ[3]క్రోధా
దులు దక్కి విచారించి చెప్పుం డనిన నెవ్వరుం బలుకకున్న నే నిందు ధర్మ
నిర్ణయంబు సేసెద నెల్లవారును [4]వినుండు జూదంబును [5]వేఁటయుఁ
బానంబును [6]బహుభక్షణాసక్తియు నను నాలుగు దుర్వ్యసనంబులం దగి
లిన పురుషుండు ధర్మువుం దప్పి వర్తిల్లునట్టివానికృత్యంబులు సేకొనం

224 1. జనడదిగాన—ల ; జనదెంతయు రమణతోఁ క్షత్త్రధర్మంబులందు—ణ ; దగదని—క.డ. 2. క్షత్త్రధర్మంబు — ఈ.ఉ ఏ ఖ.జ. 3. వగవనగునె — అ ఏ.ఒ.ఔ.వీ.శ.ప ; వగవదగునె — కొన్ని ప్రతులు. 4. సత్య—ఐ.ణ.ల. 5. నేని - క.ఖ.డ.

225 1. వికర్ణుండున్యాయ—ఝ. 2. ణాకర్ణుడై —ఔ.ల.

226 1 డది — అ.ఆ ; నది—ఉ.ఊ.ఝ.

227 1. కురువృద్ధులైన — కొన్ని ప్రతులు. 2. విదురద్రోణకృపాచార్యులుం—పెక్కు ప్రతులు. 3. క్రోధంబులు దక్కిదీని — పెక్కు ప్రతులు. 4. వినుండని యిట్లనియె — ఆ.ఊ.ఒ.ఘ.ల.వీ.శ. 5. చత్వార్యాహుర్నరశ్రేష్ఠా వ్యసనాని మహీక్షితామ్ మృగయాం పానమక్షాంశ్చ గ్రామ్యేచైవాతి సక్తతామ్ ॥ మూలము 2—61—20. 6. పరనారీబహుళాసక్తియు — ల. (మూలాను

[7]దగవు [8]కితవాహూతుండై వ్యసనవర్తియయి పరాజితుం డయిన పాండవాగ్రజుండు పాండవుల కందఱకు [9]సాధారణధనం బయిన పాంచాలిఁ బణంబుఁ జేసెం గావున ద్రౌపది [10]యధర్మవిజిత [11]యకోక్క్రమలి నేకవస్త్ర [12]నిట దోడ్కొని తెచ్చుట యన్యాయం బనిన వికర్ణుపలుకుల కొడంబడక [13]కర్ణుండు వానికిట్లనియె.

228 ఆ. ఎల్లవారు నెఱుఁగ నొల్లని ధర్మువు, బేల నీకుఁ [1]జెప్ప నేలవలసెఁ
జిఱుతవాని కింత [2]తఱుసంటిపలుకులు, సన్నె వృద్ధ[3]జనము లున్న [4]చోట.

229 వ. నీవు ద్రౌపది నధర్మవిజితయని పలికితి సభా[1]సదు లెల్లనెఱుంగ ధర్మజుండు [2]దనసర్వస్వమ్ము నొడ్డి యోటువడినప్పు డిది వానికి వెలిగాదు గావున ధర్మవిజిత[3]య యిట్లు గానినాఁడు పాండవు లిందఱును దీని విజితఁగా నేల యొడంబడుదురు మఱి యేకవస్త్రయై యున్నదీని సభకుం దోడ్కొని వచ్చుట [4]ధర్మువుగా దంటి భార్యకు[5]దైవవిహితుం డయిన[6]భర్త యొక్కరుండ యిది యనేకభర్తృక గావున బంధకి యనంబడు [7]నిట్టి దాని విగతవస్త్రం జేసి [8]తెచ్చినను ధర్మవిరోధంబు[9]లేదని కర్ణుండు వికర్ణ

గుణము) 7. దగదు – పెక్కు ప్రతులు. 8 దుర్ద్యూతాహూతుండై – ణ ; కితవదురోదరోపహతుండై – క.ఖ డ ; దుర్ద్యూతపానరతుండై – ఇ.ఐ. 9. సాధారణంబయిన–పెక్కు ప్రతులు. సాధారణీ(ణా)చ సర్వేషాం పాండవానాం అనిందితా — అని మూలము భం 2–6–23. 10. నధర్మ విజిత నికోక్క్రమలి— ఐ. 11 యేకవస్త్రదీనినిట — ఆ.ఉ ఎ.ఐ. 12 నిటదెచ్చుట – క.ఖ డ ; నిట దోడ్కొనివచ్చుట– అ.ఈ ఊ ణల 13. కర్ణుండిట్లనియె – కొన్ని ప్రతులు.

228 1. నెరుగనేల — పెక్కు ప్రతులు ; నెరుగబోలవలసె – ఏ ఔ. 2. గరువతనంబిది – శ ష స; చిఱుసందితనములు - ఒ ణ ; పరుసదనంబిది – ల ; పరుసదనమ్ములు–తి ; తరుసంటి తనమిది - క.ఖ.డ ; గరువంపు బలుకులు– వీ. 3. జనులు నున్నచోట - క.ఖ డ. 4. యెడల - ణ

229 1. జనులెరుంగ - ఆ.ఈ.ఊ.ఘ. 2. దన—ఇ.క.ఖ.డ. ప్రతులలో లేదు. 3. యగునట్లుగాని — ఎ ఐ.ఒ.ల. 4 యధర్మంబంటి — వీ.శ ష. 5. ధర్మ విహితుం డయిన — ఇ.ఉ.ఎ.ఐ.ఔ ; దైవాధిష్ఠితంబైన—ణ 6. భర్తయెందును నొక్కరుండ - కొన్ని ప్రతులు 7. మరిదీని (దీనిమరి) – కొన్ని ప్రతులు. 8. తెచ్చినను — ల. కొన్ని ప్రతులు ; తెచ్చిన ధర్మ — వా 9. గాదని — ఆ.ఉ.ఎ.

వచనంబులకుం బ్రత్యాఖ్యానంబు [10]సేసిన విని [11]దుర్యోధనుండు దుశ్శాసనుం [12]బిలిచి యిప్పాండవులయు ద్రౌపదియు వస్త్రంబు లపహరింపుమని పంచిన దాని నెఱింగి.

230 క. [1]కితవవ్యవసాయపరా, జితు లగుటం జేసి బలిమి చెడి పాండుసుతుల్
ధృతిఁ దమపయిపుట్టము లా, యతకీర్తులు మున్న పెట్టి యాసభ నున్నన్.

-: దుశ్శాసనుండు ద్రౌపదిగట్టిన పుట్టం బొలుచుట :-

సం. 2-61-40

231 సీ. [1]ఇది సేయఁ గాదని మది విచారింపక సద్ధర్మహతుండు దుశ్శాసనుండు

ఐ ఒ ఝ. 10. సేసెనంత — కొన్ని ప్రతులు. 11. దుర్యోధనుండు సంతసిల్లి —
ఏ బొ.ల. ఇది కర్ణుని వాక్యముగా మూలమునఁగలదు.
"దుశ్శాసన సుబాలోఽయం వికర్ణః ప్రాజ్ఞవాదికః
పాండవానాంచ వాసాంసి ద్రౌపద్యా శ్చాప్యుపాహర భం 2-61-38.
12 జూచి – కొన్ని ప్రతులు.

230 1. కృతకవ్యవహార – చ.స ; కితవ వ్యవహార — కొన్ని ప్రతులు

231 1. ఈ పద్యమునకు పూర్వము — 'ఖ' ప్రతిలో నధిక పాఠము కలదు. ద్రౌపదీ కృతమైన ఈ కృష్ణ స్తవము పి పి.యస్. ప్రతిలో కలదు. ఇందలి కందపద్యము మాత్రమే స ప్రతిలో కలదు

క. ఏనింక నేమి సేయుదు
నీనిర్దయు చేత ననుచు హృదయ మదర న
మ్మానిని వణకుచు కృష్ణ ద
యానిధి గోవింద కావు మనుచున్నంతన్

శ్లో॥ హేకృష్ణ ద్వారకావాస క్వాసీ యాదవ నందనః
ఇమామవస్థాం సంప్రాప్తామనాథాం కిము పేక్షసే॥
శంఖ చక్ర గదా పాణే ద్వారకా నిలయాచ్యుతా
గోవింద పుండరీకాక్ష రక్షమాం శరణాగతామ్॥

హేకృష్ణ హేయదూద్వహా
హే కేశవ హేముకుంద హేగోవిందా
హేకమలనయన హేహరి
హేకమలా హృదయలోల హేగోపాలా.

వ. అని విష్ణుదేవు ప్రార్థనము చేసి యున్నంత.

నెట్టన ద్రౌపది గట్టినపుట్టంబు సభలోన[2]విడ్చె నాశంక లేక
యుడుగక యొలువంగఁ బడి[3]యు మున్నపనీతమైన తద్వస్త్రంబు [4]నట్టి వలువ
లలితాంగి జఘనమండలమునఁ బాయక యొప్పుచు నున్న నయ్యెవిధఁ జూచి

ఆ. సభ్యు లెల్ల నుదితసమ్మదు లయిరి దు,శ్శాసనుండు వస్త్రచయము పర్వ
తోపమానమయిన నొలువంగ నోపక,యుడిగె లజ్జఁ బొంది యుక్కు[5]దక్కి.

232 వ. [1]ఇట్లు భీమసేనుండు ద్రుపదరాజ[2]నందనకు దుశ్శాసనుండు సేసిన యవ
మానంబు సూచి కోపరక్తాంతనయనుం డగుచు నంత కాకారంబున దంత
[3]సందష్టదారుణముఖుం డయి యెల్లవారును [4]విన నిట్లనియె.

233 మ. కురువృద్ధుల్ గురు[1]వృద్ధబాంధవు లనేకుల్ సూచు[2]చుండన్ మదో
ద్ధురుఁడై ద్రౌపది నిట్లు సేసినఖలున్ దుశ్శాసనున్ లోకభీ
కరలీలన్ వధియించి తద్రిపుల [3]వక్షశ్శై ల[4]రక్తౌఘని
ర్ఝర [5]ముర్వీపతి సూచుచుండ సని [6]నాస్వాదింతు నుగ్రాకృతిన్.

2. నొలిచెను (దా) శంకలేక — పెక్కు ప్రతులు. 3. మున్ను వనిత మై, గట్టిన వలువలకు రణిమిగుల — ఙ. 4. నంటి — ట. 5 దరిగి — కొన్ని ప్రతులు. ధిక్ శబ్దస్తుతత్రాత్ర సముభూల్లోమహర్షణః సభ్యానాం నరదేవానాం దృష్ట్వా కుంతీసుతాం స్తదా । భం. 2–61–49. తెలుఁగుభారతము నందిది 234 వచన మందు చెప్పబడి యున్నది.

232 1. అ(య్య)ట్టి యవసరంబున – పెక్కు ప్రతులు. 2. పుత్రికి — పెక్కు ప్రతులు. 3. సందష్టాధరదారుణ – ల. 4. వినుచుండ – కొన్ని ప్రతులు.

233 1. విప్ర — క.ఖ ; ముఖ్య — ఊ ఘ. 2. చుండంగ నుద్ధురుడై — ఒ.క.ఖ. 3. వక్షఃప్రాంత — ఊ.ఒ.ఘ.జ ; వక్షోపాంతరక్తంబు నిర్ఝరులాశ్చర్యము (త) నొంది చూడనని నాస్వాదింతు రౌద్రాకృతిన్ – ఛ.ఝ ; వక్షస్స్ఫీతరక్తంబు — ఏ. 4 రక్తాంబు — ఈ.వ ; రక్తము నిర్ఝరులాశ్చర్యము పొందిచూడ — వ. 5. ముల్ వీరలు — కొన్ని ప్రతులు. 6. నాఘ్రాణింతు — ఙ.

234 వ. ఇట్లు సేయనైతినేని [1]పితృపితామహులగతికిం దప్పినవాఁడ నగుదు ననిస నతని యతిమానుషం బయిన [2]మహావ్యవసాయంబున [3]కద్భుతం బంది దిక్కులుచూడక ధిక్ఛబ్దముఖరితముఖు లగుచు [4]సభాజనులు తమలో సపుత్త్రికుం డయిన ధృతరాష్ట్రి నిందించుచు దుౕపదరాజపుత్త్రి వాక్యం బులు [5]విచారింపక వృద్ధరాజు లుపేక్షించి రనుచుండిరంత [6]నుద్యతబాహుం డయి విదురుం డెల్ల[7]వారిని వారించి యిట్లనియె.

235 క. సుమతులు పాంచాలీ ప్రశ్నమునర్థము [1]నేర్పడన్ విచారింపుఁడు [2]పా పము వొందు ధర్మసందేహము దీర్పని[3]నాఁడు సభ్యులగు [4]సజ్జనులన్.

236 మత్తకోకిలము. ఈవికర్ణుఁడు బాలుఁడయ్యును [1]నేర్పరించి యథావిధిన్
దేవమంత్రియ పోలె [2]ధర్మువుఁ జెప్పె నీతనిబుద్ధి మీ
రేవగింపక చేకొనుం డిది [3]యెల్లయందును [4]ధర్మ స
ద్భావ మొక్కని కేర్పరింపఁగ బ్రహ్మకైనను బోలునే.

237 ఆ. సభకు వచ్చి ధర్మసందేహ మడిగిన, నెఱిఁగి[1]చెప్పకుండి రేని సభ్యు లన్నృతదోషఫలమునం దర్ధమొందుదు, రనిరి ధర్మవేదులైన మునులు.

238 ఆ. [1]ధర్మువెఱిఁగి దానిఁ దా నొండుగా [2]లాభ,లోభపక్షపాతలోలబుద్ధి సభల నెవ్వఁ డేని [3]సభ్యుఁడై పలుకువాఁ,డన్నృతదోషఫలము ననుభవించు.

234 1. యస్మత్పితృ — కొన్ని ప్రతులు. 2. సాహసవ్యవ — ఇ ఔ.ఛ ఝ. 3. కునం దరు నాశ్చర్యంబంది — ఎ.ఐ ఒ ; కద్భుతంబంది ధిక్ఛబ్దముఖరిత — పెక్కుప్రతులు 4 సభాజనులు తమలో — కొన్ని ప్రతులలో లేదు 5. నిర్ణయింపక — ఇ.ఎ.ఔ. ఝ. 6. నుద్గత — పెక్కు ప్రతులు, నుద్గతబాహ్వనయనుండై — ఊ.ఒ ఖ ఘ. శ.ప. 7. వారును విననిల్లనియె — పెక్కు ప్రతులు.

235 1. నేర్పడగవిచారింపరు—ణ ; నేర్పడన్‌విచారింపరు — ఆ. 2 దోసమువొందు—ల. 3. వారు సభ్యులగుదురె జగతిన్ — క.ఖ డ 4. జనములకున్—ఎ ఏ ఐ.ఒ.గ.ల.

236 1. నేర్పరించె — కొన్ని ప్రతులు ; నిందరున్ వినుచుండగా — వ. 2. కర్జము—ఆ. 3. యిట్టులెందును — వీ.శ ష.స , యిష్టమందును - ఎ ఐ 4 జూడ—క.ఖ.డ.

237 1. తీర్పకుండి - కొన్ని ప్రతులు ; తెలుప — ఆ.

238 1. ధర్మువెరిగి యెరిగి దానినొండొకలాభ — ఉ.స ; ధర్మమెరిగియరిగి దాని వా రొండుగా - ణ. 2. కామలోభ - ఈ. 3. సరగున — ణ.ల.స.

—: విరోచన సుధన్వుల వృత్తాంతము :—

239 వ. ఈయర్థం [1]బితిహాసంబులయందు వినంబడుఁ దొల్లి ప్రహ్లాదునికొడుకు విరోచనుండును [2]నంగిరసుండనువిప్రునికొడుకు సుధన్వుండు[3]ను నొక్కకన్యాప్రతిగ్రహ నిమిత్తంబున నెల్ల[4]సుగుణంబుల [5]నేన పెద్ద నేన పెద్దనని తమలో నిద్దఱును [6]ప్రాణంబు లొడ్డుగా నొడ్డి వివాదంబు సేసి ప్రహ్లాదు[7]పాలికిం జని రందు సుధన్వుండు ప్రహ్లాదున కిట్లనియె.

240 తే. నీవు ధర్మ[1]విదుండవు మావివాద, మెఱిఁగి [2]తీర్పు గుణశ్రేష్ఠుఁ డితఁడొ నేనొ
చెప్పు మన్యథాబుద్ధివై చెప్పి తేని, మఘవుకులిశంబు వ్రచ్చు నీమస్తకంబు.

241 వ. అనినం బ్రహ్లాదుండు భయంపడి [1]కశ్యపుకడకుం [2]జని విరోచన [3]సుధన్వులు తన్ను వివాదనిర్ణయం బడిగినవిధంబును జెప్పి[4]న విని వానికిం గశ్యపుం డిట్లనియె.

239 1. బునసందొక్క(నకొక్క) యితిహాసంబు గలదు — ఎ.ఐ.ఒ.క ఖ.డ ; బితిహాస రూపంబున — ఆ ఈ.ఊ ఘ చ.ణ.శ.ష. 2 నంగిరసుండను విప్రుని కొడుకు — పెక్కు ప్రతులలో లేదు 3. ననువారలు వైవాహికకన్యా పరిగ్రహణ నిమిత్తంబున — ల. 4. గుణంబుల — పెక్కు ప్రతులు. 5. మేమ పెద్దలమని తమలో నిద్దరును వివాదంబు సేసి — పెక్కు ప్రతులు. 6. ప్రాణంబులొడ్డుగా నొడ్డి — పెక్కు ప్రతులలో లేదు. కాని మూలములోఁ గలదు. తయోర్దేవ నమత్రాసీత్, ప్రాణయోరితినః శ్రుతమ్. భం. 2-61-60. 7. కడకుం — కొన్ని ప్రతులు.

240 1. పరుండవు — వ. 2. తీర్చి గుణోత్కృష్టుడితడొ నేనొ — ఐ ; తీర్పుగుణోత్కృష్టుడితడొ నేనొ — గ.

241 1. కశ్యపమహామునిపాలికిం—ల ; కశ్యపమహాముని — ఎ.ఐ. 2. బోయి— పెక్కు ప్రతులు. 3. సుధన్వుల వివాదపద ప్రశ్న నిర్ణయంబును ప్రాణంబు పణంబు చేసి యడిగిన - వి.శ.ష. 4. నగశ్యపుం డిట్లనియె - కొన్ని ప్రతులు.

242 తే. సాఱియును [1]ధర్మదర్శి యు [2]సాఱి [3]ధర్మ, విధులు దప్పంగఁ జెప్పిన నధమవృత్తి
వరుణపాశసహస్రంబు వానిఁగట్టి, [4]పాయునేఁటేఁట నొక్కొకడాయతముగ.

243 వ. [1]ధర్మం బధర్మవిద్ధంబయి సభకు[2]వచ్చిన దానిం [3]దీర్పనిసభ్యు లధర్మవిద్ధులగుదురు [4]మఱిసభ్యులు కామక్రోధంబులు విడిచి [5]యధర్మంబు నాపనినాఁడయ్యధర్మం[6]బునం దొక్కపాదంబు సభ్యుల [7]నొక్కపాదంబు భూపతిఁ దక్కినయది గర్తనుం బొందు [8]సమంజసులైన సభ్యులచేత [9]విధ్యుక్తం బయ్యోనేని నధర్మంబు కర్తనుం బొందుఁ గావున ధర్మంబు దప్పక చెప్పవలయు ననినంబ్రహ్లాదుండు [10]ధర్మమతియై విచారించి తన[11]కొడుకుకంటె గుణశ్రేష్ఠుఁడుగా సుధన్వుం జెప్పినఁ బుత్త్రస్నేహంబు విడిచి ధర్మువు దప్పకచెప్పి తని ప్రహ్లాదుం బ్రశంసిం[12]చి సుధన్వుం డరిగెఁ [13]గావున

242 1. ధర్మవర్తియు — ల; ధర్మవిదుడును — ఝ. 2. సభలయందు — ఆ.ఊ.ల.వీ.శ.ష.స; సాక్ష్యవిధులు—నూ; సాంఖ్యధర్మవిధులు దప్పంగ జెప్పిన నధమవృత్తి — క.ఖ; ప్రాసయతి సరిపోవులకై ఘ.స. లందలి పాఠము గ్రహింపఁబడినది; సభలయందు దప్ప జెప్పిరి యేని సధర్మన్వృత్తి; సభలయందు దప్పుగా జెప్పిరేని యధర్మవృత్తి—ల; సాక్ష్య విధులు దప్పఁగాదు తప్పినను నధర్మయుక్త—ఓ ఛ.జ.వా. 3. ధర్మువును దప్ప జెప్ప నధర్మన్వృత్తి — ట 4. పాయునొక్కొకక్క ఁటేఁట నాయతముగ — ల శ.ష; పాయు నెప్పుడు నేఁటేఁట నాయతముగ — క డ; పాయకెప్పుడు నేఁటేట ద్రోయునతని — ఎ.గ.

243 1. ధర్మాధర్మవిరోధంబయిన దాని దీర్పనిసభ్యులు ధర్మవిరుద్ధులగుదురు కావున — శ.ష; ధర్మాధర్మవిరుద్ధంబయి సభకు వచ్చినదాని నిశ్చయించి దీర్పని — కొన్ని ప్రతులు. 2 వచ్చి ధర్మనిర్ణయం బడిగిన దాని నిశ్చయించి చెప్పని సభ్యులు ధర్మవిరుద్ధులగుదురు — ల. మూల మిట్లున్నది. విద్ధోధర్మోహ్యధర్మేణ సభాం యత్ర ప్రపద్యతే నచాస్య శల్యంకృంతంతి విద్ధాస్తత్ర సభాసదః భం. 2-61-69.3. చెప్పకున్న-ఇ.ఎ ఐ 4. మఱిసభ్యులు—కొన్నింట లేదు. 5. ధర్మువుబోవనినా—క.ఖ డ. 6. బుదోషంబునం—అ.ణ.ల 7. బాదంబుగర్తను, దక్కిన యది భూపతిం బొందు గావున — ల. ఇచ్చట మూలమిట్లున్నది. అర్ధంహరతివై శ్రేష్ఠః పాదోభవతి కర్తృషు, పాదశ్చైవ సభాసత్సు యేననిందంతి నిందితమ్. భం. 2-61-70 8. సజ్జనులైన—ఆ.చ.ణ. 9 విధ్యుక్తంబైన యధర్మంబు — ఇ ఊ.ఎ; విధినియుక్తంబైన యధర్మంబు-డ; విధ్యుక్తంబుగాదీర్పంబడిన యధర్మంబు-ఔ. 10. ధర్మంబు-ఓ.ఔ.క.ఖ.ఘ.డ; ధర్మమతి విచారించి-అ ఈ.ఎ ఏ.ఐ ణ. 11. తనూజుకంటె-కొన్ని ప్రతులు. 12. చి విరోచనునకు బ్రాణంబొసంగి — ఒ.వీ శ.ష. 13. గావున —

మీరును [14]ద్రౌపదీ[15]ప్రశ్నంబునందు ధర్మబుద్ధి సేయుండని విదురుండు పలికిన దుర్యోధనుభయంబున సభ్యు లెవ్వరుం బలుక[16]రయిరి ద్రౌపదియు నట్లు సకల[17]క్షత్త్రియసమక్షంబున దుశ్శాసనుచేతం బరిభవింపంబడి [18]దుఃఖిత యయి.

244 సీ. [1]అవ్విధంబున నొప్పి యాస్వయంవరమునాఁ డఖిలభూపతులచేనట్లు సూడఁ
బడి పాండవుల ధర్మపత్ని నై గోవిందుచెలియలి నై వీనిచేత నిట్లు
పరిభూత నగుచు సభామధ్యమున మహీపతులచేఁ జూడంగఁ బడితి నింత
వడుదునె యిపుడు నాపలుకుల కెవ్వరుఁ బ్రతివచనం బేల పలుక[2]రై రి

ఆ. ధన్యులార[3]యే నదాసినే, దాసినే యెఱుఁగఁ జెప్పి పనుపుఁ డెల్ల[4]దాని
ననుచు [5]వనరుచున్న [6]నాపగాసుతుఁడు శాంతనవుఁ డిట్టులనియె దానిఁ
జూచి.

245 వ. అవ్వా నీప్రశ్నంబునకు నుత్తరం బయ్యుధిష్ఠిరుఁడు సెప్పవలయుఁ [1]గాని [2]నాఁడు ధర్మసూక్ష్మత [3]యెవ్వరికి నెఱుంగ గహనంబు దీని[4]ఫలంబు వేగంబ [5]యిక్కురుకులపాంసను లనుభవింతు రని పలుకుచున్న [6]యవసరంబున నక్కోమలిం జూచి [7]నగుచు.

కొన్నింట లేదు 14. ద్రుపదరాజ పుత్రి యడిగిన ధర్మనిర్ణయంబు తప్పకచెప్పుండని — వీ.శ.ష 15. ప్రశ్నయందు — కొన్ని ప్రతులు , ప్రశ్నార్థంబునందు — ఎ ఐ ఒ క.ఖ డ, ప్రశ్నంబునకు ధర్మనిర్ణయంబు తప్పకచెప్పుండని—ల 16 కుండిరి - పెక్కు ప్రతులు. ఇట సభాసదులు మిన్నకుండగా, కర్ణుడు ద్రౌపదిని ద్యూతవిజిత యని చెప్పుటయు — ఇత్యాది మూలమున గలదు. కర్ణోదుశ్శాసనం త్వాహకృష్ణాం దాసీంగృహాన్ నయ తాంవేపమానాం సవ్రీడాం ప్రలపంతీం స్మపాండవాన్ దుశ్శాసనః సభామధ్యే విచకర్ష తపస్వినీమ్! భం 2–61–71. 17. క్షత్త్రి — కొన్ని ప్రతులు 18. మహాదుఃఖితయై—వీ.శ.ష. కొన్నిప్రతులు

244 1. స్వయంవరే యాస్మినృపైర్దృష్టారంగే సమాగతైః నదృష్ట పూర్వాచాన్యత్ర సాహమద్యసభాంగతా— ఇత్యాదిశ్లోకములు భం. 1–62—4నుండి 13వఱకు ఈ పద్యమునకు మూలములు; అవిధంబున నట్టులా — వ వీ శ.ష 2. రయ్యె — పెక్కు ప్రతులు. 3. యేనుదాసినేవీని [రి]కి— శర. పెక్కుప్రతులు. 4. వారు— ఈ.ప. 5. నరచు — కొన్నిప్రతులు. 6. యానసభలోన — క.ఖ డ.

245 1. గానినాడు—ఇ.ఈ ఐ.క.ఖ.ఘ.డ. ప్రతులలోలేదు. 2. నాడు—పెక్కుప్రతులలో లేదు. 3. యెరింగి చెప్ప నెవ్వరికి—ఎ.ఏ.ఐ డ ; యెవ్వరికిన్నెరుగంగ—ల. 4. ఫలంబు వేణుఫలంబునుంబోలె యిక్కురు—ఇ.ఎ. 5. యిక్కురుపాంసను—ఆ.ఇ.ఈ ఔ.గ చ. 6. యవసరంబున—కొన్నిప్రతులలోలేదు. 7. నగుచు కర్ణుండిట్లనియె—కొన్నిప్రతులు.

246 తే. [1]తరుణి [2]యేవురకంటె నొక్కరుఁడ భర్త, యగుట [3]లగ్గు జూదంబున నాలి [4]నోటు
వడనివానిఁగాఁ దగుభర్తఁ బడయు మింక,ననుచు రాధేయుఁ డుల్లసమాడె [5]నంత.

247 ఉ. [1]అమ్మదితర్ణ విభీతహరిణాక్షిఁ [2]గలాపవిభాసి కేశభా
రమ్మున నొప్పుదానిఁ దనరమ్య[3]పృథూరుతలంబు నెక్కఁగా
రమ్మని సన్న సేసె ధృత[4]రాష్ట్రిసుతాగ్రజుఁ డప్డు దాని దూ
రమ్మునఁ [5]జూచి కౌరవకురంగమృగేంద్రుఁడు భీముఁ డల్కతోన్.

248 క. లయసమయదండధర [1]నిర్దయుఁడై ధరణీశు లెల్లఁ దనపలుకులు వి
[2]స్మయసంభ్రమభయసంభృతు,లయి వినుచుండంగ నిట్టు లనియెన్ సభలోన్.

249 ఉ. ధారుణి రాజ్యసంపద మదంబునఁ గోమలిఁగృష్ణఁ[1]జూచి రం
భోరు నిజోరుదేశమున నుండఁగఁ బిల్చిన యిద్దురాత్ము దు

246 1. ఇట — ఓ ప్రతిలో నధికముగా పద్యముకలదు- ఈపద్యమే ఉద్యోగపర్వ ప్రథమాశ్వాసమున 350వ పద్యము. ఇంచుక మార్పుతోనున్నది.
క. లేరిచట మగలునీకును
వీరలుజూదమున నోడి విడిచిరి నిన్నున్
వారిజలోచన నీపైఁ
గూరిమిగల మగని వెతకికొను మెరు ననియెన్.
2. యేగురికంటె - ఇ.ఈ ణ. 3. మేలు — ల; లగ్గు జూదంబునందాలి — పి.శ.ష. 4. గోలువడని — అ. 5. నధిప — ట.

247 1. ఈపద్యమునకు ముందు, అయ్యవసరంబున, అనువచనము ఉ.ఝ వ. ప్రతులలోఁ గలదు 2. విలూనవికీర్ణకేశ — చ. 3. మృదూరు — ఈ.ఉ.ఎ. 4 రాష్ట్రిని యగ్రసుతుండు దాని — ఏ.గ.చ.వ. 5. గాంచి — కొన్నిప్రతులు.

248 1. నిర్దయ కోపసముద్గత ప్రతాపానలవి — ల. 2. స్మయభయసంభ్రమ— క.ఖ.గ; స్మయభయ సంభ్రమపరివృతులయి — అ.ఔ.గ.ణ; స్మయసంభ్రమ సంభృతులయి భయమున వినుచుండనాసభన్ దగబలికెన్ — ల.శ.ష.

249 1. నిట్లు - ఝ స; జారు — వ; గ్రమ్మరం, గోరనిజోరుదేశమునకున్ దగ

ర్వారమదీయబాహుపరివర్తితచండగదా[2]భిఘాత భ
[3]గ్నోరుతరోరుఁ జేయుదు సుయోధను నుగ్రరణాం[4]తరంబునన్.

250 వ. అని సర్వజనభయానకక్రోధావేశ[1]వివశుం డయి [2]యాయుధంబు లున్న వలనికి [3]దృష్టులు సలుపుచు నగ్రజుమొగంబు సూచుచున్న [4]భీమసేను నతిరౌద్రాకారంబు సూచి భీష్మవిదురద్రోణాదు లిది కోపంబునకవసరంబు గాదని యాతనిం బ్రశాంతచిత్తుం జేసి రంత.

251 క. ధృతరాష్ట్రు నగ్నిహోత్రా, యతనంబున [1]నఱచె వఱకు లగ్నులు శాంత
ద్యుతుల య్యెఁ గౌరవస్త్రీ, తతిహృదయము లధికశోకతప్తము లయ్యెన్

252 క. [1]క్రూరాత్మకు[2]లై దుష్పద, వీరతులగు ధార్తరాష్ట్ర [3]వీరులకయ్యా
గారములఁ నెగసెనెంతయు, ఘో[4]రంబుగఁ గాకఘూకఘూత్కారంబుల్.

253 క. అట్టి మహోత్పాతంబులు, పుట్టినఁగృపవిదుర [1]కలశభూశాంతనవుల్
పెట్టన ధృత[2]రాష్ట్రజులకుఁ, [3]బుట్టె నరిష్టమని రిష్టమునఁ దమలోనన్.

బల్విన — ణ 2. విఘాత - ఇ.ఊ.ఏ ఐ.ఒ.క.ఖ.గ ఘ.ఝ.ణ. 3. గ్నోరుగ జేయుదున్ ఖలు — వ. 4. గణంబునన్ — ఏ.ణ వ. ఇట ద్రౌపదీ శాపవాక్యములు పి.పి.యస్. ప్రతిలోఁ గలవు 2-63-80

250 1. మానసుండయి — ఏ ఔ. 2. తన (తమ) యాయుధంబు — పెక్కుప్రతులు. 3. దృష్టినిలుపుచు — అ.ఘ చ. 4. భీమసేను రౌద్రా—పెక్కుప్రతులు.

251 1. వరశ్శరచె నగ్నులు — ఊ.గ.చ.

252 1. క్రూరాత్ములు నతిదుష్పథవీరులునగు — ణ.(?); క్రూరాత్మకులును దుష్పద వీరులునగు — ఒ. (?); క్రూరాత్మకులగు కౌరవవీరులయును — క.ఖ.డ ; క్రూరాత్మకులును దుష్టప్రారంభులు నయిన ధార్తరాష్ట్రుల — పి. శ. ప 2. లును దుష్పదవీ — ల. 3. విస్తృత-ఉ.వ. 4. రముగా — పెక్కుప్రతులు.

253 1. కలశభవ — ఊ.ఎ ఐఖ. 2. రాష్ట్రునకుం — ఇ.ఎ.క.ఝ.డ. 3. బుట్టు నరిష్టమని — కొన్నిప్రతులు ; బుట్టు నరిష్టమని రపుడు పొల్పుగ దమలోన్ — స; బుట్టునరిష్టంబు ననిరి బొలుపుగ దమలోన్—ఝ.వ.

254 వ. అంత నంతయు నెఱింగి గాంధారి విదురుం దోడ్కొని ధృతరాష్ట్రు[1]కడకుం బోయి పాండవపరాజయంబును ద్రౌపది[2]పరిభవంబును దుర్నిమిత్తోత్పత్తియుం జెప్పిన విని[3]ధృతరాష్ట్రుండు దుర్యోధనుం [4]బిలిచి యిట్లనియె.

255 చ. పరమపతివ్రతన్ [1]సభఁ దపస్వినిఁ బాండవధర్మపత్ని ధ
ర్మరత నయోనిజం బ్రకృతిమానవభామినిఁ గాఁ దలంచి దె
ప్పరములు వల్కఁగాఁ దగునె బాల్యము[2]నాదిగ దుష్ట[3]భావనం
బెరఁగితి నీనిమిత్తమునఁ బెద్దయు దుఃఖితులైరి పాండవుల్.

256 వ. [1]వారలవలన [2]నీదురాగ్రహం బుడుగుమని కొడుకును [3]భంగించి సకల బాంధవహితంబు సేయం [4]దలంచి ద్రౌపదిని రావించి శాంతవచనంబుల నిట్లనియె.

*—: ధృతరాష్ట్రుండు ద్రౌపది గోరినవరంబు లిచ్చుట :—*

సం. 2-63-27

257 క. సుందరి నా[1]కోడండ్రుర, యంద[2]ఱ్ఱ్యర్హితవు నీవ యతిముదమున నీ
[3]కుం దఁగఁ [4]బ్రియంబు సేసెద, నిందుముఖీ వేఁడు మెద్ది యిష్టము నీకున్.

258 వ. [1]అనినం బాంచాలి యిట్లనియె

254 1. పాలికిం — కొన్నిప్రతులు 2. పరిభవప్రకారంబును — పెక్కుప్రతులు. 3. ధృతరాష్ట్రుండదరిపడి—ఇ ఊ. ఘ ల. శ. ష. 4 బిలిపించి — ఎ.ఏ.ఐ.క.ఖ.చ.ద ల.

255 1. సతి — కొన్నిప్రతులు. 2. దక్కవు — పెక్కుప్రతులు 3. వాసనన్ — ఈ.ఎ.ఐ ఒ క.ఖ.గ ఝ.ణ ల.శ.ష

256 1. నీవు వారివలన క్రోధంబు విడువుమని కొడుకును వారించి — శ ష. 2. నీ— పెక్కుప్రతులలో లేదు. 3 భర్జించి — అ.ఇ ఎ.ఒ.చ స ; వారించి — క.ఖ.డ. శ.ష.స ; బదరి — అ.స. 4. దలంచినవాడై — పెక్కుప్రతులు.

257 1. కోడండుర — ఇ.సం. 2 ఖ్యర్హితవు — గు ప్రౌ.శ ష స సూ సం.శ; ఖ్యర్చితవు — ఐ. వా. 3. కొందఁగ—వా కొన్నిప్రతులు; కుందగ — కొన్నిప్రతులు. 4. వరంబులిచ్చెద — ఉ ల.స.

258 1. అనిన ధృతరాష్ట్రునకు ద్రౌపది యిట్లనియె — ఎ.ఐ.ఖ.ల.

259 ఆ. కరుణతోడ నాకు వరము ప్రసాదింప, బుద్ధియేని లోకపూజితుండు
[1]మనునిభుండు ధర్మతనయుండు దాస్యంబు, వలనఁ బాయవలయు
వసుమతీశ.

260 వ. అట్లయినం గురుకుమారులు గురువృద్ధ[1]జనలాలితుండై పెరిఁగిన [2]ప్రతి
వింధ్యు దాసపుత్త్రుం డన కుండుదు రిదియ [3]నాయిష్టం బనిన నిచ్చితి నింక
[4]రెండవవరంబు వేఁడుమనిన ద్రౌపది యిట్లనియె.

261 క. నెమ్మిని ధర్మజు నలువురు, [1]దమ్ములుఁదమయాయుధ[2]ముల దమవర్మవరూ
[3]ధమ్ములయుఁదోడ సకలహి,తమ్ముగఁ బాయంగవలయు దాస్యమువలనన్.

262 వ. అనిన ధృతరాష్ట్రుండు [1]నీకోరినవరం[2]బిచ్చితి నింక [3]మూఁడవవరంబు
వేఁడుమనిన ద్రౌపది యిట్లనియె.

263 ఆ. వైశ్యసతికి నొక్కవరము సత్క్షత్త్రియ, సతికి రెండు శూద్రసతికిమూఁడు
విప్రసతికి [1]నూఱు వేఁడ [2]జన్వరములు, [3]గాన యింక వేఁడగాదు నాకు.

259 1. ఘననిభుండు — క.

260 1. జనోపలాలితుండై —ఎ.ప.ఐ.ఒ.ఔ ; బాంధవోపలాలితుండై — గ. 2. ప్రతి వింధ్యుండు—కొన్నిప్రతులు. 3. నాకునిష్టంబనిన—కొన్ని ప్రతులు. 4. నొక్క— అ.ఒ.

261 1. దమ్ములు శస్త్రాస్త్రములయు దమవర్మవరూ — ట ; దమ్ములు దమ వస్త్రములయు దమ శస్త్రవరూ — ప్రౌ ల.వీ.శ ష ; దమ్ములు దమయస్త్రము లయు దమ దివ్యవరూ—డ. 2. ములు దమదివ్యరథాశ్వమ్ములతోడను సర్వ హితమ్ముగ — కొన్నిప్రతులు. 3. ధమ్ములతోడను సకల — గు.ప్రౌ వీ సం.

262 1. దానికోరిన వరంబిచ్చియింక—పెక్కుప్రతులు. 2. బిచ్చియింకను వరంబు—ట. 3. నొక్కవరంబు — ల.

263 1. నూరువేడంగ జనుగాన నింక వేడగాదు ఇభపురేశ (?)—కొన్నిప్రతులు ; నాల్గు, వేయు, మూడు అని భిన్నప్రతులలోఁగలదు. కాని యిది మూలవిరుద్ధము ; నూరు వేడంగ జనుగాని (గాక,గాన) యింక వేడగూడ దిభపురీశా — కొన్ని ప్రతులు; నూరువేడంగ వరములు — ల (?) 2. నౌవరములు — క.ఖ. 3 గాననింక — అ.ఝ.సం ; గాకయింక — ఊ.ఎ.ప.ల ; గానియింక — ఇ.ఒ.గ.ఘ.ష.

264 వ. అనిన ధృతరాష్ట్రుండు [1]కోడలిగుణంబులకు [2]ధర్మంబెఱుంగుటకు సంతసిల్లి [3]యనుజసహితుం [4]డయిన యుధిష్ఠిరు రావించి [5]నీవు సర్వ

264 1. నక్కోమలి యుత్తమగుణం – జౌ.ఘ ల. 2. ధర్మసూక్ష్మత యెఱుం—ఎ.ఐ. 3. ఇక్కడ ఈవచనమునడుమ — ఇ.లో గుర్తింపఁబడిన యధికపాఠము కొద్ది మార్పులతో స ప్రతిలోఁ గలదు. కాని దీనికి మూలము మృగ్యము.

వ. శకునిం బిలిచి ద్రౌపదితో నొక్క యొడ్డొడ్డి యాడు మనిన నతండులు దెచ్చి యిచ్చి నీకిష్టంబైన యొడ్డొడ్డుమనిన ద్రౌపదియు నత్యంతశుచిర్భూతయై నీళ్లు నతులు పుచ్చుకొని త...న మాద్రేయులకునమస్కరించి నాకుం బ్రతికూలురరయి పాండవులను నన్నునుం గెలుపించి శత్రులం దృంచువిధంబు గావలయు వాకు నను కూలురు గండని వేడుకొని యడ్డసారెలు బుచ్చుకొని శకుని కిట్లనియె.

క. ఈసభ యెల్లనుజూడగ
దాసత్వము సేయగాని దాసత్వమునం
జేసి మీతోడ బోరగ
గాసిల్లినచోట నేను క్రమ్మరదివుతుఁ.

ఆ. వె. నీవువోడితేని నీకతంబ యేవ్వర
దాసవృత్తి వాసి తద్దయెరుగ
...... యొండు యాడంగ గణగుము
యనిన శకుని యిట్లనియె మగుడ.

ఆ. వె. ఆడియోడిపోవుడది ధర్మువె వారి
కనిన నాతియిట్లనియె నతని
కోపమలదియు నిల్వకోలదియె వాయుఁ
గరుడి దాసితనము గణగినట్లు.

వ. అనిన దుర్యోధనుండు ద్రౌపదిపలికిన యట్ల మా కోపంబులు వారికోపంబులు నుడుప బ్రహ్మాదులకు నగునె యిదియె యొడ్డొడ్డి యాడు మనిన శకుని యాగాక యని యొడ్డొడ్డిన యక్కోమలికి వరదులైన మాద్రేయులు ద్రౌపది గెలుచు నట్లుగాబడిన.

క. ఇంకవొడ్డుకయొడ్డువినుమా
శంకిత దివ్యాంబరములు శరములు రథముల్
కంకటములు భూషణములు
ముంకొని నీవొడ్డియాడు మున్నతిమతివై.

క. అనియట్లు యొడ్డియోడిన
మనమున గౌరవుడు వెరచి మానుమని నీ
వనితకు నీసారెలు గడు
ననయంబును గెల్వనిచ్చు నక్రమలీలన్.

వ. అని వారించె ద్రౌపదియు దనపురుషులకడకు వచ్చియున్నంత—ఇ. 4. డై విన్న నై యున్న యుధిష్ఠిరుం బిలిచి—పెక్కు ప్రతులు. 5. నీవు నీసర్వ—ఆ.ఎ.ప ఐ.గ.

సంపద[6]లు స్వరాజ్యంబు [7]నొప్పుగొని యెప్పటియట్లు యింద్రప్రస్థపురంబున కరిగి సుఖం బుండుము నీకు [8]లగ్గయ్యెడమని [9]వెండియు.

265 తే. నీవునిత్యంబు వృద్ధోపసేవఁ జేసి, [1]యెఱుఁగు దెల్లధర్మంబుల నెఱుక లేక కడఁగి నీకెగ్గుసేసె నాకొడుకు దీని, మఱచునది [2]నీకు నేనొండ్లు గఱపనేల.

266 క. మనమున [1]వేరమిఁ దలఁపమి, యును [2]సతము చిత్తుఁ డగుటయును [3]గుణములు [4]కై
కొని[5]దోషంబులు విడుచుట,[6]యును నుత్తముఁ డయిన పురుషునుత్తమ గుణముల్.

267 వ. ఏను బుద్ధిలేక జూదం[1]బు పేక్షించితి నల్పబుద్ధి[2]సత్త్వుండయిన వృద్ధునన్నును [3]మీతల్లియయిన గాంధారినిం దలంచి దుర్యోధ[4]నాదులు సేసిన[5]దుర్నయంబులు [6]సేకొనకుండునది సర్వశాస్త్రవిదుం డయిన విదురుండు మంత్రిగా సర్వధర్మవిదుండవైన నీవు రక్షకుం[7]డవుగా నిక్కురుకులంబునకు లగ్గగునని ధర్మరాజుఁ [8]బాండురాజు రాజ్యంబునందు [9]సమర్పించిన.

6. లును రాజ్యంబు – పెక్కుప్రతులు 7 నొప్పంగొని—ఉ.ల.వి. 8. లగ్గయ్యెడుమని—ఆ.ఉ ఔ.గ 9. దీవించి – అ.ఘ; వెండియు ధృతరాష్ట్రుం డిట్లనియె — కొన్ని ప్రతులు

265 1. యెరుగుమీవు నెల్లధర్మువు లెరుక లేక—ఉ; యెరుగు దెల్లధర్మంబులు నెరుకలేక—పెక్కు ప్రతులు. 2. యేను నిన్నొండ్లుగరపనేల — అ.ణ.వి.శ.ష ; నిన్ను నేనొండ్లు [డు] — ఈ ఊ క.ఖ గ ట.డ.ల.

266 1. వైరము — పెక్కు ప్రతులు. 2 సద్ధర్మాత్ముడగుటయును — వి.శ.ష ; నుత్తమచిత్తు—ఛ.ఝ.వ. 3. దోషంబుల్ గొనక గుణంబులు విడువమియును — క ఖ.డ. 4. చేకొని–పెక్కుప్రతులు 5 విద్వేషంబుడుగుటయును సుజనుల కివియె యొనర నుత్తమగుణముల్ — ఉ. 6. యును సముద్రైనట్టి పురుషునుత్తమగుణముల్ — ట.

267 1. బపేక్షించితి — కొన్ని ప్రతులు. కాని యిది మూలానుగుణము కాదు మయాద్యూత మిద మాసీ దుపేక్షితమ్ భం. 2–65–12. 2. సత్త్వుండనైన — ట.ల.వి. 3. మీ తల్లి గాంధారినిం – పెక్కు ప్రతులు ; మీ యమ్మ గాంధారి — క.ఖ.డ. 4. ను దుర్గుణంబులు — క.ఖ.డ ; నాదుల దుర్గుణంబులు — పెక్కు ప్రతులు. 5. దుష్కర్మం — ఔ.ట. 6. దలంపక సర్వశాస్త్ర — శ.ష. 7. డవుగాకురు — పెక్కు ప్రతులు. 8. బాండు రాజ్యంబునందు — కొన్ని ప్రతులు. 9. నియోగించిన – పెక్కు ప్రతులు.

268 తరలము. తరుణి ద్రౌపది యిట్లు పాండవ ధార్తరాష్ట్రులకైన భీ
కరపరస్పర కోపవేగము గ్రన్నఁ[1]బాచి విపత్తి సా
గరనిమగ్నుల నుద్ధరించెఁ బ్రకాశకీర్తుల [2]ధీరులం
బురుషసింహములన్ నిజేశులఁ[3]బూని తద్దయుఁ[4]బ్రీతితోన్.

269 సీ. దానినంతయు భీమసేనుండు [1]విని రాజ్య[2]సంప్రాప్తి పాండవ సత్తములకు
సతికారణంబున [3]ధృతమయ్యె ననునింతకంటెను గష్టంబు గలదె[4]యొండు
[5]పేర్మి నపత్యంబుఁ [6]గర్మంబు విద్యయు ననునివి తేజంబు [7]లట్టి[8]తగిన
పురుషున [9]కెందును నిరతంబు మిక్కిలి తేజంబు[10]కర్మంబు దీని విడిచి

ఆ. [11]యలుక గాఁడె పురుషుఁ డని కోపఘూర్ణిత, రక్తనేత్రుఁ డై పరాక్ర
మమున
శత్రువరుల నుగ్రసంగరంబునఁ[12]జంపి, కుతలరాజ్య మెల్లఁ [13]గొందు ననుచు.

270 వ. మృగమధ్యంబున నున్న సింహంబునుంబోలె ననుజమధ్యంబున నున్న
[1]యాతనిం [2]గరంబున వారించి ధర్మరాజు ధృతరాష్ట్రశాసనంబునం
దమ్ములుం దానును ద్రౌపదీసహితంబుగాఁ గాంచనరథారూఢుఁడై
యింద్రప్రస్థపురంబున [3]కరిగిన నిట దుశ్శాసనుచేత నంతవృత్తాంతంబు[4]ను
విని దుర్యోధనుండు కర్ణశకుని సైంధవులతో విచారించి ధృతరాష్ట్రు
పాలికిం జని యిట్లనియె.

268 1. బాచియు దుఃఖసా - వ ; బాపి - ల.ఙ. 2. వీరులన్ - పెక్కు ప్రతులు. ఈ భావము మూలము ననుసరించి కర్ణుని వాక్యముగా నున్నది. భం 2-64-1-3. 3. బొల్తి (బొలతి)— పెక్కుప్రతులు ; ప్రోచి—వ ; బోల—డ. 4. భక్తితో — కొన్ని ప్రతులు ; శక్తితో — ఙ.

269 1. నిజరాజ్య-ఘ. 2. సంపద-ఉ.వ. 3. ధృతినయ్యె-కొన్నిప్రతులు. 4 యెందు-పెక్కు ప్రతులు. 5. పేర్మినపత్యంబు పెంపును బలమును నలఘుతేజంబును కలిమి తగిన — ఛ. (ప్రాసయతి నియమభంగము) పేర్మియు సత్యంబు బెంపును బలమును నలఘుతేజంబును గలిగి తెగిన—ఝ (ప్రాసయతి భంగవు). 6. ధర్మంబు—కొన్ని ప్రతులు. 7 లట్లు — ఒ.ల శ.ష. 8. వఱలు — వీ.శ.ష. 9. కెప్పుడు — ఛ.ఝ. 10 ధర్మంబు— పెక్కు ప్రతులు ; తోఁగూడ దెరగువిడిచి — వ ; శౌర్యంబు దీని విడిచి—ట. 11. యలుసు—ల ; యలతి—డ. 12 నోర్చి — ఐ.ఒ.క.ఛ.ఝ.డ. 13. గొందు ననియె—పెక్కు ప్రతులు

270 1. భీమసేనుం-కొన్నిప్రతులు. 2. గరతలంబున—వా; సాంత్వవచనంబుల-వీ.శ.ష; గరంబున-పెక్కుప్రతులు. 3 కరిగెనిట—ఆ.ఉ.క.గ.ల. 4. నెరింగి—కొన్నిప్రతులు.

271 క. అహితుల నెల్లవిధంబుల, [1]విహతులఁగాఁ జేయునది వివేక మని మరు
[2]న్మహితుండు చెప్పె [3]నిది మును, బృహస్పతి [4]సురేశ్వరునకుఁ బ్రియహిత
బుద్ధిన్.

272 వ. [1]అప్పాండవుల [2]కెంతలగ్గు సేసియు నింక హితుల మయ్యెదమె [3]యాశీ
విషంబుల [4]నలిగించి కంఠసమీపంబున విడుచునట్లు [5]వారల విడిచి పుచ్చి
కర్జంబు దప్పితిమి.

273 ఉ. భూ[1]విదితప్రతాపపరిభూతవిపక్షుఁడు సవ్యసాచి గాం
డీవము గొన్న భీముఁడు వడిఁ గద గొన్నఁ గవల్ కృపాణ[2]చ
ర్మావర[3]ణాదిభాసిత[4]మహాభుజవిక్రము లైన వారలఁ
లావె రణంబు[5]లో మన కలంఘ్యబలాఢ్యుల నింక [6]నోర్వఁగన్.

274 వ. కావున వారల [1]ననుద్యూతంబునఁ బరాజితులం [2]గావించి [3]విరళదేశ
నిర్వాసితులం జేయుట కార్యం బనిన విని ధృతరాష్ట్రుం [4]డొడంబడి

271 1. విహతముగా జేయునది వివేకమున — ఙ ; నిహతులగా - ఊ ; నిహతుల
జేయునదియని యనేకములు — ఉ ; విహితులుగా — ఏ.ఐ.ఒ.ఔ.క.ఘ.ల.
2. న్మహితుడు దాజెప్పెనుమును — గ.శ.ష. 3 నట — ఆ.ఇ.ఈ.ఉ.ఊ ;
నది — ఔ.గ.ఘ.ఝ ; మరి యాబృహస్పతి — అ ; నదిమరి — ఔ.ఝ.ట ;
నటమరి - ల. 4. సురేంద్రునకును - ఆ.ఇ.ల.

272 1. కావున నింకపాండ - ఖ.శ.ష ; కావుననింక మన మప్పాండ - వీ ; కావున
నప్పాండవుల—ల. 2 కునెంతయుమేలు — క.డ ; కెంత మేలు — ఎ.ఐ.ఒ.ఖ ;
కునెంత సేసియు - ఙ ; కెంతహితంబు - ఏ.ఔ 3. యాశీవిషోరగంబులనతి
క్రాంతంబుగా - ఈ.ఐ. 4 గిలించి - ఝ ; నలిగించి యుపకరణంబున - ఙ.
5. వారి — ఆ.ఇ.ఈ.ఘ.ల.

273 1. వినుత-ఆ.ఇ.ఈ.ఏ.ఔ.గ.ఘ.ఝ.ఙ.ల.శ.ష. 2. వర్మావర-ఎ.ఐ.గ.ఙ.ల.వీ.శ.ష.
3. ణావిభాసిత—వ. ణావిభూషిత—ఙ ; ణాతిశోభిత—వ; ణోపశోభిత-ఒ.క.ఖ.
గ.డ ; ణాభిశోభిత—ఘ.ఝ. 4. పరాక్రమ విగ్రహులైన వారలఁ — ఎ.ఐ.ఒ
5. లోన నవిలంఘ్య — ఎ.క ; లోపలనలంఘ్య-ఝ. 6. నోర్వగఁ — ఖ.ఙ.ల.

274 1. ననుద్యూత పరాజితుల — ఆ.ఇ.ఈ.క.ఖ.గ.ఘ.ఝ.డ.ఙ.వీ. 2. జేసి వెలువ
రించుట కార్యం — అ.ఏ.ఔ.ఘ.ఝ ; గావించి భూమి వెలువరించుట — ఉ.వీ;
జేసి భూమి వెలువరించుట కార్యం — ల.శ.ష. 3. దేశనిర్వాసితులం — ఆ.ఇ.
ఈ.ఊ.క.ఖ.గ ; దేశనివృత్తులం — ఎ.ఐ.ఒ.ఙ ; నవిరళదేశనివాసితుల — ట.
4. డెట్టకేనియు దానికొడంబడి - పెక్కు ప్రతులు. పునర్ద్యూతము విషయమున

యప్పుడ [5]యనుద్యూతార్థంబు ధర్మ[6]నందనుం [7]దోడితేరం బ్రాతికామిం
బంచినం [8]బితృని యోగంబును [9]విధిని యోగంబు నతిక్రమింప [10]నగునే యని.

275 క. నృపవరుఁ డనుజులుఁ దానును, ద్రుపద [1]తనూజయుఁ [2]బ్రియంబుతో నరిగెను హా
స్తి[3]పురంబునకు నశేష,స్వపతు [4]జనహృదయములకు [5]సంతాపముగన్.

276 వ. అం దెప్పటియట్ల ధృతరాష్ట్ర[1]నిర్మితసభాసీనులై [2]యున్నంత [3]నభిమతా
తుం డైన శకునికితవుండు ధర్మరాజున కిట్లనియె.

277 క. ధన[1]సంపద రాజ్యంబున, దినకరతేజుండు [2]మిమ్ము ధృతరాష్ట్రుఁడు పెం
పునఁ [3]బూజించెం గావునఁ, జన దింకను [4]వానిఁ నొడ్డి సరిక్రీడింపన్.

భీష్ముడు తన అసమ్మతిని వెలిబుచ్చుట గాంధారి ధృతరాష్ట్రునకు హితబోధ గావించుట — ఇత్యాదులు మూలమునఁ గలవు. దుర్యోధనునిత్యజించి కులమును రక్షింపుమని గాంధారి బోధించినది. ఈవిషయము తెలుఁగున లుప్తము 5 పునర్ద్యూతార్థంబుగ [గా] — పెక్కు ప్రతులు 6. తనయుం — పెక్కు ప్రతులు. 7. దోడ్కొనితేర — పెక్కుప్రతులు 8 వాడిందప్రస్థపురంబునకుం జని ధృతరాష్ట్రుశాసనం బెరింగించిన విని ధర్మతనయుండు తమ్ములు దానును పితృ—ఛ. జ.ఝు.ఞ.ల ధర్మజుని మార్గమునందే ప్రాతికామి కలిసినట్లు మూలమునఁ గలదు. తతో వ్యాధ్వగతంపార్థం ప్రాతికామీయుధిష్ఠిరమ్ భం. 2-67-1 9. విధినియోగంబు — కొన్ని ప్రతులలో లేదు. కాని మూలమున ధాతుర్నియోగాత్ భూతాని ప్రాప్నువంతి శుభాశుభే ననివృత్తిస్తయోరస్తి దేవితవ్యం పునర్యది అని కలదు. భం 2-67-3 10 గాదని యిప్పుడకదలి — అ.ఇ.ఈ.ప బొ ఛ జ.ఝు.శ ష

275 1. తనూజయును బ్రియముతో నరిగిరి — ఒ బొ.ఘ.ట.డ.ఞ, తనూజయును బ్రీతితో నరిగిరి — గ.ఝు; తనూజయును ముదముతో నరిగిరి — ఞ 2. బ్రియంబుతో నరిగిరి — పెక్కు ప్రతులు. ప్రియంబుతో ముదముతో అనుభావము మూలమున లేదు 3. పురమునకు నిశ్శేష — ఖ.డ 4. జనములకు హృదయసంతాపము గాన్ — ఏ.బొ. 5 సంతోషముగన్ — అని పెక్కు ప్రతులు. కాని అది మూల విరుద్ధము. వ్యథయంతిస్మ చేతాంసి సుహృదాం భం. 2-67-6

276 1 నిర్మితంబైన సభామంటపమున (మండపంబున)-పి.శ.ష. 2. యిష్ట సంభాషణ క్రీడాసంరంభంబున నున్నయవసరంబున — ఉ.ల; యిష్టవినోదంబులనున్న— ఞ. 3. నభిమతాత్ముంబులుగొని — పెక్కు ప్రతులు

277 1. సంపద్రాజ్యముల (లు) — పెక్కు ప్రతులు; సంపదలును రాజ్యము — ఐ.ఒ. క.ఖ.డ.ఞ. 2. మీకు — ఞ. 3. దాను జూచె — అ; యొప్పించెం — ఉ; నిప్పించెం — స. 4. దాని — ఈ.ఊ.క.ఘ.ఞ.

278 వ. ఇది [1]యపూర్వంబైన పణంబు [2]దీనినోడి యోటువడిన వార లజినవల్కలంబులు గట్టి [3]వన్యమూలఫలాశనులై బ్రహ్మచర్యంబునం బండ్రెండేండ్లు వనవాసంబు [4]సేసి [5]పదుమూఁడగు నేఁడు జనపదంబున [6]నజ్ఞాతవాసంబు సేసి [7]యందెఱుంగం బడిరేని వెండియుం బండ్రెండేండ్లు వనవాసంబు [8]నొక్కయేఁ డజ్ఞాతవాసంబుఁ జేయు[9]చుండువా రిట్లోపు[10]దేని [11]జూదం [12]బాడుద మనిన [13]ననుద్యూతార్థం [14]బాహూతుండనై [15]మగుడ నగు సేయని.

*-: ధర్మరాజు శకునితో రెండవమాఱు జూదం బాడుట :-*

సం. 2-67-21

279 క. ధర్మసుతుఁ [1]డొడ్డి శకుని[2]క, ధర్మస్థితి నోటువడియె [3]దైవముచెయిదిన్ నిర్మిత మయిన శుభాశుభ, కర్మఫలం బెట్లు దేహి [4]గడవఁ గ నేర్చున్.

278 1. యొక్కయపూర్వం — ఉ ఎ.ఐ ఓ.ఘు.ఝు ల ; ఈ యపూర్వంబయిన పణంబున నోటువడినవారలు — అ.ఇ.ఈ 2 దీననోటువడిన — అ.ఔ.ఘ. 3. కంద — శ ప.ల. 4 సేయువారు — ఐ. 5. పదమూడవ — ఇ.ఉ.ఊ.ఐ.ఔ.ణ.పీ.శ.ష. 6. నొరులెఱుంగకుండ నజ్ఞాత — ల.పీ శ.ష. 7. యం దెవ్వరు నెఱుంగకుండనుండి, యెఱింగిరేనియు — ఊ ఏ.ఔ.ణ 8. చేసి పదమూడవ (గు) నేడు జనపదంబున నజ్ఞాత — కొన్ని ప్రతులు 9. నది యిట్లోపుదేని - కొన్ని ప్రతులు. వనవాసాజ్ఞాత వాసములు సక్రమముగా నెఱవేర్చినచో మరల తమ రాజ్యమును తాము ఓడిన వారు పడయగలరని — మూలమునఁ గలదు. ఆయంశ మిందు లోపించినది. మఱియు భీష్మద్రోణ బాహ్లిక సోమదత్త వికర్ణ యుయుత్సాదులును గాంధారి ద్రౌపదీ కుంతీ దేవులును, పునర్ద్యూతమునఁ బ్రవర్తింప వలదని ధర్మజునకు బోధించి నట్లు మూలమునఁ గలదు. అది తెలుఁగున లోపించినది. 10. దు రేని — పెక్కు ప్రతులు. 11. యొడ్డిజూదం—ఇ.ఈ.ఉ ఏ.క.ఖ.గ.ఐ 12. బాడుమనిన — పెక్కు ప్రతులు 13. విధిప్రేరితుండై ననుద్యూ (పునర్ద్యూ) — ఎ.ఐ.ఓ క.ఖ.గ.ట.డ. 14. బుగా బిలువంబడి మగుడ — శ.ష. 15. వచ్చిమగుడ—అ.ఉ.ఛ.ల.

279 1. డొడి - ఎ.ఐ.ఓ.క.డ.వ. 2. యధర్మస్థితి — ఐ 3. దైవముచేతన్ — పెక్కు ప్రతులు ; దైవ వశమునన్ — ఊ ; దైవోపహతిన్ — వ. 4. గడవగనోపున్— ఔ ; గడవగవచ్చున్—వ.

280 వ. [1]అంత ననుద్యూత పరా[2]జితు లయిన పాండవులు దమ[3]రాజ్యోపభోగంబులు విడిచి [4]విప్రసుహృద్బాంధవ [5]జనానుగమ్యమాను లయి వనంబునకుం బోవ సమకట్టి భీష్మ ధృతరాష్ట్ర విదుర కృప ద్రోణాచార్యుల [6]నామంత్రించిన విదురుం డిట్లనియె.

281 క. వనవాస[1]పరిక్లేశం, బున కోపదు కుంతిదేవి భోజాత్మజ గా
వున నాగృహమున నుండెడు, ననవరతము [2]భక్తితో మదభ్యర్చితయై.

282 సీ. ధర్మజ్ఞుఁడవు నీవు[1]పేర్మిఁ బరాక్రమ[2]ధనుఁడు [3]భీముం డింద్రతనయుఁ డఖిల
యుద్ధవిశారదుం [4]డిద్ధయశోనిధి నకులుఁ[5]డర్థాఢ్యుండు ప్రకటబుద్ధి
నెంతయు [6]సంయమవంతుఁడు సహదేవుఁ డధ్యాత్మవిద్య నారాధ్యుఁ డెందు
ననఘుండు ధౌమ్యుండు విను[7]శాస్త్రధర్మంబులందు విచక్షణ సుందరాంగి

ఆ. ద్రుపద[8]తనయ యిట్లు విపులగుణాళి క,న్యోన్యహితు[9]ల రగుట నన్యు లుర్వి
నాదరిం[10]పఁగాక భేదింప నోపెడు, వారు గలరె [11]మిమ్ము ధీరమతుల.

283 వ మఱియుఁ గృష్ణద్వైపాయనుచేత శిక్షితులరు [1]నారదుచేత రక్షితులరు మీకుం బురోహితుండు ధౌమ్యుండు [2]దైవమానుషసంపన్నులరు [3]బలపరాక్రమంబులం[4] జేసి రాజులను ధర్మచరితంబునం జేసి ఋషులను మహత్త్వంబు

280 1 ఇట్లు పునర్ద్యూత—పెక్కుప్రతులు 2. జితులైపా ° ఘ.ఝ ఙ.
3 రాజ్యభోగంబులు — ఊ.ఒ.క.గ.ఝ 4. విప్ర—ఏ గ ఝ ఙ ప్రతులలో లేదు
5 జనోపాస్యమునులయి — వి శ ష ; ధౌమ్యాది ప్రజానుగమ్య — ల
6. వీడ్కొనినన (య) జాతశత్రునకు విదురుం డిట్లనియె — పెక్కు ప్రతులు.

281 1. కృతాయాసంబున—ఒ. 2. ప్రీతితో — జ; భక్తితోడ నభ్యర్చితయై —ఎ.ఙ; భక్తితోమదర్చిత యగుచున్—కఘూ

282 1. నెమ్మి — ఉ ; ధర్మ—ఘ. 2 ఘనుడు — ఖ.ఙ. 3 మధ్యముడింద్ర — అ ఏ.ఐ ఒ ఔ క.గ. 4. డింద్రతేజోనిధి — ఆ ఇ ఖ ; డిద్ధతేజోనిధి — పెక్కు ప్రతులు 5. డర్థజ్ఞుండు—పెక్కు ప్రతులు. 6. సద్గుణ—ఈ ఝ ల , విజ్ఞాన—అ ఎ.ఔ.ఘ ; విక్రమ—ఖ ; నతినేమ—గ. 7. మర్థధర్మం—ఎ.ఙ , శాస్త్రధర్ముండు నెందు — ఘ. 8 రాజతనయ విపుల—ఎ ఐ ఙ.ల శ.ష 9. లనంగ నన్యు — ఎ.ఙ. 10. చికాక—పెక్కు ప్రతులు. 11. యిట్టి ధీరమతుల — అ

283 1. నారాయణుచేత రక్షితులరు, నారదుచేత నిరీక్షితులరు — పెక్కు ప్రతులు.
2. మీరుదైవమానుష — అ.ఐ ఒ ఔ.ఘ చ 3 మీబల — పెక్కు ప్రతులు.
4. జేసిరాజులరు... ...ఋషులను ... కుబేరాదుల ... జయించినవారలు — అని

నం జేసి కుబేర వాసవాదులను జయించిన వారలరు మిమ్ము భూమియు గాడ్పును జంద్రాదిత్యులు [5]నెల్లకాలము రక్షించుచు నుండెడ మెల్ల కార్యంబులయందును నప్రమత్తుల[6]రయి వర్తిల్లునది భవత్పునర్దర్శ[7]న మయ్యెడ మరుగుండని [8]కఱపిన గురు[9]వృద్ధానుమతంబునం దమ తల్లి చరణంబులకు మ్రొక్కినం గొడుకు[10]ల.

284 సీ. అధికలజ్జావనతాస్యుల [1]నపగతాభర[2]ణాంబరుల ధర్మపరుల నజిన వల్కలధారుల వరమునివేషులఁ బాండుకుమారుల [3]భానునిభులఁ
జూచి దుఃఖిత యయి సుతులార యిట్టి దుర్వ్యసనోపహతులైన వారి మిమ్ముఁ జూడక ముందఱ సురలోకమున కేఁగి పాండుభూపతి పుణ్యభాగి యయ్యె

తే. భక్తిఁ బతితోన[4]పోవఁ దపంబుసేసె, మాద్రి యే నేల పోవక మందభాగ్య
[5]నయితినని విలాపిం[6]చుచు నపుడుగుంతి, యేడ్చె దుఃఖితులగు[7]చుండ నెల్ల వారు.

285 వ. [1]మఱియును.

286 మత్తకోకిలము. వీర లిట్టు లనాథులై మునివృత్తి [1]నుండెదువారె హా
ద్వారకాపుర[2]నాథ కేశవ దైత్యభేది భవత్పదాం

కొన్ని ప్రతులు. 5. నెప్పుడు రక్షించుచుండెదరెల్ల — పెక్కు ప్రతులు; నెప్పుడు రక్షించు—డ. 6 రై యుండునది—ఝ. 7. నంబయ్యెడుమని—ఉ.ఊ.ప ఝ; నమయ్యెడుమని — ఇ.ఈ ఏ ఒ ఔ ఖ.గ. 8. పని(ంచి)చిన—ఎ ఒ.క డ.ణ. 9. వృద్ధ జనానుమతులై — అ.ఆ.ఇ.ఈ ఏ ఐ ఒ.ఔ.గ.ఘ.ఝ ణ.ల. 10. ల జూచి — కొన్ని ప్రతులు.

284 1. మణిభూషణాంబర రహితులు నగుచునజిన — ణ. 2. ణాను లేపనాంబరులనజిన — ఉ ఝ.వీ. 3. భరత నిభుల — ఈ.ఔ; భరతవిభుల - వీ; భరత కులుల—అ. 4. నరుగ—కొన్ని ప్రతులు. 5. నని విలాపింపుచును విశాలాక్షి కుంతి — డ. 6. చి లోలాక్షి గొంతి—కొన్ని ప్రతులు. 7. చుండిరెల్లవారు—అ ఉ.ఔ.చ.ణ

285 1. ఈ వచనము కొన్ని ప్రతులలో లేదు ; ఇట్లు గొంతి శోకాక్రాంత యగుచు మరియును — ఉ.ల.

286 1. బొందెదు — అ.ఇ.ఏ.ఔ.చ.ఙ ; బోయెదు — క.ఖ.స. 2. వాస—కొన్నిప్రతులు.

ఘోరుహో[ శ్రితు లైన [3]వీరలఁ బూని కావక యుండఁగా
ధారుణీధర నీకు ధర్మువె ధర్మ[4]నిర్మలమానసా.

287 తరలము. [1]అమితసత్త్వులు ధర్మమూర్తు లహర్పతిప్రతిముల్ రిపు
ద్రుమ[2]హుతాశను లాపగేయుఁడు ద్రోణుఁడున్ విదురుండు గౌ
తముఁడు నుండఁగ ధర్మమార్గము దప్పఁ జాడియె పాండవో
త్తము[3]లు రాష్ట్రి[4]నివాసయోగ్యులె ధార్తరాష్ట్రుల వంచనన్[5].

288 క. అన్న సహదేవ నీవును, నన్నలతో నరిగె [1]దయ్యె యటు నడవులకీ
వున్నను [2]నుతు లందఱు నిం, దున్నట్టుల [3]నాకుఁ జిత్తమూఱడియుండున్.

289 వ. అనుచు శోకాక్రాంత యయి కుంతీ[1]దేవి దనకు వినయవినమితోత్తమాంగ
యయిన పాంచాలిం జూచి,[2]బాష్పజలంబు లురుల నిట్లనియె.

290 క. ధనశాలి నీకతంబునఁ, [1]బవిత్రమై ద్రుపదకులముఁ [2]బాండుకులంబున్
[3]భువనముల వెలిఁగె నీ[4]వు,ద్భవ మొంటను బొచ్చుటను శుభస్థితితోడన్.

291 ఆ. పురుషవృషభు లయిన పురుషులతోడన, యరిగి పరమభక్తిఁ బరిచరింపఁ
[1]బోవఁ [2]గనుట నీవు పుణ్యంబు సేసితి,వంచుఁ బ్రీతిఁ గౌఁగిలించుకొనియె.

3 వారల — ఎ.బౌ ఛ.ఝ. 4 నిర్ణయమానసా — వ

287 1. అమితనిశ్చలబాహుసత్త్వుల హ—ట 2 కురారులునాప-ణ స ; కురారకులాప—ఙ ; పరశ్వథులాప—ఉ ఏ గ. 3. లరణ్యనివాస — కొన్నిప్రతులు 4. వియోగ యోగ్యులె—౯. 5 ఈ పద్యాంతమున. అని మరియును—ట ; అని కుంతి మరియు నిట్లనియె — ఞ

288 1 నన్నయడవులకును నీ — పెక్కు ప్రతులు. 2. నాసుతులందరు నున్నట్లే (ట్లై) నాకు — ఖ డ , నాసుతులందరు నున్నట్టులు—ణ. 3. నామనంబున నూఱడి—ఐ ఒ.

289 1. దేవి వినయ — పెక్కు ప్రతులు ; దేవివినయావనతోత్త — ల. 2. బాష్ప కణంబులు రాల — ణ ; బాష్పపూరిత లోచనయగుచు — అ.

290 1. ప్రవిమలమై — కొన్నిప్రతులు 2 పాండవ కులమున్ — పెక్కు ప్రతులు. 3 భువనమున — ణ. 4 వుద్భవిల్లుట [ ను]ను — అ.ఇ.ఈ ఉ ఊ.ఏ బౌ.గ.

291 1. పుణ్యసాధ్వినీవు పుణ్యంబు సేసితివనుచు గృష్ణ గౌగిటందు జేర్చె — ణ ; గాంచి పుణ్యాత్మవైతని కౌగిలించికొనియె గోడలిగొడుకుల గుంతిదేవి — ట. 2. ౹లీ౹ — అ. వనవాసకాలమువందు సహదేవుని నాదరముతో జూచుకొనవలయు నని ద్రౌపదికి కుంతియాదేశించినట్లు మూలమునఁగలదు.

292 వ. [1]అని యిట్లు కోడలిం గొడుకులను దీవించి కుంతీదేవి విదురుగృహంబున నుండె నంత.

293 ఆ. పతులపిఱుఁద మందగతి ముక్తకేశియై, పోవుదాని ద్రుపదపుత్రిఁ జూచి [1]వంతఁ గౌరవేంద్రునంతిపురంబున, వార లెల్లఁ దలలు వాంచి రడలి.

294 ఆ. ధర్మతనయు పిఱుఁదఁ దమ్ములు నలువురు, నరుగుచుండి తత్సభాంతరమున జనులు వినుచునుండ [1]సంభృతక్రోధులై, పలికి రధికపరుషభాషణముల.

295 క సాహసమున మద్బాహుల, దాహతి దుర్యోధనాదు లగు [1]రిపుల జగ ద్ద్రోహులఁ జంపుదు నత్యు, గ్రాహవమున హరిహరాదు లడ్డం బైనన్.

296 ఆ. [1]దుష్టచిత్తుఁడైన కష్టు దుర్యోధను, శిరము దన్ను వాఁడ ధరణిఁగూల్చి హీనుఁడైన దుస్ససేనుని వధియించి, వేఁడిరక్త మానువాఁడఁ గడఁగి.

292 1 అనియిట్లు — పెక్కు ప్రతులలో లేదు. ఇవ్విధంబున వారికి ననుజ్ఞయిచ్చి కుంతిదేవి — ఐ.ట.ఝ.స.

293 1. వంత—ఉ.ఏ.ఐ.ట.గ.ఝ.పి.శ.ష.స ; యంత — వా. కొన్ని ప్రతులు. 1. కృష్ణాం త్వదృష్టపూర్వాం తాం ప్రజంతీం పద్భిరేవచ । ఏకవస్త్రాం రుదంతీం తాం ముక్తకేశీం రజస్వలామ్ ॥ దృష్ట్వా తదా స్త్రియస్సర్వా వివర్ణవదనా భృశమ్ విలప్య బహుధా మోహాత్ దుఃఖశోకేనపీడితాః పి.పి.ఎస్—70—20. 2. భారతానాం స్త్రియః సర్వా గాంధార్యాసహసంగతాః ప్రాక్రోశన్ భైరవం తత్రదృష్ట్వాకృష్ణాం సభాగతామ్. భం. 2—72—19.

294 1. సంభ్రమాక్రాంతులై — ఉ.ఛ.ఝ. కౌరవులలో నొకనిని పతిగా వరింపుమని ద్రౌపదికి దుశ్శాసనుఁడు చెప్పుటయు, పిమ్మట దుర్యోధనుఁడు ద్రౌపదిని నిందా వాక్యములు పల్కుటయు మూలమునఁగలవు.

295 1. శత్రులనుద్రోహుల — ఐ ; ఖలుల — స ; సుతుల, శరుల — కొన్ని ప్రతులు.

296 1. ఈపద్యము ట.పి.శ.ష. ప్రతులలో మాత్రమే కలదు. కాని యీవిషయము మూలమునఁ గలదు. సుయోధన మిమం పాపంహంతాస్మి గదయాయుధి శిరః పాదేన చాస్యాహ మధిష్ఠాస్యామి భూతలే. 2—68—28. యదివతుని భిత్వాతే నపి జేర్భోణితంరణే ధార్తరాష్ట్రాన్ రణేహత్వా మిషతాం సర్వధన్వినామ్ శమం గంతాస్మి నచిరాత్సత్యమే తద్బ్రవీమివః 1—68—21నుండి 22 వఱకు.

297 మ. [1]కనకోర్వీధరసానుసారరుచిమద్గాండీవనిర్ముక్త [2]ప
త్త్రినిపీతారుణవారిశేషముఁ బతత్త్రివ్రాతముల్ ద్రావు న
య్యని నాతోడఁ జతుర్దశాబ్దమున మాఱై పోరు కర్ణాదిదు
ర్జనసంఘంబుల [3]మార్తురం దునుముదున్ సంగ్రామరంగంబునన్.

298 క. [1]మాయాద్యూతంబునఁ ని, ర్జేయులఁగా మమ్ము నిట్లు సేసిన ఖలు న
న్యాయపరు శకుని నస్మ,త్సాయకజిత[2]హస్తుఁ జేసి చంపుదు [3]మాజిన్.

299 వ. అని భీమార్జుననకులసహదేవు[1]లును విజృంభించి కృతప్రతిజ్ఞులై రట్లు పాండవులు పరిత్యక్త[2]విభవు లయి నిజాయుధంబులు ధరించి గజపురంబు వెలువడి రంత.

300 సీ. [1]ధృతరాష్ట్రవిభుని మందిరమున నఱచుచుఁ [2]బఱచె గోమాయువుల్ పట్ట [3]పగల
[4]యప్రదక్షిణముగా నయ్యె నుల్కాపాత [5]మపమేఘమై యున్నయంబర మున

297 1. ఈపద్యమునకు వెనుక అని భీమసేనుండు పలికిన అనువచనము — వీ.శ.ష ప్రతులలో కలదు. 2. శస్త్రనిపీతా — అ ష 3. ద్రుంతు ఘోరబలవత్సం గ్రామ — ఈ.ఎ.ఐ ఒ.క ఖ ఘ ఛ.ఝ.డ ల ; ద్రుంతునేను బలవత్సంగ్రామ — ఆ ఇ.ఊ.

298 1 దీనికిముందు 'అనియర్జునుండు పలికిన' - అను వచనము వీ.శ.ష. ప్రతులలో కలదు నకుల సహదేవులు వేర్వేరుగా శపథములు పల్కినట్లు మూలమునఁగలదు- భం—2—68/37-41. సహదేవుఁడు.
2—68/42—44 నకులుఁడు.
2 సత్త్వ - ఈ.ఎ.ఐ ఒ.క. 3. నాజిఁ — పెక్కు ప్రతులు.

299 1. లు విజృంభించి — పెక్కు ప్రతులు. 2. పరిచరవిభవు — ఉ వ ; విభవులయి గజపురంబు వెలువడిన — ఉ.ఓ ఛ.జ ప్రతులు తప్ప తక్కిన ప్రతులు.

300 1. ధృతరాష్ట్ర (ష్ట్ర) రాజమందిరమున — అ.ఇ ఉ.ఊ.ఐ.ఒ ఎ.క.ఖ.ఘ.చ.డ. 2. బరగె — ఆ.ఈ.ఎ.ఏ.క చ.ట ; బరతెంచెనక్కలు — అ. 3. పగలు — కొన్ని ప్రతులు. 4. నప్రదక్షిణ — కొన్ని ప్రతులు ; యప్రదక్షిణమయ్యె నగ్నులుల్కా - ఉ.ఎ.ఐ.ఒ.ఖ.ల.స. 5 మపమేఘమయ్యును నంబర - ఏ ఓ ఖ.గ. మపమేఘమయ్యునయ్యంబర —ఐ ; మతి నిర్మలంబగునంబర — ఉ ; మతి నిర్మలం

[6]విద్యుత్సహస్రముల్ విలసిల్లె [7]మఱి రాహు పర్వంబు [8]గాకయ భాను(
[9]బట్టె
భూకంప మయ్యె నప్పుడు సభాంతరమున [10]నరు లెల్ల వినుచుండ నార
దుండు

ఆ. పలికె నద్భుతముగ( బదునాలు[11]గవయేఁడు, భారతాజి యగు నపారవీరు
లయిన పాండవులు జయం బందుదురు [12]భీమ, మఘవసుతుల [13]విక్రమమున
ననుచు.

301 వ. ధృతరాష్ట్రుం[1]డును దాని నంతయు విని కొడు[2]కుల దుర్నయంబుల [3]నింక
నెట్టి యరిష్టంబులు [4]పుట్టెడునో యని [5]వగచుచు విదురుం [6]బిలిచి ధౌమ్య
ద్రౌపదీ [7]సహితు లయిన పాండవు [8]లెట్లు వోయి రని యడిగి[9]న నతనికి
విదురుం డిట్లనియె.

*—: విదురుఁడు ధృతరాష్ట్రునకుఁ బాండవు లడవికిఁ*
*బోయిన రీతి సెప్పుట :—*
సం. 2-71-3

302 సీ. వదనసరోజంబు [1]వస్త్రాంతమునఁ గప్పికొని[2]యేఁగె ధర్మనందనుఁడు
మఱియు

బైన యంబర - ఎ.ఝ. 6. విద్యుత్సహస్రంబు - అ.ఈ.ఉ.ఊ.చ ఝ. 7. రాహువుపర్వంబు - అ.చ. 8. గాకయు - గు.ప్రౌ; కొన్ని ప్రతులు; లేకయు - కభూ. 9 గప్పె - ఇ.ఈ.ఏ.గ.గు.ఝ.ట ణ.శ ష.ప్రౌ. 10. నరులెల్ల - పెక్కు ప్రతులు; పరునెల్ల - వా (ఈ పాఠము సర్వయతి నియమునకు భంగకరము) 11. డగునేటి - ఉ ఖ.ల; గగునేడు — ఈ.ఊ.ఎ.ఏ.ఐ.ఒ.క. గ.చ.ఝ. 12. భీమసేన మఘవసుతులచేత జేసి - అ.ఇ.ఈ ఏ.గ షు. 13. విక్రమమున జేసి — ఉ.ఊ.ఎ.ఐ ఒ.క.ఖ.డ.ల.వీ.శ.ష.

301 1. డుదాని - అ.ఈ.ఎ.క ఖ.ఘ.ణ. 2. కులుసేయు దుర్ణయంబున - ఆ.ఇ.ఊ. ఎ ఐ ఓ ఔ.ఝ; కులవలని దు యంబున-ఒ.చ.ట; కులుచేసిన దుర్ణయంబున - ల. 3. నింకనేను, నింకేమి, నింకె — భిన్నప్రతులు 4. పుట్టునో — కొన్నిప్రతులు 5. వగచి - అ.ఇ.ఈ ఏ.ఒ.గ. .ఝ.ల. 6. బిలిపించి - అ.ఈ.ఉ.ఐ.ఒ క.ఖ.డ.ల; బిలుపించి — స; బిలచి — ఐ. 7. సహితులయి పాండవు - పెక్కు ప్రతులు. 8. లెవ్విధంబున - ఉ; లెందు - క.ఖ డ. 9 నవిదురుం - పెక్కు ప్రతులు; నవానికి విదురుం - క.ఖ ల.

302 1. వస్త్రంబుననుగప్పి - ఈ; వస్త్రార్థమున — ఉ.ట. 2. పోయె - ట.

భీమబాహులు రెండుఁ [3]బెద్దలుగాఁ జాచి ఘనసత్త్వుఁ డమ్మరుత్తనయుఁ డరిగె
నిసుము చల్లుచు నమరేంద్ర[4]పుత్త్రుఁడు వోయె భూరేణులిప్తశరీరుఁడగుచు
నకులుండు [5]సనియె మానక లజ్జఁ జేసి యధోవక్త్రుఁడై సహదేవుఁ డరిగె

ఆ. [6]వివృతకేశభరము [7]వ్రేలంగ ద్రౌపది,సనియె రౌద్రయామ్యసామగాన
ముఖరితాస్యుఁ డగుచు మ్రోల[8] ధౌమ్యుం, డేఁగె, [9]సకలజనులు శోకజలధిఁ దేల.

303 వ. [1]అనిన నశ్లేల వార లరిగి రని యడిగిన విదురుం డిట్లనియె.

304 క. [1]నీకొడుకు నికృతిఁ జేసి య, పాకృత[2]రాజ్యుఁ డయి ధర్మపతి నిజరూపా
లోకన [3]జనదాహభయ,[4]వ్యాకులుఁడై చనియె దృష్టి వారించి వడిన్.

305 క. సమరమున బాహుబలదర్పము [1]మెఱయం గంటి సనుచు [2]బాహు లతివిశా
లములుగఁ జేయుచు నరిగెను, సమీరజుఁ డరాతి[3]భీతిసంజననుండై.

3. బెద్దలుగాఁజూచి – వా ; బెద్దయుగాజాచి — ణ ; బెద్దలుగాఁజేసి – శ ష.స ; బెద్దలుగాఁజాచి – వి 4. సూనుడు — ఉ. 5 బోయెమానక — అ.ఇ, నేగెమానక — ఘ ; బోయెనూరక — ఉ ; సనియెమానస — డ. 6 వికృతకేశ – ఊ.ఔ గ.ఘ చ.ణ శ.ష మూలాను గుణము కాదు కృష్ణాకేశై ప్రతిచ్ఛాద్య ముఖమాయతలోచనా అని మూలము భం.2-71-6. 7. వెలుగంగ — శ.ష. 8. ధౌమ్యుడరిగె — అ ఈ.ఏ ఐ ఘ,ఝ.ల. 9. నఖిలజనులు విస్మయంబునొంద – పెక్కు ప్రతులు

303 1. అనిన నశ్లేలవారలి (ల) వ్విధంబున నరిగిరని యడిగిన ధృతరాష్ట్రునకు విదురుం డిట్లనియె – పెక్కు ప్రతులు.

304 1. నీ కొడుకుల దగునికృతినపాకృత – పెక్కు ప్రతులు ; నీ కొడుకులచేని కృతినపాకృత — శ ష. 2. విభవుండుధర్మ – ఉ 3. ఘనదాహ – ణ 4. వ్యాకుల మతినరిగె దృష్టి – పెక్కు ప్రతులు ; వ్యాకులగతి – ఇ.ఉ.క.ఖ డ

305 1. మెరయగగంటి – ఇ.ఈ ఉ.ఊ.ఏ.ఒ ఔ.డ ణ ; చూపనుగ్రగంటి – ఖ.వి.శ.ష. 2 బాహులు సువిశాల – ఊ ఎ ఏ.ఐ ఔ.క ఖ గ.డ ; బాహులొగి — ఇ.ఈ.ఘ. ఛ.ఝ.ల. 3. భయదసంహననుండై – శ ష స ; భయదసంశీలుండై — స.

306 క. [1]వెఱచఱవ నింత[2]కంటెం, దఱుచుగ బాణంబు లేసి తడయక [3]పగఱం
జెఱుతు నని యిసుము చల్లుచు, నుఱక ధనంజయుఁ[4]డు రణ[5]జయోన్నతుఁ
డరిగెఁ.

307 వ. [1]మఱి [2]దుఃఖానుభావంబున కనుచితం బైన [3]తన సుందరరూపంబు సూచి జనులు [4]దుఃఖింపకుండవలయు నని ధూళిధూసరిత[5]శరీరుండై నకులుం [6]డరిగె దీనం బైన తనయాననంబు సూచిన [7]వారికి నెల్ల నెగ్గగు నని [8]యవనతవదనుం డయి సహదేవుం [9]డరిగె.

308 చ. [1]తడిసిన యేకవస్త్రపరిధానముతోడ విముక్తకేశియై
[2]తొడరుచు దుఃఖ[3]భావమున [4]ద్రోవది వోయె మహా[5]హవంబునం
బడిన నిజేశ[6]మిత్త్రసుతబంధుజనంబుల [7]శోకవేదనం
గడుకొని [8]యట్ల యేఁగుదురు కౌరవభామిను [9]లన్విధంబునఁ.

306 1. వెఱచఱువ – ల.స. 2 కంటెను – పెక్కు ప్రతులు. 3 రిపులన్ – ఎ.ణ. 4. డమిత రణోన్నతుడరిగెఁ – ఝ ; డురణజయోన్నతినరిగెన్ – ల 5. జయోద్ధతు డరిగెన్ – ఉ ఘ ; జయోన్మదు డరిగెన్ – క ; జయోన్ముఖు డరిగెన్ – ఖ.

307 1. మరియును – కొన్నిప్రతులు. 2. దుఃఖానుభావంబున – ఇ.ఉ.ఊ ఐ.ఘ. చ.ఝ.వీ.శ ష ; దుఃఖానుభవంబున – వా. 3. తన – కొన్నింటలేదు. 4. దుఃఖింపకుండ ధూళిధూసరిత – పెక్కుప్రతులు. 5. వదనుండై – చ. [మూలవిరుద్ధము] ధూళిధూసరిత వదనుడు – అనునది మూలము ననుసరించి సహదేవునకు వర్తించుచున్నది. మాద్రీపుత్రః సహదేవో ముఖమాలిప్యగచ్ఛతి 2–71–4. 6. డు చనియె – ఎ.ఐ.ఒ.క.చ. 7. వారికెల్ల నెగ్గగు – పెక్కు ప్రతులు. 8. తలవాంచి సహదేవుం డరిగె – పెక్కుప్రతులు. మాద్రీపుత్రః సహదేవో ముఖమాలిప్యగచ్ఛతి. 2–71–4. 9. డరిగె మరియును – అని కొన్నిప్రతులు.

308 1. తడయక – అ.ఇ.ఒ.ఖ.ఘ.చ. 2. తొడరిన – ఉ.ట. 3. భారమున– అ.ఈ.ఉ.ల. 4. ద్రౌపది – పెక్కు ప్రతులు. 5. రణంబునఁ – అ. 6. పుత్త్రసఖబంధు – ఏ.క.ఖ.గ ; పుత్త్రసఖబంధు – డ. 7. శోకవేదనల్ గడు కొనియుండ నేగుదురు – ణ. 8. యిట్లయేగుదురు – కొన్నిప్రతులు ; యిట్టు లేగుదురు–వీ.శ.ష. 9. లన్నుదెల్పుచుఁ–ఏ.ఒ.గ.ఘ.వ.శ.ష.స.

309 క. భారతరణహేతు లగుకురు, శూరుల పరలోకవిధులు [1]సూచించి క్రియా
[2]పారగుఁడు ధౌమ్యుఁ డరిగె [3]వి,చారజ్ఞుఁడు రౌద్రయామ్య[4]సామోద్గీతిన్.

310 వ. [1]అనిన విని ధృతరాష్ట్రుండు దుఃఖితుం[2]డయి.

311 తరలము. సమర[1]శూరులు పాండవుల్ జితశత్రు [2]లున్నతచిత్తు లు
త్తములు వారలతోడివైరము ధర్మయుక్తిఁ గరం బయు
క్తము ప్రజాక్షయకారణం బని తద్దయున్ [3]భయ మందుచున్
[4]విమనుఁడై పడియుండె [5]హా యని వెచ్చ నూర్చుచు [6]విన్ననై.

312 వ. [1]అట్లు వగచుచున్న ధృతరాష్ట్రునకు [2]సంజయుం డిట్లనియె.

313 సీ. పాండు[1]కుమారులఁ బరమధార్మికులని వగవక రాష్ట్రంబువలనఁ బాపి
[2]వసుపూర్ణమైన యివ్వసుమతి సేకొంటి [3]వసుధేశ నీకింక వగవనేల
కలశజ విదుర గంగా[4]సుత [5]ప్రభృతులు [6]వారింప వారింప వశముగాక
కర్ణ[7]గాంధారుల కఱపులు విని వారి కపకారియయ్యె నీ యాత్మజుండు

309 1. సూచించుక్రియన్ — ఐ.క.జ.డ.ణ.స. 2. ధీరుడు ధౌమ్యుడు ధర్మవి — అ.ఇ.ఈ ఎ.ఏ.ఒ.గ.ఘ.ణ.ల.వీ శ.ష.స. 3. విచారు డరిగె రౌద్రయామ్య సామోద్గతుడై — వీ.శ.ష. 4. సామోద్గతినిన్ — అ ; సామోద్గతితోన్ — వ ; సామోద్గతులన్ — ట , సామోద్గతియై — క.ఖ డ ; సామగతి నరిగెన్ — ఘ; సరణిన్నరిగెఁ — ఎ ; సద్గతినరిగెన్ — ఊ.

310 1. చనియెననిన — ఉ.ఏ.ఐ.ఒ.ఖ.గ.స. 2. డయి యిట్లనియె — ఈ.ఉ.ఎ.ఐ.ఒ.ఖ.ఘ.

311 1. వీరులు — ఏ.గ. 2. లుద్ధతచిత్తులు — ఔ. 3 దురటిల్లుదున్ — అ.ఆ.ఇ.ఈ.ఊ.ఘ; దురపిల్లుచున్ — ల. 4. వివశుడై — ఏ; విమతుడై — క.ఖ.డ.ణ.ల ; విముఖుడై — జ.ఝ; విమతియై — అ. 5. నెంతయు వేదనం గడువిన్ననై — ణ. 6. దీనుడై — ఔ.

312 1. ఇట్లు — పెక్కుప్రతులు. 2. విదురిండిట్లనియె — ఊ.క.ఖ.ఝ. [మూలము ననుసరించియు యిది సంజయుని వాక్యమే].

313 1. తనూజులు — ఐ.ఒ.క.ఖ.డ ; కుమారులు — ఆ.ఈ ఉ.ఔ.ఘ.ట.ణ. 2. వసుపూర్వమైన — ఝ.ణ ; పరిపూర్ణమైన — ఘ. 3 ధర్మంబు విడిచి యధర్మవృత్తి — ఘ ; ధర్మువు విడిచి యధర్మవృత్తి — వ; ధర్మమువిడిచి యధర్మవృత్తి — ఇ. 4. సూనుకృపులును వారింపగా వారివలనుబోక — ఈ ; సుతుల్ వినయోక్తి వారింప వారలవలనబోక — ణ. 5. ప్రముఖులు — ఎ.ఐ.ఒ.క.ఖ.చ. 6. వారింపనెంతయు వశముగాక — ఎ.ల ; వద్దని వారింప — ఐ ; వారింపగా వాని — ఘ. 7. దుశ్శాసనుల్ గరపగవిని — క.ఖ ;

ఆ. వగవ[8]కధికు లయిన వారితో వైరంబు, సేసి[9]కొంటి కరము [10]చెట్ట యనక
[11]నీవు నీసుతుండు నేర్తురుగా కొరు, లేమి సేయ నేర్తు [12]రిందుకులుఁడ.

314 వ. [1]అని సంజయుండు పలికిన విని విదురుండు ధృతరాష్ట్రున కిట్లనియె.

315 తరలము. వగవ నేటికి నింక నైనను [1]వారలం బిలిపించి యీ
జగతి నెప్పటియట్ల యేలుచు సంతసంబున నుండఁగా
జగదధీశ్వర పంపు వంచన చన్నె [2]యన్యులసంపదల్
మిగిలి[3]చేకొన నిట్లు సేసిన మెత్తురే [4]మది నుత్తముల్.

316 ఆ. అనిన విదురు పలుకు లాధృతరాష్ట్రుండు, వినియు విననియట్లు[1] విపినవాస
గతులఁ బాండుసుతులఁ గ్రమ్మఱింపక యుపేక్షించెఁ[2] బూర్వవిహిత
కిల్బిషమున.

317 వ. [1]మఱియు ద్రోణుండు పాండవులకు [2]నెయ్యుం డయ్యును దొల్లి యాజోప
యాజుల వరంబున నగ్నికుండంబున నుద్భవిల్లిన ద్రుపదాత్మజుండు ధృష్ట

సౌబలుల యిక్కరపులు—శ.ప; గాంధారులు గరపంగవిని—ల. 8. నధికులైన—అ.ఇ.
ఏ.గ. 9. కొనుట — ఈ.ఎ.గ.ఘ.ఝ.ల. 10. చెడ్డ — ణ. 11. నీవుసుతుడు
మిగుల — ఈ.వ. 12. రిందువంశ (?) — ఎ ఏ.గ.ణ.

314 1. అనిన విదురుండు — పెక్కు ప్రతులు ; అనినవిని సంజయుపలుకుల కను
గుణంబుగా — ఝ.ల.

315 1. వారి బిల్వగబంచి యిజ్జగతి— ఆ.ప.ఔ.గ. 2 వారల — అ.ఇ.ఈ.ఉ.ఎ.ఒ.
ఘ.జ.ఝ. 3. చేకొనియిట్లు—ఆ.ఈ.ఎ.ఏ.ఐ.ఒ.ఔ.క.ఖ.గ.ఝ.పీ.స. 4. మహి —
ఎ.ఒ.క.ఖ.ఘ.ఝ.ణ.ల ; భువి — అ.

316 1. యట్ల — కొన్నిప్రతులు. 2. బూర్వకర్మకిల్బిషమున — ఉ.ఎ.ణ.ల.పీ ;
బూర్వచిత్తకలిత — అ.

317 1. మఱియు — పెక్కుప్రతులలో లేదు ; అంతపాండవులు కామ్యకవనాభిముఖు
లై రిట భీష్మద్రోణ కృపులు వారివెంటన పోవువారయ్యును పోవక నిలిచి రెట్లం
టేని, భీష్మపరిభూతయైన యంబయను కన్యక శిఖండియై ద్రుపదునకుం బుట్టుట
జేసి భీష్ముండు పోవకనిలిచె — మరియు ద్రోణుండును సంబంధుండై తనకు ప్రతి
వీరుం ... యెరింగినవాడై ... నొద్దనయుండె కృపాచార్యుండును తత్సంబం
ధంబునంజేసి పోవక నిలిచె — ల. 2 హితుండయ్యును — పెక్కు ప్రతులు.

ద్యుమ్నుండు [3]పాండవసంబంధి యయి ప్రతివీరుం డగుట నాతని[4]తోఁ దనకు సమరం[5]బగు నని యెఱింగి పాండవానుగమనంబు [6]సేయ నొల్లక గజపురంబున ధృతరాష్ట్రునొద్దన యుండె నిట్లింద్రప్రస్థపురంబున నిరువది [7]మూఁ డేఁడులు రాజ్యంబు సేసి [8]పాండవులు [9]పాపద్యూతపరాజితు లయి.

318 క. [1]వీరు లగుపాండుసుతులు మ,హారణ్యనివాసనిరతు లయి ధరణీబృం దారకసహస్రములతోఁ,సారమతుల్ సనిరి [2]నిత్యసత్యవ్రతులై.

319 క. అని యిట్లు సభాపర్వం,బున కథ జనమేజయునకు [1]మొగి వైశంపా [2]యను చెప్పిన విధ మంతయు,మనునిభ[3]శుభచరిత నిత్యమహిమాతిశయా.

320 రథోద్ధతము. [1]హారహీరధవళాంశునిర్మలో, దారకీర్తి[2]రణదర్ప సద్గుణా [3]వైరివీరరసవైద్యమన్మథా,కార [4]ధీర పరగండభైరవా.

321 క. [1]కరుణావతార ధరణీ,సురవర[2]సురభూజ రాజసుందర నయబం ధుర [3]ధర్మధురంధరమం,దరధైర్య సుహృన్నిధాన దానవినోదీ.

3. పాండవులకు సంబంధుండై —ఐ.క ఖ.ఙ 4. తోడ — కొన్నిప్రతులు. 5. బుగల దని—ఆ.ఎ.ఘ ఙ 6. సేయక— పెక్కుప్రతులు. 7 మూడేండ్లు—కొన్నిప్రతులు. 8. పాండవులు — పెక్కుప్రతులలో లేదు. 9 కపటద్యూత—కొన్నిప్రతులు.

318 1. వీరుల [లి] ట — ఒ.ఔ.ఖ వ.స ; ధీరులు పాండుతనయులు — ఆ.ఇ. 2. గణ్యసత్యవ్రతులై — ట.

319 1. మును — అ.ఉ.ఐ.ఒ.ఔ.ఙ.స. 2. యనముని సెప్పినయంతయు — ల. 3. చారిత్ర నిత్యమహిమాతిశయా — ల ; సుచరిత్రనిత్య — అ.ఇ.ఊ.ఝ.

320 1. హారశారద సుధాంశునిర్మ — అ.ఈ.ఉ.ఊ.ఎ.ఏ.ఐ.ఔ.క.ఖ.గ.ఘ ఙ.స ; ఈ పద్యము పెక్కు ప్రతులలో కరుణావతార అను పద్యము తరువాత కలదు. దీనిని స్వాగతవృత్తమని వ్యవహరించినారు ; తారశారద సుధాంశునిర్మ — ఝ. 2. గుణదర్ప — ఙ. 3. ధారధీర నిరవద్యమన్మథా — ఉ ఊ ఘ ; వారవర నిరవద్య — ఙ.ల.వీ ; వారధీర నిరవద్య — అ.స 4. వీరపర — కొన్ని ప్రతులు ; వీరనృపగండ — ఙ.ల.

321 1. కరుణాభిరామ—ఉ.ల. ఈపద్యము రాజవంశవార్ధిచంద్ర అనుపద్యము తరువాత—ఇ.ఎ.ఐ.ఖ.ఙ.ల.శ ; ప్రతులలో కలదు. 2. భువనైక రాజసుందర—ఘ. 3. ధర్మగుణైకధురంధర హేమగిరీంద్ర ధీర — శ.ష.స ; గుణధర్మైక ధురంధర చారుసుహృ—ఙ.

322 ఉత్సాహము. [1]రాజవంశ[2]వార్ధిచంద్ర రాజదేవ నిత్యల
క్ష్మీజయాభిరామ [3]ధర్మమిత్త్రి మిత్త్రవిద్వదం
భోజవనపయోజమిత్త్రి భూరికీర్తి కౌముదీ
రాజితత్రిలోక నిఖిలరాజ [4]నిత్యపూజితా.

## గద్యము

ఇది సకలసుకవిజనవినుత నన్నయభట్టప్రణీతం బయిన శ్రీమహాభారతంబునందు
సభాపర్వంబున నర్ఘ్యాభిహరణంబును శిశుపాలవధయు[1]ను రాజసూయవిభూతికి
దుఃఖితుండై సభాస్థలితుండై యున్న దుర్యోధనుంజూచి ద్రౌపదీ భీమ
సేనులు నగుటయు [2]రాజసూయ[3]విభూతి సూచి సహింపక దుర్యో
ధనుండు జూదం[4]బొనర్చుటయు నందు శకునికైతవంబున ధర్మ
[5]రాజ పరాజయంబును ద్యూతదుఃఖార్ణవమగ్ను లయిన
పాండవులం బాంచాలి యుద్ధరించుట యుఁ [6]బున
ర్ద్యూతపరాజితులయి పాండవులు వనవాస
గతులగుటయు నన్నది సర్వంబును
ద్వితీయాశ్వాసము.
సభాపర్వము సమాప్తము.

322 1. ఈ పద్యము — ఇ.ఎ.ఓ ఖ ఞ.ఐ వి శ.ష. ప్రతులలో మాత్రమే కలదు 2. రత్నరాజ — ఎ.ఐ ఖ.ఞ ; పార్ధివేంద్ర—శ ష. 3, ధర్మమిత్ర—ఎ.ఐ : ధర్మ మిత్ర బంధు — ఞ. ధర్మశీల — వా ; ధర్మమిత్రవృత్త — అ.ఇ.ఒ. 4. లోక పూజితా — ఎ.ఐ.ఞ ల ; రాజపూజితా — ఖ.శ.ష.

323 1. ను సభాస్ఖలితుండైన దుర్యోధన — పెక్కుప్రతులు, ను రాజసూయ సమాప్తియు, సభాస్ఖలితుండైన దుర్యోధను—అ ఎ.ఔ.ఘ.ల. 2. దత్కార ణంబున జూదంబగుటయు — ఎ.ఐ. 3. మహోత్సవంబునకు సహింపక — క.ఖ ; విభూతికి సహింపక దుఃఖితుండై —ల. 4 బొనర్చి శకుని కైతవం బున — ఇ.ఉ.ఊ.ఏ.ఔ గ.ఝ. 5 రాజునోడించుటయు (నోడుచుటయు)—భిన్న ప్రతులు. 6. నను ద్యూత పరాజితులై — కొన్నిప్రతులు.

—:o:—

# శ్రీమదాంధ్రమహాభారతము

## ఆదిపర్వము

### గద్య పద్య ప్రథమ పాద సూచి.

-: ఈ :-

—: క్ష :—

-: ద :-

-: ధ :-

-: న :-

—: ం :—

# సభా పర్వము

-: ఆ :-

—: ధ :—



—: న :—

---

## అనుబంధము—1

—:o:—

| వరుస నెం | ముద్రణ కాలము | పర్వము | పరిష్కర్త | ముద్రాక్షరశాల | ఉన్నచోటు |
|---|---|---|---|---|---|
| 1 | 1833 (?) | ఆది—స్వర్గారోహణపర్వములు | ఆలూరి ఏకామ్ర జోస్యులు | | ఆం. మ. భా. ప్రా. |
| 2 | 1847 | ఆదిపర్వము | వైయాకరణ రామానుజాచార్యులు చిన్నయసూరి. | సరస్వతీపీఠము ముద్రాక్షరశాల మద్రాసు. | |
| 3 | 1850 | భీష్మ,ద్రోణ, కర్ణ,శల్య,సౌప్తిక పర్వములు | రా. వేంకటకృష్ణ శాస్త్రులు ఆలూరు ఏకామ్ర జ్యోతిష్కులు | జ్యోతిష్కకళానిధి ముద్రాక్షరశాల మద్రాసు | ఆం. మ. భా. ప్రా. |
| 4 | 1855 | సభాపర్వము (సటీక) | వి. కృష్ణమాచార్యులు | | ఆం. మ. భా. ప్రా. |
| 5 | 1863 | ఆదిపర్వము | సరస్వతి తిరువేంగడాచార్యులు వంగీపురం రామకృష్ణమాచార్యులు. | సరస్వతీ ముద్రాక్షరశాల మద్రాసు | బ్రి. మ్యూ. |
| 6 | 1863 | భారతము | | వాణీనికేతన ముద్రాక్షరశాల మద్రాసు | |
| 7 | 1864 | ఉద్యోగపర్వము | మాదిరెడ్డి శేషాచలనాయుడు | విద్యావిలాస ముద్రాక్షరశాల మద్రాసు | బ్రి. మ్యూ. |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 8 | 1864 | ఆది—స్వర్గా రోహణపర్వములు | వింజమూరి కృష్ణ మాచార్యులు | మద్రాసు | బ్రి. మ్యూ. |
| 9 | 1865 | సభాపర్వము | | శారదానిలయ ముద్రాక్షరశాల మద్రాసు | బ్రి. మ్యూ. |
| 10 | 1865 | సభాపర్వము | | మద్రాసు | బ్రి. మ్యూ. |
| 11 | 1867 | ఆదిపంచకము | వింజమూరికృష్ణ మాచార్యులు | వాణీనికేతన ముద్రాక్షరశాల మద్రాసు | నెల్లూరు – తిక్కన గ్రంథాలయము. |
| 12 | 1870 | శ్రీమదాంధ్ర మహాభారతము | వావిళ్ళరామ స్వామి శాస్త్రులు సరస్వతి తిరువేంగ డాచార్యులు | హిందూభాషా సంజీవిని ముద్రా క్షరశాల మద్రాసు. | సారస్వత నికేతనము– వేటపాలెము. |
| 13 | 1870 | ఆదిపర్వము | తిరునగరి రామా నుజయ్య | శ్రీనికేత ముద్రా క్షర శాల. మద్రాసు | |
| 14 | 1870 | ఉద్యోగ పర్వము | ఎస్. తిరువెంగళా చార్యులు, ఎన్. రామ స్వామి శాస్త్రి | హిందూభాషా సంజీవిని ముద్రా క్షర శాల. మద్రాసు. | మ. రి. ఆ. |
| 15 | 1873 | ఆదిపర్వము | కందాళై శ్రీమాన్ రామానుజాచార్యులు | వివేకకళానిధి ముద్రాక్షరశాల, కళావిలాస ముద్రా క్షరశాల. మద్రాసు. | మ. రి. ఆ. |
| 16 | 1874 | ఆదిపర్వము | పండితులు | సరస్వతీ ముద్రాక్షర శాల మద్రాసు. | మ.రి.ఆ. |
| 17 | 1875 | సౌప్తికపర్వము | సమర్థిరంగయ్య | మద్రాసు | |
| 18 | 1875 | యుద్ధపంచకము | | మద్రాసు. | బ్రి.మ్యూ. |
| 19 | 1876 | ఆదిపర్వము | పండితులు | విద్యావిలాస, సత్య విలక్షణవిద్యావిలాస ముద్రాక్షర శాలలు మద్రాసు. | మ. రి. ఆ. |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 20 | 1877 | ఆదిపర్వము | వారణాశి సుబ్బ రామశాస్త్రిలు | మద్రాసు | మ. రి. అ. |
| 21 | 1879 | ఆదిపర్వము ఆశ్వా 1–3 | యం. యస్. బి. వి. యల్. యస్. | మద్రాసు | మ. రి. అ. |
| 22 | 1879 | ఆదిపర్వము | పండితులు | శ్రీభారతీనిలయ ముద్రాక్షరశాల | మద్రాసు. |
| 23 | 1879 | ఆదిపర్వము | అ. సరస్వతీ నృసింహాచార్యులు | జ్ఞానసూర్యోదయ ముద్రాక్షరశాల మద్రాసు | మ. రి. అ. |
| 24 | 1880 | ఆదిపర్వము | పండితులు | శ్రీ భారతీనిలయ ముద్రాక్షరశాల మద్రాసు | మ. రి అ. |
| 25 | 1880 | ఆదిపర్వము | పండితులు | విబుధమనోహారిణి ముద్రాక్షరశాల మద్రాసు | మ. రి. అ. |
| 26 | 1880 | శాంతిపర్వము | పండితులు | శ్రీభారతీనిలయ ముద్రాక్షరశాల మద్రాసు | మ రి. అ. |
| 27 | 1881 | ఆది–స్వర్గారోహణ పర్వములు | భద్రాచలము తిరుమల నరసింహాచార్యులు | శ్రీభారతీనిలయ ముద్రాక్షరశాల మద్రాసు | బ్రి మ్యూ. |
| 28 | 1881 | ఆదిపర్వము | తిరుమల నరసింహాచార్యులు | శ్రీభారతీనిలయ ముద్రాక్షరశాల మద్రాసు | మ. రి. అ. |
| 29 | 1881 | ఆదిపర్వము | అం. వారణాసి సుబ్బారామ శాస్త్రిలు. | కవిరంజనీ ముద్రాక్షరశాల మద్రాసు | మ. రి అ. |
| 30 | 1883 | ఆదిపర్వము | పండితులు | విబుధమనోహారిణి ముద్రాక్షరశాల మద్రాసు | మ. రి. అ |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 31 | 1883 | ఆదిపర్వము | శ్రీమాన్ పంచాంగం రాఘవాచార్యులు | శ్రీభారతీనిలయ ముద్రాక్షరశాల మద్రాసు | మ. రి. అ. |
| 32 | 1884 | ఆదిపంచకము | పండితులు | వివేకకళానిధి ముద్రాక్షరశాల మద్రాసు | ఆం. మ. ఖా. ప్రా. |
| 33 | 1887 | ఆది—స్వర్గారోహణ పర్వములు | శ్రీ ములుకుట్ల విశ్వనాథశాస్త్రి | విబుధమనోహారిణీ ముద్రాక్షరశాల | మద్రాసు |
| 34 | 1890 | ఆది—ఉద్యోగ పర్వములు సం—1 | పండితులు | శ్రీరంగవిలాస. సరస్వతీవిలాస ముద్రాక్షరశాలలు మద్రాసు. | ఆం. మ. ఖా. ప్రా. |
| 35 | 1890 | భీష్మ—స్వర్గారోహణ పర్వములు. సం—2. | పండితులు | శ్రీరంగవిలాస సరస్వతీ విలాస ముద్రాక్షరశాల మద్రాసు | ఆం. మ. ఖా ప్రా. |
| 36 | 1890 | ఆది— ఉద్యోగ పర్వములు సం—1 | నిమ్మగడ్డ లక్ష్మి నృసింహ సిద్ధాంతి | శ్రీవాణివినోద మందిర ముద్రాక్షర శాల మద్రాసు | ఆం మ. ఖా. ప్రా. |
| 37 | 1890 | భీష్మ—స్వర్గారోహణ పర్వములు సం—2. | నిమ్మగడ్డ లక్ష్మి నృసింహ సిద్ధాంతి | శ్రీవాణీ వినోద మందిర ముద్రాక్షర శాల మద్రాసు | ఆం. మ. ఖా. ప్రా. |
| 38 | 1891 | శ్రీమహాభారతము | నేలటూరి వెంకట సుబ్బశాస్త్రులు. కొండగుంట రాఘవ శాస్త్రులు. | సరస్వతీ విలాస ముద్రాక్షర శాల. మద్రాసు | |
| 39 | 1893 | ఆదిపర్వము | గుదిమెళ్ళ వెంకట వరదాచార్యులు | వాక్సతీనిలయ ముద్రాక్షరశాల | మద్రాసు |
| 40 | 1894 | ఆదిపర్వము | | శ్రీ రంగనాయక విలాస ముద్రాయంత్రము మద్రాసు | మ. రి. అ. |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 41 | 1894 | శాంతిపర్వము ఆమ్నాయ కళా నిధి సహితము | నేలటూరు పార్థ సారథి అయ్యంగారు | ఎడిన్‌బరో ముద్రాక్షరశాల మదరాసు | ఆం. మ. భా. ప్రా. |
| 42 | 1895, 1896 | ఆది—సభా పర్వములు | | నెల్లూరు | బ్రి. మ్యూ. |
| 43 | 1896 | శ్రీమహాభా రతము | శ్రీరంగనాయకీ విలాస ముద్రాక్షర శాలాధికారులు. | శ్రీరంగనాయకీ విలాస ముద్రాక్షర శాల. నెల్లూరు | మ. రి. ఆ |
| 44 | 1898 | ఆదిపంచ కము | పండితులు | శ్రీరంగవిలాస ముద్రాక్షరశాల మద్రాసు. | మ. రి. ఆ. |
| 45 | 1899 | సభా పర్వము | సి. జానకి రామయ్య | మద్రాసు | బ్రి. మ్యూ. |
| 46 | 1900 | ఆదిపర్వము | | ఆదిలక్ష్మీ నారా యణ ప్రెస్ మద్రాసు | ఆం. మ. భా ప్రా. |
| 47 | 1900 | ఉద్యోగ పర్వము | పనప్పాకం శ్రీని వాసాచారి | మద్రాసు | బ్రి.మ్యూ. |
| 48 | 1901 | ఆది—స్వర్గా రోహణ పర్వములు | కందుకూరి వీరేశ లింగం పంతులు రాయదుర్గం నర సయ్యశాస్త్రి | మద్రాసు | ఆం. మ. భా.ప్రా. |
| 49 | 1904 | ఆదిపంచ కము | పండితులు | శ్రీరంగవిలాస ముద్రాక్షరశాల మద్రాసు | ఆం. మ. భా.ప్రా. |
| 50 | 1905 | ఆదిపంచ కము | తాటికొండ రామ శాస్త్రులు | మద్రాసు | సారస్వత నికేతనము వేటపాలెము |
| 51 | 1910 | ఆదిపర్వము | | శ్రీరామానుజ విలాస ముద్రాక్షర శాల. మద్రాసు | |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 52 | 1912 | ఆది—సభా పర్వములు | పండితులు | సుజనరంజనీ ముద్రాక్షరశాల కాకినాడ | ఆంధ్ర సాహిత్య పరిషత్తు కాకినాడ |
| 53 | 1912 | మహాభారతము | తంజనగరము తేవప్పెరుమాళ్ళయ్యగారు | వేమూరు వేంకట కృష్ణమసెట్టిఅండ్ సన్సు మద్రాసు | సారస్వత నికేతనము వేటపాలెము |
| 54 | 1913 | ఆదిపంచకము | మారేపల్లి రామచంద్ర శాస్త్రి, రాజశ్రీ విక్రమ దేవవర్మ | శ్రీశారదాముకుట ముద్రాక్షర శాల | విశాఖ పట్టణము |
| 55 | 1914 | విరాటోద్యోగ పర్వములు | తంజనగరము తేవప్పెరుమాళ్ళయ్యగారు | ఆనంద ముద్రాక్షరశాల మద్రాసు | ఆంధ్ర సాహిత్య పరిషత్తు కాకినాడ |
| 56 | 1915 | ఆదిపర్వము (భారత సంజీవని వ్యాఖ్యా సహితము) | చదలువాడ సుందర రామశాస్త్రి, దండిగుంట సూర్యనారాయణశాస్త్రి | శారదాంబా విలాస ముద్రాక్షరశాల మద్రాసు | ఆంధ్ర సాహిత్య పరిషత్తు కాకినాడ |
| 57 | 1915 | ఆరణ్యపర్వము | | ఆదిసరస్వతీనిలయ ముద్రాక్షరశాల మద్రాసు | |
| 58 | 1915 | శాంతిపర్వము | | వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు మద్రాసు | |
| 59 | 1917 | ఆదిపంచకము | మారేపల్లి రామచంద్ర శాస్త్రి, రాజశ్రీ విక్రమ దేవవర్మ | యస్.యస్.యమ్ ముద్రాక్షర శాల | విశాఖ పట్టణము |
| 60 | 1917 | ఆది—సభా | తంజనగరము తేవప్పెరుమాళ్ళయ్య | ఆనంద ముద్రాక్షరశాల మద్రాసు | |
| 61 | 1917 | ఆది—స్వర్గారోహణ పర్వములు | | వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు మద్రాసు | |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 62 | 1917 | విరాట—ఉద్యోగ పర్వములు | | వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు మద్రాసు | |
| 63 | 1917 | కర్ణ—స్త్రీ పర్వములు | | వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు మద్రాసు | |
| 64 | 1925 | మహాభారతము | | వావిళ్ళరామస్వామి శాస్త్రులు అండ్ సన్సు మద్రాసు | సారస్వత నికేతనము వేటపాలెము |
| 65 | 1925 | ఉద్యోగ పర్వము (ఆమ్నాయ కళానిధి వ్యాఖ్యసహితము) | నేలటూరి పార్థసారథి అయ్యంగారు | గోమతి ముద్రణాలయము మద్రాసు | ఆంధ్ర సాహిత్య పరిషత్తు కాకినాడ |
| 66 | 1927 | ఆది సభా పర్వములు | | వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు మద్రాసు | |
| 67 | 1928 | ఆరణ్య పర్వము | | వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు మద్రాసు | |
| 68 | 1928 | భీష్మద్రోణ పర్వములు | బుక్కపట్నం రాఘవాచారి | ఆనంద ముద్రాక్షరశాల మద్రాసు | |
| 69 | 1929 | శాంతి సప్తకము | | వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు మద్రాసు | |
| 70 | 1932 | మహాభారతము | పళ్ళెపూర్ణప్రజ్ఞాచార్యులవారి లఘుటీకావ్యాకరణ విశేషములతో. | చంద్రికా ముద్రాక్షరశాల గుంటూరు | |
| 71 | 1933 | మహాభారతము | తూములూరి శివరామశాస్త్రి ఎలమర్తి విశ్వపతి కవిరాజు (లఘు టీకా వివరణములతో) | ఆంధ్రగ్రంథ మండలి తెనాలి | |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 72 | 1935 | ఆదిపంచకము | | వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు | మద్రాసు |
| 73 | 1935 | ఉద్యోగ పర్వము లఘుటీకా సహితము | మున్నంగి లక్ష్మీనరసింహ శర్మ | రామా అండ్ కో | ఏలూరు |
| 74 | 1936 | యుద్ధపంచకము | | వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు | మద్రాసు |
| 75 | 1937 | ఆదిపర్వము | | | మద్రాసు |
| 76 | 1939 | విరాటోద్యోగ పర్వములు సం—3 | బుక్కపట్నము రామానుజయ్య | ఆనంద ముద్రాక్షరశాల | మద్రాసు |
| 77 | 1944 | ఆనంద— మహాభారతము | బుక్కపట్నము రాఘవాచారి | ఆనంద ముద్రాక్షరశాల | మద్రాసు |
| 78 | 1960, 61<br>1962, 63<br>1964, 65 | శ్రీమదాంధ్ర మహాభారతము సం—7 | | వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు | మద్రాసు |
| 79 | | | బొబ్బిలిపండితులు శ్రీ అంపోలు అప్పలాచార్యులు. (గుజలీప్రతి) | | |
| 80 | | ఆదిపంచకము | ఆదిరాజు భాస్కర శాస్త్రులు | వెస్టువార్డు కంపెనీ | విజయనగరము |
| 81 | | ఆదిపంచకము | శ్రీ చిలకూరి వేంకట శాస్త్రులు గుజలీప్రతి | | |
| 82 | | ఆదిపంచకము | గుజలీప్రతి | | |
| 83 | | ఆదిపంచకము | వంకాయల కృష్ణస్వామిశెట్టి గుజలీప్రతి | | |
| 84 | | ఉద్యోగ పర్వము | పండితులు | విద్వన్మోద తరంగిణీ ముద్రాక్షరశాల | మద్రాసు |

1. ఆ. మ. భా. ప్రా. ఆంధ్ర మహాభారత ప్రాజెక్ట్ — ఉస్మానియా విశ్వవిద్యాలయము
2. బ్రి. మ్యూ. బ్రిటిష్ మ్యూజియమ్. లండన్.
3. మ. రి. ఆ. మద్రాసు రికార్డ్సు ఆఫీసు. మద్రాసు.

---

## అనుబంధము—2

ముద్రితాముద్రిత ఆంధ్ర మహాభారత ప్రతుల నొసంగినవారు.

1 తాళపత్రప్రతి — ఉద్యోగపర్వము. ముద్రితప్రతి. 2 సంపుటములు. 18 పర్వములు మద్రాసు శ్రీరంగ విలాస, సరస్వతీవిలాస ముద్రాక్షరశాల 1890.

శ్రీ వి. నరసింహారెడ్డి ఎమ్. ఏ. తెలుగుశాఖ. ఆర్ట్సు అండ్ సైన్సు కళాశాల వరంగల్లు.

2 ఆంధ్రభారతము— ముద్రితప్రతి (ముఖపత్రము లేదు) ఆది, సభా, అరణ్య, విరాట, ఉద్యోగ పర్వములు. భీష్మ, ద్రోణ, కర్ణ, శల్య, సౌప్తిక, శాంతి, అనుశాసనిక, అశ్వమేధపర్వములు.

శ్రీ పి. వరవరరావు. తెలుగులెక్చరరు. జడ్చర్ల కళాశాల. జడ్చర్ల.

3 తాళపత్ర ప్రతులు. విరాట, భీష్మ, శాంతి పర్వములు.

శ్రీ కందాళ వెంకట అప్పలాచార్యులుగారు. శిరోమణి. బి. ఎ. బి. ఒ. యల్. ఉపాధ్యాయుడు. మొగల్‌పుర మిడిల్‌స్కూలు చార్‌మినార్. హైద్రాబాదు.

4 తాళపత్ర ప్రతులు. సభా, సౌప్తిక, అశ్వమేధ, ఆశ్రమవాస, స్వర్గారోహణ పర్వములు ద్రోణ, కర్ణపర్వములు.

శ్రీ కందాళ వెంకట సుందరాచారిగారు. ఉపాధ్యాయుడు. ముఫిద్ అనామ్ హైస్కూలు పత్‌థార్ చౌక్. హైద్రాబాదు.

5 తాళపత్రప్రతి. ఆది, సభాపర్వములు, విరాట ఉద్యోగ పర్వములు. భారతం విడికమ్మలు. ఆది, అరణ్య. శ్రీ ఎ. రాజేశ్వరశర్మ. తెలుగు శాఖ, ఉస్మానియా విశ్వ విద్యాలయము.

6 తాళపత్రప్రతి. ఉద్యోగపర్వము. శ్రీ కె. వై. ఎల్. నరసింహారావు. హెడ్ ఆఫ్ ది ఇంగ్లీషు డిపార్టుమెంటు. ఖమ్మంకాలేజి. అదే కాలేజిలో సీనియరు తెలుగులెక్చరరు. శ్రీ యడవల్లి ఆదినారాయణగారి ద్వారా వచ్చినది.

7 తాళపత్ర గ్రంథము. ఆది సభాపర్వములు—ఆంధ్రమహాభారతము. శ్రీమతి పి. యశోదా రెడ్డి. ఎమ్. ఎ, తెలుగు లెక్చరరు. స్త్రీల కళాశాల ఉస్మానియా విశ్వవిద్యాలయము హైద్రాబాదు.

